
సదాశివ సమారంభాం
గురు దక్షిణామూర్తి
గురు వేదవ్యాస మహర్షి
గురు శుక మహర్షి
గురు నారద మహర్షి
గురు వాల్మీకి మహర్షి
గురు శ్రీకృష్ణ
శంకరాచార్య మధ్యమాం
గురు దత్తాత్రేయ
గురు బాబాజి
గురు గౌతమ బుద్ధ
గురు ఆదిశంకరాచార్య
గురు రామానుజాచార్యులు
గురు జ్ఞానేశ్వర్
గురు రవిదాస్
గురు కబీర్ దాస్
గురు చైతన్య మహా ప్రభువు
గురు నానక్
గురు రాఘవేంద్ర స్వామి
గురు వీరబ్రహ్మేంద్ర స్వామి
యోగి వేమన
అస్మదాచార్య పర్యంతాం
గురు త్రైలింగ స్వామి
గురు లాహిరి మహాశయ
గురు రామకృష్ణ పరమహంస
అమ్మ శారదా దేవి
గురు వివేకానంద
గురు సాయిబాబా
గురు అరబిందో
గురు రమణ మహర్షి
గురు యోగానంద
గురు భక్తివేదాంత ప్రభుపాద
గురు మళయాళ స్వామి
గురు విద్యాప్రకాశానందగిరి
గురు చంద్రశేఖర పరమాచార్య
వందే గురుపరంపరాం..

Free Gurukul

"ఉచిత గురుకుల విద్య ఫౌండేషన్" ద్వారా విలువలు, నైపుణ్యాలతో కూడిన విద్య ఉచితంగా + సులభంగా + ఆకర్షణీయంగా + నాణ్యతతో కూడి అందించే సేవా కార్యక్రమంలో బాగంగా ఈ పుస్తకాన్ని ఇంటర్నెట్ నుంచి సేకరించి అందిస్తున్నాము. సేకరణ కర్త పేరు మాకు తెలియరాలేదు, అయినా వారు మంచి సేవ చేసారు కావున ఇందుకు మేము వారికి కృతజ్ఞత తెలియచేసుకుంటున్నాము.

సాయి రామ్ వారి సేవల విస్తరణలో బాగంగా ఈ ఫౌండేషన్ స్థాపించబడినది. దీనిద్వారానే అన్ని సేవలు అందించబడును. ఇటువంటి పుస్తకాలు మీరు వ్రాసినట్లయితే (లేక) సేకరిస్తే మాకు తెలియచేయండి. మేము ప్రతి విద్యార్ధికి ఉచితంగా అందేలా చేస్తాము, తద్వారా ఉన్నత విలువలు, నైపుణ్యాలు కలిగిన విద్యార్ధులను మన దేశానికి అందించవచ్చు. మాతో కలిసి నవ భారత నిర్మాణ కార్యక్రమంలో పనిచేయుటకు, భాగస్వామ్యం అగుటకు ఆసక్తి ఉంటే సంప్రదించగలరు.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) ఉచిత గురుకుల విద్య ఫౌండేషన్ వెబ్ సైట్ : www.freegurukul.org
2) సాయి రామ్ వెబ్ సైట్ : https://sites.google.com/site/sairealattitudemanagement
3) మొబైల్ ఆప్: Free Gurukul



Website: www.freegurukul.org Mobile App: Free Gurukul email: support@freegurukul.org
Facebook: www.facebook.com/freegurukul Helpline/WhatsApp: 9042020123

" మన లక్ష్యం: విలువలు, నైపుణ్యాలతో కూడిన విద్య అనేది ఉచితంగా + సులభంగా + ఆకర్షణీయంగా + నాణ్యతతో కూడి అందరికి అందించబడాలి "

ఉచిత గురుకుల విద్య ఫౌండేషన్ – Free Gurukul Education Foundation

సర్వం పరమాత్మ పాద సమర్పణమస్తు

# అతి విశిష్టం ఈ దానం!



"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్న్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.

రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, ఐవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

ప్రథమ ముద్రణ : మే, 2010

ప్రతులకు : వ్యవస్థాపకులు :
**సిద్ధాశ్రమము**
శాతవాహననగర్,
వనస్థలిపురం, హైద్రాబాద్ - 500 070.
ఫోన్ : 040-24240557

: **సిద్ధాశ్రమము**
ఇందిరానగర్ కాలని,
నరసన్నపేట,
శ్రీకాకుళం జిల్లా - 532 421.

కంప్యూటర్ డి.టి.పి. మరియు ముద్రణ : **ఎస్.కె.వి. కలర్ స్ట్రీమ్**
గౌలిగూడ, హైద్రాబాద్.
ఫోన్ : 040-24616187, 9849010634



SIDDHASHRAMAM
M: +91 8096065675 , P : +91 40 24240557
E : contactus@siddhashramam.org
W : www.siddhashramam.org

# బ్రహ్మవిద్యా రత్నాకరము

## (ప్రథమ సంపుటము)

**స యస్య సాక్షాద్భవ పద్మజాతిభిః**
**రూపం ధియో వస్తుతయో పవర్ణితం**
**మౌనేన భక్త్యా పరమేన పూజితః**
**ప్రసీదతామేష స సాత్త్వతాం పతిః**

ఎవ్వని రూపంబిట్టిదని బ్రహ్మారుద్రాదులు నిజబుద్ధివైభవంబున
వర్ణింపనేరరు-అట్టి ఈ సాత్త్వత పతి పూజితుండై నాకు ప్రసన్నుడయ్యెడు

వేదమాత అనే గోవునుంచి వేదసారమనే క్షీరసాగరమును మహర్షులు
పితికినారు ఆ క్షీరసాగరమందలి గ్రుక్కెడు పాలు ఈ గ్రంథము

అస్మద్గురు సమారంభాం
కృష్ణ సాందీప మధ్యమాం
శ్రీ మహాదేవ పర్యంతాం
వందే గురు పరంపరాం

వాల్మీకి మహర్షి మఱియు వైష్ణవావతారమయిన వ్యాస భగవానుని కృపచే - గురు
పరంపర సాయముచే వ్రాయబడిన యీ గ్రంథము
జగద్గురువగు ఈశ్వరునికే అంకితం

# విషయ సూచిక

# మనవి

బ్రహ్మ విద్యకు వేదములు, ఉపనిషత్తులు, ఆరణ్యకములు, బ్రాహ్మణములు, ప్రమాణములు. వీటికి భాష్యములయిన రామాయణ, భారత, భాగవతములు, సాంఖ్యము, భక్తి సూత్రములు మొదలయినవి ప్రామాణిక గ్రంథములుగా పరిగణింప బడును. ఈ బ్రహ్మవిద్యారత్నాకరములో ప్రామాణిక గ్రంథములలో వివరింపబడిన ఒకే విషయమునకు సంబంధించిన విషయములను క్రోడీకరించి ఒకే ప్రకరణముగా ఒకే చోట పొందుపఱచబడినవి.

దేశము నిత్య కళ్యాణము, పచ్చతోరణముగా సిరిసంపదలతో సుఖశాంతులతో సుభిక్షముగా విరాజిల్ల వలయునన్నది ఋషుల ఆకాంక్ష. కావున దేశమును ఎలా తీర్చి దిద్దవలయును అని ఋషులు చెప్పిరో ఆ భావములను **దేశము** అను ప్రకరణములో వివరింపబడినది. అవినీతి బంధు ప్రీతి, చీకటి బజారు అలుము కున్న ఈ దేశము ఎటుదిగజారు? అన్న ప్రశ్నకు సమాధానముగా ఋషులు చెప్పిన వాటిని పరిపాలన విధానముగా పాలకులు, మంత్రులు, ప్రభుత్వ ఉద్యోగులకు ఉండవలసిన లక్షణములు, గుణములు మొదలయిన వాటిని **పరిపాలన** ప్రకరణములో వివరింపబడినది. పౌరుల వ్యక్తిగత బాధ్యతలు, విధులు గుఱించి ఋషులు చెప్పిన విషయములను **వ్యక్తిగత విధులు బాధ్యతలు** అను ప్రకరణమున వివరింపబడినది. ఈవిధముగా ఈ గ్రంథములో దేశపురోభివృద్ధికి అవసరమయిన విషయములు వివరింపబడినవి.

నేను సైతం ప్రపంచాగ్నికి సమిధనొక్కొటి ఆహుతిచ్చా అన్నట్లు వేదముల లోని విజ్ఞానశాస్త్ర విషయములు, కణాదుని అణుశాస్త్రవిజ్ఞానము, ఆర్యభట్టు, లీలావతి, చరకుడు, శుశ్రుతుడు, వరాహమిహురుడు మొదలయిన విజ్ఞానవేత్తలు చెప్పిన విషయములను లోకమునకు అందచేయవలసినదిగా ఆయా శాస్త్రములలో నిష్ణాతులయిన వారిని కోరుతూ కొన్ని విషయములు మాత్రము **విజ్ఞానశాస్త్ర ప్రకరణము**లో చెప్పబడినవి.

శాస్త్రవిహితముగాని పుణ్యకర్మానుష్ఠానము ధనవ్యయమును, నరక ప్రాప్తిని కలుగచేయును. కావున న్యాయార్జిత ధనముతో ధర్మపరుడైనవాడు పుణ్యకర్మలు ఏ విధముగా చేయవలయునని ఋషులు వివరించిరో ఆ విధానమును **పుణ్యాకర్మానుష్ఠాన** ప్రకరణములో వివరింపబడినది. భూమి, ఆకాశము, కాలముల గుఱించి **అధిభౌతిక, అధ్యాత్మము**గా విభజించి వివరింపబడినది. అధిభౌతికమును విజ్ఞాన శాస్త్రవేత్తల వద్ద, అధ్యాత్మమును సద్గురువుల వద్ద నేర్చుకొనవలయును.

తీవ్రమోక్షేచ్ఛ గలవారిని ఉద్దేశించి చెప్పబడిన అధ్యాత్మిక విషయములు **ఉపనిషత్ప్రకరణము, సింహావలోకనము** అను ప్రకరణములలోనూ, సాధనను **పరవిద్య**లోనూ వివరింపబడినది. ఉపనిషత్తులకు వ్యాఖ్యానము రామాయణ, భాగవతములను మేళవించి వివరింపబడినది. అధ్యాత్మ విషయములలో శాస్త్ర పాఠముగా పునశ్చరణలయిన సాంఖ్యసూత్రములు, బ్రహ్మ సూత్రములను, ప్రత్యేక విభాగముగా ఇందు వివరించలేదు. దప్పిక గొన్నవానికి దాహము తీరుటకు దోసిడు నదీజలము చాలును. నది నీరంతా త్రాగవలసిన పనిలేదని శ్రీకృష్ణ భగవానుడు చెప్పినట్లు, జీవితసాఫల్యతకు కావలసిన చదువులలో మర్మమెల్ల చదివితి అని ప్రహ్లాదుడు చెప్పినట్లు ఈ బ్రహ్మవిద్యారత్నాకరములో **పద్మకల్పములో బ్రహ్మకు పరమాత్మ బోధించిన విషయములనే ఒక క్రమ పద్ధతిలో ప్రకరణములుగా విభజించి వివరింపబడినది.** "కర్మనిష్ఠులగు నుపాధ్యాయులైన వారలీ యాత్మ తత్త్వంబును నెఱుంగరెఱింగిరేని యుపదేశింపరు.'' (భాగవతము, చతుర్థ స్కంధము, 883). చెప్పఁడొక చదువు మంచిది (భాగవతము, సప్తమ స్కంధము, 210). గురుఁడు క్రూరుఁడనర్థచయంబునందు దుశ్శీలత నర్థకల్పనముఁజేసెడి గ్రాహ్యముగాదు. (భాగవతము, సప్తమ స్కంధము, 212). గురువులు దమకును లోఁబడు తెరువులు సెప్పెదరు విష్ణు దివ్య పదవికిం దెరువులు సెప్పరు (భాగవతము, సప్తమ స్కంధము, 246) కొంతమంది గురువులు ఆత్మ స్థానము పొందుమార్గము చెప్పరు. అటువంటి గురువుల బారిన పడకుండా ధర్మాధర్మములు గ్రహించ కోరువారికి, సాధన చేసి మోక్షమును పొందగోరువారికి ఈ గ్రంథము మార్గ దర్శకము. దీనిని శ్రద్ధగాచదివి విషయములను అర్థము చేసికొనిన ప్రయోజనముండును.

గురుపరంపరా న్యాయముగా నాకు మాగురువుగారు బోధించిన విషయములను నాబుద్ధికి తోచినంత వఱకు ఇందు వివరించితిని. సాధన రహస్యములను, పారిభాషిక పదములను పూర్వ మహనీయులెవ్వరూ గ్రంథస్థము చేయనందున ఆ సంప్రదాయమును పాటించి సాధన రహస్యములను మఱియు బ్రహ్మవిద్యా పారిభాషిక పదములను ఇందు వివరించలేదు. వీటిని సద్గురువులను ఆశ్రయించియే నేర్చుకొనవలసి ఉండును. క్షీర నీర న్యాయముగా పెద్దలు, రసజ్ఞులు దోషములను వదలి మంచిని గ్రహించప్రార్థన. ఈ గ్రంథమును చదివి వారి అభిప్రాయములను తెలియచేయగోరుచున్నాము.

**సర్వేజనో సుఖినో భవంతు**

⌘●⌘

# కలియుగము

శ్రీకృష్ణుడు నిర్యాణము చెందిన నాటి నుండి కలియుగము ప్రారంభమయ్యెను. మఘా నక్షత్రమున పగటి పూట సప్తర్షులు ప్రవేశించిన నాటికి కలి ప్రవేశించి 1200 సంవత్సరములు. కలియుగ ప్రమాణం 4లక్షల సంవత్సరములు. క్రీస్తుశకము 2010 నాటికి కలి ప్రవేశించి 5112 సంవత్సరములు మాత్రమే అయినది. కలియుగములో పాపములు చేసినగానీ రావు. పుణ్యములు చేయుదుమన్న మాత్రముననే పుణ్యము వచ్చును.

**కలియుగములో :**

**1. మతము :- దేవ మాయా మోహితులై శాస్త్రోక్త శౌచాచారంబులు విడిచి, నిజేచ్ఛం జేసి దేవతా హేళనంబులు సేయుచు, వేద, బ్రాహ్మణ, యజ్ఞపురుషుల దూషించుచు, లోకంబులం దమ తమ మతంబులకుం దామే సంతసిల్లుచు నవేద మూలంబగు స్వేచ్ఛం జేసి ప్రవర్తించి యంధపరంపరచే విశ్వాసంబు సేసి తమంతన యంధ తమసంబునం బడుచు నుండుదురు.** (భాగవతము పంచమ స్కంధము మొదటి ఆశ్వాసము-89) అనగా వేద పద్ధతులు సాగవు. దేవతా హేళన చేయు చుందురు. అనగా ఒక మతము వారు మఱియొక మతములోని దేవతలను దేవుళ్ళను నిందించెదరు.

**2. ధర్మము :-** ధర్మపద్ధతి ఉండదు. ధర్మము ఒక పాదముతో ఉండును. ప్రజలు ధర్మ రహితులు. వేద ఉపదేశములుండవు.

**3. యజ్ఞ యాగాది క్రతువులు :-** వేదములో చెప్పినట్లు యజ్ఞములు, యాగములు లేనందున దేవతలకు హవిర్భాగములుండవు. పితృ, దైవ కార్యములు సాగవు. మఱియు పాడగును. దేవ పితృ కార్యములలో బ్రాహ్మణేతరులు భోక్తలుగా కూర్చుందురు. దేవాలయములు, బ్రాహ్మణీకములు, ఆశ్రమములు పాడగును. దేవతలకు, ఋషులకు, పితృదేవతలకు, ధరణికి, ధర్మదేవునికి బాధ కలుగును.

**4. న్యాయము :-** పెద్దలు కూడా న్యాయ మార్గమున నడవరు. న్యాయ పద్ధతిన బుధులైన వారు కూడా నడవరు. జ్ఞానులు కూడా క్రూరులుగా మారుదురు. నాస్తిక వాదము పెరిగి పోవును. పుణ్య ఫలములు అబద్ధములని భావింతురు.

**5. దేశ పరిస్థితి :-** ఇంద్రుడు వానలు కురియింపడు. సకాలములో వానలు కురియవు. పాడి పంటలు తగ్గును. ధాన్యములో పొల్లు ఎక్కువ. పండ్ల చెట్లు పాడగును. పంటలు, పండ్లు తక్కువగా పండును. ఔషధములు పస చెడును. ఒక కాలమున పండు ఓషధులు వేఱొక కాలమున పండవు. జనపదములు (పల్లెటూళ్ళు) పాడగును. ప్రజలు కష్టములపాలగుదురు. అనగా పంటలు పండక, పండిన పంటలు చేతికి అందక, తుఫానులు, భూకంపములు, వరదలు, వ్యాధుల వలన ప్రజలు కష్టముల పాలగుదురు.

**6. సంఘ పరిస్థితి :-** ప్రపంచమంతా దుర్మార్గమయమగును. ప్రజలు సురా మఱియు సురతాపేక్ష పరులు. వర్ణాశ్రమాచార రహితులు. వర్ణాశ్రమ ధర్మములు తప్పును. వర్ణ సంకరమగును (inter caste marriages). కులములు చెఱచు చుండెదరు. సత్యముండదు. దుర్జనులు ఎగిసి మహా సాధు జనులను బాధింతురు. దీనుల, దుర్బలుల ధనము అపహరింపబడును. ప్రజలు దరిద్రులై ఇచ్చే దాత లేక దొంగలుగా తయారగుదురు. దొంగలు జనులను వధియించి ధనము తీసుకొనుట వలన జనులు అడవుల పాలగుదురు. మోహము వలన లోభము, లోభము వలన కామము, కామము వలన క్రోధము, క్రోధము వలన వైరము కలిగి వైరము వలన ఒకరినొకరు హాని చేసికొందురు. సాధువులు దుర్గతులను రోగములను పొంది చనిపోవుదురు. వారికి ఆయువు తగ్గును. దుర్మార్గులకు ఆయువు పెరుగును. ప్రజలు దుర్మార్గులను గౌరవింతురు. వీరు ఉన్నత ఉద్యోగములలో ఉందురు. దుర్మార్గులకు ధనముండును.

**7. వర్ణ వ్యవస్థ :-**

**బ్రాహ్మణులు :-** జపము, స్వాధ్యాయము మొదలైన నియమములు వదులుదురు. దుర్మార్గకర్మపరులై వేద నింద చేయుచు, యజ్ఞ యాగాది క్రతువులు, వ్రతములు

వదులుదురు. దుష్పరిగ్రహ విహారులై, యజ్ఞ యాగాది కర్మంబులు పరార్థపరులై చేయుచు హీనులై నశించెదరు. వేదములు అమ్ముకొందురు. హీన వంశజులయిన రాజులను సేవింతురు. నీచుల దగ్గర చేరి ధనము యాచించెదరు. అన్యాయము చేయుదురు. దిక్కులేక నలు దిక్కులకు పాఱిపోవుదురు.

**క్షత్రియులు :-** క్షత్రియులు శౌర్యము, సిరి, తేజస్సు, మైత్రి, భూపరిపాలన లేక ఉందురు.

**వైశ్యులు :-** క్రయ విక్రయములలో కపటముండును.

**శూద్రులు :-** శూద్రుడు రాజ లక్షణ ముద్రితుండగును. హీన వంశ జాతులు రాజ్య మేలుదురు. వీరు పాప చరితులు. పాలకులు ప్రజల వద్ద పన్ను తీసుకొని ప్రజలకు భయము కలుగ చేయుదురు. భూమిని రక్షింపకుండా దర్పముతో సాధువులకు బాధలు కలుగచేసి, వారి స్త్రీలను, ధనమును, భూములను హరించి, దారుణముగా పరస్పర విరోధము పెంచుకొని విశ్వప్రాణి నాశనమునకు కారణమగుదురు. వీరు ఉగ్రముగా ఒక్కొక్కరు కొన్ని వందల మందిని చంపుదురు. వేదములు చెప్పుదురు. మిక్కిలి తపో ధనవంతులు. బ్రాహ్మణులు వీరికి సేవ చేయుదురు. వేదము వీరు చెప్పగా బ్రాహ్మణులు శ్రద్ధగా విందురు.

**8. ప్రజలు :-** నాస్తికులు. శరీర పోషణ యందు శ్రద్ధ పెరుగును. అన్ని చోట్ల త్రాగుడు, స్త్రీ వ్యసనములుండును. అన్నము అమ్ముకొందురు. (Hotels ఉండును.) దురన్న భిక్షకులు, అనృతవాదులు, అధర్మ పరులు, ధర్మ విరహితులు, అన్యాయ పరులు, నిర్దయులు, మాయోపాయులు, దయా రహితులు, దురా చారులు, ఆచార హీనులు, నిష్కారణ వైరులు, క్రౌర్యము, హింస, అసత్యము, దంభము, కుటిలత మొదలైనవి కలిగి ఉందురు. క్రోధ, మాత్సర్య, లోభ, మోహాది దుర్గుణములు గలిగి అతి రోషములు కలవారు, ప్రజలు క్రూరులుగా వర్తించెదరు. దయా సత్య శౌచాదిహీనులు, తప్పులెన్నువారు. మంద ప్రజ్ఞులు, మంద మతులు, మంద బుద్ధులై ఒండొరులను మెచ్చరు. సోమరి పోతులు, సార హీనులు, దుర్బలులు, మంద భాగ్యులు, ధనహీనులు, భయంకర వ్యాధులచే పీడింప బడుదురు. అల్పాయువులు,

పూర్ణాయుర్దాయము పదహారు సంవత్సరములు. ఆయువు తగ్గును. ఏడెనిమిది సంవత్సరములకు స్త్రీలు సంతాన వంతులగుదురు. మనుజులు అన్న, పాన, మైథున, శయన, ఆసనాది కర్మాసక్తులగుదురు. జననీ జనక సుత సోదర బంధు దాయాది సుహృజ్జనులను పరిత్యజించెదరు. వ్యవహారములు తగువులతో ఉండును.

**విద్య :-** అల్పవిద్య వలన వ్యామోహము కలిగి వేద విద్య తగ్గును. సరస్వతి కుజనులను ప్రాప్తించును.

**తండ్రి కొడుకులు :-** కొడుకు తల్లినీ, తండ్రిని పోషింపడు. కొడుకు తండ్రిని అవమానము చేయును. కొడుకులు తండ్రులను చంపుదురు. తల్లి తండ్రులు వారి కొడుకులు ఒకరినొకరు చంపుకొందురు. వీరు ప్రజలలో గౌరవము పొందుదురు.

**భార్యా భర్తలు :-** భార్యా భర్తలు ఎవరి ఇష్టానుసారము వారు ప్రవర్తింతురు. భర్తలు భార్యలను భరించరు. భార్య భర్తను అవమానించును. భార్యలు భర్తలతో తగువులు పెట్టుకొందురు.

**బంధువులు :-** బంధువులలో బంధు ప్రేమ పోవును.

**స్నేహము :-** స్నేహము వంచనా సహితము. అనగా స్నేహము వంచనతో కూడి ఉండును.

**గురు శిష్యులు :-** గురువు శిష్యులను మెచ్చుకొనక వంచకుడగును. శిష్యులు గురువును దూషింతురు. శిష్యులు గురువులతోనుండరు.

**9. అరాచకము :-** కలియుగములో ప్రజలు పాలకులు లేని పశువులవలె ఉందురు. మఱియు రాజ్యము నాయకుడు లేని సేనవలె ఉండును. వర్షములు కురియవు. పంటలు పండవు. ప్రజల యోగ క్షేమములు పట్టించుకొనే నాథుడు ఉండడు. సైన్యము విదేశీ దండ యాత్రలను సమర్థముగా త్రిప్పి కొట్టలేదు. ఇష్టా పూర్తములు చేయు వారుండరు. ద్విజులు యజ్ఞములు చేయరు. దేవతార్చన సరిగా జరుగదు. కళలు, కళాకారులు అభివృద్ధి పొందరు. కట్టుబాట్లు ఉండవు. ధనప్రాణ మానములకు రక్షణ ఉండదు. మానవులు ఒకరినొకరు చంపుకొందురు. ఎవడు దేనినికూడ తన సొత్తుగా భావించలేడు. ఇంటి యజమాని మాట భార్య కానీ,

కొడుకు కానీ వినరు. భూషణాలంకృతులైన కన్యలు సాయంసమయములో ఉద్యానవనములలో విహరించ లేరు. బంగారు ఆభరణములు ధరించి ప్రజలు ప్రయాణము చేయుటకు భయపడుదురు. ప్రియురాండ్రతో కలిసి నిర్భయముగా సంచరింపలేరు. వర్తకులు వస్తు సంభారములతో నిర్భయముగా ప్రయాణము చేయలేరు. ధనికులు నిర్భయముగా తలుపులు తెఱుచుకొని నిద్రింపలేరు. కలియుగము గుఱించి భాగవతము ప్రథమ స్కంధములో ధర్మరాజు భీమునితో చెప్పినట్లుగా ఇట్లు వివరింప బడినది.

**సీ. ఒక కాలమునఁ బండు నోషధిచయము వే**
**ఱొక కాలమునఁ బండకుండు నండ్రు**
**క్రోధంబు లోభంబు క్రూరత బొంకును**
**దీపింప నరులు వర్తింతు రండ్రు**
**వ్యవహారములు మహావ్యాజ యుక్తము లండ్రు**
**సఖ్యంబు వంచనా సహిత మండ్రు**
**మగలతో నిల్లాండ్రు మచ్చరించెద రండ్రు**
**సుతులు దండ్రులఁ దెగఁ జూతు రండ్రు**

**తే. గురుల శిష్యులు దూషించి కూడ రండ్రు,**
**శాస్త్ర మార్గము లెవ్వియుఁ జరుగ వండ్రు**
**న్యాయ పద్ధతి బుధులైన నడవరండ్రు,**
**కాలగతి వింతయై వచ్చెఁ గంటె నేఁడు.**

( భాగవతం - ప్రథమ స్కంధము-332)

భారతములో అరణ్య పర్వములో ధర్మరాజునకు మార్కండేయుడు కలియుగము గుఱించి వర్ణించి చెప్పును. ఆ సందర్భమున

**సీ॥ పాషండ దర్శన బహుళంబు లయ్యెడు**
**వర్ణాశ్రమంబులు వసుమతీశ**
**తవిలి శరీరంబుఁ దద్దయుఁ బ్రోతురు**
**పుణ్య ఫలంబులు బొంకులనుచుఁ**

**గాలంబుతోఁ గూడఁ గలుగవు వానలు**
**పొల్లులై బీజముల్ వొలిసిపోవుఁ**
**గ్రయవిక్రయంబులఁ గపటంబు దఱచగుఁ**
**గడఁగి యిల్లడ సొమ్ము లడఁచికొంద్రు**
**ఆ॥ సాధుచరితు లైన జనులు దుర్గతుల రో**
**గములఁ దెగుదు రల్పకాలమునన**
**పాపపరులు లగ్గఁ పరమాయువును నరో**
**గతయు సిరియుఁ బొందఁ గాంతు రెందు.**

(అరణ్య పర్వము - చతుర్థాశ్వాసము - 293)

కలి పురుషుడు అధర్మమునకు ప్రతీక. ప్రాణి వధ, స్త్రీ ద్యూత, మద్యపానములు, అసత్య, మద, కామ, హింస, వైరములు అనునవి  కలి పురుషునకు స్థానములు. అసత్యము, లోభము, మాయ, కపటము, కలహము, దౌర్జన్యము, చౌర్యము, కలుషము, దురాచారము, అలక్ష్యము, మొదలైన ధర్మేతర సమూహము కలి పురుషుని ఆశ్రయించును. కాని **ధీరులకు** కలి వలన భయము లేదు. కలియుగాంతమున **శంబల** గ్రామమున విష్ణు యశుండను విప్రునకు విష్ణువు కల్క్యావతారుడై జనియించును. శంతనుని అన్న దేవాపి, ఇక్ష్వాకు వంశజుడగు మరుత్తు వీరు యోగయుక్తులై **కలాప** గ్రామ నిలయులై కలియుగాంతమున రాజ్యంబు చేసి కైవల్య పద ప్రాప్తులగుదురు.

కృతయుగము :- కలియుగ ప్రమాణమైన 4లక్షల సంవత్సరములు గడిచిన పిదప చంద్ర సూర్య శుక్ర గురువులు ఏకరాశి గతులయిన కృతయుగంబు ప్రారంభ మగును. ఈ కలియుగములోనే భాగవతమును శుకమహర్షి పరీక్షిత్తునకు, సూతమహర్షి శౌనకాదులకు, భారతమును పరీక్షిత్తు తనయుడయిన జనమేజయునకు వైశంపాయనుడు చెప్పెను. కావున కలియుగములో పాటించ వలసిన ఆచరణ పద్ధతులే యిందు వర్ణింపబడినవి. ఏ యుగములో నయినా వేదము చెప్పిన పద్ధతులే ఆచరణీయములు.

*****

# బ్రహ్మవిద్య

**నిర్వచనము :** బ్రహ్మచే బోధింపబడినది బ్రహ్మవిద్య. బ్రహ్మ గురించి బోధించునది బ్రహ్మవిద్య. ఇహలోకములకు, పరలోకములకు సంబంధించిన సర్వ విషయములు శాస్త్ర పాఠముగాను, ఆచరణ విధానముగాను చెప్పునది బ్రహ్మ విద్య. బ్రహ్మవిద్య పరమాత్మచే నాలుగు వేదములుగా బోధింపబడినది. ఇది దేశ కాల పాత్రలకు అతీతముగా సత్యమై, నిత్యమై, ఏకమై విరాజిల్లును. వేదములో చెప్పిన బ్రహ్మ విద్యనే పురాణములు చెప్పినవి.

**విశిష్టత :** బ్రహ్మ విద్య శ్రేష్ఠమైనది. ఇందు సర్వ విద్యలు ప్రతిష్ఠితమై ఉన్నవి. ఇది తెలుసుకున్నచో ఈ సర్వమూ తెలియును. రహస్యమైనది. సత్పురుషులచే సేవింపబడునది. సర్వ పాపములు పోగొట్టునది. పరాత్పరుని పొందు సాధనను చెప్పునది. అపరవిద్య పరవిద్యల సమ్మేళనము గలది.

**అపరవిద్య :** అపర విద్యలో ఇహలోకమునకు సంబంధించిన దేశము, రాజు, రాజ ఉద్యోగులు, ప్రజలు, జాతి ధర్మములు, ఆశ్రమ ధర్మములు, ప్రజలయొక్క విధులు బాధ్యతలు చెప్పబడును. వీటిని పాటించిన ఆదర్శ సమాజము ఉత్తమ పౌరులు ఏర్పడుదురు. ఇహలోకమునకు సంబంధించిన ఈ సర్వ విషయములు అందరికి చెప్పబడును. పరలోకమునకు సంబంధించిన పుణ్యకర్మానుష్ఠానములగు ఇష్టాపూర్తముల గురించి చెప్పబడును. అనగా యజ్ఞ యాగాదులు, క్రతువులు, అగ్నిహోత్రము, వేదాధ్యయనము, దాన ధర్మములు, పుణ్యతీర్థములు సేవించుట (తీర్థయాత్రలు) అతిథి పూజ మొదలగునవి చెప్పబడును. ఈ పుణ్యకర్మానుష్ఠానము చేసి పుణ్యఫలితమును కోరిన పుణ్యలోక ప్రాప్తి కలిగి ఇహలోకమున సుఖభోగములు కలుగును. ఈ పుణ్యకర్మానుష్ఠానము చేయు విధి విధానము ధర్మపరులందరికి చెప్పబడును. విజ్ఞానశాస్త్ర విషయములు, ఆయుర్వేదము, గణితము, ఖగోళము మొదలయినవి చెప్పబడును. వీటిని అర్హులకు మాత్రమే బోధింతురు. అధిభౌతిక అధిదైవికములుగా భూమి, ఆకాశము, సూర్యుడు, చంద్రుడు, కాలము గురించి చెప్పబడును. అధి దైవికములుగా చెప్పినవి యోగ రహస్యములు. కావున వీటిని

అర్హులకు మాత్రమే బోధింతురు. పుణ్యకర్మానుష్ఠానము చేసి పుణ్యఫలితము కోరని వారు శాశ్వత బ్రహ్మలోక ప్రాప్తిని పొందుదురు. వీరు జన్మపరంపరలలో చిక్కుకొనరు. ఆత్మ తత్త్వమును బ్రహ్మ విచారణగానూ, సృష్టి విచారణగానూ, దేహ విచారణ గానూ విభజించి ఆత్మ, ఆదిపురుషుడు, విరాట్ పురుషుడు, జీవ పురుషుడు, ప్రకృతి, మహత్, మాయ, అవిద్య, దేహము, కర్మ, జీవునకు దేహముతో గల సంబంధము, జీవుడు పయనించు మార్గములు మొదలయినవి ఈ విభాగము క్రింద బోధింతురు. ఈ విభాగమును నిష్కామ పరులైన అర్హులకు మాత్రమే బోధించెదరు. వేదాంత వాక్యములు తత్త్వంబు నెఱిగించును. వాటిని గ్రహించి సాధన చేయ వలయును.

**పరవిద్య :** వైరాగ్య విజ్ఞానములు కలవారు మాత్రమే దీనికి అర్హులు. అనగా ఇహలోక పర లోకములయందు భోగ భాగ్యముల యందు ఆసక్తి ఉండని వారు అర్హులు. సంసార తాపత్రయములను వదలి ధనేషణ, దారేషణ, పుత్రేషణ అనే ఈషణ త్రయములను వదలిన వారు మాత్రమే ఈ పరవిద్యకు అర్హులు. ఈ పర విద్యలో యోగము, భక్తి, అనే సాధనలు చెప్పబడును.

బ్రహ్మవిద్యను బోధించు గురువులు అందఱు ఒకే విషయమును బోధింతురు. పాఠ్యాంశములోగాని సాధనలలోగాని భేదముండదు. ఇతర గురువులు బోధించు పద్ధతులలో అనంతములైన పద్ధతులు ఉండును.

**వ్యవసాయాత్మికా బుద్ధిః ఏకేహ కురునందన**
**బహుశాఖా హ్యనంతాశ్చ బుద్ధయోఽ వ్యవసాయినామ్** (సాంఖ్య యోగము 41)

కురునందన = అర్జునా; ఇహ = ఈ బ్రహ్మ విద్యయందు, వ్యవసాయాత్మికా + బుద్ధి : = గురువులు బోధించు శాస్త్ర పాఠము ఆచరణ పద్ధతులలో; ఏకా (భవతి)= భేదము ఉండదు. అందఱు ఒకటే బోధింతురు; చ=మఱియు; అవ్యవసాయినామ్+ బుద్ధయః = ఇతరులు చెప్పువాటిలో; బహుశాఖాః + అనంతాః = అనంతము లయిన పద్ధతులు అనేక భేదములు ఉండును.

| పరవిద్య | |
|---|---|
| వీరికి చెప్పవచ్చును | వీరికి చెప్పరాదు |
| శ్రద్ధా సంపన్నునకు, విరక్తునకు, సదాచారునకు, మంచి గుణములు కలిగి దుర్గుణములు లేని వానికి అనగా శుద్ధాత్ముడు, నిష్కామునికి, శాంత చిత్తునికి, సర్వభూత సమునికి, నిర్మత్స రునికి, అసూయా రహితునికి, తపస్సు చేయువానికి, భక్తునికి, గురు సేవా తత్పరుడు అయిన వానికి చెప్పవచ్చును. గురువులు తమ ప్రియ శిష్యులకు పరమ రహస్యములు తెలియ పలుకుదురు. | ఇంద్రియ లోలునకు, పుత్రదారాదులందు అత్యంత ఆసక్తి కలవానికి, ధన సంపాదన యందు మిక్కిలి ప్రేమ గల వానికి, అవి నీతునకు, దురాచారునకు, వ్యసన పరునకు, దుర్గుణములు కలవానికి, ఖలునకు, డాంబికునకు, భక్తి హీనునకు చెప్పరాదు. |

అర్హత లేని వారికి బ్రహ్మ విద్యను చెప్పరాదు అను నియమము కలదు. అందువలన శ్రీకృష్ణుడు అర్జునుని తో

**ఇదం తే నా తపస్కాయ నా భక్తాయ కదాచన**
**న చా శుశ్రూషవే వాచ్యం న చ మాం యో ఒభ్యసూయతి.**

(మోక్షసన్న్యాస యోగము-67)

తే = ఓ అర్జునా నీకు చెప్పిన; ఇదం = ఈ అధ్యాత్మిక రహస్యమును; కదాచన = ఎప్పుడును; అతపస్కాయ = తపస్సును చేయని వానికి; న = చెప్పరాదు; అభక్తాయ= సత్వగుణములు లేనివానికి; న = చెప్పరాదు; అశుశ్రూషవే = గురు శుశ్రూష చేయని వానికి; న = చెప్పవద్దు; చ = మఱియు; యః=ఎవరు; మాం = నాయందు; అభ్యసూయతి = అసూయ ఉండునో వానికి; న+వాచ్యం= చెప్పవద్దు.

చ॥ ఎఱిగెడు వాఁడు కర్మచయమెల్లను మాని హరిస్వరూపమున్
నెఱయ నెఱింగి యవ్వలన నేరుపుఁ జూపు గుణానురక్తుఁడై
తెఱకువ లేక క్రుమ్మరుచు దేహధనాద్యభిమాన యుక్తుఁడై
యెఱుఁగని వానికిం దెలియ నీశ్వరలీల లెఱుంగఁ జెప్పవే.

(భాగవతము, ప్రథమ స్కంధము-99)

అనగా ఆత్మ తత్త్వమును తెలిసినవాడు కర్మ ఫలితములను కోరక ఆత్మతో క్రీడించును. అట్టి మహానుభావులకు బ్రహ్మ విద్య గుఱించి చెప్పవలసిన పనిలేదు. తమోగుణము యందు ఉండి దేహము, ధన ధాన్యములు, సంపదలు, భోగభాగ్యము లందు, సంసార తాపత్రయములందు తలమునకలై నిజకుటుంబ పారవశ్యమున ఉన్నవానికి ఈ బ్రహ్మవిద్యను చెప్పరాదు. బ్రహ్మతత్త్వమును తెలుసుకొనవలయును అనే జిజ్ఞాసాపరునకు ఈ బ్రహ్మవిద్యను చెప్పుము అని నారదుడు వ్యాసభగవానునికి చెప్పెను.

*****

# వేదము

'విద' ధాతువు నుండి వేదము అను పదము పుట్టినది. విద జ్ఞానే అని వేదమునకు జ్ఞానమర్థమని పాణిని చెప్పినాడు. కావున వేదమనగా జ్ఞానమును గలుగ చేయునది అని అర్థము. లౌకిక జ్ఞానము మఱియు అతీంద్రియ జ్ఞానములను గలుగచేయు విషయములు వేదములో వివరింపబడును.

ప్రారంభ సృష్టిలో ఆత్మ లేక ఆది పురుషుని వలన వేదము ఉద్భవించినది. అనంతర సృష్టిలో చతుర్ముఖ బ్రహ్మ యొక్క నాలుగు ముఖముల నుంచి వేదములు ఉద్భవించినవి. వేదమునకు ముందు స్వరము ఉద్భవమైనది. ఆ స్వరమును అర్హులైన పెద్దలు విన్నారు. వారు శ్రోత్రియులు. ఇట్టి శ్రోత్రియత్వము పరానుభూతి వలనగాని గలుగదు. అందువలన పరానుభూతికి చేరువలో నున్న వారికై శ్రోత్రియత్వము వలన విన్న దానిని ఋషులు స్మృతికి తెచ్చుకొని వ్రాసినారు. విన్నదానిని వ్రాయటము వలన వేదములను అపౌరుషేయములని అన్నారు. ఋషి, ఛందస్సు, ఆ మంత్రాధిష్ఠాన దేవతలు వేదములోని ప్రతి సూక్తములో చెప్పబడును. ఆది పురుషుడు చతుర్ముఖ బ్రహ్మకు వేదము చక్కగా అర్థమగునట్లు చెప్పెను. ఆ చతుర్ముఖ బ్రహ్మ తన వలన సృజియింపబడిన ఋషులకు చెప్పెను. ఆ ఋషులు వారి శిష్యులకు విశదీకరించిరి. ప్రారంభ సృష్టిలో ఆది పురుషుని వలన ఉద్భవించిన వేదము అనంతర సృష్టిలో బ్రహ్మ యొక్క నాలుగు ముఖముల నుంచి ఋగ్వేదము, సామవేదము, యజుర్వేదము, అథర్వవేదము అనే నాలుగు వేదములుగా ఒకేసారి ఆవిర్భవించినది. వేద కాలములోనే వేద విభజన జరిగినది.

**తత్రాఽ పరా ఋగ్వేదో యజుర్వేదః సామవేదో ఽథర్వవేదః**
**శిక్షా కల్పో వ్యాకరణం నిరుక్తం ఛన్దో జ్యోతిష మితి ।**
**అథ పరాయయా తదక్షర మధిగమ్యతే**

(ముండక ఉపనిషత్ - ప్రథమముండకే. ప్రథమ ఖండః 5)

ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదము, అథర్వవేదము అనే నాలుగు వేదములను శిక్షా, కల్పం, వ్యాకరణం, నిరుక్తం, ఛందస్సు, జ్యోతిషం అనే వేదాంగములతో

చదవవలయును. వేద వేదాంగములను చదువుట అపర విద్య. ఆ చదివిన చదువును సాధన చేసి పరమాత్మను పొందుట పరవిద్య. లౌకిక జ్ఞానమునకు సంబంధించిన అపరవిద్యయు, అక్షర పరబ్రహ్మను చేరు పరవిద్యయు వేదములందు తెల్పబడినవి. పూర్వము ఆది పురుషుడు మత్స్యావతారములో వేదములు కలిసిపోకుండా విభాగించి వైవస్వత మనువు వేళ బ్రహ్మకు ఇచ్చెను. వైవస్వత మనువు కాలములోనే ఇప్పటి యుగ చతుష్టయములలోని ద్వాపర యుగసంధి సమయములో ఆ వేదములకు శాఖలు ఏర్పఅచి ఒక్కొక్క వేదమును ఒక్కొక్క శిష్యునకు వ్యాస భగవానుడు ఇచ్చెను.

ఋగ్వేదమును-పైలునకు; సామవేదమును-జైమినికి; యజుర్వేదమును-వైశంపాయనునికి; అథర్వవేదమును-సుమంతునికి ఇచ్చెను. (ఇతడు రామాయణము లోని సుమంతుడు కాదు) వీరు వారి వారి శిష్యులకు విభాగించి ఇచ్చిరి. ఒక్కొక్క వేదము మరల సంహితలని బ్రాహ్మణములని ఆరణ్యకములని ఉపనిషత్‌లని నాలుగు విభాగములు క్రింద వర్గీకరింపబడినవి.

| ఋగ్వేదము | ఐత్తరేయ బ్రాహ్మణము | ఐత్తరేయ ఆరణ్యకము | ఐత్తరేయ ఉపనిషత్ |
|---|---|---|---|
| సామవేదము | తలవర బ్రాహ్మణము జైమిని బ్రాహ్మణము | ------- | కేన ఉపనిషత్ ఛాందోగ్య ఉపనిషత్ |
| యజుర్వేదము | తైత్తరీయ బ్రాహ్మణము | తైత్తరీయ ఆరణ్యకము బృహదారణ్యకము | తైత్తరీయ ఉపనిషత్ కఠోపనిషత్ ఈశోపనిషత్ |
| అథర్వవేదము | ------- | ------- | ముండక ఉపనిషత్ మాండుక్య ఉపనిషత్ ప్రశ్న ఉపనిషత్ కైవల్య ఉపనిషత్ |

జన్మసంస్కారముచే సాధన చతుష్టయము సంపాదించి త్రిగుణములను జయించినవారికి వేదములు చక్కగా అర్థమగును. అనగా వేదము నందు వివరింపబడిన విషయములు సంపూర్ణముగా తెలియును. వేదము అర్థబాహుళ్యము భావబాహుళ్యము గలది. కర్త కర్మ క్రియలతో పూర్తి వాక్యముండదు. పదముల సముచ్ఛయముండును. వీటిని ఋషుల భాష్యముల ననుసరించి గ్రహించవలసి ఉండును. భావబాహుళ్యమునకు ఉదాహరణ :- ఇంద్ర పదమునకు అనేక అర్థములుండును. దేవతలకు ప్రభువు అని, ఆది పురుషుడని, చైతన్యమని, సర్వత్రా ఆత్మను దర్శించిన వాడని, జీవుడని ఇలా ఉన్న అర్థములో ఒక అర్థమును ఇంద్ర పదమునకు చెప్పవలసి ఉండును.

**స బ్రహ్మ స శ్శివ స్సహరి స్సేన్ద్ర సోఽ క్షరః పరమస్స్వరాట్** (శ్రుతి). ఇక్కడ వాడిన ఇంద్ర పదమునకు-ఆది పురుషుడు, పరమాత్మ, విరాట్ పురుషుడు అని అర్థము. **తస్మాదిదన్ద్రోనామ** .... (ఐత్తరేయ ఉపనిషత్ ప్రథమాధ్యాయే తృతీయ ఖండః 14). ఇక్కడ ఇంద్రుడనగా సర్వత్రా ఆత్మ దర్శనము చేసినవాడని అర్థము. అహల్యతో జారత్వము చేసిన ఇంద్ర పదమునకు చైతన్యము అని అర్థము. ఈ విధముగా ఒకే పదమునకు అనేక అర్థములు. ఈ విధముగా భావబాహుళ్యము కలది. **ముఖాత్ ఇంద్రః చ అగ్నిః చ-** (ఋగ్వేదము-అష్టకము 8-అధ్యాయము 4). ఈ మంత్రమునకు అర్థము చెప్పునప్పుడు నోటినుంచి అగ్ని, బాహువుల నుంచి ఇంద్రుడు వచ్చెనని చెప్పవలయును. కాని మంత్రములో బాహువునుంచి అనే పదము లేదు.

అర్థబాహుళ్యమునకు ఉదాహరణ :- **స భూమిం విశ్వతో వృత్వా అత్య తిష్ఠ దశాంగులమ్** (శ్రుతి). ఇందు భూమి అను పదమునకు అధి దైవికమైన ప్రకృతి అని అర్థము చెప్పవలయును. ఈశ్వరుడు ప్రకృతిని అధిష్ఠించి సృష్టి చేసెనని అర్థమున భూమి అను పదము చెప్పబడినది. ఇటుల వేదము భావ బాహుళ్యము, అర్థబాహుళ్యము గలది.

**యే భూతానామధి పతయో విశిఖాసః కపర్దినః** (కృష్ణ యజుర్వేద తైత్తిరీయ సంహిత-చతుర్థకాండము-పంచమ ప్రపాఠకం)
యే = ఎవరు: భూతానామ్ = భూతములయొక్క: అధిపతియః= అధిపతులు విశిఖాసః= జుట్టు లేని వారు: కపర్దినః = జటాజూటములు గలవారు. ఈ వాక్యములో క్రియ లేదు. కొన్నిటిలో కర్త ఉండదు. కొన్నిటిలో కర్మ ఉండదు. కొన్నిటిలో క్రియ ఉండదు. ఆ ఉన్న పదములు కూడా విడి విడిగా ఉండును. ఆ పదములను ఎలా కలపవలయునో కూడా తెలియదు.

ఉదాహరణకు - **ఇన్ద్రాఽ గచ్ఛ హరివ ఆగచ్ఛ మేధాతిథేః। మేష వృషణశ్వస్యమేనే॥ గౌరావస్కన్ది న్నహల్యాయై జార। కౌశిక బ్రాహ్మణ గౌతమ బ్రువాణ ॥**
(తైత్తరీయ ఆరణ్యకము-ప్రథమ ప్రపాఠకః-ద్వాదశోనువాకః- 3-4)

ఇందు ఇంద్ర, హరివః, మేధాతిథేః, మేష వృషణ, అహల్య, జార, గౌతమ, ఇవి విడి విడి పదములు. ఈ పదములను కలుపు క్రియ అగు "ఆగచ్ఛ" ఉన్ననూ భావము స్పష్టముగా అర్థమగుట లేదు. దీనికి భాష్యముగా వేదాంతమును అర్థమగుటకు అహల్య కథగా రామాయణములో బాల కాండలో వాల్మీకి మహర్షి వివరించినారు. ఈ కథ జన్మ సంస్కారము, త్రిగుణములు జయించిన వారికి అహల్య - ఇంద్రునితో జారత్వము జరిపిన కథ అర్థమగును. ఈ కథ ఒక ఆధ్యాత్మిక రహస్యము కావున వేదములు చదివినా అర్థము కావు. అందువలన వ్యాస భగవానుడు

**నిగమంబులు వేయు జదివిన,**
**సుగమంబులు గావు ముక్తి సుభగత్వంబుల్**
**సుగమంబు, భాగవతమను**
**నిగమంబుఁ బఠింప ముక్తి నివసనము బుధా**

( భాగవతము, ప్రథమ స్కంధము- 140)

వేదములు వేయి సార్లు చదివినా చక్కగా అర్థము కావు అని చెప్పినారు.

**చదువని వాఁడజ్ఞుం డగుఁ,**
**జదివిన సదసద్వివేక చతురత గలుగుం**
**జదవఁగ వలయును జనులకుఁ,**
**జదివించెద నార్యులొద్దఁ జదువుము తండ్రీ.**

( భాగవతము, సప్తమ స్కంధము -130)

వేదములు చదవనిచో అజ్ఞానవంతుడగును. చదివినచో సత్ ఏదో- అసత్ ఏదో తెలియును. కావున వేదములు సర్వ జనులు అనగా స్త్రీ పురుషులందఱు చదవ వలయును. ఆత్మదర్శనము చేసిన పెద్దల వద్ద వారికి శుశ్రూష చేసి నేర్చుకొన వలయును. ఆర్యులొద్దకాక మిగిలిన వారి వద్ద నేర్చుకున్నచో సరిగా వాటి అర్థములు తెలియవు.

**సంహితలు :-** వేద సంహితలందు అధ్యాత్మిక విషయములు, విజ్ఞాన శాస్త్ర విషయములు, కర్మ విభాగమునకు సంబంధించిన మంత్ర పాఠములుండును.

**బ్రాహ్మణములు :-** బ్రాహ్మణములందు వేద మంత్రముల అర్థములు, యజ్ఞకర్మలు ఎలా చేయవలయునో వివరింపబడును.

**ఆరణ్యకములు :-** ఆరణ్యకములందు అధ్యాత్మిక భావనలు ప్రధానముగా వివరింపబడును.

**ఉపనిషత్తులు :-** ఉపనిషత్‌లందు ఎక్కువగా అతీంద్రియ జ్ఞానమునకు సంబంధించిన ఆత్మ, సృష్టి, సాధనలు వివరింపబడును. అక్కడక్కడ పుణ్య కర్మానుష్ఠానము ఏ విధముగా చేయవలయునో వివరింపబడును. సందర్భాను సారము వ్యక్తి యొక్క విధులు బాధ్యతలు వివరింపబడును. ఆత్మను పొందు విధానము వివరింపబడును.

భౌతిక శాస్త్రము, రసాయన శాస్త్రము, ఇంజనీరింగ్, అణు శాస్త్రము అనే ఈ నాలుగు శాస్త్రములు వేటికి అవి వేఱు వేఱు విషయములను బోధించును. కానీ ఈ నాలుగు వేదములు ఒకే విషయమును బోధించును. అనగా అపరవిద్య, పరవిద్యలనే బోధించును. ఒక వేదములో చెప్పిన విషయమునకు ఇంకొక వేదములో చెప్పిన విషయమునకు పరస్పర విరుద్ధముండదు. అనేక మారులు ఒక వేదములోని మంత్రములు ఇంకొక వేదములో కూడా కనిపించును. వేదములలో ఒకే విషయమునకు సంబంధించినవన్నీ ఒకే చోట చెప్పబడవు. అనగా ఇంద్రాది దేవతలకు సంబంధించినవి గానీ ఆత్మ, ప్రకృతి మొదలయినవాటి గుఱించి చెప్పిన విషయములుగానీ ఒకే చోట చెప్పబడవు.

వేదములలో ఇతర విషయములైన జ్యోతిష్యము, ముహూర్తము, వాస్తు, హస్త సాముద్రికము, మొదలైన విషయములు కూడా ఉండును. ఈ శాస్త్ర విషయములు వేదములలో అరటి పండు వలచి నోటిలో పెట్టినట్లు ఉండవు. వీటిని నేర్చుకొనుటకు నేర్చుకొనినవి ఆచరించుటకు తగిన అర్హత అవసరము. అథర్వవేదము చదివి అందు చెప్పబడిన ఔషధుల పేర్లు - అవి ఏవ్యాధి చికిత్సకు పనికి వచ్చునో తెలిసినంత మాత్రమున ఆయుర్వేద వైద్యుడు కాలేడు. వేదములోని విషయమును గ్రహించుటకు ప్రత్యేక శ్రద్ధ కృషి అవసరము. అందుకు ఉపవేదమయిన ఆయుర్వేదమును అధ్యయనము చేయ వలసి ఉండును. అటులనే ఖగోళ శాస్త్రము, గణితము మొదలైన శాస్త్ర విషయములను ప్రత్యేక కృషి, శ్రద్ధ గలిగిన కొందఱు మాత్రమే నేర్చుకొనగలరు. ఇట్టి కృషి, శ్రద్ధ లేనివారు వేదములు చదివినా ఈ శాస్త్ర విషయములు అర్థము కావు.

అందువలన వ్యాసభగవానుడు **మేధా విహీనులయిన పురుషులచేతనట్టి వేదంబులు ధరియింప బడుచున్నవి.** (భాగవతం ప్రథమస్కంధం-84) అని చెప్పినాడు. విజ్ఞానశాస్త్ర విషయములలో అవగాహన లేని వారు వేదములు చదివినా వాటిలోని విషయములు వారికి అర్థము కావు. కావున వేదములు చదివి అందలి శాస్త్ర విషయములు లోకమునకు వెల్లడించవలసిన బాధ్యత విజ్ఞానవంతులపై కలదు. ఒక వ్యక్తికి ఆంగ్లభాష (English) రాదు. అతడు ఇంగ్లీషులో ఒక గొప్ప ఉపన్యాసము వినినను ప్రయోజనమేమి? ప్రయోజనము లేదు. అటులనే మానవ శరీర నిర్మాణము, మానవునికి వచ్చు జబ్బులు, వాటికి వాడవలసిన మందులు గుఱించి, ప్రాథమిక స్థాయి విద్యాభ్యాసము కూడ చేయని వానికి ఎంత చెప్పినను అర్థము కాదు. కావున వాడు ఆ వైద్య శాస్త్ర విషయములు విన్నా ప్రయోజనము లేదు. కావున నేర్చుకొనుటకు ఒక అర్హత కావలసియుండుననిగదా, నేడు మనము కొన్ని పరీక్షలు పెడుతున్నాము. అర్హత సంపాదించిన వారందఱూ నేర్చుకొనుటకు అర్హులే అనిగదా మన భావన. ఇంజనీరింగ్ చదవవలయుననే అభిలాష గల వారందఱికీ ఒక ప్రవేశ

పరీక్ష పెట్టి ఆ పరీక్షలో ఉత్తీర్ణత పొందిన వారిలో కొందఱికి మాత్రమే ఇంజనీరింగ్ కళాశాలలో ప్రవేశము గలిగించుచున్నాము గదా. ఇదే విషయమును అర్హత లేని **స్త్రీ శూద్రులకుం త్రైవర్ణికాధములకు** అనగా బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యులకు **వేదములు విననర్హంబులు** కావు అని వ్యాసభగవానుడు **(**భాగవతం- ప్రథమస్కంధం**-84)** చెప్పిరి. అనగా వేదములోని విజ్ఞాన విషయములు విన్నా అర్థము కావని అర్థము. వీరే అర్హత సంపాదించినచో చదవవచ్చును. దేవహూతి, గార్గి, మొదలైన స్త్రీలు వేదమును గ్రహించిరి. శూద్రుడయిన సత్యకామజాబాలి వేదమును గ్రహించెను.

**వేదములో పరవిద్య, దేవతా స్తుతులు, సూక్తములతోపాటు అపరవిద్యలో ఈ దిగువ ఉదహరించిన శాస్త్ర విషయములు** (Theory) **చెప్పబడును.**

| | |
|---|---|
| విజ్ఞాన శాస్త్ర విషయములు<br>1. ఆయుర్వేదము (Medicine)<br>2. ఖగోళ విషయములు (Astronomy)<br>ఖగోళ విషయములలో<br>(అధి భౌతికము)<br>అ) సూర్యుని గుఱించి ( Helio centric) | అధిదైవికమయిన అధ్యాత్మికమయిన సూర్య భగవానుని గుఱించి |
| ఆ) గ్రహముల గుఱించి<br>ఇ) రాహు, కేతువులను నిర్ణయించుట గుఱించి<br>ఈ) నక్షత్రముల గుఱించి<br>ఉ) కాలమును గణించుట గుఱించి | అధి దైవికమయిన కాలము. మఱియు |

| | |
|---|---|
| 3. భూగోళము (Geography)<br>భూమి గురించి- (అధి భౌతికముగా)<br>అష్ట ధాతువుల గురించి (Metolargy) | అధి దైవికమయిన భూమి గురించి అనగా భూమిని మోయుచున్న అష్ట దిగ్గజములు, పాల సముద్రము, సప్త ద్వీపములు, సప్త సముద్రములు మొదలయినవి. |
| 4. అణు శాస్త్రము ( Atomic energy) | |
| 5. గణిత శాస్త్రము (Mathematics) | |
| 6. సృష్టి గురించి ( Evolution theory)<br>చెప్పబడును. | అధిభౌతికము, అధిదైవికము గురించి అధ్యాత్మికమయిన ఆత్మ గురించి ఆత్మ సృష్టి చేసిన విధానము అనగా 14లోకములు, విరాట్ పురుషుని నుంచి వచ్చిన దేవతల గురించి చెప్పబడును. |

**పుణ్యకర్మానుష్ఠానము :** పుణ్యకర్మానుష్ఠానము చేయు విధి విధానము వేదము నందు వివరింపబడును. ఈ పుణ్యకర్మానుష్ఠానము మూడు విధములు.

1. ఇహలోక సుఖములకై చేయు పుణ్యకర్మానుష్ఠానము
2. పరలోక సుఖములకై చేయు పుణ్యకర్మానుష్ఠానము
3. మోక్షమును పొందుటకు చేయు పుణ్యకర్మానుష్ఠానము

ఇహలోక పరలోక సుఖములకై చేయు కర్మను ప్రవృత్తి కర్మగా చెప్పుదురు. వీటి ఫలితము అశాశ్వతము. అశాశ్వత ఫలితమునకై ప్రాకులాడు వారు మేధా విహీనులు. వీరు వేదములోని విభాగమునే తీసుకొని వేదము పుణ్యకర్మ ప్రవృత్తి కర్మ గురించి చెప్పినదని భ్రమించి వాటినే ఆచరించి ఇతరులకు బోధించి వారిచే ఆచరింప చేయుదురు. వీరినే పండితమన్యులని, మేధా విహీనులని పేర్కొనిరి. కావున **శ్రుతి, కర్మ పరమని చెప్పు వారు వేదజ్ఞులనదగరు** అని వ్యాస భగవానుడు భావించినారు. మోక్ష మార్గమును గురించి చెప్పునది నివృత్తి కర్మగా చెప్పుదురు.

భూలోకములో ప్రభువు ప్రజలు ఎలా నడుచుకొనవలయునో వారి విధులేమిటో బాధ్యతలు ఏమిటో వేదములో వివరింపబడును. ఇవి ప్రజలందరూ చదివి ఆచరింప వలయును. అప్పుడే ఆదర్శసమాజము ఏర్పడును. ధర్మమనగా విధులను, బాధ్యతలను సక్రమముగా నెరవేర్చుట. ధర్మాచరణ వలన వ్యక్తికి, సంఘమునకు మేలు కలుగును. దీనినే పుణ్యమనిరి. వీరినే పుణ్యాత్ములు అనిరి. అధర్మ మనగా విధులను బాధ్యతలను నేరవేర్చకుండుట. అధర్మా చరణ వలన వ్యక్తికి, సంఘమునకు కీడు కలుగును. వీటిని పాపములనిరి. వీరినే పాపాత్ములనిరి. కావున ఏది పుణ్యమో ఏది పాపమో తెలియుటకు వ్యక్తిగత విధులు బాధ్యతలు అను విభాగమును అందరూ చదవవలయును.

**వేదాంగములు**

**వేదాంగములు ఆరు. అవి:**

**1. శిక్షా :** ఒక పదమును వాక్యమును ఎలా చదవవలయునో చెప్పును. అనగా ఎలా పలక వలయునో చెప్పును. ఒక పదమును ఉదాత్త అనుదాత్త స్వరిత ప్లుతము హ్రస్వము దీర్ఘము ఒత్తిఒత్తి బలముగా పలుకుట, ఎంత విరామముతో పలక వలయును మొదలయిన విషయములను బోధించును. (ఉత్తరాది వారు వేదమును చదువుటకు, దక్షిణాది వారు చదువుటకు భేదము కనబడుచున్నది)

**2. వ్యాకరణము :** సంధి, సమాసములు, అలంకారములు మొదలయినవి వివరించ బడును. పాణిని, వరరుచి, పతంజలి అనే మునిత్రయము వ్యాకరణమునకు పుష్టిని గలుగ చేసిరి.

**3. ఛందస్సు :** తెలుగులో కంద పద్యము, ఆటవెలది, తేటగీతి అను ఛందస్సులవలె ఉష్ణిక, ధాత్రి, త్రిష్టుప్, అనుష్టుప్, జగతీ,పంక్తి, బృహతీ మొదలయిన అనేక ఛందస్సులు కలవు. అందులో గాయత్రీ ఛందస్సు ఒకటి. ఇలాంటి ఛందస్సులలో ఆ మంత్రము ఏవిభాగమునకు చెందినదో ఆ మంత్రము యొక్క ఛందస్సు వివరింపబడును. సంస్కృత భాషకు సంబంధించిన కావ్యములు చదువుటకు శిక్షా, వ్యాకరణము, ఛందస్సులు చాలును. కానీ వేదము చదువుటకు వీటితో పాటు నిరుక్తము అవసరము.

**4. నిరుక్తము :** వేద మంత్రములలోని ఒకే పదమునకు అనేక అర్థములుండుటచే వేద మంత్రములు అర్థము చేసికొనుటకు మఱికొంత పరిజ్ఞానము, తపస్సు అవసరము. అట్టి పరిజ్ఞానమును గలుగ చేయునది నిరుక్తము. పాణిని వ్యాకరణ మును రచించినట్లే వేదమంత్రములు అర్థమగుటకు నిరుక్తమును "యాస్కుడు" చెప్పినాడు. ఐతే పారిభాషిక పదములు (technical words) వాటి అర్థములు నిరుక్తములో చెప్పలేదు. ఉదాహరణకు అహల్యా యై జార మంత్రములో అహల్య అనగా ఏమిటి ? జార శబ్దమునకు అర్థము ఏమిటి ? వీటి వివరణ ఉండదు. వేదము చదివి ఆ చదివిన దాని అర్థమును గ్రహించవలయును. అర్థము గ్రహించని చదువు వ్యర్థము. ఈ విషయమునే యాస్కుడు ఇట్లు చెప్పినాడు.

**స్థాణు రయం భారహారః కిలా భూదధీత్య వేదం న విజానాతి.**

( నిరుక్తం - ప్రథమాధ్యాయము - షష్టి పాదము)

నేడు వేద పాఠశాలలో కేవలం శిక్షా మాత్రమే చెప్పుచున్నారు. కావున ఆ చదివే మంత్రముల అర్థము తెలియదు. అర్థము తెలియని చదువు వ్యర్థము. కావున వేదాంగములతో కూడిన చదువు చెప్పవలయును. లేనిచో వీరి వలన అనేక అపభ్రంశములు చోటు చేసుకొనగలవు.

**5. కల్పము :** వేద మంత్రముల విజ్ఞానమును మనము ఉపయోగించు విధానము కల్పము. కోరికలు నెఱవేఱుటకు చేయు పుణ్యాకర్మానుష్ఠానమే కల్పము. అనగా ఇహలోక సుఖములు, పరలోక సుఖములు పొందుటకు ఏమి చేయవలయునో కల్పమున వివరించబడును.

| కల్పము | | |
|---|---|---|
| వైదికము | | అవైదికము |
| 1. | యాగములు. చతుష్టోమము, ఉక్థ్యము, అతిరాత్రము, జ్యోతిష్టోమము, అభిజిత్ యాగము, విశ్వజిత్ యాగము, ఆప్తో ర్యాగము ఇతర క్రతువులు. దశరాత్ర క్రతువు, ఏకాదశ, ద్వాదశ రాత్రములు, అశ్వమేధము రాజసూయము మొదలైనవి. | వేదములందు చెప్పని యాగ ములు యోగ్యత లేనివారు కర్తలుగాను, ఋత్విక్కులుగా ఉండుట, సోమ రసము లేనివి, పశుఆలంబన లేని యజ్ఞములు మొదలైనవి. |
| 2. | విద్యలు-మధువిద్య, భార్గవీ వారుణీ విద్య మొదలైనవి | పర్యంక విద్యగా చెప్పబడే తాంత్రికము. |
| 3. | ఇష్టా పూర్తములు. | శైవ, వైష్ణవ, ఆగమములు వేదములలో విగ్రహారాధన లేదు. |

**6. జ్యోతిష్యము :** పూర్వజన్మ కర్మానుసారము జీవుడు భూలోకమునకు వచ్చినాడు. పూర్వజన్మ పుణ్య కర్మమున ఈ జన్మలో సుఖము, అభివృద్ధి గల్గును. పూర్వజన్మ పాపకర్మ వలన ఈ జన్మలో దుఃఖము, రోగములు, కష్టములు కలుగును. కావున పూర్వజన్మ కర్మ వలన సుఖదుఃఖములు ఎప్పుడెప్పుడు కలుగునో వివరించును.

**వేదములో కథలు :** ఒక విషయమును వివరించుటకు కథలు చెప్పు విధానము వేదములలో కలదు. ఉదాహరణకు, 1. కేన ఉపనిషత్‌లో కర్మేంద్రియములు, జ్ఞానేంద్రియములు, ప్రాణము ఆత్మను దర్శించ లేవు. ఒక్క జీవుడు మాత్రమే ఆత్మను దర్శించగలడు అని చెప్పుటకు ఒక కథను చెప్పిరి. ఈ విషయము అర్థమగుటకు అగ్ని (వాక్కు) వాయువు (ప్రాణము) ఆ వచ్చిన యక్షుడు ఎవరో గ్రహించలేక పోయిరి అని చెప్పిరి. ఇంద్రుడు (జీవుడు). ఆ యక్షుని అతి సమీపమునుండి చూచుటకు వెళ్ళగా యక్షుడు అదృశ్యమయ్యెను. అక్కడ ప్రత్యక్షమయిన ఉమ ఆ వచ్చినది పరమాత్మ అని చెప్పినది. అతడే (ఆత్మయే)

మీకు గల శక్తులను ఇచ్చెనని చెప్పినది. ఆత్మవలననే దేహేంద్రియ మనోబుద్ధులు పని చేయునని దీని అర్థము.

**2. ఆపోవా ఇదమగ్రే సలిల మాసీత్తస్మిన్ప్రజాపతిర్వాయు ర్భూత్వా ఽ చరత్స ఇమా మపశ్యత్తాం వరాహోభూత్వా ఽ హరత్తాం విశ్వకర్మా భూత్వాన్యమార్ట్సాఽ ప్రథత సా పృథివ్య భవత్తత్పృథివ్యై పృథివిత్వం.**

(కృష్ణ యజుర్వేద తైత్తిరీయ సంహిత - కాండము 7 - ప్రపాఠకము - 1 - అధ్యాయము 5)

ఇదమ్= ఈ భూమి (అధిభౌతికమయిన భూమి (earth) యోగ సంబంధమయిన ఆధార చక్రము); అగ్రే=సృష్ట్యాది యందు (యోగానుష్టానమునకు పూర్వము) సలిలం= జలములో; (శరీరమందు గల జలతత్వముతో) ఆసీత్= ఉండెను; భూమి అంతా జలమయమై ఉండెను. అందువలన ఎటు చూసినా; ఆపోవై=జలములే. అప్పుడు ప్రజాపతిః =ప్రజాపతి; వాయుః= వాయువుగా; భూత్వా= ఉండి; ఆచరత్= సంచరించెను. సః=ఆప్రజాపతి; ఇమాం=ఈ భూమిని; అపశ్యత్=చూచెను; వరాహః భూత్వా=యజ్ఞవరాహముగా అవతరించి; తామ్=ఆ భూమిని; ఆహరత్= ఉద్ధరించెను; విశ్వకర్మా + భూత్వా = అతడే విశ్వ కర్మగా అవతరించి; తామ్= ఆభూమిని; న్యమార్ట్=విశేషముగా శుభ్రము చేసెను; సా=ఆ భూమి; అప్రథత= విస్తరించెను; సా= అది; పృథివీ+ అభవత్= పృథివి అయినది; పృథివ్యై+పృథిత్వమ్= విస్తరించెను అను అర్థమున "పృథివీ"అని నామము గలిగినది. ఈ మంత్రములో అధి భౌతికమయిన భూమి గురించి, యోగ సాధనకు సంబంధించిన కుండలినీ శక్తి గురించి వివరింపబడినది. అధి భౌతిక పరంగా మొదట భూమి అంతా జలమయం. ఆ జలముపై వాయువులు వీచుచుండెను. ఆ భూమి క్రమ క్రమముగా గట్టి పడి జలములు తొలగి బురద గలిగి ఆపై గట్టి భూభాగము ఏర్పడెను. భూమి పై గల బురద తొలగినది. శుభ్రమైనది. జీవులకు నివాస యోగ్యమైనది. యోగ సాధన పరంగా ఆధారచక్రము జలతత్త్వములో మునిగి ఉండును. అప్పుడు జీవునకు రసానుభూతిగా చెప్పబడే ఇన్ద్రియసుఖములపై కాంక్ష, సంభోగ ఆపేక్ష విపరీతముగా ఉండును. ఇవి సామాన్య జనుల లక్షణములయిన ఆహార, నిద్రా, మైథునములలో

మునిగి ఉండును. అట్టి వ్యక్తి ప్రాణయామము అవలంబించవలయును. ఇదే ప్రజాపతి వాయువుగా సంచరించుట. అప్పుడు ప్రాణము హంసగా మారును. ఇతడే వరాహము. ఆ హంస ఆధార చక్రములోని కుండలినీ శక్తిని ఉద్ధరించును. ఆకుండలినీ శక్తి దేహమంతా విస్తరించును. అప్పుడు సాధకుడు పరమహంస అగును. ఈ మంత్రము అర్థమగుటకు భాగవతములో యజ్ఞవరాహావతార కథగా చెప్ప బడినది. ఇటుల వేద మంత్రములు అర్థమగుటకు చిన్న చిన్న కథలు చెప్పబడును. అయితే ఆ కథలు శ్లేషతో కూడి ఉండును.

**షట్ దర్శనములు**

అపరవిద్య పరవిద్యలలో చెప్పిన శాస్త్రవిషయములను (theory) ఆచరణ విధానమున్కై చెప్పినవి షట్ దర్శనములు. అణు శాస్త్రమునకు సంబంధించిన విషయములను కణాదుడు వైశేషికమున చెప్పెను. పుణ్యకర్మానుష్ఠానము గుఱించి జైమిని పూర్వ మీమాంసలో వివరించెను. యోగము, యోగ రహస్యములు మొదలైన వాటిని గుఱించి ఆధ్యాత్మిక సాధన రహస్యములను గుఱించి సాంఖ్యముగా కపిలుడు వివరించెను. చిత్తము, యోగశక్తులు, యోగ విఘ్నముల గుఱించి పతంజలి వివరించెను. యోగములో గలుగు సిద్ధులను తృణీకరించి గుణములను వదలి నిర్గుణుడగు విధానమును నారదుడు భక్తి లక్షణములుగా వివరించెను. వ్యాస భగవానుడు బ్రహ్మసూత్రములను రచియించెను.

**ముగింపు :**

1. వేదములు స్త్రీ పురుషులందఱు చదవవలయును. అందలి విజ్ఞానశాస్త్ర విషయములు లోకమునకు అందించ వలసిన గురుతర బాధ్యత విద్యావంతులపై ఉన్నది. 2. వేదములలో వ్యక్తి యొక్క విధులు బాధ్యతలు చెప్పబడును. అనగా ధర్మ, అర్థ,కామముల గుఱించి చెప్పబడును. 3. పుణ్యకర్మానుష్ఠానము గుఱించి చెప్పబడును. 4. ఆత్మస్థానము పొందు విధానము గుఱించి చెప్పబడును. వీటినే అపరవిద్య, పరవిద్యగా చెప్పుదురు.

అపరవిద్య ప్రధానముగా మూడు విభాగములుగా వర్గీకరింప వచ్చును. ఒకటవ విభాగములో ఇహలోకమునకు సంబంధించిన జాతి ధర్మములు, ఆశ్రమ

ధర్మములు, రాజధర్మములు, స్త్రీపురుష విధులు బాధ్యతలుగా చెప్పబడును. వైజ్ఞానిక విషయములు చెప్పబడును. రెండవ విభాగములో పుణ్యలోకములు పొందుటకు పుణ్యకర్మానుష్ఠానము ఏ విధముగా చేయవలయునో వివరించబడును. మూడవ విభాగములో అతీంద్రియజ్ఞానమునకు సంబంధించిన ఆత్మ, ప్రకృతి, జీవుడు మొదలయిన విషయములు చెప్పబడును. వీటిని బ్రహ్మవిచారణగా, సృష్టి విచారణగా, దేహవిచారణగా చెప్పుదురు.

సాధన రహస్యములు గోప్యముగా చెప్పబడును. వేదము చదివి మోక్ష సాధన చేసి మోక్షమును పొందినవారు మాత్రమే వేదజ్ఞులుగా పిలువబడుదురు. అట్టి వేదజ్ఞులు జీవన్ముక్తులు మాత్రమే వేదమును విపులీకరించగలరు.

నేటి మన భావనలోని కొన్నింటికి వేద ప్రమాణము కనపడదు. ఉదాహరణగా సముద్రయానము చేయుట దోషమని ఆ విధముగా సముద్ర ప్రయాణము చేసిన వారిని బహిష్కరించ వలయును అని వేదములు చెప్పలేదు. రాముడు సముద్రమును దాటి లంకకు చేరినాడు. హనుమంతుడు సముద్రమును దాటి లంకకు చేరినాడు. శ్రీకృష్ణుడు తన నివాసముగా సముద్ర మధ్యమున ద్వారకను నిర్మించినాడు. ఋషులు ఎందరో సముద్రమును దాటి శ్రీకృష్ణునిని దర్శించినారు. రుక్మిణి పంపున వెళ్ళిన అగ్నిద్యోతనుడు అను బ్రాహ్మణుడు సముద్రమును దాటి ద్వారకకు చేరి రుక్మిణీ సందేశమును శ్రీకృష్ణునకు వినిపించినాడు.

అటులనే భర్త మరణించిన అతనితోపాటు అతని భార్యకూడా మరణించ వలయునని వేదము చెప్పలేదు. కావున వేదములు చదివి, వేదములు చెప్పని నేటి అనేక దురాచారములను ఖండించవలయును.

*****

## వేద కాలము నాటి ఆశ్రమములు - ఆశ్రమ వాసులు

**లక్ష్యము :-** ఆత్మదర్శనమును పొందుటయే ప్రధాన లక్ష్యము. జీవన్ముక్తులై, జితేంద్రియులై, గుణ రహితులై శాంతత్త్వమును పొంది దేహ త్యాగానంతరము పునరావృత్తి రహితులై ఆత్మ స్థానమున ఆత్మగా విరాజిల్లుటయే ప్రధాన లక్ష్యము. బ్రహ్మలోక ప్రాప్తిని పొందుటయే లక్ష్యము.

**ఆశ్రమములు :-** దట్టమైన భయంకర అరణ్యములలో ఉండెడివి. అనగా జన సమర్థమునకు దూరముగా నుండెడివి. ఆశ్రమములు ప్రశాంతతకు, అందమునకు ప్రతీకలుగా నుండెడివి. ఆశ్రమము లోపల బయట శుభ్రము చేయబడి ఆశ్రమము ముంగిట ముగ్గులతో అందముగా నుండెడివి. ఆశ్రమమునకు దేవతలు, గంధర్వులు, సిద్ధులు, అప్సరసలు, నారదాది ఋషి పుంగవులు అప్పుడప్పుడు వచ్చు చుండెడివారు. ఆశ్రమములు సర్వ భూతములకు ఆశ్రయములుగా నుండెడివి. ఋషి పుంగవులు ఉండుట వలన వేదఘోషల వలన, సత్పురుషుల నిలయమై రెండవ బ్రహ్మ లోకము వలె అలరారు చుండెడివి. ఆశ్రమములు ఆకాశములో సూర్యుని వలె తపోశక్తిచే దేదీప్యమానముగా ప్రకాశించు చుండెడివి.

**ఆశ్రమ పరిసరములు :-** ఆశ్రమముల చుట్టూ అనేక అరణ్య వృక్షములు, ఫల వృక్షములు ఉండెడివి. చెట్లు దట్టముగా నుండుట వలన మృగములు నెమళ్ళు, పక్షుల కిలకిలారావములతో చూడ ముచ్చటగా శోభిల్లు చుండెడివి. ఆశ్రమ పరిసరములు పూలు, లతలు కలిగి అందముగా నుండెడివి. సరస్సులు పద్మములు, కలువలు, నీటి పక్షులతో అలరారుచుండెడివి. త్రాగుటకు మధుర జలాశయములు కలిగి ఉండెడివి. పరిసరములలో జలపాతములుండి ఆ జలపాతముల ఘోష సుమధురముగా నుండెడిది.

ఆశ్రమవాసులు :- గృహస్థులు - బ్రహ్మణ్యులు-మోక్షార్థులు.

**రూపము :-** సూర్యునివలె అగ్ని వలె దేదీప్యమైన ముఖ వర్చస్సు కలవారు.

**ఆహారము :-** కందమూలములు, పండ్లు, దుంపలు, ఆకులు, ఆహారముగా తీసుకొని కొందఱు, జలము మాత్రమే ఆహారముగా గలవారు కొందఱు, నిరాహారులుగా కొందఱు ఉండి తపస్సు చేయుచుండెడివారు.

**వస్త్రధారణ :-** నార చీరలు, జింక చర్మము ధరించెడివారు. నిరాడంబర వస్త్రధారణ గలిగి ఉండెడి వారు. ఆసనమునకు దర్భాసనము, లేడి చర్మమును ఉపయోగించెడి వారు.

**సీ. హరిహయుం డధ్వర హయ హరణార్థమై మించి కైకొని విసర్జించి నట్టి**
**భూరి యమంగళ భూత మాయారూపములను ధరించిరి మూఢజనులు,**
**పాషండ చిహ్నముల్ పర(గుట వారలు జగతిపై నగ్న వేషములు గలుగు**
**జైనులు భూరి కాషాయ వస్త్రంబులు ధరియించు బౌద్ధులు( దగ జటాస్థి**

**తే. భస్మధారులు నయిన కాపాలికాదు, లన(గ వెలసిరి లోకంబులందు( జాల(**
**దల(ప ధర్మోపమం బన(దగు నధర్మ, మందు నభిరతి వొడమిన యజ్ఞజనులు.**

(భాగవతము చతుర్థ స్కంధము - 524)

ఇంద్రుడు పృథు చక్రవర్తి యొక్క యజ్ఞాశ్వమును దొంగిలించుట కొఱకు వేషము ధరించి విడిచిన వాటిని మూర్ఖులైన మానవులు గ్రహించినారు. అవి పాషండ ధర్మ చిహ్నములు. దిగంబరుడుగా ఉండుట, కాషాయ వస్త్రములు ధరియించుట వేద ధర్మములు కావు. బౌద్ధ మతస్థుల వలన కాషాయ వస్త్రములు, జైన మతమువలన దిగంబరత్వము నేడు చోటు చేసుకొన్నవి. జటలు, ఎముకలు, భస్మము కాపాలికులు ధరింతురు. సర్వ వ్యాపకుడను అర్థములో దిక్కులే అంబరముగా కలవాడు అనే అర్థములో శివునుని, దత్తాత్రేయుల వారిని దిగంబరులు అని అందురు.

**వాక్కు :-** మృదు- మధుర వాక్కు కలిగి సత్యమును పలికెడి వారు.

**శయనం :-** భూతలమును శయనముగా గలిగి తమ చేతులను తలక్రింద పెట్టుకొని నిద్రించెడివారు.

**గుణములు :-** క్రోధమును జయించిన వారు. పుణ్యకర్మానుష్ఠానపరులు. ధర్మవేత్తలు, ధర్మజ్ఞులు. అహింసావ్రతులు, సత్ పురుషులు. పరహితులు, అక్రూరులు, దయా దాక్షిణ్యము కలవారు. శాస్త్ర విహితముగా ప్రవర్తించు వారు. దీనినే తైత్తరీయము "అలూక్షాధర్మ కామాస్యుః"అని చెప్పినది.

**తపస్సు :-** తపో నిరతులు. స్థిరాసనమున కొందఱు, కంఠములోతు నీళ్లలోనుండి కొందఱు, పంచాగ్ని మధ్యమున నుండి కొందఱు, ఆకాశమే పందిరిగా గలిగి ఎండకు, వానకు, చలికి తపింపక సర్వ కాలములలోను తపస్సు చేయుచుండెడివారు. తపో శక్తి సంపన్నులు. అయినా తపో శక్తిని వ్యర్థము చేయనివారు. నిరాడంబరులు. బ్రహ్మణ్యులు, జితేంద్రియులు. దివ్య జ్ఞానము కలవారు. క్రోధమును జయించిన వారు. అపకారులకు కూడ ఉపకారము చేయువారు. " కొట్టిన తిట్టిన పడుచుందురు గాని పరమభాగవతులు'' అన్నదానికి ఉదాహరణ వీరు. పుణ్యాలోకములను జయించినవారు.

**సంప్రదాయము :-** వైఖానస సంప్రదాయము, వాలఖిల్య సంప్రదాయము, సంప్రక్షాళుల సంప్రదాయము, మరీచకుల సంప్రదాయము, అస్మకుట్టుల సంప్రదాయము మొదలయిన సంప్రదాయములను పాటించువారు.

**ఆశ్రమములలోని కార్యక్రమములు :-** ఆశ్రమవాసులు వారి శిష్యులైన బ్రహ్మ చారులకు వేదమును బోధించుటవలన, వారు (ఆశ్రమ వాసులు) చదువుటవలన వేదఘోష వినబడుచుండెడిది. అనగా వేదము చదువుట, వాటి అర్థము చెప్పుట, ఆయుర్వేద, ఖగోళాది సర్వ విజ్ఞానశాస్త్ర విషయములు, ధనుర్వేదము, విధులు బాధ్యతలు, పుణ్యాకర్మానుష్ఠానము చేయుట, ఆ ఫలితమును కోరక జీవన్ముక్తుడగు విధానము, పునరావృత్తిరహిత శాశ్వత బ్రహ్మలోకనివాసము మొదలయిన సర్వ విషయములను బోధించెడివారు.

వారి ఆశ్రమమునకు వచ్చిన వారికి, ఆశ్రమములో కొంత కాలము గడిపిన తరువాత వారి యోగ్యతలను పరిశీలించి సర్వవిద్యలు బోధించెడి వారు. అర్హులకు మాత్రమే పర విద్యను బోధించెడివారు. ప్రజల మెప్పు గాక బ్రహ్మత్వమును పొంది దేవతలచే పూజలందుకొన తలంచెడివారు. వేద కాలములో బ్రహ్మచర్యాశ్రమము, గృహస్థాశ్రమము, వానప్రస్థాశ్రమము, సన్న్యాసాశ్రమము, క్రమ పరిణామములో

ఉండెడివి. బ్రహ్మచర్యాశ్రమము నుండి సన్న్యాస ఆశ్రమ స్వీకరణ దోషముగా పరిగణింప బడెడిది. వేద కాలములో మతములు లేనందున మతాధిపతులు, పీఠాధిపతులు, మహంతులు లేరు.

**అతిథి-అభ్యాగతులు :-** అతిథి అభ్యాగతులను అర్ఘ్య పాద్యాదులచే పూజించి వచ్చిన వారికి ఉచితముగా ఆహారమును ఇచ్చి వసతిని కలుగచేసి ఆదరించి సంప్రీతిని కలుగ జేసేడివారు.

**అగ్ని హోత్రము :-** నిత్యాగ్నిహోత్రము చేసెడివారు. అగ్ని హోత్ర శాలలు విశాలములై స్రుక్, స్రువము, కుశలు, సమిధలు, కృష్ణాజినములు, యజ్ఞపాత్రలు, పూర్ణ కలశములు మొదలయినవి ఆ అగ్నిహోత్రశాలలో నుండెడివి. బలి హోమములచేత సర్వ దేవతలను ఆరాధించెడివారు.

**ఆశ్రమ అధిపతులు :-** వయో వృద్ధులు, జ్ఞాన వృద్ధులు, తపోధనులు, జీవన్ముక్తులు, గృహస్థులు, నిరాడంబరులు, ఆశ్రమ నిర్వహణకు రాజులను ధనవంతులను ఆశ్రయింపక దైవమునే ఆశ్రయించి, స్వతంత్ర జీవితము గడుపువారు. దేహత్యాగ సమయమున యోగ పద్ధతిన తమ శరీరమునుండి ఆత్మను వేఱు చేసి వారు బ్రతికి ఉండగనే  శరీరమును అగ్నికి ఆహుతి చేసి దివ్యదేహము ధరించి బ్రహ్మ లోకమును పొందెడివారు.

ఆశ్రమములు ఎలా ఉండవలయునో అని చెప్పుటకు రామాయణములో భరద్వాజ, శరభంగ, సుతీక్షణ, అగస్త్య, మతంగాది మునుల ఆశ్రమములు, భారతములో కొన్ని మునుల ఆశ్రమములు, భాగవతములో వ్యాసమహర్షి ఆశ్రమములు మొదలయినవి వర్ణింపబడినవి. ఏకాలములోనయినా ఇట్టి ఆశ్రమములు దర్శనీయ ములు. ఇట్టి ఆశ్రమ అధిపతులు పూజనీయులు.

*****

# పురాణములు

**పురాణముల ఆవశ్యకత :** వేదములను వేదాంగములతో కలిపి చదివి సారమును గ్రహించుట కష్టము. వేదములోని భాష సులభముగా ఉన్నను భావము అంతుబట్టదు. వేదములను ఆత్మదర్శనము చేసిన ఆర్యుల వద్దనే పఠించి అర్థతాత్పర్యములను గ్రహించవలసి ఉండును. కావున వేదములలో చెప్పిన విషయములు అర్థమగుటకు పురాణములు చెప్పబడినవి. పురాణములలో రామాయణ, భారత, భాగవతములు ముఖ్యములు. పురాణములలో పరవిద్య, దేవతా స్తోత్రములతో పాటు అపర విద్యకు సంబంధించిన విషయములు అనగా ఆదర్శ సమాజ నిర్మాణానికి అవసరమయిన సంఘ నియమములు, వ్యక్తిగత విధులు బాధ్యతలు రాజు యొక్క విధులు బాధ్యతలు మఱియు విజ్ఞాన శాస్త్ర విషయములగు ఆయుర్వేద, ఖగోళ, భూగోళాది విషయములు, పుణ్యకర్మానుష్ఠానమునకు సంబంధించిన విషయములు వివరింపబడును. అధ్యాత్మిక భావనలకు సంబంధించి ఆత్మ, ఆది పురుషుడు, ప్రకృతి, మాయ, అవిద్య, దేహము, జీవుడు మొదలయినవి వివరింపబడును. పరవిద్యగా సాధన రహస్యములు వివరింపబడును. అపరవిద్య పరవిద్యకు సంబంధించిన విషయములు వివరముగా చెప్పుటకు కథలు చెప్పుదురు. ఈ కథలలో చెప్పబడిన పదములు రూఢికార్థముతోనూ, యౌగికార్థముతోనూ కలసి ఉండును. ఈ కథలలో వాడిన వ్యక్తి వాచకములు కేవలము వ్యక్తి వాచకములుగా గాక విశేషణములుగా గ్రహించినచో సాధకులకు ఉపయోగపడును.

ఉదాహరణకు రామాయణంలోని రాముడు వ్యక్తి వాచకముగా దశరథుని పుత్రుడు. యౌగికార్థముగా రాముడు ఒక సాధారణ మానవుడు. అతడు సాధన చేసి శాశ్వత బ్రహ్మలోకమును పొందినాడు. ఆ విధి విధానము రాముని కథగా వివరింపబడినది.

అయోధ్య అనగా భారత దేశములో గల ఒక ప్రదేశము. ఇది రూఢికార్థము. అథర్వవేద సంహితలో అయోధ్య అనగా శరీరము మఱియు ఈ శరీరములోని హృదయ స్థానము. ఈ రెండు అర్థములు వచ్చునట్లుగా అయోధ్య వర్ణన ఉండును.

సీత అనగా జనకుని కూతురు ఇది రూఢికార్థము. అదే యౌగికార్థములో సీత అనగా మహత్ ప్రకృతి. సీత అగ్ని ప్రవేశము, సీతా పరిత్యాగములు యౌగికార్థములో చెప్పిన కథలు.

ఇటులనే భారతములోని కథలు. ఉదాహరణకు ద్రౌపది అగ్ని కుండములో నుంచి పుట్టినది. అగ్నిలో ఏది వేసినా అది దగ్ధమగును. అంతే తప్ప అగ్నిలో నుంచి ఏ మానవుడు జన్మించడు. ఇలా అగ్నిలో నుంచి పుట్టినది ఏమిటో తెలిసిన తప్ప ద్రౌపది గుఱించి అర్థము కాదు.

భాగవతములో వసుదేవుడు దేవకీదేవి చెఱసాలలో ఉన్నారు. వసుదేవుని భార్య యైన రోహిణి గోకులంలో నందుని ఇంట ఉన్నది. దేవకి గర్భవతియైనది. అలా ఆఱుగురు కొడుకులను కనెను. ఏడవసారి దేవకి గర్భవతియైనది. ఈ దేవకీదేవి గర్భము వసుదేవుడు చెఱసాలలో ఉండగనే నందుని ఇంట ఉన్న రోహిణి గర్భములో ఎటులనో ప్రవేశించినది. రోహిణికి బలరాముడు పుట్టినాడు. ఈ కథ అర్థమయితే బలరాముడు అనగా ఏమిటో తెలియును. ఈ విధముగా భారత, భాగవత, రామాయణములలోని కథలు ఉండును. యౌగికార్థము తెలియక కేవలము రూఢి కార్థము తెలిసి చదివినచో అనేక అపభ్రంశములు ఉదయించును. ఉదాహరణకు చెట్టు చాటున ఉండి రాముడు వాలిని సంహరించెను. ఇందలి చెట్టు, రాముడు, వాలి యౌగికార్థములు. అవి తెలియని వారికి వాలిని సంహరించుట అధర్మముగా కనిపించును.

*****

# రామాయణము

రామాయణమును వాల్మీకిమహర్షి వారి శిష్యులయిన కుశీలవులకు చెప్పిరి. ఆ కుశీలవులు మొదట ఋషుల సభలలో రామాయణమును చెప్పిరి. ఋషులు ప్రశంసించిరి. ఆ తర్వాత కుశీలవులు రామాయణమును అయోధ్యలోని ప్రజలకు చెప్పిరి. రాముడు కొలువు తీరి ఉండగా **కుశీలవులు రామునికే రామకథను చెప్పిరి.** అనగా జీవునికి జన్మసాఫల్యత పొందు విధి విధానమును చెప్పిరి.

**రామాయణము .........**

**ఇదం పవిత్రం పాపఘ్నం పుణ్యం వేదైశ్చ సమ్మితమ్**
**యః పఠేద్రామ చరితం సర్వపాపై : ప్రముచ్యతే** (బాలకాండ-1వసర్గ-98)

ఇదమ్ = ఈ రామాయణము; వేదైః+చ+సమ్మితమ్ = వేద సమ్మతము. అనగా వేదములో గల సర్వ విషయములు రామాయణములో పొందుపఱచ బడియున్నవి. జీవుడు పుణ్యలోక ప్రాప్తికి, ఆత్మస్థానము పొందుటకు వలయు సాధన రహస్యము లున్నవి. కావున ఈ సాధనలు ఆచరించిన; సర్వపాపైః = సర్వ పాపముల నుంచి; ప్రముచ్యతే = విడువబడును అనగా సర్వబంధములు తొలగి బంధరహితుడగును. కావున ఇది; పాపఘ్నమ్ = పాపములను తొలగించునది; పవిత్రం = పవిత్ర గ్రంథము; పుణ్యం = పుణ్యప్రదమైనది; యః = ఎవడు; రామ చరితం = జీవుడు బంధరహితుడై ఈశ్వరుడగు విధానమును; పఠేత్ = చదివి గ్రహించి ఆచరించినచో అనగా పారాయణ చేసినచో ఈశ్వరుడగును. పారాయణ అనగా చదివి గ్రహించి ఆచరించుట అని అర్థము.

**వేదోప బృంహరణార్థాయ తావగ్రాహయత ప్రభుః ( బాలకాండ-4వసర్గ-6)**

ప్రభుః = జీవన్బంధ విముక్తుడయిన వాల్మీకి మహర్షి; వేద + ఉపబృంహ ణార్థాయ= వేదము విపులముగా అర్థమగుట కొఱకు; తౌ= ఆ కుశీలవులకు; అగ్రాహయత= బోధించెను. బంధ రాహిత్యమునకై వేదమునకు భాష్యమయిన ఈ రామాయణమును అర్హులయిన కుశీలవులకు, వారు రామునికి వినిపించిరి.

**రసైః శృఙ్గార కారుణ్య హాస్య వీర భయానకైః**
**రౌద్రాదిభిశ్చసంయుక్తం కావ్యమేతదగాయతామ్** (బాల కాండ- 4వ సర్గ-9)

శృంగార, కారుణ్య, హాస్య, వీర, భయానక, రౌద్ర, మొదలయిన రసములతో కూడిన రామాయణమును కుశీలవులు గానము చేసిరి.

**కామార్థ గుణ సంయుక్తం ధర్మార్థ గుణ విస్తరమ్**
**సముద్ర మివ రత్నాఢ్యం సర్వశ్రుతి మనోహరమ్** (బాలకాండ 3వ సర్గ-8 )

ధర్మ, అర్థ, కామములను విపులముగా వివరించునది. సర్వ విషయములను తెలుపు రత్నాకరము వంటిది. పరవిద్యకు అపరవిద్యకు సంబంధించిన సర్వవేదముల సారము. మనోహరమైనది.

రామాయణము - వినువారి అర్హతలు :
**ధర్మకామార్థసహితం శ్రోతవ్య మనసూయయా** (బాలకాండ-5వ సర్గ-4)

రామాయణము ధర్మ, అర్థ, కామములతో కూడినది. దీనిని దుర్గుణములు లేకుండా అనగా అసూయ, ద్వేషము, కామ క్రోధాదులు లేకుండా వినవలయు. చదవ వలయును.

**ఫలశృతి :**

**పఠన్ ద్విజో వాగృషభత్వమీయాత్**
**స్యాత్ క్షత్రియో భూమిపతిత్వ మీయాత్**
**వణిగ్జనః పణ్యఫలత్వ మీయాత్**
**జనశ్చశూద్రోఽ పి మహత్త్వమీయాత్** (బాలకాండ-1వ సర్గ-100)

పఠన్ = రామాయణము చదివి ఆచరించిన; జనః = ఒక వ్యక్తి - (సర్వజనులు); మహత్త్వమ్ = ఆత్మస్థానమును; ఈయాత్ =పొందును (పొందుదురు) ప్రత్యేకముగా; ద్విజ+స్యాత్ = బ్రాహ్మణులు చదివినచో; వాక్ + వృషభత్వమ్ + ఈయాత్ = వాక్య విశారదుడగును. బ్రాహ్మణులు రాముని అనుసరించియు, తమసానది వద్ద నిద్ర అనే అజ్ఞానములో ఉండగా రాముడు వీరిని వదలి వెళ్ళినాడు. ఈ బ్రాహ్మణులు శ్రీరాముని వద్దనే ఉండు విధానము రామాయణంలో వివరింపబడును. అనగా ఆత్మతో ఏకీభూతులగు విధానము వివరించబడును;

క్షత్రియః=క్షత్రియులు- రాజులు చదివినచో; భూమి+పతిత్వమ్+ ఈయాత్=గొప్ప సామ్రాజ్యమును పొందుదురు. రాజు, రాజస్వభావము పరిపాలన ఎలా చేయ వలయును ఎలా చేయకూడదు అనే విషయములు, యుద్ధరంగమునకు సైన్యమును నడిపించుట యుద్ధతంత్రములు మొదలయినవి చెప్పబడుట వలన రామాయణము చదివి రాజులు తమతమ లోపములను సరిదిద్దుకొన్నచో వారి రాజ్యాధిపత్యము సుస్థిరమగును. వణిక్+జనః= పశు పోషణ, వ్యవసాయము, వాణిజ్యము వృత్తులుగా గల వైశ్యులు చదివినచో; పణ్యఫలత్వమ్+ఈయాత్ = అర్థసాధకత్వము పొందు దురు. శూద్రః+అపి = రాజోద్యోగులైన సేవకుడు చదివినచో దూత ఎలా ప్రవర్తించాలి? రాజోద్యోగి ఎలా ప్రవర్తించాలి? సేనాధిపతి ఎలా ఉండాలి? భృత్యుడు ఎలా ఉండాలి? అనే విషయములు తెలియుట వలన రాజు కొలువులో ఎలా ప్రవర్తించవలయునో అతడు విధిని ఎలా నిర్వర్తించవలయునో బాధ్యత ఏమిటో తెలిసి ప్రవర్తించి రాజు యొక్క మన్ననలను పొందును. ఈ విధముగా సర్వులకు మేలు కలుగును.

**కావ్యం రామాయణం కృత్స్నం సీతాయాశ్చరితం మహత్**
**పౌలస్త్యవధ మిత్యేవ చకార చరితవ్రతః** (బాలకాండ - 4వ సర్గ- 7).

చరితవ్రతః= తపశ్శాలియైన వాల్మీకి మహర్షి; కృత్స్నం+కావ్యం=సంపూర్ణ రామాయణమును ఈ క్రింద ఉదహరింపబడిన విషయములతో అనగా; రామ+అయనం= అయనమునకు గతి స్థానము అని అర్థములుండుట వలన జీవుని ప్రయాణము, ఆత్మస్థానము చేరు విధానమును; మహత్ = మహతత్త్వ మయిన; సీతాయాః = సీత యొక్క; చరితం = చరితమును అనగా మహత్ తత్త్వము దాని వలన గలిగిన ఉపాధి లక్షణములను; పౌలస్త్యవధమ్ ఇతి+ఏవ= రావణ సంహారమును అనగా జీవత్వమును నశింపచేయుటను మొదలయిన అనేక విషయములను చకార = రచియించెను. అనగా ప్రకృతి-జీవుడు-జీవుడు ఆత్మస్థానము చేరు విధానమును రచియించెను.

**నానాచిత్ర కథాశ్చాన్యా** (బాలకాండ-3వ సర్గ -11)

రామునికథతో పాటు యోగమునకు అవసరమయిన విపుల వ్యాఖ్యానముతో కూడిన అనేక కథలను కూడ రచియించెను.

**ప్రాప్త రాజ్యస్య రామస్య వాల్మీకి ర్భగవానృషిః**
**చకార చరితం కృత్స్నం విచిత్ర పదమాత్మవాన్** (బాలకాండ 4సర్గ- 1)

ఆత్మవాన్+ భగవాన్+ఋషిః+వాల్మీకిః=ఆత్మవంతుడు, భగవంతుడు, ఋషి అయిన వాల్మీకి ; రాజ్యస్య+ ప్రాప్త= రాముడు రాజ్యమును పొందిన కాలముననే; కృత్స్నం+రామస్య+చరితం=రాముని యొక్క (జీవుల యొక్క) సమస్త విషయము లను; విచిత్రపదమ్ = శ్లేషతో పైకి ఒక అర్థము, గూఢముగా ఇంకొక అర్థముతో- రామాయణమును; చకార = రచియించెను.

ఉదా :- ఆదిత్య హృదయం పైకి ఇది సూర్య భగవానుని నుతించుటగా కనిపించును. నిగూఢముగా ప్రశ్నోపనిషత్‌కు విపుల వ్యాఖ్యానము. సూర్యుడు అధిభౌతికము. ఇతనివలన కాలము అనగా ఋతువులు మొదలయినవి ఏర్పడును. ఇతడు బ్రహ్మనిద్ర పోగానే నశించును. సూర్యభగవానుడు అధి దైవికము. ఇతడు కుంతికి పుత్రునిని, సత్రాజిత్తునకు శమంతకమణిని ఇచ్చెను. ఇతడు బ్రహ్మకు ఆయుర్దాయము గతించిన నశించును. ఆదిత్యుడు : అధ్యాత్మికమయిన ఆత్మ. **అసౌ ఆదిత్యో బ్రహ్మ** (శ్రుతి) ఇతడు ఎప్పటికి నశించడు. ఇతడు నిత్యుడు. ఇటుల సూర్యుడు, సూర్యభగవానుడు ఆదిత్యుల మువ్వురి గుఱించి ఆదిత్య హృదయములో వర్ణింపబడినది. అటులనే హనుమంతుని సముద్ర లంఘనము, ఇటు కథా పరముగా అటు యౌగికార్థముగా వర్ణింపబడినది.

వాల్మీకి నోటి వెంట అప్రయత్నముగా వెలువడిన **"మా నిషాద ప్రతిష్ఠాం"** శ్లోకమే శ్లేష. పైకి ఒక నిషాదుని శపించినట్లు కనపడును. అంతరార్థమున నారద మహర్షి చెప్పిన వేద సారమును వాల్మీకి విని, మననము చేసి, నిధి, ధ్యాసలకు చేరి తన అనుభవమును ఆ శ్లోకము ద్వారా ప్రకటించినారు. వేదములో చెప్పిన సాధన రహస్యములు రామాయణములో వివరింపబడినవి. ప్రతి వెయ్యి శ్లోకములకు గాయత్రీ మంత్రములోని ఒక అక్షరమును ఉంచి రామాయణమును రచియింతునని వాల్మీకి చెప్పలేదు.

*****

## భారతము

వేదములో గల సర్వ విషయములు భారతమున ఉండుటచే భారతము పంచమ వేదమని పిలువబడెను. అపరవిద్యకు సంబంధించిన ఆయుర్వేద, ఖగోళ, భూగోళము మొదలయిన విషయములు, పుణ్యకర్మలు, వాటిని చేయు విధివిధానము, ఇహలోక మునకు సంబంధించిన ధర్మ, అర్థ, కామములుగా వర్గీకరింప బడిన విధులు బాధ్యతలు ఇందు వివరింపబడినవి.

పరవిద్యకు సంబంధించిన ఉపనిషత్తులన్నింటిలో గల సారమును, ఆత్మస్థానము చేరుటకు చెప్పబడిన ఆచరణ విషయములను భగవద్గీతలో చెప్పి సందర్భాను సారము యోగరహస్యములను వివరించెను. భగవద్గీత పరవిద్యకు సంబంధించినది అగుటవలన ఇందలి పదములన్నియు యౌగికార్థమున గ్రహించవలయును. ఇటుల అపరవిద్య - పరవిద్యల సమ్మేళనము భారతము. ఈ భారతమును చదివి గ్రహించి ఆచరించుట అనే పారాయణ చేసినచో బంధరహితుడై ఆత్మ స్థానమును చేరి ఆత్మయగును. కావున జీవుడు అనగా నరుడు నారాయణుడగు విధివిధానము భారతమున వర్ణింపబడినది. అందువలన **ధర్మేచార్థే చ కామే చ మోక్షే చ భరతర్షభ । యదిహాస్తి తదన్యత్ర యన్నే హాస్తి న తత్ క్వచిత్** - అని చెప్పబడినది.

భారతములో మోక్షమార్గమునకు సంబంధించిన విషయములు కలవు. కాని అవి సామాన్య పాఠకుని దృష్టికి అగుపడవు. విదురనీతులు , శాంతిపర్వము, అనుశాసనిక పర్వములలో చెప్పబడిన ధర్మములు గ్రహించి అవియే ధర్మములని భావింతురు. కావున నారదమహర్షి, వ్యాసునితో భారతమున మూఢులకెల్ల మేలగునని భారతాఖ్యానము చేసియు, **"కామ్య కర్మంబులందు రాగంబు గల ప్రాకృత జనులకు నియమించిన ధర్మములు సెప్పితివి. వారలదియే ధర్మంబని జుగుప్సితంబులగు కామ్యకర్మంబులు సేయుచు దత్త్వజ్ఞానంబు మఱతురు"** అని చెప్పినారు. **(భాగవతము ప్రథమ స్కంధము - 98)**

*****

# భాగవతము

వేదములో చెప్పబడిన అపరవిద్య పరవిద్యలు భాగవతమున చెప్పబడినవి. కావున వ్యాసభగవానుడు భక్తి యుక్తంబయిన చిత్తంబున పరిపూర్ణుండైన ఈశ్వరుని గాంచి భువన క్షేమకరంబయిన భాగవతామ్నాయమును రచించెను. కావున భాగవతము వితత నిగమార్థంబు. సమస్తంబు గాకయు నయ్యునుండు వస్తు వెఱుగంగదగు భాగవతమునందు అని చెప్పుచూ మోక్షకామునకు మోక్షము సిద్ధించును అని చెప్పబడినది.

**భాగవత నిర్వచనము : "సత్యం పరం ధీమహి"** అను గాయత్రీ ప్రారంభమున గాయత్రినామ బ్రహ్మ స్వరూపంబై ధర్మవిస్తరంబును, వృత్రాసుర వధంబును నెందు చెప్పంబడునదియ భాగవతంబని పలుకుటం చేసి ఈ పురాణంబు శ్రీ మహా భాగవతంబన నొప్పుచుండు.

**గాయత్రీ** : సత్యం+ పరం= నిత్యుడై సత్యుడై స్వయం జ్యోతియై ప్రకృతికి పరుడై ఉన్న ఆత్మను,ధీమహి= మేము ధ్యానింతుము అని అర్థము. ధ్యానమునకు లక్ష్యము ఈశ్వరుడు. ఆ ఈశ్వరుడే - విరాట్ పురుషుడు. ఇతడే ప్రకృతి ప్రవర్తకుడు. ఇతడు పురము అనే ఉపాధి యందు వసియించి పురుష శబ్ద వాచ్యుడైనాడు. వేద పరి భాషలో పంది శరీరము+అందులో గల ఆత్మ = పురుషుడు. ఏనుగు శరీరము+ ఆత్మ= పురుషుడు. సుబ్బలక్ష్మి శరీరము+ఆత్మ = పురుషుడు. వెంకట్రావు శరీరము+ అందులో గల ఆత్మ= పురుషుడు. ఇలా సర్వ జీవరాసులు పురుష శబ్ద వాచ్యులు. అనగా పురుషులుగా పిలువబడుదురు. తెలుగు భాషలో పురుషుడనగా మగవాడు. ఈ మగవాడు సంసార తాపత్రయములలో చిక్కుకొన్నచో అతనిని **ఆడదిగా** పేర్కొనెదరు. వేద పరిభాష తెలియక కేవలము తెలుగు భాష తెలియుట వలన స్త్రీలు బిల్వార్చన, శివుని పూజ చేయకూడదని చెప్పిరి.

ఈ దేహము లేక పురము ప్రకృతి సంబంధము. స్థూల శరీరము పంచ భూతాత్మ కము. కామక్రోధ లోభ మోహ, మద మత్సరములనే అరిషట్ వర్గములు ఆఱు

కలది. జీవుని అవస్థాత్రయములు మూడు. కావున ఈ అర్థమును ప్రతిబింబిం చుటకు గాయత్రికి ఐదు ముఖములు (పంచభూతాత్మకము), ఆఱు పొట్టలు (అరిషట్‌వర్గములు), మూడు పాదములు (త్రయావస్థలు) గలదిగా వర్ణించిరి.

**అగ్నిర్ముఖం బ్రహ్మా శిరః విష్ణుః హృదయగ్ం రుద్రశ్శిఖా పృథివీ యోనిః ప్రాణా పాన వ్యానోదాన సమానా సప్రాణా చతుర్విగ్ం శత్యక్షరా శ్వేతవర్ణా**

(మహా నారాయణోపనిషత్తు, అనువాకము, 53-1)

అగ్నిః= అగ్ని; ముఖం=ముఖము, బ్రహ్మా= బ్రహ్మ, శిరః=శిరస్సు, విష్ణుః= సర్వ వ్యాపకుడయిన ఆత్మ; హృదయగ్ం= హృదయస్థానము; రుద్రః= రుద్రుడు; శిఖా=శిఖ; పృథివీ = ప్రకృతి; యోనిః=సకల ఉపాధులకు, త్రిగుణములకు పుట్టుకస్థానము; సః+ప్రాణా+అపాన+వ్యాన+ఉదాన+సమానాః = అతడు ముఖ్యప్రాణము, మఱియుప్రాణాపాన, వ్యాన, ఉదాన, సమానవాయువులు. అక్షరా= అక్షరము అనగా నశింపనిది. ఈ విధముగా శరీరమందు గల హృదయస్థానములో గల స్వయంజ్యోతి స్వరూపమైన ఆత్మ. ఉపాధి చతుర్విగ్ంశత్యక్షరాః=24 తత్త్వములతో కూడినది. శ్వేతవర్ణా = తెల్లని వర్ణము గలది. ప్రకృతిని స్త్రీ స్వరూపముగా వర్ణింతురు. కావున గాయత్రి స్త్రీ స్వరూపము. అందున్న అక్షరుడు అధ్యాత్మికమైన ఆదిత్యుడు. ఓం అనునది భూః భువః సువః అనే త్రిలోకములు నశించినా నశింపడు. **ఓం ఇత్యేకాక్షరం బ్రహ్మ** అని శ్రుతి. అట్టి పరమాత్మ నాకు మంచి బుద్ధి నిమ్ము అని సాధకుడు ప్రార్థించును. ఈ ప్రకృతి దృశ్యము. పురుషుడు ద్రష్ట. ఈ ప్రకృతి పురుషులను గుఱించి స్వానుభవంతో సంపూర్ణముగా తెలియుటయే సంధ్యోపాసన. ప్రారంభములో గాయత్రిగా చెప్పబడే ప్రకృతి లేక ఉపాధి లక్షణములను గ్రహించి అనగా సీత పుట్టుక, సీత స్వరూపము సీత స్వభావము సీత లక్షణములు తెలుసుకొని ఆపై సీతను పరిత్యజించి తను ఈశ్వరుడగుటయే సంధ్యావందన రహస్యము. అలా ఆచరించి ఆత్మ స్వరూప మును పొందిన మహనీయులు బ్రాహ్మణులు. భాగవతమున ప్రకృతి పురుషుల గుఱించి విపులముగా చెప్పబడును. రామాయణం, భారతములు కూడ ఇవే

విషయములను చెప్పినవి. పరధర్మంబులు విస్తారముగానూ అపర ధర్మములు సందర్భానుసారము చెప్పబడుటయే ధర్మ విస్తరము. వీటిని రామాయణములో సమపాళ్ళుగానూ భారతములో అపర ధర్మములు విస్తారముగా పరధర్మములు సందర్భానుసారము చెప్పబడినవి. ఇదే ఈమూడు గ్రంథములలో గల చిన్న తేడా. జనన మరణ వలయములు వృత్తము. **చనిపోతూ పుడుతూ చనిపోతూ పుడుతూ జీవుడు ఈ వృత్తములో చిక్కుకున్నాడు**. ఇలా చిక్కుకొనుటకు కారణము అసురత్వము. దైవీ సంపద లేక పోవుట వలన అసుర సంపద పుష్కలముగా ఉండుట వలన జీవుడు ఈ జనన మరణ వలయములలో చిక్కుకొని వృత్రాసురుడైనాడు. జీవునిలోని జీవత్వము నశించినచో ఈశ్వరుడగును. ఈ జీవత్వమును ఎలా నశింపచేయవలయునో భాగవతంలో చెప్పబడినది. ఈ ప్రయాణములో గల అవరోధములు వాటిని అధిగమించుటను రాముని ప్రయాణం అయిన రామాయణ ములో చెప్పబడినది. రామాయణంలో అన్నిటికీ రాముడే ఉదాహరణ. రాముడు అనగా జీవుడు. భాగవతంలో అనేక మంది జీవులను ఉదాహరణగా తీసుకొనినారు.

**భాగవత ప్రశంస :**

> **అల్పతరమైన సుఖములనందుచున్న,**
> **జనుల దుఃఖంబు మాన్పంగఁ జాలునట్టి**
> **పుండరీకాక్ష గుణకథా ప్రోతమైన,**
> **వితత నిగమార్థమగు భాగవతము**

(భాగవతము, తృతీయ స్కంధము-263)

కామ్యకర్మపరులు అల్పసుఖములైన ఇహలోక-పరలోక సుఖములు పొందుచున్నారు. వాటిలో సుఖము తక్కువ దుఃఖము ఎక్కువ. కావున వారలకు అల్పసుఖము అధిక దుఃఖము కలుగుచున్నది. అటులకాక దుఃఖరాహిత్యము, నిత్యసుఖము పొందుటకు వలయు సాధన గుఱించి వేదములో చెప్పినవే భాగవతంలో చెప్పబడినవి.

**పుణ్య కీర్తనుడైన భువనేశు చరితంబు**. సృష్ట్యాదియందున్న ఆత్మ, ఆత్మ చేసిన పనులు చెప్పబడును. **బ్రహ్మ తుల్యంబు**. సృష్ట్యాది యందున్న ఆత్మ సృష్టిలో

భిన్నరూపులై లయకాలమున సృష్టి నశించగా తిరిగి ప్రళయానంతరము ఒక్కడగును. కావున ఇది అంతా ఆత్మయే. ఆ ఆత్మ గుఱించి చెప్పునదే భాగవతం. వేదముతో సమానము. సకల పురాణ రాజము. పురాణము దశ లక్షణములతో కూడి ఉండును. ఈ పది లక్షణములు రామాయణ భారతములలో ఉన్ననూ, ఏ లక్షణమునకు ఆ లక్షణము విడివిడిగా ఉండవు. కాని భాగవతమున విడివిడిగా విభజింపబడి ఉండును. ప్రథమస్కంధములో దశ లక్షణముల ప్రస్థావన ఉండును. ద్వితీయ స్కంధంలో సర్గము, తృతీయస్కంధంలో విసర్గం, చతుర్థ, పంచమ, షష్ట స్కంధము లలో మన్వంతరములు, పోషణ; సప్తమ అష్టమస్కంధములలో స్థానం, ఊతుల గుఱించి; వైవస్వత మనువు గుఱించి నవమస్కంధములో, దశమ స్కంధంలో ఈశాను చరితం, ఏకాదశ, ద్వాదశస్కంధములలో నిరోధం, ముక్తి, ఆశ్రయములు విపులముగా వివరింపబడినవి. వేదేతిహాసములసారము. భాగవతము వేదసారము మఱియు అక్కడక్కడా ఇతిహాసములు కూడా కలవు. **"కలి కాల దోషాంధకారంబున నష్ట దర్శనులైన జనులకు నిప్పుడీ పురాణము కమల బంధుని భంగియున్నది. వేద కల్ప వృక్ష విగళితమై శుక ముఖా సుధా ద్రవమున మొనసి యున్నది. యోగి వరులకు అభిలషితంబు. శ్రీమంతంబు. పరమార్థభూతము. అఖిల సుఖదము".**

**పోతన దృష్టిలో భాగవతము :**

> **లలిత స్కంధము, కృష్ణమూలము, శుకాలాపాభిరామంబు మం**
> **జులతా శోభితమున్, సువర్ణసుమనస్సుజ్ఞేయమున్, సుందరో**
> **జ్జ్వల వృత్తంబు, మహాఫలంబు, విమల వ్యాసాలవాలంబునై**
> **వెలయున్ భాగవతాఖ్య కల్పతరు వుర్విన్ సద్విజ శ్రేయమై-**

(భాగవతం ప్రథమస్కంధం-22)

ఇందలి శ్లేష వలన ఇటు భాగవత పరంగాను అటు కల్పవృక్ష పరంగానూ అర్థము చెప్పవచ్చును. అందమయిన అర్థవంతమయిన స్కంధముల విభాగము గలది. సమస్తము తనే అయి, సమస్తము తానుకాని సృష్టికర్త అయిన శ్రీకృష్ణుడే (ఆత్మయే) ఆధారము గలది. శుక బ్రహ్మచే ఆలాపించబడినది. అవతార పురుషుల కథలతో

శోభిల్లునది. మంచి విషయములు గలది (సువర్ణము). మంచి మనస్సు గల జ్ఞానులకు అర్థమగునది ఉజ్వలమైనది. సుందరమైనది కైవల్య ఫల ప్రాప్తి గలది. విమలమైనది. దోషరహితమైనది.

కల్పవృక్షపరంగా సుందరమైన మొదలు గలది నల్లని వ్రేళ్ళు గలది. చిలక పలుకులతో మనోహరమైనది. సుందరమైనది, సుందరమైన లతలు పెన వేసుకొనగా శోభిల్లునది. చూపులకు అందమైనది రంగు రంగుపూలతో శోభిల్లునది. కంటికి ఇంపైన గొప్ప వృక్షము. ఇది గుండ్రనిది. గొప్ప గొప్ప పండ్లు కలది. రంధ్రములు లేనిది చాలా పెద్ద చెట్టు, పక్షులకు ఆశ్రయమైనది.

**పాఠకుల అర్హతలు :**

1. మంచివారు అనగా దుర్గుణములు లేని వారు. 2. నిర్మత్సరులు అనగా కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యములు లేని వారు. 3. కపట నిర్ముక్తులు అనగా కపటము, మోసము, దగా, వంచన లేని వారు. 4. కాంక్షసేయక అనగా నిష్కామపరులు. 5. మహాతత్త్వబుద్ధి అనగా చిత్తశుద్ధిగలిగినవారు. 6. ఆధ్యాత్మికాది తాపత్రయములనడచి అనగా ధనేషణ, దారేషణ, పుత్రేషణాలు అనే ఈషణత్ర యము లేనివారు. 7. అందు దగిలియుండుట అనగా తాపత్రయ ములను వదిలి ఆత్మతత్త్వము గ్రహించి ఆత్మలో కలిసి ఉండాలనుకునేవారు చదవవలయును. ఇవి లేనివారు చదివితే భాష అర్థమవుతుంది. ఈ లక్షణములు గలవారు చదివిన సాధన రహస్యములు తెలియును.

భాగవతము చదివి ఏమి గ్రహించాలి.

> **"సమస్తంబుఁ గాకయు నయ్యునుండు**
> **వస్తు వెలుఁగంగఁదగు భాగవతమునందు"**

(భాగవతము, ప్రథమ స్కంధము, 36)

ఈ విశ్వములో సర్వము ఆత్మస్వరూపమే. అనగా ఆత్మ, ఆది పురుషుడు, విరాట్ పురుషుడు, జీవుడు, హృదయగుహలోగల ఆత్మ, ప్రకృతి అంతా ఆత్మ స్వరూపమే. కావున సమస్త స్థావర జంగమ స్వరూపములు ఆత్మ స్వరూపములే. ఈ విధముగా

సమస్తము ఆత్మ అయి ఉండును. ఇతడే విరాట్ పురుషుడు. ఇతనిని దర్శించుటయే విశ్వరూప సందర్శనము. సృష్ట్యాది యందు గల ఆత్మలో ఈ విశ్వము లేదు. కావున ఈ విశ్వము ఆత్మ కాదు. ఆది పురుషుడు కాడు. కావున అతడు ఈ సమస్తము గాక ఉండు. కావున సమస్తము గాకయు అయ్యు ఉండు వస్తువయిన ఆత్మను స్వానుభవంలో భాగవతం చదివి సాధన చేసి దర్శించవలయును. భాగవతము చదివిన వానికి విష్ణు సేవాబుద్ధి విస్తరిల్లు. సంసారి భార్యా పుత్రాదులకు సేవ చేయును. మోక్షార్థి విష్ణువును సేవించును. ఆ విధముగా విష్ణువును సేవించవలయుననే జ్ఞానము గలుగును.

**ఫలశృతి :-**

**ఆ॥ మోక్షకామునకు మోక్షంబు సిద్ధించు,**
**భవభయంబు లెల్లఁ బాసిపోవు.** (భాగవతము, ద్వితీయ స్కంధము, 7)

జనన మరణములనే భవ భయములు పోయి మోక్షము గలుగును. పరాను భూతి పొందిన మహనీయులు, యోగ్యులయిన వారికి అనగా శిష్యులకు గురువులు వైఖరీ శక్తియుతులై బోధింతురు. గురువుల ఆచరణే శిష్యులకు పాఠము.

భారతము మొదట చదవవలయును. ఆ తర్వాత భాగవతం చదవవలయును. ఆ తర్వాత రామాయణం. ఆ తర్వాత ఉపనిషత్‌లు. ఆ తర్వాత వేదం చదవవలయును. అన్నది పెద్దల భావన. వీటిలో ఉన్న సారములు గీతలు. భగవద్గీత, ఉద్ధవగీత మొదలయిన ఈ గీతలు గురుస్థానమునకు చేరువలో ఉన్నవారికి ఉద్దేశింపబడినవి. ఈ గ్రంథములు ఒకసారి చదివితే అర్థము కావు. ఈ గ్రంథములు చదువుచూ అందలి విషయములను ప్రత్యేకముగా వ్రాసుకొని ఆ గ్రంథములను అనేక పర్యాయములు చదువుచూ తను వ్రాసుకున్నవి సరిచేసుకొనుచూ అధ్యయనము చేయుటయే పారాయణ.

**"ఋతం చ స్వాధ్యాయ ప్రవచనేచ। సత్యంచ స్వాధ్యాయ ప్రవచనేచ తపశ్చస్వాధ్యాయ ప్రవచనేచ"**

అని తైత్తరీయ ఉపనిషత్ చెప్పిన దానిని ఒక పదములో చెపితే పారాయణ. ఆ గ్రంథములో చెప్పిన విషయములు అర్థము చేసుకొని చదివిన ప్రయోజనము ఉండును.

భారత, భాగవత రామాయణములలో నరుడు, నారాయణుడు ఎట్లు అగునో ఆ విధానమే చెప్పబడినది. కావున ఇవి ఒక దాని కంటే యింకొకటి గొప్పవి కావు. ఈ మూడు గ్రంథములు వేదములో గల అపర విద్య, పరవిద్యలనే చెప్పినవి. ఆత్మ స్థానమునకు చేరు సాధనను రాముని ఉదాహరణముగా తీసుకొని రామాయణము వివరించినది. ఆత్మస్థానమునకు చేరు సాధనను ధృతరాష్ట్రుని ఉదాహరణగా తీసుకొని అర్జునుని తీసుకొని మరికొంతమంది మానవులను తీసుకొని భారతము వర్ణించినది. ఆత్మ స్థానమును పొందిన మహానుభావులను అవతార పురుషులుగా పేర్కొని, వారు చెప్పిన ఉపదేశములను వారి సాధనలను అవతార పురుషుల కథలుగా భాగవతములో వర్ణింపబడినవి. కావున భేదము ఉదాహరణగా తీసుకొన్న వ్యక్తుల యందు తప్ప విషయము నందు ఉండదు. ఆత్మ స్థానమునకు చేరు సాధన ఒకటే. ఎవరు చెప్పినా అదే చెప్పవలయును తప్ప వేదము చెప్పినదానికి భిన్నముగా చెప్పరాదు.

**ఇతిహాసము - ఉపాఖ్యానములు :**

పూర్వ మహాపురుషుల గురించి చెప్పిన చారిత్రాత్మక విషయములు ఇతి హాసములు. ఒక ప్రధాన విషయము చెప్పుచు ప్రధాన విషయము అర్థమగుటకు చెప్పిన ఉదాహరణలు ఉపాఖ్యానములు. ప్రవృత్తి కర్మావలంబియై నివృత్తి కర్మావలంబిగా చేయు విషయమును ప్రధానముగా స్వీకరించి మధ్యలో పురంజనోపాఖ్యానము చెప్పి ఆ పురంజనుడు, అతని భార్య, పురంజనుని మిత్రుడు మొదలైనవారు ఆధ్యాత్మికముగా ఎవరెవరో భాగవతములో చెప్పినారు.

**సారాంశము :-** రామాయణ, భారత, భాగవత పురాణములలో అపర విద్యకు సంబంధించిన 1 దేశము, రాజు, ప్రజలు, విధులు బాధ్యతలు, ఉండవలసిన లక్షణములు, ధర్మము, అర్థము, కామముల గురించి; 2 ఆయుర్వేదము, ఖగోళము,

భూగోళము మొదలయిన వాటికి సంబంధించిన శాస్త్రవిషయములు జ్యోతిష్యము, వాస్తు , సాముద్రికముల గురించి; **3.** పుణ్యాకర్మానుష్ఠానము గురించి; **4.** పరవిద్యకు సంబంధించి ఆత్మ ఆది పురుషుడు, ప్రకృతి, అవిద్య, మాయ, జీవుడు, జీవ లక్షణములు తిరిగి జీవుడు ఈశ్వరుడగుటకు చేయవలసిన సాధనలు వివరించ బడును. అనగా కర్మ యోగ భక్తి సాధనములు వివరించబడును. ధర్మము అపరధర్మము, పరధర్మము అని రెండు విభాగములు. అపర ధర్మములలో సామాన్య ధర్మము, ఆపత్కాల ధర్మము, విశేషధర్మము అని ఉండును. వీటిని గురించి విపులముగా చెప్పబడును. విషయము అర్థమగుటకు ఉదాహరణగా కథలుండును. పరవిద్యకు సంబంధించినవి ఆత్మవిద్య తెలిసిన గురువుల వద్దనే గ్రహించ వలయును. పరవిద్యకు సంబంధించిన విషయములు ఏగ్రంథము నందునూ విపులముగా చెప్పబడవు. పురాణములు వేదములకు భాష్యములగుట వలన పురాణము చదువుటకు గల అర్హతలు సంపాదించి చదివి అందలి విషయములను ఆచరించినవారు ఫలితమును పొందుదురు.

పురాణములలో అపరవిద్య పరవిద్యలు రెండును వివరించబడును. కర్మ భ్రష్టతను సూచించుటకు కథలలో శాపములుగా వర్ణింతురు. కథలో చెప్పిన యౌగికార్థము గ్రహించవలయునని చెప్పుటకు ఫలశృతిగా చెప్పుదురు. పురాణములను రచియించిన వాల్మీకి, వ్యాసభగవానులు ఋషులు. స్వతంత్రులు, రాజును ఆశ్రయించి వారిని స్తోత్రం చేసిన వారు కారు. ఆత్మ దర్శనం చేసిన మహనీయులు. అటులనే రాజులను సేవించి అప్పుడుపుకూడు భుజింపని సత్కవి పోతన. ఇతడు ఆత్మ దర్శనం చేసిన మహనీయుడు. అందువలన వ్యాసభగవానుడు భాగవతమున చెప్పిన రహస్యము లన్నియు పోతన గారి అనువాదమున కనిపించును. కేవలము రూఢికార్థమును మాత్రమే గ్రహించిన కవి పండితుల వలన యౌగికార్థము వారికి తెలియక పోవుట వలన పురాణముల అనువాదములలో అనేక యోగ రహస్యములు మనకు అందలేదు.

*****

## పురాణములు చెప్పుటకు - వినుటకు అర్హతలు

**పురాణములు :-** వేదములకు భాష్యములగుట వలన రామాయణ, భారత భాగవతములు చెప్పుటకు వినుటకు అర్హత కావలయును. ఈ విషయములను చెప్పువానిని గురువు అని, వినుటకు అర్హత గలవారిని శిష్యులని చెప్పినారు. ఈ అర్హతలు లేనిచో వారు కథా విషయమును మాత్రమే చెప్పగలరు. అటులనే కథా విషయములను మాత్రమే వినగలరు.

| గురువు | శిష్యుడు |
|---|---|
| 1. తపస్సు చేసి ఆత్మ దర్శనమునొంది, సర్వత్రా గల ఆత్మను దర్శించినవాడై ఉండవలయును | తపస్సు చేస్తున్న వాడై యుండవలయును. |
| 2. గుణరహితుడై ఉండవలయును. | తమోగుణము, రజో గుణము లేక సత్వ గుణాశ్రయుడై ఉండవలయును. ఇతనినే భక్తుడని అందురు. |
| 3. వేద వేదాంగములు పూర్తిగా చదివి, ఆకళింపు చేసికొనిన వాడై ఉండవలయును. నిరంతరము స్వాధ్యాయనము చేయు వాడై ఉండవలయును. | వేదములను చదివి అర్థము గ్రహించి సాధన చేయుచున్నవాడై ఉండవలయును. |
| 4. అరిష్వర్గములగు, కామ, క్రోధ, లోభ,మోహ,మద, మాత్సర్యములు, విద్యామదము లేని వాడై ఉండవలయును. | అసూయాది దుర్గుణములు, అహంకారము లేక వినయ శీలుడై విషయపరిజ్ఞాన జిజ్ఞాస గలిగి ఉండవలయును. |

| | |
|---|---|
| 5. నిష్కామ పుణ్యకర్మానుష్ఠాన పరుడై ఉండవలయును. | పుణ్యకర్మానుష్ఠాన పరుడై ఉండవలయును. |
| 6. మహా యోగియై ఉండవలయును. | ఏకాగ్ర చిత్తము కలిగి ఉండవలయును. |
| 7. విరక్తి కలిగి విజ్ఞాన యుతుడై ఉండవలయును. | విరక్తి కలిగి ఉండవలయును. |
| 8. ధన కనక వస్తు వాహనములయందు ఆపేక్ష, ఆడంబరము లేని వాడై ఉండవలయును. | ధన కనక వస్తు వాహనములయందు ఆపేక్ష ఆడంబరము లేని వాడై ఉండవలయును. |
| 9. శిష్యులకు అర్థమగునట్లు విషయమును బోధింప గలవాడై ఉండవలయును. ఇతనినే "వాగ్విదాం వరం" అని అందురు. | గురువు చెప్పినది శ్రద్ధగా విని, మననంబు చేసి నిధి, ధ్యాసలకు చేరుటకు వలయు సాధన చేయువాడై ఉండవలయును. |
| 10. వైఖరీ శక్తి సమేతుడై ఉండవలయును. ఒకరి కొలువునందుండక స్వతంత్రుడై ఉండవలయును. | గురు భక్తి కలిగి ఉండవలయును. |

ఇట్టి అర్హతగల గురువులే అర్హతగల శిష్యులకు పర అపరవిద్యలను చెప్పి పురాణములను బోధించిరి. ఈ పురాణములు చెప్పువారిని వాటిని విను వారి గుఱించి వారి అర్హతల గుఱించి పురాణములలో చెప్పబడును. పురాణములలోని విషయములను స్వానుభవములో గ్రహించినవారు గురువులు. స్వానుభవంలో గ్రహించవలయునని ఆకాంక్షగలవారు శిష్యులు. మొదట రామ కథను నారద మహర్షి వాల్మీకికి చెప్పగా ఆ వాల్మీకి కుశీలవులకు ఆ కుశీలవులు రామునికి రామాయణము వివరించిరి. అటులనే నారదుడు వ్యాసునికి భాగవతము చెప్పగా వ్యాసుడు శుక

బ్రహ్మకు, అతడు సూత మహర్షికి, ఆ సూత మహర్షి శౌనకాదులకు భాగవతము వివరించినారు. శుక మహర్షి పరీక్షిత్తునకు భాగవతమును వివరించెను. ఇట్టి అర్హత లేని గురువులకు ఈ పురాణములు వేదములు భాగవతమున నారదుడు చెప్పినట్లు డాంబికులకు జీవనోపాయంబునై ఉండును. పురాణములు సంస్కృతంబున ఉన్నను తెలుగు భాషలో ఉన్నను అర్థము చేసుకొనుటకు భాషలో పాండిత్యము, వేదాంత విషయ పరిజ్ఞానము, సాధన కలిగి స్వతంత్రుడై ఉండవలయును. ఉదర పోషణార్థము రాజులను ఆశ్రయించిన కవులు అస్వతంత్రులు. అపార భాషా పాండిత్యము కలిగి ఉండియు వేదాంత విషయ పరిజ్ఞానము లేనందున వారి అనువాదములలో వాల్మీకి, వ్యాసభగవానుడు చెప్పిన యోగరహస్యములు మనకు అందలేదు. సంస్కృత శ్లోకమయినా, తెలుగు భాషలోని పద్యములైనా ఆ పద్యము చదివి అదే క్రమములో వాటి అర్థములు చెప్పినచో రచయిత చెప్పదలుచుకున్న భావము సర్వముపాడగును. ఉదాహరణకు : **"ముఖాత్ ఇంద్రశ్చ అగ్నిశ్చ"** అను మంత్రమునకు అనువాదము చేయుచు ముఖమునుంచి ఇంద్రుడు మఱియు అగ్ని వచ్చిరని చెప్పినచో ఆ అనువాదము తప్పు. ముఖము నుంచి అగ్ని, బాహువుల నుంచి ఇంద్రుడు వచ్చెనని అనువదించవలయును. అయితే ఆ మంత్రములో బాహువుల నుంచి అనే పదము లేదు. అయినా ఆవిధముగనే వ్యాఖ్యానించ వలయును.

**చ॥ తనకుల ధర్మముల్ విడిచి దానవవైరి పదార విందముల్**
**పనివడి సేవసేసి పరిపాకము వొందక యెవ్వఁడేనిఁ జ**
**చ్చిన మఱుమేన నైన నది సిద్ధి వహించుఁ దదీయ సేవఁ బా**
**సినఁ గుల ధర్మ గౌరవము సిద్ధి వహించునె యెన్ని మేనులన్**

(భాగవతము-ప్రథమస్కంధము-100)

తమ కులధర్మములను పాటించి, సంసారతాపత్రయములను విడిచి, భగవంతుని పాదపద్మములను శ్రద్ధతో సేవించి, ఆత్మస్థానము పొందక, ఒకడు చనిపోయినను, మఱుజన్మలోనయినా ఆత్మస్థానమును పొందును. అలాగాక కేవలము కులధర్మము లనే పాటించుచూ, సంసారతాపత్రయములలో ఉండి సంసార సేవ చేయుచూ

భగవంతుని సేవ చేయనిచో ఉత్తమ కులము నందు పుట్టినను, పుణ్యాకర్మానుష్ఠానము చేసిననూ ఆత్మస్థానమును ఎన్ని జన్మలకు పొందలేరు. ఈ పద్యమునకు ఉదాహరణగా నారదుడు తను చేసిన సాధనను చెప్పినాడు. ఇలాగాక ఆ పద్యములో వరుసగా ఉన్నట్లుగా ఒకడు తన కులధర్మములను విడిచిపెట్టి భగవంతుని పాదపద్మములను సేవించుచూ అని తెనిగించరాదు. వేదములో పారిభాషిక పదములు ఏ విధముగా నిగూఢముగా ఉండునో, పురాణములలోనూ అదే విధముగా నిగూఢముగా ఉండును. వీటిని ఎవ్వరునూ గ్రంథములలో వివరించరు. అహల్య-ఇంద్రుడు-గౌతముడు-జారత్వం- అని వాడిన పదములను అలాగే ఉంచి వాల్మీకి రచియించినాడు. అంతే తప్ప ఆ కథలో వాడిన పదాల నిగూఢ అర్థమును విశదీక రించలేదు. వీటిని గురు పరంపరా న్యాయముగా గ్రహించవలసి ఉండును.

1. భారతములో ఉద్యోగ పర్వములో కౌరవ పాండవ సేనలో గల వీరులు, వారల శక్తి సామర్థ్యములను బట్టి అర్థరథ, మహారథ, అతిరథులుగా భీష్ముడు సభలో వివరించినాడు. మరల అదే విషయమును దుర్యోధనుడు ద్రోణాచార్యునితో పాండవసేనలో 19 మంది వీరులను కౌరవసేనలో 7 మంది వీరులను గీతలో చెప్పినాడు. గీతలో చెప్పిన వీరు ప్రతివాని శరీరములోనూ ఉందురు. వీరిని బ్రహ్మవిద్యద్వారా గ్రహించవలయును. ఇందు చెప్పబడిన కృష్ణుడు, అర్జునుడు, రథము, వ్యూహము, భీష్ముడు, భీముడు మొదలయినవన్ని శరీరాంతర్గత భాగములు. పారిభాషిక పదములు. కాబట్టి తపస్సు చేయని వానికి చెప్పరాదనే నియమము చెప్పబడినది.

2. భారతములో భూభారమును తగ్గించుటకు యుద్ధములో 18 అక్షౌహిణులు పాల్గొనిరి.

ఒక అక్షౌహిణి అనగా : రథములు-21,870; ఏనుగులు-21,870; గుఱ్ఱములు-65,610; కాలిబంట్లు- 1,09,350 అనగా మొత్తము 2,18,700. యుద్ధములో కౌరవ పాండవ సేన కలసి 18 అక్షౌహిణిలు. కాని శల్య పర్వములో 18వ దినమున యుద్ధము నాటికి కౌరవపాండవ సేనలోని బలాబలములు ఇట్లున్నవని చెప్పబడినది.

| కౌరవులకు | | పాండవులకు |
|---|---|---|
| రథములు-11,000 | ... | 6000 |
| ఏనుగులు-10,700 | ... | 3000 |
| గుఱ్ఱములు-2,00,000 | ... | 1,00,000 |
| పదాతిబలము-3 కోట్లు | ... | ఒక కోటి భటులు |

మరల స్త్రీ పర్వములో యుద్ధములో 76 కోట్ల 20 వేల ఉత్తమ యోధులు మరణించినట్లు చెప్పబడినది. ఈ అంకెలు ఒక దానితో ఒకటి పొంతన కుదురుట లేదు.

**3.** ఇలా కన్యక సుద్యుమ్నుండను కుమారుండయి రాజ్యంబు సేయుచు ఒకనాడు మేరువుపొంత గల కుమారవనమును చేరెను. అప్పుడు అతడు ఆడుది అయ్యెను. మగవాడు ఆడుదిగా కాగల ప్రదేశము భూమిపై ఏదేశములోనయియనా ఎచ్చటనైన కలదా ?

**4.** భూమి గుఱించి ప్రియవ్రతుడు తన రథమును సూర్య వేగముతో సూర్యునికి వ్యతిరేక దిశగా నడపగా, భూమిపై సప్త సముద్రములు, సప్తద్వీపములు ఏర్పడినవి. సప్త సముద్రములలో పాల సముద్రం ఒకటి. కావున ఈ పాల సముద్రం భూమి పైనే గలదు. మరి ఏదేశంలోనయినా పాల సముద్రం ఉన్నదా ?

**5.** వానరులు వింధ్య పర్వతము దిగగానే దక్షిణ సముద్రము, అక్కడగల మహేంద్ర పర్వతము ఎక్కి హనుమంతుడు లంకకు చేరినట్లు రామాయణములో వర్ణింప బడినది. వింధ్య పర్వతము వద్ద సముద్రము లేదు. పురాణములలో ఇలా ఎన్ని కథలో చెప్పబడినవి. ఇవి అన్నియు బ్రహ్మవిద్యా రహస్యములు. కావున ఈ కథలలో గల ఆంతరంగిక రహస్యమును ఆత్మదర్శనం చేసి పరానుభూతిని పొందిన మహానుభావుడు యోగశక్తులలో ఒకటైన వైఖరీ శక్తి సమేతుడైన వాడు మాత్రమే పురాణములను వివరించగలరు.

*****

# దేశము

**(Country Planning and Town Planning)**

దేశము ఏ విధముగా ఉండవలయునో కోసల దేశ వర్ణనగానూ, పట్టణములు ఎలా ఉండవలయునో అయోధ్యగానూ, లంకా పట్టణ వర్ణనగానూ రామాయణములో వివరింప బడినది. ఆ విధముగా దేశము పట్టణములు పల్లెలు ఉండవలయునన్నది ఋషుల ఆకాంక్ష.

దేశము ఆవులతో నిండి పాడి సమృద్ధిగా ఉండవలయును. వరి మొదలయిన ధాన్యములు గలిగి దేశము ధాన్య సమృద్ధియై ఉండవలయును. దేశములో గల అనేక నగరములలో యంత్ర శాలలు (Factories) గలిగి ఆర్థిక పుష్టి గలిగి ప్రజలు సుఖ శాంతులతో ఉండవలయును.

## రామాయణములో వర్ణన

**రాజు :** కుబేరునికి, ఇంద్రునికి ఎంత ఐశ్వర్యమున్నదో అంత ఐశ్వర్యము రాజునకు కలదు.

**రాజ ప్రాసాదము- కోట :-** ఉన్నతమైన కోట, కోట బురుజులు కలిగి ఆ కోట పై రాజ చిహ్న పతాకము గలిగి యున్నది. ఆ కోట చుట్టూ దుర్గమము, గంభీరము, శత్రుదుర్భేధ్యమైన ప్రాకారము గలదు. ఆ ప్రాకారమునకు నాలుగు వైపులా నాలుగు ద్వారములు గలవు. ఆ ద్వారములకు ధృడమైన సుందరమయిన తలుపులు, గడియలు అమర్చిబడియున్నవి. లంకాపుర వర్ణనలో కోట పర్వత శిఖరముపై ఉండెను. అనేక ప్రాకారములు (Compound wall) ఉండెను. కోటలో భవన సముదాయముల మధ్య (రావణుని) రాజభవనముండెను. ఆ భవనము చాలా విశాలమైనది. పెద్ద బంగారు ముఖద్వారము కలది. వైడూర్యమణులు పొదిగిన కిటికీలుగలది. ఆ ప్రాసాదము చుట్టూ పెద్ద ప్రాకారములు ఉండెను. ఆ ప్రాకారము నకు చుట్టూ నీటితో నిండిన పెద్ద అగడ్త కలదు. ఆ అగడ్తలోని నీటిలో పద్మములు కలవు. వేల కొలది రాక్షసులు ఆ ప్రాకారమును రక్షించుచుండిరి. ఆ ప్రాసాదములో, సభామండపము బంగారు నగిషీలు కలిగి ఎక్కడ చూచినా అనేక రత్నములతో

కట్టడములతో కృత్రిమముగా నిర్మించిన పర్వతములతో శోభాయమానముగా ఉండెను. సభాసదులు కూర్చొనుటకు బంగారు ఆసనములు కలవు.

**కోట లోపల - కోట వెలుపల గల రక్షణ వ్యవస్థ :**
వేలకొలది రాక్షసులు ఆ ప్రాసాదమును రక్షించు చుండిరి. ఐరావతము వంటి ఉత్తమ జాతి ఏనుగులు మహా వేగముగల తెల్లని, కొంచెం తెల్లని రంగు గల గుఱ్ఱములు, రథములు గలిగి ఉండెను. (రావణుని గృహము నందు)కోట లోపల, బయట వేయి సేనా విభాగములు ఆయుధములు ధరించి తిరుగు చుండిరి. కోట లోపల, బయట ఆయుధ శాలలు (military equipments తయారు చేసేవి. DRDL, MISIL లాంటివి) గలవు.

**అంతఃపుర రక్షణ:** (లంక పరముగా వర్ణింపబడినది) ఒక సేనా నివేశము (one batalion) అంతఃపురము ఎదుట నిలువ బెట్టబడి ఉండెను. అంతఃపురములో (రాక్షస) స్త్రీలు శూలములు ముద్గరములు శక్తులు, తోమరములు ధరించి అంగ రక్షకులుగా ఉండిరి. అంతఃపురము అగరు చందనములతో చిత్రశాలలు, చంద్రశాలలు, క్రీడాగృహములు, కామ క్రీడా గృహములు బంగారముతో చేయబడిన శయనములు, ఆసనములు, ప్రధానమయిన పాత్రలు ఉండెను. సర్వాలంకార భూషితులై అనేక మంది స్త్రీలు ఉండిరి. అందమైన కుండలములు పుష్పమాలలు ధరించి ఉండిరి.

**రక్షణ వ్యవస్థ :** (Military organization) :- నగరము వెలుపల రెండు యోజనముల వఱకు మఱియు నగరములోను పటిష్టమైన రక్షణ వ్యవస్థ గలిగి ఉన్నది. వందలాది శతఘ్నులు గలిగి ఉన్నవి. (Powerful weapons like Rockets Tankers and rocket launchers, Military vehicles etc.) ఐరావత, మహాపద్మ, అంజన, వామన కులసంజాత, గజములతోనూ భద్ర, మంద్ర, మృగ, భద్రమంద, భద్రమృగ, మృగమంద్ర (Cross breeds) జాతి గజములతోనూ వింధ్యపర్వతమునందు గల మత్తగజములతోను, పర్వత సమానములు మదాన్వితములు, బలాన్వితములగు హిమవత్పర్వత గజములు గలిగి యున్నవి. ఇంద్రుని గుఱ్ఱమగు ఉచ్చైశ్రవమనే గుఱ్ఱములతో సమానములయిన కాంభోజ, భాహ్లిక, వనాయు, సింధు, దేశములలో

పుట్టిన ఉత్తమాశ్వములతో నిండియున్నవి. అనేక వేల రథములు అపార సైన్యము ఉన్నవి. అనగా రక్షణ వ్యవస్థ పటిష్ఠముగా ఉండవలయును అన్నది సారాంశము.

**రాణి : (మండోదరి)** : అద్భుత సౌందర్యవతి. ఆమె ముత్యములు, రత్నములు పొదిగిన అలంకారములు ధరించెను.

**భోజనశాల :** (లంక పరముగా వర్ణింపబడినది) ప్రధానముగా పులుపు,ఉప్పు, కారము గలిగిన ఆహారము ఉండెను. లేళ్ళు, అడవి దున్నపోతు అడవి పందులు, ఏదు పందులు, నెమళ్ళు, కోడి, కొక్కెర పక్షులు, వార్ధ్రాణసకములు, ఏక శల్యము గల చేపలు మొదలయిన వాటి మాంసము ఉండెను. అనగా మాంసాహారము ఉండెను. పెరుగు, సౌవర్చలవణము ఉండెను. బంగారు కడవలతో, వెండి కడవలతో మద్యము ఉండెను.

**నగరము :** ఆ నగరము అష్టాపదాకారముగా నలువైపులా సమముగా విస్తరింపబడి యున్నది. ఆ దేశములో గల నగరములన్నియు ఎంతో సుందరముగా ఉన్నవి. నటీనట సంఘములు గలిగియుండెను. (Dance & drama association) కమ్మరి, కుమ్మరి, సాలె, వడ్రంగి, శిల్పములు చెక్కు శిల్పులు ఉండిరి. (Manufactures, handi crafts). ఆ నగరములో నానా దేశముల నుండి వచ్చిన వర్తక వ్యాపారులు నివసించుచుండిరి. (Trade & Commerce).

**నగరములో వీధులు :** (road, streets) :- రాజ వీధులు తీర్చిదిద్దినట్లు చక్కగా విభజింప బడియున్నవి. అప్పుడప్పుడూ అనగా ప్రత్యేక సందర్భములలో ఆ రాజ మార్గములను నీరు చల్లి, పూలు చల్లి, సుందరముగ తీర్చిదిద్దెడివారు. త్రాగుటకు చెఱుకు రసమును మరిపించు మధుర జలము గలిగియుండెను. (ముఱికి నీరు పోవు నట్లు ఉండి ఉండవచ్చును). ఆ నగరములో నలువైపులా ఉద్యానవనములు మఱియు అక్కడక్కడా మామిడితోటలు, పూలతోటలు, జంతుశాలలు (zoo), పురావస్తు ప్రదర్శన శాలలు (Museum), లలిత కళలు (fine arts music, dance, handi crafts) వీణ, మృదంగము, దుందుభి, పణవము మొదలయిన సంగీత, పరికరములు వాయించు సంగీత విద్వాంసులుండుటచే సంగీత వాద్య ఘోష వీనుల విందుగా వినబడుచుండెను.

**ఉద్యానవనము :** ఉద్యానవన వర్ణనగా అశోక వనము వర్ణన చేయబడినది. (అశోకవనము). ఆ వనములో మద్ది, సంపెంగ, విరిగి, పొన్న, కరవీర వృక్షములు, తీగ గానుగచెట్లు ఉండెను. మామిడి మొదలయిన ఫల వృక్షములు, పూల చెట్లు , పండ్లు పూల భారముతో ఉండెను. ఆ చెట్లకు అనేక తీగలు చుట్టుకొని ఉండెను. ఆ చెట్లపై అనేక పక్షులు ఉండెను. ఆ వనములో చక్రవాక పక్షులు, నీటికోళ్ళు, హంసలు, సారస పక్షులు మొదలగు పక్షులు జంటలు జంటలుగా ఉండి మధురముగా ధ్వని చేయు చుండెను. అనేక మృగములు ఉండెను. కృత్రిమముగా తయారు చేయబడిన పర్వతములు, పర్వత గుహలు ఉండెను. యంత్రముల సాయమున ఒక నది అనగా నీటి ప్రవాహము పర్వతము నుండి క్రిందకు జారి కొంత దూరము ప్రవహించి తిరిగి, ఆ పర్వతము పైకి ప్రవహించునట్లు ఏర్పరుపబడియున్నది. ఆ వనములో మాణిక్యములు పొదిగిన చపటాలు, వెండి బంగారు చపటాలు గలవు. వనముయొక్క మధ్యలో కూర్చొనుటకు స్పటిక, మాణిక్యముల అరుగులుండెను. పుష్ప వృక్షముల దగ్గర, ఫల వృక్షముల దగ్గర ఛత్రములు, అరగులు, బంగారు తిన్నెలు ఉండెను. శింశుపా వృక్షము చుట్టూ శిల్పులచే తయారు చేయిబడిన బంగారుచెట్లు, వెండిచెట్లు యుండెను. ఆచెట్లకు చిరుగంటలు గలిగి ఉండెను. అనేక వృక్షములు ఉండుటచే నెమళ్ళు, క్రౌంచ పక్షులు, చక్కని మంచినీటి సరస్సులు ఉండుటచే రాజహంసలు గలవు. నగర ఉద్యాన వనములలో మృగములు, పక్షులు గలిగి ఉండెను. త్రాగు నీరు సదుపాయము కలిగి, చక్కని వీధులు గలిగి ఉద్యాన వనములు, జంతుశాలలు, మ్యూజియములు గలిగి చక్కని మురికి నీరు పోవు సదుపాయములు గలిగి మనస్సుకు ఉల్లాసమును, వినోదమును గలిగించునవి గలిగి చూడ ముచ్చటగా నగరములు ఉండవలయును.

**గృహములు :** ఆ నగరములోని భూమి మిట్ట పల్లములు లేక సమముగా నున్నది. సమస్థితి గలిగిన స్థలముపై దట్టముగా ఇండ్లు నిర్మింపబడినవి. అనేక అంతస్థులు గలిగిన మేడలు యుండెను. రాజ బంధువుల మేడలు రత్న శోభితమై అలరారు చున్నవి. ఆ మేడలు అనేక అంతస్థులు గలిగియున్నవి. పద్మ, స్వస్తిక లక్షణములతో వర్థమాన గృహములతో నగరముండెను. గృహముల ద్వారములు బంగారముతో నిర్మింపబడినవి. ఆ గృహములకు ముందు వైడూర్య మాణిక్యములతో నిర్మించిన అరగులు ఉండెను. ఆ గృహములలోని నేల వజ్రములతోనూ, స్పటికములతోనూ,

మాణిక్యములతోనూ ప్రకాశించు చుండెను. మెట్లు వైడూర్య మాణిక్యములతో నిర్మింపబడెను. ఆ గృహములలో అక్కడక్కడ బంగారు మదపుటేనుగుల బొమ్మలు గలవు. గృహముల లోపల (రాత్రి) దీపములు వెలుగు చుండెను. ప్రాకారాదుల లోపల స్ఫటిక మాణిక్యముల పరాగము ఉండెను. దీనిని బట్టి చరిత్రలో చెప్పబడిన హరప్పా, మహోంజదారా పట్టణములలో వర్ణింపబడిన నాగరికత కంటె ముందే మన అయోధ్యా నగరము నాగరికత గలిగి ఉన్నదని తెలియుచున్నది.

**దేశ ప్రజలు:-**

**గుణములు :-** ప్రజలందఱూ ధర్మస్వభావులు మహర్షులవలె నిర్మలులు, దాన గుణము కలవారు నిత్య సంతోషులు, సత్యసంధులు. శీల వంతులు. కృతజ్ఞులు. ఇంద్రియ నిగ్రహము కలవారు. పుణ్య కర్మానుష్ఠాన పరులు. ఉదారులు. తమ కున్న దానితో తృప్తి పడువారు. ఆశ లేని వారు. లోభ గుణము లేని వారు. అసూయ లేని వారు. అనగా ప్రజలు ఈ విధముగా ఉండవలయును.

**విద్య :-** విద్యావంతులు, అనేక శాస్త్రములు అధ్యయనము చేసెడివారు, విద్వాంసులు కావున స్పష్టమైన చక్కని ఉచ్చారణ కలిగియున్నవారు. అనగా ప్రజలు విద్యావంతులై ఉండవలయును.

**ధనము :-** మహాధనవంతులు. అశ్వములు, గోవులు, ధనదాన్యములు గలవారు.

**శరీర శుభ్రత :-** అభ్యంగన స్నానము చేయువారు, చందనాది సుగంధ ద్రవ్యములు పూసుకొనెడివారు.

**వేషధారణ :-** శిరస్సుకు శిరోభూషణము(తలపాగా) ధరించి ఉండిరి.. (తలలో, మెడలో) పుష్పమాలలు, మంచి వస్త్రములు, హస్తాభరణములు, ముంజేతి కంకణములు, కంఠాభరణములు, చెవులకు కుండలములు, ధరించి ఉండిరి. సౌందర్యవంతులు. స్త్రీలు సుందరనారీమణులు. ప్రజలు అందముగా ఉండిరి. శరీరమునకు సుగంధ ద్రవ్యములు పూసుకొని పుష్ప మాలలు, ఆభరణములు ధరించి ఉండిరి. స్త్రీలు అందముగా ఉండిరి. స్త్రీలు ధరించిన వడ్డాణముల చప్పుళ్ళు, అందెల సవ్వడి వినిపించు చుండెను. ఆ స్త్రీలు మధురముగా గానము చేయు చుండిరి. అనగా ప్రజలలో బీదరికమును రూపుమాపి ఆర్థిక స్వావలంబన గలిగి ఉండునట్లు పాలకులు చూడవలయును.

**ఆహారము :-** మృష్టాన్నములు భుజించెడివారు. కుంకుమ పువ్వు, కస్తూరిమున్నగు పరిమళ ద్రవ్యములను సేవించెడివారు.

**ప్రజలు :-** నీచుడుగాని, దొంగగాని, వర్ణ సంకరుడు గాని, నాస్తికుడు గాని, అసత్యవాదిగాని, దీనుడుగాని, పరదారాసక్తుడుగాని, చిత్తక్షోభ చెందిన బాధాతప్తుడు గాని, లోకకంటకుడు గాని క్రూరుడుగాని, పొగరుబోతుగాని లేడు. (ఇట్టి వారికి రాజు మరణ దండన విధించుట వలన ఆ దేశములో ఇట్టివారు లేరు అని భావించ వలయును).

**వర్ణ వ్యవస్థ :-** అయోధ్య పరంగానూ లంక పరంగానూ వర్ణింప బడినది. సర్వ వర్ణముల వారు వారివారి కులధర్మములను ఆచరించెడివారు.

**బ్రాహ్మణులు :-** మహర్షి సదృశులు వేదవేదాంగ పారంగతులు. సత్యనిరతులు సుగుణవంతులు. ధర్మ పరులు. స్వకర్మనిరతులు. అహితాగ్నులు. యజ్ఞములు చేయించెడి వారు. యజ్ఞములు చేసెడివారు. దానము చేయువారు. దానము తీసుకొనువారు. వేద వ్రతానుష్ఠాన పరులు ఇంద్రియ నిగ్రహము గలవారు. రాజులకు ధర్మాచరణ చెప్పుచూ భగవంతుని సేవించెడివారు.

**లంకలో బ్రాహ్మణులు :-** మంత్రములు జపించుచుండిరి. వేదాధ్యాయన నిరతులు. దర్భలు ధరించి అగ్ని హోత్రము చేయుచుండిరి. యజ్ఞ దీక్ష వహించి కొందఱు, జటలు ధరించి కొందఱు, ముండనము చేయించుకొని కొందఱు ఉండిరి. వారి నిత్యాగ్నిహోత్రము, వేదాధ్యయనము, యజ్ఞములు, ఉదర పోషణకు తప్ప ఆత్మ దర్శనమునకు కావు అని చెప్పుటకు వారు ఎద్దు చర్మములను ధరించిరి అని చెప్పబడినది. ఆత్మ దర్శన ప్రాప్తి ఫలమయినచో నారచీరలు ధరించిన వారని వర్ణింపబడెడిది.

**క్షత్రియులు :-** ధర్మ పరులు, సత్యవంతులు. అగ్నివలె తేజోవంతులు. యుద్ధవిద్యా నిపుణులు. పౌరుషము కలవారు, శూరులు. పరాక్రమ వంతులు. లంకలో క్షత్రియులు అనేక ఆయుధములు ధరించిరి. క్షత్రియులు వారి కుల గురువులను ఇతర వేద విద్వాంసులయిన బ్రాహ్మణులను సేవించెడివారు.

**వైశ్యులు :** సత్యవంతులు . ధర్మపరులు. కార్యనిర్వహణదక్షులు. కోశాధికారులుగా రాజులను సేవించెడివారు-మిగిలిన వారు బ్రాహ్మణ క్షత్రియులను సేవించెడివారు

**శూద్రులు :** ( భృత్యులు, సేవకులు, రాజోద్యోగులు మొదలయినవారు). ఈ శూద్రులు ధర్మపరులు. సత్యవంతులు. రాజ భటులు రాజులను సేవించెడివారు. మిగిలిన వారు బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యులను సేవించెడివారు. లంకలో రాజభటులు ఆయుధములు ధరించి యుద్ధమునకు సర్వ సన్నద్ధమై ఉండిరి. అయోధ్యా పుర వర్ణనలో చాతుర్వర్ణముల వారు ధర్మపరులు. లంకలోని వారు ధర్మపరులు కారు. ప్రజలు ధర్మపరులుగా నీతి నిజాయితీలు గలవారిగా ఉండవలయును.

**ప్రజలు - వారలలో గల భేదములు :** 1. దుర్మార్గులు : పరులలోని సుగుణములను దుర్గుణములుగా ఆపాదింతురు. 2. మధ్యస్థులు : పరుల దుర్గుణములందు దోషములను చెప్పుదురు. 3. సాధువర్తనులు : పరుల దోషములను వేలెత్తి చూపరు. 4. ఉత్తములు : పరులలో గల సద్గుణములను గ్రైకొందురు. రావణుడు దుర్మార్గుడు. రాములోని సుగుణములను దోషములుగా ఆపాదించెను.

**దుశ్శీలః కర్కశ స్తీక్ష్ణో మూర్ఖో లుబ్ధో ఽ జితేంద్రియః**
**త్యక్త ధర్మో హ్యధర్మాత్మా భూతానామహితే రత:** (అరణ్యకాండ:36-11)

రాముడు దుశ్శీలుడు. కర్కశుడు, తీక్షణస్వభావము గలవాడు, మూర్ఖుడు, లుబ్ధుడు, ఇంద్రియ లోలుడు, ధర్మమును విడిచినవాడు, అధర్మ పరుడు, భూతములకు అహితము చేయుటయందు ఆసక్తి గలవాడు. అనగా హింసా ప్రవృత్తి కలవాడు అని దుర్మార్గుడైన రావణుడు రామునిలోని సుగుణములను దుర్గుణములుగా ఆపాదించినాడు.

**ముగింపు :** నేటి అవైదిక ప్రవర్తన వలన దేశము సుఖశాంతులు లేక ఉన్నది. ప్రజలు అనేక కష్టములకు లోనగుచున్నారు. కావున ఈ విభాగమును ప్రజలందఱూ చదవ వలయును. ముఖ్యముగా పాలకులు చదివి, ఈ విధముగా దేశమును, నగరములను, పట్టణములను, పల్లెలను అభివృద్ధి చేయవలయును. దుర్మార్గులను పాలకులు కఠినముగా శిక్షించి ఆదర్శ సమాజమునకు బాటలు వేయవలయును.

1. దేశము సుఖ శాంతులతో పాడి పంటలతో యంత్రములతో (Factories and industrial developments) ఉండవలయును. 2. రక్షణ వ్యవస్థ : పటిష్టముగా ఉండవలయును. అనగా సైన్యము, యుద్ధ పరికరములుతో ఉండవలయును.

**3.** నగరము : త్రాగు నీరు సదుపాయము, మురికి నీరు పోవు సదుపాయము, విశాలమైన వీధులు, చక్కని భవంతులు, ఉద్యానవనములు, జంతు శాలలు, పురావస్తు ప్రదర్శన శాలలు కలిగి సాహిత్య సంగీత నాటక రంగమునకు సంబంధించిన వారు ఉండవలయును. **4.** ప్రజలు : విద్యావంతులు, ధర్మపరులు, ధనవంతులు, చక్కని వేష భాషలు కలిగి ఉండవలయును. ప్రజలు ఆరోగ్యవంతులుగా ఉండునట్లు పాలకులు చూడవలయును. ప్రజలు ఆర్థికముగా బలవంతులై ఉండవలయును.

*****

## ధర్మములు

**"ధర్మమూల మిదం జగత్".** ఈ జగత్తు ధర్మ మూలము. ధర్మమే ఈ జగత్తునకు ఆధారము. **ధర్మోహి పరమో లోకే సత్యం ప్రతిష్ఠితమ్.** లోకములో ధర్మమే గొప్పది. ధర్మమునందు సత్యము ప్రతిష్ఠితమై ఉన్నది. ధర్మమునందు ధర్మార్థ కామము లన్నియు కలవు. ధర్మము వలన అర్థము, సుఖము కలుగును. పరదారాసక్తత, వైరము లేకుండా చంపుట, అసత్యావాక్యము అనునవి కామము వలన కలుగు వ్యసనములు. కామము వలన కలుగు వ్యసనములకు దూరముగా ఉన్నవాడే ఈ లోకమున ధర్మాచరణ చేయగలడు. ఇందు అసత్యము గొప్ప వ్యసనము.

**ధర్మము :** దేవతలు ధర్మమును, రాక్షసులు అధర్మమును ఆశ్రయించి ఉందురు. ధర్మము అధర్మమును అణగత్రొక్కునపుడు కృతయుగము. అధర్మము ధర్మమును అణగత్రొక్కునపుడు కలియుగము. వేద ప్రణీతము ధర్మము. వేద ప్రణీతము కాని అవైదికము అధర్మము. ధర్మమును పుణ్యమని, అధర్మమును పాపమనీ చెప్పుదురు. ప్రాణులకు పుణ్య పాపములు అనుభవంబులు కాని ఊరక పోవు. అనగా వాటి ఫలితములు ఏదో ఒకరోజు తప్పక అనుభవించవలసియే ఉండును. ధర్మము చాలా సూక్ష్మమైనది. తెలిసికొనుట చాలా కష్టము. ధర్మాధర్మ విచక్షణ మనస్సే తెలిసి కొనును. **అపర ధర్మమని, పర ధర్మమని ధర్మము రెండు విభాగములు.** అపర ధర్మములో ధర్మము అనగా చేయవలసిన పనులు. అర్థము అనగా ధన సంపాదన. కామము అనగా సుఖభోగములు అనుభవించుట గుఱించి వివరించబడును. పర ధర్మములో మోక్షమునకు చేయవలసిన కర్మానుష్ఠానం

వివరించబడును. అపర ధర్మములో **సామాన్య ధర్మములు, విశేష ధర్మము**లని ధర్మములు రెండు తెఱంగులు.

భీష్ముని వద్ద ధర్మరాజు నరజాతి సాధారణంబులగు ధర్మంబులను, వర్ణాశ్రమ ధర్మంబులును, రాగ వైరాగ్యోపాధులతో గూడి ప్రవృత్తి ధర్మంబులును, దాన ధర్మంబులును, రాజ ధర్మంబులును, స్త్రీ ధర్మంబులును, శమదమాదికంబులును, హరితోషణంబులగు ధర్మంబులును, ధర్మార్థకామ మోక్షములును తెలుసుకొనెను. (భాగవతం-ప్రథమస్కంధము-215)

అపర ధర్మము పాటించునపుడు నిజధర్మ బాధకంబయిన ధర్మము అనగా **విధర్మము, పరధర్మ ప్రేరితంబయిన** ధర్మము అనగా తనకు స్వధర్మముకాక ఇతరులకు విహితమయినది, **అభాస ధర్మము** అనగా స్వేచ్ఛగా మఱియొక ఆశ్రమమును గ్రహించి శాస్త్ర విరుద్ధముగా చేయుట, **కపట ధర్మము** అనగా వంచనతో దంభముతో సలుపునది, **పాషండ ధర్మము** అనగా వేద విరుద్ధ ధర్మము వీటిని మానవలయును. అనగా తన జాతి వారికి గాక ఇతర జాతి వారికై చెప్పబడిన ధర్మములు ఆచరించరాదు. ఉదాహరణ: అర్జునుడు క్షత్రియుడు. క్షత్రియ జాతికి యుద్ధముచేసి శత్రుసంహారము చేయుట ధర్మము. సన్న్యాసికి, బ్రాహ్మణునికి అహింస ధర్మము. కావున క్షత్రియుడైన అర్జునుడు యుద్ధము మాని బిక్షమెత్తుకొనుట అధర్మము. అహింస వ్రతము చేయుట క్షత్రియునికి అధర్మము. అపర ధర్మము (నైసర్గిక ధర్మము) ఆచరించినచో మనస్సుకు శాంతి, దేశమునకు క్షేమము కలుగును. కావున అపర ధర్మము దురిత శాంతి సమర్థంబగు అని చెప్పబడినది. ప్రజలకు వాక్మనః కాయవృత్తుల వలన ఆచరించు అపర ధర్మము సమస్త లోకంబులకు విశోకంబు చేయును. కావున అపర ధర్మము పాటించిన దేశమునకు ప్రజలకు క్షేమము కలుగును.

అపర ధర్మములో మరల సంఘ నియమములు, వ్యక్తి నియమములని రెండు విభాగములు. జాతి ధర్మము, ఆశ్రమ ధర్మములు సంఘనియమములు. వీటినే కులధర్మములని అందురు. కులధర్మములు పాటించవలయునని వేద, పురాణములు చెప్పినవి. కుల ధర్మములు పాటించుట వలన భగవంతుడు సంతోషించును. అదియే పుట్టుకకు సార్థకత. ఈ విషయమునే పురుషుడు చేయు

వర్ణాశ్రమ ధర్మంబులకు మాధవుడు సంతోషించుటయే సిద్ధి అని భాగవతమున చెప్పబడినది.

తత్త్వ దర్శనులైన ఋషులచే ఇహలోక జీవనోపాధికి కృషి, పరలోకమునకై అగ్ని హోత్రాది ఉపాయంబులు చెప్పబడినవి. వీటిని కాదని ఇంకొక విధముగా ఆచరించు వారు ఫలమును (ఇహలోక పరలోక ఫలములను) పొందరు. అపర ధర్మము పాటించుట వలన దేశము పాడిపంటలు ధన ధాన్య సమృద్ధికలిగి సుఖ శాంతులతోనూ, ఆదర్శ పౌరులతోనూ విరాజిల్లును. వేదములలో చెప్పిన నియమములు పాటించక పోవుటయే అధర్మము. అధర్మ ప్రవర్తన వలన వ్యక్తి యొక్కయు, సంఘము యొక్కయు శ్రేయస్సుకు విఘాతము గలుగును. దేశములో శాంతి భద్రతలు లేక అశాంతి, అలజడులు ఉండును. కావున వేద చోదితంబులగు ధర్మంబులందు ఆసక్తుడవు కమ్ము అని వేద పురాణముల ఆదేశము. ధర్మములలో శాస్త్ర విషయములు చెప్పబడును. వాటిని ఆచరించుటను **కర్మ** అని అందురు. శాస్త్ర విషయములు ఆచరణ అను రెండింటిని చెప్పినది **విద్య** అని చెప్పబడును.

మోక్షమార్గమునకు అవలంబించవలసిన **శాస్త్ర పాఠము పరధర్మము, ఆచరణ కర్మ. ఈ రెండింటిని చెప్పినది పరవిద్యగా గ్రహించవలయును.** ధర్మాచరణను పుణ్యమనియు, అట్టి ధర్మాచరణపరులను పుణ్యాత్ములనియును, అధర్మాచరణను పాపమనియు అట్టి అధర్మాచరణ పరులను పాపాత్ములనియు చెప్పుదురు. విధులు బాధ్యతలుగా చెప్పబడే అపర ధర్మము పాటించుట సంఘము యొక్కయు, వ్యక్తి యొక్కయు బాధ్యత. ఈ అపర ధర్మమును పాటించనిచో దేశములో సుఖశాంతులు ఉండవు. ప్రజలు కష్టముల పాలగుదురు. కేవలము అపర ధర్మ ప్రచారము వలన ప్రయోజనము లేదు. ఈ ధర్మప్రచారము వలన ఉత్తమ పౌరులు ఉత్తమ దేశము ఏర్పడదు. అధర్మ పరులను అనగా విధులు బాధ్యతలు నెఱవేర్చని వారిని, అకార్యములు అనగా చేయకూడని పనులను చేయు వారిని ప్రభువు (ప్రభుత్వము) కఠినముగా దండించవలయును. సరియైన దండన లేని యెడల మఱియు, ఆలస్యముగా విధించు దండన వలన రాజ్యములో సుఖ శాంతులు ఉండవు. దీనినే అరాజకమనిరి. అరాజకములో ధర్మబోధ నిరర్థకము. అధర్మ పరులకు సకాలములో సరియైన దండన విధింపబడినచో ధర్మ ప్రచారము వలన ఉత్తమ పౌరులు గలిగి,

దేశము సుఖ శాంతులతో విరాజిల్లును. సంఘ విద్రోహులు నశించెదరు. సత్పురుషుల ఆచరణయే ధర్మ ప్రచారము. ఈ అపరధర్మాచరణ వలన కీర్తి, ధనము వచ్చునే గాని మోక్షము రాదు.

ధర్మపరముగా ధనము సంపాదించి, అధర్మములుగాని సుఖభోగములు అనుభవించ వలయును. ధనము కలిగినవారు కేవలము సుఖ భోగములకు వ్యయము చేయక పుణ్యాకార్యంబులు చేయవలయును. సుఖభోగములు అనుభవించుటయే కామము. అపర ధర్మాచరణ వలన ఆపదలు రావనేది లేదు. కావున అపర ధర్మము ఆచరించి, దారిద్ర్యములో ఉండి సుఖ భోగములు లేక నిరాశతో ఉండి ఆపదలో దైవము రక్షింపనప్పుడు అపరధర్మాచరణ నిష్ఫలమనే భావన గలుగును. అప్పుడు ధర్మాచరణ నిష్ఫలమని అనుకొనును. అపర ధర్మము గుఱించి బాధలలో ఉన్నవాని భావనను లక్ష్మణుని పరంగా చిత్రీకరింపబడినది. ఉత్తమ మార్గమునందున్నను (అపరధర్మాచరణచేసినను) జితేంద్రియుడవైనను, ఆపదల నుండి (అపర) ధర్మము రక్షింపకున్నది. అందువలన (అపర) ధర్మము నిష్ప్రయోజనము. ధర్మమన్నది ఉన్నచో ధర్మాత్ముడయిన వానికి (రామునకు) ఆపద రాకూడదు. ధర్మమున్నచో ధర్మపరునికి ఆపదలు వచ్చి ఉండెడివి కావు. జంగమ స్థావరములు కనబడుచున్నవి. ధర్మము అగోచరము. కావున ధర్మమనేది లేదు. ధర్మము వలన సుఖము అధర్మము వలన కష్టము వచ్చినచో, జనులు అధర్మము నందు ఆసక్తి చూపక ధర్మాచరణ చేసి సుఖమునే పొందెడివారు. ధర్మపరులు ఆపదలో చిక్కుకొను చున్నారు. అధర్మపరులకు సంపదలు అభివృద్ధి అగుచున్నవి. కావున ధర్మము కష్టములను, అధర్మము సుఖములను ఇచ్చుచున్నట్లు కనబడుచున్నవి. ధర్మపరుడవయిన నీవు (రాముడు) కష్టముల పాలగుచున్నావు. నీకు సుఖము లేదు. అధర్మపరుడు (రావణుడు) సుఖపడుచున్నాడు. అతనికి ఆపద రాలేదు. కావున ధర్మమనేది లేదు. సత్యానికి స్థానము లేదు. ఋజుత్వానికి మంచితనానికి చోటులేదు. ధర్మా ధర్మములు సుఖమును, కష్టమును యివ్వవు. కావున ధర్మాచరణ వ్యర్థము. ధర్మము దుర్బలమై అధర్మమునకు లొంగిపోయిన అట్టి ధర్మమును పరిత్యజించుట యుక్తము. ధర్మము ఆచరించినా అధర్మము ఆచరించినా వినాశము కలుగునపుడు ఏది ఆచరించినా ఒక్కటే. కాలానుసారము ధర్మాధర్మములను ఆచరించ వలయును.

ధర్మము వలన గాక బలము వలన కార్యసాధన గలిగినట్లయిన ధర్మమును విడచి బలమును ఆశ్రయింపుము.

**గమనిక :** రాముడు ఈ మాటలను వినలేదు. అపరధర్మాచరణ వలన రామునికి గొప్ప కీర్తి వచ్చినది. అపరధర్మాచరణ వలన భూలోకమున కీర్తి ప్రతిష్ఠలు పరలోకమున స్వర్గప్రాప్తి గలుగును. అపర ధర్మము ఆచరించనిచో భూలోకమున దండన (జైలు) పరలోకమున నరక ప్రాప్తి గలుగును. ధర్మాచరణకు ఫలము ఉత్తమలోకము. ఈ విషయమును చెప్పుటకు శ్రవణకుమారుని కథచెప్పబడినది. శ్రవణ కుమారుడు మాతాపితరులను సేవించినాడు. ఉత్తమ ధర్మపరుడు. కాని అకారణముగా చంపబడినాడు. (దశరథుని బాణము వలన చనిపోయినాడు). అట్టి మరణ సమయమున ధర్మాచరణకు ఫలితము లేక పోయినదని వాపోయినాడు. శ్రవణ కుమారుడు మరణించినాడు. దివ్య దేహమును ధరించి స్వర్గమునకు వెళ్ళుచూ తను తల్లిదండ్రులకు సేవచేసిన పుణ్యఫలితము వలన నేడు స్వర్గము లభించినదని దివ్య శరీరధారియై చెప్పినాడు.

**పరధర్మము :** పరధర్మమునకు దృష్ట, శ్రుత, ప్రపంచ అర్థంబు ఫలంబు కాదు. భక్తి ఫలంబు. అసంగులయిన వారికి మోక్షమిచ్చు. నారాయణ కథలయందు చెప్పబడినదే పరధర్మము. మన ధర్మాచరణ అధర్మాచరణకు దేవతలు సాక్షులు.

తీవ్ర మోక్షేచ్ఛ గలవారు మాత్రమే పరధర్మమును పాటించవలయును. భరతుడు తల్లిని గౌరవించలేదు. లక్ష్మణుడు తండ్రిని గౌరవించలేదు. రాముడు గురువైన వసిష్ఠుని మాట వినలేదు. గోపికలు పరపురుషుడైన శ్రీకృష్ణుని తమ భర్తలను బంధువులను కాదని అతనితో రమించినారు. (యౌగిక అర్థము వేఱు) ప్రహ్లాదుడు తన తండ్రి విష్ణువుని పూజింపవద్దని చెప్పిన మాటను వినలేదు. వీరు వేదములో అపర ధర్మములో చెప్పిన తల్లిని తండ్రిని గురువును పూజింపమని చెప్పిన ఉపదేశములను పాటించలేదు. అయినను పరధర్మ ఆచరణ పరులగుట వలన వీరందఱూ ధర్మజ్ఞులే.

*****

# పరిపాలన (Public Administration)

## పాలకులు - రాజు

రాజు గురించి చెప్పిన విషయములను దేశమును పాలించు పరిపాలకునికి అన్వయించు కొనవలయును. ఈ విభాగమును చదివి పరిపాలనను మెఱుగుపఱచు కొన వలయును. ఈ లక్షణములను చదివి గ్రహించి పాలకులు ఆచరించవలయును. దేశమును పరిపాలించువాడు రాజు. ఈ రాజులలో మంచివారు చెడ్డవారు అని రెండు విభాగములు. మంచి రాజులకు ప్రతినిధి రాముడు. చెడ్డ రాజులకు ప్రతినిధి రావణుడు. ఈ ఇద్దఱిని అధ్యయనము చేసినచో రాజు (పాలకుడు) మంచి వాడగుటకు అవకాశము కలదు. తన తప్పులను గ్రహించి సరిదిద్దుకొనిన శుభ లక్షణయుతుడైన రాజు (పాలకుడు) అగును.

రాజులకు ఉండవలసిన లక్షణములు గలిగి దుష్ట లక్షణములు లేని వారు మంచి రాజు. మంచిపరిపాలనా దక్షుడయ్యు ఉండకూడని లక్షణములయిన దుందుడుకు స్వభావము గలవాడు, పరస్త్రీ వ్యామోహితుడు, మంత్రుల హిత వాక్యములను పెడ చెవినపెట్టు వాడు, గూఢచారుల ద్వారా విషయములను గ్రహించని వాడు, యుద్ధములో తన బలము ఎదుటి బలములలో గల తార తమ్యములు గ్రహించక, హిత వాక్యములను వినక మదోన్మత్తుడు అయినవాడు దుష్టుడు. ఈ విధముగా రాజులను వర్గీకరించి దశరథుని పరంగా, రావణుని పరంగా, వాలి పరంగా రామాయణములో చిత్రీకరించినారు. అటులనే ధర్మరాజు పరంగా, దుర్యోధనుని పరంగా భారతములో చిత్రీకరించినారు.

ధశరథుడు పరిపాలనా దక్షుడయ్యు ముందు వెనుకలు ఆలోచింపక తొందరపడి ఒక కార్యమును చేసి ఆపై తను చేసిన కార్యమునకు చింతించువాడు. చేతులు కాలిన తర్వాత ఆకులు పట్టుకొను స్వభావము కలవానిగా చిత్రీకరింపబడినాడు. ఉదా: 1. నీటికి వచ్చినది ఏనుగేనా అని ఆలోచింపక శబ్దము మాత్రమే విని జ్ఞానా జ్ఞాన విచక్షణ లేక శ్రవణకుమారుని చంపినాడు. (యౌగికార్థములో ఇంకొక విషయముగా గ్రహించవలయును). 2. కాముకుడై కైక మందిరమునకు వెళ్ళి అపరాధిని విడిచిపెట్టమన్నా నిరపరాధిని చంపమన్నా నీవు ఏది చెపితే అది

ఆఱవ పాలు పన్నుగా తీసుకొని, ప్రజలను కన్నబిడ్డల వలె పాలించని అధర్మ ఫలితము వలన రాజుకు నరకప్రాప్తి కలుగును.

**పుణ్యకార్యములు :** రాజులు కామ, లోభ, భయ, ద్వేషయుతులు. వారు ఇంద్ర యాగము చేయుదురు. అలా చేయకుండిన దేశమునకు అశుభము గలుగును.

**రాజు స్వభావము :** రాజులు సాధారణముగా మంచి వారిని కూడా శంకించెదరు. ఐశ్వర్యముతో ఉన్నవారు ఇతరులను పొగడుచుండగా సహించరు.

**రాజుకు ఉండవలసిన లక్షణములు :** గుణవంతులను, సత్యమును, ధర్మమును రక్షించువాడే రాజు. ప్రజలకు హితము చేయువాడే రాజు. అనగా సత్ప్రవర్తన గలిగి ఉండవలయును.

**1. శారీరక బలము :** బలవంతుడు. అతిరథుడు.మహాతేజశ్శాలి. శత్రువులను జయించిన వాడు. గొప్పతేజోవంతుడు, పరాక్రమ వంతుడుగా ఉండవలయును.

**2. లక్షణములు :** రాజర్షి . మహర్షి తుల్యుడు. వేదజ్ఞుడు, ధర్మపరుడు, సత్యసంధుడు, జితేంద్రియుడు, బుద్ధిమంతుడు, యజ్ఞములు ఆచరించువాడు, దూరదృష్టి గలవాడు, పరిపాలనాదక్షుడు, మంచి మిత్రులు కలవాడు, పౌరులకు, జానపదులకు ప్రియుడు. ప్రజా రక్షకుడుగా ఉండవలయును. వైభవములో ఇంద్ర తుల్యుడు, ధనములో కుబేర సముడు, సర్వ శాస్త్రములను అభ్యసించి వాటి సారమెల్ల ఎఱిగినవాడు అయి ఉండవలయును. మంచి నేర్పరి, ఏమరి పాటు లేని వాడు, అన్ని విషయములు తెలుసుకున్నవాడు, ఇంద్రియలోలుడు కాని వాడు, కృతజ్ఞుడు, ధర్మాత్ముడు అయిన రాజు చాలా కాలము రాజ్యమందు స్థిరముగా ఉండును. నిద్రిస్తున్నా రాజనీతి అనే కండ్లతో మేలుకొని ఉన్న రాజును ప్రజలు పూజింతురు.

రాజు ధృడనిశ్చయముతో ఇతరుల చేష్టాదుల ద్వారా వారి అభిప్రాయములను గ్రహించి తగిన విధముగా రాజ కార్యములు చేయవలసి ఉండును. లేనిచో రాజు ప్రజలను పాలింపలేడు. ప్రజలు మంచివాళ్ళు చెడ్డవాళ్ళు అను విషయమున వారి మాటలను బట్టి గ్రహించ వలయును. ఎదుట వానిని పరీక్షించకుండా సఖ్యము చేయరాదు. దాన గుణము కలిగి హితులను దగ్గరకు చేర్చుకొని దయ కలిగి జితేంద్రియుడై ఉండవలయును. ధర్మార్థ కామములను ఆయా కాలములలో

విభజించి ఆచరించ వలయును. లోక మెఱిగి సామ దాన భేద దండోపాయములను రాజు ఆచరించ వలయును. అట్టి రాజు, లోకములో ఆపదలు పొందడు. దేవతలను, గురువులను, పురోహితులను, బ్రాహ్మణులను తండ్రితో సమానులైన బంధువులను వృద్ధులను గౌరవింపవలెను. మంచి మిత్రులను సంపాదించ వలయును. శత్రువులను వధించ వలయును. శత్రువులు చెడిపోవుట, మిత్రుల అభివృద్ధి రాజుకు మంచిది. తగు కాలము గుర్తించుచూ, మిత్రుల విషయమున చక్కగా ప్రవర్తించువాని రాజ్యము, కీర్తి, ప్రతాపము వృద్ధి పొందును. ధనాగారము సైన్యము,మిత్రులు, బాహు బలము గల రాజు గొప్ప రాజ్యమును పొందగలుగును. దేశము పాడిపంటలతో ధన ధాన్యములతో సుఖ శాంతులతో ఉండునట్లు చూడవలయును. ఇంద్రియములు మనస్సును అదుపులో ఉంచుకొనుట, ఓరిమి, ధైర్యము, ధర్మము, సామము, దానము, సత్యము, పరాక్రమము, వినయము కలిగి ఉండుట, దుష్టులను దండించుట, దోషులను దండించుట, రాజనీతి అవలంబించుట, నిగ్రహించ తగిన వారిని నిగ్రహించుట, అనుగ్రహించవలసిన వారిని అనుగ్రహించుట - ఇవి రాజులకు ఉండవలసిన లక్షణములు.

అర్థసాధకులయిన వైశ్యులను రక్షించి వారికి ఆపదలు లేకుండా చూడవలయును. చక్కగా అలంకరించుకొని ఉదయం ప్రజలకు దర్శనము ఇవ్వవలయును. అశ్వములను, ఏనుగులను, యుద్ధపరికరములను ఇంకా ఇంకా సంపాదించ వలయును. ధర్మార్థ కామములను కాలానుగుణముగా అనుభవించవలయును. ధర్మము, అధర్మము, కామములయందు, సందేహము కలిగినప్పుడు ప్రజలు రాజునే అనుసరింతురు. **యథా రాజా తథా ప్రజాః** ధర్మమునకు, అధర్మమునకు రాజు ఆచరణయే ప్రమాణము కావున రాజు ధర్మపరుడుగా ఉండవలయును.

రాజనీతి శాస్త్రమును చదివి సరిగా సారమును గ్రహించవలయును. లేనిచో గురువుల సేవ వ్యర్థము. అట్టి వాడు వ్యర్థుడు. విద్యలు బాగుగా అభ్యసించి నీతి మార్గమును అనుసరించు రాజు చిరకాలము రాజ్యమును పాలించును. రాజు ఎల్లప్పుడూ ఇంద్రియములను అదుపులో పెట్టుకొనవలయును. కామము వలన, క్రోధము వలన కలుగు వ్యసనములకు దూరముగా ఉండవలయును. కొందఱితో స్వయముగా ఇంకొందఱితో దూతల ద్వారా వ్యవహారములను నడుపవలయును. ధనాగారము, ఆయుధాగారము చక్కగా నింపవలయును.

**3. కోటలు :** ధనము, ఆహార ధాన్యములు, పశువులకు గడ్డి, నీళ్ళు, వంట కట్టెలు, యుద్ధ వీరులు, ఆయుధములు, యుద్ధపరికర యంత్రములు కోటలో పుష్కలముగా కలిగి ఉండునట్లు చూడవలయును.

**రాజుకు ఉండకూడని లక్షణములు :** నాస్తికత్వము, అసత్యము, క్రోధము, ఏమరిపాటు, సోమరితనం, ఆలస్యము, ఇంద్రియములకు వశుడగుట, మిత్రులతో గాక తను ఒక్కడే నిర్ణయించుట, ఆలోచనలు రహస్యముగా ఉంచకపోవుట, నిర్ణయించిన కార్యములు ప్రారంభించకపోవుట, మంచి పనులు చేయక పోవుట, కార్య నిర్ణయములో దీర్ఘాలోచన అందఱితో ఒకేసారి వైరము ఇవి ఉండరాదు.

**హిత వాక్కు :** చెప్పుడు మాటలను, భజనపరుల మాటలను వినరాదు.

**సులభాః పురుషా రాజన్ సతతం ప్రియవాదినః**
**అప్రియస్య తు పథ్యస్య వక్తా శ్రోతా చ దుర్లభః** (అరణ్య కాండ, 37వ సర్గ-2)

రాజు మాటకు ప్రతి దానికీ తలలూపి తాళాలు వేసే భజన పరులు చాలామంది ఉందురు. రాజుకు హితమైన మాటలు చెప్పేవాళ్ళు అరుదు. అలా చెప్పేవాళ్ళు, వినే వాళ్ళు కూడా అరుదు.

**చేయకూడని పనులు :** బుద్ధిమంతుడు ఇతరులు నిందించే ఏపని చేయకూడదు. ప్రజలను బాధించరాదు. రాజు నాస్తికులను చేరదీయరాదు. అర్థముచేత ధర్మమును, ధర్మముచేత అర్థమును, కామాసక్తుడై అర్థధర్మములను ఉపేక్ష చేయరాదు. ప్రభువు మఱియు సాక్షి వీరు ధర్మ విధులు తప్పినచో మహా పాపాత్ములు. రాజులు బ్రాహ్మణులను కోపింపచేయదగదు. బ్రాహ్మణ హింస అతిపాపము, కృతాపరాధు డయినను బ్రాహ్మణులకు మరణ దండన విధించరాదు. బ్రాహ్మణుని ధనము తీసుగొనుట, తల గొఱుగుట, ఇంటి నుండి వెడల గొట్టుట చేయవచ్చును. ఎవని వలన బ్రాహ్మణుని ప్రాణము పోవునో వారికి మిక్కిలి పాపం వచ్చును. ధర్మమార్గాను వర్తియైన రాజు పరభార్యలను స్పృశించడు. ఇతర రాజుల భార్యలను విశేషించి రక్షించవలయును. తన భార్యను పర పురుష స్పర్శనుండి రక్షించుకొనునట్లు ఇతరుల భార్యలను కూడ రక్షించవలయును.

**విధులు - బాధ్యతలు :** ప్రజలను ధర్మముతో పాలించ వలయును. రాజ్యమును, రాజధానిని రక్షించవలయును. మంత్రులతోనూ మిత్రులతోనూ ఆలోచించి తన బుద్ధితో కూడ ఆలోచింప వలయును. నీతి మార్గమునందున్నవాడు మంత్రులతో ఆలోచించి శాస్త్రానుసారము నిర్ణయము చేయవలయును. ధర్మార్థ కామములను కాలానుసారము ఆచరించవలయును. అట్టి వాడు లోకములో ఆపదలు పొందడు. బుద్ధిమంతులయిన మంత్రులతో ఆలోచించి కార్యమును చేయవలయును. శాస్త్రజ్ఞానము, అర్థ శాస్త్ర జ్ఞానము తెలియని బుద్ధి హీనులతో ఆలోచించరాదు. కొందఱు మంత్రులు శత్రువులతో కలసి తమ ప్రభువునకు అపకారము కలిగించు చెడ్డపనులు అతని చేత చేయించెదరు. శత్రువుల నుండి లంచము తీసుకొని రాజుకు అపకారము చేయుదురు. అట్టి మంత్రులనువారి వ్యవహారములను బట్టి రాజు గుర్తించవలయును. ఎవరు హితులవలె కనబడి అహితము ఉపదేశించెదరో వారిని రాజు దూరముగా ఉంచవలయును. లేనిచో రాజుకు కీడు కలుగును. ప్రేమించ తగిన గుణములు లేని రాజును యుద్ధములో సైనికులు విడిచి వేయుదురు. సైన్యమునకు ఆహారము జీతము సకాలములో ఇవ్వవలయును. లేనిచో సైన్యము తిరుగుబాటు చేయును. యుద్ధములో మరణించిన సైనిక కుటుంబములకు కూడు, గుడ్డకు లోపము లేకుండా పోషించవలయును. నిద్రకు వశము కారాదు. తెల్లవారు ఝామునవే రాజకార్యములను గుఱించి ఆలోచించవలయును. ఒక్కడే ఆలోచించరాదు. చాలా మందితో ఆలోచించరాదు. రాజ రహస్యములు వెల్లడికారాదు. రాజకార్యము ముందుగా వెల్లడికారాదు. రాజుయొక్క ఆలోచన మంత్రుల ఆలోచనలు ఇతరులు ఊహలచేత, యుక్తిచేత, ముందుగా తెలిసికొనరాదు. స్వల్ప ప్రయత్నముతో అధిక ఫలము ఇచ్చు కార్యము సాధించ వలయును. ఆ కార్యము ఆలస్యములేక చేయవలయును. పెద్దలను గౌరవించవలయును. వృద్ధులను, ఉత్తమ పండితులను, బాలురను, దానము మనస్సు వాక్కులచే ప్రసన్నముగా చేసికొనవలయును. యుద్ధవీరులను సత్కరించవలయును. మేలు చేసిన వారిని పదిమందిలో సత్కరించవలయును.

**రాజోద్యోగులను నియమించుట :** రాజోద్యోగులను వారి వారి సామర్థ్యములను బట్టి ఆ యా పదవులలో నియమించవలయును. పరీక్షించి ప్రలోభములకు లొంగని వారిని ఉన్నత పదవులలో నియమించ వలయును. మూర్ఖులనుగాక సమర్థులను

చేయుదునన్న మూర్ఖవాచాలుడు. (అయోధ్యకాండ-పదవసర్గ-32,33) నిరపరాధిని చంపుట రాజధర్మము కాదు. ఇతడు రాజధర్మ భ్రష్టుడు. కుండెడు పాలలో ఒక చిన్న విషపు బొట్టు మొత్తం పాలను పాడు చేయునట్లు ఈ ఒక్క కాముకత్వమనే దుర్గుణము అతని చావునకు వచ్చినది (యౌగికార్థములో రాముని యువరాజ్య పట్టాభిషేకము కైక వరముల అర్థము వేఱు). రావణుడు పరిపాలనాదక్షుడయ్యు సీతను ఎత్తుకొని వచ్చుట అనే కార్యములో మంత్రులతో సలహా సంప్రదింపులు చేయలేదు. మారీచుడనే మంత్రి చెప్పిన మాటలు వినలేదు. స్త్రీ వ్యసన పరుడు. మంత్రుల సలహాలను పాటించలేదు. గూఢచార వ్యవస్థను ఏర్పఱచుకొనలేదు. బలాబల నిరూపణలోనూ, యుద్ధతంత్రములోనూ విఫలుడు. శత్రువును చులకనగా చూసి నశించినాడు. రామ సుగ్రీవుల స్నేహము గుఱించి గూఢచారుల ద్వారా వాలి గ్రహించలేదు. తార హితోపదేశము చెప్పినా వినక నశించినాడు. పర దారాసక్తుడై రాజ ధర్మమును పాటించలేదు. (యౌగికార్థమున వాలిని సంహరించుట వేఱు.)

**రాజు: దేవతా స్వరూపుడు** : రాజు యమ, కుబేర, ఇంద్ర, వరుణులను అతిశయించి ఉండును. ఇంద్రునిలో 4వ భాగము (1/4) కలిగి ఉండును. ఇంద్రుడు, అగ్ని, చంద్రుడు, వరుణుడు, యముడు అను ఐదుగురు దేవతల అంశము రాజులో ఉండును. కావున ఇంద్రుని వంటి భోగము, అగ్ని వంటి తేజస్సు చంద్రుని వంటి రూపము, వరుణ యములవలె దండన విధించుటలు రాజుయందు ఉన్నవి. రాజులు భూలోకమున సంచరించే దేవతలు.

**యువరాజు:-** రాజకుమారులందఱూ రాజ్యాభిషిక్తులు కారు. రాజ్య భారమును జ్యేష్ఠ పుత్రునికిగానీ గుణవంతుడైన ఇతర కుమారులకు గానీ రాజులు అప్పగింతురు.

**రాజులకు లభించు పుణ్య ఫలితము :** ప్రజలను ధర్మాను సారముగా పాలన చేయుటవలన రాజునకు మునులు చేయు పుణ్యకర్మానుష్ఠానములో నాలుగవ భాగము (1/4) లభించును. దేశ ప్రజలను అందఱినీ కన్నబిడ్డల వలె సంరక్షించుచూ, అవసరమైనచో తన ప్రాణములను పణము పెట్టి దేశమును రక్షించు రాజునకు ఇహలోకమున శాశ్వత కీర్తి లభించును. పరలోకమున బ్రహ్మలోకము పొంది, అక్కడ కూడా దేవతలచే పూజింపబడును. ప్రజల వద్ద నుంచి (1/6)

చేరదీయవలయును. ధనాశ కలవారిని, దొంగలను శత్రు పక్షపాత బుద్ధిగలవాళ్ళను, పిరికివాళ్ళను, దుర్మార్గులను రాజకార్యములందు నియమించరాదు.

**వేట :** శ్రాద్ధాదులందే, ప్రఖ్యాత శ్రాద్ధా దివసంబు లందే వేటాడవలయును. రాజులకు వేట ధర్మమయిననూ, సంభోగములో ఉన్నదానినీ, నిండుగర్భిణిని, పరుగెత్తే ఓపికలేనిదానినీ, చంపుట పాపము. వేట శునకములను పెంచి వేట సలిపిన పాపము. అతడు ప్రాణ నిరోధమను నరకములో పడును. ఇతనిని పదునైన ఆయుధములతో నలగగొట్టుదురు.

**శిష్ట రక్షణ-దుష్ట శిక్షణ :** శిష్ట రక్షణ దుష్ట శిక్షణలు రాజధర్మము. లోకాచార విరుద్ధముగా ప్రవర్తించు వానికి దండన తప్ప మఱియొక ప్రాయశ్చిత్తము లేదు. కావున అట్టి వారిని దండించవలయును.

**దండన :** కఠిన దండన విధించి ప్రజలను భయపెట్టరాదు. చిన్నతప్పునకు పెద్దశిక్ష వేయరాదు. అధికార వాంఛతో రాజు సేవకులతో భేదము కలిగించువారిని చంపివేయ వలయును. నిర్దోషిని చంపరాదు. పాపాత్ములను పాముల వలె వధించుట కర్తవ్యము. **"న పాపానాం వధే పాపం విద్యతే" (సుందర కాండ 52-11)** పాపులను వధించుట పాపము కాదు. దొంగలను చంపవలయును. బ్రాహ్మణ ధనము అపహరించిన వానిని చంపినా పాపము లేదు.

ధనిక బీద తారతమ్యములు లేక అందఱికీ సమానముగా న్యాయము జరుగునట్లు చూడవలయును. ఏ మానవుడు కామ మోహితుడై కుమార్తెనూ, సోదరినీ, తమ్ముని భార్యను పొందునో వానికి రాజు మరణ దండన విధించవలయును. కామ మోహితుని, మతి భ్రమనొందిన వానినీ, నిద్రలో ఉన్నవానినీ, మద్యము త్రావిన వానినీ, సాధు జడ భావముగలవానిని, ఆడదానిని చంపుట ధర్మముకాదు. దండింపతగని వారల దండించు పాపిని దండించవలయును. సాధువులకు బాధలు కలిగించు ఖలులను దండింపని రాజులకు ఆయువు, స్వర్గము, ధనములు పోవును. రాజు పాపులను, దొంగలను, చంపదగిన వానిని రాజు చంపకుండా వదిలినచో భ్రూణ హత్యాపాపము కలుగును. నిర్దయుడై సజాతి వారిని నిర్దోషులైన వారిని వధించుట మిక్కిలి పాపము. అట్టి పాపాత్ములను చంపకుండా ఉన్నచో ఉత్తమ క్షత్రియునకు ఆ పాపము వచ్చును. స్త్రీ పురుష నపుంసకులలో నెవ్వరేని భూత

దయ లేక స్వమాత్ర పోషకులగుచూ నిరనుక్రోశంబుగా భూతద్రోహులై వర్తించు వారిని వధించిననూ పాపము పొందరు. మంచి చెడు తెలియక సన్మార్గమున నడవని గురువులనైననూ శిక్షించవలయును. రాజులు దోషులకు తగు దండన విధించుచూ ప్రజలయందు దయ గలవారై ప్రశాంత చిత్తులై ఉందురు. పాపులు రాజుచే శిక్షింపబడినచో వారల పాపము నశించును.

**సంక్షేమ కార్యక్రమములు** (Welfare Activities)
దేశములోని చెఱువులు నీటితో నిండి ఉండునట్లు చూడవలయును. పేద రైతులకు ధాన్యపు విత్తనములు ఉచితముగా సరఫరా చేయవలయును. వర్తకులకు తక్కువ వడ్డీకి ఋణము ఇవ్వవలయును. కుంటివాళ్ళను, మూగవాళ్ళను, గుడ్డివాళ్ళను, అంగహీనులను, అనాథలను పోషించ వలయును.

**క॥ పంగుల మూకాంధుల విక**
**లాంగులను నబాంధవుల దయంబ్రోతె?**

(భారతము, సభాపర్వము, ప్రథమాశ్వాసము-45)

రాజు ధర్మపాలుడు, ప్రజారక్షకుడు, పుణ్యుడు, దుష్టశిక్షకుడు, కీర్తిమంతుడు అయి ఉండవలయును. జితేంద్రియులు కాని వారు రాజ్యభారమును మోయలేరు. ధర్మముగా పాలించిన రాజు స్వర్గలోకంబునకు వెళ్ళును. పాపులు రాజుచే దండింపబడి పాప రహితులై స్వర్గమునకు వెళ్ళుదురు. దండన వలన పాపి పాపరహితుడగును. శిక్షింపదగిన వానిని శిక్షింపని రాజు మఱియు శిక్ష అనుభవించనివాడు (దోషి) వీరిరువురూ వినాశము నొందుదురు.

**యుద్ధము :-** యుద్ధసమయమున శత్రువు ఏమరుపాటుగా ఉన్నప్పుడు శత్రువు అతని మరొక శత్రువుతో యుద్ధము చేయునపుడు, మఱియు శత్రువునకు కాలము అనుకూలించనపుడు పరాక్రమము సఫలమగును. పరాక్రమము చూపవలసిన సమయములో పరాక్రమము చూపని సౌమ్యునికి కీర్తి, యశస్సు యుద్ధములో జయము లభింపదు. పరాక్రమము చూపవలసిన సమయములో పరాక్రమము చూపక కరుణ, ఓర్పు గలవానిని చూచి ప్రజలు అసమర్థుడని తలచెదరు. శత్రువులతో సమయానుసారము సంధి, విరోధము పెట్టుకొనువాడు రాజ్యమును ఐశ్వర్యమును పొందును. శత్రువు కంటె తను దుర్బలుడుగనూ సమబలుడుగానూ

ఉన్నచో సంధి చేసుకొనవలయును. శత్రువు కంటె తను అధిక బలవంతుడైనచో (యుద్ధము) విరోధము పెట్టుకొనవచ్చును. శత్రువుల బలాబలములను గ్రహించ వలయును. ఆత్మరక్షణ కర్తవ్యము. యుద్ధములో తప్పక విజయమే లభింపదు. వీరుడు యుద్ధములో శత్రువును చంపును లేదా వానిచే చనిపోవును. యుద్ధములో మరణించిన వీరుని గూర్చి విచారింపకూడదు. శత్రురాజులను ఉపేక్షించరాదు. శత్రువుల కదలికలను గ్రహించవలయును. అనేక విషయములు సేకరించగలిగిన రాజులు శత్రువులనునశింపచేయగలరు. పలు దుర్గంబులు, మంత్రులు, చతురంగ బలములు, మంత్ర, ఔషధములు, బుద్ధి కలిగి సమయా సమయములు కాలము ఎఱిగి రాజు యుద్ధము చేయవలయును. యుద్ధమునందు శత్రువులను గెలవ వలయును. లేదా చనిపోవవలయును అన్నది బృహస్పతిమతము. ధర్మ యుద్ధమున శత్రువులను వధించిననూ పాపము లేదు. తనకంటె అధికులతో యుద్ధము చేసి గెలిచిన పౌరుషం. యుద్ధసమయమున శత్రు పక్షమునుంచి వచ్చిన వానిని విశ్వసింపరాదు. కుటిల బుద్ధిగలవారు తన మనస్సులోని భావములను అణచుకొని సమయము వచ్చినపుడు దెబ్బ తీయుదురు. దీనినే ఆపదలో ఉన్న (అన్నను) స్వజనమును విడిచి వచ్చినవాడు ఎవనిని మాత్రము విడిచిపెట్టడు? అని రామాయణమున చెప్పబడినది. యుద్ధములో జయము చెప్పలేము. కావున యుద్ధమున జయము కోరువాడు తన ప్రయత్నమున తన్నుతాను రక్షించుకొన వలయును. అగ్ని ప్రజ్వరిల్లుచుండగా ఉపేక్ష చేయరాదు. అటులనే శత్రువును ఉపేక్ష చేయక చంపవలయును. శత్రువుల దుర్గములను పాడు చేయవలయును. పరాక్రమము చూపవలసిన యుద్ధసమయములో యుద్ధమున విజయము కోరినవాడు యుద్ధ విశారదుడు. యుద్ధమునందు నానా శస్త్రముల ప్రయోగం తెలుసుకొని తప్పక ప్రయోగించవలయును. వీరుడయినవాడు శత్రువుల యుద్ధగర్జనను సహింపడు. యుద్ధసమయమున రాజు తన కొడుకులను కూడ యుద్ధమునకు పంపును.

రాజు సైన్యమును నడిపించునపుడు సైన్యమునకు నీరు, ఆహారము లభించు మార్గములోనూ, సుఖముగానూ, ప్రయాణము చేయించ వలయును. శత్రువులు ఆ నీటిని, ఆహారమును విష ప్రయోగము చేసి పాడు చేయవచ్చును. కావున జాగ్రత్తగా గమనించ వలయును. శత్రువులు రహస్య ప్రదేశములలోనూ, దుర్గమారణ్యము లలోనూ ఉన్నారేమో పరీక్షించవలయును. సైన్యము ప్రయాణించు

మార్గమును బాగు చేయించవలయును. సైన్యమునకు కుడి, ఎడమ, చివర అనగా సేన చుట్టూ రక్షణ ఉంచి రాజు సైన్యము యొక్క మధ్యలో ఉండి యుద్ధమునకు బయలుదేర వలయును. సేనాపతులు సేనకు నలువైపులా తిరుగుచూ అతి జాగరూకతతో పరిరక్షించ వలయును. మృత్యుకాలము సమీపించునపుడు యుద్ధములో అస్త్ర శస్త్రములు విఫలమగును. శత్రువు మరణముతో వైరము సమసిపోవును. తనకున్న బలము గుఱించి తెలిసిన వాళ్ళు శత్రువులు యుద్ధమునకు రమ్మనమని పిలిచినపుడు వెళ్లకుండా ఉండలేడు.

**శరణాగతి :** యుద్ధములో భయపడి పిరికి పందలా పారిపోవుచున్న వానిని, రక్షింపమని పలుకు వానిని, (శరణాగతుని) చంపరాదు. ఏమరిపాటుగా ఉన్న వానిని, చేత ఆయుధము లేనివానిని, బలము లేని దుర్బలునిని శరణు చొచ్చు వారిని కరుణతో చూచుట ఘన పుణ్యము. శరణుచొచ్చిన వారిని చంపరాదు. అంజలి ఘటించి దీనుడై శరణుచొచ్చిన శత్రువులను చంపరాదు. శరణాగతుని రక్షింపనిచో పాపము. శరణు చొచ్చినవారు తనకళ్ళముందే చనిపోయినచో శరణుఇచ్చిన వాని పుణ్యమంతా పోవును. స్వర్గప్రాప్తి ఉండదు. అపకీర్తి వచ్చును. యుద్ధరంగములో ఆయుధము ధరించి తనని చంప వచ్చిన శత్రు పక్షము వాడు వేద వేదాంత రహస్య వేది అయినను (అనగా బ్రాహ్మణుడైనను) వానిని చంపినా పాపము లేదు. రావణ సంహారము పాపము కాదు. కావున రాముడు వాల్మీకి రామాయణము ప్రకారము పాప పరిహారమునకై శివలింగ ప్రతిష్ఠాదికార్యములు చేసినట్లు ఉండదు.

**రాజు-ప్రజలు :** సామంత రాజులను, అధికారులను,గ్రామాధికారులను వేఱువేఱుగా పిలవవలయును. మంత్రులతో విడివిడిగా, సమిష్టిగా ఆలోచన చేయవలయును. రాజోద్యోగులు, ప్రజలు, రాజు అంటే పూర్తిగా భయపడరాదు. అనగా రాజు నిరంకుశుడు కాకూడదు.

రాజు పలికిన మాటలకు వంత పలికే రాజోద్యోగులు, ప్రజలు అనేక మంది ఉందురు. కాని రాజుకు హితము కలుగునది అయినా ప్రస్తుతము అప్రియము కలుగునన్న భయముతో రాజుకు ఎదురు చెప్పరు. అలా అప్రియము పలికే వాళ్ళ మాటలువినే ప్రభువులు అరుదు. అనగా తందాన తాన అనే వాళ్లను రాజు దూరముగా ఉంచ వలయును.

## దుర్మార్గపు రాజు

దుర్మార్గపు రాజు వలన సంపన్నములయిన దేశములు, ఆ దేశమునందలి ప్రజలు నశించెదరు.

**స్వభావము :** తల్లి తండ్రి, అన్నదమ్ములు, సఖులు, బంధుజనులను అయినా రాజ్యకాంక్ష చేసి రాజులు చంపుదురు. పాప స్వభావుడు, చపలుడు అయిన వానికి రాజ్యాధికారము లభింపదు. ఒకవేళ లభించినా అది నిలబడదు.

**లక్షణములు :** అధర్మాత్ముడు, ఉపకారము చేసినవానికి ఉపకారము చేయనివాడు, అసత్య ప్రతిజ్ఞ కలవాడు, కోప స్వభావము గలవాడు, జీతములు, బహుమతులు అల్పముగా రాజసేవకులకు ఇచ్చువాడు, ప్రమత్తుడు, గర్వితుడు, శఠుడు (మొండివాడు) తనని తనే గొప్పగా భావించువాడు, చెడ్డ స్వభావముతో స్వేచ్ఛగా ప్రవర్తించువాడు, పాపపు ఆలోచనలు, చెడ్డబుద్ధి గలవాడు, మంత్రులతో రాజ కార్యములు విచారింపని వాడు, దురాశపరుడు, చేయవలసిన రాజకార్యములు తగు సమయములందు స్వయముగా చేయనివాడు, గూఢచారుల ద్వారా రాజ్య విషయములను తెలుసుకొనని వాడు, ప్రజల దర్శనమునకు అందుబాటులో లేని వాడు, కామ భోగములతో మునిగి తేలుతున్న వాడు, బుద్ధిహీనుడు, చపల చిత్తుడు, తెలుసుకొనదగిన విషయములు గూఢచారుల ద్వారా తెలుసుకొనని వాడు, కోశాగారమును పరిపాలన వ్యవహారమును, గూఢచారులను తమ ఆధీనములో ఉంచుకొననివాడు, దేశమును రక్షించనివాడు, శాస్త్రజ్ఞానమును ఆచరణలో పెట్టనివాడు, ధర్మార్థ కామములను ఏది ఎప్పుడు చేయవలయునో తెలియనివాడు దుర్మార్గపు రాజు.

ఇట్టి రాజునకు కష్టము కలిగిన, ఆపద గలిగినా ప్రజలు గాని తోటి రాజులు గాని ఎవరూ సహాయపడరు. స్వజనమే అతనిని చంపి వేయును. ప్రజలు అట్టి రాజును స్మశానములో ఉన్న అగ్నివలె విడిచి వేయుదురు. దుర్మార్గపు రాజును ఏనుగులు నదిలోని బురదను పరిహరించునట్లు ప్రజలు రాజును విడిచి వేయుదురు. ఆ రాజు ఆ దేశప్రజలు ఆ రాజ్యము కూడా నశించును. రాజు విపరీతముగా ప్రవర్తించినచో మంత్రుల సలహాలను పాటించనిచో, సర్వము వ్యర్థమై పోవును. రాజు యొక్క చెడు ప్రవర్తన వలన ప్రజలు వ్యసనములు పాలగుదురు. ప్రజా

రక్షణ యందు ప్రతికూలుడు, తీక్షణ స్వభావము గలవాడు, ప్రజలకు ప్రతికూలముగా ప్రవర్తించువాడు, వినయము లేనివాడు, రాజ్యమును పాలింప చాలడు. క్రూరుడు, దుర్బుద్ధి, ఇంద్రియములను జయింపని రాజు వలన ఆ దేశ ప్రజలందఱు తప్పక నశింపగలరు. ఈ లోకములో సన్మార్గ వర్తనము, ధర్మపరులు అయిన సత్పురుషులు ఇతరులు చేసిన అపరాధముల మూలమున సపరివారముగా నశించిరి. రాజధర్మము ననుసరించక కామ భోగములకే ప్రాధాన్యమిచ్చినవాడు, ఆత్మ స్తుతి చేయువానిని, దుష్టుని, చిత్త చాంచల్యము గలవానిని అందఱినీ దండించే వానినీ, లోకం తిరస్కరించును. బలగర్వితులు వెనక ముందు చూడక పనులు చేసి రాజనీతిని గ్రహించ లేరు. దేశ కాలమును గ్రహించక చేయు పనులు చెడిపోవును. రాజు చపల చిత్తుడై చేయు కృత్యములను వారి శత్రువులు వాటిని తమకు అనుకూలముగా చేసికొందురు. శత్రువుల బలా బలములు గ్రహించక చిన్న చూపు చూసి ఆత్మ రక్షణ చేసుకొనని రాజు రాజ్యభ్రష్టుడగును. భయపడవలసిన సమయమునందు భయము చెందక చేయవలసిన పనులు చేయని రాజు శీఘ్రముగా రాజ్య భ్రష్టుడై ఆపై గడ్డి పరకతో సమానుడగును. ఎండిన కట్టెలు, మట్టిబెడ్డలు, బూడిద ఒక వేళ ఉపయోగపడినా ఉపయోగపడవచ్చు కాని స్థాన భ్రష్టులైన రాజుల వలన ప్రయోజనము లేదు. రాజ్య భ్రష్టుడైన రాజు నలిగిన పూలదండవలె, కట్టి విడిచిన వస్త్రము వలె వ్యర్థుడు. పాలకులు చాణక్యుని రాజనీతిశాస్త్రమును, పంచతంత్రమును, ఆర్థికాభివృద్ధికి, దేశాభివృద్ధికి పనికివచ్చు వ్యవసాయ వాణిజ్య రంగములకు ఉపయోగపడు గ్రంథములను చదువవలయును. గత చరిత్ర గ్రహించి లోపములను సరిదిద్దుకొని వర్తమానములో విజ్ఞతగలిగి భవిష్యత్తులోని వారికి ఆదర్శముగా ఉండవలయును.

*****

## పరిపాలన - రాజోద్యోగులు

| ఆంతరంగిక సలహాదారులు | | కార్య నిర్వహణ చేయువారు |
|---|---|---|
| పుణ్యకర్మానుష్ఠానమునకై సలహాదారులు | రాజ్యపరిపాలనలో సలహాదారులు | సేనాధిపతి, పన్నులు వసూలు చేయువారు, ఇతరులు |
| పురోహితులు | మంత్రులు | |

**పుణ్యకర్మానుష్ఠాన సలహా దారులు**

**పురోహితుడు :** ఉత్తమ కులము నందు పుట్టినవాడు, గొప్పశాస్త్ర జ్ఞానము గలవాడు, అగ్నులయందు శ్రద్ధ కలవాడు, బుద్ధిమంతుడు, కర్తవ్యములను బోధించువాడు, వినయ సంపన్నుడు, అసూయ కపటము లేని వాడు అయి ఉండవలయును.

**గురువులు :** రాజనీతి శాస్త్ర విశారదులు, యుద్ధనిపుణులు అయి ఉండవలయును.

**రాజ్యపరిపాలనలో సలహాదారులు మంత్రులు :** మంత్రులకు ఉండవలసిన **లక్షణములు :** రాజుపై ప్రేమ గలవారై ఉండవలయును. విద్యావంతులు, వేదవేదాంగములను అర్థము చేసుకున్నవారు, సర్వ శాస్త్రములు అనగా ధర్మ శాస్త్రము - అర్థ శాస్త్రము- పరిపాలన - విజ్ఞాన శాస్త్రములయిన ఖగోళ, భూగోళ, అణు, దేశ నగరాభివృద్ధి, యంత్రముల స్థాపన (factories), వ్యవసాయ రంగము, పరిశ్రమల రంగము, అణువిజ్ఞానము మొదలయిన వాటిలో ప్రావీణ్యము ఉన్నవారు, రాజనీతి కోవిదులు,శాస్త్ర వేత్తలు, మేధావంతులు, పండితులు అయి ఉండవలయును.

**కీర్తి :** సర్వ శాస్త్రములు తెలిసిన వారు. దేశ విదేశములలో కీర్తిని గడించినవారు. కీర్తివంతులు, ప్రసిద్ధి పొందినవారు, మహాత్ములు, ఉత్తమ వంశ సంజాతులు మంచి శీలము, మంచి నడవడిగలవారు. దుర్వ్యసనములయిన వ్యభిచారము, త్రాగుడు, లంచగొండితనము, జూదము మొదలయినవి లేని వారు. అకార్యము చేయుట యందు సిగ్గుపడు వారు అయి ఉండవలయును.

**గుణములు :** సావధాన చిత్తము కలవారు.అనగా తొందరపాటు తనము లేనివారు. తేజస్సు-క్షమ-యశస్సు గలవారు.గుణ గ్రహణ పారంగతులు. ఇంగిత జ్ఞానము

కలవారు.ఇతరుల మనోభావములు తెలుసుకొన కలిగినవారు. సహృదయులు. పవిత్ర హృదయము గలవారు. ఉత్సాహము గలవారు. అనగా దేశాభివృద్ధి చేయుటకు ఉత్సాహవంతులు అయి ఉండవలయును.

**ఇంద్రియములు** : నియతేంద్రియులు. జితేంద్రియులు అయి మంత్రులు ఉండ వలయును.

**రామాయణములో దశరథుని మంత్రులు :**
దశరథునికి దృష్టి, జయంతుడు, విజయుడు, సిద్ధార్థుడు, అర్థ సాధకుడు, అశోకుడు, మంత్రపాలుడు, సుమంతుడు అని మంత్రులు. అందు సుమంతుడు ఆంతరంగికుడు. వీరు గాక మఱి కొందఱు మంత్రులు ఉండెడివారు.

**ఐశ్వర్యము** : శ్రీమంతులు అయి మంచి వేషభాషలు కలవారు.

**మాట** : ఆడిన మాట తప్పని వారు. ప్రియముగా మాటలాడువారు. స్మిత భాషణ గలవారు. కోపముచే గానీ, కామముచేగానీ, ధనముచే గానీ అసత్యము పలుకని వారు.

**దేశ రక్షణ** : దేశ రక్షణకై సైన్యమును సమకూర్చుటలో తత్పరులు.

**ఆర్థికవ్యవస్థ** : పుష్కలముగా ధనాగారమును నింపెడివారు. ప్రజల నుంచి 1/6 పాలుశిస్తును వసూలు చేయుట వలన, అనవసరపు ఖర్చులు చేయనందున, ధనాగారము పుష్కలముగా నుండెడిది.

**న్యాయ వ్యవస్థ** : ధర్మ సూక్ష్మ నిపుణులు. దోషముల తారతమ్యములను గ్రహించి తగు తీవ్ర దండన విధించెడివారు. నిర్దోషి అయినచో శత్రువునుకూడా దండించరు. పుత్రుడైనను దోషి అయినచో తగిన దండనము విధించెడివారు.

**వీరత్వము** : మంచి పరాక్రమము గలవారు. వీరులు,శూరులు.

**సమర్థులు** : పరిపాలన నేర్పరులు. సంధి విగ్రహము మొదలయిన రాజ తంత్రములను తెలిసినవారు. రాజనీతిశాస్త్రము తెలిసిన వారు. సమిష్టిగా రాజ్య తంత్రమును నిర్వర్తించెడివారు. వారిలో వారికి విభేదములు లేవు. పరిపాలనా

రహస్యములను గుప్తముగా నుంచెడివారు. వ్యవహారదక్షులు. మంత్రాలోచన తెలిసిన వారు. గూఢచారుల వలన దేశ విదేశ విషయములు సర్వము గ్రహించెడివారు. ప్రజారక్షకులు. బ్రాహ్మణ క్షత్రియహితాను రక్తులు.

ఇట్టి లక్షణములు కలిగిన మంత్రులు దేశమును అభివృద్ధి కలుగచేయుదురు. ఇట్టి లక్షణములు కలిగిన వారు మంత్రులుగా ఉండవలయును.

**మంత్రాలోచన** : (Cabinet decisions) : రాజనీతిశాస్త్రము పరిశీలించి అందఱు మంత్రులూ కలిసి ఏకాభిప్రాయము వెల్లడించిన అది ఉత్తమము. మొదట ఆలోచనలు భిన్నముగా ఉన్ననూ, ఏకాభిప్రాయమును ప్రకటించుట మధ్యమము. ఎవరి అభిప్రాయములు వారివై ఏకాభిప్రాయములేని మంత్రాలోచన అధమము.

**మంత్రులయొక్క విధులు, బాధ్యతలు** : తన అభివృద్ధిని కోరు బుద్ధిమంతుడైన మంత్రి తనను రాజు ఏదైనా సలహా అడిగినపుడు చేతులు జోడించి సవినయముగా సమాధానము చెప్పవలయును. రాజులతో చెప్పుమాటలు ప్రతికూలము కానివి, మృదువైనవి, హితము, శుభకరము అయినవిగాఉండి వినయముగా చెప్పవలయును. ఎంత హితమైన వాక్యమైననూ, గౌరవభావము లేకుండా తిరస్కార భావముతో చెప్పినచో దానిని రాజు అభినందించడు. కార్యము సాధించు విషయములో గుణదోషములు, లాభనష్టములు ఉపాయములను అడిగిన చెప్పుట ఉత్తమము.
**ఉదాహరణ** : మారీచుడు. వీటిని రావణునితో చెప్పినపుడు పాటించలేదు.

**విధులు** : 1. శత్రువుల బలము, తన బలము, తెలుసుకొని తన దేశ స్థితినీ అభివృద్ధినీ నష్టమునూ ఆలోచించి రాజుకు హితముపదేశించువాడే ఉత్తముడైన మంత్రి. రాజుకు హితోపదేశము చెప్పవలయును. 2. రాజు యొక్క శాశ్వత అభివృద్ధిని కోరు బుద్ధిమంతుడైన మంత్రి రాజకార్యములో ఊహించని కష్టము కలిగినపుడు కార్యనిర్వహణ గుఱించి ఉపదేశించుట యుక్తము.

**3. బాధ్యత :-** స్వేచ్ఛగా నిరంకుశముగా, అధర్మమార్గమున ఉన్నరాజును ఉత్తమమైన మంత్రులు నిగ్రహించవలయును. 4. సర్వ కోరికలు పొందిన మంత్రులు, రాజును జుట్టుపట్టుకొని అయినా చెడ్డపనుల నుండి నిగ్రహించవలయును. 5. భయము విడిచి నిశ్చితమైన మాట చెప్పవలయును. 6. రాజుకు భయపడి, ప్రియముగా

మాటలాడే మంత్రుల వలన కార్యము చెడిపోవును. 7. ధర్మానికి, మూలము రాజే. అందువలన రాజు చెడు అలవాట్లకు లోను కాకుండా మంత్రులు చూడవలయును. అటులనే దుర్మార్గపు ఆలోచనలు గల మంత్రులు తమ రాజుతో సహా నశింతురు. మంత్రులకు ధర్మము, అర్థము, కామము, యశస్సు ప్రభువు వలననే లభించును. ఇట్టి లక్షణములు గల మంత్రులు, మంత్రాలోచన ఉన్నచో దేశము అభివృద్ధి చెందును.

**కార్యనిర్వహణ** (Executive body) : **సేనాధిపతి:** రాజభక్తి గలవాడు. సమర్థుడు ధైర్యవంతుడు, శూరుడు, బుద్ధిమంతుడు.నిజాయతీ కలవాడు. దురాశలేక ఉన్నంతలో తృప్తి గలవాడు. సేనాపతిగా ఉండవలయును. రాముని సైన్యాధిపతి నీలుడు. రావణుని సేనాధిపతి ప్రహస్తుడు. ధర్మరాజు సైన్యాధిపతి దృష్టద్యుమ్నుడు. దుర్యోధనుని సేనాధిపతులు భీష్ముడు, ద్రోణుడు, శల్యుడు. వీరలకు పాండవులన్న ప్రేమ. కర్ణుడు ఉత్తమ కుల సంజాతుడుగా గుర్తింపబడలేదు. కావున దుర్యోధనుడు ఓడిపోయినాడు.

**సైన్యము** : బలవంతులు యుద్ధనేర్పరులు అయి ఉండవలయును. అందఱూ ఐక్యమత్యముగా ఉండి తమ ప్రాణములను విడుచుటకు కూడా సిద్ధపడి ఉండవలయును. తన దేశమందలి ఆటకుల సైన్యము, జీతమునకై తాత్కాలికముగా పనిచేయు సైన్యము (short commissioned soldiers/officers) మిత్ర సైన్యములు, తనసైన్యము, రాజుయొక్క సైన్యముగా పరిగణింపబడును. శత్రువుల సైన్యమును పరిగ్రహించరాదు. శత్రుసైన్యమునుంచి వచ్చినవారు మిత్రుని వలె ఉండి అవకాశము దొరకగానే చంపివేయుదురు. విశేష ధర్మముగా మఱికొన్నింటిని పరిశీలనకు తీసుకొని విభీషణుని రాముడు తన సైన్యము లోనికి తీసుకొనినాడు. అటులనే ధర్మరాజు ధృతరాష్ట్రునికి వైశ్యస్త్రీకి పుట్టిన యుయుత్సుడుని తన సైన్యములో కలుపుకొనెను.

**పన్నులు వసూలు చేయువారు** (Revenue officers) : నిష్కల్మష చిత్తము గలవారు, నీతిమంతులు, నైపుణ్యము గలవారు, సమబుద్ధిగలవారు, రాగద్వేష రహితులు అయి ఉండవలయును.

**వైద్యులు** (Doctors) : సమర్థులై లోకానికి మేలు చేయు బుద్ధిగలవారై ఉండవలయును.

**జ్యోతిష్యులు** : దేవతా సంబంధ, భూసంబంధములయిన ఉత్పాతాలను కనిపెట్టి శాంతి ప్రక్రియను చేయువారై ఉండవలయును. అనగా ఫలాన దినమున తుఫాను, భూకంపము మొదలయినవి వచ్చే సూచనలు ఉన్నవి అని చెప్పి తీసుకోవలసిన తగుజాగ్రత్తలు చెప్పి ప్రజలను సురక్షిత ప్రదేశమునకు తరలించి వారికి ఆహార, వసతి విషయములలో తగు శ్రద్ధ వహించువారై ఉండవలయును.

**భృత్యుడు** (All government servants) : భృత్యువర్గము చేయు అపరాధము స్వామిది. భృత్యులు చేయు అకృత్యములకు ప్రభుత్వముది బాధ్యత. రాజు భృత్యునకు చేయుటకు చాలా కష్టమైన పని చెప్పినపుడు ఆ పనిని అనురాగముతో చేయు భృత్యుడు శ్రేష్ఠుడు. బుద్ధిమంతుడు సమర్థుడు అయిన భృత్యుడు రాజుకు ప్రియమైన కార్యమును మిక్కిలి అనురాగముతో చేయక మొక్కుబడిగా చేయునో వాడు మధ్యముడు. బుద్ధిమంతుడు సమర్థుడు అయిన భృత్యుడు కార్యమును సక్రమముగా నెఱవేర్పనిచో అతడు అధముడు. భృత్యుని కాచుట మహాధర్మము. సేవకుని పోషించకపోవుట పాపము. (జీతము సరిగా ఇవ్వక పోవుట పాపము). చిన్నపనిమీద పెద్దవారిని పంపరాదు. సామాన్యులను పంపవలయును.

**గూఢచారులు** : (SPY.intelligent department) : రాజులు దూరముగా ఉన్న విషయములను గూఢచారుల ద్వారా గ్రహించవలయును. అలా తెలుసుకున్న రాజులు దీర్ఘ దృష్టి గలవారని చెప్పబడుదురు. బుద్ధిమంతులు అయిన రాజులు గూఢచారుల ద్వారా శత్రువును గూర్చి ముందుగా తెలుసుకున్నచో అతనికి యుద్ధములో స్వల్ప ప్రయత్నము చేతనే జయము లభించును. గూఢచారుల ద్వారా మంత్రుల ప్రవర్తన, ప్రభుత్వ ఉద్యోగుల పనితీరు మొదలగు అన్ని విషయములను తెలుసుకొనవలయును. హనుమంతుడు గూఢచారిగా రావణ సైన్యము, రావణుని యుద్ధచతురత, బలాబలములను గ్రహించెను. అతనిని రాముడు సీత జాడ తెలియుటకు గూఢచారిగా పంపినాడు. అతడు ప్రతిపక్ష భయంకర వీర సైనికునిగామారి సైనికులను సంహరించి, రావణ కొలువులో దూతగా హితోప

దేశములు చేసినాడు. ఆ విధముగా హనుమంతుడు వీర సైనికునిగా, గూఢచారిగా, దూతగా వివిధకార్యములు నెఱవేర్చినాడు. రావణుడు శుకసారణులను గూఢచారులుగా పంపి రాముని సైన్యము గుఱించి గ్రహించియు, యుద్ధ తంత్రమున విఫలుడయినాడు. రామ సుగ్రీవుల స్నేహమును వాలి గూఢచారుల ద్వారా గ్రహించలేదు కావున నశించి పోయినాడు.

**దూత :** (Ambassador) లక్షణములు :- స్వదేశమున పుట్టినవాడు, విషయ పరిజ్ఞానము కలవాడు, సమర్థుడు, సమయస్ఫూర్తి గలవాడు, చెప్పిన విషయములను ఉన్నది ఉన్నట్లుగా చెప్పగలవాడు, పండితుడు అయి ఉండవలెను. వేద వేదాంగములు అధ్యయనము చేసిన వాళ్ళు, అతిగా మాటలాడని తత్వము గలవారు, మృదు మధురవాక్కు గలవారు, తొందరలేని ఉచ్చారణ గలవారు అయి ఉండవలెను. ఇట్టి దూత గల రాజు తలపెట్టిన కార్యము సిద్ధించును. సూర్యోదయమున అంధకారము నశించునట్లు స్థిర చిత్తము లేని దూతల వలన దేశ కాలములు గుర్తించక పోవుట వలన నెఱవేఱు కార్యములు కూడ చెడిపోవును. బుద్ధిమంతు లమనుకొని అహంకారముతో దూతలు జరగవలసిన కార్యములను కూడ చెడగొట్టుదురు. ఈ కార్యమును చేయవలయునని నిశ్చయించిన తర్వాతకూడ అర్థము అనర్థము అనే ఆలోచనలో పడి బుద్ధి సరిగా ప్రకాశింపదు. చేయవలసిన కార్యము నిర్దేశింపబడగా ఆ కార్య నిర్వహణతో పాటు అదే కార్యమునకు సంబంధించిన అనేక పనులు చేయగలిగి ఉండవలయును. సీతాన్వేషణ అనే పని నిర్దేశింపబడినది. సీతాన్వేషణ పూర్తి అయినది. వెంటనే తిరిగి రాక హనుమంతుడు రాక్షస సైన్యమును సంహరించి రావణునితో మాటలాడి శత్రువును దెబ్బతీయుట అనే యుద్ధనీతిని అనుసరించి లంకాదహనము చేసి యుద్ధములో అవసరమగు రథములు, గజాశ్వశాలలను, ధనాగారమును, ముఖ్యుల భవనములను తగుల పెట్టినాడు. సైన్యమును సంహరించినాడు. ఒక కార్యము స్వల్పమయినా, నిర్విఘ్నముగా పరిసమాప్తి అగుటకు హేతువు ఒకటే ఉండదు. అనేక హేతువులుండును. ఆ హేతువులను గుర్తెఱిగిన వాడే కార్యము సాధించుటలో సమర్థుడు.

**దూతను చంపరాదు :** దూతను వధించుట రాజధర్మవిరుద్ధము. అటుల చేసినచో లోకమున జనులు రాజును నిందింతురు. దూతను చంపరాదు. దీనిని విపరీత జ్ఞానముతో ఆలోచించి, శ్రీకృష్ణుడు దూతగా రాగా అతనిని బంధింప దుర్యోధనాదులు కృషి చేసిరి. దూత మరణించినచో అతడు చేసిన సమస్త పాపములు దూతను చంపిన రాజుకు ప్రాప్తించును.

**దూతను చంపవచ్చు :** దూత తనని పంపిన రాజు యొక్క అభిప్రాయము గాక తన స్వంత అభిప్రాయములను చెప్పినచో ఆ దూతను చంపవచ్చు.

**దూతకు దండన విధించుట:** యుక్తాయుక్త విచారణ చేసి, దూతకు తగిన దండన విధించవలయును. విరూపము చేయుటయు, కొరడాలతో కొట్టుట, తలగొఱుగుట చేయవచ్చును.

**ప్రజలు - రాజు:** రాజాస్థాన నియమములను పాటించుచూ కూర్చొనవలయును. రాజుకు అనుకూలముగా ప్రవర్తించుట చేతనే రాజు వద్ద ఉండగలరు. రాజు యొక్క అనుగ్రహము సంపాదించుటకు ప్రయత్నము చేయవలయును. రాజుకు అయిష్టముగా ప్రవర్తించరాదు. రాజులను ప్రేమ పూర్వకముగా సేవించవలయును. లేనిచో రాజులు కోపింతురు. రాజులు కన్నబిడ్డలనయినా, వారు హితులు కానిచో వదిలివేయుదురు. ఇతరులు సమర్థులయినచో వారిని దగ్గరకు తీయుదురు. రాజుకు వ్యతిరేకముగా ఉన్నవాడు సుఖమును వృద్ధిని పొందజాలడు. ప్రజలు రాజులను హింసింపకూడదు. నిందించకూడదు. అప్రియము పలుకకూడదు. చులకనగా మాట్లాడరాదు. రాజుకు స్నేహము లేని వారితో గాని ఉదాసీనులతో గాని తిరగరాదు. రాజోద్యోగుల విషయమున ఎక్కువ ప్రేమ, ఎక్కువ ద్వేషము చూపకూడదు. అందుకని మధ్యేమార్గము అవలంబించవలయును. ప్రభువును ఆశ్రయించి జీవించు అనుచరులు (రాజోద్యోగులు) రాజు ఎదుట అతనికి అప్రియమైన మాటలు చెప్పరాదు. రాజుచే మరణదండన విధింపబడిన అపరాధులు జీవించరు. సజాతీయుడైన వీరుని విషయమున అసూయచేతనో శత్రు పక్షపాతము చేతనో రాజు శిక్షింపక పోవుట చేతనో, వెనుక ఎవరో ఉండి ప్రోత్సహించుట చేతనో తప్ప శాస్త్ర జ్ఞానము తెలిసిన పండితులు రాజుతో పరుషముగా మాటలాడరు. రాజుకు

చాలామంది మిత్రులుందురు. కావున వారి విషయమున విశ్వాసము పనికి రాదు. సామాన్య జనులు వారి విషయమున జాగరూకతతో ఉండవలయును. బలవంతుడు దుర్బలునితో విరోధము చేసి ఒకచోట ఉండవచ్చును. దుర్బలుడు బలవంతునితో విరోధము పెట్టుకొనరాదు. అటుల చేసినచో రక్షణ యుండదు. ఒకే కులమునకు చెందిన వాళ్ళు, ఇరుగు పొరుగు దేశములలో ఉన్నవాళ్ళు ఆపదలో ఉన్న వాళ్ళని దెబ్బతీయుదురు. శత్రువులు గుణవంతులే కావచ్చు, స్వజనము గుణరహితులే కావచ్చు, గుణములు లేకపోయినను స్వజనమే మేలు. పరులు ఎప్పటికీ పరులే. తన పక్షమును విడిచి పరుల పక్షములో చేరిన వానిని, వాని పక్షము వారు నశించిన పిమ్మట పరపక్షము వారు అతనిని చంపివేయుదురు. స్వజనమును విడిచి పరులకు భృత్యత్వము చేయు వానిని సత్పురుషులు నిందింతురు. స్వదేశములో పుట్టి పెరిగి జాతికి ద్రోహము చేయుట దేశ ద్రోహము.

**సభామర్యాద** : సభామర్యాద పాటించి కూర్చొనవలయును. సభలో ధర్మసందేహము అడిగినపుడు తెలిసియు చెప్పని వారికి అసత్యదోష ఫలితము కలుగును. ధర్మము తెలిసియు అధర్మము జరుగుతున్నపుడు సభలో తన స్వలాభము కొఱకుగాని, లోభము వలన గాని, పక్షపాత బుద్ధివలనగాని, లోలత్వము వలన గాని పలకనిచో అసత్యము పలికిన దోషము వచ్చును. ధర్మము కోసము సభకు వచ్చినపుడు ధర్మము చెప్పనిచో, కామక్రోధములు వదలి అధర్మమును అరికట్టనిచో, ఆ పాపములో ఒక పాలు సభకును, ఒకపాలు రాజునకు, తక్కినది అధర్మము చేసిన వారికి గలుగును. (ద్రౌపది సభలోనికి వచ్చి ధర్మ సందేహము అడిగినప్పటికి కౌరవ వృద్ధులు చెప్పలేదు.) సభవారి దోషముల నెఱిగి యూరకయున్న నెఱుగకయున్నా నెఱింగియైనా నిట్టట్టు పలికి ప్రాజ్ఞుడయినా పాపమును పొందును. కావున ఇట్టి సభకు పోరాదు.పాలకుల నిర్ణయములు ప్రభుత్వఉద్యోగుల వలన ప్రజలకు అందుబాటు లోనికి వచ్చును. కావున ప్రభుత్వ ఉద్యోగులు నిజాయితీ పరులు, దేశాభివృద్ధిని కాంక్షించువారు, ప్రజలతో మమేకము అయి వారి సుఖమును, అభివృద్ధిని కాంక్షించువారు అయి ఉండవలయును.

*****

## జాతి ధర్మములు (సంఘ నియమములు)

వేదకాలములో చాతుర్వర్ణ వ్యవస్థ కలదు. కుల వ్యవస్థ ఒక్క భారతదేశములోనే కలదు.

వర్ణ వ్యవస్థ గుణ వ్యవస్థగా సర్వ దేశములలో కలదు. సర్వ దేశములలోని సర్వ వర్ణముల వారు అనగా సర్వ ప్రజలు విరాట్ పురుషుని దేహసంజాతులే. కావున సత్త్వ గుణము కలవారు బ్రాహ్మణులు. రజో గుణము కలవారు క్షత్రియులు. తమో గుణము కలవారు వైశ్యులు. పై మూడు గుణముల సమ్మేళనము కలవారు శూద్రులు. ఈ జాతులను నేడు (division of Labour) గుణకర్మలుగా గుర్తించినచో విజ్ఞాన వేత్తలు, శాస్త్రజ్ఞులు, న్యాయకోవిదులు, న్యాయాధికారులు, దైవభక్తి కలవారు బ్రాహ్మణులు. దేశ అధ్యక్షుడు, పరిపాలకులు, సేనాధిపతులు ఉన్నత ఉద్యోగులు వీరు క్షత్రియులు. వ్యవసాయము వాని అనుబంధములయిన పాడి పంటలు ఆర్థిక స్వావలంబనకు పనికి వచ్చు యంత్రముల పరిశ్రమల స్థాపన చేయువారు, వ్యాపార రంగములోను, ఎగుమతులు, దిగుమతులు చేయువారు వైశ్యులు. ప్రభుత్వ ప్రైవేటు రంగములలో పనిచేయు ఉద్యోగులు, కార్మికులు, చేతివృత్తుల వారు శూద్రులు. ఈ విధముగా సర్వులు దేశ అభ్యున్నతికి అవసరము.

జాతి మాత్రంబున వర్ణంబు నిర్దేశింప పనిలేదు అని నారద మహర్షి అభిప్రాయము.

**సర్వ వర్ణముల వారు** (బాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర, సంకరజాతుల వారు పాటించవలసినవి).

1. **శౌచము పాటించవలయును** : అనగా బాహ్యశౌచమునకై స్నానము చేయ వలయును. మంచిదుస్తులు ధరించవలయును. ప్రతిజ్ఞను నిలబెట్టుకొని **శీలము,** జన్మము రక్షించకొనవలయును.

2. **వాక్కు:** మిత భాషిత్వము పాటించవలయును. సత్యమును పాటించవలయును. సత్యవాక్యమే స్వర్గలోక సౌఖ్యసాధనము. అసత్యము చెప్పరాదు. ప్రాణులకు అన్నోదకంబులు పంచి యివ్వవలయును. అనగా ఆహారము, పానీయములు ఇవ్వవలయును.

**3. గుణములు :** దయ గలిగి ఉండవలయును. సైరణ అనగా ఓర్పుగలిగి ఉండ వలయును. మార్దవము అనగా సౌమ్యముగా ఉండవలయును. పెద్దలకు శుశ్రూష చేయవలయును. మనస్సును చెడుతలంపుల నుంచి నిగ్రహించవలయును. గ్రామ్యంబులయిన కోరికలు మానవలయును.

**4. చేయరాని పనులు :** హింస చేయరాదు. వ్యభిచారము చేయరాదు. దొంగతనము చేయరాదు. అన్యాయము చేయరాదు.

**5. ధన సంపాదన :** ధర్మపరముగా ధనము సంపాదించి దొరికిన దానితో తృప్తిగలిగి పేరాశ లేకుండా ఉండవలయును.

**6. కామము :** బ్రహ్మచారి ఇంద్రియ నిగ్రహము గలిగి ఉండవలయును. గృహస్థుడు నిజ భార్య(ల)తో సంసార జీవితము గడపవలయును.

ఈ పైన చెప్పిన గుణములు కలిగియుండి మంచిపనులు చేసి, ఇహలోక పరలోక సుఖములందు విరక్తి గలిగినచో, సర్వవర్ణములవారు మోక్షమునకు అర్హులే. క్షత్రియుడైన విశ్వామిత్రుడు బ్రహ్మర్షి అయినాడు. శూద్రుడైన రోమహర్షణ పుత్రుండైన ఉగ్రశ్రవసుడన పేరనొప్పు సూతుడు శౌనకాది మునులకు ఆత్మదర్శన ప్రాప్తికై వలయు విధానముతో పాటు అనేక విషయములను చెప్పినాడు. మఱియు వేదవ్యాస ముఖ్యులయిన మునులు, సుమతులు చూచిన, ఆత్మను దర్శించినాడు. ఛాందోగ్యోపనిషత్తులో శూద్రుడైన సత్యకామ జాబాలి బ్రహ్మ విద్యను పొందినట్లు చెప్పబడినది. పైన చెప్పిన అర్హతలేని వారు పరవిద్యకు అర్హులుకారు అనే విషయమునే వ్యాసభగవానుడు మొదలయిన పెద్దలు చెప్పినారు. వైరాగ్య సంపన్నుల యినవారు మోక్షార్థులు చేయవలసిన పనులు ఈ క్రింద వివరింపబడినవి.

1. నిష్ఫలక్రియలు విడుచుట. 2. సమదర్శనత్వము 3. సదసద్వివేకము. 4. ఉపవాసాది తపము. 5. పాత్రులకు దానము. 6. ప్రాణులందు ఆత్మబుద్ధి 7. సత్త్వగుణ సంపన్నులై ఈశ్వరుని స్మరణ, కీర్తన, సేవ, అర్చన, నమస్కారము, దాస్య, ఆత్మ సమర్పణ, సఖ్యములుగా చెప్పబడే భక్తిలక్షణములను పాటించవలయును. 8. అన్నింటికన్నా ముఖ్యమైనది దేహంబుగాని తన్ను వెదకికొనుట అనగా

ఆత్మప్రాప్తికై వలయు సాధన చేయవలయును. నిజవంశాను గత విహిత ధర్మంబున వర్తించు నరుండు మెల్లన స్వాభావిక కర్మ పరత్వము విడిచి ముక్తినొందు.

గత జన్మకర్మ వాసనల వలన బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర జాతులలో జన్మించెదరు. అందువలన ఈజన్మలో వారు చేయవలసిన పనులు నిర్ణయింప బడినవి. వర్ణములు గుణ, కర్మవిభాగముననుసరించి ఏర్పడినవి.

**బ్రాహ్మణ క్షత్రియ విశాం శూద్రాణాం చ పరంతప**
**కర్మాణి ప్రవిభక్తాని స్వభావ ప్రభవై ర్గుణైః**

(భగవద్గీత, మోక్ష సన్న్యాస యోగము -41)

**బ్రాహ్మణులు**

సదాచారమును పాటించవలయును. కావున సత్కులాచారుండు ద్విజుడు.

| బ్రాహ్మణులు | | | |
|---|---|---|---|
| మోక్షార్థులు నివృత్తి కర్మావలంబులు | బ్రహ్మలోక ప్రాప్తి పొంది తిరిగి జన్మించెడి వారు ప్రవృత్తి కర్మావలంబులు | వేద వేదాంగములు చదివియు డాంబిక వేషధారులై అగ్రహారము, బంగారం, కంకణములు, ధన కనక వస్తువులందు ఆపేక్ష గలవారు వీరి విద్య జీవనోపాధికి పనికి వచ్చును. | బ్రాహ్మణ కులములో పుట్టి బ్రాహ్మణత్వము లేనివాడు. **ఛండాలుడు** ఉదా:- భారతము అనుశాసనిక పర్వము లోని ఇంద్ర మతంగ సంవాదంబను కథ. |
| **వేదజ్ఞులు** | **పండిత మన్యులు** | **మేథావిహీనులు** | |

వేదము నివృత్తి కర్మా వలంబులయిన బ్రాహ్మణులను ప్రశంసించినది. వీరిని పండితులని చెప్పినది . వీరు వేదజ్ఞులు. ఆత్మ దర్శనము చేసినవారు. కుక్కయందు, కుక్కమాంసము తినువానియందు, గోవునందు, బ్రాహ్మణునియందు గల ఆత్మను దర్శించిన సమదర్శనము గలవారు. బ్రహ్మలోక ప్రాప్తి పొంది తిరిగి జననమరణ వలయములో చిక్కుకొననివారు సద్బ్రాహ్మణులు. మొదటి తరగతి వారు అందఱూ ఋషులే. వీరి మనస్సు అప్పుడే తీసిన వెన్న వంటిది. నిండు మనంబు నవ్య నవనీత సమానము అని చెప్పబడును. ప్రవృత్తి కర్మావలంబులయిన రెండవ తరగతి బ్రాహ్మణులను వేదము నిరసించినది. వీరు బ్రహ్మలోక ప్రాప్తి పొంది పుణ్యము క్షీణించగా తిరిగి భూలోకమున జన్మించెదరు. అంతటి అత్యున్నత స్థానము పొంది తిరిగి పతనమయిరి. వీరి పతనావస్థ చూచి వేదము చలించి వీరిని నిరసించినది. ఇక మూడవ తరగతి బ్రాహ్మణులు వీరికి పరలోకము గుఱించి గాక ఇహలోక సుఖములందే ఆపేక్ష. వీరి వేద పఠనము, యజ్ఞ యాగాదులు, కవిత్వము ఇహలోక సుఖములైన అగ్రహారములు, ధనకనకవస్తు వాహనములు, రాజును యాచించి బ్రతుకుటకు పనికి వచ్చును. వీరిని మేధావిహీనులనిరి. ఈ రెండవ మూడవ తరగతి బ్రాహ్మణులనుద్దేశించి భాగవతమున చతుర్థస్కంథములో నందీశ్వరుడు దక్షునికి, బ్రాహ్మణులకు యిచ్చిన శాపంగా కథాపరంగా వర్ణింపబడినది. అర్థవాద బహుళంబు లయిన వేద వాక్యంబుల వలన మధుగంధ సమంబైన చిత్తక్షోభంబు చేత విమోహిత మనస్కులయి నష్టమనీషంగలిగి కర్మతంత్రంబు విస్తృతంబు చేయుదురు. ఈ మూఢుండు తత్త్వవిముఖుండగు. భగవంతుని యందు భేద దర్శి యగు. మర్త్యశరీరము శ్రేష్ఠముగా తలచి దేహాది పోషణంబు కొఱకు, ధరియింపబడిన విద్యా, తపో, వ్రతంబులు గలవారలై ధన, దేహ, ఇంద్రియములందు ప్రీతి చెంది యాచకులై విహరింతురు. దేహాధికంబులు పాదేయంబులుగా తలంచుచూ బుద్ధిచేత ఆత్మతత్త్వము మఱచి వర్తించుచూ పశుప్రాయుడై స్త్రీ కాముండగు. కూటధర్మంబులయిన నివాసంబుల గ్రామ్యసుఖ కాంక్షలచేసి వర్తించును.

...............................................................“నీదక్షుని
న్ననువర్తించినవారు సంసరణకర్మారంభులై నిచ్చలున్
జననం బందుచుఁ జచ్చుచున్ మరల నోజం బుట్టుచున్ వర్తిలున్. ”
(భాగవతము చతుర్థస్కంధము 48)

ఈ మార్గమును అనుసరించువారు మోక్షమును పొందలేరు. మూడవతరతి బ్రాహ్మణులే మనకు ఎక్కువగా కనిపించెదరు. వీరి వేషభాషలలో డాంబికము,ఆడంబరత్వము, అహంకారము అజ్ఞానము ఉండును. ఈ లక్షణములను బట్టి వీరిని గుర్తించవచ్చు. వీరు రాజులను ధనవంతులను, ప్రజలను ఆశ్రయించి కవులుగా, పండితులుగా, పురోహితులుగా బ్రతుకుదురు. వీరి మాట చాలా కటువుగా ఉండును. మృదుత్వముండదు. **“పల్కు దారుణా ఖండల శస్త్రతుల్యము. జగన్నుత విప్రులయందు.”** (భారతము, ఆది పర్వము, ప్రథమా శ్వాసము, 100) అని చెప్పబడినది.

**నాలుగవ తరగతి బ్రాహ్మణుడు :** బ్రాహ్మణుడు పాప వర్తనుడయిన శూద్రునికంటె నీచుడు. ఇతడు చండాలుడు.

**బ్రాహ్మణులకు ఉండవలసిన లక్షణములు :**

**శౌచము** - శౌచమును పాటింప వలయును. అనగా స్నానము చేసి శరీర శుభ్రత పాటించవలయును.

**వాక్కు** - మార్దవము అనగా మృదు మధురముగా సంభాషణ ఉండవలయును. సత్యము చెప్పవలయును.

**గుణము** - బాహ్యేంద్రియ నిగ్రహము గలిగి ఉండవలయును. ఇది శమముగా చెప్పబడును. అంతరేంద్రియ నిగ్రహము గలిగి ఉండవలయును. ఇది దమముగా చెప్పబడును. కృప, దయ, అనుగ్రహము, నిత్యసంతోషము, తృప్తి, క్షమ,తితీక్ష, తాలిమి, జ్ఞానము, సదసద్వివేకము, గలిగిఉండవలయును. తపస్వాధ్యాయములు గలిగి ఉండవలయును. సంతోషి గాని విప్రుని విద్యా, తపో, విభవంబులు, యశంబులు నిరర్థకంబులు.

**బాధ్యత :** బ్రాహ్మణుడు దీనులగని ఉపేక్షించిన అతని తపస్సు భిన్న భాండగత క్షీరమువలె వ్యర్థము.

**ఇహపరసాధన వృత్తులు :**

**అధ్యయనము :-** వేద వేదాంగములు చదివి అర్థము గ్రహించి, ఆచరించ వలయును. "శమశ్చ స్వాధ్యాయ ప్రవచనేచ. దమశ్చస్వాధ్యాయ ప్రవచనేచ" (తైత్తిరీయ ఉపనిషత్) అనగా వేదములు జీవితాంతము చదవవలయును.

**అధ్యాపనము :** వేదవేదాంగములు శిష్యులకు బోధించవలయును ఇదే ధర్మప్రచారము. దీనివలన యశస్సు గలుగును. ధర్మపరంగా తను ఆచరించి ధర్మోపదేశములు చేయుట, బ్రాహ్మణుని విధి.

**యజన -** వేద విధిననుసరించి యజ్ఞములు చేయవలయును.
**యాజన -** అర్హులచే యజ్ఞములు చేయించవలయును.

అర్థసముపార్జన - వినియోగం

**దానము తీసుకొనుట** (ప్రతిగ్రహంబు). ఇదియే భిక్షాటన. యోగ్యులయిన వారి వద్దనుంచి జీవనోపాధికి అవసరమైనంత మాత్రమే గ్రహించవచ్చును. స్వతంత్రు లయిన బ్రాహ్మణులు ఇతరులను యాచించి ధన, కనక, వస్తు, వాహనాదులు, అగ్రహారములు పొందరు. ఈ విషయమునే కథా పరంగా శృంగి పరీక్షిత్తునకు శాపం యిచ్చు సందర్భముగా చెప్పబడినది.

**ఉ॥ పోము హిరణ్యదానములఁ బుచ్చుకొనంగ, ధనంబు లేమియుం**
**దేము సవంచనంబులుగ దీవన లిచ్చుచు వేసరింపఁగా**
**రాము వనంబులన్ గృహవిరాములమైనివసింపఁ ........................**

(భాగవతం - ప్రథమస్కంధం- 468)

**దానము యిచ్చుట** తను పొందిన దానిలో నుంచి స్వార్థమునకై సంపూర్ణముగా వినియోగించక, పాత్రాపాత్రత గుర్తెఱిగి అర్హులయిన వారికి అతిథి సత్కారము చేయవలయును. దానము యివ్వవలయును.

**ప్రజలకు బ్రాహ్మణుల యందు గల బాధ్యత :** విప్రులగని యవమానింపదగదు ఘన పుణ్యులకున్. బ్రాహ్మణుడు సంతోషించినచో సామాన్యుడైనను ఇంద్రునివలె భోగభాగ్యములు పొందును.

**చేయకూడని పనులు :** బ్రాహ్మణులకు నీచసేవనంబు కర్తవ్యంబు కాదు. అనగా జీవనోపాధికై పరుల వద్ద జీతమునకై కొలువు చేయరాదు. మద్యపానము చేసిన బ్రాహ్మణుని ప్రజలు నిందించెదరు.

## క్షత్రియులు

సర్వదేవమయియుండు క్షత్రియుడు. (బ్రాహ్మణునకు ఉండవలసిన శౌచము, వాక్కులకు చెప్పబడినవి ఇక్కడ అను సంధానము చేసుకొనవలయును).

**లక్షణములు (గుణములు) :-** ధైర్యము, శౌర్యము, తేజస్సు, సద్వీర్యము, శీలము, పరిపాలనా దక్షత, బుధాచారము, ఇంద్రియజయము (శమము, దమములుగలిగి ఉండుట), పరితోషణము (సంతోషము) ధర్మపరత్వము, ధర్మపరిరక్షణ.

**అధ్యయన**-వేదవేదాంగములు చదువుట.
**అధ్యాపన** - వేదవేదాంగములు బోధించుట.
**యజన** - యజ్ఞయాగాది క్రియలు చేయుట. ఉదా:- దశరథుడు అశ్వమేధ యాగమును చేసినాడు. రాముడు అరణ్యవాసకాలమున చిత్రకూటము పై నిర్మింపబడిన పర్ణశాల గృహప్రవేశమునకు వలయు విధివిధానమును తనే స్వయంగా చేసినాడు. జటాయువు మరణించినపుడు దహన సంస్కార, పిండ ప్రదాన విధులు తనే చేసినాడు.

**యాజన :-** యజ్ఞములు ఇతరుల కొఱకు చేయించుట. ఉదా:- విశ్వామిత్రుడు ప్రధాన ఋత్విక్కుగా సూర్యవంశ చక్రవర్తియైన త్రిశంకునిచే (సశరీర స్వర్గ ప్రాప్తికై) యజ్ఞము చేయించినాడు.

**దానము :** పాత్రులకు దానము యివ్వవలయును.

**అర్థసంపాదన :** రాజులవద్ద క్షత్రియ వృత్తిచేపట్టి, సేనాధిపతిగా, సైనికునిగా జీవనభృతి పొందవచ్చును.

ఉదా :- భీష్ముడు దుర్యోధనుని కొలువులో కౌరవసేనాధిపతి.

**ఆపత్కాలమున వృత్తులు:-**

**ఋతము:** - పొలములో పడిన ఎన్నులు ఏరుకొని జీవించవచ్చును.

**మృతము (భిక్షాటన) :-** బ్రాహ్మణులయింట భిక్షాటన చేయవచ్చును. ధర్మరాజాదులు ఏక చక్ర పురమున భిక్షాటన చేసిరి.

**అమృతము :-** ప్రాప్తానుసారము లభించిన వాటితో జీవితము గడపవచ్చును. తేనె, పండ్లు, వేటతో జీవనము సాగించవచ్చును. ఉదా: (అరణ్యావాసమున రాముని ఆచరణ)

**ప్రమృతము :** - వ్యవసాయము.

**సేవ :-** నీచ సేవ తప్పు. బ్రాహ్మణ క్షత్రియులను సేవించి బ్రతకవచ్చును.

ఉదా: నలుడు ఋతుపర్ణునివద్ద వంటలవాడుగా ఉండెను. పాండవులు విరాట రాజు వద్ద కంకుభట్టుగా, వంటల వాడిగా, నాట్యము నేర్పువానిగా, అశ్వశాలయందు, పశువుల శాలయందు పని చేసిరి.

క్షత్రియులలో ఆ రాజు యొక్క ప్రథమ సంతానము గాని, యోగ్యుడు గాని రాజు అగును.

**రాజులు - ప్రజారక్షణ :-** రాజులు ప్రజలను కన్నబిడ్డలవలె చూచుకొని చక్కని పాలన చేయవలయును. రాజులు దుష్టశిక్షణకు మూలస్తంభములు. ధర్మపరిరక్షకులు.

**చేయకూడని పనులు** : క్షత్రియులకు నీచసేవనంబు కర్తవ్యంబు కాదు. దానము పుచ్చుకొనరాదు. (కాని క్షత్రియ స్త్రీ ఆపత్కాలములో రెండుసార్లు దానము స్వీకరించవచ్చుననేది ఉండి ఉండవచ్చును. అందువలన ద్రౌపది ధృతరాష్ట్రునిచే దానము పొంది తన భర్తలను, ఆయుధములను విడిపించినది.

## వైశ్యులు

సర్వ వర్ణముల వారికి చెప్పబడినవి ఇక్కడ అనుసంధానము చేసుకొనవలయును. అధ్యయన అధ్యాపన,యజన, యాజనలు చెప్పబడలేదు. **కృషి, గోరక్షణలు** చెప్పబడినవి.

**లక్షణములు :** ఎంత ధనం సంపాదించినా తృప్తిలేక పోవుట, ధనసంపాదనలో మెలుకువ, నిపుణత, బ్రాహ్మణకులమును అనుసరించి ఉండుట, ధర్మ, అర్థ కామ వాంఛలు కలిగిఉండుట. (ధర్మము గుఱించి గ్రహించినా ఆచరణలో అర్థకామ ములకే ప్రాముఖ్యము ఇచ్చెదరు).

**పుణ్యకర్మానుష్ఠానం : చేయవలసిన పనులు :** గురు, దేవ, విప్ర అర్చనలు చేయ వలయును. అనగా గురువులను విప్రులను దేవతలను అర్చించవలయును.

దానము - పాత్రులకు మాత్రమే దానము యివ్వవచ్చును. పాత్రులు ఎవరు అపాత్రులు ఎవరు అను విషయము పుణ్యకర్మానుష్ఠానంలో వివరించబడును.

**అర్థసంపాదన :** వాణిజ్యము (వ్యాపారము) ఈ వాణిజ్యము సత్యము అసత్యములతో మిశ్రమముగా ఉండును. కృషి(వ్యవసాయము)పంటలు, గోరక్షణ(పశువుల పెంపకం)పాడి. ధనసంపాదనకు సంబంధించినవి యంత్రాగారముల స్థాపన నిర్వహణ Economic activity కి ముఖ్యులు వీరు. దేశఆర్థిక స్థితిగతులకు మూలస్తంభములు వైశ్యులు.

**శూద్రులు :** (service sector, all government employees)

సర్వ వర్ణములవారికి చెప్పబడినవి ఇక్కడ అనుసంధానము చేయవలయును. ప్రత్యేక లక్షణములు చెప్పబడలేదు.

**చేయవలసిన పనులు :** యజమానులను మాయలేక అనగా నిజాయితీగా తన శక్తి కొలదిసేవించవలయును. పెద్దలను గౌరవించవలయును. బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యులను సేవించవలయునని భృత్యుడు చేయవలసిన పనులుగా వివరింపబడినవి.

ఉదా: నారదుడు పూర్వ జన్మలో శూద్రజాతియందు పుట్టి గురువులను సేవించి, అరిషట్ వర్గములను జయించి, వైరాగ్య విజ్ఞానయుతుడై బ్రహ్మమును దర్శించి దేహత్యాగానంతరము బ్రహ్మ మానస పుత్రుడుగా ఆవిర్భవించి విజ్ఞానమును బోధించుచున్నారు.

**చేయకూడనివి** (తపస్సుచేయుటకు సమయముండదు)కావున తపస్సు చేయరాదు. ఉపవాసమున్న శరీరము దుర్బలమగును అలా వృత్తికి అవరోధము కావున ఉపవాసముండరాదు.

**సంకర జాతులు**

వీరు కులానుగతంబులైన చౌర్య (దొంగతనం) హింస (దోపిడి) మొదలయిన వృత్తులను వర్జింప వలయును.

**సర్వులు**

కులధర్మములను పాటించవలయును. కులధర్మములను పాటించకపోవుట పాపము. తమ స్వభావ కర్మలందు నిరతుడైనవాడు పరమసిద్ధిని పొందును. స్వధర్మాచరణ శ్రేయస్సును గలిగించును. ఇతర జాతి ధర్మములు గొప్పవైనను అవి ఆచరింపరాదు. తన జాతి ధర్మము దోషయుతమైనను త్యజింపరాదు. అనగా క్షత్రియులు యుద్ధము చేయకుండా ఉండరాదు.

**శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మాత్ స్వనుష్ఠితాత్**
**స్వభావ నియతం కర్మ కుర్వన్నాప్నోతి కిల్బిషమ్**

(మోక్ష సన్న్యాస యోగము-47)

చక్కగా అనుష్ఠింపబడిన పరధర్మము కంటె, స్వభావముచేత నియమింప బడిన తన కుల ధర్మములు పాటించుట శ్రేయము. ఆ కుల ధర్మములలో విశేషగుణములు లేకున్ననూ వాటిని పాటించుట వలన పాపమును పొందడు.

**కులము :** ఒకని కారణమున కులమునకు అపకారము జరుగునప్పుడు ఆ ఒక్కరిని విడిచి పెట్టి కులమును రక్షించుకొనుట ధర్మము. కుల దోషులను దూషించి కులమును రక్షించుట ధర్మము. ఒకడు కాలపాశమునకు వశుడై పాపము చేయగా అతడుచేసిన దాని వలన కులము నశించును. కుల నాశనము వలన సనాతనములగు కుల ధర్మములు నశించును. కులనాశనము వలన స్త్రీలు, పురుషులు వర్ణ సంకరులగుదురు. తద్వారా కుల నాశనము చేసిన వానికి నరకప్రాప్తి కలుగును. కులనాశనము పాపము. వంశనాశనము పాపము.

*****

## ఆశ్రమ ధర్మములు (సంఘ నియమములు)

**సర్వ ఆశ్రమ ధర్మములు :**
సర్వ ఆశ్రమ ధర్మములలో నివాసము, శౌచం, ఆహారపానీయములు, వాక్కు, శయనం, రూపము, వస్త్రధారణ, ప్రవర్తన (గుణములు), ఇంద్రియ జయము, గురుసేవ, విద్యాభ్యాసం, శాస్త్ర పరిచయం మొదలగునవి చెప్పబడును. వీటితో పాటు విశేష ధర్మములు చెప్పబడును.

**సంభాషణ :-** భోజన, సహవాసములు నీచులతో చేయరాదు.
ఇంద్రియ జయము, మనోవాక్కాయ సంయమనము, ఋజు ప్రవర్తన, సర్వభూత సమత్వము కలిగి గురుసేవ, పుణ్యకర్మానుష్ఠానం, తీర్థయాత్రాదులు చేయ వలయును. సత్యము పలుకవలయును.

**సత్య మేక పదం బ్రహ్మ సత్యే ధర్మః ప్రతిష్ఠితః**
**సత్యమేవాక్షయా వేదాః సత్యేనైవాప్యతే పరమ్.**

(అయోధ్యా కాండ 14వ సర్గ -7)

సత్యమే బ్రహ్మపదం. సత్యమునందే ధర్మము ప్రతిష్ఠితమైయున్నది. వేదములు సత్యము. సత్యము ద్వారానే పరమ పదము చేరగలము.

### బ్రహ్మచర్యాశ్రమము

**నివాసము:-** గురుమందిరమునకుం చని, గురు కులాశ్రమములో ఉండవలయును. **శౌచం:** స్నానము చేయవలయును. గురుభార్య, పరాంగనల వలన అభ్యంగన, కేశప్రసాదన, శరీరమార్దన, మజ్జన రహస్య యోగములు వర్జించి ఉండవలయును. **ఆహార పానీయంబులు:-** ప్రతిదినము రేపు మాపును విహిత గృహంబుల భిక్షాటన చేసి భిక్షను గురువునకు నివేదించి అనుజ్ఞగొని మితభోజనము చేయవలయును. విహిత కాలమున ఉపవసించుచూ ఉండవలయును. మాంస భక్షణ, సురాపానము చేయరాదు. **వాక్కు :** అంగనలందు, అంగనాసక్తులందు ప్రయోజనమాత్ర భాషణంబు లొనర్చుచూ, సత్యభాషణ, మౌనము కలిగి ఉండవలయును. **శయనం:** చెప్పబడలేదు. కాని భూతల శయనముగా భావించవలయును. **రూపము:** కౌపీనము-

కృష్ణాజినము, యజ్ఞోపవీతము, మౌంజి, పాలాశదండము, కమండలము కలిగి , దర్భహస్తుడై అక్షమాల (జపమాల) కలిగి సంస్కారహీన శిరోరుహుండుగా ఉండవలయును. **ప్రవర్తన:** జితేంద్రియత్వము, శీలముగలిగి ఉండవలయును. దాసునిచందంబున భక్తి, వినయ, సౌమనస్యంబులు గలిగి అధ్యయనోప క్రమావసానంబుల గురుచరణంబులకు నమస్కరించుచూ గురుసేవ గలిగి ఉండ వలయును. త్రిసంధ్యలయందు గాయత్రి ఉపాసన, అగ్నిహోత్రం, దేవతోపాసనంబులు చేయుచూ ఉండవలయును. **విద్య :** వేదవేదాంగములు, సర్వశాస్త్రములు అభ్యసించ వలయును.

**చేయకూడని పనులు :** వడుగు కింతి పొత్తు వలదు వలదు అనగా స్త్రీలతో పరిచయం పెట్టుకొనరాదు. బ్రహ్మచర్య త్యాగము నింద్యము. బ్రహ్మచర్యము నుండి సన్న్యాసము స్వీకరింపరాదు. అటుల చేసిన ఇహపర లోకంబులలో గల సుఖమునకు హాని గలుగును. నారదుడు దక్షుని పుత్రులను బ్రహ్మచర్యాశ్రమములో ఉండగనే తపస్సుకు ప్రేరేపించినాడు. దానిపై దక్షుడు **"దేవర్షి పితృ ఋణంబుల దీర్పక అమీమాంసిత కర్మంబులు గల బాలురకు బుద్ధి జెఱిచి** వారలకు నుభయలోకంబుల శ్రేయో హానినొనర్చితివి అని పలికెను. (భాగవతము, షష్ఠమ స్కంధము, 252) అనగా బ్రహ్మచర్యాశ్రమమునుండి సన్న్యాసాశ్రమ స్వీకరణ వేద కాలమున నిషిద్ధము. పరిపూర్ణ వైరాగ్యవంతులై లోక వ్యవహారము లందు ఆపేక్ష లేని జితేంద్రియులు మాత్రమే బ్రహ్మచర్యాశ్రమము నుండి మోక్షమునకు ప్రయత్నించ వచ్చును. వీరు ఆత్మ దర్శనము చేసి ఆత్మదర్శన విధానమును ఇతరులకు బోధించవచ్చును. ఉదా: సనకసనందనాదులు, నారదుడు, శుకబ్రహ్మ.

## గృహస్థాశ్రమము

**ఇది భగవంతుని ఊరువులు :** వేదోక్త విధి ఆచరించు గృహస్థుండు ముక్తి పొందును. గృహస్థుడు గృహస్థాశ్రమ కర్మంబులు ఆచరింపుచూ కర్మ ఫలితమును భగవంతునికి సమర్పించవలయును. గృహస్థాశ్రమ వాసులు రెండు రకములు: ఒకరు సంసార తాపత్రయములలో చిక్కుకొని పట్టు పురుగు చందంబున బందీఅయి, శ్రౌత స్మార్త కర్మంబులు చేయుచూ సంసారమును గుఱించి గ్రహించక, నేను నాది అనే అహంకార మమకారములు కలిగి సుఖ దుఃఖములకు

విచలితులగుచు జన్మ రాహిత్యము గుఱించి తెలుసుకొనక చచ్చి నరకమున బడి తిరిగి జన్మించుచు జనన మరణ వలయములలో తిరుగాడు వారు. వీరిని సంసారుల అని అందురు. మఱియొకరు ఋషులు, మహాత్ములు, పండితులు,జ్ఞానులు. వీరు సంసారములో తామరాకు పై నీటిబొట్టు వలె ఉండి సంసార వృక్ష స్వరూప స్వభావములను గ్రహించి, జన్మ రాహిత్యమునకై ప్రయత్నము చేసి ఆత్మస్థానము (బ్రహ్మలోకము) చేరు వారు. వీరిని విద్వాంసులు అని అందురు. **భార్య యొుక్క గొప్పతనము (ప్రశంస):** పురుషులకు (మగవారికి) అంగన వలన (భార్యవలన) ధర్మార్థ కామంబులు సిద్ధించు. భార్య యందు సకల గృహ కార్యభారంబు చేర్చి పురుషుడు నిశ్చితుండై సుఖియించు చుండును. ఇతరాశ్రమ దుర్జయంబులైన యింద్రియ శత్రు వర్గంబుల, దుర్గాధిపతి యైన రాజు శత్రు సంఘంబుల జయించు చందంబున, గృహస్థుడు లీలా మాత్రంబున జయించు. ఇట్టి కళత్రంబునకు ప్రత్యుపకారము చేయ సకలగుణాభిరాములగు సత్పురుషులు నూఱేండ్లకును జన్మాంతరంబులనైన సమర్థులు కారు.

**గృహస్థాశ్రమ ప్రశంస :** గృహస్థాశ్రమమునందు ధర్మార్థ కామ మోక్ష ప్రజానందం బును, యశంబును అతి వేద్యంబులు గాని రజస్తమో విహీన పుణ్యాలోకంబులు గలుగును. తనకును పితృ, దేవర్షి, మర్త్య,భూత గణంబులకు ఈ లోకమున గృహస్థాశ్రమము సర్వ క్షేమార్థంబయిన ఆశ్రమము. కర్ణ ధారుండు (నావ నడిపే వాడు) నావ చేత సముద్రము గడుచు చందంబున గృహస్థుడు సకల ఆశ్రమ వాసుల నరసి రక్షింపుచు నిజాశ్రమమున వ్యసనార్ణవంబు దరియింపచేయును.

**గృహస్థులు చేయ వలసిన పనులు :**

**ఉదయము పూట:** దేవతలను, మధ్యాహ్నం లోపు అతిథి అభ్యాగతులను, అపరాహ్ణము పితృ దేవతలను అర్చించవలయును. యజ్ఞములచే దేవతల ఋణము, వేదములు (పురాణములు) చదువుట వలన ఋషుల ఋణము, సంతానము బడిసి పితృదేవతల ఋణము తీర్చ వలయును. పంచ యజ్ఞములను చేయవలయును.

**చేయకూడనివి :** గృహస్థునకు క్రియా త్యాగము నింద్యము.

| సంసార వృక్షము | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| మూలము | ప్రకృతి | | | | | | | |
| వ్రేళ్ళు | సత్త్వగుణము | రజోగుణము | తమో గుణము | | | | | |
| శాఖలు | ధర్మము | అధర్మము | | | | | | |
| చెట్టు కొమ్మలు | ఆకాశము | వాయువు | అగ్ని | జలము | భూమి | బుద్ధి | మనస్సు | అహంకారము |
| చెట్టు ఆకులు | ప్రాణము | అపానము | వ్యానము | ఉదానము | సమానము | పంచ ఉప ప్రాణములు | కర్మలు | |
| చిగుళ్ళు | శబ్ద | స్పర్శ | రూప | రస | గంధము | విషయములు | | |
| చెట్టు రంధ్రములు | రెండు కళ్ళు | రెండు చెవులు | రెండు ముక్కు రంధ్రములు | నోరు | గుదము | గుహ్యాము | | |
| చెట్టుపై పొరలు | వస | రక్తము | మాంసము | మేధస్సు | ఎముకలు | మజ్జ | వీర్యము | |
| చెట్టు యొక్క స్వభావము | కామ | క్రోధ | లోభ | మోహ | మద | మాత్సర్యము | | |
| స్వభావమును గ్రహించునవి | చెవి | చర్మము | కన్ను | నాలుక | ముక్కు | | | |
| రసము | ధర్మ | అర్థ | కామ | మోక్షము | | | | |
| పండ్లు | సుఖము | దుఃఖము | | | | | | |

ఈ చెట్టుపై జీవుడు, ఈశ్వరుడు అనే రెండు పక్షులు గలవు. జీవ పక్షి సుఖదుఃఖములనే పండ్లను తినుచున్నది.ఈశ్వర పక్షి నిరీక్షకునిగా సాక్షిగా ఉన్నది.

దేహము, ఇంద్రియములు, ప్రాణములు, అంతఃకరణ చతుష్టయము, గుణములు, తద్వారా చేయబడు కర్మ వ్యాపారము కలసి, సంసార వృక్షము.

సంసార వృక్షము యొక్క అధర్మ తరుశాఖలు.

అధర్మము+మృష (అసత్యము)

దంభుడు+మాయ

లోభుడు+నికృతి (పాపము)

క్రోధము+హింస

కలి+దురుక్తి (పరుషవాక్కు)

భయము+మృత్యువు

యాతన(దుఃఖము)+నరకము

ధర్మాధర్మముల వలన జీవునకు ఊర్ధ్వ గతి, అధోగతి గలుగుచున్నవి. అధర్మము వలన అసత్యము, దంభము, మాయ,లోభము పాప కృత్యములు,క్రోధము, హింస, కలి, పరుషవాక్కు భయము కలిగి చరించి మరణానంతరము యాతనా శరీరము పొంది నరక ప్రాప్తుండై జనన మరణ వలయములో చిక్కుకొనును.

**సంసార వృక్షము:** సంసారము ఈశ్వరాధీనము, మాయావృతము, ద్రవ్య క్రియాకారక చేతనాత్మకము. ద్రవ్యము, గృహము, పొలము, తోటలు, పశువులు భోగభాగ్యములకువలయు ధనము, బంగారము, వెండి, వివిధ వస్తువులు, కలిగి భార్యపిల్లలు, తల్లిదండ్రులు, బంధువులు, ఆశ, అహంకార మమకారములు సుఖదుఃఖములు గలిగి సంసారముండును. ప్రకృతి సంబంధము వలన సంసారము గలుగును. దేహేంద్రియంబులతోడ ఆశ్రయించిన జీవునకు సంసారము గలుగును. ఉదా:

అగ్ని వలన కుండ వేడెక్కి, అందున్న జలము వేడెక్కి, ఆ జలము నందున్న బియ్యము ఉడికి అన్నమగును. వనవాసియైనను జితేంద్రియుడు గాకుండెనేని, కామాది సహితుండగుటం చేసి సంసారబంధంబు సిద్ధించు. సుత కళత్ర, బాంధవులను ఆదరించ వలయుననే భావన వలన సంసారము నందు బద్ధుడగును. భార్యాపుత్రులు, మేడలు, బంధువులు, మిత్రులను చూచుకొని ప్రాణేచ్ఛలయుండి జిహ్వా చాపల్యము వలన, స్త్రీ సంభోగ వాంఛ వలన, ఇహలోక సుఖములను కోరి, మోక్షమును కోరక, ఇల్లుగాచి యుండెడి కుక్కవలె వర్తించుచూ చివరకు సంతుష్టి లేక సంసారి చెడును. రాజస తామసులయి సిరియు, ఐశ్వర్యము, సంతానము కోరి పితృ భూతాదులను ఆరాధింతురు. కొఱవి దయ్యమును గాంచి అగ్ని కొఱకు వెంటబడినట్లు కాంచనము కోరి ధనవంతుల పంచలను తిరుగును. సంసార మందలి మేలుకొఱకు అన్యులను సేవించును. విద్వాంసుడైనను, దేహేంద్రియంబులందు ప్రీతిసేసిన, మిథునీ భవ సుఖ ప్రధానంబగు గృహస్థాశ్రమము నంగీకరించి, స్వరూప స్మృతి శూన్యుడై సంసార తాపత్రయంబులను పొందును. సంసారాసక్తమతి గలిగిన వానికి ఈశ్వరుండు ముఖ్యుండు కాడు, సంసార ప్రవర్తకునికి సుగుణములయిన సత్యము, శమము, దమము, ధృతి, మానము, సిగ్గు, క్షమ, శౌచము, దయ, యశము మొదలుగా గల గుణములు, బుద్ధి నశించును. జీవుడు సంసారమున ఉండియు, మనంబున ఎప్పుడు ముక్తి చింత సేయునపుడు సంసార బంధము బాయును. జీవుడు తను వేఱని, దేహము వేఱని, ఎప్పుడు తెలియునో అప్పుడు సంసారమును తరియించును.

**గృహస్థాశ్రమము - సంసారులు :**

సంసారకాముడై సంసారము నిక్కముగా తలచి సంసార పద్ధతికి కట్టుబడును. అభిమానము, కుత్సితము, హింసామతి (తదభిమానుండయి కుత్సితమతి) హింసలుచేయుచూ, సత్యముపాటింపక అసత్యపరుడై, దానముచేయక, కరుణలేక, (సత్య,దాన, కరుణ, ధర్మాది, నిర్ముక్తుడై) ధర్మ విముఖుడై, కుటుంబము మీద కోపపడుచూ, కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యంబులచే కట్టుబడి, యౌవనము అతి చంచలమని గ్రహించక పట్టుదల, అహంకార మమకారములు గలిగి, నిజనాశనంబునకు హేతువులగు కర్మంబుల ప్రవర్తించుచూ, శ్రౌతస్మార్త

కర్మానుష్ఠానపరుడై కర్మేంద్రియంబుల చేత కర్మలుచేయుచూ జ్ఞానేంద్రియంబుల చేత తమో విషయంబులైన శబ్ద,స్పర్శ, రూప, రస, గంధాదులను అనుభవించుచూ, మనస్సుతో కూడి కర్మేంద్రియ జ్ఞానేంద్రియ మనోవిషయంబులు పొందుచూ కాముకుండై ఉండును.

సంతానమునకై గృహక్షేత్ర విత్తాదులు సంపాదించబడును. మఱియు సంసార బద్ధుడై సుఖభోగములను కోరును. పరుండుటకు దూది పరుపులు, తినుటకు షడ్రసోపేతమయిన భోజనము, వెండి బంగారు భోజన పాత్రలు, ధరియించుటకు పట్టుబట్టలు, నివసించుటకు ప్రాసాదములు, భవంతులు గలిగి, కవి, పండిత, మంత్రులుగా రాజుల కొలువులో గాని, ధనవంతుల కొలువులో గాని ఉండి ఆ పడుపుకూడు భుజించుచు వారలను సేవించును. సమయమును వృధాగా గడిపి కాలక్షేపము చేయును.

**అర్థము:** బహు ధనాపేక్షవలన ఇహపరదూరులైన పాషండులను సేవించుచూ కలవారి యిండ్ల తిరుగుచూ పాపకర్మలను ఆశ్రయించుచూ, ఇతరులను ధనము కొఱకు అడిగి (అప్పు దొరకక) అవమానము పొందుచూ ప్రయాస లబ్దంబైన ధనము కోల్పోయి దుఃఖ పడుచూ పర ద్రవ్యాభిలాష వలన స్నేహితులను, పితృ, పుత్ర, భాతృజ్యేష్ఠులనైన వధియించుచూ, అల్ప ద్రవ్యములకై పోరాడును.

**కామము:** భార్య వలన సంతానము బడయుచూ, తరుణీకృత గోప్య భాషణములు (ఆడవారితో రహస్య సంభాషణలు) అతి మనోహర వనితా జనాలాపతత్పరుడై (వేశ్యల మాటలు వింటూ) కామినీ యుక్తుండునై (వేశ్యాలోలుడై) ఉండును. అంగనారతుల, నిద్రాసక్తి రాత్రి గడుపును.

**మోహము :** గృహక్షేత్ర (పొలము) కళత్ర, సుత, బాంధవులు, ఆప్తులు, విత్తము, పశు, ధన, ఆరామం, (తోటలు) వివిధ వస్తువులందు నేను నాది అనెడి మోహము గలుగును. వాటి యందు అభిమానము గలుగును. ధనము గృహాదుల రక్షణ యందు దందహ్యమాన దేహుండై అనగా కాలము గడుపుచూ ధనము, పశు, పుత్ర, కళత్ర బాంధవ సంఘము సత్యమనుచూ, భావించుచూ, సుతలాలస భాషణమునకు ఆనందపడుచూ వారి భుక్త శేషము అనుభవించుచూ క్షుద్ర తమంబులగు జిహ్వాది

ఉపస్థాది కామ జనిత సుఖ లేశంబులనన్వేషించుచూ దాయాదుల చేత దుఃఖపడుచూ, దుర్జనులచేత వ్యథిత హృదయుండగుచూ, కూట ధర్మంబు గల దుఃఖము అనయము సుఖ రూపంబుగా మనంబున తల పోయుచూ రాజ తిరస్కారములకు దుఃఖపడుచూ అన్యోన్య వైరంబుల దుఃఖ పడుచూ ఒక చోట ఆనంద పడుచూ, ఒకచోట దుఃఖపడుచూ, ప్రమోదము వేదనలను బొందుచూ, **నిజ కుటుంబ పారవశ్యమున విరక్తిమార్గంబు కాన లేక** ఆత్మ తత్త్వము ఎఱుంగకుండుట చేసి మోక్ష మార్గమునకు దూరమై అంధకారమున (నరకమున) బడును.

**కాలము:** అహోరాత్రాది కాల విశేష గణన పరుండు గాక అతి మూఢ మనస్కుండై స్వప్న గోచరములయిన బహు విధ సంపదలకు ఆనంద పడుచూ శరీర పరిణామాది పీడలకు దుఃఖించుచూ యౌవనము గడుపును.

**వృద్ధాప్యము :** యౌవనమున మత్తుండై, అంధుని వలె తిరుగుచూ, సంసార చింతా క్రాంతుడై ముసలి తనమున తను పోషించిన వారిచే పోషింపబడుచూ ముసలి ఎద్దు పగిది బ్రతుకును. వానిని చూచి దారాసుతాదులు ఏవగింతురు. భార్య సంసార కారణము. సుతులు ఋణస్థులు. చుట్టాలు దొంగలు. ఇతరులు కార్యార్థులు అని గ్రహించక అంగన, పుత్ర, ఆరామ విత్తాది సంసార హేతుక సంగ సుఖము దగిలి వర్తింప కాలము అయిపోవగనే మరణ సమయమున ఇద్దఱు కాలకింకరులు (యమదూతలు), తన ముందట నిలిచిన చూచి శకృన్మూత్రము విడుచుచూ పాప రతి నైతి పుణ్యము సేయనైతినని విలపించి యమభటులచే యమ పాశములతో బంధింపబడి శరీరము నుండి నిర్గమించును. మరణానంతరము యాతనా శరీరము పొంది యమకింకరులు తర్జన భర్జనలు చేయుచుండగా ఆకలి దప్పికలచే బాధపడుచూ 99 వేల యోజనముల దూరమున గల యమపురికి పోవును. మహా పాపాత్ముడు ముహూర్తత్రయ కాలమునను సామాన్య దోషియగువాడు ముహూర్త ద్వయంబున నేగి నరకమున యాతనలంబొంది క్షీణపాపుండై మరల భూలోకమునకు పూర్వజన్మ కర్మాను సారంబు వచ్చును. మరల హర్ష శోక భయంబుల నిచ్చుచున్న సంసారము ధరియించును. ఇటుల కర్మంబు లొల్లని బుద్ధి నెఱింగియు, వినియు,

కర్మంబులు సేయుచుండి పట్టు పురుగు వలె సంసారంబున బడి నాశనంబునొందు. దోషరహితమగు మోక్షమనే శాశ్వత సుఖ లాభములు పొందరు.

**సారాంశము** : సంసారులు 1. మిధ్యాభూతంబగు దేహంబునందు ఆత్మాభిమానంబు సేయుచూ, 2. మాయ చేత మోహితుడయి; 3. త్రిగుణాత్మకుండనని అభిమానించుచూ త్రిగుణములను అంగీకరించి గుణబద్ధుడై; 4. కర్మంబులందు ఆసక్తంబయిన బుద్ధిం చేసి; 5. త్రిగుణత్వాభి మానంబుగా కర్తయు, భోక్తయునను అనర్థంబు నొందుచూ; 6. విభ్రాంతుడగుచూ; 7. సంసార స్వరూపంబగు మహాంధకారంబునందు (నరకమునందు) ప్రసుప్తుండగు.

**గృహస్థాశ్రమము - విద్వాంసుడు :**

సంసారంబు సుఖంబని నిశ్చయింపక అప్రమత్తుండై మఱియొక మార్గంబున సిద్ధి గలదని గ్రహించి సంసార వృక్షమును ధృడమగు విరక్తితో త్రుంచి అశ్వత్థ వృక్షమును గ్రహించును.



**ఊర్ధ్వమూల మధశ్శాఖ మశ్వత్థం ప్రాహురవ్యయమ్**
**ఛందాంసి యస్య పర్ణాని యస్తం వేద స వేదవిత్**

(భగవద్గీత, పురషోత్తమ ప్రాప్తియోగము-1)

ఈ వృక్షము అనాది. మూలముపైన, శాఖలు క్రిందకి గలవు. జ్ఞాని ఈ వృక్షము మూలమును తెలుసుకొనును. కర్మబంధములయిన పరాభవంబులు గల గృహంబులందు ముక్త సంబంధులగు పురుషులకు సంతోషము గానేరదు. స్వస్తత పొందిన మనస్సు గల మహాత్ములు కుటుంబమునందు కోరిక లేకుందురు. జ్ఞానియైన గృహస్థుడు గృహమున ఉన్నను, వనంబున ఉన్నను నైష్టికత్వము నాశ్రయించి గురుతర వృత్తితో మెలగు. సంసార వృక్షమును ధృడమగు విరక్తితో త్రుంచి, ఎంతటదేహ నిర్వహణంబు సిద్ధించు అంతయె గైకొనుచూ సంసారంబు సుఖంబని నిశ్చయింపక యొండు మార్గంబున సిద్ధిగలదని గ్రహించి, ఆ మార్గమును, గురువులను ఆశ్రయించి తెలుసుకొనును. అతి సాధారణ జీవితము గడుపును. బ్రహ్మచర్యా శ్రమంబున గురువులను సేవించి, వేదవేదాంగములు అభ్యసించి, గురు దక్షిణగా గురువులకు అభీష్టము లొసగి, అతిథి భుక్త శేషము విఘసము అని భావించి అతిథి, అభ్యాగతులను ఆదరించుచూ, సుజనులను మన్నింపుచు, ఆత్మయందు, సర్వభూతముల యందు అచ్యుత దర్శనము చేసి, ఎఱుక గలిగి వర్తించుచూ, యజ్ఞశేషము అమృతమని భావించి యజ్ఞములు ఆచరించుచూ ఉండును.

**ఆహారము :** దేవ, పితృదేవతాది ఆరాధనలందే మాంసభక్షణచేయుచూ మిగిలిన దినములలో మాంసమును స్వీకరింపక, మత్తు పానీయములుస్వీకరింపక ఉండవలయును.

**వస్త్రధారణ :** తెల్లని బట్టలు ధరించవలయును.

**అర్థము :** నిజాధికారముగా అర్థవిచారణ చేసి, పాత్రుల నుంచి దానము స్వీకరించ వలయును

**కామము :** ఋతుకాలమున భార్యను పొందుచూ, పెక్కు సంతానము గలిగి, ఇంద్రియ వ్యసనాది మగ్నుండు గాక, తరుణుల జాడ పోక, (వేశ్యాలోలుడు, పరస్త్రీ లోలుడుగాక) ఉండవలయును.

**వ్యవహారము :** సర్వభూత సుహృతు, శాంతులకు, సుజనులకు, గర్వహీనులకు, ప్రాప్త లాభపరులకు భగవంతుడు నమస్కరించునని ఎఱింగి ఆ విధముగా గృహస్థ జీవితము గడుపవలయును. (ఇట్టి యోగ్యులయిన గృహస్థులు వాన ప్రస్థాశ్రమము స్వీకరించ అర్హులు).

**వాన ప్రస్థాశ్రమము**

మోహము తెగ గ్రోసి, సిద్ధముని వర్తనుడై, గేహము (ఇల్లు) వెలువడు నరుని గుఱించి అనగా వానప్రస్థుడు ఏ విధముగా ఉండవలయునో వానప్రస్థాశ్రమము చెప్పును. వానప్రస్థాశ్రమము మోక్షసాధనకు ప్రారంభ పాఠము. వీరు అర్థ కామములను పరిత్యజించి ధర్మమును పాటించుచు మోక్షాయుత చిత్తులయి ఉండవలయును.

**నివాసము :** వనంబునకుంచని (గ్రామ, నగర, నివాసము కూడదు), పర్ణశాల లేక పర్వత కందరం (గుహ) లో ఉండవలయును.

**శౌచము :** శౌచము పాటించుచూ అనగా స్నానము చేయవలయును.

**ఆహారం :** దున్నక పండెడి నీవారాదికంబులు, అగ్ని పక్వంబు చేసి కాని, చేయక గానీ (వంట చేసికొని, వంటచేయక) అర్కపక్వంబులయిన ఫలంబులు తినుచు (సహజముగా పండిన పండ్లను తినుచూ) నూతన ద్రవ్యములు లభింప పాతవాటిని పరిత్యజించుచూ, మితాహారము కలిగి ఉండవలయును.

**వాక్కు :** సత్యభాషణ మృదుత్వము కలిగి ఉండవలయును.

**శయనము :** భూశయనము కలిగి ఉండవలయును.

**రూపము :** అజిన వల్కల పరిచ్ఛదంబులు ధరించి, దండ కమండలము ధరించి, నఖ శ్మశ్రుకేశ తనూరుహంబులు ప్రసాదితంబు సేయక, జటిలుండై ఉండవలయును.

**ప్రవర్తన :** ఇంద్రియ జయము గలిగి బ్రహ్మ చర్యము పాటింపుచూ, కామ క్రోధములు, మానాభి మానములు, అహంకారము లేకుండా ద్వంద రహితుండై, సర్వసంగ రహితుడై, వన్యాహారంబుల నిత్యకృత్యంబులైన చరు పురోడాశము లొనర్చుచూ, అగ్నుల ఆత్మారోపణంబు చేసి, పండ్రెండైన, ఎనిమిదైన, నాలుగైన, రెండైన, నొకవత్సరంబయిన తపః ప్రయాసంబున, బుద్ధినాశంబు గాకుండా

మునియై చరింపుచూ, అవసాన సమయంబున దైవ వశంబున జరారోగముల చేత చిక్కి నిజ ధర్మానుష్ఠాన సమర్థుండు గాని సమయమున నిరశన వ్రతుండై సన్న్యసించి, యోగములో దేహంబును వదలవలయును. హనుమంతునికి సీత లంకలో కనబడనపుడు వానప్రస్థుని గురించి ఈ విధముగా వర్ణింప బడినది.

**హస్తాదానో ముఖాదానో నియతో వృక్షమూలికః**
**వానప్రస్థో భవిష్యామి హ్యదృష్ట్వా జనకాత్మజామ్**

(సుందరకాండ 13-40)

వృక్షమూలము నందు నివసించుచూ, చేతిలో పడిన దానిని నోటికి అందిన దానిని తినుచూ, వానప్రస్థుడుగా ఉందును.

**తాపసో వా భవిష్యామి నియతో వృక్షమూలికః**

(సుందరకాండ-13-45)

తపస్సు చేయుచూ నియమములును పాటించుచు, వృక్షమూలము నందు నివశించెదను.

**ఇహైవ నియతాహారో వత్స్యామి నియతేన్ద్రియః**

(సుందరకాండ-13-54)

నియతేంద్రియుడనై ,నియతాహారుడనై ఉండెదను.

**సన్న్యాస ఆశ్రమము**

ఇది భగవంతుని శీర్షము.

**నివాసము :** సన్న్యాసికి తనదంటూ ఒక ఆశ్రమము ఉండరాదు. పెక్కుదినంబు లొక్కయెడ వసియింపక, ఊరూర నొక్కొక్క రాత్రి నిలచుచూ నిరాశ్రయుడై ఉండవలయును.

**శౌచము :** శౌచమును పాటించ వలయును. ఆహార పానీయములు: భిక్షాటనతో ఆహారమును సంపాదించవలయును. భిక్షువునకు ఇంద్రియ లోలత్వము నింద్యము. **వాక్కు :** మృదు మధుర వాక్కుగలిగి ఉండవలయును. ఎక్కువగా మౌనం పాటించవలయును. **శయనం :** భూతలశయనం చేయవలయును.

**రూపము :** కౌపీనాచ్ఛాదన మాత్రంబైన వస్త్రములు ధరియించి దండంబు ధరియించి లేదా దండము ధరియింపక బహిరంగ వ్యక్త చిహ్నుండుగాక ఉండవలయును. **ప్రవర్తన:** నిరపేక్షుండును సకల భూత సముండును, శాంతుండును, సమచిత్తుండును, నారాయణ పరాయణుండును, ఆత్మారాముండును, అంతరంగంబున వ్యక్తమైన ఆత్మానుసంధానము గలిగి మనీషియై కార్యాకారణ వ్యతిరిక్తంబయిన పరమాత్మయందు విశ్వంబు దర్శించుచూ సత్, అసత్ మయంబైన విశ్వంబునందు పరబ్రహ్మమైన ఆత్మను అవలోకింపుచూ, జాగరణ స్వప్న సంధి సమయముల నాత్మనిరీక్షణ సేయుచూ, ఆత్మకు బంధ మోక్షంబులు మాయామాత్రంబు గాని వస్తు ప్రకారంబున లేవనియు, దేహంబునకు జీవితంబు ధ్రువంబు గాదనియు, మృత్యువు ధ్రువంబనియును నెఱుంగుచూ, జ్ఞానోత్పత్తి పర్యంతంబు సంచరించుచూ, అట మీద విజ్ఞాన విశేషంబు సంభవించినం పరమహంసుండై భూత దేహంబుల సంభవ నాశంబులకు మూలమైన కాలము ప్రతీక్షించుచూ బాహ్యానుసంధాను భావంబున మనుష్యులకు తన వలన ఉన్మత్త బాల మూక తెఱంగున చూపుచూ దేహ మాత్రావసిష్ఠుండై చరియింపవలయును.

**చేయకూడనివి :** తపస్వికి గ్రామ నివాసము నింద్యము. ఆడపొత్తు తగదు. మత్తాది వ్యాపారంబులనుల్లసిల్లక, బహువిద్యల జీవింపక, గ్రహ నక్షత్రాది విద్యల నభ్యసింపక,భేద వాదంబులైన తర్కంబుల తర్కింపక, ఎందునూ పక్షీకరింపక, శిష్యులకు గ్రంథంబులు వంచించి ఉపన్యసింపక, ఆత్మ పరంబులుగాని శాస్త్రములు వర్జించి ఉండవలయును. ఇంద్రియ నిగ్రహములేని సన్న్యాస ఆశ్రమము స్వీకరించుట వ్యర్థము.

**అనాశ్రితః కర్మఫలం కార్యం కర్మకరోతి యః**
**స సన్న్యాసీ చ యోగీ చ న నిరగ్నిర్న చాక్రియః**

(భగవద్గీత-ఆత్మ సంయమయోగము-1)

రాజులను ధనవంతులను ఆశ్రయింపక కర్మఫలత్యాగము చేసిన వాడే సన్న్యాసి. అతడే యోగి.

*****

# వ్యక్తిగత విధులు - బాధ్యతలు

చేయవలసిన పనులను ధర్మములుగానూ చేయకూడని పనులను అధర్మములు గనూ చెప్పుదురు. ధర్మములను పుణ్యములని అధర్మములను పాపములని అందురు. పాపములను నేడు మనము నేరములని పిలుచుచున్నాము. నేరములకు తగిన శిక్షలు క్రిమినల్ ప్రొసీజర్‌కోడ్‌లో చెప్పబడును. ఎవరిది ఎట్టి స్వభావమో దానిని మార్చుట కష్టము. అయినా దుష్ట స్వభావమును వదలి మంచి స్వభావమును ప్రజలు అలవరచుకొన వలయును.

**సంచారము :** ఉదయసంధ్య, సాయం సంధ్యలలో, అర్ధరాత్రి, మానవులు తిరుగరాదు. ఆ సమయములో భూత,యక్ష,దానవ, గంధర్వులు తిరుగుదురు.

**నివాసము :** ఒకేచోట ఎక్కువ కాలముండుట ఎవరికి ఆనందము కాదు. కావున అప్పుడప్పుడూ యితర పుణ్యస్థలములను దర్శించవలయును.

**సూర్యుని చూచుట :** సూర్యోదయ సూర్యాస్తమయములలో సూర్యుని చూచినచో ఆయువు తగ్గును.

**కాలకృత్యములు :** మలమూత్ర విసర్జన రహస్యముగా చేయవలయును. మూత్ర పురీషములు వదులునపుడు త్రిసంధ్యలలో ఉత్తరాభి ముఖముగాను, రాత్రి దక్షిణాభి ముఖముగాను చేయవలయును. మూత్ర పురీషములు విసర్జించు సమయమున మాటలాడరాదు. అనగా ఆ సమయములో నోరు తెరువరాదని అర్థము. కావున పొగత్రాగుట, మాటలాడుట చేయరాదని భావము. మూత్ర పురీషానంతరము మట్టితో (నేడు సబ్బుతో) చేయి శుభ్రపరుచుకోవలయును.

మూత్రమునకు వెళ్ళి కాళ్ళు కడుగుకొనక సంధ్యోపాసన (దేవతాసంబంధ పుణ్యా కార్యములు) చేయుట **పాపము.** అప్పుడు కలి పురుషుడు అతనిని ఆవహించును. సూర్యునికి ఎదురుగా మలమూత్రములు విడచుట **పాపము.**

**ఆవలింతాదులు :** ఆవులింత తుమ్ము, ఉమ్ము రహస్యముగా చేయవలయును.

**నదీస్నానము** : ఉదయం, మధ్యాహ్నం, సాయంత్రము స్నానం చేసి శరీరమును శుభ్రముగా ఉంచుకొనవలయును. నదులలో నది నీటిని అపరి శుభ్రము చేయరాదు. నదినీటిని అపరి శుభ్రముగా ఉంచుట **పాపము**. అనగా స్నానం చేయునపుడు సబ్బు, నూనె వాడరాదు మఱియు వ్యర్థ పదార్థములను రసాయన పదార్థములను నది నీటిలోనికి వదలరాదు. బట్టలు నదిలో ఉతకరాదు.

**ఆహారము:** ఆరోగ్యము గలిగించు ఆహారములను భుజింపవలయును. అనారోగ్యము గలిగించు వాటిని తినరాదు. ఉప్పు నమలరాదు. జాతిపై వేసిన ఉప్పును తీసుకొనరాదు. ఉప్పు చేతిలో వేయరాదు. రాత్రి తేనె వాడరాదు. రాత్రి పెరుగుతో భోజనము చేయరాదు. అన్నము అశుచిగా ఉన్నా, ఎంగిలిగా ఉన్నా, కీటకములు, వెంట్రుకలు ఉన్నా, అమంత్ర పూర్వకముగా ఉన్నా, అన్నము పెట్టిన ఫలితమును రాక్షసులు తీసుకొందురు. వాల్మీకి రామాయణములో అరణ్యావాసములో రాముడు, సీత, లక్ష్మణుడు మాంసాహారము భుజించినట్లుగా వర్ణింపబడినది. బ్రాహ్మణ, క్షత్రియులు ఐదువేళ్ళు గల జంతువులలో ఉడుము, కుందేలు, తాబేలు, ముండ్లపంది (శల్యకము), అడవిపంది (శ్యావిభము) లను తిన వచ్చును అని రామాయణంలో చెప్పబడినది. ప్రపంచ జనాభాలో అధిక సంఖ్యాకులు మాంసాహారులు. బుద్ధుని అహింసా సిద్ధాంతము వలన శాకాహారమునకు ప్రాముఖ్యత పెరిగినది. పితృ కార్యములందు, యజ్ఞములయందు తప్ప మిగిలిన కాలములలో (బ్రాహ్మణులు) మాంసము తినిన **పాపము**. బాలురను, వృద్ధులను, గురువులను విడిచి భోజనము చేయుట **పాపము**. సంధ్యాసమయములో భోజనము చేయుట **పాపము**.

**పానీయములు** : శుభ్రమైన, మంచినీరు త్రాగవలయును. కావున నదినీటిని అపరిశుభ్రముచేయుట పాపమని చెప్పబడినది. మద్యపానము మహాపాతకము. మద్యపానము వలన పూర్వజన్మలో చేసిన పుణ్యము కూడా పోవును. ప్రజలలో పాపాసక్తి కలిగి పతితులగుదురు. చ్యవనుని అజ్ఞప్రకారము మదమనే రాక్షసుడు మధ్యపానము, స్త్రీ, వేట, జూదములను ఆశ్రయించును. మద్యపానము అనుదినము చేయువాడు **వీచీరయమను** నరకమున బడును. యమభటులు వానిచే వేడి ఉక్కునీటిని త్రాగింతురు. ధర్మార్థ సిద్ధిని కోరువాడు మద్యపానము చేయరాదు.

మధ్యపానము వలన ధర్మ అర్థకామములు తగ్గిపోవును. అన్నపానీయములు దొరకని సమయములో కల్లు త్రాగిన పాపము లేదు అని విశేషధర్మముగా చెప్పబడినది. దాహముతోనున్నవారికి త్రాగుటకు నీరు ఇవ్వకపోవుట పాపము.

**నిద్ర :** బలవంతునితో విరోధము పెట్టుకున్నవారలకు, ధనము పోయినవారలకు, ధనము సంపాదించ వలయును అని అనుకునేవారికీ, కాముకునకూ, దొంగతనము చేయవలయునని అనుకునేవారికీ, అలుక, ఆతురత్వము గలవారలకు నిద్ర రాదు. సూర్యోదయము సూర్యాస్తమయములలో నిద్రించుట **పాపము.**

**వ్యసనము :** వెలది,జూదము,వేట, మాటకటువు (పరుషవాక్కు)అధిక ప్రసంగము, అనవసర దండన, అనవసరపు ఖర్చు, ఇవి సప్త వ్యసనములు. వీటివలన **పాపములు** కలుగును.

**మంత్రము :** అవతలవాని శీల వృత్తములు ఎఱుగక మంత్రము చెప్పినచో మంత్రము చెప్పినవారు దోషి అగును.

**విద్య :** వేదములు డాంబికముతో చదవరాదు. సంధ్యా సమయములందు వేదము చదువుట **పాపము.** లంకలోని రాక్షస బ్రాహ్మణులు రాత్రివేళ వేదము చదువు చుండగా హనుమంతుడు చూచెను. తన విద్య వలన ఇతరుల యశమును తూలనాడిన ఎడల బ్రహ్మహత్యా **పాతకము** కలుగును. తనకు తెలిసిన విషయములు ఇతరులు అడిగినపుడు చెప్పకుండుట **పాపము.** దుర్వాదములందు పట్టుదల **పాపము.** ధనము తీసుకొని జ్యోతిష్యము చెప్పుట **పాపము.** అభ్యాసముతో విద్యలన్నియు పొందవచ్చును. కాని గురుముఖతా పొందని విద్య మదమును, మాత్సర్యమును కలుగచేయును. విద్య, తపస్సు వయో రూప కులములు సుజనులకు గుణములు. అవి కుజనులయెడ దోషములు. నీచాత్ముండభ్యసించు విద్యలెల్లను మద కారణములుగాని సత్త్వ గుణ గరిష్ఠములు కావు. ఈ విషయమును చెప్పుటకు ఏకలవ్యుని బొటనవ్రేలును ద్రోణుడు గురు దక్షిణగా గ్రహించినట్లు కథగా వర్ణించిరి. ఈ విషయము గ్రహించనిచో రూఢికార్థమున ద్రోణుడు చేసినది తప్పుగా కనపడును. శాస్త్ర అభ్యాసంబున ఎవరయినా తనకు విద్యా,తపో, యోగ గుణంబులు గలుగునని

పలికిన వానిని చూచి సభలో పరిహాసింతురు. అది కుమతి అగువాడు ఎఱుంగడు. వేదము, పురాణములు ఆర్యులొద్ద నేర్చుకొనవలయును. జీవనోపాధికి పనికివచ్చు శాస్త్రములను చదవవలయును. అఖండ భాషాపాండిత్యము గలిగి ఉండవలయును. ప్రజలు విద్యావంతులయి ఉండవలయును.

**వేదాధ్యయనము :** సామవేద బ్రాహ్మణులు భాద్రపద మాసములో నూతనముగా ప్రారంభించినపుడు వేదాధ్యయనము చేయరు.

**తల్లి-దండ్రులు :** తల్లి ,తండ్రి, గురువు వీరు ప్రత్యక్ష దైవములు. వీరిని కాదని దైవమును ఆరాధించుట శక్యము కాదు. కన్నతండ్రి, అన్నగారు, విద్య చెప్పిన గురువు, వీరు ముగ్గురు తండ్రులని ధర్మవిదులు చెప్పుదురు. పుత్రునకు హితము చేకూర్చగలవాడు తండ్రి. తండ్రి ప్రత్యక్ష దైవము. తండ్రి ఆజ్ఞను పాటించుట ధర్మము. తండ్రిసేవ సత్యముకంటె, దానము కంటె, యజ్ఞములకంటె గొప్పది. తండ్రి ఆజ్ఞను పాటించినచో సర్వము చేకూరును. తల్లిని సేవించి కాశ్యపుడు స్వర్గమునకు వెళ్ళినాడు. తల్లి చనిపోయిన తర్వాత ప్రపంచమంతా శూన్యముగా తోచును. తల్లిని చంపుట **పాపము.** కొడుకులకు తండ్రి గుణములు, కూతుళ్ళకు, తల్లిగుణములు వచ్చునని లోకసామెత. జననీ జనకులను పెంచనివాడు జీవన్మృతుడు. "జననీ జనకుల వృద్ధుల తనయుల గురు విప్ర సాధు దారాదుల నేజనుడు ఘనుడయ్యు బ్రోవకవనరును జీవన్మృతుడు వాడు ధరిత్రిన్". తల్లి తండ్రులను సేవించకుండుట **పాపము.** తల్లిదండ్రులకు, బ్రాహ్మణులకు కీడు తల పెట్టువాడు, దండింపతగని వారలను దండించు వాడు **కాలసూత్రమనే** నరకములో పడుదురు. అతనిని యమభటులు పది వేల యోజనముల పొడవు గల ఇనప స్తంభముపై పైన క్రింద అగ్ని పెట్టి నడిపించెదరు. అతనిని అగ్నితో కాల్చెదరు. అతడు ఆకలి దప్పికలతో బాధపడును.

**అన్నదమ్ములు :** ఏదేశమునకు వెళ్ళినా భార్యా, బంధువులు దొరుకుదురు. కాని ఎక్కడను తోడ బుట్టిన వారు లభింపరు. ధనము విషయములో అన్నదమ్ములకు అభిప్రాయభేదములు వచ్చును. కాని ప్రేమ పోదు.

| అన్న దమ్ములు | |
|---|---|
| ఒకరంటే ఒకరు ప్రేమ గలవారు | ఒకరంటే ఒకరికి గిట్టనివారు |
| రాముడు అతని సోదరుడు భరతుడు | వాలి సుగ్రీవుడు |

**జ్ఞాతులు :** అన్ని భయముల కంటె జ్ఞాతి భయమే గొప్పది. జ్ఞాతులు ఎల్లప్పుడూ తమ జ్ఞాతులకు ఆపదలు వచ్చినప్పుడు సంతోషించెదరు. క్రూరులైన జ్ఞాతులు తమ హృదయంలోని భావములను దాచుకొని ద్రోహచింత గలవారై తమ జ్ఞాతికి ఆపద వచ్చినప్పుడు వారిలో వారు ఆనందపడుదురు. అగ్నివలన, శస్త్రముల వలన, యమపాశము వలన భయము లేదు కాని, క్రూరులు, స్వార్థపరులయిన జ్ఞాతుల వలననే భయము. గోవులలో సంపద, స్త్రీలలో చాపల్యము, బ్రాహ్మణుల యందు తపస్సు, జ్ఞాతుల వలన భయము సహజము. శత్రువుతోనూ, కోపించిన సర్పముతోనూ కలసి నివసించవచ్చుగాని జ్ఞాతులతో నివసింప శక్యము కాదు. జ్ఞాతులు తమలో ముఖ్యుడు, కార్యసాధకుడు, విద్యావంతుడు, ధర్మ స్వభావము కలవారు, శూరుడు అయిన వానిని అవమానింతురు. తిరస్కరింతురు. జ్ఞాతులు సంతోషముతో కలసి మెలసి ఉండరు. సహభోజనాది సత్కారంబుల, సవినయమున, జ్ఞాతులు ప్రీతులై ఇహపర అర్థ సాధకులగుదురు. జ్ఞాతులు గుణహీనులైనను విడువందగదు. ఒకరిపై ఒకరికి ద్వేషమున్నప్పటికీ ఇతరుల వలన ఇబ్బందులు కలుగునపుడు జ్ఞాతులు కలసి ఒకటిగా ఉండవలయును. ఉదా:- ధర్మరాజు, దుర్యోధనుడు, గంధర్వులు.

**అప్ప చెల్లెళ్ళు :** అప్పచెల్లెళ్ళు పేదరికముగా ఉన్నప్పుడు ప్రేమతో తీసుకొని వచ్చి ఇంటి వద్ద ఉంచి పోషించవలయును.

**బంధువులు :** బంధువులలో చంపెడి దోషము గలిగినను చంపదగదు. బంధుజనుల తలయును, మూతియు గొఱుగుట తలగొఱుగుట కంటె తుచ్ఛతరము. తన సంపదను తన బాంధవులతో కూడి అనుభవింపక పోవుట **పాపము.** ఇతడు **క్రిమి భోజనము** అను నరకమున బడును. ముఱికి గుంటలో పడి అందలి ఆహారమును తినును. మిత్రులు, బంధువులు, మన ఇంటికి వచ్చి వెళ్ళునపుడు వారిని కొంత దూరము సాగనంపవలయును.

**గురువులు :** గురువు మోక్షమార్గమును బోధించవలయును. పితృ, గురు, జనని, బంధు, పతి, వీరలలో ఎవ్వరయినా మృత్యురహితంబైన మోక్షమార్గము చూపకున్నచో వారెవరూ హితులు కారు. ఏ కార్యమైనా గురువాక్యోద్యుక్తులైకాని తత్పూర్వారంభము చేయకూడదు. ఉదా: రాముడు విశ్వామిత్రుని అనుజ్ఞ గైకొని శివ ధనుస్సును ఎత్తెను. గురువులు పేదరికముగా ఉన్నప్పుడు వారిని ప్రేమతోడ తెచ్చి పోషించవలయును. గురు ద్రోహము **పాపము.** గురు తల్ప గమనము అధిక **పాపము.** గురువు మాట పెడ చెవిని పెట్టుట **పాపము.** గురువును వదిలివేయుట, గురువును వధించుట **పాపము.**

**గురువు-శిష్యుడు :-** గురుభక్తి గల శిష్యుని - గురువు వదులుట **పాపము.** గురువులు మూడు రకములు. ఇహలోకమున జీవనోపాధికి వలయు విద్యను బోధించువారు ఒక రకము. కామ్య కర్మను చెప్పువారు రెండవ రకము. మోక్షమార్గము చెప్పువారు మూడవ రకము.

**అతిథి-అభ్యాగతులు :** అతిథి సామాన్యుడయినను పూజింపవలయును. మహాపురుషుడు అతిథిగా వచ్చినప్పుడు పూజింపవలయునని ప్రత్యేకించి చెప్పనవసరము లేదుకదా ! అగ్నిని ఆరాధించిన తరువాత అతిథిని పూజింపవలయును. ఇటుల ఆచరించని తపస్వి దొంగ సాక్ష్యము పలికినవానివలె తన మాంసమును, నరకమున తానే తినవలసి యుండును. అతిథి జనములకు అతిథి సత్కారంబులు గావించువారు ధరణిలో శాశ్వత కీర్తి పొందుదురు. ఉదా: రామునకు అతిథి సత్కారము చేసిన మునులు, శబరి శాశ్వత కీర్తి పొందిరి.

దాహముతో నున్న వారికి నీరు యిచ్చుట **ధర్మము.** విప్రునికి భోజనము పెట్టకపోవుట **పాపము.** బ్రాహ్మణ అతిథి ఎవరి యింట భోజనము లేక ఉండునో ఆ ఇంటి యజమాని యొక్క పుణ్యఫలము నశించును. అగ్ని ముఖము కంటె బ్రాహ్మణుని ముఖము శ్రేష్ఠము. బ్రాహ్మణ భోజనము ద్వారా భగవంతుడు తృప్తి చెందునట్లు యజ్ఞములోని హవిస్సు ద్వారా తృప్తి చెందడు. అతిథికి భార్యను సమర్పించుట ఒకనాటి ఆచారము. అతిథిని క్రోధ దృష్టిన చూచినవాడు **అపర్యావర్తన**మను నరకమున బడును. అతనిని రాబందులు గ్రద్దలు పీక్కుతినును. విప్రుడు

మానవులకు దైవము. ఎవని యందు విప్రులు, భవుడు, శివుడు, విష్ణువు విష్ణు భక్తులు ప్రసన్నులగుదురో వారికి భువిని, దివిని అసాధ్యము లేదు. విప్రుల రూపమున యోగీశ్వరులు అవధూత వేషమున చరియించుచుందురు. విప్రులను పెద్దలు పిన్నలు అనక విప్రులందఱకు నమస్కారము చేయవలయును. బ్రాహ్మణ పూజచే మానవుడు అఖిల సంపదలను పొందును. మదముతో సద్బ్రాహ్మణులకు అవమానము చేసిన ఇంద్రపదవి యందున్నను భ్రష్టులగుదురు.

**ఉండవలసిన గుణములు - ఉండకూడని గుణములు**

**శీలము:-** చేయవలసిన పనులు చేయుచూ ఉండకూడని గుణములు లేకుండా చేయకూడని పనులు చేయక ఉండుటయే శీలము. సత్కులమందు పుట్టినా, సకలవేదములు, పురాణశాస్త్రములు చదివినా, శీలము లేనియెడల అతని జీవితము వ్యర్థము.

**తృప్తి:-** తృప్తి గలవాడు ఎప్పుడూ ఆనందముగా హాయిగా ఉండును. బేలతనము విడచి ధైర్యము నవలంబించి తగిన ప్రయత్నము చేసిన కార్యసాఫల్యము గలుగును. సంతుష్టుడే మూడు జగముల పూజ్యుడు. తృప్తి లేని వాడు సప్త ద్వీపములనయిన చక్కబడడు. అనగా భూమి పై ఎక్కడా కూడ ఆనందంబుగా హాయిగా ఉండలేడు.

**ఉత్సాహము:-** ఉత్సాహము మనిషికి చాలా బలమిచ్చును. ఉత్సాహవంతునికి ఈ లోకంలో లభించనిది లేదు. అతనికి ఓటమి ఉండదు. ఉత్సాహము అభివృద్ధికి అర్థసాధనకు, శ్రేయస్సునకు మూలము. ఉత్సాహము గొప్పసుఖము. ఉత్సాహమే మానవునిని ఎల్లప్పుడూ సర్వకార్యములందు ప్రవర్తింపచేయును. ఉత్సాహమే తలపెట్టిన పనిని సఫలమగునట్లు చేయును.

**దయ:-** "అనృశంస్యం పరోధర్మః" (సుందరకాండ 38-42) క్రూరముగా లేక పోవుట పరమ ధర్మము.

**ప్రేమ:** దగ్గరగా ఉన్నచో ప్రేమ గలుగును. మహాత్ములు పాపరహితులు. జితాత్ములు. మహాప్రభావంతులయిన మునులకు ప్రియులు గాని, అప్రియులు గాని ఉండరు. మునులకు దుఃఖము గాని అధిక భయము గాని గలుగదు.

**ఓర్మి :- అలంకారో హి నారీణాం క్షమా తు పురుషస్య వా**

(బాలకాండ 33-7)

**క్షమా దానం క్షమా యజ్ఞః క్షమా సత్యం హి పుత్రికాః**
**క్షమా యశః క్షమా ధర్మః క్షమయా విష్ఠితం జగత్** (బాలకాండ 33-8)

దానం, యజ్ఞం, సత్యం, యశస్సు, ధర్మం. వీటి వలన గలుగు పుణ్యఫలితము క్షమ వలన గలుగును. ఒక్కమాటలో చెప్పవలయునన్న ఈ సర్వధర్మములు క్షమ యందు అంతర్లీనముగా ఉన్నవి. స్త్రీ, పురుషులకు క్షమయే సర్వాలంకారము. కాని శత్రువు పిలుచుచుండగా ఓర్పు చూప కూడదు. అట్టి ఓర్పు మరణ సమానము లేదా మరణము కంటె కూడ హీనము.

**పౌరుషం:** జరిగిన అవమానమును తన పౌరుషముచే తుడిచి వేయని వాని పౌరుషం వ్యర్థము.

**కీర్తి :** కీర్తి వడయుట లెస్స. అనిత్యంబయిన కాయము విచారణీయము కాదు.

**బుద్ధి:** ఆపదలందు, ధన నాశనము గలిగినపుడు, ప్రాణ భీతి ఏర్పడినపుడు, ధైర్యవంతుడు తన బుద్ధితో ఆలోచించవలయును. అంతేగాని క్రుంగిపోరాదు.

**మాట:** సత్యమునే పలకవలయును. సత్యమే ఈశ్వరుడు. సత్యమును మించిన ఉత్తమ ధర్మములేదు. సత్యము చెప్పనివాడు నరకమునబడును. అసత్యము చెప్పుట **పాపము.** సత్యహీనుని మోవజాలనని తొల్లి భూదేవి బ్రహ్మతో పలికినది. స్నేహము, పగ, అలుక, ధర్మము. పాపము తిరుగుబాటు తనము ఇవి మాటల వలన ఏర్పడును. మనస్సుకు ప్రియముగను, హితముగను, మధురముగను, ధర్మయుతముగను, మాటలాడవలయును. మాట పరిమితముగా, సత్యముగా, అమోఘముగా ఉండవలయును. మేలు చెప్పేనేని మేలంద్రు కీడు చెప్పేనేని చెడ్డవారు అని అందురు. అనగా శుభవార్తలు వెంటనే చెప్పవచ్చును. కాని చావు కబురు చల్లగా చెప్పవలయును. మాట ఇచ్చి నిలబెట్టకొనవలయును. సత్యవంతులు ప్రతిజ్ఞా భంగము చేయరు. మాట యిచ్చి తప్పుట **పాపము.** చాడీలు చెప్పరాదు. రహస్యములను వెల్లడి చేయరాదు. ఒక అశ్వము యిచ్చెదనని మాట ఇచ్చి తప్పిన వానికి 100 అశ్వములను

చంపిన పాపము, ఒక గోవును యిచ్చెదనని మాట యిచ్చి తప్పిన వానికి వేయి గోవులను చంపిన పాపము వచ్చును. మాట యిచ్చి నిలబెట్టు కొనవలయును. అసత్యము భూతహితముగా పలికినచో సత్యము కంటె గొప్పది. ఆడవారి విషయమున, వివాహసమయమున, ప్రాణ,విత్తమానభంగములందు, గో, బ్రాహ్మణ రక్షణమునందు (ఆత్మీయుల రక్షణ విషయమున అసత్యము దోషము కాదు. సీత హనుమంతుని గురించి రాక్షస స్త్రీలతో అతడు తనకు తెలియదని పల్కినది). స్వజనమునకు బాధగలుగింపకుండా ఉండు సమయములందు అబద్ధము ఆడవచ్చు. (రాముడు సుమంతునితో దశరథుని మాట వినబడలేదని చెప్పమనును.) మాట ఇచ్చి (ప్రతిజ్ఞ చేసి) అలా చేయని వానికి ఇష్టా పూర్తముల వలన గలిగిన పుణ్యాము నశించును. (బాలకాండ 21-8).

**ఉపకారము:** అపకారికి కూడ ఉపకారము చేయవలయును కావున పుణ్యాత్ములు సర్వుల యందు దయ చూప వలయును. పాపాత్ములకు కూడ చెడు చేయరాదు. ఉపకారము చేసిన వానికి ప్రత్యుపకారము చేయవలయును. ఇది సనాతన ధర్మము.

**ప్రతిక్రియ :-** ఆపద రానున్నదని తెలిసినపుడు ఆపద నివారించుటకు తగిన ప్రతిక్రియ చేసుకొనవలయును.

**దూషణ** : దుర్భాషా ఘనశరములు మనమున నాటి బాధ గలిగించును. దాని వలన రోషము వచ్చును. రోషము వలన శోకము, శోకమువలన కంటి నుండి కన్నీరు వచ్చును. బాంధవుల దురుక్తులు మనస్సున నాటుకొని చిత్తము అహర్నిశము పరితాపము గలిగింపగా నరుడు కృశించును. సాధువులను దూషించుట తగదు.

**నింద** : అంగహీనులను, దరిద్రులను, విద్యావిహీనులను, రూపహీనులను నిందించుట **పాపము.** సుజననిందా దోషమున అధోగతి గలుగును. పెద్దల చేతలు అల్పులకు తెలియవు కావున పెద్దలను నిందించరాదు. గురునింద, విప్రనింద,సుజన నింద, పరనింద, దేవతానింద, వేదనింద **పాపము.** జడస్వభావము గల దేహమే ఆత్మఅని పలుకు వారు మహాత్ముల నిందించుట కార్యము కాదు.

**స్తుతి :** ఆత్మస్తుతి దోషము, అతిహేయము.ఆత్మస్తుతి **పాపము.**

**పరిహాసము** : పరిహాసము రహస్యముగా చేయవలయును. క్రూరులతో, అనార్యులతో పరిహాసముచేయరాదు.

**కోపము :** ఉధృతముగా వచ్చిన కోపమును పరిత్యజించవలయును. కోపమును వివేకము చేత అణుచుకొన్నవాడే పురుషులలో శ్రేష్ఠుడు. శత్రువుల మీద కోపమును చూపవలయును. కోపము చూపు వానికి అందఱూ భయపడుదురు. ఉధృతముగా వచ్చిన కోపమును అణుచుకొనకుండుట దోషము. కోపముచే తపస్సు హరింపబడి ఆత్మలో శాంతిని పొందలేక పోవును. ప్రజ్వరిల్లుచున్న అగ్నినినీటితో చల్లార్చినటుల, కోపమును తమ బుద్ధితో నిరోధించగల మహాత్ములగు పురుషశ్రేష్ఠులు ధన్యులు. కోపము వలన గురువులను కూడ చంపును. సాధు పురుషులను కూడ దూషించును. కోపము వలన పాపము చేయనివాడెవడు ? కోపించినచో ఏది పలకవలయునో ఏది పలుకరాదో తెలియదు. కోపించు వానికి ఏది చేయరాదో తెలియదు. పలుకరాని పలుకులను కూడ పలుకును. పాము తన కుబుసమును విడిచినట్లు క్షమ వలన తన కోపమును అణుచుకొనినవాడు సత్పురుషుడు అనబడును.

**అపహాస్యము** (హేళనగా మాటలాడుట): ఇతరుల పుత్రులను భార్యలను అపహసించుట పాపము. అతడు **తామిస్రము** అను నరకమున బడును. యమ భటులు కట్టెలతో చావబాదుచు, కొండపై నుండి దొర్లించుచూ అన్నం పెట్టక బాధింతురు. పెద్దలను అపహాస్యము చేయుట **పాపము.**

**భృత్యుడు :** భృత్యుడు చేసిన అపరాధమును క్షమించవలయును. అపరాధము చేయనివాడు ఎవరు ఉండరు కదా ! లోకములో ఏదో ఒక తప్పు చేయని వాడుండడు గదా. మంచి సేవకుడు కాని వానిని పోషింపకుండుట పాపము కాదు.

**తృష్ణ :** జనులు సుఖము కోరి తృష్ణకు లోనై దుఃఖములు గలుగునట్టి కార్యములు చేయుదురు. కావున తృష్ణ ఉండరాదు.

**ఆశ :** "ఆశాపాశము దా గడున్ నిడుపు లేదంతంబు" అనగా ఆశకు అంతులేదు. కావున ఆశ ఉండరాదు.

**లోభము :** లోభము వలన ఇతరుల సొమ్ము అపహరింతురు. రాజ్యసుఖ లాభము వలన స్వజనులను చంపుచున్నారు. కావున లోభము ఉండరాదు.

**మత్సరము** : నిరహంకార, నిరస్తపాపులైన సుజనుల కీర్తిని కొందఱు కామించి ఊరక మత్సరింతురు. మత్సరము ఉండరాదు.

**విచారించుట** : దైవ తంత్రంబైన పనికి వగవంబనిలేదు.

**పగ (వైరము) :** దేహ ధారులు చనిపోయిన పిదప వారితో పగ ఉండరాదు.

**ద్రోహము** : భూత ద్రోహి శుభము పొందడు. భూతములకు ఎగ్గు చేసిన ఎగ్గు పుట్టును. కుటుంబ పోషణార్థము పరులకు ద్రోహము చేయుట **పాపము.** ఇతడు **రౌరవమను** నరకమున బడును.

**మేలు మఱచుట** : తనకు ఇతరులు చేసిన మేలు మఱచిపోవుట **పాపము.** ఇతరులకు మేలు చేసి పది మందికి చెప్పుట **పాపము.**

**విషాదము-శోకము:** విషాదము చాలా చెడ్డది. విషాదము పురుషుని బలపరాక్రమ ములను చంపివేయును. మనస్సులో విషాదము రానీయకూడదు. పరాక్రమము చూపవలసిన సమయములో విషాదమును పొందిన తేజోవిహీనుని కార్యములు ఏవీ సిద్ధించవు. శోకము మానవుని శౌర్యమును తగ్గించి వేయును. శోకముతో క్రుంగిపోవు వానికి సుఖముండదు. వారి తేజస్సు క్షీణించిపోవును. శోకాక్రాంతుడైన వానికి జీవిత విషయమున సంశయమేర్పడును (ఆత్మహత్యకు పాల్పడ వచ్చును). శోకము పనులను చెడగొట్టును. శోకము ధైర్యమును, శాస్త్రజ్ఞానమును సర్వమును నశింపచేయును. శోకము వంటి శత్రువు లేడు. శోకము ఎంత చిన్నదైనను దానిని సహించుట కష్టము, శోకము చేత మనస్సు మూఢమై మోహము చెందును. దుఃఖించు వాని పనులన్నియు చెడిపోవును. దుఃఖము వలన నిద్రరాదు. అధైర్యమును అవలంబింపకూడదు. మూర్ఖుడు అధైర్యముతో ఉండి శోకములో క్రుంగిపోవును. అధైర్యమును విడచి కార్యము నందు శ్రద్ధ చూపవలయును.

**అవమానము :** పెద్దలకు అవమానము చేయుట **పాపము.** నీచ వర్ణుడు నిష్ఠ సలుపుచూ తపోదాన విద్యాచారంబుల పెద్దలకు అవమానము చేయుట **పాపము.**

ఇతడు **క్షారకమను** నరకమున బడును. యమభటులు ఇతనిని తలక్రిందుగ వ్రేలాడదీసి బాధింతురు. మహాజనావమానంబున జనులు శీఘ్రంబె నశింతురు.

**అపకారము :** సాధువులకు, పేదవారికి, బ్రాహ్మణులకు అపకారముచేయుట **పాపము.**

**పాపము :** ఉత్తమ బ్రాహ్మణులు, పెద్దలు కోపముతో తిట్టిరి కొట్టిరి అని వారలకు అపకారము చేయుట **పాపము.** ఇది తగును ఇది తగదని ఆలోచింపక పేదవారికి, సాధువులకు అపకారము చేయుట **పాపము.** నమ్మిన వారికి, పెద్దవారికి, భోజనము పెట్టిన వారికి అపకారము చేయుట **పాపము.**

**సాక్ష్యము :** లంచము తీసుకొని అబద్ధపు సాక్ష్యము చెప్పుట **పాపము.** కపట సాక్ష్యము చెప్పుట **పాపము.** ఇతడు నరకమున తన మాంసమును తనే తినును. ఇతడు **వీచీరయమను** నరకమున బడును. వానిని యమభటులు ఎత్తైన కొండపై నుంచి విసిరివేయుదురు.

**పాప ప్రకటన :** పాపకర్మల పాపాన్ని ప్రకటించే వారికి కూడ పాప ఫలము అంటు కుంటుంది.

**తగవు :** భూమి,బంగారము, వెండి,ధనము ఇవి తగువుకు కారణములు.

**అపరాధము :** మహాత్ములకు ఎగ్గు ఒనరించు వారిజన్మములు వ్యర్థము. సుజనాపరాధము **పాపము.** అట్టి పాపాత్ములకు ఆయువు, సిరియు నశించిపోవును.

**హింస :** దేహాభి మానులై పశుప్రాయులై భూత హింస గావించుట హృషీకేశాను వర్తనులయిన సాధువులకు తగదు. పరులకు హింసలు గావింపగవలదు. తనకు మంచిదని ఇతరులను హింసించిన ఆ పాపఫలము పొందుదురు. యశము, సిరియు, ధర్మము, ఆయువు, భద్రంబు, ఇవి ఆర్యహింస సేయుటవలన నశించును.

**హత్య (వధించుట) :** దీనులను, అతిథిని, అభ్యాగతుని, భయస్తుని, శరణాగతుని, ముని జనములను స్త్రీలను, బ్రాహ్మణులను, గోవులను,విశ్వసించిన వారిని, పోషించువారిని, బాలురను, శిశువులను, వృద్ధులను, అంధులను, సఖులను, తల్లి తండ్రులను, తోబుట్టువులను, బంధువులను, నిద్రపోయిన వారిని, ధనవాంఛ వలన

నిరాయుధుని చంపుట **పాపము.** రాజును చంపుట **పాపము.** పశువులలో ఆడ జంతువులను చంపరాదు. దుష్ట జంతువులను చంపినా పాపము లేదు. ఒకడు ఇతరులకు హింస చేయునపుడు వానిని చూచిన పురుషుడు శక్తి గలిగియు ఆ హింసను వారింపనిచో హింస చేసిన వాడు పొందు పాపమును ఆ హింసను వారింపని వారు పొందుదురు. ఎవరు కరుణలేకుండా ఇతరుల ప్రాణములు వధింతురో వారు నరకమున బడుదురు. భ్రూణహత్య **పాపము.** వేదాభ్యాసము, గృహస్థ ధర్మములను చక్కగా ఆచరించుచున్నవాడు స్త్రీని చంపవలెనని కోరడు. అనేక స్త్రీల భర్తలను చంపిన ఆ పతివ్రతల కన్నీళ్ళు ఊరకపోవు. తపస్సు చేయువారిపై గాని బ్రహ్మచారిపై గాని ఆయుధమును ప్రయోగించరాదు. అపకారము చేసిన వారిని చంపుటలో దోషము లేదు. అధర్మపరులను అధర్మముగా చంపినా పాపము లేదు.

**బలి** : భైరవపూజ **పాపము.** అనగా మనుష్యులను క్షుద్ర దేవతలకు బలియిచ్చుట పాపము. యజ్ఞములో పశువులను చంపుట పాపము కాదు. స్త్రీ పురుషులెవ్వరైన శరీర రక్షణార్థము పశువులను, మానవులను బలి యిచ్చుట **పాపము.** వీరు **రక్షోగణ భోజనము** అను నరకమున బడుదురు.

**ఆత్మహత్య: "వినాశే భహవో దోషా జీవన్ భద్రాణి పశ్యతి"** (సుందరకాండ 13-47) మానవుడు బ్రతికియున్నచో శుభములుబడయవచ్చు, మానవుడు జీవించి ఉన్నచో నూఱు సంవత్సరములుకైనా ఆనందము పొందవచ్చు. ఆత్మహత్య మహాపాతకము. ఆత్మహత్య చేసుకొనరాదు.

**దండన:** బ్రాహ్మణులను, గోవులను, స్త్రీలను, దండించుట **పాపము.** గర్వి, కార్యస్వరూపమును తెలియనివారు, లోక మార్గమును పాటింపక ఉన్మత్తునిగా ప్రవర్తించువాడు అయిన గురువు దండనార్హుడు. ఇట్టి గురువులను దండించినా పాపము లేదు.

**తరుముట** : పశువులను,రోగులను, ఆడువారిని తరుముట **పాపము.** గోవులను తన్నుట **పాపము.**

**విషము పెట్టుట :** విషముపెట్టి చంపుట **పాపము.**

**గృహదహనము :** రాజపుత్రులు, దొంగలు,వీరలు ధనికుల గ్రామములపైబడి గృహదహనము చేయుట, విషము పెట్టుట చేసిన **పాపము.** వీరిని **సారమేయమను** నరకములో పడవేతురు. కుక్కలు వాటి కోరలతో వీరిని పీక్కుతినును.

**తగుల బెట్టుట :** ఊరు,ఇల్లు,అడవి తగుల బెట్టుట **పాపము.** గోవుల మేత కొఱకు అడవి గాల్చుట పాపము కాదు.

**పాడుచేయుట :** పంటలు పాడు చేయుట **పాపము.**

**చెఱ పట్టుట :** స్త్రీలను చెఱ పట్టరాదు.స్త్రీలనుచెఱపట్టుట **పాపము.** పరధనాపహరణ, పరదారాగమనము, మంచివారిని శంకించుట అను మూడు దోషములు వినాశము కలిగించును.

**పరిత్యాగము :** ఆశ్రితులను విడుచుట **పాపము.** తనయందు భక్తిగలవారిని విడుచుట మహాపాపము, బ్రహ్మహత్యతో సమానము. దోషరహితులును, ధర్మపరులను విడుచుట ధర్మ విరుద్ధము. (రాముడు సీతా పరిత్యాగము చేసినట్లు చెప్పబడిన కథ ఒక యోగ పాఠము మఱియు అమృతత్త్వమునకు సోపానము).

**విశేషధర్మము :** ధర్మభ్రష్టుడైన వానిని విడిచినవాడు సుఖము పొందును. పరుల ధనమును హరించుట యందు ఆసక్తి , పరదారాగమనము చేయు పాపాత్ముణ్ణి విడిచివేయ వలయునని పెద్దలు చెప్పుదురు. తల్లి, తండ్రి, సోదరుడు, బంధువర్గము వీరు అధర్మము చేసినచో వారిని వదలుట పాపముకాదు. వారిని వదలవలయును.

**హింస :** దీపము వలన పురుగులు కాలిపోయినా పాపము లేదు. నాగలి దున్నుతున్నప్పుడు నానావిధ ప్రాణులు నశించినా పాపము లేదు. సాధు జంతువులను హింసించిన **పాపము.** ఇతడు **మహా రౌరవము** అను నరకమున బడును. ఇతడు హింసించిన ఆయా మృగములు పక్షులు భయంకర రూపములతో బాధలు పెట్టును. ఇంటిలో గాని, దొడ్డిలో గాని, పశువులను పక్షులను పట్టి హింసించిన **పాపము.**

గోహత్య పాతకము. జంతువులలో ఆడజంతువులను చంపుట **పాపము.** అతిశయమున పశువులను చంపి యజ్ఞము చేయుట **పాపము.** ఇతడు **విశసము** అను నరకమున పడును.

**వధ :** పంటలు పాడు అగుచున్నవని, మూషకాదులను బిల నిరోధము చేసి వధించుట **పాపము.** ఇతడు కుంభీపాక నరకమున పడును. ఇతనిని మరుగుతున్న నూనెలో వేయుదురు.

**శూలమునకు గ్రుచ్చుట :** గ్రామ, అరణ్యా జంతువులను శూల ప్రోతము గావించి హింసించుట **పాపము.** ఇతడు శూల ప్రోతము అనే నరకములో పడును. ఇతనిని యమభటులు శూలములతో పొడిచెదరు. రాబందులు, గ్రద్దలు వారిని పీక్కు తినును.

**పీడ :** దూర్త స్వభావంబున జంతుపీడ గావించుట **పాపము.** ఇతడు **దంద శూకము** అను నరకమున పడును. ఇతనిని ఏడు, ఐదు ముఖములు గల సర్పములు గఱచును.

**బాధించుట :** బ్రాహ్మణులను బాధించుట **పాపము.** స్వేచ్ఛా విహారంబుల సంచరించు సాధు పశుపక్షి మృగాదులను బాధించుట **పాపము.** ఇతడు **వరటు నిరోధమనే** నరకమున బడును. వృధాగా పశువులను కొట్టుట **పాపము.** గోవు ముట్టి కుట్టువాడు పాపి.

**నిరోధించుట :** నీరు త్రాగుటకు వచ్చిన గోవును నీరు త్రాగకుండా చేయుట **పాపము.** జంతువులను హింసించువాడు, **అంధకూప నరకము**న బడును. క్రూర మృగ పక్షి పశు సర్ప దోమలు నల్లులు ఈగలు ఇతనిని పీక్కు తినును.

**సంభోగము :** జంతువులతో సంభోగించిన **పాపము.** ఇతడు **శాల్మలి** నరకమున పడును. కఠిన మైన మేకులు గల బూరుగు చెట్టుకు కట్టి బంధించి హింసింతురు.

**పాలు పితుకుట :** లేగదూడకు పాలు లేకుండ పాలుమొత్తము పితుకుట **పాపము.** పాపాత్ములను సేవించుట **పాపము.**

యుద్ధ రంగము నుండి పాఱిపోవుట **పాపము.** పుణ్యాకార్యములకు విఘ్నము చేయుట

**పాపము.** వేద మార్గమును విడచి పాషండ మార్గమున నడచుట **పాపము.** ధర్మమార్గమును పాడు చేసినా, అధర్మ మార్గమున నడచినా **పాపము.** లోలత్వము, అభిమానము, లోభము, మోహము, మత్సరము ఉండరాదు. లోకంబున ప్రాజ్ఞులయిన వారు దేహాభిమానంబు గల పురుషులందు, అల్పుల యందు నమస్కారము గావింపరు. వారు మనంబు లందు నమస్కారము గావింతురు. అష్టాంగములతో పెద్దలకు నమస్కారము చేయవలయును. లోకంబున జనులు అన్యోన్యము ప్రత్యుత్థానములు వందనము గావింతురు. రాజునకు మరణాంతరము ఉత్తమజన్మ లభించుటకు వనవాసము అమృతము వంటిది. అపర ధర్మమును పాటించ వలయునే గాని అపర ధర్మమును వదలరాదు అను అర్థమున ధర్మమును అధిక్షేపించిన వానికి ప్రాయశ్చిత్తము లేదని చెప్పిరి. కాలపాశముచే చుట్టబడిన పురుషులు మనస్సు జ్ఞానేంద్రియములు సరిగా ప్రవర్తింపని కారణమున ఏది చేయదగినదో, ఏది చేయరాదో ఎఱుగడు. మిత్రద్రోహము **పాపము.** కులక్షయ కృతం దోషం. అనగా కులక్షయము చేయుట **పాపము.**

**కులక్షయే ప్రణశ్యంతి కులధర్మాస్సనాతనాః**
**ధర్మే నష్టే కులం కృత్స్న మధర్మోఽభి భవత్యుత**

(అర్జున విషాద యోగము-40)

**వర్ణ సంకరము** దోషము. వర్ణ సంకరము వలన నరకము కలుగును. మఱియు పితృదేవతలకు పిండోదక క్రియలు చెందవు.

**సంకరో నరకాయైవ కులఘ్నానాం కులస్యచ**
**పతంతి పితరో హ్యేషాం లుప్త పిండోదక క్రియాః**

(అర్జున విషాద యోగము-42)

**ఉత్సన్న కులధర్మాణాం మనుష్యాణాం జనార్దన**
**నరకేఽ నియతం వాసో భవతీ త్యనుశుశ్రుమ**

(అర్జున విషాద యోగము-44)

పుణ్యపాపముల గుఱించి సంక్షిప్తముగా ఇట్లు చెప్పబడినది.

క॥ ఒరులేమేమి యొనర్చిన
నరవర యప్రియము తన మనంబున కగుఁదా
నొరులకు నవి సేయకునికి
పరాణయము పరమ ధర్మపథములకెల్లన్

(శాంతి పర్వము, పంచమాశ్వాసము, 220)

**సారాంశము :** జాతి ధర్మములను, ఆశ్రమ ధర్మములను పాటించవలయును. విధులు బాధ్యతలను నెఱవేర్చ వలయును. మంచి పనులు చేయవలయును. పాపపు పనులు చేయరాదు. ప్రాణులందఱికీ భయము కలిగించు పాపాత్ముడు త్రిలోకాధిపతియైనను చాలాకాలము సుఖముగా జీవించడు. అట్టి వానిని ప్రజలు పామును చంపినట్లు చంపివేయుదురు. అట్టి పాపాత్ముడు తన కర్మకు తగిన ఫలము అనుభవించును. పాపాత్ములకు కొంతకాలము ఐశ్వర్యము లభించినను చివరకు మొదలు నరికిన చెట్టువలె కుప్పకూలెదరు. పాప ఫలితము వెంటనే గలుగదు. కొంతకాలము పట్టును. (అరణ్యకాండ 49-27) ఆయా కాలము వచ్చినప్పుడు వృక్షములు పుష్పములను పూచినట్లు ప్రతి వ్యక్తి సమయము వచ్చినప్పుడు అతడు చేసిన పాపకర్మ ఫలితమును తప్పక అనుభవించును. భుజించిన విషాహారమువలె పాపకర్మఫలము అచిరకాలముననే లభించును.

భూలోకమున ఒకవ్యక్తి పాపము చేయు చుండగా చూచిన వ్యక్తి సాక్షి. సాక్ష్యము ఆధారముగా పాపులను రాజు శిక్షించును. పరలోకమున, మానవులు చేయు పాపపుణ్యములకు సూర్యుడు, చంద్రుడు, గ్రహములు, ఆకాశము, వాయువు, అగ్ని, భూమి, జగత్తు, దిక్కులు, పగలు, రాత్రి, సంధ్యలు, ఋతువులు, కాలము, రాత్రి సంచరించు రాక్షసులు, భూతములు, ఇతర దేవతలు, ధర్మదేవత (యముడు), వేదములు, గోవు, గంధర్వులు, గృహదేవతలు, అంతరాత్మలు సాక్షులు. కావున ఎవరూ సాక్షులు లేరని భావించవలదు. భూలోకమున దండన తప్పించు కొనినను,పరలోకమున దండన తప్పదు. మూడు లోకములకు చివర దక్షిణ దిక్కున నరకములుండును. యముడు నరకమునకు వచ్చు పాపుల

కర్మంబులకు తగిన ఫలంబునిచ్చి శిక్షించుచుండును. కావున దేహముండగానే పుణ్యచరితుడై పాపము తొలుగు విధము నాచరింపవలయును.

తపము, వేదాధ్యయనము, యజ్ఞము, దానము, శమము, సత్యము, బ్రహ్మచర్యము, దమము, శౌచము, యమనియమాదులు, ధర్మవర్తనము, పశ్చాత్తాపము, ప్రాయశ్చిత్తము, భక్తి మొదలయిన వాటివలన పాపములు నశించును. ప్రాయశ్చిత్తములు అల్పములైనను పాపములను పోగొట్టును. భగవంతుని పేరుతో పుత్రుని పిలిచినా, పరిహాసమునకైనా, ఆటలందు అయినా, పద్యగీతముల ద్వారా అయినా, నారాయణ నామస్మరణ పాపములను పోగొట్టును.

పాలకులు చక్కని పాలనను అందించవలయును. ప్రభుత్వఉద్యోగులు నిజాయితీ పరులై వారి విధులను బాధ్యతలను సక్రమముగా నెఱవేర్చవలయును. దురహంకారులు కారాదు. ప్రజలు వారి విధులను, బాధ్యతలను నెఱవేర్చ వలయును. అప్పుడు ఋషులు కాంక్షించిన మరోప్రపంచము ఏర్పడును. దేశము సుఖశాంతులతో వర్ధిల్లును.

*****

# పెద్దలకు ఉండవలసిన లక్షణము

**లక్షణములు :** ఆర్జవము ఋజు ప్రవర్తన అనగా మాయ, కపటము, మోసము, దగా లేకుండుట. క్రోధరాహిత్యము కామ లోభాదులు లేకుండుట, అసూయ, అహంకారములు లేకుండుట దీనత్వము లేకుండుట. డాంబికత్వము (మాటలలో వేషములో) లేకుండుట. అఖిల భూతదయ, నిత్యసంతోషము గలిగి ఉండుట. తెలియక చేసిన తప్పుకు ప్రాయశ్చిత్తము చేసికొనుట. శరణాగతికి శరణు యిచ్చుట లక్షణములు. సత్పురుషులు దేహాభిమానము లేకుండుటచేసి భూతంబుల యెడ అనగా సర్వ ప్రాణుల యెడ ద్రోహంబు ఆచరింపరు. ఇతరుల వలన ద్రోహము గలిగిన అది దైవకృతంబని తలతురు. మనుజోత్తములు ఆత్మహితము చిత్తము నందు కోరరు. వారు జనులకు అర్థసంపత్తి , ఐశ్వర్యము, సుఖము, శ్రేయస్సు, కోరుదురు. వీరు శరీరమును పరుల రక్షణకై పరోపకారమునకై వినియోగింతురు. బుద్ధిమంతులు రూప, యౌవన, ధన, విభవ, ప్రియ, సంవాసంబులు అనిత్యములని ఎఱిగి వాటిని మోహింపరు. ధర్మజ్ఞుడు ఇతరులు అలిగినా తను అలుగక, ఇతరులు దూషించినా విననట్లు మాఱు పలుకక, ఆపదలయందు ధైర్యము కోల్పోవక ఉండును. ఉదా: రాముడు పట్టాభిషేక విఘ్నమున ప్రవర్తించిన తీరు. విరక్తులకైనను తన యంత లభించు సౌఖ్యతతి వర్జింపదగదు. సాధువులు భగవంతునినే శరణము కోరుదురు. రక్షణము లేక సాధువు రక్షితుడగు. ధీరబుద్ధులకు మనో భావ మొక్కటియె అభావ్య భావ్య పరీక్షకు ప్రమాణము.

సత్కుల జాతులయిన బ్రాహ్మణ, క్షత్రియులకు మంచి లక్షణములు ఉండ వలయును. లేనిచో వారు ఛండాలురని పిలువబడుదురు. ఈ విషయమునే కథలుగా చెప్పిరి. భారతము అనుశాసనిక పర్వములోఒక బ్రాహ్మణుడు అకారణముగా గాడిద పిల్లను కొట్టినాడు. అనగా అకార్యము చేసినాడు. చేయకూడని పనిచేయుటవలన గాడిద అతనిని ఛండాలుడనెను. రామాయణంలో త్రిశంకుడు గురువును వదిలినాడు. గురుపుత్రులను వదలి తను యింకొక గురువును చూచుకొనెదనని

చెప్పినాడు. ఆ విధముగా అతడు ఛండాలుడయినాడు. విధి విహితముగా యజ్ఞమును చేసినను స్వర్గప్రాప్తి పొందలేక త్రిశంకు స్వర్గములో ఉన్నాడు. గురువును శపించబోయి కల్మాషపాదుడు రాక్షసుడైనాడు.

**పెద్దల బాధ్యత :** ఇతరులను తనవలె చూడవలయును. అపకారికి కూడ ఉపకారము చేయవలయును. పరహితమే ధర్మము అని ఒక కార్యార్థమై యితరులను యాచించెదరు. అదియు పెద్దలకు శోభాయమానము (ఉదా- వామనుడు ఇంద్రుని పనికై బలిని యాచించెను) ధార్మికుల సొమ్ము వినయోచితముగా పొందవలయును. పెద్దలు చేసిన పనినే పిన్నవారు చేయుదురు. గాన పెద్దలు పౌరవిధులు బాధ్యతతో చక్కగా నిర్వర్తించవలయును.

**ఆర్తజన రక్షణ :** యజ్ఞయాగాది పుణ్యఫలము, వేదములు చదివిన ఫలము, ఆర్తులను గాచిన ఫలముతో సమము కావు. ఆర్తులయిన వారి కోరికలు వ్యర్థంబులు గాకుండాతీర్చుట సత్పురుషుల ధర్మము. సాధు రక్షణంబు సజ్జనులకు భూషణము. శరీరధారులకు ఆపద వచ్చిన వారి ఆపద గ్రమ్మన మాన్చి వారికి సుఖములు చేయుట కన్న నొండు మేలు లేదు. తనకు తెలిసినది ఇతరులు అడిగినప్పుడు చెప్పకపోవుట **పాపము.** శరణాగతి యిచ్చు వానికి శక్తి గలిగియు శరణము యివ్వకపోవుట **పాపము.**

**పెద్దలు కూడ చేయరాని పనులు:** ఎంత జితేంద్రియులయినా ఏకాంతముగా ఆడవారితో ఉండరాదు. ఉన్నచో చిత్త చలనము గలిగి కామము గలుగును. ఆడవారితో నున్నప్పుడు ఎంత వివేక వంతులయినా జ్ఞానము కోల్పోవుదురు. ధర్మతత్త్వంబెఱుగువారు సతీజనంబులు కృతా పరాధులైనను దీనవత్సలతంచేసి వధింపరు. సదాచారములు వదులుట **పాపము.** సదాచారము చేయక దురాచారము చేయుట **పాపము.**

*****

## ఉపదేశములు

ఎవరు ఎంత బరువు మోయగలరో అంత భారమునే మోయవలయును. అనగా తనకు సాధ్యమయిన పనిని చేయుటకు సంకల్పించ వలయును. రాజువద్దనుండు చిన్నవారితో గాని పెద్దవారితో గాని తగువు పెట్టుకొనకూడదు. యౌవనము స్థిరముగా ఉండునదికాదు. సత్పురుషులు ఆచరించు మార్గమును అనుసరించవలయును. ఇతరులను ఆశ్రయించి జీవించు వాని జీవనము దుర్భరజీవనము. పిలువక పోయినా జనక, గురు, సుహృజ్జన, నాయక గేహంబులకు (ఇండ్లకు) ప్రజలు వెళ్ళుదురు. తండ్రి యింట్లో జరిగే శుభకార్యములకు వెళ్ళకుండా ఏ ఆడపిల్ల ఉండలేదు. అయినను వారు దేహాభిమాన మదంబున కోపిష్టులయిన పోరాదు. కుటిలురగు దుర్జన గృహములకు బంధుసరళి పోరాదు. అటుల వెళ్ళినను వారు అనాదరముగా చూతురు. స్మశానములోని పూలు, దేవాలయములోని పూలు స్త్రీలు పెట్టుకొనుటకు, శాంతికి పనికిరావు. వినాశకాలము దాపురించిన హితోక్తులు ఇష్టముకావు. సుఖము శాశ్వతముకాదు. ఎవరు తిరిగి రావలయునని కోరుకొందమో వారిని చాలా దూరము సాగనంపకూడదు. మానవులు జరామృత్యువులకు వశులగుదురు. ఎవరయినా ఒకవ్యక్తి ఎదురుగా కనబడుచున్నప్పుడు ఆ వ్యక్తి మీద ప్రేమ ఉండును. నిరంతరము చదవక పోవుట వలన విద్య శిథిలమగును. యౌవనం ప్రవహించిన నదివలె వెనుకకురాదు. ఇష్టుడు కాని వానికి ఎవరూ ఉపదేశము చేయరు.

*****

# మిత్రుడు

ధనవంతునితో దరిద్రునకు, తత్త్వవిదునితో మూర్ఖునకు, శాంతునితో క్రూరునకు, వీరునితో భీరునకు, సజ్జనునితో దుర్జనునకు స్నేహము ఏర్పడదు. సత్సాంగత్యము, స్నేహము, సంభాషణ, తగవు యివి సమానస్థాయి వారితో చేయవలయును. జితక్రోధుడు, ఇంద్రియములను జయించిన వారితో బుద్ధిమంతుడు స్నేహము చేయవలయును. సత్పురుషులతో స్నేహము చేయవలయును. దానివలన సద్గుణములు కలుగును. స్నేహము అధికులతో గాని, గుణహీనులతో గాని చేయరాదు. స్నేహితునకు హితము చెప్పవలయును. సుఖములో ఉన్నా, దుఃఖములో ఉన్నా మిత్రుడే మిత్రునకు గతి. ధనికుడైనా, దరిద్రుడైనా, దుఃఖములో ఉన్నా, సుఖములో ఉన్నా, దోషములు ఉన్నవాడైనా, దోషములు లేనివాడయినా, స్నేహితుడే ఉత్తమగతి. రక్తసంబంధపు చుట్టరికము కంటె మనస్సులు కలిసిన స్నేహము వలన ఏర్పడిన బంధుత్వము ఎక్కువ. స్నేహితులు వెండి, బంగారము, ఆభరణములు మొదలయిన వాటిని పంచుకొనక సమముగా అనుభవింతురు. స్నేహమునకు ఫలము ఉపకారము చేయుట. ధర్మము పాటించువాడు స్నేహితునకు ఉపకారము చేసియే తీరవలయును. ధనము, సుఖము, దేశమును, స్నేహితుని నిమిత్తము విడచుటకు వెనుదీయరు. ఇరువురు కార్యార్థులకు స్నేహము గలుగును. దుర్దశ వచ్చిన వానికి అట్టి దుర్దశ వచ్చినవాడే స్నేహితుడగును. చెడిపోయిన దీనుణ్ణి ఆదుకునేవాడే స్నేహితుడు. ఎవరైతే ఇతర పనులను విడచి, మిత్రకార్యము సాధించుటలో ఉత్సాహము చూపడో అతడు అనర్థములను పొందును. కాలము మించిపోయిన తర్వాత మిత్రుని కార్యము చేసిననూ, మిత్రకార్యమును సాధించిన వాడు కాజాలడు. ఉపకారము చేసిన వానికి ప్రత్యుపకారము చేయవలయును.

గుణవంతుడయిన మిత్రుని పోగొట్టు కున్నవానికి గొప్ప అర్థలోపము గలుగును. మిత్రునకు మాట యిచ్చి ఆమాటను నిలబెట్టుకొనినవాడు పురుషోత్తముడు.

ఉపకారము పొంది ప్రత్యుపకారము చేయక పోవుట ధర్మము కాదు. తనకు యింతకు పూర్వము ఉపకారము చేసినవారు ఒకపని మీద తన వద్దకు వచ్చినప్పుడు వారి కోరికలను తీర్చనివారు, తమ పనులు నెఱవేఱిన పిమ్మట మిత్రునకు ప్రత్యుపకారము చేయని కృతఘ్నుడు వధార్హుడు. గోహత్య చేసినవానికి, సురాపానము చేసినవానికి, దొంగతనము చేసినవానికి, వ్రతభంగము చేసినవానికి పెద్దలు ప్రాయశ్చిత్తమును చెప్పి ఉన్నారు. కాని కృతఘ్నునకి ప్రాయశ్చిత్తము లేదు. మిత్ర ద్రోహము **పాపము.** స్నేహితుని సంపాదించుట సులభము. కాని ఆ స్నేహమును రక్షించుకొనుట కష్టము. చిత్తము మారిపోవుట వలన చిన్న విషయములకు కూడ స్నేహము చెడిపోవును. అతి స్నేహము కూడ మరణమునకు దారి తీయును. మిత్రులు పేదరికముగా నున్నప్పుడు వారిని తీసుకువచ్చి పోషించవలయును. ధనవంతులు తనవారిని, మిత్రులను సంతోష పెట్టవలయును.

దుష్ట సాంగత్యము వలన సత్యము, శౌచము, దమము, దయ, ధృతి, మౌనము, బుద్ధి, సిగ్గు, క్షమ, యశము, శమదమాది గుణములు నశించును. చెడ్డవారితో స్నేహము, అనార్యులయిన వారితో స్నేహము వలన ప్రయోజనము లేదు. అనార్యుల స్నేహము గజ స్నానమువలె నిష్ఫలము. అనార్యులయిన స్నేహితులు నిలకడ లేక పువ్వునుంచి మఱియొక పూవును తుమ్మెద చేరునట్లు నిలకడ లేక యుందురు. చెడ్డవారితో స్నేహము పనికిరాదు. శరత్కాల మేఘములు ఎంత గర్జించినను వానపడనట్లు చెడ్డవారితో స్నేహము వలన ప్రయోజనము లేదు. పాపాత్ములతో తిరిగిన వారి ధర్మములు కూడ పోవును. సాధువులు అసాధువులతో సహవాసము చేసిన **పాపము.** ఏపాపము చేయనివారైనా పాపాత్ములతో సంబంధము వలన వారి పాపము వలన వీరు నశించిపోవుదురు. లోకములో ధర్మాత్ములయిన వారు పాపాత్ముల సహవాసమున సమూలముగా నశించిరి.

*****

## కార్యము

లోకములో చేయవలసిన కార్యము చేయవలయును. అనగా తన విద్యుక్త ధర్మములను పాటించవలయును. లోకములో కార్యము సాధించుటకు సంధి, విగ్రహము, యానము, ఆసనము, ద్వైదీభావనము, సమాశ్రయము అను ఆఱు ఉపాయములున్నవి. ఒక కార్యమును సామ, దాన, భేదోపాయములచే సాధింప లేని సమయమున పరాక్రమము (దండము) చూపించవలయును. లోకములో కార్యసాధకులు ఉత్తములు, మధ్యములు, అధములు అని మూడు విధములు. చేయవలసిన కార్యమును పూర్తి చేయగలవారే బుద్ధిమంతులు. కార్యసాఫల్యమును గూర్చిన అన్ని విషయములు తెలిసి చేయవలయును. కార్యసాఫల్యత గూర్చి తెలిసిన మిత్రులను కార్యము గుఱించి సంప్రదించవలయును. కార్యము పూర్తిచేయు వానికి దాని ఫలము తప్పక లభించును. శూరత్వము అవలంభించిన కార్యసాధనము అగును. ఏపని చేయుట వలన ధర్మము, భూలోకమున కీర్తి, ఆయుష్షు కలుగునో అట్టి కార్యములు చేయవలయును. సంశయ రహిత కార్యములు చేయవలయును. అసాధ్యమయిన కార్యము చేబూనరాదు. ఆకార్యము సాధించుటలో కలుగు ఫలితము కూడ ఆలోచింపవలయును. కాలమును గమనించి మిత్రుల సహాయము తీసుకొని పురుషకారమును వహించి కార్యమును ఆచరింపవలయును. కార్యమును కార్య సాఫల్యత గుఱించి తెలిసిన ఇద్దఱు ముగ్గురుతో కలసి ఆలోచించవలయును. ఏదైనా పని ప్రారంభించినపుడు ఆపని మంచిదా చెడ్డదా అను విషయమును దాని వలన గలుగు ఫలమును, దోషమును తెలుసుకొనని వాడు మూర్ఖుడు. ఒకపని యొక్క ఫలితమును గ్రహింపక ఆ పనిని చేయువాడు దుఃఖము ననుభవించును. దుఃఖము కలుగు అకార్యములను చేయరాదు. బుద్ధిహీనులు తాము చేయు పనులకు ఎట్టి ఫలితము కలుగునో గ్రహించక అట్టి కర్మలు, కార్యములు చేసి నశింతురు. మరణమాసన్నమయినవాడే అట్టి అధర్మయుతమైన కర్మలు చేయును. చెడ్డ ఫలితము కలుగు పనిని చేయరాదు. కార్యసిద్ధి, దిగులు చెందకుండుట,నేర్పు, మనస్సు ఉత్సాహముగా ఉండుట, అనునవి కార్యసిద్ధికి హేతువులు. కార్యము

యొక్క మూలమును రక్షించుకొనవలయును. మూలము స్థిరముగా ఉన్న సర్వగుణములు కార్యసిద్ధిని గలుగచేయును. (మూలము అనగా కార్యనిర్వాహకుడు రాజులేక నాయకుడు). హితము కోరువాడు సమర్థుడయిన మంత్రి, సమానప్రయోజనము గల మిత్రులు, బంధువులతో ఆలోచన చేసి ఎవడు పనులు ప్రారంభించునో, ఎవడు దైవమును అనుకూలముగా చేసికొనునో అతడు కార్యసాఫల్యకులలో ఉత్తముడు. ఎవడు అట్టి మిత్రులతో ఆలోచింపక ఒంటరిగానే ఆలోచన చేయునో, ధర్మాధర్మములను,మంచి చెడులను నిర్ణయించునో, ఎవడు ఇతరుల సహాయము లేక ఒంటరిగా పనులు చేయునో అతడు మధ్యముడు. పురుషకారమును విడిచి, గుణదోషములను పరికించక దైవము మీదనే ఆధారపడి కార్యమును ఉపేక్షించినవాడు **నరాధముడు.**

నిరుత్సాహము, దీనత్వము, శోకముచే వ్యాకులబుద్ధి గలవాడు చేయుకార్యములన్నీ చెడిపోవును. అతడు కష్టాల పాలగును. మనోవ్యాకులత్వము సకల కార్యములను నశింపచేయును. అతిగా ఏపని చేసినా అది కష్టములకు దారితీయును. దైవ కృతమైన కార్యమును మానవ ప్రయత్నముచే సరిచేయలేము. కార్యసిద్ధికై పురుష కారమునకు దైవమునకు సమమైన ప్రాధాన్యము యివ్వవలయును. (సుందరకాండ 36-19).

బుద్ధిమంతులు గడిచిన దానిని గాక చేయవలసిన కార్యమును ఆలోచించెదరు. నింద్యము, గర్వము చేత అహితము అయిన పాపకార్యము చేసిన వాటి ఫలితము పొందవలసి ఉండును. కార్యము చేపట్టు సమయమున దాని పూర్వాపరములు పూర్తిగా చెపితే బుద్ధిమంతుడు ఆదరించును. బుద్ధిహీనుడు చికాకుపడును. (ఉదా:సీతాపహరణకార్యమున మారీచుడు రావణునికి చేసిన హితబోధ) పాపపు పనులు చేయువారికి అకార్యమేదో కార్యమేదో తెలియదు. ఈ పని చేయవచ్చు చేయరాదు అని భావించకుండా అకార్యము చేయుట **పాపము.** ధైర్యము, దూరదృష్టి బుద్ధినేర్పు కలవాడు ఏకార్యమునయినా సాధించగలడు. అపజయము ఎఱుగడు.

*****

## అర్థము (ఆదాయము)

జీవికాదు లన్నియు వేదంబు వలన ప్రతి పాద్యంబులు. పగలు అర్థ ధర్మములందు చరింప వలయును. ధనము వలననే అన్ని పనులు సిద్ధించును. ధనమున్న వానికే మిత్రులు, బంధువులు చేరుదురు. ధనమున్నవాడే మొనగాడు. అతడే పండితుడు. అతడే పరాక్రమ వంతుడు, బుద్ధిమంతుడు,మహాభాగ్యశాలి. ధనమున్నవాడే గొప్ప సద్గుణ సంపన్నుడు. ధనవంతునికే ధర్మము, కామము, అర్థము కూడ సిద్ధించును. ధనమున్న వానికి హర్షము, కామము, దర్పము ఉండును. వానికి అంతా అనుకూలముగా ఉండును. అర్థము సుఖహేతువు. అది దొరకనందున ప్రజలు మహా దుఃఖమును పొందుదురు. ధనవంతునికి గాని భోగంబులు లేవు. ధనము వలన పశువులు, వివిధ వస్తువులు, వివిధ భోగ భాగ్యములు అనుభవించ వచ్చును. యజ్ఞము, పుణ్యాకర్మలు వీటిని విత్తవంతుడై సలుపవలయును.

**ధనహీనుడు** : ధనహీనుని పనులు గ్రీష్మఋతువులో చిన్నచెఱువులు ఎండి పోయినట్లు భగ్నములై పోవును. బీదవాడు ధనము కోసము ప్రయత్నించినను అది లభ్యము కాదు.

**ధనసంపాదన : ధర్మమార్గమున అర్థమును సంపాదించ వలయును.** కొంత ధనమున్నవారే యింకొంత సంపాదించగలరు. ప్రయత్నమున గాని ధనము రాదు. ఏపనీ ప్రారంభింపని వానికి సంపద గలుగదు. బలహీనుడైనను పని ప్రారంభిం చినచో పని ప్రారంభింపని అధికులను కూడ గెల్చును. ప్రయత్నమునకు దైవమను కూలించిన ధనము గలుగును. కృషి, వాణిజ్యాదులు, అర్థసంపాదన కారణములు. ధనము సంపాదించ వలయుననే కోరిక గలవాడు ధన సంపాదనలో వచ్చు కష్టములను గుఱించి ఆలోచింపక ముందుకుపోయిన అర్థమును సంపాదించ గలరు అని అర్థశాస్త్ర పండితులు చెప్పుదురు. ధర్మమును విడచి అర్థమునకు ప్రాధాన్యమిచ్చువాడు ద్వేష పాత్రుడగును.

**లక్ష్మీ నివాసము :** సత్యవ్రతుల యందు, శౌచము పాటించువారి యందు, గురుభక్తి గలవారియందు, అప్రమత్తుల యందు, సత్కర్మపరుల యందు, శమదమాదులు గల వారియందు లక్ష్మీనివాసముండును. అనగా వ్యసనపరుల యందు, జూదము, వ్యభిచారము,అధికవ్యయము, నిర్లక్ష్యము గలవారి యందు లక్ష్మి చిరకాలముండదు. ధనము వీధి బడిన దైవవశమున ఉండును. అనగా దైవము అనుకూలించిన నష్టము రాదు.

**ధనము కొఱకు :** దొంగతనం (మాయ, మోసము, కపటం, కల్తీ, నల్లబజారు) దోపిడి హత్య అనే పాపకృత్యములు చేయును. ధనము వలన దర్పము, కార్పణ్యము, మానము (గౌరవము), భయము, ఉద్వేగము పుట్టును. ధనము ప్రాప్తంబయిన అది దుఃఖకరము గాని సుఖకరము గాదు. ఎల్లరూ ధనవంతుల చుట్టూ చేరి నిత్యము వేధింతురు. అర్థవంతులకు రాజ, చోర, స్వజన, జన, జల, అగ్నివలన భయము కలుగును. ధనము సంపాదించుట, రక్షించుట, ధనవినాశములు దుః ఖములు. ధనము కొఱకు మోహము పడువారు పరలోకమున సుఖమును బడయలేరు. ధనవంతుడు ధర్మోపకారములు చేయకుండుట **పాపము.** యాచకునికి యివ్వక పోవుట **పాపము.** ధనవంతులై ఇంద్రియ సుఖములు కోరుచూ పుణ్యకార్యక్రమములు చేయక ధన వ్యామోహమున ఉండుట **పాపము.** ధనమును కూడబెట్టుటయే లక్ష్యముగా గలవారు, ఇతరులకు ఉపకారము చేయనివాడు, **సూచీముఖమనే** నరకమున పడును. బంధువులను మిత్రులను నాశనము చేసి లభించిన ద్రవ్యము విషముతో కూడిన పిండివంటల వంటివి.

**ఖర్చు :** ఆదాయము ఎక్కువ వ్యయము తక్కువ ఉండవలయును. తన సంపదను 5 భాగములుగా విభజించి. ధర్మమునకు, యశమునకు, ఆశ్రితులకు, అర్థమునకు, కామమునకు వ్యయము చేయవలయును. రాజు తన ఆదాయమును దేవతలకు, పితృ దేవతలకు, బ్రాహ్మణులకు, అతిథులకు, మిత్రవర్గమునకు, సైన్యమునకు, దేశాభివృద్ధికి వ్యయము చేయవలయును. అపాత్రులకు దానమివ్వరాదు. మొత్తం ఆదాయములో 1/4 వంతు లేదా 1/3 వంతు లేదా 1/2 భాగమును మాత్రమే ఖర్చు చేయవలయును. అపాత్రులకు దానమిచ్చుట, యాచకుల ఆశలు నిష్ఫలము చేయుట **పాపము.**

**ధనము విషయమున చేయకూడని పనులు**

రాజు నిరపరాధుల యొక్క ధనములను తీసికొనుట **పాపము.** సేవకుని చేత పని చేయించుకొని జీతము ఇవ్వకుండుట **పాపము.**

**దొంగతనము :** దొంగతనము చేయుట పాపము. లోభమున పరుల విత్తము అపహరించుట **పాపము.** నమ్మిన వాని సొమ్ము, ఇతరుల సొమ్ము, వికలాంగుల సొమ్ము, బ్రాహ్మణుల ధనము అపహరించుట, వెండి, బంగారం, గంధపు వస్తువులు దొంగిలించుట **పాపము.** చోరవృత్తిచే బ్రాహ్మణాదుల హిరణ్య రత్నాది ద్రవ్యములు హరించువాడు **సందంశమనే** నరకమున బడును. అగ్నితప్తశూల ములచే అతని శరీరము గ్రుచ్చుదురు. దొంగతనము చేసిన వాని భార్య కూడ మఱుజన్మలో అతని భార్యగా పుట్టును. అనగా భార్య తన భర్తను దొంగతనమునకు ప్రోత్సహించ రాదు. అతనిని దొంగతనము నుంచి మరలించవలయును అని భావన. (లంచగొండితనము, క్రయ విక్రయములలో దగా, మోసము, కల్తీ, నల్లబజారు వ్యాపారము, కాంట్రాక్టు పనులలో నాణ్యతలేని నాసిరకపు పనులు అన్నీ దొంగతనం క్రిందకు వచ్చును). గురువును రక్షించుసమయములో, ఆపద సమయములలో, దొంగతనము చేసినా పాపము లేదు.

**విక్రయము :** రసములు, లక్క, విషము, ఆయుధములు,విక్రయించుట తగదు. కేశములు విక్రయించుట తగదు. బ్రాహ్మణులు వేదము విక్రయించుట **పాపము.**

**తత్వ విదుడు :** జీవయాత్రకు కావలసినంత ధనమునే సంపాదించవలయును. అధిక ధనము సంపాదించ రాదు. అటుల ధనమును సంపాదించిన వాడు దొంగ వలె శిక్షార్హుడు. ధన ధాన్యంబులు దైవ లబ్దంబులు. కావున వాటిని దైవ కార్యములకు వినియోగించవలయును. ధనమునందు అభిమానము మాని అనుభవించ వలయును. న్యాయార్జిత ధనముతో దేవ, పితృ, ఋషి, మానవ, పశుపక్ష్యాదులకు వలయు కార్యములు అనగా పంచ యజ్ఞములు చేయవలయును. ధనము ఇచ్చి పెద్దలను తల్లి, తండ్రి, సుత, సోదర జ్ఞాతుల చిత్తములను సంతోషము కలిగించ వలయును. ధర్మ అనుష్ఠార్థమునకుగానీ యాత్రార్థమునకుగానీ ధనము కోరరాదు.

*****

## కామము

రాత్రి కామము నందు చరింపవలయును. ధర్మఅర్థముల కంటె కామము బలమైనది. ధర్మ అర్థములను విడచి కామమునే కోరువాడు ఆపదలలో చిక్కుకొనును. కామము పురుషులకు కష్టములు తెచ్చును. కామము క్షణిక సుఖము. కామపరత్వము ప్రశస్తము కాదు. లజ్జాకరమయిన కామమునకు వశుడగుట చేత చిత్త స్థైర్యము నశించును. చిత్త స్థైర్యము కోల్పోయిన పిమ్మట ఏకార్యమూ సిద్ధించదు. కామము ప్రతికూల స్వభావము కలది. ఏ వ్యక్తి పై కామము గలుగునో ఆ వ్యక్తి పై జాలి, స్నేహము కూడ గలుగును. (సుందరకాండ 22-4). కామాంధునికి కళ్ళు కనిపించవు. కామభోగములు అనుభవించుచున్నా కామము శాంతి పొందదు. ధర్మార్థములను విడిచి, కామమును మాత్రమే సేవించువాడు చెట్టుకొమ్మపై నిద్రించిన వానివలె పతనము చెందును. భూమికి, ధనధాన్యములకు, భామలకు, మానములకు, ప్రాభవములకు కామించి ఒకరినొకరు చంపుకొందురు.

**వ్యభిచారము :** వ్యభిచారము **పాపము.** వేశ్యాలోలుడు పాపి. వేశ్యాజీవనము **పాపము.** మదనాతురులగుచు స్త్రీ పురుషులు వావి వరుసలు మఱచి ప్రవర్తించువారు **వజ్రకంటకమనే** నరకములో పడుదురు. వీరిని అగ్ని మయంబులయిన ఉక్కుప్రతిమలను ఆలింగనము చేయింతురు. బ్రాహ్మణుడు శూద్ర కామినుల పొంది శౌచాచారమును మంట గలుపుట **పాపము.** ఇతనిని **పూయోద** మనే నరకములో పడవేయుదురు. అతడు మలమూత్రములు, లాలాజలము, కఫముతో గూడిన వాటిని భుజించు చుండును. గురు పత్నిని సోమయాజి భార్యను పొందుట **పాపము.** అతనిని **వీచీరయమనే** నరకమున పడవేయుదురు. వానిని ఎత్తైన కొండపై నుండి తలక్రిందులుగా విసిరివేయుదురు. బ్రాహ్మణ స్త్రీని కలసిన శూద్రుడు పాపాత్ముడు. పర స్త్రీలను కలియుట **పాపము.** పరకాంతలను వారి భర్తలను మోసపుచ్చి సంభోగించుట **పాపము.** అతడు **అంధతామిస్రము** అను నరకమున బడును. స్త్రీలు పురుషులు వ్యభిచరించిన **పాపము.** స్త్రీలను చెఱపట్టుట పాపము. బలాత్కరించుట **పాపము.** పరస్త్రీలను పొందుట, బలాత్కరించుట, హరించుట రాక్షస జాతి ధర్మములు అయిననూ ఇవి పాపములే.

కామము ఎంత అనుభవించినా తృప్తి కలుగదు. కామము వలన నివృత్తిగలవానికి ఎల్లకాలము భద్రము. వాసుదేవార్పణముగా ధర్మార్థకామముల ప్రవర్తించుచు నిత్య సంతుష్టుడయి ఉండవలయును. వాసుదేవార్పణముగా గృహోచిత క్రియలను చేయుచు పుత్ర, మిత్ర, కళత్రాది సంగమంబు కలవంటివి అని ఎఱిగి బాహ్యముగా ఆసక్తిఉన్నవానివలె ప్రవర్తించవలయును. ఏభార్యకై తన ప్రాణములనుకూడా విడచునో అట్టి భార్యయందు మోహమును విడచి అతిథి సత్కారమందు వినియోగించవలయును.

**వివాహము - ధర్మాధర్మముల ప్రకారము 8 రకములు**

**ధర్మపద్ధతి :-**

**1.** బ్రాహ్మము **2.** దైవము **3.** ఆర్షము **4.** ప్రాజాపత్యము-ఆడపిల్లగల తండ్రి తన కూతురును కులము, శీలము, విద్య గలవానికి అగ్నిసాక్షిగా ఉదక ప్రదానముగా వరుని తండ్రి సమక్షమున వరునికి యిచ్చుట. **5.** క్షాత్రము : (స్వయంవరం) కన్య తన తల్లిదండ్రుల సమక్షమున తనకు నచ్చిన వరుని వరించి పెండ్లిచేసుకొనుట. ఇందు కన్య అభిప్రాయమునకే విలువ.

**అధర్మము:** ద్వాపర యుగం నాటికి ఆచారములో ఉన్న (అధర్మ) వివాహములు **6.** గాంధర్వము (Love marriage) ఇరువైపుల తల్లిదండ్రులకు తెలియకుండా వధూవరులు స్వతంత్రముగా చేసుకున్న వివాహము. ఇది అతి రహస్యము. ఇందు వేద మంత్రములుండవు. (ఉదా: శకుంతల-దుష్యంతుడు) **7** కన్యాశుల్కము-వర విక్రయము : డబ్బిచ్చి చేసుకున్న పెండ్లి. **8.** ఆసురము (Kidnap) కన్యకు ఇష్టము లేదు అయినా కన్యను బలవంతముగా ఎత్తుకువచ్చి తనుగాని, తనవాళ్ళుగాని చేసుకున్న పెండ్లి, ఇదే రాక్షస వివాహము. (ఉదా: భీష్ముడు కాశీరాజ పుత్రికలగు అంబ, అంబాలిక, అంబికలను ఎత్తుకొనివచ్చెను. తన తమ్మునకు అంబాలిక, అంబికలను యిచ్చి వివాహము చేసెను.)

పైన చెప్పిన ఎనిమిది రకముల వివాహములలో చేరని 9వ పద్ధతి. కన్యకు ఇష్టము కానీ వారి బంధువులకు ఇష్టము లేదు. అప్పుడు కన్య యొక్క సంకేతాను సారము వరుడు వచ్చి కన్యను తీసుకొని పోయి వివాహము చేసికొనుట. ఇందు కన్య యొక్క అభిప్రాయమునకు వరుని సామర్థ్యమునకు విలువ. ఉదా:- రుక్మిణీ కల్యాణము.

**పాపము:** అన్న ఉండగా తమ్ముడు వివాహమాడుట ధర్మవిరుద్ధము. వివాహము చేసుకొనక పోవుట **పాపము.** సంతానము లేక పోయినను **పాపము.** అవివాహితులైనా, సంతానహీనుడైన వారు ఎంత తపస్సు చేసినా, దక్షిణ లిచ్చినా, యజ్ఞములు చేసినా సద్గతి చెందరు.

**పూర్వకాలమున స్త్రీలు :-**

ఆది యందు స్త్రీ పురుషులు స్వపర బేధములేక సంభోగ సుఖములలో ఉండెడివారు. ఈస్థితి ఉత్తర కురు దేశము లందు కలదు. స్త్రీలు పర పురుషులతో కలిసినచో పాపము అని శ్వేత కేతువు చెప్పెను.

**బహుభర్తృత్వము:** గౌతమి కూతురయిన జటిల అను ఆమె ఏడుగురిని, దాక్షాయణి అను మునికన్యక ప్రచేతసులు అను పది మందిని పెండ్లియాడిరి.

**సనాతన ఆచారము :-** అన్ని ధర్మముల కంటె కులము నిలుపుట మిక్కిలి ధర్మము. కావున పుత్రులు లేనిచో బ్రాహ్మణుని వలన పుత్రులను పొందెడివారు. అతిథికి తన భార్యను యిచ్చి సంతోష పరచెడివారు. పూర్వకాలమున స్త్రీలు సంధ్యావందనము ఆచరించెడివారు.

**సన్ధ్యా కాలమానాః శ్యామా ధ్రువమేష్యతి జానకీ,**
**నదీం చేమాం శుభజలాం సన్ధ్యార్థే వర వర్ణినీ.** (సుందరకాండ 14-49)

(శ్యామా) మంచి శరీర ఛాయ గల సీత మంచినీళ్ళు గల యానదికి సంధ్యోపాసన నిమిత్తము, ఈ ప్రాతః సంధ్యాకాలమున రాగలదు అని సుందర కాండలో కలదు. కౌసల్య ప్రాణాయామము చేసి ధ్యానినిమగ్నమై ఉన్నది అనీ, విష్ణుపూజ చేయు

చుండెనని, అగ్నిలో హోమము చేయుచుండెనని, దేవతలకు జలతర్పణ లిచ్చుచుండెను అనీ అయోధ్యకాండలో వర్ణింపబడెను. స్త్రీలు కూడ తిలోదకము లిచ్చెడివారు. స్మశానమునకు వెళ్ళెడివారు. వేద వేదాంగములు చదివి, ఆత్మదర్శన ప్రాప్తి పొందు సాధన చేసెడివారు. ఉదా:- కపిల మహర్షి తల్లి దేవహూతి, గార్గి.

**సామాన్య స్త్రీ స్వభావము** : స్త్రీలు తమ భర్తలు కష్ట కాలములో నున్నప్పుడు వారిని అవమానింతురు. సుఖస్థితిలోనున్న వారికి భర్తపై అనురాగము ఉండును. అతడు కష్ట స్థితిలో ఉన్నపప్పుడు అతనిని విడిచివేయుట స్త్రీ స్వభావము. (అరణ్యకాండ 13-5) భర్తపై అనురాగముండదు. స్త్రీలలో మెఱుపుకున్న చంచలత్వము, ఆయుధములకున్న తీక్షణత్వము, గరుత్మంతునికి, వాయువుకు ఉన్న వేగము ఉన్నవి (అరణ్యకాండ 13-6). స్త్రీలు ధర్మాధర్మ విచక్షణ లేనివారు. చపల స్వభావులు, తీక్షణ స్వభావము కలవారు. భేద భావనను కలుగ చేయువారు (అరణ్యకాండ, 42-30). స్త్రీలను బుజ్జగించిన కొలది పురుషుడు వాళ్ళకు స్వాధీనుడగును. మంచి మాటలతో చెప్పిన కొలదీ వాళ్ళు తిరస్కరింతురు. స్త్రీలలో యౌవనము స్థిరము కాదు. యౌవనము గడచి పోక ముందే సుఖించవలయును. (సుందరకాండ 24-35). ఆడవారి నిమిత్తము మంచివారయినా కొట్టుకు చత్తురు. కామినులను పెద్దలు విశ్వసింపరు. ఆడవారి చూపులను గెలువలేము. నిద్రిస్తున్నప్పుడు పరస్త్రీలను చూచిన ధర్మలోపము. కామదృష్టి లేక, నిర్మల మనస్సుతో కార్యార్థము చూచిన ధర్మలోపము లేదు. (సుందరకాండ 11-37) శుభా శుభములు పొందుటకు, ఇంద్రియముల ప్రవర్తనకు మనస్సేకారణము, కావున నిర్మల మనస్సుతో చూచిన ధర్మలోపము లేదు. (సుందరకాండ 11-38). ఆడవాళ్ళలో కొందఱు రహస్యముగా అపకారము చేయుదురు. సర్వదా స్వలాభము చూచుకొందురు. సత్కులము, ఉపకారము, విద్య, దానము, ఆదరణలు స్త్రీల హృదయమును ఆకర్షించవు. చపలుడు, ఇంద్రియ నిగ్రహము లేనివాడు, బుద్ధిహీనుడు, వేశ్యాలోలుడు, స్వభార్యను కాదని ఇతర స్త్రీలతో తిరుగువానిని ఇతరుల భార్యలు పరాభవింతురు. పరవనితాసక్తులకు పరదారాసక్త

లకు ఇహమూ పరమూ లేదు. అంగనాసక్తులకు కాముకుల సంగంబు నిరయ రూపంబగు సంసారంబగు. అతి మోహితులై విడువక సతులం తగిలెడి జడునకు బుద్ధి చాతుర్యంబులుండవు. ప్రియురాలిని యడబాసిన దుఃఖము కలుగును. స్త్రీలకు భవంతులు, వస్త్రములు, ప్రాసాదములు, తెరలు, రాజసత్కారములు గాక మంచి నడవడియే ఆభరణము. ఇష్టజన వియోగము నందు, రాజక్షోభమందు, యుద్ధములందు, స్వయంవరము నందు స్త్రీలు పర పురుషుల కంటబడవచ్చును. స్త్రీకి మొదటి గతి భర్త. రెండవ గతి కుమారుడు. మూడవగతి జ్ఞాతులు. నాలుగవ గతి లేదు. పరపురుషుని యింట ఉన్నస్త్రీని సత్కుల జాతుడు స్వీకరింపడు. స్వైరిణియగు భామిని పురుషాంతరాసక్తయగుట విచారించి పరిజ్ఞాని విడుచును. అవివేకియైన పురుషుడింద్రియ లోలుండై రతిం దగిలి దానిని విడువ నేరక పరిగ్రహించి ఉభయ లోకచ్యుతుండగు. భర్తలేని స్త్రీకి ఎంతమంది పుత్రులున్నను, ధనధాన్యసమృద్ధి గలిగియున్నను ఆమెను విధవ అనియే అందురు. విధవ పుణ్యోత్సవములకు దూరము కాగలదు. (సుందరకాండ 26-30). భర్తలేనిచో అలంకారము లేకుండా ఉందురు అని **దీర్ఘతముడు** చెప్పెను.

**భార్య యొక్క విధులు-బాధ్యతలు :** గృహస్థులందరికి భార్య ఆత్మవంటిది. గృహాలంకరణ చేయవలయును. సత్యము, ప్రియ సంభాషణ గలిగి భర్త చిత్తమును రంజింప చేయవలయును. ఉపవాసములు, వ్రతములు, తపము కంటె భర్తను దేముడని కొలుచు సాధ్వికి నిఖిల జగములలో దుర్లభము లేదు. పతివ్రతలు ఆత్మేశ్వరుండయిన ఆ పరమేశ్వరుని భర్తృభావంబున చేసి సేవించుచుందురు. స్త్రీకి భర్తయే దేవత. అతడే ప్రభువు. భర్తకు సేవ చేయవలయును. భర్త సేవ మాత్రముననే స్వర్గమును పొందుదురు. తల్లి, తండ్రి, కుమారుడు, స్నేహితులకంటె భర్తయే ఉత్తమ గతి. స్త్రీ భర్తను అనుసరించి ఉండుట ధర్మము. స్త్రీలు చంచల స్వభావులయినా పతివ్రతలు భర్తనే ఆశ్రయంచి ఉందురు. భర్త ఊరిలో లేని సమయములో శరీర సంస్కారము, కేళీవిహారము, వనమందిర గమనము, మహోత్సవ

దర్శనము చేయరాదు. స్త్రీ భర్తను పరిత్యజించరాదు. భర్తను అనుసరించని స్త్రీ నరకమున బడును. భార్య, భర్తకు స్వయముగా పరిచర్యలు చేయవలయును. ధాన్యముకానీ, ధనము కాని, అనవసరముగా ఖర్చు చేయరాదు. ఇల్లు, పరిసరములు, గృహోపకరణములు శుభ్రముగా ఉంచవలయును. బంధువులందరికి ఎల్లప్పుడు సంతోషము కలుగ చేయవలయును. చెడ్డవారితో స్నేహము చేయరాదు. ఇరుగు పొరుగు వారితోనూ, బంధువులతోను ప్రియముగా ఉండవలయును. ఇతరులతో హాస్యపు మాటలు, మితిమీరి నవ్వుట చేయరాదు. అత్తగారి ఎడల అణుకువ, విధేయత కలిగి అతిథులు వచ్చినప్పుడు వారికి వినయముగా భోజనాది పనులు స్వయముగా నిర్వర్తించవలయును.

**భర్త బాధ్యత:** కుల శీల, వర్తనముగల భార్య కోరిక తీర్చుట పతికి కర్తవ్యము. ఏపురుషుడయినా తనపై ప్రేమలేని స్త్రీని కామించినచో వాని శరీరమునకు తాపము మాత్రమే కలుగును. తనపై ప్రేమలేని స్త్రీని కామించువానికి ఆనందముగలుగదు. (సుందరకాండ 22-42).

**పాపము:** గుణవతియు, అనుకూలవతియు, సంతానవతియు, అగు భార్యను వదులుట **పాపము.** కట్టుకున్నభార్యను సంతోషపెట్టక, ఏడిపించుట **పాపము.** సంధ్యాకాలములో రతి నిషేధము. ఋతుమతియై పుత్రార్థము పతిని కోరినప్పుడు, పతి ప్రతికూలుడై ఋతు విఫలత్వముచేసిన అతనికి భ్రూణహత్య పాపము వచ్చును. భార్య చేత రేతఃపానము చేయించుట **పాపము.** కామమోహితుడై భార్యచేత రేతఃపానము చేయించువారు **రేతఃపాన నరకంబున** పడును. అతనిని రేతస్సుగల మడుగులోనికి త్రోసి అదే రేతస్సును వాని చేత త్రాగింతురు. గుణవతియు, అనుకూలవతియు, సంతానవతియు అగు భార్యను వదలుట పాపము. కట్టుకున్న భార్యను సంతోష పెట్టక ఏడిపించుట **పాపము.**

**పుత్రులు :** కుమారుడు, తమ్ముడు, సద్గుణవంతుడైన శిష్యుడు వీరు ముగ్గురూ పుత్రులు. పుత్రులు 10 రకములు.

1. ఔరసుడు-ధర్మపద్ధతిన వివాహమయిన భార్యయందు-తనవలన గలిగిన వాడు.
2. క్షేత్రజ్ఞుడు-భర్త అసమర్థుడైన-భర్త అనుమతితో భార్యకు ఇతరుల వలన గలిగిన సంతానము. ఉదా: కల్మషపాదుని భార్య వసిష్ఠునివలన కన్నసంతానము. పాండురాజు భార్య యమాది దేవతల వలన కన్న పాండవులు.
3. విధవ కొడుకు-భర్త చనిపోగా అత్తమామల అనుమతితో కోడలు పొందిన సంతానము.

   ఉదా: చిత్ర వీర్యుడు, విచిత్ర వీర్యుడు చనిపోగా వారి భార్యలు అంబికా అంబాలికలు పొందిన ధృతరాష్ట్రుడు, పాండురాజు.
4. దత్తుడు-దత్తత చేసుకున్నవాడు.
5. క్రీతుడు- తల్లిదండ్రులు అమ్మగా కొనుక్కొన్నవాడు ఉదా-శునశ్శేపుడు.
6. కానీనుడు - కన్యకు పుట్టినవాడు. ఉదా-కర్ణుడు.
7. గూఢకుడు- తన భార్యకు ఎవరివలన పుట్టెనో తెలియనివాడు.
8. సహోఢుడు- పెండ్లికి ముందు గర్భవతియయిన భార్యకు పుట్టినవాడు.
9. ఆపవిద్ధుడు-ఎవరో కనివేయగా ఇతరులు వానిని కొడుకుగా పెంచుకున్నవాడు. ఉదా- కర్ణుడు.
10. కృతిముడు- తల్లిదండ్రులను వదలి తిరుగుతూ వుంటే ఎవరయినా జాలిపడి పెంచుకున్నవాడు.

ఇందు ఔరసుడు ముఖ్యుడు. కానీ ఈ 10 మంది వారి తల్లిదండ్రులకు పితృ కర్మచేయవచ్చును. అన్ని స్నేహముల కన్న పుత్ర ప్రేమ ఎక్కువ.

**సుపుత్రుడు :** పుత్రులు సమర్థులైన, తల్లిదండ్రుల కష్టములు పోవును. బుద్ధిగల సుతుడు పుట్టినచో తండ్రి మిన్నుముట్టకేలయుండును? అనగా అధిక ఆనందమును పొందును. తండ్రికి భక్తితో పరిచర్య చేసిన కీర్తి కలుగును. తండ్రిమాటను పాటించిన

కొడుకునకు ధర్మపరుడని, ఖ్యాతి, స్వర్గము గలుగును. పుత్రుడు లేనందున దేవతలు యాగభాగము స్వీకరింపరు. పుత్రుడు తల్లికి ఇష్టుడు.

**కుపుత్రుడు:** కుపుత్రుని వలన అపకీర్తి, అధర్మము, మనోవ్యధ, సర్వజన విరోధము గలుగును. ఇల్లు దుఃఖాలయమగును. కుపుత్రునిగని పరి తాపము పొందుటకంటె సంతానము లేకుండుట ఒప్పును.   ధనముండియు తల్లిని దండ్రిని చూడనివాడు ప్రల్లదుడు. ఇతరుల మేలు కొఱకు తన కొడుకును విడచుట లోకాచార విరుద్ధము.

**బాలురు** : బాలురకు తాడనంబు పథ్యంబరయన్ అనగా బాలురను మంచి మాటలతో గాక కొట్టి సన్మార్గవర్తనులను చేయవలయును. దొంగతనం చేయుచున్న కొడుకును (కృష్ణుని) - తల్లి (యశోద) ఱోటికి కట్టి శిక్షించినది.

**కూతుళ్ళు** : బుద్ధిమంతుడు తన కూతుళ్ళను యుద్ధ వీరునకు యివ్వరాదు. కూతుళ్ళకు పెండ్లిచేసి సన్న్యాసము స్వీకరించ వలయును. ఉదా: కర్దముడు తన 9 మంది కూతుళ్ళకు పెండ్లిచేసి సన్న్యాసము స్వీకరించెను.

**పాపము:** కుమార్తెను తగిన వరునకు యివ్వకుండుట **పాపము**. కుమార్తెను ఒకరికి యిచ్చెదనని చెప్పి మరల మనస్సు మార్చుకొని ఇతరులకు యిచ్చుట **పాపము.** ఆడపిల్లకు తల్లిదండ్రులు లేక పోయినా, సోదర సోదరీమణులు లేకపోయినా పెండ్లి కుమారునకు అచ్చట్లు ముచ్చట్లు ఉండవు.

ధర్మార్థ కామముల గుఱించి హితోక్తులుగా సుభాషితములలో శతకములలో వివరింపబడినవి. వాటిని చదవవలయును. అటులనే జీవితములోని ఒడిదుడుకులకు సంబంధించిన విషయములను చెప్పు గొప్ప రచయితల రచనలు చదవవలయును. జీవితమును ఆనందమయము చేసుకొనవలయును.

*****

## పుణ్యకర్మానుష్ఠానము

ఇహలోకములో సంఘనియమములు, ఆశ్రమ నియమములు, వ్యక్తిగత విధులు, బాధ్యతలు నెఱవేర్చి ధర్మ పరుడుగా ఉండవలయును. ఇట్టి ధర్మపరుడు చేసిన పుణ్యకర్మల వలన పుణ్యలోకములు కలుగును. ఇహలోకమున పేరు ప్రతిష్ఠలు కూడ కలుగును. పుణ్యకర్మలు శాస్త్ర విహితముగా చేయవలయును. ఒక వ్యక్తి పుట్టిన కులమును, ధనమును, గుణమును ఆధారముగా చేసికొని పుణ్యకర్మలు చేయు విధానము చెప్పబడినవి. కావున ఎవరెవరికి ఏమేమి చెప్పినారో గమనించి ఆ విధముగా చేయవలయును. దుర్జన స్వభావము లేకుండా, దైవీ సంపద కలిగి, శాస్త్ర విహితముగా పుణ్యకార్యములు చేయవలయును. సత్త్వగుణాశ్రయుడై పుణ్య కర్మచేయవలయును. అహంకారము, ఆడంబరము, అశాస్త్రముగా పుణ్యకర్మలు చేయరాదు.

**చ॥ అకుటిల భక్తిఁ గేశవ సమర్పణ బుద్ధిఁ గ్రతు క్రియల్ వొన**
**ర్పక విపరీతులై యుముక రాసులు దంచి ఫలంబు నందఁగా**
**నక చెడు రీతి నూరక ధన వ్యయమౌటయ కాని మోక్ష దా**
**యక మగుచున్న తత్ఫలమునందరు విష్ణు పరాఙ్ముఖ క్రియుల్**

(భాగవతము, తృతీయ స్కంధము-401)

మాయ, దగా, మోసములు లేకుండా, తమోగుణము, రజోగుణమును వదలి సత్త్వగుణాశ్రయుడై, పుణ్యకర్మలయిన అగ్నిహోత్రము, యజ్ఞ యాగాది క్రతువులు దానము మొదలైనవి చేయవలయును. సత్త్వగుణము గలిగి పుణ్యకర్మలు చేయనివారు ఊకను దంచి బియ్యమును పొందలేనట్లు, ధనము ఖర్చు అగుట తప్ప పుణ్యఫలితమును పొందలేరు. మోక్షమును పొందలేరు.

**పుణ్యకర్మలు**

<table>
<tr><td colspan="2">ధనము గలిగి చేయునవి</td><td colspan="2">ధనముతో పని లేనివి</td></tr>
<tr><th>నిత్యము</th><th>నైమిత్తికము</th><th>నిత్యము</th><th>నైమిత్తికము</th></tr>
<tr><td>ఇష్టములు</td><td>పూర్తములు</td><td rowspan="2">స్వాధ్యాయము సంధ్యా వందనము దైవీ సంపద కలిగి ఉండుట.</td><td rowspan="2">తపస్సు మంత్ర జపము</td></tr>
<tr><td>అగ్ని హోత్రము దేవతారాధన- (పూజ)</td><td>(హవ్యము) యజ్ఞ యాగాది క్రతువులు (కవ్యము) పితృదేవతారాధన దాన ధర్మములు వ్రతములు</td></tr>
<tr><td colspan="2">నూతులు, చెఱువులు త్రవ్వించుట, తోటలు నిర్మించుట చేర్చబడినవి. ద్వాపర యుగములో ఇష్టాపూర్తముల క్రింద తీర్థయాత్రలు పుణ్య నదీ స్నానములు చేర్చబడినవి. కలియుగములో దేవాలయ నిర్మాణములు చేర్చబడినవి.</td><td colspan="2"></td></tr>
</table>

అగ్నిహోత్రము, యజ్ఞములు, పితృదేవతారాధన, దానము, తీర్థయాత్రలు, పూజావిధానము, మఱియు ధనముతో పనిలేని స్వాధ్యాయము మంత్రజపము, సంధ్యావందనము, తపస్సు, దైవీసంపదలు మొదలగునవి పుణ్య కర్మానుష్ఠానము క్రింద చెప్పబడినవి. గురువు ఆచరించి చెప్పు బోధనలు పాటించవలయును. పుణ్యకర్మలు చేయవలయును. కానీ ఆ పుణ్య కర్మ ఫలితమును కోరరాదు.

**కర్మణ్యేవాధికారస్తే మా ఫలేషు కదాచన ।**
**మా కర్మ ఫలహేతుర్భూః మా తే సంగోఽస్త్వ కర్మణి॥**

(భగవద్గీత, సాంఖ్యయోగము, 47)

పుణ్య కర్మలు శాస్త్ర విహితముగా చేయుట వలన ఇహలోక సుఖములు కలుగును. అనగా కష్టములు తీరి సుఖములు కలుగును. అటులనే పుణ్య లోకములు కూడా కలుగును. కానీ పుణ్య ఫలితము క్షీణించగనే తిరిగి భూలోకమున జన్మింతురు. కావున పుణ్య కర్మలు చేసి ఆ పుణ్య ఫలితమును కోరని వారు బ్రహ్మలోకమున శాశ్వతముగా నుందురు. ఈ విషయమునే పై శ్లోకమున శ్రీకృష్ణుడు వివరించినాడు. పుణ్య కర్మానుష్ఠానము శ్రద్ధగా చేయవలయును. జ్ఞానులు కూడా పుణ్య కర్మానుష్ఠానమును శ్రద్ధగా చేయవలయునే గాని మానరాదు అన్నది శ్రీకృష్ణుని ఆదేశము. శ్రీకృష్ణుడు పుణ్య కర్మానుష్ఠానమును చేయువారిని మూడు తరగతులుగా విభజించెను. సత్త్వ గుణయుతులు. వీరు పుణ్య కర్మలను శ్రద్ధగానూ మఱియు ఫలాపేక్షలేకుండా చేయుదురు. రజోగుణయుతులయినవారు పుణ్య కర్మలను పుణ్య ఫలముకొఱకు, కీర్తి ప్రతిష్ఠల కొఱకు, దంభము కొఱకు, మఱియు ఇతరుల చేత పూజింప బడుటకు చేయుదురు. తమోగుణయుతులు పుణ్య కర్మలను శాస్త్ర విధిని పాటింపకుండా అశ్రద్ధగా చేయుదురు. వీరు పుణ్య కర్మలను దేశకాల పాత్రలను పాటింపక మఱియు ఆడంబరము, అహంకారము, కామము, రాగము, ద్వేషము, క్రోధము, పౌరుషము, దర్పము కలిగి చేయుదురు. దేహమునకు పీడ కలుగునట్లు చేయుదురు. భగవద్గీతలో శ్రద్ధాత్రయ విభాగ యోగములో పుణ్య కర్మలు అవి చేయువారి లక్షణములు వివరింపబడినవి.

*****

# ఇష్టములు

## అగ్ని హోత్రము

అగ్నిహోత్రము చేయుటకు నెయ్యి, సమిధలు, హవిస్సు, పాయసం, పేలాలు, పెరుగు కావలయును. త్రేతాగ్నులను ఆరాధించుట, అగ్నుల ఆత్మారోపణ మొదలయినవి ప్రత్యేకముగా అనుభవశాలురయిన పెద్దలవద్ద నేర్చుకొనవలయును. కొన్ని సూచనలు మాత్రము ఉపనిషత్‌లలో కనబడును. ముండక ఉపనిషత్ లో ద్వితీయ ముండకంలో అగ్నిహోత్రం గురించిన సూచన యివ్వబడినది. అగ్నిహోత్రము పొగలేక చక్కగా మండుతున్నపుప్పడు ఆజ్యభాగములలో రెండు ఆహుతులు, ఆవాస స్థానములో మిగిలిన ఆహుతులు ఇవ్వవలయును. నిత్యఅగ్నిహోత్రము చేయుచూ అమావాస్య నాడు చేయవలసినది, పౌర్ణమినాడు చేయవలసినది, చాతుర్మాసములలో చేయ వలసినది, ఆగ్రాయణమున (క్రొత్తగా పంట వచ్చినపుడు చేయు కార్యక్రమము) చేయవలసినది చేయవలయును. అతిథికి భోజనము పెట్టి పూజింపవలయును. వైశ్వదేవము లేకుండా చేయరాదు. ఇలా విధిని పాటింపక ఎవరయినా అగ్ని హోత్రము చేసిన యెడల అతని పుణ్యఫలితము సర్వము నాశనము అగును. పాపఫలితము వలన నరకప్రాప్తి కలుగును. జాతి, ఆశ్రమ ధర్మములను అనుసరించి అగ్ని హోత్రము చేయవలయును. వేదము చెప్పిన ప్రకారము అగ్నిహోత్రము చేయుటకు బ్రాహ్మణ క్షత్రియ వర్ణముల వారు అర్హులు.

*****

## యజ్ఞ యాగాది క్రతువులు

వేదసూక్తములలో స్తుతింపబడిన దేవతలకు-వేదములో చెప్పినట్లు విధివిహితముగా యజ్ఞములు చేయవలయును. అట్టి యజ్ఞములకే దేవతలు ప్రసన్నులయి వరములు అనుగ్రహించెదరు. (హవ్యము) యజ్ఞ నిర్వహణకు హోత, అథర్వు, ఉద్గాత, బ్రహ్మ అను నలుగురు ఋత్విక్కులుందురు. వేదము చెప్పిన ప్రకారము యజ్ఞయాగములు చేయుటకు బ్రాహ్మణ క్షత్రియ వర్ణముల వారు అర్హులు. యజ్ఞయాగములు చేయుట వలన **దేవతల ఋణము** తీరును. **యజ్ఞము చేయుటకు సోమలత కావలయును.** ఈ సోమలత ద్వారా సోమ పానమును తయారు చేసి ఇంద్రాది దేవతలకు ఒసంగెదరు. ఏ దేవతకు ఏ పశువు ఇష్టమో ఆ పశువును బలి ఇవ్వవలయును. ఏ యాగమునకు ఎన్ని యూప స్థంభములు ఉండవలయునని వేదము చెప్పినదో అన్ని యూప స్థంభములను నిలుపవలయును. అశ్వమేధ యాగములో మారేడు కఱ్ఱతో చేసినవి ఆఱు, చంద్ర కఱ్ఱతో చేసినవి ఆఱు, మోదుగ కఱ్ఱతో చేసినవి ఆఱు, దేవదారు కఱ్ఱతో చేసినవి రెండు, శ్లేష్మాతక వృక్షముతో చేసినది ఒకటి. మొత్తము ఇరువది ఒకటి యూపస్తంభములు ఉండవలయును. ఆ యూపస్తంభములను బంగారముతో అలంకరించి, వస్త్రములు చుట్టవలయును. అశ్వమేధ యాగమును దేశమును పాలించు సుక్షత్రియుడైన రాజు మాత్రమే చేయవలయును.

సూర్యశ్చక్షు ర్వాతః ప్రాణా వ్యాత్తమగ్ని వైశ్వానర సంవత్సరః ఆత్మా (బృహదారణ్యక ఉపనిషత్-ప్రథమ బ్రాహ్మణము-1) అనగా సూర్యుడు అశ్వమునకు కన్ను. వాయువు ప్రాణము. నోరు వైశ్వానర అగ్ని. సంవత్సరము ఆత్మ. అశ్వము అనగా విరాట్‌పురుషుడు. బాహ్యముగా విరాట్ పురుషుని దర్శించి అంతరాత్మయగు ఆత్మను ప్రజ్ఞానేత్రముతో దర్శించుటయే అశ్వమేధయాగము. బ్రహ్మవిద్యా సంప్రదాయములో అశ్వమనగా పరిశుద్ధ మనస్సు. గాడిదనగా మలిన మనస్సు. రామాయణములో సీతాపహరణ సందర్భమున రావణుడు గాడిదలు పూన్చిన రథముపై వచ్చినాడు. మనస్సును లయము చేయుటయే అశ్వమేధయాగము. ఒక అశ్వమేధయాగము వస్తువినియోగముతో చేయునది. మఱియొక అశ్వమేధయాగము

మానసిక యజ్ఞము. దీనికి వస్తువులతో పనిలేదు. ఇందు మనస్సును లయింప చేయుదురు. ఈ రెండు విధములైన అశ్వమేధయాగముల ప్రస్తావనను గూఢముగా రామాయణములో బాలకాండలో చిత్రీకరించబడినది.

చతుష్టోమ, ఉక్థ్యము, జ్యోతిష్టోమ, అతిరాత్రము, అభిజిద్యాగము, విశ్వజిద్యాగము, ఆప్తోర్యామ రాజసూయ యాగము మొదలయినవి యాగములుగా చెప్పబడినవి. యాగ ప్రారంభము నుంచి ముగింపు వఱకు చేయవలసిన విధివిధానమంతయు కృష్ణ యజుర్వేదము నందు వివరింపబడినది. ఏఏ కోరికలకు ఏఏ దేవతలను, ఏవిధముగా యజింపవలయునో శుక్ల యజుర్వేదమున చెప్పబడినది. అటులనే భాగవతము ద్వితీయస్కంధము నందు ఏఏ కోరికలకు ఏఏ దేవతలను ఆరాధించ వలయునో చెప్పబడినది. పుత్రులు లేని వారు యజ్ఞము చేసినా కర్మసాక్షులైన దేవతలు స్వకీయ భాగము స్వీకరింపరు. వేద విహితముగా యజ్ఞ యాగాదులు చేసిన దేవతలు స్వయముగా వచ్చి యజమానిని ఆశీర్వదించి, సోమపానము చేసి, తమతమ నెలవులకు వెళ్ళుదురు. ఉదా: దశరథుడు యజ్ఞము చేయగా యజ్ఞ పురుషుడు వచ్చి దశరథునకు ఒక పాయసపాత్రను ప్రసాదించినాడు. త్రిశంకుడు యజ్ఞము చేయగా దేవతలు కనబడిరి కాని యజ్ఞ భాగములను స్వీకరించలేదు, యజ్ఞ ఫలితమును ప్రసాదించలేదు. కావున యజ్ఞములు వేద విహితముగానే ఉండవలయును. **రుద్ర హీనంబగు యాగంబు లేదు.** దేవతలను ఆహ్వానించినపుడు శివునిని ఆహ్వానించనిచో అట్టివారు నశించిపోవుదురు. దీనికి ఉదాహరణగా దక్షుని మృతి చెప్పబడినది. దుష్టచిత్తులయిన వారి యజ్ఞయాగాదులను దేవతలు మెచ్చరు. అహంకారముతో చేసిన యజ్ఞమును దేవతలు మెచ్చరు. దీనివలన మేలు కంటె కీడు కలుగును. మన మనోభావన దేవతలకు తెలియును. కావున మనస్సును నిర్మలముగా ఉంచి యజ్ఞములు, క్రతువులు, దాన ధర్మములు చేయవలయును. హవిస్సు, నెయ్యి, పురోడాశము, కుశలు,యూపస్తంభములు, ఇవి ఒక పర్యాయము ఉపయోగించినచో వాటిని మరల ఉపయోగింపరాదు.

బ్రహ్మ, సృష్ట్యాది యందు యజ్ఞములను, ప్రజలను సృజియించెను. ఈ యజ్ఞము వలన మీమీ కోరికలు నెఱవేఱునని పలికెను. యజ్ఞముల వలన వృద్ధి గలుగును.

యజ్ఞముల ద్వారా మీరు దేవతలను పూజించండి. వారు మీ మీ కోర్కెలను తీర్తురు. యజ్ఞ శేషమును (ప్రసాదమును) భుజించి సమస్త పాపముల నుండి విముక్తి పొందుదురు.

**అన్నాద్భవంతి భూతాని పర్జన్యాదన్న సంభవః**
**యజ్ఞాద్భవతి పర్జన్యో యజ్ఞః కర్మ సముద్భవః**

(కర్మయోగము -14)

**కర్మ బ్రహ్మోద్భవం విద్ధి బ్రహ్మాక్షర సముద్భవం -**

(కర్మయోగము -15)




ఇంద్ర యాగము చేసిన రాజులకు ఆయుష్షు పెరుగును. సంతానము వృద్ధి పొందును. దేశమునకు, ప్రజలకు అభివృద్ధి కలుగును. కేశవార్పణంబుగా యజ్ఞము చేయ వలయును.

**వానప్రస్థులు :** పశు యజ్ఞము చేయరాదు. కంద మూలదికంబుల చేత నిత్య నైమిత్తిక క్రియలు చేయవలయును. నిష్కాములయిన వారు బాహ్య కర్మంబులు విడిచి, ఆత్మ యందు మానసిక యజ్ఞంబులు ఆచరింతురు. బాహ్య యజ్ఞము కంటె మానసిక యజ్ఞము గొప్పది. అహంకార మమకారములు లేక, చిత్తములో పరమాత్మను ధ్యానించుట మానసిక యజ్ఞము. కామ క్రోధాదులను వదలి ఏకాంతములో తనను తాను తెలుసుకొనుట యజ్ఞములలో కెల్ల విశేషము. సర్వము బ్రహ్మ స్వరూపము అని గ్రహించి యజ్ఞము చేయవలయును. యజ్ఞము చేయువాడు

హోమ సాధనములు, ద్రవ్యములు, హోమాగ్ని, క్రియలు, యజ్ఞఫలము, భోక్త, సర్వము బ్రహ్మమే అని గ్రహించవలయును.

**బాహ్య యజ్ఞ నిరసన** : భాగవతమున నారదుడు ప్రాచీన బర్హితో బాహ్య యజ్ఞములను నిరసించినాడు. అటులనే ధర్మరాజు బాహ్య యజ్ఞములను నిరసించుచూ ఇట్లు చెప్పినాడు.

"గృహస్థాశ్రమ ధర్మంబులైన తురంగమేధాది యాగంబుల చేతఁ బురుషుండు బ్రహ్మహత్యాది పాపంబుల వలన విడివడి నిర్మలుండగునని నిగమంబులు నిగమించుఁ బంకంబున బంకిల స్థలంబునకు, మద్యంబున మద్యభాండంబునకు శుద్ధి సంభవింపని చందంబున బుద్ధి పూర్వక జీవ హింసనంబులయిన యాగంబుల చేతం బురుషులకు బాప బాహుళ్యంబు కాని పాపనిర్ముక్తి గాదని శంకించెద." (భాగవతం ప్రథమ స్కంధము - 203).

**యజంతే సాత్త్వికా దేవాన్ యక్షరక్షాంసి రాజసాః**
**ప్రేతాన్ భూతగణాం శ్చాన్యే యజంతే తామసా జనాః**

(భగవద్గీత, శ్రద్ధాత్రయ విభాగము-4)

సత్త్వ గుణయుతులు దేవతలను, రజోగుణయుతులు యక్ష రాక్షసులను, తమో గుణయుతులు భూత ప్రేతాదులను, ఆరాధింతురు.

సత్త్వగుణయుతులు ఫలాపేక్ష లేకుండా, శ్రద్ధతో యజ్ఞములు చేయుదురు. రజోగుణయుతులు ఫలమునుద్దేశించి మఱియు కీర్తి ప్రతిష్ఠల కొఱకు యజ్ఞములు చేయుదురు. తమో గుణయుతులు శాస్త్రసమ్మతముగాని విధముగానూ శ్రద్ధలేకుండా అన్నదానము లేకుండా యజ్ఞములు చేయుదురు. దంభము, అహంకారము కామ రాగాదులు కలిగి యజ్ఞములు చేయుదురు.

ఇంద్రుడు గావించు యజ్ఞ విఘ్నములు చూచుచుండ వలయును గాని ప్రతీకారంబు చేయరాదు. సప్త మాతృకలు గర్భ పీడనము, శూల పీడనము చేయుదురు. వీరికి బలి, మంత్ర, ధ్యాన, తర్పణలతో తృప్తి పొందించిన వారికి ఆయురారోగ్యములు కలుగ చేయుదురు.

దేవతా తిరస్కారము యుక్తము కాదు. దేవతలకు అప్రియము గావించు మనుష్యులు అధోగతి పాలగుదురు. తండ్రికి, ధర్మమునకు, తపస్సుకు, విద్యకు, దేవునకు ప్రియమగు పనులు చేసిన, దేవతలు మెచ్చెదరు. వేదములో దేవతలను స్తుతించుటకు, ఆహ్వానించుటకు, ఆరాధించుటకు, కోరికలు నివేదించుటకు సూక్తములు కలవు. దైవకార్యమునకు ఒకరినైన, ఇరువురినైనా మాత్రమే భోజనమునకు పిలువ వలయును. అనగా అట్టహాసముగా ఆడంబరముగా దైవకార్యము చేయరాదు.

*****

## పితృదేవతారాధన (కవ్యము)

**పితృదేవతలు :** దేవతలు ఉత్తర దిక్కున, పితృ దేవతలు దక్షిణ దిక్కున ఉందురు. పితృదేవతలను ఆరాధించుట వలన సంతాన ప్రాప్తి కలుగును. శ్రాద్ధము పెట్టుట వలన, సంతాన ప్రాప్తి వలన **పితృదేవతల ఋణము తీరును.** దేవతలకు, అసురులకు, గరుడ, యక్షాదులకు కూడ పితృ దేవతలు పూజనీయులు. దేవతారాధనను హవ్యమని, పితృ దేవతారాధనను కవ్యము అని అందురు. ప్రతి అమావాస్యకు పితృ యజ్ఞము చేయవలయును. పితృ కార్యము చేయునప్పుడు శౌచమును పాటించవలయును. క్రూరత్వము, ఉగ్రభావము లేకుండుట అవసరము. శునకము, రజస్వల, పతితుడు, పితృ కార్యమప్పుడు దగ్గరకు రారాదు.

**ఆహారము :** తిలలు, పాయసము, నెయ్యి పితృ యజ్ఞమునకు ఉత్తమములు. పితృకార్యములో చేపలు, మాంసము సమర్పింప వలయును. పితృ కార్యములలోను, యజ్ఞము నందు మాంస భక్షణము దోషము కాదు. పితృ దేవతలకు వృషణములు లేని మేకను బలి ఇవ్వవలయును. రాముడు అరణ్యా వాసములో చిత్ర కూటము వద్ద గార పిండితో దశరథునకు శ్రాద్ధము పెట్టినాడు. దుర్మాంసము, నల్ల దుప్పి మాంసము వాడరాదు. భోజనములో మునగ, ఉల్లి, అడవి మునగ, జీలకట్టు, కరివేపాకు, గురుజ, ఇంగువ వాడరాదు. వంట వండిన తరువాత నువ్వులు వంటకముపై చల్లినచో ఆ వంట అశుచి అగును. పితృ తర్పణమునకు గయ, కురుక్షేత్రము, గంగ ఒడ్డున, పుణ్య ప్రదేశములు శ్రేష్ఠము. గయలో పిండము పెట్టుట మిక్కిలి శ్రేష్ఠము.

**భోక్తలుగా ఉండుటకు అర్హతలు :** పితృ పూజావిధికి పిలుచు బ్రాహ్మణులను తప్పని సరిగా పరీక్షింప వలయును. దేవపూజకు పిలుచు బ్రాహ్మణులను పరీక్షించరాదు. భోక్తల యొక్క చరిత్ర మంచిదై ఉండవలయును. శ్రోత్రియులు, రోగములు లేని వారు, వికలాంగులు కాని వారు భోక్తలుగా ఉండుటకు పాత్రులు. శాంతులు, వ్రతశీలురు, దాంతులు, అధ్యాపకులు, దయగలవారు, వ్యాకరణము, ధర్మశాస్త్రము, పురాణములు చదివిన వారు, అగ్నిని ఆరాధన చేయువారు, భోక్తలుగా ఉండుటకు పాత్రులు. బ్రహ్మైకత్వము బోధించు వాడు ఉత్తముడు. శత్రువులలో ఈ చెప్పిన మంచి గుణములున్ననూ వారిని భోజనమునకు పిలువరాదు.

**భోక్తకు పనికి రాని వాడు :** వేదము చదవని వాడు, జూదరి, కపటి, భార్యతో విడిపోయి పిల్లలను పంచుకొనినవాడు, గృహ దాహి, సముద్ర వ్యాపారి, సముద్రమందు తిరుగుచు డబ్బు సంపాదించేవాడు, అఖిల వస్తువులను అమ్మువాడు, వడ్డీకి ధనము యిచ్చువాడు, రాజసేవకుడు, గ్రామ సేవకుడు, కుష్టురోగి, గాయకుడు, శిల్పి, వీరిని భోక్తలుగా భోజనమునకు పిలువరాదు. సగోత్రుడు, భార్య పోయిన వాడు భోక్తగా పనికిరాడు.

పితృ కార్యములలో గొడుగులు,చెప్పులు,దానమిచ్చుట ఉత్తమము. పుష్పమాలికలు, ధూప దీప, వస్త్రములతో అర్చనలతో బ్రాహ్మణులకు భోజనము పెట్టి, మరల పితృదేవతలకు పిండ ప్రదానము చేయవలయును.

**పాపము :** రాత్రి పితృకార్యము చేయుట **పాపము.** పితృ కార్యమునకు ఒక్కరినైనా, ముగ్గురినైనా, భోజనమునకు పిలువవలయును. ధనవంతులకైననూ, శ్రాద్ధ విస్తారంబు కర్తవ్యంబు కాదు.

**ఫలితములు :** కవ్యము మహాఫలము. చనిపోయిన వారికి శ్రాద్ధ కర్మ చేయ వలయును. పితృదేవతలు ఆనందించి, కర్తకు ఆయువు, శ్రీ, కీర్తి మొదలగు ఇహలోక సుఖములు ఇత్తురు.

యమసభలో అగ్నిస్వాత్తాది పితృగణంబులు తమ గోత్రములకు మేలు కలుగుట కొఱకు సత్యంబులగు ఆశీర్వాదంబులు నొసంగు చుందురు. ప్రేత జనులకు

దహనాది సంస్కారములు, మృత దివసమున సంవత్సరీకము జరుపవలయును. భాద్రపదమున కృష్ణపక్షమున (మహాలయపక్షములు), ఉత్తరాయణమున, దక్షిణాయనములందు, విషుయందు, వ్యతీపాతమున, దినక్షయమునందు, సూర్యచంద్రగ్రహణముల సమయమున పితృతర్పణములు ఇవ్వవలయును. శ్రవణద్వాదశి, వైశాఖశుక్లతదియ, కార్తీక శుక్లనవమి, హేమంతశిశిర ఋతువులలో వచ్చు నాలుగు అమావాస్యలలో, మాఘశుక్ల సప్తమి, జన్మ నక్షత్రముతో గూడిన పున్నమి ద్వాదశితో కూడిన ఉత్తరాత్రయ, శ్రవణ, అనూరాధ, ఏకాదశితో కూడిన ఉత్తరాత్రయమున, జన్మ నక్షత్రయుక్త దివసమున, ప్రశస్తకాలమున దేవ బ్రాహ్మణ సమారాధనము, జపహోమస్నాన వ్రతము ఆచరించవలయును.

*****

## పూర్తములు - దాన ధర్మములు

సమాజ సేవకు సంబంధించిన నూతులు, చెఱువులు త్రవ్వించుట, ఆరామములు, సత్రములు కట్టించుట, దాన ధర్మములు, తీర్థ యాత్రలు, అతిథి పూజ, బ్రాహ్మణ పూజ, దేవపూజ మొదలగునవి పూర్తముల క్రింద వర్గీకరింపబడును.

**దాన ధర్మములు :**

తైత్తిరీయ ఉపనిషత్ శీక్షావల్లిలో ఇట్లు చెప్పబడినది :-

శ్రద్ధయా + దేయమ్ = శ్రద్ధతో దానమివ్వ వలయును
శ్రియా + దేయమ్ = ఉన్నంతలో ఎక్కువగా దానమివ్వ వలయును
హ్రియా + దేయమ్ = (వినయముతో) సిగ్గుతో దానమివ్వ వలయును
భియా + దేయమ్ = కరుణతో ఇవ్వవలయును
అశ్రద్ధయా + అదేయమ్ = అశ్రద్ధతో దానము ఇవ్వరాదు
సంవిదా + దేయమ్ = పాత్రత నెఱిగి దానమివ్వ వలయును.

అర్థమును (ధనమును) విడచుట చాల కష్టము.కావున దానము చేయుట కష్టము.

దానము తన శక్త్యానుసారము చేయవలయును. తన ధనమును ఐదు భాగములుగా చేసి కర్మమునకు, అర్థమునకు, ధర్మమునకు, యశమునకు, ఆప్తులకు పంచి పెట్ట వలయును. అట్లు చేసిన ఇహపరము లందు సుఖించును. పౌరుషము లేకుండా, అంతః కరణ శుద్ధి గలిగి ప్రియముగా దానము చేయవలయును. ఏ దానము వలన నాశనము కలుగునో అది దానము కాదని తత్త్వ విదులు చెప్పిరి. దానము పుచ్చుకొనువాడు కోరినది దానము ఇవ్వవలయును. దానమిచ్చువాడు ప్రియ వచనములు గలిగి ఉండవలయును. కోపము తెచ్చుకొనరాదు. అవమానము చేయరాదు. దానమిచ్చి మనస్సులో ఎట్టి క్లేశమును పొందరాదు. మనస్సులో ఏవగింపు ఉండరాదు. కృత్రిమ భక్తి ఉండరాదు. యాచకులను రిక్త హస్తములతో పంపరాదు. న్యాయమైన ధనముతో దేశ, కాల, పాత్రలను బట్టి దానమిచ్చిన ఫలితముండును. అన్యాయార్జితమైన ధనముతో దానము చేసిన ఫలితము లేదు. దానము చేసి విచారించినా, తమ పేరు వ్రాసుకొని తనను తాను పొగడుకొన్నా నిష్ఫలము. కొన్ని దానములను ఉదక ప్రదానముగా ఇవ్వవలయును. బ్రహ్మ ప్రీతిగా దానమును ఇవ్వవలయును.

**దానము- ప్రదేశము :-** పుణ్య ప్రదేశములలో దానము, ధర్మము చేయవలయును. ఆ ప్రదేశములలో చేసిన దాన ధర్మములు వేయింతల ఫలితమునిచ్చును.

**దానము - పాత్రత:** దాన ధర్మములు పాత్రత నెఱిగి చేయవలయును. పాత్రులకు మాత్రమే దానము చేయవలయును. యోగ్యుడయిన బ్రాహ్మణునునికి తృప్తి గలిగించిన పితృదేవతలు, మునులు ఆనందము పొందుదురు. కావున యోగ్యుడయిన వానిని వెతికి తెచ్చి దానము ఇవ్వవలయును. రైతుకు మంచి క్షేత్రము, విత్తనములు దొరికినట్లు దాతకు ఈ విధముగా యోగ్యుడు దానము పుచ్చుకొనుటకు సమకూరిన భాగ్యము.

**దానమునకు అర్హులు :-** చరాచరంబైన విశ్వమంతయు విష్ణుమయంబగుట చేసి భగవంతుడు ముఖ్యపాత్రంబని పెద్దలు నిశ్చయించిరి. పురుషులలో వేదంబులు ధరించుచూ సంతోష, విద్యా, తపో గరిష్ఠుండైన బ్రాహ్మణుండు పాత్రంబు. అట్టి బ్రాహ్మణులలో కొందఱు కర్మనిష్ఠులు, కొందఱు తపోనిష్ఠులు, కొందఱు వేద

శాస్త్ర నిష్ఠులు, కొందఱు జ్ఞానయోగ నిష్ఠులు. అందు జ్ఞాన నిష్ఠునకే పితృజనుల నుద్దేశించి కవ్యంబులును, దేవతల నుద్దేశించి హవ్యంబులు పెట్టుట ముఖ్యము. ధర్మపరులు, క్రోధము లేనివారు, సత్యము పలుకువారు, దాంతులు, ధీరులు, నిజకర్మము నాచరించువారు, విజితేంద్రియులు, సర్వభూత హితులు, లోభత్వము లేనివారు, శుచిగానున్నవారు, వేదవేదాంగములు పూర్తిగా చదివినవారు, షట్కర్మ నిరతులు వీరు దానమునకు అర్హులు.

**దానమునకు అనర్హులు :- అపాత్రులకు దానమిచ్చిన నరకము వచ్చును.** దైవకార్యమునకు, పితృ కార్యమునకు ఈ దిగువ నుదహరించిన వారు అపాత్రులు. దురాత్ముడు, మత్తుడు, జడుడు, ఉన్మత్తుడు, పతితుడు, నపుంసకుడు, కుష్ఠు, క్షయ, అపస్మారములు గల రోగి, మత్తు పానీయములు అమ్మువాడు, వేదములు విక్రయము చేయువాడు,ఆడపిల్లలను అమ్మకొని బ్రతుకువాడు, ధనమును వడ్డీకి ఇచ్చువాడు, అగ్నిహోత్రము చేయనివాడు, సంధ్యోపాసన చేయనివాడు, గాయకుడు, నర్తకుడు వీరు దానమునకు అనర్హులు.

**దశదానములు :-** 1. కన్య, 2. భూమి 3. గృహము 4. బంగారము 5. అన్నము 6. జలము 7. వస్త్రము 8. మంచము 9. ఆసనము 10. వాహనము - ఇవి దశ దానములు

**కన్యాదానము :-** కన్యాదానము (వివాహము) వలన దేవతలు సంతోషింతురు.

**భూదానం :-** ఏ దానము కూడ భూదానముతో సమానము కాదు.దానములన్నింటి కంటె భూదానము గొప్పది. భూదానము అశ్వమేధ యాగముతో సమానము. ఈ దానము ఇచ్చిన వాడు శాశ్వతముగా స్వర్గలోకములో ఉండును. భూమిని దానము చేసినవాడు భూమి ఉన్నంత కాలము స్వర్గలోకములో నుండును. భూదానము ఇచ్చిన వానికి బ్రహ్మహత్యాది పాపములన్నీ పోవును. దానము ఇచ్చినవాడు ఎంత పాపత్ముడయిన, దానము పుచ్చుకొన్నవానికి ఆ పాపము అంటదు. భూమి దానము ఇచ్చినవాడు, పుచ్చుకొన్నవాడు ఇంద్రలోకములో ఉందురు.

**గృహదానము:-** గృహదానము చేసిన అన్ని పీడలు పోయి, దానం చేసినవానికి ఆయువు గలుగును.

**బంగారము దానము :-** బంగారము అగ్నితో సమానము సువర్ణదానము గొప్పది. బంగారము దానము ఇచ్చిన ఆయువు, భావశుద్ధి పవిత్రత కలుగును.

**అన్నదానము :** అన్నము నీరు అన్ని జంతువులకు ప్రాణాధారము. కావున అన్నదానము గొప్పది. అన్నదానము ప్రాణదానముతో సమానము. వృద్ధులకు, వికలాంగులకు, స్త్రీలకు, తాపసులకు, ఆకలితో ఉన్న వారికి అన్నదానము చేయుట మంచిది. అన్నము పెట్టునప్పుడు తినే వారి కులము, గోత్రము, విద్య, వృత్తాంత ములతో పని లేకుండా ఆదరణతో అన్నము పెట్టవలయును. అన్నదానము వలన పాపము నశించి స్వర్గము వచ్చును. అనాదరణగా పెట్టరాదు. అశ్రద్ధగా పెట్ట రాదు. ఎవరయినా కామ క్రోధాదులు చూపినను వారిని అవమానించరాదు. (అన్నదానము చేయు విధివిధానము భారతములోని సక్తుత్ కథలో వివరింపబడినది)

**జల దానము :-** జల దానము ఉత్తమము. కావున చెఱువులు, నూతులు త్రవ్వించ వలయును. ఈ చెఱువులలో గోవులు నీరు త్రాగిన, వేసవి కాలములో మనుష్యులు స్నానము చేసిన, పుణ్యము కలుగును. అనగా ఆ చెఱువులలో నీరు పుష్కలముగా ఉండవలయునని అర్థము. చెఱువులు, నూతులు త్రవ్వించిన వారు స్వర్గమును పొందుదురు. దాహముతో ఉన్న వారికి త్రాగుటకు నీరు ఇచ్చుట పుణ్యము.

**వస్త్ర దానము :-** వస్త్ర దానము చేసిన వారు చంద్ర లోకమునకు వెళ్ళుదురు.

**మంచము, ఆసనము, వాహనము :** ఇవి దానము ఇచ్చిన శుభ ఫలితము కలుగును.

**ఇతర దానములు :**

**విద్యాదానము :-** పేదలను తన ధనముతో చదివించిన, మఱియు శిష్యులకు గురువు విద్య నేర్పిన అది విద్యాదానము. తపస్సు, విద్య, దేవతలకు పూజనీయము. కావున విద్యాదానము గొప్పది.

**ధూప-దీప దానము :-** ఈ దానము వలన దేవతలు తృప్తి పొందుదురు. ఆత్మప్రకాశము, శాంతి కలుగును.

**ఆహార పదార్థముల దానము :-** నువ్వులు దానమిచ్చిన అగ్నిష్టోమము చేసిన ఫలము కలుగును. నెయ్యి, పాలు, పెరుగు, కంద మూలములు (కూరగాయలు), నువ్వుల పరిమళ ద్రవ్యములు (కస్తూరి మొదలైనవి) దానము ఇవ్వవలయును.

గొడుగులు, చెప్పులు, దానమిచ్చిన శుభ ఫలము.

**గోదానము :-** కొమ్ములకు బంగారు తొడుగులు తొడిగి-లేగదూడలు గలిగి పాలు బాగాయిచ్చు గోవులను దానము ఇవ్వవలయును. పాలు పితుకుటకు కంచు పాత్రలు, బ్రాహ్మణునకు వస్త్రములు దానము చేయవలయును. పూర్వ దినమున బ్రాహ్మణుల ఆజ్ఞతో ఉపవాసముండి గోవులున్న మందకు వెళ్ళి నియమములు పాటించుచూ ఒక పగలు ఒకరాత్రి ఉండి మఱునాడు తను యివ్వదలచిన గోవును **"తల్లి గోవు; తండ్రి వృషభము; గర్భప్రదేశము పగలు; ధరణి సంప్రతిష్ఠ"** అనిపఠియించి గోవును దానము ఇవ్వవలయును. ఈ గోవులు నా యొక్క సకలపాపములను పోగొట్టి సౌఖ్యమును కలుగ చేయునని పలికి, వ్రతశీలుడు, పాపరహితుడు, శాంతుడు, దాంతుడు, అక్రోధనుడు అగు బ్రాహ్మణునికి ఉదక ప్రదానముగా దానము ఇవ్వవలయును.

**గోదాన ఫలితము :-** గోదానము వలన అన్ని కోరికలు నెఱవేఱును. దాత గోలోకమున వసియించును. ఆవు యొక్క శరీరంలో ఎన్ని రోమములుండునో అన్నివేల సంవత్సరములు గోదానము ఇచ్చిన వారు స్వర్గములో సుఖమును పొందుదురు. గోదానము వలన ఏడు తరముల వారు స్వర్గ లోకమునకు పోవుదురు. కపిల గోదానము శ్రేష్ఠము. కపిల గోవును దానమిచ్చిన ఆదానం ఇచ్చిన వాని యొక్క ఇరువది యొక్క తరములవారు ఊర్ధ్వలోకములలో ఉందురు. ఒక ఎద్దును దానము చేసిన పది గోవులను దానము చేసిన ఫలితము కలుగును. ఆశ్వయుజ మాసములో బహుళ అష్టమిన వ్రతము పూని మూడు దినములు గోశాలలో గోపంచకము స్వీకరించినచో బహు కోరికలు తీరును. అలా మూడు దినములు అవి త్రాగి, మఱి మూడు దినములు వాయు భక్షణ చేసి గోవులతో యవలు త్రొక్కించి వాటిని చెఱిగి, నూకలతో జావకాచుకొని, మూడు నెలలు త్రాగినచో, బ్రహ్మహత్యాది పాతకములు కూడ పోవును. గోమూత్ర పురీషములలో లక్ష్మీ ఉండును. శ్రద్ధగా

అనేక గోవులను దానము ఇచ్చిననూ ఒక్క గోవును అశ్రద్ధగా దానము ఇచ్చుట వలన నృగుమహారాజు ఊసరవల్లిగా జన్మించెను. కావున గోదానమును శ్రద్ధగా చేయవలయును. నీరు త్రాగలేనివి, సంతానోత్పత్తికి పనికి రానివి అనగా ముసలి గోవులను దానము ఇవ్వరాదు.

**ప్రాణదానము** (శరణు ఇచ్చుట) :- సర్వతీర్థములలో స్నానము, సర్వ వ్రతములు, సర్వ దానములు, ప్రాణదానముతో సమానము కావు. అఖిల భూతములకు అభయమిచ్చుట అన్ని దానముల కంటె గొప్పది.

**ముగింపు** : దానము చేయుట మంచిది. తన పేరు భూలోకములో మంచిగా చెప్పుకొన్నంతకాలము అతనికి స్వర్గ లోకములో నివాసము కలుగును. ఫలాపేక్ష లేని దేశ, కాల, పాత్రలను నెఱిగి ఇచ్చు దానము సాత్వికము. ఫలము కోరి ప్రత్యుపకారము కోరి మనస్సులో బాధ పడుతూ ఇచ్చిన దానము రాజసము. దేశ కాల పాత్రలను పాటింపక తిరస్కార భావనతో అవమానము చేసి ఇవ్వబడిన దానము తమోగుణ ప్రధానము అని భగవద్గీతలో చెప్పబడినది.

**దాతవ్యమితి యద్దానం దీయతేஉ నుపకారిణే ।**
**దేశే కాలే చ పాత్రేచ తద్దానం సాత్త్వికం స్మృతమ్ ॥**

(భగవద్గీత, శ్రద్ధాత్రయ విభాగ యోగము, 20)

**యత్తు ప్రత్యుపకారార్థం ఫలముద్దిశ్య వా పునః ।**
**దీయతే చ పరిక్లిష్టం తద్దానం రాజసం స్మృతమ్ ॥**

(భగవద్గీత, శ్రద్ధాత్రయ విభాగ యోగము, 21)

**అదేశకాలే యద్దానం అపాత్రేభ్యశ్చ దీయతే ।**
**అసత్కృతమవజ్ఞాతం తత్తామసముదాహృతమ్ ॥**

(భగవద్గీత, శ్రద్ధాత్రయ విభాగ యోగము, 22)

**వ్రతములు**

వేదములలో చెప్పిన వ్రతములు ఆచరించవలయును.

*****

# తీర్థయాత్రలు

వేద కాలములో పుణ్యక్షేత్రముల, తీర్థయాత్రల ప్రస్థావన ఉండదు. రామాయణ కాలము నాటికి ఋషులు వసియించు ఆశ్రమములు పుణ్యక్షేత్రములుగా పరిగణింపబడినవి. ద్వాపర యుగము నాటికి ఈ క్రింద వివరింపబడినవి పుణ్యక్షేత్రములుగా పరిగణింపబడినవి.

**నదులు** :- కౌసికి, గండకి (ఇవి నేపాల్ లో ఉన్నవి.) గంగ, యమున, సరస్వతీ, సరయు, గోమతి (నైమిశారణ్యములో ఉంది) సింధు, విపాస, నర్మద, శోణా, గోదావరీ, కృష్ణవేణి, భీమ, కావేరి, తామ్రపర్ణి .

**తీర్థములు** :- ప్రభాసతీర్థము, వజ్రతీర్థము, మనుతీర్థము, పంచాప్సరతీర్థము, పిండారకతీర్థము.

**సంగమములు** :- ప్రయాగ, గంగా సాగరం.

**సరస్సులు** :- మానస సరోవరము,పుష్కరము, బిందు సరోవరము, పంపా సరస్సు.

**సేతువులు** :- సేతు బంధనము (రామేశ్వరము), దక్షిణ సముద్రము (కన్యాకుమారి)

**క్షేత్రములు** :- (హరి క్షేత్రము) గయ, హరిద్వార్. కాశీ, కురుక్షేత్రము, మథుర (శ్రీకృష్ణ జన్మస్థలము) కుశస్థలి (ద్వారక) గోకర్ణము, మహిష్మతి పురము.

**ఆశ్రమములు** :- పులస్త్యాశ్రమము (నేపాల్-గలేశ్వర్ అనేది నేటి పేరు.), పులహాశ్రమము, నారాయణాశ్రమము (బదరీ) సీతారామాశ్రమము.

**అరణ్యములు** :- నైమిశారణ్యము (లక్నో దగ్గర)

**గిరులు** :- మహేంద్రగిరి, శ్రీశైలము, మలయాచలము, వింధ్య.

పుణ్యతీర్థములలో దేవతలు,ఋషులు, ధర్మపరులు ఉండుట వలన అవి పవిత్రములై సర్వ కామ పదములు. తీర్థయాత్రలు శారీరక శ్రమతో కూడి ఉన్నందున దగ్గరలోనున్న తీర్థము కంటె దూరముగా ఉన్న తీర్థము విశేషము. అతి దుర్గమము, అతి విషమములు అయిన తీర్థములను మనస్సులో తలచిన మాత్రముననే పాపములు పోవును.

**తీర్థయాత్రలు చేయువిధము :-**

**కామము, క్రోధము, మదము, లోభము లేకుండా తీర్థయాత్రలు చేయవలయును.** నియమములు ఆచరించుచూ, తీర్థములను సేవింపవలయును. బ్రహ్మచర్యము, జితేంద్రియత్వము, సత్సాంగత్యము ధర్మాచరణ, జ్ఞానేంద్రియ కర్మేంద్రియములను, మనస్సును నియమించుట, మౌనము, అధ్యయనము ఇవి మానుషవ్రతము అని చెప్పబడును. మనోబుద్ధి శౌచంబులు దేవ వ్రతము అని చెప్పబడును. మానుష వ్రతము, దేవ వ్రతములు పాటించుచూ, తీర్థంబులు సేవించ వలయును. శమము, దమము, అహింస, తపస్సు, శుచి కలిగి పుణ్యనదీస్నానము, తీర్థయాత్రలు చేయవలయును. సకల నదులు సముద్రములో కలియుట వలన సముద్ర స్నానము గొప్పది. పూర్వ జన్మసుకృతము లేని వారికి తీర్థయాత్రలు కుదరవు. ఉపవాసము, తీర్థ సేవనము చేయని వారు దరిద్రులు, రోగులు అగుదురు. నిర్ధనుండు యాత్రసేయుటకునైనా పరులను ధనమును యాచించరాదు. శక్తి కొలది దాన ధర్మములు, పితృ కార్యములు, జప హోమములు చేయవలయును. సర్వులకు సంతర్పణ చేయవలయును. దేవతలను, బ్రాహ్మణులను అర్చించవలయును. అనగా దేవ, ఋషి, పితృ తర్పణ, బ్రాహ్మణ సంతర్పణలు చేయవలయును. పరమాత్మను ధ్యానము చేయవలయును.

అన్ని తీర్థముల కంటె మానస తీర్థము గొప్పది. ఆకాశ గంగలో స్నానము చేసిన మానస వికారములు పోవును. ఈ మానస సరస్సు, ఆకాశ గంగలు పుణ్యతీర్థములు ప్రతివాని శరీరములోనే కలవు. కావున బాహ్యతీర్థముల కంటె అంతరంగిక తీర్థము గొప్పది. కావున రాగ రహితులు, విగతస్పృహ కలవారలకు తీర్థములతో పనిలేదు. భాగవతోత్తములకు పుణ్యతీర్థములతో పనిలేదు. వారే తీర్థములు కావున వీరి దర్శనమే పుణ్య తీర్థ సందర్శనము వంటిది. జ్ఞానేంద్రియ కర్మేంద్రియములను నియమించువారు, అహంకారము లేని వారు, క్రోధము లేనివారు, అపరి గ్రహము పాటించువారు, మితాహారులు, సత్యవ్రతులు, నిత్యసంతోషులు, శుభమైన ఆచారము కలవారు వీరు సమస్త తీర్థము లందు స్నానమాడిన ఫలితమును, అన్ని యజ్ఞములు చేసిన ఫలితమును పొందుదురు.

కలియుగములో రాజులచే నిర్మింపబడిన పెద్దపెద్ద దేవాలయములు, అవి ఉన్న ప్రదేశములు పుణ్యక్షేత్రములుగా పరిగణింపబడినవి. వాటికై ఒక స్థలపురాణము కల్పింపబడినది. మతప్రాతిపదికన శివ భక్తులకు కొన్ని, విష్ణు భక్తులకు కొన్ని, శాక్తేయులకు కొన్ని, దత్తాత్రేయ భక్తులకు కొన్ని, ఇలా పేర్కొని వీటన్నింటికి ఒక స్థల పురాణము కల్పింపబడినది. పురాణములలో చెప్పిన విషయములకు స్థల పురాణ కథలకు పొంతన ఉండదు.

**పుణ్యక్షేత్రములు వాటి అంతరార్థములు**

| | |
|---|---|
| హిమాలయములు | - భ్రూమధ్యస్థానము. |
| హరిద్వార్ | - నిరంతర నామస్మరణ చేయు చిత్తము-హరిద్వార్. |
| ఋషీకేశ్ | - హృషీకములు అనగా ఇంద్రియములు. జ్ఞానేంద్రియములు ఇంద్రియార్థములపై ప్రసరింపకుండుటయే ఋషీకము. |
| యమునోత్రి-గంగోత్రులు | - ముక్కుయొక్క కుడి రంధ్రము ఎడమ రంధ్రములు. |
| గంగోత్రి | - ఆకాశగంగ ఉన్న స్థానము. బ్రహ్మరంధ్రము. అదియే గంగోత్రి. ఈ గంగలో స్నానము చేయవలయును. |
| కేదారనాథ్ | - కేదారుడు అనగా శిరస్సున గంగ కలవాడు. కావున సహస్రారచక్రమునగల ఆకాశగంగను దర్శించి-ఆత్మను దర్శించుట. |
| బదరీ విశాల్ | - సర్వుల యందుగల ఆత్మను చూచుట-విశ్వరూప సందర్శనము. |
| అమరనాథ్‌గుహ | - హృదయ గుహలో గల ఆత్మ. |
| మానస సరోవరము | - లింగ శరీరము. ఇది నశించిన జన్మరాహిత్యము గలుగును. |
| సరయూ | - సహస్రార చక్రము. |
| అయోధ్య, ద్వారక | - హృదయగుహ. |
| బృందావనము | - కామక్రోధములు లేకుండుట. |

| | |
|---|---|
| దండకారణ్యాము | - ఆధారచక్రము నుండి అనాహతము వఱకుగల బ్రహ్మదండి లేక సుషుమ్ననాడి. |
| నైమిశారణ్యాము | - కనుఱెప్పలు ఆర్పకుండా శ్రద్ధగా వినుట. |
| కాశి | - అనగా వెలుగు. జ్యోతి. ఆత్మను దర్శించి యీ స్థానమును చేరి దేహము వదలిన యోగికి పునర్జన్మ లేదు. |
| త్రివేణీ సంగమము ప్రయాగ | - ఇడా పింగళ-సుషుమ్నలు కలియు స్థానము. |
| ఏడుకొండలు | - సప్త ఆవరణలు దాటుట. |
| శ్రీశైలము | - బ్రహ్మరంధ్రము. |
| అన్నవరము | - (సత్యన్నారాయణ). సత్యమును పాటించుట. |
| సేతువు (రామేశ్వరము) | - జీవత్వము నుండి ఈశ్వరత్వమునకు మార్గము. |
| కాంతమల జ్యోతిదర్శనము | - హృదయ గుహలో గల ఆత్మ దర్శనము. |

ఈ విధముగా బాహ్యముగాగల సర్వ పుణ్యక్షేత్రములు శరీరమందు గలవని గుర్తించవలయును. బాహ్య పుణ్యక్షేత్ర దర్శనములకు ధనము కావలయును. శరీరములోగల వాటిని దర్శించుటకు సాధన కావలయును. సాధనవలన గలుగు ఫలితము గొప్పది.

*****

## దేవతారాధన - పూజ

యజ్ఞములోని దేవతారాధన (హవ్యము) అతిథి పూజలను సమన్వయ పఱచి షోడశోపచారములుగా పూజా విధానమును తయారు చేసిరి.

పూజచేయువారు **ఇంద్రియనిగ్రహము కలిగి ఉండవలయును.** కరుణ గలిగి ఉండవలయును. ఋజు ప్రవర్తన గలిగి ఉండవలయును. బాహ్యశౌచము, అంతః కరణ శౌచము గలిగి ఉండవలయును. సమత్వము గలిగి ఉండవలయును.

**అతిథి పూజ, బ్రాహ్మణ పూజ -** ఇవి వేదములో చెప్పబడినవి. తీర్థముల కంటె అతిథి పూజ గొప్పది. సత్పురుషులు దర్శన మాత్రముననే ఇతరులను పావనంబు చేయుదురు. సజ్జన దర్శనము పుణ్యము. బ్రాహ్మణ పూజచే మనుష్యులు అఖిల సంపదలు పొందుదురు. అగ్ని ముఖము కంటె బ్రాహ్మణ ముఖము శ్రేష్ఠము. కావున బ్రాహ్మణ అతిథిని అర్ఘ్య పాద్యాది విధులతో పూజించి భోజనమును పెట్టవలయును. అటుల చేయని ఇంటి యజమాని యొక్క పుణ్యఫలము నశించును అని కఠోపనిషత్‌లో చెప్పబడినది.

**వేద కాలములో విగ్రహారాధన లేదు.** బౌద్ధ మతము, జైనమతములలో, వారివారి మత ప్రబోధకులగు బుద్ధుడు, జైనుడు బాహుబలి మొదలగు జైన తీర్థంకరులకు విగ్రహము కల్పించి ఆరాధించెడివారు. ఆ విధానమే శైవ, వైష్ణవ, శాక్తేయ మతములలో వారివారి ఇష్ట దైవములకు విగ్రహములు కల్పించి రాజులచే దేవాలయ నిర్మాణము గావించి పూజ చేయుట ఆచారముగా చోటు చేసుకొన్నది. పూజా విధానము వేద ప్రమాణికము గాక పోవుట వలన పూజా విధానములో అనేక పద్ధతులు, ఆచారములు చోటు చేసుకొన్నవి.

వేద కాలములో వివిధ దేవతలను యజ్ఞముల ద్వారా పూజించెడివారు. యజ్ఞములు చేయుటకు గల అర్హతలలో కులము ప్రధాన పాత్ర వహించెడిది. అగ్రకులాలయిన బ్రాహ్మణ, క్షత్రియులే యజ్ఞమునకు అర్హులు, ఆ యజ్ఞ ఫలితమునకు ఆదేశ ప్రజలందఱూ అర్హులు.

వైశ్యులకు, శూద్రులకు యజ్ఞ యాగములు చేయు అర్హత లేదు. ఇట్టి కాలము నందు వేదములలో చెప్పిన దేవతల ప్రీతికై చేయు యజ్ఞమునకు ప్రత్యామ్నాయ బీజములు పడినవి. యజ్ఞములోని దేవతారాధన వేద కాలమందలి అతిథి పూజల సమన్వయముతో తర్వాత తర్వాత పూజావిధానముగా సంతరించుకున్నది. నాలుగు వర్ణముల వారు స్త్రీలు అందఱు పూజ చేయుటకు అర్హులు. ఈ పూజావిధానము భక్తి విభాగము క్రింద చేర్చబడినది. **పూజాదిష్వనురాగ ఇతి పారాశర్యః** (నారద భక్తి సూత్రములు 1-16). పూజా విధానం గుఱించి భారతములోనూ భాగవతం ఏకాదశ స్కంధములో (ఉద్ధవ గీతలో శ్రీకృష్ణుడు ఉద్ధవునికి చెప్పినట్లుగా) వివరించబడినది.

**పూజా విధానము:** పూజా విధానము మూడు విధములు.

**వైదిక పూజా విధానము** :- వేదములోని మంత్రములు చదువుచూ ఒక మండపమున నిరాకారముగా దేవుని ఆహ్వానము చేసి పూజింతురు. ఆ తరువాత కాలములో దేవతా విగ్రహములు చోటు చేసుకొన్నవి.

**తాంత్రిక పూజా విధానము** :- ఇది మరల కౌళమార్గమనీ, సమయాచారమనీ ప్రధానముగా రెండు విభాగములుగా విభజింపబడినది. కౌళమార్గములో స్త్రీని నగ్నముగా ఉంచి, మధు మాంసములతో అర్చనా విధానము జరుగును. దీనిని కొందఱు ఏవగించుకొందురు. శిష్ట జనులు సమయాచారమును పాటింతురు. ఈ సమయాచారములో శక్తికి ప్రతీకగా ఒక శ్రీ చక్రమును తయారు చేసి మధు మాంసములు లేకుండా వైదిక పద్ధతిలో వలె మంత్రములతో పూజింతురు. ఇట్టి శ్రీచక్రార్చన నేడు వాడుకలో ఉన్నది. తాంత్రిక పూజ విధానమును శాక్తేయులు పాటింతురు.

**వైదిక తాంత్రిక పూజా విధానము** :- నేడు మనము చేయు పూజా విధానము ఈ పూజా విధానము క్రిందకు వచ్చును.

**విగ్రహములు** :- పరస్పర పాత్రంబులకు సహింపని మనుషులకు పూజనార్థముగా దేవతా ప్రతిమలు కల్పింపబడినవి. పురుషద్వేషులైన వారలకు ప్రతిమార్చనము

ముఖ్యార్థప్రదంబు కాదు. అనగా సర్వ జీవ రాశులలో ఈశ్వరుడు ఉన్నాడను జ్ఞానములేని వారలకు విగ్రహారాధన వలన ప్రయోజనము లేదు. బాహ్యాపూజలో విగ్రహము ప్రధాన పాత్ర వహించును. సాధకులకు ప్రారంభంలో లక్ష్యమునకు సాధనగా విగ్రహమును తయారుచేసిరి. వేద ప్రతిపాదిత అధ్యాత్మిక భావనలు ప్రతిబింబించునట్లు సాకారముగా విగ్రహమును మలచిరి. భగవంతుడు నిరాకారుడు. అపాణి పాదం, అచక్షు, అశ్రోత్రం అని చెప్పుటకు లింగమును భగవంతునికి ప్రతీకగా మలచిరి. భగవంతుడు సాకారుడు నిరాకారుడు అని చెప్పుటకు మొండి జగన్నాథుని విగ్రహము మలచిరి. ప్రకృతి అష్ట విధములుగా భేదము పొందినది అని గుర్తు చేయుటకు స్త్రీ దేవతలగు పార్వతి, దుర్గ మొదలగు దేవతలను అష్ట భుజములతో చిత్రీకరించినారు. ఇటుల ప్రతి విగ్రహము అధ్యాత్మిక భావనతో చిత్రీకరించినారు. భగవంతుడు స్త్రీ పురుష నపుంసక మూర్తిగాడనియు మరల వెనుక తానన్నియు అగుననియు మఱియు అతడు సృష్టి స్థితి లయ కారకులగు బ్రహ్మ విష్ణు శివ స్వరూపముల సమిష్టి రూపుడని గ్రహించవలయును.

**విగ్రహములోని రకములు :-** విగ్రహములు ఱాయి, కఱ్ఱ, లోహము, మట్టి, ఇసుక, స్ఫటికము, చిత్రపటము, మనోమయము అని ఎనిమిది రకములు. ఱాతి విగ్రహములు మరల నర్మదా నదిలో సహజముగా లభించే బాణములని, గండకీనదిలో సహజముగా లభించే సాలగ్రామములని, శిల్పిచే తయారు చేయబడిన విగ్రహములని మూడు రకములు. శ్రీ కృష్ణుడు పై ఎనిమిది రకములనే చెప్పినారు. కాని నేడు మనకు అక్కడక్కడా పాదరసమును ఘనీభవింపచేసిన రసమయ లింగములు, అటులనే నవపాషాణములతో తయారుచేయబడిన పళనిలోని కుమారస్వామి విగ్రహము కనబడుచున్నది. మనోమయ విగ్రహము అంతరంగిక పూజ క్రిందకు వచ్చును. బాహ్యాపూజలో ఆడంబరము, అహంకారము, అజ్ఞానము అపభ్రంశములుండును. సత్త్వగుణ ప్రధానమయిన అంతరంగిక పూజలో ఈ దోషములు ఉండవు. బాహ్యాపూజకంటే అంతరంగిక పూజల వలన గలుగు ఫలితము గొప్పది.

**దేవాలయములోని విగ్రహములు:** మూల విగ్రహములని, ఉత్సవ విగ్రహము లని రెండు రకములు వాడుకలో గలవు. దక్షిణ భారత దేశములో మూల విగ్రహమును స్పృశించరాదు. ఆ విగ్రహమున్న గర్భగుడిలోనికి వెళ్ళనివ్వరు. ఉత్తర భారత దేశములో సర్వులు విగ్రహమును స్పృశించవచ్చును. గర్భగుడిలోనికి వెళ్ళవచ్చును. ఇలా ప్రాంతీయ ఆచారములు చోటు చేసుకున్నవి. లింగమును పూజించుట, విగ్రహమును పూజించుట కంటె కూడ గొప్పది అనగా దైవము సర్వవ్యాపకుడని, నిరాకారుడని గుర్తించవలయునన్నది దీని సారాంశము.

వేద కాలము నాటి దేవతలు కొందఱు మాత్రమే పూజలందుకొనుచున్నారు. అందు ప్రధానముగా విష్ణువు, శివుడు, స్త్రీ దేవతలయిన లక్ష్మి, పార్వతీ, సరస్వతులు పూజలందుకొనుచున్నారు. ఆ తర్వాత వీరి స్థానములో (కలియుగంలో) అవతార పురుషులుగా ప్రస్తుతింపబడిన కొందఱు మాత్రమే పూజలందుకొనుచున్నారు. అవతారములలో నరసింహావతారము, దత్తాత్రేయుడు రామావతారము, కృష్ణావతారములు ప్రసిద్ధము. కూర్మావతారముగా కూడ శ్రీకూర్మములో దేవాలయము కలదు. ఆంజనేయస్వామి పూజలందుకొనుచున్నారు. పూజ చేయువారు విగ్రహమునకు అభిముఖంగా కూర్చొనవలయును. తూర్పు ముఖముగా గాని, ఉత్తరముఖముగా గాని కూర్చుని పూజించవలయును. దేవతా పూజని హవ్యముగా భావించవచ్చును. ఈశ్వరుని, ఇంద్రాది దేవతలని పూజించ వలయును. దేవతలు, బలి, హోమము, నమస్కారముల ద్వారా భక్తి సాధ్యులు.

**పూజకు పూలు** :- ఓషధులలో పుష్పములు మేలు. పూలతో దేవతలను పూజింప వలయును. దాని వలన మానవుల కోరికలను దేవతలు తీర్తురు. పద్మములు, జాజులు, తులసీదళములు, దేవతలకు ఇష్టము. కలువలు, తామరపూలు, యక్షులకు ఇష్టము. ఎఱుపు రంగుకలవి, ముళ్ళతో కూడినవి, రాక్షసులకు ఇష్టము. గాఢవాసన కలవి క్షుద్ర దేవతలకు ఇష్టము. తీక్షణ గంధ పుష్పములుభూత రక్షో గణములకు ఇష్టము. పరిమళముతో కూడినవి కాంతి గల పూలు మానవులకు ఇష్టము.

**ధూపము** :- గుగ్గిలము వేయుట మంచిది. యక్ష, గంధర్వ, పన్నగ, రాక్షసులు ధూపమునకు మెచ్చి కోర్కెలు తీర్చెదరు.

**దీపం** : దేవుని వద్ద దీపము ఎన్ని నిముషములు వెలుగునో అన్ని సంవత్సరములు మానవుడు స్వర్గలోకములో నుండును. దీపారాధనకు ఆవు నెయ్యి ముఖ్యము. గేదె నెయ్యి,మేక నెయ్యి, తైలము మధ్యమము. మేధోష్ఠి, క్రొవ్వు నూనెలు వాడరాదు. తామస, భూత, రక్షోముఖంబులైన కుత్సిత జాతులెల్ల దీపారాధన వలన దీపము వద్ద అణిగి పోవును.

**హారతి** :- కర్పూర దీపము మంచిది. కర్పూర దీపమును దేవతలకు ఇచ్చిన పరమ పుష్టిని, ఆయువును ఇచ్చెదరు.

**నైవేద్యము** :- దేవతలకు నైవేద్యం పెట్టి దానిని భుజింపవలయును.

| | |
|---|---|
| హృదయగుహ | - గర్భగుడి |
| ఆత్మ | - గుడిలోని దేవుడు |
| నిరంతర నామస్మరణ | - అర్చన / శివలింగముపైగల ధారాపాత్ర |

హృదయగుహలోగల దైవమును (ఆత్మను) దర్శించుటకు సాధన కావలయును. బాహ్యపూజకంటె మానసిక పూజ గొప్పది.

గురువును సేవించవలయును. భగవంతునిని పూజింపవలయును. శ్రీరాముడు విశ్వామిత్రునిని సేవించెను. భగవంతునిని పూజించెను. కలియుగములో గురువులు వారివారి వ్యక్తిగత ఉపాధి నామములతో పూజలందుకొనుచున్నారు.

*****

# ధనముతో పనిలేనివి

## స్వాధ్యాయము

వేదము చదువుట వలన **ఋషుల ఋణము తీరును.** ఋతంచ స్వాధ్యాయ ప్రవచనేచ। సత్యం చ స్వాధ్యాయ ప్రవచనేచ । తపశ్చ స్వాధ్యాయ ప్రవచనేచ । దమశ్చ స్వాధ్యాయ ప్రవచనేచ। శమశ్చ స్వాధ్యాయ ప్రవచనేచ। అగ్నయశ్చ స్వాధ్యాయ ప్రవచనేచ । అగ్ని హోత్రంచ స్వాధ్యాయ ప్రవచనేచ । అతిథియశ్చ స్వాధ్యాయ ప్రవచనేచ । మానుషంచ స్వాధ్యాయ ప్రవచనేచ। ప్రజాచ స్వాధ్యాయ ప్రవచనేచ। ప్రజనశ్చ స్వాధ్యాయ ప్రవచనేచ। ప్రజాతిశ్చ స్వాధ్యాయ ప్రవచనేచ। అని తైత్తిరీయ ఉపనిషత్ తొమ్మిదవ అనువాకములో చెప్పబడినది. అనగా ఋతము, సత్యము, తపస్సు, బాహ్యేంద్రియ నిగ్రహము, అంతరేంద్రియ నిగ్రహము, నిత్యాగ్నిహోత్రము, యజ్ఞ యాగాది క్రతువులు చేయుచు, అతిథి అభ్యాగతులను ఆదరించుచు, మానవ సేవ చేయుచు, వైవాహిక జీవితము గడుపుచు, స్వాధ్యాయ ప్రవచనములు చేయ వలయును. వేదములు షడంగములతో కలిపి చదివి, చదివినదాని అర్థము గ్రహించవలయును. అర్థము తెలియని వేద పఠనము గుఱించి యాస్కుడు ఈ విధముగా చెప్పెను.

**స్థాణురయం భారహారః కిలా భూ దదీత్య వేదం న విజానాతి**

(నిరుక్తం ప్రథమాధ్యాయము - షష్టి పాదము)

ఎవడు; ఆదీత్య = వేదమును పలుకుచు; వేదం = వేదార్థము; న+విజానాతి =తెలుసుకొనడో; అయం=ఇతడు అనగా వేద మంత్రములను చదివి వాటి అర్థము తెలియని వాడు; స్థాణుః=చెట్టు (మొద్దు) లాంటి వాడు. భారహారః+కిల+అభూత్ =బరువు మోయు ఎద్దులాంటి వాడు. అనగా పశువు, మొద్దులాంటి వాడని అర్థము.

వేదమును చదివి అందలి అర్థ తాత్పర్యమును గ్రహించి, ఆత్మ తత్త్వమును స్వానుభవంతో గ్రహించవలయును. వేదము డాంబికముగా చదువరాదు. వేదమును విక్రయించరాదు. వేద పండితులను వ్యాసుడు రెండు విభాగములుగా విభజించి

నాడు. వేదమును చదివి అందలి అర్థమును గ్రహించి, ఆవిధముగా మోక్ష సాధనకై యత్నించువారు. వీరు పండితులు. వేదజ్ఞులు. వేదమును చదివి, కర్మఫలమును కోరి యజ్ఞ యాగములు చేయుచూ ఇతరులకు కూడా కర్మ ఫలాసక్తిని గలిగించు బోధ చేయువారు. వీరిని పండిత మన్యులు, మూర్ఖులు అనిఅందురు.

స్వాధ్యాయముగా వేదముల స్థానములో రామాయణ, భారత, భాగవతములు వచ్చినవి. వీటిని స్త్రీ పురుషులందఱూ చదువ వలయును. ఆ చదివిన చదువు ఆచరణలో కనబడవలయును. దీనినే పారాయణ అని అందురు. అనగా పురాణములను చదివి సంసార తాపత్రయములను వీడి అపర విద్య పర విద్యలను గ్రహించి అమృతత్త్వమును పొందుటయే పారాయణ ఫలితము.

స్వాధ్యాయముగా వేదములు, ఆరణ్యకములు, బ్రాహ్మణీకములు, ఉపనిషత్తులు, షడ్దర్శనములు, గీతలు, పురాణములు మొదలగునవి అధ్యాత్మవిషయములో చెప్పబడినవి. అయితే ఈ గ్రంథములన్నీ చదువుటగాక జీవిత గమ్యమును చేరుటకు కావలసిన చదువులలో మర్మము తెలుసుకున్న చాలును.

**యావానర్థ ఉదపానే సర్వతః సంప్లుతోదకే ।**
**తావాన్ సర్వేషు వేదేషు బ్రాహ్మణస్య విజానతః॥**

(భగవద్గీత, సాంఖ్యయోగము, 46)

దాహము తీరుటకు గ్రుక్కెడు నీరు చాలును. నదీ జలమంతా ఎందులకు ? అటులనే ఆత్మ దర్శన ప్రాప్తికి వలయు విషయ పరిజ్ఞానము చాలును. అసంఖ్యాక మయిన గ్రంథములతో పనిలేదు.

*****

# మంత్ర జపము - సంధ్యావందనము

వేదములు ఓంకారమును జపించవలయునని చెప్పినవి. దీనినే బ్రహ్మ గాయత్రి అని అందురు. కొందఱు సోహం అనే హంస గాయత్రి జపించ వలయునని చెప్పిరి. అటులనే కొందఱు ఏ మంత్రము జపించకుండా అజప గాయత్రి అనగా శ్వాసపై దృష్టిని నిలప వలయునని చెప్పిరి. కలియుగములో మతములు వచ్చిన తరువాత వైష్ణవ, శైవ, శాక్తేయములకు సంబంధించిన అనేక మంత్రములు చోటు చేసుకొన్నవి. మనస్సును ఏకాగ్రతగా ఉంచుటయే వీటన్నిటి ముఖ్య ఉద్దేశ్యము.

**సంధ్యావందనం** : ఒకనాడు జనక మహారాజు అశ్వతరాశ్వ కుమారుడయిన బుడిలునితో నీకు గాయత్రీ ముఖము తెలియునా? అని అడిగెను. అంత బుడిలుడు జనకునితో గాయత్రీ ముఖమును నేను ఎఱుగననెను. అంత జనకుడు ఏనుగు బరువును మోయునట్లు నీవేల సంసార భారమును మోయుచున్నావు? అని ప్రశ్నించెను. (బృహదారణ్యక ఉపనిషత్ -14వ బ్రాహ్మణము.) వేదములలోని అనేక సందర్భములలో వినియోగింపబడు సూక్తములలోని కొన్ని వాక్యములను తీసుకొని తైత్తిరీయ ఆరణ్యకములోనివి కొన్ని, నారాయణ ఉపనిషత్తులోనివి కొన్ని కలపి సంధ్యావందనమును ఒక మహాను భావుడు **(కల్పమును)** తయారు చేసినాడు.

**ఓం తత్సవితుర్వ రేణ్యం భర్గో దేవస్య ధీమహి**
**ధియో యోనః ప్రచోదయాత్॥**

ఓ సూర్య భగవానుడా ! మాకు మంచి బుద్ధిని ఇమ్ము అని ఈ మంత్రమునకు అర్థము. ఇది 24 అక్షరములు కలిగి గాయత్రీ ఛందస్సులో కలదు. ఈ మంత్రము వేదములలో అనేక సందర్భములలో వచ్చును. దీనిని సూర్యోపాసనగా గాని, గాయత్రీ మంత్రముగా గాని ఏ వేదములలోను, ఏ సూక్తములలోను చెప్పబడలేదు. అయితే ఒక మహానుభావుడు వేదసారమును సంధ్యావందనములో నిబిడీకృతము చేసినాడు. ఈ దృశ్యమాన ప్రపంచమంతా విరాట్ పురుషునిగా చెప్పబడే ప్రకృతి పురుషుల సమిష్టి . విరాట్ పురుషునిని అధి దైవికముగా సవితా దేవతగా ఉత్ప్రేక్షించి ఆ

పురుషునకు అగ్ని ముఖము. బ్రహ్మ శిరస్సు , విష్ణువు హృదయము, రుద్రుడు శిఖా. పృథివీ యోని, పంచ ప్రాణములు అతని యొక్క ప్రాణములు అని చెప్పిరి. **(సవితా దేవతాఽగ్నిర్ముఖం, బ్రహ్మాశిరో, విష్ణుర్ హృదయగ్ం, రుద్రశ్శిఖా, పృథివీ యోనిః, ప్రాణాపాన వ్యానోదాన సమానా సప్రాణా)**. గాయత్రీ అధి భౌతికముగా ప్రకృతి. స్త్రీ స్వరూపిణి. కావున త్రిపద అనగా మూడు పాదములు కలది. సత్త్వ గుణము, రజో గుణము, తమో గుణము అను మూడు గుణములు కలది. జీవులందఱు ఈ త్రిగుణములచే బద్ధులు. ఈ గుణములు పోయినచో జీవుడు ముక్తుడు. పంచ శీర్షః అనగా ఐదు ముఖములు కలది. పంచ భూతములే ఈమె యొక్క ముఖములు. పంచ భూతముల సమ్మేళనమున 24 తత్త్వములతో శరీరము ఏర్పడును. జీవుడు అరూపుడు చిదాత్మకుడు అయినను దేహ సంబంధము కలిగి ఈ 24 తత్త్వములతో కూడి గుణహితుడై కర్మలు చేయుచూ, కర్తయు భోక్తయు అను అనర్థమును పొందుచున్నాడు. జన్మరాహిత్యమును పొందక పట్టు పురుగు వలె నశించి పోవుచున్నాడు. కావున ఈ 24 తత్త్వములను గ్రహించి, జ్ఞానేంద్రియ ములను విషయేంద్రియముల నుంచి మరలించి, కర్మేంద్రియములను నిగ్రహించి, ప్రాణమును నియమించి అంతఃకరణ చతుష్టయములగు అహంకారము చిత్తము, మనుస్సు, బుద్ధులలో నేను అనెడి భావనను కలుగ చేయు అహంకారమును వదలి, చిత్తశుద్ధి కలిగి, సంకల్ప వికల్పములకు నిలయమైన మనస్సులోని వికల్పములను నశింప చేసుకొని, సంకల్పముతో కూడిన మనస్సును బుద్ధియందు ఏకీకరణ చేసిన ఈ ఇరువది నాలుగు తత్త్వములను అధిగమించిన జీవుడు క్షేత్రజ్ఞుడై జీవన్ముక్తుడగును. దేహ పరిత్యాగానంతరము స్వస్వరూపమును పొంది బ్రహ్మమై విరాజిల్లును.

షట్ కుక్షిః అనగా ఆఱు పొట్టలు కలది. కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యములనే అరిషట్ వర్గములే ఆఱు పొట్టలు. అరిషట్ వర్గములను జయించి గుణరహితుడు అయినవాడు మోక్షమును పొందును.

అద్వైత భావనలో ఈశ్వరుడే జీవుడైనను, సాధన చేసి జీవుడు తిరిగి ఈశ్వరుడు కావలయును. ఈ విధి విధానమును చెప్పినది సంధ్యావందనము. వేదములో

బ్రహ్మకు ప్రతీకగా అక్షర బ్రహ్మయగు ఓంకారమును జపించవలయునని చెప్పినది. **ఓమిత్యేకాక్షరమ్ బ్రహ్మ.** ఆ బ్రహ్మనే **ఆసావాదిత్యో బ్రహ్మేతి** అని వేదము చెప్పినది. కావున బ్రహ్మను లక్ష్యముగా ఉంచుకొని ధ్యానము చేయవలయునని, అట్టి మంచి బుద్ధిని ఆదిత్యుడు కలుగ జేయుగాక అని కుంతి ఇట్లు ప్రార్థించినది.

**............................... నీ**

**పాదసరోజచింతనముపై ననిశంబు మదీయబుద్ధి న**

**త్యాదర వృత్తితోఁ గదియునట్లుఁగఁ జేయఁ గదయ్య యీశ్వరా.**

(భాగవతం-ప్రథమస్కంధం -199)

సంధ్యావందనమునకు భాష్యముగా రామాయణ, భాగవతములు రచియింపబడినవి. స్త్రీ పురుషులు సర్వులు మోక్షమునకు అర్హులు. మోక్షమును పొందు విధివిధానమే సంధ్యావందనము. సంసార తాపత్రయములనుంచి విడివడి మోక్షమునకు అర్హత పొందుటయే సంధ్యావందనము చేయుటగా జనకమహారాజు యొక్క అభిప్రాయము. సంసార తాపత్రయములను వీడి అరిషట్ వర్గములను జయించి ఓంకారోపాసన లేక సంధ్యావందనము చేసినవాడు బ్రహ్మర్షియగును.

*****

# తపస్సు - దైవీసంపద

**తపస్సు** : శరీరము, వాక్కు, మనస్సుతో చేయు పుణ్యకర్మానుష్ఠానము తపస్సు. తపస్సులో నిత్యము బహువిఘ్నములు కలుగును. ఆచరించుట కష్టము.

## దైవీసంపద

దైవీ సంపద కలిగి ఉండుటయే పుణ్యా కర్మానుష్ఠానము యొక్క ముఖ్య లక్ష్యము.

**బాహ్యేంద్రియ నిగ్రహము** :- జ్ఞానేంద్రియములు చెడు విషయములపై ప్రసరించ రాదు. కర్మేంద్రియములు చెడ్డ పనులు చేయరాదు.

**అంతరేంద్రియ నిగ్రహము** :- మనస్సులో చెడు తలంపులు ఉండరాదు.

**సేవ** :- వృద్ధులకు, పెద్దలకు, గురువులకు, తల్లిదండ్రులకు సేవ చేయవలయును. సేవచేయుట పుణ్యము. సంసార తాపత్రయములనుంచి విడివడి మోక్షాపేక్ష కలిగి మహాపురుషులకు సేవ చేయవలయును. పరోపకారము పుణ్యము. అనాథప్రేత సంస్కారము పుణ్యము. దుఃఖములో నున్న వారికి దుఃఖోప శమనము కలిగించుట పుణ్యము. సంఘమునకు ప్రజలకు మేలు కలుగు పనులు చేయుట పుణ్యము. రోగికి ఉచితముగా మందులిచ్చిన పాపములు పోవును. నదిని దాటించిన పుణ్యము. మార్గము శుభ్రము చేసిన సంతాన ఫలము కలుగును. సాధువులకు ఉండుటకు ఉనికి కలిగించిన సుఖము కలుగును.

**ఉపకారము** :- మనకు ఉపకారము చేసిన వారియందు కృతజ్ఞత కలిగి ఉండుట పుణ్యము. ఉపకారికి వారు చేసిన దాని కంటె ఎక్కువ చేయుట ఉత్తమ పుణ్యము.

**అహింస** :- అహింస పాటించవలయును. అహింసాపరులు పుణ్యలోకములు పొందుదురు.

**సత్యము** :- సత్యము పలుక వలయును. సత్యము ప్రియముగాను, హితముగాను, పరిమితముగాను చెప్పవలయును. రాజ్యము, పుత్రులు, ధనము, యశస్సు సత్యమునకు సమానము కావు. బావులు త్రవ్వించుట పుణ్యము. అంతకంటె క్రతువులు, అంతకంటె సుతుడు, అంతకంటె సత్యము మేలు. వేయి అశ్వమేధ

యాగముల కంటే ఒక సత్యవాక్యము మేలు. సర్వ తీర్థములలో స్నానము చేసిన దాని కంటె, సర్వవేదములు చదివిన దాని కంటె సత్యము గొప్పది. సకల పుణ్యములందు సత్యము గొప్పది. సత్యహీనుని భూమి మోప జాలదు.

(రామాయణం- బాలకాండ-33-8)

దానము, యజ్ఞము, సత్యము, యశస్సు, ధర్మము మొదలయినవి అన్ని ఓర్పు మీదనే నిలచి ఉన్నవి. కావున క్షమ గలిగి ఉండవలయును.

**అసుర సంపద** అయిన దంభము, దర్పము,అభిమానము, క్రోధము, పౌరుషము ఉండరాదు. ఆశ అహంకారాదులు ఉండరాదు.

**కీర్తి** :- నిర్మల కీర్తియే ధనము. ఎంత కాలము భూమిపై కీర్తి ఉండునో వారు అంతకాలము స్వర్గములో నుందురు. భూమి మీద కీర్తి లేకుండా జీవించుట వ్యర్థము. కీర్తిని కలిగి ఉండవలయును.

**సాంగత్యము** : సజ్జన సాంగత్యము కలిగి ఉండవలయును.

**అపరిగ్రహము** : అపరిగ్రహమును పాటించవలయును.

శ్రద్ధ, కరుణ, భూత దయ, సమభావన కలిగి ఉండవలయును. అనగా సుగుణములు కలిగి ఉండవలయును.

పుణ్యకర్మానుష్ఠానము చేయుచూ దైవీసంపదను పొందవలయును. దైవీసంపదగలిగి పుణ్యకర్మానుష్ఠానము చేయవలయును. ఇదియే జీవిత పరమార్థము.

ఫలితము కోరిచేసిన పుణ్యకర్మానుష్ఠానము పునర్జన్మను కలుగజేయును. ఫలితము కోరని పుణ్యకర్మానుష్ఠానము మోక్షమును గలుగచేయును. మానవుల మెప్పుగాక దేవతలు ప్రసన్నులగుటకు పుణ్యకర్మానుష్ఠానము చేయవలయును.

*****

# విజ్ఞాన శాస్త్ర విషయములు

పరలోక సుఖానుభూతి గుఱించి అధ్యాత్మికము చెప్పును. ఇహలోక సుఖానుభూతుల గుఱించి విజ్ఞాన శాస్త్రము చెప్పును. కావున ఈ రెండునూ మానవాళికి అవసరము. విజ్ఞాన శాస్త్ర విషయములు వేద, పురాణములలో ఉన్ననూ, అవి సామాన్యులకు అర్థము కావు. వీటిని నేర్చుకొనుటకు ప్రత్యేక శ్రద్ధ, కృషి అవసరము. విజ్ఞాన శాస్త్రము ప్రకారము ఒక పదార్థమును క్రొత్తగా తయారు చేయలేము, నాశనమును చేయలేము. అటులనే శక్తిని కూడ నాశనము చేయలేము. (Matter cannot be created nor destroyed. Energy cannot be created nor destroyed.) కాని వేదములో స్థావర జంగమముల సృష్టి విధానమును బ్రహ్మకు ఈశ్వరుడు వివరించినట్లు కలదు. సర్వమును సృష్టి చేయు విధి విధానము మన వేదములలో ఉన్ననూ, నేడు మనకు వేదమంతయు లభ్యముకానందున అట్టి విజ్ఞానము నేడు మనకు లభ్యమగుట లేదు. కణాదుడు అణు శాస్త్రము గుఱించి వివరించినను, మనము దాని ప్రయోజనము పొందలేకుంటిమి. ఇటులనే అనేక విభాగములలో మన పూర్వీకులు చెప్పిన విషయములను అధ్యయనము చేయకపోవుట వలన ప్రత్యేక శ్రద్ధ కృషి లేకపోవుట వలన మన వేద పురాణములలో ఉన్న విషయములను సశాస్త్రీయముగా లోకమునకు వెల్లడి చేయలేని స్థితిలో మనముంటిమి. కావున **విజ్ఞాన వేత్తలు వేదములలోని విజ్ఞాన శాస్త్ర విషయములు చదివి ప్రపంచమునకు అందలి విషయములను వెల్లడి చేయవలయును.** విజ్ఞానశాస్త్ర విషయములు బౌద్ధమత గ్రంథములలోనూ జైన మత గ్రంథములలోనూ కలవు. కావున వాటిని కూడ అధ్యయనము చేయ వలయును. అన్నీ మన వేదములలోగలవని సంతోషించుటకాక మన వేదములలో వివరింపబడిన విజ్ఞాన శాస్త్ర విషయములను అధ్యయనము చేసి వర్తమానములోనూ భవిష్యత్తులోనూ మఱికొన్నింటిని కనుగొనవలసి ఉన్నది. విజ్ఞాన శాస్త్ర పరిశోధన ఒక నిరంతర ప్రక్రియ.

*****

# ఆయుర్వేదము

ఆయుర్వేదము వ్యాధి నిరోధకమునకు మఱియు చికిత్సకు అవసరము. అథర్వ వేదములో అనేక చోట్ల ఓషధులను అవి ఏ రోగముల నివారణకు పనికి వచ్చునో చెప్పబడినవి. అయితే ఆ ఓషధులను ఏ విధముగా ఉపయోగించవలయునో అనే విషయములు అందు చెప్పబడలేదు. ఈ రోగ చికిత్సా విధానమునకు ఉపవేదమైన ఆయుర్వేదమును అభ్యసించవలసి ఉండును.

| | | |
|---|---|---|
| వెలగ | - | వీర్య వృద్ధికి |
| తిలక | - | వీర్య వృద్ధికి |
| లోధ్ర | - | వీర్య వృద్ధికి |
| ఖధిర వృక్షము | - | వీర్య వృద్ధికి |
| జమ్మి చెట్టు, రావి చెట్టు | - | సంతానమును కలుగ చేయును. |
| ఉలిమిరి చెట్టు | - | విషానికి విరుగుడు |
| తాబుకం | - | విషానికి విరుగుడు |
| తస్తుకం | - | విషానికి విరుగుడు |
| మదావతి | - | ఒక వ్యక్తిని మూర్ఛిల్ల చేయును. |
| వేణుతురు చెట్టు | - | మూర్ఛ రోగములు పోగొట్టును |
| శంఖము | - | మతి మఱుపును పోగొట్టును |
| ఉత్తరేణి | - | క్షయ రోగ నివారిణి |
| చంగల్వ కోస్టు | - | క్షయ రోగ నివారిణి |
| అశ్వత్థ వృక్షము | - | రాజ యక్ష్మము, కుష్టు |
| చీపద్రు | - | కాన శ్వాశములకు |
| లత్తుక | - | దెబ్బ తగిలిన కారేరక్తాన్ని ఆపుతుంది, మఱియు విరిగిన ఎముకలను కలుపును. |
| సిలాచి (చంద్ర, మోదుగ, మర్రి, జువ్వి చెట్టుల నుంచి తయారు చేయుదురు). | - | గాయమును మానుపుతుంది |

| | | |
|---|---|---|
| తెల్ల ఆవాలు | - | గర్భిణీ స్త్రీల కొఱకు |
| శమీ వృక్షము | - | సర్వ రోగ నివారిణి |
| దేవదారు | - | రోగ నివారకము |
| పాఠ | - | చనిపోయిన వారు బ్రతుకుదురు |
| ఉదకములు | - | సర్వ రోగ నివారణములు |
| వ్రీహి, యవలు | - | శరీర బలాన్ని వృద్ధి చేయును |
| వృక్షములలో పలాశ వృక్షము | - | ఉత్తమము. |

గోమూత్రము :- గోమూత్రముతో పుండు చుట్టూ కడగి, పుండును కూడ శుభ్రము చేయవలయును అప్పుడు పుండు మానును.

వయోవృద్ధుడు అయిన చ్యవనుని అశ్వనీదేవతలు మందులతో యువకుడగునట్లు చేసిరనే కథ కలదు. ఆ విధానము గుఱించి అధ్యయనము చేయవలయును.

హిమాలయ పర్వతములలో ఋషభ పర్వతము, కైలాస శిఖరముల మధ్య సమస్త ఓషధులతో కూడిన ఓషధి పర్వతము ఉన్నదని. దాని పై మృతసంజీవని, విశల్యకరణి, సువర్ణ కరణి, సంధాన కరణి అను ఓషధులు కలవు అని రామాయణంలో పేర్కొనబడినది. వీటి గుఱించి అధ్యయనము చేయవలసి ఉన్నది. చరకుడు, శుశృతుడు, బౌద్ధ ఆచార్యుడైన నాగార్జునుడు మొదలైన వారి కృషి ఫలితమును లోకమునకు అందచేయవలసిన గురుతర బాధ్యత ఆయుర్వేద విజ్ఞానులపైన గలదు. కొన్ని మఠములలో కొన్ని తాళ పత్రములలో ఆయుర్వేదమునకు సంబంధించిన విషయములు కలవు. అమరకంటకలో గులేబకావళి అనే పుష్పమునుంచి రసము తీసి అక్కడ గల నాటు వైద్యులు కంటికి మందును తయారు చేయుచున్నారు. అటులనే అనేక చోట్ల అరణ్యములోని మూలికలను నాటువైద్యులు, సన్యాసులు బైరాగి చిట్కాలని కొన్ని మందులను తయారు చేయుచున్నారు. వాటిని శాస్త్రీయముగా అధ్యయనము చేయుటకు ఒక బృహత్ ప్రణాళికను రూపొందించ వలసి ఉన్నది. ఆయుర్వేదమును ప్రజలందఱుకు అందుబాటులోనికి తీసుకొని రావలసిన బాధ్యత ఆయుర్వేద వైద్యులపై ఉన్నది. పరిపాలకులు కూడా కృషి చేయవలయును.

*****

# ధనుర్వేదము

### ఆయుధముల విజ్ఞాన శాస్త్రము

సంఘములోని దుష్ట శక్తులను ఏరివేయుటకు మఱియు సమూలముగా నశింప చేయుటకు ధనుర్వేదము అవసరము. యుద్ధములో వాడబడు అనేక మారణా యుధములు ధనుర్వేదములో చెప్పబడినవి. బ్రహ్మాస్త్రము, ఆగ్నేయాస్త్రము, సమ్మోహనాస్త్రము, మొదలయిన మారణాయుధముల తయారీ విధానము నేడు మనకు లభ్యమగుట లేదు. పూర్వము ఈ ధనుర్వేదమును ఉత్తమ కుల సంజాతులకు నేర్పెడివారు. ఆ ధనుర్వేదము మనకు అందలేదు. తమోగుణ యుతుల చేతులలో ఈ మారణాయుధ విజ్ఞానము పడినచో ప్రపంచ వినాశనమునకు కారణమగును అన్నది పూర్వీకుల భావన. ఇలా విజ్ఞానము వినాశనమునకు కారణము కాకూడదు అనే భావనతో ద్రోణాచార్యుడు ఏకలవ్యునికి ధనుర్వేదము నేర్పలేదు.

### భౌతిక రసాయన శాస్త్రములు

భౌతిక రసాయన శాస్త్రముల గుఱించిన విజ్ఞానము వేదముల నుంచి బౌద్ధ మతములోనికి జైన మతములోనికి వారివారి గ్రంథములలో కనబడుచున్నది. వాటిని అధ్యయనము చేసి లోకమునకు అందచేయవలయును.

### ఇంజనీరింగ్

ఇంజనీరింగ్ కౌశలము నేటి దేవాలయముల నిర్మాణములో కనబడుచున్నది. హిమాచల్ ప్రదేశములోగల జ్వాలాముఖి దేవాలయము, శ్రీశైలములోని శిఖరము యొక్క నీడ ఆ ప్రక్కన ఉన్న నీటిలో కనబడుట, కాళహస్తి దేవాలయములో, దేవాలయములో ఉండగనే శిఖర దర్శనము, నల్లగొండకు దగ్గరలోగల ఛాయా సోమేశ్వరుడు, కొన్ని దేవాలయములలో గర్భగుడిలోని విగ్రహముపై సూర్యకాంతి పడుట మొదలయినవి ఎన్నియో మన పూర్వీకుల ఇంజనీరింగ్ కౌశలమునకు నిదర్శనములు. శ్రీరాముడు సముద్రముపై నిర్మించిన సేతువు ఇంజనీరింగ్ కౌశలమునకు నిదర్శనము. సముద్ర కెరటముల ప్రభావమునకు లోనుగాక - అలలపై తేలియాడు పద్ధతిన బ్రిడ్జి కట్టుట గుఱించి పరిశోధన చేసిన బాగుండును.

*****

## వృక్ష శాస్త్రము

భాగవతము తృతీయ స్కంధములో బ్రహ్మ చేసిన సృష్టి గురించి చెప్పుచూ బ్రహ్మ మొదట వనస్పతులను, లతలను, పొదలను, చెట్లను సృష్టించెనని చెప్పుచూ అవి అవ్యక్త చైతన్యంబులు నంతస్స్ఫుర్శంబులు అని చెప్పినాడు. అనగా వీటికి ప్రాణమున్నదనియు సుఖ దుఃఖములు ఉన్నవనియు కానీ అవి అవ్యక్త చైతన్యంబులు అనగా వాటి భావములను వ్యక్తీకరించలేవు అని చెప్పినారు. చెట్లకు కూడా ప్రాణమున్నదని, సుఖదుఃఖములు గలవనే విషయమును పరిశోధన చేసి జగదీష్ చంద్రబోస్ ప్రయోగాత్మకముగా నిరూపించినాడు.

## సృష్టి పరిణామ సిద్ధాంతము

సృష్టి అంతా ఒక్కసారే బహిర్గతము కాలేదనియు కాల క్రమమున పరిణామ క్రమమున సృష్టి ఏర్పడినదనియు సృష్టిలో చివరగా మానవుడు వచ్చెననియు వేద పురాణములలో బ్రహ్మ దేవుని సృష్టిగా చెప్పబడినది. దీనిని శాస్త్రీయముగా డార్విన్ సృష్టి క్రమమును వివరించినాడు. సృష్టి ఎటుల ఏర్పడినదన్న విషయముపై నేడు పరిశోధనలు జరుగుచున్నవి.

పురాణములలో వర్ణింపబడిన సోమలత, పక్షులలో హంస, రాజహంసలు, ఏనుగులలో నాలుగు దంతములుగల ఏనుగు, పాములలో ఐదు తలలు కలవి మొదలయినవి నేడు కనిపించుటలేదు. వీటి శిలాజముల గురించి పరిశోధన చేయవలసి ఉన్నది.

## గణితము

**కాలమును గణించుట :**

సూర్యుని వలన కాలమానము గణించబడును. త్రిసరేణు షడంశము ఒక పరమాణువు.

పరమాణు ద్వయము - ఒక అణువు

3 అణువులు - త్రిస రేణువు

పరమాణువునందు సూర్యగతి ఎంత తడవు ఉండు - అది సూక్ష్మ కాలము.

త్రిసరేణువు నందు సూర్యగతి ఎంత తడవు ఉండు - ఒక త్రుటి.

| | | |
|---|---|---|
| 100 తృటులు | - | ఒక వేధ |
| 3 వేధలు | - | ఒక లవము |
| 3 లవములు | - | ఒక నిముషము (మనము చెప్పే నిముషము కాదు) |
| 3 నిముషములు | - | ఒక క్షణము (2.4 సెకనులు) |
| 5 క్షణములు | - | ఒక కాష్ఠ (12 సెకనులు) |
| 10 కాష్ఠలు | - | ఒక లఘువు (2 నిముషములు) |
| 15 లఘువులు | - | ఒక నాడి (30 నిముషములు) |
| 2 నాడులు | - | ఒక ముహూర్తము (ఒక గంట) |
| 6 నాడులు | - | ఒక ప్రహరం-యామము-జాము (3 గంటలు) |
| 4 యామములు | - | ఒక పగలు లేదా ఒక రాత్రి (12 గంటలు) |
| 8 యామములు | - | ఒక దినము (24 గంటలు) |
| | | 60 ఘడియలు ఒక దినము |
| 15 దినములు | - | ఒక పక్షము (15 రోజులు) |
| 2 పక్షములు | - | ఒక మాసము (30 దినములు) |
| 2 మాసములు | - | ఒక ఋతువు (2 నెలలు) |
| 6 మాసములు | - | ఒక అయనము (6 నెలలు) |
| 2 అయనములు | - | ఒక సంవత్సరము |
| 100 సంవత్సరములు | - | మానవులకు పరమాయువు. |
| మానవుల ఒక మాసము | - | పితృదేవతలకు ఒక దినము |
| మానవుల ఒక సంవత్సరము | - | దేవతలకు ఒక దినము. |

## సంఖ్యా మానము

ఒకట్లు-పదులు-వందలు-వేలు-లక్ష

| | | |
|---|---|---|
| వంద లక్షలు | - | ఒక కోటి 1,00,00,000(1+7 సున్నాలు). |
| లక్ష కోట్లు | - | ఒక శంకువు............ (1+13 సున్నాలు) |
| వెయ్యి శంకులు | - | ఒక మహాశంకువు (1+16 సున్నాలు) |
| వెయ్యి మహాశంకువులు | - | ఒక వృందము........ (1+19 సున్నాలు) |
| వెయ్యి వృందములు | - | ఒక పద్మము .......... (1+22 సున్నాలు ) |
| వెయ్యి పద్మములు | - | ఒక మహా పద్మము (1+25సున్నాలు) |
| వెయ్యి మహా పద్మములు | - | ఒక ఖర్వము ........... (1+28సున్నాలు) |
| వెయ్యి ఖర్వములు | - | ఒక మహా ఖర్వము (1+31సున్నాలు) |
| వెయ్యి మహా ఖర్వములు | - | ఒక సముద్రము .... (1+34సున్నాలు) |
| వెయ్యి సముద్రములు | - | ఒక ఓఘము ....... (1+37 సున్నాలు) |
| వెయ్యి ఓఘములు | - | ఒక మహా ఓఘము (1+40సున్నాలు) |
| అమేయము | - | అసంఖ్యాకము. |

సెకనులో వెయ్యోవంతును మనవాళ్లు గణించిరి. అటులనే సున్నాను కూడా మన పూర్వీకులు కనుగొనినారు అని పైవాటి వలన తెలియు చున్నది.

*వేదములోగల గణిత శాస్త్ర విషయములు ఆర్యభట్టు, లీలావతులు చెప్పిన గణిత శాస్త్ర విషయములను సేకరించి ప్రపంచమునకు విద్యావంతులు తెలియజేయ గలరని ఆశించుచున్నాము.*

*****

# ఖగోళ శాస్త్రము

గణిత శాస్త్రములో ఇవి ప్రత్యేక విభాగము. దీనిని నేర్చు కొనుటకు ప్రత్యేక కృషి శ్రద్ధ అవసరము. భాగవతములో పంచమ స్కంధములో **"అ॥ కమలజాండ మధ్యగతుఁడైన సూర్యుండు."** అనగా సూర్యుడు బ్రహ్మాండమునకు (సౌర కుటుంబమునకు) మధ్యలో ఉండును అని వ్యాస భగవానుడు చెప్పిన విషయమును శుకబ్రహ్మ పరీక్షిత్తునకు వివరించినట్లు కలదు. ఖగోళ శాస్త్ర విషయములను భాగవతమున వ్యాసుడు చెప్పిననూ మనము ప్రపంచమునకు కోపర్నికస్ కంటె ముందు చెప్పలేక పోయితిమి.

**సూర్యుడు :** బ్రహ్మాండమునకు సూర్యుడు మధ్యగతుడై ఉండును. ఒక దినమునందు 9 కోట్ల 51 లక్షల యోజనముల గల భూమండల మంతయు తిరుగును. సూర్యుడు ఒక క్షణమున 2050 యోజనములు సంచరించును. ఒక ముహూర్తమున 34 లక్షల 8వందల యోజనములు సంచరించును. 15 గడియలకు 2 కోట్ల 37 లక్షల 75 వేల యోజనములు నడుచును. ఒక దినమున 9 కోట్ల 51 లక్షల యోజనములు తిరుగును. వీటిని బట్టి మన పూర్వీకులకు భూమి గుండ్రముగా గాక కోడిగ్రుడ్డు ఆకారముగా ఉన్నదని తెలిసినట్లు తెలియుచున్నది.



ఇలా సూర్యుడు తిరుగుచుండును. సూర్య రథము యొక్క ఇరుసు మేరుశిఖరమున చక్రము మానసోత్తర పర్వతమున తిరుగును. సూర్యుని రథమునకు ఒక చక్రము మాత్రమే ఉండును. అనగా సూర్యుడు గ్రహముల చుట్టూ తిరుగడు. ఇతర గ్రహములు సూర్యుని చుట్టూ తిరుగుచూ తమ చుట్టూ తాము తిరుగును. అందువలన ఇతర గ్రహములకు రెండు చక్రములు సూర్యునకు ఒక చక్రము ఉన్నది అని చెప్పబడినది. సూర్యుడు ద్వాదశ రాశులలో తిరుగుటకు ఒక సంవత్సరము పట్టును. సూర్యుడు రాశులకు అభిముఖముగా తిరుగును. సూర్యుని వలన సంవత్సరము, అయనములు, ఋతువులు, మాసములు, అహోరాత్రములు కలుగుచుండును. సూర్యుడు మకర రాశినుండి మిథున రాశ్యంతము వఱకు అనగా జనవరి 14నుంచి జులై 14 వఱకు మంద గతుల తిరుగును. అందువలన పగలు ప్రొద్దు ఎక్కువ. దీనిని ఉత్తరాయణము అని అందురు. సూర్యుడు కర్కాటక రాశి ప్రవేశము నుండి ధనుస్సు రాశి అంతము వఱకు అనగా షుమారు జులై 14 నుంచి జనవరి 14వఱకు తీవ్ర గతుల సంచరించును. అందువలన పగలు ప్రొద్దు తక్కువ. దీనిని దక్షిణాయనము అని అందురు. మేషరాశి నుండి సూర్య సంచారము ప్రారంభింప బడిన దినమును **"విషు"** అని అందురు. అనగా సూర్యుడు సున్న డిగ్రీలో నున్న నిమిషమును విషు అని అందురు. ఇది సుమారు ఏప్రియల్ 14వ తేదిన వచ్చును. వృషభ కన్యా రాశులలో సూర్యుడు సంచరించుచున్నప్పుడు ఒక్కొక్క గడియ రాత్రి తగ్గును. వృశ్చిక మీన రాశులలో సూర్యుడు సంచరించుచున్నప్పుడు ఒక్కొక్క గడియ రాత్రి ఎక్కువ అగును. మేష తులా రాశులలో సూర్యుడు సంచరించుచున్నప్పుడు రాత్రింపగళ్ళు సమానము. దీనినే (Equinox day) అని అందురు. శీఘ్ర గతి మందగతి, సమగతులనియెడి విశేషంబు వలన సంవత్సరము, పరివత్సరము, ఇడావత్సరము, అనువత్సరము, ఇద్వత్సరము, అని 5 విధములయిన సంవత్సరములు ఏర్పడును. సౌర, బార్హస్పత్య, సాయన, చంద్ర, నక్షత్రమాన బేధములు సూర్యుని వలన కలుగును.

**చంద్రుడు** :- ఇతని వలన చంద్రమానము కలుగును. వృద్ధి, క్షయ, రూపంబున శుక్ల పక్ష, కృష్ణ పక్షములు కలుగ చేయును. అన్ని గ్రహములలోనూ, శీఘ్రముగా సంచరించు గ్రహమిది. ఒక్కొక్క నక్షత్రమున త్రింశన్ముహూర్తము ఉండును.

అనగా షుమారు 24 గంటలు ఉండును. ఒక్కొక్క రాశిని షుమారుగా రెండున్నర దినములలో మారును. చంద్రుడు ఆరోజు ఆకాశమున ఏనక్షత్రమునకు సమీపమున ఉన్నాడో తెలుపునది నక్షత్రము. సూర్యుడు నుండి చంద్రుడు ఉండే దూరమును తెలుపునది తిథి. ఆ విధముగా సూర్యచంద్రుల మధ్యగల దూరమును పదిహేను భాగములుగా చేసి, ఒక్కొక్క భాగమునకు పాడ్యమి, విదియ, తదియ మొదలయిన పేర్లు పెట్టిరి.చంద్రుడు అభిజిత్‌తో కూడి మేరు శిఖరము చుట్టూ తిరుగును. గ్రహములకు చక్రగతి, స్వగతి అనే గతిద్వయము కలుగును. స్వగతి అనగా తన చుట్టూ తాను తిరుగుట. చక్రగతి అనగా సూర్యుని చుట్టూ తిరుగుట. నక్షత్ర రాశులతోడ కూడిన కాల చక్రము మేరువు ధ్రువులకు (Polor star) ప్రదక్షిణముగా తిరుగును.

**బుధుడు** :- బాహ్యముగా నేత్రములకు కనిపించడు. ఇది కనిపించిన దేశములో క్షామము.

**శుక్రుడు :-** సూర్యునకు ముందరగాని వెనుకగాని ఉండును. సౌమ్య, మృదు, శీఘ్ర సంచారములు చేయును. ఋజుగతి, వక్రగతులు ఉండును. శుక్ర గ్రహము అనుకూలుడైనచో మంచి వానలు కురియును. (శుక్రుడు ఆకాశంలో కనిపించనిచో అది శుక్ర మూఢము)

**కుజుడు** :- కుజుడు 45దినములకు ఒక్కొక్క రాశి మారును. ఋజు గతి వక్రగతి ఉండును. ఇతడు దేశమునకు అరిష్ఠమును కలుగ చేయును.

**గురుడు** :- గురుడు ఒక్కొక్క రాశిలో ఒక సంవత్సరము ఉండును. ఋజుగతి వక్రగతి కలవు. వక్రించియు శుభములు కలుగచేయును. (ఇతడు ఆకాశములో కనిపించనిచో గురుమూఢము)

**శని** :- శని ఒక్కొక్క రాశిలో రెండున్నర సంవత్సరములు ఉండును. జగమునకు పీడలు కలుగ చేయును.

**సప్తర్షి మండలము** :- శని గ్రహము మీద 11లక్షల యోజనముల పైన సప్త ఋషి మండలము కలదు. ఇది లోకులకు మేలుచేయును.

**శింశుమార చక్రము :-** సప్తఋషి మండలము మీద 30లక్షల యోజనముల పైన శింశుమార చక్రము కలదు. శింశుమార చక్రమునకు ధృవుడు, ఇంద్రుడు, (Herschel), వరుణుడు (Neptune), యముడు (Pluto), కలరు. భాగవతమున యమగ్రహము తరువాత చెప్పిన **కశ్యప గ్రహమును ఇంకనూ, మన ఖగోళ శాస్త్ర వేత్తలు కనుగొనవలసి ఉన్నది.**

**రాహు - కేతువులు :-** సూర్య గ్రహమునకు నూఱు యోజనముల క్రింద రాహు మండలము కలదు. ఈ రాహు మండలము వలన సూర్య, చంద్ర గ్రహణములు ఏర్పడును. రాహు కేతువులు ఛాయా గ్రహములు. ఆకాశమున కనిపించవు. ఈ రాహు కేతువులను గణించు విధానము ఖగోళ శాస్త్రములో వివరించబడును. రాహు మండలము క్రింద వెయ్యి యోజనముల క్రింద సిద్ధ, చారణ విద్యాధరులు. వీరికి వెయ్యి యోజనములు క్రింద యక్ష రాక్షసులు, వారి క్రింద మేఘ మండలము, మేఘ మండలము క్రింద భూమి కలదు. ఇటుల భూమి, చంద్రుడు, సూర్యుడు, ఇతర గ్రహములు, రాహు కేతువుల గుఱించి ఖగోళశాస్త్ర పరిజ్ఞానము వేద పురాణములలో వివరింపబడినను వీటిని అర్థము చేసుకొనుటకు ఖగోళ శాస్త్ర పరిజ్ఞానము అవసరము. రాహు కేతువులు సూర్య చంద్రులను మ్రింగుతారనే కథగా సామాన్యుల కొఱకు చెప్పిరి.

**శింశుమార చక్రమునకు -నక్షత్రములు :**

| | | |
|---|---|---|
| ఉత్తర పార్శ్వంబున | - | పునర్వసు-పుష్యమి |
| దక్షిణ పార్శ్వంబున | - | కృత్తిక, రోహిణి, మృగశిర, ఆరుద్ర, ఆశ్లేష |
| దక్షిణ ఉత్తర కర్ణంబుల | - | మఘ, జ్యేష్ట |
| దక్షిణ ఉత్తర లోచనంబుల | - | ధనిష్ట, మూల |
| దక్షిణ ఉత్తర నాసారంధ్రంబుల | - | శ్రవణ, పూర్వాషాఢ |
| దక్షిణ ఉత్తర పాదంబుల | - | అభిజిత్, ఉత్తరాషాడ |
| దక్షిణ స్కంధంబుల | - | శతభిష నక్షత్రములు గలవు. |

**దేవతలు :**

పుచ్ఛాగ్రంబున - ధ్రువుడు (Polor star)

పుచ్ఛంబున ప్రజాపతి - అగ్నీంద్ర-ధర్మువు

పుచ్ఛమూలంబున - ధాత; విధాత

స్తనంబున - అశ్వనీ దేవతలు

దక్షిణ దౌడ - యముడు

పృష్టంబున - ఆకాశగంగ,దేవమార్గము (పాలపుంత)

**ఋషులు :**

కటి ప్రదేశంబున - సప్త ఋషులు

ఉత్తర దౌడ - అగస్త్యుడు

**గ్రహములు :**

హృదయము - సూర్యుడు

మనస్సు - చంద్రుడు

ముఖము - కుజుడు

కంఠము - రాహువు

మేఢ్రంబు - గురుడు

గుహ్యము - శని

ప్రాణాపానంబులు - బుధుడు

సర్వాంగములు - కేతువు.

బొడ్డు - శుక్రుడు ఉందురు.

సూర్యాది గ్రహముల సంచారమును, ఖగోళ శాస్త్ర విషయములను గ్రహించుటకు ఉజ్జయినిలో, జైపూర్‌లో జంతర్‌మంతర్‌ను పూర్వకాలముననే నిర్మించిరి.

*****

## జ్యోతిష్యము

జ్యోతిష్యము, ముహూర్త భాగము, హస్త సాముద్రికము, వాస్తుల గురించిన ప్రస్తావన వేదపురాణములలో కలదు. కాలములో కలుగు శభాశుభములను గ్రహించుటకు జ్యోతిష్యము అవసరము. గ్రహ దశలు మారునపుడు ప్రజల వైభవములు మారును. జన్మ నక్షత్రమునకు క్రూర గ్రహములయిన రవి, కుజ, రాహువులు ఆక్రమించిన మరణము కలుగునని రామాయణంలో ధశరథుని పరముగా వివరింపబడినది. జ్యోతిష్యములో ఐదు గ్రహములు మాత్రమే ఒక వ్యక్తి జన్మించినపుడు ఉచ్ఛలో ఉండును. రోహిణి నక్షత్రమునకు కుజుడు, బుధుడు సమీపించిన, శని గ్రహము సమీపించిన క్రూర గ్రహములయిన కుజ, శనులు చూచినా రాహుగ్రస్తమయిన రెండు క్రూర గ్రహముల మధ్య రోహిణి నక్షత్రము ఉన్నా దేశమునకు అరిష్ఠము కలుగును. చిత్త నక్షత్రమునకు శని వచ్చిన, గ్రహయుద్ధం సంభవించును, తోక చుక్క కనిపించిన, లేదా తోకచుక్క రోహిణి నక్షత్రమును ఆక్రమించిన, దేశమునకు అరిష్ఠము కలుగునని రామాయణమున వివరింపబడినది. చంద్రుడు పునర్వసు నక్షత్రము, చిత్త నక్షత్రములతో కూడిన చంద్రుడు బాగా ప్రకాశించును.

## ముహూర్త భాగము

రావణుడు రాముని భార్య సీతను వింద ముహూర్తమున అపహరించినాడు కావున ఈ వింద ముహూర్తమున అపహరింపబడిన వస్తువు అచిర కాలములోనే లభించునని జటాయువు రామునకు చెప్పెను.

## అంగ సాముద్రికము

జుట్టు నల్లగా ఉన్నా, కనుబొమ్మలు కలవకుండాఉన్నా, పిక్కలు గుండ్రముగా ఉన్నా, పిక్కలపై రోమములు లేక ఉన్నా, లలాటము, పార్శ్వ భాగములు, నేత్రములు, చేతులు, పాదములు, సీలమండలు, తొడలు, సమముగా ఉన్నా, వ్రేళ్ళ గోళ్ళు మంచి కాంతివంతముగా ఉన్నా, స్థనములు బలసిఉన్నా, స్థనముల మొనలు లోనికి ఉన్నా, నాభి లోతుగా ఉన్నా, వక్షస్థలము పుష్టిగా ఉన్నా, పాదముల వ్రేళ్ళు నేలకు ఆనించినపుడు సమముగా ఉన్నా, వ్రేళ్ళ సందులయందు ఖాళీలు లేకున్నా, ఆ స్త్రీకి వైధవ్యము లేదు.

## వాస్తు

చిరకాలము జీవించుగోరువారు వాస్తు దేవతా శాంతి చేయవలయును. స్థిర దినమున స్థిర ముహుర్తమున గృహపూజ చేసి గృహ ప్రవేశము చేయవలయును. శ్రీరాముడు చిత్ర కూటమున లేడిని బలి యిచ్చి గృహ ప్రవేశము చేసినట్లు, పంచవటిన పుష్ప బలి ఇచ్చినట్లు రామాయణంలో వర్ణింపబడినది. తూర్పు ఉత్తరములందు పల్లముగాను, పడమర దక్షిణములు ఎత్తుగాను ఉండవలయునని, నది తూర్పు వైపునకు ప్రవహించునట్లుగాను, ముఖ ద్వార ప్రదేశము సమతలముగా ఉండ వలయునని చెప్పబడినది. ఆ విధముగానే పర్ణశాలల వర్ణన గావింపబడినది. అగ్ని గృహము విశాలముగా ఉండవలయునని చెప్పబడినది. జ్యోతిష్యము, ముహూర్త భాగము, అంగ సాముద్రికము, వాస్తు భాగములలో ఋషిప్రోక్తములు గాని అనేక విషయములు అపభ్రంశములు నేడు చోటు చేసుకొన్నవి. కావున వీటిని శాస్త్రీయముగా అధ్యయనము చేసి మూఢ నమ్మకములను తొలగించి హేతుబద్ధముగా వీటిని పరిశీలించి రచియించిన ప్రపంచమునకు ప్రయోజనము గలుగును. సంపూర్ణముగా శాస్త్ర పరిజ్ఞానము లేని డాంబికుల వలన, ప్రజలకు ఈ శాస్త్రములపై నమ్మకము లేక ఉన్నది.

*****

## భూమి

కంటికి కనిపించునవి **అధిభౌతికము** లని చెప్పుదురు. వీటిని విజ్ఞాన శాస్త్రం ద్వారా అధ్యయనము చేయవలసి ఉండును. అధి దైవికములు బాహ్యా దృష్టికి గోచరింపవు. వీటిని తపస్సు ద్వారానే గ్రహించవలయును. **అధిదైవికము** విభాగము క్రింద చెప్పబడిన కథలు యోగ రహస్యములు. అధిభౌతిక అధిదైవికములుగా భూమి ఆకాశము గుఱించి వర్ణింతురు. అధిభౌతికమును మంచివారు చెడ్డవారు కూడా బాహ్యా చక్షువులతో దర్శించగలరు. అధిదైవికమును పుణ్యాత్ములు మాత్రమే దర్శించగలరు. అనగా భూదేవతను, సముద్రుని, సూర్యభగవానుని, చంద్ర, కుజ, గురు, శని మొదలయిన వాటిని పుణ్యాత్ములు మాత్రమే దర్శించగలరు. భూమి, భూగోళము, భూలోకము, భూదేవత, భూతత్త్వములు ఒకటి కావు. సముద్ర జలములతో కలసి ఉన్న భూమి భూగోళముగా చెప్పబడును. అంతరిక్షములో భూమి ఒక గోళము. ఈ భూమి జలముపైలేదు. భూమి క్రింద ఏ లోకములు లేవు. భూమి పైనను ఏలోకములు లేవు. భూమి సూర్యుని చుట్టూ తిరుగును. భూమి, చంద్రుడు, సూర్యుడు వీరి పరిభ్రమణము వలన గ్రహణములు ఏర్పడును. ఇది అధిభౌతికమైన భూమి. ఈ భూమికి భారము లేదు. భూమిని అష్టదిగ్గజములు మోయుట ఆది శేషువు తనపడగలపై భూమిని మోయుట జలములపై భూమి ఉండుట మొదలయిన పురాణ కథలు యోగ రహస్యములు. అనగా ఇవి అధిదైవికమునకు సంబంధించిన కథలు. ఈ భూమికిగల భారమును తొలగించుటకు శ్రీకృష్ణుడు అవతరించెను.

బ్రహ్మ తన శరీరమును స్వాయంభువ మనువు శతరూపలుగా విభజించినాడు. వారికి ఉత్తానపాదుడు, ప్రియవ్రతుడు అను ఇద్దఱు కుమారులు, ఆకూతి, దేవహూతి, ప్రసూతి అనే ముగ్గురు కుమార్తెలు జన్మించిరి. అందు ప్రియవ్రతుడు ప్రజాపతి అయిన విశ్వకర్మ కూతురు అగు బర్హిష్మతిని వివాహము చేసుకొనెను. వారికి 1. అగ్నీధ్రుడు, 2. ఇధ్మజిహ్వుడు, 3. యజ్ఞబాహువు, 4. హిరణ్యరేతసుడు, 5. ఘృత పృష్టుడు, 6. మేధాతిథి, 7. వీతిహోత్రుడు 8. మహావీరుడు, 9. సవనుడు, 10. కవి అను పదిమంది పుత్రులు ఊర్జస్వతి అనే కుమార్తె కలిగినారు. వీరిలో మహావీరుడు, సవనుడు, కవి అను ముగ్గురు ఊర్ధ్వ రేతస్కులయి బ్రహ్మవిద్యా నిష్ణాతులయి ఉండిరి. మిగిలిన ఏడుగురు సప్తద్వీపములకు అధిపతులయిరి.

**ప్రియవ్రతుడు ఒకనాఁడు మేరునగ ప్రదక్షిణంబు సేయు సూర్యునకు నపరభాగంబునం బ్రవర్తించు నంధకారంబు నివర్తింపంబూని భగవదుపాసనా జనితాతి పురుష ప్రభావుండై సవితృ రథసదృక్ష వేగంబు గలిగి తేజోమయంబైన రథంబు నారోహణంబు సేసి రాత్రులనెల్ల దినంబులొనర్తునని సప్త వారంబులు ద్వితీయ తపనుండునుం బోలె నరదంబు వఱపుటయు నారథనేమి మార్గంబులు సప్తసముద్రంబులును నా మధ్య భూసంధులు సప్త ద్వీపంబులు నయ్యె -** (భాగవతము, పంచమ స్కంధము, ప్రథమాశ్వాసము -18).

అలా ఏర్పడిన సప్తద్వీపములకు అగ్నీధ్రుడు తన కుమారులు ఏడుగురిని ఆ ద్వీపములకు అధిపతులను చేసెను.

## జంబూద్వీపము

భూపద్మమునకు మధ్యప్రదేశంబున జంబూద్వీపము గలదు. ఇది లక్షయోజనముల పొడవు లక్షయోజనముల వెడల్పు గలిగి వర్తులాకారంగా ఉన్నది. ఈ ద్వీపము చుట్టూ లవణ సముద్రము గలదు. లవణ సముద్రం విస్తీర్ణము లక్ష యోజనములు.




జంబూద్వీపానికి అధిపతి **అగ్నీధ్రుడు.** ఇతడు ఒకనాడు మందర పర్వత సమీపంలో సంతానం కొఱకు బ్రహ్మదేవుని ఆరాధించినాడు. అతని తపస్సుకు మెచ్చి బ్రహ్మ తన సమక్షంలో బ్రహ్మలోకంలో సంగీతం ఆలపించే "పూర్వచిత్తి" అనే అప్సరసను పంపినాడు. వీరిరువురు వివాహము చేసికొనినారు. వీరికి -




అని 9మంది కొడుకులు గలిగినారు. వీరు వారి తండ్రి అనుమతితో జంబూద్వీపమును 9వర్షములుగా విభజించుకొని పరిపాలించినారు. వారు పాలించిన ప్రదేశములు వారి వారి పేర్లతో ప్రసిద్ధి పొందినవి. ఈ 9 మంది మేరు కుమార్తెలయిన మేరు దేవి, ప్రతి రూప, ఉగ్రదంష్ట్ర, లత, రమ్య, శ్యామ, నారి, భద్ర, దేవి అను వారిని వరుసగా వివాహమాడినారు. అగ్నీధ్రుడు వేదోక్త కర్మలు చేసి బ్రహ్మలోకంబునకు చనియెను. జంబూద్వీపములో వర్తులాకారంగా 9వర్షములు ఉన్నవి. ఆ వర్షములు ఒక్కొక్కటి 9వేల యోజనాల విస్తీర్ణం కలిగి ఉన్నవి.

| | వర్షము | అధిపతి | అధిదేవత | ఆ వర్షము గురించి |
|---|---|---|---|---|
| 1 | ఇలావృత | ఇలావృతుడు | శివుడు | ఈ వర్షంలో పార్వతీ దేవి విహరించే ఉద్యానవనం ఉన్నది. ఆ వనంలోనికి పురుషుడెవరయినా ప్రవేశించిన స్త్రీలుగా మారుదురు అని పార్వతి శాపం ఇచ్చినది. పార్వతీ దేవి చెలికత్తెలతో వచ్చి శివుని సేవించుచూ ఉండును. జనులు మంత్ర తంత్రాలతో శివుని పూజించుదురు. |
| 2 | భద్రాశ్వ | భద్రాశ్వుడు | హయ గ్రీవుడు | భద్రాశ్వునికి హయగ్రీవుడు ఇష్టదైవం జనులు హయగ్రీవుని మంత్రతంత్రాలతో ఆరాధింతురు. |
| 3 | హరి | హరివర్షుడు | నరసిం హుడు | ఇష్టదైవం నృసింహుడు. ప్రహ్లాదునితో గూడి ఉత్తములయిన దైత్య దానవులు మంత్ర తంత్రాలతో నృసింహుని ఆరాధించుదురు. |

| | | | | |
|---|---|---|---|---|
| 4 | కేతుమాల | కేతుమాలుడు | మన్మథుడు | శ్రీ మహావిష్ణువు లక్ష్మీదేవిని సంతోషపెట్టుట కొఱకు మన్మథుని రూపంతో సాక్షాత్కరించును. లక్ష్మీదేవి ప్రజాపతి సంతానమయిన పగలు రాత్రులలో కామదేవుని పూజించు చుండును. |
| 5 | రమ్యక | రమ్యకుడు | మత్స్యావ తారుడు | మనువు మిగిలిన జనులతో కలసి మత్స్యావతారుని పూజింతురు. |
| 6 | హిరణ్మయ | హిరణ్మయుడు | కూర్మావ తారుడు | అర్యముడు మిగిలిన జనులతో కలసి కూర్మావతారునికొలిచెదరు. |
| 7 | ఉత్తరకురు | కురువు | వరాహావ తారుడు | భూదేవి వరాహావతారుని కొలుచును. జనులు వరాహావతారుని కొలిచెదరు. |
| 8 | కింపురుష | కింపురుషుడు | సీతాలక్ష్మణ సమేతుడైన శ్రీరాముడు | ఆంజనేయుడు కింపురుష గణాలతో శ్రీరామునిని ఆరాధించుచూ ఉండును. |
| 9 | భరత | నాభి | నారాయ ణుడు | ఈ భారత వర్షములోనే నారాయణుడు ఎన్నో అవతారములు ధరించినాడు. తత్త్వం |

ఉపదేశించినాడు. నారదాది మునుల సాంగత్యంతో సాంఖ్యయోగాన్ని ఉపదేశంగా పొంది నారాయణుని జనులు ఆరాధింతురు. ఈ వర్షమున గలవారు సాత్త్విక, రాజస, తామస కర్మంబులు చేసి కర్మానుసారము దేవలోకం-మానవ లోకం-నరకలోకం చేరుకొందురు. భక్తి యోగంబున అవిద్యా గ్రంథిని దహనము చేసి ఉత్తమ గతిని పొందెదరు. సర్వసంగ పరిత్యాగం చేసి- నారాయణ ప్రాప్తిని పొందెదరు.

**జంబూద్వీపము**




జంబూద్వీపము చుట్టూ లవణ సముద్రము కలదు.

జంబూద్వీప మధ్యభాగంలో ఇలావృత్తమనే వర్షం ఉన్నది. దీనికి అధిపతి **ఇలావృతుడు**. ఇలావృత వర్షమునకు హద్దులు :

**తూర్పు** : ఇలావృత వర్షానికి తూర్పున గంధమాధనము అనే సీమా పర్వతము. (Range) ఉన్నది. విస్తృతి రెండువేల యోజనములు. ఈ సీమా పర్వతము తూర్పు పడమరల పొడవు ఉత్తర దక్షిణ వెడల్పు కలిగి ఉన్నది. గంధమాధన సీమా పర్వతము తరువాత భద్రాశ్వ వర్షము ఉన్నది.

**దక్షిణము** : ఇలావృత వర్షానికి దక్షిణంగా, నిషధ, హేమకూట, హిమవత్పర్వతము అనే సీమా పర్వతములు ఉన్నవి. ఇవి తూర్పు నుండి పడమరకు పొడవు, ఉత్తర దక్షిణములకు  వెడల్పు కలిగి ఉన్నవి. వీటి పొడవు ఉత్తర దిక్కున గల నీల, శ్వేత, శృంగ పర్వతములలో సమానముగా ఉండును. ఈ మూడు పర్వతముల నడిమి ప్రదేశములలో హరి వర్షము, కింపురుష వర్షము, భరత వర్షము అనే వర్షములు ఉన్నవి.

**పడమర** : ఇలావృత వర్షమునకు పశ్చిమములో మాల్యవంతము అనే సీమా పర్వతము ఉన్నది. విస్తృతి రెండు వేల యోజనాలు. తూర్పు పడమర పొడవు, ఉత్తర దక్షిణాలు వెడల్పు కలిగి నీలపర్వతాన్ని ఆనుకొని ఉన్నది.  కేతు మాల వర్షానికి సరిహద్దుగా ఉన్నది. ఇలావృత వర్షమునకు పడమర మాల్యవంతము అనే సీమా పర్వతము తరువాత కేతుమాల వర్షము ఉన్నవి.

**ఉత్తరము** : ఇలావృత వర్షమునకు  ఉత్తరమున నీలము, శ్వేత, శృంగవంతము అనే సీమా పర్వతములు ఉన్నవి. ఇవి తూర్పు నుండి పడమరకు పొడవుగానూ, ఉత్తరము నుండి దక్షిణానికి వెడల్పుగాను విస్తరించి ఉన్నవి. వీని విస్తీర్ణము రెండు వేల  యోజనములు. ఇవి ఒకదానికంటె ఒకటి పది యోజనాలు తక్కువ పొడవు కలిగి ఉన్నవి. ఇవి ఉప్పు నీటి సముద్రము వఱకు వ్యాపించి ఉన్నవి. ఈ మూడు పర్వతముల నడిమి ప్రదేశములో రమ్యక,హిరణ్మయి, కురు, అను పేరు గల మూడు వర్షములున్నవి. అవి ఒక్కొక్కటి తొమ్మిదివేల యోజనాల విస్తృతి, కలిగి ఉన్నవి.

**ఇలావృత వర్షములోని పర్వతములు** :

ఇలావృత వర్షమునకు మధ్యభాగమున మేరువు పర్వతము ఉన్నది. అది సువర్ణమయము. ఈ మేరువు పర్వతము లక్ష యోజనముల ఎత్తు గలిగి మఱియు దాని చుట్టూ ఉన్న పర్వతాలకంటె ఎత్తు గలిగి ఉండును. పాద ప్రదేశము పదహారు

వేల యోజనముల విస్తృతి కలిగి అంతే లోతు కలిగి ఉన్నది. పాద ప్రదేశము పైన ముప్పది రెండువేల యోజనముల విస్తృతి కలిగి ఉన్నది. మేరువు యొక్క నడిమి దళము పదహారు వేల యోజనముల పొడవు, పదహారు వేల యోజనముల వెడల్పు నడిమి దళమునకు మీద విస్తీర్ణము ముప్పది రెండువేల యోజనము విస్తీర్ణముకలిగి ఉన్నది. **ఈ మేరు పర్వత శిఖరములో బ్రహ్మ పురము ఉన్నది.**




మేరువు పర్వతమునకు కొండలు :

| | |
|---|---|
| తూర్పున | - మందర పర్వతము ఉన్నది. ఇది పదివేల యోజనముల ఎత్తు. |
| పడమర | - సుపార్శ్వ పర్వతము ఉన్నది. ఇది పదివేల యోజనముల ఎత్తు. |
| ఉత్తరము | - కుముద పర్వతము ఉన్నది. ఇది పదివేల యోజనముల ఎత్తు. |
| దక్షిణము | - మేరు మందర పర్వతము ఉన్నది. ఇది పదివేల యోజనముల ఎత్తు. |

**తూర్పు - మందర పర్వతము**

| చెట్లు | ఉద్యానవనము | సరస్సు |
|---|---|---|
| పెద్దపెద్ద మామిడి చెట్లు ఉన్నవి. ఆ చెట్లు 11 వందల యోజనాల పొడవు, ఒక వంద యోజనాల వెడల్పు గలిగి ఉన్నవి. మామిడి చెట్ల పండ్లు పర్వత శిఖరం అంత పెద్దవి. రుచి అమృత సమా నము మాగినపండ్లు ఆ కొండపై రాలును. ఆ పండ్లు పగిలి ఆ పండ్లరసం, అరుణో దయం అనే నదిగా ప్రవహిం చును. ఆ నదీ రసాలు తియ్యనివి. సుగంధంతో కూడినవి. ఎఱ్ఱని రంగుగల ఆ నదీ తరంగములు అందఱిని పవిత్రము చేయును. ఆ నదీ జలములలో పార్వతీదేవి చెలికత్తెలు స్నానం చేయు దురు. వారి శరీరమందలి దివ్యపరిమళాన్ని గ్రహించిన వాయువు 10వేల యోజన ముల పర్యంతము సుగం ధము వెదజల్లును. | **నందనవనము** అనే ఉద్యానవనం ఉన్నది. ఇందు దేవతలు దేవకాంతలతో కలసి గంధర్వుల ఆట పాటలను ఆలకించుతూ, ఆలాపించుతూ ఆనందంగా విహరించుదురు. | క్షీర సరస్సు. ఇది శత యోజన విస్తీర్ణం. ఇందు స్నానమాడిన యోగనిష్టా అణిమాది సిద్ధులు గలుగును. |

దక్షిణం - **మేరు మందర పర్వతం 10** వేల యోజనముల ఎత్తు.

| చెట్లు | ఉద్యానవనము | సరస్సు |
|---|---|---|
| పెద్దపెద్ద నేరేడు చెట్లు కలవు. 11 వందల యోజనాల పొడవు ఒక వంద యోజనాల వెడల్పు గలిగి ఉన్నవి. నేరేడు పండ్లు పెద్ద ఏనుగు అంత ఉండును. ఆ నేరేడుపండ్ల రసం **జంబూ నది**గా ప్రవహించును. ఆనదీ జలంతో తడిసినమట్టి వాయువు సూర్యుల సంపర్కం వల్ల బంగారం లాగ మారి పోవును. ఆ బంగారమును దేవతలు ఆభరణాలుగా చేసుకొని అలంకరించుకుందురు. | **చైత్రరథం** అనే ఉద్యానవనం ఉన్నది. ఇందు దేవతలు దేవకాంతలతో కలసి గంధర్వుల ఆటపాటలను ఆలకించుచూ ఆనందంగా విహరించెదరు | మధుసరస్సు. ఇది శతయోజన విస్తీర్ణం. యోగనిష్ఠా అణిమాది సిద్ధులు గలుగును. |

పడమర - **సుపార్శ్వ పర్వతం** 10 వేల యోజనాలు ఎత్తు.

| చెట్లు | ఉద్యానవనము | సరస్సు |
|---|---|---|
| కడిమిచెట్లు ఉన్నవి. 11 వందల యోజనాల పొడవు ఒక వంద యోజనాల వెడల్పు గలిగి ఉన్నవి. కడిమి చెట్లు కోటరముల నుండి ఐదు మధు ధారా ప్రవాహములు ఐదు దిక్కులా ప్రవహిస్తు ఉండును. ఒక్కొక్క ప్రవాహం ఐదు బారల వెడల్పు గలిగి చిన్నదిగా ఉండును. ఆ ఐదూ తేనె ప్రవాహాలను ఆస్వాదించిన వారి ముఖాల నుండి వెలువడిన పరిమళం నూరు యోజనాల పర్యంతం వ్యాపించును. | **వైభ్రాజమనే** ఉద్యానవనము ఉన్నది. ఇందు దేవతలు దేవకాంతలతో కలసి గంధర్వుల ఆటపాటలను ఆలకించుచూ ఆనందంగా విహరింతురు. | ఇక్షుసరస్సు. ఇది శతయోజన విస్తీర్ణం, యోగ నిష్ఠా అణిమాది సిద్ధులు గలుగును. |

ఉత్తరం - **కుముద పర్వతం** 10 వేల యోజ నాల ఎత్తు

| చెట్లు | ఉద్యానవనము | సరస్సు |
|---|---|---|
| మఱ్ఱి చెట్లు ఉన్నవి. 11 వందల యోజనాల పొడవు. ఒక వంద యోజనం వెడల్పు గలిగి ఉండును. ఆ మఱ్ఱి చెట్ల నుండి పాలు, పెరుగు, నేయి, తేనె, బెల్లం, ఇంకా రకరకాలరుచులు గలిగిన ఆహార పదార్థములు ఎప్పుడూ వచ్చును. వస్త్రాలు, పాన్పులు, ఆసనాలు, నగలు మొదల యినవి ఆ వటవృక్షం ప్రసాదించును. కోరిన కోరిక లను తీర్చును. | **సర్వతోభద్రము** అనే ఉద్యానవనం ఉంది. ఇందు దేవతలు దేవకాంతలతో కలసి గంధర్వుల ఆటపాటలను ఆలకించుచూ ఆనందంగా విహరింతురు. | నిర్మల జల సరస్సు. ఇది శత యోజన విస్తీర్ణం. యోగనిష్టా పరులకు అణిమాది సిద్ధులు గలుగును. |

మేరువు పర్వతమునకు చుట్టూ ఉన్న కొండలు :




వీటి పొడవు దక్షిణము నుండి ఉత్తరమునకు పద్దెనిమిది వేల యోజనములు వెడల్పు తూర్పు నుండి పడమర వఱకు రెండు వేల యోజనములు కలిగి ఉండును.

## మేరు పర్వతం బ్రహ్మపట్టణం - ఆకాశగంగ

మేరుపర్వతం పై బ్రహ్మ పట్టణం ఉన్నది. అది 10వేల యోజనముల పొడవు అంతే వెడల్పు గలిగి ఉన్నది. ఆ బ్రహ్మ పురానికి ఎనిమిది దిక్కులలోనూ అష్టదిక్పాలుర పట్టణాలు ఉన్నవి.

**ఆకాశగంగ :**

నారాయణుడు త్రివిక్రమావతారం ధరించినప్పుడు ఎడమ కాలిగోటి వలన బ్రహ్మాండం పైకప్పు బ్రద్దలయినది. అంత వఱకు బ్రహ్మాండం బయట ప్రవహించే జలధార (ఆకాశగంగ) ఆ కన్నం ద్వారా లోపలికి ప్రవేశించి త్రివిక్రమావతారుని పాదాలను స్పృశిస్తూ ప్రవహించినది. ఆ ప్రవాహమే "భగవత్పాది" అనే పేరుతో సకల లోకాల పాపములను పరిహరిస్తూ చాలాకాలం స్వర్గంలో విహరించినది. ధ్రువుడు ప్రతిదినం భక్తితో ఆనదీ జలాన్ని స్వీకరించుచూ తలపై ధరించును. సప్తఋషులు ఆ ఆకాశగంగలో స్నానం చేయుదురు. ఆ జలమును తమతమ జటాజూటములలో ధరింతురు. ఆ నది దేవ మార్గం ద్వారా వచ్చి చంద్రమండలాన్ని ఒరుసుకుంటూ మేరు పర్వత శిఖరానికి చేరును. ఆకాశగంగా జలాలు తమను దర్శించిన వారికి, తమలో స్నానం చేసిన వారికి అమృతత్వాన్ని ఇచ్చును. ఆకాశగంగ బ్రహ్మ పట్టణానికి నాలుగు ద్వారాల ద్వారా, నాలుగు పేర్లతో ప్రవహించుచున్నది.

**సీత** : తూర్పు ద్వారము నుంచి ప్రవహించును. భద్రాశ్వ వర్షాన్ని పవిత్రం చేస్తూ, తూర్పు సముద్రములో కలియును.



**అలకనంద** : దక్షిణ ద్వారం నుంచి ప్రవహించును. హేమకూటం, హిమకూటం అనే పర్వతపంక్తులను దాటి భారత వర్షాన్ని పవిత్రము చేయుచూ, దక్షిణ సముద్రములో కలియును.

**చక్షువు** : పడమర ద్వారం నుంచి ప్రవహించును. మాల్యవంతం అనే పర్వతం మీదుగా సాగి కేతుమాల వర్షాన్ని పవిత్రం చేయుచూ, పడమట సముద్రంలో కలియును.

**భద్ర** : ఉత్తర ద్వారం నుంచి ప్రవహించును. కుముద, నీల, శ్వేతశృంగ పర్వతముల మీదుగా ప్రవహించి, శృంగనగరం చేరుకొని, అక్కడ నుండి మానసోత్తరాలైన ఉత్తర కురుభూములను పవిత్రము చేయుచూ, (కురువర్షము) ఉత్తర సముద్రంలో కలియును.

జంబూద్వీపమందు భారత వర్షం కర్మభూమి. భారతవర్షము కంటికి కనిపించును. మిగిలినవి బాహ్యదృష్టికి గోచరింపవు. తక్కినవి భోగభూములు. ఈ తక్కిన వర్షములలోనివారు స్వర్గం నుంచి భూమికి దిగి వచ్చినవారు. అక్కడ పుణ్య ఫలాలు అనుభవించుతూ ఉందురు. అవి భూతలస్వర్గము, సురతానంద సుఖము గలిగి దేవాంగనల దృష్టులు గలిగి, ఇచ్ఛా విహారములు సలుపుచుందురు. దేవతలతో సమానంగా ఉందురు. వీరు పూజ్యులు. పుణ్యాత్ములు, సుఖానంద పరవశులై మోక్షాన్ని కోరరు. ఎంతో సంతోషంతో జీవించెదరు. 10వేల ఏనుగుల బలం కలిగి ఉందురు. వజ్రకాయులు. 10 వేల సంవత్సరాల ఆయుర్దాయం కలిగి ఉందురు. స్త్రీలు ఒక పర్యాయము మాత్రమే సంతానమును కనెదరు. ఎప్పుడూ త్రేతాయుగమే ప్రవర్తిస్తూ ఉండును. ప్రవర్తనలో ఎటువంటి పొరపాట్లుండవు. అన్ని ఋతువులందూ చిగుళ్ళతో, పువ్వులతో, ఫలాలతో నిండిన తీగలు, వృక్షాలు గల వనాలు ఉన్నవి. సరోవరాలలో పద్మాలుండును. ఆ పద్మాల పరిమళం ఆఘ్రాణిస్తూ రాజ హంసలు, కలహంసలు విహరించుచూ ఉండును. నీటికోళ్ళు, కొక్కెరలు, బెగ్గురు పక్షులు, జక్కవలు, కొలనులలో ఈదులాడుతూ ఉండును. సరస్సులలో కొండలోయలలో దేవతా స్త్రీలు విహరించుచూ, వారి చూపులతో పురుషులను ఆకర్షితులను చేయుచూ ఉందురు. పురుషులు స్వేచ్ఛా విహారాలుచేయుచూ ఉందురు. దేవతలు తమకు సేవకులు చేసే సేవలను గ్రహిస్తూ విహరించుచూ ఉందురు.

# భారత వర్షము - కర్మ భూమి

సీతాన్వేషణ సందర్భమున సుగ్రీవుడు భారత దేశము గురించి వానరులకు ఈ విధముగా వివరించెను.

**తూర్పుదిక్కు**

**దేశములు** :- కాశి, మాలవ, విదేహ, కోసల, పుండ్ర, మగధ, అంగ, (బ్రహ్మమాల, కోశాకార రాజ్యము ఇవి వెండి గనుల దేశము. ఇవి ఇప్పుడు ఏపేర్లతో పిలువబడు చున్నవో తెలియవు.)

**నదులు** :- గంగ, యమున, సరస్వతీ, సరయు, కౌశికీ, సింధు (మహీనది, కాల మహీనది ఇవి ఇప్పుడు ఏ పేర్లతో ఉన్నవో తెలియవు.) శోణనది. ఈ నది ఎఱ్ఱని నీరు కలిగి వేగముగా ప్రవహించును.

**పర్వతము** : - యమున పర్వతము, (ఇది ఇప్పుడు ఏ పేరుతో ఉన్నదో తెలియదు.)

**దక్షిణ దిక్కు**

**దేశములు** :- విదర్భ, మత్స్య, కౌశిక, ఉత్కళ, కళింగ, ఆంధ్ర, పుండ్ర, చోళ, పాండ్య, కేరళ (మేఖల, ఋష్ఠిక, మాహిషక, ఇవి ఇప్పుడు ఏపేరుతో ఉన్నవో తెలియదు.)

**నదులు** :- నర్మదా, మహానది, గోదావరీ, కృష్ణవేణీ, కావేరీ, తామ్రపర్ణీ, (వరదా ఇది ఇప్పుడు ఏపేరుతో ఉన్నదో తెలియదు).

**పర్వతములు** :- వింధ్యపర్వతము, మలయపర్వతము

**అరణ్యములు** :- దండకారణ్యము.

**నగరములు** :- అవంతీ దశార్ణ నగరము అబ్రవంతి (ఇవి ఇప్పుడు ఏపేరుతో ఉన్నవో తెలియదు. )

**పడమర దిక్కు**

**దేశములు** :- సౌరాష్ట్ర, భాహ్లిక చంద్ర, చిత్ర (ఇవి ఇప్పుడు ఏపేరుతో ఉన్నవో తెలియదు).

**పట్టణములు :-** మురచీపట్టణం, జటాపురం, అవంతీ, అంగవేపపురం (ఇవి ఇప్పుడు ఏపేరుతో ఉన్నవో తెలియవు. )

**వనము :-** అంకిత వనము, (ఇది ఇప్పుడు ఏపేరుతో ఉన్నదో తెలియదు).

**ఉత్తర దిక్కు**

**దేశములు :-** చీనా, పరమచీన, మ్లేచ్ఛ, బాహ్లిక, పుళింద, మద్రక, కాంభోజ, శక, సౌరస, టంకణ, శూరసేన, భరత, కురు, (ప్రస్థల, ఋషిక, నీహార, వరద ఇవి ఇప్పుడు ఏపేరుతో ఉన్నవో తెలియవు). రామాయణంలోని ఈ దేశములను, నదులను గమనించిన భారత దేశముతోపాటు ఇతర దేశముల ప్రస్తావన కూడ ఉన్నట్లు కనిపించుచున్నది. భాగవతమున భారత వర్షములో పైన చెప్పిన నదులతో పాటు మఱికొన్ని నదుల ప్రస్తావన కనిపించుచున్నది.

**నదులు:-** మందాకిని, (చిత్రకూటము వద్ద కలదు.) గోమతి (నైమిశారణ్యములో కలదు) శతధృవు, చంద్రభాగ, వితస్తీ , అసిక్కి, (ఇవి నేడు తావి, జీలం, చీనాబ్ మొదలయిన పేర్లతో పిలువ బడుచున్నవి.) తుంగభద్ర, భీమరధి భీమ, తపతి (చంద్రవట, అవతోద, కృతమాల, వైహాయశి, పయస్విని, పయోద, సక్కరావత్ర, నిర్వింధ్య, పయోష్ణా, తాపి, దేవా, శిల, సురస చర్మన్వతి, వేదస్మృతి, ఋసికుల్య, త్రిసమ, త్రుషద్వతి, భోగవతి, షుషమా, మరుద్వదా, విశ్వా ఇవి ఇప్పుడు ఏపేరుతో ఉన్నవో తెలియవు.)

**పర్వతములు :-** హిమవంతము, త్రికూటము, పారియాత్రము, ఋషభము, ఇంద్రకీలాద్రి, ఇవి హిమాలయములలో ఉన్నవి. రామగిరి, చిత్ర కూటము, గోవర్ధనము, రైవతకము, సహ్యాద్రి, మహేంద్రగిరి, ద్రోణా చలము, వేదాద్రి, శ్రీశైలము, వెంకటాద్రి, ఋశ్యమూకము, నీలగిరి, (మంగళ ప్రస్థం, మైనాకం, కూటరం, గోళ్ళం, మేఘ పర్వతం, వృక్ష గిరి, కుకుంబము, కాక ముఖము, సుక్తిమంతము, ఇవి ఇప్పుడు ఏపేరుతో ఉన్నవో తెలియవు). భూమండలము తొమ్మిది కోట్ల యాభైఒక్క లక్షల యోజనములు. సగరపుత్రులు అశ్వమేధ యాగములోని అశ్వము నన్వేషించు సందర్భమున భూమిని త్రవ్వుట వలన స్వర్ణప్రస్థ, చంద్రశుక్లావర్త, రమణక, మందేహ, అరుణ, పాంచజన్య, సింహళ, లంక అనే 8 ఉపద్వీపములు ఏర్పడినవి.

రావణ నివాసమయిన లంక యిందు చెప్పిన సింహళముగాని, లంకగాని కాదు. ఆ లంక యోగరహస్యము.

## ౨. ప్లక్ష ద్వీపము




లక్షయోజనముల విస్తృతి     2లక్షల యోజనముల విస్తృతి

ప్లక్షద్వీపమునకు నడుమ ఒక పెద్ద జువ్వి చెట్టు ఉన్నది. ఆకారణమున ఆద్వీపమునకు ప్లక్ష ద్వీపమని పేరు. ఈ ద్వీపవాసులు అగ్ని దేవుని ఆరాధింతురు. అధి దేవత అగ్ని. వేద స్వరూపుడయిన సూర్య భగవానుని ఋగ్యజుస్సామ వేదమంత్రాలతో ఆరాధించుచూ ఉందురు. ప్లక్ష ద్వీపానికి అధిపతి **ఇధ్మజిహ్వుడు.** ఇతనికి ఏడుగురు కొడుకులు. ప్లక్ష ద్వీపాన్ని ఏడు వర్షములుగ విభజించి తన కుమారులను అధిపతులుగ చేసెను. వారి పేరుననే ఆ వర్షములు పిలువబడుచున్నవి. "ఇధ్మజిహ్వుడు'' నిస్సంగుడై తపస్సునకై అడవికి వెళ్ళెను. ఈ ప్లక్ష ద్వీపంలో నివసించే పురుషులు దేవతలతో సమానమైనవారు. వీరి ఆయుర్దాయం వేయి సంవత్సరములు. కేవలం చూపులతోనే సంతానాన్ని అనుగ్రహించెదరు. వీరికి శ్రమ, చెమట ఉండదు. ఈ ద్వీపములోని నదులలో స్నానంచేసి, నాలుగు వర్ణాలవారు పాపం పోగొట్టుకుందురు.

| వర్షము | అధిపతులు | కులపర్వతములు | నదులు | వర్ణములు |
|---|---|---|---|---|
| 1. శివ | శివుడు | మణికూటం | అరుణ | హంసలు |
| 2. యశస్వ | యశస్వుడు | వజ్రకూటం | నృమణ | పతంగులు |
| 3. సుభద్ర | సుభద్రుడు | ఇంద్రసేనం | ఆంగిరసి | ఊర్ధ్వాయనులు |
| 4. శాంత | శాంతుడు | జ్యోతిష్మంతం | సావిత్రి | సత్యాంగులు |
| 5. క్షేమ | క్షేముడు | ధూమ్రవర్ణం | సుప్రభాత | |
| 6. అభయ | అభయుడు | హిరణ్యగ్రీవం | ఋతుంభర | |
| 7. అమృత | అమృతుడు | మేఘమాలం | సత్యంభర | |

# 3. శాల్మలీ ద్వీపం




2లక్షల యోజనములు    4 లక్షల యోజనములు

శాల్మలీ ద్వీపంలో శాల్మలీ (బూరుగు చెట్టు)గలదు. అందువలన ఈ ద్వీపమునకు ఈ పేరు వచ్చినది. ఈ వృక్షముపై గరుత్మంతుడు వసియించుచుండును. ఈ ద్వీప వాసులు భగవత్ స్వరూపుడు, వేదమయుడు, ఆత్మ స్వరూపుడు అయిన సోముని వేద మంత్రాలతో ఆరాధింతురు. ఈ ద్వీపము లందలి వారలకు ఆయురింద్రయ పటుత్వంబులు తేజోబలంబులు, జన్మించిన తోడనే జనియించును. శాల్మలీ ద్వీపానికి అధిపతి **"యజ్ఞబాహువు."** ఇతనికి 7గురు కొడుకులు. శాల్మలీ ద్వీపాన్ని 7వర్షములుగా విభజించి, ఆ 7గురుని అధిపతులుగ చేసెను.

| **వర్షము** | **అధిపతులు** | **కులపర్వతములు** | **నదులు** | **వర్ణములు** |
|---|---|---|---|---|
| 1. సురోచన | సురోచనుడు | స్వరసం | అనుమతి | శ్రుతి ధరులు |
| 2. సౌమనస్య | సౌమనస్సుడు | శతశృంగం | సినీవాలి | విద్యాధరులు |
| 3. రమణక | రమణకుడు | వామదేవం | సరస్వతి | వసుంధరులు |
| 4. దేవబర్హ | దేవబర్హుడు | కుముదం | కుహు | ఇద్మధరులు |
| 5. పారిబర్హ | పారిబర్హుడు | ముకుందం | రజని | |
| 6. ఆప్యాయన | ఆప్యాయనుడు | పుష్పవర్ష | నంద | |
| 7. అభిజ్ఞాత | అభిజ్ఞాతుడు | శతశ్రుతి | రాక | |

## 4. కుశద్వీపం




4 లక్షల యోజనముల విస్తృతి          8లక్షల యోజనముల విస్తృతి

కుశ ద్వీపం మధ్యలో కుశస్తంభము (ఎత్తుగా పెరిగిన దర్భదుబ్బు) గలదు. అందువలన ఈ ద్వీపమునకు ఈ పేరు వచ్చినది. ఈ కుశస్తంభము దివ్యకాంతులతో తన కాంతిని ద్వీపము అంతా వెదజల్లును. ప్రజలు యజ్ఞపురుషుని ఆరాధించుచూ ఉందురు. ఈ ద్వీప వాసులకు ఆయురింద్రియ పటుత్వంబులు, తేజో బలంబులు జన్మించిన తోడనే జనియించును. కుశద్వీపానికి అధిపతి **హిరణ్యరేతసుడు.** ఇతనికి 7గురు కొడుకులు ఈ ద్వీపాన్ని 7వర్షములుగ విభజించి తన 7గురు కుమారులను వాటికి అధిపతులుగ చేసెను.

| **వర్షము** | **అధిపతులు** | **కులపర్వతములు** | **నదులు** | **వర్ణములు** |
|---|---|---|---|---|
| 1. వసుదాన | వసుదాసుడు | బభ్రువు | రసకుల్య | కుశలులు |
| 2. ధృడరుచి | ధృడరుచుడు | చతుశ్శృంగం | మధుకుల్య | కోవిదులు |
| 3. నాభి | నాభుడు | కపిలం | శ్రుతవింద్య | అభియుక్తులు |
| 4. గుప్త | గుప్తుడు | చిత్ర కూటం | మిత్రవింద్య | కులకులు |
| 5. సత్యవ్రత | సత్యవ్రతుడు | దేవానీకం | దేవగర్భ | |
| 6. విప్ర | విప్రుడు | ఊర్ధ్వరోమం | ఘృతచ్యుత | |
| 7. వామదేవ | వామదేవుడు | ద్రవిణం | మంత్రమాల | |

## 5. క్రౌంచ ద్వీపము




8లక్షల యోజనములు 16 లక్షల యోజనములు

క్రౌంచ ద్వీపం మధ్యన క్రౌంచ పర్వతము గలదు. ఆపర్వతము వలన ఆ ద్వీపమునకు ఆ పేరు వచ్చినది. షణ్ముఖుడు(కుమారస్వామి) ఈ క్రౌంచ పర్వతమును తన దివ్యబాణముచే భేదించెను. ఆరంధ్రం ద్వారా పాలవెల్లి ప్రవాహం వెలువడినది. ఆ ప్రవాహము ఆ ద్వీపాన్ని తడుపుతూ ఉండును. వరుణ దేవుడు ఆ ద్వీపమును కాపాడుతూ, ఎవరకీ ఏభయం లేకుండా చేయును. ప్రజలు వరుణ దేవుని సేవించుచూ ఉందురు. ఇందలి వారలకు ఆయురింద్రియ పటుత్వంబులు తేజో బలంబులు జన్మించిన తోడనే గలుగును. క్రౌంచ ద్వీపానికి అధిపతి **"ఘృత పృష్టుడు"**. ఇతనికి 7గురు కొడుకులు. క్రౌంచ ద్వీపాన్ని 7 వర్షములుగ విభజించి తన 7గురు కుమారులను అధిపతులుగ చేసెను. ఆ కుమారుల పేరుననే ఆ వర్షములు పిలువబడుచున్నవి.

| **వర్షము** | **అధిపతులు** | **కులపర్వతములు** | **నదులు** | **వర్ణములు** |
|---|---|---|---|---|
| 1. ఆమోద | ఆమోదుడు | శుక్లం | అభయ | గురువులు |
| 2. మధువహ | మధువహుడు | వర్ధమానం | అమృతౌఘ | ఋషభులు |
| 3. మేఘపృష | మేఘపృష్ఠుడు | భోజనం | ఆర్యక | ద్రవిణకులు |
| 4. సుదామ | సుదాముడు | ఉపబర్హణం | తీర్థపతి | దేవకులు |
| 5. ఋషిజ్య | ఋషిజ్యుడు | ఆనందం | తృప్తిరూప | |
| 6. లోహితార్ణ | లోహితార్ణుడు | నందనం | పవిత్రవతి | |
| 7. వనస్పతి | వనస్పతుడు | సర్వతో భద్రం | శుక్ల | |

పాలసముద్రంలో త్రికూటమనే పర్వతము కలదు. ఈ పర్వతమందలి అడవులలో గజేంద్ర మోక్షము కథలోని గజేంద్రుడు ఉండెనని భాగవతం అష్టమస్కంధములో వివరింపబడినది.

# 6 శాక ద్వీపం




16 లక్షల యోజనములు 32లక్షల యోజనములు

శాకద్వీపం మధ్యలో శాక వృక్షము గలదు. ఆకారణంగానే ఆద్వీపమునకు ఆపేరు వచ్చినది. ఆవృక్షము యొక్క సుగంధ పరిమళం ఆద్వీపమంతా వ్యాపించి ఉండును.

ఆద్వీపవాసులు అందలి నదీ జలాలు సేవించుచూ, ప్రాణాయామము చేసి రజస్తమో గుణంబులు నశింప చేసుకొని పరమ సమాధిని వాయురూపుడయిన భగవంతునిని సేవించెదరు. ఆ ద్వీప వాసులకు ఆయురింద్రయ పటుత్వంబులు, తేజోబలంబులు జన్మించిన తోడనే జనియించును. శాక ద్వీపానికి అధిపతి **"మేధాతిథి."** ఇతనికి 7గురు కొడుకులు, శాకద్వీపాన్ని 7 వర్షములుగ విభజించి తన 7గురు కొడుకులను అధిపతులుగ చేసెను.

| వర్షము | అధిపతులు | కులపర్వతములు | నదులు | వర్ణములు |
|---|---|---|---|---|
| 1. పురోజన | పురోజనుడు | ఈశానం | అనఘ | ఋతవ్రతులు |
| 2. మనోజన | మనోజనుడు | ఊరుశృగం | ఆయుర | సత్యవ్రతులు |
| 3. వేపమాన | వేపమానుడు | బలభద్రం | ఉభయస్పృష్టి | దానవ్రతులు |
| 4. ధూమ్రనీక | ధూమ్రనీకుడు | శతకేసరం | అపరాజిత | సువ్రతులు |
| 5. చిత్రరథ | చిత్రరథుడు | సహస్రస్రోతం | పంచవతి | |
| 6. బహురూప | బహురూపుడు | దేవపాలం | సహస్రస్పతి | |
| 7. విశ్వచార | విశ్వచారుడు | మహానసం | నిజధృతి. | |

## 7. పుష్కర ద్వీపం




32 లక్షల యోజనాలు. 64 లక్షల యోజనాల విస్తృతి.

జంబూద్వీపములోని ఇలావృత వర్షములో గల మేరువు పర్వతం పై బ్రహ్మపట్టణం కలదు. ఈ పుష్కర ద్వీపంలో గల మానసోత్తర పర్వతంపై బ్రహ్మ ఆసనం కలదు. బ్రహ్మదేవుని ఆసనంబగు 10వేల బంగారు రేకులు గలిగిన పద్మము ఇక్కడ గలదు. పుష్కర ద్వీప మధ్యంబున మానసోత్తరము అను పెద్ద పర్వతము గలదు. ఆ పర్వతం 10వేల యోజనాల విస్తీర్ణము. తూర్పు పడమరలో గల రెండింటికి మాన సోత్తర పర్వతము సరిహద్దు.




(లింగ శరీరము - మనస్సు,
సహస్రార చక్రము = మానసోత్తర పర్వతము,
మేరువు = బ్రహ్మ రంధ్రము)

ఈ నాలుగు పట్టణములలో సూర్యుడు క్రమంగా ఉదయం, మధ్యాహ్నం, అస్తమయం, అర్ధరాత్రి అనే కాల భేదాలను కల్పించును. **వీతిహోత్రుడు** ఈ ద్వీపమునకు అధిపతి. అతనికి రమణకుడు ధాతకుడు అను ఇద్దఱు కొడుకులు. ఇతడు తన ఇద్దఱు కుమారుల పేరున 2వర్షములను ఏర్పఱచి ఆ వర్షములకు ఆకుమారుల పేర్లు పెట్టి, వారిని అధిపతులుగా చేసెను. ఈ ద్వీప వాసులు బుద్ధి బలం, నియమ నిష్టలు గలవారు. భేద భావం లేక సమ భావంతో కలసి మెలసి ఉందురు. వేదోక్త కర్మలను ఆచరించుచూ చతుర్ముఖుని కొలుచుచూ ఉందురు. ఈ ద్వీపవాసులందఱికి ఆయురింద్రియ పటుత్వంబులు, తేజోబలంబులు జన్మించిన తోడనే జనియించును. ఇక్కడ చాతుర్వర్ణములు లేవు.




**నిర్జన భూమి :** 2 కోట్ల యోజన విస్తీర్ణము. దేవతావాస యోగ్యము.ఆ భూమి అద్దంలాగా స్వచ్ఛంగా నున్నగా ఉండును. ఈ భూమిని చేరిన పదార్థమును మరల పొందలేము.

**లోకాలోక పర్వతం :** లోకాలోక పర్వతం 8 కోట్ల యోజనములు. సువర్ణభూమి. సూర్యాది ధ్రువాంతంబులగు జ్యోతిర్గణంబులు మధ్యనుండుట చేసి లోకాలోక పర్వతంబు అని పేరు. ఆ లోకాలోక పర్వతంబు మీద నాలుగు దిక్కుల యందు:




అను నాలుగు దిగ్గజములు లోక రక్షణార్థంబు నిర్మితంబై ఉండును. తూర్పున-విరూపాక్షము, దక్షిణమున-మహాపద్మం, పశ్చిమమున-సౌమనసము,

ఉత్తరమున-భద్రము అను దిగ్గజములు కలవని రామాయణములో వివరింపబడినది. ఆ పర్వతమున విష్ణువు విష్వక్సేనుడాదిగా గల పార్షదులతో గూడి అఖిలలోక రక్షణార్థము కల్పపర్యంతము యోగమాయా విరచితుండై ఉండును. వివిధ మంత్రములను రహస్యంగా రక్షించుతూ ఉండును. భగవంతుడు తప్ప ఇతరులు ఆ పర్వతమును దాటి సంచరించలేరు.

## సుగ్రీవుడు సీతాన్వేషణ సందర్భమున వానరులకు చెప్పిన భూమి

### రామాయణమున భూమి గురించి

#### తూర్పున

**మందర పర్వతము.** దాని అగ్రభాగమును ఆశ్రయించి ఉండువారిలో కొందరికి చెవులుండవు, కొందరికి పెదవులే చెవులు, కొందరికి ముఖములు ఇనుప ముఖము వలె భయంకరముగా ఉండును. వీరికి ఒక పాదముండును. మహా వేగము కలవారు. చాలా బలవంతులు. మనుష్యులను తినివేయుదురు. కొందరి శిరస్సులు తీక్షణముగా పొడవుగా ఉండును, కొందరు బంగారు ఛాయ గలిగి చూచుటకు అందముగా ఉందురు.

**సముద్రము-ద్వీపములు :** కొందరు కిరాతకులు పచ్చి చేపలను తిందురు. కొందరు నరవ్యాఘ్రములు అను పేరు గల భయంకరులు. వీరు సముద్ర మధ్యములో సంచరించు చుందురు.

**యవ ద్వీపము :** ఇది 7 రాజ్యముల సముదాయము

**సువర్ణ ద్వీపము :** బంగారుగనులు గలిగి ఉండును.

**రజత ద్వీపము.**

**పర్వతము : శిశిరము -** ఈ శిశిర పర్వతము దేవతలకు దానవులకు నివాస స్థానము. ఈ పర్వత శిఖరములు స్వర్గమును తాకుచుండును.

సముద్రము - సముద్రపు ద్వీపములు. ఇక్కడ అసురులు కలరు. బ్రహ్మదేవుని అనుజ్ఞ చేత తమ సమీపమునకు వచ్చిన వారి నీడను పట్టిలాగి తినుచుందురు. మహాసర్పములకు నివాసస్థానము. రోహిత మనే సముద్రమును చేరిన, అక్కడ గల కూట శాల్మలీ వృక్షమున **గరుత్మంతుని గృహము** కలదు. ఆ గృహమును

విశ్వకర్మ నిర్మించెను. మందేహులు అనే రాక్షసులు, పర్వత శిఖరముల మీద వ్రేలాడు చుందురు. సూర్యోదయ సమయమున సూర్యుని చేత తపింప చేయబడి బ్రహ్మ తేజస్సుల చేత కొట్టబడిన వారై, సముద్ర జలములో పడిపోవుదురు. మరల పర్వత శిఖరముల చేత వ్రేలాడుచుందురు. క్షీర సముద్రమును చేరగలరు. ఆ క్షీర సముద్ర మధ్యమునందు "ఋషభమనే" తెల్లని పర్వతము ఉన్నది. అక్కడ సుదర్శన మను సరస్సు ఉన్నది. దివ్యసువాసన గల పుష్పించిన వృక్షములు, బంగారు కింజల్కములు గల పద్మములు, రాజహంసలతో అందముగా ఉండును. దేవతలు, చారణులు, యక్షులు, కిన్నరులు, ఆసరస్సులో క్రీడింతురు. క్షీరసముద్రము దాటిన తరువాత **జల సముద్రము.** ఔర్వ ఋషి కోపము వలన పుట్టిన అశ్వ ముఖము గల తేజస్సు అనగా బడబాగ్ని ఉన్నది. స్థావర జంగమములతో కూడిన ఆ జలము ఆతేజస్సుకు ఆహారము. ఆ బడబాగ్నిని చూచి సముద్రములోని ప్రాణులు అఱచుచుండెడి ధ్వని వినబడును. ఆ సముద్రము ఉత్తర తీరమున "జాత రూప శిల" అనే మహా పర్వతము ఉన్నది. అది 13 యోజనములు వ్యాపించినది. జాతరూపశిల అనే మహా పర్వతము పై ఆ పర్వతాగ్రమమున ఆదిశేషువు కూర్చుండి కనబడును. చంద్రకాంతి వంటి కాంతితో ప్రకాశించు చుండును. నల్లటి వస్త్రము ధరించి ఉండును. ఆ పర్వతము పై మూడు తలలు గల బంగారు తాళవృక్షము జండాగా ఉన్నది. ఇది నూఱు యోజనముల పొడవు దానిపై సాల, తాళ, తమాల, కర్ణికార వృక్షములు కలవు. సౌమనసమను పేరుగల బంగారు శిఖరము గలదు. అది పది యోజనములు ఎత్తు, ఒక యోజనము విస్తీర్ణము కలిగి ఉన్నది. పూర్వము త్రివిక్రమ అవతారమున, విష్ణువు, సౌమనస శిఖరముపై ఒక పాదమును, రెండవ పాదమును మేరు పర్వత శిఖరముపై ఉంచెను. సూర్యుడు జంబూద్వీపమునకు ఉత్తరముగా సంచరించి సౌమనస శిఖరము చేరి మేరువునకు దక్షిణముగా ఉన్నవారికి కనబడును. వైఖానస, వాలఖిల్య మహర్షులు ఉందురు. ఇది సుదర్శన ద్వీపము.

ఉదయ పర్వతమున ప్రాతః కాల సంధ్యఎఱ్ఱగా ప్రకాశించు చుండును. బ్రహ్మఈ పర్వతమును భూమికి, జగత్తునకు ద్వారముగానూ, సూర్యునికి హృదయ స్థానముగానూ సృష్టించెను. కావున ఇది పూర్వ దిక్కు. ఉదయ పర్వతము దాటి ఎవరును వెళ్ళలేరు. **తూర్పుదిక్కునకు ఉదయ పర్వతము హద్దు.**

## దక్షిణము

**దక్షిణ సముద్రము :** ఈ దక్షిణ దిక్కుగురించి రామాయణములో మూడు విధములుగా వర్ణింప బడినది. సుగ్రీవుడు సీతాన్వేషణ సందర్భమున వానరులకు చెప్పునపుడు ఒకవిధముగ, రావణుడు లంక నుంచి పంచవటికి సీతను అపహరించుటకు వచ్చు సందర్భమున ఒకవిధముగ, మరల వానరులు సీతాన్వేషణ సందర్భమున దక్షిణదిక్కు ప్రయాణముగా ఒకవిధముగ వర్ణింపబడినది. ఈ మూడింటిని సమ్మేళనము చేసి చదివిన దక్షిణదిక్కు గురించిన అవగాహన కలుగును.

**సుగ్రీవుడు వానరులకు చెప్పుట :** మలయ పర్వత శిఖరముపై సూర్యకాంతివంటి కాంతిగల అగస్త్యుడు కనపడును. దక్షిణ సముద్రములో **మహేంద్ర పర్వతము** కలదు. అది బంగారు వికారము కలది. ఆ పర్వతముపై దేవతలు, ఋషులు, యక్షులు, అప్సర స్త్రీలు, సిద్ధులు, చారణులు, నివసించు చుందురు. ఇంద్రుడు ప్రతి పర్వమునందు ఆ పర్వతమునకు వచ్చును. సముద్ర మధ్యము నందు **అంగారక** అను రాక్షస స్త్రీ ఉన్నది **(సింహిక)** ఆమె నీడను బట్టి లాగి ప్రాణులను భక్షించు చుండును. ఆవలి ఒడ్డున ఒక ద్వీపమున్నది. అది నూఱు యోజనముల వైశాల్యము కలది. ఆ ద్వీపమునకు మానవులు వెళ్ళజాలరు. రాక్షస రాజు రావణుడు ఆ దేశము నందే నివసించు చుండును. (లంక) ఆ ద్వీపము దాటిన పిమ్మట పుష్పితకమనే అందమైన పర్వతమున్నది. దానికి రెండు శిఖరములు ఒకటి బంగారు శిఖరము, దానిని సూర్యుడు సేవించు చుండును. ఒక శిఖరము వెండిది. తెల్లగా ఉన్న ఆ శిఖరమును చంద్రుడు సేవించుచుండును. కృతఘ్నులుకాని, క్రూరులు కానీ, నాస్తికులు కానీ ఆ పర్వతమును చూడ జాలరు. ఆ పర్వతమునకు సమస్కరించి, పదునాలుగు యోజనములు వెళ్ళిన పిమ్మట సూర్యవంతమనే పర్వతము ఉన్నది. వైద్యుత పర్వతము ఉన్నది. సర్వకామములను ఫలించునది. అక్కడ ఫలములను తిని మధువులను త్రాగి ముందుకు వెళ్ళండి.

**కుంజర పర్వతము :** దానిమీద విశ్వ కర్మ అగస్త్యుని గృహమును నిర్మించెను. అది పది యోజనముల ఎత్తు,ఒక యోజనము వైశాల్యము ఉన్నది. భోగవతి నగరము సర్పములకు నివాసము. అక్కడ వాసుకి నివసించు చుండును. ఋషభ మనే

పర్వతము ఉన్నది. అది వృషభ ఆకారములో ఉన్నది. ఆ పర్వతముపై గోశీర్షకము, పద్మకము, హరి శ్యామము అను చందనము పుట్టును. అది అగ్ని వంటి కాంతి కలది. దానిని స్పృశించరాదు. ఆ వనమును గంధర్వులు రక్షింతురు. ఆ పర్వతము పై శైలూషుడు, గ్రామణి, శిక్షుడు, శుకుడు, బభ్రువు అను ఐదుగురు గంధర్వ రాజులు నివసించు చుందురు. పితృలోకము దాటి వెళ్ళజాలరు. పితృలోకము దక్షిణ దిక్కుకు హద్దు.

**లంక నుంచి పంచవటి - రావణుని ప్రయాణం :** లంకా పట్టణము. సముద్రము, సముద్ర తీరము:- పద్మ సరస్సులు,ఆశ్రమములు, నాగులు, గంధర్వులు, కిన్నరులు, సిద్ధులు, చారణులు, అప్సరస్త్రీలు, బ్రహ్మపుత్రులైన వైఖానసులు, చంద్ర కిరణములు ఆహారముగాగల వాలఖిల్యులు, మహర్షులు, మాషగోత్ర ఋషులు కలరు. వారిని చూచుచూ రావణుడు ప్రయాణము చేయుచూ నూఱు యోజనముల పొడవు శాఖలుగల ఒక వటవృక్షమును చూచెను. ఆ వృక్షము పై ఎందరో ఋషులు నివసించు చుండిరి. ఆ వృక్షము పేరు సుభద్ర. పూర్వము గరుత్మంతుడు ఆ వటవృక్షముపై కూర్చుండి గజకచ్ఛపములను తినుటకు తెచ్చుకొనెను. ఆ వటవృక్షమును దాటి, సముద్రమును దాటి సముద్రపు ఆవలి ఒడ్డుకు రావణుడు చేరెను. ఆ తర్వాత దండకారణ్యంలో గల మారీచుని ఆశ్రమమునకు వచ్చెను. ఆ తర్వాత పంచవటికి వచ్చెను.

**వానరుల అనుభవం :**

**వానరులు - సీతాన్వేషణలో దక్షిణ దిక్కు వర్ణన :** ఋశ్యమూక పర్వతము నుంచి వానరులు బయలుదేరి దక్షిణ దిక్కుకు ప్రయాణమయిరి. కండు మహర్షి శపించిన ప్రదేశమునకు చేరిరి. ఈ ప్రదేశములలోని నదులలో నీరు లేదు. అక్కడ ఫల వృక్షములు లేవు. ఆకులు కూడలేవు. వనములో సంచరించు ప్రాణులు లేవు. పూర్వము కండు మహర్షి ఉండెను. అతనికి 10సంవత్సరముల కుమారుడు మరణించుటచే, ఆ మహాముని కోపించి ఆ విధముగా శపించెను. అక్కడ ఒక అసురుడు ఉండెను. అంగదుడు వానిని సంహరించెను. వానరులు ఆ వింధ్యారణ్యములో వెతికిరి. వింధ్య పర్వతమును అన్వేషించిరి. ఋక్షబిలమనే బిలమును చూచిరి. ఇది మయ నిర్మితము. ఆ బిలములో ఒక యోజనము దూరము

వెళ్ళిరి. వెలుతురు కనబడెను. తపస్విని కనబడెను. ఆమెయే స్వయంప్రభ. స్వయంప్రభ మేరుసావర్ణి కుమార్తె. ఈ భవనము అప్సరస స్త్రీ అయిన హేమది. వానరులు కన్నులు మూసుకొనగా స్వయంప్రభ వారిని ఆగుహనుండి బయటకు తెచ్చి ఇదే **వింధ్యపర్వతము**, ఇది **ప్రస్రవణ పర్వతము**, ఇది **దక్షిణ సముద్రము** అని చెప్పినది. ఆ వింధ్యపర్వత గుహ నుండి బయటకు వచ్చిన సంపాతిని వానరులు క్రిందకి దింపిరి. సంపాతి సీత లంకలో ఉన్నదని, తను చూచుచున్నానని చెప్పెను. హనుమంతుడు **మహేంద్ర పర్వతమును** ఎక్కెను. హనుమంతుడు ఆ పర్వతంపైనుండి ఆకాశమార్గమున లంకకు పయనించుచుండగా దక్షిణ సముద్రములోనుంచి మైనాక పర్వతము (మైనాకుడు), సురస (నాగమాత) వచ్చిరి. వారిని దాటి దక్షిణ సముద్రములో గల సింహిక అనే రాక్షసిని చంపి లంకలో గల **లంబ పర్వతము**పై దిగెను.

### పడమర దిక్కు

**పర్వతము** : సింధు సాగర సంగమ స్థానము వద్ద సోమగిరి పర్వతము కలదు. అదిబంగారు శిఖరములు కలిగిఉన్నది. అక్కడ రెక్కలతో ఎగురు సింహములు, ఏనుగులు సంచరించు చుండును.

**పారియాత్ర పర్వతము** : ఇచ్చట 24 కోట్ల గంధర్వులు నివసించు చున్నారు. ఏ ఫలములను తీసుకొనకూడదు. వానరులకు గంధర్వుల వలన భయము లేదు.

వజ్రమనే పర్వతము : చక్రవంతమను పర్వతము. దీనిపై విశ్వకర్మ వేయి అంచులు గల చక్రమును నిర్మించెను. అక్కడ విష్ణువు ఆ చక్రమును రక్షించుచున్న హయగ్రీవుని చంపి ఆ చక్రము గ్రహించెను. పంచజనుని చంపి శంఖమును గ్రహించెను.

**వరాహ పర్వతము** : సముద్రములో 64 యోజనములు వ్యాపించి ఉన్నది. ప్రాగ్జ్యోతిషమను పట్టణమున్నది. అక్కడ నరకుడు అను రాక్షసుడు గలడు.

సావర్ణమను పర్వతము కలదు . మేఘమను పర్వతము కలదు. ఇక్కడ ఇంద్రునికి దేవతలు పట్టాభిషేకము చేసిరి. 60వేల బంగారు పర్వతములు ఈ పర్వతముల మధ్యలో **మేరు పర్వతమున్నది.** సూర్యుని వరమున మేరు పర్వతమున గలవన్నియు బంగారు వర్ణము గలవి. ఆ మేరు పర్వతమును దేవతాదులు చేరి సూర్యుని

సేవింతురు. మేరు అస్త్రాద్రుల మధ్య పది తలలు గల బంగారు తాటి చెట్టు ఉన్నది. అక్కడ మేరు సావర్ణి నివసించుచున్నారు.

**అస్త్రాద్రి** :- సూర్యుడు అస్తమించును. ఈ అస్త్రాద్రి మేరువునకు పది వేల యోజనముల దూరములో ఉన్నది. విశ్వకర్మ భవనమును నిర్మించెను. ఇది వరుణుని నివాసము. ఈ అస్త్రాద్రి పడమర దిక్కునకు హద్దు. దీనిని దాటి ఎవరును వెళ్లజాలరు.

**ఉత్తర దిక్కు**

ఆశ్రమములు -సోమాశ్రమము

**పర్వతములు** : కాల పర్వతము - సుదర్శన పర్వతము. దేవసఖ పర్వతము, అది దాటిన శూన్య ప్రదేశము అక్కడ ఏవీ ఉండవు.

**కైలాస పర్వతము** - అక్కడ విశ్వకర్మ నిర్మించిన కుబేరుని గృహమున్నది.

**క్రౌంచ పర్వతము** -

**మానస పర్వతము** - దేవతలు,రాక్షసులు కూడ అచ్చటికి వెళ్ళజాలరు.

**మైనాక పర్వతము** - మయునిచే నిర్మింపబడిన మయుని భవనమున్నది.

సిద్ధులు నివసించు ఆశ్రమము , వైఖానసుల సరస్సు, కుబేరుని వాహనమైన సార్వ భౌమము. అనే ఏనుగు నిత్యము అక్కడకువచ్చును. శూన్యఆకాశము. తపస్సిద్ధులచే అది ప్రకాశించుచుండును. చంద్ర, సూర్య, నక్షత్రములు గాని మేఘములు గాని ఉండవు. శైలోద అనే నది కలదు. అక్కడ కీచకములు అను వెదుళ్ళు ఉండును. అవి సిద్ధులను అటు ఇటు తీసుకొని వచ్చును.

**ఉత్తర కురుదేశము** : పుణ్యాత్ములు ఉందురు. వారు రతియందు ఆసక్తి గలవారు.

**ఉత్తర సముద్రం** : సోమగిరి పర్వతం. బ్రహ్మలోకం,ఇంద్రలోకంలో గలవారు, ఆ పర్వత సౌందర్యమును తిలకించెదరు. సూర్యుడు లేడు. అయినా సూర్యకాంతి వంటి కాంతి ఉండును. శివుడు, బ్రహ్మ నివసించు చుందురు. కురు దేశమునకు ఉత్తరముగా ఎవరూ వెళ్ళరాదు. ఉత్తర దిక్కునకు సోమగిరి హద్దు. సోమగిరిని దాటి దేవతలు కూడ వెళ్ళ జాలరు.

భాగవతమున వర్ణింపబడిన భూమికి, రామాయణమున వర్ణింపబడిన భూమికి చాలా భేదము ఉన్నట్లు కనబడును. ఇవి యోగరహస్యములు.

భూమండలమునకు పైన భువర్లోకము, సువర్లోకము, మహర్లోకము, జనలోకము, తపోలోకము, బ్రహ్మలోకము కలవు. ఇవి కాంతివంతమయిన లోకములు. బ్రహ్మలోకమున దేవతలు క్రీడింతురు. ఈ లోకములు ఏవియు బాహ్యదృష్టికి కనిపించవు.

భూమండలము క్రింద అతల, వితల, సుతల, రసాతల, తలాతల, మహాతల, పాతాళ లోకములుండును. ఈ లోకములు ఏవియు బాహ్యదృష్టికి కనిపించవు. ఇది యోగ భాష.

**అతలము** : ఇందు మయుని కుమారుడగు బలుడు చరియించు చుండును. అతని ఆవలింతల వలన స్వైరిణులు, కామినులు, పుంశ్చలు అను స్త్రీ గణంబులు జనియించిరి. ఆ కామినీ జనంబులు పాతాళంబు ప్రవేశించిన పురుషునకు హాటకరసం అనెడి సిద్ధ రస ఘటిక ఇచ్చి వివిధ రతి క్రీడల చరియింతురు.

**వితలము** : ఇందు పార్వతీ పరమేశ్వరులు సంభోగము చేయుచుండ వారల వీర్యంబును వాయువు అగ్నులు భక్షించి ఉమియుట వలన హాటకి అను పేర ఒక నది పుట్టెను. ఆ నది శుద్ధ బంగారము అయ్యెను.

**సుతలము** : ఇందు విష్ణువాజ్ఞగా బలి చక్రవర్తి కలడు. బలి గృహ ద్వారమున విష్ణువు గదా పాణియై శంఖ చక్రాది ఆయుధ ధరుడై తేజరిల్లును.

**తలాతలము** : ఇందు మయుడు ఉండును. శివుడు ఇతనిని ఇక్కడ ఉంచినాడు.

**మహాతలము** : ఇందు కద్రువ పుత్రులగు సర్పములు కలవు. కుహక, తక్షక, కాళియ, సుషేణాది ప్రధానులు గరుత్మంతునికి భయపడి ఉందురు.

**రసాతలము** : దైత్య దానవులగు నివాత కవచ కాలకేయులుందురు. ఇంద్ర దూతయగు సరమచే చెప్పబడు మంత్రాత్మక వాక్యంబున భయము నొందు చుందురు.

**పాతాళము** : ఇందు నాగ కులముండును. వాసుకి, శంఖ, కుళిక, మహాశంఖ, శ్వేత, ధనంజయ, ధృతరాష్ట్ర, శంఖచూడ, కంబళాశ్వతర, దేవదత్త మొదలయిన మహానాగంబులు ఐదు, పది, నూఱు, వేయి, శిరంబులు కలిగి ఫణికాంతుల చీకటిని పార ద్రోలుదురు. పాతాళము క్రింద భాగమున శేషుడుండును. ఇతడు విష్ణు శరీరము. ఇతనికి అనంతుడు, సంకర్షణుడు అను పేర్లు కలవు. లోకములను

సంహరింప ఏకాదశ రుద్రులను పుట్టించుచుండును. శేషువు అధ్యాత్మ విద్య యుక్తంబైన ఆనంద హృదయ గ్రంథిని భేదించును. శేషుని ఆకస్మికంబుగనయినా, ఆర్తుడైనా స్మరించిన అఖిల పాపములు పోయి సకల శ్రేయస్సులు కలుగును. ఈ లోకములో దైత్యదానవ నాగాది దేవ యోనులు స్వర్గమున కంటె అధిక భోగంబులు కలిగి కేళీ వినోదంబులచేటు లేని శరీరములు కలిగి చరియింతురు. ఇందు గలవారలకు అధివ్యాధులు, జరారోగంబులు, శరీరవైవర్ణ్యంబు, స్వేదదుర్గంధ ములును కలుగక పరమ కల్యాణమూర్తులగుచు, సుదర్శన భయము తప్ప ఇతర మృత్యు భయము లేక ఉందురు. అధిదైవికమైన భూమి గుఱించి చెప్పునపుడు అనేక కథలు చెప్పుదురు.

1. భూమిని ఆదిశేషువు తన పడగలపై మోయుచున్నాడు.
2. భూమిని అష్టదిగ్గజములు తమ తలలపై మోయుచున్నవి.
3. జలములను సృజియించిన తరువాత భూమిని సృజియించెను.
4. భూమి జలముల పైభాగమున ఉండెను.
5. భూమి జలములలో మునిగిపోయినది. అంత ప్రజాపతి ఆ భూమిని నీటి నుంచి ఉద్ధరించి మరల జలముల పై భూమిని ఉంచెను (వరాహావతార కథ).
6. భూమి నుంచి నాగేటి చాలులో సీత జన్మించినది.
7. భూమిని సగర పుత్రులు త్రవ్వగా సాగరమేర్పడినది.
8. భూమిపై ప్రియవ్రతుడు సూర్య రథ వేగముతో తన రథమును నడపగా సప్త ద్వీపములు సప్త సముద్రములు ఏర్పడినవి.
9. భూమిని గోవుగా చేసి పృథు చక్రవర్తి ఓషధులను పితికెను.
10. కలి పురుషుడు గోరూపముగా ఉన్న భూమిని తన్నెను.
11. భూ భారమును మానుప శ్రీకృష్ణుడుగా భగవంతుడు అవతరించి భూ భారమును మాన్పెను.
12. సహస్ర శీర్షములు గల విరాట్ పురుషుడు భూమిని అధిష్ఠించి ఉన్నాడు. ఇలా అనేక కథలలో చెప్పిన భూమికి ఒకే అర్థమును చెప్పరాదు. ఈకథలన్నియు యోగ రహస్యములు.

*****

## ఆకాశము

బాహ్యముగా కనిపించే ఆకాశము అనీ, ఘటాకాశము అనీ, హృదయాకాశము అనీ, ఆకాశమును అనేక విధములుగా చెప్పుదురు. సుందరకాండలో హనుమంతుడు లంక చేరు సందర్భమున ఈ ఆకాశము గుఱించి వివరింపబడినది. వేదములో భూమి ఆకాశములను ద్యావాపృథివీ సూక్తములుగా వర్ణింతురు.

**అధి భౌతికము :** ఇది కంటికి కనిపించును. ఈ ఆకాశము గుఱించి వర్ణించుచూ పక్షులు విహరించు మార్గము, మేఘ మండలము, మేఘములు, చంద్రుడు, సూర్యుడు, ఇతర గ్రహములు, అశ్విన్యాది నక్షత్రములు గుఱించి హనుమంతుడు లంక చేరు సందర్భమున ఆకాశ మార్గ ప్రయాణముగా చెప్పబడినది.

**అధి దైవికము :** ఇది కంటికి కనిపించదు. ఇది యోగ మార్గము. శరీరములోని సుషుమ్నా మార్గమును ఆకాశముగా వర్ణింతురు. ఈ సుషుమ్నా మార్గములో పుణ్యకర్మానుష్ఠాన పరులు, యోగులు, మాత్రమే పయనించగలరు, మఱియు దర్శింపగలరు. సుందరకాండలో హనుమంతుడు లంక చేరు సందర్భమున చారణులు ప్రయాణించు మార్గముగా ఈ ఆకాశ మార్గమును వర్ణింపబడినది. అనగా హనుమంతుని ప్రయాణమును సుషుమ్నా నాడిలోని ప్రయాణముగా గ్రహించ వలయును. ఈ మార్గములో నాగులు, విద్యాధరులు, యక్షులు, గంధర్వులు, విశ్వావసు అను గంధర్వ రాజు నివాసము, దేవేంద్రుని వాహనమయిన ఐరావతము సంచరించు మార్గము వర్ణింపబడినది. ఈ మార్గమున మహర్షి గణములు, స్వర్గమును జయించిన పుణ్యాత్ములు, హవిస్సులు మోసుకొని పోవు అగ్ని సంచరించెదరని చెప్పబడినది.

### సూర్యుడు

సూర్యుడు, ఒక గ్రహముగా కంటికి కనిపించును. ఇది అధిభౌతికము. అధి దైవికముగా ఇతడు సూర్య భగవానుడు. ఇతనిని పుణ్య కర్మానుష్ఠానపరులు మాత్రమే దర్శించెదరు. సూర్యభగవానుని రథమునకు గాయత్రీ చ్ఛందంబాదిగా సప్త

ఛందంబులు అశ్వములు. రథసారథి అరుణుడు. సూర్యభగవానుని ముందట అంగుష్ఠ శరీర ప్రమాణము గల 60వేల వాలఖిల్యులు సౌరసూక్తము పఠియించు చుందురు. అనేక మునులు, దేవతలు, గంధర్వాదులు సూర్యభగవానుని సేవించెదరు. సూర్యభగవానునికి ముగ్గురు భార్యలు పద్మిని, ఛాయ, బడబ. వీరివలన యముడు, యమున, శని, తపతి, వైవస్వత మనువు జన్మించినారు. సూర్య భగవానుని వలన సుగ్రీవుడు (రామాయణ కాలమున), సూర్య భగవానుని వలన కర్ణుడు (భారత కాలమున) కలిగిరి. సత్రాజిత్తు సూర్యభగవానుని దర్శించి శమంతక మణిని పొందెను. ధర్మరాజుకు అక్షయ పాత్ర లభించినది. సూర్యభగవానుని వలన జ్యోతిర్మార్గము, ఉత్తరాయణ మార్గము, దక్షిణాయన మార్గము అనే మార్గములు ఏర్పడును. ఇవి పుణ్యాత్ములు ఊర్ధ్వలోకములకు వెళ్ళు మార్గములు. ఈ మార్గములకు పంచాగములోని దక్షిణాయన, ఉత్తరాయణములకు సంబంధము లేదు. అవి కాల విభజన క్రిందకు వచ్చును. ఆదిత్యుడనగా దేహములో చరియించు ప్రాణము. ఇదియే హంస.

సూర్య మండలమే గాయత్రిగా చెప్పబడే దేహములోగల హృదయ స్థానము. సూర్య భగవానుడు పరమాత్మ. గాయత్రి అనగా దేహము. ఆత్మను ఆత్మలో కలుపుటయే ఆదిత్యోపాసన. ఇదియే సంధ్యావందనము.

## చంద్రుడు

చంద్రుడు అధిభౌతికముగా ఉపగ్రహము. ఇది కంటికి కనిపించును. అధి దైవికముగా దేవత. చంద్రుని గుఱించి అనేక అధిదైవికములయిన కథలు వేదపురాణములలో కలవు.

1. అమృత మధనములో పాల సముద్రము నుంచి జన్మించెను.
2. అత్రి అనసూయలకు బ్రహ్మ అంశమున చంద్రునిగా ఆవిర్భవించెను.
3. గురువు భార్య అయిన తారతో కలసి, బుధుని జన్మకు కారకుడు అయ్యెను.
4. శివుని జటా జూటములో ఉండును.
5. తారలు ఇతని భార్యలు. అందఱినీ సమంగా చూడక రోహిణి యందు మిక్కిలి అనురాగము ఉండుటచే క్షయ రోగ పీడితుడయ్యెను.

ఈ కథలలో చెప్పబడే చంద్రుడు ఒకరు కాడు. ఇవి యోగరహస్యములు భూమి, ఆకాశములు కలసి బృహత్ రూపమున బ్రహ్మాండము. సాకార రూపమున విరాట్ పురుషుని దేహము. సూక్ష్మరూపమున మానవ శరీరము. అనగా బ్రహ్మాండములో గల పదునాలుగు లోకములు, సూర్యుడు, చంద్రుడు, నక్షత్రములు, నదులు పర్వతములు మొదలయినవన్నీ మన మానవ శరీరములో ఉండును. వీటిని శ్రీకృష్ణుడు యశోదకు మానవ దేహములో ఏవేవి ఎచ్చట గలవో చూపించినాడు. దీనిని కథా పరముగా శ్రీకృష్ణుని నోటిలో యశోద బ్రహ్మాండమును దర్శించెనన్నట్లు చెప్పబడినది. దేహము ఆత్మ ఉండుటకు నివాస స్థానముగా కల్పింప బడినది. ఈ దేహమును కొందఱు స్థూల దేహము, సూక్ష్మదేహముగా విభజించి విశదీకరించగా కొందఱు అన్నమయ కోశము, ప్రాణమయ కోశము, మనో మయకోశము, విజ్ఞాన మయకోశము, ఆనందమయ కోశమనే పంచకోశములుగా వివరించినారు. కొందఱు ఈ దేహమును సప్తావరణలుగా విభజించినారు. దీనినే సప్త ద్వీపములుగా విభజించి చెప్పిరి. విరాట్ పురుషుని దేహముతో సమన్వయ పఱచి మొదట బ్రహ్మాండమును అవగతము చేసుకొని ఆ పై దేహములో ఆ లోకములు, సూర్య చంద్రుల గుఱించి అధ్యయనము చేయవలయును.

స్థూల శరీరము, సూక్ష్మ శరీరము, అగ్ని ఖండము, సూర్య ఖండము, చంద్ర ఖండము, ప్రాణము, బుద్ధిగా సప్తద్వీపముల గుఱించి ఆకాశము గుఱించి లోకముల గుఱించి, చదివిన సీతాన్వేషణ పూర్తి యగును.

*****

# కాలము

బ్రహ్మకు పగలు వేయి యుగములు. పగటి కాలమున 14 మంది మనువులు పాలింతురు. ఒక్కొక్క మనువు 71 దివ్య యుగములు పాలించును. నాలుగు యుగములు కలసి ఒక దివ్య యుగము. మనువులు మారగానే, దేవతలు, ఇంద్రుడు. సప్తర్షులు, మునులు, మారుదురు. భగవదంశంబున పుట్టిన వారు ఆ మనువు కాలమున అఖిల జగములను పాలింతురు. ఈ మన్వంతరములలో శ్రీహరి అవతరించి జగములను రక్షించును. బ్రహ్మ పగటి కాలమున అవ్యక్తము నుంచి చరాచరములన్నియు జన్మించు చున్నవి. రాత్రి వెయ్యి యుగములు. పగలు గడిచి పోయిన పిదప బ్రహ్మ నిద్ర పోవును. అప్పుడు జగములన్నియు నశించును. అవ్యక్తమునందే లయమగుచున్నవి.

బ్రహ్మకు రాత్రి అవగానే సంకర్షణాగ్ని త్రిభువనములను దహింప మహర్లోక వాసులు జన లోకమునకు వెళ్ళుదురు. ప్రళయకాలములో భయంకరముగా ప్రచండ వాయువులు వీచును. అగ్ని దహింపగా వాయు వేగానికి సముద్ర జలముల నీరు మూడు లోకములను ముంచును. సముద్రముపై యోగ నిద్రలో బ్రహ్మయుండును. జనలోక వాసులు అతనిని వినుతింతురు. బ్రహ్మకు రాత్రి అవగానే సూర్యచంద్రులు లేక చీకటి అలుముకొనును. హరి, శక్తి రూపంబున వెలుగు. బ్రహ్మకు మరల పగలు అయినప్పుడు పూర్వముండిన ఈ ప్రాణి సమూహమే మరల మరల పుట్టును. రాత్రి అయినప్పుడు లయమగును.

**కల్పము** : విష్ణువు నాభిలో పద్మము పుట్టినది. అది పద్మ కల్పమని పిలువబడును. ఆ పద్మంలోబ్రహ్మపుట్టినది బ్రహ్మ కల్పము. బ్రహ్మ యొక్క ద్వితీయ పరార్థములో హరి వరాహావతారమున ప్రకటితుండయ్యెను. అది వరాహ కల్పము. **ఇప్పుడు వరాహ కల్పము జరుగుచున్నది.** బ్రహ్మకు 100 సంవత్సరములు పరమాయువు. 50 సంవత్సరములు పరార్థము మిగిలిన 50 సంవత్సరములు ద్వితీయ పరార్థము. ఇప్పుడు ద్వితీయ పరార్థము జరుగుచున్నది.

| యుగము | యుగ ప్రమాణము | పాదములు |
|---|---|---|
| కృతయుగము | 17,28,000 సంవత్సరములు | 4 |
| త్రేతాయుగము | 12,96,000 సంవత్సరములు | 3 |
| ద్వాపర యుగము | 8,64,000 సంవత్సరములు | 2 |
| కలియుగము | 4,32,000 సంవత్సరములు | 1 |

4 యుగములు 43,20,000 సంవత్సరములు కలిసి ఒక దివ్య యుగము. వీటిని శాస్త్రజ్ఞులు భౌతికశాస్త్రపరముగా చదివిన అనేక శాస్త్ర విషయములు తెలియును. యోగ సిద్ధి వలన గలిగిన నేత్రములతో, లోకములను అవలోకించేవారికి చెప్పబడే కాల పరిమాణము.

| యుగము | కాలపరిమాణము | సంధ్య యొక్క పరిమాణము |
|---|---|---|
| కృతయుగం | 4వేల దివ్య వర్షములు | 800 దివ్య వర్షములు |
| త్రేతాయుగం | 3 వేల దివ్య వర్షములు | 600 దివ్య వర్షములు |
| ద్వాపర యుగం | 2 వేల దివ్య వర్షములు | 400 దివ్య వర్షములు |
| కలియుగం | 1 వెయ్యి దివ్య వర్షములు | 200 దివ్య వర్షములు |

సంధ్యాంశము నందు ధర్మము అల్పమై కానబడును. సంధ్యాంశ మధ్యమునందు ధర్మము అతిశయించును. పాదభేదంబున మర్యాదలు తగ్గును. అధర్మము పెచ్చు పెరుగును. కృతయుగమున ధర్మదేవతకు తపస్సు, శౌచము,దయ,సత్యము అనునవి 4పాదములు. త్రేతాయుగమున మూడుపాదములు. ద్వాపర యుగమున రెండు పాదములు. కలియుగములో ఒక పాదము ఉండును. పుట్టిన ప్రజలు కృత కృత్యులయిరి. కాన అది కృతయుగము అయినది. ఆ కృత యుగంలో మనుష్యులందఱిదీ ఒకే వర్ణము. అదే హంస వర్ణము. ధర్మము వృషభ రూప ధరుడైన వాసుదేవుడు. వేదము ప్రణవము.

బ్రహ్మకు పగటి కాలమున 14మంది మనువులు

| మనువు | ఇంద్రుడు | దేవతలు | ఋషులు | విష్ణువు అవతరించి చేసిన ఘనకార్యములు |
|---|---|---|---|---|
| **1వ మనువు స్వాయంభవుడు** | యజ్ఞుడు | యజ్ఞుని కొడుకులు | - - - | స్వాయంభువ మన్వంతరమును పాలించెను. |
| ద్వితీయ మన్వంతరము **స్వారోచిషుడు** (ద్యుమంతుడు, సుషేణుడు, రోచిష్మంతుడు మొదలయిన వారు మను పుత్రులు.) | రోచనుడు | తుషితా దులు | ఊర్జస్తంభ ముఖ్యులు | వేద శిరుని భార్య అయిన తుషితకు కొడుకుగా విభుడను పేరున అవత రించెను. బ్రహ్మచర్యము పాటించి 88 వేల మంది మునులను అనుగ్రహించెను. |
| తృతీయ మన్వంతరము **ఉత్తముడు** (పవనుడు సృంజయుడు, యజ్ఞ హోత్రుడు మను పుత్రులు) | సత్యజిత్తు | సత్య భద్రాశ్వులు | వసిష్ఠుని కొడుకులైన ప్రమథాదులు. | ధర్మునికి సూనృతకు సత్య సేనుడుగా విష్ణువు అవతరించి రాక్షస సంహారము చేసెను. |
| నాలుగవ మన్వంతరము ఉత్తముని భ్రాత **తామసుడు** (కేతుడు, వృకుడు, ఖ్యాతి నరుడు మొదలయిన 10 మంది మను పుత్రులు.) | త్రిశిఖుడు | సత్యక హరివీర | జ్యోతిర్వ్యోమ ముఖ్యులు | హరి మేధునికి హరిణికి హరి జన్మించెను. గజేంద్రునిని మొసలి బారి నుండి రక్షించెను. |

| | | | | |
|---|---|---|---|---|
| ఐదవ మన్వంతరము ఉత్తమునిభ్రాత అయిన **రైవతుడు** (ప్రతివింద్యుడు, అర్జునుడు మొదలయిన వారు మను పుత్రులు.) | - - - - | భూతర యుడు మొదలయిన వారు | హిరణ్య రోముడు, ఊర్ధ్వ బాహుడు, వేదశీర్షుడు | శుభ్రుడు వికుంఠులకు వైకుంఠుడు అన విష్ణువు జన్మించి వైకుంఠమనే లోకమును కల్పించెను. |
| ఆఱవ మన్వంతరము **చాక్షుసుడు** ( పురు, పురుష సుద్యుమ్నుడు) మొదలయిన వారు మను పుత్రులు | మంత్ర ద్యుమ్నుడు | అప్యాదికులు | హవిష్మంతుడు వీరకుడు | వైరాజ సంభూతిలకు అజితుడన పేర విష్ణువు పుట్టెను. కూర్మావతారియై మందరాద్రిని మోసెను. అమృతమును పంచిఇచ్చెను. |

| | | | | |
|---|---|---|---|---|
| సప్తమ మన్వంతరము **వైవస్వతుడు.** (ఇక్ష్వాకు, నభగుడు, ధృష్టుండు, శర్యాతి, అరిష్యంతుడు, నాభాగుడు, దిష్టుండు, కరూశకుండు, పృషధ్రుండు, వసుమంతుడు, వీరు మను పుత్రులు. | పురంధరుడు | ఆదిత్యులు, మరుత్తులు, అశ్వినులు, వసువులు, రుద్రులు. | గౌతమ,కశ్యప, అత్రి, విశ్వామిత్ర, జమదగ్ని, భారద్వాజ, వసిష్ఠుడు. | కశ్యపునకు అదితికి వామనుడుగా విష్ణువు అవతరించి ఇంద్రుని తమ్ముడైనాడు. ఈ మనువు కాలములోనే పరశురాముడు, శ్రీరాముడు, బలరాముడు, శ్రీకృష్ణుడు, బుద్ధుడు అవతరించిరి. కల్కి అవతరించ గలడు. |
| అష్టమ మన్వంతరము **సూర్య సావర్ణి.** (నిర్మోహ, విరజస్కాద్యులు అనువారు మను పత్రులు.) | బలి | సుత్తపుడు విరజుడు అమృతడు ప్రభువు మొదలయిన వారు | గాలవుండు, దీప్తిమం తుడు, పరశురా ముడు, అశ్వత్థామా కృపుడు వ్యాసుడు ఋశ్య శృంగుడు. | బలిచక్రవర్తిని ఇంద్ర పదవిలో నిలుపును. |

| | | | | |
|---|---|---|---|---|
| నవమ మన్వంతరము **దక్షసావర్ణి.** (ధృతకేతు, దీప్తి కేతువు మొదలయిన వారు మనుపుత్రులు) | అర్భుతుండు | పరుడు మరీచి గర్గాదులు | ద్యుతి మత్రభృ తులు | ఆయుష్మంతుడు అంబుధారలకు విష్ణువు జన్మించును. |
| దశమ మన్వంతరము ఉపశ్లోక సుతుండగు **బ్రహ్మ సావర్ణి.** భూరిషేణాదులు మనుపుత్రులు | శంభుడు | విబుద్ధా ద్యులు | హవిష్మం తుడు మొదలయిన వారు | విశ్వసృజుండు విషుచిలకు విష్వక్సేనుడుగా జన్మించి శివునితో స్నేహము చేయును. |
| ఏకాదశ మన్వంతరము **ధర్మసావర్ణి** సత్య ధర్మాదులు పది మంది మనుపుత్రులు | వైధృతుడు | విహంగమ కామ గమన నిర్మాణ రుచులు | వరుణాదులు | విష్ణువు ధర్మ సేతువుగా సూర్యునికి పుత్రుడై జన్మించును. |

| | | | | |
|---|---|---|---|---|
| ద్వాదశ మన్వంతరము **భద్ర సావర్ణి.** దేవవ్రత, ఉపదేవ, దేవజ్యేష్ట మొదలయిన వారు మనుపుత్రులు | ఋతుధా ముడు | హరితాదులు | తపోమూర్తి తప ఆగ్నీధ్ర మొదలయిన వారు | సత్యతపుడు సూనృతలకు స్వధాముడన పేరున జనియించును. |
| పదమూడవ మన్వంతరము **దేవసావర్ణి.** చిత్రసేన, విచిత్రాదులు మనుపుత్రులు | దివస్పతి | సుకర్మ సుత్రా దులు | నిర్మోహ తత్త్వ ధర్మాదులు | దేవ హోత్ర బృహతికి విష్ణువు యోగవిభుడను పేరున జన్మించును. |
| పదునాలుగవ మన్వంతరము **ఇంద్రసావర్ణి.** గంభీర, వస్వాదులు మనుపుత్రులు | శుచి | పవిత్ర, చాక్షుష | అగ్ని బాహు శుచి, శుక్ర, మాగ ధాదులు | సత్రాయలుడు వితాసలకు బృహద్భానువు అను పేర విష్ణువు జన్మించును |

మనువు, మను పుత్రులు, ఇంద్రుడు, దేవతలు, ఋషులు వీరు హరి ఆజ్ఞను చరించువారు. వీరు హరి స్వరూపులు. జగములను విష్ణు శక్తితో నడుపుదురు.

**కాలము - నిర్వచనము:** భగవద్రూపంబు భేదాస్పదంబగుచు (భూత, వర్త, భవిష్యత్‌గా) అద్భుత ప్రవాహంబు గలది కాలంబని చెప్పుదురు. ప్రకృతి గుణసామ్యంబున చేసి వర్తించి, నిర్విశేషుండగు భగవంతుని చేష్టా విశేషంబు దేనివలన నుత్పన్నంబగు నదియు కాలంబని చెప్పంబడు. అదియు జీవ రాశి అంతర్గతంబగుటం చేసి పురుషుండనియు, వాని బహిర్భాగ వ్యాప్తించేసి కాలంబనియు చెప్పంబడు. కాలము దైవము. కావున మానవుడు దైవమును అతిక్రమింపజాలడు. కలా, కాష్ఠా ముహూర్తములు అనంగల కాలము దైవము. కాలము 25వ తత్త్వము. కొందఱు కాలము పురుష శబ్దవాచ్యుండైన ఈశ్వరుని పౌరుషమని చెప్పుదురు.

**కాలమును సృజియించుట :** ఈశ్వరుడు తన మాయంచేసి విశ్వంబును సృజింపగోరి రజంబున, క్రీడింపగోరి సత్వంబున, నిద్రింపగోరి తమంబున నుత్పాదించి చరమైన కాలమును సృజియించె. ఈశ్వరునికి కాలము కర్త కాదు. ఈశ్వరుడు కాలాతీతుడు. కాలమునకు పక్షపాతము లేదు. మంచి వారిని చెడ్డవారిని కూడ కాలము హరించును. ఈశ్వరుడు కాలాహ్వాయుడై సత్త్వ గుణంబున దేవానీకంబునకు వృద్ధియు, రజో, తమో గుణులయిన రాక్షసులకు హానియు చేయుచుండు. కాలము వ్యక్తము కాదు. విచిత్రము. వేగము కలది. దురవగాహము. దుస్తరము. కాలములో యుగధర్మములు సాంకర్యము పొందును. కాలమన్నియు చేయుచునుండు. ఒక భంగిచరింపదు. అనగా ఎల్లకాలము ఒకే విధముగా ఉండదు. అన్నింటికి కాలమే కారణము. కాలమే కర్మ సాధనము. సమస్త భూతములను ప్రేరేపించు కారణము కాలమే. గాలికి మేఘములు కలియుచు విడిపోవునట్లు ప్రపంచము సర్వము కాలతంత్రమై కలియుచూ విడిపోవుచూ ఉండును. దైవయుక్తంబయిన కాలంబున చేసి లోకము పరిభ్రమించుచుండు. కాలమునకు సర్వులు వశులే. కాలము ప్రజలను లోకములను నియమించును. కాలమును వశము చేసి కొనుట గాని జయించుటకు గాని సాధ్యము కాదు. కాలము చేయలేని పని లేదు. కాలమే విధి. విధిని ఎవరూ దాటలేరు. భూత జనన, లయంబులకు కాలము కర్తయై వర్తించు. సకల భూతములకు ఆశ్రయము.

అంతర్గతమై భూతంబుల చేత భూతంబుల గ్రహించు. కాలము సమీపించిన ఎట్టి గుణవంతుడయిన చనిపోవును. కాల, స్వభావములను ఏ ప్రాణి అతిక్రమించజాలదు. ఎంత వానికి కాలము గడవ రాదు. కాలము అవలంఘ్యనీయము. కాలమును ఎవరూ దాటలేరు. దానిని ఎవరూ మరల్చలేరు.

మహదాదితత్త్వములకును మహత్తత్త్వాభిమానులగు జీవులకును భయాపహము. యుగయుగములలో భౌతిక శరీరములకు శక్తి సన్నగిల్లును. కాలమునందు అహంకార మోహితుండై ప్రకృతి నొందు జీవుండు భయంబునొందు. కాలమును గమనించి ధర్మార్థ కామములను అనుష్ఠించవలయును. ప్రాణులకు కాలగతి చేత పుట్టుట, చచ్చుట పొసగును. మానవులను కాలము వంచించును. కాలము రాకుండా మృత్యువురాదు. ప్రాణులకు కాలము వలన వినాశము దాపురించినపుడు వారు కాలమునకు లొంగిపోయి, అకార్యములు చేయుదురు. మానవునికి మరొక వ్యక్తితో మిత్రత్వము, శత్రుత్వము మొదలయినవి కాలానుగుణముగా కలుగును. కాలమును ఎవరూ జయించలేరు.

**కాలో హి దురతిక్రమః** (అరణ్యకాండ 63-21)

శూరులు, బలవంతులు, యుద్ధ విశారదులు, కాలము సమీపించగనే చనిసోవుదురు. అదుపు తప్పిన మనస్సుగలవాళ్ళు కాలమునకు వశులై హిత వాక్యములను ఆచరింపరు. హితవాక్యములను ఆయువు మూడిన నరులు వినరు. మరణ కాలము ఆసన్నమైనప్పుడు మానవుడు విపరీతముగా ప్రవర్తించును. చచ్చుటకు సిద్ధముగా నున్న వాళ్ళకు ధర్మపరమైనది ఇష్టముగా ఉండదు.

కం॥ **కాలము ప్రబలులకునుబలి,**
**కాలాత్ముం డీశ్వరుండగ గణ్యుఁడు జనులం**
**గాలవశులుగాఁ చేయును,**
**గాలము గడవంగ లేరు ఘను లెవ్వారున్.**

(భాగవతము-దశమస్కంధము, 1644)

**ఎందును గాలము నిజమని,**
**పందతనంబునను బుద్ధిఁ బాయక ఘనులై**
**యెందాఁక బుద్ధినెగడెడి**
**నందాఁకఁ జరింపవలయు నాత్మ బలమునన్**

(భాగవతము-దశమస్కంధము-36)

కాలవశమున సుఖదుఃఖములు గలుగును. దుఃఖంబులు వాంఛితంబులు గాక చేకూరుభంగి సుఖంబులును కాలాను సారంబు లబ్ధంబగు. పురుషునకు ఆయువు, శ్రీయు, కీర్తియు, ఐశ్వర్యమును మొదలయినవి అనుభవింప ఎంతకాలము ప్రాప్తంబంతకాలము ఉండును. ప్రాప్తంబు తీరిన పురుషుడు జాలింబొందినను అవియుండక పోవచ్చు. కావున గుణము అవగుణము, కీర్తి, అపకీర్తి, జయము, అపజయము, సుఖము, దుఃఖము, చావు, బ్రతుకును సమంబయి గలుగుచుండు.

*****

## శుభ శకునములు

లక్షణములు, జ్ఞానము, పక్షుల స్వరములు ఇవి మనుష్యులకు రాబోవు సుఖ దుః ఖములను సూచించును. భవిష్యత్ కాలములో జరుగబోవు విశేషములు చెప్పునవి శకునములు.

**1. దేశ సంబంధము :**

**గాలి :-** గాలి అనుకూలముగా వీచును. చల్లగాలి వీచును.

**నీరు: -** నదులలో నీరు పుష్కలముగా ఉండును. నిండుగా ప్రవహించును. స్వచ్ఛముగా ఉండును. వరదలు లేకుండును.

**2. పశువులు -పక్షులు- జంతువులు :** మృగములు పక్షులు సవ్యముగా తిరుగును. ఏనుగులు ఉత్సాహముగా ఉండును. గుఱ్ఱముల సకిలింపులు వీనులకింపుగా ఉండును.

**3. శరీర సంబంధము :** మనస్సు ఉత్సాహముగా ఉండును. మనస్సులో ఎట్టి ఆందోళన ఉండదు. శుభవార్తలు విందుము.

**4. స్వప్నము :** స్వప్నములో తేనె, పాయసం తినుచున్నట్లు, పులి చేత దెబ్బతిని, రక్తంకారుతూ, ఏడుస్తూ ,ఉత్తరాభి ముఖముగా వెడుతున్నట్లు కల వచ్చిన శుభము.

**5. దేవతా సంబంధము :** పూలవాన దేవతలు కురిపింతురు. అగ్నిహోత్రము సవ్యముగా ప్రజ్వరిల్లును. ఉజ్జ్వలముగా ప్రజ్వరిల్లును. మంచి సుగంధ వాసనలతో ప్రజ్వరిల్లును.

**సూర్యుడు :** కాంతి వంతముగా ఉండును.

**దిక్కులు :** తేజోవంతముగానూ, తేటగానూ ఉండును.

**6. అధి దైవికం :** దేవ దుందుభులు మ్రోగును. గంధర్వులు, కిన్నెరులు గానము చేయుదురు. అప్సరసలు నాట్యములు చేయుదురు.

# అశుభ శకునములు

**దేశ సంబంధములు :** భూకంపము, కుల పర్వతములు వణుకుట. సముద్రములు ఉప్పొంగుట, మేఘములు లేకుండా ఆకాశము బ్రద్దలగునట్లు ఉఱుములు, మెఱుపులు, పిడుగులు పడుట, (అగ్నిపర్వతములు బ్రద్దలగుట) ఉల్కలు రాలుట.

వాన - కుంభవృష్టి, వడగళ్ళు పడుట,రక్తపు వాన.

గాలి - సుడిగాలి, గాలి దుమారము, గుహలు రొదలిచ్చుట, గాలికి చెట్లు పడుట.

వ్యాధులు - అంటు వ్యాధులు ప్రబలుట.

**పశు-పక్షి-మృగాదులు :**

ఏనుగు - మత్తగజములకు మదము ఉడుగుట.

గుఱ్ఱము - ఉత్తమాశ్వములకు కన్నీరు ఉదయించుట. గుఱ్ఱముతోకకు నిప్పులు వచ్చుట .

గాడిదలు - గాడిదలు గుంపులు గుంపులుగా కనిపించుట,గాడిదలు భీషణముగా అఱచుట.

ఎద్దులు - ఆంబోతు ఋతుకాలమున ఆవులతో కలియక తరిపి దూడల వెంట పడుట.

ఆవులు - ఆవులు దూడలకు పాలు ఇవ్వక పోవుట. ఆవులను పితికిన చీము, నెత్తురు వచ్చుట, దూడలు పాలు త్రాగకపోవుట.

కుక్క - కుక్క మనముందు ముఖము పైకెత్తి (అఱచుట) ఏడ్చుట.

నక్క - సూర్యోదయమున సూర్యుని ముందుగా నిలబడి ఏడ్చుట. పగలు నక్కలు అఱచుట. నక్క నోటి నుండి మంటలు వెలువడుట, నక్క మన వెనుక అఱచుట.

| | | |
|---|---|---|
| గ్రద్దలు | - | గ్రద్దలు గుంపులు గుంపులుగా కనబడుట. గ్రద్దలు ఆడుట. ఆకాశములో తిరుగుట. |
| గుడ్లగూబ | - | పగలు గుడ్లగూబలు తిరుగుట, అఱచుట. |
| పావురము | - | పావురము యమ దూతవలె పైకి వచ్చుట. శుకసారికలు రాత్రి భయంకరముగా అఱచుట. |
| కాకులు | - | కాకులు భయంకరముగా అఱచుట. కాకులు, గుడ్లగూబలు పగలు మేడలలో అఱచుట. |
| పక్షులు | - | భయంకరముగా అఱచుట. |

మిణుగురు పురుగులు ఎక్కువగా కనిపించుట. మృగములు, పక్షులు దీనముగా, ఘోరముగా ధ్వని చేయుచూ మనకు ఎడమ వైపున తిరుగుట.

**వింతలు :** జంతువువేరొక జంతువును కనుట, మృగములు పక్షులను;ఆవులు జంతువులను కనుట. ఆవులకు గాడిదలు పుట్టుట. ముంగిసలకు ఎలుకలు పుట్టుట. కుక్కలకు పిల్లులు పుట్టుట. ఆడవాళ్ళు ఒకే కాన్పులో నలుగురు, ఐదుగురు సంతానము కనుట, శిశువులు పుట్టినప్పుడే నవ్వుతూ ఆడుతూ మాట్లాడుట. మేకలు నక్కల వలె కూయుట. చిలుకలు గుడ్లగూబలవలె అఱచుట. గృహములలో కలువలు (మొండిచెయ్యి కాబోలు) ఉదయించుట, జెండాపై పొగ. ఆయుధములు మండుట.

**శరీర సంబంధము :** మనస్సు కలత పడుట, ఆందోళనగా ఉండుట, హృదయములో ఏదో బాధ ఏర్పడుట, చిత్తము విపరీతముగా ఉండుట. మగవారికి ఎడమ కన్ను, ఎడమ భుజము, దేహములోని ఎడమ భాగము అదురుట. కడుపులో మంట, కంటికి కళ తప్పినట్లు కనబడుట.

**స్వప్నము :** నగ్నముగా ఉండుట, రక్త కుసుమముల మాల ధరించుట, గాడిదను ఎక్కుట, గరళము తినుట, నెత్తిపై నూనెపడుట, ప్రేతమును కౌగలించుకొనుట. కలలో ఏ వ్యక్తి అయితే గాడిద కట్టిన రథముపై విర పూసిన వెంట్రుకలతో

నగ్నముగా, నూనె స్నానము చేయుచున్నట్లుగా, కలవచ్చిన, కలలో కనిపించిన వ్యక్తికి కీడు (త్రిజట స్వప్నములో రావణుడు ఆలా కనిపించినాడు కావున రావణునికి కీడు).

**దేవతా సంబంధము :** ఆలయములలో దేవతా విగ్రహములు కదులుట, ఆలయము దాటి వెలుపలకు దేవతా విగ్రహము నడుచుకుంటూ వచ్చుట, దేవతా విగ్రహములు కన్నీరు కార్చుట, ఏడ్చుట, ఒరగుట, దేవతా విగ్రహమునకు చెమటలు పట్టుట.

**అగ్ని :** అగ్ని శాలలో అగ్ని మండకుండుట, దట్టంగా పొగవచ్చుట, అగ్నిహోత్రము రౌద్రముగా ఎగురుట అనగా యజ్ఞశాల తగుల బడుట. అగ్ని అప్రదక్షిణముగా ఎగురుట.

**సూర్యుడు :** సూర్యుడు తేజో విహీనుడు వలె కనబడుట. సూర్యుడు కాంతి విహీనుడగుట, ఉదయం సాయం సమయమున నల్లరంగు సూర్యుని కమ్ముట, రవి బింబము నల్లగాకనబడుట. గ్రహణము రాకుండా రాహువు సూర్యుని పట్టుకొనుట. చీకటి కమ్ముట. సూర్యాస్తమయములలో భూమ్యాకాశములు కలసినట్లు కనిపించే చోట సూర్యుడు చాలా ఎఱ్ఱగా కనిపించుట.

**గ్రహములు :** గ్రహముల, నక్షత్రముల కాంతి తగ్గుట. సౌమ్యగ్రహములు వక్రగతుల వర్తించుట, పాప గ్రహములు మిత్రత చెందుట. గ్రహ యుద్ధము.

నేటి పంచాంగములలో కనిపించే బల్లి శకునము అటులనే తుమ్మితే బయలుదేర రాదని, పిల్లి ఎదురు వస్తే బయలుదేరరాదని, విధవ ఎదురు రాకూడదని చెప్పబడే శకునములు ఋషుల రచనలలో కనిపించవు.

*****

# ఋగ్వేదము

**అగ్నిమీళే పురోహితం యజ్ఞస్య । దేవమృత్విజం।**
**హోతారం రత్న ధాతమమ్**
(అధ్యాయము-1, కాండ-1, మంత్రము-1)

| | | |
|---|---|---|
| ఋత్విజం | = | ఋత్విజుడును |
| హోతారం | = | హోతయును |
| పురోహితం | = | పురోహితుడును |
| యజ్ఞస్య+దేవం | = | యజ్ఞము యొక్క దేవుడును |
| రత్న ధాతమం+అగ్నిం | = | మణి మాణిక్యాది సర్వాభరణ శోభితుడగు అగ్నిని అనగా పరమాత్మను |
| ఈళే | = | స్తుతించు చున్నాను |

## శాంతి పాఠము

**ఓం వాక్ మే మనసి ప్రతిష్ఠితా మనో మే వాచి ప్రతిష్ఠిత మావిరావీర్మ ఏధి । వేదస్య మ ఆణీస్థః శ్రుతం మే మా ప్రహాసీ । రనేనాధీతేనాహోరాత్రాన్ సన్దధామి । ఋతం వదిష్యామి సత్యం వదిష్యామి । తన్మామవతు తద్వక్తారమవతు । అవతు మా మవతు వక్తారమవతు వక్తారమ్ ।**

**ఓం శాంతిః శాంతిఃశాంతిః**

వాక్ - మే - మనసి - ప్రతిష్ఠితా - మనః - మే - వాచి - ప్రతిష్ఠితమ్ - అవిః - అవిః- మే - ఏధి - వేదస్య - మే - అణీస్థః - శ్రుతం- మే - మా - ప్రహాసీః - అనేన- అధీతేన - అహో రాత్రాన్ - సందధామి - ఋతం - వదిష్యామి - సత్యం - వదిష్యామి - తత్ - మాం - అవతు - తత్ - వక్తారమ్ - అవతు - అవతు- మాం - అవతు - వక్తారం - అవతు - వక్తారమ్.

| | | |
|---|---|---|
| మే | = | నా యొక్క |
| వాక్ | = | మాట |
| మనసి | = | మనస్సు నందు |
| ప్రతిష్ఠితా | = | ప్రతిష్ఠింపబడి యుండు గాక |
| మే | = | నా యొక్క |
| మనః | = | మనస్సు |
| వాచి | = | మాట యందు |
| ప్రతిష్ఠితమ్ | = | ప్రతిష్ఠింపబడి ఉన్నది. (ప్రతిష్ఠింపబడి యుండు గాక) అనగా మనస్సులో ఉన్నది ఒకటి, మాట ఒకటి గాక త్రికరణ శుద్ధి కలిగి ఉండు గాక. |
| మే+అవిః+అవిః+ ఏధి | = | నాకు దర్శన మిచ్చుటకు రమ్ము అనగా నాకు బ్రహ్మ సాక్షాత్కారము కలుగు గాక |

| | | |
|---|---|---|
| మే | = | నాకు |
| వేదస్య | = | వేదముల యొక్క అనగా వేదములను |
| అణీస్థః | = | అందించుటలో సమర్థులు కండు అనగా వేద పరిజ్ఞానము నాకు కలుగు గాక |
| మే | = | నేను |
| శ్రుతం | = | గురుముఖతా నేర్చిన విద్య -విన్నది |
| మా + ప్రహాసీః | = | నన్ను పరిత్యజించకుండుగాక అనగా నేను మఱచి పోకుండా ఉండును గాక |
| అహః+రాత్రాన్ | = | పగళ్ళు రాత్రుళ్ళు అనగా నిరంతరము |
| అనేన+అధీతేన | = | ఈ నేర్చిన విద్యతో అనగా స్వాధ్యాయము నందు |
| సందధామి | = | గడుపుదును అనగా జీవితమును వేద ఆచరణలో గడుపుదును గాక |
| ఋతం+వదిష్యామి | = | సత్యమును చెప్పుచున్నాను |
| సత్యం+వదిష్యామి | = | సత్యమును చెప్పుచున్నాను |
| తత్ | = | తత్ శబ్ద వాచ్యుడగు బ్రహ్మ |
| మామ్ | = | నన్ను |
| అవతు | = | రక్షించు గాక |
| తత్ | = | ఆ బ్రహ్మ మా |
| వక్తారమ్ | = | గురువును కూడా |
| అవతు | = | రక్షించు గాక |
| అవతు+మామ్ | = | నన్ను రక్షించు గాక |
| అవతు+వక్తారమ్ | = | గురువును రక్షించు గాక |
| అవతు+వక్తారమ్ | = | గురువును రక్షించు గాక |

*****

ఈ ఉపనిషత్‌లో వెలిబుచ్చిన సృష్టి గుఱించిన ప్రశ్నలు, వాటి సమాధానములనే భాగవతము ద్వితీయ స్కంధములో బ్రహ్మను నారదుడు అడిగి సందేహ నివృత్తి పొందినట్లు వర్ణింపబడినది. కావున ఈ ఉపనిషత్‌నకు విపుల వ్యాఖ్యానముగా వ్యాసభగవానునిచే రచియింప బడిన భాగవతమును మేళవించి చదివిన అర్థమగును.

ఈ ఉపనిషత్‌లోని ప్రశ్నలు :

1. ఈ కనిపించే దృశ్యమాన జగత్తు అనాదిగా ఉన్నదా ?
   లేక ఎవరైనా సృజియించినారా?

   **"నాకుంజూడఁగ నీవు రాజవనుచున్నాఁడన్ యథార్థ స్థితిన్**
   **నీకంటెన్ ఘనుఁడొక్క రాజు గలఁడో ? నీవంతకున్ రాజవో ?"**

(భాగవతము ద్వితీయ స్కంధము - 75)

**సమాధానము :** జగత్తు అనాదిగా లేదు. ఆత్మ అనాది. ప్రారంభ సృష్టి ఆత్మ చేసినది. పునః సృష్టి బ్రహ్మ చేసినాడు.

2. సృష్టికి ఆధారంబెయ్యది?
   **"బ్రారంభ సంపత్తికాధారంబెయ్యది"**

(భాగవతము ద్వితీయ స్కంధము - 74)

**సమాధానము :** ఆత్మయే ఆధారము. ఆ ఆత్మ స్వయంభువు. స్వప్రకాశము. అట్టి ఆత్మ - స్వయంగా ఉపాధిని నిర్మించుకొని అందు వసియించి పురుషుడైనది. అతడే ఆది పురుషుడు. ఇతనిని ఈశ్వరుడని కూడా అందురు. ఆది పురుషుడు సృష్టి చేయ సంకల్పించి తనను తానుగా కాలము, జీవుడు, ప్రకృతి, కర్మగా విభజించుకొనెను. అయితే ఆదిపురుషుని లక్షణములు వీటి లక్షణములు ఒకటి కావు. ఉదా: ఒకే చెఱుకుగడ నాలుగు ముక్కలయినా అన్నింటి స్వభావ స్వరూప లక్షణములు ఒకటిగానే యుండును. కాని ఆత్మ లేక ఆదిపురుషుడు తనని తను నాలుగు భాగములుగా విభజించుకొనినను వాటి లక్షణములు ఒకటి కావు. కాలము, జీవుడు, ప్రకృతి, కర్మ ఇవి వేటికి అవి ప్రత్యేక స్వభావ స్వరూప లక్షణములు గలిగి ఉండును. ఇలా ఉండుటకు కారణము మాయ. అలా వచ్చిన వాటిలో ప్రకృతిని ఈశ్వరుడు అధిష్ఠించి విరాట్ పురుషుడైనాడు.

**ప్రారంభ సృష్టి :-** ఈ విరాట్ పురుషుడు - మహత్ తత్త్వము, అహంకారము, ఆకాశము, వాయువు, తేజస్సు (అగ్ని), జలము, భూతత్త్వములనే సప్తావరణలతో కూడిన ఒక బ్రహ్మాండమును సృజియించెను. ఈ బ్రహ్మాండమునకు పై పౌర ప్రకృతి. అట్టి బ్రహ్మాండము చాలా కాలము జలములలో ఉన్నది (ఈ జలము పంచ భూతములలోని జలము కాదు).

| | | |
|---|---|---|
| బ్రహ్మాండము నుంచి | - | |
| సమిష్టిలో | - | 14 లోకములు సృజియింప బడినవి. సర్వజీవ రాసుల దేహములు సృజియింప బడినవి. |
| వ్యష్టిలో | - | మానవ దేహము సృజియింప బడినది. |

స్వయంభువు అయిన విరాట్ నుంచి అనగా విరాట్ దేహమునుంచి :
సమిష్టిలో - దేవతలు సృజియింప బడిరి. వీరిని అధిభౌతిక అధి దైవికములుగా చెప్పుదురు. ఉదాహరణకు అగ్ని అధిభౌతికముగా సర్వమునూ దహించును. అధిదైవికముగా అధిష్ఠాన దేవత. అటులనే మిగిలినవి ఊహించ వలయును.

వ్యష్టిలో - ఆవిధముగా విరాట్ దేహమునుంచి వచ్చిన దేవతలు అధిదైవిక స్వరూపములుగా మానవుని దేహములో ప్రవేశించి ఇంద్రియాదులకు అధిష్ఠాన దేవతలుగా చెప్పబడిరి. విరాట్ దేహము నుంచి వచ్చిన దేవతలు మానవ శరీరములో వసియించినారు. అలా వారు వసువులయినారు. మానవ దేహము ద్రవ్య శక్తి అయిన పంచభూతముల, క్రియా శక్తి అయిన ప్రాణము, జ్ఞాన శక్తి అయిన మనస్సుల కలయిక. ఈ దేహము స్థూల దేహము, సూక్ష్మ దేహము అని రెండు విభాగములు. ఈ దేహములోనికి ప్రాణము, జీవుడు రాగానే ఆకలి దప్పికలు కలుగును. ఈ ఆకలి దప్పికలు విరాట్ దేహము నుంచి దేవతలు వచ్చినట్లు రాలేదు. ఇవి ప్రాణ లక్షణములు. ఈ ఆకలి దప్పికల కొఱకు విరాట్ పురుషుడు ఆహారమును, నీటిని కల్పించెను. ఆకలి దప్పికలు ప్రాణ లక్షణములు అగుట వలన వీటికి శరీరములో ప్రత్యేక స్థానము లేదు.

3. ఈ దేహవ్యాపారము ఎలా జరుగు చున్నది ? ఆత్మ ఈ దేహములోనికి ఎలా ప్రవేశించినది ?

**సమాధానము :-** ఆత్మ వలన ఈ దేహవ్యాపారము జరుగుచున్నది. బ్రహ్మ రంధ్రము ద్వారా ఆత్మ ఈ శరీరము లోనికి ప్రవేశించినది. జీవుడు శరీరములో త్రయావస్థలలో విహరించును అని చెప్పినాడు.

4. ఈ దృశ్యమాన ప్రపంచము ఎవని స్వరూపము?

**యదర్థంబే స్వరూపంబు?** (భాగవతము ద్వితీయ స్కంధము -74)

**సమాధానము:-** విరాట్ స్వరూపము అనగా ప్రకృతి పురుషుల స్వరూపము.

5. ఎవరు అమృతత్త్వమును పొందుదురు? అమృతత్త్వమును పొందుటకు ఎవరిని ఉపాసించవలయును ?

**సమాధానము :-** సంసారతాపత్రయములలో చిక్కుకున్న వారు పుట్టుచూ చనిపోవుచూ జనన మరణవలయములో చిక్కుకొని ఉందురు. అమృతత్త్వమును పొందలేరు. వామదేవునిలాంటి వారు అనగా ధీరులు ఆత్మను ఉపాసించి అమృతత్త్వమును పొందుదురు. సృష్ట్యాదియందున్న ఆత్మయే జీవుని హృదయ గుహలో వసియించుట వలన ఆత్మ ఒక్కటేతప్ప రెండు లేవు.

**పునః సృష్టి :** ఆత్మ ప్రారంభసృష్టి ఏవిధముగా చేసెనో అదే విధముగా బ్రహ్మ పునః సృష్టి చేసెను. కావున ప్రారంభ సృష్టికి, పునః సృష్టికి భేదము లేదు. ఇది అయోనిజ సృష్టి.

**ప్రజా పతుల సృష్టి :** వీరు భార్యా సమేతులై సమస్త స్థావర జంగమములను అనగా దేవ, దానవ, యక్ష, రాక్షస, మానవ, పశు, పక్ష్యాదులన్నింటినీ సృజియించిరి.

**మిథున ధర్మ సృష్టి :** ఒక ప్రాణిలోని స్త్రీపురుషుల వలన అదే ప్రాణి జనియించును.

**మానవ సృష్టి :** మగవాని యొక్క వీర్యము వలన స్త్రీ గర్భము దాల్చును. అలా ఆ పిండము నుంచి కరచరణాది అవయవములతో శరీరము ఏర్పడును. పూర్వజన్మ కర్మానుసారము జీవుడు ఈ శరీరములో ప్రవేశించును. అది మొదటి స్థితి. జన్మించి సంసారతాపత్రయములలో చిక్కుకొనుట రెండవ స్థితి. చనిపోయి తిరిగి జన్మించుట మూడవ స్థితి.

ఆత్మను ఉపాసించి సర్వమూ ఆత్మయని గ్రహించి అమృతత్త్వమును పొంద వలయును అని ఉపదేశము.

**ఓంతత్సత్**

*****

## ప్రథమోఽధ్యాయః - ప్రథమఖండః

ఈప్రథమ ఖండములో బ్రహ్మ విచారణ మఱియు సృష్టి విచారణ చేయుచున్నాడు. సృష్టి విచారణలో విరాట్ పురుషుడు ఆవిర్భవించినాడు. లోకములు నిర్మింపబడినవి. ఆ విరాట్‌పురుషుని నుంచి దేవతలు సృజియింపబడిరి.

ఈ కనిపించే దృశ్యమాన జగత్తు అనాదిగా ఉన్నదా ? లేక ఎవరైనా సృజియించినారా?

### బ్రహ్మ విచారణ

**హరిః ఓం. ఆత్మ వా ఇదమేక ఏవాగ్ర ఆసీన్నాన్యత్కించన మిషత్**

ఆత్మా - వా - ఇదమ్ -ఏకః - ఏవ - అగ్ర (అగ్రే) - ఆసీత్ - న - అన్యత్ - కించన - మిషత్.

| | | |
|---|---|---|
| అగ్ర (అగ్రే) | = | సృష్టి ప్రారంభమందు-ఈ |
| ఆత్మా | = | ఆత్మ |
| ఏకః+ఏవ | = | ఒక్కడే |
| ఆసీత్ | = | కలడు. |
| వా | = | ఆత్మ తప్ప |
| అన్యత్ | = | ఇంకొకటి ఏదియు లేదు అనగా |
| ఇదమ్ | = | ఈ విశ్వములోని స్థావరములు గాని |
| మిషత్ | = | చలనాది వ్యాపారముగల ప్రాణికోటి గాని |
| కించన | = | ఈ దృశ్యమాన ప్రపంచములో గల లోకములు గాని ఏదియు |
| న | = | లేదు. అనగా ఆత్మతప్ప ఇతరమైనది ఏదికూడ లేదు. |

సృష్ట్యాది యందు ఆత్మ ఒక్కడే గలడు. ఆ ఆత్మ ఉపాధిని నిర్మించుకొని పురుషుడయినది. ఇతనిని బ్రహ్మయని, ఈశ్వరుడని అందురు. ఇతడు సృష్టి చేయ సంకల్పించినాడు. అలా సృష్టి చేయ సంకల్పించిన తరువాత ఒక్కడుగా ఉన్న అతడు భిన్నత్వమును పొందినాడు.

**"మాయా విభుండైన యీశ్వరుండు తన మాయం జేసి దైవయోగంబునం బ్రాప్తంబులయిన కాల జీవాదృష్ట స్వభావంబులు వివిధంబులు సేయ నిశ్చయించి కైకొనియె."** (భాగవతం - ద్వితీయ స్కంధము- 86)

అనగా ఈశ్వరుడు కాలము, జీవుడు, కర్మ, ప్రకృతిగా తనని తను విభజించుకొనెను. ఇలా విభజించుకొనినను ఈశ్వరుని లక్షణములు వీటి లక్షణములు ఒకటి గావు. భిన్నములు. ప్రకృతిని ఈశ్వరుడు అధిష్ఠించి విరాట్ పురుషుడై సృష్టి చేసినాడు.

సృష్టి ఎలా చేసినాడు?

**స ఈక్షత లోకాన్ను సృజా ఇతి**

సః - ఈక్షత - లోకాన్ - ను - సృజా (సృజై) - ఇతి.

| | | |
|---|---|---|
| సః | = | స్వయంభువు అయిన విరాట్ పురుషుడు |
| లోకాన్ | = | లోకములను |
| ను | = | మఱియు లోకపాలురను, అన్నమును స్థావర జంగమాత్మక విశ్వమును |
| సృజా(సృజై)+ఇతి | = | సృజియింతునని |
| ఈక్షత | = | ఆలోచించెను. |

*****

# సృష్టి విచారణ

లోకములను సృజియించెను. స్థావరములను సృజియించెను.

**స ఇమాం ల్లోకాన సృజత । అమ్భోమరీచీర్మరమాపోఽ థోఽమ్భః పరేణ దివం ద్యౌః ప్రతిష్ఠాఽన్తరిక్షం మరీచయః । పృథివీ మరో యా అధస్తాత్తా ఆపః॥**

సః - ఇమాన్ - లోకాన్ అసృజత - అమ్భః - మరీచీః - మరం - ఆపః - అథః - అమ్భః - పరేణ - దివం - ద్యౌః - ప్రతిష్ఠా - అంతరిక్షం - మరీచయః - పృథివీ - మరః - యాః - అథస్తాత్ - తాః - ఆపః

సృష్టి రెండు విభాగములు ఒకటి జడ పదార్థములను సృజియించుట , రెండవది చైతన్య జీవులను సృజియించుట. మొదటి విభాగమును చెప్పుచున్నాడు.

జడ పదార్థములను సృజియించుటకు.

1. సృజియించువాడు - కర్త
2. వస్తువునకు కావలసిన పదార్థము - ప్రకృతి.
3. వస్తువు తయారగుటకు కొంత సమయము (కాలము) అవసరము.

ఈ పదార్థమును లేక వస్తువును ఏల సృజించవలెను? అన్న ప్రశ్నకు ఒక వ్యక్తి దానిని అనుభవించుటకు - అన్నది సమాధానము. ఈ అనుభవించువాడే భోక్త. ఇతడే జీవుడు. ఒక వస్తువును తయారు చేసిన వాడు మఱియు ఇతరులు కూడ ఆ వస్తువును అనుభవించ వచ్చును. కావున యిచ్చట కర్తయే భోక్త అగును. అప్పుడు ఆత్మ భోక్త అగును. కావున ఆత్మ తన క్రీడార్థము సృష్టి చేసెనని చెప్పుదురు.

కావున ఈశ్వరుడు ప్రకృతి-కర్మ, కాలము-జీవుడుగా తనని తను విభజించు కొనినాడు జడ పదార్థముల సృష్టికి ఈక్రింద చెప్పబడినవి కావలయును.

| కర్త చేయువాడు | కావలసిన పదార్థములు | సమయము | పదార్థము నుండి తయారయిన వస్తువులు |
|---|---|---|---|
| కుమ్మరివాడు | మన్ను | కొంత సమయము | మట్టిపాత్రలు |
| బంగారపు పనివాడు | బంగారం | కొంత సమయము | బంగారపు వస్తువులు |
| అటులనే ఈశ్వరుడు | ప్రకృతి | కొంత సమయము | బ్రహ్మాండము లోకములు ఏర్పడినవి. |

ఈ బ్రహ్మాండమునే విరాట్ దేహము అని అందురు.

ఈ బ్రహ్మాండము ఎటుల తయారయినదో భాగవతమున ఇట్ల వివరింప బడినది. ఈశ్వరుడు సృష్టి చేయ సంకల్పించి అండమును సృజియించినాడు.

ఈశ్వరుడు ప్రకృతిని అధిష్ఠించి మహత్ - అహంకారము - ఆకాశము - వాయువు- తేజము (అగ్ని) - జలము - భూమి - అనే వాటిచే ఒక మహా అండమును సృజియించెను. ఆ అండము కొంత కాలము జలములలో ఉన్నది. ఆ అండము అచేతనముగా ఉన్నది. ఆ అండములోనికి ఈశ్వరుడు ప్రవేశించి ఆ అండమునకు చేతనత్వము గల్పించి - దానిని విస్తారము చేసి - ఆ అండమును భేదించి నిర్గమించెను (భాగవతం - ద్వితీయ స్కంధము - 86)

ఈ విరాట్పురుషుని శరీరము లేక బ్రహ్మాండమే - ఈ 14 లోకములు లోకములు సృజియించుటకు మందు బ్రహ్మాండమును నిర్మించి దానిని 14 లోకములుగా విభజించెను. ఇది ప్రారంభ సృష్టిగా చెప్పబడును.

ఈ లోకముల నిర్మాణమును భాగవతంలో ఇంకొక విధముగాను వివరింప బడినది. నారాయణుడు చిచ్ఛక్తి సమేతుడై ఆదిశేషువుపై సముద్ర మధ్యలో యోగనిద్రపొంది కన్నులు మూసుకొని పడుకున్నాడు. అప్పుడు అతనికి సృష్టిచేయవలయుననే కోరిక గలిగినది.

కొంతకాలమునకు కాలము, శక్తి వ్యక్తమయినవి. సృజియించుటకు సూక్ష్మ పదార్థమును మనస్సులో భావించినాడు. రజోగుణం ఏర్పడినది. ఆ గుణంతో పరమేశ్వరుని నాభిప్రదేశము నుండి ఒక పద్మము గలిగినది ఆ పద్మంలో నుండి బ్రహ్మ పుట్టెను.

ఆ బ్రహ్మ అష్టాంగ యోగములతో కూడిన యోగం చేసినాడు. గాలిని బంధించి సమాధిలో నూఱు సంవత్సరములు ఉండెను. అప్పుడు తన హృదయపద్మము లో నున్న పరమాత్మను చూచెను. అప్పుడు తత్కాలవాయువుచే కంపితంబగు నిజనివాసంబయిన పద్మంబును, వాయువును, జలంబులను కనుగొనెను. తన తపఃశక్తి చేత అభివృద్ధి పొందిన విద్యాబలంబున వాయువును బంధించి జలాన్నంతా త్రాగి ఆకాశమంతా నిండియున్న జలాన్ని చూచి ఆకాశంలో ఒకపద్మమును చూచినాడు. ఆపద్మంలో దాగియున్న లోకములను చూచినాడు. మెల్లగా ఆ తామరపూవులోనికి వెళ్ళినాడు. ఆ పద్మంలో మూడు లోకములు కన్పించినవి. వాటిని 14 లోకములుగా సృష్టించినాడు. (భాగవతం-తృతీయస్కంధం 334 -337)

ముండకఉపనిషత్ 1-1-8 లో సప్తసప్త లోకాః అనిచెప్పిన 14లోకములను 4 విభాగములుగా యిందు చెప్పబడినవి.

ఈలోకములలో భూమి తప్ప మిగిలినవి ఏవియు బాహ్యదృష్టికి గోచరము కావు.

దేహి తన మరణ కాలమున మనోప్రాణములను తన శరీరములో ఏ స్థాయిలో ఉంచి శరీరమును వీడునో ఆ లోకములకు అతడు చేరును. ఈ లోకముల గుఱించి చెప్పుటలోని ప్రయోజనము ఇది.

ఈమంత్రములో అంబః (స.న) - ఆపః (ప.స్త్రీ) - అని జలమునకు రెండు పదములు ప్రయోగించినాడు. అటులనే దివమ్ (వ.స్త్రీ) - ద్యౌః (ఓ స్త్రీ ) అని స్వర్గమునకు రెండు పదములు ప్రయోగించినాడు.

అంబః - పదము వలన తెలియబడు జలములు, ఆపః పదము వలన తెలియబడు జలములు ఒకటి కావు.

దివమ్, ద్యాః లలో ఒకటి స్వర్గమునుగాను, ఇంకొకటి స్వర్గ లక్షణము గాను గ్రహించవలయును.

| | | |
|---|---|---|
| సః | = | విరాట్ పురుషుడు బ్రహ్మాండమును భేదించి |
| ఇమాన్ + లోకాన్ | = | ఈ 14 లోకములను |
| అసృజత | = | సృజియించెను. ఇది ప్రారంభసృష్టిగా చెప్పబడినది. ఆ విరాట్ పురుషుడు రజో గుణమునాశ్రయించి బ్రహ్మ అయినాడు. అతడు |
| యాః + అమ్బః | = | ఏ జలములు ఆకాశమున గలవో |
| తాః | = | ఆజలములు అందుగల పద్మములోగల మూడు లోకములను 14 లోకములుగా విభజించినాడు. (అనంతర సృష్టి గా చెప్పబడినది.) |

ఇప్పుడు బ్రహ్మాండములో ఆ లోకముల స్థానము ఆ లోకలక్షణములు వివరించు చున్నాడు.

| | | |
|---|---|---|
| ఆపః + పరేణ | = | జలముల పై భాగమున |
| పృథివీ | = | భూమిని |
| ప్రతిష్ఠా | = | ప్రతిష్ఠించెను. ఇది భూమి యొక్క స్థానము. |
| మరమ్ | = | ఈ భూమిపైగల ప్రాణికోటి మృత్యువును పొందును గాన ఈ భూలోకము |
| మరః | = | మృత్యు లక్షణము గలది. |
| (పృథివీ పరేణ) + అంతరిక్షం | = | భూమి పై భాగము అంతరిక్షమున, ఆ అంతరిక్షమున భువర్లోకము, సువర్లోకము, మహర్లోకము, జనలోకము, తపోలోకము అను లోకములను |
| (ప్రతిష్ఠా) | = | ప్రతిష్ఠించెను. |
| మరీచయః | = | ఈ లోకములు కాంతివంతమైన లోకములు. పుణ్యా కర్మానుష్ఠాన పరులు సూర్య కిరణముల ద్వారా ఈ లోకములకు చేరుదురు. ఇవి |

| | | |
|---|---|---|
| మరీచీః | = | కాంతి గల లోకములు. |
| (అంతరిక్షం+ పరేణ) | = | అంతరిక్షము పై భాగమును అనగా బ్రహ్మాండపు ఉపరి భాగమున |
| దివమ్ | = | స్వర్గమును (బ్రహ్మలోకమును) |
| (ప్రతిష్ఠా) | = | ప్రతిష్ఠించెను. ఆ లోకమున |
| ద్యౌః | = | దేవతలు క్రీడింతురు. మఱియు |
| అమ్భః | = | జలములు గలది. పురాణములలో ఆకాశగంగ గా అభివర్ణింతురు. సాధకుడు ఈ ఆకాశ గంగను అవతరణ చేయవలయును. ఇదే గంగావతరణ కథగా సాధన రహస్యమును వివరించిరి. |
| అథః | = | ఆ తర్వాత |
| ఆపః | = | జలముల |
| అధస్తాత్ | = | దిగువున - సూర్యచంద్ర నక్షత్రముల కాంతిగాక ఇతర కాంతి గల అతలము, వితలము, సుతలము, తలాతలము, మహీతలము, రసాతలము, పాతాళము అనే 7 లోకములను ప్రతిష్ఠించెను. |

ఈ విధముగా 14 లోకములను - 4 విభాగములుగా సృజియించెను.

| | | |
|---|---|---|
| మొదటి విభాగము | = | జలములకు పై గల భూమి |
| రెండవ విభాగము | = | భూమి పై గల అంతరిక్షము |
| మూడవ విభాగము | = | అంతరిక్షముపై భాగమున గల స్వర్గము బ్రహ్మ లోకము |
| నాలుగవ విభాగము | = | జలములకు భూమికి దిగువున గల లోకములు. |




ఈ బ్రహ్మాండము సమిష్టిలో లోకములుగా చెప్పుదురు. ఈ లోకములనే వ్యష్టిలో శరీర భాగములుగా చెప్పుదురు. లోకములను ఉపలక్షణములుగా తీసికొని సమస్త స్థావరములు సృజియింపబడినవని గ్రహించవలయును.

లోకపాలకులను సృష్టిచేయ సంకల్పించెను.

**స ఈక్షత ఇమే ను లోకాః లోకపాలాన్ను సృజా ఇతి**

**సో ఽ ద్భ్యయ ఏవ పురుషం సముద్ధృత్యా మూర్ఛయత్**

సః - ఈక్షత - ఇమే - ను - లోకాః - లోకపాలాన్ - ను - సృజా (సృజై) - ఇతి - సః - అద్భ్యయః - ఏవ - పురుషం - సముద్ధృత్య - అమూర్ఛయత్

సృష్టియొక్క మొదటి విభాగమును చెప్పి ఇపుడు సృష్టియొక్క రెండవ విభాగమును చెప్పుచున్నాడు. జీవమున్న ప్రాణి నుండే యింకొక ప్రాణి పుట్టుచున్నది. మగ ప్రాణియొక్క వీర్యము ఆడ ప్రాణియోనియందు పడి గర్భములో పిండ రూపము ధరియించును. ఆ తరువాత ఆ పిండమునకు కాళ్ళు, చేతులు, ముఖము మెదలయిన శరీర అవయవములన్నియు తయారగును. అనగా శరీరము ఏర్పడును. తరువాత చైతన్యము గలుగును. ప్రాణము, జీవుడు, ఆత్మ - అందు ప్రవేశించి కొంతకాలమునకు మాతృగర్భమునుండి బాహ్య ప్రపంచము లోనికి వచ్చును. అనగా తల్లి ప్రసవించును.

| | | |
|---|---|---|
| సః | = | ఈశ్వరుడు సృష్టిలో భాగముగా |
| ఇమే+లోకాః | = | ఈ లోకములను |
| సృజా(సృజై)+ఇతి | = | సృజియించితిని. తదుపరి |
| లోకపాలాన్ | = | లోక పాలకులను, |
| ను | = | మఱియు లోకస్థులను అనగా జీవులను, జీవలక్షణములయిన ఆకలి దప్పికలను |
| ను | = | ఆకలి దప్పికలకై అన్న పానీయములను సృజియించెదనని |
| ఈక్షత | = | ఆలోచించెను. అనగా సంకల్పించెను |
| సః | = | ఈశ్వరుడు(విరాట్ పురుషుడు) |

| | | |
|---|---|---|
| (అద్భ్యః) అద్భయః+ఏవ | = | ఆ నీటిలోగల అండమునే |
| సముధృత్య | = | లేవనెత్తి - ఆ అండమును విస్తారము గావించి, |
| అమూర్ఛయత్ | = | కరచరణాది అవయవములతో జీవుని శరీరమును రూపుదిద్దెను. అందు ఆత్మగా, జీవునిగా ప్రవేశించి |
| పురుషం | = | పురుషునిని పుట్టించెను. |

పురమనగా ఉపాధి లేక శరీరము. అందుగల జీవునిని పురుషుడు అని అందురు. పురుషునిని సృజియించెననగా సమస్త జంగమములను అనగా సమస్త జీవరాసులు సృజియింపబడినవి అని అర్థము. భూమిపై చరించునవి, ఆకాశమున విహరించునవి జలములలో గలవి, కంటికి కనిపించునవి, కంటికి కనిపించనివి, అన్ని రకముల జీవరాసులు సృజియింపబడినవి. ఇప్పటికి సమస్త స్థావర జంగమములు సృజియింప బడినవని చెప్పినాడు.

*****

విరాట్ పురుషుడు - అతని అవయవముల నుంచి లోకపాలురు (దేవతలు) సృజియింపబడుట.

**తమభ్య తపత్త స్వాభి తప్తస్య ముఖం నిరభిద్యత యథాఽ ణ్డమ్ ముఖా ద్వాగ్వా చోఽగ్ని ర్నాసికే నిరభిద్యేతాం, నాసికాభ్యాం, ప్రాణః ప్రాణాద్వాయు రక్షిణీ నిరభిద్యేతా మక్షిభ్యాం చక్షుశ్చక్షుష ఆదిత్యః కర్ణౌ నిరభిద్యేతాం కర్ణాభ్యాం శ్రోత్రం శ్రోత్రాద్దిశ స్త్వజ్ నిరభిద్యత త్వచో లోమాని లోమభ్య ఓషధి వనస్పతయో హృదయం నిరభిద్యత హృదయాన్మనో మనస శ్చన్ద్రమా నాభిర్నిరభిద్యత నాభ్యా అపానోఽ పానా న్మృత్యుః శిశ్నం నిరభిద్యత శిశ్నాద్రేతో రేతస ఆపః**

**ప్రథమోఽ ధ్యాయే ప్రథమ ఖండః**

తమ్ - అభ్యతపత్ - తస్య - అభితప్తస్య - ముఖం - నిరభిద్యత - యథా - అండమ్ - ముఖాత్ - వాక్ - వాచః - అగ్నిః - నాసికే - నిరభిద్యత - ఏతాం-

నాసికాభ్యాం - ప్రాణః - ప్రాణాత్ - వాయుః - అక్షిణీ - నిరభిద్యత - ఏతాం - అక్షిభ్యాం - చక్షుః - చక్షుషః - ఆదిత్యః - కర్ణౌ - నిరభిద్యత - ఏతాం - కర్ణాభ్యాం - శ్రోత్రం - శ్రోత్రాత్ - దిశః - త్వక్ - నిరభిద్యత - త్వచః - లోమాని - లోమభ్యః - ఓషధి వనస్పతియౌ - హృదయం - నిరభిద్యత - హృదయాత్ - మనః - మనసః - చన్ద్రమాః - నాభిః - నిరభిద్యత - నాభ్యాత్ - అపానః - అపానాత్ - మృత్యుః - శిశ్నం - నిరభిద్యత - శిశ్నాత్ - రేతః - రేతసః - ఆపః

అధ్భయః ఏవ సముద్ధృత్య అమూర్చయత్‌కు యిప్పుడు విపులవ్యాఖ్యానము చెప్పుచున్నాడు. జీవపురుషుడు జన్మించుట విరాట్‌దేహము నుంచి దేవతలు ఆవిర్భవించుట అనే రెండిటిని కలిపి ఇందు వర్ణింపబడినది. (మంత్రములో ఉన్నట్లు యధాక్రమముగా అర్థము చెప్పరాదని గతములో చదువుకున్నాము. భావము ననుసరించి పదములను ఒక క్రమములో ఉంచి వ్యాఖ్యానము చేయవలయును).

| | | |
|---|---|---|
| తం | = | పురుషునిని సృష్టిచేయ |
| అభ్యతపత్ | = | సంకల్పించెను |
| తస్య+అభితప్తస్య | = | విరాట్ పురుషుని యొక్క సంకల్పము వలన |
| యధా+అండమ్ | = | గ్రుడ్డు నుండి పిల్ల బయటకు వచ్చినట్లు మాతృగర్భస్థ అండము నుండి - జీవుని |
| ముఖం | = | ముఖము |
| నాసికే | = | ముక్కురంధ్రములు |
| అక్షిణీ | = | రెండు కన్నులు |
| కర్ణే | = | రెండు చెవులు |
| త్వక్ | = | చర్మము |
| నాభిః | = | నాభి |

| | | |
|---|---|---|
| శిశ్నం | = | శిశ్నము |
| హృదయం | = | హృదయము అనగా సంపూర్ణ అవయములతో పురుషుడు |
| నిరభిద్యత | = | జన్మించెను. అనగా ప్రాణి కోటి జన్మించినది. విరాట్ పురుషుని |
| ముఖాత్+వాక్+ వాచః + అగ్నిః + నిరభిద్యత | = | నోటి వలన వాక్-వాక్ నుంచి అగ్ని వచ్చినవి. |
| ఏతాం+నాసికాభ్యాం+ప్రాణః + ప్రాణాత్ + వాయుః+నిరభిద్యత | = | అతని ఈ రెండు ముక్కురంధ్రముల వలన ప్రాణము. ప్రాణము నుంచి వాయువు వచ్చినవి. |
| ఏతాం+అక్షిభ్యాం+చక్షుః + చక్షుషః + ఆదిత్యః + నిరభిద్యత | = | ఈ రెండు కన్నుల వలన దృష్టి, దృష్టి నుంచి ఆదిత్యుడు వచ్చినవి. |
| ఏతాం+కర్ణాభ్యాం+శ్రోత్రం + శ్రోత్రాత్+దిశః+(దిశాః) నిరభిద్యత | = | ఈ రెండు చెవుల వలన శబ్దము, శబ్దము నుంచి దశదిశలువచ్చినవి. |
| త్వచః+లోమాని+ లోమభ్యః+ఓషధిః వనస్పతయో +నిరభిద్యత | = | చర్మము వలన రోమములు రోమముల నుంచి ఓషధులు వనస్పతులు వచ్చినవి. |
| హృదయాత్+మనః+ మనసః+చంద్రమాః+ నిరభిద్యత | = | హృదయము వలన మనస్సు మనస్సు నుంచి చంద్రుడు వచ్చెను |
| నాభ్యాత్+అపానః + అపానాత్+మృత్యుః+ నిరభిద్యత | = | నాభి వలన అనగా నాభికి దిగువనగల గుదమున అపానము, అపానము నుంచి మృత్యువు వచ్చెను. నాభి నుంచి అపాన |

వాయువు వచ్చెను అని చెప్పిన ప్రశ్నో పనిషత్‌లో చెప్పిన దానికి విరోధము సంభవించును. కావున నాభికి దిగువున గల గుదము నుండి అపాన వాయువు వచ్చెనని చెప్పవలయును.

| | | |
|---|---|---|
| శిశ్నాత్+రేతః+ | = | శిశ్నము నుండి రేతస్సు |
| రేతసః+ఆపః+ | | ఆ రేతస్సు నుండి జలము |
| నిరభిద్యత | | (పంచభూతముల లోని జలము కాదు) వచ్చెను. |

| **విరాట్ దేహము** | | **దేవతలు** |
|---|---|---|
| ముఖము | వాక్కు | అగ్ని |
| ముక్కు | ప్రాణము | వాయువు |
| కన్నులు | దృష్టి | ఆదిత్యుడు |
| చెవులు | శబ్దము | దిశలు |
| చర్మము | రోమములు | ఓషధులు |
| హృదయము | మనస్సు | చంద్రుడు |
| నాబి | అపానము | మృత్యువు |
| శిశ్నము | రేతస్సు | జలము |

సృష్టి గురించి - విరాట్‌పురుషుని గురించి భాగవతమున వర్ణింపబడిన విషయములు ముందు ముందు ఉపనిషత్తులలో చదువుకుందాము.

*****

## ద్వితీయ ఖండః

విరాట్‌పురుషుని దేహమునుండి దేవతలు ఆవిర్భవించిరి. మాతృగర్భము నుండి జీవుడు జన్మించెను. జీవపురుషునికి ఆకలిదప్పికలు గలిగినవి. ఆకలిదప్పికలు విరాట్‌పురుషుని దేహమునుండి ఆవిర్భవించలేదు.

**తా ఏతా దేవతాః సృష్టా అస్మిన్మహ త్యర్ణవే ప్రాపతం స్తమశనాయా**
**పిపాసాభ్యా మన్వవార్జత్ తా ఏన మబ్రువ న్నాయతనల నః**
**ప్రజానీహి యస్మిన్ ప్రతిష్ఠితా అన్నమదామేతి.**

తాః - ఏతాః - దేవతాః - సృష్టాః - అస్మిన్ - మహతి - అర్ణవే - ప్రాపతన్ - తమ్- అశనాయా పిపాసాభ్యామ్ - అన్వవార్జత్ - తాః - ఏనమ్ - అబ్రువన్ - ఆయతనం- నః - ప్రజానీహి - యస్మిన్ - ప్రతిష్ఠితాః - అన్నమ్ - ఆదామ - ఇతి

ఈ విధముగా దేవతలు సృష్టింపబడిన

| | | |
|---|---|---|
| సృష్టాః | = | సృజియింపబడిన |
| తాః+ఏతాః | = | ఈ |
| దేవతాః | = | దేవతలు |
| అస్మిన్ | = | ఈ |
| మహతి+అర్ణవే | = | గొప్పసాగరమునందు అనగా ఈ బాహ్య ప్రపంచములో |
| ప్రాపతన్ | = | పడిరి |
| తాః | = | ఆదేవతలు |
| ఏనమ్ | = | విరాట్ పురుషునిని |
| నః | = | మాకు - తగిన |
| ఆయతనం | = | నివాస స్థానమును |
| ప్రజానీహి+ఇతి | = | చూపుము అని - మేము ఆశరీరములో |
| యస్మిన్+ప్రతిష్ఠితాః | = | ఎందు ఉండవలయునని |
| అబ్రువన్ | = | అడిగిరి. విరాట్‌పురుషుడు |

| | | |
|---|---|---|
| తమ్ | = | జీవపురుషునిని |
| అశనాయాపిపాసాభ్యాం | = | ఆకలి దప్పికలతో |
| అన్వవార్జత్ | = | మెలివేసెను. అనగా జీవుడు దేహము లోనికి రాగానే ఆకలి దప్పికలు గలిగినవి. సర్వజీవరాసులకు ఆహారం నిద్ర, మైథునములు సామాన్య లక్షణములు. సర్వ జీవరాసులకు జాగ్రతావస్థలో ఆహార పానీయములు అవసరము అని భావము. |

ఆకలి దప్పికలు మేము ఎందుండి

| | | |
|---|---|---|
| అన్నం | = | అన్నమును |
| ఆదామ | = | తిందుమో ఆ స్థానములను తెలుపుమని అడిగెను. |

ఆకలి దప్పికలు - జీవ లక్షణములు. దేహం ఏర్పడి - ఆ దేహంలోనికి ప్రాణము,జీవుడు ఆత్మ ప్రవేశించగానే జీవలక్షణములు ఏర్పడును.

**తాభ్యో గా మాన యత్తా అబ్రు వన్న వై నోఽ యమల మితి**
**తాభ్యోఽశ్వమాన యత్తా అబ్రువన్నవైనోఽ య మలమితి**

తాభ్యః - గాం - అనయత్ - తాః - అబ్రువన్ - న - వై - నః -అయం - అలమ్ - ఇతి - తాభ్యః- అశ్వం - ఆనయత్ - తాః - అబ్రువన్ - న - వై- నః - అయం - అలమ్ - ఇతి.

ఇంద్రియములు, ప్రాణము, ఆకలి దప్పికలు సర్వజీవులలో యున్నా ఇంద్రియముల ద్వారా పొందు అనుభూతులలో తేడా గలదు. పశువులలో యున్న ఇంద్రియములు ఉత్కృష్టమైనవి కావు. దీనిని చిన్న కథగా వివరించుచున్నాడు.

| | | |
|---|---|---|
| తాభ్యః | = | ఆ దేవతల కొఱకు |
| గాం+వై+ఆనయత్ | = | ఆవును - అనగా గ్రామ్యపశువులను సృజియించి తెచ్చెను. |
| తాః | = | ఆ దేవతలు |
| నః | = | మాకు |

| | | |
|---|---|---|
| న+అయమ్+అలమ్+ ఇతి | = | ఇది సరిపడదని - (మానివాసమునకు యీ గ్రామ్య పశువులు సరిపడవని). |
| అబ్రువన్ | = | పల్కిరి |
| తాభ్యః | = | వారి కొఱకు |
| అశ్వం+వై+ఆనయత్ | = | గుఱ్ఱమును, ఏనుగు మొదలయినవాటిని క్రిమికీట కాదులు, పక్షులు, మృగములు, మొదలయిన జీవ రాసులను సృజియించి తెచ్చెను. |
| తాః | = | వారు |
| నః | = | మాకు |
| అయమ్+న+అలమ్+ ఇతి | = | మానివాసమునకు యివి సరిపడవని |
| అబ్రువన్ | = | పలికిరి |

ఆవు, అశ్వమును ఉదాహరణగా తీసుకొని సర్వజీవరాసులను సృజియించెనని గ్రహించవలయును. ఆహార - నిద్రా - మైథునములు సర్వజీవరాసుల సామాన్య ధర్మము. కానీ పురుషునిలో గల ఇంద్రియములు శ్రేష్ఠములు. అనగా మానవజన్మ శ్రేష్ఠము.

*****

**తాభ్యః పురుషమాన యత్తా అబ్రువన్ సుకృతం బతేతి**
**పురుషో వావ సుకృతమ్ తా అబ్రవీద్యథాయ తనం ప్రవిశతేతి**

తాభ్యః - పురుషం - ఆనయత్ - తాః - అబ్రువన్ - సుకృతం - బత - ఇతి - పురుషః - వావ - సుకృతం - తాః - అబ్రవీత్ - యథా- ఆయతనం - ప్రవిశత - ఇతి.

| | | |
|---|---|---|
| తాభ్యః | = | ఆ దేవతల కొఱకు |
| పురుషం | = | మానవ దేహమును సృజియించి |
| ఆనయత్ | = | తెచ్చెను. దానిని చూచి |
| తాః | = | వారు- ఆ దేవతలు |

| | | |
|---|---|---|
| సుకృతం | = | మానవ దేహం చక్కగా ఉన్నది. |
| బత+ఇతి | = | బాగు బాగు అని |
| అబ్రువన్ | = | పలికిరి ఆనగా ప్రశంసించిరి |
| తాః | = | మా నివాసమునకు |
| పురుషః+వావ+సుకృతం | = | మానవదేహమే మాకు తగినదని పల్కిరి అంత సృష్టికర్త మీరు |
| యథా+ఆయతనం | = | నా దేహములో ఏ భాగములోనుండి మీరువచ్చిరో ఆ విధముగా ఈమానవ దేహములో ఆ భాగములో |
| ప్రవిశత+ఇతి | = | ప్రవేశించండి అని |
| అబ్రవీత్ | = | పలికెను. |

పశు-పక్షి-మృగాదుల శరీరములలో దేవతలకు స్థానములేదు. మానవ శరీరములోనే దేవతలకు స్థానము. కావున మానవుడు యితర ప్రాణి కోటికంటె గొప్పవాడు. ప్రాణికోటిలో, స్థావర - జంగమములలో ఎవరి కంటె ఎవరు గొప్పవారో భాగవతము-తృతీయ స్కంధము - 966 నుంచి 969 వరకు చెప్పబడినవి.

సీ. **తరళాక్షి ! విను మచేతన దేహములకంటెం**
**జేతన దేహముల్ శ్రేష్ఠ మందుం**
**బ్రాణవంతంబులై స్పర్శనజ్ఞానంబు**
**గలుగు చైతన్య వృక్షముల కంటె**
**ఘనరసజ్ఞాన సంకలిత చేతను లుత్త**
**ములు రసజ్ఞానంబు గలుగు వాని**
**కంటె గంధజ్ఞాన కలిత బృందంబులు**
**గడుశ్రేష్ఠములు, వాని కంటె శబ్ద**

తే: **వేదు లగుదురు శ్రేష్ఠులై వెలయు శబ్ద,**
**విదుల కంటెను సద్రూప వేదులైన**
**వాయు సాదులు శ్రేష్ఠముల్, వాని కంటె,**
**వరుస బహుపాదు లుత్తముల్ వాని కంటె.**

క: తలఁపఁ జతుష్పదు లధికులు,
బలకొని మఱి వానికంటెఁ బాదద్వయముం
గల మనుజు లలఘుతము, లి
మ్ముల వారలయందు వర్ణములు నాల్గరయన్.

వ : అందు .

సీ. తలఁప బ్రాహ్మణ లుత్తములు వారికంటెను
వేదవేత్తలు, వేదవిదులకంటె
విలసిత వేదార్థ విదులు, వారలకంటె
సమధిక శాస్త్ర సంశయము మాన్పు
మీమాంసకులు, మఱి మీమాంసకుల కంటె
నిజధర్మ విజ్ఞాననిపుణు, లరయ
వారి కంటెను సంగ వర్జిత చిత్తులు
దగ వారి కంటె సద్ధర్మపరులు.

తే : ధార్మికుల కంటె నుత్తమోత్తముడు వినుము
మత్సమర్పిత సకల ధర్మ స్వభావ
మహిమములు గల్గి యితర ధర్మములు విడిచి
సమత వర్తించు నప్పుణ్యతముఁడు ఘనుఁడు.

ఆ దేవతలు - మానవ శరీరములో ప్రవేశించినారు

**అగ్ని ర్వాగ్భూత్వా ముఖం ప్రావిశద్వాయుః ప్రాణో భూత్వా నాసికే ప్రా విశదాదిత్య శ్చక్షు ర్భూత్వాఽక్షిణీ ప్రావిశ ద్దిశః శ్రోత్రం భూత్వా కర్ణౌ ప్రావిశన్నోషధి వనస్పతయో లోమాని భూత్వా త్వచం ప్రావిశంశ్చన్ద్రమా మనో భూత్వా హృదయం ప్రావిశన్మృత్యు రపానో భూత్వా నాభింప్రావిశ దాపో రేతో భూత్వా శిశ్నం ప్రావిశన్**

అగ్నిః - వాక్ - భూత్వా - ముఖం - ప్రావిశత్ - వాయుః - ప్రాణః - భూత్వా- నాసికే - ప్రావిశత్ - ఆదిత్యః - చక్షుః - భూత్వా - అక్షిణీ - ప్రావిశత్ - దిశః -

శ్రోత్రం భూత్వా - కర్ణౌ - ప్రావిశన్ - ఓషధిః వనస్పతయః - లోమాని - భూత్వా - త్వచం - ప్రావిశన్ - చన్ద్రమాః - మనః - భూత్వా - హృదయం - ప్రావిశత్ - మృత్యుః - అపానః - భూత్వా- నాభిః - ప్రావిశత్ - ఆపః - రేతః - భూత్వా - శిశ్నం - ప్రావిశన్.

| | | |
|---|---|---|
| అగ్నిః + వాక్+ భూత్వా+= | | అగ్ని - వాక్కుగామారి ముఖమును |
| ముఖం+ ప్రావిశత్ | | (నోటి యందు) ప్రవేశించెను |
| వాయుః+ ప్రాణః+ | = | వాయువు ప్రాణముగా మారి ముక్కును |
| భూత్వా+నాసికే+ప్రావిశత్ | | ప్రవేశించెను |
| ఆదిత్యః + చక్షుః+ | = | ఆదిత్యుడు దృష్టిగా మారి |
| భూత్వా+అక్షిణీ+ప్రావిశత్ | | నేత్రములందు ప్రవేశించెను. |
| దిశః+శ్రోత్రం+భూత్వా | = | దిశలు శబ్దముగా మారి చెవులందు |
| కర్ణౌ +ప్రావిశన్ | | ప్రవేశించెను. |
| ఓషధిః+వనస్పతయః | = | ఓషధులు, వనస్పతులు రోమములుగా |
| లోమాని+ భూత్వా | | మారి చర్మము ప్రవేశించెను. |
| త్వచం+ ప్రావిశన్ | | |
| చంద్రమాః + మనః+ | = | చంద్రుడు మనస్సుగా మారి |
| భూత్వా+హృదయం+ | | హృదయమునందు ప్రవేశించెను. |
| ప్రావిశత్ | | |
| మృత్యుః + అపానః+ | = | మృత్యువు అపాన వాయువుగా మారి |
| భూత్వా+నాభిః+ | | నాభికి దిగువన గల గుదమున |
| ప్రావిశత్ | | ప్రవేశించెను |
| ఆపః+రేతః+భూత్వా | = | జలము రేతస్సుగా మారి శిశ్నమును |
| శిశ్నం+ప్రావిశన్ | | ప్రవేశించెను. |

ఇంద్రియాదులతో పాటు అధిష్ఠాన దేవతలు కూడ మానవునిలో ఉన్నారు. కావున మానవుడు విశిష్టుడు. దేవతలకు స్థానం ఏర్పడినది. విరాట్ పురుషుని నుంచి యేయే

స్థానములనుంచి యేయే దేవతలు వచ్చిరో ఆయా దేవతలు జీవునిలో ఆయా స్థానములలో ప్రవేశించిరి. అనగా ఈశ్వరుడు - జీవుడు బింబ ప్రతిబింబములు.

| విరాట్ దేహము నుంచి వచ్చినవి | మానవునిలో ప్రవేశించినవి |
|---|---|
| ముఖము... వాక్కు...అగ్ని... | అగ్ని...వాక్కు...ముఖము(నోరు) |
| ముక్కు ... ప్రాణము..వాయువు | వాయువు ...ప్రాణం..ముక్కు |
| కన్నులు... దృష్టి.. ఆదిత్యుడు.... | ఆదిత్యుడు..దృష్టి..కన్నులు |
| చెవులు...శబ్దము.. దిశలు.... | దిశలు...శబ్దము... చెవులు... |
| చర్మము.. రోమములు,ఓషధులు | ఓషధులు,రోమములు,చర్మము |
| హృదయం... మనస్సు, చంద్రుడు. | చంద్రుడు మనస్సు. హృదయం |
| నాభి.. అపానము.. మృత్యువు.. | మృత్యువు.. అపానము.. నాభి |
| శిశ్నము.. రేతస్సు.. జలము.. | జలము..రేతస్సు.. శిశ్నము. |
| దేవతలకు మానవ శరీరములో స్థానము ఏర్పడినది | |

ఆకలి దప్పికలు ప్రాణ లక్షణములు అగుట వలన వీటికి ప్రత్యేక స్థానములేదు. ఆకలి దప్పికలు విరాట్పురుషుని దేహము నుండి వచ్చిన దేవతలవలె ఏర్పడలేదు.

*****

ఆహారము వలన ఇంద్రియములకు, మనస్సునకు, ప్రాణమునకు ఉత్తేజము, బలము గలుగును. యజ్ఞమును ఉదాహరణగా తీసుకొని ఆకలి దప్పికల గుఱించి వివరించుచున్నాడు. యజమాని యజ్ఞము చేసి యజ్ఞాంతమున సర్వ దేవతలకు హవిర్భాగములు పేరు పేరున సమర్పించును. అటులనే ఆ ఆకలి దప్పికల కొఱకు తీసుకొనబడు ఆహారము, నీరు పచనము చేయబడి సర్వేంద్రియములకు సమముగా అందింపబడును. ఈవిషయమునే ఇలా వివరించుచున్నారు.

**త మశనాయా పిపాసే అబ్రూతా మావాభ్యామభిప్రజానీహీతి। తే అబ్రవీదేతాస్వేవ వాం దేవతాస్వా భజామ్యేతాసు భాగిన్యౌ కరోమీతి। తస్మాద్యస్యైకస్యై చ దేవతాయై హవిర్గృహ్యతే భాగిన్యా వేవాస్యామశనాయా పిపాసే భవతః।**

**(ప్రథమోఽధ్యాయే ద్వితీయ ఖండః)**

తమ్ - అశనాయాపిపాసే - అబ్రుతామ్ - ఆవాభ్యామ్ - అభిప్రజానీహి - ఇతి - తే- అబ్రవీత్ - ఏతాసు - ఏవ - వాం - దేవతాసు - ఆభజామి - ఏతాసు - భాగిన్వో- కరోమి - ఇతి - తస్మాత్ - యస్త్యై - కస్త్యై - చ - దేవతాయై - హవిః - గృహ్యతే- భాగిన్యౌ - ఏవ - అస్యామ్ - అశనాయా - పిపాసే - భవతః

| | | |
|---|---|---|
| తం | = | ఆ సృష్టికర్తని |
| అశనాయా పిపాసే | = | ఆకలి దప్పికలు |
| ఆవాభ్యాం | = | మా యిద్దఱి కొఱకు |
| అభిప్రజానీహి+ఇతి | = | నివాస స్థలము ఏర్పరచుము అని |
| తే | = | వారు |
| అబ్రుతామ్ | = | పల్కిరి |
| ఏతాసు+దేవతాసు+ఏవ | = | ఈ దేవతలతోనే |
| వాం | = | మీ యిద్దఱును |
| ఆభజామి | = | కలసి వుండుడు అని మీకు స్థాననిర్ణయము చేసితిని ఆపై మీకు |
| ఏతాసు+ఏవ | = | ఈ దేవతల యందే |
| భాగిన్వౌ | = | భాగము కలవారినిగ |
| కరోమి+ఇతి | = | చేసితిని అని |
| అబ్రవీత్ | = | పల్కెను |
| తస్మాత్ | = | అందువలన |
| యస్త్యై కస్త్యై+చ+ దేవతాయై+హవిః+గృహ్యతే | = | ఏఏదేవతల కొఱకు హవిస్సు యిచ్చెదరో |
| అస్యామ్ | = | ఆ దేవతలయందు |
| అశనాయాపిపాసే | = | ఆకలిదప్పికలు |
| భాగిన్యౌ +ఏవ | = | భాగస్వాములు |
| భవతః | = | అగుదురు. |

దేవతలకువలె ఆకలిదప్పికలకు దేహములో ప్రత్యేకించి స్థానము లేదు. దేహమే ఆకలిదప్పికలకు స్థానము. ఆకలిదప్పికలు ప్రాణ లక్షణములు.

*****

## తృతీయ ఖండః

ఆకలిదప్పికల కొఱకు అన్నమును సృజియించుట

**స ఈక్షతేమే ను లోకాశ్చ లోకపాలాశ్చాన్నమేభ్యః సృజా ఇతి**

సః - ఈక్షత - ఇమే - ను - లోకాః - చ - లోకపాలాః - చ - అన్నమ్ - ఏభ్యః- సృజా - ఇతి.

| | | |
|---|---|---|
| లోకాః+లోకపాలాః | = | 14 లోకములు, మఱియు లోకపాలురు అయిన దేవతలు సృజియింపబడిరి. |
| ఏభ్యః | = | వారి కొఱకు నివాస స్థానము కూడ కల్పించ బడినది |
| చ | = | జీవునికి ఆకలి దప్పికలు కూడా గలిగినవి |
| ఇమే+ను | = | ఈ ఆకలి దప్పికల కొఱకు |
| అన్నం+చ | = | తినుటకు అన్నమును త్రాగుటకు నీటిని |
| (సృజై) సృజా + ఇతి | = | కల్పింతునని |
| సః | = | ఈశ్వరుడు |
| ఈక్షత | = | సంకల్పించెను. |

ఏ పురుషుని నుంచి దేవతలు వచ్చిరో ఆ పురుషునకు అనగా ఈశ్వరునకు ఆహారము, నీరు అవసరము లేదు. జీవ పురుషునకు జాగ్రతావస్థలో ఆహారము, నీరు అవసరము.

*****

అన్నమును సృజియించెను

**సో ఽ పోఽ భ్యతపత్తాభ్యోఽ భి తప్తాభ్యో మూర్తి రజాయత ।**
**యా వై సా మూర్తి రజాయతాన్నం వై తత్.**

సః - ఆపః - అభ్యతపత్ - తాభ్యః - అభితప్తాభ్యః - మూర్తిః - అజాయత - యా - వై - సా - మూర్తిః - అజాయత - అన్నం - వై - తత్.

| | | |
|---|---|---|
| సః | = | విరాట్పురుషుడు |
| అభ్యతపత్ | = | తపస్సు చేసెను. అనగా సంకల్పించెను |
| అభితప్తాభ్యః | = | తపస్సు వలన, ఆ సంకల్పము వలన |
| తాభ్యః+ఆపః | = | ఆ జలముల నుంచి (ప్రకృతి నుంచి) ఆకలి దప్పికల కొఱకు (జీవునికి గలుగు ఆకలి దప్పికల కొఱకు) |
| మూర్తిః | = | ఘన పదార్థము |
| అజాయత | = | పుట్టించెను |
| యా+సా+మూర్తిః | = | ఏది ఘన పదార్థముగా |
| అజాయత | = | పుట్టెనో |
| తత్ | = | అది |
| అన్నం + వై | = | అన్నము. అన్నము భౌతికముగా ఘన పదార్థము. ఆకలి తీరుటకు అన్నము |
| వై | = | దప్పిక తీరుటకు నీటిని సృజియించెను. |

పశువులకు - తృణము; పక్షులకు - కీటకములు, పండ్లు; క్రూరమృగములకు - ఇతర మృగములు, మాంసాహారముగా చేపలు, మేకలు వగైరాలు; మానవులకు - శాకాహారముగా - బియ్యం, పప్పులు, కూరగాయలు మొదలయినవి ఆహారము.

ప్రకృతి వలన గలిగిన దేహము - మఱియొక దేహములో ఉండే జీవికి ఆహారము. ఈ దేహము ఆహారముగా యింకొక జీవి భక్షించిన తర్వాత ఈ దేహములో ఉండే జీవాత్మ దాని కర్మానుసారము యింకొక దేహమును ధరించును. ఆత్మ ఏ ప్రాణికి ఆహారము కాదు. ఆహారము వలన ఆకలి తీరును. శరీరమునకు అనగా ఇంద్రియములకు, మనస్సుకు, ప్రాణమునకు, ఉత్తేజము, బలము కలుగును. ఆహారము వలన కలిగిన వీర్యము వలన జీవకోటి అభివృద్ధి చెందును. ఇవి ఆహారము వలన ప్రయోజనములు.

అహం వైశ్వానరో భూత్వా ప్రాణినాం దేహమాశ్రితః
ప్రాణాపాన సమా యుక్తః పచామ్యన్నం చతుర్విధమ్

(గీత-పురుషోత్తమయోగము-14)

| | | |
|---|---|---|
| అహం | = | నేను |
| ప్రాణినాం | = | ప్రాణులలో |
| వైశ్వానరః+భూత్వా | = | జీవునిగా జాగ్రతావస్థలో వైశ్వానరునిగా |
| దేహం+ఆశ్రితః | = | దేహమును ఆశ్రయించి అనగా దేహమున ఉండి |
| అన్నం | = | అన్నమును |
| పచామి | = | జీర్ణింపజేసి |
| ప్రాణ-అపాన-సమాన యుక్తః | = | ప్రాణముగా అన్నమును భుజించి, సమానముగా దానిని జీర్ణింపజేసి, అన్నరసమును సర్వ శరీర భాగములకు సమానముగా పంచి అపానముగా మలినమును విసర్జించుచూ ఈ విధముగా |
| చతుర్విధమ్ | = | నాలుగు పనులను చేయుచున్నాను. |

అన్నము ఘనపదార్థము కావున భక్ష, భోజ్య - లేహ్య - పానీయములు అని నాలుగు విధములని చెప్పటము పొసగదు.

*****

**తదేత దభి సృష్టం పరాజత్యజిఘాం సత్ తద్వాచాజిఘృక్షత్తన్నా శక్నోద్వాచాగ్రహీతుమ్ సయద్ధైన ద్వాచా గ్రహైష్యదభి వ్యాహృత్యహై వాన్న మత్రప్స్యత్.**

తత్ - ఏతత్ - అభిసృష్టం - పరాజ్ - అతి - అజిఘాంసత్ - తత్ - వాచా- అజిఘృక్షత్ - తత్ - న - అశక్నోత్ - వాచా - గ్రహీతుమ్ - సః - యత్ - హ- ఏనత్ - వాచా - అగ్రహైష్యత్ - అభివ్యాహృత్య - హ - ఏవ - అన్నమ్ - అత్రప్స్యత్.

అన్నమును భుజించితేనే ఆకలి తీరుతుంది. నీరు త్రాగుతేనే దాహం తీరుతుంది. ఈ విషయమును చమత్కారముగా చెప్పుచున్నాడు. అన్నమును పట్టుకొనుట అనగా

ఆకలి తీరుట అని అర్థము. ఆహారము జీర్ణమయిన తరువాత మిగిలిన వ్యర్థమును విసర్జించుట అని రెండవ అర్థము. (అటులనే నీరు త్రాగిన తరువాత దాహము తీరుట, మిగిలిన వ్యర్థమును విసర్జించుటగా అర్థము చేసుకోవలయును.)

| | | |
|---|---|---|
| అభిసృష్టం | = | ఆ విధముగా సృజింపబడిన |
| తత్+ఏతత్ | = | ఆ అన్నము |
| అతి +పరాజ్ | = | దూరముగా |
| అజిఘాంసత్ | = | ఓలలాడుచున్నది. అనగా ఆహారము తిన్నగా మన నోటిముందుకురాదు. స్వయంకృషితో - వ్యవసాయం, వేట ద్వారా సంపాదించవలయును. |
| తత్ | = | ఆ ఆహారమును |
| వాచా | = | మాటలచే |
| అజిఘృక్షత్ | = | పట్టుకొన ప్రయత్నించెను. భుజింప చూచెను |
| తత్ | = | ఆ అన్నము |
| వాచా | = | మాటలచే |
| గ్రహీతుమ్ | = | పట్టు కొనుటకు |
| న+అశక్నోత్ | = | వశము కాలేదు |
| సః | = | జీవుడు |
| యత్+హ+ఏనత్ | = | ఈ ఆహారమును |
| వాచా | = | వాక్కుచే |
| అన్నం+అగ్రహైష్యత్ | = | అన్నమును పట్టుకొనిన |
| అభివ్యాహృత్య+హ+ఏవ | = | అన్నమునుతినకుండా, కబుర్లాడి నంత మాత్రమున |
| అత్రప్స్యత్ | = | ఆకలితీరి, సంతుష్టి గలిగెడిది. |

అన్నము గురించి మాట్లాడిన ఆకలి తీరదు. నీరు గురించి మాట్లాడిన దాహం తీరదు.

*****

**తత్ ప్రాణేనాజిఘృక్షత్తన్నాశక్నో త్ప్రాణేన గ్రహీతుం। స యద్ధైన త్ప్రాణేనాగ్రహైష్య దభి ప్రాణ్యహైవాన్నమత్రప్స్యత్**

తత్ - ప్రాణేన - అజిఘృక్షత్ - తత్ - న - అశక్నోత్ - ప్రాణేన - గ్రహీతుం - స- యత్ - హ - ఏనత్ - ప్రాణేన - అగ్రహైష్యత్ - అభిప్రాణ్య - హ - ఏవ - అన్నమ్- అత్రప్స్యత్.

| | | |
|---|---|---|
| తత్ | = | ఆ అన్నమును |
| ప్రాణేన | = | ప్రాణము చేత |
| అజిఘృక్షత్ | = | పట్టుకొన భావించెను |
| తత్ | = | ఆ అన్నము |
| ప్రాణేన | = | ప్రాణము చేత |
| గ్రహీతుం | = | పట్టుకొనుటకు |
| న+అశక్నోత్ | = | వశము కాలేదు |
| సః | = | జీవుడు |
| యత్+హ | = | ఒకవేళ అన్నమును |
| ఏనత్ | = | ఈ |
| ప్రాణేన | = | ప్రాణము చేత |
| అన్నం+అగ్రహైష్యత్ | = | అన్నమును పట్టుకొనిన |
| అభిప్రాణ్య+హ+ఏవ | = | వాసన చూచినంతనే |
| అత్రప్స్యత్ | = | ఆకలి తీరి సంతుష్టి గలిగెడిది. |

అన్నమును వాసన చూచితే ఆకలి తీరదు. అటులనే నీటిని వాసన చూచితే దాహము తీరదు.

*****

**తచ్చక్షుషాజిఘృక్షత్తన్నాశక్నో చ్చక్షుషాగ్రహీతుం।**

**స యద్ధైన చ్చక్షుషాగ్రహైష్యద్ దృష్ట్వా హైవాన్నమత్రప్స్యత్।**

తత్ - చక్షుషా - అజిఘృక్షత్ - తత్ - న - అశక్నోత్ - చక్షుషా - గ్రహీతుమ్ - సః- యత్ - హ - ఏనత్ - చక్షుషా - అగ్రహైష్యత్ - దృష్ట్వా - హ - ఏవ - అన్నమ్ - అత్రప్స్యత్

| | | |
|---|---|---|
| తత్ | = | అన్నమును |
| చక్షుషా | = | కన్నులచే |
| అజిఘృక్షత్ | = | పట్టుకొన భావించెను |
| తత్ | = | ఆ అన్నము |
| చక్షుషా | = | కన్నుల చేత |
| గ్రహీతుమ్ | = | పట్టుకొనుటకు |
| న+అశక్నోత్ | = | వశము కాలేదు |
| సః | = | జీవుడు |
| యత్+హ+ఏనత్ | = | ఒకవేళ దీనిని |
| చక్షుషా | = | కన్నులచేత |
| అన్నం+అగ్రహైష్యత్ | = | అన్నమును పట్టుకొనిన అన్నమును |
| దృష్ట్వా+హ+ఏవ | = | చూచినంతనే |
| అత్రప్స్యత్ | = | ఆకలి తీరి సంతుష్టి గలిగెడిది. |

అన్నమును చూచినంత మాత్రమున ఆకలి తీరదు. నీటిని చూచినంత మాత్రమున దాహం తీరదు.

*****

**తచ్ఛ్రోత్రేణా జిఘృక్షత్తన్నాశక్నోచ్ఛ్రోత్రేణ గ్రహీతుం । సయద్ధైన ఛ్ఛ్రోత్రేణాగ్రహైష్యత్ శ్రుత్వా హైవాన్నమత్రప్స్యత్**

తత్ - శ్రోత్రేణ - అజిఘృక్షత్ - తత్ - న - అశక్నోత్ - శ్రోత్రేణ - గ్రహీతుమ్ - సః - యత్ - హ - ఏనత్ - శ్రోత్రేణ - అగ్రహైష్యత్ - శ్రుత్వా - హ - ఏవ - అన్నమ్ - అత్రప్స్యత్.

| | | |
|---|---|---|
| తత్ | = | అన్నమును |
| శ్రోత్రేణ | = | చెవులతో |
| అజిఘృక్షత్ | = | పట్టుకొన భావించెను |
| తత్ | = | అన్నము |

| | | |
|---|---|---|
| శ్రోత్రేణ | = | చెవులచేత |
| గ్రహీతుం | = | పట్టుకొనుటకు |
| న+అశక్నోత్ | = | వశము కాలేదు |
| సః | = | జీవుడు |
| యత్+హ+ ఏనత్+శ్రోత్రేణ | = | ఒకవేళ దీనిని ఈ చెవుల చేత |
| అన్నం+అగ్రహైష్యత్ | = | అన్నమును పట్టుకొనిన |
| శ్రుత్వా+హ+ఏవ | = | వినినంత మాత్రమునే |
| అత్రప్స్యత్ | = | సంతృప్తి గలిగెడిది |

అన్నమును గురించి వినినంత మాత్రమున ఆకలి తీరదు. నీటి గురించి వినినంత మాత్రమున దాహం తీరదు.

*****

**తత్త్వచాజిఘృక్షత్ తన్నాశక్నోత్త్వచా గ్రహీతుమ్**
**స యద్ధైన త్వచాగ్రదహైష్యత్ స్పృష్ట్వా హైవాన్న మత్రప్స్యత్**

తత్ - త్వచా - అజిఘృక్షత్ - తత్ - న - అశక్నోత్ - త్వచా - గ్రహీతుమ్ - సః- యత్ - హ - ఏనత్ - త్వచా - అగ్రహైష్యత్ - స్పృష్ట్వా - హ - ఏవ - అన్నమ్ - అత్రప్స్యత్.

| | | |
|---|---|---|
| తత్ | = | అన్నమును |
| త్వచా | = | చర్మముచే |
| అజిఘృక్షత్ | = | పట్టుకొన భావించెను |
| తత్ | = | అన్నము |
| త్వచా | = | చర్మముచే |
| గ్రహీతుమ్ | = | పట్టుకొనుటకు |

| | | |
|---|---|---|
| న+అశక్నోత్ | = | వశము కాలేదు |
| సః | = | జీవుడు |
| యత్+హ | = | ఒకవేళ అన్నమును |
| ఏనత్ | = | ఈ |
| త్వచా | = | చర్మముచే |
| అన్నమ్+అగ్రహైష్యత్ | = | అన్నమును పట్టుకొనిన |
| స్పృష్ట్వా+హ+ఏవ | = | పట్టుకొనినంత మాత్రము చేతనే |
| అత్రప్స్యత్ | = | సంతృప్తి గలిగెడిది |

అన్నమును చేతులతో స్పృశియించినంత మాత్రమున ఆకలి తీరదు. నీటిని చేతులతో స్పృశియించినంత మాత్రమున దాహం తీరదు.

*****

**తన్మనసాజిఘృక్షత్తన్నాశక్నో న్మనసా గ్రహీతుం ।**
**స యద్ధైన న్మనసా గ్రహైష్యద్ధ్యాత్వా హైవాన్నమత్రప్స్యత్**

తత్ - మనసా - అజిఘృక్షత్ - తత్ - న - అశక్నోత్ - మనసా - గ్రహీతుమ్ - సః - యత్ - హ - ఏనత్ - మనసా - అగ్రహైష్యత్ - ధ్యాత్వా - హ - ఏవ - అన్నమ్ - అత్రప్స్యత్

| | | |
|---|---|---|
| తత్ | = | అన్నము |
| మనసా | = | మనస్సుచేత |
| అజిఘృక్షత్ | = | పట్టుకొన భావించెను |
| తత్ | = | అన్నము |
| మనసా | = | మనస్సుచేత |
| గ్రహీతుం | = | పట్టుకొనుటకు |
| న+అశక్నోత్ | = | వశము కాలేదు |
| స | = | జీవుడు |

| | | |
|---|---|---|
| యత్+హ | = | ఒకవేళ అన్నమును |
| ఏనత్+మనసా | = | మనస్సు చేత |
| అన్నం+ అగ్రహైష్యత్ | = | అన్నమును పట్టుకొనిన |
| ధ్యాత్వా+హ+ ఏవ | = | మనసున తలచినంత మాత్రముననే |
| అత్రప్స్యత్ | = | సంతుష్టి గలిగెడిది |

అన్నమును మనస్సుచే తినినట్లు భావించినంత మాత్రమున ఆకలి తీరదు. నీటిని మనస్సుచే త్రాగినట్లు భావించినంత మాత్రమున దాహం తీరదు.

*****

**తచ్ఛిశ్నేనాజిఘృక్షత్తన్నాశక్నో చ్ఛిశ్నేన గ్రహీతుం।**
**సయద్ధైన చ్ఛిశ్నేనాగ్ర హైష్యద్విసృజ్యహైవాన్నమత్రప్స్యత్**

తత్ - శిశ్నేన - అజిఘృక్షత్ - తత్ - న - అశక్నోత్ - శిశ్నేన - గ్రహీతుమ్ - సః - యత్ - హ - ఏనత్ - శిశ్నేన - అగ్రహైష్యత్ - విసృజ్య - హ - ఏవ - అన్నమ్ - అత్రప్స్యత్

| | | |
|---|---|---|
| తత్ | = | అన్నమును |
| శిశ్నేన | = | శిశ్నము చేత |
| అజిఘృక్షత్ | = | పట్టుకొన భావించెను |
| తత్ | = | అన్నమును |
| శిశ్నేన | = | శిశ్నము చేత |
| గ్రహీతుమ్ | = | పట్టుకొనుటకు |
| న+అశక్నోత్ | = | వశము కాలేదు |
| సః | = | జీవుడు |
| యత్+హ+ఏనత్+శిశ్నేన | = | ఒక వేళ శిశ్నము చేత |
| అన్నం+అగ్రహైషత్ | = | అన్నమును పట్టుకొనిన |
| విసృజ్య+హ+ఏవ | = | వీర్య స్కలనము జరిగినంత మాత్రముననే |
| అత్రప్స్యత్ | = | సంతుష్టి గలిగెడిది. |

అన్నమును శిశ్నము ద్వారా గ్రహించలేము. ఆకలి తీరదు. నీటిని శిశ్నము ద్వారా గ్రహించలేము. దాహం తీరదు. అన్నమును నోటి ద్వారా భుజించవలయును. నీటిని నోటి ద్వారానే త్రాగవలయును. భుజింపబడిన ఆహారము, నీరు సమాన వాయువుచే శరీర భాగములకు సమానముగా పంచబడును. ఆ అన్నము లోని వ్యర్థ పదార్థము మలద్వారము ద్వారా విసర్జింపబడును. నీరు - మూత్రద్వారము ద్వారా విసర్జింప బడును. ఆ అన్నములోని విశిష్ట భాగమయిన రసము వీర్యముగా మారును. ఆ వీర్యము స్త్రీ యోనియందుంచబడి - మఱొక దేహ నిర్మాణమునకు కారణమగును.

*****

**అపాన వాయువు చేయుపని- మలమూత్రవిసర్జన**

**తదపానేనాజిఘృక్షత్ తదావయత్। సైషోఽన్నస్యగ్రహో యద్వాయు రన్నాయుర్వా ఏష యద్వాయుః**

తత్ - అపానేన - అజిఘృక్షత్ - తత్ - అవయత్ - సః - ఏషః - అన్నస్య - గ్రహః - యత్ - వాయుః - అన్నాయుః - వా - ఏషః - యత్ - వాయుః

| | | |
|---|---|---|
| సః | = | జీవుడు |
| తత్ | = | అన్నమును |
| అపానేన | = | అపానవాయువుచే |
| అజిఘృక్షత్ | = | పట్టుకొనభావించెను |
| తత్ | = | ఆ అన్నము |
| ఆనయత్ | = | వశము అయ్యెను |
| ఏషః+అన్నస్య+గ్రహః | = | ఈ అపాన వాయువు అన్నము యొక్క అనగా తిన్న అన్నము జీర్ణమవగా మిగిలిన వ్యర్థపదార్థమును గ్రహించునది |

| | | |
|---|---|---|
| యత్+వాయుః | = | అందువలన అపాన వాయువు |
| అన్నాయుః | = | అన్నాయువు అని పిలువబడును. |
| వా | = | లేక ఇది అన్నమును గ్రహించిన వాయువుగా |
| ఏషః+యత్+వాయుః | = | అపాన వాయువు గుర్తింపబడెను. |

అపాన వాయువు వలన మలమూత్రములు విసర్జింపబడును.

*****

**ముఖ్య ప్రాణము- 5గా విభజింపబడి**

| | | |
|---|---|---|
| ప్రాణము | - | ఆహార పానీయములను తీసుకొనును |
| సమానము | - | ఆ ఆహారమును పచనముచేసి అన్నసారమును శరీర భాగములన్నింటికి సమానముగా పంచును |
| అపానము | - | జీర్ణమవగా మిగిలిన వ్యర్థపదార్థమును మలినములను మలమూత్రములుగా విసర్జించును. |

వ్యానవాయువుకు, ఉదాన వాయువుకు ఆహారముతో సంబంధం లేదు. ఇట్లు సృష్టి విచారణ పూర్తి చేసినాడు.

మరల బ్రహ్మవిచారణ చేయుచున్నాడు. ఆత్మ లేకుండ శరీర వ్యాపారము జరుగదు. ఈ ఆత్మ శరీరములోనికి ఎట్లు వచ్చినదో వివరించుచున్నాడు

**స ఈక్షత కథం న్విదం మదృతేస్యాదితి । స ఈక్షత కతరేణ ప్రపద్యా ఇతి। స ఈక్షత యది వాచాభివ్యాదృతం యది ప్రాణే నాభిప్రాణితం యది చక్షుషా దృష్టం యది శ్రోత్రేణ శ్రుతం యది త్వచా స్పృష్టం యది మనసా ధ్యాతం యద్యపానేనాభ్య పానితం యది శిశ్నేన విసృష్ట మథకోఽ హమితి**

సః- ఈక్షత - కథం - ను - ఇదమ్ - మదృతే - స్యాత్ - ఇతి - సః - ఈక్షత- కతరేణ - ప్రపద్యా - ఇతి - సః - ఈక్షత - యది - వాచా - అభివ్యాహృతం- యది - ప్రాణేన - అభిప్రాణితం - యది - చక్షుషా - దృష్టం - యది - శ్రోత్రేణ- శ్రుతం - యది - త్వచా - స్పృష్టం - యది - మనసా- ధ్యాతం - యది - అపానేన- అభ్యపానితం - యది - శిశ్నేన - విసృష్టమ్ - అథ - కః - అహమ్ - ఇతి

| | | |
|---|---|---|
| సః | = | ఆత్మ |
| కతరేణ | = | ఏ మార్గము ద్వారా ఈ శరీరములోనికి |
| ప్రపద్యా+ఇతి | = | ప్రవేశించుట అని |
| ఈక్షత | = | ఆలోచించెను |
| యది | = | ఒకవేళ, నేను యీ శరీరంలో లేకుండా |
| వాచా+అభివ్యాహృతం | = | వాక్కు చేత జీవుడు స్వతంత్రముగా మాట్లాడ గలిగినట్లయితే |
| యది+ప్రాణేన+ అభిప్రాణితం | = | ప్రాణము వాసన చూడగలిగినట్లైతే |
| యది+చక్షుషా+దృష్టం | = | కన్నులు చూడగలిగినట్లయితే |
| యది+శ్రోత్రేణ+శ్రుతం | = | చెవులు వినగలిగినట్లయితే |
| యది+త్వచా+స్పృష్టం | = | చర్మము స్పర్శించ గలిగినట్లయితే |
| యది + మనసా+ధ్యాతం | = | మనస్సు ధ్యానింప గలిగినట్లయితే |
| యది+ అపానేన+ అభ్యపానితం | = | అపానవాయువు ఆహారమును గ్రహించి గలిగినట్లయితే |
| యది+ శిశ్నేన + విసృష్టం | = | శిశ్నము వీర్యమును స్ఖలింపచేసి సంతానమును గలుగచేయగలిగి నట్లయితే |
| అథ+అహం+కః+ఇతి | = | నేను ఎవరిని అని |
| సః | = | ఆత్మ |
| ఈక్షత | = | ఆలోచించెను. |
| మదృతే+కథం+ను+ ఇదమ్స్యాత్+ఇతి+ సః+ఈక్షత | = | నేను లేకుండా ఎట్లు యీ శరీరము పనిచేయును ? నశింపకుండా ఎట్లు ఉండును ? అని ఆత్మ ఆలోచించెను. |

అనగా ఆత్మలేనియెడల శరీర వ్యాపారము జరుగదు. శవములో ఇంద్రియము లున్నను ఇంద్రియ వ్యాపారము లేదుగదా.

ముందు లోకాలు ఏర్పడినవి - అనగా శరీరం ఏర్పడినది.

దేవతలు ఏర్పడినారు. అనగా ఇంద్రియములు వాటికి వ్యాపారము ఏర్పడినది. ప్రాణము, జీవుడు దేహములోనికివచ్చినారు. అనగా జీవ లక్షణములయిన ఆకలి దప్పికలు గలిగినవి. ఇక వీటినన్నింటినినడిపించు ఆత్మ హృదయ గుహలోనికి రావలయును.

ఈ విధముగా నేను లేకుండా యీ శరీర వ్యాపారము ఎట్లు జరుగునని ఆత్మ ఆలోచించెను. అలా ఆలోచించి ఆత్మ శరీరములోనికి ఎట్లు ప్రవేశించెనో రాబోవు మంత్రములో వివరించుచున్నాడు. జీవుడు సృజియింపబడలేదు. ఆత్మయే ఉపాధిలో ప్రవేశించి ఆత్మగా జీవునిగా వ్యవహరింపబడుచున్నది.

*****

ఆత్మ దేహములోనికి బ్రహ్మరంధ్రము ద్వారా ప్రవేశించెను. జీవుడు త్రయావస్థలలో విహరించును.

**ఆత్మ- జీవుడు**

**స ఏతమేవ సీమానం విదార్యైతయా ద్వారా ప్రాపద్యత । సైషా విదృతిర్నామ ద్వాస్తదేతన్నాన్దనమ్ । తస్య త్రయ అవసథాస్త్రయః స్వప్నా। అయమావసథోऽ యమావసథోऽ యమావసథ ఇతి ।**

సః - ఏతమ్ - ఏవ - సీమానం - విదార్య - ఏతయా - ద్వారా - ప్రాపద్యత - సా - ఏషా - విదృతిః - నామ - ద్వాః - తత్ - ఏతత్ - నాన్దనమ్ - తస్య - త్రయః- అవసథాః - త్రయః - స్వప్నాః - అయమ్ - అవసథః - అయమ్ - అవసథః - అయమ్ - అవసథః - ఇతి.

ఆత్మ ఉపాధిలోనికి బ్రహ్మ రంధ్రము ద్వారా ప్రవేశించెను.

| | | |
|---|---|---|
| ఏతం+ఏవ | = | ఈ శిరోభాగమున గల బ్రహ్మరంధ్రమునే |
| సీమానం + విదార్య | = | బ్రద్దలు కొట్టి అనగా మార్గమును చేసి |
| ఏతయా+ద్వారా | = | ఈ బ్రహ్మరంధ్రము ద్వారా |
| సః+ప్రాపద్యత | = | ఆత్మ ఉపాధిలోనికి ప్రవేశించెను. (హృదయగుహలో ఉండెను). |

| | | |
|---|---|---|
| సా+ఏషా+ద్వాః(దోః) | = | ఆత్మ ప్రవేశించిన యీ మార్గమునకే |
| విదృతిః+నామ | = | విదృతి అని పేరు |
| తత్+ఏతత్+నాందనం | = | నందతి కావున నందనము. ఈ నందనమే ఆ తర్వాత పురాణములలో నందనవనం అయినది- యోగ భాషలో సహస్రార చక్రమని పిలువబడినది. ఈమార్గము ఆనందము, సుఖము. |
| త్రయః | = | మూడు అవస్థలు జీవునకు గలవు. అనగా జాగ్రత్, స్వప్న, సుషుప్తి అను మూడు అవస్థలు జీవునకు గలవు. |
| తస్య | = | జీవునకు అనగా జీవుడు ఉండుటకు |
| త్రయః+అవసథాః | = | మూడు ప్రదేశములు గలవు. |
| అయమ్+అవసథః | = | ఈ జీవాత్మ ఇక్కడ ఉండును (జాగ్రతావస్థలో కుడికన్నులో ఉండును) |
| స్వప్నాః+అయమ్+ అవసథః | = | స్వప్నావస్థలో ఇక్కడ ఉండును (కంఠస్థానము వద్ద అనగా మనస్సు వద్ద ఉండును) |
| అయమ్+అవసథః | = | సుషుప్తి అవస్థలో హృదయ గుహ వద్ద ఉండును. |

ఆత్మగా హృదయగుహలో ఉండును. జీవాత్మగా దేహముతో మమేకమై త్రయావస్థ లలో త్రిపురములలో ఉండును. త్రయావస్థలలో జీవునిగానూ, తురీయములో ఆత్మగానూ వ్యవహరింపబడును. ఈజీవుడే త్రిపురాసురుడు. ఈ త్రిపురాసుర సంహారము కథగా భాగవతమున వర్ణింపబడినది. ఈ కథ ఒక యోగరహస్యము. జీవాత్మ నశించి ఆత్మయగు విధివిధానము రహస్యముగా సాధకులకు అర్థమగునట్లు వివరింపబడినది. ముందు ముందు దీని గుఱించి చదువుదుము.

*****

## సృష్టి సర్వము- ఆత్మ స్వరూపమే

**సజాతో భూతాన్యభి వ్యైఖ్యత్ కిమిహాన్యం వావ దిషదితి । స ఏతమేవ పురుషం బ్రహ్మ తతమమపశ్యత్ ఇదమదర్శమితి ॥**

సః - జాతః - భూతాని - అభివ్యైఖ్యత్ - కిం - ఇహ - అన్యం - వావ - దిషత్ - ఇతి - సః - ఏతం - ఏవ - పురుషం - బ్రహ్మ - తతమం - అపశ్యత్ - ఇదం - అదర్శం - ఇతి.

| | | |
|---|---|---|
| జాతః+సః | = | శరీరములో ప్రవేశించిన ఆత్మ |
| ఇహ+అన్యం+ | = | ఇక్కడ తనకంటె అన్యమైన భూతములు |
| భూతాని + కిం | | ఏమిటని |
| వావ దిషత్+ఇతి+ | = | మఱియు ఆత్మ కంటె భిన్నమయినది ఏదియు |
| అభివ్యైఖ్యత్ | | లేదని వ్యాఖ్యానించెను. |
| సః | = | ఆత్మ |
| ఏతం+పురుషం | = | ఈ పురుషుడే |
| తతమం+బ్రహ్మ+ఏవ | = | సర్వత్రా వ్యాపించిన బ్రహ్మము అని |
| అపశ్యత్ | = | చూచెను |
| ఇదం | = | ఈ సర్వవిశ్వము ఆత్మ స్వరూపముగా |
| అదర్శమ్+ఇతి | = | చూచితిని. అనగా సర్వత్రా తనే గలననే విషయ మును దర్శించెను. |

సృష్టిలోగల సర్వనామములు, రూపములు, ఈ సృష్టి అంతా ఆత్మయే అని దర్శించెను. ఈ స్థితిలో దృశ్యము నశించిపోయి ద్రష్ట ఒక్కడే మిగులును. భిన్నత్వము నశించి ఏకత్వమును చూచును. ఇదే ఆత్మ దర్శనం. ఇదే సాధన ఫలితం. అజ్ఞానములో ద్రష్ట - దృక్ -దృశ్యము వేఱు వేఱుగా ఉండును. జ్ఞానములో ఈ త్రిపుటి భావన నశించి ద్రష్టయే మిగులును.

*****

సాధన చేసి తనే ఆత్మయని - ఆత్మయేసర్వత్రా వ్యాపించి యున్నదని గ్రహించ వలయును.

**తస్మాదిదన్ద్రోనామేదన్ద్రో హ వై నామ । తమిదన్ద్రం సన్తమిన్ద్ర మిత్యా చక్షతే పరోక్షేణ। పరోక్ష ప్రియా ఇవ హి దేవాః పరోక్ష ప్రియా ఇవ హి దేవాః।**

**ప్రథమోఽ ధ్యాయే తృతీయః ఖండః (ప్రథమాధ్యాయము సమాప్తము)**

తస్మాత్ ఇదంద్రః - నామ - ఇదంద్రః - హ - వై - నామ - తమ్ - ఇదన్ద్రం- సన్తమ్ - ఇన్ద్రం - ఇతి - ఆచక్షతే - పరోక్షేణ - పరోక్షప్రియాః - ఇవ - హి - దేవాః - పరోక్ష - ప్రియాః - ఇవ - హి - దేవాః

| | | |
|---|---|---|
| తస్మాత్ | = | ఈ సర్వ ప్రపంచము తనే అని చూచినందు వలన అతనికి |
| ఇదంద్రః+నామ | = | ఇదంద్రా అనే పేరు గలిగెను |

ఇదంద్రః+హ+వై+నామ = ఇదంద్రా అనే పేరు - ఎవరు యీ సర్వజగత్తు తనే అని గ్రహించునో అతనికి కూడా ఇదంద్రా అనే పేరే.

**(జీవ పురుషుడు సాధన చేసి ఇంద్రుడుగా మారవలయును)**

| | |
|---|---|
| తం+ఇదంద్రం+సంతం+= | అతడు ఇంద్రుడని |
| ఇంద్రః+అచక్షతే+ఇతి | పిలువబడు చున్నాడు. |
| పరోక్షప్రియాః+దేవాః+ = | ముద్దు పిలుపుకు దేవతలు |
| ఇవ+హి | ఆనందించెదరు. |
| పరోక్షేణ+పరోక్షప్రియాః+= | మనము మన పిల్లవానికి ఓ పేరు పెట్టి |
| ఇవ+హి+దేవాః | పిలిచేటప్పుడు చిట్టి అని, బుజ్జి అని, బంగారం అని ఎలా పిలుచుదుమో అటులనే ఇదంద్రుడు ముద్దుగా ఇంద్రుడు అనియే పిలువబడు చున్నాడు. ముద్దు పిలుపునకే దేవతలు యిష్టపడుదురు. |

సర్వము బ్రహ్మస్వరూపముగా స్వానుభవంలో దర్శించిన జీవునిని ఇంద్రుడని చెప్పుదురు. పురాణములలో ఇంద్రుని పరంగా చెప్పబడిన కథలన్నీ ఇంద్ర పదమునకు వేఱు వేఱు అర్థములలో చెప్పబడిన విషయములు. కావున ఇంద్ర పదమునకు అన్ని కథలలోనూ ఒకే అర్థము చెప్పరాదు. ఇంద్రపదమునకు నిరుక్తకారుడు వర్షమును కురిపించువాడు అనీ, అన్నమును ఇచ్చువాడు అనీ, సోమపానము కొఱకు వెళ్ళువాడు అనీ ముఖ్య ప్రాణము అనీ చైతన్యము అనీ గొప్ప ఐశ్వర్యవంతుడు అనీ చెప్పినాడు. రామాయణంలో ఇంద్రునిపరంగా చెప్పబడిన మలద కరూశ దేశములలోని ఇంద్ర పదమునకు అర్థము వేఱు. అహల్యా ఇంద్రుని కథగా చెప్పబడిన ఇంద్ర పదమునకు అర్థము వేఱు. శరభంగ మహర్షి ఆశ్రమమునకు వచ్చిన ఇంద్రునిని రాముడు దూరంగా ఉండి దర్శించు సందర్భమున చెప్పబడిన ఇంద్ర పదమునకు అర్థమువేఱు. ఈ కథలన్నీ యోగ రహస్యములు.

*****

## ద్వితీయోஉ ధ్యాయః

మానవులలో కొందఱు సంసారులు, కొందఱు విద్వాంసులు. అజ్ఞాని సంసారములో చిక్కుకొని మమత - అహంకారములచే రాగ ద్వేషములకు లోనై నాది నీది నేను నీవు అనే ద్వంద్వ భావనలలో చిక్కుకొని జనన-మరణ వలయములో పుట్టుచూ చనిపోవుచూ సర్వయోనులలో తిరుగుతున్నాడు. ఇట్టివాడు భవసాగరమును దాటలేక మృత్యువు యింటికి చేరుచున్నాడు. ఇతడు సంసారి.

జ్ఞాని ఈ భవసాగరమనే మృత్యువును సాధన ద్వారా అవిద్యను దాటి, సర్వము అతని దివ్య కళామయమనుచు విష్ణువు నందు ఉల్లము చేర్చి - సర్వము ఆత్మయే యని గ్రహించి ఆత్మ దర్శనము చేసి అమృతత్త్వము పొందుచున్నాడు. ఇతడు విద్వాంసుడు. ఇతనినే ధీరుడు అని అందురు. ఈ ఇరువురి గుఱించి గతములో చదువుకున్నాము. ఇప్పుడు పునశ్చరణ చేయబడుచున్నది.

ఈ ఇరువురి గుఱించి ఈ రెండవ అధ్యాయమున వివరించినారు. జనన మరణ వలయములలో చిక్కుకొనకుండా ఆత్మ స్థానమునకు చేరవలయుననే ఉపదేశము ఈ అధ్యాయమున ఇవ్వబడినది.

రామాయణములో రాముని అనుసరించ లేక తమసానది తీరము నుండి వెను తిరిగిన బ్రాహ్మణులు,పుర ప్రజలు సంసారులుగా ఉదహరింపబడిరి. రామునితో ఉన్న లక్ష్మణుడు విద్వాంసుల కోవకు చెందిన వానిగా ఉదహరింపబడినాడు.

భాగవతమున వ్యాసభగవానుడు ఈ యిరువురి గుఱించి ద్వితీయ, తృతీయ, పంచమ, సప్తమ స్కంధములలో వివరించినారు. భాగవతములో చెప్పబడిన కొన్నింటిని ఇక్కడ మరల పొందుపరచటమైనది.

**సంసారి గుఱించి :** పూర్ణాయుర్దాయము నూఱు సంవత్సరములైన అందు 50 సం॥ నిద్రలో రాత్రి గడుపును. 20 సం॥ బాల్యంలో గడపును. మిగిలిన 30 సం॥ కుటుంబ పోషణలో గడుపును.

"బ్రాహ్మణ కులంబునం జేసి శ్రౌత స్మార్త కర్మానుష్ఠాన పరుండై విషయ సుఖంబులందుఁ దగులువడి కాలంబు తుద నెఱుంగక .....నైహికార్థంబుల యందుఁ దృష్ణ గలిగి మైథున నిమిత్తంబు సుత దారాదులయందు స్నేహంబు సేయుచు...."

(భాగవతము పంచమ స్కంధము పూర్వభాగము 175)

"రహస్య సంభోగ చాతుర్య సౌందర్య విశేషంబుల ధైర్య వల్లికాలవిత్రంబులయిన కళత్రంబులను, మహనీయ మంజుల మధురాలాపంబులు గలిగి వశులయిన శిశువులను, శీలవయోరూప ధన్యలగు కన్యకలను, వినయ వివేక విద్యాలంకారు లయిన కుమారులను, గామిత ఫలప్రదాతలగు భ్రాతలను, మమత్వ ప్రేమ దైన్య జనకులయిన జననీ జనకులను, సకల సౌజన్య సింధువులయిన బంధువులను, ధనకనక వస్తువాహన సుందరంబులయిన మందిరంబులను, సుకరంబులైన పశుభృత్య నికరంబులను, వంశ పరంపరాయత్తంబులయిన విత్తంబులను వర్జింపలేక....స్వయంకృత కర్మ బద్ధుండై, శిశ్నోదరాది సుఖంబులఁ బ్రమత్తుండయి నిజకుటుంబ పోషణ పారవశ్యంబున విరక్తి మార్గంబుఁ దెలియనేరక స్వకీయ పరకీయ భిన్న భావంబున నంధకారంబునం బ్రవేశించుఁ ..."

(భాగవతము - సప్తమ స్కంధము 213)

ఆ॥ మరగి కాననమునఁ గొఱవి దయ్యముఁ గాంచి
యగ్నిఁ గోరి వెంట నరుగు మాడ్కిఁ
గాంచనంబు గోరి కలవారి యిండ్ల పం
చలను దిరుగు నరుఁడు చలనమంది

(భాగవతము - పంచమ స్కంధము,పథమాశ్వాసము, 168)

.....గృహీవలుండు

తే॥ బడుగు ముసలెద్దు రోసిన పగిది, నంత
నతఁడు నేవెంటలను సుఖం బందలేక
తానుబోషించు జనులు దన్ దనరఁబోవ
బ్రదుకు ముదిమియు మిక్కిలి బాధ పఱుప (భాగ. - తృతీయ- 981)

సీ॥ అతిరోగపీడితుండై మందమగు జఠరాగ్నిచే మిగుల నల్పాశి యగుచు,
మెఱసి వాయువుచేత మీఁదికి నెగసిన కన్నులు, కఫమునఁ గప్పఁబడిన
నాళంబులను గంఠనాళంబునను ఘురఘుర మనుశబ్దంబు దొరయ బంధు
జనులమధ్యంబున శయనించి బహువిధములఁ దన్నుఁ బిలువంగఁ బలుకలేక,

(భాగవతము - తృతీయ స్కంధము-983)

వ॥ అంత మరణావస్థంబొందు సమయంబున నతి భయంకరాకారులు సరభసేక్షణులునగు యమదూతలిద్దఱు దన ముందఱ నిలిచినం....

(భాగవతము - తృతీయ స్కంధము-984)

సీ॥.............

గృహముల లోపల గృహమేధులగు నరులాత్మ తత్త్వము లేశమైన నెఱుఁగ రంగనారతుల నిద్రాసక్తిఁ జను రాత్రి పోవుఁ గుటుంబార్థబుద్ధి నహము

ఆ॥ పశుకళత్ర పుత్త్ర బాంధవ దేహాది
సంఘమెల్లఁ దమకు సత్యమనుచుఁ
గాఁపురములు సేసి కడపటఁ జత్తురు
కనియుఁ గాన రంత్యకాల సరణి

(భాగవతము - ద్వితీయ స్కంధము 3)

**విద్వాంసుని గుఱించి :** విద్వాంసుడు నామ మాత్ర సారంబులగు భోగ్యంబులలోన నెంతయు దేహ నిర్వహణంబు సిద్దించునంతయు గైకొనుచు అప్రమత్తుండై సంసారంబు సుఖంబని నిశ్చయింపక యెండు మార్గంబున సిద్ధి గలదని చూచి పరిభ్రమణంబు సేయు.

నిర్మల చిత్తులయిన మహాత్ములు కుటుంబము నందు నిస్పృహ సేయుదురు. కర్మానుభవపర్యంతము పుత్ర దార సమేతంబగు ప్రపంచంబు అనుభవించు. దేహంబు నందు మోహ జనకంబులగు అహంకార మమకారములు విడచి దేహంబు నందు ఆత్మ సిద్ధి కొఱకైన ఉపాయంబునం చేసి బ్రహ్మ భావంబు బడయు. కూటస్థుండైన ఈ ఆత్మ ఉదాసీన భూతంబైనను దీనిని ద్రవ్య- జ్ఞాన-

క్రియా - మనంబులకు ఈశ్వరుండుగా ఎవ్వడు తెలియువాడు భవంబు నొందకుండు. ఆత్మదేహంబుకంటె వేఱు అని తెలిసినవాడు దేహధారియై యుండియు దద్గుణంబుల బొరయక వర్తించు.

ఇట్టి వానినే - గీత - కర్మ సన్న్యాసయోగము-18 లో ఇట్లు చెప్పబడినది

**విద్యా వినయ సంపన్నే బ్రాహ్మణే గవి హస్తిని**
**శునిచైవ శ్వపాకే చ పండితాః సమదర్శినః**

| | | |
|---|---|---|
| పండితాః | - | విద్వాంసులు |
| విద్యా వినయ సంపన్నే | - | విద్య మఱియు వినయము |
| బ్రాహ్మణే | | గల బ్రాహ్మణుని యందును |
| గవి | - | గోవు నందును |
| హస్తిని | - | ఏనుగు నందును |
| శుని | - | కుక్క యందును |
| శ్వపాకే | - | చండాలుని యందును |

ఇవి అన్నీ బాహ్యదృష్టికి గోచరించు ఉపాధులు. ఈ ఉపాధులను గాక ఈ ఉపాధులను సృజియించి ఈ ఉపాధులయందు హృదయగుహలోగల, ఆత్మనే దర్శింతురు. వీరు

సమదర్శినః - సమదర్శనులు.

**సారాంశము:-** ఆత్మ దర్శన చేసిన విద్వాంసుడు జనన మరణ వలయము నుండి విడివడి బ్రహ్మ యగును. సంసారులు చనిపోవుచూ - పుట్టుచూ - ఇలా జనన మరణ వలయములో సర్వ యోనులలో వాని కర్మానుసారము తిరుగాడుదురు.

ఈ ఆధ్యాయమున వామదేవుడనే ఋషిని ఉదాహరణగా తీసుకొని, కర్మ బంధములను తొలగించుకొని ఆత్మయై విరాజిల్లవలయుననే ఉపదేశము యివ్వబడినది.

*****

పూర్వజన్మ కర్మానుసారము - ఉపాధిలో గర్భస్థుడగుట మొదటిజన్మ.

**పురుషే హ వా అయమాదితోగర్భో భవతి యదేతద్రేతః। తద తత్సర్వేభ్యోఽ ంగే భ్యస్తేజః సంభూత మాత్మన్యేవాత్మానం బిభర్తి తద్యదా స్త్రియాం సించత్యథైన జ్జనయతి తదస్య ప్రథమం జన్మ.**

పురుషే - హ - వా - అయమ్ - అదితః - గర్భ - భవతి - యత్ - ఏతత్ - రేతః - తత్ - ఏతత్ - సర్వేభ్యః - అంగేభ్యః - తేజః - సంభూతమ్ - ఆత్మని - ఏవ - ఆత్మానం - బిభర్తి - తత్ - యదా - స్త్రియాం - సించతి - అథ - ఏనత్ - జనయతి - తత్ - అస్య - ప్రథమం - జన్మ.

| | | |
|---|---|---|
| యత్+ఏతత్ | = | ఏది ఆకలి దప్పికకల కొఱకు అన్నము గ్రహింపబడి జీర్ణమై అన్నరసము అన్నిఅంగములకు సమానముగా పంచబడిన తర్వాత ఏర్పడిన విశిష్ట భాగముగా |
| సంభూతం | = | పుట్టినదో |
| తత్ | = | అది |
| ఏతత్+రేతః | = | ఈ వీర్యము |
| సర్వేభ్యః+అంగేభ్యః+ తేజః | = | అన్ని అంగముల తేజస్సు |
| తత్ | = | ఆ వీర్యము |
| యదా+స్త్రియాం | = | ఎప్పుడు స్త్రీ గర్భంలో |
| సించతి | = | పడుతుందో |
| అయమ్+గర్భః | = | ఇది గర్భమునకు |
| అదితః+భవతి | = | మొదటి కారణమగుచున్నది అనగా |
| అథ+ఏనత్+ జనయతి | = | ఆ వీర్యము వలన ఈ పిండము ఏర్పడుచున్నది. |
| ఆత్మానం | = | తనను అనగా ఆ పిండమును |

| | | |
|---|---|---|
| ఆత్మని +ఏవ | = | స్త్రీ తన గర్భము నందే |
| బిభర్తి | = | ధరించుచున్నది. |
| పురుషే+తత్+అస్య+ ప్రథమం+జన్మ | = | పురుషుని యందు అనగా జన్మకు యిది మొదటి కారణము. |
| హ+వా | = | జీవుడు తన పూర్వ జన్మ కర్మానుసారము ఉపాధిలో ప్రవేశించును. |

పూర్వజన్మ కర్మానుసారము - జీవుడు గర్భస్థ శిశువుగా తల్లి గర్భములో ఉండును. గర్భస్థ శిశువుగా యుండుట మొదటి స్థితి.

*****

**తత్ స్త్రియా ఆత్మభూయం గచ్ఛతి. యథా స్వమంగం తథా తస్మాదేనాం న హినస్తి సా స్యైత మాత్మానమత్ర గతం భావయతి ।**

తత్ - స్త్రియాః - ఆత్మభూయం - గచ్ఛతి - యథా - స్వమ్ - అంగం - తథా - తస్మాత్ - ఏనాం - న - హినస్తి - సా - అస్య - ఏతమ్ - ఆత్మానమ్ - అత్ర - గతం - భావయతి.

| | | |
|---|---|---|
| తత్ | = | ఆ వీర్యము |
| అస్య+స్త్రియాః | = | ఈ స్త్రీలయొక్క గర్భములోనికి |
| గచ్ఛతి | = | ప్రవేశించుచున్నది |
| యథా+స్వమ్+అంగం | = | ఏ విధముగా తన శరీర అవయవములు తనతో ఏకీభూతమయి వుండునో |
| తథా | = | ఈ విధముగా వీర్యము |
| సా+ఆత్మభూయం | = | ఆమె శోణితముతో ఏకీభూతమగుచున్నది |
| తస్మాత్ | = | అందువలన ఈ వీర్యము |
| ఏనామ్ | = | గర్భము ధరించిన స్త్రీని |

న+హినస్తి = బాధించదు

ఏతం = ఈ వీర్యము పిండ రూపము ధరియించి

అత్ర+గతం = ఆమె గర్భములో ఉండి కరచరణాది అవయవములు కలిగి శిశువుగా తయారగును.

ఆత్మానం+భావయతి = ఆ శిశువును తన స్వంతముగా భావించుచున్నవి. ఆమెయొక్క గర్భములో జాగ్రత్తగా ఆ శిశువు పెంచ బడుచున్నది.

తల్లి గర్భములో ఉన్న ఆ ఉపాధిలోనికి ప్రాణము వచ్చినది. జీవుడు తన పూర్వ జన్మ కర్మానుసారము ప్రవేశించును. ఇది జీవునికి మొదటి జన్మ.

| | |
|---|---|
| 1. లోకాన్ను సృజా ఇతి - లోకముల ను సృజియింతునని ఆత్మ సంకల్పము | సంతానము పొందుదునని మానవుల సంకల్పము |
| 2. సోஉద్భ్యయ ఏవ పురుష సముద్ధృత్యా మూర్ఛయేత్ నీటినుంచి అండమును కల్పించి | వీర్యము యోనిలో పడి శుక్ల శోణిత సంపర్గమున అండముగా మారి - ఆ అండము యోనిలో గల జలములో ఉండి |
| 3. తస్మాభ్య తపత్తస్యాభి తప్తస్య ముఖం నిరభిద్యత.... శిశ్నం నిరభిద్యత-ఆ అండము నుంచి ముఖము కన్ను... శిశ్నము మొదలయిన సర్వ అవయవ ములు గలిగినవి. | |

*****

**రెండవ స్థితి - జన్మించుట**

**సా భావయిత్రీ భావయితవ్యా భవతి। తం స్త్రీ గర్భం బిభర్తి సోஉగ్ర ఏవ కుమారం జన్మనోஉగ్రేஉధి భావయతి । స యత్కుమారం జన్మనోஉగ్రేஉధి భావయత్యాత్మాన మేవ తద్భావయత్యేషాం లోకానాం సన్తత్యా ఏవం సంతతా హీమే లోకాస్త దస్య ద్వితీయం జన్మ**

సా - భావయిత్రీ - భావయితవ్యా - భవతి - తం - స్త్రీ - గర్భం - బిభర్తి - సః - అగ్రే - ఏవ - కుమారం - జన్మనః - అగ్రే - అధి - భావయతి - సః - యత్ - కుమారం- జన్మనః - అగ్రే - అధి - భావయతి - ఆత్మానమ్ - ఏవ - తత్ - భావయతి - ఏషాం - లోకానాం - సంతత్యై - ఏవం- సంతతాః - హి - ఇమే - లోకాః - తత్ - అస్య - ద్వితీయం - జన్మ

| | | |
|---|---|---|
| సా+భావయిత్రీ+స్త్రీ | = | అలా గర్భము ధరించునట్లు భావించ బడుచున్న ఆ స్త్రీ, నెల తప్పేటప్పటికి అనుమానం గలుగును . మూడవ నెల వచ్చేసరికి ఆ స్త్రీకి గర్భము వచ్చినదనే భావన గలుగును. ఆగర్భిణీ స్త్రీ |
| తం+గర్భం | = | ఆగర్భమును - ప్రసవము వఱకు |
| బిభర్తి | = | భరించుచున్నది |
| భావయితవ్యా + భవతి | = | గర్భిణీ స్త్రీగా భావింపబడదగినదియై యున్నది. అనగా అలాంటి గర్భిణీ స్త్రీని అపురూపముగా చూచుకోవలయును. |
| సః | = | ఆ గర్భస్థ శిశువు |
| అగ్రే+ ఏవ | = | గర్భములో ఉండగనే అనగా |
| జన్మనః+ అగ్రే | = | జన్మించుటకు ముందే |
| కుమారం | = | ఆ శిశువును |
| అధి + భావయతి | = | ఆమె జాగ్రత్తగా పెంచుచున్నది. |

ఈ విషయమునే మరల నొక్కి వక్కాణించుచున్నాడు.

| | | |
|---|---|---|
| యత్ | = | ఏ ఆహారమును తను తీసుకొనునో |
| తత్ | = | ఆ ఆహారమును యిచ్చుట ద్వారా |
| సః | = | ఆ గర్భస్థ శిశువు |
| జన్మనః + అగ్రే | = | జన్మించుటకు ముందు |
| కుమారం | = | ఆ శిశువును |
| అధి+భావయతి | = | పెంచుచున్నది. పిల్ల వానికి తగిన వయస్సు వచ్చు వఱకు తల్లి ఆహారము యిచ్చి పెంచును. |
| ఆత్మానమ్+ఏవ + భావయతి | = | తన రక్తమాంసములతో రూపు దిద్దుకొన్న ఆ శిశువును - తన ప్రతిరూపమని ఆ తల్లి భావించును - ఈ విధముగా |
| ఏషాం+లోకానాం | = | ఈ లోకములలో |
| సంతత్యై | = | వంశపారంపర్యం కొఱకు జరుగుచున్నది. |
| ఇమే+ లోకాః | = | ఈలోకములు |
| ఏవం | = | ఇట్లే |
| సంతతాః+హి | = | పరంపరగా యున్నవి. ఇది ప్రాణులలో జరుగు ప్రక్రియ. |
| తత్ | = | 9 నెలల తర్వాత తల్లి ప్రసవించును. అది ఆ |
| అస్య | = | గర్భస్థ శిశువు యొక్క |
| ద్వితీయం | = | రెండవ |
| జన్మ | = | జన్మ |

అలా భూలోకమునకు వచ్చి బాల్యాది అవస్థలు గతించి- యౌవనము ప్రాప్తించ సంసారియై - సంసారభారమును మోయుచూ సుఖదుఃఖములను అనుభవించుచూ... నిజకుటుంబ పారవశ్యమున ఆత్మతత్త్వము ఎఱుంగక ఉండును.

*****

## మూడవస్థితి - చనిపోయి మళ్ళీ పుట్టుట

**సోఽస్యాయమాత్మాపుణ్యేభ్యః కర్మభ్యః ప్రతిధీయతే । అథాస్యాయ మితర ఆత్మాకృతకృత్యో వయోగతః ప్రైతి స ఇతః ప్రయన్నేవ పునర్జాయతే తదస్య తృతీయం జన్మ.**

సః - అస్య - అయమ్ - ఆత్మా - పుణ్యేభ్యః - కర్మభ్యః - ప్రతిధీయతే - అథ - అస్య - అయమ్ - ఇతరః - ఆత్మా - కృతకృత్యః - వయోగతః - ప్రైతి - సః - ఇతః - ప్రయన్ - ఏవ - పునః జాయతే - తత్ - అస్య - తృతీయం - జన్మ.

| | | |
|---|---|---|
| సః | = | అలా పుట్టిన వాడు |
| అస్య+పుణ్యేభ్యః+ కర్మభ్యః +అయమ్ ఆత్మా+ప్రతిధీయతే | = | కొడుకులు, కూతుళ్ళను కని, వారి యొక్క ఆలన పాలన చూచుచు, వారి పెండ్లిడ్లు చేసి మనుమలను ఎత్తుకొని వారి మురిపములలో జీవితం గడపుచూ, ధనము, పొలాలు, సంపదలు కష్టపడి సంపాదించి, వాటిని ప్రయత్నముచే రక్షించుచూ - పుణ్యాకర్మలు ఫలితముకోరి చేయుచూ భూలోక మున జీవితం గడుపును. |
| అథ | = | ఆ తర్వాత ముసలివాడై |
| అస్య+అయమ్+ ఇతరః+ ఆత్మా+ కృతకృత్యః+వయోగతః | = | రోగముల యొక్క బాధచే బాధపడుచూ, ఇతర ఆలోచనలతో - దైవచింతన తప్ప యితర లోక వ్యవహారముల గుఱించిన ఆలోచనలతో గడుపుచూ నేను కృతకృత్యుడ నయితిని అని భావించి వయస్సు గతించి ముసలివాడై |
| ప్రైతి | = | చచ్చిపోవును. ఆత్మతత్త్వము లేశమైన ఎఱుంగక సంసారమునందలి ప్రేమతో చావ లేక ఉండగా ఇద్దఱు యమభటులు వచ్చి బలవంతంగా యీ వ్యక్తిని తీసుకొని పోవుదురు. |

| | | |
|---|---|---|
| సః+ ఇతః+ ప్రయన్ | = | అతడు యిలా చచ్చి ఈలోకము నుండి స్థూల శరీరం బూడిద అవగా సూక్ష్మశరీరముతో పైలోకము లకు - నరకమునకే - ప్రయాణించును. అక్కడ నరకభాదలు అనుభవించి |
| పునః | = | మరల అతని యొక్క పుణ్య- పాపపు కర్మలతో అనగా |
| జాయతే | = | వాడి కర్మానుసారం మానవునిగానో, కుక్క నక్క పందిగానో యీ భూలోకములో పుట్టుచున్నాడు |
| తత్ | = | అలా మళ్ళీ పుట్టటం |
| అస్య | = | ఆ జీవుని యొక్క |
| తృతీయం+జన్మ | = | మూడవ జన్మ- ఇలా సంసారి పుట్టుచూ చని పోవుచూ ఉండును |

గర్భస్థ శిశువుగా - మొదటి స్థితి. పుట్టిన తర్వాత ప్రపంచంలోనికి వచ్చి సంసార బద్ధుడగుట రెండవ స్థితి. చనిపోయి ఊర్ధ్వలోకములలో పాప పుణ్యములు అనుభవించి వాని కర్మానుసారము మళ్ళీ పుట్టుట - మూడవ స్థితి. ఇలా జనన మరణ వలయంలో చిక్కుకొని జీవుడు దరిగాన లేదు. మూఢుడైన సంసారి గుఱించి భాగవతమున ప్రహ్లాద చరిత్రలో ప్రహ్లాదుడు తోడి బాలురతో ఇట్లు చెప్పినాడు:

**సీ॥ కంటిరే మనవారు ఘనులు గృహస్థులై విఫలులై కైకొన్న వెఱ్ఱితనము**
**భద్రార్థులై యుండి పాయరు సంసార పద్ధతి నూరక పట్టువడిరి**
**కల యోనులం దెల్ల గర్భాద్యవస్థలఁ బురుషుండు దేహియై పుట్టుచుండుఁ**
**దన్నెఱుంగఁడు కర్మతంత్రుడై కడపట ముట్టఁడు భవశతములకు నయిన**

**ఆ॥ దీన శుభము లేదు దివ్యకీర్తియు లేదు**
**జగతిఁ బుట్టి పుట్టి చచ్చి చచ్చి**
**పొరలనేల మనకుఁ బుట్టని చావని**
**త్రోవ వెదకికొనుట దొడ్డ బుద్ధి**

(భాగవతము, సప్తమ స్కంధం: 214)

ఈ సంసార చక్ర పరిభ్రమణ గుఱించి తెలిసిన కొందఱు-సంసార తాపత్రయ ములను వీడి; ఆత్మ తత్త్వము అన్వేషింపదలచి; సమర్థుడయిన గురువును ఆశ్రయించి; సాధన చేసి; తన హృదయ గుహలో గల ఆత్మను దర్శించి; ఆ తర్వాత సర్వత్రా గల ఆత్మను దర్శించి; కర్మబంధములనే పంజరము నుంచి విడివడి; కర్మ బంధ రహితులై పంజరము నుంచి స్వేచ్ఛగా ఎగిరి అనగా విదేహులై ఆత్మ అగుదురు. జీవపక్షి- ఈశ్వరపక్షియై ఈ దేహము అనే పంజరము నుండి స్వేచ్ఛగా ఎగిరిపోవును. చుట్టాలు దొంగలు, సుతులు ఋణస్థులు, కాంతలు సంసార కారణములు అని గ్రహించి విరక్తుడై, ఆత్మ తత్త్వమును మఱచి యజ్ఞాన కామ్య కర్మముల తిరుగు వేదనాతురులకు, మోహ విచ్ఛేదము చేసి- ఘన సింధువు చేరెడి గంగభంగి నీ పాద సరోజ చింతనముపై అనిశంబు మదీయ బుద్ధి నత్యాదర వృత్తితో గదియునట్లుగ చేయగదయ్య ఈశ్వరా- అని కుంతీ ప్రార్థించినట్లు ప్రార్థించి, అమృతత్త్వమును పొందుదురు. అలాంటి మహానుభావులలో వామదేవుడనే ఋషి ఒకడు.

*****

ఆత్మ తత్త్వము గ్రహించిన జ్ఞాని అయిన వామదేవ ఋషి అనుభవ ప్రకటన

**తదుక్తమృషిణా**

**గర్భేను సన్నన్వేషామవేద మహం దేవానాం జనిమాని విశ్వా శతం మా పుర ఆయుసీ రరక్షన్నథః శ్యేనో జవసా నిరదీయ మితి గర్భ ఏవైతచ్ఛయానో వామదేవ ఏవమువాచ**

తత్- ఉక్తమ్- ఋషిణా

గర్భే - ను - సన్ - అను - ఏషామ్ - అవేదమ్ - అహం - దేవానాం - జనిమాని - విశ్వా - శతం - మా - పురః - ఆయుసీః - అరక్షన్ - అథః - శ్యేనః - జవసా - నిరదీయమ్ - ఇతి - గర్భః - ఏవ - ఏతత్ - శయానః - వామదేవః - ఏవమ్ - ఉవాచ.

ఋషిణా+తత్+ఉక్తమ్ = వామదేవుడనే ఋషి చేత యిట్లు చెప్పబడినది. వామదేవుడనే ఋషి స్వానుభవమును ప్రకటించు చున్నాడు.

| | | |
|---|---|---|
| అహం | = | నేను |
| గర్భే+ను+సన్ | = | గర్భములో ఉండగనే |
| విశ్వా | = | విశ్వమంతయూ వెదకి |
| ఏషాం+దేవానాం+మా+ శతం+జనిమాని | = | దేవతల యొక్కయు, నా యొక్కయు అనేక జన్మములను |
| (గర్భే) గర్భః+శయానః+ ఏవ | = | గర్భస్థుడుగా ఉండగనే |
| అను+అవేదమ్ | = | తెలుసుకొంటిని. అనగా, ఇంద్రియముల వ్యాపార మును జీవ లక్షణములను తెలుసు కొంటిని. |
| అధః | = | అలా తెలుసుకొని, తల్లి గర్భము నుండి బయటపడి సాధన చేసి హృదయగుహలో గల ఆత్మను దర్శించి సర్వత్రా ఆత్మను దర్శించి నేను |
| ఆయసీః+పురః+ అరక్షన్ | = | ఇనుపపంజరమున బంధింపబడియున్న |
| శ్యేనః | = | పావురము - ఎటులనో |
| జవసా+నిరదీయమ్+ఇతి | = | జవసత్త్వములతో ఆ పంజరము నుండి ఎగిరి పోయినట్లు - కర్మబంధములచే బంధింపబడి యున్న నేను కర్మబంధ ములను తొలగించుకొని- జీవన్ముక్తుడ నయితినని. |
| వామదేవః | = | వామదేవుడనే ఋషి |
| ఏతత్+ ఏనమ్+ఉవాచ | = | ఈ విషయమును చెప్పెను. |

పంజరము తలుపులు తెఱచియున్నా ఎగిరి పోవలయుననే సంకల్పము లేనిదే పావురము పంజరమునుంచి ఎగిరిపోదు. అలా ఎగిరి పోవలయుననే సంకల్పమునే వైరాగ్యము, విరక్తి అని అందురు. ఆపై తను దేహము కాదని, ఈశ్వరుడను అని సాధనచే గ్రహించిన జీవన్ముక్తుడగును. ఇదే అమృతత్త్వము.

*****

## బ్రహ్మత్వము పొందుట గురించి

**స ఏవం విద్వానస్మాచ్ఛరీర భేదా దూర్ధ్వ ఉత్క్రమ్యా ముష్మిన్స్వర్గే లోకే సర్వాన్కామా నాప్త్వామృతః సమ భవన్తమభవత్.**

**ద్వితీయోஉధ్యాయే- ప్రథమ ఖండః**

సః - ఏవం - విద్వాన్ - అస్మాత్ - శరీరభేదాత్ - ఊర్ధ్వః - ఉత్క్రమ్య - అముష్మిన్-స్వర్గే - లోకే - సర్వాన్ - కామాన్ - ఆప్త్వా - అమృతః - సమభవత్ - సమభవత్.

| | | |
|---|---|---|
| విద్వాన్ | = | విద్వాంసుడయిన |
| సః+సర్వాన్+కామాన్+ ఆప్త్వా | = | వామదేవుడు ఆత్మను దర్శించి సర్వ కోరికలను పొంది. |
| ఏవమ్ | = | ఈ విధముగా అమృతత్త్వమును పొందెను. |
| అస్మాత్ | = | అందువలన ఎవరయినా వామదేవుని వలె సాధన చేసిన |
| శరీర+భేదాత్+ఊర్ధ్వః+ ఉత్క్రమ్య | = | ఈ శరీరమున గల బ్రహ్మ రంధ్రమును భేదించుకొని ఊర్ధ్వమునకు పయనించి |
| అముష్మిన్+స్వర్గే+లోకే +అమృతః+సమభవత్+ సమభవత్ | = | ఆముష్మికమైన స్వర్గలోకము నందు బ్రహ్మ సమానుడై బ్రహ్మయగును బ్రహ్మ యగును. |

భాగవతము ద్వితీయ స్కంధములో బ్రహ్మరంధ్రము ఎలా భేదించుకొని బ్రహ్మ మందు కలియవలయునో వివరింపబడినది. ఈ విషయము ముందు ముందు వివరింపబడును.

*****

## తృతీయాధ్యాయః

సృష్ట్యాది యందుగల ఆత్మనా లేక హృదయ గుహలో గల ఆత్మనా ఎవరిని ఉపాసన చేయాలి? ఇది శిష్యుల ప్రశ్న.

**కో౽యమాత్మేతి వయముపాస్మహే కతరః స ఆత్మా
యేన వా పశ్యతి యేన వా శృణోతి యేన వా గన్ధానా జిఘ్రతి
యేన వా వాచం వ్యాకరోతి యేన వా స్వాదు చాస్వాదు చ విజానాతి**

కః - అయమ్ - ఆత్మా-ఇతి - వయమ్ - ఉపాస్మహే - కతరః - సః - ఆత్మా - యేన - వా - పశ్యతి - యేన - వా - శృణోతి - యేన - వా - గంధాన్ - అజిఘ్రతి- యేన - వా - వాచం - వ్యాకరోతి - యేన - వా - స్వాదు - చ - అస్వాదు - చ - విజానాతి.

| | | |
|---|---|---|
| యేన+పశ్యతి+వా | = | ఎవనిచేత ప్రేరేపింపబడి అనగా హృదయ గుహలో గల ఆత్మ ప్రకాశముచే జీవుడు చూచుచున్నాడో |
| యేన+శృణోతి+వా | = | వినుచున్నాడో |
| యేన+గన్ధాన్+ అజిఘ్రతి+వా | = | వాసన పీల్చుచున్నాడో |
| యేన+వాచం+ వ్యాకరోతి+వా | = | మాట్లాడుచున్నాడో |
| యేన+స్వాదు+చ+ అస్వాదు+చ+ విజానాతి+వా | = | ఇది మధుర పదార్థము అని యిది మధుర పదార్థము కాదని నాలుక ద్వారా రుచి చూచుచున్నాడో అనగా ఆత్మవలన జీవుడు మనసుతో గూడి జ్ఞానేంద్రియముల ద్వారా విషయములను గ్రహించి- కర్మేంద్రియముల ద్వారా పని చేయుచున్నాడో |
| అయం+ఆత్మా | = | ఈ దేహేంద్రియమనో బుద్ధులను పని చేయించు హృదయ గుహలో గల ఈ ఆత్మనా |

| | | |
|---|---|---|
| సః+ఆత్మా | = | సృష్ట్యాదియందుగల ఆత్మనా |
| కతరః | = | ఈ రెండింటిలో ఎవరిని |
| వయం | = | మేము |
| ఉపాస్మహే | = | ఉపాసించవలయును. |
| కః+ఇతి | = | ఈ సర్వమూ ఎవడు? అనగా ఈ సర్వమూ ఎవని స్వరూపము? |

ఈ రెంటిలో ఎవరిని ఉపాసించవలయును ? ఈ సృష్టి ఎవని స్వరూపం? అని శిష్యుడు రెండు ప్రశ్నలను అడిగినాడు.

ఈ ప్రశ్నలకు వాగ్రూపముగా సమాధానము చెప్పినా ప్రయోజనం లేదు. శిష్యులు గురువును చేరి గురువును సేవించి గురు సాన్నిధ్యంలో నేర్చుకొనవలయును తప్ప సాధన రహస్యములు విపులముగా గ్రంథస్థము చేయబడవు. ఈ సాధన రహస్యములను గోప్యముగా కథలద్వారా వర్ణించెదరు. వీటిని అనుభవశాలురయిన గురువుల వద్దనే గురుముఖతానే గ్రహించవలయును.

రామాయణంలో ఎవరిని ఉపాసించవలయును? ఎలా ఉపాసించవలయును? సాధన ఎలా చేయవలయును? అన్న ప్రశ్నలకు రాముని ఆచరణను వివరించినారు. బ్రహ్మాత్వము పొందుటయే సాధన ఫలితము. ఈ సాధనను రహస్యముగా చెప్పబడినది.

రాముడు---చిత్రకూటం చేరి ఋషుల సమక్షంలో ఉన్నాడు

దండకారణ్యములో విరాధుని సంహారము

జన స్థానమున - ఖర, దూషణ,త్రిశిరసుల సంహారము

కబంధుని సంహారము

కిష్కింధలో - వాలి సంహారము

లంకచేరి - రావణ సంహారము చేసినాడు.

అనగా ఈ రాక్షసులు ఎవరో గ్రహించి ఈ రాక్షసులను సాధనలో సంహరించ వలయును. సాధన పూర్తి అయినది. రామునికి బ్రహ్మదర్శనం అయినది. బ్రహ్మత్వము అనుభవంలోనికి వచ్చినది.

భాగవతంలో అనేక ఉదాహరణలు ఇవ్వబడినవి. నారదుని పూర్వ జన్మ, భీష్మ నిర్యాణము, ధృతరాష్ట్రుని దేహత్యాగము, ధర్మరాజు అతని తమ్ముల దేహత్యాగము, ధ్రువుడు, ప్రహ్లాదుడు, ఇలా అనేక అనేక కథలుగా సాధనను వివరించినారు.

**ఆ కథల సారాంశము:**

మొదట సాధకుడు, ధర్మపరుడు కావలయును. రామాయణంలో రాముడు ధర్మ పరుడు. భారతంలో యుధిష్ఠరుడు ధర్మపరుడు. ధర్మ పరుడు-జాతి ధర్మములు, ఆశ్రమ ధర్మములు పాటించ వలయును. ధర్మ మార్గముననే ధనము సంపాదించవలయును అట్టి ధనముతోనే ధర్మ పరంగా కామములను అనుభవించ వలయును ధర్మ పరుడయిన సాధకుడు మాత్రమే పుణ్య కర్మానుష్ఠానమునకు అర్హుడు. వీరలకు మాత్రమే దేవతల దర్శనమగును. రామునికి శరభంగాశ్రమ మునకు వచ్చిన ఇంద్రుని దర్శనము దూరమునుంచి గలిగినది. రామునికి సముద్రుని దర్శనము గలిగినది. గరుత్మంతుని దర్శనం, బ్రహ్మాది దేవతల దర్శనం కలిగినది. కుంతీ దేవికి సూర్యభగవానుని దర్శనం కలిగినది. సత్రాజిత్తునకు సూర్యభగవానుని దర్శనం కలిగినది. ధర్మరాజునకు సూర్యభగవానుని దర్శనం కలిగినది.

ఇట్టి పుణ్య కర్మానుష్ఠాన పరులలో ఏకొద్దిమంది మాత్రమో మోక్షమును అనగా బ్రహ్మత్వము పొందకోరుదురు. అలాబ్రహ్మత్వము పొందకోరిన వారిలో కొందఱు మాత్రమే బ్రహ్మత్వము పొందుదురు.

రామాయణంలో విశ్వామిత్రాదులు ఉదాహరణ. భాగవతంలో నారదుని పూర్వ జన్మ ఉదాహరణ అయితే హిరణ్యాక్ష, హిరణ్యకశిపుల పరంగానూ, కంసుని పరంగానూ బ్రహ్మత్వమును పొందుటకు చెప్పిన సాధన రహస్యములు సామాన్య పాఠకునికి గందరగోళముగా ఉండును. కథాపరముగా వీరలను దుర్మార్గులుగా చిత్రీకరించి సాధన రహస్యములను గోప్యముగా సాధకులకు అందచేసినారు.

అందుకే భగవద్గీతలో వేలకొలది మందిలో ఏకొందంఱుమాత్రమే సాధన చేయుదురనియు, అలా సాధన చేసిన వేలమందిలో ఏకొందఱు మాత్రమే ఆత్మ దర్శనం పొంది ఆత్మగా విరాజిల్లుదురని చెప్పబడినది.

సృష్ట్యాదియందు ఉన్న ఆత్మయే శరీరములో హృదయ గుహలో ఉన్నది. కావున ఆత్మలు రెండు కావు. ఒకటే అని గురువు శిష్యులు అడిగిన ఈ రెండింటిలో ఎవరిని ఉపాసించాలి అన్న ప్రశ్నకు సమాధానము చెప్పినాడు.

ఇప్పుడు ఈ సృష్టి అంతా ఎవని స్వరూపమో వివరించుచున్నాడు.

*****

బ్రహ్మ నుంచి సర్వసృష్టి వచ్చినది. మఱియు సృష్టిలో గల సర్వము బ్రహ్మమే అని స్వానుభవములో గ్రహించుటయే ప్రజ్ఞానం.

**యదేతద్ధృదయం మనశ్చైతత్। సంజ్ఞానమాజ్ఞానం విజ్ఞానం ప్రజ్ఞానం మేధా దృష్టిః ధృతిర్మతిర్మనీషా జూతిః స్మృతిః సంకల్పః క్రతు రసుః కామోవశ ఇతి సర్వాణ్యే వైతాని ప్రజ్ఞానస్య నామధేయాని భవన్తి।**

యత్ - ఏతత్ - హృదయం - మనః - చ - ఏతత్ - సంజ్ఞానమ్ - అజ్ఞానం - విజ్ఞానం - ప్రజ్ఞానం - మేధా - దృష్టి - ధృతిః - మతిః - మనీషా - జూతిః - స్మృతిః సంకల్పః - క్రతుః - ఆసుః - కామః - వశః - ఇతి - సర్వాణి - ఏవ - ఏతాని - ప్రజ్ఞానస్య - నామధేయాని - భవన్తి

| | | |
|---|---|---|
| మనః | = | మనస్సు |
| మతిః | = | మతి |
| ధృతిః | = | ధృతి |
| జూతిః | = | భావ స్వాతంత్ర్యము |
| సంకల్పః | = | సంకల్పము |
| క్రతుః | = | నిలకడ, స్థిరత్వము |

| | | |
|---|---|---|
| ఆసుః | = | ప్రాణము |
| కామః | = | కామము |
| మనీషా | = | ఆలోచన |
| స్మృతిః | = | స్మృతి |
| మేధా | = | మేధస్సు |
| హృదయం | = | హృదయం |
| అజ్ఞానం | = | అజ్ఞానము |
| విజ్ఞానం | = | విజ్ఞానము |
| ప్రజ్ఞానం | = | ప్రజ్ఞానము |
| సంజ్ఞానం | = | సుజ్ఞానము |
| దృష్టిః | = | చూపు |
| ఏతత్+వశః+చ | = | ఈ కోరిక, కోపం, ద్వేషం, అరిషట్ వర్గాలు |
| ఏతాని+సర్వాణి+ ప్రజ్ఞానస్య+ నామ ధేయాని+ఏవ+భవన్తి | = | ఈ సర్వమును ప్రజ్ఞానము యొక్క పేర్లే అగుచున్నవి |
| యత్+ఏతత్+ఇతి | = | ఏదైతే సృష్టి అంతా వ్యాపించియున్నదో అదే ఇది. ఈ విశ్వమంతా ఆత్మస్వరూపమే. ఆత్మస్వరూపము గానిది అణువు కూడా లేదు. |

ఈ సర్వము ఎవని స్వరూపము అని అడిగినదానికి - ఈ సర్వము ఆత్మ స్వరూపమని చెప్పినాడు.

**"..... సర్వంబును నీవ. నీవు గానిది లేశంబును లేదు...."**(భాగవతం - సప్తమ స్కంధము-88)అని హిరణ్యకశిపుడు చెప్పినాడు. రామాయణం అరణ్యకాండ-39 సర్గ -15లో సృష్టిలోగల సర్వములో స్థావర జంగమములలో ఆత్మను సాధన చేసి దర్శించిన వానిగా మారీచుని ఉదహరించినాడు.

**రామభూతమిదం సర్వ మరణ్యం ప్రతిభాతి మే...**
**రామమేవహి పశ్యామి**
**రకారా దీని నామాని రామత్రస్తస్య రావణ**
**రత్నాని చ రథాశ్చైవ త్రాసం సంజనయన్తి మే**

(రామాయణం-అరణ్యకాండ-39వ సర్గ)

అనగా స్థావర జంగమములలో రామునినే - ఆత్మ స్వరూపమునే చూచుచున్నాను. దీనితో మారీచుని సాధన పూర్తి అయినది. అతని కథ కూడా పూర్తి అయినది.

భాగవతంలో కంసుని పరంగా ఇట్లు చెప్పబడినది:

శ్రీకృష్ణుడు మధురలో ప్రవేశించినాడు. కంసుని యోగసాధన పూర్తి అయినది. ఆ ఆరూఢ స్థితిలోని యోగసాధనను వర్ణించుచూ **"తరువులెల్ల హేమ తరువులగుచు మెఱయు చుండె"** (భాగవతం-దశమస్కంధము-1300) అని చెప్పబడినది. కంసుని సాధన పూర్తి అయినది. కంసుని కథ కూడా పూర్తి అయినది.

*****

అదే ఇది. జీవుడు వేఱు - ఈశ్వరుడు వేఱు అని గాక సాధన ద్వారా సర్వము ఆత్మయే అని గ్రహించవలయును.

బ్రహ్మ పర్యంతము గలది ఆత్మయే. ఆత్మగానిది ఏదీ లేదు

**ఏష బ్రహ్మైష ఇన్ద్ర ఏష ప్రజాపతి రేతే సర్వేదేవా ఇమాని**
**చ పఞ్చ మహాభూతాని పృథివీ వాయు రాకాశ ఆపో జ్యోతీంష్యే**
**త్యేతానీమాని చ క్షుద్ర మిశ్రాణీ వ బీజానీతరాణి చేతరాణి**
**చాణ్డజాని చ జారుజాని చ స్వేదజాని చోద్భిజ్జాని చాశ్వాగావః**
**పురుషా హస్తినో యక్తించేదం ప్రాణి జంగమం చ పతత్రి చ**
**యచ్చ స్థావరం సర్వం తత్ ప్రజ్ఞా నేత్రమ్ ప్రజ్ఞానే ప్రతిష్ఠితం**
**ప్రజ్ఞానేత్రో లోకః ప్రజ్ఞా ప్రతిష్ఠా ప్రజ్ఞానం బ్రహ్మ.**

ఏషః - బ్రహ్మ - ఏషః - ఇన్ద్రః - ఏషః - ప్రజాపతిః - ఏతే - సర్వే - దేవాః - ఇమాని- చ - పఞ్చ - మహాభూతాని - పృథివీ - వాయుః - ఆకాశః - ఆపః - జ్యోతీంషి - ఇతి - ఏతాని - ఇమాని - చ - క్షుద్ర - మిశ్రాణి - ఇవ - బీజాని -

ఇతరాణి - చ - ఇతరాణి - చ - అణ్డజాని - చ - జారుజాని - స్వేదజాని - చ - ఉద్భిజాని - చ - అశ్వః (అశ్వాః) - గావః - పురుషాః - హస్తినః - యత్కించ (యత్+కిం+చ) - ఇదం - ప్రాణి - జంగమం - చ - పతత్రి - చ - యత్ - స్థావరం - సర్వం - తత్ - ప్రజ్ఞానేత్రమ్ - ప్రజ్ఞానే - ప్రతిష్ఠితం - ప్రజ్ఞానేత్రః - లోకః - ప్రజ్ఞా - ప్రతిష్ఠా - ప్రజ్ఞానం - బ్రహ్మ.

**అధి దైవికముగా - విరాట్ పురుషునిగా**

ఏషః +బ్రహ్మ+చ = ఇతడే బ్రహ్మ, విష్ణువు, శివుడు
ఏషః + ఇన్ద్రః = ఇతడే ఇంద్రుడు (ఐశ్వర్య వంతుడు)
ఏషః+ప్రజాపతి = ఇతడే ప్రజాపతి
ఏతే+సర్వే+దేవాః = ఈ సర్వదేవతలు యితడే.
మఱియు

**అధిభౌతికముగా**

ఇమాని = ఈ
పృథివీ = పృథివీ
అపః = జలము
జ్యోతీంషి = జ్యోతి (అగ్ని )
వాయుః = వాయువు
ఆకాశః = ఆకాశము
ఇతి+ఏతాని+పఞ్చ+ మహా భూతాని = అనే ఈ ఐదు పంచ మహాభూతాలు
చ = మఱియు
పురుషాః = మానవులు
గావః = ఆవులు
(అశ్వః) అశ్వాః = గుఱ్ఱములు
హస్తినః = ఏనుగులు
చ = మఱియు
ఇమాని+ క్షుద్ర+ఇవ = ఈ చిన్న చీమలు, దోమలు లాంటి జీవరాసులు

| | | |
|---|---|---|
| ఇమాని+ మిశ్రాణి | = | ఈ కంటికి కనిపించని సూక్ష్మజీవులు |
| ఇతరాణి+బీజాని | = | ఇతర జీవులు |
| అండజాని+చ | = | గ్రుడ్డునుంచి పుట్టినవి |
| జారుజాని+చ | = | గర్భము నుంచి పుట్టినవి |
| స్వేదజాని+చ | = | చెమట వలన పుట్టిన పేలు మొదలయినవి |
| ఉద్భిజాని+చ | = | భూమి నుంచి పుట్టినవి |
| పతత్రి+చ | = | గాలిలో ఎగురుచున్న పక్షులు |
| ఇతరాణి | = | నీటిలో గల చేపలు, మొసళ్ళు మొదలయినవి |
| ఇదమ్+ప్రాణి+ జంగమం+చ | = | జంగమములు అయిన ఈ ప్రాణులు |
| యత్+చ+స్థావరం | = | నిలకడగా యున్న చెట్లు, చేమలు మొదలయినవి కొండలు, పర్వతములు, నదులు, సముద్రములు, నక్షత్రములు, గ్రహములు, సూర్యచంద్రులు, మేఘములు, |
| యత్+కించ+సర్వం | = | పరమాణువు కూడ వదలకుండా యీ సృష్టి సర్వము అతడే. |
| తత్+ప్రజ్ఞానేత్రం | = | ఈ సర్వము అతనిగా దర్శించుటయే అదే జ్ఞానేత్రం. |
| ప్రజ్ఞానేత్రః+లోకః | = | ఈ పదునాలుగు లోకములు ప్రజ్ఞా నేత్రము నందు గలవు. |
| ప్రజ్ఞానే+ప్రతిష్ఠితం | = | ఈ సర్వము బ్రహ్మమందు ప్రతిష్ఠితమై యున్నవి |
| ప్రజ్ఞా+ప్రతిష్ఠా | = | ప్రజ్ఞయందు ప్రతిష్ఠితమై యున్నవి. కావున |
| ప్రజ్ఞానం+బ్రహ్మ | = | ప్రజ్ఞానమే బ్రహ్మ. తను మఱియు - ఈ సర్వము ఆత్మ అని గ్రహించుటయే ప్రజ్ఞానం. |

అధిభౌతికమయిన ఉపాధిలో అంతర్యామిగా జీవరూపమున, హృదయగుహలో ఆత్మగా ఉండును. ఉపాధి - జీవాత్మ - ఆత్మల కలయికయే ఈ సర్వము. ఇందు " నేతినేతి"అని విచారణ ద్వారా ఆత్మను గ్రహించుటయే ప్రజ్ఞానం.

*****

**అమృతత్త్వమును పొందును**

**స ఏతేన ప్రజ్ఞేనాత్మనాస్మాల్లోకాదుత్క్రమ్యా ముష్మిన్ స్వర్గే**
**లోకే సర్వాన్ కామానాప్త్వామృతః సమభవదమృతః సమభవత్**

**(తృతీయోఽ ధ్యాయే ప్రథమఃఖండః) తృతీయాధ్యాయము సమాప్తము**

సః - ఏతేన - ప్రజ్ఞేన - ఆత్మనా - అస్మాత్ - లోకాత్ - ఉత్క్రమ్య - అముష్మిన్-స్వర్గే - లోకే - సర్వాన్ - కామాన్ - ఆప్త్వా - అమృతః - సమభవత్ - సమభవత్

| | | |
|---|---|---|
| సః | = | ప్రజ్ఞానం బ్రహ్మయని తెలిసినవాడు అనగా సర్వత్రా ఆత్మను దర్శించినవాడు |
| సర్వాన్+కామాన్ | = | సమస్త కోరికలు |
| ఆప్త్వా | = | పొంది |
| ఏతేన+ప్రజ్ఞేన | = | ఈ ప్రజ్ఞచేత అనగా ఆత్మదర్శనము చేత |
| ఆత్మనా | = | తను |
| అస్మాత్+లోకాత్ | = | ఈ పుణ్యలోకములను |
| ఉత్క్రమ్య | = | దాటి |
| ఆముష్మిన్+స్వర్గే+లోకే | = | పునరావృత్తి రహితమయిన బ్రహ్మలోకములో |
| అమృతః | = | అమృతత్త్వమును |
| సమభవత్ | = | పొందును |
| సమభవత్ | = | బ్రహ్మయై విరాజిల్లును |

*****

**శాంతి పాఠము**

**ఓం వాక్ మే మనసి ప్రతిష్ఠితామనో మే వాచి ప్రతిష్ఠిత మావిరావీర్మ ఏధి। వేదస్య మ అణీస్థః శృతం మే మా ప్రహాసీ రనేనాధీతే నాహోరాత్రాన్ సన్దధామి। ఋతం వదిష్యామి సత్యం వదిష్యామి। తన్మామవతు తద్వక్తారమవతు। అవతు మామవతు వక్తారమవతు వక్తారమ్।**

**ఓం శాంతిః శాంతిఃశాంతిః**

*****

సర్వము ఆత్మస్వరూపమే. సర్వమును ఆత్మగా దర్శించువాడు అమృతుడగును అని ఈ ఉపనిషత్తును ముగించినాడు. సర్వము ఆత్మస్వరూపము అన్న మాటను సరిగా అర్థము చేసుకొనవలయును.

| | | |
|---|---|---|
| పాల నుంచి | - | పెరుగు వచ్చినది. |
| పెరుగు నుంచి | - | వెన్న వచ్చినది. |
| వెన్న నుంచి | - | నెయ్యి వచ్చినది. |

ఈ పాలు,పెరుగు, వెన్న, నెయ్యిల స్వభావములు ఒకటిగావు. భిన్నములు అయినను యివి అన్నియు పాల నుంచి వచ్చినవే. పాల స్వరూపములే.

సృష్ట్యాదియందు ఆత్మ ఒక్కడే గలడు. ఇలా ఏకత్వమును ప్రతిపాదించినాడు. ఆ **ఆత్మ** ఉపాధిని నిర్మించుకొని **పురుషుడైనది.** ఇతడే ఈశ్వరుడని పేర్కొనబడినాడు. ఈశ్వరుడు ప్రకృతిని అధిష్ఠించి ఆ ప్రకృతితో కూడినాడు. ఇతనిని **విరాట్ పురుషుడని** అందురు. ఇతడు బ్రహ్మాండమును సృజియించెను. అనగా సర్వజీవరాసుల శరీరములను సృజియించెను.

| | | |
|---|---|---|
| ఈ విరాట్ పురుషుడు | - | లోకములను సృజియించెను. |
| | - | లోక పాలురను సృజియించెను |
| | - | సర్వజీవరాసులను సృజియించెను |

దేవతలు మానవ శరీరము బాగున్నదని ఈశ్వరాజ్ఞచే ఆ మానవ శరీరములో ప్రవేశించిరి. ప్రాణమువలన జీవునికి ఆకలిదప్పికలు గలిగినవి. వాటి కొఱకు అన్నమును సృజియించెను.

ప్రకృతి ఒక్కటే అయినను ఉపాధులలో భిన్నత్వము గోచరించుచున్నది. అనగా ఏనుగు శరీరము ఒకలాగా చీమ శరీరము ఒకలాగా పాము శరీరము ఒకలాగా పక్షిశరీరము ఒకలాగా మానవుని శరీరము ఒకలాగా ఇలా అనేక భేదములతో శరీరములు కనబడుచున్నవి. ఆ విధముగానే స్థావరములలో కూడా భేదము కనబడుచున్నవి.

ఈ విధముగా సృష్టిలో ఉపాధులలో భిన్నత్వము కనబడుచున్నవి. ఒకే ఈశ్వరుడు జీవునిగా రూపాంతరము చెంది ఉపాధి భేదాలననుసరించి, గుణముననుసరించి, కర్మననుసరించి జీవులలో భిన్నత్వముగా గోచరించుచున్నాడు. ఏనుగు శరీరములో ఉన్న జీవుని లక్షణములు ఆహారపు అలవాటులు ఏనుగుచేయు పనులు వేఱు. చీమ శరీరములో ఉన్న జీవుని లక్షణములు ఆహారపు అలవాటులు అది చేయు పనులు వేఱు.అలాగే మానవ శరీరములో ఉన్న జీవుని లక్షణములు ఆహారపు అలవాటులు పనులు వేఱు.

ఇలా ప్రతి జీవి అది ఉన్న ఉపాధిని బట్టి గుణము బట్టి కర్మల వలన జీవులలో భిన్నత్వము గోచరించుచున్నది.ఈ విధముగా ఉపాధులలో భిన్నత్వము జీవులలో భిన్నత్వము గలిగి సృష్టి ఉన్నది. సృష్టి త్రిగుణాత్మకము.

ఈ పరిస్థితులలో ఏనుగు యందు- కుక్క యందు-బ్రాహ్మణుని యందు-చండాలుని యందు సమదృష్టి గలిగి ఉండుట ఎట్లు పొసగును? అందఱియందు సమదృష్టి ఉన్నచో రామునికి-రావణునికి భేదముండదు గదా? శ్రీకృష్ణుడు - ధర్మరాజుయందు దుర్యోధనునియందు సమదృష్టి గలిగి ఉన్నాడా? కాళీయుని యందు గోప కాంతలయందు సమదృష్టి గలిగి అందఱినీ సమంగా కౌగిలించు కున్నాడా ? సమదృష్టి గలవాడు పండితుడు అని సమ దృష్టి అనే పేరుతో పసిపిల్ల వానిని ప్రక్కలో పడుకోపెట్టుకున్నట్లు పాముని ప్రక్కలో పడుకోపెట్టుకుంటే అది ప్రజ్ఞానమా? లేక వివేక విహీనతా? ఈ విధముగా అనేక ప్రశ్నలు వేసుకొని సమదృష్టి భేదదృష్టుల గుఱించి, సర్వము ఆత్మయే అనియు, కాదనియు ఈ వాదములకు వ్యాసభగవానుడు భాగవతము సప్తమస్కంధములో వివరముగా వివరించినాడు. ఆ సందర్భమున స్థావరమయిన స్తంభంబు - ఆత్మ కాదు కాని **"హరి సర్వాకృతులం గలండు"** - (భాగవతం- సప్తమస్కంధం 277) అనగా స్థావరజంగములలో ఆత్మ అంతర్యామిగా ఉండును అని ప్రహ్లాదునిచే చెప్పించినాడు. అనగా భిన్నత్వము ఉపాధులలోనూ జీవులలోనూ గలదు. అంతర్యామిగా ఏకత్వము గలదు. కావున ఉపాధులను, జీవులను గాక, ఆత్మను దర్శించుటయే ప్రజ్ఞానం. ఇలా దర్శించుటకు

సాధన ఒకటే మార్గము. **"యెందాక జీవుండు స్వతంత్రుండయిన యీశ్వరుండు గాకుండు నంత తడవు నంగన యిది పురుషుండనేననియెడి బుద్ధి మానుట కర్తవ్యంబు గాదు. బ్రహ్మచారి యతి గృహస్థులందెవ్వ డైన జిత్తంబు పరిపక్వంబు గాక యద్వైతాను సంధానంబు సేసిన మూఢుండగు"**

(భాగవతం - సప్తమస్కంధము - 423)

సారాంశమేమనగా జీవుడు సాధన చేసి జీవత్వమును నశింప చేసుకొని ఈశ్వరుడు గావలయును. ఇతడు పండితుడు. ఈశ్వరత్వమును పొందుటయే ప్రజ్ఞానం. ఈ స్థితిలో తరువులన్నీ హేమ తరువులుగా కనిపించును. దృశ్యము - దృక్- ద్రష్టలలో దృశ్యము నశియించి కేవలం ద్రష్టఒక్కడే మిగులును. ఇతనికి సర్వము ఆత్మ స్వరూపముగా గోచరించును. జీవత్వము నశించి ఈశ్వరత్వము పొందుట వలన అమృతత్త్వమును పొందును అని ఈ ఉపనిషత్తును ముగించినాడు. **ఈ ఉపనిషత్‌లో సాధనను వివరించలేదు.** ఈ సాధనను గురుముఖతానే నేర్చుకొనవలయును. అయితే ఈ గురువులు వాగ్రూపమున బోధించరు. తాము ఆచరించుచూ అర్హులయిన శిష్యులకు ఆచరణ విధానమును చెప్పుదురు. ముందు అర్హత సంపాదించిన అట్టి అర్హుల వద్దకు గురువులు స్వయముగా వత్తురు. లేదా అర్హత సంపాదించి గురువులను ఆశ్రయించవలయును.

*****

# సామవేదము

**అగ్న ఆ యాహి వీతయే గృణానో హవ్యదాతయే ని హోతా సత్సి బర్హిషి ।**

(ఆగ్నేయం ఖండమ్, ప్రథమోఽధ్యాయః-1)

| | | |
|---|---|---|
| హోతా | = | యజ్ఞములో ఋత్విక్కువు అయిన |
| అగ్న (అగ్నే) | = | ఓ అగ్ని దేవా (ఓ పరబ్రహ్మ) |
| వీతయే | = | హవిస్సును స్వీకరించుటకు |
| హవ్యదాతయే | = | దేవతలకు హవిర్భాగములు అందించుటకు |
| గృణానః | = | మా స్తుతిని గైకొనుటకు |
| ఆయాహి | = | రమ్ము |
| బర్హిషి | = | దర్భాసనముపై |
| ని సత్సి | = | సుఖముగా ఆసీనుడవు కమ్ము |

## శాంతి పాఠము

**హరిః ఓం. ఓం ఆప్యాయన్తు మమాంగాని వాక్ప్రాణ శ్చక్షుః శ్రోత్ర మథోబలమింద్రియాణి చ సర్వాణి సర్వం బ్రహ్మోపనిషదం మాహం బ్రహ్మ నిరాకుర్యాం మా మా బ్రహ్మ నిరాకరోద నిరాకరణ మస్త్వ నిరాకరణంమేఽస్తు తదాత్మని నిరతే ఉపనిషత్సు ధర్మాస్తే మయి సన్తు తే మయి సన్తు.**

**ఓం శాంతిః శాంతిః శాంతిః**

ఆప్యాయంతు - మమ - అంగాని - వాక్ - ప్రాణః - చక్షుః - శ్రోత్రమ్- అథః- బలమ్ - ఇంద్రియాణి -చ - సర్వాణి - సర్వం - బ్రహ్మ - ఔపనిషదం - (మ) మే - అహం - బ్రహ్మ - నిరాకుర్యామ్ - మా - మా - బ్రహ్మ - నిరాకరోత్ - అనిరాకరణమ్ - అస్తు - అనిరాకరణమ్ - అస్తు - తదా - ఆత్మని - నిరతే - య (యే) - ఉపనిషత్సు - ధర్మాః - తే - మయి - సంతు - తే - మయి - సంతు.

| | | |
|---|---|---|
| మమ | = | నాయొక్క |
| వాక్ | = | వాక్కు (కర్మేంద్రియములు) |
| శ్రోత్రమ్ | = | చెవి |
| చక్షుః | = | కన్ను అనగా జ్ఞానేంద్రియములు |
| చ | = | మనస్సు |
| సర్వాణి+ఇంద్రియాణి | = | సర్వ జ్ఞానేంద్రియ కర్మేంద్రియములు |
| అంగాని | = | శరీరములోని సర్వ అంగములు |
| అథః | = | ఆ తర్వాత |
| ప్రాణః | = | ప్రాణము |
| బలమ్ | = | శక్తిని కలిగి బలవంతములగు గాక |
| సర్వమ్ | = | ఈ దృశ్యమాన జగత్ సర్వము |

| | | |
|---|---|---|
| ఔపనిషదం | = | ఉపనిషత్‌లో చెప్పబడిన |
| బ్రహ్మ | = | ఆత్మ స్వరూపమే |
| అహం | = | నేను |
| బ్రహ్మ | = | బ్రహ్మమును |
| మా+నిరాకుర్యాం | = | నిరాకరింపకుందునుగాక |
| బ్రహ్మ | = | బ్రహ్మము నన్ను |
| మా+నిరాకరోత్ | = | నిరాకరింపక ఉండుగాక |
| అనిరాకరణమ్+అస్తు | = | ఆ విధముగా మేము ఒకరి నొకరు నిరాకరింపకుండ ఉందుము గాక |
| మే | = | నా కొఱకు అనగా నన్ను బ్రహ్మ |
| అనిరాకరణం+అస్తు | = | నిరాకరింపకుండును గాక |
| ఉపనిషత్సు | = | ఉపనిషత్తుల యందు |
| య (యే) | = | ఏ ఏ |
| ధర్మాః | = | ధర్మములు కలవో |
| తే | = | ఆ ధర్మములు |
| ఆత్మని | = | నా యందు |
| నిరతే | = | ఉండుగాక |
| మయి+సంతు | = | నాయందు ఉండుగాక |
| తే+మయి+సంతు | = | ఆ ధర్మములు నా యందు ఉండుగాక |
| తదా | = | అప్పుడు ధర్మపరుడను అగుట వలన బ్రహ్మవిద్యకు యోగ్యుడను అయ్యెదను గాక. |
| ఆప్యాయంతు | = | బ్రహ్మను చేరుకొందును గాక. |

*****

## ప్రథమ ఖండము

ఈశ్వరుడు ప్రకృతిని అధిష్ఠించి దేహమును నిర్మించెను. ఈ దేహములో పూర్వ జన్మ కర్మానుసారము జీవుడు ప్రవేశించినాడు. తనులేకుండా ఈ దేహము ఎట్లు పని చేయునని ఆత్మ బ్రహ్మ రంధ్రముద్వారా దేహములోనికి ప్రవేశించినాడు. హృదయగుహలో ఉన్నాడు. ఈ ఆత్మ అమరుడు. హృదయగుహలోగల **అమరనాథుని** దర్శించిన జీవుడు ఈశ్వరుడగును. ఇదే ఆచారకాండలో అమరనాథయాత్రగా చెప్పబడుచున్నది.

ఈ దేహము - నోరు, చేతులు, పాదము, గుదము, గుహ్యము అనే పంచ కర్మేంద్రియములు; చెవులు, చర్మము, కన్నులు, నాలుక, ముక్కు అనే పంచ జ్ఞానేంద్రియములు; మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము అనే అంతఃకరణ చతుష్టయములు; ప్రాణము, అపానము, సమానము, వ్యానము, ఉదానము అనే పంచప్రాణములు మొత్తం 19 యింటి సమ్మేళనము.

దేహము, జీవుడు, హృదయగుహలోగల ఆత్మ అనే ఈ మూడింటి సమిష్టియే ప్రాణి. దేహము, జీవుడు, హృదయగుహలోగల ఆత్మలగుఱించి విచారణ చేయు చున్నాడు.

శవములో కర్మేంద్రియములు, జ్ఞానేంద్రియములున్ననూ అవి పనిచేయవు. ప్రాణమున్న ప్రాణిలోనే ఇంద్రియములు పనిచేయుచున్నవి. కావున దేహము జడమని తెలిసినది. ఈదేహము పనిచేయుటకు కారణములు అన్వేషించుచున్నారు. ప్రాణము వలన ఈ శరీరము పనిచేయుచున్నదని అనుభవమున గ్రహించినారు. ప్రాణము వలన ఇంద్రియములు, అంతఃకరణ చతుష్టయము పనిచేయుచున్నవి అని తెలిసినది. ప్రాణము వలన మనసు పని చేసిననూ ప్రాణులందఱి మనసు ఒకలాగ పని చేయుట లేదు. ఒకరిది మంచి మనసు, ఒకరిది దుష్ట మనసు. ఇలా భిన్నత్వము ఏల గోచరించుచున్నది? కేవలము ప్రాణము వలననే మనసు పనిచేసిన అందఱి మనసు ఒకలాగ పని చేయవలయును. కావున ప్రాణము మఱియు ఇంకొకటి ఏదో మనసును పనిచేయించు చున్నది. ఆ ఇంకొకటి వలననే కొందఱిది మంచి మనసు - మరి కొందఱిది దుష్ట మనసుగా ఉన్నది. కావున ఆ ఇంకొకటి ఏది?

వయస్సుతో నిమిత్తములేకుండా దేహము నుండి ప్రాణము వెడలి పోవుచున్నది. ఎవరి ఆజ్ఞను అనుసరించి ప్రాణము ఈ దేహములోనికి వచ్చుచున్నది?ఎవరి ఆజ్ఞవలన ప్రాణము ఈ దేహము వదలి వెడలి పోవుచున్నది?

ఈ దేహము, ఇంద్రియములు పనిచేయు విధి విధానమును గమనించినాడు. మనము మంచిమాటలను మాట్లాడవలయునని సంకల్పించిన మధురవాక్కు మననోటినుంచి వచ్చుచున్నది. చెడుమాటలు మాట్లాడవలయునని సంకల్పించిన దుర్భాషలు మననోటినుంచి వచ్చుచున్నవి. మనము మాట్లాడవద్దని చెప్పిన, నోరు మాట్లాడకుండా మౌనంగా ఉండును. మనము మంచిపనులు చేయవలయునని సంకల్పించిన మనచేతులు మంచిపనులుచేయుచున్నవి. చెడ్డపనులు చేయవలయు నని సంకల్పించిన చెడ్డపనులు చేయుచున్నవి. ఏపని చేయవద్దని సంకల్పించినచో చేతులు ఏపని చేయుట లేదు. మనము మంచి ప్రదేశమునకు వెళ్ళవలయునని సంకల్పించిన మన కాళ్ళు మంచిప్రదేశమునకు వెళ్ళుచున్నవి. చెడుప్రదేశమునకు వెళ్ళవలయునని సంకల్పించిన చెడుప్రదేశమునకు వెళ్ళుచున్నవి. ఎక్కడకు వెళ్ళవద్దని చెప్పిన పాదములు ఎక్కడకు వెళ్ళుటలేదు. గుహ్యము ధర్మబద్ధమయిన సంభోగమును, అధర్మయుత మయిన సంభోగమును మన సంకల్పానుసారము చేయుచున్నది. బ్రహ్మచర్యము పాటించవలయునని చెప్పిన మన మాట విని అది ఆవిధముగానే పనిచేయుచున్నది. మలమూత్రములు మన ఇచ్ఛానుసారము జరిగిననూ, కాలకృత్యములు జరపవద్దని చెప్పిననూ గుదము మనమాట వినక మలమూత్రవిసర్జన చేయుచున్నది.

అటులనే శబ్దమును వినవద్దని చెప్పిననూ మనమాట వినకుండా చెవులు శబ్దమును గ్రహించుచున్నవి. అటులనే జ్ఞానేంద్రియములు సహజముగా మన మాట వినకుండా వాటి వాటి ఇంద్రియార్థములపై ప్రసరించుచున్నవి. మనస్సు కొన్నిసార్లు మన మాట వినుచున్నది. కొన్నిసార్లు మన మాట వినుటలేదు. ప్రాణము కొన్నిసార్లు మన మాట వినుచున్నది. కొన్నిసార్లు వినుటలేదు. ఇలా ఆలోచించిన దేహము, ఇంద్రియములు, మనస్సు, ప్రాణములు కొన్ని కొన్నిసార్లు మన మాట వినుచున్నవి. కొన్నిసార్లు వినుటలేదు.

దేహములోగల 19 అవయవములపై మనము పూర్తి ఆధిపత్యమును సంపాదించుటను సామ్రాజ్యపట్టాభిషేకము అని అందురు. జీవుడు ఈశ్వరుడయిన, ఈ 19 అంగములపై పూర్తి ఆధిపత్యము గలుగును. కావున జీవుడు ఈశ్వరుడగుటయే సామ్రాజ్యపట్టాభిషేకము. ఈ 19 అంగములపై పూర్తి ఆధిపత్యము గలుగు సాధనను సామ్రాజ్యపట్టాభిషిక్తుడగు విధివిధానమును రామాయణము వివరించినది. రాముడు దేహసామ్రాజ్యములోని శత్రువులయిన విరాధుని, ఖరదూషణాదులను, కబంధుని, వాలిని, రాక్షసులను, రావణుని, సంహరించి సామ్రాజ్యపట్టాభిషిక్తుడైనాడు. సామ్రాజ్య పట్టాభిషేకముతో రామకథను నారదమహర్షి, వాల్మీకికి చెప్పి ముగించినాడు. భారతములో ధర్మరాజు కౌరవులను పూర్తిగా నిర్మూలించి సామ్రాజ్య పట్టాభిషిక్తుడైనాడు. కౌరవ సంహారముగుటించి, భీష్ముని, ద్రోణుని, కర్ణుని, మిగిలిన వారిని ఎలా సంహరించవలయునో వివరించినది భారతము. భారతములో సామ్రాజ్య పట్టాభిషిక్త విధి విధానము వర్ణింపబడినది.

అరిషట్వర్గములవలన దారితప్పిన పరీక్షిత్తుని (జీవుని) సప్తఅహములలో మోక్షప్రాప్తిని లేదా ఆత్మయగు విధివిధానమును వివరించినది భాగవతము.

దేహ సామ్రాజ్యముపై పూర్తి ఆధిపత్యము గలది ఆత్మ. దీనినే కథాపరంగా చక్రవర్తి అందురు. దేహ సామ్రాజ్యముపై కొంత ఆధిపత్యము గలవాడు జీవుడు. దీనిని కథాపరంగా యువరాజు అని అందురు. ప్రేషితము అనగా మన సంకల్పము ఉన్నా లేక పోయినా ఎవరి ఆజ్ఞకో లోబడి పనిచేయుట ప్రేషితముగా అర్థము చేసికొనవలయును. మన సంకల్పానుసారము దేహేంద్రియ మనో బుద్ధులు పనిచేయుటను ఇషితంగా అర్థముచేసుకొనవలయును.

*****

# దేహవిచారణ

ఆత్మ గురించి మాకు చెప్పండి
ఈ దేహము, ఇందున్న మనస్సు - ప్రాణము. జ్ఞానేంద్రియములు,
కర్మేంద్రియములు ఎవని వలన పనిచేయుచున్నవి.
ఇది శిష్యుని ప్రశ్న

1. **కేనేషితం పతతి ప్రేషితం మనః**
   **కేన ప్రాణః ప్రథమః ప్రైతి యుక్తః**
   **కేనేషితాం వాచమిమాం వదన్తి**
   **చక్షుః శ్రోత్రం క ఉ దేవో యునక్తి**

కేన - ఇషితం - పతతి - ప్రేషితం - మనః - కేన - ప్రాణః - ప్రథమః - ప్రైతి- యుక్తః - కేన - ఇషితాం - వాచమ్ - ఇమాం - వదన్తి - చక్షుః - శ్రోత్రం - కః - ఉ- దేవః - యునక్తి

ఈ దేహములో గల జ్ఞానేంద్రియ, కర్మేంద్రియములు, ప్రాణము, మనస్సులలో మనము సంకల్పించితే పనిచేసేవి కొన్ని, మనము సంకల్పించక పోయినా, కొన్ని వాటిని మనము గాక ఎవరో నియమించినట్లు ఆ నియామకుని మాట వినుచున్నవి. కావున ఆ నియామకుడు ఎవడు? మనమెవరము? నియామకునికి మనకు సంబంధం ఏమిటి?

| | | |
|---|---|---|
| కేన | = | ఎవరి చేత |
| మనః | = | మనస్సు |
| ఇషితం | = | సంకల్పించబడి |
| ప్రేషితం | = | నియోగింపబడి |
| పతతి | = | కోరికల వైపు వెళ్ళుచున్నది? (కొన్ని సార్లు చెడు కోరికలు కోరవద్దని చెప్పినా మనస్సు మన మాట వినక, అటు యిటూ తిరుగు చున్నది). |
| కేన+యుక్తః | = | ఎవరి చేత నియోగింపబడి |
| ప్రథమః+ప్రాణః | = | దేహ వ్యాపారమునకు ముఖ్యమైన ప్రాణము |

| | | |
|---|---|---|
| ప్రైతి | = | దేహము నుండి వెడలుచున్నది ? (మనము ప్రాణమును యీ దేహమువదలి వెళ్ళవద్దని సంకల్పించినా, అది మనమాట వినక, ఎవరి మాటనో పాటించి దేహము నుండి వెడలుచున్నది). |
| ఇమామ్+వాచమ్ | = | ఈ వాక్కు |
| కేన+ఇషితాం | = | ఎవరి చేత సంకల్పించబడి |
| వదన్తి | = | మాటలాడుచున్నది? అటులనే మిగిలిన కర్మేంద్రియ ములగు పాదములు, చేతులు, గుహ్యము, గుదము ఎవరిచేత సంకల్పించబడి వాటివాటి పనులు చేయుచున్నవి. |
| చక్షుః | = | కన్ను ఎవరిచే సంకల్పింప బడి పనిచేయు చున్నది? |
| శ్రోత్రం | = | చెవి ఎవరిచే నియోగింపబడి పనిచేయు చున్నది? |

మనము ఆ శబ్దాన్ని వినవద్దని చెప్పినా- మన మాట వినక- అది శబ్దాన్ని గ్రహించు చున్నది. ఆ విధముగనే ముక్కు, చెడు గాలి పీల్చవద్దని మనము చెప్పినా అది మన మాట వినక చెడు గాలిని పీల్చుచున్నది.

ఆ విధముగనే ఎవరిచే సంకల్పించబడి మిగిలిన జ్ఞానేంద్రియములగు నాలుక, చర్మము పనిచేయుచున్నవి. ఈ శరీరములో గల కొన్ని యింద్రియములు, ప్రాణము, మనస్సు అన్నీ ఎవరిచేతనో నియోగింప బడినట్లు పనిచేయుచున్నవి.

| | | |
|---|---|---|
| కః+ఉ+దేవః | = | చక్రవర్తి తన ఉద్యోగులను నియమించునట్లు ఏ దేవుడు |
| యునక్తి | = | వీటిని నియమించుచున్నాడు? |

(చక్రవర్తి తన రాజ ప్రాసాదంలో కూర్చొని ఆజ్ఞలను జారీ చేసి వాటిని తన ఉద్యోగస్థులచే అమలు పఱచునట్లు పనిచేయించుచున్నాడా లేక ఉద్యోగస్థులతో కూడి పనిచేయించుచున్నాడా?

ఆత్మ దేహమును సృజియించినది. ఆత్మ దేహములో ఆత్మగానూ, జీవాత్మగానూ ఉంటున్నది. ఆత్మను చక్రవర్తిగా భావించితే జీవాత్మ యువరాజు.

ఈ దేహమనే సామ్రాజ్యముపై యువరాజు అనే జీవాత్మ స్వతంత్రముగా గాక ఆత్మ అనే చక్రవర్తికి లోబడిపని చేయును.

ఈ దేహమునకు 19 ముఖములు. 5 జ్ఞానేంద్రియములు, 5 కర్మేంద్రియములు, 5 ప్రాణములు, అంతఃకరణచతుష్టయములు 4. కావున 19లో నుంచి 5 ప్రాణములు పోగా మిగిలినవి 14. ఈ 14పై జీవాత్మకు స్వతంత్రముగా పనిచేసే అధికారము లేకపోయినా ఆత్మకు ప్రతినిధులయిన 5 ప్రాణముల సాయమున ఇంద్రియాదులను పాలించును.

రామపాదుకలనగా ప్రాణము. మంత్రులనగా ఇంద్రియములు, భరతుడు జీవాత్మ. దేహపాలనయే రాజ్యపాలన. దీనినే రామాయణం కథగా వివరించినది. రాముని పాదుకలను సింహాసనముపై ఉంచి- మంత్రుల సాయంతో- భరతుడు 14 సంవత్సరములు పరిపాలించెను.

కేన ప్రేషితం? అనగా సమిష్టిలో ఈ విశ్వము ఎవని ఆజ్ఞానుసారము వర్తించు చున్నది? అనగా విశ్వ నియంత ఎవరు? అటులనే వ్యష్టిలో ఈ దేహము ఎవని ఆజ్ఞననుసరించి పనిచేయుచున్నది. కేన ఇషితం? అనగా ఎవని సంకల్పానుసారము ఈ దేహేంద్రియ మనో బుద్ధులు పనిచేయుచున్నవి అని శిష్యులు వినయముగా గురువును అడిగిరి. అంత గురువు ఈ ప్రశ్నలకు సమాధానముతో పాటు మరికొన్ని అనుబంధ ప్రశ్నలు వేసుకొని వాటికి కూడా సమాధానము చెప్పినాడు.

*****

ఆత్మ - ఈశ్వరుడు- విరాట్ పురుషుల గుఱించి గతంలో వివరింపబడినవి. ప్రకృతి వలన మానవ దేహము నిర్మింపబడినది. విరాట్ పురుషుని దేహము నుండి దేవతలు సృజియింపబడిరి. ఆ దేవతలు మానవుని శరీరములో ప్రవేశించిరి అని గతంలో చదువుకున్నాము. ఆ దేవతలు మానవుని ఇంద్రియాదులలో ప్రవేశించుట వలన ఇంద్రియాదులకు ఆ ఆ ఇంద్రియార్థములు గలిగినవి.

ఆత్మ వలన ఈ దేహేంద్రియ మనోబుద్ధులు పని చేయుచున్నవి.

**విరాట్ పురుషుని**

హృదయము నుండి మనస్సు - మనస్సు నుండి చంద్రుడు వచ్చినాడు. అలా వచ్చిన చంద్రుడు దేహములో మనస్సుగా మారి హృదయములో ప్రవేశించినాడు.

ముక్కు నుండి ప్రాణము -దాని నుండి వాయువు వచ్చినాడు. అలా వచ్చిన వాయువు- మానవ దేహములోప్రాణంగా మారి ముక్కులో ప్రవేశించినాడు.

ముఖము నుండి వాక్కు - వాక్కు నుండి అగ్ని వచ్చినది. అలా వచ్చిన అగ్ని వాక్కుగా మారి ముఖములో ప్రవేశించినాడు.

కన్ను నుండి దృష్టి- దానినుండి ఆదిత్యుడు వచ్చినాడు. అలా వచ్చిన ఆదిత్యుడు దృష్టిగా మారి కన్నులలో ప్రవేశించినాడు.

చెవుల నుండి శబ్దము దాని నుండి దిశలు వచ్చినవి. అలా వచ్చిన దిశలు శబ్దముగా మారి చెవుల యందు ప్రవేశించినారు.

అనగా విరాట్ పురుషుని నుండి ఇంద్రియార్థములు- వాటి నుంచి వచ్చిన దేవతలు మానవ శరీరములో ప్రవేశించినవి. ఆ ఆ ఇంద్రియములు ఆఆ పనులను చేయుచున్నవి.

| | |
|---|---|
| మన మనస్సుకు ఆధారము | విరాట్ పురుషుని మనస్సు |
| మన ప్రాణమునకు ఆధారము | విరాట్ పురుషుని ప్రాణము |
| మన వాక్కుకు ఆధారము | విరాట్ పురుషుని వాక్కు |
| మన కన్నుకు ఆధారము | విరాట్ పురుషుని కన్ను |
| మన చెవికి ఆధారము | విరాట్ పురుషుని చెవి అని చెప్పినాడు. |

మనస్సు పూర్వ జన్మ కర్మానుసారము సంకల్పించుచున్నది. ముక్కుద్వారా ప్రాణమును పీల్చుచున్నాము. నోటి ద్వారా మాటలాడుచున్నాము. కన్నులవలన చూచుచున్నాము. చెవి వలన శబ్దము వినుచున్నాము. విరాట్ పురుషుని నుండి వచ్చిన దేవతలు మన శరీరములో ప్రవేశించడం వలన ఒక్కొక్క ఇంద్రియము

ఒక్కొక్క పని చేయుచున్నది. ఈ సర్వ వ్యాపారములను ఆత్మ చక్రవర్తివలె జీవాత్మ యువరాజువలె నడిపించును. కావున సాధనద్వారా - మొదట హృదయగుహలో గల ఆత్మనుదర్శించి జీవన్ముక్తుడై దేహత్యాగానంతరము బ్రహ్మయై అమృతు లగుదురు. శిష్యులయొక్క దేహవిచారణకు సమాధానము చెప్పి అంతిమ లక్ష్యమును గురువు వివరించినాడు.

*****

**ఆత్మ వలన పనిచేయును**
**ఆత్మను దర్శించిన అమృతత్త్వము గలుగును**

**2.** **శ్రోత్రస్య శ్రోత్రం మనసో మనో యత్**
**వాచో హ వాచం స ఉ ప్రాణస్య ప్రాణః**
**చక్షుష శ్చక్షు రతిముచ్య ధీరాః**
**ప్రేత్యాస్మా ల్లోకా దమృతా భవన్తి**

శ్రోత్రస్య - శ్రోత్రం - మనసః - మనః - యత్ - వాచః - హ - వాచం - సః - ఉ - ప్రాణస్య - ప్రాణః - చక్షుషః - చక్షుః - అతిముచ్య - ధీరాః ప్రేత్య - అస్మాత్ - లోకాత్ - అమృతాః - భవన్తి

| | | |
|---|---|---|
| యత్ | = | ఏదైతే సృష్ట్యాదియందు ఉన్నదో |
| సః+ఉ | = | ఆ ఆత్మయే ఆదిపురుషుడై విరాట్ పురుషుడైనాడు. ఆ విరాట్ పురుషుడు తన దేహమునుంచి దేవతలను సృజియించినాడు. ఆ దేవతలు మన దేహములో ప్రవేశించినవి. |
| వాచః+వాచం(వాక్) | = | విరాట్ పురుషుని నుంచి వాక్కు, దానినుంచి అగ్ని వచ్చినవి. ఆ అగ్ని వాక్కుగా మారి మన దేహములోని వాక్కులో ప్రవేశించినది. కావున విరాట్ పురుషునియొక్క వాక్కు మనకు వాక్కు. దీనిని వాక్కు యొక్క వాక్కు అని చెప్పుచున్నాను. |

| | | |
|---|---|---|
| శ్రోత్రస్య+శ్రోత్రం | = | విరాట్పురుషునినుంచి శబ్దము దాని నుంచి దిక్కులు వచ్చినవి. ఆ దిక్కులు శబ్దముగామారి మన చెవులలో ప్రవేశించినవి. కావున విరాట్పురుషుని యొక్క చెవి మనకు చెవి. దీనిని చెవి యొక్క చెవి అని చెప్పు చున్నాను. |
| చక్షుషః+చక్షుః | = | విరాట్ పురుషునినుంచి రూపము, దాని నుంచి ఆదిత్యుడు వచ్చినారు. ఆ ఆదిత్యుడు రూపముగా మారి మన కన్నులలో ప్రవేశించినాడు. కావున విరాట్ పురుషుని యొక్క కన్ను మన కన్ను. దీనినే కన్నుల యొక్క కన్నులు అని చెప్పుచున్నాను. |
| ప్రాణస్య+ప్రాణః | = | విరాట్పురుషుని నుంచి ప్రాణము, దాని నుంచి వాయువు వచ్చినవి. ఆ వాయువు ప్రాణముగా మారి మన ప్రాణములో ప్రవేశించినది. కావున విరాట్ పురుషుని యొక్క ప్రాణము మన ప్రాణము. దీనినే ప్రాణము యొక్క ప్రాణమని చెప్పుచున్నాను. |
| మనసః+మనః | = | విరాట్పురుషుని నుంచి హృదయము (మనస్సు) దానినుండి చంద్రుడు వచ్చినారు. ఆ చంద్రుడు మనస్సుగా మారి మన మనస్సులో ప్రవేశించినాడు. కావున విరాట్ పురుషుని యొక్క మనస్సు మన మనస్సు. దీనినే మన మనస్సు యొక్క మనస్సు అని చెప్పుచున్నాను. |
| హ | = | సృష్ట్యాది యందున్న ఆత్మ బ్రహ్మ రంధ్రము ద్వారా శరీరము లోనికి ప్రవేశించి హృదయ గుహలో ఉన్నది. జీవాత్మ దాని పూర్వజన్మకర్మానుసారము ఈ శరీరములో ప్రవేశించినది. అందువలన ఈ శరీర వ్యాపారముజరుగుచున్నది. అనగా ఆత్మ ప్రకాశమున జీవాత్మయొక్క సంకల్పానుసారము నోరు మాట లాడుచున్నది, మనస్సు పని చేయుచున్నది. |

(ఈ జ్ఞానేంద్రియములు, కర్మేంద్రియములు, మనస్సు, ప్రాణము, జీవాత్మ ఈ సర్వము ఆత్మ నియమించును. కావున)

| | | |
|---|---|---|
| ధీరాః | = | ఇహలోక పరలోక సుఖములందు ఆపేక్ష లేని వారు ధీరులు, జ్ఞానులు. అనగా దేహము నిత్యము కాదని తెలిసిన సిద్ధ మునివర్తనులైన నరులు |
| అతిముచ్య | = | దేహభావన నుండి విడివడి అనగా సంసార తాపత్రయములను వదలించు కొని మోహము తెగగోసి గేహమునుండి వెలువడి సాధనచేసి తనే ఆత్మయని గ్రహించి జీవన్ముక్తుడై |
| అస్మాత్+లోకాత్ | = | ఈ లోకము నుండి |
| ప్రేత్య | = | వెడలి అనగా దేహ త్యాగానంతరము |
| అమృతాః+భవన్తి | = | జనన మరణ వలయము నుండి విడివడి, బ్రహ్మ లోకము చేరి బ్రహ్మయై అమృతు లగుదురు. |

ఈ ఉపనిషత్తులో చెప్పిన అమృతత్త్వమును పొందు విధి విధానమును భాగవతము ప్రథమ స్కంధము 315 లో ఇట్లు చెప్పబడినది.

**క॥ దేహము నిత్యము గాదని**
**మోహముఁ దెగఁగోసి సిద్ధముని వర్తనుఁడై**
**గేహము వెలువడు నరుఁడు**
**త్సాహముతోఁ జెందు ముక్తి సంపద ననఘా**

(భాగవతము ప్రథమస్కంధము-315)

దీనికి ఉదాహరణగా ధృతరాష్ట్రుని సాధనను భాగవతమున వివరించినారు.దీనినే రామాయణములో రాజ్య పట్టాభిషేకమందు విఘ్నము కలిగినా మోహముతో క్రుంగిపోక అయోధ్యను వీడి అరణ్యమున ప్రవేశించి సాధన చేసి చరితార్థుడై మరల బ్రహ్మలోకము చేరినట్లుగా రామ కథ వివరిపబడినది.

ఒకడు చక్రవర్తి. ఒకడు యువరాజు. యువరాజు కూడ చక్రవర్తి ఆజ్ఞలకు లోబడి యుండును. చక్రవర్తి రాజ ప్రాసాదంలో కూర్చుని, యువరాజు ఉద్యోగస్థులతో కూడి పనిచేయించుచున్నాడు. హృదయగుహలోగల ఆత్మ చక్రవర్తి. దేహమందలి జీవాత్మ యువరాజు. చక్రవర్తి ఆజ్ఞలకు లోబడే యీ దేహసామ్రాజ్యం పనిచేయు చున్నది. కావున **అన్యుడొకడు విభుడు** అని భాగవతమున చెప్పబడినది.

ఆత్మ వలన రెండు ప్రయోజనములు సమకూరును. ఆత్మ వలన దేహేంద్రియ, మనో బుద్ధులు పనిచేయును. ఇది ఒక ప్రయోజనము. ఆత్మను దర్శించిన జీవుడు అమృతుడగును. ఇది రెండవ ప్రయోజనము.

*****

బ్రహ్మవిచారణ:

ఆత్మను దర్శించిన అమృతుడగును అని గురువు చెప్పగానే ఆత్మ లక్షణములు ఏమిటి? ఆత్మను దర్శించుట ఎట్లు? ఆత్మను తెలిసికొనినకలుగు లాభమేమి? అని శిష్యులు ప్రశ్నించినారు.

అంత గురువు ఆత్మను జీవుడు తప్ప యితరమయిన ఇంద్రియాదులు దర్శించ లేవు. గ్రహించలేవు అని చెప్పినారు. జాగ్రత్, స్వప్న, సుషుప్తి అవస్థలను దాటి నిశ్చల సమాధిలోనే ఆత్మను దర్శించవలయునని చెప్పినారు.

**ఆత్మ స్థానమునకు మనస్సు - ప్రాణము- ఇంద్రియములు వెళ్ళలేవు**

3. **న తత్ర చక్షుర్గచ్ఛతి న వాగ్ గచ్ఛతి నో మనః**
   **న విద్మో న విజానీమో యథైత దనుశిష్యాత్**

న - తత్ర - చక్షుః - గచ్ఛతి - న - వాక్ - గచ్ఛతి - నః - మనః - న - విద్మః - న - విజానీమః - యథా - ఏతత్ - అనుశిష్యాత్

| | | |
|---|---|---|
| తత్ర | = | హృదయస్థానములో గల ఆత్మ స్థానమునకు |
| నః | = | మన యొక్క |

| | | |
|---|---|---|
| మనః+న+గచ్ఛతి | = | మనస్సు వెళ్ళలేదు |
| న+చక్షుః | = | కన్నులు చూడలేవు. అటులనే మిగిలిన జ్ఞానేంద్రియములు గ్రహించలేవు. |
| వాక్+న+గచ్ఛతి | = | వాక్కు చేరలేదు. కావున వర్ణింపలేదు. అటులనే మిగిలిన కర్మేంద్రియములచే గ్రహించలేము. |

జ్ఞానేంద్రియముల ద్వారా మనస్సు ఒక విషయమును గ్రహించును. ఆ గ్రహించిన విషయమును వాక్కు వర్ణించును. అయితే ఆత్మను జ్ఞానేంద్రియములు, మనస్సు గ్రహించలేనందున వాక్ వర్ణింపలేదు.

ఆ ఆత్మను గుఱించి పూర్తిగా వర్ణించి చెప్పుటకు భాష సరిపోదు. బెల్లంతింటే తియ్యగా వుంటుంది. లడ్డూ తిన్నా తియ్యగానే ఉంటుంది. పాలకోవా కూడా తియ్యగానే ఉంటుంది. ఈ మూడింటికి తీపిలో గల తేడాను భాష ద్వారా సరిగా విపులీకరించలేము. ఎవరికి వారు అనుభవములో గ్రహించాలి. కావున

| | | |
|---|---|---|
| ఏతత్ | = | ఈ ఆత్మను- ఈజీవుడు |
| విద్మః | = | స్వానుభవముతో గ్రహించవలయును. ఇతరవిధముగా తెలియలేము. కావున జాగ్రతాది అవస్థలలో ఎఱుగము. కావున ఆత్మను ఎఱిగి |
| యథా+అనుశిష్యాత్ | = | ఎట్లు భాష ద్వారా విశదీకరించుటయో |
| న+విజానీమః | = | తెలియకున్నది. |

ఆత్మస్థానమునకు జీవుడు తప్ప యితర మేమియు చేరలేవు. కావున స్వానుభవంలో జీవుడు ఆత్మను దర్శించి, గ్రహించవలయును. ఆత్మ-దేహము కంటె భిన్నమనియు, ఆత్మవలననే యీ దేహేంద్రియ మనోబుద్ధులు పనిచేస్తున్నవనియు, ఆత్మ యొక్క ఆజ్ఞకు లోబడి ప్రాణము ఈ దేహము నుండి వెడలిపోవుచున్నదని మాత్రము చెప్పగలము.

*****

**4. ఆత్మ లక్షణములు- ఆత్మను యింద్రియముల ద్వారా గ్రహించలేము.**

**అన్యదేవ తద్విదితాద థో అవిదితా దధి**

**ఇతి శుశ్రుమ పూర్వేషాం యే నస్తద్వ్యాచచక్షిరే.**

అన్యత్ - ఏవ - తత్ - విదితాత్ - అథః - అవిదితాత్ - అధి - ఇతి - శుశ్రుమ - పూర్వేషాం - యే - నః - తత్ - వ్యాచచక్షిరే.

| | | |
|---|---|---|
| తత్ | = | ఆత్మ |
| విదితాత్+ | = | మనకు తెలిసిన దేహ లక్షణములు, జగత్ |
| అన్యత్+ఏవ | | లక్షణముల కంటె భిన్నము |
| అధి | = | శ్రేష్ఠమైనది |
| అథః | = | ఆ తర్వాత |
| అవిదితాత్ | = | మనకు అరూపుడు, చిదాత్మకుడయిన జీవుడు ఎలా ఉండునో తెలియదు. కావున మనకు తెలియని జీవుని కంటె కూడా భిన్నుడు. ఆత్మ అంతర్లీనముగా ఉండుట చేత మనో బుద్ధి యింద్రియముల ద్వారా గ్రహించలేము. |
| తత్ | = | ఆ ఆత్మ గురించి |
| యే+పూర్వేషాం | = | ఎవరైతే పూర్వుల యొక్క మాటగా |
| నః+వ్యాచ చక్షిరే | = | మాకు విశదీకరించారో అనగా మా గురువులు మాకు అలా బోధింపగా మేము |
| శుశ్రుమ+ఇతి | = | వింటిమి, ఆ విషయాన్నే మీకు చెప్పితిమి. |

ఆత్మలక్షణములు -

దేహలక్షణముల కంటె భిన్నము. జగత్‌లక్షణముల కంటె భిన్నము జీవాత్మ కంటె భిన్నము. ఆత్మ అంతర్లీనముగా ఉండును. ఆత్మవలన దేహవ్యాపారములు

జరుగుచున్నవి. ఆత్మను మనస్సు- ప్రాణము- ఇంద్రియముల ద్వారా గ్రహించలేము. జీవుని వలన గ్రహించగలము.

నేతి నేతి - అను పద్ధతిన ఆత్మను వివరించుచున్నాడు. దేహము -మనస్సు- ప్రాణము - ఇంద్రియములు ఆత్మ కావు. జీవుడు ఆత్మ కాదు. దేహములో - హృదయగుహలో గలదే సృష్ట్యాది యందున్నఆత్మ.

*****

ఆత్మను దర్శించిన
అమృతత్త్వము గలుగును

5. యద్వాచాఽ నభ్యుదితం యేన వాగభ్యుద్యతే
తదేవ బ్రహ్మ త్వం విద్ధి నేదం యదిదముపాసతే

6. యన్మనసా న మనుతే యేనాహుర్మనో మతమ్
తదేవ బ్రహ్మ త్వం విద్ధి నేదం యదిదముపాసతే

7. యచ్చుషా న పశ్యతి యేన చక్షూంషి పశ్యతి
తదేవ బ్రహ్మ త్వం విద్ధి నేదం యదిదముపాసతే

8. యచ్ఛ్రోత్రేణ న శృణోతి యేన శ్రోత్రమిదం శ్రుతమ్
తదేవ బ్రహ్మ త్వం విద్ధి నేదం యదిదముపాసతే

9. యత్ప్రాణేన న ప్రాణితి యేన ప్రాణః ప్రణీయతే
తదేవ బ్రహ్మ త్వం విద్ధి నేదం యదిదేముపాసతే
(ఇతి ప్రథమః ఖండః)

యత్ - వాచా - అనభ్యుదితం - యేన - వాక్ - అభ్యుద్యతే - యత్ - మనసా - న - మనుతే - యేన - ఆహుః - మనః - మతమ్ - యత్ - చక్షుషా - న - పశ్యతి - యేన - చక్షూంషి - పశ్యతి - యత్ - శ్రోత్రేణ - న - శృణోతి - యేన -

శ్రోత్రమ్- ఇదం - శ్రుతమ్ - యత్ - ప్రాణేన - న - ప్రాణితి - యేన - ప్రాణః- ప్రణీయతే - తత్ - ఏవ - బ్రహ్మ - త్వం - విద్ధి - న - ఇదం - యత్ - ఇదమ్ - ఉపాసతే

ఆత్మ వలననే దేహేంద్రియ మనో ప్రాణ వ్యాపారము జరుగుచున్నది. ఆత్మ - జీవాత్మతోసహా దేహం నుండి వెడలి పోయినచో - ఈ దేహం మృతమగును. ఆ ఆత్మను ఇంద్రియములు, మనస్సు, ప్రాణముల చేత గ్రహించలేము. కావున

| | | |
|---|---|---|
| యత్+మనసా+న+మనుతే | = | దేనిని (ఆత్మను) - మనస్సుచేత గ్రహించ లేమో. |
| యేన+మనః+మతమ్ | = | దేని చేత మనస్సు పనిచేయునని |
| ఆహుః | = | చెప్పుదురో |
| యత్+ప్రాణేన+న+ప్రాణితి | = | దేనిని ప్రాణము చేత తెలియలేమో |
| యేన+ ప్రాణః + ప్రణీయతే | = | దేనిచేత ప్రాణము పని చేయుచున్నదో |
| యత్+చక్షుషా+న+పశ్యతి | = | దేనిని నేత్రములచే చూడలేమో |
| యేన+చక్షూంషి+పశ్యతి | = | దేని చేత నేత్రములు చూచుచున్నవో. |
| యత్+శ్రోత్రేణ+న+శ్రుణోతి | = | దేనిని చెవులచేత వినలేమో, అనగా గ్రహించ లేమో |
| యేన+ఇదం+శ్రోత్రం+శ్రుతం | = | దేని చేత చెవులు శబ్దమును గ్రహించు చున్నవో. (అటులనే మిగిలిన జ్ఞానేంద్రి యముల ద్వారా ఆత్మను గ్రహించలేము. ఆత్మ వలననే మిగిలిన జ్ఞానేంద్రియములు పని చేయుచున్నవి). |
| యత్+వాచా+అనభ్యుదితం | = | దేనిని వాక్కుచేత వర్ణించలేమో |
| యేన+వాక్+అభ్యుచ్యతే | = | దేని చేత వాక్కు పని చేయునో (అటులనే మిగిలిన కర్మేంద్రియముల చేత ఆత్మను |

| | | |
|---|---|---|
| | | గ్రహించలేము ఆత్మవలననే మిగిలిన కర్మేంద్రియములు పని చేయుచున్నవి). |
| తత్+ఏవ+బ్రహ్మ | = | ఇంద్రియములు, ప్రాణము, మనస్సుచే గ్రహించలేనిది. ఇవి పనిచేయుటకు కారణ మయినది. హృదయగుహాలో యున్నదే ఆత్మ అని. |
| ఇదమ్+త్వం+విద్ధి | = | దీనిని నీవు గ్రహించుము. దానినే దర్శించ వలయును. ఆత్మను దర్శించిన కర్మబంధములు తొలగి అమృతత్త్వమును పొందుదురు. |
| యత్+ఇదం+న+ఉపాసతే | = | ఏదైతే మనము నిత్యాగ్ని హోత్రం ద్వారా వివిధ దేవతలను నిత్యము ఆరాధించు చున్నామో అవి బ్రహ్మ కావు. |

ఈ దేవతలను ఉపాసించిన అమృతత్త్వము రాదు. ఇహలోక పరలోక సుఖములు మాత్రమే గలుగును. ఈ దేవతలు అమృతత్త్వము ఇవ్వజాలరు. ఈ విషయమునే భాగవతమున

ఆ॥ **విశ్వమయత లేమి వినియు నూరక యుండి**
**రంబు జాసనాదులడ్డపడక -**

(భాగవతము, అష్టమస్కంధము, 94)

గజేంద్రుని మొఱ వినియు బ్రహ్మాది దేవతలు ఊరక యుండిరి అని వర్ణించినారు.

*****

## ద్వితీయ ఖండము

సాధన వలన జీవుడు - జీవ లక్షణములైన రాగ - ద్వేషములను వదిలించుకొని- కర్మ వాసనలను క్షయింపచేసుకొని - త్రయావస్థలను దాటిన ఈశ్వరుడగును. దీనినే ఆత్మదర్శనమని, బ్రహ్మత్వము పొందుట అని- అమృతత్త్వమని అందురు.

సాధన లేక కేవలము వేదములు చదివినను - విన్నను ఆత్మ దర్శనము కాదు.

ఒకడు తను చూచిన దానిని వర్ణించి చెప్పుట లోక సహజము. మనకు అర్థము కాని ఒక విషయమును ఒక మేధావి విపులముగా వివరించిన అర్థమగుట లోక సహజము. కాని చూడని దానిని వర్ణించి చెప్పుట ఆశ్చర్యము. బాహ్యదృష్టికి గోచరించని దానిని చూచుట ఆశ్చర్యము. ఎన్నిసార్లు విన్నా అర్థముకాని విషయమును అర్థమయినట్లుగా భావించుట ఆశ్చర్యము. దేనిని మనస్సుద్వారా గాని- ఇంద్రియముల ద్వారా గాని గ్రహించలేమో దానిని భాషద్వారా చెప్పుట - విని గ్రహించితిమి అని భావించుట ఆశ్చర్యము గదా.

**ఆశ్చర్య వత్పశ్యతి కశ్చిదేనమ్**
**ఆశ్చర్య వద్వదతి తథైవ చాన్యః**
**ఆశ్చర్య వచ్చైన మన్యః శృణోతి**
**శ్రుత్వాప్యేనం వేద నచైవ కశ్చిత్.**

(భగవద్గీత-సాంఖ్యయోగము-29)

ఆశ్చర్యవత్ - పశ్యతి - కశ్చిత్ - ఏనమ్ - ఆశ్చర్యవత్ - వదతి - తథా - ఏవ - చ- అన్యః - ఆశ్చర్యవత్ - చ - ఏనమ్ - అన్యః - శృణోతి - శ్రుత్వా - అపి - ఏనమ్ - వేద - న - చ - ఏవ - కశ్చిత్

| | | |
|---|---|---|
| ఏనమ్ | = | ఈ ఆత్మను |
| ఆశ్చర్యవత్ | = | ఆశ్చర్యముగా |
| కశ్చిత్+వదతి+చ | = | ఒకడు పలుకుచున్నాడు (చూడని దానిని వర్ణించుట కంటె ఆశ్చర్యమేమున్నది. అలా చూడని దానిని మాటలచేచూచినట్లు వర్ణించుటకంటె ఆశ్చర్య మేమున్నది. |

| | | |
|---|---|---|
| ఏనమ్ | = | ఈ ఆత్మను |
| కశ్చిత్ | = | ఒకడు |
| ఆశ్చర్యవత్ | = | ఆశ్చర్యముగా |
| శృణోతి+చ | = | వినుచున్నాడు. |
| శ్రుత్వా+అపి | = | ఏన్ని సార్లు విన్నా కూడా |
| ఏనమ్ | = | ఈ ఆత్మను |
| న+వేద | = | గ్రహించలేడు.అయినా కూడా |
| చ | = | మఱియు |
| తథా+ఏవ | = | అట్లే |
| అన్యః | = | ఇంకొకడు వాగుచున్నాడు. |
| అన్యః | = | ఇంకొకడు వినుచున్నాడు. |
| కశ్చిత్ | = | ఒకానొక సాధకుడు- సూక్ష్మాతి సూక్ష్మ మైన ఈ ఆత్మను |
| ఆశ్చర్యవత్ +ఏవ | = | ఆశ్చర్యముగానే |
| పశ్యతి | = | చూచుచున్నాడు. |

గీతలోని ఈ శ్లోకమునకు మూలాధారము కేన ఉపనిషత్ లోని ఈ అధ్యాయము.

**ఆత్మ తత్త్వమును సంపూర్ణముగా గ్రహించుట అనగా**

1. సృష్ట్యాది యందు గల ఆత్మ లక్షణములను గ్రహించవలయును. ఆత్మ లక్షణములు :- స్వయంభువు. స్వయంజ్యోతి, ఒక్కడు, నిరుపాధికము, గుణ రహితము.
2. ఆ ఆత్మ ఉపాధిని నిర్మించుకొని పురుషుడయినది.
   పురుషుని లక్షణములు :- స్వయంభువు, స్వయంజ్యోతి, ఒక్కడు, సోపాధికము, గుణరహితము.
3. పురుషుడు సృష్టి చేయ సంకల్పించి - ప్రకృతి, కర్మ, కాలము, జీవునిగా రూపాంతరము చెందినాడు. పురుషుడు ప్రకృతిని అధిష్ఠించినాడు. ఇతనిని విరాట్ పురుషుడందురు.

విరాట్పురుషుని లక్షణములు :- స్వయంభువు, స్వయంజ్యోతి, సోపాధికము, గుణయుతుడు.

| | | |
|---|---|---|
| సమిష్టిగా | - | ఒక్కడు |
| వ్యష్టిగా | - | భిన్నుడు. |
| గుణయుతుడగుట వలన | - | గుణములననుసరించి త్రిమూర్తి స్వరూపుడు. గుణముల వలన కర్మలు ఏర్పడినవి. |
| రజో గుణయుతుడై బ్రహ్మగా | - | సృష్టిని చేయుచున్నాడు. |
| సత్త్వ గుణయుతుడై విష్ణువుగా | - | సృష్టిని పరిరక్షించుచున్నాడు. |
| తమో గుణయుతుడై శివునిగా | - | సృష్టిని లయము చేయుచున్నాడు. |
| విరాట్ దేహము నుండి | - | దేవతలు సృజియింపబడిరి. |

సర్వస్థావర జంగమములు సృజియింపబడినవి.
ప్రకృతి వలన సకల స్థావర జంగమములకు ఉపాధులు ఏర్పడినవి.

4. సర్వ స్థావరజంగమములో జీవరూపమున, హృదయగుహలో ఆత్మరూపమున అంతర్యామిగా ఉన్నాడు. ఇతడు బాహ్యదృష్టికి గోచరింపడు. జీవరూపమున గుణయుతుడై కర్మలు చేయుచున్నాడు. ఆ కర్మ ఫలితములను కోరి సుఖ దుఃఖములను అనుభవించుచున్నాడు. కర్మ బద్ధుడగుచున్నాడు. రాగ ద్వేషములకు లోనగుచున్నాడు. హృదయ గుహలో సాక్షిగా ఉన్నాడు. సృష్ట్యాది యందున్న ఆత్మ పెద్దది. హృదయ గుహలో గల ఆత్మ సూక్ష్మాతిసూక్ష్మము. పరిణామములో భేదము తప్ప స్వరూప స్వభావములలో భేదము లేదు.
5. కాలరూపమున జనులకు ఆయువును క్షీణింపచేయుచున్నాడు. ఆ విధముగా సృష్ట్యాదియందు ఒక్కడుగా ఉన్న ఆత్మ సృష్టిలో సర్వమూ అతడే అయినాడు. సర్వ భూతములయందు అంతర్యామిగా ఉన్నాడు. ఇలా ఆత్మయొక్క సంపూర్ణస్వరూపమును గ్రహించిన వానిగా **హిరణ్యకశిపుని**ని భాగవతము సప్తమ స్కంధములో వర్ణించినారు.

బ్రహ్మత్వమును పొంది సృష్టి చేసినట్లు తను కూడ బ్రహ్మయై విరాజిల్ల **హిరణ్యకశిపుడు** తపస్సును ప్రారంభించినాడు. నూఱు దివ్య సంవత్సరములు మందరాచలముపై తపస్సు చేసినాడు. బ్రహ్మను దర్శించినాడు. ఆత్మ తత్త్వమును సంపూర్ణముగా గ్రహించినాడు. ఆత్మ తత్త్వమును ప్రకటించినాడు. (భాగవతం సప్తమస్కంధము-88.)
ఆత్మ :- ఆత్మనిష్ఠా గరిష్ఠులకు ధ్యేయంబగు నాత్మవు సర్వార్థ సాధకులకు సాధనీయుండవు.
పురుషుడు :- ఆద్యంత రహితుండవు.
విరాట్ పురుషుడు :- మూడు మూర్తులకు మూలంబగు పరమాత్మవు త్రయీ తనువునంగ్రతువులు విస్తరింతువు. సకలవిద్యలు నీతనువు. మహాభూత గణంబులకు నాధార భూతుండవు, జ్ఞాన విజ్ఞాన మూర్తివి.
అంతరాత్మ :- అంతరాత్మవు
జీవాత్మ :- జీవ లోకంబునకు జీవాత్మవు
హృదయగుహలో గల ఆత్మ :- మనో బుద్ధి చిత్తేంద్రియములకు నధీశ్వరుండవు.
ప్రాణము :- నీవు ముఖ్య ప్రాణంబగుటంజేసి ప్రజాపతివి.
కాలము :- కాలమయుండవై జనులకు నాయుర్నాశంబు సేయుదువు.
సర్వంబును నీవ. నీవుగానిది లేశంబును లేదు- అని చెప్పినాడు.
ఈ సర్వము అనే పదము సరిగా అర్థము చేసుకొనవలయును. ఉదాహరణకు మామిడి టెంక నుంచి - మామిడి చెట్టు యొక్క కాండము కొమ్మలు- ఆకులు- పండు వచ్చినవి. అనగా మామిడి చెట్టు యొక్క సర్వము మామిడి టెంక నుంచి వచ్చినది. అయితే ఈ సర్వము మామిడి టెంక నుంచే వచ్చినవి గదా అని మామిడి చెట్టు యొక్క ఆకులు తింటే మామిడిపండు తిన్న రసానుభూతి గలుగదు. ఇప్పుడు మనకు మామిడి ఆకులు వేఱు, మామిడి పండు వేఱు అని స్వానుభవంలో తెలిసినది గదా. మామిడి టెంక నుంచి మామిడి చెట్టులోని సర్వమూ వచ్చినది. ఇది ఏకత్వము. మామిడి ఆకు వేఱు. మామిడి పండు వేఱు - ఇది భిన్నత్వము
ఇలా ఏకత్వ భిన్నత్వముల గుఱించి విపులముగా చెప్పుటకు ప్రహ్లాదుడు తన తోటి దైత్యబాలకులకు చెప్పిన పాఠముగా వ్యాసభగవానుడు విశదీకరించినాడు. అదే ప్రహ్లాద చరిత్ర.

*****

ఈ రెండవ అధ్యాయములోని శ్లోకములకు భాషా పరంగా చదివిన గందరగోళముగా ఉండును. అదే భావమును అర్థము చేసుకున్నచో విషయము చక్కగా బోధపడును.

*****

ఆత్మను స్వానుభవంలో దర్శించవలయును

1. యది మన్యసే సువేదితి దహరమే వాపి
నూనం త్వం వేత్థ బ్రహ్మణో రూపం
యదస్య త్వం యదస్య దేవేష్వథ ను
మీమాంస్య మేవ తే మన్యే విదితమ్

యది - మన్యసే - సువేద - ఇతి - దహరమ్ - ఏవ - అపి - నూనం - త్వం - వేత్థ - బ్రహ్మణః - రూపం - యత్ - అస్య - త్వం - యత్ - అస్య - దేవేషు - అథ - ను - మీమాంస్యమ్ - ఏవ - తే - మన్యే - విదితమ్.

| | | |
|---|---|---|
| యది | = | ఒకవేళ |
| బ్రహ్మణః+రూపం | = | ఆత్మ యొక్క రూపమయిన అధి భౌతికమును దర్శించి |
| సువేద+ఇతి | = | బ్రహ్మ స్వరూపము బాగుగా తెలియునని |
| త్వం+మన్యసే+అపి | = | నీవు భావించినట్లయిన యింకా నీవు అధిదైవిక అధ్యాత్మ రూపములలో ఆత్మను దర్శించవలయును గాన |
| దహరమ్+ఏవ | = | బహుశా ఏ కొంచమో అనగా |
| నూనం+వేత్థ | = | నిజముగా అధి భౌతికరూపము మాత్రమే నీకు తెలిసినది. |
| త్వం | = | నీవు |
| యత్+అస్య | = | బ్రహ్మ యొక్క |
| దేవేషు+విదితమ్ | = | అధిదైవిక రూపమయిన- దేవతలయందు- బ్రహ్మ స్వరూపమును దర్శించితినని తలచిననూ నీకు |

| | | |
|---|---|---|
| | | తెలిసినది ఆత్మ యొక్క సంపూర్ణ స్వరూపము కాదని యింకా నీవు ఆత్మ యొక్క అధ్యాత్మ రూపమును దర్శించవలయునని |
| మన్యే | = | తలంచుచున్నాను. |
| అథ | = | ఆ తర్వాత |
| తే | = | మీరు |
| యత్+అస్య+ను | = | బ్రహ్మయొక్క రూపమును నిశ్చల సమాధిలో దర్శించితిరని భావించినను అనగా అధ్యాత్మిక రూపమును దర్శించిన అపరానుభూతిలో మాట ఉండదు గాన |
| మీమాంసమ్+ఏవ | = | మీరు పలుకుట చిత్రము. |

తెలుసును, బాగా తెలుసును, తెలియదు అని చెప్పుటకు జీవునికి మనస్సు జ్ఞానేంద్రియములు పరికరములుగా పొందిన జ్ఞానము అవసరము. జాగ్రతావస్థలో స్థూల శరీరములో గల మనస్సు జ్ఞానేంద్రియముల ద్వారా జీవుడు పొందిన జ్ఞానము ఇంద్రియ జన్య జ్ఞానము అగుట వలన అతీంద్రియ జ్ఞానమగు ఆత్మ గురించి తెలియదు. స్వప్నావస్థలో సూక్ష్మశరీరములో మనో నిర్మిత మాయచే ఆవరింపబడి కలలు గను స్థితిలో ఆత్మ గురించి తెలియదు. సుషుప్తిలో మనస్సు ఇంద్రియముల వ్యాపారము ఉండదు కావున జ్ఞానమునకు అవసరమగు పరికరములు లేనందున ఆత్మ గురించి తెలియదు. కావున త్రయావస్థలు దాటినగానీ ఆత్మ దర్శనము కాదు. ఆత్మదర్శనము అనుభవైక వైద్యము. అది మాటలకు అందనిది. అని గురువు ఆత్మ గురించి చెప్పినాడు.

ఆత్మ- అధి భౌతికముగా - సర్వ జగత్‌గా విస్తరిల్లినది. ఈ బాహ్య జగత్తును దర్శించి ఆత్మను దర్శించితినని భ్రమపడరాదు.

ఆత్మ - అధి దైవికముగా మనస్సు, ప్రాణము, ఇంద్రియ అధిష్టాన దేవతలుగా ఉన్నది. వాటిని గ్రహించి ఆత్మను దర్శించితినని భ్రమపడరాదు.

అంతర్యామిగా, హృదయగుహలో గల ఆత్మను దర్శించుటయే ఆత్మ దర్శనము. ఈ స్థితిలో కేవలం బ్రహ్మానందం అనుభవముగా ఉండును.

ఆ అనుభవమును మాటలలో వ్యక్తీకరించలేము. ఇదే విషయాన్ని రాబోవు రెండు మంత్రములలో పదే పదే వక్కాణించి చెప్పుచున్నాడు.

*****

**ఆత్మ గుఱించి తెలుసు- తెలియదు**

**2. నా హం మన్యే సువేదేతి నో న వేదేతి వేద చ**
**యో నస్తద్వేద తద్వేద నో న వేదేతి వేద చ**

న - అహం - మన్యే - సువేద - ఇతి - న -ఉ - న - వేద - ఇతి - వేద - చ - యః - నః - తత్ - వేద - తత్ - వేద - న - ఉ - న - వేద -ఇతి - వేద - చ

శిష్యుడు చెప్పుచున్నాడు.

| | | |
|---|---|---|
| అహం+సువేద+ఇతి | = | నేను ఆత్మను సంపూర్ణముగా గ్రహించితినని |
| న+మన్యే | = | తలచుట లేదు. |
| న+ఉ+న+వేద+ | = | నేను ఆత్మ- తెలియదని అనుకొనుట లేదు |
| ఇతి+చ+వేద | | తెలుసునని అనుకొనుట లేదు |
| యః | = | ఎవరు |
| నః | = | మాకు, వేద వేదాంగములు చదువుట వలనగాక సాధన వలన |
| తత్+వేద | = | ఆత్మ తెలుసు- అని అనుకొందురో |
| తత్+వేద | = | వారికి ఆత్మ తెలియును |
| న+ఉ+న+వేద+ఇతి+ చ+వేద | = | ఆత్మ యొక్క సంపూర్ణ స్వరూపము స్వానుభవంలో తప్ప - యితర విధముగా తెలియదు అని భావించి ఆత్మను దర్శించితిరో వారికి తెలియును. |

*****

### ఆత్మ గురించి తెలుసు- తెలియదు

**3. యస్యా మతం తస్యమతం మతం యస్య న వేద సః**
**అవిజ్ఞాతం విజానతాం విజ్ఞాత మవిజానతామ్**

యస్య - అమతం - తస్య - మతం - మతం - యస్య - న - వేద - సః - అవిజ్ఞాతం - విజానతాం - విజ్ఞాతమ్ - అవిజానతామ్.

| | | |
|---|---|---|
| యస్య | = | ఈ దేహేంద్రియముల ద్వారా ఎవనికి |
| అమతం | = | ఆత్మ తెలియదని గ్రహించునో |
| తస్య | = | అలా గ్రహించి సాధన చేసిన వానికి |
| మతం | = | ఆత్మ దర్శనము గలుగును. అతనికి ఆత్మ స్వానుభవంలో తెలుసును |
| యస్య | = | ఎవరికి |
| మతం | = | వేద వేదాంగములు చదివి అందు ఆత్మ గురించి వర్ణన చదివి నాకు ఆత్మ తెలియునని భావించునో |
| సః | = | వాడు |
| న+వేద | = | సాధన లేనందున ఆత్మను దర్శించలేడు. కావున |
| విజానతాం+అవిజ్ఞాతం | = | శాస్త్ర పాఠముల ద్వారా మాకు ఆత్మ తెలియును అన్న వారికి ఆత్మ గురించి తెలియదు. |
| అవిజానతాం+విజ్ఞాతం | = | అలా శాస్త్రముతో పాటు సాధన చేయుట ద్వారానే తప్ప యితర విధముగా ఆత్మ తెలియదు అని సాధన చేసినవాడు ఆత్మను దర్శించును గావున అతనికి ఆత్మ తెలియును. |

*****

### ఆత్మను గ్రహించిన అమృతత్త్వము

**4. ప్రతి బోధ విదితం మత మమృతత్త్వం హి విందతే**
**ఆత్మనా విందతే వీర్యం విద్యయా విందతేఽమృతమ్**

ప్రతిబోధ - విదితం - మతమ్ - అమృతత్త్వం - హి - విందతే - ఆత్మనా- విందతే - వీర్యం - విద్యయా - విందతే - అమృతమ్

| | | |
|---|---|---|
| ప్రతిబోధ+విదితం | = | ఆత్మను తెలియుట వలన |
| మతమ్ | = | బ్రతికుండగా జీవన్ముక్తుడగును అని నా అభిప్రాయము |
| అమృతత్త్వం+హి+ విందతే | = | దేహత్యాగానంతరము ఆత్మలో ఏకీభూతుడవై అమృతత్త్వము పొందుదును. |
| ఆత్మనా+వీర్యం+ విందతే | = | ఉపాధి చేత సాధన చేసి ఆత్మ బలమును పొందును. అనగా మృత్యువును దాటును మఱియు |
| విద్యయా+అమృతమ్+ | = | విద్యచే అమృతత్త్వమును పొందును విందతే |

విద్య, అవిద్యలు అనేక అర్థములలో వాడబడును. ఇక్కడ అవిద్య అనగా దేహము. విద్య అనగా జీవుడు. దేహమును సాధనగా చేసుకొని సాధన చేయవలయును. అప్పుడు జీవుడు అమృతుడగును.

*****

### ఆత్మను గ్రహించిన జన్మసార్థకత

**5. ఇహ చేద వేదీ దథ సత్యమస్తి । న చేది హా వేదీ న్మహతీ వినష్టిః**
**భూతేషుభూతేషు విచిత్య ధీరాః । ప్రేత్యా స్మాల్లోకాదమృతా భవంతి**

ఇతి ద్వితీయ ఖండః

ఇహ - చేత్ - అవేదీత్ - అథ - సత్యమ్ - అస్తి - న - చేత్ - ఇహ - అవేదీత్- మహతీ - వినష్టిః - భూతేషు - భూతేషు - విచిత్య - ధీరాః - ప్రేత్య - అస్మాత్- లోకాత్ - అమృతాః - భవంతి

| | | |
|---|---|---|
| ఇహ | = | బ్రతికియుండగనే నీవు |
| అవేదీత్+ చేత్ | = | బ్రహ్మను తెలిసికొనినచో |
| అథ | = | ఆ తర్వాత, - ఆవిధముగా బ్రహ్మ దర్శన ప్రాప్తి పొందుట వలన |
| సత్యం+అస్తి | = | జన్మ సార్థకత గలుగును |
| ఇహ+న+అవేదీత్+చేత్ | = | ఈ జన్మమునందు సంసారసాగరములో పడి ఆత్మను దర్శించనిచో-జన్మపరంపరలలో చిక్కుకొనుట అనే |

| | | |
|---|---|---|
| మహతీ+వినష్టిః | = | గొప్ప అనర్థము గలుగును |
| ధీరాః | = | ధీరులు- తమయందు |
| భూతేషు+భూతేషు | = | సర్వ భూతములయందు, |
| విచిత్య | = | ఆత్మను దర్శించి |
| అస్మాత్+లోకాత్+ప్రేత్య= | | ఈ లోకమునుంచి నిష్క్రమించి |
| అమృతాః+భవంతి | = | అమృతత్త్వమును పొందుచున్నారు. |

అనగా సర్వభూతములు విరాట్ దేహమునందు ప్రతిష్ఠితమై ఉన్నవి. సర్వభూతము లలో వాటి హృదయగుహాలో ఆత్మ కలదని తెలుసుకొని తన హృదయగుహాలో కంఠస్థానమునకు దిగువ నాభికి పైన అథోముఖముగా తామరమొగ్గలా హృదయ కోశము ఉంది. అది శరీరమునకు అంటక లంబముగా వ్రేలాడు చున్నది. ఆ హృదయ కోశముగా చెప్పబడే ఆ హృదయ గుహాలో సర్వత్రా ప్రకాశించు చున్న మహా అగ్ని కలదు. ఆ అగ్ని యువకుడు, సర్వజ్ఞుడుగా చెప్పబడుచున్నాడు. ఆ అగ్ని శరీరమంతా వ్యాపించి ఉండును. పాదమునుంచి తల వఱకు శరీరమును వేడిగా ఉంచును. ఆ అగ్ని వైశ్వానరాగ్ని రూపమున ఆహారమును పచనము చేయును. శరీరమునకు సమముగా పంచి పెట్టును. అగ్నియొక్క జ్వాలా సమూహము ఆ హృదయ కోశములో ప్రకాశించుచున్నది. అగ్ని జ్వాల ఊర్ధ్వ ముఖంగా ఉంది. ఆ అగ్ని జ్వాల మధ్యలో నివ్వరి ధాన్యము ములుకంత పరిమాణము కలిగి బంగారు వన్నె కలిగి పరమాత్మ ప్రకాశించుచున్నాడు. దానిని దర్శించవలయును. **ఇదే జ్యోతి దర్శనము.** ఈ జ్యోతి దర్శనము పొందిన మహనీయుడు అమృతత్త్వమును పొందుచున్నాడు. ఇతనిని పండితుడని సమదర్శనుడని శ్రీకృష్ణుడు భగవద్గీతలో కర్మ సన్న్యాసయోగము 18 లో చెప్పినాడు.

శరీరమునకు అంటక **లంబము**గా హృదయకోశము వ్రేలాడుచున్నది అని వేదములో (మంత్రపుష్పము) చెప్పిన దానినే సుందరకాండలో హనుమంతుడు లంకను చేరి అక్కడగల **లంబ** పర్వముపై దిగినట్లు వర్ణింపబడినది.

*****

# తృతీయ ఖండము

వాక్కు, ప్రాణము, మనస్సు ఇవేవియు ఆత్మను దర్శించలేవు. జీవుడు ఒక్కడే ఆత్మను దర్శించును అని చెప్పి ఆ విషయమును బాగా అర్థమగుటకు ఒక కథగా వివరించుచున్నాడు. వాక్కును అగ్నిగా, మనస్సును వాయువుగా, జీవునిని ఇంద్రుడుగా పాత్రలలో చిత్రీకరించి కథ చెప్పుచున్నాడు.

వేదమంత్రములకు సాధన రహస్యములు అర్థమగుటకు కథలుగా చెప్పుదురు. ఈ పద్ధతినే వాల్మీకి మహర్షి, వ్యాస భగవానులు తమ తమ రచనలలో పాటించినారు.

దేహము - జీవుడు - హృదయగుహలోగల ఆత్మల సంపుటియే ప్రాణి. దేహము మరల స్థూలదేహము, సూక్ష్మదేహము అని రెండు విభాగములు. స్థూలదేహమును, స్థూలదేహమే నేను అనే భావనను, స్థూలదేహములోగల ఇంద్రియాదులను రాక్షసులుగానూ, సూక్ష్మదేహములోగల వాటిని దేవతలుగనూ, లేదా దేవతల సంతానముగానూ చిత్రీకరించెదరు.

రామాయణంలో స్థూలదేహములోని అవయవములు, భావములను రాక్షసులుగా చిత్రీకరించినారు. సూక్ష్మదేహములో గల వాటిని దేవతల పుత్రులయిన వానరులుగా చిత్రీకరించినారు. ఈ రాక్షసులు, వానరులు ప్రతివాని దేహములో ఉందురు.

ఇట్లు ఆత్మ పరంగా శ్రీరాముని, జీవాత్మ పరంగా రావణుని చిత్రీకరించినారు. సాధకునిగా రాముని తీసికొని సాధన రహస్యములను వివరించినారు. అటులనే భారతములో స్థూలదేహముగా కౌరవులను వారి సైన్యమును మఱియు సూక్ష్మ దేహముగా పాండవులను వారి సైన్యమును వివరించినారు. సాధకునిగా ధర్మరాజుని తీసికొని సాధన రహస్యములను వివరించినారు.

భాగవతములో అనేక సాధకులను తీసికొని సాధన రహస్యములను వివరించినారు. ఆధ్యాత్మిక భావముల వివరణగా చదవ వలయునని గుర్తు చేయుటకు కథలలో ఒక చిన్న మెలిక పెట్టెదరు.

ఇంద్రుని కుమారుడు వాలి. ఇతడు రాక్షసుడు కాడు. మరి రాముడు వాలిని ఏల సంహరించెను ? అన్న ప్రశ్నకు వాలి అనగా దేహములో ఎవరో గ్రహించవలయును. సముద్రుడు మైనాకునితో నిన్ను ఇంద్రుడు పాతాళమునకు కాపుగా ఉంచినాడు

అని చెప్పగా మైనాకుడు హనుమంతునితో తనకు ఇంద్రునకు మిత్రత్వములేదని చెప్పును. ఈ పరస్పర విరుద్ధ భావనలను ఎందుకు వాల్మీకి రచియించెను? ఇలాంటి మెలికలు ఎన్నియో రామాయణంలో కలవు. ఆ మెలికలను విప్పినగాని సాధన రహస్యములు తెలియవు.

గాంధారియొక్క గర్భస్థ పిండము గర్భమునుండి పతనమగును. వ్యాసుడు దానిని 101 ముక్కలు చేసి, 101 కుండలలో పెట్టి పోషింపగా 100 మంది కౌరవులు, ఒక ఆడపిల్ల (దుశ్శల) పుట్టిరి. ఇది అసహజము. ఇలాంటి అనేక మెలికలతో భారతము రచియింపబడినది. ఆ మెలికలను విప్పినగాని సాధన రహస్యములు తెలియవు. ఈ విధముగా రామాయణము భారతము రచియింపబడినవి. వీటిని సామాన్య కథలుగా గాక వేదాంత పరిభాషలో చదివి సాధన చేసిన సాధకులు అమృతత్త్వమును పొందుదురు.

*****

**దేవతలు తమే విజయమును సాధించితిమని తలచిరి**

1. **బ్రహ్మ హ దేవేభ్యో విజిగ్యే తస్య హ**
   **బ్రహ్మణో విజయే దేవా అమహీయంత**
   **త ఐక్షన్తా స్మాకమేవాయం విజయో౽**
   **స్మాకమేవాయం మహిమేతి**

బ్రహ్మ - హ - దేవేభ్యః - విజిగ్యే - తస్య - హ - బ్రహ్మణః - విజయే - దేవాః - అమహీయంత - తే - ఐక్షంత - అస్మాకమ్ - ఏవ - అయం - విజయః - అస్మాకమ్ - ఏవ - అయం - మహిమా - ఇతి.

| | | |
|---|---|---|
| బ్రహ్మ | = | బ్రహ్మ, సృష్ట్యాది యందు గల ఆత్మ |
| దేవేభ్యః | = | దేవదానవ యుద్ధములో దేవతల జయము కొఱకు దేవతలలో ఒకడిగా వుండి |
| విజిగ్యే+హ | = | జయము సంపాదించి యిచ్చెను |
| తస్య+ బ్రహ్మణః+హ | = | ఆ బ్రహ్మము యొక్క అనగా బ్రహ్మ దేవతలు కలసి సంపాదించిన |

| | | |
|---|---|---|
| విజయే | = | విజయమును |
| దేవాః | = | దేవతలు |
| అమహీయంత | = | తమ విజయమని ఉప్పొంగి పోయిరి. |
| అస్మాకం+ఏవ | = | మాదే |
| అయం+విజయః | = | ఈ విజయము |
| అస్మాకం+ఏవ | = | మాదే |
| అయం+మహిమా+ఇతి | = | ఈ గొప్ప తనమని |
| తే | = | ఆ దేవతలు |
| ఐక్షంత | = | తలచిరి |

*****

**దేవతలకు జ్ఞానము గలిగించ ఆత్మ కనిపించెను**

**2. తద్ధైషాం విజజ్ఞౌ తేభ్యో హ ప్రాదుర్బభూవ**
**తన్నవ్యజానత కిమిదం యక్షమితి**

తత్ - హ - ఏషాం - విజజ్ఞౌ - తేభ్యః - హ - ప్రాదుర్భః - భూవ - తత్- న - వ్యజానత - కిమ్ - ఇదం - యక్షమ్ - ఇతి

| | | |
|---|---|---|
| తత్ | = | ఆ బ్రహ్మ అప్పుడు |
| ఏషాం+ విజజ్ఞౌ+హ | = | దేవతలు, తను కలసి సంపాదించిన విజయమును దేవతలు ఒక్కరే సంపాదించిరని తలచి ఉప్పొంగి పోవుచున్న విషయమును తెలుసుకొని |
| తేభ్యః+హ | = | వారికి తను కనిపించి వారికి జ్ఞానము గలిగించ వలయుననుకొని - వారి కొఱకు అనగా వారికి |
| తత్+ప్రాదుర్భ భూవ | = | స్వయముగా బ్రహ్మ వారి కళ్ళెదుట సాక్షాత్కరించెను. |
| కిమ్+ఇదం+యక్షం+ఇతి | = | ఈ సౌందర్యవంతుడు ఎవరు ? అని |

న+ వ్యజానత (వ్యజానంత) = దేవతలు ఆలోచించి గ్రహించలేక పోయిరి.

ఇతడు యక్షరాక్షసులలోని యక్షుడుకాడు. యక్షామివ చక్షుషః ప్రియోవా భూయాసం (మంత్ర బ్రాహ్మణము 1-7-14) అనగా కన్నులకు ప్రియము గొలుపునది అని యక్షుడు అన్న పదమునకు అర్థము.

*****

వాక్కును అగ్నిగా ఉత్ప్రేక్షించి కథ చెప్పుచున్నాడు.

**అగ్ని ఆ ఆత్మను ఏవరయినది గ్రహించలేదు.**

**3. తేఽగ్నిమబ్రువన్ జాతవేద ఏతద్విజానీహి కిమే తద్యక్షమితి తథేతి**

తే - అగ్నిమ్ - అబ్రువన్ - జాతవేద - ఏతత్ - విజానీహి - కిమ్ - ఏతత్ - యక్షమ్ - ఇతి - తథా - ఇతి

జాతవేద = ఓ అగ్నీ
కిం+ఏతత్+యక్షమ్ = ఈ ముగ్ధ మనోహర మూర్తి ఎవరు అయినది
విజానీహి+ ఇతి = తెలుసుకొనుము అని
తే = ఆ దేవతలు
అగ్నిం = అగ్నితో
అబ్రువన్ = పలికిరి
ఏతత్ = ఇతడు ఎవరయినదీ తెలుసుకొందును. తెలుసుకొని
తథా+ఇతి = దానిని మీకు తెలియ చెప్పుదును అని అగ్ని పలికెను.

*****

**4. తదభ్యద్రవత్త మభ్యవదత్కోఽసీత్యగ్ని ర్వా**
**అహమస్మీత్య బ్రవీజ్జాతవేదా వా అహమస్మీతి**

తత్ - అభ్యద్రవత్ - తమ్ - అభ్యవదత్ - కః - అసి - ఇతి - అగ్నిః - వా - అహమ్- అస్మి - ఇతి - అబ్రవీత్ - జాతవేదాః - వా - అహమ్ - అస్మి - ఇతి

| | | |
|---|---|---|
| అభ్యద్రవత్ | = | అగ్ని వేగముగా పరుగెత్తి బ్రహ్మ వద్దకు వెళ్ళెను. |
| తత్ | = | ఆ బ్రహ్మ |
| తం | = | అగ్నిని |
| కః+అసి+ఇతి | = | నీవు ఎవరవు అని |
| అభ్యవదత్ | = | ప్రశ్నించెను |
| అహం+ అగ్నిః +వై+ అస్మి+ఇతి | = | అధి భౌతికముగా నేను అగ్నిని-అని |
| అబ్రవీత్ | = | పలికెను |
| అహమ్+ జాతవేదాః+వా | = | నేను అధిదైవికముగా జాతవేదుడను |
| అస్మి+ఇతి | = | అని పలికెను |

అధి భౌతికముగా - అగ్నిని, అధి దైవికముగా- జాతవేదుడను అని పల్కెను.

*****

5. తస్మిం స్త్వయి కిం వీర్య మిత్యపీదం
   సర్వం దహేయం యదిదం పృథివ్యా మితి

తస్మిన్ - త్వయి - కిం - వీర్యమ్ - ఇతి - అపి - ఇదం - సర్వం - దహేయం - యత్ - ఇదం - పృథివ్యామ్ - ఇతి

| | | |
|---|---|---|
| తస్మిన్ | = | బ్రహ్మ వాని యందు గల శక్తిని తెలుసుకొన గోరి వానితో |
| త్వయి+కిం+వీర్యం+ | = | నీ యందు గల శక్తి ఏమిటి- అని అడిగెను |
| ఇతియత్+ఇదం+ | = | ఈ భూమి యందు |
| పృథివ్యాం+ఇదం+ సర్వం+అపి | | గల సర్వము |
| దహేయం+ఇతి | = | దహించగలను- అని అగ్ని చెప్పెను. |

అధిభౌతికమయిన అగ్నిగా సర్వము దహించగలను.

*****

**6. తస్మై తృణం నిదధా వేతద్దహేతి**
**తదుపప్రేయాయ సర్వజవేన తన్న**
**శశాక దగ్ధుం సతత ఏవ నివవృతే నైత**
**దశకం విజ్ఞాతుం యదేతద్యక్షమితి**

తస్మై - తృణం - నిదధౌ - ఏతత్ - దహి - ఇతి - తత్ - ఉప - ప్రేయాయ - సర్వ - జవేన - తత్ - న - శశాక - దగ్ధుం - సః - తత్ - ఏవ - నివవృతే - న - ఏతత్ - అశకం - విజ్ఞాతుం - యత్ - ఏతత్ - యక్షమ్ - ఇతి

| | | |
|---|---|---|
| తస్మై | = | అగ్ని కొఱకు బ్రహ్మ ఒక |
| తృణం | = | గడ్డిపోచను |
| నిదధౌ | = | ఉంచెను. బ్రహ్మ అగ్నితో |
| ఏతత్+దహ+ఇతి | = | దీనిని దహించుము అని పల్కెను |
| తత్+ఉప+ప్రేయాయ | = | గడ్డిపోచను అగ్ని సమీపించెను |
| తత్+సర్వజవేన | = | ఆ గడ్డిపోచను కాల్చుటకు అగ్ని తన సర్వశక్తిని |
| న+శశాక+దగ్ధుం | = | ఉపయోగించినను దానిని కాల్చలేక పోయెను. అటు పిమ్మట |
| సః | = | అగ్ని |
| తత్+ఏవ+నివవృతే | = | ఆ యక్షుడు ఎవరయినదీ తెలుసుకొనలేక వెనుకకు మరలెను |
| యత్+ఏతత్+యక్షం | = | ఈ సౌందర్యవంతుడెవరో |
| ఏతత్+విజ్ఞాతుం | = | తెలుసుకొనుటకు |
| న+అశకం+ఇతి | = | నా శక్తి చాలదు అని దేవతలతో పల్కెను. |

*****

మనస్సు-వాయువు గ్రహించలేక పోయినది

**7. అథ వాయుమబ్రువన్వాయవే త ద్విజానీహి కిమేత ద్యక్షమితి తథేతి**

అథ - వాయుమ్ - అబ్రువన్ - వాయో - ఏతత్ - విజానీహి - కిమ్ - ఏతత్ - యక్షమ్ - ఇతి - తథా - ఇతి

| | | |
|---|---|---|
| అథ | = | అగ్ని మరలి వచ్చిన తర్వాత దేవతలు |
| వాయుమ్ | = | వాయువును చేరి |
| వాయో | = | ఓ వాయువా |
| కిమ్+ఏతత్+యక్షమ్ | = | ఈ సౌందర్యవతుడెవరయినదీ |
| ఏతత్+విజానీహి+ఇతి | = | తెలుసుకొని రమ్ము అని |
| అబ్రువన్ | = | పలికిరి |
| తథా+ఇతి | = | ఆ సౌందర్యవతుడెవరయినదీ తెలుసుకొని వచ్చి చెప్పెదనని వాయువు బయలు దేరెను. |

*****

**8. తదభ్యద్రవత్త మభ్యవదత్కోఽసీతి వాయుర్వా అహమస్మీత్య బ్రవీన్మాతరిశ్వా వా అహ మస్మీతి**

తత్ - అభ్యద్రవత్ - తమ్ - అభ్యవదత్ - కః - అసి - ఇతి - వాయుః - వా - అహమ్ - అస్మి - ఇతి - అబ్రవీత్ - మాతరిశ్వా - వా - అహమ్ - అస్మి - ఇతి.

| | | |
|---|---|---|
| అభ్యద్రవత్ | = | వాయువు వేగముగా బ్రహ్మ వద్దకు వెళ్ళెను |
| తత్ | = | ఆ బ్రహ్మము |
| తం | = | వాయువును |
| కః+అసి+ఇతి | = | నీవు ఎవడవు అని |
| అభ్యవదత్ | = | అడిగెను. అంత వాయువు |
| అహమ్+వాయుః+వై+ అస్మి+ ఇతి | = | నేను అధి భౌతికముగా వాయువును- |
| అహమ్+మాతరిశ్వా+ వా+అస్మి+ఇతి | = | నేను అధి దైవికముగా మాతరిశ్వుడను- అని |
| అబ్రవీత్ | = | పలికెను |

అధి భౌతికముగా వాయువును, అధి దైవికముగా మాతరిశ్వుడను అని పలికెను

*****

**9. తస్మిం స్త్వయి కిం వీర్య మిత్యపీదం సర్వమాదదీయ యదిదం పృథివ్యామితి**

తస్మిన్- త్వయి- కిం- వీర్యమ్-ఇతి-అపి-ఇదం- సర్వమ్-ఆదదీయ- యత్- ఇదం- పృథివ్యామ్-ఇతి

| | | |
|---|---|---|
| తస్మిన్ | = | బ్రహ్మవాని యందు గల శక్తిని తెలుసు కొనగోరి వానితో |
| త్వయి+కిం+వీర్యం+ఇతి | = | నీ యందుగల శక్తి ఏమిటి? అని అడిగెను |
| యత్+ఇదం+పృథివ్యామ్+ ఇదం+సర్వం+అపి ఆదదీయ+ఇతి | = | ఈ భూమి యందు గల సర్వము ఎగురగొట్ట గలను- అని చెప్పెను. |

*****

**10. తస్మై తృణం నిదధా వే తదా దత్స్వేతి**
**తదుప ప్రేయాయ సర్వజవేన తన్నశశా**
**కాదాతుం స తత ఏవ నివవృతే నై తద**
**శకం విజ్ఞాతుం యదే తద్యక్షమితి**

తస్మై - తృణం - నిదధౌ - ఏతత్ - ఆదత్స్వ - ఇతి - తత్ - ఉపప్రేయాయ - సర్వజవేన - తత్ - న - శశాక - ఆదాతుం - సః - తతః - ఏవ - నివవృతే - న - ఏతత్ - అశకం - విజ్ఞాతుం - యత్ - ఏతత్ - యక్షమ్ - ఇతి

| | | |
|---|---|---|
| తస్మై | = | వాని కొఱకు బ్రహ్మ ఒక |
| తృణం | = | గడ్డి పోచను |
| నిదధౌ | = | ఉంచెను |
| ఏతత్+ఆదత్స్వ+ఇతి | = | దీనిని ఎగురగొట్టుము- అని పల్కెను. |
| తత్+ఉప+ప్రేయాయ | = | గడ్డిపోచను వాయువు సమీపించెను |
| తత్+సర్వజవేన+న+ శశాక+ఆదాతుం | = | ఆ గడ్డిపోచను వాయువు తన సర్వశక్తిని ఉపయోగించినను ఎగుర గొట్టలేక పోయెను. |
| సః | = | వాయువు |
| తతః+ఏవ+నివవృతే | = | ఆ సౌందర్యవంతు డెవరయినదీ తెలుసుకొనలేక అచ్చటనుండే వెనుకకు మరలెను |

యత్+ఏతత్+యక్షం = ఈ సౌందర్యవంతుడెవరో
ఏతత్+విజ్ఞాతుం = తెలుసుకొనుటకు
న+అశకం+ఇతి = నా శక్తి చాలదు అని దేవతలతో పల్కెను

అటులనే మిగిలిన దేవతలు కూడ ఆ యక్షుడెవరయినదీ తెలుసుకోలేక పోయిరి.

*****

| <u>దేహములో అవయవములు</u> | <u>దేవతలలో</u> | |
|---|---|---|
| | అధిభౌతికము | అధిదైవము |
| నోరు | అగ్ని | జాతవేదుడు |
| మనస్సు | వాయువు | మాతరిశ్వుడు |

జ్ఞానేంద్రియ, కర్మేంద్రియములు, మనస్సు, ప్రాణములు ఆత్మను దర్శించలేవు. విరాట్ పురుషుని ముఖము నుంచి వచ్చిన అగ్ని మన శరీరములో ముఖము (నోరు) నందు ప్రవేశించెను. అటులనే మిగిలిన దేవతలు కూడా మన శరీరములో ప్రవేశించిరి అని గతములో చదువుకున్నాము. కావున విరాట్‌పురుషుని నుంచి వచ్చిన దేవతలుకానీ, మన శరీరములోని ఇంద్రియాదులు కానీ ఆత్మను గ్రహించలేవు. కిం వీర్యం - నీ బలమేమిటి అని అడిగినదానికి దేవతలు తాము చేయగల పనిని చెప్పిరి. కానీ వారికి ఆ శక్తి ఎవరి వలన వచ్చినదో వారికే తెలియదు. వారికి ఆ శక్తినిచ్చినది పర బ్రహ్మ లేక ఆత్మ. ఈ విషయమునే భాగవతములో సప్తమ స్కంధములో

> **"..... నీకు, నాకు బ్రహ్మాదులకున్ బలమెవ్వఁడు ....**
> **.... డట్టి విభుఁడు బలమసురేంద్రా"**

(భాగవతము సప్తమ స్కంధము-264)

అనగా ఈ అగ్నికి - వాయువునకు - సమస్త దేవతలకు వారి వారికి ఆ శక్తులను కలుగచేసినది ఆత్మ అని గ్రహించవలయును. ఆత్మను ఇంద్రియాదులు దర్శించ లేవు. జీవుడు మాత్రమే దర్శించగలడు. అయితే జీవుడు ఆత్మను దర్శించుటకు చేయవలసిన సాధనను భాగవతము దశమ స్కంధము 82,84,85,87 పద్యములలో ఇట్లు చెప్పబడినది. క్రౌర్యంబు విడచి, ధైర్యంబు నొంది, గాంభీర్యంబు వాటించి, మౌనియుంబోలె, వైరానుబంధంబున, నన్యానుసంధానంబు మఱచి నిరంతరము

భగవన్నామమును జపించుచు, మనస్సు, చెవులు, దృష్టి, చర్మము, ముక్కు, వాక్కు అనగా జ్ఞానేంద్రియ కర్మేంద్రియములు పరమాత్మ పరము చేయవలయును.

ఇంద్రుడు లేక జీవుడు హృదయ గుహలో గల ఆత్మను దర్శించుటకు వెళ్ళుట.

ఇంద్ర పదమునకు జీవుడని అర్థము

**11. అథేంద్రమబ్రువన్ మఘవన్నేతద్విజానీహి కిమేతద్యక్షమితి తథేతి తదభ్యద్రవత్తస్మాత్తిరోదధే**

అథ - ఇంద్రమ్ - అబ్రువన్ - మఘవన్ - ఏతత్ - విజానీహి - కిమ్ - ఏతత్ - యక్షమ్ - ఇతి - తథా - ఇతి - తత్ - అభ్యద్రవత్ - తస్మాత్ - తిరోదధే

| | | |
|---|---|---|
| అథ | = | దేవతలలో ఏ ఒక్కరూ బ్రహ్మను గురించి తెలుసుకోలేక వెనుతిరిగి వచ్చిన తర్వాత, దేవతలు |
| మఘవన్ | = | ఓ ఇంద్రుడా |
| ఏతత్+యక్షమ్ | = | ఈ సౌందర్యవంతుడు |
| కిమ్ | = | ఎవరు అనే |
| ఏతత్+ విజానీహి+ఇతి | = | ఈ విషయమును తెలుసుకొనవలసినదని |
| ఇంద్రం | = | ఇంద్రునితో |
| అబ్రువన్ | = | పలికిరి |
| తథా+ఇతి | = | ఇంద్రుడు అటులనే-అని |
| తత్+అభ్యద్రవత్ | = | ఆ బ్రహ్మను వేగముగా సమీపించెను |
| తస్మాత్ | = | ఇంద్రుడు సమీపించుట వలన |
| తిరోదధే | = | అదృశ్యము అయ్యెను. |

ఇంద్రియములు దేవతలు. ఆ దేవతలకు అధిష్ఠానమయిన జీవుడే ఇంద్రుడని పిలువబడును. అట్టి అధి దైవికమయిన జీవుడే ఆత్మను దర్శించినచో ఆత్మ యొక్క మహిమ వలన అమృతుడగును.

*****

**12. స తస్మిన్నేవాకాశే స్త్రియమాజగామ బహుశోభమానాముమాం హైమవతీం తాం హో వాచ కి మేతద్యక్షమితి**

ఇతి తృతీయ ఖండః

సః - తస్మిన్ - ఏవ - ఆకాశే - స్త్రియం - ఆజగామ - బహుశోభ మానామ్ - ఉమామ్ - హైమవతీం - తాం - హ - ఉవాచ - కిమ్ - ఏతత్ - యక్షమ్ - ఇతి

| | | |
|---|---|---|
| సః | = | ఆ ఇంద్రుడు |
| తస్మిన్+ఏవ+ఆకాశే | = | బ్రహ్మ అంతర్థానమయిన ఆ ఆకాశ ప్రదేశము నందే- హృదయాకాశము నందే |
| బహుశోభమానామ్ హైమవతీం+ఉమాం స్త్రియం | = | మిక్కిలి సౌందర్యరాశియు, హిమవంతుని కూతురు అగు ఉమను (పార్వతిని) |
| ఆజగామ | = | చూచెను |
| తాం | = | ఆమెను సమీపించి |
| కిం+ఏతత్+యక్షమ్ ఇతి | = | ఈ సౌందర్యవంతుడు ఎవరు అని |
| ఉవాచ+హ | = | ఇంద్రుడు అడిగెను |

ఈ మంత్రమునకు కథగా వ్యాసభగవానుడు - నిరంతర నామస్మరణ చేసిన కంసుడు శ్రీకృష్ణునికి బదులు (పురుషునికి బదులు) ఒక శక్తి స్వరూపిణిని చూచినట్లు. ఆ శక్తి స్వరూపిణి ఆకాశంలో నిలచి నా సరసన జనియించిన స్వయంభువు అయినవాడు ఒక్కడు గలడని అతనికి చెప్పును. సాధనలో ఆత్మ దర్శనమునకు ముందు ప్రకృతి దర్శనము అగును. అనగా ప్రకృతి గుటించిన విమల జ్ఞానము గలుగును. పురుష ప్రకృతులు నాణెమునకు గల బొమ్మ బొరుసు వంటివారు. పురుష ప్రకృతుల కలయికను పూర్ణ బిందువు అని అందురు. సహస్రారమున పూర్ణబిందువు గలదు. జీవుడు సహస్రారమును చేరి పూర్ణబిందువును చేర వలయునని అర్థము.

*****

## చతుర్థ ఖండము

### ఇంద్రుడు లేక జీవుడు ఆత్మను గ్రహించుట

1. సా బ్రహ్మేతి హోవాచ బ్రహ్మణోవా ఏతద్విజయే
   మహీయధ్వ మితి తతో హైవ విదాంచకార బ్రహ్మేతి

సా - బ్రహ్మ - ఇతి - హ - ఉవాచ - బ్రహ్మణః - వా - ఏతత్ - విజయే - మహీయధ్వమ్ - ఇతి - తతః - హ -ఏవ - విదాంచకార - బ్రహ్మ - ఇతి.

| | | |
|---|---|---|
| సా | = | ఆ ఉమాదేవి |
| బ్రహ్మ+ఇతి+హ | = | ఆ యక్షుడు, సృష్టి కారకుడైన ఆత్మ యని |
| ఉవాచ | = | చెప్పెను |
| బ్రహ్మణః+వా+ విజయే | = | బ్రహ్మ చేతనే అనగా అతడు మీతో బాసటగా యుండుటచేత - బ్రహ్మ, మీరు కలసి యీ విజయమును పొందిరి. |
| ఏతత్+మహీయధ్వమ్ +ఇతి | = | బ్రహ్మవలనమీరు మహిమాన్వితులగుచున్నారు. అనగా మీకు ఆ శక్తులు గలుగుచున్నవి అయితే మీరొక్కరు ఈ విజయమును సాధించితి మని ఈ విజయము మీదేనని పొంగి పోయిరి అని పలికెను |
| తతః+ఏవ+హ | = | ఆ విధముగా ఉమచే బోధింపబడుట చేతనే ఇంద్రుడు ఆ వచ్చినది |
| బ్రహ్మ+విదామ్చకార+ ఇతి | = | బ్రహ్మయని గ్రహించెను |

క్షీర సాగర మథనములో విష్ణువు పాలకడలి త్రచ్చు వారిలో నొకడుగా యుండెను. అప్పుడే అమృతం గలిగినది.

*****

### ఇంద్రియాదుల కంటె జీవుడు గొప్పవాడు

**2. తస్మాద్వా ఏతే దేవా అతితరామి వాన్యాన్దేవాన్య దగ్ని ర్వాయు రింద్రస్తే హ్యే నన్నేదిష్ఠం పస్పృశుస్తే హ్యేన త్ప్రథమో విదాం చకార బ్రహ్మేతి**

తస్మాత్ - వా - ఏతే - దేవాః - అతితరామ్ - ఇవ - అన్యాన్ - దేవాన్ - యత్ - అగ్నిః - వాయుః - ఇంద్రః - తే - హి - ఏనత్ - నేదిష్ఠమ్ - పస్పృశుః - తే - హి - ఏనత్ - ప్రథమః - విదాంచకార - బ్రహ్మ - ఇతి

| | | |
|---|---|---|
| ఏతే+దేవాః+హి | = | ఈ దేవతలు అనగా |
| అగ్నిః+వాయుః+వా | = | అగ్ని, వాయువు |
| యత్+నేదిష్ఠమ్+పస్పృశుః+హి | = | బ్రహ్మను చాలా దగ్గరగా సమీపించియు |
| తే | = | వారు యక్షుడెవరయినదీ గ్రహించలేదు |
| ఏనత్+బ్రహ్మ+ఇతి | = | ఆ వచ్చినది బ్రహ్మయని ఉమ చెప్పగా |
| తే+ఇంద్రః+ప్రథమః+ విదాంచకార | = | దేవతలలో, ఇంద్రుడు ప్రప్రథమముగా గ్రహించెను |
| తస్మాత్ | = | అందువలన ఇంద్రుడు |
| అన్యాన్+దేవాన్ | = | ఇతర దేవతలను మించి |
| అతితరామ్+ఇవ | = | సామర్థ్యమున్న వాని వలె గ్రహించెను. కావున ఆ దేవతల కంటె శ్రేష్ఠుడయ్యెను. |

ఇంద్రియాదుల కంటె జీవుడు శ్రేష్ఠుడు

*****

ఈ విషయమునే యింకొకసారి చెప్పుచున్నారు.

**3. తస్మాద్వా ఇంద్రోఽతి తరామి వాన్యాన్దేవా న్సహ్యే నన్నేదిష్ఠం పస్పర్శసహ్యేన త్ప్రథమో విదాంచకార బ్రహ్మేతి**

తస్మాత్ - వా - ఇంద్రః - అతితరామి - ఇవ - అన్యాన్ - దేవాన్ - సః - హి - ఏనత్ - నేదిష్ఠమ్ - పస్పర్శ - సః - హి - ఏనత్ - ప్రథమః - విదాంచకార - బ్రహ్మ- ఇతి.

| | | |
|---|---|---|
| ఏనత్+బ్రహ్మ+ఇతి | = | ఆ వచ్చినది బ్రహ్మయని ఉమ చెప్పగా |
| సః | = | ఇంద్రుడు |
| ప్రథమః+విదాంచకార | = | ఇతర దేవతలు తెలుసుకొనని విషయమును మొదట యితడు గ్రహించెను |
| సః+హి | = | అదీగాక ఆ ఇంద్రుడు |
| ఏనత్ | = | ఈ బ్రహ్మను |
| నేదిష్టమ్ +పస్పర్శ+హి | = | సమీపమునుండి చూచెను |
| తస్మాత్+వా | = | అందువలన |
| ఇంద్రః | = | ఇంద్రుడు |
| అన్యాన+దేవాన్ | = | ఇతర దేవతలను |
| అతితరామి+ఇవ | = | అతిశయించెను |

*****

**4. తస్యైష ఆదేశో యదే తద్విద్యుతో వ్యద్యుతదా3 ఇతీన్న్యమీ మిషదా3 ఇత్యధి దైవతమ్**

తస్య- ఏషః - ఆదేశః - యత్- ఏతత్- విద్యుతః -వ్యద్యుతత్ - ఆ - ఇతి - న్యమీమిషదా-ఇతి- అధిదైవతమ్.

| | | |
|---|---|---|
| యత్+ఏతత్ | = | ఈ బ్రహ్మ యొక్క స్వయం ప్రకాశమైన కాంతి ఏదైతే కలదో అది |
| తస్య | = | ఆ బ్రహ్మ యొక్క స్వరూపము. అనగా బ్రహ్మ స్వయం ప్రకాశకుడు. |

| | |
|---|---|
| విద్యుతః+వ్యద్యుతత్+ఆ= | సహస్ర కోటి సూర్యకాంతితో, కండ్లకు |
| న్యమీమిషత్+ఆ+ఇతి | మిరిమిట్లు గొలిపి, ఆ కాంతిని తేటిపాఱ చూడలేక ఱెప్పలు ఆర్పేట్లు చేస్తున్నట్లు మెఱుపులు మెఱసినట్లు ఉండును. నీవు సాధనచే జీవత్వమును నశింప చేసుకొని |
| అధి దైవతమ్+ఇతి = | అధిదైవతమయిన కూటస్థుడవై హృదయ గుహలో గల ఆత్మను దర్శించి- దేహమును వీడి ఆత్మతో ఏకీభూతుడవు కావలయును. |
| ఏషః+ఆదేశః = | గురువునయిన మీకు-ఇదే నా ఆదేశము-ఉపదేశము. |

**సాధన**

సాధనతో మొదట- కర్మేంద్రియములను కర్మానుష్ఠానం ద్వారా వశము చేసుకొనవలయును. ఆ తర్వాత శబ్ద, స్పర్శ, రూప, రస, గంధాదులపై ప్రసరించు జ్ఞానేంద్రియములను నిగ్రహించవలయును. ఆ తర్వాత ప్రాణమును వశము చేసుకొనవలయును.

ఆ తర్వాత సుఖదుఃఖములకు విచలితుడు గాక- కాలానుసారము అవి గలుగునని గాంభీర్యము లేక తితీక్షగలిగి ఉండవలయును గుణములు- చిత్త, అహంకార, మనో, బుద్ధులను ప్రకోపించును.

తమోగుణము- అహంకారమును
రజోగుణము - చిత్తమును, మనస్సును
సత్త్వగుణము - బుద్ధిని ప్రకోపించును.

సత్త్వగుణము ద్వారా అనగా బుద్ధిద్వారా, రజోగుణము, తమోగుణములను జయించవలయును అనగా చిత్తము, మనస్సు, అహంకారములను వశము చేసుకొనవలయును. గుణరహిత స్థితియే శాంతము. అట్టి శాంతస్థితిని పొందవలయును. వీనినే జీవన్ముక్తుడని, విదేహుడని, కూటస్థుడని, ఆత్మదర్శనం చేసినవాడని అందురు. ఇతడు దేహమును వీడి బ్రహ్మ రంధ్రముచించి బ్రహ్మలో ఏకీభూతుడగును.

*****

**సాధన**

5. **అథాధ్యాత్మం యదేతద్గచ్ఛతీవ చ మనోఽనేన చైతదుపస్మరత్య భీక్ష్ణం సంకల్పః**

అథ - అధ్యాత్మం - యత్ - ఏతత్ - గచ్ఛతి - ఇవ - చ - మనః - అనేన - చ - ఏతత్ - ఉపస్మరతి - అభీక్ష్ణం - సంకల్పః

| | | |
|---|---|---|
| యత్+ఏతత్+ గచ్ఛతి+ ఇవ | = | నదులు సముద్రము వైపు పయనించు విధముగా |
| అనేన | = | ఈ మనస్సు చేత |
| అభీక్ష్ణమ్ | = | నిరంతర ధ్యానము వలనను |
| అథ+చ | = | సంసార తాపత్రయములనుంచి విడివడి ఇంద్రియములను స్వాధీన పఱచుకొని |
| మనః+సంకల్పః+చ | = | వికల్పము - రాహిత్యము అగుట వలనను, సంకల్పములచే |
| ఏతత్+అధ్యాత్మం | = | ఈ అధ్యాత్మ మయిన బ్రహ్మను దర్శించి తానే బ్రహ్మయని |
| ఉపస్మరతి | = | గ్రహించును |

అధ్యాత్మ గుఱించి భాగవతమున ఇట్లు చెప్పబడినది. **కార్యవర్గంబును గారణ సంఘంబు నధికరించి చరించు నాత్మ తత్త్వ మధ్యాత్మ మనఁబడు**

(భాగవతము ప్రథమ స్కంధము - 56)

అనగా కారణము - ప్రకృతి. కార్య వర్గము- జగత్తు. ప్రకృతికి జగత్తుకు అవ్వలగల అనగా సృష్ట్యాదియందు గల ఆత్మ తత్త్వము అధ్యాత్మమనబడును.

*****

**బ్రహ్మ యొక్క స్థానమునే నందన వనం అని అందురు.**

**6. తద్ధ తద్వనం నామ । తద్వన మిత్యు పాసితవ్యం । స య ఏతదేవం వేదాభి హైనం । సర్వాణి భూతాని సంవాంచ్ఛంతి ॥**

తత్ - హ - తత్ - వనం - నామ - తత్ - వనమ్ - ఇతి - ఉపాసితవ్యం - సః - యః - ఏతత్ - ఏవం - వేద - అభి - హ - ఏనం - సర్వాణి - భూతాని - సంవాంచ్ఛంతి

| | | |
|---|---|---|
| తత్ | = | ఆ బ్రహ్మ శరీరములోనికి బ్రహ్మ రంధ్రము ద్వారా ప్రవేశించెను. ఆ ప్రదేశము నందనము అనే పేరు బడసెను. కావున |
| తత్+వనం+హ+నామ | = | అది నందనవనం అనే పేరు బడసెను. అక్కడ బ్రహ్మ వసియించును. కావున |
| తత్+వనం+ ఉపాసితవ్యం+ఇతి | = | బ్రహ్మను ఉపాసించి, ఆ ప్రదేశమునకు నందనవనమునకు సాధన ద్వారా చేరి ఆ బ్రహ్మ రంధ్రమును చించి బ్రహ్మమందు కలవవలయును- అని నా ఉపదేశం |
| యః+సః | = | ఎవరు యీ విధముగా |
| ఏతత్+ఏవం+వేద | = | దీనిని - ఈ బ్రహ్మను- ఆత్మనే దర్శించి ఆత్మతో ఏకీభూతమగుట తెలుసుకొని ఏకీభూతులగుదురో |
| సర్వాణి+భూతాని | = | సకల భూతములు |
| ఏనం | = | ఆ సాధకునిని |
| అభి+సంవాచ్ఛంతి+ హ | = | బ్రహ్మను సేవించునట్లు సేవించును. మఱియు అతనిని బ్రహ్మను ప్రార్థించినట్లు ప్రార్థించును. ఇదే బ్రాహ్మీ స్థితి. |

*****

7. ఉపనిషదం భో బ్రూహీత్యుక్తా త ఉపనిషద్
బ్రాహ్మీం వావ త ఉపనిషదమబ్రూమేతి

ఉపనిషదం - భోః - బ్రూహి - ఇతి - ఉక్తాః - త - ఉపనిషత్ - బ్రాహ్మీం - వావ - త - ఉపనిషదమ్ - అబ్రూమ - ఇతి

| | | |
|---|---|---|
| భోః | = | అయ్యా |
| ఉపనిషదం+బ్రూహి+ ఇతి+ఉక్తాః+వావ | = | బ్రహ్మ గుఱించి చెప్పండి- అని మీరు అడిగినారు అనగా ఈ విశ్వ నియామకు డెవడు? ఈ దేహేంద్రియ మనోబుద్ధులు ఎవని ఆజ్ఞకు లోబడి పని చేయు చున్నవి? ఈదేహము, మనస్సు, ఇంద్రియములు, ఎవని సంకల్పానుసారము పని చేయు చున్నవి? అని మీరు అడిగిరి. ఈ ప్రశ్నలతో పాటు అనుబంధముగా ఆత్మ లక్షణములు ఏమిటి? జీవుడు ఆత్మను ఎలా దర్శించవలయును? ఆత్మను దర్శించిన కలుగు లాభమేమిటి? అనే ప్రశ్నలు వేసుకొని |
| త (తే) | = | మీకు |
| ఉపనిషత్+ బ్రాహ్మీం | = | బ్రహ్మను గుఱించిన ఉపనిషత్‌ను వివరించితిని |
| త(తే) | = | మీకు |
| ఉపనిషదమ్+అబ్రూమ | = | ఆ విషయమును |
| ఇతి | = | చెప్పితిని |

*****

## స్నాతకోత్సవం

### సాధన గుఱించి - ఉపదేశం

**8.** తస్మై తపో దమః కర్మేతి ప్రతిష్ఠా
వేదాః సర్వాంగాని సత్యమాయతనమ్

తస్మై - తపః - దమః - కర్మ - ఇతి - ప్రతిష్ఠా - వేదాః - సర్వఅంగాని - సత్యమ్ - ఆయతనమ్

| | | |
|---|---|---|
| తస్మై | = | వారి కొఱకు- ఆ శిష్యుల కొఱకు సాధనను గురువు యిలా చెప్పుచున్నాడు. |
| కర్మ | = | పుణ్యకర్మానుష్ఠానము |
| దమః | = | బాహ్యేంద్రియ నిగ్రహము, అంతరేంద్రియ నిగ్రహము |
| తపః | = | తపస్సు |
| వేదాః+ సర్వ అంగాని | = | వేదములు, వేదాంగములు చదివి |
| సత్యం | = | సత్యమును పాటించి బ్రహ్మను దర్శించవలయును. ఆ బ్రహ్మమందు సర్వము |
| ప్రతిష్ఠా | = | ప్రతిష్ఠింపబడి యున్నది. ఆ బ్రహ్మయే |
| ఆయతనమ్+ఇతి | = | సర్వమునకు ఆధారము |

*****

-మంగళాచరణం-

9. యో వా ఏతామేవం వేదాஉపహత్య పాప్మాన
మనంతే స్వర్గే లోకే జ్యేయే ప్రతితిష్ఠతి ప్రతితిష్ఠతి

ఇతి చతుర్థః ఖండః

యః -వా - ఏతామ్ - ఏవం - వేద - అపహత్య - పాప్మానమ్ - అనంతే - స్వర్గేలోకే - జ్యేయే - ప్రతితిష్ఠతి - ప్రతితిష్ఠతి

| | | |
|---|---|---|
| యః+వా+ | = | ఎవరు నే చెప్పిన యీ సాధనలతో పాటు |
| ఏతామ్+ఏవం+ | | బ్రహ్మ చర్యం మొదలయినవి పాటించి |
| వేద | | బ్రహ్మను తెలుసుకొనిన వారు |
| పాప్మానం+అపహత్య | = | పుణ్యాపాప కర్మబంధముల నుంచి విముక్తులై |
| అనంతే+జ్యేమే | = | అనంత సుఖ ప్రదాయకమైన, సర్వోత్కృష్టమైన |
| స్వర్గేలోకే | = | బ్రహ్మ లోకము నందు |
| ప్రతితిష్ఠంతి | = | శాశ్వతముగా ఉందురు. |
| ప్రతితిష్ఠంతి | = | బ్రహ్మ లోక ప్రాప్తిని పొంది జనన మరణ వలయము నుంచి విడివడి బ్రహ్మయై విరాజిల్లి శాశ్వతముగా బ్రహ్మ స్థానమున ఉందురు. |

కేన ఉపనిషత్ సమాప్తము

*****

## శాంతి పాఠము

**హరిః ఓం. ఓం ఆప్యాయన్తు మమాంగాని వాౖక్ప్రాణ శ్చక్షుః శ్రోత్ర మథోబలమింద్రియాణి చ సర్వాణి సర్వం బ్రహ్మోపనిషదం మాஉహం బ్రహ్మ నిరాకుర్యాం మా మా బ్రహ్మ నిరాకరోద నిరాకరణ మస్త్వ నిరాకరణంమஉస్తు తదాత్మని నిరతే ఉపనిషత్సు ధర్మాస్తే మయి సన్తు తే మయి సన్తు.**

**ఓం శాంతిః శాంతిః శాంతిః**

*****

# యజుర్వేదము

"--అగ్నయే త్వా పరిదదామ్యసౌ సోమాయత్వా పరిదదామ్యసౌ । సవిత్రే త్వా పరిదదామ్యసౌ సరస్వత్యై త్వా పరిదదామ్యసౌ మృత్యువేత్వా పరిదదామ్యసౌ యమాయ త్వా పరిదదామ్యసౌ--దేవస్యత్వా సవితుః ప్రసవ ఉపనయనే ఉసౌ-- స్వస్తి మగ్ని ర్వాయు స్సూర్య శ్చన్ద్రమా ఆపోఉను సంచరంతి తాగ్ం స్వస్తి-- "

(కృష్ణ యజుర్వేదే తైత్తరీయారణ్యాక భాగః ఏకాగ్ని కాండే
ద్వితీయ ప్రపాఠకః తృతీయ ఖండః)

"వటువా! నిన్ను అగ్నికి ఇచ్చుచున్నాను. నిన్ను సోమునికి ఇచ్చుచున్నాను. సూర్య భగవానునికి ఇచ్చుచున్నాను. సరస్వతీదేవికి ఇచ్చుచున్నాను. మృత్యుదేవతయగు యమునికి ఇచ్చుచున్నాను. నీకు శుభము కలుగుగాక. నీకు అగ్నివాయువు సూర్యుడు చంద్రుడు జలదేవతలు శుభములు చేకూర్చెదరు గాక.''

బ్రహ్మ సంధత్తమ్ తన్మే జిన్వతమ్ । క్షత్ర సంధత్తమ్ తన్మే జిన్వతమ్ । ఇష సంధత్తమ్ తా మే జిన్వతమ్ । ఊర్జం సంధత్తమ్ తా మే జిన్వతమ్ । రయి సంధత్తమ్ తామే జిన్వతమ్ । పుష్టి సంధత్తం తా మే జిన్వతమ్ । ప్రజా సంధత్తమ్ । తామే జిన్వతమ్ । పశూన్ సంధత్తమ్ తాన్మే జిన్వతమ్ ।

(తైత్తిరీయ బ్రాహ్మణము - ప్రథమ ప్రపాఠకము, ప్రథమ అనువాకము)

ధర్మ పరులు, వేద వేదాంగ విదులు అయిన బ్రాహ్మణులతోనూ, ధర్మ పరిపాలనా దక్షులయిన క్షత్రియులతోనూ సాంగత్యమును కలుగజేసి, నాకు అన్నము, బలము, ధన ధాన్యములు, పుష్టి, సంతానము, పశువులనూ ఒసగి నన్ను సంతోష పరచెదవుగాక.

**ఓం శాంతిః శాంతిః శాంతిః**

SIDDHASHRAMAM
M: +91 8096065675 , P : +91 40 24240557
E : contactus@siddhashramam.org
W : www.siddhashramam.org

## శాంతి పాఠము

**ఓం సహనావవతు। సహనౌభునక్తు । సహ వీర్యం కరవావహై ।**
**తేజస్వినావధీతమస్తు । మా విద్విషావహై ॥**
**ఓం శాంతిఃశాంతిఃశాంతిః**

సహ -నా (నౌ) - అవతు - సహ - నౌ - భునక్తు - సహ - వీర్యం - కరవావహై - తేజస్వి - నా (నౌ) - అవధీతమ్ - అస్తు - మా - విద్విషావహై.

| | | |
|---|---|---|
| నౌ+సహ | = | ఆ పరమాత్మ గురు శిష్యులమైన మనల నిద్దఱిని |
| అవతు | = | రక్షించుగాక |
| నౌ+సహ | = | మనల నిద్దఱిని |
| భునక్తు | = | రక్షించుగాక |
| సహ+వీర్యం | = | యుద్ధంలో జయమును కాంక్షించి పోరు యుద్ధ వీరుని వీర్యం వలె అత్మ దర్శన ప్రాప్తికై |
| కరవావహై | = | పరిశ్రమించెదము గాక |
| నౌ+తేజస్వి+అవధీతమ్+ అస్తు | = | మాయిద్దఱి కృషి ఫలవంతమగుగాక |
| మా+విద్విషావహై | = | మేము పరస్పరము ద్వేషింపకుందుము గాక |

**ఓం శాంతిః శాంతిః శాంతిః**

# కఠోపనిషత్

నవనాథులలో ఒకరైన చౌరంగినాథుడు తపస్సు చేసిన ప్రదేశము చౌరంగి. ఇది ఉత్తర కాశీకి సుమారు 25 కిలోమీటర్ల దూరములో కలదు. ఈ చౌరంగి గ్రామము నుంచి సుమారు 3 కిలో మీటర్లు అడవిలో నడచి వెళ్ళిన నచికేత గుహ, ఆ గుహకు ముందు నచికేతుని పేరున వ్యవహరింపబడు ఒక చిన్న చెఱువు కలదు. గుహకు సమీపములో మఱియొక భూగర్భము కలదు. దీనినే యముని గుహగా చెప్పుదురు. చౌరంగి గ్రామమునకు దగ్గరలో ఉద్దాలకుని ఆశ్రమము కలదు. ఇప్పుడు ఆ గ్రామమును అతని పేరుననే వ్యవహరించుచున్నారు.

నచికేతుని గుహవద్ద అతని జన్మ వృత్తాంతమును తెలుపు గ్రంథమును చదివితిమి. ఆ గ్రంథములోని సారాంశము ఇది.

ఉద్దాలక మహర్షి ఒక రోజు బ్రహ్మ వద్దకువెళ్ళి తనకు భార్యను ప్రసాదించమని కోరినాడు. అంత బ్రహ్మ నీకు ముందు కొడుకు కలుగును. ఆ తరువాత భార్య గలుగును అని చెప్పినాడు. ఉద్దాలకుడు భూలోకమునకు వచ్చెను. ఒకనాడు అతడు గంగానది సమీపములో తిరుగుచుండగా అతని రేతస్సు పతన మైనది. ఆ రేతస్సును ఒక ఆకును గిన్నెగా చేసి అందులో ఉంచి, ఒక దర్భను కూడ ఆ గిన్నెలో ఉంచి గంగానదిలో ఉంచెను. కొంత సమయము గడవగా ఒక రాకుమార్తె తన చెలికత్తెలతో స్నానార్థము గంగకు వచ్చి కుతూహలంతో ఆ గిన్నెలో ఏమి ఉన్నదో చూడతలచి ఆ గిన్నెలోని దానిని వాసనచూడగా ఆ రాకుమార్తె గర్భవతి అయినది. లోకనిందకు వెఱచి, ఆ రాకుమార్తె బాలుని గనగానే అతనిని ఒక పెట్టెలో పెట్టి గంగలో విడచెను. దైవయోగమున ఆ పెట్టె స్నానార్థము గంగకు వచ్చిన ఉద్దాలక మహర్షికి దొరికెను. అతడు ఆ కుమారుని పెంచుకొను చుండెను. కుఱ్ఱవాడు ఉద్దాలకుని ఆశ్రమంలో పెరుగుచూ అతనిని తండ్రిగా భావించు చుండెను. ఇది ఇటులుండ రాజు తన కుమార్తె గర్భవతి యగుట, ఆ కుఱ్ఱవానిని గంగలో విడచుట తెలిసి ఆ రాకుమార్తెను అరణ్యములో విడచి రమ్మని పంపెను. ఆమె ఉద్దాలకుని

ఆశ్రమ సమీపంలోనికి వచ్చి ఈకుమారుడు తన కుమారుడని గుర్తించెను. ఉద్దాలకుడు సర్వము ఆమె ద్వారా తెలుసుకొని ఆమెను భార్యగా చేసుకొనెను. ఆ రాకుమార్తె పేరు చంద్రావతి. ఆమె నాసికద్వారా వాసన చూచుట వలన జన్మించినందున ఆ కుఱ్ఱవాడు నచికేతుడుగా ప్రసిద్ధుడయ్యెను.

బ్రహ్మ చెప్పినట్లు ముందు కుమారుడు ఆపై భార్య గలిగినది. ముండక ఉపనిషత్తులో అథర్వుడు బ్రహ్మను చేరి బ్రహ్మవిద్యను నేర్చుకొనెను. కైవల్య ఉపనిషత్తులో అశ్వలాయనుడు బ్రహ్మను చేరి బ్రహ్మవిద్యను నేర్చుకొనెను. బ్రహ్మ యనగా సృష్ట్యాది యందు గల ఆదిపురుషుడని అర్థము. ఆ ఆది పురుషుడే కాలస్వరూపమున తనసృష్టిని లయము చేయును. అప్పుడు అతనిని కాలుడు అని అందురు. ఆ కాలుడే యమునిగా యిందు వ్యవహరింపబడినాడు. ఈ ఉపనిషత్తులో నచికేతుడు బ్రహ్మను చేరి (యముని చేరి) బ్రహ్మవిద్యను నేర్చుకొనెను. బ్రహ్మవిద్యను చెప్పగలవాడు బ్రహ్మయే గావున వీరు బ్రహ్మను చేరి ఆత్మతత్త్వమును గ్రహించిరి.

బ్రహ్మ విద్య గుఱించి అన్ని విషయములు ఒక చోటనే చెపితే హృదయానికి హత్తుకొనవు సరిగదా విసుగు గలుగును. ఆత్మవిద్య చాలాక్లిష్టము గావున ఒక చక్కని కథగా చెప్పి ప్రధాన కథ నడుచుచుండగా సందర్భోచితముగా ఆధ్యాత్మిక విషయములు, ధర్మాధర్మములు చెప్పినచో అవి హృదయమునకు హత్తుకొనును.

ఈ కథలో ముఖ్యముగా
- కథ ఇతి హాసముగా పైకి కనిపించుచూ
- అంతర్లీనముగా ఆధ్యాత్మ విషయములు
- ఆత్మ దర్శనము చేయువిధానము
- అపరవిద్యకు సంబంధించిన లోకవ్యవహారములు ధర్మాధర్మములు
- వర్ణనలు ఇవి అన్నీ కలసి వుండును.

కథ చెప్పుటకు ఒక సన్నివేశముగావలయును. ఒక విషయమును ప్రస్తావించుటకు పూర్వరంగము కావలయును. ఈ సంప్రదాయములను వాల్మీకి మహర్షి, వ్యాసభగవానులు తమ తమ గ్రంథములలో ప్రవేశపెట్టినారు.

బ్రహ్మవిద్య నేర్చుకొనుటకు :

సర్వసంగ పరిత్యాగము, భార్యాపుత్రాదులందు సంసారమునందు ఆపేక్షలేక ఉండుట, పుణ్యకర్మాచరణము, ధర్మాధర్మముల జ్ఞానము, పుణ్యకర్మల వలన గలుగు ఫలితములందు నిర్వేదము, భూలోక, పరలోక సుఖములందు విముఖత, ఆత్మతత్త్వము తెలుసుకొనవలయుననే తీవ్ర ఆకాంక్ష. ఇవి యుండవలయును. ఈ విషయములనే ప్రథమవల్లిలో చెప్పినారు. యముడు నచికేతునకు మూడు వరములు అనుగ్రహించుట అనే నెపంతో పై విషయములు ప్రథమవల్లిలో ప్రస్తావించినాడు. అంతేగాని యముడు మూడు రోజులు ఇంట్లో లేడనగానే ఆ మూడు రోజులు నరకమును ఎవరు పరిపాలించిరి అని గాని, నచికేతునకు భోజనము పెట్టుటకు యముని యింట్లో యముని భార్య లేదా అని గాని ఆలోచించరాదు. కథలో చెప్పిన ప్రధాన విషయమునందే దృష్టిని కేంద్రీకరించి తత్త్వమును గ్రహించవలయును.

ఈ ఉపనిషత్తులో నలుగురు పాత్రధారులు కలరు :

1. ఋషి - కథ చెప్పు చున్నాడు. 2. అతని శిష్యులు - కథను వింటున్నారు. 3. యముడు - ఆత్మవిద్యను బోధించు జగద్గురువు. 4. నచికేతుడు- ఆత్మవిద్యను గ్రహించగోరు విద్యార్థి.

భగవద్గీతలో కూడా ఇదేవిధముగా నలుగురు కలరు :

1. సంజయుడు, 2. ధృతరాష్ట్రుడు, 3. శ్రీకృష్ణుడు, 4. అర్జునుడు.

వేద, పురాణములలోని ప్రతికథ రూఢికార్థముతోనూ, యౌగికార్థంతోనూ కూడి ఉండును. ఈవిధముగా చెప్పటం ఋషుల పద్ధతి. ప్రారంభస్థాయి గల వాళ్ళకు మొదట కథగా చెప్పుదురు. ఆరూఢ స్థాయిలోని వారికి అధ్యాత్మ రహస్యములు చెప్పుదురు. ఆ విధానములను ఆచరించిన జన్మసాఫల్యము నొందుదురు.

*****

# ప్రథమ వల్లీ

**ఋషి తన శిష్యులకు కథగా చెప్పుచున్నాడు.**

**1. ఉశన్ హ వై వాజశ్రవసః సర్వవేదసం దదౌ**
**తస్య హ నచికేతా నామ పుత్ర ఆస**

ఉశన్ - హ - వై - వాజశ్రవసః - సర్వవేదసం - దదౌ - తస్య - హ - నచికేతాః - నామ - పుత్రః - ఆస.

| | | |
|---|---|---|
| హ+వై | = | అనగనగా ఒకప్పుడు |
| వాజశ్రవసః | = | గౌతమ వంశస్థుడగు వాజశ్రవుని కుమారుడు అయిన ఉద్దాలకుడు |
| ఆస | = | ఉండెను |
| తస్య | = | అతనికి |
| నచికేతాః+నామ+పుత్రః | = | నచికేతుడనే పేరుగల కుమారుడు గలడు |
| ఉశన్ | = | ఆ ఉద్దాలకుడు ఆత్మతత్త్వము పొందగోరి |
| సర్వవేదసం+దదౌ+హ | = | తన సమస్తమును దానం చేసెను. అనగా ఇచ్చుటకు ఏమీలేవు. సర్వసంగ పరిత్యాగి అయ్యెను. సాధారణముగా సంసారులు ధనకనక వస్తు వాహనములను సంపాదించుట, వాటిని రక్షించుట యందే కాలము గడుపుదురు. ఇట్టి వారు ఆత్మ తత్త్వమును గ్రహించలేరు. కావున వాటి యందు మమకారము, సంసార తాపత్రయములు ఉండ రాదు. ఈ విషయమునే సర్వమును దానము చేసినట్లుగా చెప్పినాడు. |

ఆత్మతత్త్వము గ్రహించ గోరువాడు :

1. ధనకనక వస్తు వాహనములపై మమకారము ఉండరాదు, 2. సంసార తాపత్రయములో కూరుకొని, భార్య, పిల్లలు, బంధువులు గురించి-వారిపై ఆపేక్ష, మమకారము, మోహము గలిగి యుండరాదు.

ఇక్కడతో ఉద్దాలకుని పరంగా సాధన రహస్యములు సంక్షిప్తముగా ఋషి వివరించినాడు. ఉద్దాలకుడు 1. సర్వము దానము చేసినాడు, 2. సంసార తాపత్రయములను వదలినాడు. బుద్ధిని పరమాత్మయందుంచి, 3. తను పరమాత్ముని సేవలో జీవితం గడుపుచున్నాడు. ఇదే భక్తి. దాని వలన ఇతడు జీవన్ముక్తుడయినాడు.

*****

**ఋషి చెప్పుచున్నాడు.**

**2. తగ్ం హ కుమారగ్ం సంతం దక్షిణాసు**
**నీయమానాసు శ్రద్ధా ఽ ఽ వివేశ సో ఽ మన్యత**

తం - హ - కుమారం - సంతం - దక్షిణాసు - నీయమానాసు - శ్రద్ధా - ఆవివేశ - సః - అమన్యత

| | | |
|---|---|---|
| తం+కుమారం+ | = | నచికేతుడు బాలుడుగా ఉన్నప్పటికి |
| సంతం+హ | | అతనికి ఆత్మ తత్త్వము గ్రహించుట యందు |
| శ్రద్ధా | = | శ్రద్ధ |
| అవివేశ | = | కలిగినది |

బ్రహ్మమును శ్రద్ధ, భక్తి, ధ్యాన యోగము ద్వారా గ్రహించ వలయును. కావున నచికేతునికి శ్రద్ధ కలిగినది. సాధన చిన్న వయసు నుండి చేయవలయును. **'గౌమార సమయంబున మనీషా గరిష్ఠుండై పరమ భాగవత ధర్మంబు ననుష్ఠింప వలయు'**

(భాగవతము- సప్తమ స్కంధము- 213)

| | | |
|---|---|---|
| సః | = | అతడు - ఆ నచికేతుడు, వాళ్ళనాన్న పుణ్య ఫలితము కోరక |
| దక్షిణాసు+ | = | దక్షిణగా తీసికొనిపోబడుచుండగా |
| నీయమానాసు (సత్సు) | | వాటి యందు - దృష్టి నిల్పి తన మనసులో పుణ్య ఫలితము కోరరాదని |
| అమన్యత | = | తలచెను. |

*****

ఇందు అన్యాపదేశంగా గోదాన లక్షణములను చెప్పినాడు. గోదానము ఇచ్చునపుడు ఇటువంటి గోవులను దానం చేయరాదు అని దీని భావము.

*****

**ఋషి గోదాన లక్షణములను చెప్పుచున్నాడు.**

**3. పీతోదకా జగ్ధతృణా దుగ్ధదోహా నిరింద్రియాః**
**అనందా నామ తే లోకాస్తాన్ స గచ్ఛతి తా దదత్**

పీతోదకాః - జగ్ధతృణాః - దుగ్ధదోహాః - నిరింద్రియాః - అనందాః - నామ - తే - లోకాః - తాన్ - సః - గచ్ఛతి - తాః - దదత్.

| | | |
|---|---|---|
| పీతోదకాః+జగ్ధతృణాః | = | నీరు త్రాగలేనివి, గడ్డితినలేనివి, పాలు |
| దుగ్ధదోహాః+నిరింద్రియాః | | యివ్వనివి, సంతానోత్పత్తికి పనికిరాని ముసలివి అయిన |
| తాః | = | ఇటువంటి గోవులను |
| దదత్+సః | = | దానము యిచ్చినవాడు |
| అనందాః+నామ | = | ఆనంద రహితమయి దుఃఖ జనితమయిన |
| తే+లోకాః | | ఆ చీకటిలోకాలకు |
| తాన్ | = | వాటిని, అనగా అటువంటి గోవులను దానము యిచ్చినవాడు. |
| గచ్ఛతి | = | వెళ్ళును |

*****

నచికేతుడు కాల స్వరూపుడయిన పరమాత్మ వద్దకు (యముని వద్దకు) వెళ్ళుట గుఱించి కారణమును ప్రతిపాదించుచున్నాడు.

**నచికేతుడు చెప్పుచున్నాడు.**

**4. స హో వాచ పితరం తత కస్మై మాం దాస్యసీతి**
**ద్వితీయం తృతీయం త హో వాచ మృత్యవే త్వా దదామితి**

సః - హ - ఉవాచ - పితరం - తత - కస్మై - మాం - దాస్యసి - ఇతి - ద్వితీయం - తృతీయం - తం - హ - ఉవాచ - మృత్యవే - త్వా - దదామి - ఇతి

| | | |
|---|---|---|
| సః | = | ఆ నచికేతుడు |
| తత | = | ఓ తండ్రీ |
| మాం+కస్మై+ | = | నన్ను ఎవరికి దాస్యము చేయుటకు అనగా |
| దాస్యసి+ఇతి | | సేవచేయుటకు ఇచ్చుచున్నావు అని |
| ద్వితీయం+తృతీయం | = | రెండు మూడు పర్యాయములు |
| పితరం | = | తండ్రితో |
| ఉవాచ | = | పల్కెను. |
| హ | = | గురువును సేవించి సాధన రహస్యములను గ్రహించ వలయును.కావున నన్ను ఏ గురువు వద్దకు విద్యాభ్యాసమునకై పంపుచున్నావని రెండు మూడు పర్యాయములు అడిగెను. ఉద్దాలకుడు ఇట్లు పలికెను. |
| త్వా(త్వాం) | = | నిన్ను |
| మృత్యవే | = | కాలస్వరూపుడయిన పరబ్రహ్మకు దాస్యము చేయుటకు, గురుసేవ చేయుటకు |
| దదామి+ఇతి | = | ఇచ్చితిని అని |
| తం+ఉవాచ+ | = | నచికేతునితో ఉద్దాలకుడు పలికెను |
| హ | | పరమాత్మకు దాస్యము చేసిన భవబంధ విమోచనము అని గుర్తించి ఉద్దాలకుడు పుత్రునిని దాస్యమునకై పరమాత్మ వద్దకు పంపెను. |

**సంసార జీమూత సంఘంబు లిచ్చునే ? చక్రి దాస్యప్రభంజనము లేక**

(భాగవతము, సప్తమస్కంధము-171)

అని ప్రహ్లాదుడు తన తండ్రితో పలికినాడు.

నచికేతుడు అన్నది ఒక వ్యక్తి వాచకము. నచికేతుడు అనేవాడు ఉద్దాలకుని వీర్యము ఒక రాకుమార్తె వాసన చూడగా పుట్టినాడు. ఇలా లోకవ్యవహారములలో జరుగదు. ఇటువంటి కథలు మనము వినగానే యిందులోని యౌగికార్థమును గురుముఖతా గ్రహించవలయును. ఇటువంటి కథలు బ్రహ్మవిద్యకు సంబంధించినవి. వీటిని లౌకిక అర్థముతో చదవరాదు.

నచికేతుడనగా ఎవరో అనే విషయాన్ని ఋషి ముందు రాబోవు శ్లోకములలో చెప్పుచున్నాడు. ఆత్మతత్త్వము ఒకరు చెపితే అర్థము కాదు. వేదవేదాంగములు చదివినా అర్థము కాదు. పుణ్యకర్మానుష్ఠానం చేత ఆత్మను దర్శింపలేము. ఆత్మతత్త్వమును బుద్ధిని పరమాత్మయందుంచి ధ్యానము చేసి బుద్ధిద్వారా స్వానుభవంతో ఆత్మను దర్శించవలయును. **నచికేతుడనగా బుద్ధి**. ఉద్దాలకుడు స్వానుభవంతో బుద్ధిద్వారా ఆత్మను దర్శించినాడు. ఈ విషయమును యింత సూటిగా గాక గూఢముగా గూఢార్థముతో కథగా చెప్పినాడు. ఆత్మ తత్త్వమును బుద్ధి ద్వారా గ్రహించవలయును. స్వానుభవంతో అత్మను దర్శించవలయును.

*****

### నచికేతుని స్వగతం

5. **బహూనా మేమి ప్రథమో బహూనా మేమి మధ్యమః**
   **కిం స్విత్ యమస్య కర్తవ్యం యన్మయాద్య కరిష్యతి**

బహూనాం - ఏమి - ప్రథమః - బహూనాం - ఏమి - మధ్యమః - కిం - స్విత్ - యమస్య - కర్తవ్యం - యత్ - మయా - అద్య - కరిష్యతి.

| | | |
|---|---|---|
| బహూనాం+ఏమి+ప్రథమః | = | అనేక మందిలో నేను ప్రథముడను |
| బహూనాం+ఏమి+మధ్యమః | = | అనేకమందిలో నేను మధ్యముడను. |
| యమస్య | = | యమునికి నాతో |
| కిం+కర్తవ్యం | = | ఏమి పని |

| | | |
|---|---|---|
| యత్+మయా | = | నా చేత |
| అద్య+స్విత్ | = | ఇప్పుడు ఏమి దాస్యము |
| కరిష్యతి | = | చేయించును |

జ్ఞానం - మనస్సు - బుద్ధి - చిత్తం - అహంకారం అనే యీ ఐదింటిలో బుద్ధి - మధ్యముడు. ఎవరినయినా ప్రశంసించేటప్పుడు - వాడు బుద్ధిమంతుడని ఎవరినయినా తిట్టేటప్పుడు - నీకు బుద్ధి లేదా అని చెప్పుదురు. కావున అన్నింటికంటె ముఖ్యమైనది బుద్ధి. కావున బుద్ధి ప్రథమ శ్రేణిలో గణింపబడును. బుద్ధి ద్వారా ఆత్మ తత్త్వమును గ్రహించవలయునన్నది సారాంశము. గురువును సేవించి బ్రహ్మవిద్యను గ్రహించవలయును. కావున గురుసేవకై నచికేతునిని యముని వద్దకు పంపినాడు.

*****

**ఋషి చెప్పుచున్నాడు.**

**6. అనుపశ్య యథా పూర్వే ప్రతిపశ్య తథాఽపరే**
**సస్య మివ మర్త్యః పచ్యతే సస్యమివా జాయతే పునః**

అనుపశ్య - యథా - పూర్వే - ప్రతిపశ్య - తథా - అపరే - సస్యమ్ - ఇవ - మర్త్యః - పచ్యతే - సస్యమ్ - ఇవ - అజాయతే - పునః

సామాన్యముగా గృహస్థులు సంసారములో పడి భార్య, పుత్రులు గృహము సంపద అనే వాటియందు మమకారము గలిగి , అజ్ఞానంలో పడి ఆత్మతత్త్వము ఎఱుంగక పుట్టుచూ చనిపోవుచూ, ఇలా జనన మరణ వలయంలో చిక్కుకొని మోక్షమార్గంబు గాన లేకయున్నారు. దీనినే వరి పంటను ఉదాహరణగా తీసుకొని ఋషి చెప్పుచున్నారు.

| | | |
|---|---|---|
| మర్త్యః | = | సామాన్య మానవులు, సంసారులు |
| సస్యమ్+ఇవ | = | వరి పంటవలె |
| పచ్యతే | = | పండి రాలిపోవుచున్నారు. అనగా మరణ సమయం రాగానే మరణించుచున్నారు. |

| | | |
|---|---|---|
| పునః | = | మరల, వారి కర్మానుసారము |
| సస్యమ్+ఇవ+అజాయతే | = | వరి పంటవలె పుట్టుచున్నారు. ఈవిధముగా జనన మరణ వలయములో తిరుగుచూ మృత్యువు యొక్క ఆవలి తీరమును చేరలేకయున్నాడు. |

ఇలా పుట్టని చావని త్రోవ వెతుకుకొనుట దొడ్డబుద్ధి. కావున

| | | |
|---|---|---|
| అపరే+పూర్వే | = | మోక్షమార్గమును పొందిన ఇతర సాధకులు మఱియు మీ పూర్వులు అనగా ఉద్దాలకుడు, నచికేతుడు మొదలయినవారు |
| యథా | = | సంసారములో వుండి మోక్షమును పొందుటకు ఏ విధముగా ఆచరించిరో వారి ఆచరణ విధానమును |
| అనుపశ్య | = | గమనించుము ఓ సాధకుడా |
| తథా | = | ఆ ప్రకారముగా |
| ప్రతిపశ్య | = | గమనించి వారివలె ఆచరింపుము. |

*****

**అతిథిని పూజింపవలయును అనే**

**అపర ధర్మములను ఋషి చెప్పుచున్నాడు.**

**7. వైశ్వానరః ప్రవిశత్యతిథి ర్బ్రాహ్మణో గృహాన్**
**తస్యైతాం శాంతిం కుర్వంతి హర వైవస్వతోదకమ్**

వైశ్వానరః - ప్రవిశతి - అతిథిః - బ్రాహ్మణః - గృహాన్ - తస్య - ఏతాం - శాంతిం- కుర్వంతి - హర - వైవస్వత - ఉదకం

ధర్మమూర్తి అయిన యముడు కూడా తను ధర్మాన్ని ఆచరించి ఇతరులకు ఆదర్శమూర్తిగా ఉండవలయును. జ్ఞానికూడ ఇతరులకు ఆదర్శముగా ఉండుటకు పుణ్య కర్మలు శ్రద్ధగా చేయవలయును అనే విషయమును ఋషి ప్రతిపాదించు చున్నాడు.

| | | |
|---|---|---|
| వైవస్వత | = | కర్మసాక్షియగు సూర్యభగవానుని పుత్రుడా ! పవిత్రుడయిన |
| వైశ్వానరః+బ్రాహ్మణః | = | అగ్నిహోత్రుని వంటి బ్రాహ్మణ కుమారుడు |
| అతిథిః | = | అతిథిగా |
| ప్రవిశతి | = | ప్రవేశించెను |
| తస్య | = | ఆ బ్రాహ్మణ కుమారునికి |
| ఉదకం+హర | = | నీటిని తెచ్చి అర్ఘ్యపాద్యాది విధులచే అతిథి యగు నచికేతుని పూజింపుము. |
| ఏతాం+శాంతిం+ గృహాన్+ కుర్వంతి | = | బ్రాహ్మణ అతిథిని అర్ఘ్యపాద్యాది విధులచే గృహస్థులు పూజించుచున్నారో అనగా పూజింప వలయును. |

ఇందు అతిథి పూజయనే ధర్మాన్ని మనకు, ఋషి చెప్పినాడు.

*****

ఎంత ధర్మాన్ని ఆచరించినా ఒక్కనిషేధమును ఆచరించినచో పుణ్య ఫలితము సర్వము నశించిపోవును ఇదే విషయమును ఋషి తన శిష్యులకు చెప్పుచున్నాడు.

8. **ఆశా ప్రతీక్షే సంగతం సూనృతాం చేష్టా పూర్తే పుత్ర పశూంశ్చ సర్వాన్ ఏతద్వృంక్తే పురుషస్యాఽల్పమేధసో యస్యా ఽనశ్నన్ వసతి బ్రాహ్మణోగృహే**

ఆశాప్రతీక్షే - సంగతం - సూనృతాం - చ - ఇష్టాపూర్తే - పుత్ర పశూన్ - చ - సర్వాన్ - ఏతత్ - వృంక్తే - పురుషస్య - అల్పమేధసః - యస్య - అనశ్నన్ - వసతి - బ్రాహ్మణః - గృహే.

| | | |
|---|---|---|
| బ్రాహ్మణః | = | బ్రాహ్మణుడు |
| యస్య+అల్పమేధసః+ పురుషస్య+గృహే | = | అల్ప బుద్ధిగల ఏ పురుషుని యొక్క గృహమందు |
| అనశ్నన్+వసతి | = | భోజనము లేకుండా ఉపవాసముండునో ఆ ఇంటి యజమాని యొక్క |

| | | |
|---|---|---|
| ఏతత్+సంగతం+ | = | సజ్జన సాంగత్యము వలన గలిగిన పుణ్యము |
| సూనృతాం | | సత్యవాక్ పరిపాలన వలన గలిగిన పుణ్యము |
| ఇష్టాపూర్తే+చ | = | ఇష్టాపూర్తములయిన యజ్ఞయాగాదులు, నూతులు మొదలయినవి నిర్మించుట వలన గలిగినపుణ్యము. ఇటువంటి అనేక పుణ్యకార్యములు చేయుట వలన గలిగిన పుణ్యము అంతయు బ్రాహ్మణ అతిథిని అభోజనునిగా ఉంచుట వలన |
| ఆశాప్రతీక్షే+సర్వాన్+ | = | ఆ పుణ్య ఫలితము వలన గలుగు |
| పుత్రాన్ పశూన్+చ | | సర్వాభీష్ట సిద్ధులు, పుత్రులు, పశువులు-సర్వ సంపదలు ఈ సర్వము |
| వృంక్తే | = | నశించును. అనగా దీని అర్థము పుణ్యము సర్వము నశించి పాపము గలుగును. దాని వలన అతనికి ఊర్ధ్వలోక ప్రాప్తిపోయి చీకటి లోకముల ప్రాప్తి (నరకనివాసము) గలుగును. |

*****

యముడు నచికేతునకు మూడు వరములు అనుగ్రహించుటకు తగిన భూమికను కథా పరంగా ఋషి ఏర్పరచినాడు.

**9. తిస్రో రాత్రీ ర్యదవాత్సీ ర్గృహే మేఽనశ్నన్ బ్రహ్మన్నతిథి ర్నమస్యః**
**నమస్తేఽస్తు బ్రహ్మన్ స్వస్తిమేఽస్తు తస్మాత్ ప్రతి త్రీన్ వరాన్ వృణీష్వ**

తిస్రః - రాత్రీః - యత్ - అవాత్సీః - గృహే - మే - అనశ్నన్ - బ్రహ్మన్ - అతిథిః - నమస్యః - నమః - తే - అస్తు - బ్రహ్మన్ - స్వస్తి - మే - అస్తు - తస్మాత్- ప్రతి - త్రీన్ - వరాన్ - వృణీష్వ

| | | |
|---|---|---|
| బ్రహ్మన్ | = | భగవత్ స్వరూపుడవయిన బ్రాహ్మణుడా |
| నమస్యః+అతిథిః (సన్) | = | పూజార్హుడవైన అతిథిగా |
| మే+గృహే | = | నా గృహమందు |

| | | |
|---|---|---|
| అనశ్నన్ | = | భోజనము లేకుండా |
| తిస్రః+రాత్రీః+ | = | మూడు రాత్రులు |
| యత్+అవాత్సీః | = | ఉండిరి కావున |
| తస్మాత్ | = | ఆ కారణమున |
| బ్రహ్మన్ | = | ఓ బ్రాహ్మణుడా |
| ప్రతి+త్రీన్+వరాన్ | = | మీరు ఆ దోషనివార్థమై మూడు వరములు |
| వృణీష్వ | = | కోరుకొనుడు |
| తే+ నమః+ అస్తు | = | మీకు నమస్కారము |
| మే+స్వస్తి+అస్తు | = | నాకు శుభము గలుగగాక అని మీరు దీవింపుడు |

పుణ్యకర్మానుష్ఠాన పరులు పుణ్యఫలితము కోరి బ్రహ్మలోకము చేరి, పుణ్యము క్షీణించగానే తిరిగి భూలోకమున జన్మింతురు.

*****

**నచికేతుని ప్రథమ వరము**

**10. శాంత సంకల్ప స్సుమనా యథా స్యాత్ వీతమన్యు ర్గౌతమో మా ఉభి మృత్యో త్వ త్ప్రసృష్టం మాఉభి వదేత్ప్రతీత ఏతత్రయాణాం ప్రథమం వరం వృణే**

శాంత సంకల్పః - సుమనాః - యథా - స్యాత్ - వీతమన్యుః - గౌతమః - మా - అభి - మృత్యో - త్వత్ - ప్రసృష్టం - మా - అభి - వదేత్ - ప్రతీతః - ఏతత్ - త్రయాణాం - ప్రథమం - వరం - వృణే.

**కథా పరంగా**

| | | |
|---|---|---|
| మృత్యో | = | ఓ యమధర్మరాజా! |
| గౌతమః | = | గౌతమ వంశజుడయిన మా తండ్రియగు ఉద్దాలకుడు |
| వీతమన్యుః | = | కోపరహితుడై, |
| శాంతసంకల్పః | = | శాంతమనస్కుడై, |
| సుమనాః | = | నిర్మలమనస్కుడై |

| | | |
|---|---|---|
| యథా+స్యాత్ | = | నేను తిరిగి భూలోకమునకు వెళ్ళిన తరువాత ఉండుగాక |
| త్వత్+ప్రసృష్టం | = | నీ అనుగ్రహమున పంపబడిన నన్ను మా తండ్రి |
| మా+అభి+ప్రతీతః (సన్) | | చూచి తన కుమారునిగా గుర్తించినవాడై |
| మా+అభి+వదేత్ | = | నన్ను ప్రేమతో పలకరించుగాక |
| ఏతత్+త్రయాణాం | = | తమరు నాకు యిచ్చిన ఆ మూడు వరములలో |
| ప్రథమం+వరం+వృణే | = | ఇది మొదటి వరము. ఈ వరమును ప్రసాదింప కోరుచున్నాను. ఈ వరమును అనుగ్రహింపుము. |

**యౌగిక అర్థంగా**

| | | |
|---|---|---|
| గౌతమః | = | గౌ అనగా ఇంద్రియములు. తమః అనగా చీకటి అనగా ప్రారంభములో సాధకుడు ఇంద్రియలోలుడై తమో గుణయుతుడై యున్నను సాధన చేసి ఆత్మదర్శనము చేసినచో (యమునిని చూచుట అనగా ఆత్మదర్శనము) |
| యథా వీతమన్యుః | = | కోపరహితుడు |
| శాంతసంకల్పః | = | ద్వందాతీతుడై - సుఖదుఃఖములందు విచలితుడు గాక త్రిగుణాతీతుడై శాంతత్వము గల వాడై శాంతిని పొందును. |
| సుమనాః | = | నిర్మల మనస్కుడు అయి |
| స్యాత్ | = | జీవన్ముక్తుడగును అనగా నద్వేష్టి నకాంక్షతి నశోచతి అని చెప్పినట్లు ఉండును. |

**పుణ్యకర్మానుష్ఠానపరంగా**

పుణ్యకర్మలు అనుష్ఠించి పుణ్యఫలితమును కోరినవారు బ్రహ్మ లోకము చేరి భోగభాగ్యములు అనుభవించి పుణ్యము క్షీణించగనే తిరిగి బ్రహ్మలోకము నుండి భూలోకమునకు వత్తురు.

ఈ విధంగా కథగా యముడు నచికేతునకు వరము అనుగ్రహించుట, పుణ్యకర్మానుష్ఠానపరులకు గలుగు ఫలితము. ఆత్మదర్శనము చేసిన వారికి గలుగు జీవన్ముక్తత్వములనే మూడింటిని కలిపి యిందు చెప్పినాడు. ఈపద్ధతులే మనకు రామాయణం, భాగవతములలోని ప్రతికథలోనూ కనిపించును. అందులోని కథలు రూఢి అర్థములో జరిగిన కథలు అవే కథలలో యౌగికార్థము సాధన రహస్యములు ఉండును. అలా చెప్పవలయును అని అనుకునేటప్పుడు లోకవిరుద్ధమైన అసహజ మయిన విషయాన్ని ఋషి ప్రవేశపెట్టును.

ఉదా: 1. వాలి, సుగ్రీవులకు తండ్రే తప్ప తల్లిలేదు.

2. ద్రుపదుని తండ్రి పృషతుడు. అతడు మేనకను చూచెను. అప్పుడతిని రేతస్సు పతనమయినది. ఆ రేతస్సును కాలితో తొక్కినాడు. అంత ద్రుపదుడు పుట్టినాడు.

3. ఇల అనే రాజు ఒక అరణ్యంలోనికి (కుమార వనము) వెళ్ళగానే ఆడపిల్ల అయినాడు.

ఈ విధముగా పురాణములలోని అన్ని కథలు ఉండును. వాటిని ఆధ్యాత్మిక భావన తెలిసిన వారినుంచే గ్రహించవలయును.

*****

యముడు చెప్పుచున్నాడు

**11. యథా పురస్తాద్భవితా ప్రతీత ఔద్దాలకి రారుణిః మత్ప్రసృష్టః సుఖం**
**రాత్రీశ్శయితా వీతమన్యుః త్వాం దదృశివాన్ మృత్యుముఖాత్ప్రయుక్తమ్**

యథా - పురస్తాత్ - భవితా - ప్రతీతః - ఔద్దాలకిః - ఆరుణిః - మత్ప్రసృష్టః - సుఖం - రాత్రీః - శయితా - వీతమన్యుః - త్వాం - దదృశివాన్ - మృత్యుముఖాత్ - ప్రయుక్తం.

**కథాపరంగా**

ఆరుణిః+ఔద్దాలకిః = అరుణుని కుమారుడయిన ఉద్దాలకుడు

మత్ప్రసృష్టః = నా నుండి పంపబడి

| | | |
|---|---|---|
| మృత్యుముఖాత్+ | = | జననమరణ వలయము నుండి విడివడిన |
| ప్రయుక్తం+త్వాం | | నిన్ను చూచి, నిన్ను తన కుమారునిగా గుర్తించిన వాడై |
| ప్రతీతః+దదృశివాన్+ | = | పూర్వమువలె ఉన్నవాడై- పూర్వము వలె |
| యథా+పురస్తాత్+ భవితా | | నీయందు ప్రేమతో |
| వీతమన్యుః+సుఖంరాత్రీః | = | కోపము లేక రాత్రులు సుఖముగా |
| శయితా | = | నిద్రించును. |

**పుణ్యకర్మానుష్ఠానము**

యముని పట్టణము వేఱు, యముని గృహము వేఱు, యమలోకము వేఱు. యముని పట్టణము సంయమి అనునగరము. మేరు పర్వత శిఖరముపై బ్రహ్మపురము ఉంది. ఆ బ్రహ్మపురానికి ఎనిమిది దిక్కులలోనూ అష్టదిక్పాలుల పట్టణములు ఉన్నవి.

ఆత్మదర్శనము చేసినవాడు సంసారములో ఉండియు సంసారములో చిక్కుకొనక ఉండును. అట్టి యోగి శాంతత్త్వము గలిగి సుఖముగా శయనించును. యముని గృహము-ఇందు యముడు, అతని భార్యలు మొదలయిన వారు ఉందురు.

యమసభ - యముని పట్టణము - పుణ్యలోకము- పుణ్యవంతులు ఉందురు. యమలోకము - చీకటిలోకము. పాపులు శిక్షింపబడుదురు.

నచికేతుడనే సాధకుడు పుణ్యకర్మానుష్ఠానము వలన పుణ్యలోకము అయిన యముని పట్టణమునకు చేరినాడు. ఆ తరువాత యముని ఇంటికి వెళ్ళినాడు. యమునిచే అర్ఘ్యపాద్యాది విధులచే పూజింపబడినాడు. పుణ్యము వలన గలిగే ఫలితము పుణ్యలోక ప్రాప్తి గలిగినది. ఆ పుణ్యానుభవము క్షీణించగానే తిరిగి పునర్జన్మకు భూలోకమునకు వత్తురు. అనగా పుణ్యలోకప్రాప్తి అన్నది అశాశ్వతము. పునర్జన్మప్రాప్తి గలుగును.

*****

**ఋషి స్వర్గలోకమును వర్ణించుచున్నాడు**

**12. స్వర్గేలోకే న భయం కిం చ నాస్తి న తత్ర త్వం న జరయా బిభేతి**
**ఉభే తీర్త్వా అశనాయా పిపాసే శోకాతిగో మోదతే స్వర్గలోకే**

స్వర్గే - లోకే - న - భయం - కిం - చ - న - అస్తి - న - తత్ర - త్వం - జరయా - బిభేతి - ఉభే - తీర్త్వా - అశనయా - పిపాసే - శోకాతిగః - మోదతే - స్వర్గలోకే.

| | | |
|---|---|---|
| స్వర్గేలోకే | = | స్వర్గలోకమునందు అనగా బ్రహ్మలోకము నందు |
| తత్ర+ కించన+ అశనయా+ పిపాసే+న+జరయా+ భయం+న+చ+ శోకాతిగః+న+బిభేతి | = | అక్కడ కొంచెము కూడ ఆకలి దప్పులు, ముసలి తనము, మరణము శోకమోహములు - (ఈ ఆఱు జీవ లక్షణములు) కొంచెము కూడ అక్కడ ఉండవు. కేవలము బ్రహ్మానందము అనుభవములో ఉండును. |
| ఉభే+తీర్త్వా | = | స్థూల శరీరము, సూక్ష్మశరీరముల రెండింటిని |
| త్వం+అస్తి | = | దాటినచో హిరణ్మయ శరీరవర్తియై నీవు (ఓ సాధకుడా) బ్రహ్మలోకమున ఉందువు. |
| స్వర్గలోకే+మోదతే | = | శాశ్వతముగా బ్రహ్మలోకంలో పునరావృత్తి రహితులయి బ్రహ్మయై విరాజిల్లి ఆనంద స్వరూపమున ఆనందింతురు. ఈ విషయమునే ఇప్పుడు రెండవ వరముగా వివరించున్నారు. |

*****

**నచికేతుని రెండవ వరము**

**13. స త్వ మగ్నిం స్వర్గ్య మధ్యేషి మృత్యో ప్రబ్రూహి తం శ్రద్ధ ధానాయ మహ్యమ్**
**స్వర్గలోకా అమృతత్త్వం భజంతే ఏతద్ద్వితీయేన వృణే వరేణ**

సః - త్వం - అగ్నిం - స్వర్గ్యం - అధ్యేషి - మృత్యో - ప్రబ్రూహి - తం - శ్రద్ధధానాయ - మహ్యం - స్వర్గలోకాః - అమృతత్త్వం - భజంతే - ఏతత్ - ద్వితీయేన - వృణే - వరేణ

| | | |
|---|---|---|
| సః | = | నచికేతుడు అంత యమ ధర్మరాజుతో కొందఱు పుణ్యాత్ములు పుణ్య ఫలితము కోరక |
| స్వర్గలోకాః | = | పుణ్యలోకములలో పుణ్యఫలితములను అనుభవించి బ్రహ్మస్థానములో |

| | | |
|---|---|---|
| అమృతత్త్వం | = | అమృతత్త్వమును |
| భజంతే | = | పొందుచున్నారు |
| మృత్యో | = | ఓ యమ ధర్మరాజా |
| త్వం+స్వర్గ్యం+ | = | నీవు స్వర్గలోకమును |
| అగ్నిం+అధ్యేషి | | (బ్రహ్మలోకము) చేర్చు అగ్ని విద్యను ఎఱుగుదువు కావున |
| తం | = | ఆ అగ్నివిద్యను |
| శ్రద్ధధానాయ+మహ్యం | = | శ్రద్ధావంతుడనయిన నాకు |
| ప్రబ్రూహి | = | చెప్పుము |
| ఏతత్ | = | ఈ అగ్నివిద్యనే చెప్పుమని నా |
| ద్వితీయేన+వరేణ | = | రెండవ వరముగా కోరుచున్నాను |
| వృణే | = | అనుగ్రహింపుము |

*****

**యముడు చెప్పుచున్నాడు**

**14.** **ప్రతేబ్రవీమి తదుమే నిబోధ స్వర్గ్య మగ్నిం నచికేతః ప్రజానన్**
**అనంత లోకాప్తి మథో ప్రతిష్ఠాం విద్ధి త్వ మేనం నిహితం గుహాయాం**

ప్ర - తే - బ్రవీమి - తత్ - ఉ - మే - నిబోధ - స్వర్గ్యం - అగ్నిం - నచికేతః - ప్రజానన్ - అనంతలోకాప్తిం - అథః - ప్రతిష్ఠాం - విద్ధి - త్వం - ఏనం - నిహితం - గుహాయాం.

| | | |
|---|---|---|
| నచికేతః | = | ఓ నచికేతుడా |
| స్వర్గ్యం+అగ్నిం | = | స్వర్గమును చేర్చు అగ్నిని |
| ప్రజానన్ | = | తెలిసి కొన్నవాడనైన నేను అనగా జ్యోతి స్వరూపుడ నయిన నేను |
| తే | = | పుణ్య కర్మానుష్ఠాన ఫలితము కోరని నీకు |
| ప్ర+బ్రవీమి | = | విశదీకరించెదను |

| | | |
|---|---|---|
| తత్+మే | = | దానిని నావలన |
| నిబోధ | = | గ్రహించుము. అది |
| అనంత లోకాప్తిం | = | పదునాలుగు లోకములకు |
| అథః+ఉ | = | మఱియు సర్వ స్థావర జంగమములకు |
| ప్రతిష్ఠాం | = | ఆధారమయినట్టియు అయిన |
| ఏనం | = | ఈ అగ్నిని |
| గుహాయాం | = | హృదయగుహలో జ్యోతి స్వరూపముగా |
| నిహితం | = | ఉన్నదానిగా |
| త్వం | = | నీవు |
| విద్ధి | = | తెలుసుకొనుము. |

*****

ఈ అగ్ని బాహ్యముగా లేదు. హృదయ గుహలో స్వయం ప్రకాశమయిన జ్యోతి రూపమున ఉన్నది. దానిని ఆత్మగా చెప్పుదురు. సృష్ట్యాదియందున్న ఆత్మయే హృదయగుహలో సూక్ష్మరూపమున నెలకొని ఉన్నది అని తెలుసుకొనుము.

**యముడు చెప్పుచున్నాడు**

**15. లోకాది మగ్నిం తమువాచ తస్మై యా ఇష్టకా యావతీర్వా యథా వా**
**స చాపి తత్ప్రత్యవదద్ యథోక్త మథాస్య మృత్యుః పునరేవాహ తుష్టః**

లోకాదిం - అగ్నిం - తం - ఉవాచ - తస్మై - యాః - ఇష్టకాః - యావతీః - వా - యథా - వా - సః - చ - అపి - తత్ - ప్రవదత్ - యథోక్తం - అథ - అస్య - మృత్యుః - పునః - ఏవ - ఆహ - తుష్టః

| | | |
|---|---|---|
| మృత్యుః | = | యమ ధర్మరాజు |
| తం+లోకాదిం+అగ్నిం+ తస్మై+ఉవాచ | = | లోకముల కంటె ముందుది, స్వయం జ్యోతి యైనది హృదయగుహలో ప్రకాశించునది, సృష్టిస్థితి లయములు చేయునది అగు - ఆ అగ్ని గుఱించి నచికేతునికి చెప్పెను |

| | | |
|---|---|---|
| యాః+ఇష్టకాః+ | = | ఇటుకలు అంటే ఏమిటి ? అవి ఎన్నో, |
| యావతీః+వా+ | | ఎలాచేయాలో అనే విషయం చెప్పెను. |
| యథా+వా | | ఈ అగ్నిని ఆరాధించుటకు భౌతికమయిన ఇటుకలు, నెయ్యి, సమిధలు వగైరాలు అవసరము లేదు. ఈ అగ్ని హృదయ గుహలో ఉంది. కావున బాహ్యముగాకాక మానసికముగా ఆరాధన చేయవలెను. |

పురుష సూక్తంలో దేవతలు **“ వసంతోఅస్యాసాదాజ్యం”-** అని వసంత ఋతువును నెయ్యిగా, గ్రీష్మ ఋతువును ఇధ్మముగా మానసికంగా ఇలా యజ్ఞం చేసి యజ్ఞపురుషుని దర్శించిరి.

| | | |
|---|---|---|
| సః+చ+అపి+ | = | నచికేతుడు కూడ యముడు చెప్పినది |
| తత్ | | చెప్పినట్లు |
| యథోక్తం+ప్రవదత్ | = | వల్లెవేసి తిరిగి యమునకు వప్ప చెప్పినాడు |
| అథ | = | అంత యమ ధర్మరాజు |
| అస్య+తుష్టః | = | నచికేతుని ధారణాశక్తికి సంతసించినవాడై |
| పునః+ఏవ+ఆహ | = | మరల యిట్లనెను |

**ఆ అగ్నిని చేయు విధానము యిందు వివరింపబడలేదు.**

దీనిని గురుముఖతానే- గురువును ఆశ్రయించియే గ్రహించవలయును.

*****

**యముడు చెప్పుచున్నాడు**

**16. తమబ్రవీత్ప్రీయమాణో మహాత్మా వరం తవేహాద్య దదామి భూయః**
**తవైవ నామ్నా భవితాఽయ మగ్నిః సృంకాం చేమా మనేక రూపాం గృహాణ**

తమ్ - అబ్రవీత్ - ప్రీయమాణః - మహాత్మా - వరం - తవ - ఇహ - అద్య - దదామి - భూయః - తవ - ఏవ - నామ్నా - భవితా - అయం - అగ్నిః - సృంకాం - చ - ఇమాం - అనేకరూపాం - గృహాణ

| | | |
|---|---|---|
| మహాత్మా | = | మహాత్ముడయిన యముడు, ఓ నచికేతా లోకాదిం అగ్నింఅని లోకములకు ముందుగల అగ్నిని గూర్చి నీవు అడిగినావు గదా. ఆ అగ్ని అనగా |
| అయం+అగ్నిః | = | ఈ హృదయగుహలో గల అగ్ని |
| ఇమాం+అనేకరూపాం | = | ఈ సృష్టిలో అనేకరూపములను గలిగి వర్తించుచున్నది. అనగా యీ సృష్టి సర్వము అదే. నీకు ఆ అగ్నిని ఆరాధించు విధానమును చెప్పగా నీవు శ్రద్ధగా విని దానిని తిరిగి అప్పచెప్పితివి. కావున |
| తమ్+ఇహ+తవ భూయః+అద్య+ వరం+దదామి | = | నీకు మరల ఇప్పుడే యింకొక వరమును యిచ్చుచున్నాను |
| తవ+ఏవ+నామ్నా భవితా+చ | = | ఈ అగ్ని నీ పేరుతోనే అనగా నచికేతాగ్నిగా ఇకపై పిలువబడును. |
| తమ్ | = | నీకు |
| సృంకాం | = | రత్నహారమును యిచ్చుచున్నాను. దీనిని |
| గృహాణ | = | స్వీకరించుము అని |
| ప్రీయమాణః+అబ్రవీత్ | = | నచికేతుని యందలి ప్రేమతో పలికెను. |

*****

**యముడు చెప్పుచున్నాడు**

**17. త్రి ణాచికేతః త్రిభి రేత్య సంధిం త్రికర్మ కృత్తరతి జన్మ మృత్యూ**
**బ్రహ్మజజ్ఞం దేవ మీఢ్యం విదిత్వా నిచాయ్యేమాం శాంతి మత్యంత మేతి**

త్రి - నాచికేతః - త్రిభిః - ఏత్య - సంధిం - త్రికర్మకృత్ - తరతి - జన్మమృత్యూ - బ్రహ్మజజ్ఞం - దేవం - ఈఢ్యం - విదిత్వా - నిచాయ్య - ఇమాం - శాంతిం - అత్యంతమ్ - ఏతి

| | | |
|---|---|---|
| నాచికేతః | = | ఓ నచికేతుడా హృదయ గుహలో గల |

| | | |
|---|---|---|
| ఇమాం | = | ఈ ఆత్మ |
| బ్రహ్మజజ్ఞం | = | సృష్ట్యాది యందు గలది |
| ఈఢ్యం | = | సర్వులచే స్తుతింపదగినది |
| దేవం | = | స్వయం ప్రకాశమైనది. |
| త్రికర్మకృత్ | = | ఈ ఆత్మను మనసా వాచాకర్మణా పుణ్యకర్మాను ష్ఠానము చేసి - సాధనచే |
| నిచాయ్య+విదిత్వా | = | హృదయ గుహలో దర్శించి, సర్వజగత్తు ఆ ఆత్మయే యని గ్రహించిన |
| శాంతిం+అత్యంతమ్+ ఏతి | = | శాంతినిపొందుచున్నాడు జీవన్ముక్తుడగు చున్నాడు. |
| త్రి(త్రయః)+త్రిభిః | = | జాగ్రత్, స్వప్న, సుషుప్తి అవస్థలను దాటి, స్థూల సూక్ష్మశరీరములను అహంకార మహత్ ప్రకృతు లను దాటి హిరణ్మయ కోశముగా పిలువబడే హృదయ గుహకు చేరి, కూటస్థుని తో |
| సంధిం+ఏత్య | = | క్షేత్రజ్ఞునిని ఏకీభూతుని చేసినచో |
| జన్మమృత్యూ | = | జననమరణములు అనే సంసారసాగరమును |
| తరతి | = | దాటుచున్నాడు. అనగా అమృతత్త్వమును పొందు చున్నాడు. |

*****

**యముడు చెప్పుచున్నాడు**

**18. త్రి ణాచికేత స్త్రయ మేత ద్విదిత్వా య ఏవం విద్వాం శ్చినుతే నాచికేతం స మృత్యుపాశాన్ పురతః ప్రణోద్య శోకాతిగో మోదతే స్వర్గలోకే.**

త్రి - నాచికేతః - త్రయం - ఏతత్ - విదిత్వా - యః - ఏవం - విద్వాన్ - చినుతే - నాచికేతం - సః - మృత్యుపాశాన్ - పురతః - ప్రణోద్య - శోకాతిగః - మోదతే - స్వర్గలోకే.

| | | |
|---|---|---|
| నాచికేతః | = | ఓ నచికేతుడా |
| యః+విద్వాన్ | = | ఏ విద్వాంసుడు |
| ఏతత్+త్రయం+ విదిత్వా+త్రి (త్రీణి) | = | ఈ మూడు అవస్థలు, ఈ అవస్థలలో వుండే వైశ్వానరుడు, తైజసుడు, ప్రాజ్ఞులను తెలుసుకొని |
| ఏవం+నాచికేతం | = | ఈ హృదయగుహలో గల ఆత్మను దర్శించ మానసిక యజ్ఞం అయిన నచికేతాగ్నిని |
| చినుతే | = | చేయునో |
| సః | = | ఆ నచికేతాగ్నిని తెలిసిన వాడు |
| పురతః | = | మరణ కాలమునకు ముందే |
| మృత్యుపాశాన్+ప్రణోద్య | = | మృత్యుపాశములను త్రెంచుకొని |
| శోకాతిగః | = | శోకమోహములులేనివాడై జీవన్ముక్తుడగును - దేహానంతరము |
| స్వర్గలోకే+ మోదతే | = | స్వర్గ లోకములో అనగా బ్రహ్మలోకములో ఆనందించును. |

ఉదా: జనకుడు ఇతడు విదేహుడు. జీవన్ముక్తుడు.

రామ పట్టాభిషేకమునకు విఘ్నము గలిగినప్పుడు తన అల్లునికి యిలాంటి విఘ్నము గలిగినదని విచారించలేదు. సీతను రావణుడు ఎత్తుకొని వెళ్ళినపుడు శోకించలేదు. రాముడు చిత్రకూటంలో వుండగా తన కూతురుని అల్లుడిని చూచి పరామర్శించ లేదు. ఇట్టి వాడు బ్రహ్మలో ఏకీభూతుడై కర్పూర దీప సంయోగము వలె బ్రహ్మయై విరాజిల్లును.

*****

**యముడు చెప్పుచున్నాడు**

**19. ఏష తే ఽగ్ని ర్నచికేతః స్వర్గ్యో యమ వృణీథా ద్వితీయేన వరేణ**
**ఏత మగ్నిం త వైవ ప్రవక్ష్యన్తి జనాస స్తృతీయం వరం నచికేతో వృణీష్వ**

ఏషః - తే - అగ్నిః - నచికేతః - స్వర్గ్యః - యమ్ - అవృణీథాః - ద్వితీయేన - వరేణ ఏతమ్ - అగ్నిం - తవ - ఏవ - ప్రవక్ష్యంతి - జనాసః - తృతీయం - వరం - నచికేతః - వృణీష్వ

| | | |
|---|---|---|
| నచికేతః | = | ఓ నచికేతా ! |
| యమ్+ఏతం+అగ్నిం+ ద్వితీయేన+వరేణ+ అవృణీథాః | = | రెండవ వరముగా లోకాలకు ముందున్న అగ్నిని గురించి చెప్పమని కోరితివో |
| స్వర్గ్యః+అగ్నిః+ఏషః | = | ఆ స్వర్గం చేర్చు అగ్ని ఇదే |
| తే | = | నీ కొఱకు దానిని ఉపదేశించితిని |
| జనాసః | = | జనులు ఈ అగ్నిని |
| తవ+ ఏవ+ప్రవక్ష్యంతి | = | నీ పేరుతోనే పలుకుదురు. |
| నచికేతః | = | ఓ నచికేతా |
| తృతీయం+వరం | = | మూడవ వరమును |
| వృణీష్వ | = | కోరుకొనుము. (హృదయ గుహలో అగ్ని జ్వాలల మధ్యలో ఆత్మ కలదు. అది నచికేతాగ్ని). |

*****

**నచికేతుడు చెపుచున్నాడు**

**20. యే యం ప్రేతే విచికిత్సా మనుష్యేఽ స్తీ త్యేకే నాఽయ మస్తీతి చైకే**
**ఏత ద్విద్యా మనుశిష్ట స్త్వయాఽ హం వరాణా మేష వరస్తృతీయః**

యా - ఇయం - ప్రేతే - విచికిత్సా - మనుష్యే - అస్తి - ఇతి - ఏకే - న - అయం - అస్తి - ఇతి - చ - ఏకే - ఏతత్ - విద్యాం - అనుశిష్టః - త్వయా - అహం - వరాణాం - ఏషః - వరః - తృతీయః

| | | |
|---|---|---|
| మనుష్యే+ప్రేతే | = | మనుష్యుడు మరణింపగా శరీరమునకు భిన్నమయినది |
| ఏకే+అస్తి+ఇతి | = | శరీర, ఇంద్రియ, మనోబుద్ధులను పనిచేయించుచూ ఉన్నది అయిన ఆత్మ ఒకటి యీ శరీరములో కలదు అని కొందఱు |

| | |
|---|---|
| ఏకే+అయం+న+అస్తి+= ఇతి+చ | అలాంటిది ఏదీ లేదని అనగా ఆత్మ అనేది లేదని కొందఱు చెప్పుచున్నారు |

అనగా చక్రములు, ఇరుసు, రథసారథి కూర్చునే స్థలము, రథికుడు కూర్చునే స్థలము- ఇవి అన్నీ కలపి రథం అని వ్యవహరింపబడును. దేనికి అవి విడగొట్టిన రథము అనే వ్యవహార నామము ఉండదు. అలానే ఈ శరీరము ఈ శరీర వ్యాపారమును కలిపి ఆత్మగా వ్యవహరించుచున్నారు తప్ప ప్రత్యేకించి ఆత్మ అనేది లేదు. ఈ శరీరమే ఆత్మయని కొందఱు ఇలా రెండు వాదనలు గలవు.

(ఈ రెండు వాదములను స్వీకరించి శ్రీకృష్ణుడు తన భగవద్గీతలో సాంఖ్యయోగంలో సమాధానం చెప్పినాడు)

| | | |
|---|---|---|
| యా+ఇయం+విచికిత్సా | = | కావున ఆత్మ ఉన్నదా ? లేదా అనే సంశయమును |
| ఏతత్+త్వయా+ అనుశిష్టః | = | నీచే ఉపదేశింపబడి |
| అహం+విద్యాం | = | నేను తెలుసుకొందును |
| వరాణాం+ఏషః+వరః+ తృతీయః | = | మీరు నాకు యిచ్చిన మూడు వరములలో యిది నాకు మూడవ వరము. |

కావున నాకు ఆత్మ గుఱించి బోధించండి.

మొదటి వరముగా పుణ్య కర్మలు చేసి పుణ్యఫలితము కోరి, బ్రహ్మ లోకము చేరి, పుణ్యము క్షీణించగానే పునర్జన్మను పొందుదురు అనే విషయమును అన్యాప దేశముగా చెప్పెను. రెండవ వరముగా పుణ్య కర్మలు చేసి పుణ్యఫలితము కోరని వారు బ్రహ్మ లోకము చేరి అమృతత్త్వమును పొంది బ్రహ్మ లోకమునందే వసియించెదరు. వారికి పునర్జన్మ లేదు. ఈ కర్మానుష్ఠానమునకు బాహ్య వస్తువులతో పని లేదు. దీనిని మానసిక యజ్ఞము అని అందురు. పురుష సూక్తములో **"వసంతో అస్యాసీదాజ్యమ్ గ్రీష్మ ఇధ్మ శ్శరద్ధవి"** అని మానసిక యజ్ఞము ఎలా చేయవలయునో చెప్పబడినది. ఆ యజ్ఞ విధానమునే యముడు రెండవ వరముగా చెప్పినట్లుగా ఇందు చెప్పబడినది.

ధర్మపరుడై - పుణ్యకర్మానుష్ఠానము చేసి పుణ్య ఫలితము కోరని వారు తీవ్ర మోక్షేచ్ఛపరులు ఆత్మ తత్త్వము గుఱించి తెలుసుకొనవలయును అనే భావనను మూడవ వరముగా చెప్పబడినది. ఇలా వరముల పేరిట సాధకులను మూడు తరగతులుగా విభజించి గూఢముగా విషయమును చెప్పినారు.

*****

**యముడు చెపుచున్నాడు**

**21. దేవై రత్రాపి విచికిత్సితం పురా న హి సువిజ్ఞేయ మణురేష ధర్మః**
**అన్యం వరం నచికేతో వృణీష్వ మా మోపరోత్సీ రతి మా సృజైనమ్**

దేవైః - అత్ర - అపి - విచికిత్సితం - పురా - న - హి - సువిజ్ఞేయం - అణుః - ఏషః - ధర్మః - అన్యం - వరం - నచికేతః - వృణీష్వ - మా - మా - ఉపరోత్సీః - అతి - మా - సృజ - ఏనం

వ్యవసాయము తెలిసిన రైతు, విత్తనములను సుక్షేత్రములోనే చల్లును. చవిటి నేలలో చల్లడు. అటులనే ఆత్మజ్ఞానము స్వానుభవంలో గ్రహించినవ్యక్తి యోగ్యుడయిన శిష్యునకే బోధించును. లోకమున జనులు రెండు రకములు. ఒకరు సంసారులు. వీరు సంసార తాపత్రయములలో కూరుకొని భార్యా, పిల్లలు, బంధువులు, అష్టఐశ్వర్యములు, భోగభాగ్యములు, ఇహలోక పరలోక సుఖాల కొఱకు ఆలోచించేవారు. వీరికి ఆత్మవిద్య చెప్పుట అనగా చవిటి నేలలో విత్తనములు చల్లుట అనే ప్రక్రియ క్రిందకు వచ్చును. వీరు ఆలకించినా ఆచరింపలేరు. కావున పెద్దలు వీరికి ఆత్మజ్ఞానమును ఉపదేశింపరు.

ఇంకొక రకపు వారు విద్వాంసులు. వీరు నీటిలో తామరాకులా సంసారంలో ఉండి సంసారము సుఖంబని నిశ్చయించక మఱియొక మార్గంబున సిద్ధిగలదని ఆ మార్గము గుఱించి ఆలోచించుచూ ఆ మార్గమును తెలుసుకొనుటకై అన్వేషింతురు. వీరు సుక్షేత్రము వంటివారు వీరికి ఆత్మజ్ఞానము బోధించిన ఫలితముండును. ఈ కోవకు చెందినవారు విని, మననము చేసి సాధనద్వారా ఆత్మదర్శనం చేసి ఆత్మతో ఏకీభూతులగుదురు.

నచికేతునిని పరీక్షించుట అనే నెపంతో మనకు ఈ సందేశము ఇవ్వబడినది.

అత్ర+దేవైః+అపి = ఆత్మ ఉన్నదాలేదా అనే విషయంలో దేవతలచే కూడ

పురా = పూర్వము

విచికిత్సితం = తర్జన భర్జనలు చేయబడినవి. వారు కూడ పూర్తిగా గ్రహించలేదు.

ఏషః+ధర్మః+అణుః = ఈ ఆత్మ ధర్మము కడు సూక్ష్మము

న+సువిజ్ఞేయం+హి = కనుక ఒకరు చెపితే అర్థము కాదు. స్వానుభవంతో శ్రద్ధా, భక్తి, ధ్యానయోగము, తపస్సు చేసి గ్రహించ వలయును.

నచికేతః = ఓ నచికేతా

అన్యం+వరం = ఆత్మ గుఱించి చెప్పుమని గాక యింకొక వరమును

వృణీష్వ = కోరుకొనుము

మా = నన్ను

మా+ఉపరోత్సీః = ఈ విషయముపై నన్ను బాధింపకుము పట్టుపట్టకు

మా = నన్ను

ఏనం+అతి+సృజ = ఈ వరమును గుఱించి అనగా ఆత్మ గుఱించి చెప్పమని తట్టకు

*****

**నచికేతుడు చెప్పుచున్నాడు**

**22. దేవై రత్రాపి విచికిత్సితం కిల త్వం చ మృత్యో యన్న సువిజ్ఞేయ మాత్థ**
**వక్తా చాస్య త్వాదృగన్యో న లభ్యో నా న్యో వరస్తుల్య ఏతస్య కశ్చిత్**

దేవైః - అత్ర - అపి - విచికిత్సితం - కిల - త్వం - చ - మృత్యో - యత్ - న - సువిజ్ఞేయం - అత్థ - వక్తా - చ - అస్య - త్వాదృక్ - అన్యః - న - లభ్యః - న - అన్యః - వరః - తుల్యః - ఏతస్య - కః - చిత్.

అత్ర+దేవైః+అపి+ = ఆత్మ ఉన్నదా లేదా అనే విషయము పెద్దలైన

| | | |
|---|---|---|
| విచికిత్సితం+ కిల+చ | | దేవతలచే కూడ తర్జన భర్జనలు చేయబడినదని తమరు చెప్పుచున్నారు గదా. మఱియు |
| త్వం+యత్+న+ సువిజ్ఞేయం+అత్థ | = | తమరు కూడ యీ విషయము చాలా సూక్ష్మమగుట వలన అసమర్థుడయిన గురువు చెప్పిన అర్థముకాదని చెప్పుచున్నారు గదా. కావున |
| మృత్యో+ | = | కాల స్వరూపుడవయిన పరమాత్మా! |
| అస్య+వక్తా+చ+ తాదృక్+అన్యః+ న+లభ్యః | | ఆత్మ తత్త్వమును చెప్పగల మీవంటి సమర్థుడయిన గురువు యింకొకరు లేరు |
| తత్ | = | కావున మీరే ఆత్మ విషయమును నాకు ఉపదేశించండి |
| ఏతస్య+అన్యః+ వరః+తుల్యః+కః+ చిత్+న | = | ఈ వరము వంటి యింకొక వరము, అనగా దీనితో తుల్యమైనది యింకొకటి యేదియు లేదు. కావున మీరు దయచేసి నేనడిగిన ఆత్మవిషయమునే ఉపదేశించండి. |

*****

ఆత్మతత్త్వము తెలియ కోరు జిజ్ఞాసి పుణ్యాకర్మానుష్ఠాన ఫలితములను తెలుసుకొని నిర్వేదం పొందవలయును. ఇహలోక, పరలోక సుఖాలపై ఆపేక్ష యుండరాదు. అట్టివారలే ఆత్మ తత్త్వమును తెలుసుకొనుటకు అర్హులు. ఈ విషయమునే యముడు నచికేతునిని పరీక్షించు చున్నట్లు యిందు వర్ణింపబడినది.

**యముడు చెపుచున్నాడు**

**23. శతాయుషః పుత్రపౌత్రాన్ వృణీష్వ బహూన్ పశూన్ హస్తి హిరణ్యమశ్వాన్**
**భూమే ర్మహాదాయతనం వృణీష్వ స్వయం చ జీవ శరదో యావదిచ్ఛసి**

శతాయుషః - పుత్రపౌత్రాన్ - వృణీష్వ - బహూన్ - పశూన్ - హస్తి - హిరణ్యాం - అశ్వాన్ - భూమేః - మహత్ - ఆయతనం - వృణీష్వ - స్వయం - చ - జీవ - శరదః - యావత్ - ఇచ్ఛసి

| | | |
|---|---|---|
| శతాయుషః+ | = | ఓ నచికేతా నూఱు సంవత్సరముల |
| స్వయం+చ+యావత్ | | ఆయుర్దాయము, లేదా నీకు ఎంత |
| +శరదః+జీవ+ఇచ్ఛసి | | ఆయుర్దాయము కావాలో అంత |
| పుత్రపౌత్రాన్ | = | మఱియు పుత్రులను, మనుమలను |
| వృణీష్వ | = | కోరుకొనుము |
| బహూన్ +పశూన్ | = | అనేక లక్షల గోవులను |
| హస్తి+అశ్వాన్ | = | ఏనుగులను, గుఱ్ఱములను |
| హిరణ్యం | = | బంగారమును |
| మహత్+భూమేః+ | = | విశాల సామ్రాజ్యమును |
| ఆయతనం | | |
| వృణీష్వ | = | కోరుకొనుము |

ఇందు ఇహలోక సుఖములు ప్రస్తావించబడినవి.

*****

**యముడు చెప్పుచున్నాడు.**

**24. ఏతత్తుల్యం యది మన్యసే వరం వృణీష్వ విత్తం చిరజీవికాం చ**
**మహాభూమౌ నచికేతస్త్వమేధి కామానాం త్వా కామభాజం కరోమి**

ఏతత్ - తుల్యం - యది - మన్యసే - వరం - వృణీష్వ - విత్తం - చిరజీవికాం - చ - మహాభూమౌ - నచికేతః - త్వమ్ - ఏధి - కామానాం - త్వా - కామభాజం - కరోమి.

| | | |
|---|---|---|
| నచికేతః | = | ఓ నచికేతుడా |
| విత్తం | = | ధనరాసులు |
| చిరజీవికాం+చ | = | చిరకాల జీవనము, మణులు మాణిక్యములు |
| మహాభూమౌ | = | విశాల సామ్రాజ్యము |
| ఏతత్+తుల్యం+ | = | ఒకవేళ యివి గాక వీటితో సమానమైన |
| వరం+యది+మన్యసే | | యింకేమయినా కోరాలని నీవు తలంచినచో |

| | | |
|---|---|---|
| వృణీష్వ | = | కోరుకొనుము |
| త్వా+కామానాం+ | = | నీవు కోరిన కోరికలను అనుగ్రహించి |
| కామభాజం+కరోమి | | నిన్ను కృతార్థునిని చేయుదును |
| త్వం+ఏధి | = | ఆ భోగభాగ్యములతో నీవు వర్ధిల్లుము. (ఇహ లోక సుఖములను గుఱించి- ఇందు ప్రస్తావించినాడు) |

*****

**యముడు చెప్పుచున్నాడు.**

**25. యే యే కామా దుర్లభా మర్త్యలోకే సర్వాన్ కామాం శ్ఛన్దతః ప్రార్థయస్వ**
**ఇమా రామాః స రథాః స తూర్యా న హీ దృశా లమ్భనీయా మనుష్యైః**
**అభిర్మత్ప్రత్తాభిః పరిచారయస్వ నచికేతో మరణం మాऽను ప్రాక్షీః**

యే - యే - కామాః - దుర్లభాః - మర్త్యలోకే - సర్వాన్ - కామాన్ - ఛందతః - ప్రార్థయస్వ - ఇమాః - రామాః - సరథాః - సతూర్యాః - న - హి - ఈదృశాః - లంభనీయాః - మనుష్యైః - అభిః - మత్ప్రత్తాభిః - పరిచారయస్వ - నచికేతః - మరణం - మా - అను - ప్రాక్షీః

| | | |
|---|---|---|
| నచికేతః | = | ఓ నచికేతుడా |
| ఇమాః+సరథాః+ | = | ఈ రథములతోనూ, సంగీత |
| సతూర్యాః+రామాః | | వాయిద్యములతోనూ కూడిన యీ అప్సరసలు |
| మనుష్యైః | = | తపస్సు చేయని మానవులచే |
| ఈదృశాః+న+ | = | ఇటువంటి అసమాన సౌందర్య |
| లంభనీయాః+హి | | రాసులయిన అప్సరసలు పొందనలవి కాని వారు |
| అభిః+మత్ప్రత్తాభిః+ | = | అటువంటి అప్సరలసను నీకు ఇచ్చెదను |
| పరిచారయస్వ | | మాచే అనుగ్రహింపబడి యిచ్చిన వీరిచే సకల సుఖాలు పొందుట అనే పరిచర్యలు చేయించు కొనుము ఇవి గాకపోతే |
| మర్త్యలోకే +యే+యే+ | = | భూ లోకంలో యేయే కోరికలు పొంద |

| | | |
|---|---|---|
| కామాః+దుర్లభాః | | అసాధ్యమో అటువంటి |
| సర్వాన్+ కామాన్+ ఛందతః | = | సర్వకోరికలు నీ యిష్టానుసారము |
| ప్రార్థయస్వ | = | కోరుకొనుము అంతేగాని |
| మరణం+మా+ | = | మరణానంతరము కూడ |
| అనుప్రాక్షీః | | ఉంటుందా ఉండదా అనే ఆత్మవిషయము అడగకుము. |

ఇందు పరలోక సుఖాల గుఱించి ప్రస్తావించినాడు. ఇహలోక, పరలోక సుఖాపేక్షపరునికి బ్రహ్మవిద్య ఒంటబట్టదు. ఈ విషయమునే భగవద్గీతలో శ్రీకృష్ణుడు సాంఖ్యయోగములో **"యామీమాం పుష్పితాం- వాచం"** అంటూ అర్జునుని హెచ్చరించినాడు.

*****

**నచికేతుడు చెప్పుచున్నాడు**

**26. శ్వోభావా మర్త్యస్య యదంతకైతత్ సర్వేంద్రియాణాం జరయంతి తేజః**
**అపి సర్వం జీవిత మల్పమేవ తవైవ వాహాస్తవ నృత్యగీతే.**

శ్వోభావాః - మర్త్యస్య - యత్ - అంతక - ఏతత్ - సర్వేంద్రియాణాం - జరయంతి - తేజః - అపి - సర్వం - జీవితం - అల్పమ్ - ఏవ - తవ - ఏవ - వాహాః - తవ - నృత్యగీతే.

పరలోక సుఖాలను కోరేవారిని యోగ భ్రష్టులందురు. రామాయణంలో అరణ్యకాండలో రాముడు సీతా లక్ష్మణ సహితుడై సంచరించుచుండగా ఒక చోట ఒక యోజనము వైశాల్యము గల రమ్యమైన సరస్సును చూచిరి. ఆ రమ్యమైన సరస్సు నుండి గీత వాద్యాదుల ధ్వని వినవచ్చుచుండెను. అంత ఆ విషయమై రాముడు అడుగగా ధర్మభృత్ అనే మహాముని యిట్లు చెప్పసాగెను.

మాండకర్ణి అనే మహాముని వాయుభక్షకుడై పదివేల సంవత్సరములు తపస్సు చేసెను. దేవతలు ఆ ముని తపోభంగమునకై ఐదుగురు అప్సరస స్త్రీలను పంపిరి.

వారు ఆమునికి భార్యలైరి. ఆ అప్సరసలు క్రీడించుటచే వాద్యధ్వని, వారి అలంకారముల ధ్వని కలసి మనోహరమైన గీత ధ్వని వినవచ్చుచున్నదని చెప్పెను.

వాల్మీకి ఈ కథ ద్వారా ఇహలోక పరలోక సుఖములు ఆత్మదర్శనమును పొంద దలచిన సాధకునికి అవరోధములని వీరు యోగభ్రష్టులని ఆచరణ పాఠమును మనకు అందించినాడు.

| | | |
|---|---|---|
| | | ఈ సుఖఃభోగములు అశాశ్వతములు |
| శ్వోభావాః+జీవితం+ | = | స్వభావముగా శరీరమునకు |
| అపి+అల్పమ్+ఏవ | | అమృతత్త్వము లేదు. జీవితము అల్పము. ఈ సుఖ భోగములు |
| మర్త్యస్య+యత్+ఏతత్+ | = | మానవుని యొక్క సర్వేంద్రియముల |
| సర్వేంద్రియాణాం+తేజః+ | | తేజస్సునుహరించును. మోక్షకామునకు |
| జరయంతి | | ఈ సుఖభోగములు ఆటంకములు కావున |
| అంతక | = | ఓ విశ్వ లయకారకా! ప్రభో |
| వాహాః+తవ+ఏవ+ | = | నీవు ఇచ్చెదవన్న మానుష భోగములు, |
| తవ+సర్వం+నృత్య గీతే | | మానవులకు దుర్లభమైన ఈ నృత్య గీతములతో కూడిన ఈ అప్సరసలను తమరివద్దే ఉండనీయుడు. నాకు వాటితో పనిలేదు. నేను అడిగిన ఆత్మను గురించి బోధింపుడు. |

*****

**నచికేతుడు చెప్పుచున్నాడు**

**27. న విత్తేన తర్పణీయో మనుష్యో లప్స్యామహే విత్త మద్రాక్ష్మ చేత్వా
జీవిష్యామో యావదీశిష్యసి త్వం వరస్తు మే వరణీయ సఏవ**

న - విత్తేన - తర్పణీయః - మనుష్యః - లప్స్యామహే - విత్తం - అద్రాక్ష్మ చేత్ - త్వా - జీవిష్యామః - యావత్ - ఈశిష్యసి - త్వం - వరః - తు - మే - వరణీయః - సః - ఏవ

| | | |
|---|---|---|
| త్వం+యావత్+ ఈశిష్యసి+ జీవిష్యామః | = | మీరు ఎంత కాలము యీ జగత్తును పాలించుచూ లయం చేయరో అంతకాలమే జీవులమైన మేము జీవింతుము. కావున ఈ భోగభాగ్యములు శాశ్వతములు గావు. |
| మనుష్యః+విత్తేన+ న+తర్పణీయః | = | సంసారములో ఉండి మునిగి తేలుతూ వుండే మానవుడు ఎంత ధనము సంపాదించినా యింకా సంపాదించాలనే తాపత్రయంలో ఉండును తప్ప, ఉన్నదానితో తృప్తి చెందడు. అనగా అగ్నిహోత్రంలో నెయ్యి వేసిన కొలదీ మండుతూ ఉండును తప్ప చల్లారదు. అటులనే యీ కామం ఎంత అనుభవించినా తృప్తి కలగదు. |
| త్వా+అద్రాక్ష్మచేత్+ విత్తం+లప్స్యామహే | = | మీ దర్శన భాగ్యముగలిగినది. కనుక మీవలన ఆత్మ జ్ఞానమును పొంది ఆత్మదర్శనము చేసినట్లయిన మేము కావాలనుకున్నప్పుడు ధనమును, అనంత భోగభాగ్యములను సంపదను పొందగలము. |
| మే+వరణీయః+వరః+ సః+ఏవ+తు | = | కావున ఆత్మతత్త్వము తెలుపుటగుటించి నేను ప్రార్థించిన ఆ వరమే నాకు వరము. ఇంకొక వరముతో పనిలేదు. |

(దీనికి ఉదాహరణగా వసిష్ఠులవారు విశ్వామిత్రునికి, అతని అక్షౌహిణి సేనకు కావలసిన భోజన పదార్థములను సమకూర్చినారు. భరద్వాజ మహర్షి భరతునికి అతని అక్షౌహిణి సేనకు సకల మర్యాదలు చేసినారు)

*****

**నచికేతుడు చెప్పుచున్నాడు**

**28. అజీర్యతా మమృతానా ముపేత్య జీర్యన్మర్త్యః క్వధః స్థః ప్రజానన్**
**అభిధ్యాయన్ వర్ణరతి ప్రమోదా ననతి దీర్ఘే జీవితే కో రమేత**

అజీర్యతాం - అమృతానాం - ఉపేత్య - జీర్యన్ - మర్త్యః - క్వధః - స్థః - ప్రజానన్ - అభిధ్యాయన్ - వర్ణరతి - ప్రమోదాన్ - అనతి - దీర్ఘే- జీవితే - కః - రమేత

అనతి+దీర్ఘే+జీవితే = అల్పాయుర్దాయము గల ఈ జీవితములో

జీర్యన్+మర్త్యః = జరామరణములు గలిగిన మనుష్యుడు

ప్రజానన్+ క్వధః+స్థః = సంతానముకావాలని కోరేవాడు ఎవ్వడు?

వర్ణరతి+ప్రమోదాన్+ అభిధ్యాయన్ = సంపదలు, భోగభాగ్యములు, స్త్రీలతో సంభోగ సుఖంవీటిని ఆలోచిస్తూ వుండే మూర్ఖుడు ఎవ్వడు.

(తదాస్థః పుత్రాదులను కోరుటలో ఆశ గలవాడు క్వ= ఎవ్వడు)

కః+రమేత = ఈ అశాశ్వతమైన సుఖాలు పొంది ఎవడు రమించును.

అజీర్యతాం+ అమృతానాం+ ఉపేత్య = నశించనిది, అమృతత్త్వము గలది అయిన ఆత్మను పొంది అనగా దర్శించి ఆత్మతో ఏకీభూతుడు కావలయును అని కోరును తప్ప యీ ఇహలోక పరలోక సుఖములను ఎవ్వడూ కోరడు. గావున నాకు ఆత్మతత్త్వము ఉపదేశించండి.

*****

**29. యస్మిన్నిదం విచికిత్సన్తి మృత్యో యత్సాం పరాయే మహతి బ్రూహి**
**న స్తత్ యోఽయం వరోగూఢ మను ప్రవిష్టో నాన్యం తస్మాన్నచికేతా వృణీతే.**

(ఇతి ప్రథమవల్లీ )

యస్మిన్ - ఇదం - విచికిత్సన్తి - మృత్యో - యత్ - సాంపరాయే - మహతి - బ్రూహి - నః - తత్ - యః - అయం - వరః - గూఢం - అనుప్రవిష్టః - న - అన్యం - తస్మాత్ - నచికేతాః - వృణీతే.

| | | |
|---|---|---|
| మృత్యో | = | ఓ లయకారకుడా ! |
| యస్మిన్+ఇదం+ విచికిత్సంతి | = | ఆత్మ ఉన్నదా లేదా అనే విషయంలోతర్జన భర్జనలు జరుగుతున్నాయి. |
| యత్+సాంపరాయే+ మహతి+తత్ | = | ఏది పరలోకమునకు సంబంధించిన గొప్ప సంగతో దానిని - ఆత్మ గుఱించి |
| నః+బ్రూహి | = | మాకు విశదీకరించండి |
| యః+అయం+గూఢం+ అనుప్రవిష్టః | = | ఈ నిగూఢమైనది ఏదో ఆ నిగూఢమైన ఆత్మగుఱించి తెలుసుకొనవలయునని తలంచు చున్నాను. |
| తస్మాత్ | = | కావున |
| అన్యం+వరః | = | ఇంకొక వరము |
| నచికేతా | = | ఈ నచికేతుడు |
| న+వృణీతే | = | కోరడు |

*****

# ద్వితీయ వల్లీ

ఋషి చెప్పుచున్నాడు

1. అన్యచ్ఛ్రేయోఽన్య దుతైవ ప్రేయ స్తేఉభే నానార్థే పురుషం సినీతః
తయోః శ్రేయః ఆదదానస్య సాధు భవతి హీయతేఽర్థాద్య ఉ ప్రేయో వృణీతే.

అన్యత్ - శ్రేయః - అన్యత్ - ఉత - ఏవ - ప్రేయః - తే - ఉభే - నానార్థే - పురుషం - సినీతః - తయోః - శ్రేయః - ఆదధానస్య - సాధు - భవతి - హీయతే - అర్థాత్ - యః - ఉ - ప్రేయః - వృణీతే.

ప్రజలు పాటించే మార్గాలు రెండు ఉన్నాయి.

| | | |
|---|---|---|
| అన్యత్+శ్రేయః | = | ఒక మార్గము శ్రేయస్సును గలిగించునది |
| అన్యత్+ఉత+ఏవ+ ప్రేయః | = | ఇంకొక మార్గమున్నదే అది చాలా ప్రియమైనది |
| తే+ఉభే+నానార్థే | = | ఆ రెండూ భిన్న ప్రయోజనాలు, భిన్న ఫలితాలు యిచ్చునవి |
| తయోః + శ్రేయః+ ఆదధానస్య+సాధు+ | = | ఈ రెండింటిలో శ్రేయోమార్గము ఎన్నుకొన్న వానికి శుభము గలుగును |
| భవతి+యః+ఉ+ప్రేయః+ పురుషం+వృణీతే+సినీతః | = | ఎవడు ప్రేయో మార్గమును కోరుకొనునో ఆ మార్గము ఆ పురుషునిని బంధించు చున్నది. అనగా అతడు కర్మ బద్ధుడగు చున్నాడు. |
| అర్థాత్+హీయతే | = | పురుషార్థములలోపరమ పురుషార్థమయిన మోక్షమునకు దూరమగుచున్నాడు అనగా కర్మ బద్ధుడై జన్మపరంపరలలో చిక్కుకొను చున్నాడు. ప్రేయో మార్గము దక్షిణాయన మార్గము. శ్రేయో మార్గము ఉత్తరాయణ మఱియు జ్యోతిర్మార్గము. |

*****

**ఋషి చెప్పుచున్నాడు**

**2. శ్రేయ శ్చ ప్రేయశ్చ మనుష్య మేత స్తౌ సమ్పరీత్య వివినక్తి ధీరః**
**శ్రేయో హి ధీరో ఽభి ప్రేయసో వృణీతే ప్రేయో మన్దో యోగక్షేమా ద్వృణీతే**

శ్రేయః - చ - ప్రేయః - చ - మనుష్యమ్ - ఆ - ఇతః - తౌ- సమ్పరీత్య - వివినక్తి - ధీరః - శ్రేయః - హి - ధీరః - అభి - ప్రేయసః - వృణీతే - ప్రేయః - మన్దః - యోగక్షేమాత్ - వృణీతే.

| | |
|---|---|
| మనుష్యమ్+శ్రేయః+చ+ = ప్రేయః+ఆ+ ఇతః | మానవుని ఎదుట శ్రేయస్సు ప్రేయస్సు అనేవి రెండు మార్గములు ఉన్నవి. ఆరెండింటిలో కోరుకొనుటలోనే అతని వివేకము వుంది. |
| ధీరః+తౌ = | ధీరుడు శ్రేయస్సు, ప్రేయస్సు అను |
| సంపరీత్య+వివినక్తి+ = ధీరః+ప్రేయసః+ శ్రేయః+హి+అభి+వృణీతే | ఈ రెండింటిలో గల గుణదోషములను బాగుగాపరిశీలించి ధీరుడు ఆరెండింటిలో ప్రేయస్సు కంటె ఇతరమయిన అచల స్థిరకళ్యాణంబయిన శ్రేయోమార్గమును ఎన్ను కొనును. |
| చ = | మఱియు |
| మందః+యోగక్షేమాత్+ = ప్రేయః+వృణీతే | చాలా తెలివైన వాడిని అని భావించే ఈ వెఱ్ఱివాడు అగు బుద్ధిహీనుడు సంసారములో ఉండి భార్యా, పిల్లలు ధనధాన్యములు, ఇహలోక పరలోక సుఖములను ఆపేక్షించి ప్రేయో మార్గమును కోరుకొనును. సంసార పద్ధతికి కట్టుబడును. బద్ధుడగును. |

*****

**యముడు చెప్పుచున్నాడు**

**3. స త్వం ప్రియాన్ప్రియా రూపాంశ్చ కామా నభిధ్యాయ న్నచికేతోఽ త్యస్రాక్షీః**
**నైతాం సృంకాం విత్తమయీమ వాప్తో యస్యాం మజ్జన్తి బహవో మనుష్యాః**

సః - త్వం - ప్రియాన్ - ప్రియరూపాన్ - చ - కామాన్ - అభిధ్యాయన్ - నచికేతః - అతి - అస్రాక్షీః - న - ఏతామ్ - సృంకాం - విత్తమయీామ్ - అవాప్తః - యస్యాం - మజ్జన్తి - బహవః - మనుష్యాః

| | | |
|---|---|---|
| నచికేతః | = | ఓ నచికేతా |
| సః+త్వం | = | మాటిమాటికి ప్రలోభపెట్టినను ప్రలోభములకు లొంగని వాడవయిన నీవు వాటిని |
| అతి+అస్రాక్షీః | = | కాలదన్నితివి |
| ప్రియాన్+చ | = | ప్రియమైనవి అగు భోగభాగ్యములు, సంపదలు |
| ప్రియరూపాన్+ | = | పుత్రపౌత్రులు మొదలయినవి మఱియు |
| కామాన్+అభిధ్యాయన్ | | అప్సరోజనములతోడి సురలోక సుఖములు-వివిధ కోరికలు-వీటిలోని గుణ దోష ములను విచారించి |
| యస్యాం+బహవః+ | = | ఎందులో అనగా ఈ సుఖభోగములలో |
| మనుష్యాః+మజ్జంతి | | అనేక వేలమంది మనుష్యులు మునిగి పోవుచున్నారో |
| ఏతాం+విత్తమయీాం+ | = | ఈ భోగభాగ్యములనే బంగారు |
| సృంకాం+న+అవాప్తః | | సంకెలను-నీవు స్వీకరింపవైతివి. |

*****

**యముడు చెప్పుచున్నాడు**

**బ్రహ్మవిద్య నేర్చుకో గోరువాని అర్హత**

**4. దూరమేతే విపరీతే విషూచీ అవిద్యయా చ విద్యేతి జ్ఞాతా**
**విద్యాభీప్సినం నచికేతసం మన్యే న త్వా కామా బహవోఽలోలుపన్త**

దూరమ్ - ఏతే - విపరీతే - విషూచీ - అవిద్యా - యా - చ - విద్యా - ఇతి - జ్ఞాతా - విద్యాభీప్సినం - నచికేతసం - మన్యే - న - త్వా - కామాః - బహవః - అలోలుపన్త.

మాయ, మర్మము, అహంకారం, సంసారతాపత్రయములు, సుఖాపేక్ష గలిగి పుణ్యకార్యాలు ఆచరించే కామ్యకర్మపరులు, ఇంద్రియలోలురకు బ్రహ్మవిద్య చెప్పరాదు. చెప్పినా వారికి వంటబట్టదు.

| | | |
|---|---|---|
| త్వా+బహవః+కామాః+ | = | నీకు ఈ అనేక కామములు |
| న+అలోలుపంత | | లోలత్వమును గలిగించ లేకపోయినవి. కావున |
| నచికేతసం+ | = | ఓ నచికేతా ! నిన్ను బ్రహ్మవిద్యను భోధింప |
| విద్యాభీప్సినం+మన్యే | | తగిన విద్యార్థిగ తలంచుచున్నాను. |

**మొదటి పాఠం**

| | | |
|---|---|---|
| 1. యా+విద్యా+ఇతి | = | ఇది విద్యయని |
| అవిద్యా | = | ఇది అవిద్యయని మొదట |
| జ్ఞాతా | = | తెలుసుకొనవలయును |
| ఏతే+విపరీతే+చ | = | ఈ రెండూ పరస్పర విరుద్ధములు - చీకటి వెలుగుల వంటివి |
| విషూచీ+చ+దూరం | = | భిన్నధ్రువాలు మఱియు ఒకదానికొకటి చాలా దూరం |

ఇది విద్య. ఇది అవిద్య అని మొదట గ్రహించవలయును. అవిద్య, అనగా సంసార తాపత్రయములలో ఉండుట. విద్య అనగా తామరాకుపై నీటి బొట్టు వలె ఉండుట.

సృష్ట్యాదిని బ్రహ్మ

| | | |
|---|---|---|
| అహం (నేను) | - | అను దేహాభిమాన బుద్ధిగల మోహమును |
| అంగనా సంగమము | - | అను మహా మోహంబును |
| తత్ప్రతి ఘాత జాతంబైన క్రోధంబు అనే | - | అంధతామిస్రంబును |
| అహమేవ మృతో உస్మి | - | అను తామిస్రంబును |
| | - | చిత్తవిభ్రమంబును |

అను అవిద్యా పంచక మిశ్రమంబుగా సర్వభూతావళిని పుట్టించె. అవిద్య వలన జీవునికి దేహ,కర్మ బంధము గలుగును. అవిద్య సంసార హేతువు. అవిద్యచే కర్మ బంధము గలుగును. శరీరము, ఇంద్రియములు, మనస్సు, చిత్తము, అహంకారము, బుద్ధి, గుణములు యివి అవిద్య - ఇవి నేను గాను- నేను కూటస్థుడను అని

గ్రహించుట విద్య. అవిద్యను సాధన ద్వారా పాఱద్రోలి, తను జీవుడను కానని గ్రహించి, కూటస్థుడగుట విద్య.

**ఈశ్వరునిదై క్రీడించుచునవిద్యయనంబడుచున్న మాయ యుపరతయై యెప్పుడు విద్యా రూపంబున బరిణత యగు నప్పుడు జీవోపాధియయిన స్థూల సూక్ష్మ రూపంబులు దహించి కాష్టంబులేక తేజరిల్లు వహ్ని చందంబున యుపరతుండయి అప్పుడు బ్రహ్మ స్వరూపంబునంబొంది పరమానందంబున విరాజమానుండగు.**

(భాగవతము, ప్రథమ స్కంధము - 67)

జీవుండు మాయచేత మోహితుండై గుణవ్యతిరిక్తుండయ్యు మాయా సంగతిందాను త్రిగుణాత్మకుండని యభిమానించుచుం ద్రిగుణత్వాభి మానంబునం గర్తయు భోక్తయునను ననర్థంబు నొందు.

*****

**ఒక రకము మూర్ఖుల గుఱించి**

**యముడు చెప్పుచున్నాడు**

**5. అవిద్యయామన్తరే వర్తమానాః స్వయం ధీరాః పండితం మన్యమానాః**
**దన్ద్రమ్యమాణాః పరియన్తి మూఢాః అన్ధేనైవ నీయమానా యథాన్ధాః**

అవిద్యాయామ్- అన్తరే- వర్తమానాః- స్వయం- ధీరాః - పండితం- మన్యమానాః - దన్ద్రమ్యమాణాః - పరియన్తి- మూఢాః- అన్ధేన- ఏవ- నీయమానాః- యథా- అన్ధాః

(ముండక 1,ii-8 లో జంఘన్యమానాః అని వుంటే యిందులో దన్ద్రమ్యమాణాః అని కలదు.) అవిద్య అనగా తను దేహమనుకొనుట. అలా భావించి దేహానికి సుఖాన్ని ఆపేక్షించి పుణ్యకర్మల ఫలితమును గోరి పుణ్యకర్మలు చేసి కర్తయు, భోక్తయు అను అనర్థము పొందును. కర్మవలన అవిద్య గలుగును. అవిద్యవలన కర్మలు చేయుదురు. దీనినే కర్మ వాసన అని అందురు. అటువంటి

అవిద్యయామ్+అన్తరే+ వర్తమానాః+మూఢాః = అవిద్యలో ఉంటూ- ఈ మూర్ఖులు

స్వయం+ పండితం = వారంతట వారే పండితులము- అని అనుకొని
ధీరాః+మన్యమానాః = జీవిత పరమార్థము సాధించిన ధీరుల మనుకొని కృతార్థులము అయితిమి అనుకొని

వీరు గురువులై ఇతరులకు కర్మాసక్తిని గలిగించి పుణ్యకర్మలు తద్వారా గలుగు బ్రహ్మలోక ప్రాప్తిని గురించియే బోధించుచున్నారు. వీరి బోధలను పాటించి రజోగుణయుతులైన మఱికొందఱు వీరిని అనుసరించుచున్నారు. ఎలా అనుసరిస్తున్నారని అంటే.

యథా+అన్ధేన+ఏవ = ఏ విధముగా గ్రుడ్డివానిచేతనే
నీయమానాః+అన్ధాః = నడిపింపబడే గ్రుడ్డివాళ్ళవలె వీరిని అనుసరించు చున్నారు.
దంద్రమ్యమాణాః = ఇలా పెడత్రోవ పట్టిన గురువులు, వారిని అనుసరించువారు, పుణ్యఫలితము కోరి పుణ్య కర్మలు చేయుచూ బ్రహ్మలోకము చేరి పుణ్య ఫలితము క్షీణించగానే భూలోకమున పునర్జన్మకు వచ్చి ఇలా
పరియన్తి = జనన మరణ వలయములో తిరుగు చున్నారు.

ఇట్టి వారి గురించి భాగవతమున ఇట్లు చెప్పబడినది.

**శ్రుతి గర్మ పరమని చూపుచుండు వారు వేదజ్ఞులనఁ దగువారు గారు.**

(భాగవతము- చతుర్థస్కంధము- 877)

**కర్మ నిష్ఠులగు నుపాధ్యాయులైన వారలీ యాత్మ తత్త్వంబును నెఱుంగరు. ఎఱింగిరేని యుపదేశింపరు.** - (భాగవతము- చతుర్థస్కంధము-883)

**కానని వాని నూఁతగొని కానని వాడు విశిష్ట వస్తువుల్ గానని భంగి**

(భాగవతం-సప్తముస్కంధము-182)

*****

**యముడు చెప్పుచున్నాడు**

**6. న సామ్పరాయః ప్రతి భాతి బాలం ప్రమాద్యన్తం విత్తమోహేన మూఢం**
**అయం లోకో నాస్తి పర ఇతి మానీ పునః పునర్వశమా పద్యతే మే**

న - సామ్పరాయః - ప్రతిభాతి - బాలం - ప్రమాద్యన్తం - విత్తమోహేన - మూఢం - అయం - లోకః - న - అస్తి - పరః - ఇతి - మానీ - పునః - పునః - వశమ్ - ఆపద్యతే - మే.

ఇంకొక రకం మూర్ఖులగుఱించి ఇందు చెప్పుచున్నాడు.

| | | |
|---|---|---|
| అయం+లోకః | = | ఈ లోకము తప్ప |
| పరః+లోకః+న+అస్తి+ ఇతి+మానీ | = | పరలోకమనేది లేదు. కావున యిక్కడనే సుఖపడాలి తప్ప తపస్సు మొదలయిన వాటిచే కృశీభూత దేహులై పొందేది ఏముంది అని పలికే వీడు |
| సాంపరాయః+న+ ప్రతిభాతి | = | పుణ్యకర్మానుష్ఠానముచే పొందబడు పుణ్యలోకములు వీనికి తెలియవు ఇట్టి |
| బాలం | = | బాలుడును అనగా అవివేకి అజ్ఞాని అయిన వాడు |
| విత్తమోహేన+ ప్రమాద్యంతం | = | ధన కనక వస్తు వాహనాదులు, పుత్ర, పౌత్రాదుల యందు గల మోహము అంతమందు దుఃఖప్రాప్తిని గలుగు చేయునని తెలియని |
| మూఢం | = | మూర్ఖుడు |
| పునః పునః | = | మరల మరల |
| మే+వశం+ఆపద్యతే | = | నా వశమును పొందుచున్నాడు. అనగా జన్మించి, చనిపోయి యిలా జనన మరణవలయములో చిక్కుకొనుచున్నాడు. |

పుణ్యాకర్మలు చేయని వాడు నరకమును పొంది ఆ తరువాత భూలోకమున జన్మించుచున్నాడు. వీరు ఒకతరగతికి చెందిన మూర్ఖులు. ఇంకొకరు ఫలితము కోరి పుణ్యాకర్మలు చేసి బ్రహ్మ లోకము పొంది పుణ్యము క్షీణించగానే మరల

భూలోకమున జన్మించుచున్నారు. వీరు ఒక తరగతికి చెందిన మూర్ఖులు. ఈ ఇద్దఱు మూర్ఖులు జన్మ పరంపరలలో చిక్కుకొనుచున్నారు. కావున జన్మ పరంపరలలో చిక్కుకొనకుండా ఉండుటకు పుణ్యఫలితము కోరని పుణ్య కర్మానుష్ఠానము చేయ వలయునన్నది సారాంశము.

*****

**ఆత్మ గుఱించి యముడు చెప్పుచున్నాడు**

7. **శ్రవణా యాపి బహుభి ర్యోన లభ్యః శృణ్వన్తో ఽపి బహవో యం న విద్యుః**
**ఆశ్చర్యో వక్తా కుశలో ఽస్య లబ్ధాఽఽ శ్చర్యోజ్ఞాతా కుశలానుశిష్టః**

శ్రవణాయ - అపి - బహుభిః - యః - న - లభ్యః - శృణ్వన్తః - అపి - బహవః - యం - న - విద్యుః - ఆశ్చర్యః - వక్తా - కుశలః - అస్య - లబ్ధా - ఆశ్చర్యః - జ్ఞాతా - కుశలానుశిష్టః

| | | |
|---|---|---|
| యః | = | ఏ ఆత్మతత్త్వము |
| బహుభిః+శ్రవణాయ+ అపి+న+లభ్యః | = | సంసారములో పడి కొట్టుమిట్టాడుచున్న పలువురకు ఆత్మ తత్త్వము వినుటకైనను లభ్యము కాదు |
| బహవః+శ్రుణ్వంతః+ అపి+యం+న+విద్యుః | = | చాలా మంది విన్నప్పటికి విన్నవారు సాధన చేయకపోవుటవలన ఈ ఆత్మ తత్త్వమును గ్రహించలేరు |
| అస్య+వక్తా+ ఆశ్చర్యః | = | ఆత్మతత్త్వమును ఆత్మను స్వానుభవంలో దర్శించని వాడు బోధించుట ఆశ్చర్యము. |
| కుశలానుశిష్టః+జ్ఞాతా+ ఆశ్చర్యః | = | ఆత్మ సాక్షాత్కారము పొందిన జ్ఞాని బోధించిననూ సాధన చేయని వాడు ఆత్మ తత్త్వమును గ్రహించితిని అని అనుకొనుట ఆశ్చర్యము. |

| | | |
|---|---|---|
| లబ్ధా+కుశలః | = | సాధనచేసి ఆత్మను స్వానుభవంలో దర్శించి, ఆత్మను పొందినవాడు పునరావృత్తి రహితుడైన కుశలుడు. |

ఈ విషయమునే భగవద్గీతలో సాంఖ్యయోగంలో 29వ శ్లోకంగా చెప్పినారు.

*****

**యముడు చెప్పుచున్నాడు**

**8. న నరేణా వరేణ ప్రోక్త ఏష సువిజ్ఞేయో బహుధా చిన్త్యమానః**
**అనన్య ప్రోక్తే గతి రత్ర నాస్తి అణీ యాన్హ్య తర్క్యమాణః ప్రమాణాత్**

న - నరేణ - అవరేణ - ప్రోక్తః - ఏషః - సువిజ్ఞేయః - బహుధా - చిన్త్యమానః - అనన్య ప్రోక్తే - గతిః - అత్ర - న - అస్తి - అణీయాన్ - హి - అతర్క్యమ్ - అణు - ప్రమాణాత్.

| | | |
|---|---|---|
| అవరేణ+నరేణ | = | స్వానుభవంలో ఆత్మదర్శనము చేయని వానిచే |
| ప్రోక్తః +ఏషః+న+ సువిజ్ఞేయః | = | చెప్పబడినచో యీ ఆత్మగుఱించి స్పష్టంగా తెలియదు. |
| బహుధా + చింత్యమానః+ న+సువిజ్ఞేయః | = | వేద వేదాంగములు మొదలయినవి పెక్కు గ్రంథములు చదివి వాటిని లోతుగా అధ్యయనము చేసి ఆలోచించినను ఆత్మ గుఱించి స్పష్టంగా తెలియదు. |
| అనన్యప్రోక్తే+ అత్ర+ గతిః + న+ అస్తి | = | స్వానుభవంలో ఆత్మదర్శనం చేసిన మహానుభావుడు గురువుగా ఉండి అర్హుడయిన శిష్యునకు బోధించినచో ఆత్మ విషయమై ఆత్మ ఉన్నదా లేదా అనే విషయమై సందేహములు లేక స్పష్టంగా తెలియును. ఆత్మ గుఱించి |
| అతర్క్యం+హి | = | ఇది పదార్థమా ! శక్తా - ఇలా తర్కమునకు అందనిది. ఒకసారి పదార్థముగా గోచరిస్తుంది. ఆత్మ వలన ఉపాధులు వచ్చినవి. ఉపాధులు పదార్థములు. |

| | | |
|---|---|---|
| | | పంచభూతాత్మకములు. కావున పదార్థమని అనిపించును. ఆత్మ ప్రాణ రూపమున ఇంద్రియాదులకు శక్తిని గలిగించుట వలన ఇది శక్తి అని అనిపించును. సృష్ట్యాది యందున్న ఆత్మ మహత్. ప్రతి జీవరాశిలో ఉన్న ఆత్మ |
| అణీయాన్+ అణుప్రమాణాత్ | = | సూక్ష్మము అణువు కన్నను సూక్ష్మము |

*****

**యముడు చెప్పుచున్నాడు**

**9. నైషా తర్కేణ మతి రాపనేయా ప్రోక్తా న్యేనైవ సుజ్ఞానాయ ప్రేష్ఠ**
**యాం త్వ మాపం సత్యధృతి ర్బతాసి త్వాదృక్ నో భూయాన్నచికేతః ప్రష్టా**

న - ఏషా - తర్కేణ - మతిః - ఆపనేయా - ప్రోక్తా - అన్యేన - ఏవ - సుజ్ఞానాయ - ప్రేష్ఠ - యాం - త్వం - ఆపః - సత్యధృతిః - బత - అసి - త్వాదృక్ - నః - భూయాత్ - నచికేతః - ప్రష్టా

నచికేతునిని ప్రశంస

| | | |
|---|---|---|
| నచికేతః | = | ఓ నచికేతుడా |
| సత్యధృతిః+బత+అసి | = | నీవు ఆత్మతత్త్వము తెలుసుకొనవలయుననే పట్టుదల గలిగి సత్యమైన ధృతి గలవాడవు. |
| తాదృక్ + ప్రేష్టా+ నః+ భూయాత్ | = | పనికి మాలిన రాళ్ళు పదికోట్ల కన్నా మేలు జాతి ఒక రత్నము మేలు. నీవంటి సత్యధృతి గలిగిన వాడు మాకు తటస్థ పడుగాక. |

గురువు యోగ్యుడయిన శిష్యునికి తనకు తెలిసిన విద్యను బోధించును.

**గురువులు ప్రియ శిష్యులకుం**
**బరమ రహస్యములు దెలియఁ బలుకుదు రచల**
**స్థిర కల్యాణం బెయ్యది**
**పురుషులకును నిశ్చయించి బోధింపుతగన్**

(భాగవతము, ప్రథమస్కంధము- 42)

**ఆత్మతత్త్వము**

| | | |
|---|---|---|
| న+ఏషా+తర్కేణ+ ఆపనేయా | = | ఆత్మ తత్త్వము కేవలము తర్కముతో పొందరానిది |
| అన్యేన + ఏవ+ప్రోక్తా+ మతిః+సుజ్ఞానాయ | = | ఆత్మదర్శనం చేసిన మహనీయునిచే బోధింపబడి శ్రద్ధావంతుడైన శిష్యునికి సాధన వలన తెలియును. |
| యాం+త్వం+ ఆపః | = | ప్రియతముడా ! నీవు వరముగా పొందిన ఆత్మతత్త్వము చెప్పెదను. |

*****

**ఋషి చెప్పుచున్నాడు.**

**10. జానామ్యహం శేవధి రిత్య నిత్యం న హ్యా ధ్రువైః ప్రాప్యతే హి ధ్రువంతత్**
**తతోమయా నాచికేతశ్చితోఽగ్ని రనిత్యైర్ద్రవ్యైః ప్రాప్తవానస్మి నిత్యమ్**

జానామి - అహం - శేవధిః - ఇతి - అనిత్యం - న - హి - అధ్రువైః - ప్రాప్యతే - హి - ధ్రువం - తత్ - తతః - మయా - నాచికేతః - చితః - అగ్నిః - అనిత్యైః - ద్రవ్యైః - ప్రాప్తవాన్ - అస్మి - నిత్యమ్

| | | |
|---|---|---|
| | | శిష్యులారా ! |
| అనిత్యైః +ద్రవ్యైః+ అధ్రువైః+న+ప్రాప్యతే+హి | = | ద్రవ్యములయిన నెయ్యి సమిధలు, పురోడాశము మొదలయిన వానిచే చేయబడు యజ్ఞయాగాదులచే ధనముచే చేయబడు పుణ్యకర్మలచే,అశాశ్వతములుఅయిన పుణ్యలోకాను భవములు గలుగును. మఱియు వాటిచే శాశ్వత సుఖము పొందబడదు. |
| శేవధిః+ అనిత్యం+ఇతి+ అహం+ జానామి | = | ఈ ఇహలోక పరలోక సుఖములు, పుణ్యలోకాను భవములు అనే నిధి అనిత్యములని అని నాకు తెలియును. నేను ఎఱుగుదును. |
| తతః | = | అందువలన |

| | | |
|---|---|---|
| మయా+నచికేతః | = | నా చేత ఓ నచికేతుడా నీ పేరున పిలువబడే |
| తత్+అగ్నిః+ నిత్యమ్ | | ఆ అగ్ని నిత్యము ఆరాధింపబడినది. నేను |
| చితః +హి | | నచికేతాగ్నిని చేసి ఆత్మతత్త్వము తెలుసుకొని ఆత్మను దర్శించితిని. కావున |
| ధ్రువం+ప్రాప్తవాన్+అస్మి= | | పునరావృత్తి భయము లేని ధ్రువ స్థానమును పొందితిని. అనగా జీవన్ముక్తుడనయితిని. |

గురువు స్వానుభవములో ఆత్మను దర్శించినవాడై ఉండవలయును అన్నది సారాంశము.

*****

**ఋషి చెప్పుచున్నాడు**

**11. కామస్యాప్తిం జగతః ప్రతిష్ఠాం క్రతో రానన్త్య మభయస్య పారమ్**
**స్తోమ మహదురుగాయం ప్రతిష్ఠాం దృష్ట్వా ధృత్యా ధీరో నచికేతోఽత్యస్రాక్షీః**

కామస్య - ఆప్తిం - జగతః - ప్రతిష్ఠాం - క్రతోః - అనంత్యం - అభయస్య - పారమ్ - స్తోమం - మహత్ - ఉరుగాయం - ప్రతిష్ఠాం - దృష్ట్వా - ధృత్యా - ధీరః - నచికేతః - అత్యస్రాక్షీః

ఋషి నచికేతునిని ప్రశంసించుచున్నాడు.

| | | |
|---|---|---|
| నచికేతః | = | ఓ నచికేతుడా! |
| కామస్య+ఆప్తిం | = | సకల కామములకు పరిసమాప్తి అయినట్టిదియు |
| జగతః+ప్రతిష్ఠాం | = | ఈ సకల జగత్తుకు ఆశ్రయమైనట్టిదియు |
| క్రతోః + అనంత్యం | = | క్రతువుల యొక్క అనంత ఫలరూపమయి నట్టిదియు |
| అభయస్య+పారం | = | అభయము యొక్క అనగా అమృతత్త్వమే ఆవలి ఒడ్డుగా గలదియు, (భయము మృత్యువు, అభయము - అమృతత్త్వము) |
| స్తోమం | = | సకల జనులచే స్తుతింప దగినట్టిదియు |
| మహత్+ఉరుగాయం+ | = | మహత్ శబ్దవాచ్యమైన గొప్ప విరాట్ |

| | | |
|---|---|---|
| ప్రతిష్ఠాం | | పురుషునికి జగత్తుకు ఆధారమైనట్టియు అగు ఆత్మను |
| దృష్ట్వా | = | దర్శించి |
| ధృత్వా | = | విద్యను తెలుసుకొని, |
| ధీరః+ అత్యస్రాక్షీః | = | ధీరుడవై కర్మ బంధములను తొలగించు కొంటివి. |

*****

**ఆత్మదర్శనము వలన గలుగు ఫలితమును యముడు చెప్పుచున్నాడు.**

**12. తం దుర్దర్శం గూఢమనుప్రవిష్టం గుహాహితం గహ్వరేష్ఠం పురాణమ్**
**అధ్యాత్మయోగాధిగమేన దేవం మత్వా ధీరో హర్షశోకౌ జహాతి**

తం - దుర్దర్శం - గూఢమ్ - అనుప్రవిష్టం - గుహాహితం - గహ్వరేష్టం - పురాణం- అధ్యాత్మయోగాధిగమేన - దేవం - మత్వా - ధీరః - హర్షశోకౌ - జహాతి

| | | |
|---|---|---|
| దుర్దర్శం+ గూఢమ్+ | = | సామాన్యులచే దర్శింపరానిదియు, |
| అనుప్రవిష్ఠం+గుహాహితం+ | | నిగూఢమైనదియు, అంతరాత్మగా కలదియు, |
| గహ్వరేష్టం+పురాణం+దేవం | | హృదయ గుహలో గలదియు, ప్రాకృతవిషయ వికారముల లేనట్టిదియు, లోకాదియు, జ్యోతి స్వరూపమైనదియు అగు |
| తమ్ | = | ఆ ఆత్మను |
| అధ్యాత్మయోగాధిగ మేన+మత్వా | = | అధ్యాత్మ యోగముచే, శ్రద్ధాభక్తి ధ్యానయోగములచే నిరంతరము ధ్యానించి ఆత్మను తెలుసుకొని అనగా ఆత్మను హృదయ గుహలో దర్శించి, సర్వత్రా దర్శించిన |
| ధీరః | = | ధీరుడు |
| హర్షశోకౌ | = | హర్షము, శోకము అనగా సుఖదుఃఖాధి ద్వంద ములను |
| జహాతి | = | జయించుచున్నాడు. ఇతడే పండితుడు. ఇతడే సమదర్శనుడు. ఇతడే గురువు. |

*****

**ఋషి చెప్పుచున్నాడు**

**13. ఏతచ్ఛ్రుత్వా సమ్పరిగృహ్య మర్త్యః ప్రవృహ్య ధర్మ్యమణు మేత మాప్య**
**స మోదతే మోదనీయం హి లబ్ధ్వా వివృతం సద్మ నచికేతసం మన్యే**

ఏతత్ - శ్రుత్వా - సమ్పరిగృహ్య - మర్త్యః - ప్రవృహ్య - ధర్మ్యం - అణుం - ఏతం- ఆప్య - సః - మోదతే - మోదనీయం - హి - లబ్ధ్వా - వివృతం - సద్మ- నచికేతసం - -మన్యే

| | | |
|---|---|---|
| మర్త్యః | = | మానవుడు శరీర |
| ధర్మ్యం+అణుం+ | = | ధర్మాధర్మములకు భిన్నమయినదియు. |
| మోదనీయం+ఏతత్ | | అణువు అయినదియు, సంతోషదాయక |
| శ్రుత్వా+హి | | మైనదియు అగు యీ ఆత్మతత్త్వమును అనుభవ శాలురయిన అనగా ఆత్మను దర్శించిన పెద్దలు చెప్పగా విని |
| ప్రవృహ్య | = | శరీర లక్షణముల నుండి వేఱు చేసి |
| ఏతం+ఆప్య | = | ఈ ఆత్మను పొంది అనగా ఆత్మను దర్శించిన |
| సః | = | వాడు |
| సమ్పరిగృహ్య | = | శరీర త్యాగము తరువాత |
| లబ్ధ్వా+మోదతే | | ఆత్మను పొంది అనగా ఆత్మతో ఏకీభూతుడై శాశ్వతానందమును పొందుచున్నాడు. కావున ఓ నచికేతుడా ! |
| నచికేతసం | = | నీవు యముని ద్వారా ఆత్మతత్త్వమును తెలుసుకొని దర్శించితివి అందు వలన నీకు |
| సద్మ+వివృతం+మన్యే | = | బ్రహ్మలోక ద్వారములు తెఱువబడినట్లు నేను భావించుచున్నాను. |

*****

**శిష్యులు గురువగు ఋషితో-**

**14. అన్యత్ర ధర్మాదన్యత్రాఽధర్మా దన్యత్రాఽస్మా త్కృతాఽకృతాత్**
**అన్యత్ర భూతాచ్చ భవ్యాచ్చ యత్త త్పశ్యసి తద్వద**

అన్యత్ర - ధర్మాత్ - అన్యత్ర - అధర్మాత్ - అన్యత్ర - అస్మాత్ - కృత - అకృతాత్ - అన్యత్ర - భూతాత్ - చ - భవ్యాత్ - చ - యత్ - తత్ - పశ్యసి - తత్ - వద

| | | |
|---|---|---|
| అన్యత్ర+ధర్మాత్+ అధర్మాత్ | = | ధర్మాధర్మముల కంటె భిన్నమయినది |
| అన్యత్ర+ కృత+ అకృతాత్ | = | కృతమనగా చేయబడినది. దేహము. అకృతాత్ అనగా స్వయంగా ఉద్భవించినది. జీవాత్మ. ఆత్మ-దేహలక్షణముల కంటె, జీవాత్మ లక్షణముల కంటె భిన్నమయినది. |
| అన్యత్ర + భూతాత్+చ భవ్యాత్ | = | భూత భవిష్యత్ వర్తమాన కాలములో గల విశ్వము కంటె భిన్నమయినది. |
| ఆస్మాత్+అన్యత్ర+చ | = | అధిభౌతికము, అధిదైవికముల కంటె భిన్న మయినది. |
| యత్ | = | ఏది కలదో |
| తత్+పశ్యసి | = | దానిని, ఆ ఆత్మను తమరు దర్శించితిరి |
| తత్+వద | = | మీరు దర్శించిన ఆత్మను గురించి మాకు చెప్పండి. అలా ఆత్మను దర్శించుటకు యముడు నచికేతునకు చెప్పినది మాకు చెప్పండి. |

*****

**ఓంకారమును ధ్యానించుమని యముడు చెప్పుచున్నాడు**

**15. సర్వే వేదా యత్పద మామనన్తి తపాంసి సర్వాణి చ యద్వదన్తి**
**యది చ్ఛన్తో బ్రహ్మచర్యం చరన్తి తత్తే పదం సంగ్రహేణ బ్రవీమి ఓమిత్యేతత్**

సర్వే - వేదాః - యత్ - పదం - ఆమనంతి - తపాంసి - సర్వాణి - చ - యత్ - వదన్తి - యత్ - ఇచ్ఛన్తః - బ్రహ్మచర్యం - చరంతి - తత్ - తే - పదం - సంగ్రహేణ - బ్రవీమి - ఓం - ఇతి - ఏతత్.

| | | |
|---|---|---|
| సర్వే+వేదాః | = | సకల వేదములు |
| యత్+పదం+ఆమనంతి= | | ఏ పదమును లక్ష్యస్థానముగా చెప్పుచున్నవో |
| యత్+ఇచ్ఛన్తః | = | ఏ పదవిని పొంద |
| తపాంసి+ బ్రహ్మచర్యం+= | | తపస్సు, బ్రహ్మచర్యము |
| సర్వాణి+చ | | సర్వపుణ్యకర్మలు,యోగము, |
| చరంతి | = | ఆచరించుచున్నారో |
| యత్+వదంతి | = | పెద్దలు, ఆత్మ దర్శనము చేసినవారు ఏ పదవి గురించి చెప్పుచున్నారో |
| తత్+పదం | = | ఆ పదమును పొందుటకు |
| తే | = | నచికేతా నేను మీ కొఱకు |
| సంగ్రహేణ | = | సంగ్రహముగా |
| బ్రవీమి | = | చెప్పుచున్నాను. శ్రద్ధగా విని ఆచరించండి |
| ఏతత్+ఓమ్+ఇతి | = | ఓమ్ అను అక్షర పరబ్రహ్మ. అనగా ఓంకారమును ధ్యానించండి. |

*****

**ఓంకారమును ధ్యానించుమని యముడు చెప్పుచున్నాడు**

**16. ఏతద్ధ్యే వాక్షరం బ్రహ్మ ఏతద్ధ్యే వాక్షరం పరమ్**
**ఏ తద్ధ్యే వాక్షరం జ్ఞాత్వా యో యదిచ్ఛతి తస్య తత్**

ఏతత్ - హి - ఏవ - అక్షరం - బ్రహ్మ - ఏతత్ - హి - ఏవ - అక్షరం - పరమ్ - ఏతత్ - హి - ఏవ - అక్షరం - జ్ఞాత్వా - యః - యత్ - ఇచ్ఛతి - తస్య - తత్.

| | | |
|---|---|---|
| ఏతత్+అక్షరం+ఏవ+ హి+బ్రహ్మ | = | ఈ ఓమ్ అక్షరమే బ్రహ్మ |

| | | |
|---|---|---|
| ఏతత్+అక్షరం+ఏవ+ హి+పరం | = | ఈ ఓమ్ అను అక్షరమే ఉత్కృష్టము |
| ఏతత్+అక్షరం+ఏవ+ జ్ఞాత్వా | = | ఈ ఓం అను అక్షరమును ఉపాసించిన |
| తస్య | = | వానికి అనగా |
| యః+తత్ | = | ఎవడు ఆత్మను ఉపాసించి |
| యత్+ఇచ్ఛతి+హి | = | దేనినికోరునో అనగా మోక్ష కామునకు మోక్షము, కామ్యపరునికి కామ్యఫలసిద్ధి లభ్యమగును. |

*****

**యముడు చెప్పుచున్నాడు**

**-ఓంకారము-**

**17. ఏతదాలంబనం శ్రేష్ఠ మేతదా లంబనం పరమ్**
**ఏతదా లంబనం జ్ఞాత్వా బ్రహ్మలోకే మహీయతే**

ఏతత్ - ఆలంబనం - శ్రేష్ఠమ్ - ఏతత్ - ఆలంబనం - పరమ్ - ఏతత్ - ఆలంబనం - జ్ఞాత్వా - బ్రహ్మలోకే - మహీయతే

| | | |
|---|---|---|
| ఏతత్+ఆలంబనం+ శ్రేష్ఠం | = | ఓంకారోపాసన అనే యీ పట్టుకొమ్మయే శ్రేష్ఠము |
| ఏతత్+ఆలంబనం+ పరమ్ | = | ఈ పట్టుకొమ్మయే ఉత్కృష్టము. |
| ఏతత్+ఆలంబనం+ జ్ఞాత్వా | = | ఈ ఓంకారోపాసన అనే పట్టుకొమ్మని గట్టిగా పట్టుకొని ఆ పట్టుకొమ్మని ఆధారంగా చేసుకొని మెల్లగా చెట్టులెక్కినట్లు సాధకుడు |
| బ్రహ్మలోకే+మహీయతే | = | బ్రహ్మ లోకమునందు శాశ్వతముగా వసియించి పూజనీయుడగుచున్నాడు. |

ఆత్మ గుఱించి గాక ఆత్మను తెలియు విధానము గుఱించి బోధించి ఆపై ఆత్మ గుఱించి విశదీకరించు చున్నాడు.

*****

**ఆత్మ గురించి యముడు చెప్పుచున్నాడు**

**18. నజాయతే మ్రియతే వా విపశ్చి న్నా౽యం కుతశ్చిన్న బభూవ కశ్చిత్**
**అజో నిత్యః శాశ్వతో౽యం పురాణో న హన్యతే హన్యమానే శరీరే**

(భగవత్ గీత- సాంఖ్య యోగం-20లో కూడ గలదు)

న - జాయతే - మ్రియతే - వా - విపశ్చిత్ - న - అయం - కుతః - చిత్ - న - బభూవ - కః - చిత్ - అజః - నిత్యః - శాశ్వతః - అయం - పురాణః - న - హన్యతే- హన్యమానే - శరీరే.

సృష్ట్యాదియందున్న ఆత్మ

| | | |
|---|---|---|
| అయం+కుతః+చిత్+ న+బభూవ | = | ఈ ఆత్మ ఎవరి వలనను జన్మించుట లేదు ఇది స్వయంభువు |
| కః+చిత్ | = | ఈ ఆత్మనుంచి సృష్టిలోనిది ఏదీ రాలేదు. ఈ ఆత్మ సృష్టి కారకుడు కాడు. సృష్టి కారకుడు విరాట్ పురుషుడు. |
| అయం+న+అజః | = | ఇది పుట్టుక లేనిది |
| నిత్యః+ శాశ్వతః | = | నిత్యము శాశ్వతము |
| పురాణః | = | సనాతనుడు |
| విపశ్చిత్+న+జాయతే+ మ్రియతే+వా | = | ఎప్పుడును పుట్టుట లేదు. చనిపోవుట లేదు |
| శరీరే + హన్యమానే+ న+హన్యతే | = | శరీరము నశించినా ఇది నశింపదు. దేహము పుట్టును. చనిపోవును. కాని శరీరము చంపబడినా ఆత్మ చంపబడదు. |

ఈ విషయమును హిరణ్యకశిపుడు తన తల్లికి

**జెడు నేని దేహంబు సెడు గాని( పురుషుండు సెడ(డాతనికి నింత సేటు లేదు**
**పురుషునికిని దేహ పుంజంబునకు వేఱుగాని యేకత్వంబు గానరాదు**

అని వివరించినాడు. (భాగవతము, సప్తమ స్కంధము-51)

*****

**యముడు ఆత్మ గురించి చెప్పుచున్నాడు**

**19. హన్తా చేన్మన్యతే హన్తుం హత శ్చేన్మన్యతే హతమ్**
**ఉభౌ తౌ న విజానీతో నా యం హన్తి న హన్యతే**

(ఇది భగవద్గీత, సాంఖ్య యోగం.19 లో కూడ కలదు)

హంతా - చేత్ - మన్యతే - హంతుం - హతః - చేత్ - మన్యతే - హతమ్ - ఉభౌ - తౌ - న - విజానీతః - న - అయం - హన్తి - న - హన్యతే.

| | | |
|---|---|---|
| హంతా | = | హంతకుడు |
| హంతుం+ చేత్+ మన్యతే | = | నేను చంపితిని అని అనుకొన్నట్లయిన |
| హతః | = | హతుడు |
| హతమ్+చేత్+మన్యతే | = | నేను చనిపోయానని భావించినా |
| తౌ+ఉభౌ | = | ఆ యిద్దఱు |
| న+విజానీతః | = | ఆత్మ తత్త్వము తెలియని వారు. చంపినది, చని పోయినది ఆధి భౌతికమయిన దేహము. ఆధి దైవికమయిన జీవుడు- అధ్యాత్మ మయిన ఆత్మ నశించలేదు. |
| అయం | = | ఈ ఆత్మ |
| న+హంతి+న+హన్యతే | = | చంపదు. చంపబడదు. అనగా ఆత్మ కర్తగాదు. భోక్తాకాదు. ఆత్మ సాక్షీభూతుడు. కార్యాకారణ కర్తృత్వములు ప్రకృతివే గాని పురుషునివి కావు. ప్రకృతి సంసర్గము వలన జీవుడు తనే కర్తయని భావించి భోక్తయనే అనర్థంబు నొందుచున్నాడు. |

*****

**యముడు ఆత్మ గుఱించి చెప్పుచున్నాడు.**

**ఆత్మ లక్షణం- దర్శన ఫలితం**

**20. అణో రణీయా న్మహతో మహీయా నాత్మాఽ స్య జన్తోర్నిహితో గుహాయాం**
**తమక్రతుః పశ్యతి వీతశోకో ధాతుః ప్రసాదాన్మహిమాన మాత్మానః**

అణోః - అణీయాన్ - మహతః - మహీయాన్ - ఆత్మా - అస్య - జన్తోః - నిహిత- గుహాయాం - తమ్ - అక్రతుః - పశ్యతి - వీతశోకః - ధాతుః - ప్రసాదాత్ - మహిమానమ్ - ఆత్మనః

సృష్ట్యాది యందున్న ఆత్మ

| | | |
|---|---|---|
| మహతః+ మహీయాన్ | = | సర్వ విశ్వము అదే అగుట వలన గొప్ప పరిమాణం గల వానికంటె కూడ గొప్పది. |
| ఆత్మా+అస్య+ జన్తోః+ నిహితః+ గుహాయాం | = | ఆ ఆత్మ ఈ జీవుల యొక్క హృదయ గుహలో గలదు. జీవులలో గల ఆత్మ |
| అణోః + అణీయాన్ | = | సూక్ష్మాతి సూక్ష్మము |
| తమ్ | = | స్వయంజాతమయిన దానిని ఆ హృదయగుహలో గల ఆత్మను |
| అక్రతుః | = | విరక్తి, వైరాగ్యములు గలవాడు |
| ధాతుః + ప్రసాదాత్ | = | నిర్మలమయిన అంతఃకరణములు గలవాడు |
| వీత శోకః | = | శోక మోహములు లేనివాడగుచున్నాడు |
| ఆత్మానః | = | ఆత్మ యొక్క |
| మహిమానమ్ | = | గొప్పతనమును |
| పశ్యతి | = | దర్శించుచున్నాడు |

*****

**ఋషి చెప్పుచున్నాడు**

**21. ఆసీనో దూరం వ్రజతి శయానో యాతి సర్వతః**
**కస్తం మదామదం దేవం మదన్యో జ్ఞాతు మర్హతి**

ఆసీనః - దూరం - వ్రజతి - శయానః - యాతి - సర్వతః - కః - తం - మదామదం - దేవం - మదన్యః - జ్ఞాతుమ్ - అర్హతి.

| | | |
|---|---|---|
| ఆసీనః + దూరం+ ప్రజతి | = | ఒక్క చోట ఉన్నను దూరముగా వెళ్ళుచున్నాడు అనగా అది హృదయ గుహలో సమీపమున నున్నను- అది కంటికి కనిపించనంత దూరంలో సంచరించు చున్నట్లు జాగ్రతావస్థలో కనిపించదు. |
| శయానః+ సర్వతః+ యాతి | = | శయనించియు సర్వత్రా వెళ్ళుచున్నాడు అనగా నిద్రలో, స్వప్నావస్థలో ఆత్మమాయచే కల్పింపబడిన జీవలోకములో జీవుని వశములో లేక తన ఇష్టము వచ్చినట్లు సంచరించును. |
| మదామదం | = | జాగ్రతావస్థలో సుఖదుఃఖములను సుషుప్తిలో దుఃఖము లేనిదియు అగు |
| తం+దేవం | = | ఆ స్వయం జ్యోతియైన ఆత్మను |
| మదన్యః | = | నావంటి వాడు గాక |
| కః | = | ఎవ్వడు |
| జ్ఞాతుం+అర్హతి | = | గ్రహించ సమర్థుడు. అనగా అహం బ్రహ్మ అస్మి అని ఆత్మను గ్రహించినవాడు తన స్వానుభవమును ప్రకటించినాడు. గురువు ఆత్మను దర్శించినవాడై ఉండవలయును అని అర్థము. |

*****

## ఆత్మ దర్శనము

**యముడు చెప్పుచున్నాడు**

**22. అశరీరం శరీరేష్వ నవస్థేష్వ వస్థితమ్**
**మహాంతం విభుమాత్మానం మత్వా ధీరో నశోచతి**

అశరీరం - శరీరేషు - అనవస్థేషు - అవస్థితమ్ - మహాంతం - విభుం - ఆత్మానం - మత్వా - ధీరః - న - శోచతి

| | | |
|---|---|---|
| శరీరేషు+అశరీరం | = | దేహ లక్షణములు లేనిదియు |
| అనవస్థేషు | = | జాగ్రత్, స్వప్న, సుషుప్తి అను అవస్థా త్రయంబులు లేనిదియు |

| | | |
|---|---|---|
| అవస్థితమ్ | = | జీవుల శరీరములలోగల హృదయ గుహలో గలదియు |
| మహాంతం | = | గొప్పదియు |
| విభుం | = | సర్వజగత్తుకు ప్రభువు అయినదియు అగు |
| ఆత్మానం | = | ఆత్మను |
| ధీరః | = | ధీరుడు |
| మత్వా | = | తనే ఆ ఆత్మనని తెలుసుకొని తను శరీరము కానని గ్రహించి |
| న+శోచతి | = | దుఃఖింపడు అనగా ద్వంద్వాతీతుడగును |

*****

**ఆత్మ దర్శనము**

**యముడు చెప్పుచున్నాడు**

**23. నా యమాత్మా ప్రవచనేన లభ్యో న మేధయా న బహునా శ్రుతేన**
**యమే వైష వృణుతే తేన లభ్య స్తస్యైష ఆత్మా వివృణుతే తనూం స్వాం**

(ముండక 3-2-3 లోకూడ కలదు)

న - అయమ్ - ఆత్మా - ప్రవచనేన - లభ్యః - న - మేధయా - న - బహునా - శ్రుతేన - యం - ఏవ - ఏషః - వృణుతే - తేన - లభ్యః - తస్య - ఏషః - ఆత్మా - వివృణుతే - తనూం - స్వాం.

| | | |
|---|---|---|
| అయం+ ఆత్మా | = | ఈ ఆత్మ |
| ప్రవచనేన + న | = | శాస్త్రములు చదువుట వలన గాని |
| న+ మేధయా | = | బుద్ధిచే గాని |
| బహునా+ శ్రుతేన | = | వేద పురాణములు వినుట వలన గాని |
| న+లభ్యః | = | లభ్యము కాదు |
| | | **మఱి ఎవ్వరికి లభ్యమగును?** |
| యం+ఏవ | = | సాధన చేసినవానికే |
| ఏషః+లభ్యః | = | ఈ ఆత్మ లభించును |
| వృణుతే | = | ఆ సాధకునినే వరించును |
| తేన | = | ఓంకారోపాసనచేతనే |

| | | |
|---|---|---|
| ఏషః + ఆత్మా | = | ఈ ఆత్మ |
| తస్య | = | తన యొక్క |
| స్వాం+ తనూం | = | నిజ రూపమును |
| వివృణుతే | = | చూపి దర్శనమిచ్చును |

*****

**యముడు చెప్పుచున్నాడు**

**24. నాఽ విరతో దుశ్చరితా న్నాఽ శాంతో నాఽ సమాహితః**
**నాఽ శాంత మనసో వాపి ప్రజ్ఞానేనైన మాప్నుయాత్**

న - అవిరతః - దుశ్చరితాత్ - న - అశాంతః - న - అసమాహితః - న - అశాంతమానసః - వా - అపి - ప్రజ్ఞానేన - ఏనమ్ - ఆప్నుయాత్.

| | | |
|---|---|---|
| న+ దుశ్చరితాత్ | = | పాప కార్యముల నుండి మరలని వానికి |
| న+అవిరతః | = | భోగాపేక్షల నుంచి మరలని వానికి |
| న+ అశాంతః | = | గుణయుతుడై సుఖదుఃఖములకు విచలితుడగు అశాంతి గల వానికి |
| న+అసమాహితః | = | ఇంద్రియ స్వాధీనము లేనివానికి |
| అశాంతమానసః | = | అశాంతమనస్కుడగు వానికి మఱియు |
| వా+అపి | = | ఏకాగ్రచిత్తము లేని వానికి - ఇలాంటి వారికి ఆత్మ దర్శనం లభించదు. |
| ప్రజ్ఞానేన + ఏనమ్+ ఆప్నుయాత్ | = | ప్రజ్ఞానము చేతనే ఈ ఆత్మను పొందగలడు అనగా సర్వము బ్రహ్మ స్వరూపమని- తనయందు అఖిల భూతములందు ఆత్మను దర్శించువాడే ఈ బ్రహ్మజ్ఞానము పొందగలడు. |

*****

**ఋషి చెప్పుచున్నాడు**

**25. యస్య బ్రహ్మ చ క్షత్రం చ ఉభే భవత ఓదనః**
**మృత్యుర్యస్యోపసేచనం క ఇత్థా వేద యత్ర సః**

( ఇతి ద్వితీయ వల్లీ)

యస్య - బ్రహ్మ - చ - క్షత్రం - చ - ఉభే - భవతః - ఓదనః - మృత్యుః - యస్య- ఉపసేచనం - కః - ఇత్థా - వేద - యత్ర - సః

అలా ఆత్మ దర్శనం చేయని వారిని మృత్యువు, మనము ఎలా అన్నము కూర పచ్చడి, పులుసు, పెరుగు వేసుకొని భోజనం చేయుదుమో, అలా కబళించును.

| | | |
|---|---|---|
| మృత్యుః+ యస్య | = | మృత్యువుకు - ఆత్మను దర్శించని |
| బ్రహ్మ + క్షత్రం+ ఉభే | = | వేద వేదాంగ పారంగతులయిన బ్రాహ్మణులు; ధర్మపరిపాలనా నిరతు లయిన రాజులు - వీరిరువురు. |
| చ | = | మఱియు మిగిలిన సర్వ ప్రజలు |
| ఓదనః+చ+ఉపసేచనం | = | అన్నము, కూర, పచ్చడి, పులుసు, పెరుగు వంటివి |
| భవతః | = | అగును. అనగా మృత్యువు కబళించును. ఈ జ్ఞానము |
| యస్య | = | ఎవరికి |
| వేద | = | గలుగునో |
| కః+ ఇత్థా | = | ఎవడు ఆత్మదర్శనము వలన గలుగు ప్రయోజనము, ఆత్మ దర్శనము లేనిచే గలుగు అనర్థమును ఇట్లు గ్రహించునో |
| సః | = | వాడు |
| యత్ర | = | ఎక్కడ ఆత్మ గలదో అక్కడకు చేరును అనగా మృత్యువును దాటి అమృతత్త్వమును పొందును. |

ఈ జన్మలో ఆత్మను దర్శించనిచో గొప్ప అనర్థము కలుగును అని చెప్పినదానిని ఈ విధముగా ఇందు చెప్పబడినది.

*****

# తృతీయవల్లీ

## జీవేశ్వరులకు గల భేదము

**యముడు చెప్పుచున్నాడు**

**1. ఋతం పిబంతౌ సుకృతస్య లోకే గుహాం ప్రవిష్టౌ పరమే పరార్థ్యే**
**ఛాయా తపౌ బ్రహ్మవిదో వదన్తి పఞ్చాగ్నయో యే చ త్రిణాచికేతాః**

ఋతం - పిబంతౌ - సుకృతస్య - లోకే - గుహాం - ప్రవిష్టౌ - పరమే - పరార్థ్యే - ఛాయాతపౌ - బ్రహ్మవిదః - వదన్తి - పంచాగ్నయః - యే - చ - త్రి - నాచికేతాః

| | | |
|---|---|---|
| లోకే+ఛాయాతపౌ+ ప్రవిష్టౌ పిబంతౌ | = | శరీరమునందు జీవాత్మ, పరమాత్మలనేవి వెలుగు నీడలుగా ఉండి, ఫలితమును అనుభవించుచూ ఒకటి, సాక్షిత్వమును అను భవించుచూ మఱియొకటి గలవని |
| బ్రహ్మ విదః+ వదంతి | = | బ్రహ్మజ్ఞానులు చెప్పుచున్నారు |
| పరమే+ గుహాం+ పరార్థ్యే+ సుకృతస్య +ఋతం | = | ఆత్మ సాక్షీ భూతమయినది. అది బ్రహ్మాండమునకు వెలుపల ఉన్నది. ఉత్కృష్టమైనది. అదే హృదయాకాశము అనే హృదయ గుహలో ఉన్నది మఱియు దేహ ధ్యాస గల జీవాత్మగా సుకృత దుష్కృతముల యొక్క ఫలిత ములను అను భవించుచున్నదనే సత్యమును |
| బ్రహ్మవిదః | = | బ్రహ్మవిదులు |
| వదంతి | = | చెప్పుచున్నారు. |
| యే+ పంచాగ్నయః+చ+ నాచికేతాః+త్రి | = | ఎవరు పంచాగ్నుల మధ్యలో తపస్సు చేయుచున్నారో ఎవరు నచికేతాగ్నిని చేయుచున్నారో ఎవరు అవస్థాత్రయములను దాటు చున్నారో వారు హృదయ గుహలో గల ఆత్మయందు ప్రవేశించు చున్నారు. |

*****

**ఋషి చెప్పుచున్నాడు**

**2. యస్సేతు రీజానానా మక్షరం బ్రహ్మ యత్పరమ్**
**అభయం తితీర్షతాం పారం నాచికేతం శకేమహి**

యః - సేతుః - ఈజానానామ్ - అక్షరం - బ్రహ్మ - యత్ - పరం - అభయం- తితీర్షతాం - పారం - నాచికేతం - శకేమహి

| | | |
|---|---|---|
| యః | = | ఏ అగ్ని అనగా నాచికేతమనే పేరుగల హృదయ గుహలో గల ఆత్మ |
| ఈజానానాం | = | కర్మపరులకుదుఃఖమును తొలగించుటకు |
| సేతుః | = | సేతువుయో |
| యత్ | = | ఏది |
| అభయం | = | అభయ ప్రదము అయినదో |
| తితీర్షతాం+ పారం | = | అజ్ఞాన సాగరము యొక్క ఆవలితీరమున గలదియో |
| పరం | = | ప్రకృతికి పరమయినదియో |
| అక్షరం | = | శాశ్వతమయినదియో |
| బ్రహ్మ | = | ఆత్మయో, సృష్టికారణమో ఆ |
| నాచికేతం | = | నాచికేతాగ్నిని- అనగా హృదయగుహలో గల జ్యోతిని |
| శకేమహి | = | మీరు గ్రహించవలయును. |

*****

**యముడు చెప్పుచున్నాడు**

సాధన

**3. ఆత్మానం రథినం విద్ధి శరీరం రథమేవ తు**
**బుద్ధిం తు సారథిం విద్ధి మనః ప్రగ్రహమేవ చ**

ఆత్మానం - రథినం - విద్ధి - శరీరం - రథం - ఏవ - తు - బుద్ధిం - తు - సారథిం - విద్ధి - మనః - ప్రగ్రహ - ఏవ - చ

రథమును ఉదాహరణగా తీసుకొని సాధనను వివరించుచున్నాడు.

| | | |
|---|---|---|
| ఆత్మానం+ రథినం+విద్ధి | = | జీవునిని రథికునిగ గ్రహించుము |
| శరీరం+తు+ రథమ్+ఏవ (విద్ధి) | = | శరీరమును రథముగా తెలియుము |
| బుద్ధిం+ విద్ధి+ సారథిం | = | బుద్ధిని సారథిగ తెలియుము |
| మనః+తు+ప్రగ్రహ+ తు+ఏవ+(విద్ధి) | = | మనస్సును పగ్గములుగా కొరడాగా తెలియుము |
| చ | = | మఱియు (రాబోవు శ్లోకములో వివరింప బడును) |

*****

**4. ఇంద్రియాణి హయా నాహు ర్విషయాం స్తేషు గోచరాన్**
**ఆత్మేంద్రియ మనో యుక్తం భోక్తే త్యాహుర్మనీషిణః**

ఇంద్రియాణి - హయాన్ - ఆహుః - విషయాన్ - తేషు - గోచరాన్ - ఆత్మేంద్రియ-మనోయుక్తమ్- భోక్తా- ఇతి- ఆహుః- మనీషిణః

| | | |
|---|---|---|
| మనీషిణః | = | వివేకవంతులు |
| ఇంద్రియాణి+హయాన్ | = | ఇంద్రియములు గుఱ్ఱములని |
| ఆహుః | = | చెప్పుదురు. |
| తేషు+విషయాన్+ గోచరాన్ + ఆహుః | = | ఇంద్రియముల యందు గల విషయములు ఇంద్రియములు అనే గుఱ్ఱములు నడచే మార్గము లనిచెప్పుదురు |
| ఆత్మేంద్రియ+ మనోయుక్తం | = | దేహము, యింద్రియములు, మనస్సులతో కూడి జీవుడు |
| భోక్తా+ఇతి+ఆహుః | = | భోక్త అని చెప్పుదురు |
| రథికుడు | - | జీవ ఆత్మ |
| రథము | - | శరీరము |
| సారథి | - | బుద్ధి |

పగ్గము,కొరడా - మనస్సు
గుఱ్ఱములు - ఇంద్రియములు
మార్గములు - ఇంద్రియార్థములు

సాధకుడు - శరీరము, బుద్ధి,మనస్సు, ఇంద్రియములు ఇంద్రియార్థములచే సాధన చేయవలయును. ఈ సాధనకు ధనముతో పని లేదు. ఈ సాధన వలననే ఆత్మ దర్శనము అగును.

*****

5. **యస్త్వ విజ్ఞానవాన్భవ త్య యుక్తేన మనసా సదా**
**తస్యేంద్రియాణ్య వశ్యాని దుష్టాశ్వా ఇవ సారథేః**

యః - తు - అవిజ్ఞానవాన్ - భవతి - అయుక్తేన - మనసా - సదా - తస్య - ఇంద్రియాణి - అవశ్యాని - దుష్టాశ్వాః - ఇవ - సారథేః

| | | |
|---|---|---|
| యః | = | ఎవడు |
| సదా | = | ఎల్లప్పుడు |
| అయుక్తేన+మనసా | = | అస్వాధీనమైన మనస్సుచే |
| అవిజ్ఞానవాన్ | = | వివేకము లేని |
| భవతి | = | వాడగుచున్నాడో - పగ్గములను (కొరడాను) సరిగా పట్టుకోనందున |
| తస్య+ సారథేః | = | ఆ బుద్ధి సారథికి |
| ఇంద్రియాణి | = | ఇంద్రియములనే గుఱ్ఱములు |
| అవశ్యాని+ దుష్టాశ్వాః+ | = | వశము లేని దుష్ట అశ్వములవలె |
| ఇవ+తు | | అటు యిటూ రథమును యీడ్చి చివరకు రథికునిని గోతిలో పడవేయును |

బుద్ధి సరిగా పనిచేయనిచో జీవుడు అధోగతి పాలగును. ఇంద్రియములను వాటి వాటి ఇంద్రియార్థములనుంచి మరలించ వలయును. ఇది సాధనలో ప్రథమ సోపానము. ఆ తరువాత మనస్సులోని వికల్పములను నశింప చేసుకొని మనస్సును

నిశ్చలము చేయవలయును. ఇది సాధనలో రెండవ సోపానము. మనో బుద్ధులను ఏకీకృతము చేయవలయును. ఇది సాధనలో మూడవ సోపానము.

*****

**6. యస్తు విజ్ఞానవాన్భవతి యుక్తేన మనసా సదా**
**తస్యేంద్రియాణి వశ్యాని సదశ్వా ఇవ సారథేః**

యః - తు - విజ్ఞానవాన్ - భవతి - యుక్తేన - మనసా - సదా - తస్య - ఇంద్రియాణి- వశ్యాని - సత్ - అశ్వాః - ఇవ - సారథేః

| | | |
|---|---|---|
| యః | = | ఎవడు |
| సదా+యుక్తేన+మనసా | = | ఎల్లప్పుడు స్వాధీనమయిన మనస్సు చేత |
| విజ్ఞానవాన్ + భవతి | = | విజ్ఞానవంతుడై యుండి - పగ్గములు, కొరడా సరిగా పట్టుకొన్న |
| తస్య+ సారథేః | = | ఆ బుద్ధి సారథికి |
| ఇంద్రియాణి | = | ఇంద్రియములు |
| సత్+ అశ్వాః + వశ్యాని+ ఇవ+తు | = | వశములో యున్న మంచి గుఱ్ఱముల వలె రథమును సక్రమముగా నడిపించి రథికునిని గమ్య స్థానమును చేర్చును. |

*****

**7. యస్త్వ విజ్ఞానవాన్ భవ త్య మనస్కః సదాఽశుచిః**
**న స తత్పదమాప్నోతి సంసారం చాఽధి గచ్ఛతి**

యః - తు - అవిజ్ఞానవాన్ - భవతి - అమనస్కః - సదా - అశుచిః - న - సః - తత్ - పదం - ఆప్నోతి - సంసారం - చ - అధిగచ్ఛతి

| | | |
|---|---|---|
| యః | = | ఎవడు |
| సదా | = | ఎల్లప్పుడూ |
| అశుచిః+అమనస్కః | = | అస్వాధీనమయిన మనస్సు గలిగి, విషయవాంఛలనే మనోవికారములు గలిగి |

| | | |
|---|---|---|
| అవిజ్ఞానవాన్+ భవతి | = | వివేకము లేక యుండునో |
| సః | = | అతడు |
| తత్+ పదం+ న+ ఆప్నోతి | = | బ్రహ్మపదమును పొందడు |
| చ | = | మఱియు అతడు |
| సంసారం+అధిగచ్ఛతి +తు | = | సంసార సాగరములో పడును. సుఖదుఃఖములు పొందును. |

*****

**8. య స్తు విజ్ఞానవాన్ భవతి స మనస్కః సదా శుచిః**
**స తు తత్పదమాప్నోతి యస్మాద్భూయో న జాయతే**

యః - తు - విజ్ఞానవాన్ - భవతి - సమనస్కః - సదా - శుచిః - సః - తు - తత్ - పదం - ఆప్నోతి - యస్మాత్ - భూయః - న - జాయతే

| | | |
|---|---|---|
| యః | = | ఎవడు |
| సదా | = | ఎల్లప్పుడు |
| శుచిః | = | స్వాధీనమయిన మనస్సు గలిగి |
| సమనస్కః | = | ఇంద్రియములను స్వాధీనపఱచుకొని |
| విజ్ఞానవాన్+భవతి | = | విజ్ఞానవంతుడు అగుచున్నాడో |
| సః | = | అతడు |
| తత్+పదం+ఆప్నోతి +తు | = | ఆ పరమ పదమును పొందుచున్నాడు. బ్రహ్మానందమును అనుభవించుచున్నాడు. |
| యస్మాత్+తు | = | అందువలన, పరమపదమును పొందుట వలన అతడు |
| భూయః +న+జాయతే | = | మరల పుట్టడు |

*****

**9. విజ్ఞాన సారథిర్యస్తు మనః ప్రగ్రహవాన్నరః**
**సోఽధ్వనః పారమాప్నోతి తద్విష్ణోః పరమం పదమ్**

విజ్ఞాన సారథిః - యః - తు - మనః - ప్రగ్రహవాన్ - నరః - సః - అధ్వనః - పారం - ఆప్నోతి - తత్ - విష్ణోః - పరమం - పదమ్

| | | |
|---|---|---|
| యః+నరః+విజ్ఞాన+ సారథిః | = | ఏ రథికుడు విజ్ఞానవంతుడయిన బుద్ధి సారథిని గలిగి |
| మనః+ ప్రగ్రహవాన్ | = | ఆ బుద్ధి సారథి మనో పగ్గములచే ఇంద్రియ ములనే గుఱ్ఱములను సక్రమ మార్గమున నడిపించునో |
| సః | = | అతడు, ఆ రథికుడయిన జీవుడు |
| అధ్వనః+ పారం | = | త్రోవల అద్దరిని అనగా సంసారము యొక్క ఆవలి ఒడ్డు అయినదియు |
| పరమం+పదం+తు | = | పరమ పదము అయిన పునర్జన్మ రహిత మయిన |
| తత్+విష్ణోః | = | ఆ సర్వవ్యాపకత్వమయిన ఆత్మ స్థానమును |
| ఆప్నోతి | = | పొందును |

*****

**10. ఇంద్రియేభ్యః పరా హ్యర్థా అర్థేభ్యశ్చ పరం మనః**
**మనసస్తు పరా బుద్ధిః బుద్ధేరాత్మా మహాన్ పరః**

ఇంద్రియేభ్యః - పరా - హి - అర్థాః - అర్థేభ్యః - చ - పరం- మనః - మనసః - తు - పరా - బుద్ధిః - బుద్ధేః - ఆత్మా - మహాన్ - పరః

| | | |
|---|---|---|
| ఇంద్రియేభ్యః | = | ఇంద్రియముల కంటె |
| అర్థాః+ పరా+హి | = | ఇంద్రియార్థములు గొప్పవి |
| అర్థేభ్యః +చ+మనః+ పరం | = | ఇంద్రియార్థముల కంటె మనస్సు గొప్పది |

| | | |
|---|---|---|
| మనసః+తు+పరా+ బుద్ధిః | = | అహంకారము, చిత్తము, మనసు కంటె బుద్ధి గొప్పది |
| బుద్ధేః+ పరః +మహాన్+ ఆత్మా | = | బుద్ధి కంటె మహత్తు గొప్పది. |

*****

**11 మహతః పరమవ్యక్త మవ్యక్తాత్పురుషం పరః**
**పురుషాన్న పరం కించిత్ సా కాష్ఠా సా పరాగతిః**

మహతః - పరం - అవ్యక్తం - అవ్యక్తాత్ - పురుషః - పరః - పురుషాత్ - న - పరం - కించిత్ - సా - కాష్ఠా - సా - పరా - గతిః

| | | |
|---|---|---|
| మహతః+అవ్యక్తం+ పరం | = | మహతత్త్వము కంటె అవ్యక్తము అనగా ప్రకృతి గొప్పది |
| అవ్యక్తాత్+పురుషః+ పరంః | = | అవ్యక్తము అనగా ప్రకృతి పురుషుడు కంటె గొప్పవాడు అనగా ఆత్మ గొప్పది |
| పురుషాత్+న+పరం+ కించిత్ | = | (ఆది) పురుషుని కంటె ఏదియు గొప్పది లేదు |
| సా+కాష్ఠా | = | ఆ స్థానమే ఉత్కృష్టము |
| సా+పరా+గతిః | = | అదే పరమాగతి (సృష్ట్యాది యందున్న ఆత్మయే స్వయముగా ఉపాధిని నిర్మించుకొని పురుషుడ యినది. ఆత్మ నిరాకారము. సాకారముగా చెప్పిన పురుషుడు. |

*****

**12. ఏష సర్వేషు భూతేషు గూఢోஉఉత్మా న ప్రకాశతే**
**దృశ్యతే త్వగ్ర్యయా బుద్ధ్యా సూక్ష్మయా సూక్ష్మదర్శిభిః**

ఏషః - సర్వేషు - భూతేషు - గూఢః - ఆత్మా - న - ప్రకాశతే - దృశ్యతే - తు - అగ్ర్యయా - బుద్ధ్యా - సూక్ష్మయా - సూక్ష్మదర్శిభిః

| | | |
|---|---|---|
| ఏషః | = | ఈ ఆత్మ |
| సర్వేషు + భూతేషు | = | సర్వభూతములయందు |
| గూఢః (సన్) | = | అంతర్యామి. అందువలన బాహ్య చక్షువులకు |
| న+ప్రకాశతే | = | కనబడుట లేదు |
| ఆత్మా | = | సృష్ట్యాదియందు గలదియు, ప్రాణుల శరీరములలో సూక్ష్మమైనదియు అయిన ఈ ఆత్మ |
| అగ్ర్యయా | = | ఏకాగ్రతగల |
| సూక్ష్మయా+ సూక్ష్మదర్శిభిః | = | సూక్ష్మ దృష్టి గలవారి చేత |
| బుద్ధ్యా+తు | = | బుద్ధిచే |
| దృశ్యతే | = | కనబడునో దీనినే శ్రద్ధ, భక్తి, ధ్యాన యోగముచే ఆత్మను గ్రహించవలయునని చెప్పిరి. |

*****

**యముడు చెప్పుచున్నాడు - సాధన రహస్యమును చెప్పుచున్నాడు.**

**13. యచ్ఛే ద్వాఙ్మనసీ ప్రాజ్ఞః తద్యచ్ఛేత్ జ్ఞాన ఆత్మని**
**జ్ఞాన మాత్మని మహతి నియచ్ఛేత్ తద్యచ్ఛే చ్ఛాంత ఆత్మని**

యచ్ఛేత్ - వాక్ - మనసీ - ప్రాజ్ఞః - తత్ - యచ్ఛేత్ - జ్ఞానే - ఆత్మని - జ్ఞానం - ఆత్మని - మహతి - నియచ్ఛేత్ - తత్ - యచ్ఛేత్ - శాంతే - ఆత్మని

| | | |
|---|---|---|
| ప్రాజ్ఞః | = | వివేకవంతుడు |
| వాక్+మనసీ+యచ్ఛేత్ | = | వాగింద్రియమును మనస్సునందు కలపవలయును |
| తత్ | = | ఆ మనసును |
| ఆత్మని +జ్ఞానే+ యచ్ఛేత్ | = | బుద్ధి యందు కలపవలయును |
| జ్ఞానం+మహతి + ఆత్మని+నియచ్ఛేత్ | = | బుద్ధిని మహత్తత్త్వమునూ కలపి |

| | | |
|---|---|---|
| తత్+శాంతే+ఆత్మని+ యచ్ఛేత్ | = | ఆ మహతత్త్వమును ప్రకృతి యందు కలిపి ఆ ప్రకృతిని వీడి శాంతుడై ఆనందమయుండై బ్రహ్మమందు కలియును. |

ఈ శ్లోకమునకు వివరముగా భాగవతములో ధృతరాష్ట్రునిని ఉదాహరణగా తీసుకొని వివరించినారు.

1. విన్యస్తాసనుండై
2. ప్రాణంబుల నియమించి
3. మనస్సహితంబులయిన చక్షురాదీంద్రియంబుల నాఱింటిని విషయంబుల బ్రవర్తింపనీక నివర్తించి
4. హరిభావనచే ధారణాయోగంబు వహించి
5. రజస్సత్త్వతమో రూపంబులగు మలంబుల మూటిని హరించి
6. మనంబు, అహంకారాస్పదంబైన స్థూల దేహంబు వలనంబాపి - బుద్ధియందు నేకీకరణంబు సేసి
7. అట్టి విజ్ఞాన ఆత్మను దృశ్యాంశంబున వలన నియోగించి
8. క్షేత్రజ్ఞునియందు బొందించి
9. దృష్టంబైన ఈశ్వరుని వలన క్షేత్రజ్ఞునిం బాపి
10. నాధారభూతంబైన బ్రహ్మమందు గలసి .....
    ఆత్మస్వరూపుడయ్యెను. (భాగవతము, ప్రథమ స్కంధము, 328)

*****

**యముడు చెప్పుచున్నాడు**

**14. ఉత్తిష్ఠత జాగ్రత ప్రాప్య వరాన్నిబోధత**
**క్షురస్య ధారా నిశితా దురత్యయా దుర్గం పథస్తత్కవయో వదంతి**

ఉతిష్ఠత - జాగ్రత - ప్రాప్య - వరాన్ - నిబోధత - క్షురస్య - ధారా - నిశితా - దురత్యయా - దుర్గం - పథః - తత్ - కవయః - వదంతి

| | | |
|---|---|---|
| కవయః | = | జ్ఞానులు |

| | | |
|---|---|---|
| తత్+పథః | = | ఆ తత్త్వమును పొందు మార్గమును |
| దుర్గం | = | దాట శక్యముగానిది, బహుకష్టమైనది |
| క్షురస్య+నిశితా+ధారా+ దురత్యయా | = | కత్తి యొక్క పదును పెట్టిన అంచుపై నడక వంటిది. అని |
| వదంతి | = | చెప్పుదురు<br>కావున ఓ నచికేతా ! నీవు |
| వరాన్ + ప్రాప్య | = | సాధన కొఱకు ఆత్మను దర్శించిన జీవన్ముక్తు లయిన గురువులను ఆశ్రయించి గురుకుల వాసములో ఉండి |
| నిబోధత | = | గ్రహించుము |
| ఉత్తిష్ఠత+జాగ్రత | = | సాధనకు ఉపక్రమింప లెమ్ము జాగ్రత. యోగ భ్రష్టుడవు గావద్దు. |

ఈ భావననే శ్రీకృష్ణుడు అర్జునునితో పరిప్రశ్నేన సేవయా అని చెప్పినాడు.

*****

**ఆత్మ గుఱించి యముడు చెప్పుచున్నాడు**

**15. అశబ్ద మస్పర్శ మరూప మవ్యయం తథాఽరసం నిత్య మగంధ వచ్చయత్**
**అనాద్యనంతం మహతః పరం ధ్రువం నిచాయ్య తం మృత్యుముఖాత్ప్రముచ్యతే**

అశబ్దమ్ - అస్పర్శమ్ - అరూపమ్ - అవ్యయమ్ - తథా - అరసమ్ - నిత్యమ్ - అగంధవత్ - చ - యత్ - అనాది - అనంతమ్ - మహతః - పరమ్ - ధ్రువమ్ - నిచాయ్య - తమ్ - మృత్యుముఖాత్ - ప్రముచ్యతే

| | | |
|---|---|---|
| అశబ్దం+అస్పర్శమ్ అరూపమ్+ అరసమ్+ అగంధవత్ | = | శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములనే పంచతన్మాత్రలు గానిది |
| తథా | = | ఆ విధముగనే అహంకారము, మహత్, ప్రకృతులు గానిది. |

| | | |
|---|---|---|
| యత్ | = | అట్టి ఆత్మ సృష్ట్యాదియందు ఏది కలదో అది |
| అవ్యయం | = | నాశనము లేనిదియు |
| నిత్యం | = | శాశ్వతమైనదియు |
| అనాది+ అనంతం | = | అనాదియు, అనంతమయినదియు |
| ధ్రువం | = | ధ్రువమైనదియు |
| మహతః+పరమ్ | = | మహత్ కంటె గొప్పదియు ప్రకృతికి పరమయి నదియు అగు |
| తం | = | ఆత్మను |
| నిచాయ్య | = | దర్శించి |
| మృత్యుముఖాత్+ ప్రముచ్యతే | = | జనన మరణ వలయమునుండి విడి వడుచున్నాడు. అమృతుడగుచున్నాడు. |

*****

**ఋషి చెప్పుచున్నాడు - ఫల శృతి**

**16. నాచికేత ముపాఖ్యానం మృత్యుప్రోక్తం సనాతనమ్**
**ఉక్త్వా శ్రుత్వా చ మేధావీ బ్రహ్మలోకే మహీయతే**

నాచికేతం- ఉపాఖ్యానం- మృత్యుప్రోక్తం- సనాతనం- ఉక్త్వా- శ్రుత్వా- చ- మేధావీ- బ్రహ్మలోకే- మహీయతే

| | | |
|---|---|---|
| సనాతనం | = | సనాతనమయినదియు |
| మృత్యుప్రోక్తం | = | కాలపురుషునిచే చెప్పబడినదియు అయిన |
| నాచికేతం+ఉపాఖ్యానం | = | ఈ నాచికేతోపాఖ్యానము |
| మేధావీ+శ్రుత్వా+చ +ఉక్త్వా | = | నిత్యా నిత్య వివేకము గలిగిన వివేక వంతుడు విని, ఆచరించి తన శిష్యులకు చెప్పిన |
| బ్రహ్మలోకే +మహీయతే | = | బ్రహ్మలోకము చేరి బ్రహ్మయై పూజింప బడును |

*****

**ఋషి చెప్పుచున్నాడు**

**17. య ఇమం పరమం గుహ్యం శ్రావయేద్బ్రహ్మ సంసది ప్రయతః**
**శ్రాద్ధకాలే వా తదానంత్యాయ కల్పతే తదానంత్యాయ కల్పత ఇతి**
**(ఇతి తృతీయ వల్లీ)**

యః - ఇమం - పరమం - గుహ్యం - శ్రావయేత్ - బ్రహ్మసంసది - ప్రయతః - శ్రాద్ధకాలే - వా - తత్ - అనంత్యాయ - కల్పతే - తత్ - అనంత్యాయ - కల్పతే - ఇతి

| | | |
|---|---|---|
| యః | = | ఎవడు - అంతఃకరణ |
| ప్రయతః | = | శుచియై |
| ఇమం+పరమం+ గుహ్యం | = | ఈ పరమ రహస్యమయిన నచికేతో పాఖ్యానమును |
| బ్రహ్మ సంసది+వా | = | బ్రాహ్మణుల సభలోనూ |
| శ్రాద్ధకాలే | = | శ్రాద్ధకాలమున |
| శ్రావయేత్ | = | వినిపించవలయును. |
| తత్ | = | అటుల చేయుట వలన |
| అనంత్యాయ+కల్పతే | = | అతనికి అనంత ఫలము గలుగును |
| తత్+ అనంత్యాయ+ కల్పతే+ఇతి | = | అనంత ఫలము గలుగును |

*****

# చతుర్థవల్లీ

(ఈ చతుర్థ వల్లి అంతా యముడు చెప్పుచున్నాడు)

**దేహవిచారణ - ఇంద్రియములు**

**1. పరాంచిఖాని వ్యతృణత్ స్వయం భూ స్తస్మాత్ పరాఙ్ పశ్యతి నాంతరాత్మన్**
**కశ్చిద్ధీరః ప్రత్యగాత్మాన మైక్ష దా వృత్త చక్షు రమృతత్వ మిచ్ఛన్**

పరాంచి - ఖాని - వ్యతృణత్ - స్వయంభూః - తస్మాత్ - పరాఙ్ - పశ్యతి - న - అంతరాత్మన్ - కశ్చిత్ - ధీరః - ప్రత్యగాత్మానమ్ - ఐక్షత్ - ఆవృత్త - చక్షుః - అమృతత్వమ్ - ఇచ్ఛన్.

| | | |
|---|---|---|
| స్వయంభూః | = | స్వయం భువుడయిన ఆత్మ |
| ఖాని | = | ఇంద్రియములను |
| పరాంచి+ వ్యతృణత్ | = | బాహ్య విషయములను గ్రహించువానిగా మాత్రమే నిర్మించినాడు. బాహ్య ఇంద్రియములు - బాహ్య విష యములనే గ్రహించును. |
| తస్మాత్+పరాఙ్+పశ్యతి | = | అందుచేత అవి బాహ్య విషయములనే గ్రహించును - కన్ను బాహ్య దృశ్యమునే చూచును. అటులనే మిగిలినవి ఊహించుకొనవలయును. |
| న+అంతరాత్మన్ | = | అంతరాత్మను చూడలేవు |
| అమృతత్త్వమ్+ఇచ్ఛన్ | = | అమృతత్వమును కోరినవాడై |
| ఆవృత్తచక్షుః | = | అంతర్దృష్టి గల |
| కశ్చిత్+ధీరః | = | ఒకానొక ధీరుడు సాధనచే |
| ప్రత్యగాత్మానమ్+ఐక్షత్ | = | హృదయ గుహలో గల ప్రత్యగాత్మను చూచును. |

*****

**2. పరాచః కామానను యంతి బాలా స్తే మృత్యోర్యంతి వితతస్య పాశమ్**
**అథ ధీరా అమృతత్త్వం విదిత్వా ధ్రువ మధ్రువేష్వి హ న ప్రార్థయంతే**

పరాచః - కామాన్ - అనుయంతి - బాలాః - తే - మృత్యోః - యంతి - వితతస్య-పాశమ్ - అథ - ధీరాః - అమృతత్వం - విదిత్వా - ధ్రువమ్ - అధ్రువేషు - ఇహ - న - ప్రార్థయంతే.

| | | |
|---|---|---|
| బాలాః | = | అజ్ఞానులు, మూర్ఖులు |
| పరాచః + కామాన్ | = | ఐహిక, ఆముష్మిక సుఖములను |
| అనుయంతి | = | కోరుదురు - సుఖములవైపు పయినింతురు |
| తే | = | అట్టి మూర్ఖులు |
| వితతస్య+మృత్యోః | = | అతి విస్తారమయిన మృత్యువు యొక్క |
| పాశమ్ | = | పాశములలో |
| యంతి | = | పడిపోవుదురు. అనగా యమపాశములలో చిక్కుకొందురు |
| అథ+ధీరాః | = | ధీరులు |
| ధ్రువమ్+అమృతత్త్వమ్ | = | నిత్యమగు అమృతత్త్వమును |
| విదిత్వా | = | తెలుసుకొని |
| ఇహ+ అధ్రువేషు | = | ఈ లోకములోని అనిత్య విషయములను |
| న+ ప్రార్థయంతే | = | కోరరు |

*****

**3. యేన రూపం రసం గంధం శబ్దాన్ స్పర్శాంశ్చమైథునాన్**
**ఏతేనైవ విజానాతి కిమత్ర పరిశిష్యతే ఏతద్వైతత్**

యేన - రూపం - రసం - గంధం - శబ్దాన్ - స్పర్శాన్ - చ - మైథునాన్ - ఏతేన - ఏవ - విజానాతి - కిమ్ - అత్ర - పరిశిష్యతే - ఏతత్ - వై - తత్.

| | | |
|---|---|---|
| యేన | = | ఆత్మ ప్రకాశమున - జీవరూపముచే |
| ఏతేన+ఏవ | = | (మనస్సు, ఇంద్రియములతోనే) మనస్సుతోనే |
| రూపం+రసం+గంధం | = | కంటితో రూపమును, నాలుకతో |
| శబ్దాన్+స్పర్శాన్+చ+ | | రసమును, ముక్కుతో గంధమును, |

| | | |
|---|---|---|
| మైథునాన్ | | చెవులతో శబ్దమును,చర్మముతో స్పర్శను మఱియు సంభోగ సుఖము |
| విజానాతి | = | గ్రహించును |
| అత్ర | = | ఈ ప్రపంచంలో- సృష్ట్యాదియందున్న ఆత్మకు తెలియనిది |
| కిమ్+పరిశిష్యతే | = | ఏమి మిగిలియున్నది. అనగా ఆత్మకు సర్వము తెలియును. |
| ఏతత్+వై+తత్ | = | సృష్ట్యాదియందున్నదేదో అదే ఈ హృదయ గుహలో ఉన్నది. ఈశ్వరుడే జీవరూపమున దేహమున ఉన్నాడు. |

*****

**4. స్వప్నాంతం జాగరితాంతం చోభౌ యే నానుపశ్యతి**
**మహాంతం విభుమాత్మానం మత్వా ధీరో న శోచతి**

స్వప్నాంతం - జాగరితాంతం - చ - ఉభౌ- యేన - అనుపశ్యతి - మహాంతం - విభుం - ఆత్మానం - మత్వా - ధీరః - న - శోచతి.

| | | |
|---|---|---|
| యేన+జాగరితాంతం+ స్వప్నాంతం+ఉభౌ+చ+ అనుపశ్యతి | = | దేనిచే జాగ్రతావస్థ యొక్క అంతము- (స్వప్నము) స్వప్నా వస్థ యొక్క అంతము - (సుషుప్తి) అనే ఈ రెండు అవస్థలను మఱియు, జాగ్రతావస్థను అనగా ఈ అవస్థాత్రయ ములను సాక్షీభూతుడై చూచునో ఇట్టి |
| మహాంతం | = | గొప్ప లయకారకమయినదియు (అనగా లయ కారుడు) |
| విభుం | = | సర్వలోకాలకు ప్రభువు అయిన |
| ఆత్మానం | = | ఆత్మను |
| ధీరః | = | ధీరుడు |

మత్వా = గ్రహించి
న+శోచతి = ఇహలోక సుఖదుఃఖముల గుఱించి ఆలోచించడు. ఎవరినీ ద్వేషింపడు. ఏదీ కోరడు.

*****

**5. య ఇమం మధ్వదం వేద ఆత్మానం జీవమంతికాత్**
**ఈశానం భూత భవ్యస్య న తతో విజుగుప్సతే ఏతద్వై తత్**

యః - ఇమం - మధ్వదం - వేద - ఆత్మానం - జీవమ్ - అంతికాత్ - ఈశానం- భూత - భవ్యస్య - న - తతః - విజుగుప్సతే - ఏతత్ - వై - తత్.

యః = ఎవడు
ఇమమ్+జీవమ్ = ఈ జీవితమునకు ఆధారమైనట్టియు
మధ్వదమ్ = కర్మ ఫలరూపమున అనుభవించునట్టియు
భూతభవ్యస్య+ఈశానం = ఎవరు భూత భవిష్యత్ వర్తమానములకు ఈశ్వరుడు అగునట్టియు
ఆత్మానం = ఆత్మను
అంతికాత్+వేద = అతి సమీపమున దర్శించు వాడు- అలా
తతః = ఆత్మను దర్శించుట వలన
న+విజుగుప్సతే = దేనిని అసహ్యించుకొనడు. అనగా ద్వేషింపడు దేని గుఱించి ఆలోచింపడు.
ఏతత్+వై+తత్ = ఏది ఈ హృదయ గుహలో ఉన్నదో అదే సృష్ట్యాది యందును ఉన్నది. ఈశ్వరుడు సాక్షి. జీవుడు భోక్త.

*****

**6. యః పూర్వం తపసో జాత మద్భ్యః పూర్వమజాయంత**
**గుహాం ప్రవిశ్య తిష్ఠంతం యో భూతేభిర్వ్య పశ్యత ఏతద్వైతత్**

యః - పూర్వం - తపసః - జాతమ్ - అద్భ్యః - పూర్వమ్ - అజాయంత - గుహాం - ప్రవిశ్య - తిష్ఠంతం - యః - భూతేభిః - వ్యపశ్యత - ఏతత్ - వై - తత్

| | | |
|---|---|---|
| యః | = | ఎవడు |
| పూర్వం | = | సృష్ట్యాది యందు ఆత్మగా గలడో |
| యః | = | ఎవడు స్వయంగా ఉపాధిని నిర్మించుకొని |
| పూర్వం+జాతమ్ | = | సృష్ట్యాది యందు స్వయంభువుగా ఆవిర్భవించెనో |
| తపసః+ అద్భ్యః+ భూతేభిః + అజాయత | = | సంకల్పము వలన ఆది పురుషుడుగా ఉన్నఆత్మయే ప్రకృతిని సృజించి, ప్రకృతి తో గూడి విరాట్పురుషుడై జలము మొదలయిన పంచ భూతముల వలన ప్రాణుల ఉపాధులను నిర్మించెనో - ఎవడు |
| గుహాం+ ప్రవిశ్య+ తిష్ఠంతం | = | హృదయ గుహలో ఉన్నాడో |
| వ్యపశ్యత | = | ఆ ఆత్మను దర్శించి, జన్మ కర్మల నుంచి విముక్తులై అమృతులగుదురు. |
| ఏతత్+వై+తత్ | = | ఏది హృదయ గుహలో ఉన్నదో అదే సృష్ట్యాది యందును ఉన్నది. |

*****

**7. యా ప్రాణేన సంభవత్యదితిర్దేవతామయీ**
**గుహాం ప్రవిశ్య తిష్ఠంతీం యా భూతేభిర్వ్యజాయత ఏతద్ వైతత్**

యా - ప్రాణేన - సంభవతి - అదితిః - దేవతామయీ - గుహాం - ప్రవిశ్య - తిష్ఠంతీం - యా - భూతేభిః - వ్యజాయతా - ఏతత్ - వై - తత్

| | | |
|---|---|---|
| ప్రాణేన+సంభవతి | = | ప్రాణము చేత అనగా ఏది ప్రాణరూపమున అభివ్యక్తమగునో |
| యా+దేవతామయీ+ అదితిః | = | ఏది అదితి దేవతయో- అదితి అనగా సర్వమును తినునది అనగా ఏది లయము చేయునో |
| గుహాం+ప్రవిశ్య+ తిష్ఠంతీం | = | ఏది హృదయగుహలో స్వయంగా ప్రవేశించి ఉన్నదో |

| | | |
|---|---|---|
| యా+భూతేభిః+ వ్యజాయత | = | ఏది ప్రకృతిని అధిష్ఠించి పంచ భూతములను సృజియించి తద్వారా ఉపాధులను సృజియించినదో |
| ఏతత్+వై+తత్ | = | అదే ఇది |

*****

**8. అరణ్యోర్నిహితో జాతవేదా గర్భ ఇవ సుభృతో గర్భిణీభిః**
**దివేదివే ఈడ్యో జాగ్రువద్భిర్హ విష్మద్భిర్మనుష్యేభి రగ్నిః ఏతద్ వైతత్**

అరణ్యోః - నిహితః - జాతవేదాః - గర్భః - ఇవ - సుభృతః - గర్భిణీభిః - దివేదివే- ఈఢ్యః - జాగ్రువద్భిః - హవిష్మద్భిః - మనుష్యేభిః - అగ్నిః - ఏతత్ - వై - తత్.

| | | |
|---|---|---|
| అరణ్యోః +నిహితః+ జాతవేదః+ఇవ | = | కఱ్ఱలలో దాగియున్న అగ్నివలె |
| గర్భిణీభిః+సుభృతః+ గర్భః | = | గర్భిణీ స్త్రీల గర్భములో యున్న శిశువు వలె అనగా గర్భములో ఉండగా బాహ్యచక్షువులకు గోచరము కానట్లు ఆత్మ అంతర్లీనముగా బాహ్య చక్షువులకు గోచరము గాక యున్నది. అట్టి ఆత్మను |
| జాగ్రువద్భిః+మనుష్యేభిః+ హవిష్మద్భిః దివేదివే+ ఈఢ్యః+అగ్నిః+ | = | నిత్యాగ్నిహోత్రులు ప్రతిదినము స్తుతింపదగిన అగ్ని హోత్రమునకై అగ్నిని, ఋత్విజులు, అరణిని మధించి వెలుపలికి తీసి యజ్ఞము చేయునట్లు సాధనచే ఆత్మను గ్రహించ వలయును. |
| ఏతత్+వై+తత్ | = | సృష్ట్యాదియందున్న ఆత్మయే హృదయ గుహలో ఉన్నది. |

*****

**9. యతశ్చోదేతి సూర్యోఽస్తం యత్ర చ గచ్ఛతి**
**తం దేవాః సర్వేఽర్పితాస్తదు నాత్యేతి కశ్చన ఏతద్ వైతత్**

యతః - చ- ఉదేతి - సూర్యః - అస్తం - యత్ర - చ - గచ్ఛతి - తం - దేవాః - సర్వే - అర్పితాః - తత్ - ఉ - న - అత్యేతి - కశ్చన - ఏతత్ - వై - తత్

యత్ర = ఎక్కడ నుండి
సూర్యః+ఉదేతి = సూర్యుడు ఉదయించునో
చ+అస్తం+గచ్ఛతి = మఱియు అస్తమించునో
చ = మఱియు
యతః = ఎక్కడ
సర్వే+దేవాః = సర్వదేవతలు
అర్పితాః+ఉ = రథచక్రపు నాభికి ఆకులు అమర్చబడినట్లు అమర్చబడి యున్నారో
తం+తత్ = ఆ ఆత్మను
కశ్చన = ఎవరుగాని
న+అత్యేతి = అతిక్రమించలేరు. అదే సర్వోత్కృష్టస్థానము
ఏతత్+వై+తత్ = ఇదే సృష్ట్యాదియందుగల ఆత్మ. అదే హృదయ గుహలో గలదు.

*****

**10. యదేవేహ తదముత్ర యదముత్ర తదన్విహ**
**మృత్యోః సః మృత్యుమాప్నోతి య ఇహ నానేవ పశ్యతి**

యత్ - ఏవ - ఇహ - తత్ - అముత్ర - యత్ - అముత్ర - తత్ - అను - ఇహ - మృత్యోః - సః - మృత్యుమ్ - ఆప్నోతి - యః - ఇహ - నానా - ఇవ - పశ్యతి

యత్+ఇహ = ఈ సర్వసృష్టిలో ఏది కలదో
తత్+అముత్ర+ఏవ = అది అక్కడ గలదు - సృష్ట్యాది యందు గలదు
యత్+అముత్ర = ఏది అక్కడ గలదో
తత్+అను+ ఇహ = అది యీ హృదయ గుహలో గలదు
యః = ఎవడు
ఇహ+నానా+ఇవ = ఇక్కడ భిన్నముగా కనిపించే ఉపాధులనే
పశ్యతి = దర్శించి ఆత్మకు భిన్నముగా చూచునో
సః = వాడు

మృత్యోః + మృత్యుమ్ = జనన మరణములను
ఆప్నోతి = పొందును

*****

**11. మనసైవేద మాప్తవ్యం నేహనాస్తి కించన**
**మృత్యోః స మృత్యుం గచ్ఛతి య ఇహ నానేవ పశ్యతి**

మనసా - ఏవ - ఇదమ్ - ఆప్తవ్యం - న - ఇహ - న - అస్తి - కించన - మృత్యోః - సః - మృత్యుం - గచ్ఛతి - యః - ఇహ - నానా - ఇవ - పశ్యతి

మనసా+ఏవ+ఇదం = శుద్ధమనస్సు చేత సాధన చేసి మాత్రమే ఆ ఆత్మ
ఆప్తవ్యం = పొందదగినది. దర్శించతగినది.
న = ఇంకొక మార్గము లేదు
కించన+ఇహ+న+అస్తి = ఆత్మ కానిది యిక్కడ ఏదీ లేదు. సర్వమూ ఆత్మ స్వరూపమే.
యః = ఎవడు
ఇహ = ఈ విశ్వంలో ఉపాధులలో గల ఆత్మను- సృష్ట్యాది యందున్న
నానా+ఇవ+పశ్యతి = ఆత్మకు భిన్నముగా చూచునో
సః = వాడు
మృత్యోః+మృత్యుమ్+గచ్ఛతి = జనన మరణములను పొందును.

*****

**12. అంగుష్ఠ మాత్రః పురుషో మధ్య ఆత్మని తిష్ఠతి**
**ఈశానో భూత భవ్యస్య న తతో విజుగుప్సతే ఏతద్ వై తత్**

అంగుష్ఠమాత్రః - పురుషః - మధ్యే - ఆత్మని - తిష్ఠతి - ఈశానః - భూత భవ్యస్య - న - తతః - విజుగుప్సతే - ఏతత్ - వై - తత్.

అంగుష్ఠమాత్రః+పురుషః = అంగుష్ఠమాత్ర పురుషుడు

ఇది ఒక వినూత్న ప్రయోగము. ఆత్మ సూక్ష్మాతి సూక్ష్మమని చెప్పి ఇప్పుడు బొటన వ్రేలంత పరిమాణము కలది అని చెప్పిన పొసగదు గదా! ఈ పదము జీవేశ్వరుల గుఱించి వివరించినది. చేతిలో నాలుగు వ్రేళ్ళు కలసి ఉండును. బొటనవ్రేలు ఈ నాలుగు వ్రేళ్ళకు అంటక విలక్షణముగా ఆ చేతిలోనే ఉండును. వ్రేళ్ళలో బొటన వ్రేలు ప్రధానము. అటులనే జీవుడిగా శరీరముతో మమేకం అయి ఈశ్వరునిగా శరీర లక్షణములకు విలక్షణముగా హృదయగుహలోనూ ఉండును. అట్లు జీవేశ్వరులిద్దఱు ఈ శరీరములోనే ఉందురు. అని ఈ పదమునకు అర్థము.

| | | |
|---|---|---|
| ఆత్మని+మధ్యే+ తిష్ఠతి | = | హృదయగుహలో గలడు. **"తస్య శిఖాయా మధ్యే పరమాత్మా వ్యవస్థితః"** |
| భూతభవ్యస్య+ఈశానః | = | భూతభవిష్యత్ వర్తమానములోగల సర్వవిశ్వమునకు నియామకుడు. |
| తతః | = | అందువలన ఆత్మను దర్శించినవాడు |
| న+విజుగుప్సతే | = | శోక, మోహములు, రాగ, ద్వేషములు, ఈర్ష్యా అసూయలు - యిలాంటి గుణాలు ఏవీ అతనికి ఉండవు. అతడు గుణ రహితుడు. |
| ఏతత్+వై+తత్ | = | సృష్ట్యాదియందున్నదే ఈ హృదయగుహలో కలదు. |

*****

**13. అంగుష్ఠమాత్రః పురుషో జ్యోతిరివా ధూమకః**
**ఈశానో భూత భవ్యస్య స ఏవాద్య స ఉ శ్వః ఏతద్ వై తత్**

అంగుష్ఠమాత్రః - పురుషః - జ్యోతిః - ఇవ - అధూమకః - ఈశానః - భూతభవ్యస్య- సః - ఏవ - అద్య - సః - ఉ - శ్వః - ఏతత్ - వై - తత్

| | | |
|---|---|---|
| అంగుష్ఠమాత్రః+పురుషః | = | అంగుష్ఠమాత్ర పురుషుడు |
| జ్యోతిః+ ఇవ+అధూమకః | = | పొగలేని అగ్నివంటి స్వయంజ్యోతి |
| భూతభవ్యస్య +ఈశానః | = | భూత భవిష్యత్ వర్తమానములకు ప్రభువు |
| సః | = | ఆ ఆదిపురుషుడు |

| | | |
|---|---|---|
| అద్య+ఏవ+సః+ | = | అతడు ఇప్పుడు గలడు. రేపు గలడు |
| ఉ+శ్వః | | నిన్న గలడు. త్రికాలములయందు గలడు |
| ఏతత్+వై+తత్ | = | ఇదే అది |

*****

**14. యథోదకం దుర్గే వృష్టం పర్వతేషు విధావతి**
**ఏవం ధర్మాన్ పృథక్ పశ్యన్ తానేవాను విధావతి**

యథా - ఉదకం - దుర్గే - వృష్టం - పర్వతేషు - విధావతి - ఏవం - ధర్మాన్ - పృథక్ - పశ్యన్ - తాన్ - ఏవ - అను - విధావతి

| | | |
|---|---|---|
| యథా | = | ఏ విధముగా |
| పర్వతేషు+దుర్గే+వృష్టమ్ | = | పర్వత శిఖరములందు కురిసిన వర్షపు |
| ఉదకమ్ | = | నీరు |
| విధావతి | = | అనేక పాయలై ప్రవహించి చివరకు సముద్రము చేరునో అటులనే |
| ఏవం+పృథక్+ధర్మాన్ +పశ్యన్ | = | ఆత్మ ధర్మము ఒకటయినను వివిధ ఉపాధులలో జీవరూపమున ఉండి వివిధ ధర్మములను చూచి |
| తాన్+ఏవ+అను+ విధావతి | = | వాటిని అనుసరించి చివరకు ఒకటగును. అనగా లయ కాలమున భిన్నత్వము నశించి ఆత్మ ఒకటే ఉండును. |

*****

**15. యథోదకం శుద్ధే శుద్ధ మాసిక్తం తాదృగేవ భవతి**
**ఏవం మునేర్విజానత ఆత్మా భవతి గౌతమ**

(ఇతి చతుర్థ వల్లీ)

యథా - ఉదకం - శుద్ధే - శుద్ధమ్ - ఆసిక్తం - తాదృక్ - ఏవ - భవతి - ఏవం - మునేః - విజానతః - ఆత్మా- భవతి - గౌతమ

| | | |
|---|---|---|
| గౌతమ | = | ఓ నచికేతా |
| యథా | = | ఏ విధముగా |
| శుద్ధే + ఉదకం | = | శుభ్రమయిన నీరు |
| శుద్ధం+ ఆసిక్తం | = | శుభ్రమయిన నీటిలో పోయబడి |
| తాదృక్ + ఏవ | = | ఒకటే |
| భవతి | = | అగునో అటులనే |
| ఏవం+మునేః+ | = | ఈ విధముగా ఆత్మను దర్శించిన |
| విజానతః | | జితేంద్రియుడయిన వాని వలన- ఆత్మ గ్రహింప బడి అతడు |
| ఆత్మా+భవతి | = | ఆత్మ యగును అనగా ఆత్మతో ఏకీ భూతుడగును. |

*****

## పంచమవల్లీ

ఈ పంచమ వల్లిలో 14వ శ్లోకము నచికేతుడు, మిగిలినది యముడు చెప్పుచున్నాడు.

1. **పురమేకాదశ ద్వార మజస్యా వక్ర చేతసః**
   **అనుష్ఠాయ న శోచతి విముక్తశ్చ విముచ్యతే ఏతద్ వైతత్**

పురమ్ - ఏకాదశ ద్వారమ్ - అజస్య - అవక్రచేతసః - అనుష్ఠాయ - న - శోచతి - విముక్తః - చ - విముచ్యతే - ఏతత్ - వై - తత్

| | | |
|---|---|---|
| అవక్రచేతసః+అజస్య+చ | = | అకుంఠిత ప్రజ్ఞగల స్వయంభువు అయిన ఆత్మకు సూక్ష్మ శరీరములో గల హృదయ గుహ స్థానము |
| ఏకాదశద్వారమ్+పురమ్ | = | జీవరూపమున ఉండుటకు 11 ద్వారములు గల యీ స్థూల శరీరమే ఒక పట్టణము. ఇంకొకటి సూక్ష్మ శరీరము. ఈ విధముగా స్థూల సూక్ష్మ శరీరములలో జీవరూపమున త్రయావస్థలలో సంచరించును. |
| అనుష్ఠాయ | = | ఆ ఆత్మను ధ్యానించిన వాడు |
| న+శోచతి | = | ఇహ లోక పరలోకములను గుఱించి ఆలోచింపడు. |
| విముక్తః | = | భవబంధముల నుంచి విముక్తుడై |
| విముచ్యతే | = | జన్మ బంధములనుంచి విడివడునని చెప్పబడును |
| ఏతత్+వై+తత్ | = | హృదయగుహలో గల ఆత్మ. సృష్ట్యాది యందున్న ఆత్మ ఒకటి. అదే ఇది. |

*****

| జీవుడు | ఈశ్వరుడు |
|---|---|
| రూపము : అరూపుడు, సూక్ష్ముడు, చిదాత్మకుడు | అరూపుడు |
| స్థానము : స్థూల శరీరము, సూక్ష్మ శరీరము | హృదయ గుహ |
| గాలిలో ధూళి వలె జీవుడు శరీరము తో మమేకం అయి ఉండును. తను చేసిన కర్మ వలన ఊర్ధ్వ అధో లోకము లకు పయనించి పునర్జన్మకు వచ్చును. | ఆకాశములో మేఘము వలె శరీరమునకు అంటక విలక్షణముగా ఉండును |

*****

**2. హగ్ంసః శుచిషద్ వసురంతరిక్షసద్ హోతా వేదిషదతిథిర్దురోణసత్**
**నృషద్ వరసదృతసద్ వ్యోమసదబ్జా గోజా ఋతజా అద్రిజా ఋతం బృహత్**

హంసః - శుచిషత్ - వసుః - అంతరిక్షసత్ - హోతా - వేదిషత్ - అతిథిః - దురోణసత్ - నృషత్ - వరసత్ - ఋతసత్ - వ్యోమసత్ - అబ్జా - గోజా - ఋతజా - అద్రిజా - ఋతం - బృహత్.

**పురుషునిగా**

హంసః(సన్) = ఆదిత్య రూపుడై
అంతరిక్షసత్ = అంతరిక్షమున సంచరించు చున్నాడు.
వసుః(సన్) = వాయురూపుడై
వ్యోమసత్ = ఆకాశమున సంచరించుచున్నాడు
శుచిషత్ = నిర్మలుడు, హృదయగుహలో ఉండెను గుణ రహితుడు
హోతా(సన్) = అగ్ని రూపుడై
వేదిషత్ = యజ్ఞవేది యందు ఉండెను
అతిథిః = సోమరసముగా
దురోణసత్ = ద్రోణ కలశములో ఉండెను
నృషత్ = మానవులలో ఉండెను
వరసత్ = శ్రేష్ఠమైన వాటిలో ఉన్నాడు-ఇవే అవతారములు

| | | |
|---|---|---|
| ఋతసత్ | = | సత్యములో ఉండెను |
| ఋతమ్ | = | సత్య స్వరూపుడు |
| ఋతజా | = | సత్యములోనుంచి జన్మించినవాడు |
| | | **ప్రకృతిగా** |
| అబ్జా | = | నీటి నుంచి పుట్టుచున్నాడు (లక్ష్మిగా) |
| గోజా | = | భూమినుంచి పుట్టుచున్నాడు (సీతగా) |
| అద్రిజా | = | పర్వతమునుంచి పుట్టుచున్నాడు (పార్వతిగా) |
| బృహత్ | = | బృహత్ స్వరూపుడు అనగా **పురుష - ప్రకృతులు అతడే.** |

ఈ పురుష ప్రకృతులను గ్రహించవలయుననే ఉపదేశము మధ్యాహ్న సంధ్యా వందనములో చెప్ప బడినది.

*****

3. **ఊర్ధ్వం ప్రాణమున్న యత్యపానం ప్రత్యగస్యతి**
   **మధ్యే వామనమాసీనం విశ్వేదేవా ఉపాసతే**

ఊర్ధ్వం - ప్రాణమ్ - ఉన్నయతి - అపానం - ప్రత్యక్ - అస్యతి - మధ్యే - వామనమ్ - ఆసీనం - విశ్వేదేవాః - ఉపాసతే

| | | |
|---|---|---|
| మధ్యే+ఆసీనం+వామనం | = | హృదయ కమలం మధ్యలో అణురూపమున ఆసీనుడై (వమ్-వృద్ధౌ అనుధాతువు వలన వమ్ అనగా సర్వత్రా వ్యాపించి యున్నవాడని అర్థము. ఇట్టి వామనుడు వృద్ధి పొంది త్రివిక్రముడు అయినాడు). |
| ప్రాణం | = | ప్రాణమును |
| ఊర్ధ్వం+ఉన్నయతి | = | పైకి పంపించును |
| అపానం+ప్రత్యక్+ అస్యతి | = | అపానమును క్రిందకి పంపించును. అనగా ప్రాణచర్య ఆత్మపై ఆధారపడి యున్నది. ఒకరోజు ప్రాణమును ఈ దేహమునుంచి పంపించును. దానినే మరణమని అందురు. |

| | | |
|---|---|---|
| విశ్వేదేవాః | = | సర్వ దేవతలు |
| ఉపాసతే | = | ఇతనిని పూజింతురు అనగా సర్వయింద్రియములు ఆత్మవలన పనిచేయును. దీనినే అందముగా సర్వదేవతలు యీ ఆత్మను పూజింతురు. అని వర్ణించినారు. |

*****

**4. అస్య విస్రం సమానస్య శరీరస్థస్య దేహినః**
**దేహాద్విముచ్య మానస్య కిమత్ర పరిశిష్యతే ఏతద్ వై తత్**

అస్య - విస్రంసమానస్య - శరీరస్థస్య - దేహినః - దేహాత్ - విముచ్యమానస్య - కిమ్ - అత్ర - పరిశిష్యతే - ఏతత్ - వై - తత్

| | | |
|---|---|---|
| అస్య+దేహినః+ శరీరస్థస్య | = | ఈ దేహి దేహమును నశించిపోకుండా పరిరక్షించు చున్నాడు. శరీరములోపల ఉండి |
| దేహాత్+విముచ్య మానస్య+విస్రంసమానస్య | = | దేహము నుండి వెడలు సమయమున దేహమున గల ఇంద్రియములు, మనస్సు మొదలయిన వాటితో ఒక్కొక్క దానితోసంబంధం వదిలించుకొని, దేహము నుండి పూర్తిగా బయటకు వచ్చిన దేహికి యిక ఆ దేహముతో సంబంధం లేనందున |
| అత్ర+కిమ్+పరిశిష్యతే | = | ఈ స్థూల శరీరములో నశించకుండా ఏమి మిగులుతుంది. అనగా దేహి, దేహము నుండి పూర్తిగా బయటకు వచ్చిన తర్వాత స్థూల శరీరం పూర్తిగా నశించును. సూక్ష్మ శరీరము ఉంటుంది. అది పునర్జన్మకు కారణమవుతుంది. |
| ఏతత్+వై+తత్ | = | ఇదే అది. |

*****

**5. న ప్రాణేన నాపానేన మర్త్యో జీవతి కశ్చన**
**ఇతరేణ తు జీవంతి యస్మిన్నేతా వుపాశ్రితౌ**

న - ప్రాణేన - న - అపానేన - మర్త్యః - జీవతి - కశ్చన - ఇతరేణ - తు - జీవంతి- యస్మిన్ - ఏతౌ - ఉపాశ్రితౌ

| | | |
|---|---|---|
| కశ్చన+మర్త్యః | = | ఏ ఒక్క మానవుడు |
| న+ప్రాణేన+జీవతి | = | కేవలము ప్రాణము చేత జీవించడు |
| న+అపానేన | = | కేవలము అపానము చేతను విసర్జించడు |
| యస్మిన్+ఏతౌ | = | ఏ ఆత్మ యందు యీ ప్రాణము, అపానము మొదలైనవి |
| ఉపాశ్రితౌ | = | ఆధారపడి యున్నవో |
| ఇతరేణ+తు | = | అవిగాక యితరమయిన ఆ ఆత్మచేతనే సర్వజీవరాసులు |
| జీవంతి | = | జీవించుచున్నారు. |

*****

**6. హంత తే ఇదం ప్రవక్ష్యామి గుహ్యం బ్రహ్మ సనాతనం**
**యథా చ మరణం ప్రాప్య ఆత్మా భవతి గౌతమ**

హంత - తే - ఇదం - ప్రవక్ష్యామి - గుహ్యం - బ్రహ్మ - సనాతనం - యథా - చ- మరణం - ప్రాప్య - ఆత్మా - భవతి - గౌతమ

**కర్మానుసారము జీవునికి పునర్జన్మ కలుగును**

| | | |
|---|---|---|
| గౌతమ | = | గౌతమ వంశజుడవయిన ఓ నచికేతా |
| బ్రహ్మ+ సనాతనం+ హంత | = | సనాతనమైన ఆత్మ, జీవుడు దేహమును వదలిన తర్వాత ఏమగునో అన్న |
| ఇదం+గుహ్యం | = | ఈ విషయం పరమ రహస్యమైనది. ఆ రహస్యమును |
| తే | = | నీకు (మీకు) |
| ప్రవక్ష్యామి | = | చెప్పుచున్నాను |

| | | |
|---|---|---|
| యథా+చ+మరణం+ ప్రాప్య | = | మరణించిన తర్వాత స్థూల శరీరము నశించి దేహి సూక్ష్మ శరీరమును పొంది |
| ఆత్మా | = | దేహి |
| భవతి | = | ఉత్క్రాంతమును పొంది, కర్మఫలితము క్షీణించగనే తిరిగి కర్మానుసారము జన్మకు వచ్చును. |

*****

**7. యోని మన్యే ప్రపద్యంతే శరీరత్వాయ దేహినః**
**స్థాణు మన్యేఽను సంయంతి యథా కర్మ యథా శ్రుతమ్**

యోనిమ్ - అన్యే - ప్రపద్యంతే - శరీరత్వాయ - దేహినః - స్థాణుమ్ - అన్యే - అనుసంయంతి - యథా - కర్మ - యథా - శ్రుతమ్

| | | |
|---|---|---|
| దేహినః | = | దేహి యొక్క |
| యథా+కర్మ | = | కర్మానుసారము |
| శరీరత్వాయ | = | ఉపాధి కొఱకు |
| అన్యే+యోనిమ్ | = | కొందఱు గర్భములో ప్రవేశించి మానవులుగా, |
| ప్రపద్యంతే | = | కొందఱు జంతువులుగా జన్మింతురు |
| అన్యే+స్థాణుమ్+ అనుసంయంతి | = | కొందఱు చెట్లు, లతలు తీగలుగా కొందఱు ఱాళ్ళురప్పలుగా స్థావర రూపములు పొందుచున్నారు. |
| యథా+శ్రుతమ్ | = | దేహికి పునర్జన్మ - కర్మానుసారము గలుగునని వినబడుచున్నది. |

*****

**జీవుడు-అవస్థాత్రయములు**

**8. య ఏష సుప్తేషు జాగర్తి కామం కామం పురుషో నిర్మిమాణః**
**తదేవ శుక్రం తద్ బ్రహ్మ తదేవామృతముచ్యతే**
**తస్మిం ల్లోకాః శ్రితాః సర్వే తదునాత్యేతి కశ్చనఏతద్ వైతత్**

యః - ఏషః - సుప్తేషు - జాగర్తి - కామం - కామం - పురుషః - నిర్మిమాణః - తత్ - ఏవ - శుక్రం - తత్ - బ్రహ్మ - తత్ - ఏవ - అమృతమ్ - ఉచ్యతే - తస్మిన్ - లోకాః - శ్రితాః - సర్వే - తత్ - ఉ - న - అత్యేతి - కశ్చన - ఏతత్ - వై - తత్

| | | |
|---|---|---|
| యః+ పురుషః | = | ఏ పురుషుడు జీవరూపమున |
| జాగర్తి+ కామం+కామం | = | జాగ్రతావస్థలో వుండి సర్వకోరికలను కోరుకొని (తలచుకొని) అనుభవించుచూ |
| నిర్మిమాణః | = | స్వప్నంలో తన స్వప్నలోకంలో తనమాయచే గల్పింపబడిన జీవలోకమున సుఖదుఃఖములను అనుభవించుచూ |
| ఏషః+సుప్తేషు | = | ఈ జీవుడు సుషుప్తి నందు హృదయ గుహలో గల ఆత్మస్థానమందు సర్వము విలీనమయి సుఖమును పొందుచున్నాడో |
| తత్+ఏవ+శుక్రం | = | ఆ హృదయ గుహలో గల ఆత్మయే. నిర్మలమైనది. |
| తత్+ బ్రహ్మ | = | అదియే సృష్టి స్థితి లయములు చేయు ఆత్మ. |
| తత్+ఏవ+అమృతమ్ | = | అదియే అమృతత్త్వము గలదని |
| ఉచ్యతే | = | చెప్పబడుచున్నది |
| తస్మిన్+సర్వే+లోకాః+ శ్రితాః | = | ఆ ఆత్మయందు సర్వలోకములు ఆశ్రయించుకొని ఉన్నవి సర్వ స్థావర జంగమములు రథనాభిలో చక్రపు ఆకులవలె నెలకొని ఉన్నవి |
| తత్+ఉ+న+కశ్చన+ అత్యేతి | = | ఆ ఆత్మస్థానమును దాటి ఎవడునూ అధిగమించలేడు. ఇదే పరాయణము |
| ఏతత్+వై+తత్ | = | అదే ఇది |

*****

**9. అగ్ని ర్యథైకో భువనం ప్రతిష్టో రూపం రూపం ప్రతిరూపో బభూవ**
**ఏకస్తథా సర్వభూతాంత రాత్మా రూపం రూపం ప్రతిరూపో బహిశ్చ**

అగ్నిః - యథా - ఏకః - భువనం - ప్రతిష్టః - రూపం రూపం - ప్రతిరూపః - బభూవ - ఏకః - తథా - సర్వభూతాంతరాత్మా - రూపం రూపం - ప్రతిరూపః - బహిః - చ

ఒక ఉదాహరణ చెప్పుచున్నాను ఆత్మ అంతర్యామి

| | | |
|---|---|---|
| అగ్నిః+ఏకః | = | అగ్ని ఒక్కడయ్యు |
| యథా | = | ఏ విధముగా |
| భువనం+ప్రతిష్టః+ | = | ప్రపంచములో కట్టెలలో - వివిధ కట్టెలలో |
| రూపం రూపం | | ఉండి |
| ప్రతిరూపః+బభూవ | = | ఆ కట్టెలను మండించుచూ అగ్నిగా వెలుగుచున్నదో అగ్ని ఒక్కటి, కట్టెలలో అంతర్యామిగా వుంది. ఆ అగ్ని - కట్టెలను మండించుచున్నది ఆ కట్టెలు మండుతూ - అగ్ని అవుచున్నవి. |
| తథా | = | అటులనే |
| ఏకః | = | ఆత్మ ఒక్కటి |
| సర్వభూతాంతరాత్మా+ | = | సృష్టిలోని సర్వ ఉపాధులలో |
| రూపం రూపం+ | | అంతర్యామిగా ఉంది. ఆ ఉపాధులలో |
| ప్రతిరూపః | | ఉండి వాటిని పనిచేయించుచున్నది. |
| బహిః+చ | = | విశ్వము బయట మఱియు లోపల ఉన్నది. అగ్ని ఒక్కండయ్యు పెక్కు ద్రవ్యములందు చరించు చందంబున - ఆత్మ సర్వ ఉపాధులలో ఉన్నది. |

*****

**10. వాయుర్యథైకో భువనం ప్రవిష్టో రూపం రూపం ప్రతిరూపో బభూవ**
**ఏకస్తథా సర్వభూతాంతరాత్మా రూపం రూపం ప్రతిరూపో బహిశ్చ**

వాయుః -యథా - ఏకః - భువనం - ప్రవిష్టః - రూపం రూపం - ప్రతిరూపః - బభూవ - ఏకః - తథా - సర్వభూత - అంతరాత్మా - రూపం - రూపం - ప్రతిరూపః - బహిః - చ

ఇంకొక ఉదాహరణ ఆత్మ ఉపాధులలో ఉండి ఆ ఉపాధులను అంటక ఉన్నది. నిర్మలుడు.

| | | |
|---|---|---|
| ఏకః+వాయుః | = | బాహ్య జగత్తులో ఒకటే అయిన వాయువు |
| యథా | = | ఏ విధముగా |
| భువనం+ప్రవిష్ఠః+ రూపం రూపం+ ప్రతిరూపః+బభూవ | = | ప్రపంచములో సర్వవస్తువులపై చరిస్తూ కూడ ఆ వస్తువుతో మమేకం కాలేదో |
| తథా | = | అటులనే |
| ఏకః | = | ఆత్మ ఒక్కటయ్యు |
| సర్వభూత అంతరాత్మా+రూపం రూపం+ప్రతిరూపః | = | సృష్టిలోని సర్వ ఉపాధులలో సంచరిస్తూ ఆఉపాధిలక్షణములు పొందకఉంటున్నది. |
| బహిః+చ | = | ఆఆత్మ విశ్వమునకు బయట, విశ్వమునకు లోపల ఉన్నది. |

సర్వత్రా వాయువు సంచరించుచున్నట్లు ఆత్మ సర్వ వ్యాపకత్వము కలది.

*****

**11. సూర్యో యథా సర్వలోకస్య చక్షు ర్నలిప్యతే చాక్షుషైర్బాహ్య దోషైః**
**ఏకస్తథా సర్వభూతాంత రాత్మా న లిప్యతే లోకదుఃఖేన బాహ్యః**

సూర్యః - యథా - సర్వలోకస్య - చక్షుః - న - లిప్యతే - చాక్షుషైః - బాహ్య - దోషైః - ఏకః - తథా - సర్వభూతాంతరాత్మా - న - లిప్యతే - లోకదుఃఖేన - బాహ్యః

ఇంకొక ఉదాహరణ.ఆత్మ సుఖదుఃఖములకు లోను కాదు.

| | | |
|---|---|---|
| యథా | = | ఏ విధముగా |
| సర్వలోకస్య+చక్షుః+ సూర్యః | = | సర్వ ప్రాణులకు నేత్రమగు సూర్యుడు |
| బాహ్య+చాక్షుషైః+దోషైః | = | ప్రాణుల బాహ్య చక్షువుల దోషముచేత |
| న+ లిప్యతే | = | అంటకుండా ఉన్నాడో |

| | | |
|---|---|---|
| తథా | = | అటులనే |
| ఏకః | = | ఒకటయిన ఆత్మ |
| సర్వభూతాంతరాత్మా | = | సర్వ భూతములలో అంతరాత్మగా ఉన్నా |
| బాహ్యః+లోకదుఃఖేన | = | బాహ్య జగత్తులో గల సుఖదుఃఖముల చేత |
| న+లిప్యతే | = | అంటకుండా సాక్షీమాత్రముగా ఉంటున్నాడు. |

ఆకాశమున గల సూర్యునియొక్క కిరణములు సువాసన ఇచ్చు వస్తువుల పైనను దుర్వాసన ఇచ్చు వస్తువులపైనను ప్రసరించినను వాటి సువాసన దుర్వాసనలు సూర్యునికి అంటనట్లు హృదయాకాశమున గల ఆత్మకు సుఖ దుఃఖములు అంటవు.

*****

**12. ఏకోవశీ సర్వభూతాంతరాత్మా ఏకం రూపం బహుధా యః కరోతి**
**తమాత్మస్థం యేఽను పశ్యంతి ధీరా స్తేషాం సుఖం శాశ్వతం నేతరేషామ్**

ఏకః - వశీ - సర్వభూతాంతరాత్మా - ఏకం - రూపం - బహుధా - యః - కరోతి- తమ్ - ఆత్మస్థం - యే - అనుపశ్యంతి - ధీరాః - తేషాం - సుఖం - శాశ్వతం - న - ఇతరేషామ్

| | | |
|---|---|---|
| ఏకః | = | ఆత్మ ఒక్కటి |
| సర్వభూతాంతరాత్మా | = | అదే సర్వభూతములలో అంతరాత్మగా ఉంటున్నది |
| ఏకం+ రూపం | = | ఒక్కటిగా ఉన్నతననే |
| యః+బహుధా+కరోతి | = | వివిధనామ రూపములుగా చేయుచున్నాడు అనగా తనే యీ దృశ్యమాన విశ్వమంతా అయి |
| వశీ | = | ఆ విశ్వమునకు నియామకుడు. ఆ విశ్వమును లీల త్రిప్పును. |
| తమ్+ఆత్మస్థం | = | అట్టి ఆత్మను- ఈ ఉపాధి యందున్న దానిని |
| యే+ధీరాః | = | ఏ ధీరులు |
| అనుపశ్యంతి | = | దర్శించెదరో |
| తేషాం | = | వారి యొక్క |
| సుఖం+శాశ్వతం | = | సుఖము శాశ్వతము |

| | | |
|---|---|---|
| న+ఇతరేషామ్ | = | ఆత్మను దర్శించని వారి యొక్క సుఖము శాశ్వతము కాదు. |

ఈ విషయము గుఱించి శౌనకాది మహామునులు భాగవతము ప్రారంభంలో సూతమహర్షిని- ఎయ్యది సర్వసౌఖ్యమై అలవడు? అని వినయముగా ప్రశ్నించినారు. అంతసూత మహర్షి ఆత్మదర్శనము వలననే సర్వసౌఖ్యములు దొరకును. అని వివరించినాడు.

*****

**13. నిత్యోఽనిత్యానాం చేతనాశ్చేతనానా మేకో బహూనాం యో విదధాతి కామాన్**
**తమాత్మస్థం యేఽను పశ్యంతి ధీరా స్తేషాం శాంతిః శాశ్వతీ నేత రేషామ్**

నిత్యః - అనిత్యానాం - చేతనః - అచేతనానామ్ - ఏకః - బహూనాం - యః - విదధాతి - కామాన్ - తమ్ - ఆత్మస్థం - యే - అనుపశ్యంతి - ధీరాః - తేషాం - శాంతిః - శాశ్వతీ - న - ఇతరేషామ్

| | | |
|---|---|---|
| యః | = | ఎవడు |
| అనిత్యానాం+నిత్యః | = | అనిత్యములయిన సృష్టిలోని ఉపాధులలో నిత్యమై యుండునదియు |
| అచేతనానామ్+చ+ చేతనః | = | అచేతనము లయిన వాటిలో చైతన్యరూపమయినదియు. |
| బహూనాం+ఏకః | = | దృశ్యమాన ప్రపంచంలో గల స్థావర జంగమాత్మకములలో ఏకరూపమున విలసిల్లునదియు |
| కామాన్ | = | సర్వకోరికలను |
| విదధాతి | = | అనుగ్రహించునదీ అయిన |
| తమ్+ఆత్మస్థం | = | దేహమందు గల ఆత్మను |
| యే+ధీరాః | = | ఏ ధీరులు |
| అనుపశ్యంతి | = | దర్శించెదరో |
| తేషాం | = | వారికి |

| | | |
|---|---|---|
| శాశ్వతీ+శాంతిః | = | శాశ్వతమైన శాంతి. |
| న+ఇతరేషామ్ | = | ఆత్మదర్శనము చేయని వారి యొక్క శాంతి శాశ్వతమయినది కాదు. |

ఈ విషయమునే భాగవతం ప్రారంభంలో శౌనకాది మహర్షులు సూతమహర్షిని ఏమిటం బొడము ఆత్మకు శాంతి మునీంద్రచెప్పవే అని వినయంగా అడిగారు. దీనికి సూత మహర్షి స్థూలంగా ఆత్మదర్శనం అని చెప్పి ఆ ఆత్మను ఎలా దర్శించవలయునో విపులంగా చెప్పినాడు. ఈ ఆత్మను దర్శించు విధి విధానమును రామాయణము, భారతము, భాగవతములు కథలుగా చెప్పినవి.

*****

**నచికేతుడు చెప్పుచున్నాడు.**

**14. తదేతదితి మన్యంతేఽనిర్దేశ్యం పరమం సుఖమ్**
**కథం ను తద్విజానీయాం కిముభాతి విభాతి వా**

తత్ - ఏతత్ - ఇతి - మన్యంతే - అనిర్దేశ్యం - పరమం - సుఖమ్ - కథం - ను తత్ - విజానీయాం - కిమ్ - ఉ - భాతి - విభాతి - వా

| | | |
|---|---|---|
| తత్+ఏతత్+ అనిర్దేశ్యం+ఇతి | = | ఇది ఈ విధముగా ఉండునని నిర్దేశింప రానిదని |
| మన్యంతే | = | భావించెదరో |
| పరమం+సుఖం | = | ఆత్మను దర్శించిన పరమ సుఖమని భావించెదరో అట్టి ఆత్మను |
| కథం+ను+తత్+ విజానీయాం | = | ఎట్లు దర్శింపగలను. కావున ఆ ఆత్మను |
| కిమ్+ఉ+భాతి+వా+ విభాతి | = | ఏ ప్రకాశంలో దర్శించవలయునో ఆత్మ స్వయం ప్రకాశమా? లేక ఇతర వెలుగుల సాయంతో ఆత్మను దర్శించాలా? అని నచికేతుడు యమునిని అడిగెను. |

*****

**15. న తత్ర సూర్యోభాతి న చంద్రతారకం నేమా విద్యుతో భాంతి కుతోఽ యమగ్నిః తమేవ భాంత మనుభాతి సర్వం తస్య భాసా సర్వమిదం విభాతి**

(ఇతి పంచమ వల్లీ)

న - తత్ర - సూర్యః - భాతి - న - చంద్రతారకం - న - ఇమాః - విద్యుతః - భాంతి - కుతః - అయమ్ - అగ్నిః - తమ్ - ఏవ - భాంతమ్ - అనుభాతి - సర్వం - తస్య - భాసా - సర్వమ్ - ఇదం - విభాతి

| | | |
|---|---|---|
| తత్ర | = | ఆ హృదయగుహలో |
| న+సూర్యః+భాతి | = | సూర్యుడు ప్రకాశింపడు. కావున సూర్యుని వలన గలుగు వెలుతురు లేదు. |
| న+చంద్రతారకం+భాంతి | = | చంద్రుడు నక్షత్రాలు లేవు. కావున వాటి వెలుతురు లేదు. |
| న+ఇమాః+విద్యుతః | = | ఈ మెఋపులు లేవు. కావున మెఋపుల కాంతి లేదు. |
| అయమ్+అగ్నిః +కుతః | = | ఆకాశమందు స్వయముగా వెలుతురు యిచ్చే అవే లేవన్న భూలోకములో మనము వెలుతురు కోసము మండించే అగ్ని ఎక్కడ ఉండును. అనగా అగ్ని యొక్క వెలుతురు కూడ లేదు. |
| తమ్+ఏవ+భాంతమ్ | = | అది స్వయంప్రకాశమును యిచ్చునది |
| సర్వమ్+అనుభాతి | = | అదే సర్వమునకు వెలుగు నిచ్చునది |
| ఇదం+సర్వమ్+తస్య+భాసా+విభాతి | = | ఈ సర్వము ఆ ఆత్మయొక్క ప్రకాశము చేత ప్రకాశింపబడుచున్నవి. కావున ఆత్మ ప్రకాశముననే ఆత్మను దర్శించవలయును. |

*****

# షష్ఠీవల్లీ

17వ శ్లోకము వరకు యముడు చెప్పుచున్నాడు

1. **ఊర్ధ్వమూలోஉవాక్ శాఖ ఏషోஉశ్వత్థః సనాతనః**
 **తదేవ శుక్రం తద్ బ్రహ్మ తదేవా మృత ముచ్యతే**
 **తస్మిం ల్లోకాః శ్రితాః సర్వే తదునా త్యేతి కశ్చన ఏతద్ వై తత్.**

ఊర్ధ్వమూలః - అవాక్శాఖః - ఏషః - అశ్వత్థః - సనాతనః - తత్ - ఏవ - శుక్రం - తత్ - బ్రహ్మ - తత్ - ఏవ - అమృతమ్ - ఉచ్యతే - తస్మిన్ - లోకాః - శ్రితాః - సర్వే - తత్ - ఉ - న - అత్యేతి - కశ్చన - ఏతత్ - వై - తత్

| | | |
|---|---|---|
| ఏషః+ఊర్ధ్వమూలః+ అవాక్శాఖః+అశ్వత్థః+ సనాతనః | = | ఊర్ధ్వమూలము, క్రిందకు శాఖలు గల అశ్వత్థ వృక్షము సనాతనమైనది. |

సృష్టిని ఒక వృక్షముగా భావించు. మామూలుగా మనము చూచే వృక్షములకు మూలము భూమిలో ఉండును. శాఖలు పైన ఉండును కాని, సృష్టి అనే వృక్షానికి మూలము 14 లోకాలకు పైన ఉన్నది. బ్రహ్మాది దేవతలు, దానవులు, రాక్షసులు, మానవులు, జంతువులు, మృగములు, పక్షులు, జలచరములు, కొండలు, నదులు, పర్వతములు అనే యీ జగత్తు ఆ వృక్షమునకు శాఖలు. ఈ శాఖలు పరమాత్మ కంటే దిగువున ఉన్నవి. ఈ వృక్షమునకు మూలము సనాతనమైన ఆత్మ. మూలము ఉంటుంది. శాఖలు నశించును. అ-శ్వ-త్థః - రేపటికి వుండదు. అనగా మూలము శాశ్వతము. శాఖలు అశాశ్వతము. ఈ ఆత్మ.

| | | |
|---|---|---|
| తత్ +ఏవ+ శుక్రం | = | హృదయ గుహలో గల ఆత్మయే నిర్మలమైనది |
| తత్+బ్రహ్మ | = | అదియే సృష్టి స్థితి లయములు చేయు ఆత్మ. |
| తత్+ఏవ+అమృతమ్+ ఉచ్యతే | = | అదియే నశింపబడనిది అని చెప్ప బడుచున్నది |
| తస్మిన్+సర్వే+లోకాః+ శ్రితాః | = | ఆ ఆత్మయందు సర్వలోకములు ఆశ్రయించుకొని యున్నవి. |

| | | |
|---|---|---|
| తత్+ఉ+న+కశ్చన+ అత్యేతి | = | ఆ ఆత్మ స్థానమును దాటి ఎవడును అధిగమించలేడు. ఇదే పరాయణమ్. |
| ఏతత్+వై+తత్ | = | అదే ఇది |

*****

**2. యదిదం కించ జగత్సర్వం ప్రాణ ఏజతి నిఃసృతమ్**
**మహద్భయం వజ్రముద్యతం య ఏతద్ విదురమృతాస్తే భవంతి**

యత్ - ఇదం - కిం - చ - జగత్ - సర్వం - ప్రాణే - ఏజతి - నిఃసృతమ్ - మహత్ - భయం - వజ్రమ్ - ఉద్యతం - యః - ఏతత్ -విదుః - అమృతాః - తే- భవంతి.

| | | |
|---|---|---|
| ఇదం+సర్వం+జగత్ | = | ఈ సర్వ జగత్తుగా |
| యత్+కిం+చ | = | ఏదైతే కలదో |
| ప్రాణే+ఏజతి | = | దేని వలన ఈ ప్రాణము ఉపాధులలో చరించు చున్నదో ఎవని వలన ఈ జగత్తు |
| నిఃసృతమ్(సతి) | = | లయకాలమున లయమై, సృష్టి కాలమున బహిర్గత మయినదో అతడు |
| వజ్రం+ఉద్యతం+ మహత్+భయం | = | ఎత్తబడిన వజ్రాయుధం గలిగిన వాని వలె గొప్ప భయమును గలిగించే వాడు అనగా లోక నియంత-ప్రభువు |
| యః+ఏతత్+విదుః | = | ఎవరు ఈ విధముగా అత్మను దర్శింతురో |
| తే | = | వారు |
| అమృతాః+ భవంతి | = | అమృతులగుదురు. |

భగవంతుని యందు భయము గలిగి సాధన చేసి కంసుడు అమృతుడైన విధము భాగవతము దశమ స్కంధమున వర్ణింపబడినది.

*****

3. **భయా దస్యాగ్ని స్తపతి భయాత్తపతి సూర్యః**
**భయాదింద్రశ్చ వాయుశ్చ మృత్యుర్ధావతి పంచమః**

భయాత్ - అస్య - అగ్నిః - తపతి - భయాత్ - తపతి - సూర్యః - భయాత్ - ఇంద్రః - చ - వాయుః - చ - మృత్యుః - ధావతి - పంచమః

చక్రవర్తి వలన భయముచే సర్వ ప్రజలు - అధికారులు వారి వారి విద్యుక్త ధర్మములు చేయుచున్నారు. ఇది లోక వ్యవహారములో మనము చూచుచున్నాము. అటులనే జగత్ చక్రవర్తి అయిన యితని భయము వలననే అధిదైవికములు వారివారి విధులను సక్రమముగా చేయుచున్నారు. వారివారి నియత ధర్మములను అతిక్రమించక ఉన్నారు. ఆత్మ ప్రభువు. విభుడు. నియంత. విశ్వనియామకుడు. విశ్వేశుడు అని దీని భావము.

| | | |
|---|---|---|
| అస్య+భయాత్ | = | ఇతని యొక్క భయము వలన |
| అగ్నిః+ తపతి | = | అగ్ని తన ధర్మమయిన మండుట అనే కార్యమును చేయుచున్నాడు. |
| భయాత్+ సూర్యః+తపతి | = | ఇతని యొక్క భయము వలన వెలుతురు ఇచ్చుట అనే తన ధర్మమయిన కార్యమగు వెలుతురును సూర్యుడు ఇచ్చుచున్నాడు. |
| చ | = | మఱియు |
| భయాత్+ఇంద్రః | = | భయము వలన ఇంద్రుడు త్రిలోకపాలన చేయు చున్నాడు |
| చ+వాయుః | = | మఱియు వాయువు వీచుచున్నది. |
| పంచమః+మృత్యుః+ ధావతి | = | బాల్యకైశోర యవ్వన జరామృత్యువు అనే 5 అవస్థలలో చివరిదగు మృత్యువును కలిగించి ప్రాణులను సంహరింప మృత్యువు పరుగెత్తు చున్నాడు. లేదా. అగ్ని, సూర్యుడు, ఇంద్రుడు, వాయువు, వీరు నలుగురు తరువాత ఐదవవాడు మృత్యువు. ఆ మృత్యువు యితని భయము వలనజీవరాసులను సంహరించుచున్నాడు. |

అనగా యీ దేవతలు స్వతంత్రులు గారు. వీరిని నియమించిన చక్రవర్తి యింకొకడు గలడు. అతడే ఆత్మ.

*****

**4. ఇహ చేదశకద్ బోద్ధుం ప్రాక్ శరీరస్య విస్రసః**
**తతః సర్గేషు లోకేషు శరీరత్వాయ కల్పతే**

ఇహ - చేత్ - అశకత్ - బోద్ధుం - ప్రాక్ - శరీరస్య - విస్రసః - తతః - స్వర్గేషు - లోకేషు - శరీరత్వాయ - కల్పతే

| | | |
|---|---|---|
| శరీరస్య+ విస్రసః+ప్రాక్ | = | శరీరము యొక్క పతనానికి ముందే |
| ఇహ+బోద్ధుం+అశకత్ | = | ఇక్కడ బ్రహ్మను దర్శించినచో |
| చేత్ | | అనగా హృదయగుహలో గల ఆత్మను దర్శించినచో అమృతుడగును |
| స్వర్గేషు+ లోకేషు | = | కామ్య కర్మపరుడయినచో శరీరత్యాగా నంతరము బ్రహ్మలోకము చేరి, పుణ్య కర్మ ఫలితము క్షీణించగనే |
| తతః | = | పిమ్మట |
| శరీరత్వాయ+కల్పతే | = | ఉపాధులలో జన్మించుట అనేది కల్పింపబడుతుంది. అనగా పునర్జన్మకు వచ్చును. |

*****

**జీవుడు - ఈశ్వరుడు**

**5. యథా దర్శే తథాత్మని యథా స్వప్నే తథా పితృలోకే**
**యథాప్సు పరీవ దదృశే తథా గంధర్వ లోకే ఛాయా తపయో రివ బ్రహ్మలోకే**

యథా - అదర్శే - తథా - ఆత్మని - యథా - స్వప్నే - తథా - పితృలోకే - యథా- అప్సు - పరి - ఇవ - దదృశే - తథా - గంధర్వలోకే - ఛాయా - తపయోః - ఇవ - బ్రహ్మలోకే

| | | |
|---|---|---|
| ఆత్మని | = | తనయందు గల జీవుడు - ఈశ్వరుడు వీరు |
| ఛాయా+తపయోః | = | వెలుగు నీడల వలె మఱియు |
| యథా+అదర్శే | = | అద్దములో కనిపించునట్లు బింబ ప్రతిబింబముల వలె ఉందురు. |
| తథా+పరి+దదృశే+ఇవ | = | అనగా ఈశ్వరుడు వెలుగు. స్వతంత్రుడు. జీవుడు నీడ. అస్వతంత్రుడు. ఈశ్వరుడు బింబము, జీవుడు ప్రతిబింబము. |
| యథా+స్వప్నే+ తథా పితృలోకే + తథా గంధర్వలోకే | = | ఒక వ్యక్తి స్వప్నమవగానే తిరిగి జాగ్రతావస్థకు వచ్చును. అటులనే కర్మఫలితము కోరి దక్షిణాయన మార్గమున పితృలోకము చేరి-గంధర్వలోకము, పుణ్యలోకములు చేరి ఆలోకములందు వసియించి తిరిగి పునర్జన్మకు వత్తురు. |
| యథా + అప్సు+ ఇవ | = | నది ఒడ్డున ఉన్న వృక్షములు నీటిలో ప్రతిబింబించి నీటి అలలకు కదిలినట్లు సుఖదుఃఖములకు జీవుడు కంపించును. ఒడ్డున ఉన్న వృక్షములు కంపించవు. అటులనే హృదయ గుహలోని ఆత్మ సుఖదుః ఖములకు లోనుగాదు. |
| బ్రహ్మలోకే | = | నిష్కామకర్మపరులై బ్రహ్మలోకము చేరినవారు బ్రహ్మలోకము నందు శాశ్వత సుఖము పొంది - పునర్జన్మ లేక అమృతులై యుందురు. |

*****

**6. ఇంద్రియాణాం పృథగ్భావ ముదయాస్త మయౌ చ యత్**
**పృథగుత్పద్య మానానాం మత్వాధీరో న శోచతి**

ఇంద్రియాణాం - పృథక్ - భావమ్ - ఉదయాస్త మయౌ - చ - యత్ - పృథక్ - ఉత్పద్యమానానాం - మత్వా - ధీరః - న - శోచతి

| | | |
|---|---|---|
| యత్ | = | ఎవడు |
| ఇంద్రియాణాం | = | ఇంద్రియముల యొక్క |
| పృథక్ | = | వేఱు వేఱుగా |
| ఉత్పద్యమానానాం | = | పుట్టుచున్న - ఇంద్రియార్థములను |
| చ | = | మఱియు మనస్సు నందలి |
| పృథిక్+భావమ్ | = | వివిధ భావములను |
| ఉదయాస్తమయౌ | = | ఆ ఇంద్రియార్థముల, భావముల ఉత్పత్తి వినాశనములను |
| మత్వా | = | గ్రహించిన |
| ధీరః | = | ధీరుడు- ఆత్మను దర్శించి |
| న+ శోచతి | = | నశోచతి నకాంక్షతి, నద్వేష్టి - దేనికి ఆలోచించడు. |

*****

7. **ఇంద్రియేభ్యః పరం మనో మనసః సత్వముత్తమమ్**
**సత్త్వాదధి మహానాత్మా మహతోఽవ్యక్త ముత్తమమ్**

ఇంద్రియేభ్యః - పరం - మనః - మనసః - సత్వమ్ - ఉత్తమమ్ - సత్వాత్ - అధి- మహాన్ - ఆత్మా - మహతః - అవ్యక్తమ్ - ఉత్తమమ్ -

| | | |
|---|---|---|
| ఇంద్రియేభ్యః+పరం+ మనః | = | ఇంద్రియముల కంటె మనస్సు గొప్పది |
| మనసః+సత్వమ్+ ఉత్తమమ్ | = | మనస్సు కంటె బుద్ధి గొప్పది |
| సత్వాత్+అధి+మహతః | = | బుద్ధి కంటె మహత్ గొప్పది |
| అవ్యక్తమ్ | = | మహత్ కంటె అవ్యక్తము అనగా ప్రకృతి గొప్పది |
| మహాన్+ఆత్మా+ ఉత్తమమ్ | = | అన్నింటి కంటె ఉత్తమమయిన ఆత్మ శ్రేష్ఠమైనది. ఈ ఆత్మయే పురుషుడు. |

*****

**8. అవ్యక్తాత్తు పరః పురుషోః వ్యాపకోఽలింగ ఏవ చ**
**యం జ్ఞాత్వా ముచ్యతే జంతు రమృతత్త్వం చ గచ్ఛతి**

అవ్యక్తాత్ - తు - పరః - పురుషః - వ్యాపకః - అలింగః - ఏవ - చ - యం - జ్ఞాత్వా - ముచ్యతే - జంతుః - అమృతత్త్వం - చ - గచ్ఛతి

| | | |
|---|---|---|
| అవ్యక్తాత్+తు | = | అవ్యక్తము కంటె శ్రేష్ఠమని చెప్పబడిన ఆత్మయే |
| పరః + పురుషః | = | పరమ పురుషుడు |
| వ్యాపకః | = | సర్వవ్యాపకుడు |
| అలింగః+ఏవ+చ | = | లింగ రహితుడు. స్త్రీ పురుష నపుంసక మూర్తి గాడు మఱియు స్త్రీ పురుష నపుంసక మూర్తి అతడే. |
| యం+జంతుః+జాత్వా | = | అట్టి ఎవనిని- ఈ పురుషుని యీ జీవుడు దర్శించి |
| ముచ్యతే | = | బంధ విముక్తుడగునని చెప్పబడు చున్నాడు |
| చ | = | మఱియు దేహాంతరమున |
| అమృతత్త్వం+గచ్ఛతి | = | బ్రహ్మలోకమునకువెళ్ళును. అమృతుడగును. |

*****

**9. న సంద్శృశే తిష్ఠంతి రూపమస్య న చక్షుషా పశ్యతి కశ్చనైనమ్**
**హృదా మనీషా మనసాభి క్లుప్తో య ఏతద్ విదురమృతాస్తే భవంతి**

న - సంద్శృశే - తిష్ఠంతి - రూపమ్ - అస్య - న - చక్షుషా - పశ్యతి - కశ్చన - ఏనమ్ - హృదా - మనీషా - మనసా - అభిక్లుప్తః - యః - ఏతత్ - విదుః - అమృతాః - తే - భవంతి

| | | |
|---|---|---|
| అస్య+ రూపమ్ | = | ఇతని యొక్క రూపమును |
| కశ్చన+న+చక్షుషా+ పశ్యతి | = | ఎవడును నేత్రములచే చూడలేడు |
| న+ఏనమ్+హృదా+ మనీషా+మనసా | = | ఎవడును ఇతనిని హృదయము చేతను, బుద్ధిచేతను మనస్సు చేతను గ్రహించలేడు |
| సంద్శృశే+తిష్ఠంతి | = | దృశ్యమాన ప్రపంచములో అంతరాత్మగా ఉండును |

| | | |
|---|---|---|
| అభిక్లుప్తః | = | ప్రాణము ద్వారా ప్రకటితుడగును. |
| యః+ఏతత్+విదుః | = | ఎవరు యీ విధముగా ఆత్మను తెలుసు కుందురో |
| తే | = | వారు |
| అమృతాః+భవంతి | = | అమృతులగుదురు |

*****

**యోగ సాధన**

**10. యదా పంచావ తిష్ఠంతే జ్ఞానాని మనసా సహ**
**బుద్ధిశ్చ న విచేష్టతి తా మాహుః పరమాం గతిమ్**

యదా - పంచ - అవతిష్ఠంతే - జ్ఞానాని - మనసా - సహ - బుద్ధిః - చ - న - విచేష్టతి - తామ్ - ఆహుః - పరమాం గతిమ్

| | | |
|---|---|---|
| యదా | = | ఎప్పుడు |
| బుద్ధిః+మనసా+సహ +అవతిష్ఠంతే | = | బుద్ధి మనస్సుతో సహా నిశ్చలముగా ఉండునో |
| చ | = | మఱియు |
| పంచ+జ్ఞానాని+న విచేష్టతి | = | ఐదు జ్ఞానేంద్రియములు వాటి విషయములపై ప్రసరించవో |
| తామ్ | = | ఆ స్థితిని |
| పరమాంగతిమ్+ ఆహుః | = | ఉత్కృష్టమైన గతిగా చెప్పుదురు. అనగా నిశ్చల సమాధి స్థితి గొప్పది. |

*****

**యోగ సాధన**

**11. తాం యోగమితి మన్యంతే స్థిరా మింద్రియ ధారణామ్**
**అప్రమత్త స్తదా భవతి యోగో హి ప్రభవాప్యయౌ**

తాం - యోగమ్ - ఇతి - మన్యంతే - స్థిరామ్ - ఇంద్రియధారణామ్ - అప్రమత్తః - తదా - భవతి - యోగః - హి - ప్రభవాప్యయౌ

| | | |
|---|---|---|
| అప్రమత్తః+ఇంద్రియ ధారణామ్+స్థిరామ్+ భవతి | = | అప్రమత్తతో నిరంతరము ఏ మాత్ర అశ్రద్ధ లేక పంచేంద్రియములను వాటి వాటి విషయముల నుంచి మరలించి చిత్తశుద్ధి గలిగి మనస్సును నిశ్చలముగా ఉంచునో |
| తాం+యోగమ్+ఇతి+ మన్యంతే | = | దానిని యోగమని అందురు |
| తదా | = | ఆ విధముగనే మనస్సు |
| యోగః +హి | = | యోగమునకు అనగా |
| ప్రభవాప్యయౌ | = | ఆత్మస్థానమును పొందుటకు యోగ భ్రష్టతకు కారణము |

*****

**12. నైవ వాచా న మనసా ప్రాప్తుం శక్యో న చక్షుషా**
**అస్తీతి బ్రువతోఽన్యత్ర కథం తదుప లభ్యతే**

న - ఏవ - వాచా - న - మనసా - ప్రాప్తుం - శక్యః - న - చక్షుషా- అస్తి - ఇతి - బ్రువతః - అన్యత్ర - కథం - తత్ - ఉప లభ్యతే

| | | |
|---|---|---|
| న+వాచా+న+చక్షుషా న+మనసా+ఏవ+అన్యత్ర +శక్యః+ప్రాప్తుం | = | వాక్ చేతగాని మిగిలిన కర్మేంద్రియముల చేతగాని, కన్ను ద్వారా గాని, మిగిలిన జ్ఞానేంద్రియముల ద్వారాగాని, మనస్సు చేత గాని లేదా బుద్ధిచేత కాని ఆత్మను పొందలేము. |
| బ్రువతః+అస్తి+ఇతి | = | ఆత్మ ఉన్నదని చెప్పేవారి మాటలను విని |
| కథం+తత్+ఉపలభ్యతే | = | ఎట్లు ఆత్మను పొందగలము? అనగా ఎట్లు గ్రహించగలము? అని నచికేతుడు అడుగగా యముడు జీవుని ద్వారానే శరీరమందున్న ఆత్మను గ్రహించ వలయును అని చెప్పుచున్నారు. |

*****

**13. అస్తీత్యే వోపలబ్ద వ్యస్తత్వ భావేన చోభయోః**
**అస్తీత్యే వోప లబ్దస్య తత్త్వభావః ప్రసీదతి**

అస్తి - ఇతి - ఏవ - ఉపలబ్దవ్యః - తత్వభావేన - చ - ఉభయోః - అస్తి - ఇతి - ఏవ - ఉపలబ్దస్య - తత్త్వభావః - ప్రసీదతి

| | | |
|---|---|---|
| ఉభయోః | = | రెండింటి యొక్క- (స్వరూప, సమ్యక్ జ్ఞానముల చేతను అని వ్యాస భగవానుడు భాగవతం ప్రారంభంలో ఆత్మకు శాంతి ఎలా గలుగుతుంది అని శౌనకాది మహా మునులడుగ సూతమహర్షి చెప్పినట్లు వివరించినారు. కావున రెండింటి యొక్క) అనగా స్వరూప, సమ్యక్ జ్ఞానములనే యీ రెండింటి యొక్క |
| తత్త్వభావేన+చ | = | తత్త్వభావము చేత |
| ఉపలబ్దవ్యః+అస్తి+ ఇతి+ఏవ | = | పొందదగినది. పరమేశ్వరుని మాయా గుణంబగు అవిద్య - విద్యచేతనే ఎప్పుడు ప్రతిషే ధింపబడు అప్పుడు జీవుడు బ్రహ్మ యగునని గ్రహించి |
| తత్త్వభావః+ఉప లబ్దస్య+అస్తి+ ఇతి+ ఏవ+ప్రసీదతి | = | ఆ విధముగా అవిద్యను దాటి విద్యను పొంది హృదయ గుహలో గల ఆత్మను పొందుటకు సాధన చేయుట చేతనే బ్రహ్మత్వము పొందబడుచున్నది. |

*****

**కోరికలు నశించవలయును**

**14. యదా సర్వే ప్రముచ్యంతే కామాయేఽస్య హృదిశ్రితాః**
**అథ మర్త్యోఽమృతో భవత్యత్ర బ్రహ్మ స మశ్నుతే**

యదా - సర్వే - ప్రముచ్యంతే - కామాః - యే - అస్య - హృది - శ్రితాః - అథ - మర్త్యః - అమృతః - భవతి - అత్ర - బ్రహ్మ - సమశ్నుతే

| | | |
|---|---|---|
| యదా | = | ఎప్పుడు |
| అస్య+హృది+శ్రితాః+ | = | ఈ యొక్క హృదయమును |
| యే+సర్వే +కామాః | | ఆశ్రయించుకొనియున్న సర్వ కోరికలు |
| ప్రముచ్యంతే | = | విడచిపోవునో, నశించునో |
| అథ | = | అప్పుడు |
| మర్త్యః+అమృతః+ | = | మానవుడు అమృతుడగును |
| భవతి | | |

ఆత్మదర్శనం అయిన తర్వాత, బ్రహ్మవలన కోరికలను పొందును. అతడు అమృతుడు కాడు. తిరిగి జననమరణ వలయములో చిక్కుకొనును. దీనికి ఉదాహరణగా రాక్షసుల కథలు చెప్పుదురు. వారు తపస్సు చేసి బ్రహ్మను దర్శించి వరములు పొంది చివరకు జననమరణ వలయములో చిక్కుకొనినారు.

అలా కోరికలు నశించినచో

| | | |
|---|---|---|
| అత్ర | = | ఇక్కడ జీవన్ముక్తుడై, దేహాంతరమున |
| బ్రహ్మ+సమశ్నుతే | = | బ్రహ్మ పదవిని పొంది బ్రహ్మయగును |

*****

**గ్రంథుల విభేదన జరగవలయును**

**15. యథా సర్వే ప్రభిద్యంతే హృదయస్యే హ గ్రంథయః**
**అథ మర్త్యోఽమృతో భవత్యేతావద్ధ్యనుశాసనమ్**

యథా - సర్వే - ప్రబిధ్యంతే - హృదయస్య - ఇహ - గ్రంథయః - అథ - మర్త్యః - అమృతః - భవతి - ఏతావత్ - హి - అనుశాసనమ్

ఓ నచికేతా!

| | | |
|---|---|---|
| యథా | = | ఎప్పుడు జీవుడు |
| ఇహ | = | జీవించియుండగనే |
| హృదయస్య+ | = | హృదయము యొక్క సర్వగ్రంథులను |
| సర్వే+గ్రంథయః | | అనగా బ్రహ్మగ్రంథి, విష్ణుగ్రంథి, రుద్రగ్రంథులను |
| ప్రభిద్యంతే | = | ఛేదించునో, అనగా గుణ రహితుడగునో |

| | | |
|---|---|---|
| అథ | = | అప్పుడు |
| మర్త్యః+అమృతః+ భవతి | = | మానవుడు అమృతుడగును |
| ఏతావత్+హి | = | అంతవఱకు అమృతుడు కాడు |
| అనుశాసనమ్ | = | ఇదే నీకు నా ఉపదేశము |

*****

**నాడులు**

**16. శతం చైకా హృదయస్య నాడ్యః తాసాం మూర్ధాన మభినిః సృతైకా తయోర్ధ్వమాయన్న మృతత్వమేతి విష్వంగన్యా ఉత్క్రమణే భవంతి**

శతం - చ -ఏకా - హృదయస్య - నాడ్యః - తాసాం - మూర్ధానమ్ - అభి - నిఃసృతా - ఏకా - తయా - ఊర్ధ్వమ్ - ఆయన్ - అమృతత్వమ్ - ఏతి - విష్వక్ - అన్యాః - ఉత్క్రమణే - భవంతి

| | | |
|---|---|---|
| హృదయస్య+నాడ్యః+ శతం+చ+ఏకా | = | హృదయము యొక్క అధో భాగము గల నాభి నుంచి 101 నాడులు బయలు దేరినవి. |
| తాసాం+ఏకా+ మూర్ధానమ్+ అభి+నిఃసృతా | = | వాటిలో ఒకటి శిరస్సుపై భాగమున గల బ్రహ్మ రంధ్రము వఱకు వ్యాపించియున్నది. ఇదే సుషుమ్న. |
| తయా+ ఊర్ధ్వం+ ఆయన్+అమృతత్త్వం+ ఏతి | = | ఆ సుషుమ్న నాడి చేత ఊర్ధ్వం అయిన బ్రహ్మ రంధ్రమునకు పయనించి ఆ స్థానమును చేరిన జీవన్ముక్తుడగును. అమృతుడగును. |
| అన్యాః+విష్వక్+ ఉత్క్రమణే+భవంతి | = | అలా గాక ఇతర నాడులలో పయనించిన ఊర్ధ్వలోకములకు చేరి మరల పునర్జన్మ గలుగును. నాడీ కేంద్రమునే రామాయణ ములో కిష్కంధగా వర్ణించిరి. |

*****

**దేహము నుండి జీవాత్మను వేఱుచేయవలయును.**

**17. అంగుష్ఠమాత్రః పురుషోఽంతరాత్మా సదా జనానాం హృదయే సన్నివిష్టః తం స్వాచ్ఛరీరాత్ ప్రవృహేన్ముంజాది వేషీకాం ధైర్యేణ తం విద్యాచ్ఛుక్ర మమృతం తం విద్యాచ్ఛుక్ర మమృతమితి**

అంగుష్ఠమాత్రః - పురుషః - అంతరాత్మా - సదా - జనానాం హృదయే - సన్నివిష్టః - తం - స్వాత్ - శరీరాత్ - ప్రవృహేత్ - ముంజాత్ - ఇవ - ఇషీకాం - ధైర్యేణ - తం - విద్యాత్ - శుక్రమ్ - అమృతం - తం - విద్యాత్ - శుక్రమ్ - అమృతమ్ - ఇతి.

| | | |
|---|---|---|
| అంగుష్ఠ మాత్రః+ పురుషః | = | చేతికి బొటన వ్రేలు ప్రధానము. అటులనే జగత్తుకు ప్రధానమయిన పురుషుడు ఆత్మగా |
| అంతరాత్మా | = | సర్వఉపాధులలో అంతర్యామిరూపంబున గలడు. |
| సదా+జనానాం+ హృదయే+సన్నివిష్టః | = | ఎల్లప్పుడూ జనుల యొక్క హృదయము నందు వసియించియుండును. |
| తం | = | ఆ ఆత్మను |
| శరీరాత్ +స్వాత్ | = | శరీరము నుండి, ధీరుడవై |
| ధైర్యేణ+ప్రవృహేత్ | = | ధైర్యముతో వేఱుచేయవలయును. ఉదాహరణ యిచ్చుచున్నాడు |
| ముంజాత్+ఇషీకాం+ఇవ | = | ముంజగడ్డి నుండి లోపలి పొరను వేఱుచేసినట్లు ఆత్మను శరీరము నుండి వేఱుచేయవలయును. |
| విద్యాత్+శుక్రమ్+తం అమృతం+ | = | అవిద్యను తొలగించి విద్యవలన స్వచ్ఛమైనదియు, అమృత స్వరూపమయి నదియు అగు ఆత్మను పొందవలయును |
| విద్యాత్+శుక్రమ్+తం అమృతమ్+ఇతి | = | విద్యవలననే స్వచ్ఛమైన అమృత స్వరూపమైన ఆత్మను పొందవలయును. |

దీనికి ఉదాహరణగా రామాయణములో శరభంగ మహర్షి మొదలయినవారు, వారు జీవించి ఉండగనే వారు దేహమునుండి విడివడి వారి దేహమును అగ్నికి ఆహుతి చేసి దివ్య దేహముతో అగ్ని నుంచి వచ్చినట్లు వివరింపబడినది.

యముడు తన ఉపదేశమును పూర్తిచేసినాడు. యముడు నచికేతునికి ఆత్మ తత్త్వమును గుఱించి చెప్పి తన మూడవ వరమును అనుగ్రహించినాడు. నచికేతుడు మరల తన తండ్రి యగు ఉద్దాలకుని చేరి సాధన చేసి అమృతుడయినాడు.

*****

**ఋషి చెప్పుచున్నాడు**

**మంగళా శాసనము**

**18. మృత్యుప్రోక్తాం నచికేతోఽథ లబ్ధ్వా విద్యామేతాం యోగవిధించ కృత్స్నమ్**
**బ్రహ్మప్రాప్తో విరజోఽభూత్ విమృత్యు రన్యోఽప్యేవం యో విదధ్యాత్మమేవ**

(ఇతి షష్ఠీవల్లీ)

మృత్యుప్రోక్తామ్ - నచికేతః - అథ - లబ్ధ్వా - విద్యామ్ - ఏతాం - యోగవిధిం - చ - కృత్స్నమ్ - బ్రహ్మప్రాప్తః - విరజః - అభూత్ - విమృత్యుః - అన్యః - అపి - ఏవం - యః - విత్ - అధ్యాత్మమ్ - ఏవ

| | | |
|---|---|---|
| అథః | = | ఆ తర్వాత |
| మృత్యుప్రోక్తామ్+ఏతాం | = | కాలస్వరూపుడయిన పరబ్రహ్మ చెప్పిన ఈ |
| కృత్స్నమ్+విద్యామ్+చ | = | సమస్త విషయములతో కూడిన |
| యోగవిధిం | = | పరవిద్యను మఱియు యోగమును |
| లబ్ధ్వా | = | పొంది నచికేతుడు |
| విరజః+అభూత్ | = | గుణరహితుడు అయ్యెను |
| విమృత్యుః | = | మృత్యురహితుడై అమృతుడు అయ్యెను |
| బ్రహ్మప్రాప్తః | = | బ్రహ్మ ప్రాప్తిపొందెను |
| నచికేతః | = | ఓ నచికేతుడా నీ జన్మ ధన్యము |

| | | |
|---|---|---|
| యః+అన్యః+అపి+ | = | ఎవరయినా |
| ఏవం+అధ్యాత్మమ్+ | | నచికేతుడు గ్రహించినట్లుగా ఆత్మతత్త్వమును |
| ఏవం+విత్ | | గ్రహించి సాధన చేసిన బ్రహ్మయగును. బ్రహ్మ ప్రాప్తిని పొందును. |

**ఓం శాంతిఃశాంతిఃశాంతిః**

*****

***ఓం సహనావవతు। సహనౌభునక్తు। సహ వీర్యం కరవావహై।***
***తేజస్వినావధీతమస్తు। మా విద్విషావహై॥***
***ఓం శాంతిఃశాంతిఃశాంతిః***

*****

# యజుర్వేదము

**అగ్నా విష్ణూ సజోష సేమా వర్ధంతు వాం గిరః।**
**ద్యుమ్నై ర్వాజేభిరా గతమ్॥**

(కృష్ణ యజుర్వేదము - తైత్తిరీయసంహిత - చతుర్థకాండము - సప్తమ ప్రపాఠకము)

| | | |
|---|---|---|
| అగ్నా విష్ణూ | = | ఓ అగ్నీ విష్ణువులారా మీరు |
| వాం | = | మీ యొక్క |
| ఇమాః + గిరః | = | ఈ స్తోత్రములు |
| వర్థంతు | = | వృద్ధినొందు గాక అనగా మిమ్ములను నేను వేయి నోళ్ళ ప్రస్తుతించెదను. ఆ స్తోత్రము విని |
| సజోషసా | = | నా యందు ప్రీతి కలవారై |
| ద్యుమ్నైః | = | ధనములతోనూ |
| వాజేభిః | = | అన్నముతోనూ ఇక్కడకు |
| ఆగతమ్ | = | మీరు రండు. అనగా నాకు ధన ధాన్యములను అష్టఐశ్వర్యములను ప్రసాదించుడు |

*****

# తైత్తిరీయ ఉపనిషత్

(కృష్ణ యజుర్వేదమునకు చెందిన **తైత్తరీయ ఆరణ్యక**ములోని ఏడవ, ఎనిమిదవ, తొమ్మిదవ ప్రపాఠకములలో ఈ ఉపనిషత్తు యందలి  శీక్షావల్లి, ఆనందవల్లి (బ్రహ్మ వల్లి),  భృగువల్లి చెప్పబడినవి)

SIDDHASHRAMAM
M: +91 8096065675 , P : +91 40 24240557
E : contactus@siddhashramam.org
W : www.siddhashramam.org

# శిక్షావల్లీ

**హరిః ఓం॥ శం నో మిత్రః శం వరుణః। శం నో భవత్వర్యమా శం న ఇంద్రో బృహస్పతిః । శంనో విష్ణు రురుక్రమః । నమో బ్రహ్మణే । నమస్తే వాయో । త్వమేవ ప్రత్యక్షం బ్రహ్మాసి । త్వ మేవ ప్రత్యక్షం బ్రహ్మ వదిష్యామి । ఋతం వదిష్యామి । సత్యం వదిష్యామి । తన్మామవతు । తద్వక్తార మవతు । అవతుమామ్। అవతు వక్తారమ్**

ఓం శాంతిః శాంతిః శాంతిః

**ఇతి ప్రథమోఽను వాకః**

హరిః - ఓం - శం - నః - మిత్రః - శం - వరుణః - శం - నః - భవతు - అర్యమా- శం - నః - ఇంద్రః - బృహస్పతిః - శం - నః - విష్ణుః - ఉరుక్రమః - నమః - బ్రహ్మణే - నమః - తే - వాయో - త్వమ్ - ఏవ - ప్రత్యక్షం - బ్రహ్మ - అసి - త్వమ్ - ఏవ - ప్రత్యక్షం - బ్రహ్మ - వదిష్యామి - ఋతం - వదిష్యామి - సత్యం- వదిష్యామి - తత్ - మామ్ - అవతు - తత్ - వక్తారమ్ - అవతు - అవతు - మామ్ - అవతు - వక్తారమ్.

హరిః ఓం - ఈ ఉపనిషత్ ప్రాచీన యోగ్యుడనే వానికి చెప్పబడుచున్నది.

| | | |
|---|---|---|
| నః | = | మాకు |
| మిత్రః | = | మిత్రుడు. (పగటికి అధిదేవత. నిశ్వాసమునకు, ప్రాణమునకు అధిదేవత.) |
| శం | = | సుఖమును ఇచ్చుగాక |
| వరుణః | = | వరుణుడు (రాత్రికి అధిదేవత. ఉచ్ఛ్వాసమునకు అపానమునకు అధిదేవత) |
| శం | = | సుఖమును మాకు యిచ్చుగాక |
| నః | = | మాకు |
| అర్యమా | = | అర్యముడు. (కన్నులకు, సూర్యమండల మునకు అధిదేవత, తేజస్సునకు, కాంతికి అధిదేవత. |

| | | |
|---|---|---|
| | | కాంతివలననే కన్నులకు వస్తు జ్ఞానము గలుగు చున్నవి. ఇట్టి వస్తు జ్ఞానమును గలిగించువాడు అర్యముడు.) |
| శం+భవతు | = | సుఖమును యిచ్చుగాక |
| నః | = | మాకు |
| ఇంద్రః | = | ఇంద్రుడు (బలమునకు అధిదేవత. ఇంద్రియ ములకు అధిదేవత) |
| శం | = | సుఖమును యిచ్చుగాక. |
| బృహస్పతిః | = | బృహస్పతి (వాక్కుకు, బుద్ధికి అధిదేవత) |
| శం | = | మాకు సుఖమును యిచ్చుగాక |
| ఉరుక్రమః | = | విశాలమైన పాదములు గల వాడు అనగా సర్వ వ్యాపకుడు |
| విష్ణుః | = | అయిన విష్ణువు |

**"పాదోఽస్య విశ్వాభూతాని త్రిపాదస్యా మృతం దివి"** - అన్నది శ్రుతి. ఒక పాదముతో సమస్త విశ్వమును మిగిలిన మూడు పాదములతో దివిని ఆక్రమించిన విశాలమైన పాదములు కలవాడు. త్రివిక్రమావతారుడు. విష్ణువు.

| | | |
|---|---|---|
| నః+శం | = | మాకు సుఖమును యిచ్చుగాక |
| బ్రహ్మణే | = | బ్రహ్మమునకు |
| నమః | = | నమస్కారము |
| వాయో | = | ఓ వాయుదేవుడా |
| తే | = | నీకు |
| నమః | = | నమస్కారము |
| త్వం+ఏవ | = | నీవే |
| ప్రత్యక్షం | = | ప్రత్యక్షముగా కనిపించే |
| బ్రహ్మ+అసి | = | బ్రహ్మవు. నేను |

| | | |
|---|---|---|
| త్వం+ఏవ | = | నిన్నే |
| ప్రత్యక్షం | = | ప్రత్యక్షముగా కనిపించే |
| బ్రహ్మ | = | బ్రహ్మవు అని |
| వదిష్యామి | = | చెప్పుచున్నాను. |
| ఋతం | = | నేను ఋతమును |
| వదిష్యామి | = | చెప్పుచున్నాను |
| సత్యం | = | నేను సత్యమును |
| వదిష్యామి | = | చెప్పుచున్నాను |
| తత్+మామ్ | = | వాయుదేవుడు నన్ను |
| అవతు | = | రక్షించుగాక |
| తత్+వక్తారమ్ | = | వాయుదేవుడు మా గురువును |
| అవతు | = | రక్షించుగాక |
| మామ్ | = | నన్ను |
| అవతు | = | రక్షించుగాక |
| వక్తారమ్ | = | గురువును |
| అవతు | = | రక్షించుగాక నొక్కి వక్కాణించుచున్నాడు. |

ఓం శాంతిః శాంతిః శాంతిః। అధ్యాత్మిక అదిభౌతిక, అధి దైవికములనే త్రివిధ తాపత్రయములు నశించి శాంతి గలుగుగాక తైత్తరీయ ఉపనిషత్ ప్రథమాను వాకములో నమస్కారము, మంగళాచరణము వస్తు నిర్దేశము చేయబడినది.

మిత్రుడు, వరుణుడు, అర్యముడు, ఇంద్రుడు, బృహస్పతి, విష్ణువు- వీరలకు నమస్కరించినాడు. నాకు, మా గురువుకు సుఖమును యిచ్చుగాక అనియు మఱియు రక్షించుగాక అనియు మంగళాచరణము చేసినాడు.

ప్రత్యక్షముగా కనిపించే బ్రహ్మయే వాయువని - వాయువును వస్తు నిర్దేశము ఈ విధముగా చేసినాడు. వాయువు.

మిత్రుడు-వరుణుడు: నిశ్వాస ఉచ్ఛ్వాసలే మిత్రుడు - వరుణుడు. వాయువును మనము లోపలికి పీల్చుతూ - వదలుచూ ఉండుదుము. రాత్రింపగళ్ళు ఇలా గాలి పీల్చుతూ వదలుతూ ఉందుము. పగటి వేళ వాయువును మిత్రుడని రాత్రివేళ వరుణుడు అని అందురు. సాధకుడు వీటిని గమనించును. ఉచ్ఛ్వాస నిశ్వాసము రెండూ కలిపి ఒక హంస. అటుల నిముషానికి 15 హంసలు. దినముకు 21600 హంసలు గడచును. ఈ హంస గమనము యోగములో ప్రధానపాత్ర వహించును. కావున మొదట మిత్రావరుణులను స్తుతియించినాడు. ఉచ్ఛ్వాస నిశ్వాసలనే ప్రశ్నోపనిషత్‌లో అగ్ని హోత్రంలో వేయు ఆహుతులుగా - పేర్కొనినారు.

ఆసన శుద్ధిని పొంది ఒక క్రమపద్ధతిన ప్రాణసంచారము జరపవలయునని సూచించాడు.

అర్యముడు - ఒక వస్తువు గుఱించి జ్ఞానము మనకు వెలుతురులో కన్ను ద్వారా గలుగును. బ్రహ్మ జ్ఞానము మనకు ఆత్మ ప్రకాశములో జ్ఞాననేత్రమువలనగలుగును. వాయు సంచారమును ఒక క్రమపద్ధతిన జరిపిన యోగములో సమాధి స్థితి గలిగి బ్రహ్మ సాక్షాత్కారముగలుగును. ప్రాణాయామసిద్ధిని పొంద వలయునని సూచించినాడు.

ఇంద్రుడు - సర్వదేవతలపై ఇంద్రుడు ఆధిపత్యము గలవాడు. అటులనే సర్వఇంద్రియములపై ప్రాణము ఆధిపత్యము గలది. ఆ ప్రాణము వాయు స్వరూపము. ప్రాణమును యోగములో పూర్ణముగా కుంభించి తద్వారా సర్వేంద్రియములను యోగి తన స్వాధీనము లోనికి తెచ్చుకొనును. చిత్తము శుద్ధి అగును. తద్వారా ప్రత్యాహారము సిద్ధించును. ఆ విధముగా ప్రత్యాహార స్థితిని దాట వలయునని సూచించినాడు.

బృహస్పతి - నిశ్చయ జ్ఞానమును గలుగ చేయునది బుద్ధి. ఆత్మ జ్ఞానమును బుద్ధి ద్వారా పొందవలయును. మనస్సు నిశ్చలమై బుద్ధితో గలసిన ధారణయని యందురు. వాయు సంచారముచే

ప్రాణమును స్వాధీనము చేసుకొని ధారణకు చేరవలయును అని సూచించినాడు.

విష్ణువు - విష్ణువు అనగా సర్వవ్యాపకుడు అని అర్థము. లోపలబయట గలడు. వాయువు సర్వవ్యాపకుడు. శరీరము లోపలబయట గలడు. యోగి తన శరీరములోపలి వాయువును జయించి ధారణ నుంచి నిశ్చల నిర్వికల్ప సమాధిలోకి చేరును. నిర్వికల్ప సమాధిని చేరవలయునని సూచించినాడు.

బ్రహ్మ - బ్రహ్మ జగత్తుకు ఆధారము. వాయువు జీవకోటికి ఆధారము.

సాధన ద్వారా బ్రహ్మత్వము పొందవలయునని సూచించినాడు. వాయువుని ఆధారముగా చేసుకొని ఉచ్ఛ్వాస నిశ్వాసలను, హంసను, ఒక క్రమ పద్ధతిలో జరిపి హంసను స్వాధీన పఱచుకొనవలయును. హంస స్వాధీనమయిన ప్రాణాయామము సిద్ధించును. ప్రాణాయామము సిద్ధించుట వలన ప్రత్యాహారము సిద్ధించును. తద్వారా ధారణ సిద్ధించును. ఆపై నిర్వికల్ప సమాధికి సాధకుడు చేరును. జీవన్ముక్తుడై దేహత్యాగానంతరము బ్రహ్మమై విరాజిల్లును.

వాయువును స్తుతించు మాటలతో యోగపాఠమును రహస్యముగా, మనకు అందించినారు. వాయువు స్వాధీనమయిన మనస్సు స్వాధీనమగును.

ఆహారమునకు మనస్సునకు; ఆహారమునకు ప్రాణమునకు; అవినాభావ సంబంధము గలదు. కావున సాధన ప్రారంభములో ఆహారము ప్రముఖ పాత్ర వహించును. యోగము చేయునప్పుడు ఆహారము గుఱించి తగు జాగ్రత్తలు తీసుకొనవలయును.

జాగ్రత్, స్వప్న, సుషుప్తి యనే మూడు అవస్థలలోనూ ప్రాణ వ్యాపార ముండును. మనస్సు, ఇంద్రియములు, ఇంద్రియ వ్యాపారములు సుషుప్తి అవస్థలో ఉండవు. కావున ప్రాణము ముఖ్యము. ప్రాణమే వాయువు. కావున వాయువును, దాని స్వరూప స్వభావములను మనకు వాయువును పొగడుచున్నట్లుగా విశదీకరించినారు.

*****

**యోగ సాధన:**

బ్రహ్మ సాక్షాత్కారమునకు యోగమవసరము. ఆ యోగము గురించి ప్రాణసంచారము గురించి వాక్కును ఉదాహరణగా తీసుకొని వివరించుచున్నాడు.

> **ఓం శీక్షాం వ్యాఖ్యాస్యామః । వర్ణః స్వరః । మాత్రాబలమ్ ।**
> **సామ సంతానః । ఇత్యుక్తః శీక్షాధ్యాయః**

**(ఇతి ద్వితీయోఽను వాకః)**

ఓం - శీక్షాం (శిక్షాం) - వ్యాఖ్యాస్యామః - వర్ణః - స్వరః - మాత్రా - బలమ్ - సామ - సంతానః - ఇతి - ఉక్తః - శీక్ష - అధ్యాయః

మీ అందరికీ ఒక అక్షరము, ఒక పదము, ఒక వాక్యము ఎలా పలక వలయునో తెలియును. ఉదాత్త అనుదాత్త ప్లుతములుగా వేద మంత్రములు పలకటము తెలియును. ఏకమాత్ర, ద్విమాత్ర, త్రిమాత్రలుగా వేద మంత్రములలోని అక్షరములు పలకటము తెలియును. వేద సంహితలు మీకు తెలియును.

కావున మీకు తెలిసిన దానినే ఉదాహరణగా తీసుకొని వాయు సంచారమును గూర్చి వివరించుచున్నాము.

శీక్షాం (శిక్షాం) = బ్రహ్మ సాక్షాత్కారమునకై వలయు ఆచరణ విధానమును అనగా యోగ, సాంఖ్య పద్ధతులను, సాధనలను అపరధర్మములను అనగా యోగ సాంఖ్య పద్ధతులను, సాధనలను, అపరధర్మములను

వ్యాఖ్యాస్యామః = మేము వివరించుచున్నాము.

వర్ణః = అకారాది అక్షరములు నాభినుంచి బయలుదేరి తాళువులు, ఓష్ఠ్యములు, దంతవ్యములు మొదలగు వాటిని చేరి, ఆ అక్షరములు నోటి ద్వారా బహిర్గతమగును అనే విషయము మీకు తెలుసు గదా.

అటులనే నాభి నుంచి బయలు దేరిన వాయువు ఊర్ధ్వముఖముగా వచ్చి ముక్కు ద్వారా బహిర్గత మగును. అక్షరములు ఏవిధముగ పలకవలయునని చెపితే అది వర్ణము. అటులనే గాలిని ఎలా పీల్చవలయునో చెప్పుచున్నాము.

స్వరః = ఉదాత్తము, అనుదాత్తము, స్వరితముగా వేదమంత్ర ములను చదువుదుము. ఈ విషయము మీకు తెలుసుగదా.

ఉచ్ఛ్వాస నిశ్శ్వాసములు జరుపునపుడు నాభినుంచి గాలిని పైకి లాగుట ఉదాత్తము. అటులనే గాలిని ముక్కు ద్వారా పీల్చి నాభివైపుకు పంపుట అనుదాత్తము. సమానముగా గాలిని పీల్చుట స్వరితము.

మాత్రా = మాత్ర అనగా
ఏకమాత్ర = హ్రస్వము
ద్విమాత్ర = దీర్ఘము
త్రిమాత్ర = ప్లుతము

అటులనే గాలిని పీల్చి అప్రయత్నముగా వెంటనే విడచుట ఏకమాత్ర. గాలిని బాగా పీల్చి ప్రయత్న పూర్వకముగా కొంత సేపునిలపి బయటకు విడచుట దీర్ఘము. గాలిని పీల్చి ప్రయత్నముచే శరీరమునకు ఎటువంటి యిబ్బందిగలుగ చేయనీయ కుండా సాధనచే ఎక్కువసేపు నిలిపి బయటకు విడచుట ప్లుతము. ఓంకారమును మూడు మాత్రలు పట్టుసమయముగా ఉచ్ఛరించ వలయును.

బలం = దీర్ఘాక్షరములగు ఆ, ఈ మొదలయిన వాటిని దీర్ఘముగాను ఖ, ఘ, ఛ, ఠ మొదలయిన వత్తు అక్షరములను గట్టిగా వత్తి పలుకుటయే బలం- అని మీకు తెలుసుగదా.

అలాగే గాలిని కంఠస్థానము వఱకు, ఆపై దవుడలు, ఆపై భ్రూమధ్య స్థానము వఱకు గాలిని పీల్చి పూర్ణకుంభకములో నుండుటయే బలం.

| | | |
|---|---|---|
| సామ+సంతానః | = | ఒక క్రమ పద్ధతితో పలుకుట సామము అని తగు విరామముతో పదము పలుకుట సంహిత అని అందురు. |

రాముడు అరణ్యమునకు వెళ్ళెను అను పదములో తగు విరామముతో పలికిన అర్థమగును. వాటినే వేగవంతముగా పలికినా అర్థము కాదు. అటులకాక రా...ముడు అ...రణ్యా....ము... నకు..వె....ళ్ళెను.. అని పలికిన అవతల వ్యక్తికి అర్థము కాదు. మనము అన్ని అక్షరములను పలికినను అవతల వ్యక్తికి మనము చెప్పినది సరిగా అర్థము ఎట్లు కాలేదో అట్లే మన ఉచ్ఛ్వాస నిశ్వాసలను గాలిని పీల్చి వదలుట, మరల గాల్చిని పీల్చుట వదలుట అనే క్రియలు కూడ తగు విరామముతో చేయవలయును. అటుల గాక విరామము యివ్వక వెనువెంటనే ఉచ్ఛ్వాస నిశ్వాసలు చేసినా ఫలితముండదు. ఒక ఉచ్ఛ్వాస నిశ్వాసకు మఱి యొకసారి చేయు ఉచ్ఛ్వాస నిశ్వాసకు విరామము ఎక్కువయినా ఫలితముండదు. ఒక క్రమ పద్ధతిలేని గాలి పీల్చి వదలుట వలన ప్రాణాయామ ఫలితముండదు. కావున ప్రాణమును యేయే ప్రదేశములో ఎంత సేపు ఆపవలయును ఎంత విరామము ఇవ్వవలయును వివరించెదము. గాలిని పీల్చుటకు, వదలుటకు గల కాలపరిమితిని వివరించెదము.

| | | |
|---|---|---|
| శీక్షాధ్యాయః | = | శీక్ష అధ్యాయము అనగా యోగ ఆచరణ విధానము. |
| ఉక్తః+ఇతి | = | చెప్పబడుచున్నది. ఇలా ఆఱు పద్ధతులలతో గాలిని పీల్చుటము, వదలటమనే ప్రాణాయామము చెప్పబడుచున్నది. (దీని గుఱించి విపులముగా భృగు వల్లిలో వివరింపబడినది.) |

సహ నౌ యశః । సహ నౌ బ్రహ్మవర్చసమ్
అధాతః సగ్ంహితాయా ఉపనిషదం వ్యాఖ్యాస్యామః ।
పంచస్వధికరణేషు । అధిలోక మధిజ్యౌతిష మధి విద్య
మధి ప్రజ మధ్యాత్మమ్ । తా మహా సగ్ంహితా ఇత్యా చక్షతే

అథాధి లోకమ్ । పృథివీ పూర్వరూపమ్ । ద్యౌ రుత్తర రూపమ్ ।
ఆకాశః సంధిః । వాయుః సంధానమ్ । ఇత్యధి లోకమ్
అథాధి జ్యౌతిషమ్ । అగ్నిః పూర్వరూపమ్ । ఆదిత్య ఉత్తరరూపమ్ ।
ఆపః సంధిః । వైద్యుతః । సంధానమ్ । ఇత్యధి జ్యౌతిషమ్
అథాధి విద్యమ్ । ఆచార్యః పూర్వరూపమ్ । అన్తే వాస్యుత్తర రూపమ్ ।
విద్యా సంధిః । ప్రవచనగ్ం సంధానమ్ । ఇత్యధి విద్యమ్
అథాధి ప్రజమ్ । మాతా పూర్వరూపమ్ । పితోత్తర రూపమ్ ।
ప్రజాసంధిః । ప్రజననగ్ం సంధానమ్। ఇత్యధి ప్రజమ్
అథాధ్యాత్మమ్ । అధరాహనుః పూర్వరూపమ్ । ఉత్తరాహనురుత్తర
రూపమ్ । వాక్సంధిః జిహ్వా సంధానమ్ । ఇత్యధ్యాత్మమ్
ఇతీమా మహాసగ్ం హితాః । య ఏవ మేతా మహాసగ్ం హితా
వ్యాఖ్యాతా వేద। సంధీయతే ప్రజయా పశుభిః । బ్రహ్మ వర్చ
సేనా న్నా ద్యేన సువర్గ్యేణ లోకేన (ఇతి తృతీయోఽను వాకః)

సహ - నౌ - యశః - సహ - నౌ - బ్రహ్మవర్చసమ్ - అథః - అతః - సంహితాయాః - ఉపనిషదం - వ్యాఖ్యాస్యామః - పంచసు - అధికరణేషు - అధిలోకమ్ - అధిజ్యౌతిషమ్ - అధివిద్యమ్ - అధి ప్రజమ్ - అధ్యాత్మమ్ - తాం - మహా సంహితాః - ఇతి - ఆచక్షతే - అథ - అధి లోకమ్ - పృథివీ - పూర్వరూపమ్ - ద్యౌః - ఉత్తరరూపమ్ - ఆకాశః - సంధిః -వాయుః - సంధానమ్ - ఇతి - అధి లోకమ్ - అథ - అధిజ్యోతిషమ్ - అగ్నిః - పూర్వరూపమ్ - ఆదిత్యః - ఉత్తరరూపమ్-

ఆపః - సంధిః - వైద్యుతః - సంధానమ్ - ఇతి - అధిజ్యౌతిషమ్ - అథ - అధి విద్యమ్ - ఆచార్యః - పూర్వరూపమ్ - అన్తే వాసి - ఉత్తరరూపమ్ - విద్యా - సంధిః - ప్రవచనగ్ం - సంధానమ్ - ఇతి - అధివిద్యమ్ - అథ - అధి ప్రజమ్ - మాతా - పూర్వరూపమ్ - పితా - ఉత్తరరూపమ్ - ప్రజా - సంధిః - ప్రజననగ్ం - సంధానమ్ - ఇతి - అధిప్రజమ్ - అథ - అధ్యాత్మమ్ - అధరాహనుః - పూర్వరూపమ్ - ఉత్తరాహనుః - ఉత్తరరూపమ్ - వాక్ - సంధిః - జిహ్వా - సంధానమ్- ఇతి - అధ్యాత్మమ్ - ఇతి - ఇమాః - మహాసగ్ంహితాః - యః - ఏవమ్ - ఏతా - మహాసగ్ంహితాః - వ్యాఖ్యాతాః - వేద - సంధీయతే - ప్రజయా - పశుభిః - బ్రహ్మవర్చసేన - అన్నాత్ - ఏన - సువర్గ్యేణ - లోకేన.

**పరవ్విదలో సాధన**

అత్యున్నత మయిన బ్రహ్మోపాసనలో గురు శిష్యుల మధ్య జీవితాంతము అభేదము ఉండవలయునని ఈ మంత్రము సూచించుచున్నది.

| | | |
|---|---|---|
| సహ+నౌ | = | మా యిద్దఱికి కూడ |
| యశః | = | యశము, కీర్తి - గలుగునుగాక |
| సహ+నౌ | = | మా యిద్దఱికి కూడ |
| బ్రహ్మవర్చసం | = | బ్రహ్మ తేజస్సు - గలుగునుగాక |

శిష్యుని వలన గురువుకు యశస్సు గలుగును. శ్రీకృష్ణుడు శిష్యుడగుట వలన సాందీపునికి యశస్సు గలిగినది. చక్కని శిష్యుని తయారు చేసిన ఘనత గురువుకు వచ్చును. గురువు వలన శిష్యునికి యశస్సు గలుగును. అంతటి మహానుభావుని శిష్యుడీతడనే యశస్సు గలుగును. శ్రీకృష్ణుని శిష్యుడు ఉద్దవుడు. అంతటి శ్రీకృష్ణ భగవానునకు శిష్యుడగుట వలన ఉద్దవునికి యశస్సు గలిగినది. బదరీలో శ్రీకృష్ణునితో పాటు ఉద్దవుడు కూడ పూజింపబడుచున్నాడు. ఇటుల గురుశిష్యు లిరువురకు యశస్సు గలుగును. సద్గురువు వద్ద శిక్షణ పొందిన శిష్యుడు బ్రహ్మ తేజస్సును పొంది కాలక్రమమున గురువగును.

సద్గురువునకు మంచి శిష్యుడు, మంచివానికి సద్గురువు దొరకుట అన్నది అరుదైన శుభ సంఘటన. అందువలన గురువు తనకు మంచి శిష్యుడు దొరకవలయునని, శిష్యుడు తనకు సద్గురువు దొరకవలయునని ప్రార్థింతురు. కావున ఈ మంత్రములో గురుశిష్యులు వేఱువేఱుగా ప్రార్థించక ఇద్దఱూ కలసి సమిష్టిగా (భగవంతుని) వాయుదేవుని ప్రార్థించిరి.

| | | |
|---|---|---|
| అథః | = | ఇప్పుడు |
| అతః | = | మొదట వాటి పేర్లను చెప్పి ఆ తర్వాత ఒక్కొక్క దాని గుఱించి విపులముగా చెప్పెదము |
| అధి విద్య | = | అధి విద్య |
| అధిప్రజమ్ | = | అధిప్రజ |
| అధి లోకమ్ | = | అధి లోకము |
| అధి జ్యోతిషమ్ | = | అధి జ్యోతిషము |
| అధ్యాత్మమ్ | = | అధ్యాత్మముఅని ఐదు విభాగములు |
| తాం | = | వాటిని ఆ ఐదు విభాగములను |
| మహాసంహితాః | = | మహా సంహితలు |
| ఆచక్షతే+ఇతి | = | అని చెప్పుదురు |
| పంచసు+అధికరణేషు | = | ఈ ఐదు |
| సంహితాయాః+ ఉపనిషదం | = | సంహితలయొక్క వివరణను అనగా ఒక్కొక్క సంహిత గుఱించి విపులముగా ఇప్పుడు |
| వ్యాఖ్యాస్యామః | = | విపులీకరించుచున్నాము |
| అథ | = | ఇప్పుడు |
| అధి విద్యమ్ | = | విద్యను గుఱించిన సంహితను చెప్పుచున్నాను |

1. శాస్త్ర పాఠములను గ్రహించవలయును.

| | | |
|---|---|---|
| అన్తేవాసి | = | శిష్యుడు |
| పూర్వరూపమ్ | = | ప్రారంభ స్థానము - ఇది ప్రారంభ స్థితి. |

| | | |
|---|---|---|
| ఆచార్యః | = | గురువు |
| ఉత్తరరూపము | = | ముగింపుస్థానము - ఇది ఆరూఢ స్థితి. |
| విద్యా | = | విద్య - శాస్త్ర పాఠము |
| సంధిః | = | మధ్యమ స్థానము - ప్రారంభ స్థితి, ఆరూఢ స్థితుల మధ్య స్థితి. |
| ప్రవచనగ్ం | = | బోధన గురు శిష్యులను |
| సంధానం | = | కలుపునది |
| ఇతి+అధివిద్యమ్ | = | ఇది అధివిద్యను గురించి చెప్పిన సంహిత **ఆచార్యోஉరణి రాధ్యః స్యాదన్తే వా స్యుత్తరారణిః తస్తంధానం ప్రవచనం విద్యా సంధిః సుఖావహః** (భాగవతం ఏకాదశస్కంధం-అధ్యాయం-10 శ్లోకము -12) |

2. విద్యానంతరము గృహస్థాశ్రమమును స్వీకరించ వలయును.

| | | |
|---|---|---|
| అథ | = | ఇప్పుడు |
| అధిప్రజమ్ | = | ప్రజలను గురించిన సంహితను చెప్పుచున్నాను |
| మాతా | = | తల్లి |
| పూర్వరూపమ్ | = | ప్రారంభస్థానము |
| పితా | = | తండ్రి |
| ఉత్తరరూపమ్ | = | ముగింపుస్థానము |
| ప్రజా | = | సంతానము |
| సంధిః | = | మధ్యమస్థానము |
| సంధానమ్ | = | వీరిని కలుపునది |
| ప్రజననగ్ం | = | సృష్టి కార్యక్రమము |
| ఇతి+అధిప్రజమ్ | = | ఇది అధిప్రజను గురించి చెప్పిన సంహిత. |

అనగా విద్యానంతరము గృహస్థుడై సంతానమును బడయ వలయును. పుణ్య కర్మానుష్ఠానము చేయవలయును.

వేదకాలంలో తల్లికి ప్రథమ స్థానము ఇవ్వబడినది. ఆ తరువాత పితృవ్యవస్థ ఏర్పడి తండ్రికి ప్రథమ స్థానము యివ్వబడినది. (రామాయణములో కౌసల్య రాముడు అరణ్యమునకు వెళ్ళినప్పుడు చెప్పుటను గమనించ వలయును)

తల్లిదండ్రి, గురువు, దైవము. ఇవి ఒకదాని తరువాత ఒకటి ప్రాధాన్యము కలిగి ఉన్నవి. తల్లి, తండ్రి, గురువులను మాని దైవమును ఆరాధించుట అపరవిద్యలో దోషము. పరవిద్యలో దేహసంబంధీకులైన తల్లిదండ్రులకంటే దైవమునకు ప్రాధాన్యము. కావుననే గోపికలు తల్లి, తండ్రి, పుత్రులు, సోదరులు మొదలైన దేహసంబంధీకులను వదలి దైవమైన శ్రీకృష్ణుని సేవించినారు.

3. యోగపాఠమును బోధించుచున్నాడు.

| | | |
|---|---|---|
| అథ | = | ఇప్పుడు |
| అధిలోకమ్ | = | లోకమును గురించిన సంహితను చెప్పుచున్నాను. |
| పృథివీ | = | భూమి. (ఆధార చక్రము కుందలిని శక్తి) |
| పూర్వరూపమ్ | = | ప్రారంభస్థానము |
| ద్యౌః | = | ద్యులోకము, బ్రహ్మలోకము |
| ఉత్తరరూపమ్ | = | ముగింపు స్థానము అనగా జీవుడు చేరవలసిన గమ్య స్థానము. |
| ఆకాశః | = | ఆకాశము |
| సంధిః | = | మధ్యస్థానము హృదయాకాశము లేక అనాహత చక్రము, ఆధార సహస్రార చక్రములకు మధ్య స్థానము. |
| వాయుః | = | వాయువు. ఈ ప్రారంభ, మధ్య, ముగింపు స్థానములను |

| | | |
|---|---|---|
| సంధానం | = | కలుపునది |
| అధిలోకమ్+ఇతి | = | శరీరములోని ఆధారాది చక్రముల గురించి చెప్పిన సంహితను అధిలోక సంహిత అని అందురు. |

4. యోగపాఠమును బోధించు చున్నాడు.

| | | |
|---|---|---|
| అథ | = | ఇప్పుడు |
| అధిజ్యౌతిషమ్ | = | అధి జ్యౌతిషమును గురించిన సంహితను చెప్పుచున్నాను |
| అగ్నిః | = | అగ్ని |
| పూర్వరూపమ్ | = | ప్రారంభస్థానము |
| ఆదిత్యః | = | సూర్యుడు |
| ఉత్తరరూపమ్ | = | ముగింపు స్థానము. |
| ఆపః | = | జలము |
| సంధిః | = | మధ్యమస్థానము |
| వైద్యుతః | = | మెరుపు |
| సంధానమ్ | = | కలుపునది |
| అధి జ్యౌతిషమ్+ఇతి | = | ఇది అధి జ్యౌతిషమును గురించి చెప్పిన సంహిత |

5. యోగ పాఠమును బోధించుచున్నాడు.

| | | |
|---|---|---|
| అథ | = | ఇప్పుడు |
| అధ్యాత్మమ్ | = | అధ్యాత్మము గురించిన సంహితను చెప్పుచున్నాను. |
| అధరాహనుః | = | క్రిందిదౌడ |
| పూర్వరూపమ్ | = | ప్రారంభస్థాయి |
| ఉత్తరాహనుః | = | పై దౌడ |
| ఉత్తరరూపమ్ | = | ముగింపు స్థాయి |
| వాక్ | = | వాక్కు |
| సంధిః | = | మధ్యమస్థానము |

జిహ్వా = నాలుక
సంధానమ్ = కలుపునది
అధ్యాత్మమ్+ఇతి+ = ఇది అధ్యాత్మ సంహిత అని అందురు.

| | | | | |
|---|---|---|---|---|
| బ్రహ్మ రంధ్రము | - | బ్రహ్మ రంధ్ర స్థానము | - | ద్యౌః(బ్రహ్మలోకము) |
| ఆజ్ఞేయ | - | భ్రూ మధ్య స్థానము (కన్నులు) | - | ఆదిత్యుడు |
| విశుద్ధ | - | కంఠస్థానము | | |
| అనాహత | - | హృదయ స్థానము | - | ఆకాశము |
| మణిపూరకము | - | నాభి స్థానము | - | జలము |
| స్వాధిష్ఠాన | - | యోనిస్థానము | - | అగ్ని |
| ఆధార | - | ఆసన స్థానము | - | భూమి |

ఇమాః = ఈ ఐదు
మహాసంహితాః+ఇతి = మహాసంహితలు అని చెప్పుదురు
యః = ఎవడు
ఏతాః = ఈ ఐదు
మహా సగ్ంహితాః = మహా సంహితలను
ఏవం = ఆవిధముగా
వ్యాఖ్యాతాః = వివరింపబడిన విషయములను
వేద = తెలుసుకొనునో-అతడు

**ఫలశృతి**

లోకేన = ఈ లోకములో
ప్రజయా = సంతానమును
పశుభిః = పశువులను
అన్నాత్ = అన్నమును

| | | |
|---|---|---|
| ఏన | = | మొదలయిన వానిని గలిగియుండి మఱియు |
| బ్రహ్మవర్చసేన | = | బ్రహ్మవర్చస్సును గలిగి |
| సువర్గ్యేణ | = | స్వర్గ సుఖములతో బ్రహ్మ లోకములో |
| సంధీయతే | = | స్థిరనివాసము గలిగియుండును. |

1. మొదట వేదమును చదివి గ్రహించవలయును.
2. ఆ తరువాత గృహస్థాశ్రమమును స్వీకరించి, సంతానమును పొంది వంశమును నిలుపవలయును. పుణ్య ఫలితము కోరకుండా పుణ్య కర్మానుష్ఠానము చేయువలయును. ఆ తరువాత బ్రహ్మలోకము చేరవలయుననే ఆకాంక్ష కలిగి యోగమును అభ్యసించ వలయును.
3. ఆసన శుద్ధి పొందవలయును.
4. తారక సిద్ధిని పొందవలయును.
5. నిశ్చల సమాధిని పొందవలయును.

ఇవియే ఐదు సంహితలు.

ఇహలోక సుఖములను పొంది యోగ సిద్ధిని పొందును. అమృతత్త్వమును పొందును. అపరవిద్యను పాటించుట వలన ఇహలోక సౌఖ్యములను పొందును. పరవిద్యను పాటించుట వలన పునరావృత్తి రహిత బ్రహ్మలోకమును పొంది బ్రహ్మయై విరాజిల్లును.

పృథివి అనగా ఆసన భాగము. ఆధార చక్రము. మొదట సాధనలో ఆసనశుద్ధి ఏర్పడ వలయును. కనీసము ఒకే ఆసనముపై 3 గంటలు కూర్చొనవలయును.

ఆహారము (సాత్త్వికాహారము), బ్రహ్మచర్యము సాధనలో ముఖ్యాంశములు. నాడీ శుద్ధి అయిన తర్వాత దృష్టిని ముక్కుకొనపై ప్రారంభములో నిలిపి దృష్టిని అటు యిటూ మరల్చరాదు. దృష్టి నిలబడిన తర్వాత అంతర దృష్టిని భ్రూమధ్య స్థానములో నిలుపవలయును.

ఇటుల దృష్టిని కేంద్రీకరించి మెల్లమెల్లగా గాలిని నాభిస్థానము నుండి పైకి బలముగా లాగవలయును. లోపలి గాలిని అంతా బయటకు పంపి బాహ్య కుంభకము చేయవలయును. బాహ్యకుంభకము చేసి విడచిన తర్వాత బయట గాలి లోనికి వేగముగా వచ్చును. ఆ తర్వాత అంతఃకుంభకము చేయవలయును. ఇటుల బాహ్యకుంభకము, అంతః కుంభకము చేయుట ద్వారా గాలి వేడెక్కి గుదస్థానము వద్ద సుషుమ్నలో ప్రవేశించును. ఆపై దానిని స్వాధిష్టానం, మణిపూరకం నుంచి అనాహత చక్రస్థానముకు (హృదయము వఱకు) తెచ్చి చాలా కాలము ఇటుల అభ్యాసము చేయవలయును. గాలిని నిలుపుట బలం అని ఇంతకు ముందు వివరింపబడినది.

మనస్సును ప్రయత్న పూర్వకముగా ఆలోచనలనుంచి మరల్చవలయును. ముక్కు కొనవద్ద దృష్టిని నిలిపి అభ్యాసము చేయగా భూతత్త్వము వశమగును. అప్పుడు సువాసనలు (అక్కడ సువాసన వచ్చు వస్తువులు యేవియు లేకపోయినను) ముక్కుకు తగులును. ఆహారము, బ్రహ్మచర్యము పాటింపగా జలతత్త్వము వశమగును.

భూతత్త్వము జలతత్త్వము వశమయినవి.

అగ్నితత్త్వమునకు చేరును. వాయువు వశమగును. దీనినే రామాయణంలో రామునికి సుగ్రీవాదులు పరిచయమగుటగా వర్ణింపబడినది. ఈ స్థితిలో వాయువు సప్త మరుత్తులుగా మారును.

వాయువు పరిశుద్ధ వాయువగును. పరిశుద్ధవాయువే కంఠస్థానమును దాటును. జలతత్త్వము వశమయిన తదుపరి సాధకుడు అగ్నితత్త్వమునకు చేరును. నాలుకపై అంగడికి తగులును. నోరు మూతపడి వెంటనే తెఱచుకొనదు. కొంత ప్రయత్నము చేసిన గాని మాట వెలువడదు.

ఇప్పుడు జ్ఞాననేత్రమగు మూడవ కన్ను ఉనికి స్పష్టముగా కనిపించును. ఈ స్థితిలో కోపమును నిగ్రహించుకొనుటకు. మౌనముగా నుండవలయును. కామం నశింపదు గాని వశమగును. కామ క్రోధములు విజృంభించును. భ్రూమధ్య స్థాన పరిసరములకు సాధకుడు చేరినాడని అర్థము.

లక్ష్యము భ్రూమధ్యస్థానమగును. కన్నులు అరమోడ్పుకన్నులగును. తలచిన కార్యములు నెఱవేఱును. కొన్ని శక్తులు అనుకోకుండా వచ్చును. కీర్తి ప్రతిష్ఠలు వచ్చును. జనులు ఆకర్షితులగుదురు. **యోగ భ్రష్టతకు** ఇది మొదటిమెట్టు.

సాధనకునిలో అహంకారముగలుగును. అష్టరాగములు గలిగి యోగి భ్రష్టుడగును. వైకుంఠపాళి ఆటలో అహంకారమనే పెద్దపాము మ్రింగి కోతివద్దకు చేరును. ఒకసారి పతనమయిన ఈ జీవితంలో తిరిగి కోలుకోలేడు. మరల పునర్జన్మలో తిరిగి యోగము అవలంభించవలయునే గాని ఈ జన్మలో చేసిన తప్పు సరిదిద్దుకొనుటకు అవకాశము లేదు. వీటినే పురాణములలో శాపముగా చెప్పుదురు. శాపగ్రస్థుడు మఱుజన్మలో ఆ శాపమునుంచి విముక్తుడగును.

ఈ స్థితిలో వాయువు కంటె మనస్సుకు, బుద్ధికి ప్రాధాన్యత ఎక్కువ. గుణముల చర్య తెలియును.

తనని తానురక్షించుకొని, పతనమవకుండా ఉండుటకు సంగరాహిత్యము అవసరము. జగత్తులో తను సామాన్య వ్యక్తి వలె సంచరించవలయును. ఇది అజ్ఞాతవాసము. సర్వకార్యములు నుంచి తప్పుకొనవలయును. ఏ పుణ్యకార్య మయినా తలపెట్టవలయునని ఆలోచించరాదు. ఎవరినీ ద్వేషింపరాదు.

తనకంటె పెద్దల సేవ చేయుచూ, దయ, వాత్సల్యము గలిగి బంధుమిత్రులతో సంగరాహిత్యము కలిగియుండవలయును. సంగరాహిత్యము లేనిచో పతనమగుటకు అవకాశములు ఎక్కువ.బుద్ధిచే పరమాత్మతో నిత్యాను సంధానముగలిగి ఉండవలయును.

సాధకుడు మనస్సును దాని వికారములను వదలి బుద్ధిని ఆశ్రయించవలయును. బుద్ధిద్వారా హృదయగుహలోగల ఆత్మను దర్శించి తనే బ్రహ్మయని స్వానుభవంతో గ్రహించవలయును. వ్యష్టిలో తను బ్రహ్మయని గ్రహించిన తర్వాత ఇంటగెలచి రచ్చగెలవవలయునన్న సామెతగా సర్వము బ్రహ్మయని స్వానుభవంతో గుర్తెఱిగిన

వాడు జీవన్ముక్తుడు. గుణరహితుడు. బంధరహితుడు. బ్రహ్మజ్ఞాని. అమృత ఇహ భవతి. అతనికి

కఃశోకః = శోకము ఎక్కడిది

కఃమోహః = మోహము ఎక్కడిది

అవిద్యయా మృత్యుంతీర్త్వా విద్యయాఽమృతమశ్నుతే.

ఇప్పుడు ఇతనికి శాంతి లభించినది. దీనినే కథా పరంగా ఋష్యశృంగుని భార్య శాంతి అని రామాయణంలో చెప్పినారు. ఇప్పుడు అతడు నకాంక్షతి, నశోచతి, నద్వేష్టి అనే స్థితిలో యుండును. సుఖము గలిగినప్పుడు సంతోషింపక, దుఃఖము గలిగినప్పుడు విచారింపక, క్రుంగిపోక, పూర్వజన్మ కర్మ ఫలితముల వలన సుఖదుఃఖములు గలుగునని తను వాటికి కర్తగాక నిరీక్షకుడుగా వుండును.

దేహము విసర్జించు తలంపు గలుగగానే ప్రాణమును ఆధారము నుంచి బ్రహ్మ రంధ్రమునకు చేర్చి బ్రహ్మ రంధ్రము చించి ఉపాధి పరంపరావ స్థానంబయిన ప్రకృతిం బాసి ఆనందమయుండై బ్రహ్మమందు గలియును.

అధ్యాత్మమునకు సంబంధించిన ఐదు సంహితలు :

1. అంఘ్రి మూలమున ఆధారచక్రమును బీడించి ప్రాణంబు బిగియబట్టి
2. నాభితలము చేర్చి
3. హృత్సరోజము నందు హత్తించి
4. తాలుమూలములకు తటిమి భ్రూయుగ మధ్యంబు సేర్చి
5. బ్రహ్మరంధ్రము చించి బ్రహ్మమందు గలియును.
    1. మనస్సును బుద్ధితో కలిపి
    2. బుద్ధిని క్షేత్రజ్ఞునితో
    3. క్షేత్రజ్ఞునిని ఆత్మలోపల చేర్చి - ఒకటి గావించి
    4. శాంతిగలిగి - జీవన్ముక్తుడై
    5. దేహత్యాగానంతరము బ్రహ్మమందు గలియును.

ఈ 5 స్థాయిలు ఒకదానికంటె యింకొకటి గొప్పవిగాన వీటిని మహాసంహి తలనినాడు. ఈ ఐదు సంహితలను కలపి "హంస" ఉపాసన అని చెప్పుదురు. ఇతడే పరమహంస. ఇతడే హంస వాహనంగాగల బ్రహ్మ, ఐదు మహాసంహితలను స్వానుభవంలో గ్రహించిన భూలోక, స్వర్గలోక సుఖములు పొందునని ఫలశ్రుతి చెప్పినాడు.

*****

**య శ్ఛన్ద సా మృషభో విశ్వరూపః। చన్దో భ్యోఽ ధ్యమృతా త్సంబభూవ। సమేన్ద్రో మేధయా స్పృణోతు। అమృతస్య దేవ ధారణో భూయాసమ్। శరీరం మే విచర్షణమ్। జిహ్వా మే మధుమత్తమా। కర్ణాభ్యాం భూరి విశ్రువమ్। బ్రహ్మణః కోశోఽ సి మేధయా పిహితః। శ్రుతం మే గోపాయ। ఆవహంతీ వితన్వానా। కుర్వాణాచీర మాత్మనః। వాసాగ్ంసి మమగావశ్చ। అన్నపానేచ సర్వదా। తతో మే శ్రియ మా వహ। లోమశాం పశుభి స్సహ స్వాహా। అమాయన్తు బ్రహ్మచారిణః స్వాహా। విమాయన్తు బ్రహ్మచారిణః స్వాహా। ప్రమాయన్తు బ్రహ్మచారిణః స్వాహా దమాయన్తు బ్రహ్మ చారిణః స్వాహా। శమాయన్తు బ్రహ్మచారిణః స్వాహా యశో జనేఽసాని స్వాహా। శ్రేయాన్ వస్యసోఽసాని స్వాహా। తం త్వా భగ ప్రవిశాని స్వాహా। స మా భగ ప్రవిశ స్వాహా। తస్మిం త్సహస్రశాఖే। ని భగాహం త్వయి మృజే స్వాహా। యథా పః ప్రవతాయంతి యథా మాసా అహర్జరమ్।**
**ఏవం మాం బ్రహ్మచారిణః స్వాహా। ధాతరా యన్తు సర్వతః స్వాహా।**
**ప్రతి వేశోఽసి। ప్ర మాభాహి। ప్రమా పద్యస్వ.** (ఇతి చతుర్థోఽను వాకః)

యః - చన్దసామ్ - ఋుషభః - విశ్వరూపః - చందోభ్యః - అధి - అమృతాత్ - సంబభూవ - సః- మా - ఇన్ద్రః - మేధయా - స్పృణోతు - అమృతస్య - దేవ - ధారణః - భూయాసమ్ - శరీరం - మే - విచర్షణమ్ - జిహ్వా - మే - మధు మత్తమా - కర్ణాభ్యాం - భూరి - విశ్రువమ్ - బ్రహ్మణః - కోశః - అసి - మేధయా- పిహితః - శ్రుతం - మే - గోపాయ - ఆవహంతీ - వితన్వానా - కుర్వణా - అచీరమ్ - ఆత్మనః - వాసాంసి - మమ - గావః - చ - అన్నపానే - చ - సర్వదా -

తతః - మే - శ్రియమ్ - ఆవహ - లోమశాం - పశుభిః - సహ - స్వాహా - మా - ఆయంతు - బ్రహ్మచారిణః - స్వాహా - వి- మా - ఆయంతు - బ్రహ్మచారిణః - స్వాహా - ప్ర - మాఆయంతు - బ్రహ్మచారిణః - స్వాహా - దమ - ఆయంతు - బ్రహ్మచారిణః - స్వాహా - శమ - ఆయంతు - బ్రహ్మచారిణః - స్వాహా - యశః - జనే - ఆసాని - స్వాహా - శ్రేయాన్ - వస్యసః - ఆసాని - స్వాహా - తం - త్వా - భగ - ప్రవిశాని - స్వాహా - సః - మా - భగ - ప్రవిశ - స్వాహా - తస్మిన్ - తత్ - సహస్రశాఖే - నిభగ - అహం - త్వయి నిమృజే - స్వాహా - యథా - ఆపః - ప్రవతాయంతి - యథా - మాసాః - అహర్జరమ్ - ఏవం - మాం - బ్రహ్మ చారిణః - స్వాహా - ధాతః - ఆయంతు - సర్వతః - స్వాహా - ప్రతివేశః - అసి - మా - ప్రభాహి - ప్రమా - పద్యస్వ.

శరీరము - మనస్సు - బుద్ధి - జ్ఞానేంద్రియములతో సాధన చేయవలయును.

| | | |
|---|---|---|
| యః | = | ఎవడు |
| చందసాం | = | వేదములలో |
| ఋషభః | = | శ్రేష్ఠుడో అనగా శ్రేష్ఠుడుగా వర్ణింపబడినాడో |
| విశ్వరూపః | = | ఎవడు విశ్వరూపుడో (సర్వము తనే అయినవాడో) |
| చందోభ్యః+అమృతాత్ | = | ఎవడు అమృతత్త్వమయిన వేదముల చేత |
| అధి+సంబభూవ | = | స్వయముగా ఉద్భవించెనని వర్ణింప బడినాడో |
| సః+ఇంద్రః | = | అట్టి ఇంద్రుడు - పరమాత్మ |
| మా | = | నన్ను |
| మేధయా | = | ప్రజ్ఞతో, బుద్ధితో |
| స్పృణోతు | = | నింపునుగాక. అనగా ఇంద్రుని వలన నాకు సద్బుద్ధి గలుగుగాక. |
| దేవ | = | ఓ ఇంద్రుడా - పరమాత్మ |
| అమృతస్య | = | బ్రహ్మజ్ఞానము యొక్క |
| ధారణః | = | ధారణ వలన - నిరంతర నామస్మరణ అనే ధారణ వలన |

| | | |
|---|---|---|
| భూయాసం (భూయాత్) | = | బ్రహ్మజ్ఞానిని అయ్యెదను గాక. |
| మే | = | నా యొక్క |
| శరీరం | = | దేహము |
| విచర్షణమ్ | = | బ్రహ్మజ్ఞానసముపార్జనా యోగ్యమైనది అగుగాక |
| మే | = | నా యొక్క |
| జిహ్వా | = | నాలుక |
| మధుమత్తమా | = | మధుర సంభాషణ చేయునది అగుగాక. లేక బ్రహ్మ గుఱించి పలుకును గాక. |
| కర్ణాభ్యాం | = | నా యొక్క చెవుల చేత |
| భూరి | = | బ్రహ్మ గుఱించి ఎక్కువగా |
| విశ్రువం | = | విందునుగాక. లేక మంచి మాటలను విందునుగాక. |
| బ్రహ్మణః | = | ఓంకారమా. నీవు బ్రహ్మమునకు |
| కోశః+అసి | = | కోశము అయి ఉన్నావు. ఖడ్గమునకు ఒర ఎటులో అటుల నీవు బ్రహ్మమునకు ఒర. ఓంకారమా నీవు |
| మేధయాః | = | ప్రజ్ఞచే |
| పిహితః | = | కప్పబడి యున్నావు |
| శ్రుతం | = | బ్రహ్మ గుఱించి విన్నజ్ఞానమును ఓంకారమా ! నీవు |
| మే | = | నాకు |
| గోపాయ | = | ఫలవంతము చేయుము. |

అక్షరపరబ్రహ్మమగు ఓంకారమును, అక్షరుడగు ఇంద్రుని ప్రార్థించినట్లు కనబడును. ఇందు సాధన రహస్యముగా చెప్పబడినది.

| | | |
|---|---|---|
| సర్వదా | = | ఎల్లప్పుడు |
| మే | = | నాకు ఇంద్రుడు సుఖసంపదలను |
| అచీరం(అచిరం) | = | వెంటనే |
| కుర్వాణా | = | కలుగచేయుచు - సంపదలను |

| | | |
|---|---|---|
| ఆవహంతీ | = | తీసుకొనివచ్చుచూ, సంపద సుఖశాంతు లతో |
| వితన్వానా | = | వృద్ధిపొందించుచూ ఉండుగాక |
| ఆత్మనః | = | నాకు పరమాత్మ అనుగ్రహమున |
| వాసాంసి+చ | = | వస్త్రములు |
| గావః (గాః) | = | గోవులు |
| చ | = | మఱియు అష్టఐశ్వర్యములు, సర్వ సౌఖ్యములు |
| అన్నపానే | = | అన్ని పానీయములు గలుగుగాక |
| తతః | = | ఆ తర్వాత పునరావృత్తి రహిత బ్రహ్మలోకప్రాప్తి గలుగుగాక. |
| మమ | = | నాకు |
| శ్రియమ్ | = | భోగభాగ్యములు |
| ఆవహ | = | ఓ ఇంద్రుడా ! తెమ్ము |
| పశుభిః+సహ | = | పశువులతో కూడ |
| లోమశాం | = | మేకలు, గొఱ్ఱెలు అనగా పశుసంపద నాకుయిమ్ము. |
| స్వాహా | = | ఓం స్వాహా ఇలా మంత్రము చెపుతూ ఆహుతిని యిచ్చుచున్నాడు. |

ఇంద్రుని యజ్ఞము ద్వారా ఆరాధించుచూ ఇహలోక సుఖములను గూర్చి ప్రార్థించినాడు. ఉపాసన ప్రారంభములో సాధకునికి ఇహలోక సుఖవాంఛ అధికముగా యుండును. కావున ఈ విధముగా ఆహుతులనిచ్చుచూ ప్రార్థించినాడు.

**బ్రహ్మచారులు వచ్చెదరు గాక**

గురు పరంపరాన్యాయముగా శిష్యులకు జ్ఞానమును అందించవలయును. కావున

| | | |
|---|---|---|
| బ్రహ్మచారిణః | = | బ్రహ్మచారులు, బ్రహ్మజ్ఞానమును పొందగోరు విద్యార్థులు |
| మా | = | నా వద్దకు |

| | | |
|---|---|---|
| ఆయంతు | = | వచ్చెదరుగాక. |
| స్వాహా | = | ఓం స్వాహా |
| వి | = | నలుదిక్కులనుండి |
| మా | = | నా వద్దకు |
| బ్రహ్మచారిణః | = | విద్యార్థులు |
| ఆయంతు | = | వచ్చెదరు గాక |
| స్వాహా | = | ఓం స్వాహా |
| ప్ర | = | ఎక్కువమంది |
| మా | = | నా వద్దకు |
| బ్రహ్మచారిణః | = | విద్యార్థులు |
| ఆయంతు | = | వచ్చెదరు గాక |
| స్వాహా | = | ఓం స్వాహా |
| దమ | = | బాహ్యేంద్రియ నిగ్రహము గల |
| బ్రహ్మచారిణః | = | విద్యార్థులు |
| ఆయంతు | = | వచ్చెదరుగాక. |
| స్వాహా | = | ఓం స్వాహా |
| శమ | = | అంతరేంద్రియ నిగ్రహము గల |
| బ్రహ్మచారిణః | = | విద్యార్థులు |
| ఆయంతు | = | వచ్చెదరు గాక |
| స్వాహా | = | ఓం స్వాహా |
| యశః | = | యశస్సు |
| జనే | = | జనులలో సద్గురువు అనే మంచి పేరు నాకు |
| ఆసాని+ స్వాహా | = | కలుగును గాక (ఓం స్వాహా) |
| శ్రేయాన్ | = | శ్రేయస్సు గల వాటిలో |
| వస్యసః (వసాయసః) | = | విలువైనది ఆత్మాను సంధానము నాకు |

| | | |
|---|---|---|
| ఆసాని+ స్వాహా | = | కలుగును గాక (ఓం స్వాహా) |
| తం (త్వా) | = | నీలో బ్రహ్మమైననీలో |
| భగ | = | ఓ భగవంతుడా |
| ప్రవిశాని+స్వాహా | = | ప్రవేశించెదను గాక (ఓం స్వాహా) |
| సః | = | నీవు కూడ |
| మా | = | నాలో |
| భగ | = | ఓ భగవంతుడా |
| ప్రవిశ+స్వాహా | = | ప్రవేశించుము. (ఓం స్వాహా) |
| తత్తస్మిన్ | = | నీలో |
| సహస్రశాఖే | = | అనంత శాఖలతో నొప్పు |
| త్వయి | = | నీయందు |
| (ని) భగ | = | భగవంతుడా |
| అహం | = | నేను |
| నిమృజే+స్వాహా | = | పాపములను కడుగుకొని పరిశుద్ధుడ య్యెదను గాక |
| యథా | = | ఏ విధముగా |
| ఆపః | = | నీరు సహజముగా |
| ప్రవతా+యంతి | = | పల్లమునకు ప్రవహించునో |
| యథా | = | ఏ విధముగా |
| మాసాః | = | నెలలు |
| అహర్జరం | = | సంవత్సరముగామారుచున్నవో |
| ఏవం | = | ఆవిధముగా, నా ప్రయత్నము ఏమియు లేకుండగనే |
| సర్వతః | = | అన్ని ప్రాంతములనుంచి |
| బ్రహ్మచారిణః | = | విద్యార్థులు |
| మాం | = | నా వద్దకు |
| ఆయంతు+స్వాహా | = | వచ్చెదరు గాక |

## బ్రహ్మత్వమును పొందుట

| | | |
|---|---|---|
| ధాతః | = | సృష్టికర్త వయిన నీవు ఓ ధాతా |
| ప్రతివేశః+అసి | = | నీవు సర్వజీవులకు ఆశ్రయ స్థానమయి ఉన్నావు |
| మా | = | కావున నాకు |
| ప్రభాహి | = | నీ దర్శన భాగ్యము కలుగ చేయుము. |
| ప్రమా | = | నన్ను నీవు |
| పద్యస్వ+స్వాహా | = | పొందుము. ఆ విధముగా నేను-నీవు ఒకటి అవుదుము. |

కర్పూర దీప సంయోగముగా దీనిని వర్ణింతురు. కర్పూరమును దీపము కలిసిన కర్పూరదీపమై కర్పూరము హరించి దీపమే మిగులును. అటుల జీవత్వము నశించి బ్రహ్మత్వము మిగులును.

ఇది గురువు ప్రార్థన. సుక్షేత్రము నందే మంచి విత్తనములు నాటుటకు వ్యవసాయ దారుడు ప్రయత్నించును. కావున క్షేత్రము విత్తనము మంచివై యుండ వలయును. క్షేత్రము బ్రహ్మచారులు. విత్తనము బ్రహ్మజ్ఞానము కావున బ్రహ్మ జ్ఞానమనే విత్తనమునకు వలయు సుక్షేత్రమగు బ్రహ్మచారులను పంపవలసినదిగా భగవంతుని ప్రార్థించినాడు. గురువు స్థిత ప్రజ్ఞుడు. గుణరహితుడు. కావున తను దేనికి కర్తకాడు. కావున కర్తృత్వముండదు. భగవంతుడే కారకుడు, ప్రేరకుడు. కావున నీరు పల్లమునకు ప్రవహించునటుల, నెలలు సంవత్సరములగునటుల తన ప్రయత్నము లేకనే విద్యార్థులు రావలయునని ప్రార్థించినాడు.

భగవంతుడే తనని పొందవలయునని ప్రార్థించినాడు. దీనినే రతి అని అందురు. కుబ్జ శ్రీకృష్ణుని, గోపికలు కృష్ణుని రతి కోరినారు అని కథలుగా వర్ణింపబడినది. ఆ గోపికలు శ్రీకృష్ణునితో రతి చేయుటకు ముందు-

1. తల్లుల్ దండ్రులన్ తనుజుల్, సోదరుల్, మఱదులు బంధువుల్, గురుల్- అడ్డంబుచని నివారింప తలారింపక అనగా సంగరాహిత్యము గలిగి

2. ప్రకృతిలో పురుషుని వెతకి. (పున్నాగకానవే పున్నాగ వందితు మొదలయినవి)
3. ఉన్మత్తచిత్తులై కృష్ణలీలలు అనుకరింపుచు
4. కృష్ణుని నుతించి
5. బంధ నిర్ముక్తులై
6. గుణమయ దేహములు విడచి
7. జ్ఞానకాండమున ఈశ్వరుని గని ఆత్మాను సంధానము గలిగి ఉండిరి.

*****

## బ్రహ్మ జిజ్ఞాస

**ఓం భూర్భువః సువరితి వా ఏతాస్తిస్రో వ్యాహృతయః తాసాము హస్మైతాం చతుర్థీమ్ । మహాచమస్యః ప్రవేదయతే । మహ ఇతి। తత్ బ్రహ్మ। స ఆత్మా। అంగాన్యన్యా దేవతాః । భూరితి వా అయం లోకః । భువ ఇత్యన్తరిక్షమ్ । సువరిత్యసౌలోకః మహ ఇత్యాదిత్యః । ఆదిత్యేన వావ సర్వేలోకా మహీయంతే । భూరితివాఅగ్నిః । భువ ఇతి వాయుః। సువరిత్యాదిత్యః మహ ఇతి చంద్రమాః। చంద్రమసా వావ సర్వాణిజ్యోతీగ్ంషి మహీయంతే । భూరితివా ఋచః । భువ ఇతి సామాని । సువరితి యజూగ్ంషి। మహ ఇతి బ్రహ్మ। బ్రహ్మణా వావ సర్వే వేదా మహీయంతే । భూరితివై ప్రాణః । భువ ఇతి అపానః। సువరితి వ్యానః । మహ ఇత్యన్నమ్ । అన్నేన వావ సర్వే ప్రాణా మహీయంతే । తా వా ఏతాశ్చతస్రశ్చతుర్ధా । చతస్రశ్చ తస్రో వ్యాహృతయః తా యో వేద । స వేద బ్రహ్మ । సర్వేఽస్మై దేవా బలి మావహంతి ।**

(ఇతి పంచమోఽను వాకః)

ఓం - భూః - భువః -సువః -ఇతి - వా - ఏతాః - తిస్రః - వై - వ్యాహృతయః - తాసాం - ఉ - హ - స్మ - ఏతాం - చతుర్థీమ్ - మహాచమస్యః - ప్రవేదయతే - మహః - ఇతి - తత్ - బ్రహ్మ - సః - ఆత్మా- అంగాని - అన్యాః - దేవతాః భూః - ఇతి - వా - అయం - లోక - భువః - ఇతి - అన్తరిక్షమ్ - సువః - ఇతి - అసౌలోకః - మహః - ఇతి - ఆదిత్యః - ఆదిత్యేన - వావ - సర్వే - లోకాః - మహీయంతే - భూః - ఇతి - వా - అగ్నిః - భువః - ఇతి - వాయుః - సువః -

ఇతి - ఆదిత్యః - మహః - ఇతి - చంద్రమాః - చంద్రమసా - వావ - సర్వాణి - జ్యోతీగ్ంషి - మహీయంతే - భూః - ఇతి - వా - ఋచః - భువః - ఇతి - సామాని - సువః - ఇతి - యజూంషి - మహః - ఇతి - బ్రహ్మ - బ్రహ్మణా - వావ - సర్వే - వేదా - మహీయంతే - భూః - ఇతి - వై - ప్రాణః - భువః - ఇతి - అపానః - సువః - ఇతి - వ్యానః - మహః - ఇతి - అన్నమ్ - అన్నేన - వావ - సర్వే- ప్రాణాః - మహీయంతే - తాః - వై - ఏతాః - చతస్రః - చతుర్ధా - చతస్రః - చతస్రః - వ్యాహృతయః - తాః - యః - వేద - సః - వేద - బ్రహ్మ - సర్వే - అస్మై- దేవాః - బలిం - ఆవహంతి.

| | | |
|---|---|---|
| ఉ+హ+స్మ | = | ఇంతకు పూర్వము |
| భూః | = | భూః |
| భువః | = | భువః |
| సువః | = | సువః |
| ఇతి+వా+ఏతాః | = | అను యీ |
| తిస్రః+వై | = | మూడు |
| వ్యాహృతయః | = | వ్యాహృతులు సంధ్యా వందనములో |
| తాసాం | = | మనకు తెలుసు |
| ఏతాం+చతుర్థీమ్ | = | ఈ నాలుగవ వ్యాహృతుని |
| మహః+ఇతి | = | మహః-అనుదానిని |
| మహాచమస్యః | = | మహాచమసుని పుత్రుడు |
| ప్రవేదయతే | = | కనుగొనెను |
| తత్ | = | అది |
| సః+బ్రహ్మ | = | ఆ నాలుగవ వ్యాహృతి బ్రహ్మ. ఈ నాలుగవ దానికి అనగా |
| ఆత్మా | = | ఆత్మ, అనే దానికి |
| అన్యాః+దేవతాః | = | ఇతర దేవతలు |

| | | |
|---|---|---|
| అంగాని | = | అంగములు. బ్రహ్మకు ఒక్కొక్క దేవత ఒక్కొక్క అంగము కావున ఇతర దేవతలు యీ బ్రహ్మకు అంగములు. |
| భూః+ఇతి+వా | = | భూః యను వ్యాహృతి |
| అయంలోకః | = | ఈ భూలోకము |
| భువః+ఇతి | = | భువః అను వ్యాహృతి |
| అన్తరిక్షమ్ | = | అన్తరిక్షము |
| సువః+ఇతి | = | సువః అను వ్యాహృతి |
| అసౌలోకః | = | సువర్లోకము. ఈ త్రిలోకములు నశించును |
| మహః+ఇతి | = | మహః అను వ్యాహృతి |
| ఆదిత్యః | = | ఆదిత్య లోకము. అనగా ఆత్మస్థానము. |
| ఆదిత్యేన+వావ | = | ఆదిత్యుని చేతనే గదా (స వై ఆదిత్యోపురుషః- శ్రుతి) సర్వలోకములు సృజియింపబడినవి. మఱియు |
| సర్వే+లోకాః | = | సర్వలోకములు |
| మహీయంతే | = | వృద్ధి పొందుచున్నవి. |
| భూః+ఇతి+వా | = | భూః యను వ్యాహృతి |
| అగ్నిః | = | అగ్ని |
| భువ+ఇతి | = | భువః అనువ్యాహృతి |
| వాయుః | = | వాయువు |
| సువః+ఇతి | = | సువః అను వ్యాహృతి |
| ఆదిత్యః | = | ఆదిత్యుడు |
| మహః+ఇతి | = | మహః అను వ్యాహృతి |
| చంద్రమాః | = | చంద్రుడు |

| | | |
|---|---|---|
| చంద్రమసా+వావ | = | చంద్రుని చేతనే గదా |
| సర్వాణి+జ్యోతీగ్ంషి | = | సర్వజ్యోతిస్సులు |
| మహీయంతే | = | వృద్ధి పొందుచున్నవి |

ఆదిత్యుని వలన సర్వలోకములు వృద్ధి పొందుచున్నవి. చంద్రునివలన సర్వ జ్యోతిస్సులు (కాంతిని ప్రసరించునవి అన్నీ) వృద్ధి పొందుచున్నవి. ఈ చంద్రుడు భూమికి ఉపగ్రహమగు చంద్రుడు కాడు. అత్రి అనసూయ తనయుడగు చంద్రుడు కాడు. బృహస్పతి భార్యయైన తారతో సంసారము చేసిన చంద్రుడుకాడు. చంద్రవంశమునకు మూలపురుషుడగు చంద్రుడు కాడు. అమృతోత్పాదనమున జన్మించిన చంద్రుడు కాడు. శివుని జటాజూటమున గల చంద్రుడు కాడు

చంద్రుడనగా అమృత స్వరూపుడయిన ఆత్మ. బ్రహ్మరంధ్రమనే నందనవనం దీని స్థానము. ఈ చంద్రుని వలన సర్వజ్యోతిస్సులు వృద్ధి అగుటయే గాక శరీరములోని సర్వనాడులు అమృతముతో తడుపబడును.

| | | |
|---|---|---|
| భూః+ఇతి+వా | = | భూః యను వ్యాహృతి |
| ఋచః | = | ఋక్కు |
| భువః+ఇతి | = | భువః యను వ్యాహృతి |
| సామాని | = | సామము |
| సువః+ఇతి | = | సువః యను వ్యాహృతి |
| యజూంషి | = | యజస్సు |
| మహః+ఇతి | = | మహః యను వ్యాహృతి |
| బ్రహ్మ | = | బ్రహ్మ |
| బ్రహ్మణా+వావ | = | బ్రహ్మము చేతనేగదా |
| సర్వే+వేదాః | = | నాలుగు వేదములు |
| మహీయంతే | = | వృద్ధిని పొందుచున్నవి. బ్రహ్మయే వేదపురుషుడు. కావున వేదములు వృద్ధి పొందుచున్నవి. |

| | | |
|---|---|---|
| భూః+ఇతి+వై | = | భూః యను వ్యాహృతి |
| ప్రాణః | = | ప్రాణము |
| భువః+ఇతి | = | భువః అను వ్యాహృతి |
| అపానః | = | అపానము |
| సువః+ఇతి | = | సువః యను వ్యాహృతి |
| వ్యానః | = | వ్యానము |
| మహః+ఇతి | = | మహః యను వ్యాహృతి |
| అన్నమ్ | = | అన్నము |
| అన్నేన వావ | = | అన్నము చేతనే గదా |
| సర్వే+ప్రాణాః | = | పంచ ప్రాణములు, ఇంద్రియములు, దేహము |
| మహీయంతే | = | వృద్ధి పొందుచున్నవి. అన్నము వలన ప్రాణములు వృద్ధి పొందుట అనుభవైక విషయము. జాగ్రతావస్థలో నిరాహారము వలన ప్రాణము శోషపడును. ఇంకను నిరాహారమున్న ప్రాణము పోవును. |
| తాః+వై | = | అవి |
| ఏతాః | = | ఈ భూః భువః సువః మహః అనే |
| చతస్రః | = | నాలుగు వ్యాహృతులు |
| చతుర్ధా | = | ఒక్కొక్కటి నాలుగయి |
| చతస్రః+చతస్రః | = | నాలుగు నాలుగులు-16 |
| వ్యాహృతయః | = | వ్యాహృతులు అగుచున్నవి |
| తాః | = | ఈ 16 వ్యాహుతులను |
| యః+వేద | = | ఎవడు తెలుసుకొనునో |
| సః+బ్రహ్మ+వేద | = | అతడు బ్రహ్మను తెలిసిన వాడు. అతడే బ్రహ్మ. కావున |
| అస్మై | = | అతనికి |

సర్వే+దేవాః = అందఱు దేవతలు

బలిం = కానుకలు

ఆవహంతి = కొనితెత్తురు

ఆత్మ వలన వ్యాహృతులు, సర్వలోకములు, సర్వజ్యోతిస్సులు, సర్వ వేదములు, సర్వ ప్రాణములు, అన్నము, సర్వ స్థావర జంగమములు మొదలయిన సర్వము వచ్చినవి.

| | | | | |
|---|---|---|---|---|
| భూః - | భూలోకము | అగ్ని | ఋక్ | ప్రాణము |
| | 1 | 5 | 9 | 13 |
| భువః | అన్తరిక్షం | వాయువు | సామము | అపానము |
| | 2 | 6 | 10 | 14 |
| సువః | సువర్లోకం | ఆదిత్యుడు | యజుస్సు | వ్యానం |
| | 3 | 7 | 11 | 15 |
| మహః | ఆదిత్యలోకం | చంద్రుడు | బ్రహ్మ | అన్నము |
| | 4 | 8 | 12 | 16 |

ఈ 16 తెలిసినవాడు బ్రహ్మ యగును. కావున అతనికి దేవతలు చక్రవర్తికి సామంతులు కానుకలు సమర్పించినట్లు అతనికి కానుకలు కొని తెత్తురు.

ఈ ఆత్మయే ఆదిత్యునిగా, చంద్రునిగా, బ్రహ్మగా పిలువబడి సృష్టిచేయుచున్నది. ఈ బ్రహ్మయే అన్నముగా అధి భౌతికముగా ఉంది. ఈ ఆత్మ స్వరూపము దర్శించవలయును. సాధన ద్వారా బ్రహ్మను గ్రహించవలయును.

పుణ్యకర్మానుష్ఠానపరులు పుణ్య ఫలితము కోరి పుణ్య లోకమును పొంది పుణ్య ఫలితము క్షీణించగానే తిరిగి జన్మకు వత్తురు. పుణ్య ఫలితము కోరని వారు క్రమ ముక్తిలో మహర్లోకము చేరి, భూఃభువఃసువః అనే మూడు లోకములు దహింపబడుట చూచి బ్రహ్మలోకము చేరుకొని అక్కడ వసియింతురు.

భూలోకము, అంతరిక్షము, సువర్లోకములు అనగా త్రిభువనములు లయకాలమున నశించును. ఆదిత్య లోకముగా చెప్పబడే ఆత్మ స్థానము లయకాలమున కూడా నశింపదు. కావున సాధకుడు ఆ ఆత్మ స్థానము చేరుకొనవలయును.

చంద్రుడనగా అమృతస్వరూపుడయిన ఆత్మ. అగ్ని అనగా వాక్కు. అనగా **కర్మేంద్రియములను జయించి;** అదిత్యుడనగా కన్ను-అనగా **జ్ఞానేంద్రియములను జయించి;** వాయువు అనగా ప్రాణము. **ప్రాణాయామ సిద్ధిని పొంది;** చంద్రుడు లింగ శరీరమునకు అధిష్టాత. **లింగశరీరమును భంగము చేసుకొని** ఆత్మ స్థానమును పొందవలయును.

నాలుగు వేదములు చదివి, వాటిలో చెప్పినదానిని ఆచరించి సాధన చేసి, ఆత్మ స్థానమును పొందవలయును. అన్నమయకోశము, ప్రాణమయ కోశము మొదలయిన కోశములను దాటి ఆత్మ స్థానమును పొందవలయును. ఇటుల సాధన చేయ వలయునని ఇంతకు పూర్వము చతుర్థానువాకమున చెప్పినదానినే ఇందు చెప్పినాడు.

భూః - భువః - సువః లనే లయకాలమున నశించు మూడు లోకములనుదాటి మహర్లోకము చేరి బ్రహ్మ లోకము చేరుటకు ఆదిత్యునిని ఉపాసించ వలయును. ఈవిధానమే సంధ్యావందనమున చెప్పబడినది.

*****

**బ్రహ్మ జిజ్ఞాస**

**ఆత్మ లక్షణము :- ఆత్మను దర్శించిన జీవన్ముక్తుడు, అమృతుడు అగును. ఇదే ప్రాచీన యోగ్యునికి చెప్పిన ఉపదేశం**

**స యఏషోఽన్తర్హృదయ ఆకాశః । తస్మిన్నయం పురుషోమనోమయః । అమృతో హిరణ్మయః । అంతరేణ తాలుకేఽయ ఏషస్తనఇవావలంబతే । సేంద్ర యోనిః । యత్రాసౌ కేశాన్తో వివర్తతే । వ్యపోహ్య శీర్షకపాలే భూరిత్యగ్నౌ ప్రతితిష్ఠతి । భువ ఇతి వాయౌ । సువరిత్యాదిత్యే । మహ ఇతి బ్రహ్మణి ఆప్నోతి స్వారాజ్యమ్ । ఆప్నోతి మనస స్పతిమ్ । వాక్పతిశ్చక్షుష్పతిః । శ్రోత్ర పతిర్విజ్ఞానపతిః । ఏతత్తతో**

**భవతి। ఆకాశ శరీరం బ్రహ్మ । సత్యాత్మ ప్రాణారామం మన ఆనన్దమ్ । శాన్తి సమృద్ధ మమృతమ్ । ఇతి ప్రాచీన యోగ్యోపాస్వ ।** (ఇతి షష్ఠోఽను వాకః)

సః - యః - ఏషః - అన్తర్ - హృదయః - ఆకాశః - తస్మిన్ - అయం - పురుషః - మనోమయః - అమృతః - హిరణ్మయః - అంతరేణ - తాలుకే - యః - ఏషః - స్తన - ఇవ - అవలంబతే - సా - ఇంద్రయోనిః - యత్ర - అసౌ - కేశాన్తః - వివర్తతే - వ్యపోహ్య - శీర్షకపాలే - భూః - ఇతి - అగ్నౌ - ప్రతితిష్ఠతి - భువః - ఇతి - వాయౌ - సువః - ఇతి - ఆదిత్యే - మహః - ఇతి - బ్రహ్మణి - ఆప్నోతి - స్వారాజ్యమ్ - ఆప్నోతి - మనసస్పతిమ్ - వాక్పతిః - చక్షుష్పతిః - శ్రోత్రపతిః - విజ్ఞానపతిః - ఏతత్ - తతః - భవతి - ఆకాశశరీరం - బ్రహ్మ - సత్యాత్మ - ప్రాణారామం - మనః - ఆనన్దమ్ - శాంతి - సమృద్ధమ్ - అమృతమ్ - ఇతి - ప్రాచీనయోగ్య - ఉపాస్వ.

| | | |
|---|---|---|
| యః | = | ఎవడు చందసామృషభో విశ్వరూపః అని (4వ అనువాకంలో) కీర్తింపబడినాడో |
| సః | = | ఆ బ్రహ్మ |
| ఏషః+అన్తర్+ హృదయః+ఆకాశః | = | ఈ హృదయ ఆకాశము లోపల గలదు |
| తస్మిన్ | = | అందులో - ఆ హృదయ ఆకాశంలో గల (ఇతడు) |
| అయం+పురుషః | = | ఈ పురుషుడు - ఈ దేహమందు గల ఆత్మ |
| మనోమయః | = | మనోమయుడు. |
| అమృతః | = | అమృతుడు, కాలాతీతుడు కావున అమృతుడు. శాశ్వతుడు. |
| హిరణ్మయః | = | జ్యోతిర్మయుడు. |

ఆత్మ (బ్రహ్మ) పురుషుడు. మనో మయుడు. అమృతుడు. జ్యోతిర్మయుడు, విశ్వరూపుడు, వేదవేద్యుడు.

**బ్రహ్మలో ఏకీభూతుడగుట**

| | | |
|---|---|---|
| అంతరేణ+తాలుకే | = | అంగిలి మధ్యలో |
| యః | = | ఏది |
| స్తన+ఇవ+అవలంబతే | = | కొండ నాలుక- స్తనమువలె క్రిందకి వ్రేలాడుచున్నదో |
| ఏషః | = | అది |
| సా+ఇంద్రయోనిః | = | ఇంద్రమార్గము. సుషుమ్నానాడి మరల యిక్కడ కనిపించును. ఆ సుషుమ్నానాడిలో మరల ప్రవేశించి |
| యత్ర | = | ఎక్కడ అనగా ఆ ఇంద్రమార్గము ద్వారా ప్రాణములను భ్రూమధ్యమునకు చేర్చి ఆపై |
| అసౌ+కేశాంతః | = | ఈ తలమీద వెంట్రుకలు గల భాగమయిన మాడును |
| వివర్తతే+శీర్షకపాలే | = | ప్రవేశించి ఆ మాడును |
| వ్యపోహ్య | = | పగులగొట్టి బ్రహ్మరంధ్రముచించి బ్రహ్మమందు కలియును. ఇటుల దేహత్యాగము చేసినవాడు మరల జన్మపరంపరలకు రాడు. |

రాజు తన శత్రువులను పూర్తిగా నిర్మూలించిన గాని అతని రాజ్యాధికారము సుస్థిరము కాదు. లేనిచో శత్రువులు పెచ్చు పెరిగి రాజు భ్రష్టుడై బందీ అగును. దేహము ఒక సామ్రాజ్యము. జీవుడు యువరాజు. ఇంద్రియములు, మనస్సు, అరిషడ్వర్గములు శత్రువులు. ఈ శత్రువులను జయించి రాజ్యాధికారమును సుస్థిరము చేసుకోవలయును. ఇంద్రియాది వర్గములపై అదుపు సాధించు స్థాయిని యువరాజ్య పట్టాభిషేకమనియు, ఇంద్రియాది అరిషడ్వర్గములనే వైరులను పూర్తిగా జయించిన స్థాయిని సామ్రాజ్య పట్టాభిషేకమనియు అందురు. రాముడు, అరణ్యవాసము చేసి ఇంద్రియాది అరిషడ్వర్గములనే రాక్షసులను సంహరించి, జీవత్వమనే రావణుని సంహరించి తను బ్రహ్మయై సామ్రాజ్య పట్టాభిషిక్తుడయినాడు. ఎటుల సామ్రాజ్య పట్టాభిషిక్తుడగుటయో వివరించినది రామాయణము. అది దశరథ

రాముని యొక్క కథయే కాదు. అది సాధకులందఱు సాధన చేయవలసిన విధివిధానము, ఆ సాధనలో వచ్చు అంతరాయములను వివరించిన కథ. కావున రామాయణంలోని సాధన రహస్యములను గ్రహించి ఆచరించుటయే రామాయణ పారాయణ.

ఎటుల సామ్రాజ్య పట్టాభిషేకుడగుటయో వివరించినది భారతము. ఇలా వైరివీరులను సంహరింపక యువరాజ పట్టాభిషేకము పొందినను దేహ సామ్రాజ్యముపై ఆధిపత్యము గలుగదు సరిగదా రాజ్యభ్రష్టుడగును. **రాముని రాజ్యభ్రష్టుడు గాకుండా కాపాడినది కైక.** అలాగ కాపాడు వాళ్ళు లేక ధర్మరాజు యువరాజు పట్టాభిషేకమును పొంది కౌరవులను నిర్మూలింపక రాజ్య భ్రష్టుడయినాడు. అరణ్యావాస అజ్ఞాతవాసములను చేసి ఆ తర్వాత యుద్ధములో కౌరవులను సంహరించి మరల సామ్రాజ్య పట్టాభిషిక్తుడయినాడు.

ఈ మంత్రమునకు విపుల వ్యాఖ్యానము రాముడు, ధర్మరాజుల కథగా రామాయణ-భారతములలో ఋషులు వివరించినారు.

| | | |
|---|---|---|
| భూః+ఇతి | = | భూ అనునది |
| అగ్నౌ | = | అగ్ని యందు |
| భువః+ఇతి | = | భువః అనునది |
| వాయౌ | = | వాయువు నందును |
| సువః+ఇతి | = | సువః అనునది |
| ఆదిత్యే | = | ఆదిత్యుని యందును |
| మహః+ఇతి | = | మహ అనునది |
| బ్రహ్మణి | = | బ్రహ్మము నందును |
| ప్రతి తిష్టతి | = | ప్రతిష్ఠింప బడి ఉన్నది. భూతత్త్వము మొదలయిన తత్త్వములను లయింప చేయవలయును. అప్పుడు |
| స్వారాజ్యమ్+ఆప్నోతి | = | బంధవిముక్తి గలుగును |

| | | |
|---|---|---|
| మనసస్పతిమ్ | = | మనస్సుపై ఆధిపత్యమును |
| వాక్పతిః | = | వాక్కుపై ఆధిపత్యమును |
| చక్షుష్పతిః | = | నేత్రములపై ఆధిపత్యమును |
| శ్రోత్రపతిః | = | చెవులపై ఆధిపత్యమును |
| విజ్ఞానపతిః | = | విజ్ఞానముపై ఆధిపత్యమును |
| ఆప్నోతి | = | పొందు చున్నాడు. దేహ సామ్రాజ్యముపై ఆధిపపత్యము కలుగును. |

అనగా తన శరీరమందలి జ్ఞానేంద్రియ, కర్మేంద్రియ, మనఃప్రాణములపై-సర్వముపై ఆధిపత్యము సర్వాధిపత్యము పొందుచున్నాడు. దీనినే కథాపరంగా చెప్పిన సామ్రాజ్యపట్టాభిషిక్తుడయినట్లు పురాణములలో వర్ణించుతారు. జీవన్ముక్తుడై దేహ త్యాగానంతరము

| | | |
|---|---|---|
| ఏతత్ | = | ఈ విధముగా సామ్రాజ్య పట్టాభిషిక్తుడై |
| తతః | = | ఆ తర్వాత |
| ఆకాశ శరీరం | = | సర్వ వ్యాపకత్వము గలవాడై విదేహస్థితిని పొంది దేహ లక్షణములను వీడి |
| సత్యాత్మా | = | సత్య స్వరూప మైనట్టిదియు |
| ప్రాణారామం | = | తోటలో ఒకవ్యక్తి విహరించునట్లు పంచప్రాణములు బ్రహ్మ అయిన ఆ వ్యక్తిలో విహరించును. అటుల విహరించునట్టిదియు |
| మనః+ఆనందమ్ | = | ఆనందమయ మనస్సు గలట్టియు |
| శాంతి సమృద్ధం | = | శాంతి స్వరూప మైనట్టిదియు |
| అమృతమ్ | = | అమృతస్వరూపమైనట్టిదియు అగు |
| బ్రహ్మ + భవతి | = | బ్రహ్మ అగుచున్నాడు |
| ప్రాచీనయోగ్య | = | కావున ఓ ప్రాచీన యోగ్యుడా |

| | | |
|---|---|---|
| ఉపాస్వ+ఇతి | = | ఇంత వఱకు నీకు చెప్పిన పద్ధతుల ద్వారా బ్రహ్మను ఉపాసించుము. ఆ ఉపాసన ద్వారా బ్రహ్మవగుము. ఇది నా ఉపదేశము శీక్షావ్యాఖ్యాస్యామః - అని చెప్పిన యోగ ఆచరణ పద్ధతులను వివరించినాడు మఱియు సాంఖ్య పద్ధతిని రాబోవు మంత్రములో వివరించుచున్నాడు. |

*****

సృష్టివిచారణ

**పృథివ్యంతరిక్షం ద్యౌర్దిశోఽవాంతర దిశాః । అగ్నిర్వాయు రాదిత్య శ్చన్ద్రమా నక్షత్రాణి । ఆప ఓషధయో వనస్పతయ ఆకాశ ఆత్మా। ఇత్యధి భూతమ్ అథాధ్యాత్మమ్ । ప్రాణో వ్యానోఽపాన ఉదాన స్సమానః చక్షు శ్శ్రోత్రం మనో వాక్ త్వక్ । చర్మ మాగ్ంం సగ్గ్ం స్నావాస్థి మజ్జా । ఏత దధి విధాయ ఋషి రహోచత్ పాక్తం వా ఇదగ్ం సర్వమ్ । పాంక్తేనైవ పాంక్త్గ్ం స్పృణోతీతి** (ఇతి సప్తమోఽను వాకః)

పృథివీ - అంతరిక్షం - ద్యౌః -దిశః - అవాంతరదిశాః - అగ్నిః - వాయుః - ఆదిత్యః - చంద్రమాః - నక్షత్రాణి - ఆపః - ఓషధయః - వనస్పతయః - ఆకాశః - ఆత్మా - ఇతి - అధిభూతమ్ - అథ - అధ్యాత్మమ్ - ప్రాణః -వ్యానః - అపానః - ఉదానః - సమానః - చక్షుః - శ్రోత్రం - మనః - వాక్ - త్వక్ - చర్మ - మాంసం - స్నావా - అస్థి - మజ్జా - ఏతత్ - అధివిధాయ - ఋషిః - అవోచత్ - పాక్తం - వా - ఇదగ్ం - సర్వమ్ -పాంక్తేన - ఏవ - పాంక్త్గ్ం - స్పృణోతి - ఇతి.

స్థూల శరీరమునకు సంబంధించినవి:

**జ్ఞానేంద్రియ పంచకము:-**

| | | |
|---|---|---|
| శ్రోత్రం | = | చెవులు |
| త్వక్ | = | చర్మము |

చక్షుః = నేత్రములు నాలుక, ముక్కు

మనః = మనస్సు వీటిని ఇంద్రియార్థములపై ప్రసరించకుండ నిగ్రహించవలయును.

**కర్మేంద్రియ పంచకము:-**

వాక్(వాక్కు)నోరు, చేతులు, పాదములు, గుహ్యము, గుదము- వీటిని పుణ్యకర్మానుష్ఠానము చేసి పునీతము గావించవలయును

**ధాతు పంచకము:-**

చర్మ = చర్మము

మాంసం = మాంసం

స్నావా = నరములు

అస్థి = ఎముకలు

మజ్జా = కొవ్వు - స్థూలశరీరమునకు సంబంధించినవి శరీరమును పరిశుద్ధముగా ఉంచవలయును

**ఓషధి పంచకము:-**

వనస్పతయః = వనస్పతులు (మఱ్ఱి, రావి, పనస, మేడి)

ఓషధయః = ఓషధులు

అధిభూతమ్+ఇతి = ఇవి అధి భూతముగా చెప్పబడును.

అథ = ఆ తర్వాత

అధి దైవికముల గుఱించి వివరించుచున్నాను.

**ప్రాణపంచకము:-**

ప్రాణః = ప్రాణము

అపానః = అపానము

సమానః = సమానము

వ్యానః = వ్యానము

ఉదానః = ఉదానము - పంచప్రాణములను స్వాధీనపఱచుకొనవలయును

**భూత పంచకము:-**

పృథివీ = భూమి

ఆపః = జలము

అగ్నిః = అగ్ని

వాయుః = వాయువు

ఆకాశః = ఆకాశము-వీటివలన స్థూలదేహము ఏర్పడును. స్థూలదేహము నశించును అని గ్రహించవలయును.

**దిశా పంచకము:-**

భూమి

అంతరిక్షం = అంతరిక్షము

దిశః = దిశలు

అవాంతరదిశః = మూలలు

ద్యౌః = ద్యులోకము (బ్రహ్మలోకము) - సర్వము విరాట్ దేహము అని ఆత్మ సర్వవ్యాపకము అని గ్రహించవలయును

**జ్యోతి పంచకము:-**

అగ్ని

ఆదిత్యః = సూర్యుడు

చంద్రమాః = చంద్రుడు

నక్షత్రాణి = నక్షత్రములు

ఆత్మా = స్వయం జ్యోతియైన ఆత్మ - అధిభౌతికమయిన జ్యోతులను దర్శించి, అధ్యాత్మమయిన ఆత్మ జ్యోతిని దర్శించవలయును.

| | | |
|---|---|---|
| **అధ్యాత్మ పంచకము:-** | | పురుషుడు, విరాట్‌పురుషుడు, అధిభూతం, అధిదైవం, అధియజ్ఞము |
| అధ్యాత్మమ్ | = | అధ్యాత్మముగా చెప్పబడును |
| ఏతత్ | = | ఈ విధముగా |
| ఋషిః | = | ఒక ఋషి |
| అధివిధాయ | = | ఏర్పఱచి |
| అవోచత్ | = | ఐదేసి, ఐదేసి వాటిని ఒక జట్టుగా ఏర్పఱచి చెప్పెను. |
| ఇదగ్ం+సర్వం | = | ఈ సర్వము |
| పాంక్తం+వా | = | ఐదు భాగములే |
| పాంక్తేన+ఏవ | = | ఐదు భాగములుగానే అనగా |
| పాంక్తగ్ం | = | ఐదు భాగములుగా సృష్టి |
| స్పృణోతి+ఇతి | = | విభజింపబడుచున్నది. |

(వైదిక ఛందస్సులలో పాంక్తం అనే పేరు గల చంధస్సు ఐదు పాదములు కలది. కావున ఐదు భాగములు అనుటకు పాంక్తం అని వాడబడినది.) ఈ విధముగా అధి భౌతిక, అధి దైవిక, అధ్యాత్మములను గ్రహించి బ్రహ్మయై విరాజిల్ల వలయును.

ఇందు సాంఖ్య పద్ధతి వివరింపబడినది. ఉపాధి లక్షణములను అనగా స్థూల దేహమునందలి ధాతువులను, జ్ఞానేంద్రియ కర్మేంద్రియములను సూక్ష్మ శరీరమందలి అంతఃకరణ చతుష్టయములు, ప్రాణములను, వాటి వాటి వ్యాపారములను గ్రహించ వలయును. సృష్టి గుఱించి గ్రహించ వలయును. ఆపై ఉపాధి లక్షణములను పొందక తను ఆత్మ అని గ్రహించి ద్వందాతీతుడై ఆత్మాను సంధానము చేసి అహం బ్రహ్మ అస్మి అని స్వానుభవమును పొందవలయును. ఇదియే సాంఖ్య పద్ధతి.

*****

పరవిద్యలో సాధన

## సాధన - 1

### ఓం కారమును ఉపాసించవలయును

**ఓ మితి బ్రహ్మ । ఓ మితీదగ్ం సర్వమ్ । ఓ మిత్యేత దనుకృతి హస్మవా అప్యో శ్రావయేత్యా శ్రావయన్తి। ఓ మితి సామాని గాయంతి। ఓగ్ం శోమితి శస్త్రాణి శగ్ం సన్తి । ఓ మిత్యధ్వర్యుః ప్రతిగరం ప్రతి శృణోతి । ఓమితి బ్రహ్మ ప్రసౌతి । ఓ మిత్యగ్ని హోత్ర మను జానాతి। ఓ మితి బ్రాహ్మణః ప్రవక్ష్యన్నాహ బ్రహ్మోపాప్నవానీతి । బ్రహ్మై వో పాప్నోతి ।** (ఇతి అష్టమోఽను వాకః)

ఓమ్ - ఇతి - బ్రహ్మ - ఓమ్ - ఇతి - ఇదగ్ం - సర్వమ్ - ఓమ్ - ఇతి - ఏతత్ - అనుకృతి - హ - స్మ - వా - అపి - ఓశ్రావయ - ఇతి - ఆశ్రావయన్తి - ఓమ్ - ఇతి - సామాని - గాయంతి - ఓం - శోమ్ - ఇతి - శస్త్రాణి - శంసన్తి - ఓమ్ - ఇతి - అధ్వర్యుః - ప్రతిగరం - ప్రతి - శృణోతి - ఓమ్ - ఇతి - బ్రహ్మ - ప్రసౌతి- ఓమ్ - ఇతి - అగ్నిహోత్రమ్ - అనుజానాతి - ఓమ్ - ఇతి - బ్రాహ్మణః - ప్రవక్ష్యన్ - ఆహ - బ్రహ్మ - ఉపాప్నవాన్ - ఇతి - బ్రహ్మ - ఏవ - ఉపాప్నోతి.

| | | |
|---|---|---|
| ఓం+బ్రహ్మ+ఇతి | = | ఓం అను అక్షరమే బ్రహ్మ. కావున |
| ఇదగ్ం+సర్వమ్ | = | ఈ సర్వ చరాచర జగత్తు |
| ఓం +ఇతి | = | ఓం కారమే |
| అనుకృతి | = | యజ్ఞాది వైదిక కార్యక్రమములో సమ్మతి తెలుపు విధానము-సమ్మతి సూచకముగా |
| ఏతత్+ఓమ్+ఇతి | = | ఈ ఓం అనే చెప్పుట |
| హ+స్మ+వా | = | సర్వ విదితము కదా |
| అపి | = | యజ్ఞ సమయములో అధ్వరువు అగ్ని ధ్రునుద్దేశించి హవిస్సులను సమర్పించు సమయము వచ్చినదని |
| ఓ శ్రావయ | = | తెల్పుము అని చెప్పుటకు ఓం |

| | | |
|---|---|---|
| ఆశ్రావయంతి | = | చెప్పుచున్నాడు. |
| ఓమ్+ఇతి | = | ఓం అని పలికి |
| సామాని+గాయంతి | = | సామమములు (సామవేదము) (చదువుదురు) పాడుదురు |
| ఓం+శోమ్+ఇతి | = | ఓం అని పలికియే |
| శస్త్రాణి | = | పాటకు అనువైన ఋక్ మంత్రములు అలా అనువు కానివి శస్త్రములు |
| శంసంతి | = | పఠించుచున్నారు |
| ఓం+ఇతి | = | ఓం అని పలికియే |
| అధ్వర్వుః | = | అధ్వర్వుడు |
| ప్రతిగరం | = | ప్రోత్సాహకర వాక్యములను |
| ప్రతి శృణోతి | = | పలుకు చున్నాడు |
| ఓం+ఇతి | = | ఓం అని పలికియే |
| బ్రహ్మ | = | యజ్ఞము చేయించు ఋత్విక్కులలో ముఖ్యుడు. |
| ప్రసౌతి | = | అనుజ్ఞ యిచ్చుచున్నాడు |
| ఓం+ఇతి | = | ఓం అని పలికియే |
| అగ్నిహోత్రం | = | అగ్నిహోత్రమును చేయుటకు |
| అనుజానాతి | = | అనుమతి యిచ్చుచున్నాడు |
| ఓం+ఇతి | = | ఓం అని |
| బ్రాహ్మణః | = | బ్రహ్మణ్యుడు వేదము |
| ప్రవక్ష్యన్+ఓం+ఇతి | = | చదువుటకు ప్రారంభించి ఓం అని మొదట |
| ఆహ | = | చెప్పును |
| బ్రహ్మ+ఉపాప్నవాన్ +ఇతి | = | ఓంకారో పాసనచే బ్రహ్మను పొందు వాడనగుదును గాక అని |
| బ్రహ్మ+ఏవ | = | ఓంకారోపాసన చేసినవాడు |

ఉపాప్నోతి = బ్రహ్మనే పొందుచున్నాడు

ఎవరు యే దేవతను ఉపాసించునో వాడు ఆ దేవతను పొందును. ఓం బ్రహ్మ గావున అతడు బ్రహ్మను పొందుచున్నాడు.

ఇందు ఓంకారమును ఉపాసించ వలయునని చెప్పబడినది.

*****

**పరవిద్యకు సాధన:**

**సాధన - 2 : స్వాధ్యాయము. సాధన - 3 : సత్యము. సాధన - 4 : తపస్సు.**

**ఋతం చ స్వాధ్యాయ ప్రవచనే చ। సత్యం చ స్వాధ్యాయ ప్రవచనే చ। తపశ్చ స్వాధ్యాయ ప్రవచనే చ। దమశ్చ స్వాధ్యాయ ప్రవచనే చ। శమశ్చ స్వాధ్యాయ ప్రవచనే చ। అగ్నయశ్చ స్వాధ్యాయ ప్రవచనే చ। అగ్నిహోత్రం చ స్వాధ్యాయ ప్రవచనే చ। అతిథియశ్చ స్వాధ్యాయ ప్రవచనే చ। మానుషం చ స్వాధ్యాయ ప్రవచనే చ। ప్రజా చ। స్వాధ్యాయ ప్రవచనే చ। ప్రజనశ్చ స్వాధ్యాయ ప్రవచనే చ। ప్రజాతిశ్చ స్వాధ్యాయ ప్రవచనే చ। సత్యమితి సత్యవచా రాథీతరః। తప ఇతి తపో నిత్యః పౌరుశిష్టిః। స్వాధ్యాయ ప్రవచనే ఏవేతి నాకో మౌద్గల్యః। తద్ధి తపస్తద్ధి తపః** (ఇతి నవమోఽను వాకః)

ఋతం - చ - స్వాధ్యాయ - ప్రవచనే - చ - సత్యం - చ - స్వాధ్యాయ ప్రవచనే - చ - తపః - చ - స్వాధ్యాయ ప్రవచనే - చ - దమః - చ - స్వాధ్యాయ ప్రవచనే - చ - శమః - చ - స్వాధ్యాయ - ప్రవచనే - చ - అగ్నయః - చ - స్వాధ్యాయ - ప్రవచనే - చ - అగ్నిహోత్రం - చ - స్వాధ్యాయ ప్రవచనే - చ - అతిథియః - చ - స్వాధ్యాయ - ప్రవచనే - చ - మానుషం - చ - స్వాధ్యాయ ప్రవచనే - చ - ప్రజాః - చ - స్వాధ్యాయ ప్రవచనే - చ - ప్రజనః - చ - స్వాధ్యాయ ప్రవచనే - చ - ప్రజాపతిః - చ - స్వాధ్యాయ ప్రవచనే - చ - సత్యమ్ - ఇతి - సత్యవచాః - రాథీతరః - తపః - ఇతి - తపోనిత్యః - పౌరుశిష్టిః - స్వాధ్యాయ ప్రవచనే - ఏవ - ఇతి - నాకః - మౌద్గల్య : - తత్ - హి - తపః - తత్ - హి - తపః

సాధన :- నిత్యము స్వాధ్యాయము చేయవలయును

| | | |
|---|---|---|
| ఋతం+చ+స్వాధ్యాయ+ ప్రవచనే+చ | = | ఋతము పాటించుచూ స్వాధ్యాయము, ప్రవచనము చేయవలయును. స్వాధ్యాయము-అనగా వేదాది గ్రంథములు నిత్యము చదువుట. ప్రవచనము-అనగా శిష్యులకు చెప్పుట. స్వాధ్యాయ-ప్రవచనములవలన చదివిన చదువు పూర్తిగా గుర్తుండును. |
| సత్యం+చ+స్వాధ్యాయ ప్రవచనే+చ | = | సత్యము పాటించుచూ స్వాధ్యాయ ప్రవచనములు చేయవలయును |
| తపః+చ+స్వాధ్యాయ ప్రవచనే+చ | = | తపస్సు చేయుచూ స్వాధ్యాయ ప్రవచనములు చేయవలయును |
| దమః+చ+స్వాధ్యాయ ప్రవచనే+చ | = | బాహ్యేంద్రియ నిగ్రహం కలిగి స్వాధ్యాయ ప్రవచనములు చేయవలయును. |
| శమః+చ+స్వాధ్యాయ ప్రవచనే+చ | = | అంతరేంద్రియ నిగ్రహము గలిగి స్వాధ్యాయ ప్రవచనములు చేయవలయును. |
| అగ్నయః+చ+ స్వాధ్యాయప్రవచనే+చ | = | యజ్ఞయాగాది క్రతవులలో అగ్నులను ఆరాధించుచూ స్వాధ్యాయ ప్రవచనములు చేయవలయును. |
| అగ్నిహోత్రం+చ+ స్వాధ్యాయప్రవచనే+చ | = | నిత్యాగ్నిహోత్రం చేయుచూ స్వాధ్యాయ ప్రవచనములు చేయవలయును. |
| అతిథియః+చ+ స్వాధ్యాయప్రవచనే+చ | = | అతిథి, అభ్యాగతులను ఆదరించుచూ స్వాధ్యాయ ప్రవచనములు చేయవలయును. |
| మానుషం+చ+ స్వాధ్యాయప్రవచనే+చ | = | మానవసేవ చేయుచూ, సచ్చరిత్ర గలిగి స్వాధ్యాయ ప్రవచనములు చేయవలయును. |
| ప్రజాః+చ+స్వాధ్యాయ ప్రవచనే+చ | = | సంతానము గుఱించి పట్టించుకొనుచూ స్వాధ్యాయ ప్రవచనములు చేయవలయును. |
| ప్రజనః+చ+స్వాధ్యాయ ప్రవచనే+చ | = | సంసారివై స్వాధ్యాయ ప్రవచనములు చేయవలయును. |

| | | |
|---|---|---|
| ప్రజాతిః+చ+స్వాధ్యాయ ప్రవచనే+చ | = | కొడుకులకు, కూతుళ్ళకు వివాహాది శుభ కార్యక్రమములు చేయుచూ స్వాధ్యాయ ప్రవచనములు చేయవలయును. |
| స్వాధ్యాయప్రవచనే+ఏవ | = | స్వాధ్యాయ ప్రవచనములే సాధనామార్గములు అదే |
| తత్+హి+తపః+తత్+ హి+తపః | = | తపస్సు అని |
| నాకః+మౌద్గల్యః+ఇతి | = | మౌద్గల్యుని కొడుకు - నాకుడు అను ఋషి చెప్పెను |

సాధన :- సత్యము పలుకవలెను.

| | | |
|---|---|---|
| సత్యమ్+ఇతి | = | సత్యమే తపస్సు అని |
| సత్యవచాః+రాథీతరః | = | రాథీతరుని కొడుకు సత్యవచుడు అను ఋషి చెప్పెను |

సాధన :- తపస్సు చేయవలయును

| | | |
|---|---|---|
| తపః+ఇతి | = | తపస్సే చేయవలయునని |
| తపోనిత్యః+పౌరుశిష్ఠిః | = | పౌరుశిష్ఠి కొడుకు తపోనిత్యుడు అను ఋషి చెప్పెను |

వేదకాలములో బ్రహ్మచారి- గృహస్థు - వానప్రస్థు- సన్యాస ఇవి క్రమ పరిణామ ఆశ్రమములు. వేదకాలములో గృహస్థునకే విలువ. వేదములు చదువుట స్వాధ్యాయము. శిష్యులకు వివరించి చెప్పుట ప్రవచనము. వేదాది గ్రంథములు చదువుచూ ఋతం, సత్యం, తపస్సు, దమము, శమము గలిగి అగ్నులను ఆరాధించ వలయును, నిత్యాగ్నిహోత్రము చేయవలయును. అటులనే మానవసేవ, అతిథి, అభ్యాగతులను ఆదరించుట చేయవలయును. వేదాధ్యయన ప్రవచనములలోబడి తన సంసారమును నిర్లక్ష్యము చేయరాదు. బాధ్యతా రాహిత్యము కూడదు. కావున సంసారిగా సంతానం గురించి శ్రద్ధ తీసుకొని, కొడుకులను, కూతుళ్ళల వివాహాది శుభకార్యక్రమములు చేయుచూ సంసారము చేయుచూ స్వాధ్యాయ ప్రవచనములు చేయవలయును. సాధ్యాయమే తపస్సు అని మౌద్గల్యుని కొడుకు నాకుడు అను ఋషి చెప్పెను. సత్యమే తపస్సు అని రాథీతరుని కొడుకు సత్యవచుడు అను ఋషి చెప్పెను. తపస్సే చేయవలయును. అని పౌరుశిష్ఠ కొడుకు తపోనిత్యుడు అను ఋషి చెప్పెను.

*****

బ్రహ్మత్వము పొందిన సాధకుడయిన త్రిశంకుడు స్వానుభవమును ప్రకటించు చున్నాడు.

**అహం వృక్షస్య రేరివా । కీర్తిః పృష్ఠంగిరేరివ । ఊర్ధ్వ పవిత్రో వాజినీవ స్వమృతమస్మి । ద్రవిణగ్ం సవర్చసమ్ । సుమేధా అమృతో౽క్షితః ఇతి త్రిశంకోర్వేదాను వచనమ్ ।**

(ఇతి దశమో౽ను వాకః)

అహం - వృక్షస్య - రేరివా - కీర్తిః - పృష్ఠం - గిరేః - ఇవ - ఊర్ధ్వ - పవిత్రః - వాజినీ - ఇవ - స్వమృతమ్ - అస్మి - ద్రవిణగ్ం - సవర్చసమ్ - సుమేధా - అమృతః - అక్షితః - ఇతి - త్రిశంకోః - వేదానువచనమ్ -

జగత్తు అనే వృక్షము ఆత్మ అనే బీజము వలననే గలిగినది. కావున

| | | |
|---|---|---|
| అహం | = | నేను, ఊర్ధ్వమూలలము అధ శాఖగా గలిగిన |
| వృక్షస్య | = | సంసార లేక జగత్ వృక్షమునకు |
| రేరివా | = | ప్రేరకుడను. ఆత్మ జగత్తు అనే వృక్షమునకు ప్రేరకము. నేను నాది అనే భావనవలన జీవాత్మ వలన సంసార వృక్షము గలిగినది. జీవాత్మకు ప్రేరకుడయిన ఆత్మను నేను. |
| గిరేః+పృష్ఠం+ఇవ | = | పర్వతము యొక్క శిఖరము వలె |
| కీర్తిః | = | నా పేరు ప్రతిష్ఠలు ఉన్నతములు |
| ఊర్ధ్వ+వాజినీ+ఇవ+ పవిత్రః | = | ఊర్ధ్వమున గల సూర్యునివలన పవిత్రుడను. |
| స్వమృతం+అస్మి | = | నేను అమృత స్వరూపుడను. |
| ద్రవిణగ్ం | = | జ్ఞానధనుడను |
| సవర్చసం | = | ప్రకాశవంతమైన వాడను |
| సుమేధా | = | బ్రహ్మ జ్ఞానము గలవాడను. సర్వజ్ఞుడను |
| అక్షితః | = | అవ్యయుడను |
| అమృతః+ఇతి | = | శాశ్వతుడను అని |

త్రిశంకోః+ = ఆత్మ జ్ఞానము పొందిన త్రిశంకుడనే
వేద+అనువచనమ్ ఋషి చెప్పెను.

ఉపాసనలో పరిపూర్ణత గలిగినవాడు ఆత్మ స్వరూపము నెఱిగి ఆత్మయగును. ఆత్మ స్వరూపము పొందిన ప్రతి సాధకుడు త్రిశంకుని అనుభవములనే పొందును.

*****

సాధన

అపర విద్యలోని ధర్మములను బోధించుచున్నాడు.

**వేద మనూచ్యా చార్యోఽన్తే వాసిన మనుశాస్తి।**

**సత్యం వద । ధర్మం చర । స్వాధ్యాయాన్మా ప్రమదః । ఆచార్యాయ ప్రియం ధనమాహృత్య । ప్రజాతం తుం మా వ్యవచ్ఛేత్సీః సత్యాన్న ప్రమది తవ్యమ్ । ధర్మాన్న ప్రమది తవ్యమ్ । కుశలాన్న ప్రమది తవ్యమ్ । భూత్యైన ప్రమది తవ్యమ్ । స్వాధ్యాయ ప్రవచనాభ్యాం న ప్రమది తవ్యమ్। దేవ పితృకార్యాభ్యాం న ప్రమది తవ్యమ్ । మాతృదేవో భవ । పితృదేవోభవ । ఆచార్య దేవోభవ । అతిథి దేవోభవ । యాన్యనవద్యాని కర్మాణి తాని సేవితవ్యాని । నో ఇతరాణి । యాన్యస్మాకగ్ం సుచరితాని । తాని త్వయో పాస్యాని । నో ఇతరాణి । యేకే చాస్మచ్ఛ్రేయాగ్ం సో బ్రాహ్మణాః । తేషాం త్వయాఽఽసనేన ప్రశ్వసితవ్యమ్ । శ్రద్ధయా దేయమ్ । అశ్రద్ధయాఽదేయమ్ । శ్రియాదేయమ్ । హ్రియా దేయమ్ । భియా దేయమ్ । సంవిదా దేయమ్ । అథ యదితే కర్మ విచికిత్సావా వృత్త విచికిత్సా వాస్యాత్ । యే తత్ర బ్రాహ్మణా స్సమ్మర్శిన । యుక్తాఅయుక్తాః అలూక్షా ధర్మ కామాస్స్యుః । యథా తే తత్ర వర్తేరన్ । తథా తత్ర వర్తేథాః । అథా భ్యాఖ్యాతేషు । యే తత్ర బ్రాహ్మణా స్సమ్మర్శినః । యుక్తా అయుక్తా । అలూక్షా ధర్మ కామాస్యుః యథా తే తేషు వర్తేరన్ । తథా తేషు వర్తేథాః । ఏష ఆదేశః ఏష ఉపదేశః । ఏషా వేదోపనిషత్ । ఏతదను శాసనమ్ । ఏవముపాసితవ్యమ్ । ఏవము చైత దుపాస్యమ్ ।**

(ఇతి ఏకాదశోఽను వాకః)

(ఇతి శిక్షావల్లీ)

వేదం- అనూచ్య- ఆచార్యః - అన్తే వాసినః - అనుశాస్తి

| | | |
|---|---|---|
| వేదం | = | వేదమును |
| అనూచ్య | = | బోధించి, పూర్తిగా బోధించి విద్యానంతరము |
| అన్తేవాసినః | = | గురుకులా శ్రమము వదలి యింటికి వెళ్ళు శిష్యునికి |
| ఆచార్యః | = | గురువు యీ విధముగా |
| అనుశాస్తి | = | ఆదేశించుచున్నాడు. ఇది స్నాతకోత్సవము వంటిది. |

సామాన్య ధర్మములు చెప్పుచున్నాడు.

సత్యం - వద- ధర్మం - చర - స్వాధ్యాయాత్ - మా - ప్రమదః

సత్యం+వద = సత్యమును పలుకుము.

సత్యవంతుడవు కమ్ము. అప్పుడు త్రికాల సంధ్యావందనములో గాయత్రి-సావిత్రియై నిన్ను నీ ప్రాణములను యముని నుంచి రక్షించును. సత్యవంతుని ప్రాణము లను యముడు తీసుకొనిపోవుచుండగా సావిత్రి యముని వద్ద నుంచి సత్యవంతుని ప్రాణములను తీసుకొని వచ్చినట్లు భారతములో కథగా వర్ణింప బడినది.

ధర్మం+చర = ధర్మమును ఆచరింపుము.

రామాయణములో రాముడు-రామో విగ్రహవాన్ ధర్మః అని రాముడే ధర్మస్వరూప మని చెప్పినారు. భారతములో ధర్మరాజు ధర్మ దేవత అంశ మఱియు ధర్మదేవత కుమారుడు. ధర్మరాజుకు యమ విశేషణమై యమధర్మరాజు అయినాడు.

| | | |
|---|---|---|
| స్వాధ్యాయాత్ | = | స్వాధ్యాయము వలన అనగా వేద విద్యవలన గ్రహించిన జ్ఞాన మార్గము నుంచి |
| మా+ప్రమదః | = | వైదొలగకుము అనగా జ్ఞానమార్గమును విడవకుము |

ఆచార్యాయ - ప్రియం - ధనమ్ - ఆహృత్య - ప్రజాతంతుమ్ -మా - వ్యవచ్ఛేత్సీః

ఆచార్యాయ = గురువునకు

ప్రియం+ధనం = ప్రియమైన ధనమును
ఆహృత్య = అర్పించుము.

అనగా గురుదక్షిణ యిమ్ము. లౌకికముగా గురుకులా శ్రమము నడుచుటకు ధనము కావలయును గాన, నీవు ధనవంతుడవయినచో గురుకులా శ్రమ నిర్వహణకై కొంత ధనముయిమ్ము. పారలౌకికముగా గురువు వద్ద నేర్చుకున్న జ్ఞానమును స్వానుభవంలో పొంది జీవత్వమును వదలి ఆత్మస్వరూపుడ వగుము. ఇదియే గురుదక్షిణ. అయితే గురుదక్షిణకు సంబంధించిన కథలు పురాణములలో గూఢార్థ ముతో వుండును. అర్జునుడు ద్రుపదుని బంధించి గురువగు ద్రోణునికి గురుదక్షిణ యిచ్చినాడు. శ్రీకృష్ణుడు- తన గురువయిన సాందీపుని కొడుకుని తిరిగి బ్రతికించి గురువునకు గురుదక్షిణగా యిచ్చినాడు. రాముడు శివధనుర్భంగము చేసి సీతను వివాహమాడి విశ్వామిత్రునికి గురుదక్షిణ యిచ్చినాడు. ఇవి అన్నీ బ్రహ్మవిద్యకు సంబంధించిన కథలు.

ప్రజాతంతుమ్ = వంశమును వృద్ధిచేయుము.
మా+వ్యవచ్ఛేత్సీః వంశమును విచ్ఛిన్నము చేయకుము.

గురువు వద్ద వేదమును గ్రహించు కాలములో గురువు పదే పదే సంసారములో చిక్కుకొనక స్వస్వరూప జ్ఞానమును పొందుమని చెప్పును. ఋషులందఱు గృహస్థులే.

సత్యాత్ - న - ప్రమది తవ్యమ్ - ధర్మాత్ - న - ప్రమది - తవ్యమ్ - కుశలాత్ - న - ప్రమది తవ్యమ్ - భూత్యై - న - ప్రమది - తవ్యమ్ - స్వాధ్యాయ ప్రవచనాభ్యాం- న - ప్రమది తవ్యమ్ - దేవపితృకార్యాభ్యాం - న - ప్రమది - తవ్యమ్.

నీవు గృహస్థువు కావలయును. నీవు గృహస్థాశ్రమము స్వీకరించినను

సత్యాత్+న+ప్రమదితవ్యమ్ = సత్యమునుంచి సత్యమార్గమునుంచి వైదొలగ వద్దు.
ధర్మాత్+న+ప్రమదితవ్యమ్ = ధర్మమార్గము నుంచి వైదొలగవద్దు

| | | |
|---|---|---|
| కుశలాత్+న+ప్రమదితవ్యమ్ | = | క్షేమమైన మార్గము నుంచి వైదొలగొద్దు |
| భూత్యై+న+ప్రమదితవ్యమ్ | = | జనన మరణ వలయములో చిక్కు కొనకుండా ఉండుటయే భద్రమైన మార్గము. భద్రమైన మార్గము నుంచి వైదొలగ వద్దు. |
| స్వాధ్యాయ ప్రవచనాభ్యాం+ న+ప్రమదితవ్యమ్ | = | మావలె గృహస్థుడవై, వేదము నిత్యము చదువుచూ శిష్యులకు బోధించ వలయును. ఇటుల చేయకుండా వుండరాదు. |
| దేవపితృకార్యాభ్యాం+ న+ప్రమది తవ్యమ్ | = | దేవతల కొఱకు చేయు యజ్ఞ యాగాది క్రతువులు-(హవ్య) పితృదేవతల కొఱకు చేయు తద్దినాదులు (కవ్యములు) మానరాదు. |

కాశీ వెళ్ళి పిండం పెట్టితిని అనో, బ్రహ్మకపాలంలో పిండం పెట్టితిని అనో యిలా ఏదో వంకతో పితృదేవతలకు తద్దినాదులు పెట్టకుండా ఉండవద్దు. కర్మ విభాగమును శ్రద్ధతో ఆచరించి ఆత్మజ్ఞానమును పొందుము.

మాతృ - దేవోభవ - పితృ - దేవోభవ - ఆచార్య - దేవోభవ - అతిథి - దేవో భవ

| | | |
|---|---|---|
| (మాతృ)-మాతా+దేవోభవ | = | తల్లిని దైవముగా భావింపుము |
| (పితృ)-పితా+దేవోభవ | = | తండ్రిని దైవముగా భావింపుము |
| ఆచార్య+దేవోభవ | = | గురువుని దైవముగా భావింపుము |
| అతిథిః+దేవోభవ | = | అతిథిని దైవముగా భావింపుము |

ఇవి సామాన్య ధర్మములు. తీవ్ర మోక్షేచ్ఛ కలుగువఱకు అపరధర్మములను పాటించ వలయును. తీవ్ర మోక్షేచ్ఛ కలిగినవారు మాత్రమే పర ధర్మములను పాటించ వలయును. కావున కర్మ విభాగములో విధి, నిషేధములను వివరించుట కష్టము. కావున సంగ్రహముగా వాటిని చెప్పుచున్నాము. విశేష ధర్మములను పెద్దల నుంచి వారిని చూచిగ్రహించుము.

యాని - అనవద్యాని - కర్మాణి - తాని - సేవితవ్యాని - న - ఉ - ఇతరాణి - యాని - అస్మాకం - సుచరితాని - తాని - త్వయా - ఉపాస్యాని - న - ఉ - ఇతరాణి.

| | | |
|---|---|---|
| యాని+కర్మాణి | = | ఏ కర్మలు- ఏ పనులు |
| అనవద్యాని | = | పెద్దలచే నిందితములు కావో |
| తాని | = | ఆ కర్మలు - ఆపనులు |
| సేవితవ్యాని | = | ఆచరింపదగినవి |
| న+ఉ+ఇతరాణి | = | ఇతరములకు అనగా పెద్దలచే నిందితము - లయిన కర్మలను ఆచరించవద్దు. నారాయణ కథలవలన నెయ్యే ధర్మంబులు తగులువడవవి నిరర్థకంబులు (ప్రథమస్కంధము -58) |
| యాని | = | ఏ కర్మలు |
| అస్మాకం | = | మా చేత |
| సుచరితాని | = | ఆచరింపబడినవో |
| తాని | = | ఆ పనులు |
| త్వయా | = | నీచేత |
| ఉపాస్యాని | = | చేయదగినవి. ఇంతకాలం మా ఆశ్రమంలో వుండి చూచితివి గదా. మేము చేసిన పనులనే చేయుము. |
| న+ఉ+ఇతరాణి | = | ఇతరములైన మేము చేయని పనులు నీవు చేయకుము |

యేకే - చ - అస్మత్ - శ్రేయాంసః - బ్రహ్మణాః - తేషాం - త్వయా - ఆసనేన - ప్రశ్వసితవ్యమ్.

| | | |
|---|---|---|
| యేకే | = | మా ఆశ్రమమునుంచి వెళ్ళిన తర్వాత నీకు ఎవరయినా |
| చ+అస్మత్ | = | మా వంటివారుగాని లేదా మా కంటె |
| శ్రేయాంసః+బ్రహ్మణాః | = | శ్రేష్ఠులయిన బ్రహ్మవిదులు గాని నీయింటికి వచ్చిన |

| | | |
|---|---|---|
| తేషాం | = | వారికి |
| త్వయా+ఆసనేన | = | నీవు కూర్చుండబెట్టి అర్ఘ్యపాద్యా దులిచ్చి-అతిథి పూజను నీకున్నంతలో |
| ప్రశ్వసితవ్యమ్ | = | గావించవలయును. |

శ్రద్ధయా - దేయమ్ - అశ్రద్ధయా - అదేయమ్ - శ్రియా - దేయమ్ - హ్రియా - దేయమ్ - భియా - దేయమ్ - సంవిదా - దేయమ్.

**దానం యిచ్చునప్పుడు పాటించ వలసిన విధులు చెప్పుచున్నాను.**

| | | |
|---|---|---|
| సంవిదా+దేయమ్ | = | పాత్రత నెఱిగి దానము యివ్వవలయును. |
| శ్రద్ధయా+దేయమ్ | = | శ్రద్ధతో దానము యివ్వవలయును |
| శ్రియా+దేయమ్ | = | ఉన్నంతలో ఎక్కువగా దానము యివ్వవలయును |
| హ్రియా+దేయమ్ | = | వినయముతో దానము యివ్వవలయును |
| భియా+దేయమ్ | = | కరుణతో దానము యివ్వవలయును. |

బలిచక్రవర్తి, వచ్చినవాడు విష్ణువని పాత్రత నెఱిగి, శ్రద్ధతో దానం ఇచ్చినాడు. వామనుడు తనకు మూడు అడుగులు దానమిచ్చిన చాలుననినను మణులో, రత్నములో యింకా ఎక్కువ అడగమని తనకున్నంతలో ఎక్కువగా దానము యివ్వ సంకల్పించినాడు. కాళ్ళు కడిగి వినయముతో కరుణతో దానం ఇచ్చినాడు. భగవంతుడు తనకు ఈ సిరిసంపదలను ఇచ్చినాడు. అతనిచ్చిన సిరిసంపదలలో కొంత మాత్రమే తిరిగి భగవత్ స్వరూపుడయిన వానికి ఇచ్చు చున్నాననే భావన కలుగగానే దాతలో వినయము గలుగును. కరుణ సత్త్వగుణము. సత్త్వగుణ ప్రధానముగా దానం ఇవ్వవలయును. ఇక నిషేధం చెప్పుచున్నాను.

అశ్రద్ధయా+అదేయమ్ = అశ్రద్ధతో దానం ఇవ్వరాదు.

నృగుమహారాజు అశ్రద్ధగా ఒక గోవును బ్రాహ్మణునికి దానం ఇచ్చినందువలన ఊసరవెల్లిగా పుట్టినాడు. అహంకారంతో దానం ఇవ్వరాదు. తమోగుణ ప్రధానము, రజోగుణ ప్రధానముగా దానం ఇవ్వరాదు. అటుల చేసిన దానం వలన సత్ఫలితము కలుగదు.

కర్మవిభాగములోని విధి నిషేధములు చూచి గ్రహించవలయునే గాని వాక్ రూపమున ఎంత బోధించినను అసంపూర్తిగనే యుండును. కావున

అథ - యది - తే - కర్మ విచికిత్సా - వా - వృత్త విచికిత్సా - వా - స్యాత్ - యే - తత్ర - బ్రాహ్మణాః - సంమర్శినః - యుక్తాః - అయుక్తాః - అలూక్షాః - ధర్మకామాస్స్యుః - యథా - తే - తత్ర - వర్తేరన్ - తథా - తత్ర - వర్తేథాః - అథ - అభ్యాఖ్యాతేషు - యే - తత్ర - బ్రాహ్మణాః - సంమర్శిన ః - యుక్తాః - అయుక్తాః - అలూక్షాః - ధర్మకామాస్స్యుః - యథా - తే - తేషు - వర్తేరన్ - తథా - తేషు - వర్తేథాః

వ్యవసాయాత్మక బుద్ధి గల జ్ఞానులు ఆచరించినటుల ఆచరింపుము. జ్ఞానులు ఆచరణ విధానమును అనగా వారు ఆచరించి మనకు బోధింతురు.

| | | |
|---|---|---|
| అథ | = | ఆ తర్వాత, నీవు పుణ్యకర్మలు చేయుచూ |
| యది | = | ఒక వేళ |
| తే | = | నీకు |
| కర్మవిచికిత్సా+వా | = | కర్మ విభాగము గూర్చిన సందేహము, లేక |
| వృత్త విచికిత్సా+వా | = | ఆచార వ్యవహారములను గూర్చిన సందేహము లేక ధర్మము గుఱించిన సందేహము |
| స్యాత్ | = | గలిగినచో |
| యే | = | ఎవరు |
| తత్ర | = | అక్కడ |
| బ్రాహ్మణాః | = | వేదవిదులు |
| సంమర్శినః | = | వివేకశీలురు |
| యుక్తాః | = | ధర్మపరులు |
| అయుక్తాః | = | స్వతంత్రులు అనగా ఒక రాజు ఆధీనములో ఉండి పడుపు కూడు భుజించు వారు గాక ఆత్మాన్వేషణ చేయుచున్నవారు. |

| | | |
|---|---|---|
| అలూక్షాః | = | క్రూరులుగాక సత్త్వగుణసంపన్నులు |
| ధర్మకామాస్యుః | = | ధర్మయుతమైన జీవితమును గడపువారు |
| తే | = | వారు |
| యథా+తత్ర+వర్తేరన్ | = | అచ్చట ఏ విధముగా ప్రవర్తింతురో |
| తథా | = | ఆ విధముగా |
| తత్ర | = | అక్కడ |
| వర్తేథాః | = | ప్రవర్తించుము |
| అథ | = | ఆ తర్వాత |
| అభ్యాఖ్యాతేషు | = | సమాజములో నిందితులుగా గుర్తింపబడిన వారి యందు. అనగా దుర్మార్గులయందు |
| యే+తత్ర+ | = | పై చెప్పిన లక్షణములు గల వారు ఆ |
| బ్రాహ్మణాః | | నిందితులయందు ఏ విధముగా ప్రవర్తింతురో |
| సంమర్శినః | = | నీవును ఆ విధముగా ప్రవర్తింపుము. |
| యుక్తాః+ | = | అనగా దుర్మార్గులతో చెలిమి చేయకుము. |
| అయుక్తాః+అలూక్షాః+ | | ఇదే విషయమును నొక్కి వక్కాణించినాడు |
| ధర్మకామాస్యుః+ | | |
| యథా+తే+తేషు+వర్తేరన్+ | | |
| తథా+తేషు+వర్తేథాః | | |

ఏషః - ఆదేశః - ఏషః - ఉపదేశః - ఏషా - వేద - ఉపనిషత్ - ఏతత్ - అనుశాసనమ్- ఏవం - ఉపాసితవ్యమ్ - ఏవమ్ - ఉ - చ - ఏతత్ - ఉపాస్యం

| | | |
|---|---|---|
| ఏషః+ఆదేశః | = | ఇంతవఱకు చెప్పిన ఆచరణ పద్ధతులను నీవు పాటించవలయును. ఇది మా ఆదేశము |
| ఏషః+ఉపదేశః | = | ఇదే మా ఉపదేశము |

| | | |
|---|---|---|
| ఏషా+వేద+ ఉపనిషత్ | = | ఇదే వేదసారము |
| ఏతత్+అనుశాసనం | = | ఇదే అనుశాసనం. తప్పనిసరిగా పాటించవలయును. |
| ఏవం+ఉపాసితవ్యమ్ | = | ఈ విధముగా ఆచరింపవలయును. |
| ఏవం+ఉ+చ+ ఏతత్+ఉపాస్యం | = | ఈ విధముగా, ఈ ప్రకారముగానే ఆచరింపవలయును. |

*****

**హరిః ఓం । శం నో మిత్రః శం వరుణః । శం నో భవత్వర్యమా శం న ఇంద్రో బృహస్పతిః । శంనో విష్ణు రురుక్రమః । నమో బ్రహ్మణే । నమస్తే వాయో । త్వమేవ ప్రత్యక్షం బ్రహ్మాసి । త్వా మేవ ప్రత్యక్షం బ్రహ్మ వదిష్యామి । ఋతం వదిష్యామి । సత్యం వదిష్యామి । తన్మామవతు । తద్వక్తార మవతు । అవతుమామ్ । అవతు వక్తారమ్**

ఓం శాంతిః శాంతిః శాంతిః

*****

# బ్రహ్మావల్లీ (ఆనందవల్లీ)

### గురు శిష్యుల ప్రార్థన

**ఓం సహ నా వవతు । సహ నౌ భునక్తు । సహ వీర్యం కరవావహై । తేజస్వినా వధీత మస్తు మా విద్విషా వహై ।**

**ఓం శాంతిః శాంతిః శాంతిః**

సహ - నౌ - అవతు - సహ -నౌ - భునక్తు - సహ - వీర్యం - కరవావహై - తేజస్వి - నౌ - అధీతమ్ - అస్తు - మా - విద్విషావహై.

| | | |
|---|---|---|
| నౌ+ సహ | = | గురుశిష్యులమయిన మా యిద్దఱను కూడ |
| అవతు | = | బ్రహ్మము కాపాడుగాక. సాధనలో త్రివిధ దుఃఖములు గలుగవచ్చును. లేదా సాధన వక్ర మార్గంలో బడి లక్ష్యమును చేరలేక సాధన పతనము కావచ్చును. అలా సాధన పతనము గాకుండా, త్రివిధ దుఃఖములు గలుగకుండా మమ్ములను బ్రహ్మము కాపాడుగాక. |
| నౌ+సహ | = | మమ్ములను |
| భునక్తు | = | బ్రహ్మము పోషించుగాక. |

సర్వజీవరాసుల పోషణ భారము వహించు బ్రహ్మము మమ్ములను కూడ పోషించుటతో పాటు బ్రహ్మజిజ్ఞాసను కూడ పోషించి లక్ష్యమును మమ్ములను చేర్చుగాక.

వీర్యం+సహ+కరవావహై = మేమిరువురము కూడ బలమును పొందుదుముగాక. దైవబలము, శారీరక బలమును కూడ పొందుదుముగాక. శరీరము అనారోగ్యముగా వుండి, బలహీనమయినచోసాధనకు అంతరాయ మేర్పడును. కావున శారీరకబలము అవసరము. ఒక్క శారీరక బలమున్న అదిపశుబలమగును. అటులగాక దైవబలము,బ్రహ్మ జ్ఞానము వలన గలుగు దైవబలమును కూడ పొందుదుముగాక.

నౌ = మేమిరువురము

అధీతం = నేర్వబడిన విద్య వలన బ్రహ్మజ్ఞానము వలన

తేజస్వి+అస్తు = మేమిద్దఱము తేజోవంతులము అగుదుము గాక.

మా+విద్విషావహై = ఎప్పుడు కూడ మేము ఒకరినొకరము ద్వేషించ కుండా వుందుము గాక. శిష్యునిలోనూ, గురువు లోనూ ఒకానొక సమయములో పరస్పర అవగాహన లోపించటం జరగవచ్చు. పరస్పర అవగాహన లోపము వలన ద్వేషం గలుగును. కావున మాలో పరస్పర అవగాహన లోపము గలుగకుండా వుండుగాక.

ఆనందవల్లి శాస్త్ర పాఠమును, భృగువల్లి ఆచరణ విధానమును బోధించును.

బ్రహ్మము అధిభౌతికముగా అన్నము. అధి దైవికముగా ప్రాణము. అధ్యాత్మముగా ఆత్మ లేక ఆదిత్యుడు. శరీరమందలి హృదయ గుహ ఆత్మ యొక్క స్థానము.

స్థూలశరీరము, సూక్ష్మ శరీరములనే రెండింటిని జీవాత్మ ఆశ్రయించి దేహముతో మమేకము అయి ఉండును. ఈ స్థూల శరీరమునే అన్నమయ కోశము అని, సూక్ష్మ శరీరమునే ప్రాణమయ కోశము, మనోమయ కోశము, విజ్ఞానమయ కోశము, ఆనందమయ కోశములుగా ఇందు వర్ణింపబడినది. సాధన ద్వారా జీవాత్మను దేహధ్యాస నుంచి వేఱు చేసి హృదయ గుహలోగల ఆత్మను దర్శించి జీవన్ముక్తుడై దేహత్యాగానంతరము బ్రహ్మమందు కలియవలయునని ఆనందవల్లి, భృగువల్లి యందు వివరింపబడినది. దీనిని వరుణుడు తన కుమారుడైన భృగువునకు విశదీకరించెను.

**ఓం శాంతిః శాంతిః శాంతి**

ఇది శాంతి పాఠము.

*****

## బ్రహ్మ గురించి

**ఓం॥ బ్రహ్మ విదాప్నోతి పరమ్ । తదేషాఽభ్యుక్తా । సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ । యో వేద నిహితం గుహాయాం పరమే వ్యోమన్ । సోఽశ్నుతే సర్వాన్ కామాన్సహ । బ్రహ్మణా విపశ్చితేతి । తస్మాద్వా ఏతస్మాదాత్మన ఆకాశః సంభూతః । ఆకాశా ద్వాయుః । వాయో రగ్నిః । అగ్నే రాపః । అద్భ్యః పృథివీ । పృథివ్యా ఓషధయః । ఓషధీభ్యోఽన్నమ్ । అన్నాత్ పురుషః । స వా ఏష పురుషోఽన్నరసమయః । తస్యేద మేవ శిరః । అయం దక్షిణః పక్షః । అయ ముత్తరః పక్షః । అయమాత్మా । ఇదం పుచ్ఛం ప్రతిష్ఠా । తదప్యేష శ్లోకో భవతి ।** (ఇతి ప్రథమోఽను వాకః)

ఓం - బ్రహ్మవిత్ - ఆప్నోతి - పరమ్ - తత్ - ఏషా - అభ్యుక్తా - సత్యం - జ్ఞానం - అనంతం - బ్రహ్మ - యః - వేద - నిహితం - గుహాయాం - పరమే - వ్యోమన్ - సః - అశ్నుతే - సర్వాన్ - కామాన్ - సహ - బ్రహ్మణా - విపశ్చితా - ఇతి - తస్మాత్ - వా - ఏతస్మాత్ - ఆత్మనః - ఆకాశః - సంభూతః - ఆకాశాత్ - వాయుః - వాయోః - అగ్నిః - అగ్నేః - ఆపః - అద్భ్యః - పృథివీ - పృథివ్యాః - ఓషధయః - ఓషదీభ్యః - అన్నమ్ - అన్నాత్ - పురుషః - సః - వా - ఏషః - పురుషః - అన్నరసమయః - తస్య - ఇదమ్ - ఏవ - శిరః - అయం - దక్షిణః - పక్షః - అయమ్ - ఉత్తరః - పక్షః - అయమ్ - ఆత్మా- ఇదం - పుచ్ఛం - ప్రతిష్ఠా- తత్ - అపి - ఏషః - శ్లోకః - భవతి.

## బ్రహ్మ విచారణ

ఓం

| | | |
|---|---|---|
| బ్రహ్మవిత్ | = | బ్రహ్మను తెలుసుకున్నవాడు |
| పరం+ఆప్నోతి | = | సర్వోత్కృష్ట స్థానమును పొందును |
| తత్+ఏషా+అభ్యుక్తా | = | ఆ బ్రహ్మము గురించి ఆ విధముగా చెప్పబడినది. ఇందు బ్రహ్మవిచారణ చేయబడినది. బ్రహ్మ యొక్క లక్షణములు ఎట్టివి? అది దేహములో ఎచ్చట ఉన్నది? బ్రహ్మను తెలుసుకొనుటవలన గలుగు ఫలితము ఏమిటి ? అని బ్రహ్మవిచారణ చేయబడినది |

| | | |
|---|---|---|
| బ్రహ్మ | = | బ్రహ్మ |
| సత్యం+జ్ఞానం+ అనంతం | = | సత్యస్వరూపము. జ్ఞాన స్వరూపము. అంతము లేనిది అనగా ఆదిమధ్యాంత రహితము. |
| పరమే+వ్యోమన్+ గుహాయాం+నిహితం | = | హృదయగుహలో గల పరమాకాశమందు ఉన్నటువంటి |
| యః+వేద | = | బ్రహ్మను ఎవడు స్వానుభవంలో దర్శించునో, తెలుసుకొనునో |
| సః | = | అతడు |
| సర్వాన్+కామాన్+అశ్నుతే | = | సర్వ కోరికలను పొందును. మఱియు |
| బ్రహ్మణా+సహ+ విపశ్చితా+ఇతి | = | బ్రహ్మముతో కూడ కలసియుండి అమృతత్త్వమును పొందును. |

బ్రహ్మవిచారణ చేసిన తర్వాత ఇక మీదట సృష్టివిచారణ చేయుచున్నాడు. శరీర నిర్మాణమునకు అవసరమయిన ఈ పంచభూతములు ఎట్లు వచ్చినవి ? అన్నము ఎట్లు గలిగినది ? పురుషుడు (జీవుడు) - పురుషుడు (ఆత్మ) యేయే కోశములలో గలరు ?

**సృష్టి విచారణ**

| | | |
|---|---|---|
| తస్మాత్+ఏతస్మాత్+ ఆత్మనః+వా | = | సృష్టికి పూర్వము ఆత్మ తప్ప మఱి యితరమేదియు లేదు. |

ఆత్మ సృష్టి చేయవలయునని సంకల్పించినది. ఈశ్వరాధిష్ఠితంబైన ప్రకృతి అంశంబున మహత్ గలిగినది. మహత్ అంశమున అహంకారము గలిగినది. అహంకారము సత్వ, రజో, తమో విధములని మూడు విధములుగా భాసిల్లినది. సత్వ అహంకారము నుంచి యింద్రియాధిష్ఠాన దేవతలు, మనసు; రజో అహంకారము నుండి ఇంద్రియములు, ప్రాణము, బుద్ధి గలిగినవి. తమో అహంకారమునుంచి శబ్ద తన్మాత్ర గలిగినది. దాని నుంచి

| | | |
|---|---|---|
| ఆకాశః+సంభూతః | = | ఆకాశము గలిగినది |
| ఆకాశాత్ | = | ఆకాశము వలన స్పర్శ తన్మాత్ర గలిగినది. ఆ స్పర్శ తన్మాత్ర వలన |
| వాయుః | = | వాయువు గలిగినది |
| వాయోః | = | వాయువు వలన రూప తన్మాత్ర గలిగినది. ఆ రూప తన్మాత్ర వలన |
| అగ్నిః | = | అగ్ని గలిగినది |
| అగ్నేః | = | అగ్ని నుంచి రసతన్మాత్ర గలిగినది. ఆ రసతన్మాత్ర వలన |
| ఆపః | = | జలము గలిగినది |
| అద్భ్యః | = | జలము నుంచి గంధతన్మాత్ర గలిగినది. ఆ గంధ తన్మాత్ర వలన |
| పృథివీ | = | భూమి గలిగినది |
| పృథివ్యాః | = | భూమి వలన |
| ఓషధయః | = | శరీరమునకు బలము కలిగించునవి (ఆరోగ్యము కలిగించునవి) వనస్పతులు, ఓషధులు కలిగినవి. |
| ఓషదీభ్యః+అన్నమ్ | = | ఓషధుల వలన అన్నము గలిగినది. (మనము తిను శాఖాహారములోని అన్ని దినుసులు ఓషధులే. వరి-చోడి - యవ - గోధుమ - మిరియాలు - ధనియాలు వగైరాలు. కొన్ని ఓషధులు, ఆహారము గానూ కొన్ని ఆరోగ్యమునకు గానూ ఉపకరించు చున్నవి.) |
| అన్నాత్ | = | అన్నము వలన వీర్యము గలిగినది. |

అది స్త్రీ యోనియందు శుక్లశోణితములతో కలసి పిండ మేర్పడి స్థూల శరీరము, తల, పాదములు, చేతులు వగైరాలతో, స్త్రీ పురుష అవయవ బేధముతో గలిగినది. ఆ స్త్రీ, పురుష విభాగముగా ఏర్పడిన శరీరములోనికి

| | | |
|---|---|---|
| పురుషః | = | జీవుడు పూర్వజన్మకర్మానుసారము ప్రవేశించినాడు. |

స్థూలశరీరమునకే లింగ బేధముగాని లింగశరీరమునకు స్త్రీ, పురుష బేధము లేదు. జీవునకు స్త్రీ, పురుష బేధముండదు. పురుషుడు అనగా దేహమును పురమందురు. ఆ పురమందు గల జీవునిని జీవ పరముగా చెప్పునప్పుడు మగవాళ్ళను ఆడవాళ్ళను కూడ పురుషుడు అనియే వ్యవహరింతురు పురుషుడు దేనినుంచి పుట్టడు.

**దేహ విచారణ చేయుచున్నాడు**

| | | |
|---|---|---|
| సః+వా | = | సృష్టి ప్రారంభములో గల ఆత్మయే |
| ఏషః+పురుషః | = | హృదయగుహలో గల పురుషుడు. శరీరాభిమానియై జీవ పురుషుడుగా ఉన్నవాడు కూడ అతడే. |
| అన్న రసమయః | = | స్థూల శరీరము అన్న రసమయము. అనగా అన్నము తినుటచే గలిగిన రసముచే వృద్ధి పొందుచున్నది. |

అన్న రసము వలన గలిగిన వీర్యముచే పుట్టుచున్నది. అన్నరసము వలన బలము గలిగి వృద్ధి పొందుచున్నది. చాలాకాలము నిరాహారిగాయున్న మరణము గలుగుచున్నది. కావున ఈ స్థూల శరీరము అన్నరసమయము. దేహమనే చెట్టును ఆశ్రయించి జీవ ఈశ్వర పక్షులు ఉండును. కావున పక్షులుగా చిత్రీకరించి, ఉదహరించి పాఠమును బోధించు చున్నాడు.

| | | |
|---|---|---|
| తస్య | = | స్థూల శరీరమునకు |
| ఇదం+ఏవ+శిరః | = | ఇదియే శిరస్సు |
| అయం+దక్షిణః +పక్షః | = | ఇది కుడి రెక్క |
| అయం+ఉత్తరః +పక్షః | = | ఇది ఎడమరెక్క |
| ఇదం+పుచ్ఛం | = | ఇది తోక |
| అయం+ఆత్మా+ప్రతిష్ఠా | = | ఈ ఆత్మ (జీవుడు) వైశ్వానరునిగా జాగ్రతావస్థలో స్థూల శరీరమందు గలడు. |
| తత్+అపి+ఏషః+ శ్లోకః+భవతి | = | ఈ విధముగా యీ శ్లోకము చెప్పుచున్నది. |

దేహలక్షణములను, ఆత్మ లక్షణములను వివరించి దేహాత్మల సంబంధమును వివరించినాడు. వివేకశుద్ధమైన మనంబున విచారించి దేహమునందు ఆత్మను వెతకవలయును. పురుష ప్రకృతులను గ్రహించవలయును. ప్రకృతిని అన్వేషించి పురుషునిని తెలుసుకొనవలయును. ప్రకృతి అన్వేషణయే సీతాన్వేషణ. ఆత్మ లక్షణములు వేఱు. స్థూల శరీర లక్షణములు వేఱు. శరీరము నశించును. ఆత్మ నశింపదు. శరీరమునకు పుట్టుక, వృద్ధి, నశించుట అనే అవస్థలు కలవు. ఆత్మకు పుట్టుక, వృద్ధి, నశించుట లేవు. ఈ విధముగా లక్షణ-లక్షణములచే, దేహమునకు-దేహికి వేఱు తెలియవలయును.

**ఈ స్థూల శరీరములో ఆత్మ (జీవుడు)**

స్థూల శరీరము :- అన్నమయకోశము

| | | | | | |
|---|---|---|---|---|---|
| శిరస్సు | - | జీవుడు | ఎడమ రెక్క | - | జ్ఞానేంద్రియములు |
| కుడిరెక్క | - | మనస్సు | తోక | - | కర్మేంద్రియములు |

*****

**అన్నము వలన సృష్టి అభివృద్ధి**

**అన్నా ద్వై ప్రజాః ప్రజాయంతే । యాః కా శ్చ పృథివీగ్ం శ్రితాః । అథో అన్నేనైవ జీవంతి। అథైనదపి యన్త్యంతతః । అన్నగ్ం హి భూతానాం జ్యేష్ఠమ్ । తస్మాత్ సర్వౌషధముచ్యతే । సర్వం వై తేఽ న్న మాప్నువంతి । యేఽ న్నం బ్రహ్మోపాసతే । అన్నగ్ం హి భూతానాం జ్యేష్ఠమ్ । తస్మాత్ సర్వౌషధముచ్యతే । అన్నాద్భూతాని జాయంతే । జాతాన్యన్నేన వర్ధంతే । అద్య తేఽ త్తి చ భూతాని । తస్మాదన్నం తదుచ్యత ఇతి । తస్మాద్వాఏతస్మా దన్నరసమయాత్ । అన్యోఽ న్తర ఆత్మా ప్రాణమయః । తే నైష పూర్ణః స వా ఏష పురుష విధ ఏవ । తస్య పురుష విధతామ్ । అన్వయం పురుష విధః । తస్య ప్రాణ ఏవ శిరః । వ్యానో దక్షిణః పక్షః । అపాన ఉత్తరః పక్షః । ఆకాశ ఆత్మా । పృథివీ పుచ్ఛం ప్రతిష్ఠా । తద ప్యేష శ్లోకో భవతి**

(ఇతి ద్వితీయోఽ ను వాకః)

అన్నాత్ - వై - ప్రజాః - ప్రజాయంతే - యాః - కాః - చ - పృథివీం - శ్రితాః - అథః - అన్నేన - ఏవ - జీవంతి - అథ - ఏనత్ - అపి - యంతి - అంతతః - అన్నం - హి - భూతానాం - జ్యేష్ఠమ్ - తస్మాత్ - సర్వ - ఔషధమ్ - ఉచ్యతే - సర్వం - వై - తే - అన్నమ్ - ఆప్నువంతి - యే - అన్నం - బ్రహ్మ - ఉపాసతే - అన్నం - హి - భూతానాం - జ్యేష్ఠమ్ - తస్మాత్ - సర్వ - ఔషధమ్ - ఉచ్యతే - అన్నాత్ - భూతాని - జాయంతే - జాతాని - అన్నేన - వర్ధంతే - అద్యతే - అత్తి - చ - భూతాని - తస్మాత్ - అన్నం - తత్ - ఉచ్యత - ఇతి - తస్మాత్ - వై - ఏతస్మాత్ - అన్నరసమయాత్ - అన్యః - అన్తరః - ఆత్మా - ప్రాణమయః - తేన- ఏషః - పూర్ణః - సః - వా - ఏషః - పురుషవిధః - ఏవ - తస్య - పురుష విధతాం - అను - అయం - పురుషవిధః - తస్య - ప్రాణః - ఏవ - శిరః - వ్యానః - దక్షిణః - పక్షః - అపానః - ఉత్తరః - పక్షః - ఆకాశః - ఆత్మా- పృథివీ - పుచ్ఛం - ప్రతిష్ఠా - తత్ - అపి - ఏషః - శ్లోకః - భవతి.

**అన్నము గురించి అధిభౌతికముగా అన్నం బ్రహ్మ**

స్థూల శరీరమునకు అన్నము ముఖ్యము. కావున అన్న ప్రశంస చేయుచున్నాడు.

| | | |
|---|---|---|
| అన్నాత్+వై | = | అన్నము నుండి తయారయిన వీర్యమువలన ప్రజలు గలుగుచున్నారు. కావున అన్నము నుండియే |
| ప్రజాః | = | ప్రజలు |
| ప్రజాయంతే | = | పుట్టిరి |
| చ | = | మరియు |
| యాః+కాః | = | ఏఏ జీవరాసులు |
| పృథివీం+శ్రితాః | = | భూమిపై కలవో అవిఅన్నియు అన్నము నుండియే పుట్టినవి. |
| అథః | = | ఆ తర్వాత - పుట్టిన తర్వాత సర్వ జీవరాసులు |
| అన్నేన+ఏవ+జీవంతి | = | అన్నము వలననే జీవించుచున్నవి |
| అథ | = | ఆ తర్వాత మరల |

| | | |
|---|---|---|
| అంతతః | = | అంత్యకాలము నందు మరణ సమయమున ఈ స్థూల శరీరము |
| ఏనత్+అపి | = | ఆహారమునందు లేక మట్టి యందు |
| యంతి | = | కలియుచున్నవి. ప్రాణులు తిరిగి మఱియొక ప్రాణికి ఆహారమగుచున్నవి. |
| తస్మాత్ | = | బాధను నివారించునది ఔషధము. కావున సర్వులకు ఆకలి బాధను నివారించునది అన్నము కావున అన్నము |
| సర్వ+ఔషధమ్+ ఉచ్యతే | = | సర్వులకు ఆకలి బాధను నివారించు ఔషధమని చెప్పబడినది |
| యే | = | ఎవరు |
| అన్నం+బ్రహ్మ | = | అన్నమును బ్రహ్మగా |
| ఉపాసతే | = | ఉపాసించుచున్నారో |
| తే+సర్వం+వై | = | వారు అందఱు |
| అన్నం | = | అన్నమును |
| ఆప్నువంతి | = | పొందుదురు |
| అన్నం+హి | = | అన్నము |
| భూతానాం | = | భూతములకు |
| జ్యేష్ఠమ్ | = | ముందు పుట్టినది |
| తస్మాత్ | = | అందువలన - ఆకలి బాధను నివారించుట వలన |
| సర్వ | = | సర్వప్రాణులకు |
| ఔషధమ్ | = | ఔషధము అని |
| ఉచ్యతే | = | చెప్పబడుచున్నది |
| అన్నం+హి | = | అన్నము |
| భూతానాం | = | భూతములకు |

| | | |
|---|---|---|
| జ్యేష్ఠమ్ | = | ముందు పుట్టినది |
| తస్మాత్ | = | అందువలన - ఆకలి బాధను నివారించుట వలన |
| సర్వ | = | సర్వ ప్రాణులకు |
| ఔషధమ్ | = | ఔషధము అని |
| ఉచ్యతే | = | చెప్పబడుచున్నది. ఒకటికి రెండు సార్లు నొక్కి చెప్పడమైనది. |
| అన్నాత్ | = | అన్నము నుంచి |
| భూతాని | = | సర్వ జీవరాసులు |
| జాయంతే | = | పుట్టుచున్నవి |
| జాతాని | = | పుట్టిన జీవరాసులు |
| అన్నేన | = | అన్నముచే |
| వర్థంతే | = | వృద్ధిపొందుచున్నవి |
| చ | = | మఱియు |
| భూతాని | = | జీవరాసులు మఱియొక జీవరాసులకు ఆహారముగా |
| అద్యతే | = | తినబడుచున్నవి. ఆ విధముగా ఆహారముగా జీవరాసి మఱియొక జీవరాసిని |
| అత్తి | = | తినుచున్నది. |

పురుగు చనిపోయి కప్పకు ఆహారమగుచున్నది. కప్ప చనిపోయి పాముకు ఆహారమగుచున్నది. పాము చనిపోయి గరుత్మంతునకు ఆహారమగు చున్నది. అనగా జీవరాసులు వాటి అంత్య కాలమందు మఱియొక జీవికి ఆహారమగుచున్నవి. ఒక జీవి యొక్క స్థూల శరీరమే మఱియొక జీవికి ఆహారము. బ్రహ్మవలన జీవరాసులు పుట్టుచున్నవి. వృద్ధి పొందుచున్నవి. లయమగుచున్నవి. అటులనే

| | | |
|---|---|---|
| తస్మాత్ | = | అన్నము వలన జీవరాసులు పుట్టుచున్నవి. వృద్ధి పొందుచున్నవి. మరణించుచున్నవి. |
| తస్మాత్+వై | = | అందువలన |

| | | |
|---|---|---|
| అన్నం | = | అన్నము |
| తత్+ఉచ్యతే+ఇతి | = | బ్రహ్మమని చెప్పబడుచున్నది. |

ఆహార నియమములు పాటించవలయును.

**ప్రాణమయకోశము**

| | | |
|---|---|---|
| ఏతస్మాత్+<br>అన్నరసమయాత్ | = | ఈ అన్నమయ కోశము కంటె |
| అన్యః | = | ఇంకొకటి |
| అన్తరః+ప్రాణమయః | = | ప్రాణమయకోశము లోపల గలదు |
| తేన | = | ఆత్మ చేత |
| ఆత్మా+ఏషః+<br>పూర్ణః | = | ఈ ప్రాణమయకోశమంతా ఆత్మ (జీవాత్మ)<br>వ్యాపించి ఉన్నది |
| సః+వా+ఏషః | = | ఈ ప్రాణమయ కోశమందు గల |
| పురుషవిధః+ఏవ | | పురుషుడు కూడ అన్నమయ కోశమందు గల జీవపురుషునివలె ఉండును. అన్నమయ కోశమందు గల జీవ ఆత్మయే ఈ ప్రాణమయ కోశమందూ కలదు. |
| తస్య+పురుషవిధతాం+ | = | ఆత్మకు యీ ప్రాణమయకోశము ఒక<br>వొరవంటిది |
| అయం+పురుషవిధః | = | ప్రాణమయ కోశముతోగల ఆత్మ స్థూల శరీరము<br>లోని జీవ ఆత్మవలె వుండును. |
| తస్య | = | ఈ జీవ పురుషునకు |
| ప్రాణః+ఏవ+శిరః | = | ప్రాణము శిరస్సు వంటిది |
| వ్యానః+దక్షిణః+<br>పక్షః | = | వ్యానవాయువు కుడిరెక్కవంటిది |
| అపానః+ఉత్తరః<br>+పక్షః | = | అపానవాయువు ఎడమరెక్కవంటిది |

| | | |
|---|---|---|
| పృథివీ+పుచ్ఛం | = | భూమి తోక వంటిది |
| ఆకాశః + ఆత్మా+ ప్రతిష్ఠా | = | ఈ హృదయాకాశములో ఆత్మ ప్రతిష్ఠితమై యున్నది. |
| తత్+అపి+ఏషః+ శ్లోకః+భవతి | = | ఆ విధముగా ఈ శ్లోకము చెప్పుచున్నది. |

**ప్రాణమయ కోశము**

| | | |
|---|---|---|
| ప్రాణము | - | శిరస్సు |
| వ్యాన వాయువు | - | కుడి రెక్క |
| అపాన వాయువు | - | ఎడమ రెక్క |
| భూమి | - | తోక |

ప్రాణాయామము చేయవలయును.

ప్రాణము - ప్రాణమయశరీరం

**ప్రాణం దేవా అను ప్రాణంతి । మనుష్యాః పశవశ్చయే । ప్రాణో హి భూతానామాయుః తస్మాత్ సర్వాయుష ముచ్యతే । సర్వ మేవ త ఆయుర్యంతి । యే ప్రాణం బ్రహ్మోపాసతే । ప్రాణో హి భూతానా మాయుః తస్మాత్ సర్వాయుష ముచ్యత ఇతి । తస్యైష ఏవ శారీర ఆత్మా । యః పూర్వస్య । తస్మాద్వా ఏతస్మాత్ ప్రాణమయాత్ । అన్యోఽన్తర ఆత్మా మనోమయః । తేనైష పూర్ణః । సవా ఏష పురుష విధ ఏవ । తస్య పురుష విధతామ్ అన్వయం పురుషవిధః తస్య యజురేవ శిరః । ఋుగ్దక్షిణః పక్షః । సామోత్తర పక్షః । ఆదేశ ఆత్మా । అధర్వాంగిరసః పుచ్ఛం ప్రతిష్ఠా । తదప్యేషః శ్లోకో భవతి ।** (ఇతి తృతీయోఽను వాకః)

ప్రాణం - దేవాః - అనుప్రాణంతి - మనుష్యాః - పశవః - చ - యే - ప్రాణః - హి- భూతానామ్ - ఆయుః - తస్మాత్ - సర్వాయుషమ్ - ఉచ్యతే - సర్వమ్ - ఏవ - త - (తే) - ఆయుః - యంతి - యే - ప్రాణం - బ్రహ్మోపాసతే - ప్రాణః - హి - భూతానామ్ - ఆయుః - తస్మాత్ - సర్వాయుషమ్ - ఉచ్యత - ఇతి - తస్య -

ఏషః - ఏవ - శారీరః - ఆత్మా - యః - పూర్వస్య - తస్మాత్ - వా - ఏతస్మాత్ - ప్రాణమయాత్ - అన్యః - అన్తరః - ఆత్మా - మనోమయః - తేన - ఏవ - పూర్ణః - సః - వా - ఏషః - పురుషవిధః - ఏవ - తస్య - పురుషవిధతామ్ - అను - అయం- పురుష విధః - తస్య - యజుః - ఏవ - శిరః - ఋక్ - దక్షిణః - పక్షః - సామ - ఉత్తరః - పక్షః - ఆదేశ - ఆత్మా - అథ - వా - అంగిరసః - పుచ్ఛం - ప్రతిష్ఠా - తత్ - అపి - ఏషః - శ్లోకః - భవతి

| | | |
|---|---|---|
| దేవాః | = | దేవతలు అనగా యింద్రియములు |
| ప్రాణం+అను | = | ప్రాణము వలననే జీవించుచున్నవి. అనగా |
| ప్రాణంతి | | పని చేయుచున్నవి. |
| మనుష్యాః | = | మనుష్యులు |
| పశవః | = | పశువులు |
| చ+యే | = | మఱియు ఏఏ జీవరాసులు కలవో ఆ జంగమములు అవి అన్నియు ప్రాణం వలననే జీవించుచున్నవి. |
| ప్రాణః+హి | = | ప్రాణము |
| భూతానాం | = | జీవరాసులకు |
| ఆయుః | = | ఆయువు |
| తస్మాత్ | = | అందువలన |
| సర్వాయుషమ్+ఇతి | = | సర్వజీవరాసులకు ఆయుస్సు అని |
| ఉచ్యతే | = | చెప్పుదురు |
| యే | = | ఎవరు |
| ప్రాణః+బ్రహ్మ+ఇతి | = | ప్రాణమును బ్రహ్మము అని |
| ఉపాసతే | = | ఉపాసించుచున్నారో |
| తే+సర్వం+ఏవ | = | వారు అందఱు |
| ఆయుః | = | ఆయువును |

| | | |
|---|---|---|
| యంతి | = | పొందుదురు |
| ప్రాణః+హి | = | సర్వభూతములకు ప్రాణమే ఆయుస్సు. |
| భూతానాం+ఆయుః | = | అందువలన సర్వాయుషమ్ అని పిలువబడుచున్నది. |
| తస్మాత్+ఇతి సర్వాయుషమ్ | = | సర్వులకు ప్రాణమే ఆయువు. |
| ఉచ్యత+ఇతి | = | ప్రాణమువలన సర్వయింద్రియములు వాటి వాటి పనులు నిర్వర్తించుచున్నవి. కావున ప్రాణము బ్రహ్మము. ప్రాణమునకు మనస్సునకు అవినాభావ సంబంధము కలదు. |
| తస్య | = | అతనికి |
| ఏషః+శరీరః+ఏవ | = | ఈ శరీరమే |
| ఆత్మా | = | ఆత్మ |
| తస్మాత్+వై | = | అందువలన |
| యః+పూర్వస్య | = | ఏది పూర్వము వివరించితినో అనగా |

**మనోమయ శరీరం**

| | | |
|---|---|---|
| ఏతస్మాత్+ ప్రాణమయాత్ | = | ఈ ప్రాణమయ కోశము కంటె |
| అన్యః+ఏవ | = | ఇంకొకటి |
| మనోమయః+ అంతరః+ఆత్మా | = | మనోమయ కోశము కలదు. దాని లోపల జీవ ఆత్మగలదు. |
| తేన+ఏషః+పూర్ణః+ ఆత్మ | = | ఆ జీవ ఆత్మ ఈ మనోమయ శరీరమంతా వ్యాపించి యున్నది. |
| సః+వా+పురుష+ | = | ఈ మనోమయ కోశమందుగల జీవపురుషుడు కూడ |

| | | |
|---|---|---|
| విధః+ఏవ+ | | పూర్వము చెప్పిన అన్నమయ ప్రాణమయ |
| తస్య+పురుష+ | | కోశమునందు గల జీవ పురుషుని వలె |
| విధతామ్+ | | ఉండును. |
| అయం+పురుషవిధః +ఏవ | | |
| తస్య | = | మనోమయ పురుషునకు |
| యజుః+ఏవ+శిరః | = | యజుర్వేదము శిరస్సు |
| ఋుక్+దక్షిణః+పక్షః | = | ఋుగ్వేదము కుడిరెక్క |
| సామ+ఉత్తరః+పక్షః | = | సామవేదము ఎడమరెక్క |
| అంగిరసః+పుచ్ఛమ్ | = | అంగిరసము తోక |
| అధ+వా | = | ఇప్పుడు మనోమయ కోశములో |
| ఆదేశః+ఆత్మా+ | = | జీవాత్మ ప్రతిష్ఠితమైయున్నది. |
| ప్రతిష్ఠా | | |
| తత్+అపి+ఏషః+ | = | ఆ విధముగా యీ శ్లోకము |
| శ్లోకః+అను+భవతి | | వివరించుచున్నది |

**మనోమయ శరీరం**

| | | |
|---|---|---|
| శిరస్సు | - | యజుర్వేదము |
| కుడిరెక్క | - | ఋుగ్వేదము |
| ఎడమరెక్క | - | సామవేదము |
| తోక | - | ప్రాణం |

స్వాధ్యాయననము చేయవలయును. మనస్సును స్వాధీనం చేసుకొనవలయును. జాగ్రతావస్థలో మనస్సు, ప్రాణము, ఇంద్రియములు పని చేయును. స్వప్నావస్థలో ఇంద్రియములు పనిచేయవు. మనసు ప్రాణము పనిచేయును. సుషుప్తిలో మనస్సు, ఇంద్రియములు కూడ పనిచేయవు. కేవలము ప్రాణము మాత్రమే పనిచేయును.

*****

**యతో వాచా నివర్తంతే । అప్రాప్య మనసా సహ । ఆనందం బ్రహ్మణో విద్వాన్ న బిభేతి కదాచనేతి । తస్యైష ఏవ శారీర ఆత్మా । యః పూర్వస్య । తస్మాద్వా ఏతస్మాన్మనో మయాత్ । అన్యోఽన్తర ఆత్మా విజ్ఞానమయః । తేనైష పూర్ణః । సవా ఏష పురుష విధ ఏవ । తస్య పురుష విధతామ్ । అన్వయంపురుషవిధః । తస్య శ్రద్ధైవ శిరః । ఋతం దక్షిణః పక్షః । సత్యముత్తరః పక్షః । యోగ ఆత్మా । మహః పుచ్ఛం ప్రతిష్ఠా । తదప్యేష శ్లోకో భవతి ।** (ఇతి చతుర్థోఽనువాకః)

యతః - వాచా - నివర్తంతే - అప్రాప్య - మనసా - సహ - ఆనందం - బ్రహ్మణః - విద్వాన్ - న - బిభేతి - కదాచన - ఇతి - తస్య - ఏషః - ఏవ - శారీరః - ఆత్మా- యః - పూర్వస్య - తస్మాత్ - వా - ఏతస్మాత్ - మనోమయాత్ - అన్యః - అన్తరః - ఆత్మా - విజ్ఞానమయః - తేన - ఏషః - పూర్ణః - సః - వా - ఏషః - పురుషవిధః - ఏవ - తస్య - పురుషవిధతామ్ - అను - అయం - పురుష విధః - తస్య - శ్రద్ధ - ఏవ - శిరః - ఋతం - దక్షిణః - పక్షః - సత్యమ్ - ఉత్తరః - పక్షః - యోగ - ఆత్మా - మహః - పుచ్ఛం - ప్రతిష్ఠా - తత్ - అపి - ఏషః - శ్లోకః - భవతి

| | | |
|---|---|---|
| యతః | = | ఆత్మ స్థానమును |
| అప్రాప్య | = | పొందలేక |
| మనసా+సహ | = | మనసుతో కూడి, ప్రాణము |
| వాచా | = | వాక్కు-అనగా ఇంద్రియములు |
| నివర్తంతే | = | మరలుచున్నవో ఆ ఆత్మస్థానము |
| ఆనందం | = | ఆనందము. అదియే బ్రహ్మానందము. ఈ స్థాయిని పొందినవానిని ఆనందుడని, నందుడని వ్యవ హరింతురు. శ్రీకృష్ణుని తండ్రి నందుడుగా చెప్ప బడినాడు. |
| బ్రహ్మణః+విద్వాన్ | = | ఆ స్థానమునుపొందిన విద్వాంసుడగు బ్రహ్మణ్యుడు |
| కదాచన | = | దేనిగురించి |
| న+బిభేతి+ఇతి | = | భయపడడు. అతడు నిర్భయుడు. |

తనకంటె అన్యమయినది ఇంకొకటి వుంటే అది భయ కారకము. కాని తనకంటె అన్యమయినది లేనపుడు భయముండదు. తనకి తను భయపడడు గదా. సర్వము తనే అని తెలిసిన విద్వాంసుడగు బ్రహ్మణ్యుడు భయపడడు. (ఉదాహరణకు ప్రహ్లాదుడు) ఆత్మస్థానమునకు మనస్సు, ప్రాణము ఇంద్రియములు చేరలేవు. అది ఆనందమయ స్థానము. ఆత్మగుఱించి గ్రహించిన

| | | |
|---|---|---|
| తస్య | = | అతనికి |
| ఆత్మా | = | ఆత్మ గమ్య స్థానము |
| యః+పూర్వస్య | = | ఏదియింతకు పూర్వము వివరించితినో |
| ఏషః+శారీరః+ఏవ | = | ఈ శరీరమందు గల |
| తస్మాత్+వా+ ఏతస్మాత్ | = | ఈ మనోమయ కోశము కంటె |
| విజ్ఞానమయశరీరం | = | విజ్ఞానమయ కోశము |
| మనోమయాత్ | = | మనోమయ కోశము |
| అన్తరః+అన్యః | = | లోపల |
| విజ్ఞానమయః+ఆత్మా | = | విజ్ఞానమయ జీవ ఆత్మ కలదు. |
| తేన+ఏషః+పూర్ణః | = | దానిచే విజ్ఞానమయ కోశమంతా వ్యాపింపబడి యున్నది. |
| సః+వా+పురుషవిధః +ఏషః+తస్య+పురుష విధతామ్+అను+ అయం+పురుషవిధః+ ఏవ | = | అతడు విజ్ఞానమయ కోశమందు గల జీవ పురుషుడు కూడ పూర్వము చెప్పిన అన్నమయ, ప్రాణమయ,మనోమయ శరీరమందలి జీవ పురుషునివలె ఉండును. |
| తస్య | = | విజ్ఞానమయ జీవ పురుషునికి |
| శ్రద్ధ+ఏవ+శిరః | = | శ్రద్ధ యనునది శిరస్సు |
| ఋతం+దక్షిణః+పక్షః | = | ఋతము - కుడిరెక్క |

| | | |
|---|---|---|
| సత్యం+ఉత్తరః+పక్షః | = | సత్యము - ఎడమరెక్క |
| మహః+పుచ్ఛం | = | మహత్ తోక |
| యోగ+ఆత్మా | = | యోగ ఆత్మ, ఆ విజ్ఞానమయ శరీరము నందు |
| ప్రతిష్ఠా | = | జీవ ఆత్మ ప్రతిష్ఠింపబడి యున్నది. |
| తత్+అపి+ఏషః+ | = | ఈ విధముగా యీ శ్లోకము |
| శ్లోకః+అను+భవతి | | వివరించుచున్నది |

**విజ్ఞానమయ శరీరం :**

| | | |
|---|---|---|
| శిరస్సు | - | శ్రద్ధ |
| కుడిరెక్క | - | ఋతము |
| ఎడమరెక్క | - | సత్యము |
| తోక | - | మహత్ |

బుద్ధి సమిష్ఠిలో మహత్. బుద్ధిద్వారా మనస్సు యింద్రియములను గ్రహించి బుద్ధి ద్వారా ఆత్మను గ్రహించవలయును.

*****

**విజ్ఞానము - విజ్ఞానమయశరీరం**

**విజ్ఞానం యజ్ఞం తనుతే । కర్మాణి తనుతేఽపి చ విజ్ఞానం దేవాః సర్వే । బ్రహ్మ జ్యేష్ఠముపాసతే విజ్ఞానం బ్రహ్మ చేద్వేద । తస్మాచ్చేన్న ప్రమాద్యతి శరీరే పాప్మనోహిత్వా । సర్వాన్కామాన్స మశ్నుత ఇతి। తస్యైష ఏవ శారీర ఆత్మా । యః । పూర్వస్య । తస్మాద్వా ఏతస్మాద్విజ్ఞాన మయాత్। అన్యోఽన్తర ఆత్మాఽఽనందమయః । తేనైష పూర్ణః। సవా ఏష పురుష విద ఏవ । తస్య పురుష విధతామ్ । అన్వయం పురుషవిధః । తస్య ప్రియ మేవ శిరః । మోదో దక్షిణః పక్షః । ప్రమోద ఉత్తరః పక్షః ఆనంద ఆత్మా । బ్రహ్మ పుచ్ఛం ప్రతిష్ఠా। తదప్యేష శ్లోకో భవతి ।**

(ఇతి పంచమోఽను వాకః)

విజ్ఞానం - యజ్ఞం - తనుతే - కర్మాణి - తనుతే - అపి - చ - విజ్ఞానం - దేవాః - సర్వే - బ్రహ్మ - జ్యేష్ఠమ్ - ఉపాసతే - విజ్ఞానం - బ్రహ్మ - చేత్ - వేద - తస్మాత్ - చేత్ - న - ప్రమాద్యతి - శరీరే - పాప్మనః - హిత్వా - సర్వాన్ - కామాన్ - సమశ్నుతే - ఇతి - తస్య - ఏషః - ఏవ - శారీరః - ఆత్మా - యః - పూర్వస్య - తస్మాత్ - వా - ఏతస్మాత్ - విజ్ఞానమయాత్ - అన్యః - అన్తరః - ఆత్మా - ఆనందమయః - తేన - ఏషః - పూర్ణః - సః - వా - ఏషః - పురుషవిధః - ఏవ - తస్య - పురుషవిధతామ్ - అను - అయం - పురుషవిధః - తస్య - ప్రియమ్ - ఏవ - శిరః - మోదః - దక్షిణః - పక్షః - ప్రమోదః - ఉత్తరః - పక్షః - ఆనందః - ఆత్మా - బ్రహ్మ - పుచ్ఛం - ప్రతిష్ఠా - తత్ - అపి - ఏషః - శ్లోకః - భవతి

| | | |
|---|---|---|
| విజ్ఞానం | = | విజ్ఞానము |
| యజ్ఞం | = | బ్రహ్మ గుఱించి తెలుసుకొనే ప్రయత్నం |
| తనుతే | = | చేయుచున్నది |
| చ | = | మఱియు |
| కర్మాణి+అపి | = | తన విద్యుక్త విధులను కూడ, కర్మలను కూడ |
| తనుతే | = | చేయుచున్నది |
| విజ్ఞానం+బ్రహ్మ | = | విజ్ఞానము బ్రహ్మ |
| జ్యేష్ఠమ్ | = | సర్వదేవతల కంటె ముందుది |
| సర్వే+దేవాః | = | సర్వదేవతలు |
| విజ్ఞానం | = | విజ్ఞానమును |
| ఉపాసతే | = | ఉపాసించుచున్నారు |
| చేత్ | = | ఒకవేళ |
| బ్రహ్మ+వేద | = | బ్రహ్మ గుఱించి జీవాత్మ, పరమాత్మల గుఱించి తెలుసుకున్నవాడు బ్రహ్మయగును |
| తస్మాత్ | = | అందువలన |
| చేత్ | = | ఒకవేళ అతడు ఇతరములను చూచినను, ఇతర సుఖములను పొందినను |

| | | |
|---|---|---|
| న+ప్రమాద్యతి | = | బ్రహ్మ గుఱించి పొరపడడు. విజ్ఞానము ఏది చేయవలయును. ఏది చేయకూడదో తెలుపును. కావున బ్రహ్మగుఱించి పొరపడడు. |
| శరీరే | = | శరీరమునందు |
| పాప్మనః | = | పాపములను |
| హిత్వా | = | విడచి అనగా పాపరహితుడై |
| సర్వాన్+కామాన్ | = | అన్ని కోరికలను |
| సమశ్నుతే+ఇతి | = | పొందుచున్నాడు |
| తస్య | = | అతనికి |
| ఏషః+శారీరః+ఏవ | = | ఈ శరీరమే |
| ఆత్మా | = | ఆత్మ |
| యః+పూర్వస్య | = | ఏది యింతకు పూర్వము వివరించితినో |
| తస్మాత్+వా+ ఏతస్మాత్ | = | ఈ విజ్ఞానమయ కోశము కంటె |
| విజ్ఞానమయాత్+అన్తరః అన్యః | = | ఈ విజ్ఞానమయ కోశము లోపలయింకొకటి |
| ఆనందమయః+ఆత్మా | = | ఆనందమయ జీవ ఆత్మ కలదు |
| తేన+ఏషః+పూర్ణః | = | దానిచే ఆనందమయ కోశమంతా |
| సః+వా+పురుషవిధః+ | | వ్యాపించి యున్నది. అతడు |
| +ఏషః+తస్య+పురుష | | జీవ పురుషుడనియే పిలువ బడుచున్నాడు. |
| విధతామ్+అను | | అతడు పూర్వము చెప్పిన జీవపురుషునివలె ఉండును. |
| అయం+పురుషవిధః+ఏవ | | అతడు జీవ పురుష లక్షణములు గలిగియుండును. |
| తస్య | = | ఆనందమయ పురుషునకు |
| ప్రియమ్+ఏవ+శిరః | = | ప్రియము శిరస్సువంటిది |
| మోదః+దక్షిణః+పక్షః | = | మోదము కుడిరెక్క |

| | | |
|---|---|---|
| ప్రమోదః+ఉత్తరః+పక్షః | = | ప్రమోదము ఎడమరెక్క |
| బ్రహ్మ+పుచ్ఛం | = | బ్రహ్మము తోకవంటిది |
| ఆనందః+ఆత్మా+ | = | ఆనందమయ శరీరమునందు ఆనంద స్వరూపమగు |
| ప్రతిష్ఠా | = | ఆత్మ ప్రతిష్ఠింపబడినది. కావున అతడు నద్వేష్టి, నకాంక్షతి, నశోచతి - గాయుండును. |
| తత్+అపి+ఏషః+ శ్లోకః+భవతి | = | ఈ విధముగా యీ శ్లోకము వివరించుచున్నది |

**ఆనందమయ కోశము**

| | | |
|---|---|---|
| శిరస్సు | - | ప్రియము |
| కుడి రెక్క | - | మోదము |
| ఎడమ రెక్క | - | ప్రమోదము |
| తోక | - | బ్రహ్మము |

*****

**అసన్నేవ స భవతి । అసద్బ్రహ్మేతి వేద చేత్ । అస్తి బ్రహ్మేతి చేద్వేద । సంత మేనం తతో విదురితి । తస్యైష ఏవ శారీర ఆత్మా । యః పూర్వస్య । అథాతోఽను ప్రశ్నాః । ఉతా విద్వానముం లోకం ప్రేత్య । కశ్చన గచ్ఛతీ3 । అహో విద్వానముం లోకం ప్రేత్య । కశ్చిత్స మశ్నుతా3 ఉ । సోఽకామయత । బహుస్యాం ప్రజాయే యేతి । స తపోఽతప్యత । స తపస్తప్త్వా ఇదగ్ం సర్వమసృజత । యదిదంకించ ।తత్సృష్ట్వా । తదేవాను ప్రావిశత్ । తదనుప్రవిశ్య । సచ్చత్యచ్చా భవత్ । నిరుక్తం చానిరుక్తం చ । నిలయనంచా నిలయనం చ । విజ్ఞానం చా విజ్ఞానం చ । సత్యం చా నృతం చ సత్యమభవత్ । యదిదం కించ । తత్ సత్యమిత్యాచక్షతే ।**
**తదప్యేష శ్లోకో భవతి ।** **(ఇతి షష్ఠోఽను వాకః)**

అసన్-ఏవ- సః- భవతి- అసత్- బ్రహ్మ- ఇతి- వేద- చేత్-అస్తి- బ్రహ్మ- ఇతి-చేత్- వేద- సంతమ్- ఏనం- తతః - విదుః - ఇతి - తస్య- ఏషః-ఏవ- శారీరః -ఆత్మా- యః- పూర్వస్య- అథ-అతః- అనుప్రశ్నాః -ఉత- అవిద్వాన్- అముం- లోకం-

ప్రేత్య- కః- చన- గచ్ఛతీ- అహో- విద్వాన్- అముం- లోకం- ప్రేత్య- కః- చిత్- సమశ్నుతా- ఉ- సః - అకామయత- బహుః-స్యాం- ప్రజాయేయేతి- సః - తపః - అతప్యత-సః-తపః-తప్త్వా- ఇదగ్ం- సర్వమ్- అసృజత- యత్- ఇదం- కించ- తత్- సృష్ట్వా- తత్- ఇవ- అనుప్రావిశత్- తత్- అనుప్రవిశ్య- సత్- చ-అసత్ -చ -అభవత్- - నిరుక్తం- చ- అనిరుక్తం-చ- నిలయనం-చ- అనిలయంనం -చ- విజ్ఞానం- చ- అవిజ్ఞానం- చ- సత్యం- చ-అసత్-చ-అనృతం- చ- సత్యం- అభవత్- యత్- ఇదం- కించ- తత్- సత్యమ్- -ఇతి- ఆచక్షతే- తత్ - అపి- ఏషః - శ్లోకః - భవతి

| | | |
|---|---|---|
| అసత్ | = | ఇది అసత్ అని |
| బ్రహ్మ+ఇతి | = | ఇది బ్రహ్మమని |
| సః+వేద | = | తెలుసుకున్నవాడు |
| అసన్+ఏవ+భవతి | = | జీవత్వము లేకుండా పోయి ఆత్మయే అగుచున్నాడు |
| చేత్ | = | అయితే ఒకవేళ |
| బ్రహ్మ+అస్తి+ఇతి | = | బ్రహ్మమే సర్వత్రా గలదని |
| చేత్+వేద | = | తెలుసుకున్నచో |
| తతః | = | అప్పుడు |
| ఏనం | = | వీనిని |
| సంతమ్ | = | బ్రహ్మగా |
| విదుః+ఇతి | = | తెలియుచున్నారు |
| తస్య+పూర్వస్య+ఆత్మా | = | ఇంతకుపూర్వము చెప్పిన ఆత్మ |
| యః+ఏషః+శారీరః ఆత్మ | = | ఈ శరీరమునందు హృదయ గుహలో కలడు |
| ఏషః+ఏవ | = | సృష్ట్యాది యందుగల ఆత్మయే హృదయగుహలో గల ఈ ఆత్మ |
| శారీరః+ఆత్మ | = | ఈ శరీరమందున్న ఆత్మనే |

| | | |
|---|---|---|
| అథ+అతః | = | ఇప్పుడు దర్శించవలయును. అందువలన |
| అనుప్రశ్నాః | = | ఎవరయినా బ్రహ్మముగురించి తెలియనిచో యేమి జరుగునని అనుబంధ ప్రశ్నలు గలుగుచున్నవి |
| ఉత | = | మఱియు ఎవరయినా |
| అవిద్వాన్ | = | బ్రహ్మనుగుఱించి స్వానుభవంతో తెలియనివాడు |
| అముం+లోకం | = | ఈ లోకమును |
| ప్రేత్య | = | వదలిన తర్వాత |
| కః చన | = | ఎక్కడకు |
| గచ్ఛతీ (గచ్ఛతి) | = | వెళ్ళుచున్నాడు? |
| చ | = | మఱియు |
| అహో | = | అహో |
| విద్వాన్ | = | బ్రహ్మము గుఱించి స్వానుభవంలో గ్రహించినవాడు |
| అముం+లోకం | = | ఈ లోకమును |
| ప్రేత్య | = | వదిలిన తర్వాత |
| కః+చిత్ | = | ఎక్కడకు వెళ్ళుచున్నాడు? |
| సమశ్నుతే | = | దేనిని పొందుచున్నాడు |

### సృష్టివిచారణ

సృష్ట్యాదియందు ఒక్కటిగా ఉన్న ఆత్మ

| | | |
|---|---|---|
| ప్రజాయేయేత్ | = | నన్ను నేనే విభజించుకొని |
| బహుః+స్యాం | = | బహు రూపులుగా అవుదును గాక. అని |
| సః | = | ఆత్మ |
| అకామయత | = | సంకల్పించెను |
| సః | = | ఆత్మ |
| తపః | = | తపస్సు |
| అతప్యత | = | చేసెను |

| | | |
|---|---|---|
| సః | = | ఆత్మ |
| తపః+తప్త్వా | = | తపస్సు చేసి |
| ఇదం+సర్వం | = | ఈ సర్వజగత్తును |
| అసృజత | = | సృష్టించెను |
| యత్+ఇదం+కిం+చ | = | ఏదైతే యీ సర్వచరాచర జగత్తు కలదో |
| తత్ | = | దానినంతా |
| సృష్ట్వా | = | సృజియించి |
| తత్+ఇవ | = | ఆ జగత్తులో |
| అను ప్రావిశత్ | = | ప్రవేశించెను. (ఈశావాస్యమిదం సర్వం యత్ కించ జగత్యాం జగత్) (ఈశ ఉపనిషత్ 1-) |
| తత్ | = | అందులో |
| అనుప్రవిశ్య | = | ప్రవేశించి సర్వము తనే అయ్యెను |
| సత్+చ+అసత్+చ | = | సత్తు, అసత్తు, స్థూలము, సూక్ష్మము |
| నిరుక్తం+చ+ అనిరుక్తం+చ | = | రూపము గలవి, రూపములు లేనివి, |
| నిలయనం+చ+ అనిలయనం+చ | = | ఆధారము గలవి, ఆధారము లేనివి |
| విజ్ఞానం+చ+ అవిజ్ఞానం+చ | = | జ్ఞానము, అజ్ఞానము |
| సత్యం+చ+అనృతం+చ | = | సత్యము, అసత్యము ఇవి అన్నీ ఈ సర్వము |
| సత్యం+అభవత్ | = | తనే అయ్యెను అనగా విరాట్‌పురుషుడు అయ్యెను |

శ్రీకృష్ణుడు-తనతోటి గోపబాలురతో చల్ది అన్నము తినుచున్నాడు. గోవులు దూరముగా పోయినవి. బ్రహ్మగోవులను దాచినాడు. శ్రీకృష్ణుడు గోవులను వెతకుచుండగా బ్రహ్మగోపబాలురను దాచినాడు. ఇది గ్రహించిన శ్రీకృష్ణుడు. గోవులు, దూడలు, గోపబాలురు తనే అయినాడు. ఈ స్థితిని దర్శించుటను విశ్వరూప సందర్శనముగా చెప్పుదురు.

| | | |
|---|---|---|
| యత్+ఇదం+కిం+ | = | ఏదైతే ఈ సర్వచరా చర జగత్తులో కలదో |
| చ | | అనగా ఈ సర్వజగత్తు |
| తత్+సత్యమ్+ఇతి | = | బ్రహ్మమని బ్రహ్మ స్వరూపమని |
| ఆచక్షతే | = | చెప్పుదురు |
| తత్+అపి+ఏషః+ | = | ఈ విషయమును ఈ శ్లోకము |
| శ్లోకః+భవతి | | చెప్పుచున్నది |

ఈ జగత్తు మిథ్యగాదు. సత్యము. ఇది ఆత్మచే సృజియింపబడినది. ఈ జగత్తంతయు (ఆత్మ) బ్రహ్మ స్వరూపము. పరమాత్మ కానిది పరమాణువు కూడ లేదు. సర్వము ఈశ్వరుడే మంచి చెడులు, దేవతలు రాక్షసులు, సత్యము- అసత్యము అతడే. అలా స్వానుభవంలో గ్రహించుటయే విశ్వరూప సందర్శనము. ఇలా గ్రహించినవాడు బ్రహ్మజ్ఞాని.

ప్రారంభములో సాధకుడు విశిష్ట వస్తువులను బ్రహ్మగా భావించి ఉపాసించ వలయును. దీనివలన సాధకునిలో గల ఈర్ష్య, అసూయలు పోవును. ఇదే గీతలో విభూతి యోగముగా పక్షులలో గరుత్మంతుడననియు, మృగములలో సింహమనియు ఇలా ఉత్కృష్ట వస్తువులు తనుగా శ్రీకృష్ణుడు చెప్పెను. ఆపై సాధన పరిపక్వమైన స్థితిలో సర్వము పరమాత్మగా గోచరించును. తను ఇతరులు అను ద్వైత భావన నశించును. అట్టి స్థితిని భక్తి యని యందురు.

### బ్రహ్మవిచారణ

**అసద్వా ఇదమగ్ర ఆసీత్। తతో వై సదజాయత। తదాత్మానగ్గ్ం స్వయ మకురుత। తస్మాత్త స్తుకృత ముచ్యత ఇతి । యద్వైతత్ సుకృతమ్ । రసోవైసః । రసగ్గ్ంహ్యేవాయం లబ్ధ్వాఽ ఽనందీ భవతి। కో హ్యే వాన్యాత్కః ప్రాణ్యాత్। యదేష ఆకాశ ఆనందో నస్యాత్। ఏష హ్యేవాఽ ఽనందయాతి। యదా హ్యే వైష ఏతస్మిన్నదృశ్యేఽ నాత్మ్యేఽ నిరుక్తేఽ నిలయనేఽ భయం ప్రతిష్ఠాం విందతే ।అథసోఽ భయం గతో భవతి। యదా హ్యే వైష ఏ తస్మిన్నుదర మంతరం కురుతే। అథ తస్య భయం భవతి। తత్త్వేవ భయం విదుషోఽ మన్వానస్య। తద ఏష శ్లోకో భవతి।** (ఇతి సప్తమోఽ ను వాకః)

అసత్ - వా - ఇదమ్ - అగ్ర - ఆసీత్ - తతః - వై - సత్ - అజాయత - తదా - ఆత్మానం - స్వయమ్ - అకురుత - తస్మాత్ - తత్ - సుకృతమ్ - ఉచ్యత - ఇతి - యత్ - వై - తత్ - సుకృతమ్ - రసః వై - సః - రసం - హి - ఏవ - అయం - లబ్ధ్వా - ఆనందీ - భవతి -కః - హ - ఏవ - అన్యాత్ - కః - ప్రాణ్యాత్ - యత్ - ఏషః - ఆకాశః - ఆనందః - న - స్యాత్ - ఏషః - హి - ఏవ - ఆనంద - యాతి - యదా - హి - ఏవ - ఏషః - ఏతస్మిన్ - అదృశ్యే - అనాత్మ్యే - అనిరుక్తే - అనిలయనే - అభయం - ప్రతిష్ఠాం - విందతే - అథ - సః - అభయం - గతః- భవతి - యదా - హి - ఏవ - ఏషః - ఏతస్మిన్ - ఉ - దరమ్ - అంతరం - కురుతే - అథః - తస్య - భయం - భవతి - తత్ - తు - ఏవ - భయం - విదుషః - అమన్వానస్య - తత్ - ఏషః - శ్లోకః - భవతి

ఆత్మ వై ఇదమగ్ర ఆసీత్- ఐతరేయ ఉపనిషత్

| | | |
|---|---|---|
| అసత్+వా | = | ఆత్మ. అవ్యక్తముగా నామ, రూప, రహితముగా |
| ఇదం+అగ్రే | = | ఈ సృష్టికి ముందు |
| అసీత్ | = | ఉండెను |
| తతః+వై | = | నిరాకారముగా యున్న ఆ ఆత్మయే |
| సత్ | = | పురుషుడుగా వ్యక్తము |
| అజాయత | = | అయినది |
| తదా | = | ఆవిధముగా |
| ఆత్మానం+స్వయమ్+ అకురుత | = | ఆత్మయే స్వయముగా తనకు తానే ఉపాధిని నిర్మించుకొని అందు వసియించి పురుషుడయినది. |
| తస్మాత్ | = | ఆత్మయే, పురుషుడయినందు వలన |
| తత్ (స్వకృతం) సుకృతమ్+ ఉచ్యతే+ఇతి | = | అలా ఆత్మ పురుషుడుగా స్వయం జాతుడగుట, సృష్టి చేసెనని, అది సుకృత మని మంచిపని అని చెప్పబడుచున్నది. |

| | | |
|---|---|---|
| యత్+వై | = | ఏదైతే సృష్టిగా చెప్పబడుచున్నదో అది ఆత్మ లేక |
| తత్+సుకృతం | = | పురుషుడు చేసిన మంచిపని |
| సః | = | పురుషుడు |
| రసః+వై | = | ఆనంద స్వరూపుడు |
| అయం+రసం+హి | = | ఈ ఆనంద స్వరూపమున పురుషుని |
| లబ్ద్వా+ఏవ | = | పొందినవాడు. |
| ఆనందీ+భవతి | = | ఆనందుడగును. ఆ పురుషుడే హృదయ గుహలో లేక పోయినచో |
| కః+ఏవ+అన్యాత్+హి కః+ప్రాణ్యాత్ | = | ఎవడు శ్వాసించును? ఎవడు గాలిని లోపలికి పీల్చును? ఎవడు గాలిని బయటకు వదలును? అనగాఎవడు ఉచ్ఛ్వా నిశ్వాసలను చేయును? ఎవడు అని ప్రశ్నించుట వలన ఈ పురుషుడే ఆత్మ హృదయ గుహలో లేనిచో ఎవడు కూడ ఉచ్ఛ్వాస నిశ్వాసలను చేయడు. అనగా అతడు మరణించును |
| యత్ | = | ఏది |
| ఏషః+ఆకాశే | = | ఈ హృదయాకాశములో వుండదో అప్పుడు |
| ఆనందః | = | ఆనందము |
| న+స్యాత్ | = | ఉండదు. కావున |
| ఏషః+హి+ఏవ | = | ఈ ఆత్మయే |
| ఆనంద+యాతి | = | ఎప్పుడు యీ ఆత్మ శరీరమును వీడునో అప్పుడు ఆనందము నిచ్చువాడు ఉండడు. |
| ఏతస్మిన్ | = | అందువలన |
| ఏషః | = | ఈ |
| అదృశ్యే | = | అగోచరుడును |
| అనాత్మ్యే | = | రూపరహితుడును |

| | | |
|---|---|---|
| అనిరుక్తే | = | వ్యక్తీకరింపవీలులేనివాడును |
| అనిలయనే | = | ఆధార రహితుడు. తనే సర్వమునకు ఆధారము. తనకు ఎవరూ ఆధారము కానిది |
| అభయం | = | భయరహితుడును అగు పురుషుడు |
| ప్రతిష్ఠాం | = | ప్రతిష్ఠింపబడియున్నాడని |
| యదా+హి+ఏవ | = | గ్రహించునో ఆ క్షణములో వాడు ఆత్మను |
| విందతే | = | పొందును |
| అథః | = | ఆ తరువాత |
| సః | = | వాడు |
| అభయం | = | అభయమును |
| గతః | = | పొంది |
| భవతి | = | ఆత్మ అగును |
| యదా+హి+ఏవ | = | ఎప్పుడు |
| ఏషః | = | ఈ ఆత్మకు తనకు |
| ఉ+దరం | = | కొంచెమయినా |
| అంతరం | = | బేధము |
| కురుతే | = | ఉందని భావించినచో- తను ఆత్మకంటే భిన్నుడనని భావించునో |
| ఏతస్మిన్+ఏవ | = | అలా భావించినంత మాత్రముననే |
| తస్య | = | వానికి |
| అథ | = | అప్పుడు |
| భయం | = | (జనన మరణభయము) భయము |
| భవతి | = | కలుగును |
| అమన్వానస్య | = | తనకు బ్రహ్మకు భేదము గలదని భావించిన |

| | | |
|---|---|---|
| విదుషః | = | వానికి |
| తత్+తు+ఏవ | = | ఆ బ్రహ్మ |
| భయం | = | భయమును గలిగించును. కావున తను బ్రహ్మ స్వరూపమే బ్రహ్మము కంటె భిన్నము కాదని స్వానుభవంలో గ్రహించవలయును. |
| తత్+ఏషః+శ్లోకః+భవతి | = | ఈ విషయమును ఈ శ్లోకము చెప్పు చున్నది. |

*****

## బ్రహ్మ విచారణ

**భీషాఽస్మాద్వాతః పవతే । భీషో దేతి సూర్యః । భీషా ఽస్మా దగ్ని శ్చేంద్రశ్చ । మృత్యుర్ధావతి పంచమ ఇతి ।**

భీషా - అస్మాత్ - వాతః - పవతే - భీషా - ఉదేతి - సూర్యః - భీషా - అస్మాత్ - అగ్నిః - చ - ఇన్ద్రః - చ - మృత్యుః - ధావతి - పంచమః - ఇతి.

| | | |
|---|---|---|
| అస్మాత్+భీషా | = | వాని యొక్క ఆజ్ఞచే |
| వాతః | = | వాయువు |
| పవతే | = | వీచుచున్నది |
| భీషా | = | వానియొక్క ఆజ్ఞచే |
| సూర్యః | = | సూర్యుడు |
| ఉదేతి | = | ఉదయించుచున్నాడు |
| అస్మాత్+భీషా | = | వాని యొక్క ఆజ్ఞచే |
| అగ్నిః | = | అగ్ని మండుచున్నది |
| ఇన్ద్రః | = | ఇంద్రుడు త్రిలోకపాలన చేయుచున్నాడు |
| చ | = | మఱియు |
| పంచమ+మృత్యుః | = | బాల్య, కౌమార, యౌవన, వార్ధక్యములను 4 స్థితులను దాటి 5వ స్థితి అయిన మరణమును |

| | | |
|---|---|---|
| | | గలిగించు మృత్యువు అతని పేరు చెప్పినంత మాత్రమునసే |
| ధావతి | = | పరుగిడుచున్నాడు |
| చ+ఇతి | = | మఱియు సర్వ ప్రపంచము వాని ఆజ్ఞచే నడచు చున్నది. ఇందు ఎవరికి స్వతంత్రము లేదు. దేహధారి స్వతంత్రుడు కాడు. జంత్ర గాని చేతి కీలు బొమ్మకైవడి ప్రవర్తిల్లును. |

## బ్రహ్మానందము గొప్పది

సైషాఽఽనన్దస్య మీమాగ్ంసా భవతి । యువాస్యాస్సాధు యువాఽధ్యాయకః । అశిష్ఠో ద్రడిష్ఠో బలిష్ఠః । తస్యేయం పృథివీ సర్వావిత్తస్య పూర్ణాస్యాత్ । స ఏకో మానుష ఆనందః । తే యే శతం మానుషా ఆనందాః । స ఏకో మనుష్య గంధర్వాణా మానందః । శ్రోత్రియస్య చాకా మహతస్య । తే యే శతం మనుష్య గంధర్వాణా మానందాః । స ఏకో దేవ గంధర్వాణా మానందః । శ్రోత్రియస్య చా కా మహతస్య । తే యే శతం దేవ గంధర్వాణామానందాః । స ఏకః పితౄణాం చిర లోక లోకానా మానందః । శ్రోత్రియస్య చాకా మహతస్య । తే యే శతం పితౄణాం చిరలోక లోకానామానందాః । స ఏక అజాన జానాం దేవానా మానందః । శ్రోత్రియస్య చాకా మహతస్య । తే యే శతమాజాన జానాం దేవానా మానందాః । స ఏకః కర్మ దేవానాం దేవానా మానందః । యే కర్మణా దేవా నపి యంతి । శ్రోత్రి యస్య చాకా మహ తస్య । తే యే శతం కర్మ దేవానాం దేవానామానందాః । స ఏకో దేవానా మానందః । శ్రోత్రి యస్య చాకా మహతస్య । తే యే శతం దేవానా మానందాః । స ఏక ఇంద్రస్యానందః । శ్రోత్రి యస్య చాకా మహ తస్య । తే యే శత మింద్రస్యాఽఽనందాః । స ఏకో బృహస్పతే రానందః ।శ్రోత్రి యస్య చాకా మహతస్య । తే యే శతం బృహ స్పతే రానందాః । స ఏకః ।ప్రజాపతే రానందః । శ్రోత్రి యస్య చా కామహతస్య । తేయే శతం ప్రజాపతే రానందాః । స ఏకో బ్రహ్మణ ఆనందః । శ్రోత్రియస్య చాకా మహతస్య ।

సః - ఏషః - ఆనన్దస్య - మీమాంసా - భవతి - యువా - స్యాత్ - సాధు - యువా- అధ్యాయకః - అశిష్ఠః - ద్రఢిష్ఠః - బలిష్టః - తస్య - ఇయం - పృథివీ - సర్వా - విత్తస్య - పూర్ణాస్యాత్ - సః - ఏకః - మానుషః - ఆనందః - తే - యే - శతం - మానుషాః - ఆనందాః - సః - ఏకః - మనుష్య గంధర్వాణామ్ - ఆనందః - శ్రోత్రియస్య - చ - అకామహతస్య - తే - యే - శతం - మనుష్య - గంధర్వాణామ్- ఆనందాః - సః - ఏకః - దేవగంధ ర్వాణాం - ఆనందః - శ్రోత్రియస్య - చ - అకామహతస్య - తే - యే - శతం - దేవగంధర్వాణామ్ - ఆనందాః - సః - ఏకః - పితౄణాం - చిర - లోక - లోకానామ్ - ఆనందః - శ్రోత్రియస్య - చ - అకామహతస్య - తే - యే - శతం - పితౄణాం - చిరలోక - లోకానామ్ - ఆనందాః - సః - ఏకః - అజానజానాం - దేవానామ్ - ఆనందః - శ్రోత్రియస్య - చ - అకామహతస్య - తే - యే - శతమ్ - అజానజానాం - దేవానామ్ - ఆనందాః - సః - ఏకః కర్మ దేవానామ్ - దేవానామ్ - ఆనందః - యే - కర్మణా - దేవాన్ - అపి - యంతి - శ్రోత్రియస్య - చ - అకామహతస్య - తే - యే - శతం - కర్మదేవానాం - దేవానామ్ - ఆనందాః - సః - ఏకః - దేవానాం - ఆనందః - శ్రోత్రియస్య - చ - అకామహతస్య - తే - యే - శతం - దేవానాం - ఆనందాః - సః - ఏకః - ఇంద్రస్య - ఆనందః - శ్రోత్రియస్య - చ - అకామహతస్య - తే - యే - శతం - ఇంద్రస్య - ఆనందాః - సః - ఏకః - బృహస్పతేః - ఆనందః - శ్రోత్రియస్య - చ - అకామహతస్య - తే - యే - శతమ్ - బృహస్పతేః - ఆనందాః - సః - ఏకః - ప్రజాపతేః - ఆనందః శ్రోత్రియస్య - చ - అకామహతస్య- తే - యే - శతమ్ - ప్రజాపతేః - ఆనందాః - సః - ఏకః - బ్రహ్మణః - ఆనందః - శ్రోత్రియస్య - చ - అకామహతస్య.

| | | |
|---|---|---|
| సః | = | ఆత్మను పొందినవాని యొక్క ఆ ఆనందము గుఱించి |
| ఏషః | = | ఈ |
| ఆనన్దస్య | = | ఆనందము యొక్క |
| మీమాంసా+భవతి | = | విచారణ చేయబడుచున్నది |

| | | |
|---|---|---|
| యువా | = | వయస్సులో గలవాడు |
| సాధు | = | చెడు అలవాట్లు లేని వాడు |
| అధ్యాయకః | = | వేదజ్ఞుడు |
| అశిష్ఠః | = | శిష్ఠాచారపరుడు |
| ద్రఢిష్ఠః | = | ధృడ సంకల్పము గలవాడు |
| బలిష్ఠః | = | శరీర ఆరోగ్యము గలవాడు |
| స్యాత్ | = | ఒకడు గలడనుకొనుము |
| యువా+తస్య | = | ఆయువకుడే, వానికి |
| ఇయం+పృథివీ | = | ఈ భూమియందు గల |
| సర్వా+విత్తస్య | = | సర్వ భోగభాగ్యములు |
| పూర్ణా+స్యాత్ | = | సంపూర్ణముగా అతనికి గల వనుకొనుము |
| సః+ఏకః+మానుషః+ ఆనందః | = | అట్టివాడు పొందు ఆనందము **ఒక మనుష్య** ఆనందము |
| తే+యే+శతం+మానుషాః= +ఆనందాః | | అట్టి మానుష ఆనందములకు నూఱురెట్లు |
| సః+ఏకః+మనుష్య- గంధర్వాణామ్+ఆనందః | = | ఒక **మనుష్య గంధర్వుల** యొక్క ఆనందంతో సమానము |
| శ్రోత్రియస్య+చ+ అకామహతస్య | = | శ్రోత్రియుడు, చెడు తలంపు లేని వాని ఆనందము ఈ ఆనందముతో సమానము |
| తే+యే+శతం+ మనుష్య+ గంధర్వాణామ్+ఆనందాః | = | అట్టి మనుష్య గంధర్వుల యొక్క నూఱురెట్లు ఆనందము |
| సః+ఏకః+ దేవగంధర్వాణాం+ ఆనందః+శ్రోత్రియస్య+ చ+అకామహతస్య | = | ఒక **దేవ గంధర్వుల** ఆనందముతో సమానము |

| | | |
|---|---|---|
| తే+యే+శతం+దేవగంధ ర్వాణాం ఆనందాః | = | అట్టి దేవ గంధర్వుల యొక్క నూఱు రెట్లు ఆనందము |
| సః+ఏకః+పితౄణాం+ చిరలోక+లోకానామ్+ ఆనందః+శ్రోత్రియస్య +చ+అకామతస్య | = | శాశ్వితముగా పితృలోకములో వుండే ఒక **పితృ దేవతల** యొక్క ఆనందముతో సమానము. |
| తే+యే+శతం+పితౄణాం+ చిరలోక+లోకానాం+ ఆనందాః | = | శాశ్వితముగా పితృలోకములో వుంటే అట్టి పితృదేవతల యొక్క నూఱురెట్లు ఆనందము |
| సః+ఏకః+అజాన జానాం+ దేవానామ్+ఆనందః శ్రోత్రియస్య+చ+అకామహతస్య | = | బ్రహ్మ సృష్టి వలన ఏర్పడిన **దేవతల** యొక్క ఆనందముతో సమానము |
| తే+యే+శతం+అజాన- జానాం+దేవానామ్+ఆనందాః | = | అట్టి దేవతల యొక్క నూఱురెట్లు ఆనందము |
| సః+ఏకః+కర్మదేవానామ్+ దేవానామ్+ఆనందః | = | ఒక **కర్మ దేవతల** యొక్క ఆనందముతో సమానము |
| యే+కర్మణా+దేవాన్+ అపి+యంతి శ్రోత్రియస్య+ చ+ అకామహతస్య | = | కర్మలు ఆచరించి అనగా యజ్ఞయాగాది క్రతువులు, అశ్వమేధ యాగములు నూఱు చేసి దేవత్వమును పొందుదురు. వారు కర్మ దేవతలు |
| తే+యే+శతః+కర్మదేవానాం+ దేవానామ్+ఆనందాః | = | అట్టి కర్మదేవతల యొక్క నూఱురెట్లు ఆనందము |
| సః+ఏకః+దేవానామ్+ ఆనందః+శ్రోత్రియస్య +చ+అకామహతస్య | = | ఒక **దేవతల** యొక్క ఆనందముతో సమానము |

| | | |
|---|---|---|
| తే+యే+శతం+దేవానామ్+ ఆనందాః | = | దేవతల యొక్క నూఱురెట్లు ఆనందము |
| సః+ఏకః+ఇంద్రస్య+ ఆనందః+శ్రోత్రియస్య+చ+ అకామహతస్య | = | ఒక **ఇంద్రుని** ఆనందమునకు సమానము |
| తే+యే+శతమ్+ ఇంద్రస్య+ఆనందాః | = | అట్టి ఇంద్రుని ఆనందమునకు నూఱురెట్లు ఆనందము |
| సః+ఏకః+బృహస్పతేః+ ఆనందః+శ్రోత్రియస్య+ చ+అకామహతస్య | = | **బృహస్పతి** ఆనందముతో సమానము |
| తే+యే+శతమ్+బృహ- స్పతేః+ ఆనందాః | = | అట్టి బహస్పతి ఆనందముయొక్క నూఱురెట్లు ఆనందము |
| సః+ఏకః+ప్రజాపతేః+ ఆనందః+శ్రోత్రియస్య+చ +అకామహతస్య | = | ప్రజాపతి ఆనందముతో సమానము |
| తే+యే+శతమ్+ప్రజాపతేః +ఆనందాః | = | అట్టి ప్రజాపతి ఆనందమునకు నూఱు రెట్లు |
| సః+ఏకః+బ్రహ్మణః+ఆనందః శ్రోత్రియస్య+చ+అకామహతస్య | = | ఒక **బ్రహ్మానందము**తో సమానము |

బ్రహ్మానందము-మానుషానందము కంటే కొన్ని లక్షల రెట్లు గొప్పది అని వివరించుటయే దీని ముఖ్యోద్దేశము. సాధన ద్వారా ఒక్కొక్క మెట్టు ఎక్కుట వలన సాధన ప్రారంభమున కంటె గొప్ప ఆనందము గలుగును. అలా ఒక్కొక్క మెట్టు ఎక్కి పూర్వపు ఆనందము కంటె గొప్ప ఆనందమును పొంది చివరకు బ్రహ్మతో ఏకీభూతుడై బ్రహ్మానందమును పొందవలయును.

**స యశ్చాయం పురుషే। యశ్చ సావాదిత్యే। స ఏకః। సయ ఏవం విత్। అస్మాల్లోకా త్ప్రేత్య । ఏత మన్నమయ మాత్మాన ముపసంక్రామతి । ఏతం ప్రాణమయ మాత్మానముపసంక్రామతి। ఏతం మనోమయ మాత్మానముప సంక్రామతి। ఏతం విజ్ఞానమయ మాత్మాన ముప సంక్రామతి । ఏత మానందమయ మాత్మాన ముపసంక్రామతి। తద ప్యేష శ్లోకో భవతి।** (ఇతి అష్టమో ఽను వాకః)

సః - యః - చ - అయం - పురుషే - యః - చ - అసౌ - ఆదిత్యే - సః - ఏకః - సః - యః - ఏవం - విత్ - అస్మాత్ - లోకాత్ - ప్రేత్య - ఏతమ్ - అన్నమయమ్ - ఆత్మానమ్ - ఉపసంక్రామతి - ఏతం - ప్రాణమయమ్ - ఆత్మానమ్ - ఉపసంక్రామతి - ఏతమ్ - మనోమయమ్ - ఆత్మానమ్ - ఉపసంక్రామతి - ఏతం - విజ్ఞానమయమ్ - ఆత్మానమ్ - ఉపసంక్రామతి - ఏతం - ఆనందమయమ్ - ఆత్మానమ్ - ఉపసంక్రామతి - తత్ - అపి - ఏషః - శ్లోకః - భవతి.

అస్మాత్+లోకాత్ = ఈ లోకమునుంచి
ప్రేత్య = వదలి దేహత్యాగకాలమందు బ్రహ్మజ్ఞుడు
లయయోగములో సాధనలో
ఏతమ్+అన్నమయమ్ = ఈ అన్నమయకోశమునుపొందుచున్నాడు.
+ఆత్మానమ్ ఆ తర్వాత
ఉపసంక్రామతి
ఏతమ్+ప్రాణమయమ్+= ఈ ప్రాణమయ కోశమును పొందుచున్నాడు.
ఆత్మానమ్ ఆ తర్వాత
ఏతమ్+ మనోమయమ్ = మనోమయ కోశమునుపొందుచున్నాడు.
+ఆత్మానం+ ఆ తర్వాత
ఉపసంక్రామతి
ఏతమ్+విజ్ఞానమయమ్+= విజ్ఞానమయ కోశమును పొందుచున్నాడు.
ఆత్మానం+ఉపసంక్రామతి ఆ తర్వాత

| | | |
|---|---|---|
| ఏతమ్+ఆనందమయమ్ | = | ఆనందమయకోశమును పొందుచున్నాడు |
| +ఆత్మానం+ ఉపసంక్రామతి | | ఆనందమయ కోశమును దాటి |
| యః | = | ఎవడు అనగా ఆనంద్రమయకోశమును దాటిన |
| సః | = | వాడు |
| అయం+పురుషే+ ఆత్మానం+ఉపసంక్రామతి | = | ఈ పరమ పురుషునిలో కలియుచున్నాడు |
| చ | = | మఱియు |
| యః | = | ఆ పరమ పురుషుడే |
| అసౌ+ఆదిత్యే | = | యీ ఆదిత్యుడు |
| సః | = | ఆనందమయ కోశమును దాటినవాడు |
| ఏకః | = | ఆదిత్యునిలో కలియుచున్నాడు. |
| సః+యః+ఏవం+విత్ | = | ఆదిత్యుడు పురుషుడు ఒక్కడే యని ఎవడు తెలుసుకొనునో వాడు బ్రహ్మయే. |
| తత్+అపి | = | ఆ విషయమును గూర్చి |
| ఏషః+శ్లోకః | = | ఈ శ్లోకము |
| భవతి | = | చెప్పుచున్నది |

**ఆత్మ స్థానమునకు ఇంద్రియాదులు చేరలేవు**

**యతో వాచా నివర్తంతే । అప్రాప్య మనసా సహ । ఆనందం బ్రహ్మణో విద్వాన్ । న బిభేతి కుతశ్చనేతి । ఏతగ్ం హ వావ న తపతి । కి మహగ్ం సాధు నా కరవమ్ । కిమహం పాపమకరవ మితి । స య ఏవం విద్వానేతే ఆత్మానగ్గ్ం స్పృణుతే । ఉభే హ్యే వైష ఏతే ఆత్మానగ్గ్ం స్పృణుతే । య ఏవం వేద । ఇత్యుపనిషత్**

(ఇతి నవమో ఽనువాకః)

**(ఇతి బ్రహ్మానందవల్లీ)**

యతః - వాచా - నివర్తంతే - అప్రాప్య - మనసా - సహ - ఆనందం - బ్రహ్మణః - విద్వాన్ - న - బిభేతి - కుతఃచన - ఇతి - ఏతం - హ - వావ - న - తపతి - కిమ్ - అహం - సాధు - న - అకరవమ్ - కిం - అహం - పాపం - అకరవమ్ - ఇతి - సః- యః - ఏవం - విద్వాన్ - ఏతే - ఆత్మానం - స్పృణుతే - ఉభే - హి - ఏవ - ఏషః - ఏతే - ఆత్మానాం - స్పృణుతే - యః - ఏవం - వేద - ఇతి - ఉపనిషత్

| | | |
|---|---|---|
| యతః | = | ఆస్థానమును |
| అప్రాప్య | = | పొందలేక |
| మనసా+సహ | = | మనసుతో |
| వాచా | = | వాక్కుతో |
| నివర్తంతే | = | మరలుచున్నదో అనగా ఆస్థానమును ఇంద్రియాదులు చేరలేవు. |
| ఆనందం | = | ఆనందమును |
| బ్రహ్మణః+విద్వాన్ | = | ఆ స్థానమునుపొందిన విద్వాంసుడగు బ్రహ్మణ్యుడు |
| కుతఃచన | = | ఎప్పుడూ దేనిగుఱించి |
| న+బిభేతి+ఇతి | = | భయపడడు |
| ఏతం+హ+వావ | = | బ్రహ్మజ్ఞానమును పొందిన |
| న+తపతి | = | దేనికి చలించడు |
| సః+యః+విద్వాన్+ఏవ | = | ఏ విద్వాంసుడు బ్రహ్మను తెలుసుకొనునో అతడు |
| స్పృణుతే | = | ఆనందించును |
| ఉభే+హి+ఏవ+ఏషః | = | సత్ప్రవర్తన, సాధన అనే యీ రెండింటితో |
| యః+ఏవం+వేద | = | ఎవడు బ్రహ్మను తెలుసుకొనునో |

| | |
|---|---|
| ఏతే+ఆత్మానం+స్పృణుతే | వాడు ఆత్మను పొంది ఆనందించును |
| ఏతే+ఆత్మానం+స్పృణుతే | వాడు ఆత్మను పొంది ఆనందించును |

సామాన్యుడు మరణ కాలములో యమదూతలను చూచి

| | |
|---|---|
| కిం+అహం | నేను ఎందుకు |
| సాధు | సత్కార్యములు |
| న+అకరవమ్ | చేయలేకపోతిని |
| కిం+అహం | నేను ఎందుకు |
| పాపం | పాపకార్యములను |
| అకరవమ్+ఇతి | చేసితిని అని దుఃఖించును. |
| ఇతి+ఉపనిషత్ | ఇది ఉపనిషత్. ఈ ఉపనిషత్ యీ విధముగా చెప్పుచున్నది. |

**ఓం సహ నా వవతు । సహ నౌ భునక్తు । సహ వీర్యం కరవావహై। తేజస్వినా వధీత మస్తు మా విద్విషా వహై।**

**ఓం శాంతిః శాంతిః శాంతిః**

*****

# భృగువల్లీ

**ఓం సహ నా వవతు । సహ నౌ భునక్తు । సహ వీర్యం కరవావహై। తేజస్వినా వధీత మస్తు మా విద్విషా వహై।**

**ఓం శాంతిః శాంతిః శాంతిః**

**వరుణుడు - తన పుత్రుడగు భృగువునకు బ్రహ్మ గుఱించి వర్ణించి - దానిని సాధనలో గ్రహించు విధము చెప్పెను. దీనిని భార్గవీ వారుణీ విద్య అని అందురు.**

**భృగుర్వై వారుణిః । వరుణం పితరముపససార । అధీహి భగవో బ్రహ్మేతి । తస్మా ఏ తత్ప్రోవాచ । అన్నం ప్రాణం చక్షు శ్శ్రోత్రం మనో వాచ మితి । తగ్ం హో వాచ । యతో వా ఇమాని భూతాని జాయంతే యేన జాతాని జీవంతి । యత్ప్రయంత్యభి సంవిశన్తి । తద్విజిజ్ఞాస స్వ । తద్బ్రహ్మేతి స తపోఽతప్యత । స తపస్తప్త్వా ।**

**(ఇతి ప్రథమోఽను వాకః)**

భృగుః - వై - వారుణిః - వరుణం - పితరం - ఉపససార - అధీహి - భగవః - బ్రహ్మ- ఇతి - తస్మా - ఏతత్ - ప్రోవాచ - అన్నం - ప్రాణం - చక్షుః - శ్రోత్రం- మనః - వాచమ్ - ఇతి - తం - హ - ఉవాచ - యతః - వా - ఇమాని - భూతాని- జాయంతే - యేన - జాతాని - జీవంతి - యత్ - ప్రయంతి - అభిసంవిశన్తి - తత్ - విజిజ్ఞాసస్వ - తత్ - బ్రహ్మ - ఇతి - సః - తపః - అతప్యత - సః - తపః - తప్త్వా

| | | |
|---|---|---|
| వారుణిః+వై+భృగుః | = | వరుణుని పుత్రుడు అయిన భృగువు ఆత్మ దర్శన ప్రాప్తికై |
| పితరం+వరుణం | = | తండ్రియగు వరుణుని |
| ఉపససార | = | సమీపించెను |

స్థూల, సూక్ష్మ శరీరములను దహించు సాధన విధానము భార్గవీ వారుణీ విద్యగా వర్ణింపబడినది.

వరుణునిని భృగువు అడిగిన ప్రశ్న

| | | |
|---|---|---|
| భగవః | = | భగవాన్ నాకు-బ్రహ్మము అనగా నేమి? |
| బ్రహ్మ | = | బ్రహ్మను దర్శించుట ఎట్లో |
| అధీహి+ఇతి | = | చెప్పుము అని (వినయముగా అడిగెను) |

బ్రహ్మ గురించి ఇట్లు చెప్పెను

| | | |
|---|---|---|
| (తస్మా)తస్మై | = | భృగువునకు వరుణుడు |
| ఏతత్ | = | ఇటుల |
| ప్రోవాచ | = | చెప్పెను బ్రహ్మ మంటే ఏమిటి? అని అడిగిన దానికి |
| యతః+వా | = | ఎక్కడ నుంచి |
| ఇమాని+భూతాని | = | ఈ సర్వజీవరాసులు |
| జాయంతే | = | పుట్టుచున్నవో |
| యేన | = | దేని వలన |
| జాతాని | = | పుట్టినవి |
| జీవంతి | = | జీవించుచున్నవో |
| యత్ | = | దేనియందు |
| అభిసంవిశన్తి | = | ప్రవేశించి |
| ప్రయంతి | = | లయమగుచున్నవో |
| తత్+బ్రహ్మ+ఇతి | = | అదియే బ్రహ్మము. అనగా సృష్టి,స్థితి, లయములు చేయునదే బ్రహ్మము. |

దానిని ఎలా తెలుసుకొనవలయును?

బ్రహ్మవలన మనస్సు, వాక్కు, జ్ఞానేంద్రియములు, కర్మేంద్రియములు, ప్రాణము పనిచేయుచున్నవి. ఆ బ్రహ్మను తపస్సు ద్వారా తెలుసుకొనవలయును.

బ్రహ్మ అనిర్వచనీయము. కావున మాటలతో సంపూర్ణముగా వివరించలేము. స్వానుభవంలోనే గ్రహించవలయును. కావున బ్రహ్మమును తెలియు విధానమును వివరించుచున్నాను. స్వానుభవంలో బ్రహ్మను తెలుసుకున్నవాడే బ్రహ్మ యగును.

అపరవిద్యను పాటించి పుణ్యకర్మానుష్ఠాన ఫలితంలోగల దోషమును గుర్తెఱిగి పరవిద్యను బోధించ గల గురువును చేరి సాధన రహస్యములను గ్రహించి సాధన చేయవలయును. కావున వృత్తి వ్యాపారములలో మోసము, డాంబికము, మాయ, రాజకీయములు, అహంకారము-ఇవి లేనివాడే సాధన చేయగలడు.

| | | |
|---|---|---|
| అన్నం | = | అన్నము, ఆహార నియమముల ద్వారా |
| ప్రాణం | = | ప్రాణము ప్రాణాయామము వలన |
| చక్షుః | = | దృష్టి అనగా చూపును లక్ష్యమందు నిలిపి |
| శ్రోత్రం | = | చెవులు అనగా శబ్దాతీత స్థితిని చేరి |
| మనః | = | మనస్సు అనగా మనస్సును నిగ్రహించి, మనో బుద్ధులను కలిపి |
| వాచమ్+ఇతి | = | వాక్కు వాక్కును నియంత్రించి (లేదా స్వాధ్యాయనము చేసి) మౌనముగా ఉండి వీటి అన్నింటి సమిష్టియే తపస్సు. కావున బ్రహ్మను తపస్సు చేసి |
| తత్ | = | ఆ బ్రహ్మను |
| విజిజ్ఞాసస్వ | = | స్వయముగా దర్శించుము. బ్రహ్మ గుఱించి నేను మాటల ద్వారా చెప్పుట వలన నీకు బ్రహ్మతత్త్వము అవగతమవదు. ఆ బ్రహ్మను తపస్సు ద్వారానే స్వానుభవంలో గ్రహించవలయును. బ్రహ్మను దర్శించు విధానమును నీకు చెప్పితిని అని |
| తం+హ | = | భృగువునకు |
| ఉవాచ | = | వరుణుడు చెప్పెను. అంత |
| సః | = | భృగువు |
| తపః+అతప్యత | = | తండ్రి చెప్పిన విధముగా తపస్సు చేసెను |
| సః | = | భృగువు కొంతకాలము |

తపః = తపస్సు

తప్త్వా = చేసి (తండ్రి వద్దకు వచ్చెను)

దేహవ్యాపారముకు అన్నము అవసరము. కావున బ్రహ్మ సృష్టి అభివృద్ధి కొఱకు అన్నమును సృజియించెను.

ముందు ఆహారము గుఱించి స్వానుభవంలో గ్రహించవలయును. ఆహారము వలన ప్రాణము, మనస్సు పనిచేయును. ఉద్రేకము తమోగుణ లక్షణము. తమోగుణ ప్రధానమయిన ఆహారమును తీసుకున్న మనస్సు స్వల్ప విషయమునకు కూడా ఉద్రేకపడును. వాక్కు పరుషముగా వచ్చును. కోపము గలుగును. ప్రాణవాయువు యొక్క ఉచ్ఛ్వాస నిశ్వాసలు వేగముగా జరుగును. అటులనే సత్త్వగుణ, రజోగుణ లక్షణములను వాటికి సంబంధించిన ఆహారము తీసుకొనుట వలన గలుగు ప్రాణ, మనో స్థితులను స్వానుభవంలో గ్రహించవలయును.

**ఆహారము:** ప్రారంభములో సాధకుడు ఆహారము నందు శ్రద్ధ చూపవలయును. సాత్త్వికాహారము తీసుకొనవలయును. శరీరమునకు బలమును, తేజస్సును ఇచ్చునవి, మఱియు కారము, పులుపు, ఉప్పులేని ఆహారము సాత్త్వికాహారముగా చెప్పబడును. అనగా పాలు, పండ్లు, పులగము ఇవి సాత్త్వికాహారము. సాధనకాలములో మాత్రమే మాంసాహారము నిషిద్ధము. మితాహారమును తీసుకొనవలయును. మితాహారమనగా తను సాధన కాలమునకు ముందు తీసుకునే ఆహారము కంటె కొంచెం తక్కువ. అలా కొంచెం కొంచెం తక్కువ తినటం అలవాటు చేయుచూ తను పూర్వము ఎంత ఆహారము తీసుకునేవాడో అందులో సగమన్నమాట. ఆవిధముగా మితాహారము తీసికొనవలయును.

ఏకాదశి ఉపవాసముండి-జలభక్షణచేసి-ద్వాదశినాడు ఆహారమును తీసుకొన వలయును. ఈ రకముగా ఆహారముపై సాధన చేయవలయును. ఈ విధముగా చేయుచూ యమ, నియమములను పాటించుచూ ఆసనశుద్ధి నిపొందవలయును. 3 గంటల పాటు నిశ్చలముగా కూర్చొనుటయే ఆసనశుద్ధి.

**ప్రాణము:** ఆసన శుద్ధి గలిగిన తరువాతనే ప్రాణాయామము చేయవలయును. శరీరమును ఆరోగ్యవంతముగా ఉంచుకొని, నాడులను శుద్ధి చేయవలయును. కుడి ముక్కు ద్వారా గాలిని పీల్చి మరల కుడి ముక్కు ద్వారానే గాలిని వదలవలయును. ఇటుల ఉదయం 20 సార్లు, మధ్యాహ్నం 20 సార్లు, సాయంత్రం 20 సార్లు చేయవలయును. ఎడమ ముక్కు ద్వారా గాలిని పీల్చి మరల ఎడమ ముక్కు ద్వారానే గాలిని వదలవలయును. ఇటుల ఉదయం 20 సార్లు -మధ్యాహ్నం- 20 సార్లు, సాయంత్రం- 20 సార్లు చేయవలయును. కుడి ముక్కు ద్వారా గాలిని పీల్చి ఎడమ ముక్కు ద్వారా గాలిని వదలి మరల ఎడమ ముక్కు ద్వారా గాలిని పీల్చి కుడిముక్కు ద్వారా గాలిని వదలవలయును ఇలా చేయుట ఒకసారిగా గుర్తింపబడును. అటుల ఉదయం 20 సార్లు, మధ్యాహ్నం 20 సార్లు, సాయంత్రం 20 సార్లు చేయవలయును. కుమ్మరివాడు గాలితిత్తి ద్వారా గాలిని పంపి మంటను మండించినట్లు త్వరత్వరగా గాలిని పీల్చుతూ వదలవలయును. ఇప్పుడు అంతః కుంభకము- బాహ్యకుంభకములుగా ప్రాణా యామము చేయవలయును. ఇలా చేయుట వలన **నాడీశుద్ధి** అగును. ఇది ఒక పద్ధతి. ఈ విధానమును వేసవి సమయమున చేయరాదు. మంత్రజపం- ఒకే ఆసనంపై యుండి- 3 గంటలు చేయవలయును. అప్పటికి నాడీశుద్ధి అగును.

**కన్ను- దృష్టి -నాడీ శుద్ధి అయిన తర్వాత**

కన్నులు తెఱచి ముక్కు కొనపై చూపును నిలుపవలయును. ప్రారంభములో - దృష్టికి ఒక వస్తువు రెండుగా అగపడును. అనగా లక్ష్యము కుదరలేదని అర్థము. నిత్యము క్రమము తప్పకుండా చేయుట వలన కొంతకాలమునకు లక్ష్యము కుదురును. లక్ష్యము కుదరగానే మనోచాంచల్యము తగ్గును. దీనినే తారక యోగము అని అందురు. ముక్కు కొనపై దృష్టిని నిలపవలయును. ప్రాణాయామము, తారక యోగముల సమిష్టి వలన లక్ష్యము స్థిరపడును. మనస్సు చాలా వఱకు స్వాధీనమగును. అప్పుడు దృష్టిని భ్రూమధ్యస్థానమందు నిలుప వలయును. ఇతర ఆలోచనలు పూర్తిగా నశించును. అప్పుడు తారక సిద్ధి కలుగును. తారక సిద్ధి గలిగిన తర్వాత

**శ్రోత్రం :** చెవులు. 3 మాత్రల కాలముగా ఓంకారమును జపించవలయును ఆ శబ్దమును చెవుల ద్వారా వినవలయును. ప్రారంభములో మనస్సులో నిశ్శబ్దముగా ఓంకారమును చేసిన ఆలోచనల ఉద్ధృతి ఎక్కువయి మనస్సు నిశ్శబ్ద పరిధికి రాదు. అందుకే తారక సిద్ధి అయిన తరువాత శ్రోత్రము చెప్పినారు. మనస్సు నిశ్శబ్ద పరిధికి చేరవలయును అని దీని అర్థము దీనినే పురాణములో శబ్దభేదిగా చెప్పుదురు. దశరథుడు సరయూతీరంలో శ్రవణ కుమారుని పొరపాటున బాణం వేసి చంపుటగా కథగా వర్ణింపబడినది.

సాధనలో చెవులకు శబ్దం వినబడని స్థితికి చేరవలయును.

**మనస్సు:** మనస్సుకు చంచలత్వము సహజగుణము. అది నిలకడగా వుండదు. ఎప్పుడూ ఏదో విషయం ఆలోచించును. కాని మనస్సు ఏకాగ్రత పొందిన చెవులకు బాహ్య శబ్దం వినబడదు. ఈ స్థితిలో మంత్రజపం వుండదు. ఇతర చింతనలు లేక నిశ్శబ్ద పరిధికి చేరును. ఈ స్థితిలో మనస్సు బుద్ధితో సంయోగం చెంది యుండును. దీనినే అమనస్కస్థితి అని అందురు. ఇదే తురీయ స్థితి. ఈ స్థితి అనుభవైక వైద్యము. సాధకుడు బ్రహ్మానందమనుభవించును.

**వాక్కు :** సత్యమును పలుకవలయును. స్వాధ్యాయము చేయవలయును. ఓంకారమును జపించవలయును. మృదు మధుర వాక్కు గలిగియుండవలయును. ఉద్వేగము, ఉద్రేకము లేకుండా మాటలాడవలయును. సాధనాకాలములో మౌనముగా యుండవలయును.

ఈ విధముగా ఆహారము, ప్రాణము, కన్నులు, చెవులు, మనస్సు, వాక్కులద్వారా చేయు సాధనను తపస్సు అని అందురు. ఈ విషయమునే శ్రీకృష్ణుడు శారీరక, వాచిక, మానసిక తపస్సు అని మూడు భాగములుగా వివరించినాడు. వ్యాసభగవానుడు భాగవతంలో ధృతరాష్ట్రుని పరంగా తపస్సును వర్ణించినారు. ఆహారము, నీరు తీసుకొనకుండా అనగా నిశ్చలసమాధిలో పెక్కు సంవత్సరములు ఉండి తపస్సు చేసిన వారిలో శ్రేష్ఠుడు హిరణ్యకశిపుడు.

*****

## అన్నము- బ్రహ్మము

**అన్నం బ్రహ్మేతి వ్యజానాత్ । అన్నాద్ధ్యేవ ఖల్విమాని భూతాని జాయంతే । అన్నేన జాతాని జీవంతి । అన్నం ప్రయం త్యభిసంవిశం తీతి । తద్విజ్ఞాయ । పునరేవ వరుణం పితర ముపససార । అధీహి భగవోబ్రహ్మేతి । తగ్ం హో వాచ । తపసా బ్రహ్మ విజిజ్ఞాసస్వ । తపో బ్రహ్మేతి । స తపోఽతప్యత । స తపస్తప్త్వా ।**

(ఇతి ద్వితీయోఽనువాకః)

అన్నం - బ్రహ్మ - ఇతి - వ్యజానాత్ - అన్నాత్ - హి - ఏవ - ఖలు - ఇమాని - భూతాని - జాయంతే - అన్నేన - జాతాని - జీవంతి - అన్నం - ప్రయంతి - అభిసంవిశంతి - ఇతి - తత్ - విజ్ఞాయ - పునః - ఏవ - వరుణం - పితరం - ఉపససార - అధీహి - భగవః - బ్రహ్మ - ఇతి - తం - హ - ఉవాచ - తపసా - బ్రహ్మ - విజిజ్ఞాసస్వ - తపః - బ్రహ్మ - ఇతి - సః -తపః - అతప్యత - సః - తపః - తప్త్వా.

బ్రహ్మ శరీరములో అంతర్లీనముగా ఉండుట వలన బాహ్య చక్షువులకు గోచరము కాదు. ఆత్మ వలన శరీర వ్యాపారము జరుగుచున్నది. శరీర వ్యాపార లక్షణములను ఒక క్రమపద్ధతిలో సాధనచేసి గ్రహించి చివరకు వీటికి మూలకారణమయిన ఆత్మను విజ్ఞాన చక్షువు ద్వారా గ్రహించవలయును. భృగువు తపస్సు చేయుచూ ఆహారమును గుఱించి నిశితముగా పరిశీలించెను. అమితముగా భుజించునప్పుడు. మితముగా భుజించు నపుడు- నిరాహారస్థితి- ఈ మూడు స్థితులలో శరీరము ఎలా యున్నదో గమనించెను. ఆహారమునకు శరీరమునకు గల సంబంధమును గ్రహించెను. ఆహారమునకు ఇంద్రియ పాటవమునకుగల సంబంధమును గ్రహించెను.

ఆహారమునకు ప్రాణమునకు గల సంబంధమును గ్రహించెను. ఆహారమునకు మనస్సునకు గల సంబంధమును గ్రహించెను. ఆహారమునకు గుణమునకు గల సంబంధమును గ్రహించెను. ఆహారముపై గల మక్కువనే లాలస యని అందురు.

ఈ లాలస పోనంత వరకు కామోద్రేకము తగ్గదు. గుణములలో మార్పురాదు. సాధనలో ఆహారము ప్రధాన పాత్రవహించును.

భృగువు తపస్సు చేసి అన్నము గురించి స్వానుభవంలో తెలుసుకున్న తర్వాత తిరిగి తండ్రి వద్దకు వచ్చి స్వానుభవమును ప్రకటించెను.

నేను

| | | |
|---|---|---|
| అన్నం+బ్రహ్మ+ఇతి | = | అన్నము బ్రహ్మమని |
| వ్యజానాత్+హి | = | తెలుసుకొంటిని |
| అన్నాత్+ఏవ | = | అన్నము వలననే-అనగా అన్నము జీర్ణమై వీర్యము తయారై ఆ వీర్యము వలననే |
| ఖలు | = | నిజముగా |
| ఇమాని+భూతాని | = | ఈ జీవరాసులు |
| జాయంతే | = | పుట్టుచున్నవి<br>జాగ్రతావస్థలో అన్నము తినకుండా కొంతకాలం ఉన్నచో జీవరాసులు మరణించును. |
| అన్నేన | = | అన్నము చేత |
| జాతాని | = | పుట్టిన జీవరాసులు |
| జీవంతి | = | జీవించుచున్నవి |
| అన్నం | = | జీవరాసులు మరణించి అన్నంగా మారుచున్నవి |
| అభిసంవిశన్తి | = | ఇంకొక జీవరాసినోట్లో ప్రవేశించి |
| ప్రయంతి | = | లయమగుచున్నవి. ఆ జీవరాసికి ఆహారమగుచున్నది. |

ఒక జీవరాసి యొక్క స్థూలశరీరము నశించి ఇంకొక జీవరాసికి అన్నము అగుచున్నది. కాని ఆ స్థూలశరీరములో గల ఆత్మ ఏ జీవరాసికి ఆహారం అవటము లేదు. కావున ఆత్మ ఏమగును. అనే విషయం తెలుసుకొనవలయును.

| | | |
|---|---|---|
| తత్ | = | ఆ విధముగా అన్నము గురించి |
| విజ్ఞాయ | = | తెలుసుకొని |

| | | |
|---|---|---|
| పునః | = | మరల |
| పితరం+వరుణం+ఏవ | = | తండ్రియగు వరుణుని |
| ఉపససార | = | సమీపించెను |
| భగవః | = | ఓ భగవాన్ |
| బ్రహ్మ | = | బ్రహ్మ గురించి |
| అధీహి+ఇతి | = | తెలుపుము, అంత వరుణుడు |
| తపసా | = | తపస్సు చేసి |
| బ్రహ్మ | = | బ్రహ్మను |
| విజిజ్ఞాసస్వ | = | గ్రహించుము. అని |
| తం+హ | = | భృగువునకు |
| ఉవాచ | = | చెప్పెను |
| తపః+బ్రహ్మ+ఇతి | = | తపస్సే బ్రహ్మము అని చెప్పెను |
| సః | = | భృగువు |
| తపః+అతప్యత | = | తపస్సుచేసెను |
| సః | = | భృగువు |
| తపః+తప్త్వా | = | తపస్సు చేసి- (ప్రాణము గురించి కనుగొని తిరిగి తండ్రి వద్దకు వచ్చెను) |

*****

## ప్రాణము - బ్రహ్మము

**ప్రాణో బ్రహ్మేతి వ్యజానాత్। ప్రాణాద్ధ్యేవ ఖల్విమాని భూతాని జాయంతే। ప్రాణేన జాతాని జీవంతి । ప్రాణం ప్రయంత్యభిసంవిశం తీతి । తద్విజ్ఞాయ । పునరేవ వరుణం పితరముపససార। అధీహి భగవో బ్రహ్మేతి। తగ్ం హో వాచ। తపసా బ్రహ్మ విజిజ్ఞాసస్వ। తపో బ్రహ్మేతి। స తపోఽతప్యత। సతపస్తప్త్వా**

(ఇతి తృతీయోఽను వాకః)

ప్రాణః - బ్రహ్మ - ఇతి - వ్యజానాత్ - ప్రాణాత్ - హ - ఏవ - ఖలు - ఇమాని - భూతాని - జాయంతే - ప్రాణేన - జాతాని - జీవంతి - ప్రాణం - ప్రయంతి - అభిసంవిశంతి - ఇతి - తత్ - విజ్ఞాయ - పునః - ఏవ - వరుణం - పితరం - ఉపససార - అధీహి - భగవః - బ్రహ్మ - ఇతి - తం - హ - ఉవాచ - తపసా - బ్రహ్మ - విజిజ్ఞాసస్వ - తపః - బ్రహ్మ - ఇతి - సః - తపః - అతప్యత - సః - తపః - తప్త్వా.

ఆహారము తర్వాత ప్రాణముపై శ్రద్ధ చూపవలయును. భృగువు ఆహారము తర్వాత ప్రాణముపై శ్రద్ధచూపెను. ప్రాణము గుఱించి నిశితముగా పరిశీలించెను. ప్రాణమునకు ఇంద్రియములకు గల సంబంధమును కనుగొనెను. ప్రాణము వలననే దేహేంద్రియ మనోబుద్ధులు, జ్ఞానము పనిచేయుచున్నవి. ప్రాణము పోయిన తర్వాత దేహేంద్రియములున్నను మనోబుద్ధి జ్ఞానములుండవు. శరీరము జడమగుచున్నది. శరీరమునకు చేతనము ప్రాణము వలన కలుగుచున్నది. అంతఃకరణ చతుష్టయము, జ్ఞానము ప్రాణమున్నంత వఱకే వుండును.

ప్రాణమునకు గుణములకు గల సంబంధము కనుగొనెను. ప్రాణ మున్నంత వఱకే గుణముండును. చనిపోయిన పులిలో క్రూరత్వము లేదు. చనిపోయిన పాములో పగలేదు.

గుణముల చర్య ఇంద్రియముల ద్వారా జరుగును. ఇంద్రియములకు, గుణములకు, మనసుకు ఆధారము ప్రాణము. ప్రాణము మిక్కిలి ఉద్వేగ భరితమైనప్పుడు తమోగుణము; ప్రాణముఉద్వేగ భరితమైనప్పుడు రజోగుణము;
ప్రాణము ఉద్వేగ రహితమైనప్పుడు సత్త్వగుణము. ప్రాణము పూర్ణకుంభకములో ఉండిన గుణరహిత స్థితి గలుగును. లేక నిశ్చల సమాధిలో ఉండిన లేక సుషుప్తి అవస్థలోఉండిన మనస్సుకు నిలకడ తురీయ స్థితి కలుగును. ఆహారము జాగ్రతావస్థలోనే తీసికొనబడును. స్వప్న, సుషుప్తిలలో ఆహారము తీసుకొనబడదు. కాని ప్రాణము, ఈ మూడు అవస్థలలో పనిచేయును. కావున ప్రాణమును అదుపాజ్ఞలలో ఉంచవలయును. ఇటుల ప్రాణమును అదుపాజ్ఞలలో ఉంచుటకు-

(కన్ను) తారక యోగము పనిచేయును. తారక యోగం సిద్ధించిన చెవికి శబ్దము వినపడదు.

కావున కన్ను గుఱించి, చెవి గుఱించి విడిగా చెప్పనవసరము లేదు. ఈ తారనే రామాయణంలో వాలిభార్య తారగా వర్ణించినాడు. వాలి సంహారమునకు ముందు సుగ్రీవుడు కొంతకాలం వానర రాజ పరిపాల కుడుగా ఉండెను. అప్పుడు సుగ్రీవుడు తారతో కాపురము చేసెను. వాలి చనిపోయిన తర్వాత మరల తారతో కాపురం చేసినట్లు కథగా వర్ణింపబడినది. ఈ తారనే తారకాసురుడుగా వర్ణించి తారకాసుర సంహారముగా చెప్పినారు. ఈ తారకతోనే చంద్రుడు కాపురం చేసి బుధునిని కొడుకుగా పొందినాడు. ఈ రెండు కథలు యోగమును గుఱించి చెప్పెను.

| | | |
|---|---|---|
| ప్రాణః+బ్రహ్మ+ఇతి | = | ప్రాణము బ్రహ్మమని |
| వ్యజానాత్ | = | గ్రహించితిని |
| ప్రాణాత్+హ+ఏవ+ఖలు | = | ప్రాణము వలననే నిజముగా |
| ఇమాని+భూతాని | = | ఈ జీవరాసులు |
| జాయంతే | = | పుట్టుచున్నవి |
| ప్రాణేన+జాతాని+ జీవంతి | = | పుట్టిన జీవరాసులు ప్రాణము వలననే జీవించుచున్నవి |
| ప్రాణం+అభిసంవిశంతి+ ప్రయంతి+ఇతి | = | జీవరాసులు మరణించిన తర్వాత వ్యష్టి అయిన వాటి ప్రాణము, సమిష్టి అయిన అనంత ప్రాణ వాయువులో లయమగు చున్నది. |
| తత్+విజ్ఞాయ | = | ఆ విధముగా బ్రహ్మగుఱించి తెలుసుకొని |
| పునః | = | మరల |
| పితరం+వరుణం+ ఉపససార | = | తండ్రియగు వరుణుని సమీపించెను |
| భగవః+బ్రహ్మ+అధీహి | = | ఓ భగవాన్ బ్రహ్మ గుఱించి తెలుపుము. అంత వరుణుడు |

| | | |
|---|---|---|
| తపసా+బ్రహ్మ+ విజజ్ఞాసస్వ+ఇతి | = | తపస్సు చేసి బ్రహ్మను గ్రహింపుము అని |
| తపః+బ్రహ్మ+ఇతి | = | తపస్సుయే బ్రహ్మము అని |
| తం+హ+ఉవాచ | = | భృగువునకు చెప్పెను |
| సః | = | భృగువు |
| తపః+అతప్యత | = | తపస్సు చేసెను |
| సః | = | భృగువు |
| తపః+తప్త్వా | = | తపస్సుచేసి (మనస్సు గుఱించి కనుగొని తిరిగి తండ్రి వద్దకు వచ్చెను) |

*****

## మనస్సు - బ్రహ్మము

**మనో బ్రహ్మేతి వ్యజానాత్। మనసోహ్యేవ ఖల్విమాని భూతాని జాయంతే। మనసా జాతాని జీవంతి। మనః ప్రయంత్యభి సంవిశంతీతి। తద్విజ్ఞాయ పునరేవ వరుణం పితర ముపససార। అధీహి భగవో బ్రహ్మేతి। తగ్ం హో వాచ। తపసా బ్రహ్మ విజిజ్ఞాసస్వ। తపో బ్రహ్మేతి। సతపోऽతప్యత। స తపస్తప్త్వా।**

(ఇతి చతుర్థో ऽనువాకః)

మనః - బ్రహ్మ- ఇతి - వ్యజానాత్ - మనసః - హి - ఏవ - ఖలు - ఇమాని - భూతాని - జాయంతే - మనసా - జాతాని - జీవంతి - మనః - ప్రయంతి - అభిసంవిశంతి - ఇతి - తత్ - విజ్ఞాయ - పునః - ఏవ - వరుణం - పితరం - ఉపససార - అధీహి - భగవః - బ్రహ్మ - ఇతి - తం - హ - ఉవాచ - తపసా - బ్రహ్మ - విజిజ్ఞాసస్వ - తపః - బ్రహ్మ - ఇతి - సః - తపః - అతప్యత - సః - తపః - తప్త్వా.

మనసు ఆలోచనలకు పుట్టినిల్లు. ప్రతీ జీవి ఆహారం ఎలా సమకూర్చుకొనవలయును అని ఆలోచించును. తనని తనుఎలా రక్షించుకొనవలయును? తను సుఖంగా ఉండాలంటే ఏమి చేయాలి? అని ఆలోచిస్తుంది. ఆహార, నిద్రా, భయ, మైథునాలు సర్వజీవరాసులలోనూ కనిపించే లక్షణాలు.

ఆలోచనయే జీవ లక్షణం. ఈ ఆలోచనలు మనసులో పుట్టును. మనసులో పెరుగును. చివరకు మనసులో లయమగును. ఆలోచనలు ఎలా పుడతాయి? ఆలోచనలు ఎలా పెరుగుతాయి? చివరకు ఆ ఆలోచనలు ఎలా నశించుతాయి? ఆలోచనల వలన బుద్ధి ఎలా వికసించుతుంది? బుద్ధి ఎలా నశించుతుంది? ఆలోచనలనుఎలా అరికట్టుట? ఆలోచనలను అరికడితే అనుభూతి ఎలా వుంటుంది? ఆలోచనలకు గుణములకుగల అవినాభావ సంబంధమేమిటి? ఆలోచనలు ఎలా బహిర్గతమగును? అంతర్గతముగా బీజరూపముగా నున్న వాసనలు- గుణములు సంయోగం చెంది కర్మేంద్రియముల ద్వారా బాహ్యచర్యగా బహిర్గతమగును.

వికల్పము నశించవలయును. సవికల్పసమాధి నుంచి నిశ్చల సమాధికి చేరవలయును. మనస్సులో సంకల్ప వికల్పములుండును. వికల్పము నశించి సంకల్పము ఒక్కటే మిగిలిన స్థితిని ధారణ అని అందురు. ధారణ బలపడి నిశ్చల సమాధి యగును. మొదట వికల్పము నశించవలయును. దీనినే మారీచ సుబాహులుగా చెప్పి సుబాహు వధగా చెప్పిరి

| | | |
|---|---|---|
| మనః+బ్రహ్మ+ఇతి+ వ్యజానాత్ | = | బ్రహ్మము సృష్టికి కారణము. మనస్సు ఆలోచనలకు కారణము. కావున మనస్సు బ్రహ్మమని గ్రహించితిని. |
| మనసః+హి+ఏవ ఖలు+ఇమాని+భూతాని జాయంతే | = | మనసు వలననే యీ ఆలోచనలు పుట్టుచున్నవి. |
| మనసా+జాతాని+ | = | పుట్టిన ఆలోచనలు మనస్సు వలననే వృద్ధి |

| | | |
|---|---|---|
| జీవంతి | | పొందుచున్నవి. |
| మనః+అభిసంవిశంతి+ | = | ఆలోచనలు నశించిన తర్వాత అవి |
| ప్రయంతి+ఇతి | | మనసులో లయమగుచున్నవి. |
| తత్+విజ్ఞాయ | = | ఆ విధముగా మనస్సు గురించి తెలుసుకొని |
| పునః+ఏవ | = | మరల |
| పితరం+వరుణం | = | తండ్రియగు వరుణుని |
| ఉపససార | = | సమీపించెను |
| భగవః+బ్రహ్మ+అధీహి+ | = | ఓ భగవాన్. బ్రహ్మ గురించి తెలుపుము. |
| ఇతి | | అంత వరుణుడు |
| తపసా+బ్రహ్మ+ | = | తపస్సు చేసి బ్రహ్మను గ్రహింపుము అని |
| విజిజ్ఞాసస | | |
| తపః+బ్రహ్మ+ఇతి | = | తపస్సుయే బ్రహ్మము |
| తం+హ+ఉవాచ | = | భృగువునకు చెప్పెను |
| సః | = | భృగువు |
| తపః+అతప్యత | = | తపస్సు చేసెను |
| సః | = | భృగువు |
| తపః+తప్త్వా | = | తపస్సు చేసి (విజ్ఞానమును గురించి గ్రహించెను.) |

*****

**విజ్ఞానం బ్రహ్మేతి వ్యజానాత్ । విజ్ఞానాద్ధ్యేవ ఖల్విమాని భూతాని జాయంతే । విజ్ఞానేన జాతాని జీవంతి । విజ్ఞానం ప్రయంత్యభి సంవిశంతీతి । తద్విజ్ఞాయ । పునరేవ వరుణం పితరముపససార । అధీహి భగవో బ్రహ్మేతి । తగ్ంం హోవాచ । తపసా బ్రహ్మ విజిజ్ఞాసస్వ । తపో బ్రహ్మేతి । సతపోఽతప్యత । సతపస్తప్త్వా ।**

(ఇతి పంచమోఽనువాకః)

విజ్ఞానం - బ్రహ్మ - ఇతి - వ్యజానాత్ - విజ్ఞానాత్ - హి - ఏవ - ఖలు - ఇమాని- భూతాని - జాయంతే - విజ్ఞానేన - జాతాని - జీవంతి - విజ్ఞానం - ప్రయంతి - అభిసంవిశంతి - ఇతి - తత్ - విజ్ఞాయ - పునః - ఏవ - వరుణం - పితరం - ఉపససార - అధీహి - భగవః - బ్రహ్మ - ఇతి - తం - హ - ఉవాచ - తపసా - బ్రహ్మ - విజిజ్ఞాసస్వ - తపః - బ్రహ్మ - ఇతి - సః - తపః - అతప్యత - సః - తపః - తప్త్వా.

మనస్సుయొక్క ఆలోచనలను వక్రమార్గం నుంచి సక్రమమార్గంలో ఉంచునది బుద్ధి. ఇదియే విజ్ఞానము. మనస్సు బుద్ధుల కలయిక వలన విజ్ఞానము గలుగును. దీనినే యోగ పరిభాషలో ధారణయని యందురు. ధారణయనగానేమి? ధారణయే క్రియ నిలుచును? ధారణ పరిపక్వమై పూర్వ జన్మ కర్మ వాసనలు నశించిన నిశ్చల సమాధి గలుగును. ఆత్మగానూ, జీవాత్మగానూ యున్న ఆత్మ వలన మనస్సును బుద్ధిచే వశము చేసుకొనవలయును.

| | | |
|---|---|---|
| విజ్ఞానం+బ్రహ్మ+ఇతి వ్యజానాత్ | = | విజ్ఞానం బ్రహ్మమని గ్రహించితిని |
| విజ్ఞానాత్+హి+ఏవ+ ఖలు+ఇమాని+భూతాని +జాయంతే | = | విజ్ఞానం వలననే యీ జీవరాసులు పుట్టుచున్నవి. |
| విజ్ఞానేన+జాతాని+ జీవంతి | = | విజ్ఞానము వలననే యీ జీవరాసులు వృద్ధి పొందుచున్నది. |
| విజ్ఞానం+అభిసంవిశంతి+ ప్రయంతి+ఇతి | = | విజ్ఞానమునందే లయమగుచున్నవి. |
| తత్+విజ్ఞాయ | = | ఆ విధముగా బ్రహ్మ గుఱించి తెలుసుకొని |
| పునః+ఏవ | = | మరల |
| పితరం+వరుణం+ ఉపససార | = | తండ్రియగువరుణుని సమీపించెను |

| | | |
|---|---|---|
| భగవః+బ్రహ్మ+ అధీహి+ఇతి | = | ఓ భగవాన్. బ్రహ్మ గుఱించి తెలుపుము. అంత వరుణుడు. |
| తపసా+బ్రహ్మ+ విజిజ్ఞాసస్వ | = | తపస్సు చేసి బ్రహ్మను గ్రహింపుము అని |
| తపః+బ్రహ్మ+ఇతి | = | తపస్సు ద్వారానే బ్రహ్మను గ్రహించుము. తపస్సే బ్రహ్మము |
| తం+హ+ఉవాచ | = | భృగువునకు చెప్పెను |
| సః | = | భృగువు |
| తపః+అతప్యత | = | తపస్సు చేసెను |
| సః | = | భృగువు |
| తపః+తప్త్వా | = | తపస్సు చేసి బ్రహ్మను గ్రహించెను. బ్రహ్మము ఆనంద స్వరూపము. ద్వందాతీత స్థితి గలుగువరకు సర్వము ఆత్మస్వరూపము అని గ్రహించు వఱకు తపస్సు చేయవలయును. |

ఒక్కటిగాయున్న ఆత్మసృష్టిచేసి సృష్టిలోని సర్వస్థావర జంగమాత్మకముగా వర్ధిల్లి అందు అంతర్యామిగా వుంది. దీనిని స్వానుభవంలో గ్రహించుటయే విజ్ఞానము.

*****

### ఆనందము- బ్రహ్మము

### బ్రహ్మను స్వానుభవంతో గ్రహించిన వాడు బ్రహ్మయగును

**ఆనందో బ్రహ్మేతి వ్యజానాత్ । ఆనందాద్ధ్యేవ ఖల్విమాని భూతాని జాయంతే। ఆనందేన జాతాని జీవంతి । ఆనందం ప్రయంత్యభి సంవిశం తీతి । సైషాభార్గవీ వారుణీ విద్యా । పరమే వ్యోమన్ ప్రతిష్ఠితా । స య ఏవం వేద ప్రతితిష్ఠతి । అన్నవానన్నాదో భవతి । మహాన్ భవతి ప్రజయా పశుభిర్బ్రహ్మవర్చసేన । మహాన్ కీర్త్యా ।** (ఇతి షష్ఠోఽనువాకః)

ఆనందః - బ్రహ్మ - ఇతి - వ్యజానాత్ - ఆనందాత్ - హి - ఏవ - ఖలు - ఇమాని- భూతాని - జాయంతే - ఆనందేన - జాతాని - జీవంతి - ఆనందం - ప్రయంతి - అభిసంవిశంతి - ఇతి - సా - ఏషా - భార్గవీ - వారుణీ - విద్యా - పరమే - వ్యోమన్ - ప్రతిష్ఠితా - సః - యః - ఏవం - వేద - ప్రతితిష్ఠతి - అన్నవాన్ - అన్నాదః - భవతి - మహాన్ - భవతి - ప్రజయా - పశుభిః - బ్రహ్మవర్చసేన - మహాన్ - కీర్త్యా.

ధారణావతియైన బుద్ధిని పురుషుని యందు సమర్పించిన ఆనందమయుడగును. ఈ విషయమునే కథా పరముగా ఉద్దాలకుడు నచికేతునిని యమునికి దాస్యము చేయుటకు పంపినట్లు కఠోపనిషత్‌లో చెప్పబడినది. ఆనందమే బ్రహ్మ. ఈ ఆనందము బ్రహ్మానందము. ఈ స్థాయికి చేరిన సాధకుడు ఆనందమయుండై బ్రహ్మయందు కలియును. ఇంతవఱకు చెప్పిన దానిని భార్గవీ వారుణీ విద్యగా చెప్పుదురు.

రామాయణంలో ఆనందమయ స్వరూపమును వాల్మీకి లంకాదహనం చేసి, సీతను చూచివచ్చిన ఆంజనేయుడు ఇతర వానరులతో కలసి మధువనం ప్రవేశించి మధువును సర్వవానరులు గ్రోలినారు అని వర్ణించినారు. అనగా ఆంజనేయుడు ఆనందమయుడు అయ్యెను అని గ్రహించవలయును.

ద్వందములు ఉపాధి వలన గలుగును. ద్వందాతీత స్థితి ఆనందము. అప్పుడు అతడు త్రిగుణరహితుడు. ప్రకృతిని బాసి స్వస్వరూప జ్ఞానమును పొంది బంధరహితుడై అమృతత్త్వమును పొంది ఆత్మ ఆత్మతో కలిసి ఏకీభూతుడగును. ఇతడు భయ రహితుడు. దేవతలు అతనికి కానుకలు యిత్తురు.

| | | |
|---|---|---|
| ఆనందః | = | ఆనందము |
| బ్రహ్మ+ఇతి | = | బ్రహ్మమని |
| వ్యజానాత్ | = | గ్రహించితిని ఆనందము బ్రహ్మస్వరూపము. |
| ఆనందాత్+ఏవ+హి | = | ఆనందము నుంచే |

| | | |
|---|---|---|
| ఖలు | = | నిజముగా |
| ఇమాని+భూతాని | = | యీ సర్వజీవరాసులు |
| జాయంతే | = | పుట్టుచున్నవి |
| ఆనందేన+జాతాని | = | ఆనందముచే పుట్టిన జీవరాసులు |
| జీవంతి | = | జీవించుచున్నవి |
| ఆనందం+ అభిసంవిశంతి+ ప్రయంతి+ఇతి | = | ఆనందములోప్రవేశించి లయమగుచున్నవి |
| సా+ఏషా | = | ఇది |
| భార్గవీ వారుణీ+విద్యా | = | భార్గవీ వారుణీవిద్య వరుణుడు చెప్పగా భృగువు గ్రహించిన విద్య ఈ విద్య తెలిసినవాడు- స్వానుభవములో గ్రహించినవాడు |
| పరమే+వ్యోమన్ | = | హృదయాకాశములో గల ఆత్మలో |
| ప్రతిష్ఠితా | = | ప్రతిష్ఠింపబడుచున్నాడు |
| యః | = | ఎవడు |
| ఏవం+వేద | = | ఆ విధముగా తెలుసుకొనునో |
| సః | = | వాడు |
| ప్రతితిష్ఠతి | = | బ్రహ్మమందు ప్రతిష్ఠితుడగును. ఫలశ్రుతి చెప్పుచున్నాడు. |
| అన్నవాన్ | = | అన్నము గలవాడు |
| అన్నాదః | = | అన్నము తినువాడు |
| భవతి | = | అగుచున్నాడు |
| ప్రజయా | = | సంతానము తోనూ |
| పశుభిః | = | పశువులతోనూ |
| బ్రహ్మవర్చసేన | = | బ్రహ్మవర్చస్సుతోనూ |

| | | |
|---|---|---|
| మహాన్+కీర్త్యా | = | గొప్పకీర్తి కలిగి |
| మహాన్ | = | చాలా గొప్పవాడు |
| భవతి | = | అగుచున్నాడు |

*****

**అధి భౌతికముగా అన్నము బ్రహ్మము**

**అన్నం న నింద్యాత్ । తద్ వ్రతమ్ । ప్రాణో వా అన్నమ్ । శరీర మన్నాదమ్ । ప్రాణే శరీరం ప్రతిష్ఠితమ్ । శరీరే ప్రాణః ప్రతిష్ఠితః । తదేతదన్న మన్నేప్రతిష్ఠితమ్ । సయ ఏతదన్నమన్నే ప్రతిష్ఠితం వేద ప్రతితిష్ఠతి । అన్నవా నన్నాదో భవతి । మహాన్ భవతి । ప్రజయా పశుభిర్బ్రహ్మ వర్చసేన । మహాన్కీర్త్యా**

(ఇతి సప్తమోఽను వాకః)

అన్నం - న - నింద్యాత్ - తత్ - వ్రతమ్ - ప్రాణః - వా - అన్నమ్ - శరీరం - అన్నాదమ్ - ప్రాణే - శరీరం - ప్రతిష్ఠితమ్ - శరీరే - ప్రాణః - ప్రతిష్ఠితః - తత్ - ఏతత్ - అన్నమ్ - అన్నే - ప్రతిష్ఠితమ్ - సః - యః - ఏతత్ - అన్నమ్ - అన్నే - ప్రతిష్ఠితం - వేద - ప్రతితిష్ఠతి - అన్నవాన్ - అన్నాదః - భవతి - మహాన్ - భవతి- ప్రజయా - పశుభిః - బ్రహ్మవర్చసేన - మహాన్ - కీర్త్యా.

| | | |
|---|---|---|
| అన్నమ్ | = | అన్నము పరబ్రహ్మస్వరూపము కావున |
| న+నింద్యాత్ | = | అన్నమును నిందింపవద్దు |
| తత్+వ్రతమ్ | = | అది ఒక వ్రతము. అన్నమును పరబ్రహ్మగా భావించుట ఒక వ్రతము వంటిది. |
| ప్రాణః+వా+అన్నమ్ | = | ప్రాణము అన్నము |
| శరీరం+అన్నాదమ్ | = | ఆ ప్రాణమును తినువాడు శరీరములో గల జీవుడు. |

శరీరము అన్నమును స్వీకరించిన తర్వాత అనగామనము అన్నంతిన్న తర్వాత- వైశ్వానరాగ్ని పచనము చేయగా సమాన వాయువు తిన్న అన్నము వలన గలిగినశక్తిని

శరీరభాగ ములకు సమానముగా పంచుచున్నది. ఇటుల ఆహారము వలన గలిగిన ప్రాణశక్తిని శరీరముచే తిని వేయబడుచున్నది.

ప్రాణే = ప్రాణములో
శరీరం+ప్రతిష్ఠితం = శరీరము ప్రతిష్ఠితమైయున్నది అనగా ప్రాణశక్తిచే శరీరము పనిచేయుచున్నది.
శరీరే = శరీరమునందు
ప్రాణః+ప్రతిష్ఠితః = ప్రాణము ప్రతిష్ఠితమై యున్నది.

ప్రాణము స్వతహాగా ఏ పనీ చేయలేదు. ప్రాణ వ్యవహారమునకు శరీరము అవసరము. ఇటుల శరీరము - ప్రాణము పరస్పర ఆశ్రయములు. శరీరము ద్వారా ప్రాణమును, ప్రాణము ద్వారా శరీరమును వశపరచుకొనవలయును.

తత్ = అందువలన
ఏతత్+అన్నం = ఈ అన్నము-ఈ ప్రాణము
అన్నే+ప్రతిష్ఠితమ్ = అన్నములో ప్రతిష్ఠితమైయున్నది. శరీరములో ప్రాణము ప్రతిష్ఠితమై పరస్పరాశ్రయమై యున్నది.
యః = ఎవడు
ఏతత్+అన్నమ్ = ఈ అన్నము మనము తిను ఆహారము
అన్నే+ప్రతిష్ఠితం = ప్రకృతిలో ప్రతిష్ఠితమై యున్నదని
వేద = గ్రహించునో

**ఫలశృతి**

సః = వాడు
అన్నవాన్ = అన్నముగలవాడును
అన్నాదః = అన్నము తినువాడును
మహాన్ = గొప్పవాడు
భవతి = అగును
ప్రజయా = సంతానము తోనూ

పశుభిః = పశువులతోనూ అనగా సంతానము, పశువులు
బ్రహ్మవర్చసేన = బ్రహ్మవర్చసుతోనూ
ప్రతితిష్ఠతి = ప్రతిష్ఠితుడగుచున్నాడు.
మహాన్+కీర్త్యా = గొప్ప కీర్తిని గలిగి
భవతి = ఉండును.

*****

**అన్నం న పరిచక్షీత । తద్ వ్రతమ్ । ఆపోవా అన్నమ్ । జ్యోతి రన్నాదమ్ । అప్సు జ్యోతిః ప్రతిష్ఠితమ్ । జ్యోతిష్యాపః ప్రతిష్ఠితాః । తదేత దన్న మన్నే ప్రతిష్ఠితం । స య ఏత దన్న మన్నే ప్రతిష్ఠితం వేద ప్రతితిష్ఠతి । అన్నవా నన్నాదో భవతి । మహాన్భవతి । ప్రజయా పశుభిర్బ్రహ్మ వర్చసేన । మహాన్ కీర్త్యా ।**

(ఇతి అష్టమోఽనువాకః)

అన్నం - న - పరిచక్షీత - తత్ - వ్రతమ్ - ఆపః - వా - అన్నమ్ - జ్యోతిః - అన్నాదమ్ - అప్సు - జ్యోతిః - ప్రతిష్ఠితమ్ - జ్యోతిషు - ఆపః - ప్రతిష్ఠితాః - తత్- ఏతత్ - అన్నమ్ - అన్నే - ప్రతిష్ఠితం - సః - యః - ఏతత్ - అన్నమ్ - అన్నే - ప్రతిష్ఠితమ్ - వేద - ప్రతితిష్ఠతి - అన్నవాన్ - అన్నాదః - భవతి - మహాన్ - భవతి - ప్రజయా - పశుభిః - బ్రహ్మవర్చసేన - మహాన్ - కీర్త్యా.

అన్నం = అన్నమును
న+పరిచక్షీత = నిరాకరింపవద్దు
తత్+వ్రతమ్ = అది ఒక వ్రతము. అన్నమును నిరాకరింప కుండుటయే వ్రతము
ఆపః+వా = జలములు
అన్నమ్ = అన్నము
జ్యోతిః = అగ్ని
అన్నాదమ్ = తినువాడు

| | | |
|---|---|---|
| అప్సు | = | నీటిలో |
| జ్యోతిః | = | అగ్ని |
| ప్రతిష్ఠితమ్ | = | ప్రతిష్ఠితమై యున్నది |
| జ్యోతిషు | = | అగ్నిలో |
| ఆపః | = | నీరు |
| ప్రతిష్ఠితాః | = | ప్రతిష్ఠితమైయున్నది |
| తత్ | = | అందువలన |
| ఏతత్+అన్నం | = | ఈ అన్నము |
| అన్నే+ప్రతిష్ఠితమ్ | = | అన్నమునందు ప్రతిష్ఠితమై యున్నది. అగ్నియందు ప్రతిష్ఠితమై జలము-అగ్ని పరస్పరాశ్రయమైయున్నది. |
| యః | = | ఎవడు |
| ఏతత్+అన్నమ్ | = | ఈ అన్నము |
| అన్నే+ప్రతిష్ఠితం | = | అన్నములో ప్రతిష్ఠితమై యున్నదని |
| వేద | = | గ్రహించునో |
| సః | = | వాడు |
| అన్నవాన్ | = | అన్నముగలవాడును |
| అన్నాదః | = | అన్నము తినువాడును అయి |
| ప్రజయా | = | సంతానముతో |
| ప్రతితిష్ఠతి | = | ప్రతిష్ఠితుడగుచున్నాడు |
| పశుభిః | = | పశువులతోనూ అనగా సంతానము, పశువులు |
| బ్రహ్మవర్చసేన | = | బ్రహ్మవర్చస్సు |
| మహాన్+కీర్త్యా | = | గొప్పకీర్తిని గలిగి |
| భవతి | = | యుండును |
| మహాన్+భవతి | = | గొప్పవాడగును. |

*****

**అన్నం బహు కుర్వీత । తద్ వ్రతమ్ । పృథివీ వా అన్నమ్ । ఆకాశోఽన్నాదః । పృథివ్యామాకాశః ప్రతిష్ఠితః । ఆకాశే పృథివీ ప్రతిష్ఠితా । తదేత దన్నమన్నే ప్రతిష్ఠితమ్ । సయ ఏతదన్నమన్నే ప్రతిష్ఠితం వేద ప్రతితిష్ఠతి । అన్నవా నన్నాదో భవతి । మహాన్భవతి । ప్రజయా పశుభి బ్రహ్మవర్చసేన । మహాన్కీర్త్యా ।**

(ఇతి నవమోఽను వాకః)

అన్నం - బహు - కుర్వీత - తత్ - వ్రతమ్ - పృథివీ - వా - అన్నమ్ - ఆకాశః - అన్నాదః - పృథివ్యాం - ఆకాశః - ప్రతిష్ఠితః - ఆకాశే - పృథివీ - ప్రతిష్ఠితా - తత్ - ఏతత్ - అన్నమ్ - అన్నే - ప్రతిష్ఠితమ్ - సః - యః - ఏతత్ - అన్నమ్ - అన్నే - ప్రతిష్ఠితం - వేద - ప్రతితిష్ఠతి - అన్నవాన్ - అన్నాదః - భవతి - మహాన్ - భవతి- ప్రజయా - పశుభిః - బ్రహ్మవర్చసేన - మహాన్ - కీర్త్యా.

| | | |
|---|---|---|
| అన్నమ్ | = | పాడి పంటలను-అన్నమును |
| బహు | = | ఎక్కువ |
| కుర్వీత | = | చేయవలయును. పంటలను బాగా పండించ వలయును. పాడిని అభివృద్ధి చేయవలయును. |
| తత్+వ్రతమ్ | = | అది ఒక వ్రతము |
| పృథివీ+వా | = | భూమి |
| ఆకాశః | = | ఆకాశము |
| అన్నమ్ | = | అన్నము గలుగుచున్నది. ఆకాశమందలి మేఘములు వర్షించుటవలన భూమిపై అన్నము గలుగుచున్నది. |
| అన్నాదః | = | ఆహారమును తినువాడు జీవుడు |
| పృథివ్యాం | = | భూమియందు |
| ఆకాశః | = | ఆకాశములవలన |
| ప్రతిష్ఠితః | = | ప్రతిష్ఠితమై యున్నది |
| ఆకాశే | = | ఆకాశమునందు |
| పృథివీ | = | భూమి |

ప్రతిష్ఠితా = ప్రతిష్ఠితమై యున్నది
తత్ = అందువలన
ఏతత్+అన్నమ్ = ఈ అన్నము
అన్నే+ప్రతిష్ఠితమ్ = అన్నమునందు ప్రతిష్ఠితమై యున్నవి
యః = ఎవడు
ఏతత్+అన్నమ్ = ఈ అన్నము
అన్నే+ప్రతిష్ఠితం = అన్నములో ప్రతిష్ఠితమైయున్నదని
వేద = గ్రహించునో
సః = వాడు
అన్నవాన్ = అన్నము గలవాడును
అన్నాదః = అన్నము తినువాడును అయి
ప్రజయా = సంతానముతో
ప్రతితిష్ఠతి = ప్రతిష్ఠితుడగుచున్నాడు
పశుభిః = పశువులతోనూ అనగా సంతానము, పశువులు
బ్రహ్మవర్చసేన = బ్రహ్మవర్చస్సు
మహాన్+కీర్త్యా = గొప్పకీర్తి గలిగి
భవతి = ఉండును
మహాన్+భవతి = గొప్పవాడగును.

*****

**పదవ అనువాకము**

అపర ధర్మము అన్నదాన విధి చెప్పబడుచున్నది. అన్నమును ఆప్యాయముగా వడ్డించవలయును.

బ్రహ్మను గ్రహించినవాడు బ్రహ్మయగును.

**న కంచన వసతౌ ప్రత్యాచక్షీత । తద్వ్రతమ్ । తస్మాద్యయా కయా చ విధయా బహ్వన్నం ప్రాప్నుయాత్ । ఆరాద్యస్మా అన్నమిత్యా చక్షతే । ఏతద్వై ముఖతో౽**

**న్నగ్ం రాద్ధమ్ । ముఖతోఽస్మా అన్నగ్ం రాధ్యతే । ఏతద్వై మధ్యతోఽన్నగ్ం రాద్ధమ్ । మధ్యతోఽస్మా అన్నగ్ం రాధ్యతే । ఏతద్వా అన్తతోఽన్నగ్ం రాద్ధమ్ । అన్తతోఽస్మా అన్నగ్ం రాధ్యతే య ఏవం వేద ।**

న - కంచన - వసతౌ - ప్రత్యాచక్షీత - తత్ - వ్రతమ్ - తస్మాత్ - యయా - కయా - చ - విధయా - బహు - అన్నం - ప్రాప్నుయాత్ - ఆరాది - అస్మా (అస్మై) - అన్నమ్ - ఇతి - ఆచక్షతే - ఏతత్ - వై - ముఖతః - అన్నగ్ం - రాద్ధమ్- ముఖతః - అస్మా (అస్మై) - అన్నమ్ - రాధ్యతే - ఏతత్ - వై - మధ్యతః - అన్నం - రాద్ధమ్ - మధ్యతః - అస్మా (అస్మై) - అన్నమ్ - రాధ్యతే - ఏతత్ - వై - అన్తతః - అన్నం - రాద్ధమ్ - అన్తతః - వై - అస్మా (అస్మై) అన్నం - రాధ్యతే - యః - ఏవం-వేద

గురువు శిష్యునకు గృహస్థ ధర్మమును గుఱించి మఱియొక మారు హెచ్చరించు చున్నాడు. అతిథి, అభ్యాగతులలో ఎవరయినా తనవద్దకు తలదాచుకొనుటకు, ఆకలితో అన్నము కొఱకు వచ్చిన వారికి గృహస్థుడు ఆశ్రయమిచ్చి అన్నము పెట్టి ఆదరింపవలయును. ఇది గృహస్థుని విధి. దీనిని శ్రద్ధగా పాటింపవలయును. అంతేగాని ఉపేక్ష, ఉదాసీనత, న్యూనత భావముతో చేయరాదు. వ్యవసాయము ద్వారా పంటలను బాగా పండించవలయును. దేశమును పాడి పంటలతో సమృద్ధిగా ఉంచవలయును. వ్యవసాయము ద్వారా అన్నమును ఎక్కువగా సంపాదించ వలయును. అన్నదాన విధిని చెప్పుచున్నాడు.

| | | |
|---|---|---|
| వసతౌ | = | వసతి, ఆహారము కావలయునని కోరి వచ్చిన అనగా ఆకలిగా వుంది అన్నము పెట్టండని, తలదాచు కోవటమునకు వసతి కావలయునని వచ్చిన |
| కంచన | = | ఎవరిని గాని, బ్రహ్మచర్య గృహస్థ, వానప్రస్థ, సన్యాస ఆశ్రమములలోని ఎవరినిగాని |
| న+ప్రత్యాచక్షీత | = | ఆశ్రయం ఇవ్వకుండా, అన్నము పెట్టకుండా పంప వద్దు. |

| | | |
|---|---|---|
| తత్+వ్రతమ్ | = | అలా ఆశ్రయమిచ్చుట, అన్నము పెట్టుట ఒక వ్రతము. గృహస్థుడు ఇది పాటించవలసిన విధి |
| తస్మాత్ | = | అలా వచ్చిన వారిని అన్నము లేదని పంపరాదు కావున |
| యయా కయాచ విధయా | = | వ్యవసాయము - తపస్సులనే ఏ పద్ధతుల ద్వారా నైనను ఏ విధముగానైనను ధర్మమార్గమున |
| బహు | = | ఎక్కువగా |
| అన్నం | = | అన్నమును |
| ప్రాప్నుయాత్ | = | సంపాదించవలయును. |

తన గురించి, అతిథి అభ్యాగతుల గురించి ఆహారమునకు కావలసిన వస్తువులను ముందుగా జాగ్రత్తపడి సంపాదించి నిల్వయుంచవలయును. అన్న విక్రయము పాపముగా వేదకాలములో పరిగణింప బడినది. వసిష్ఠులవారు విశ్వామిత్రునికి, వాని పరివారమునకు అన్నము పెట్టి ఆదరించినారు. భరద్వాజుడు భరతునికి వాని పరివారమునకు అన్నము పెట్టి ఆదరించినారు. సీతారామ లక్ష్మణులకు ఋషులు అన్నము పెట్టి ఆదరించినారు. అన్నము కొఱకు వచ్చిన వారికి ఎలా పెట్టవలయునో వివరించుచున్నాడు. మంచి గృహస్థుడు

| | | |
|---|---|---|
| అస్మై | = | అతిథి అభ్యాగతునికి |
| అన్నం | = | అన్నము వడ్డనకు |
| ఆరాది+ఇతి | = | సిద్ధముగా నున్నదని |
| ఆచక్షతే | = | చెప్పుచున్నారు |
| ఏతత్+వై | = | ఎవరు యీ విధముగా - అనగా |
| ముఖతః | = | స్వయముగా, అన్నమును ఆప్యాయముగా అతిథి అభ్యాగతులకు వడ్డించవలయును. అన్నదానము గురించి రామాయణములో బాలకాండలో అశ్వమేధ యాగ సందర్భమున వివరించినాడు. |

| | | |
|---|---|---|
| అన్నం | = | అన్నమును |
| రాద్ధం | = | వడ్డనకు సిద్ధముగా నున్నదని అతిథి అభ్యాగతులకు వినయముగా సమర్పించిన |
| అస్మై | = | అతనికి |
| ముఖతః+అన్నం+ రాధ్యతే | = | అదేవిధముగా మంచిగా అన్నము దొరకు చున్నది. |
| ఏతత్+మధ్యతః+అన్నం +రాద్ధం | = | తను స్వయంగా గాక ఇతర గృహస్థుల ద్వారా అతిథి అభ్యాగతులకు అన్నం సిద్ధము చేసినచో |
| ఏతత్+వై | = | ఈ విధముగా చేసినవానికి ఆ విధముగనే |
| అస్మై | = | అతనికి |
| మధ్యతః+అన్నమ్+ రాధ్యతే | = | అదే విధముగా అన్నము దొరకుచున్నది |
| అంతతః+అన్నం+రాద్ధం | = | నిరసన భావనతో అన్నము పెట్టిన, |
| ఏతత్+వై | = | ఈ విధముగా చేసినవానికి ఆ విధముగనే |
| అస్మై | = | అతనికి అన్నము దొరుకును |
| అంతతః+అన్నం+ రాధ్యతే | = | అలాగే అన్నము ఇతరులు పెట్టుదురు |
| యః+ఏవం+వేద | = | ఎవడు యీ విధముగా తెలుసుకొని అతిథి అభ్యాగతులను ఆదరించునో వాడు ఉత్తముడు. |

అతిథి అభ్యాగతులను ఆదరించి భోజన సదుపాయములు కల్పించవలయును.

*****

క్షేమ ఇతి వాచి । యోగక్షేమ ఇతి ప్రాణాపానయోః । కర్మేతి హస్తయోః । గతి రితి పాదయోః । విముక్తి రితి పాయౌ । ఇతి మానుషీస్సమాజ్ఞాః అథ దైవీః । తృప్తిరితి వృష్టౌ । బలమితి విద్యుతి । యశ ఇతి పశుషు జ్యోతిరితి నక్షత్రేషు । ప్రజాపతిరమృత మానన్ద ఇత్యుపస్థే । సర్వమిత్యాకాశే । తత్ప్రతిష్ఠేత్యుపాసీత । ప్రతిష్ఠావాన్ భవతి । తన్మహ ఇత్యుపాసీత । మహాన్భవతి । తన్మన ఇత్యుపాసీత । మానవాన్భవతి । తన్నమ ఇత్యుపాసీత । నమ్యన్తేఽస్మై కామాః । తద్బ్రహ్మేత్యుపాసీత । బ్రహ్మవాన్భవతి । తద్బ్రహ్మణః పరిమర ఇత్యుపాసీత । పర్యేణం మ్రియం తేద్విషన్తః సపత్నాః । పరియేఽప్రియాభ్రాతృవ్యాః । స యశ్చాయం పురుషే । యశ్చాసావాదిత్యే । స ఏకః । సయ ఏవం విత్ । అస్మాల్లోకా త్ప్రేత్య । ఏతమన్నమయ మాత్మాన ముపసంక్రమ్య । ఏతం ప్రాణమయ మాత్మాన ముపసంక్రమ్య । ఏతం మనోమయ మాత్మాన ముపసంక్రమ్య । ఏతంవిజ్ఞానమయ మాత్మాన ముపసంక్రమ్య । ఏత మానన్దమయ మాత్మాన ముపసంక్రమ్య । ఇమాన్లోకాన్కామాన్నీకాను రూప్యను సంచరన్ । ఏతత్సానుగా యన్నాస్తే ।

క్షేమః - ఇతి - వాచి - యోగక్షేమః - ఇతి - ప్రాణాపానయోః - కర్మ - ఇతి - హస్తయోః - గతిః - ఇతి - పాదయోః - విముక్తిః - ఇతి - పాయౌ - ఇతి - మానుషీః - సమాజ్ఞాః - అథ - దైవీః - తృప్తిః - ఇతి - వృష్టౌ - బలం - ఇతి - విద్యుతి - యశః - ఇతి - పశుషు - జ్యోతిః - ఇతి - నక్షత్రేషు - ప్రజాపతిః - అమృతమ్ - ఆనన్దమ్ - ఇతి - ఉపస్థే - సర్వమ్ - ఇతి ఆకాశే - తత్ - ప్రతిష్ఠా - ఇతి - ఉపాసీత - ప్రతిష్ఠావాన్ - భవతి - తత్ - మహః - ఇతి - ఉపాసీత - మహాన్ - భవతి - తత్ - మనః - ఇతి - ఉపాసీత - మానవాన్ - భవతి - తత్ - నమః - ఇతి - ఉపాసీత - నమ్యన్తే - అస్మై - కామాః - తత్ - బ్రహ్మ - ఇతి - ఉపాసీత - బ్రహ్మవాన్ - భవతి - తత్ - బ్రహ్మణః - పరిమరః - ఇతి - ఉపాసీత - పరి - ఏణం - మ్రియన్తే - ద్విషన్తః - సపత్నాః - పరి - యే - అప్రియాః -

భ్రాతృవ్యాః - సః - యః - చ - అయం - పురుషే - యః - సః - చ - అసౌ - ఆదిత్యే - సః - ఏకః - సః - యః - ఏవం - విత్ - అస్మాత్ - లోకాత్ - ప్రేత్య - ఏతమ్ - అన్నమయమ్ - ఆత్మానమ్ - ఉపసంక్రమ్య - ఏతం - ప్రాణమయం - ఆత్మానమ్ - ఉపసంక్రమ్య - ఏతం - మనోమయమ్ - ఆత్మానమ్ - ఉపసంక్రమ్య- ఏతం - విజ్ఞానమయమ్ - ఆత్మానమ్ - ఉపసంక్రమ్య - ఏతం - ఆనన్దమయం - ఆత్మానం - ఉపసంక్రమ్య - ఇమాన్ - లోకాన్ - కామాన్నీ - కామరూపీ - అనుసంచరన్ - ఏతత్ - సామ - గాయన్ - ఆస్తే.

కర్మేంద్రియములు చేయుపనులను వివరించుచున్నది

| | | |
|---|---|---|
| యోగక్షేమః | = | యోగక్షేమము ఆత్మ దర్శన ప్రాప్తివలన గలుగును. |
| క్షేమః | = | క్షేమము |
| వాచి+ఇతి | = | వాక్కునందు మఱియు |
| హస్తయోః+ఇతి | = | చేతుల యందు ప్రతిష్ఠితమైయున్నది |
| గతిః | = | నడచుట |
| పాదయోః+ఇతి | = | పాదములయందు ప్రతిష్ఠితమైయున్నది |
| విముక్తి | = | మలవిసర్జన |
| పాయౌ+ఇతి | = | గుదమునందు ప్రతిష్ఠితమైయున్నది |
| ఆనందమ్ | = | ఆనందము |
| ఉపస్థే+ఇతి | = | ఉపస్థలయందు ప్రతిష్ఠితయైయున్నది |
| ప్రాణాపానయోః+ఇతి | = | ప్రాణాపానములందు దేహవ్యాపారము పనిచేయుట గలదు. |
| మానుషీః+సమాజ్ఞాః+ కర్మ+ఇతి | = | ఇది మానవ దేహమునకు సంబంధించిన క్రియా కలాపములు |

| | | |
|---|---|---|
| అథ | = | ఆ తర్వాత |
| దైవీః | = | దైవీ సంబంధములు చెప్పుచున్నాను |
| వృష్టౌ+ఇతి+తృప్తిః | = | మేఘమునందు ఉఱుము మెఱుపులు వర్షము, ప్రతిష్ఠితమైయున్నది. వర్షము వలన ఆహారము లభించును. ఆ విధముగా ఆ తృప్తి ఆహారము నందు ప్రతిష్ఠితమై యున్నది. |
| బలం+ఇతి+విద్యుతి | = | పిడుగునందు బలము ప్రతిష్ఠితమై యున్నది. |
| యశః | = | సంపద, కీర్తి |
| పశుషు+ఇతి | = | పశుసంపదలో ప్రతిష్ఠితమై యున్నది. వేదకాలములో పశుసంపదయే సంపదగా గుర్తిపబడినది. ఒకనికి 100 ఆవులు, మఱియొకనికి వెయ్యి ఆవులుయున్న 1000 ఆవులు యున్నవాడు సంపద పరుడు. కీర్తి గలవాడు. |
| జ్యోతిః | = | కాంతి |
| నక్షత్రేషు+ఇతి | = | స్వయం ప్రకాశమై, సూర్యునికంటే కొన్ని రెట్లు పెద్దవయిన నక్షత్రములలో ప్రతిష్ఠితమై యున్నది. |
| అమృతమ్ | = | అమృతము |
| ప్రజాపతిః | = | ప్రజాపతియందు ప్రతిష్ఠితమయి ఉన్నది |
| సర్వమ్ | = | సర్వ స్థావర జంగమములు |
| ఆకాశే+ఇతి | = | ఆకాశమునందు ప్రతిష్ఠితమైనయున్నది |
| తత్ | = | ఆత్మ |
| ప్రతిష్ఠ+ఇతి | = | అన్నిటికి ఆధారమని గ్రహించి ఆ ఆత్మను |
| ఉపాసీత | = | ఉపాసించ వలయును అలా ఉపాసించినవాడు |

| | | |
|---|---|---|
| ప్రతిష్ఠావాన్+భవతి | = | ప్రతిష్ఠావంతుడగుచున్నాడు అనగా ఆత్మ అగుచున్నాడు |
| తత్+మహః+ఇతి | = | బ్రహ్మము సర్వోత్కృష్టమని |
| ఉపాసీత | = | ఉపాసించవలయును. అలా ఉపాసించిన వాడు |
| మహాన్+భవతి | = | సర్వోత్కృష్టుడగుచున్నాడు. |
| తత్+మనః+ఇతి | = | దానిని మనస్సును పనిచేయుదానినిగా |
| ఉపాసీత | = | ఉపాసించవలయును. అలా ఉపాసించిన వాడు |
| మానవాన్+భవతి | = | మహనీయుడగుచున్నాడు |
| తత్+నమః+ఇతి | = | దానికి నమస్కరించి |
| ఉపాసీత | = | ఉపాసించ వలయును |
| అస్మై | = | అతనికి |
| కామాః | = | సర్వకోరికలు |
| నమ్యంతే | = | లభ్యమగుచున్నవి. నెఱవేఱుచున్నవి. |
| తత్+బ్రహ్మ+ఇతి | = | దానిని బ్రహ్మమని |
| ఉపాసీత | = | ఉపాసించవలయును అతడు |
| బ్రహ్మవాన్+భవతి | = | బ్రహ్మయగుచున్నాడు |
| తత్+బ్రహ్మణః | = | ఆ బ్రహ్మమును |
| పరిమరః+ఇతి | = | లయకారకునిగా |
| ఉపాసీత | = | ఉపాసించ వలయును |
| పరిఏణం (ఏనం) | = | అట్టివానిని |
| ద్విషంతః | = | ద్వేషించు |
| స పత్నాః | = | శత్రువులును, మఱియు |
| అప్రియాః | = | అప్రియులైన |

| | | |
|---|---|---|
| భ్రాతృవ్యాః | = | జ్ఞాతులును |
| యే | = | ఎవరుకలరో వారు |
| పరిమ్రియన్తే | = | చనిపోవుదురు |
| అయం+పురుషే | = | ఆ జీవపురుషునియందు |
| యః | = | ఏ ఆత్మ కలదో |
| సః | = | ఆ ఆత్మ |
| చ | = | మఱియు |
| అసౌ+ఆదిత్యే | = | ఈ ఆదిత్య పురుషుని యందు |
| యః | = | ఏ ఆత్మ కలదో |
| సః | = | ఆ ఆత్మ |
| ఏకః | = | ఒక్కటే |
| యః | = | ఎవడు |
| ఏవమ్ | = | ఈ విధముగా |
| విత్ | = | స్వానుభవంలో గ్రహించునో |
| సః | = | అతడు |
| అస్మాత్+లోకాత్ | = | ఈ లోకమునుంచి |
| ప్రేత్యా | = | బయలుదేరి |
| ఆత్మానం | = | తనయొక్క |
| ఏతమ్+ అన్నమయమ్ | = | ఈ అన్నమయ కోశమును |
| ఉపసంక్రమ్య | = | పొంది ఆపై |
| ఆత్మానం | = | తనయొక్క |
| ఏతమ్+ప్రాణమయమ్ | = | ఈ ప్రాణమయ కోశమును |
| ఉపసంక్రమ్య | = | పొంది ఆపై |

ఏతం+మనోమయమ్+ = ఈ మనోమయ కోశమును పొంది ఆపై
ఆత్మానమ్+ఉపసంక్రమ్య

ఏతం+విజ్ఞానమయం+ = ఈ విజ్ఞానమయ కోశమును పొంది ఆపై
ఆత్మానమ్+ఉపసంక్రమ్య

ఏతం+ఆనందమయం+ = ఈ ఆనందమయ కోశమును పొంది ఆపై
ఆత్మానం+ఉపసంక్రమ్య

ఇమాన్+లోకాన్ = ఈ లోకములన్నింటిని దాటి బ్రహ్మ మందు కలియును

కామాన్నీ = పూర్ణకాముడై

కామరూపీ = బ్రహ్మస్వరూపియై - కామరూపమును ధరించి తానే బ్రహ్మకావున కోరిన రూపము ధరించి

అనుసంచరన్ = పదునాలుగు లోకములు పర్యటించుచు (నారదుని వలె పర్యటించును)

ఏతత్+సామ = ఈ దిగువ చెప్పబోవు సామమును

గాయన్+ఆస్తే = పాడుచూ పునరావృత్తి రహితుడై ఉండును

*****

## తను ఆత్మయై స్వానుభవ ప్రకటన

### బ్రహ్మజిజ్ఞాస

**హా3వు హా3వు హా3వు । అహమన్న మహమన్న మహమన్నమ్ । అహ మన్నాదో 3ఽ హమన్నాదో3ఽ హమన్నాదః । అహగ్ శ్లోక కృదహగ్గ్ శ్లోక కృదహగ్ శ్లోకకృత్। అహమస్మి ప్రథమజా ఋతా3స్య । పూర్వం దేవేభ్యో అమృతస్యనా3భాఇ । యో మాదదాతి స ఇదేవమా3ఽ ఽ వాః । అహమన్న మన్న మదన్త మా3ద్మి । అహం విశ్వం భువనమభ్య భవామ్ । సువర్ణ జ్యోతీః । య ఏవం వేద । ఇత్యుపనిషత్ ॥**

(ఇతి దశమోఽను వాకః)

(ఇతి భృగువల్లీ)

హావు - హావు - హావు - అహమ్ - అన్నమ్ - అహమ్ - అన్నమ్ - అహమ్ - అన్నమ్ - అహమ్ - అన్నాదః - అహమ్ - అన్నాదః - అహమ్ - అన్నాదః - అహం- శ్లోకకృత్ - అహమ్ - శ్లోకకృత్ - అహమ్ - శ్లోకకృత్ - అహమ్ - అస్మి - ప్రథమజాః - ఋతస్య - పూర్వం - దేవేభ్యః - అమృతస్య - నాభిః - యః - మా - దదాతి - సః - ఇతి - ఏవ - మా - ఆవాః । అహమ్ - అన్నమ్ - అన్నమ్ - అదన్తమ్ - ఆద్మి - అహం - విశ్వం - భువనమ్ - అభ్యభవాం - సువర్ణ - జ్యోతిః - యః - ఏవం - వేద - ఇతి - ఉపనిషత్

సాధకుడు పంచకోశములను దాటి బ్రహ్మ స్వరూపుడై స్వాను భవమును ప్రకటించుచున్నాడు.

| | | |
|---|---|---|
| హా3వు+హా3వు+హా3వు | = | ఆహా! ఏమి ఆశ్చర్యము, ఏమి ఆశ్చర్యము, ఏమి ఆశ్చర్యము. |
| అహమ్+అన్నమ్ | = | నేనే అన్న స్వరూపుడను - నేనే అన్నమును |
| అహమ్+అన్నమ్ | = | నేనే అన్న స్వరూపుడను |

| | | |
|---|---|---|
| అహమ్+అన్నమ్ | = | నేనే అన్న స్వరూపుడను |
| అహమ్+అన్నాదః | = | నేనే అన్నము తినువాడను- నేనే అన్నమును తినువాడను |
| అహమ్+అన్నాదః | = | నేనే అన్నము తినువాడను |
| అహమ్+అన్నాదః | = | నేనే అన్నము తినువాడను |
| అహమ్+శ్లోకకృత్ | = | నేనే అన్నమును-అన్నము తినువాడను సర్వ జీవరాసులను కలుపు వాడను |
| అహమ్+శ్లోకకృత్ | = | నేనే అన్నమును-అన్నము తినువాడనుసర్వ జీవరాసులను కలుపు వాడను |
| అహమ్+శ్లోకకృత్ | = | నేనే అన్నమును-అన్నము తినువాడను సర్వ జీవరాసులను కలుపు వాడను |
| దేవేభ్యః+పూర్వం | = | దేవతలకంటె పూర్వము |
| అహమ్+ప్రథమజా+ అస్మి | = | నేనే మొదట పుట్టిన - స్వయంభువుడైన పురుషుడను |
| ఋతస్య+అమృతస్య+ | = | సత్య స్వరూపుడను. అమృతస్వరూపుడను. |
| (నాభాఇ) నాభిః | = | కేంద్ర బిందువును (నాభిని). నేను రథచక్రపు నాభిలో రథము యొక్క ఆకులు కూడినట్లు విరాట్‌పురుషుడనైన నాయందు ఈ సర్వమూ కూడి ఉన్నది. |
| యః | = | ఎవడు సర్వజీవులను నన్నుగా భావించి |
| దదాతి+మా | = | నాకు ఆహారమును యిచ్చుచున్నాడో |
| సః+ఏవ | = | వాడు - ఆహారము జీవులకు యిచ్చి వాటిని |
| ఆవాః (అవతి)+ఇతి | = | రక్షించును |
| అహమ్+అన్నమ్ | = | నేనే అన్నమును |
| అన్నమ్+అదన్తం | = | అన్నము తినువాడను నేనే |

| | | |
|---|---|---|
| అద్మి | = | నాకు ఆహారము పెట్టకుండా తినువాటిని నేను తిందును |
| అహం | = | నేను |
| విశ్వం+భువనం | = | ఈ విశ్వమునంతా |
| అభ్యభవాం | = | మ్రింగివేయుదును అనగా నేను లయకారకుడను |
| సువర్ణ+జ్యోతిః | = | సూర్యుని వలె స్వయంప్రకాశకుడను |
| యః+ఏవం+ | = | ఎవడు ఈ విధముగా గ్రహించునో |
| వేద | = | వాడు బ్రహ్మయగును |
| ఇతి+ఉపనిషత్ | = | ఇది భృగువల్లి ఉపనిషత్ |

ఓం శాంతిః శాంతిఃశాంతిః

*****

**హరిః ఓం। శం నో మిత్రః శం వరుణః। శం నో భవత్వర్యమా శం న ఇంద్రో బృహస్పతిః । శంనో విష్ణు రురుక్రమః । నమో బ్రహ్మణే । నమస్తే వాయో । త్వమేవ ప్రత్యక్షం బ్రహ్మాసి । త్వా మేవ ప్రత్యక్షం బ్రహ్మ వదిష్యామి । ఋతం వదిష్యామి । సత్యం వదిష్యామి । తన్మామవతు। తద్వక్తార మవతు । అవతుమామ్। అవతు వక్తారమ్**

**ఓం శాంతిః శాంతిః శాంతిః**

**ఓం సహ నా వవతు । సహ నౌ భునక్తు । సహ వీర్యం కరవావహై। తేజస్వినా వధీత మస్తు మా విద్విషా వహై।**

**ఓం శాంతిః శాంతిః శాంతిః**

## ఈశోపనిషత్

**అగ్నినా తపోఽన్వ భవద్వాచా బ్రహ్మ మణినా రూపాణీ న్ద్రేణ దేవాన్వాతేన ప్రాణా న్త్సూర్యేణ ద్యాం చన్ద్రమసా నక్షత్రాణి యమేన పితౄన్రాజ్ఞా మనుష్యాన్ఫలేన నాదేయానజగరేణ సర్పాన్వ్యాఘ్రేణాఽఽరణ్యా న్పశూఞ్ఛ్యేనేన పతత్రిణో వృష్ణాఽ శ్వాన్వృషభేణ గా బస్తేనాజా వృష్ణినాఽవీర్వ్రీహిణాఽన్నాని యవేనౌషధీ ర్న్యగ్రోధేన వనస్పతీ నుదుమ్బరేణోర్జం గాయత్రియా ఛన్దాగ్ంసి త్రివృతా స్తోమా న్బ్రాహ్మణేన వాచమ్।**

(కృష్ణ యజుర్వేదీయ తైత్తిరీయ సంహిత - సప్తమ కాండే - తృతీయ ప్రపాఠకే - చతుర్దశోఽనువాకః )

అగ్ని రూపుడై సర్వ తపస్సును, వాక్కురూపుడై అన్ని మంత్రములను, మణిరూపుడై ప్రతి బింబములను, ఇంద్రరూపుడై సర్వదేవతలను, వాయురూపుడై ప్రాణములను, సూర్యరూపుడై దివిని, చంద్రరూపుడై నక్షత్రములను, యమధర్మరాజురూపుడై పితృదేవతలను, రాజుగా మనుష్యులను, సర్వఫలరూపుడై రసములను, అజగర రూపుడై సర్పములను, పెద్దపులిరూపుడై అరణ్య పశువులను, డేగరూపుడై పక్షులను, అశ్వ వృషభ, మేక, పొట్టేలురూపుడై అశ్వమును గోవులను, మేకలను, గొఱ్ఱెలను, వ్రీహాదిరూపుడై అన్నాదికమును వ్యాపించెను.

దీనినే విభూతి యోగముగా విశ్వరూపముగా  భగవద్గీతలో వర్ణించినారు.

*****

## శాంతిపాఠము

**ఓం పూర్ణమదః పూర్ణమిదం పూర్ణాత్ పూర్ణ ముదచ్యతే**
**పూర్ణస్య పూర్ణమాదాయ పూర్ణ మేవావ శిష్యతే.**
**ఓం శాంతిఃశాంతిఃశాంతిః**

| | | |
|---|---|---|
| అదః | = | సృష్టి ప్రారంభమున గల ఆత్మ |
| పూర్ణమ్ | = | పూర్ణస్వరూపము |
| ఇదమ్ | = | ఈ విశ్వముగా విస్తరిల్లిన ఆత్మ |
| పూర్ణమ్ | = | పూర్ణస్వరూపము. విశ్వము ఆత్మయొక్క ఖండ స్వరూపము కాదు |
| పూర్ణాత్ | = | సృష్ట్యాదియందు సంపూర్ణ స్వరూపముగా గల ఆత్మ నుంచి |
| పూర్ణమ్ | = | పూర్ణ స్వరూపముగా స్థావర జంగ మాత్మక విశ్వము |
| ఉదచ్యతే | = | సృజియింప బడినదని చెప్పబడుచున్నది |
| పూర్ణస్య | = | పూర్ణములో నుంచి |
| పూర్ణమ్ | = | పూర్ణమును |
| ఆదాయ | = | తీసివేసినా |
| పూర్ణమ్+ఏవ | = | పూర్ణమే |
| అవశిష్యతే | = | శేషించును - అనగా ఆత్మ అవ్యయము. |

**ఓం శాంతిఃశాంతిఃశాంతిః**

1. **ఈశావాస్య మిదగ్ం సర్వం యత్కిఞ్చ జగత్యాం జగత్**
   **తేన త్యక్తేన భుఞ్జీథా మాగృధః కస్యస్విద్ధనమ్**

ఈశా - వాస్యమ్ - ఇదమ్ - సర్వమ్ - యత్ - కిం - చ - జగత్యాం - జగత్ - తేన - త్యక్తేన - భుఞ్జీధాః - మాగృధః - కస్య - స్విత్ - ధనమ్

నీవే ఈశ్వరుడవు. "తత్త్వమసి" అని గురువు ఉపదేశించి ఈశ్వరత్వము లేక అమృతత్త్వము పొందుటకు వలయు సాధనను శిష్యునకు ఉపదేశించుచున్నాడు.

ఈశావాస్య ఉపనిషత్తు శుక్ల యజుర్వేదములో శ్లోకముల వరుస క్రమములో కొంత తేడాతో 40వ అధ్యాయముగా కలదు.

**ఉపదేశము-1**

| | | |
|---|---|---|
| జగత్యాం | = | జగత్తునందు అనగా ఈ 14 లోకముల యందు |
| యత్ | = | ఏ |
| కిం | = | యే స్థావరములు |
| చ | = | మఱియు జంగమములు కలవో మఱియు |
| జగత్ | = | జగత్తులో పంచభూతములు కలవో అనగా |
| ఇదం | = | ఈ |
| సర్వమ్ | = | సర్వము అనగా బాహ్య దృష్టికి గోచరించు నదంతా |
| ఈశా | = | ఈశ్వరునిచే సృజియింపబడిన ప్రకృతి అనే ముసుగుచే |
| వాస్యం | = | (కప్పి పుచ్చ వలయును) కప్పబడియున్నది. |

అనగా బాహ్యదృష్టికి గోచరించు ఉపాధులు ప్రకృతివి. ఆత్మ అంతరాత్మగా అందు వసియించినది. ఈ ముసుగుతొలగిన ఆత్మ దర్శనమగును. దృశ్యమాన ప్రపంచ మంతయు ఈశ్వరునిగా భావించవలయును. అనగా వస్తు దృష్టి ఉండరాదు. ఇది మొదటి ఉపదేశము.

**ఆ॥ విశ్వమందు గన్న విన్న యర్థములందు**
**వస్తు దృష్టి జేసి వాంఛ యిడడు** (భాగవతము, సప్తమ స్కంధము-117)

ప్రహ్లాదుడు వస్తు దృష్టి లేనివాడని వర్ణింప బడినది. అనగా ముసుగును తొలగించి ఆత్మ దర్శనము చేసిన మహనీయుడు అని అర్థము.

**ఉపదేశము -2**

| | | |
|---|---|---|
| తేన | = | ఆ వస్తు దృష్టిని |
| త్యక్తేన | = | వీడుట చేత - అనగా త్యాగముతో విరక్తి, వైరాగ్యముతో విమర్శించి ప్రకృతిని |
| భుఞ్జీథాః | = | అనుభవింపుము |

**సీ॥ కామినీ ప్రముఖ భోగము లెన్ని గలిగిన**
**వ్యసన సంసక్తి నా వంకఁ బోఁడు** (భాగవతము, సప్తమ స్కంధము-117)

సర్వభోగభాగ్యములు ఉన్నా వాటి యందు మునిగితేలక, భగవంతుని యందు చింత గలిగి ప్రహ్లాదుడు ఉన్నాడు. ఆ విధముగా సర్వ భోగ భాగ్యములు ఉన్నా భగవంతుని యందు చింత గలిగి ఉండుము. ఈ సంసార కూపములో బడి భార్యా పుత్రులు ధన కనక వస్తు వాహనాదులనే మోహములో కూరుకుని పోకుము. నీటిలోగల తామరాకు వలె సంసార తాపత్రయములను అంటక జీవనము సాగించుము.

**ఉపదేశము - 3**

| | | |
|---|---|---|
| కస్య+స్విత్ | = | ఎవని యొక్క |
| ధనమ్ | = | ధనమును |
| మా+గృధః | = | ఆశింపకుము.అనగా నీకు ఉన్నదానితో తృప్తి చెందుము. |

ధనము కావలయున కోరుకొనుటకు ముఖ్యకారణము సుఖాపేక్ష. కావున సుఖాపేక్ష వీడి దేహనిర్వహణమునకు ఎంతఅవసరమో అంతమాత్రమునే గ్రహించి జీవయాత్ర చేయుము. ఉన్నదానితో తృప్తి చెందుము.

*****

సృష్టి చేయునపుడే ఈశ్వరుడు కర్మను సృజియించినాడు. కర్మబ్రహ్మోద్భవం విద్ధి. కర్మ గురించి భగవద్గీతలో కర్మయోగములో విపులముగా వర్ణింపబడినది.

కర్మలను ఈ క్రింది విధముగా వర్గీకరించవచ్చును.

**ఇహలోక వ్యవహారములకు సంబంధించినవి**

1. చేయకుండా ఉండలేని కర్మలు: భోజనము, నిద్ర, ఊపిరిపీల్చుట, కాల కృత్యములు ఈ కర్మలు చేయకుండా ఎవడునూ ఉండలేడు. **నహి కశ్చిత్ క్షణమపి జాతు తిష్ఠత్య కర్మకృత్** - కర్మయోగము -5.

   జాతు = ఒకప్పుడును; కశ్చిత్ = ఎవడును; క్షణమ్ + అపి = క్షణ కాలమయినా కూడా; అకర్మ కృత్ = కర్మను చేయకుండా; న+తిష్ఠతి = ఉండడు.

   **శరీర యాత్రాఽపి చ తే న ప్రసిద్ధ్యేదకర్మణః** - కర్మయోగము-8
   అకర్మణః = కర్మలు చేయకపోవుటవలన; తే = నీ యొక్క; శరీర యాత్రా+అపి = జీవన యాత్ర కూడా; న+ప్రసిద్ధేత్ = కొనసాగదు

2. జాతి ధర్మములు - ఆశ్రమ ధర్మములు - వ్యక్తిగత విధులు - బాధ్యతలు పాటించుట.
   **నియతం కురు కర్మత్వం** - కర్మయోగము - 8
   త్వం= నీవు; నియతం+కర్మ=నీజాతికి, నీ ఆశ్రమమునకు చెప్పిన కర్మను నీ విధులను బాధ్యతలను; కురు=పాటించుము.
   **శ్రేయాన్ స్వధర్మో విగుణః** కర్మయోగము -35.
   విగుణః = సత్వ గుణ ప్రధానమయినది కాకపోయినను,
   స్వధర్మః = నీ స్వధర్మము
   శ్రేయాన్ = శ్రేయస్కరమయినది

3. లోక వ్యవహారములలో చేయు వృత్తి, వ్యాపారాది కర్మలు, సంసార తాపత్రయ కర్మలు

**అన్యత్ర లోకోఽయం కర్మ బంధనః** - కర్మయోగము -9.

అన్యత్ర= భగవంతుని పరం కాని - యితర కర్మలు;

అయం+లోకః=ఈ లోకమున

కర్మ బంధనః=కర్మలు బంధమును గలిగించును.

4. పరలోకమునకు సంబంధించిన కర్మలు

- పాప కర్మలు: ఇతరులను చంపుట, హింసిచుట, పర స్త్రీలను బలాత్కరించుట, దొంగతనము వగైరాలు - ఇవి నరకమును గలిగించును
- పుణ్య కర్మలు
  - శాస్త్రవిహితము కానివి: ఇవి నరకమును గలిగించును
  - శాస్త్రవిహితము లయినవి
    - పుణ్య ఫలితము కోరి చేసినవి: బ్రహ్మలోక ప్రాప్తి గలుగును కాని పుణ్యం క్షీణించగానే పునర్జన్మ గలుగును
    - పుణ్య ఫలితము కోరక చేసినవి: బంధకారణము కాదు శాశ్వత బ్రహ్మలోక నివాసము గలుగును. వీరికి జన్మ లేదు

**కర్మణ్యేవాధికారస్తే మా ఫలేషు కదాచన** - సాంఖ్య యోగము-47

కర్మణ్యేవ = పుణ్య కర్మలు చేయుట యందు

అధికారః = అధికారము

తే = నీకు గలదు

| | | |
|---|---|---|
| కదాచన | = | ఒకప్పుడును |
| మా+ ఫలేషు | = | ఆ పుణ్య ఫలితమును కోరరాదు. |

ఈ పుణ్య పాప కర్మలు బంధముగా చెప్పబడును
పాప కర్మలు - ఇనుప సంకెళ్ళు
పుణ్య కర్మలు - బంగారపు సంకెళ్ళు

*****

**2. కుర్వ న్నేవేహ కర్మాణి జిజీవి షేచ్ఛతగ్ం సమాః**
**ఏవం త్వయి నా న్యథేతో ఉ_స్తి న కర్మ లిప్యతే నరే**

కుర్వన్ - ఏవ - ఇహ - కర్మాణి - జిజీవిషేత్ - శతగ్ం - సమాః - ఏవం - త్వయి- న - అన్యథా - ఇతః - అస్తి - న - కర్మ - లిప్యతే - నరే.

**ఉపదేశము -4**

పుణ్య ఫలితము కోరకుండా పుణ్య కర్మలు ఆచరింపుము. అట్టి కర్మ వలన కర్మ ఫలితము అంటదు.

| | | |
|---|---|---|
| ఇహ | = | భూలోకంలో ఫలితము ఆశించక |
| కర్మాణి | = | పుణ్యకర్మలు |
| కుర్వన్+ఏవ | = | చేయుటకు మాత్రమే |
| శతగ్ం | = | నూఱు |
| సమాః | = | సంవత్సరములు |
| జిజీవిషేత్ | = | జీవించ గోరవలయును |
| ఇతః | = | జీవిత సాఫల్యమునకు పుణ్యకర్మలు చేయుటకంటె |
| అన్యథా | = | యింకొక పద్ధతి |
| న+అస్తి | = | లేదు. అనగా పుణ్యకర్మలు ఫలితము ఆశింపక చేయవలయును. కర్మబంధముగాకూడదంటే యింకొక పద్ధతి లేదు. |

ఏవం = ఈ విధముగా నిష్కామ కర్మ చేయు
త్వయి+నరే = నీవంటి మానవులయందు
కర్మ = కర్మ ఫలము
న+లిప్యతే = అంటదు. అనగా కర్మ బంధము కాదు.

పుణ్యా కర్మలు చేసి ఫలితమును కోరని యడల అట్టి పుణ్యా కర్మానుష్ఠానము బంధము కాదు.

*****

**3. అసుర్యా నామ తే లోకా అంధేన తమసా వృతాః**
**తాగ్ం స్తే ప్రేత్యాభిగచ్ఛన్తి యేకే చాత్మహనో జనాః**

అసుర్యాః - నామ - తే - లోకాః - అంధేన - తమసా - ఆవృతాః - తాన్ - తే - ప్రేత్య - అభిగచ్ఛన్తి - యే - కే - చ - ఆత్మహనః - జనాః

**ఉపదేశము - 5**

**పాప కృత్యములు చేయరాదు**

యే = ఎవరు పొల్లు మాటలతో జీవితం గడుపుదురో ఎవరయితే సంసార తాపత్రయంలో మునిగి తేలుతూ ఉందురో
కే = ఎవరు ధన సంపాదనే ముఖ్యలక్షణంగా గలిగి బ్రతుకుతూ ఉందురో
చ = మఱియు పాపకార్యములు చేయుదురో, విధి విహితముగా శాస్త్రానుసారము పుణ్యాకర్మలు చేయరో అట్టి
ఆత్మహనః = ఆత్మను చంపుకున్న
జనాః = జనులు అనగా తమ శ్రేయస్సును తామే చంపుకున్న వారు ప్రస్తుతానికి యిప్పుడు సుఖపడినా,

| | | |
|---|---|---|
| ప్రేత్య | = | మరణానంతరము |
| తే | = | వారు |
| అంధేన+తమసా | = | చిమ్మచీకటిచే |
| ఆవృతాః | = | ఆవరింపబడియున్న |
| అసుర్యాః+నామ | = | అసురులకు నిలయమయిన అనగా దుఃఖములకు నిలయమైన |
| లోకాః | = | లోకములకు |
| అభిగచ్ఛంతి | = | వెళ్ళుదురు |
| తే | = | అలా వెళ్ళినవారు |
| తాన్ | = | ఆ చీకటి లోకములలో దుఃఖములను అనుభవించి తిరిగి ఈ భూలోకములో నీచజన్మ ఎత్తుదురు. |

పుణ్యాకర్మలు- వాటి వలన గలుగు ఫలితములు, చీకటిలోకములకు కారణమగు కర్మల గురించి తెలుసుకొని నిర్వేదము పొంది, ఆత్మ గురించి తెలుసుకొని ఆత్మ దర్శనమునకై ప్రయత్నించవలయును.

*****

బ్రహ్మ విచారణ - గురువు ఆత్మ గురించి చెప్పుచున్నాడు.

4. **అనేజదేకం మనసో జవీయో నైనద్దేవా**
   **ఆప్నువన్ పూర్వ మర్షత్**
   **తద్ధావతో ఽన్యానత్యేతి తిష్ఠ**
   **త్తస్మిన్నపో మాతరిశ్వా దధాతి**

అనేజత్ - ఏకం - మనసః - జవీయః - న - ఏనత్ - దేవాః - ఆప్నువన్ - పూర్వమ్- అర్షత్ - తత్ - ధావతః - అన్యాన్ - అత్యేతి - తిష్ఠతి - తస్మిన్ - అపః - మాతరిశ్వా - దధాతి.

**5. తదేజతి తన్నైజతి తద్దూరే తద్వంతికే**
**తదన్త రస్య సర్వస్య తదు సర్వస్యాస్య బాహ్యతః**

తత్-ఏజతి - తత్- న- ఏజతి- తత్- దూరే- తత్- ఉ- అంతికే- తత్-అంతః- అస్య- సర్వస్య- తత్- ఉ- సర్వస్య - అస్య- బాహ్యతః

**ఉపదేశము - 6**

ఆత్మ గురించి ఉపదేశించినాడు.

**సృష్ట్యాది యందు**

| | | |
|---|---|---|
| ఏకః | = | ఒక్కడు |
| అనేజత్ | = | చలనము లేనిది. అనగా మార్పు చెందనిది. కాలాతీతము |

ఆత్మ - సృష్ట్యాది యందు ఒక్కటి. అనగా ఆత్మ తప్ప ఇంకేమియు లేవు. **ఆత్మా వా ఇద మేక అగ్రే అసీత్** - (ఐతరేయ ఉపనిషత్)

**సృష్టిలో**

| | | |
|---|---|---|
| **తత్+సర్వస్య+అస్య+అంతః** | = | ఆత్మ సర్వత్రా ఉండి ఉపాధులలో అంత రాత్మగా ఉన్నది. |

ఈ సృష్టిలోగల సర్వ స్థావర జంగమముల లోపల అంతర్యామిగా గలదు. అనగా దేహముగా జీవరూపమున, హృదయగుహలో ఆత్మగానూ కలదు. అంతర్యామి అగుట వలన బాహ్య దృష్టికి గోచరము కాదు. ఉదాహరణ :- పూలదండలో దారంవలె ఉన్నది. పూలదండలోని పూవులు కనిపించును. కాని ఆ దండలోని దారం కనిపించదు. ఆ దారం తెగిపోయినచో పూలు చెల్లా చెదరగును. అటులనే ఆత్మ ఈ దేహమును వీడగనే ఈ దేహము నశించును.

| | | |
|---|---|---|
| **తత్+ఉ+అస్య+సర్వస్య +బాహ్యతః** | = | అది బ్రహ్మాండమునకు బయట కలదు. సర్వత్రా గలదు. విశ్వము లయకాలమున నశించును. కాని ఆత్మ ఎన్నటికి నశింపదు. |

జీవులకు ఆత్మ హృదయ గుహలో కలదు. స్వయం జ్యోతి. కాని,

| | | |
|---|---|---|
| తత్+దూరే | = | అజ్ఞానులకు కనిపించనందున అది కంటికి కనిపించ నంత దూరములో ఉన్నది అని చెప్పవచ్చును. |
| తత్+ఉ+అంతికే | = | జ్ఞానులకు కనిపించుట వలన అది వారికి చాలా సమీపమున కలదు అని చెప్పవచ్చును. |

ఆత్మను ఇంద్రియములు గ్రహించలేవు.

| | | |
|---|---|---|
| ఏనత్+దేవాః+న+ ఆప్నువన్ | = | ఇంద్రియముల ద్వారా ఆత్మను గ్రహించలేము. జీవుడు మాత్రమే గ్రహించ గలడు. |

ఆత్మ సర్వ వ్యాపకత్వము కలది కావున ఆత్మ వేగవంతము అని భావించవలెను.

| | | |
|---|---|---|
| తత్+అన్యాన్+ధావతః+ అత్యేతి | = | బాహ్య ప్రపంచములో వేగవంతమైన వాటి కంటె వేగవంతము. సూర్యుడు, చంద్రుడు, గ్రహములు ఆకాశమున వేగముగా కదలుచున్నవి. కాని వీటిని సృజియించిన ఆత్మ సర్వ వ్యాపకత్వము వలన వేగవంతము అయిన వాటికంటె వేగవంతము. |
| పూర్వమ్+అర్షత్ | = | రెండు ప్రాణులు ఒక లక్ష్య స్థానమును చేరుటకు వేగముగా పరుగెత్తి ఏది లక్ష్య స్థానమునకు ముందు చేరునో అది చాలా వేగవంతమైనది కదా. కాని ఆత్మ సర్వ వ్యాపకత్వము వలన సర్వత్రా ఉండుట వలన అన్నింటి కంటె ముందే అక్కడకు చేరుకున్నది అని భావించుట వలన వేగవంతమైన వాటి కంటె అది అక్కడకు పూర్వమే చేరునని చెప్పవచ్చును. |

దేహములో వేగవంతమైన వాటికంటె వేగవంతము

| | | |
|---|---|---|
| మనసః+జవీయః | = | దేహములోని మనస్సు కంటె వేగవంతమైనది. |

చక్రవర్తి తన ఉద్యోగస్థులకు విధులను నిర్ణయించినట్లు ఆత్మ సృష్టిలోని వాటికి విధులను నిర్ణయించును.

అపః+మాతరిశ్వా+దధాతి = ఆత్మగా సర్వభూతముల సకలచేష్టలను అనగా దేహేంద్రియ మనో బుద్ధులకు వాటి వాటి వ్యాపార ములను మీరు ఈ పని చేయండి అని విభజించి నిర్ణయించును. బాహ్యముగా - వాయువుకు వీచుట; అగ్నికి - మండుట; జలమునకు ప్రవహించుట; భూమికి ఓర్పు; సూర్యుడు, చంద్ర, గ్రహ నక్షత్రము లకు అవి ఎలా పరిభ్రమించాలో ఒక్కొక్క విధి - అలా నిర్ణయించెను. అంతరమున - ఇంద్రియములకు మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము, ప్రాణములకు వేటి వాటికి విధులను నిర్ణయించెను. దేహములోని యివి అన్నీ - ఒక్కొక్కటి ఒక్కొక్క ధర్మము గలిగి ధర్మ క్షేత్రము అయినది. ఒక్కొక్కటి ఒక్కొక్క పని చేసి కురుక్షేత్ర మయినది. జీవరూపమున

| | | |
|---|---|---|
| తత్+ఏజతి | = | అది కదలును. జీవరూపమున అది కదలును. జంగమ రూపమున అది కదలును. |
| తత్+న+ఏజతి | = | అది కదలదు. స్థావరరూపమున అది కదలదు. అనగా స్థావర జంగమరూపముగా కనిపించే ఈ దృశ్యమాన ప్రపంచమంతయు ఆత్మ యొక్క వికారమే. |
| తస్మిన్ + తిష్ఠతి | = | విశ్వములో అంతరాత్మగా ఉండి అది నశింపకుండా ఉండునట్టి స్థితిని కలుగ చేయుచున్నది. శరీరములో ఉండి దేహవ్యాపారమును నడిపించుచున్నది. |

దీనినే విశ్వం విష్ణుః అని చెప్పుదురు.

గురువు శిష్యునకు ఆత్మ యొక్క స్వరూప - స్వభావ - లక్షణములను వివరించినాడు.

**ఉపదేశము-7**

ఆత్మ తత్త్వమును శాస్త్రముగా వల్లెవేయుట గాక స్వానుభవంలో గ్రహించ వలయును. అలా గ్రహించుటకు సాధకుడు గుణ రహితుడు కావలయును. గుణ రహితుని లక్షణములను చెప్పుచున్నాడు.

**6. యస్తు సర్వాణి భూతాన్యాత్మన్యేవానుపశ్యతి**
**సర్వ భూతేషు చాత్మానం తతోన విజుగుప్సతే**

యః - తు - సర్వాణి - భూతాని - ఆత్మని - ఏవ - అనుపశ్యతి - సర్వభూతేషు - చ - ఆత్మానం - తతః - న - విజుగుప్సతే.

**7. యస్మిన్ సర్వాణి భూతాన్యాత్మైవా భూద్విజానతః**
**తత్ర కో మోహః కః శోక ఏకత్వ మను పశ్యతి**

యస్మిన్ - సర్వాణి - భూతాని - ఆత్మా - ఏవ - అభూత్ - విజానతః - తత్ర - కః మోహః - కః శోకః - ఏకత్వమ్ - అనుపశ్యతి.

| | | |
|---|---|---|
| యః+తు | = | ఎవడు |
| సర్వాణి+భూతాని | = | సర్వభూతములను |
| | | ఉపాధి పరంగా కాక |
| ఆత్మని+ ఏవ | = | ఆత్మ యందే - అనగా విరాట్‌పురుషుని యందే |
| | | ఉన్నట్లు విశ్వరూప సందర్శనమును |
| అనుపశ్యతి | = | చూచు చున్నాడో |
| తతః | = | అటు పిమ్మట |
| సర్వ భూతేషు | = | సర్వ భూతములయందు అంతరాత్మగా ఉన్న |
| ఆత్మానం | = | ఆత్మను చూచుచున్నాడో |
| చ | = | మఱియు ఆత్మ తత్త్వమును గ్రహించుచున్నాడో - |
| | | అతడు |
| న+విజుగుప్సతే | = | జుగుప్సను పొందడు |
| యస్మిన్ | = | దేని యందు |
| సర్వాణి+భూతాని | = | సర్వభూతములు |

| | | |
|---|---|---|
| అభూత్ | = | కలవని |
| విజానతః | = | గ్రహించిన వ్యక్తి |
| ఆత్మా+ఏవ | = | సర్వము ఆత్మగనే |
| ఏకత్వం | = | ఏకత్వమును |
| అనుపశ్యతి | = | చూచుచున్నాడో |
| తత్ర | = | అప్పుడు |
| కః+మోహః | = | మోహము ఎక్కడిది? |
| కః+శోకః | = | శోకము ఎక్కడిది? అనగా శోకము, మోహము ఉండదు. రాగ ద్వేషములు ఉండవు. త్రిగుణాతీతు డగును. |

సర్వభూతములందు అంతర్యామిగా ఉన్న ఆత్మను, విరాట్ యందు సర్వభూత ములను దర్శించిన వాడు శోకము, మోహము, జుగుప్స మొదలయిన భావములను పొందడు. ఉదాహరణ జడభరతుడు. జడభరతునిని బలి యిచ్చుటకు కాళికాదేవి మందిరము తీసుకొని వెళ్ళినారు. అప్పుడు జడభరతుడు తనని చంపగా వచ్చిన వారి యందు - వారి చేతిలోగల కత్తి యందు, గుడిలోగల కాళికాదేవి విగ్రహము నందు, భేద దృష్టి లేక సర్వమును అచ్యుతునిగా తలచినాడు.

ఇట్టి స్థితి పొందుటకు

1. సృష్టి ఎలా వచ్చినదో తెలియవలయును. సృష్ట్యాది యందు ఒక్కటిగా ఉన్న ఆత్మ సృష్టిలో భిన్నత్వము పొందినది. ఈ భిన్నత్వమును దర్శించుట వలన భిన్న భావములు గలుగుచున్నవి. ఆత్మను దర్శించిన భిన్నత్వము పోయి ఆత్మయయిన ఏకత్వమే ఉండును.

| ప్రకృతి | | పురుషుడు | |
|---|---|---|---|
| ఉపాధులు ఏర్పడినవి | గుణములు వచ్చినవి | జీవ పురుషుడు | హృదయ గుహలో గల ఆత్మ |
| **ఉపాధులలో భిన్నత్వమున్నది.**<br>ఆవు శరీరమునకు,<br>ఏనుగు శరీరమునకు,<br>కుక్క శరీరమునకు,<br>బ్రాహ్మణ శరీరమునకు,<br>భేదమున్నది.<br>అనగా ఒక్కొక్క జీవి శరీరము ఒక్కొక్క విధముగా ఉన్నది. | **గుణములలో భిన్నత్వమున్నది.**<br>సత్వగుణము,<br>రజోగుణము,<br>తమోగుణము.<br>వీటి వలన గలుగు కర్మలలో భేదమున్నది. | **జీవులలో భిన్నత్వమున్నది.**<br>జీవుడు ఉపాధిని గుణములను ఆశ్రయించి భిన్న భిన్న కర్మలు చేయుచున్నాడు.<br>రాముడు - మంచివాడు<br>రావణుడు - దుర్మార్గుడు<br>దుర్యోధనుడు - దుర్మార్గుడు | సర్వ భూతములందు గల ఆత్మలో భిన్నత్వములేదు.<br>**ఏకత్వమే ఉన్నది.** |
| భిన్నత్వమున్నది | | | ఏకత్వమున్నది |

జుగుప్స, మోహము, శోకము, భయము మొదలగునవి గుణములకు సంబంధించినవి. ప్రకృతివలన కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యములు గలుగు చున్నవి. అరిషట్ వర్గములు నశించిన ఈ జుగుప్స, శోకము, మోహాదులు ఉండవు. కావున అరిషట్ వర్గములను జయింపుము అని గురువుయొక్క 7వ ఉపదేశము.

*****

## బ్రహ్మ విచారణ

## ఉపదేశము -8

### పురుషుని లక్షణములు

8. స పర్యగా చ్ఛుక్రం మకాయ మవ్రణ
మస్నావిరగ్ం శుద్ధ మపాప విద్ధమ్
కవిర్మనీషీ పరిభూః స్వయంభూ
ర్యథా తథ్యతోఽర్థాన్ వ్యదధా చ్ఛాశ్వతీభ్యః సమాభ్యః

సః - పరి - అగాత్ - శుక్రమ్ - అకాయమ్ - అవ్రణమ్ - అస్నావిరగ్ం - శుద్ధమ్- అపాపవిద్ధమ్ - కవిః - మనీషీ - పరిభూః - స్వయంభూః - యథాతథ్యతః - అర్థాన్ - వ్యదధాత్ - శాశ్వతీభ్యః - సమాభ్యః

| | | |
|---|---|---|
| సః | = | ఆ పురుషుడు |
| పరి+అగాత్ | = | అన్ని వైపులకు వెళ్ళును. అనగా సర్వవ్యాపకుడు. |
| శాశ్వతీభ్యః+ సమాభ్యః | = | శాశ్వత సంవత్సరముల వలన అనగా శాశ్వతముగా దేవతలకు, పంచభూతములకు, దేహేంద్రియ మనో బుద్ధులకు |
| అర్థాన్ | = | విధులను |
| యధా తథ్యతః | = | యధా తధముగ - అనగా ఎవరెవరు ఏఏ పనులు చేయవలయునో |
| వ్యదధాత్ | = | విభజించెను. |

అనగా ఈ విశ్వములోగల సర్వప్రాణులకు, సర్వఉపాధులకు, సర్వదేవతలకు వారి వారి విధులను తాత్కాలికముగా కాక శాశ్వతముగా నిర్ణయించెను.

| | | |
|---|---|---|
| వాయువుకు | - | వీచుట |
| అగ్నికి | - | మండుట |

| | | |
|---|---|---|
| సముద్రమునకు | - | గంభీరత్వము |
| భూమికి | - | ఓర్పు |
| సూర్యునకు | - | కాంతిని యిచ్చుట |
| ఇంద్రునకు | - | త్రిలోక పరిపాలన |
| యమునకు | - | ప్రాణి సంహారము |
| కంటికి | - | చూచుట |
| చెవులకు | - | వినుట-యిలా సర్వమునకు విధులను నిర్ణయించి నాడు. |

ఎవరెవరు ఏయే పనులు చేయవలయునో తెలుసుకుంటే ధర్మక్షేత్రము. ఈ ఉపాధులు ఎలా గలిగినవో తెలుసుకుంటే - కురుక్షేత్రము అగును.

| | | |
|---|---|---|
| అకాయం | = | శరీరము లేని వాడు |
| అవ్రణం | = | శరీరమునకు దెబ్బ తగిలినను వ్రణములు లేని వాడు |
| అస్నావిరం | = | నరములు లేనివాడు |
| అపాపవిద్ధం | = | పాపములు లేనివాడు నిష్కళంకుడు |

ఆ పురుషుడు మనవలె పంచభూతాత్మకమైన శరీరము లేనివాడు. ఆ విషయమును చెప్పుటకు - ఈపంచభూతాత్మకమైన శరీరము కంటె భిన్నమయిన శరీరము అని చెప్పుటకు హిరణ్మయ శరీరమని చెప్పుదురు. మనకు శరీరం ఉన్నది. ఎప్పుడయినా దెబ్బ తగిలితే పుండు ఏర్పడుతుంది. అతని శరీరము మనలాంటి శరీరము కాదు గావున పుండు ఏర్పడదు. మన శరీరంలో నరములు ఉన్నాయి. అతని శరీరంలో నరములు మనలాంటి నరములు కావు. మనకు మనస్సువుంది. ఇది మంచి చెడులను ఆలోచించుతుంది. అతని మనస్సు చెడును ఆలోచించదు. ఒక్క ముక్కలో చెప్పాలంటే అతనికి కూడ శరీరముంది గాని మనలాంటి శరీరము కాదు. ఆ శరీరమును హిరణ్మయ శరీరము అందురు. ఆ శరీరము దివ్య శరీరము. అతనికి

ఒక రూపం అంటూ లేదు. (అతడు ఏ రూపం కావాలనుకుంటే ఆ రూపం ధరించును ఉదాహరణకు మత్స్యావతారం. అలాగే కూర్మ, వరాహ, నరసింహావ తారము) ఈ విశ్వమంతా అతడే గావున అతనికి ఏదో ఒక రూపమే అని చెప్పలేము సర్వరూపములు అతడే.

| | | |
|---|---|---|
| స్వయంభూః | = | స్వయముగా జన్మించినవాడు. మన జన్మకు కారణం కర్మ. అతడు కర్మకు అతీతుడు. అతడే కర్మను సృజియించెను. మనకంటె భిన్నుడు. కావున అతడు. |
| పరిభూః | = | సర్వోత్కృష్టుడు |
| శుక్రమ్ | = | పరిశుద్ధుడు |
| శుద్ధం | = | శుద్ధుడు |
| కవిః | = | త్రికాలవేది |
| మనీషీ | = | సర్వజ్ఞుడు. అనగా మనకు లోక వ్యవహారంలో కనిపించే జీవులకంటె భిన్నుడు. మనకు తెలిసిన ఉపాధి లక్షణముల కంటె భిన్నుడు. |
| ఆది పురుషుడు | - | బింబము |
| జీవ పురుషుడు | - | అతని ప్రతి బింబము |
| అతడు | - | వెలుగు |
| మనము | - | ఛాయ. |

జీవ పురుషుడవయిన నీవు ఈ శరీరముతో సాధన చేసి, దేహమును దేహ లక్షణములను పరిత్యజించి ప్రకృతిని వీడి, తిరిగి ఆది పురుషునిలో లీనమై, ఆది పురుషుడవు అగుము. ఇది 8వ ఉపదేశము.

*****

**ఉపదేశము -9**

వేదము అర్థ బాహుళ్యము కలది. భావ బాహుళ్యము కలది. అవిద్య, విద్యలకు అనేక అర్థములు కలవు. **ఈశ్వరునిదై క్రీడించుచు నవిద్య యనంబడు చున్న మాయ యుపరతయై యెప్పుడు దాన విద్యా రూపంబునం బరిణత యగు నప్పుడు- జీవుడు - బ్రహ్మ స్వరూపంబునం బొందు.**

(భాగవతము - ప్రథమ స్కంధము -67)

ఇందుచెప్పబడిన అవిద్య, విద్యల అర్థము వేఱు. బ్రహ్మ అవిద్యా పంచకంబున సర్వ భూతములను పుట్టించెను. ఇక్కడగల అవిద్య అర్థము వేఱు.

(భాగవతము - తృతీయ స్కంధము)

ఇప్పుడు చెప్పబడుచున్న అవిద్య, విద్యల అర్థము వేఱు.

విద్య - అనగా తపోమదము

అవిద్య - అనగా దేహమే తను అనుకొనుట

అసంభూతి - వినాశం = ప్రకృతి

సంభూతి = జీవపురుషుడు

శరీరముతో సాధనచేసి - సాధ్యము చిక్కిన తరువాత శరీరమును పరిత్యజించి, జీవుడు తిరిగి స్వస్వరూపమును పొందవలయును. ప్రకృతిని వీడిన జీవుడు ఆనందమయుడగును. ఇది ఉపదేశము - 9, 10.

*****

9. **అంధం తమః ప్రవిశన్తి యేఽవిద్యా ముపాసతే**
   **తతో భూయ ఇవ తే తమో య ఉ విద్యాయాగ్ం రతాః**

అంధం - తమః ప్రవిశన్తి - యే - అవిద్యామ్ - ఉపాసతే - తతః - భూయః - ఇవ- తే - తమః - యే - ఉ - విద్యాయాగ్ం - రతాః

యే = ఎవరు

అవిద్యామ్ = నేనే దేహమును అని భావించుట అవిద్య. అలా అవిద్యను

| | | |
|---|---|---|
| ఉపాసతే | = | ఉపాసింతురో అనగా నేనే దేహమని, ఈ దేహ సంబంధీకులయిన భార్యా, పుత్రులు, బంధువులు తమవారని, ఈ దేహ సుఖమే తన సౌఖ్యమని, కూట ధర్మములయిన పుణ్యాకర్మఫలితములు కోరి, సంసార తాపత్రయములో ఉండి జీవితమును గడుపుచున్నారో |
| తే | = | వారు, దేహానంతరము |
| అంధం+తమః | = | చీకటి లోకములలో |
| ప్రవిశన్తి | = | ప్రవేశించెదరు. అనగా నరకప్రాప్తిని పొందుదురు. |
| యే | = | ఎవరు |
| విద్యాయాం | = | విద్య యందు |
| ఉ+రతాః | = | ఆసక్తులో అనగా తను జీవుడను గాను ఈశ్వరుడనని భావించి స్వతంత్రుడనని భావించుట విద్య. ఈశ్వరుడే జీవరూపమున దేహమందున్నాడని చెప్పగా ఈ జీవుడు ఈశ్వరుడెట్లగునో గ్రహించక, సాధనచేయక తనే ఈశ్వరుడనని అజ్ఞాన అహంకారమున ప్రవర్తించువాడు. |
| తతః | = | అంతకంటె |
| భూయ+ఇవ+తమః | = | మరల చీకటిగా వుండే లోకములలో ప్రవేశింతురు. ఉదా : వేనుడు. రాజు సర్వదేవతామయుడు అని వేదం చెప్పినది గాన ఇప్పటినుంచి మీరు నన్ను తప్ప ఇతర దేవతలను పూజించరాదని చాటించినాడు. బ్రాహ్మణులు ఈ విషయమును విశదీకరించినను విననందున బ్రాహ్మణ శాపమున వేనుడు నశించి పోయినాడు. |

*****

**10. అన్య దేవాహు విద్యయా అన్యదాహురవిద్యయా**
**ఇతి శుశ్రుమ ధీరాణాం యేనస్త ద్విచ చక్షిరే**

అన్యత్ - ఏవ - ఆహుః - విద్యయా - అన్యత్ - ఆహుః - అవిద్యయా - ఇతి - శుశ్రుమ - ధీరాణాం - యే -నః - తత్ - విచచక్షిరే.

| | | |
|---|---|---|
| విద్యయా | = | తపోమదమున తను ఈశ్వరుడను-అని భావించుట చేత |
| అన్యత్+ఏవ | = | ఒక ఫలితము గలుగునని చెప్పుదురు. అనగా అహంకారము వలన నశించిపోవునని |
| ఆహుః | = | చెప్పుదురు. చిత్రకేతువు అనువాడు తపస్సు చేసి ఆ తపోమదమున ఈశ్వరునిని అధిక్షేపించినాడు పార్వతీదేవి యిచ్చిన శాపమున మఱుజన్మలో వృత్రాసురునిగా జన్మించినాడు. |
| అవిద్యయా | = | నేనే దేహమని భావించి, దేహధ్యాసలో వుండి, దేహ భ్రాంతి అనే అజ్ఞానంలో ఉండుట చేత |
| అన్యత్ | = | ఒక ఫలితము గలుగును. అనగా సంసారములో చిక్కుకొని దరికానక చెడిపోవుదురు అని |
| ఆహుః | = | చెప్పుదురు. |
| ఇతి | = | ఆ విధంగా |
| ధీరాణాం+శుశ్రుమ | = | (ధీరుల యొక్క) - గురువుల యొక్క మాటగా మేము వినియుంటిమి |
| యే | = | ఎవరు |
| నః | = | మాకు |
| తత్ | = | ఆ విషయమును అనగా అవిద్యా విద్యలగుఱించి- అమృతత్త్వము గుఱించి |
| విచచక్షిరే | = | విశదీకరించిరో - ఆవిషయమును గురు పరంపరా న్యాయముగా విశదీకరించు చున్నాము. |

****

**శాస్త్రపాఠము**

**11. విద్యాం చావిద్యాం చ య స్తద్వేదో భయగ్ం సహ**
**అవిద్యయా మృత్యుం తీర్త్వా విద్యయామృత మశ్నుతే**

విద్యాం - చ - అవిద్యాం - చ - యః - తత్ - వేద - ఉభయగ్ం - సహ - అవిద్యయా - మృత్యుం - తీర్త్వా - విద్యయా - అమృతమ్ - అశ్నుతే

| | | |
|---|---|---|
| యః | = | ఎవరు |
| విద్యాం+చ+అవిద్యాం చ+తత్+ఉభయం+సహ | = | విద్యను, అవిద్యను, ఆ రెండింటిని గ్రహించి మఱియు ఆ రెండింటి సాయముతో మృత్యువును దాటు విధానమును |
| వేద | = | తెలుసుకొనునో వాడు |
| అవిద్యయా+మృత్యుం+ తీర్త్వా | = | అవిద్యచే మృత్యువును దాటి |
| విద్యయా+అమృతమ్ అశ్నుతే | = | విద్యచే అమృతత్త్వమును పొందును. అనగా జీవుడు అమృతుడగును. |

*****

**12. అంధం తమః ప్రవిశన్తి యేఽసంభూతి ముపాసతే**
**తతో భూయ ఇవ తే తమో య ఉ సంభూత్యాగ్ం రతాః**

అంధం - తమః - ప్రవిశన్తి - యే - అసంభూతిమ్ - ఉపాసతే - తతః - భూయః - ఇవ - తే - తమః - యే - ఉ - సంభూత్యాగ్ం - రతాః

| | | |
|---|---|---|
| యే | = | ఎవరు |
| అసంభూతిమ్ | = | ప్రకృతిని |
| ఉపాసతే | = | ఉపాసించెదరో అనగా ప్రకృతి వలన జనించిన సత్త్వ గుణము, రజో గుణము, తమో గుణములు కలిగి ఉండెదరో |

| | | |
|---|---|---|
| తే | = | వారు అనగా గుణయుతులు |
| అంధం+తమః | = | చీకటి గల లోకములలో |
| ప్రవిశన్తి | = | ప్రవేశించెదరు. అనగా నరకప్రాప్తిని పొంది తిరిగి పునర్జన్మకు వత్తురు |
| తతః | = | అటు పిమ్మట |
| యే | = | ఎవరు |
| సంభూత్యాగ్ం | = | జీవునిని అనగా తను |
| ఉ+రతాః | = | ఇహ లోక పరలోక సుఖములందు ఆపేక్ష గలిగి రమించెదరో |
| తే | = | వారు |
| భూయః | = | మరల |
| తమః+ఇవ | = | చీకటి లోకములలో ప్రవేశించి - పునర్జన్మకు వచ్చెదరు. |

అనగా గుణయుతులు - ఇహలోక పరలోక సుఖాపేక్ష పరులు మరణానంతరము తిరిగి జన్మించెదరు.

*****

**13. అన్యదేవాహుః సంభవాదన్యదాహురసంభవాత్**
**ఇతి శుశ్రుమ ధీరాణాం యే నస్తద్విచచక్షిరే**

అన్యత్ - ఏవ - ఆహుః - సంభవాత్ - అన్యత్ - ఆహుః - అసంభవాత్ - ఇతి - శుశ్రుమ - ధీరాణాం - యే - నః - తత్ - విచచక్షిరే.

| | | |
|---|---|---|
| అన్యత్+అసంభవాత్ +ఏవ | = | ప్రకృతితో సంబధము వలన పురుషునకు సుఖ దుఃఖములు గలుగునని |
| ఆహుః | = | చెప్పుదురు. |
| అన్యత్+సంభవాత్ | = | ప్రకృతిని వీడిన జీవపురుషునికి |

| | | |
|---|---|---|
| ఇతి | = | ఆనందము గలుగునని |
| ఆహుః | = | చెప్పుదురు. |
| ఆత్మను దర్శించిన | | |
| ధీరాణాం | = | ధీరుల యొక్కమాటగా |
| నః | = | మాకు |
| యే | = | ఏ గురువులు |
| విచచక్షిరే | = | విశదీకరించిరో |
| తత్ | = | దానిని మేము |
| శుశ్రుమ | = | వింటిమి |

ఆవిషయమును గురు పరంపరా న్యాయముగా విశదీకరించుచున్నాము.

*****

ఆచరణ పాఠం

**14. సంభూతిం చ వినాశం చ య స్తద్వేదో భయగ్ంం సహ**
**వినాశేన మృత్యుం తీర్త్వా సంభూత్యామృత మశ్నుతే**

సంభూతిం - చ - వినాశం - చ - యః - తత్ - వేద - ఉభయగ్ం - సహ - వినాశేన - మృత్యుం - తీర్త్వా - అసంభూత్యా - అమృతమ్ - అశ్నుతే

| | | |
|---|---|---|
| యః | = | ఎవడు |
| ఉభయగ్ం | = | రెండింటిని అనగా ప్రకృతి - జీవ పురుషునిని |
| తత్ | = | హృదయ గుహలో గల ఆత్మను |
| వేద | = | తెలుసుకొని |
| వినాశం | = | వినాశము లక్షణముగా గల ప్రకృతిచే జనించిన |
| వినాశేన+సహ | = | ప్రకృతిచేత అనగా దేహముచేత |
| మృత్యుం | = | మృత్యువును |
| తీర్త్వా | = | దాటి |

| | | |
|---|---|---|
| చ | = | మఱియు |
| సంభూతిం | = | జీవుని జీవ స్వభావమును గ్రహించి ప్రకృతి సంపర్కము వీడిన |
| అసంభూత్యా | = | జీవుని చేత |
| అమృతమ్ | = | అమృతత్త్వమును సాధకుడు |
| అశ్నుతే | = | పొందును. |
| చ | = | మఱియు బ్రహ్మ అగును. |

ఉపదేశము-1 : దృశ్యమాన ప్రపంచములోని సర్వమును ఈశ్వరునిగా దర్శించవలయును. అనగా వస్తు దృష్టిని వీడ వలయును.

ఉపదేశము-2 : సంసార తాపత్రయములను వదల వలయును

ఉపదేశము-3 : ఎవరి ధనమును ఆశించవద్దు. తృప్తిగలిగి ఉండుము.

ఉపదేశము-4 : పుణ్యకర్మానుష్ఠానము చేయుము. పుణ్య ఫలితము కోరకుము.

ఉపదేశము-5 : వ్యర్థముగా కాలక్షేపము చేయకుము. పాపకార్యములు చేయకుము.

ఉపదేశము-6 : ఆత్మ తత్త్వము గ్రహించుము.

ఉపదేశము-7 : శాస్త్ర పాఠము అధ్యయనము చేసి - సాధన ద్వారా ఆత్మను దర్శించి- గుణరహితుడవు అగుము.

ఉపదేశము-8 : ఆదిపురుషునితో సమేకం అగుము.

ఉపదేశము-9 : దేహము ద్వారా సాధన చేసి - జీవ లక్షణములను నశింప చేసికొని అమృతత్త్వము పొందుము.

ఉపదేశము-10 : ప్రకృతి, పురుషుల సంబంధము గ్రహించి, ప్రకృతిని వీడి ఆనందమయుండవై అమృతత్త్వము పొందుము

ఇందు వాడిన మృత్యుం తీర్త్వా - మృత్యువును దాటి అనగా సంసార సాగరమును దాటి అని చెప్పిన దానికి రామాయణంలో సముద్రమును దాటు విధానమును సేతువు నిర్మాణముగా విపులీకరింపబడినది.

వానరులు సేతువును నిర్మించుట.

| | ఆకాశం | వాయువు | అగ్ని | జలము | భూమి |
|---|---|---|---|---|---|
| ఆకాశం | జ్ఞానము | మనస్సు | బుద్ధి 23 | చిత్తము 22 | అహంకారం 21 |
| వాయువు | సమానం 20 | వ్యానం 19 | ఉదానం 18 | ప్రాణం 17 | అపానం 16 |
| అగ్ని | చెవులు 15 | చర్మము 14 | కన్ను 13 | నాలుక 12 | ముక్కు 11 |
| జలము | శబ్దం 10 | స్పర్శ 9 | రూప 8 | రస 7 | గంధ 6 |
| భూమి | వాక్కు 5 | పాణి 4 | పాదం 3 | గుహ్యం 2 | గుదం 1 |

మొదటి రోజు - 14 యోజనములు - అనగా జ్ఞానేంద్రియములు

రెండవ రోజు - 20 యోజనములు - అనగా సమానవాయువు. అనగా పంచప్రాణములు

మూడవ రోజు - 21 యోజనములు - అనగా అహంకారం

నాలుగవ రోజు - 22 యోజనములు - అనగా చిత్తము

ఐదవ రోజు - 23 యోజనములు - అనగా బుద్ధి

100 యోజనములు సేతువు కట్టినారు అనగా

జ్ఞానేంద్రియములను విషయంబులందు ప్రవర్తింపనీక ప్రాణాయామము చేసి - ప్రాణమును పూర్ణకుంభకములో ఉంచి అహంకారము లేక చిత్తశుద్ధి గలిగి మనస్సును బుద్ధియందు ఏకీకరణంబు చేసిన వారధి నిర్మాణము పూర్తి అగును.

ఆ తరువాత జీవుడు క్షేత్రజ్ఞుడు కావలయును. ఈ దేహము మాయా కల్పితము అని గ్రహించును. అవిద్యోపాధియైన దేహము పునీతమగును. దీనినే సీత అగ్ని ప్రవేశముగా వర్ణించిరి. దేహము పునీతమైనది. జీవుడు పునీతుడైనాడు. ఇదే రావణ సంహారము. అప్పుడు జీవుడు జీవన్ముక్తుడై బ్రహ్మ దర్శనమునకు యోగ్యుడగును. కథాపరంగా రామునికి బ్రహ్మ దర్శనము అయినది.

శిష్యుడు గురు ఉపదేశము వలన పరవిద్యను శాస్త్రపాఠముగా, ఆచరణగా గ్రహించి సాధన చేసినాడు. సాధనకు గురుకృప, ఈశ్వరకృప తోడు గావలయును. ప్రకృతి యొక్క ముసుగును ఈశ్వరుడే తొలగించి దర్శనమియ్యవలయును. కేవలము సాధన వలననే ఈశ్వర దర్శనము కాదు. ఆయనే జీవుని వద్దకు స్వయంగా రావలయును. ఈ విషయమునే భాగవతంలో బ్రహ్మ తపస్సు చేయగా విష్ణువు ప్రత్యక్షమై నీ తపస్సు వలన గాక, నీకు నా దర్శనం గలగ చేయవలయునని వచ్చితినని చెప్పును. అదే రామాయణంలో పిలవని పేరంటంగా, స్వయంగా ఈశ్వరుడయిన పరశురాముడు రాముని వద్దకు వచ్చి విష్ణువు యొక్క ధనుస్సు, బాణము యిచ్చి నీవు నేను ఒక్కరిమే. నీవు సర్వవ్యాపకుడయిన ఆత్మవు. విష్ణువువు అని రహస్యముగా తెలియచేయును. పూర్వజన్మ కర్మ వాసనలు-ఈశ్వర కృపచే-ఈశ్వరుని శరణు కోరుట వలననే నశించును.

*****

**సాధకుని ప్రార్థన**

**15. హిరణ్మయేన పాత్రేణ సత్యస్యాపిహితం ముఖమ్**
**తత్త్వం పూషన్నపావృణు సత్యధర్మాయ దృష్టయే.**

హిరణ్మయేన - పాత్రేణ - సత్యస్య - అపిహితం - ముఖమ్ - తత్ - త్వం - పూషన్ - అపావృణు - సత్యధర్మాయ - దృష్టయే.

హిరణ్మయేన+ = బంగారు మేలిముసుగు అనే హృదయస్థానంలో
పాత్రేణ+తత్+ హిరణ్మయకోశంలో - ఆ ఆత్మ యొక్క
సత్యస్య+ముఖమ్ స్వరూపము. అగ్ని జ్వాలల మధ్యలో
అపిహితం = కప్పబడి యున్నది. **తస్యశిఖాయామధ్యే పరమాత్మా వ్యవస్థితః** (శ్రుతి)
సత్యధర్మాయ+దృష్టయే = నీ పరమాత్మ స్వరూపమును చూచుట కొఱకు నీ స్వరూపమే సత్యము. ధర్మము. కావున నీ స్వరూప మును చూచుటకు
పూషన్ = స్వయం జ్యోతియైనవాడా సర్వజీవరాసులను పోషించువాడా ! (సూర్యుడా)
త్వం = నీవు
అపావృణు = ఆ ముసుగును తొలగించుము.

*****

**16. పూషన్నేకర్షే యమ సూర్య ప్రాజాపత్య**
**వ్యూహ రశ్మిన్ సమూహః తేజః**
**యత్తే రూపం కల్యాణతమం తత్తే పశ్యామి**
**యోఽసావసౌ పురుషః సోఽహమస్మి**

పూషన్ - ఏకర్షే - యమ - సూర్య - ప్రాజాపత్య - వ్యూహ - రశ్మిన్ - సమూహ - తేజః - యత్ - తే - రూపం - కల్యాణతమం - తత్ - తే - పశ్యామి - యః - అసౌ - పురుషః - సః - అహమ్ - అస్మి

| | | |
|---|---|---|
| పూషన్ + ఏకర్షే<br>యమ+సూర్య+<br>ప్రాజాపత్య | = | ఓ పోషించువాడా! ఏకర్షి అనగా ఒంటరిగా చరించువాడా, లయకారకుడా, వెలుగు నిచ్చువాడా, విరాట్‌పురుషుడా |
| తేజః+రశ్మిన్+<br>సమూహ+వ్యూహ | = | తేజోవంతములగు నీకిరణ సమూహములను ఒకచోట చేర్చి ఉపసంహరింపుము అనగా కిరణ సమూహములనే ముసుగును తొలగించుము ముసుగు తొలగినది |
| యత్+తత్+తే+<br>కల్యాణతమం+<br>రూపం+పశ్యామి | = | మిక్కిలి శుభ ప్రదమైన నీ రూపమును దర్శించితిని |
| యః+అసౌ+సః+పురుషః | = | ఎవడు బంగారు ముసుగు అనే హిరణ్మయ కోశంలో ఆత్మ రూపమున గలడో ఆ పురుషుడు |
| అహం+అస్మి | = | నేనే. స్వానుభవంతో బ్రహ్మమైనాడు. జన్మ సాఫల్యత గలిగినది. |

*****

**స్నాతకోత్సవము**

**కర్పూరదీపసంయోగం**

**17. వాయు రనిల మమృత మథేదం భస్మాన్తం శరీరమ్**
**ఓం క్రతోస్మర కృతంస్మర క్రతోస్మర కృతం స్మర**

వాయుః - అనిలమ్ - అమృతమ్ - అథ - ఇదం - భస్మాన్తమ్ - శరీరమ్ - ఓం - క్రతోస్మర - కృతంస్మర - క్రతో స్మర - కృతంస్మర.

ఓ శిష్యుడా - జీవన్ముక్తుడయిన తర్వాత

ఇదం+శరీరమ్ = ఈ శరీరము

| | | |
|---|---|---|
| భస్మాన్తం | = | చివరకు కాలి బూడిద యగును |
| అథ | = | ఆ తర్వాత |
| వాయుః+అమృతం+ అనిలం | = | జీవునితో పాటు చివర వఱకు ఉండి బ్రహ్మలోకము చేర్చు ఉదానవాయువు-అమృత స్వరూపమైన ఆ వాయువు- వాయువుతో కలసి పోవును. |
| ఓం | = | నీవు అక్షర పరబ్రహ్మవు |
| క్రతః+ స్మర | = | మనసా చేయవలసిన సాధనను జ్ఞాపకం పెట్టుకో - అనగా శిష్యులారా ఆచరణను గుర్తుంచుకోండి. |
| కృతం+స్మర | = | చేసిన సాధనను జ్ఞాపకము పెట్టుకోండి. శాస్త్ర పాఠమును గుర్తు ఉంచుకోండి. |

శిష్యుడు జీవన్ముక్తుడై ఆశ్రమమును వదలి వెళ్ళునప్పుడు తన అంత వాడయిన శిష్యునిచూచి గురువు ప్రేమమీర ఆనంద భాష్పములతో శిష్యుని తలనిమురుతూ- మిగిలిన శిష్యులను ఉద్దేశించి తను చెప్పిన శాస్త్ర పాఠమును గుర్తుంచుకొని ఆచరించండి అని హితవు పలికినాడు.

*****

-మంగళా చరణము-

**18.** **అగ్నే నయ సుపథారాయే అస్మాన్**
**విశ్వాని దేవ వయునాని విద్వాన్**
**యుయోధ్యస్మజ్జుహురాణ మేనో**
**భూయిష్ఠాం తేనమ ఉక్తిం విధేమ**

అగ్నే - నయ - సుపథా - రాయే - అస్మాన్ - విశ్వాని - దేవ - వయునాని - విద్వాన్- యుయోధి - అస్మత్ - జుహురాణమ్ - ఏనః - భూయిష్ఠాం - తే - నమ- ఉక్తిం - విధేమ.

| | | |
|---|---|---|
| అగ్నే+దేవ | = | ఓ అగ్నిదేవుడా |
| విశ్వాని+వయునాని | = | అన్ని సుకృత కర్మలను |
| విద్వాన్(సన్) | = | తెలియుచున్న వాడవై |
| అస్మత్ | = | మానుండి |
| జుహురాణామ్ | = | చెడు తలంపులను |
| ఏనః | = | పాపములను |
| యుయోధి | = | తొలగించుము |
| అస్మాన్ | = | మమ్ములను |
| రాయే | = | దైవీ సంపద కొఱకు |
| సుపథా+నయ | = | మంచి మార్గమున అనగా జ్యోతిర్మార్గమున కొని పొమ్ము |
| తే | = | నీకు |
| భూయిష్ఠాం | = | అనేక |
| నమః+ఉక్తిం | = | నమోవాకమును |
| విధేమ | = | చేయుదుము. అనగా నీకు అనేక నమస్కారములు. |

**ఓం శాంతిఃశాంతిఃశాంతిః**

**ఓం పూర్ణమదః పూర్ణమిదం పూర్ణాత్ పూర్ణ ముదచ్యతే**
**పూర్ణస్య పూర్ణమాదాయ పూర్ణ మేవావ శిష్యతే.**

**ఓం శాంతిఃశాంతిఃశాంతిః**

*****

# బ్రహ్మవిద్యా సంప్రదాయము

## సిద్ధాశ్రమం వారి ప్రచురణలు

వేద సంప్రదాయమును, ఋషుల భావములను యథాతథంగా ఆధ్యాత్మిక ప్రియులకు అందచేయదలచి స్వగృహమును కేంద్రబిందువుగా చేసుకొని **సిద్ధాశ్రమము** నెలకొల్పబడినది. బ్రహ్మవిద్యా సంప్రదాయము ననుసరించి ఈ దిగువ పుస్తకములు ప్రచురింపబడినవి.

1. **పూజాపుష్పములు** -సుమారు -300 పేజీలు

సంస్కృత శ్లోకములలో కీర్తింపబడిన గణపతి, కూమారస్వామి, అయ్యప్ప, శివుడు, అన్నపూర్ణ, రాజరాజేశ్వరి, దేవీఖడ్గమాల, గంగ, లక్ష్మి, సరస్వతి, శీతల, నారాయణ, సుదర్శన, నారసింహ, శ్రీరామ, శ్రీకృష్ణ, ఆదిత్య, ఆంజనేయ నవగ్రహ, శని, నాగరాజ, ఋణవిమోచన స్తోత్రము, గురుస్తుతి మొదలగు వాటికి సులభమగు తెలుగు అర్థములు వ్రాసి ప్రచురింపబడినది. నేటికి మూడు ముద్రణలు జరిగి భక్తుల ఆదరాభిమానములను పొందినది.

2. **పూజావిధానము** - సుమారు -500 పేజీలు

పురుష సూక్తము, శ్రీసూక్తము, నమక, చమకములు మంత్ర పుష్పములకు తెలుగు అర్థములు వ్యాఖ్యానము వ్రాయబడినవి. గణపతి పూజ, పురుషసూక్త పూజా విధానము, శ్రీసూక్త పూజా విధానము, రుద్రాభిషేకములు కొన్ని దేవతల సహస్ర అష్టోత్తరశత నామములతో ఈ పుస్తకము రూపుదిద్దు కొని ప్రచురింప బడినది. ఇప్పటికి రెండు ముద్రణలు జరిగినవి.

3. **భూతనాథోపాఖ్యానము (అయ్యప్ప చరిత్ర)** సుమారు -300 పేజీలు

సద్గురువులు చెప్పిన ఆధ్యాత్మిక విషయములను దృష్టిలో వుంచుకొని బ్రహ్మవిద్యా సంప్రదాయముగా అయ్యప్ప స్వామి కథకు వేదాంత వివరణ-చరిత్ర-దీక్షా నియమములు-ప్రయాణము-అయ్యప్పస్వామి పూజా విధానముతో ప్రచురింప బడినది. ఇప్పుడు కొన్ని భజన పాటలు ఫొటోలుచేర్చి ప్రచురింపబడినది.

**4. బ్రహ్మవిద్యా రత్నాకరము** - సుమారు-1300 పేజీలు (రెండు సంపుటములు)

ఇది సుమారు 1300 పేజీలతో రెండు సంపుటములుగా ప్రచురింపబడినది. ఇది సమగ్రముగా బ్రహ్మవిద్యను గుఱించి తెలుపు గ్రంథము. అపరవిద్యగా దేశము, పరిపాలన, వ్యక్తిగత విధులు బాధ్యతలు, పుణ్యకర్మానుష్ఠానము, ఐత్తరేయ ఉపనిషత్, కేన ఉపనిషత్, కఠోపనిషత్, తైత్తిరీయ ఉపనిషత్, ఈశోపనిషత్, ముండక ఉపనిషత్, మాండుక్య ఉపనిషత్, ప్రశ్నోపనిషత్, కైవల్య ఉపనిషత్, పతంజలి యోగ సూత్రములు, నారద భక్తి సూత్రములు, పరవిద్యగా సాధకులు- సాధన రహస్యములతో ప్రచురింపబడినది.

**ప్రచురింపబోవు గ్రంథములు**

**1. సంధ్యా వందనము :-** బ్రహ్మయజ్ఞము - పితృతర్పణములతో ఒక పుస్తకము ప్రచురింపబడును.

**2. శ్రీమద్భగవద్గీతామృతము :-** భగవద్గీతకు అనేక మంది అర్థతాత్పర్యములు వ్రాసి వారి వ్యాఖ్యానములతో వెలువరించిరి. ప్రప్రథమముగా బ్రహ్మవిద్యా సంప్రదాయముగా - ఉపనిషత్తుల సారముగా-యోగశాస్త్రముగా ఉద్ధవగీత, అవధూతగీత మొదలగు గీతలను, పురాణములను జోడించి విపుల వ్యాఖ్యానముతో ప్రచురింపదలచితిమి.

**3. వాల్మీకి రామాయణము :-** వాల్మీకి మహర్షి వేదమునకు విపుల వ్యాఖ్యానముగా రామాయణమును రచియించితిని అని చెప్పెను కావున ఆయన అభిప్రాయములకు అనుగుణమయిన వేదమంత్రములను ఉదహరించి సులభమయిన తెలుగు వచనముతో వివరింపబడును.

బ్రహ్మవిద్యా సంప్రదాయమును ప్రచారంచేయు ఉద్దేశ్యముతో ఈ గ్రంథములకు వెల నిర్ణయించలేదు. అధ్యాత్మిక ప్రియులు మా కార్య క్రమములలో పాలుపంచుకొని వారి వారి ఆర్థిక స్తోమతను బట్టి ఈ పుస్తకములను పొందవచ్చును.

***వేద ధర్మమును ఉద్ధరించండి- ఆచరించండి- ప్రచారం చేయండి.***

**శుభమగుగాక**

*****



SIDDHASHRAMAM
M: +91 8096065675 , P : +91 40 24240557
E : contactus@siddhashramam.org
W : www.siddhashramam.org

# బ్రహ్మవిద్యా రత్నాకరము

## (ద్వితీయ సంపుటము)




## బ్రహ్మవిద్యా సంప్రదాయము

## సిద్ధాశ్రమం

A


ప్రథమ ముద్రణ : జులై, 2010

ప్రతులకు : వ్యవస్థాపకులు :

**సిద్ధాశ్రమము**

శాతవాహననగర్,

వనస్థలిపురం, హైద్రాబాద్ - 500 070.

ఫోన్ : 040-24240557

: **సిద్ధాశ్రమము**

ఇందిరానగర్ కాలని,

నరసన్నపేట,

శ్రీకాకుళం జిల్లా - 532 421.

ముద్రణ : **శ్రీ సాయి కేశవ గ్రాఫిక్స్**

చిక్కడపల్లి, హైద్రాబాద్.

సెల్ : 9885644689

9000415679


B

# బ్రహ్మవిద్యా రత్నాకరము

## (ద్వితీయ సంపుటము)

స యస్య సాక్షాద్భవ పద్మజాతిభిః
రూపం ధియో వస్తుతయో పవర్ణితం
మౌనేన భక్త్యా పరమేన పూజితః
ప్రసీదతామేష స సాత్త్వతాం పతిః

ఎవ్వని రూపంబిట్టిదని బ్రహ్మరుద్రాదులు నిజబుద్ధివైభవంబున
వర్ణింపనేరరు-అట్టి ఈ సాత్త్వత పతి పూజితుండై నాకు ప్రసన్నుడయ్యెడు

C

వేదమాత అనే గోవునుంచి వేదసారమనే క్షీరసాగరమును మహర్షులు
పితికినారు. ఆ క్షీరసాగరమందలి గ్రుక్కెడు పాలు ఈ గ్రంథము

అస్మద్గురు సమారంభాం
కృష్ణ సాందీప మధ్యమాం
శ్రీ మహాదేవ పర్యంతాం
వందే గురు పరంపరాం

వాల్మీకి మహర్షి మఱియు వైష్ణవావతారమయిన వ్యాస భగవానుని కృపచే - గురు
పరంపర సాయముచే వ్రాయబడిన యీ గ్రంథము
జగద్గురువగు ఈశ్వరునికే అంకితం

D

## విషయ సూచిక

## మనవి

బ్రహ్మవిద్యా రత్నాకరము ప్రథమ సంపుటములో వేదపురాణములలోగల అపరవిద్యకు సంబంధించిన అన్ని ప్రశ్నలు వాటి సమాధానములు మఱియు ఐతరేయ, కేన, కఠ, తైత్తిరీయ, ఈశ ఉపనిషత్తులు వివరింపబడినవి.

వేదపురాణములలో పరవిద్యకు సంబంధించి ఒకే రకమైన ప్రశ్నలు వాటికి ఒకే విధమయిన సమాధానములు కనబడును. అవి ఈ రెండవ సంపుటములో వివరింపబడినవి. హిరణ్యాక్ష హిరణ్యకశిపులు, మారీచుడు, కంసుడు, తాటకి, శూర్పణఖ మొదలయిన పాత్రలు చిత్రీకరించుచున్నప్పుడు బాహ్యముగా దుర్మార్గులుగా చిత్రీకరించి సాధన రహస్యములను (బ్రహ్మవిద్యా రహస్యములను) గోప్యముగా అందించిరి. కావున సందర్భానుసారము వీరి సాధన రహస్యములను వెల్లడి చేయడమైనది.

ఈ రెండవ సంపుటములో ముండక, మాండుక్య, ప్రశ్న, కైవల్య ఉపనిషత్తులు, మఱియు సింహావలోకనము, పరవిద్య వివరింపబడినవి. వీటిని శాస్త్రము చెప్పినట్లు ఆచరించుచు శాస్త్రవిరుద్ధమయిన లోపములను సరిదిద్దుకొనిన అచలస్థిరకళ్యాణము కలుగును. జీవన సంగ్రామములో ఒక పక్షము ఆత్మ, జీవుడు, సూక్ష్మ దేహము. ఇంకొక పక్షము స్థూలదేహము అసుర సంపద. ఈ ఇరు పక్షములనే దేవతలు రాక్షసులుగను, రాముడు రావణుడుగను, పాండవ, కౌరవ యుద్ధముగను చిత్రీకరించి మన కథను మనకు చెప్పిరి. ఈ యుద్ధములో వైరి పక్షముతో యుద్ధము చేసి శత్రువులను సమూలముగ నశింపచేసి యుద్ధములో జయమును పొంది సాధకుడు దేహసామ్రాజ్య పట్టాభిషిక్తుడు కావలయునన్నది ఋషుల ఆకాంక్ష.

ఈ గ్రంథమునకు బదరీ వద్ద గల వ్యాసగుహ వద్ద బీజము పడి శ్రీశైలములో మొలకెత్తి, హిమాలయములలోగల భర్తృహరి గుహవద్ద ఫలించినది. నారదాది ఋషుల అనుగ్రహమున ఈశ్వర సంకల్పము కార్యరూపము దాల్చి వేదపురాణములలోగల సర్వవిషయములతో ఈ బ్రహ్మవిద్యా రత్నాకరము రెండు సంపుటములుగా వెలువడినది. వీటిని చదివి పండితులు వారి అభిప్రాయములను తెలుపగోరుచున్నాము.

**సర్వేజనో సుఖినోభవంతు**



SIDDHASHRAMAM
M: +91 8096065675 , P : +91 40 24240557
E : contactus@siddhashramam.org
W : www.siddhashramam.org

# అధ్యాత్మము

# సింహావలోకనము



## అధ్యాత్మ విభాగము

జన్మాద్యస్యయతోఽన్వయాదితరత శ్చార్థేష్వభిజ్ఞః స్వరాట్
తేనే బ్రహ్మ హృదా య ఆదికవయే ముహ్యన్తి యత్సూరయః ।
తేజోవారిమృదాం యథా వినిమయో యత్ర త్రిసర్గోఽమృషా
ధామ్నా స్వేన సదా నిరస్తకుహకం సత్యం పరం ధీమహి ॥

(సంస్కృత భాగవతము, ప్రథమ స్కంధము, ప్రథమాధ్యాయము, 1)

సీ. విశ్వజన్మస్థితి విలయంబు లెవ్వని వలన నేర్పడు ననువర్తనమున
వ్యావర్తనమునఁ గార్యములం దభిజ్ఞుఁడై తాన రా జగుచుఁజిత్తమునఁ జేసి
వేదంబు లజునకు విదితముల్ గావించె నెవ్వఁడు బుధులు మోహింతు రెవ్వఁ
నికి నెండమావులనీటఁ గాచాదుల నన్యోన్యబుద్ధి దా నడరునట్లు

ఆ. త్రిగుణసృష్టి యెందు దీపించి సత్యము
భంగిఁ దోఁచు స్వప్రభానిరస్త
కుహకుఁ డెవ్వఁ డతనిఁ గోరి చింతించెద
ననఘు సత్యుఁ బరుని నమదినంబు,

ఈ శ్లోకములో పరమాత్మను ధ్యానించడముతో పాటు ఆత్మ గుఱించి అధ్యాత్మ తత్త్వము గుఱించి, ప్రకృతి గుఱించి, సృష్టి గుఱించి, జీవేశ్వరుల గుఱించి సంగ్రహముగ చెప్పబడినది.

వేదములలో, ఉపనిషత్తులలో సంగ్రహముగ చెప్పబడిన ఆత్మ తత్త్వమును రామాయణము, భారతము, భాగవతములలో విపులముగ వివరింపబడినవి. పురాణములలో విపులముగ వివరింపబడిన విషయములను ఈ సింహావలోకనము అను ప్రకరణమున చెప్పబడినవి.

- ఆత్మ - ఆది పురుషుడు (వీరికి సృష్టితో సంబంధము లేదు)
  - విరాట్ పురుషుడు. ప్రకృతి పురుషుల సమిష్టి రూపము. నిరాకారములో దీనినే పూర్ణ బిందువు అని అందురు.
    - ప్రకృతి
      - అపర ప్రకృతి
        - దేహము *
      - పరాప్రకృతి
        - గుణములు
          - కర్మ
            - ప్రవృత్తి కర్మ
            - నివృత్తి కర్మ
    - పురుషుడు
      - దేహి
        - విశిష్ట జీవులు (అవతార పురుషులు)
        - సామాన్య జీవులు
          - సంసారి
          - విద్వాంసుడు
      - హృదయ గుహలో గల ఆత్మ

* సమిష్టిలో విశ్వము, వ్యష్టిలో దేహము ఏర్పడినది.



- ఆత్మ - ఆది పురుషుడు
  - విరాట్ పురుషుడు.
    - సమిష్టి
      - బ్రహ్మ
      - విష్ణువు
      - రుద్రుడు
    - సమిష్టి
      - సమస్త లోకములు, సర్వ స్థావర జంగమములు, సర్వ భావములు, సర్వ కర్మలు
    - వ్యష్టి (ఒక జీవి)
      - దేహము
      - దేహి
      - ఆత్మ

- సృష్టి
  - ప్రారంభ సృష్టి
  - అనంతరసృష్టి (బ్రహ్మ సృష్టి)
  - ప్రజాపతుల సృష్టి
    - స్వాయంభువుని కుమార్తెల వలన సృష్టి
    - కశ్యప ప్రజాపతి వలన సృష్టి సర్వ స్థావర జంగమములు
    - వైవస్వత మనువు వలన సృష్టి మానవులు
  - అండసృష్టి
  - మిథునసృష్టి
    - సర్వజీవరాసులు
    - మానవుడు

ఈ సృష్టిని రామాయణ, భారతములలో పాత్రలుగా చిత్రీకరించిరి.

తీవ్ర మోక్షేచ్ఛ గలవారికి ఈవిభాగము ఉపయోగము. వీరినే ధీరులు అని అందురు. పుణ్య కర్మలు, వాటి అశాశ్వత ఫలితములు, తెలిసి నిర్వేదము పొందినవారు ఈ విభాగమును నేర్చుకొనుటకు సద్గురువును ఆశ్రయించి, అభ్యసించి, ఆచరించిన అచల స్థిరకల్యాణమగు స్వస్వరూపమును పొందుదురు.

వేదములలో ఉపనిషత్తులలో చెప్పిన అధ్యాత్మిక విషయములను కపిలుని సాంఖ్య సూత్రములుగా, నారదుని భక్తి సూత్రములుగా, వసిష్ఠుని యోగవాసిష్ఠముగా, వ్యాసుని బ్రహ్మ సూత్రములుగా, పతంజలి యోగ సూత్రములుగా, రామాయణ, భారత, భాగవతపురాణములుగా రచియింపబడినవి. పరవిద్యకు సంబంధించి అష్టావక్రుడు చెప్పినది అష్టావక్రగీతగా, దత్తాత్రేయుడు చెప్పినది అవధూత గీతగా, ఋషభుడు చెప్పినది ఋషభగీతగా, వసిష్ఠుడు చెప్పినది వసిష్ఠగీతగా, భారతము భీష్మ పర్వములోనిది భగవద్గీతగా, శ్రీకృష్ణుడు తన నిర్యాణ సమయములో ఉద్ధవునికి చెప్పినది (భాగవతము 11వ స్కంధములో కలది) ఉద్ధవగీతగా ప్రసిద్ధములయినవి. ఇవి అన్నీ వేదములలోని ఉపనిషత్తులలోని విషయములను అమృతత్త్వము పొందు విధివిధానమును విపులముగా అర్థమగుటకు చెప్పబడిన పునశ్చరణ గ్రంథములు. అందువలన ధర్మరాజు జన్మసంసార బంధ విముక్తి గుఱించి భీష్మునిని అడుగగా భీష్ముడు ఋషులచే అనేకగీతలలో చెప్పబడినవి (ఋషిభిః పరిభిః గీతాని) అని చెప్పెను.

*****



## బ్రహ్మ విచారణ

ఈ విభాగము క్రింద **ఆత్మ** గుఱించి, **(ఆది) పురుషుని** గుఱించి వివరించబడును. ఆత్మ తత్త్వమును సృష్ట్యాది యందు గల ఆత్మ విభాగము క్రింద, సృష్టిలోని విభాగము క్రింద, దేహములో గల విభాగము క్రింద వివరించబడును.




**బ్రహ్మ విచారణ:-** కిం తద్బ్రహ్మ? అని అర్జునుడు శ్రీకృష్ణుని అడిగెను. దానికి శ్రీకృష్ణుడు అక్షరం బ్రహ్మ అని సమాధానము చెప్పెను. అనగా సృష్ట్యాది యందుగల ఆత్మయే బ్రహ్మ. దీనిని పర బ్రహ్మ అనియు అందురు. ఆత్మకు ఆది పురుషునకు సృష్టితో సంబంధములేదు. వీరిలో సృష్టిలేదు.

**సృష్ట్యాది యందు గల ఆత్మ :**

సృష్ట్యాదియందు ఆత్మ తప్ప ఇతరమేదియు లేదు. ఆత్మ ఒక్కడే గలడు. కావున ఒక్కడు.

అనాది, సనాతనము, పురాణము.

శాశ్వతుడు. నిత్యుడు. అమృతుడు. భూతభవిష్యత్ వర్తమాన కాలములో అనగా సర్వ కాలములలో ఉండును.

స్థాణువు. అచలము. అనగా సర్వకాలములలో మార్పు చెందక ఒకే విధముగా ఉండును.

స్వయంభువు. పుట్టుక లేనివాడు.

స్వయంజ్యోతి. పరంజ్యోతి. నిఖిలైక జ్యోతి. జ్యోతిర్మయుడు. స్వప్రకాశుడు. కల్పాంతమున అంధకారమున ఉన్న జగత్తును తన ప్రకాశముచే వెలిగించును. సూర్య చంద్రులకు కూడ అనగా వెలుగులకు వెలుగు.

నిరుపాధికము.

నిరాకారుడు.

అవ్యక్తుడు.

బాహ్య చక్షువులకు గోచరము కాడు. ఇంద్రియాదులచే గ్రహించలేము. అగోచరుడు.

గుణ రహితుడు. త్రిగుణ రహితుడు. నిర్గుణుడు. ప్రకృతి గుణ విలక్షణుడు. సత్వాది గుణ శూన్యుడు.

శుద్ధుడు. శుద్ధ స్వరూపుడు.

నిర్మలాత్మ. పరమాత్మ.



నిస్సంగుడు.

సాక్షి.

క్రియా శూన్యుడు.

పూర్ణుడు. పరిపూర్ణుడు. సకల సంపూర్ణుడు. ప్రకృతి పరిపూర్ణుడు.

అవ్యయుడు. క్షయరహితుడు.

అచింత్యము.

అప్రమేయము.

కాలాతీతము.

సృష్టి హేతువు.

పరిమాణములో పెద్దది. మహత్.

ఇంద్రియములు లేకపోయినను ఇంద్రియములు చేయు పనులను అన్నింటిని చేయును.

సర్వజ్ఞుడు. జ్ఞాన స్వరూపుడు.

సృష్టిలోని సర్వ దేవతలకు, దేహములోని ఇంద్రియమనోబుద్ధులకు శాశ్వతముగా విధులను నిర్ణయించును.

ఆత్మ నిష్ఠాగరిష్ఠులకు ధ్యేయము.

బుధులు మోహింతురు. బుధులు ఆత్మతో ఏకీభూతులయి ఆత్మగా విరాజిల్లుదురు. ఉదాహరణకు నదులు సముద్రములో కలసి సముద్రముగా పిలువబడునట్లు ఆత్మతో కలసి ఆత్మగా పిలువబడుదురు.

ఆత్మ బలహీనులకు లభ్యము కాదు.

శాస్త్రము చదువుట వలన గాని ఇతరులు చెప్పగా విన్నంతమాత్రమునగాని ఆత్మను గ్రహించలేము. సాధనచే ఆత్మను గ్రహించగలము.

**సృష్టిలో గల ఆత్మ :**

భిన్నుడు. మండుచున్న పెద్ద అగ్నినుండి అగ్నికణములు వచ్చినట్లు సృష్ట్యాదియందున్న ఆత్మనుంచి సృష్టిలో అంతర్యామిగా ఆత్మలు అనేకము వచ్చినవి. సృష్ట్యాది యందున్న ఆత్మ లక్షణములు, సృష్టిలో స్థావర జంగమములలో వసియించు ఆత్మ లక్షణములు ఒకటే. అనగా స్వరూప స్వభావములు ఒకటే. ఆత్మ ఏకమయ్యు జలాదులయందు చంద్రసూర్యులు, ఘటాదులయందు గగనము, పెక్కై గానంబడు భంగి వ్యాప్య వ్యాపకంబుల బహుభంగుల తోచు. వ్యవహార ప్రసిద్ధి కొఱకైన భేదముకాని ఆత్మకు భేదము లేదు.

శాశ్వతుడు. నిత్యుడు. అమృతుడు.

స్థాణువు. అచలము. అనగా సర్వభూతములయందు సర్వకాలముల యందు మార్పు చెందక ఒకే విధముగా ఉండును.

స్వయంభువు.

స్వయంజ్యోతి.

నిరాకారుడు.

అవ్యక్తుడు. బాహ్య చక్షువులకు గోచరము కాడు. ఇంద్రియములచే గ్రహించలేము.

గుణ రహితుడు.

శుద్ధుండు.

నిర్మల జల ప్రతిబింబితుండైన దినకరుని భంగి వర్తించు.

నిర్మలాత్మ. అంతరాత్మ. జగదంతరాత్మ. సర్వాత్మ. విశ్వాత్మ. సకలాత్మ. జగదాత్మ. భూతాత్మ.



నిస్సంగుడు.

సాక్షి.

క్రియా శూన్యుడు.

పూర్ణుడు.

సర్వవ్యాపకుడు.

సమస్త విశ్వము వ్యాపించిన వాడు.

బహిరంతర్భాసురుడు.

అంతర్యామి. పంచ భూతములలో అనగా ఆకాశమునందు శబ్దముగా, వాయువునందు స్పర్శగా, అగ్నియందు తేజముగా, జలములందు రసముగా, పృథివియందు గంధముగా కలడు.

పరిమాణములో సూక్ష్మము.

**దేహములో గల ఆత్మ :**

కః అధియజ్ఞః? అని అర్జునుడు శ్రీకృష్ణుని అడిగినాడు. దానికి శ్రీకృష్ణుడు అధియజ్ఞోఽ హమేవాత్ర దేహే అనగా హృదయగత ఆత్మయే అధియజ్ఞుడని సమాధానము చెప్పినాడు.

సృష్టిలోగల ఆత్మ లక్షణములన్నియు దేహములోగల ఆత్మకు వర్తించును. సృష్టిలో ఆత్మ, దేహములో హృదయగత ఆత్మగా, జీవాత్మగా అనగా రెండుగా ఉండును. సృష్ట్యాదియందు ఆత్మ ఒక్కడయ్యును దేహధారులందరిలో ఆత్మగా జీవాత్మగా ఉండును.

**హృదయ గత ఆత్మ - అధియజ్ఞుడు**

శాశ్వతుడు. నిత్యుడు. అమృతుడు.
అక్షరుడు.
స్వయంభువు. స్వయంజ్యోతి. నిరాకారుడు. అవ్యక్తుడు.
గుణరహితుడు.

శుద్ధుడు.

సాక్షి. సాక్షిభూతుడు.

క్రియాశూన్యుడు.

కార్యాకారణ కర్తృత్వము లేదు. అనగా. చంపడు. చంపబడడు.

తటస్థుండు. సూర్యుండు తటస్థుండై ఉండ ప్రకాశమానంబైన దృష్టరూపము బోలె ఆత్మతటస్థుండై ఉండ దేహేంద్రియ మనోబుద్ధులు ప్రకాశమానంబగు.

అయస్కాంత సన్నిధానమున ఇనుము చలించునట్లు హృదయగత ఆత్మ వలన దేహేంద్రియ మనోబుద్ధులు, జీవుడు పనిచేయుదురు.

అంతరాత్మ. కావున పంచ భూతములు ఏమియు చేయలేవు. అనగా నీరు తడుపజాలదు. అగ్ని దహింపజాలదు. వాయువు ఎండింపజాలదు. ఆయుధములచే ఛేదింపబడడు. చంపబడడు.

శరీరగతుడయ్యు ప్రాకృతములగు సుఖదుఃఖములకు విచలితుడు కాడు.

అనురక్తుడు కాడు.

క్షేత్రజ్ఞుడు.

హృదయగుహ ఇతని స్థానము.

ఆత్మను మనోబుద్ధి అహంకార నాడీప్రకాశమువలన తెలుసుకొనవలయును. ఆత్మను జీవుడు బుద్ధి ద్వారా గ్రహించ వలయును. సత్పురుషులకు తమో నివారకంబైన జ్యోతి స్వరూపమున చిత్తమున దర్శనమగును. దేహములోగల ఆత్మ స్థానమునే బ్రహ్మలోకమని అందురు. సాధకుడు ఆత్మను దర్శించి ఆత్మ స్థానమునకు చేరినచో జన్మ రాహిత్యము కలుగును. ఇతనినే పండితుడని, జ్ఞానిఅని, యోగీశ్వరుడని, ఏకాంత భక్తుడని విదేహుడని, జీవన్ముక్తుడని అందురు. ఇతడే **వేదజ్ఞుడు.** ఈ వేదజ్ఞుడు దేహపరిత్యాగానంతరము సృష్ట్యాదియందుగల ఆత్మ స్థానము చేరి ఆత్మయై విరాజిల్లును. దేహములో ఆత్మ స్థానము హృదయ గుహ. హృదయకోశము దేహమునకు అంటక లంబముగా వ్రేలాడుతూ కంఠస్థానమునకు దిగువన, నాభిస్థానమునకు పైన ఉన్నది. హృదయమునకు అథోముఖముగా ఉన్నది. తామరమొగ్గలా ఉన్నది. ప్రకాశవంతముగా ఉన్నది. ఆ హృదయగుహలో గొప్ప అగ్ని కలదు. ఆ అగ్ని యొక్క జ్వాలాసమూహము ప్రకాశించుచుండును. ఆ అగ్ని



సర్వజ్ఞుడు. యువకుడు. ఆ అగ్ని వైశ్వానరాగ్నిరూపమున అన్నమును పచనము చేయును. ఆ అగ్ని శరీరమంతా అనగా ఆపాదతలమస్తకము వ్యాపించి శరీరమును వేడిగా ఉంచును. హృదయగుహలోని అగ్నిజ్వాల ఊర్ధ్వముఖముగా ఉన్నది. ఆ అగ్నిజ్వాలల మధ్యలో అణువులో అణువంత పరిమాణమున పరమాత్మ బంగారువన్నె కలిగి మెఱుపు వలె ప్రకాశించు చున్నది. ఈ హృదయగుహలోగల అగ్నిని సాధన ద్వారా తెలుసుకొనుటయే నిత్యాగ్నిహోత్ర పరమావధి. ఇదే నచికేతాగ్నిగా పిలువబడును.

## దేహమందలి జీవాత్మగా అధిదైవము

అధిదైవం కిం? అని అర్జునుడు శ్రీకృష్ణుని అడిగెను. దానికి శ్రీకృష్ణుడు పురుషశ్చాది దైవతం అని చెప్పెను. అనగా దేహములో గల జీవుడు అధిదైవము.

అరూపుడు.

చిదాత్మకుడు.

అవ్యక్తుడు. బాహ్యచక్షువులకు గోచరము కాడు.

క్షరుడు.

మణిహారములో సూత్రము వలె జీవాత్మగా ప్రకృతి యొక్క గుణములను ప్రకృతియొక్క వికారములను కూడి ఉండును. దేహముతో మమేకమై ఉండును.

సుఖదుఃఖములను అనుభవించును.

## హృదయగత ఆత్మ - జీవాత్మ

ఒకే దేహమనే వృక్షమును ఆశ్రయించిఉన్న రెండు పక్షుల వలె ఈ రెండింటికి దేహమే నిలయము. దేహమునకేగాని షడ్భావ వికారములు ఆత్మకు లేవు. వృద్ధిక్షయములు చంద్ర కళలకు గాని చంద్రునికి లేని కైవడి జన్మనాశంబులు దేహమునకు గాని ఆత్మకు లేవు.

*****

# (ఆది) పురుషుడు

సృష్ట్యాదియందున్న ఆత్మ స్వయముగా ప్రకృతికి భిన్నమైన హిరణ్మయకోశమును నిర్మించుకొని అందు వసియించి పురుషుడైనది. ఉపాధి అనే పురమునందు వసియించుటవలన పురుషుడు. ఇతడు ఆది పురుషుడు. హిరణ్మయకోశమునకు మన శరీరమునకు వలె రక్త మాంసములు, నరములు మొదలగునవి లేవు. కావున ఇతడు ఇతరోపాధి శూన్యుండు.

ఆది పురుషుడు. పరమపురుషుడు. ఉత్తమ పురుషుడు. పురుషోత్తముడు.

సృష్ట్యాదియందు ఒక్కడు.

అనాది. సనాతనము. పురాణము.

శాశ్వతుడు. నిత్యుడు. అమృతుడు.

స్థాణువు. అచలము.

స్వయంభువు. అభవుడు. అజుడు. భవంబులనొందడు. జననము లేదు. జననవిరహితుడు. జన్మ కర్మంబులు లేనివాడు. కుల గుణవిరహితుడు.

స్వయంజ్యోతి. స్వయం ప్రకాశకుడు. స్వప్రకాశకుడు. శశ్వత్ ప్రకాశకుడు.

సోపాధికము. సాకారుడు.

అవ్యక్తము. సామాన్యులకు దర్శనీయుడు కాడు.

గుణ రహితుడు. త్రిగుణాతీతుడు. గుణాతీతుడు. నిర్గుణుడు. అగుణుడు. గుణములు లేవు. గుణ విహీనుడు.

రాగ రహితుడు. సముడు.

నిస్సంగుడు. గుణసంగ విరక్తుడు.

క్రియా శూన్యుండు. లుప్త క్రియా కలాపుడు.

వీతకర్ముడు.

కర్తృత్వ శూన్యుండు.

అవిశ్వుడు. విశ్వము కానివాడు. విశ్వముతో సంబంధము లేనివాడు.

శుద్ధుండు. పరిశుద్ధుండు. శుచి. విమలుడు.

సాక్షి. సర్వ సాక్షి. కర్మ సాక్షి.



పూర్ణుడు. పరిపూర్ణుడు.

అవ్యయుడు. క్షయరహితుడు.

అచింత్యము.

అప్రమేయము.

కాలాతీతుడు. కాల రహితుడు.

కాలాతీతుడగుట వలన కాలము కర్త కాదు. అందువలన ఇతనిని యౌవనవంతునిగా చిత్రీకరించెదరు.

జ్ఞాన స్వరూపుడు. విజ్ఞాన ఘనుడు. అఖిల విజ్ఞానమునకు ఆశ్రయుడు. కావున ఇతనిని దర్శించి ఇతనిలో ఏకీభూతుడయిన ఈ సర్వమూ తెలియును. అఖిల విజ్ఞానమయుడు. జ్ఞాన విజ్ఞాన మూర్తి. జ్ఞాన ప్రదుడు. జ్ఞాన గమ్యుడు. సర్వజ్ఞుడు.

పరుడు. పరాత్పరుడు. పరాపరుడు. పరముడు. ప్రకృతి పురుషులకు పరుడు. ప్రకృతి పురుష వ్యతిరిక్తుడు. ప్రకృతించెందడు. ప్రకృతికి పరుడు. తమస్సుకు అవ్వలి వాడు.

సృష్టి లయమునొందిన అనగా లయకాలమున లోకములు,లోకేశులు, లోకస్థులు నశించిన పిదప పెంజీకటికవ్వల పదునాలుగు లోకములకు ఉపరిది అయిన అలోకంబున ఏకాకృతిగా స్వయంజ్యోతిగా ప్రకాశించుచుండును. జగములు నశింప ఇతడు మేల్కొని బ్రహ్మాండమును ఎఱుగుచుండు. ఈ స్థితిలో ఇతనిని మఱ్ఱి ఆకుపై పవళించినట్లు(వటపత్రశాయిగా)చిత్రీకరింతురు. సృష్ట్యాదియందు మఱియు సృష్టిలయము చెందినపుడు ఇతడు ఒక్కడే ఉండుట వలన ఆ సమయమున ఇతనిని ఎవరుమాత్రము దర్శించగలరు? ఇతడు ఐశ్వర్యము, వీర్యము, యశస్సు, శ్రీ, జ్ఞానము, వైరాగ్యములను ప్రసాదించును కావున ఇతడు భగవంతుడు.

సృష్ట్యాదియందున్న ఆత్మకు ఆది పురుషునకు సృష్టితో సంబంధము లేదు. వీరిలో సృష్టి లేదు. ఈ కనిపించు దృశ్యమాన ప్రపంచము ఆత్మగాని ఆది పురుషుడు గాని కాదు. ఆత్మ, ఆదిపురుషుడు వీరు ఈ సమస్తము కాక ఉందురు.

*****

# అధ్యాత్మము

కిం అధ్యాత్మమ్? అని అర్జునుడు శ్రీకృష్ణుని అడిగెను. ఆత్మ యొక్క స్వభావము అనగా ఆత్మ తత్త్వము అధ్యాత్మ మనబడును అని శ్రీకృష్ణుడు చెప్పినాడు.

**కార్యవర్గంబును గారణ సంఘంబు నధికరించి చరించు నాత్మ తత్త్వ మధ్యాత్మమనం బడును.** (భాగవతము, ప్రథమ స్కంధము, 56)

కారణము:- ప్రధాన కారణము - విరాట్పురుషుడు;
ఉపాదాన కారణము - ప్రకృతి

కార్యము:- ప్రకృతి వలన సృజియింపబడిన విశ్వము.
విశ్వము, ప్రకృతి, విరాట్పురుషులకు పరమయినది.
ఆత్మ. ఆ ఆత్మ విరాట్పురుషునిగా ఉపాధులను నిర్మించి, అందు ఆత్మగా, జీవాత్మగా వసియించినది. ఇట్టి ఆత్మతత్త్వము అధ్యాత్మమనబడును.

ఆత్మ సృష్టిచేయ సంకల్పించి హిరణ్మయకోశమును నిర్మించుకొని అందు వసియించి ఆది పురుషుడయినది.

**ఒక వాదన:-** ఆది పురుషుడు సృష్టిచేయ సంకల్పించి తన మాయవలన తనని పురుషునిగా, జీవునిగా, ప్రకృతిగా, కాలముగా, కర్మగా విభజించుకొనినాడు. ఒక్కడే ఇలా భిన్నత్వమును పొందినను వీటి లక్షణములు మాత్రము వేటికి అవి వేఱు వేఱు. అనగా ఆది పురుషుని లక్షణములు, విరాట్పురుషుని లక్షణములు, జీవుని లక్షణములు, ప్రకృతి లక్షణములు, కాలముయొక్క లక్షణములు, కర్మ లక్షణములు ఇవి వేటికి అవి వేఱు. ఇవి అన్నీ ఒకే లక్షణములు కలిగి లేవు.

సృష్టిలో దేహంబునకు ద్రవ్యంబులయిన మహాభూతంబులును,
జన్మ నిమిత్తంబులయిన కర్మంబులును
కర్మక్షోభకంబైన కాలంబును
కాల పరిణామ హేతువైన స్వభావంబును
భోక్తయైన జీవుండును
ఆదిపురుషుడే(వాసుదేవుడే). ఆది పురుషుని కంటె వ్యతిరిక్తము లేదు.






**ఇంకొక వాదన:-** ఆత్మ యందు ప్రకృతి లేదు. అయినను ఇంద్రజాలికుడు తన మాయ వలన వస్తువులను సృజియించునట్లు ఆత్మ తన మాయ వలన ప్రకృతిని సృజియించినది. ప్రకృతి వలన ఉపాధిని సృజియించి ఆత్మ స్వయముగా అందు వసియించి విరాట్పురుషుడయినది. విరాట్పురుషుడు ప్రకృతికి సంబంధించిన తన ఉపాధినుంచి దేవ, దానవ, మానవ, పశుపక్ష్యాది సర్వ జంగమములను, సర్వ స్థావరముల ఉపాధులను నిర్మించినాడు. ఆ ఉపాధులలో హృదయగత ఆత్మగా, జీవాత్మగా వసియించినాడు. ఆ విధముగా అతడు సర్వ ఉపాధులలో ఉండి సర్వ అవతార పురుషులుగా విస్తరిల్లినాడు. ఈ దృశ్యమాన ప్రపంచమంతయు విరాట్పురుషుడే. ఈ సర్వమూ అతడే. అతడు గానిది పరమాణువు కూడా లేదు.

**ప్రకృతి గుఱించి:-** ఎండమావులలో నీరు లేదు. అయినను ఎండమావులలో నీరు ఉన్నట్లు కనబడుచున్నది. అటులనే అజ్ఞానులకు ప్రకృతి కనబడుచున్నది. సత్యము ఎఱిగినవాడు ఎండమావులలో నీరు లేదని గ్రహించినట్లు ఆత్మ జ్ఞానికి ప్రకృతి లేదు. కేవలము ఆత్మయే సర్వత్ర గోచరించును. అంతా ఆత్మ స్వరూపమే.

*****

## విరాట్‌పురుషుడు

**విరాట్పురుషుని ఆవిర్భావము- సృష్ట్యాదియందు**

**అజోऽపి సన్నవ్యయాత్మా భూతానా మీశ్వరోऽపి సన్**
**ప్రకృతిం స్వామధిష్ఠాయ సంభవామ్యాత్మమాయయా॥** (భగవద్గీత, జ్ఞానయోగము,6)

నేను పుట్టుక లేనివాడను, అవ్యయుడను, భూతములకు ఈశ్వరుడను అయినప్పటికి నేను నాయొక్క మాయ అయిన ప్రకృతిని అధిష్ఠించి విరాట్పురుషునిగా అవిర్భవించుచున్నాను.

**సృష్టిలో విరాట్పురుషుని రూప గుణ లక్షణములు**

విరాట్‌పురుషుడు

**సీ॥ మహదహంకార తన్మాత్ర సంయుక్తుఁడై చారు షోడశ కళా సహితుఁడగుచుఁ**
**బంచ మహాభూత భాసితుండై శుద్ధ సత్త్వుఁడై సర్వాతి శాయియగుచుఁ**
**జరణోరు భుజ ముఖ శ్రవణాక్షి నాసాశిరములు నానా సహస్రములు వెలుఁగ**
**నంబర కేయూర హార కుండల కిరీటాదులు పెక్కువే లమరుచుండఁ**

**తే॥ బురుష రూపంబు ధరియించి పరు డనంతుఁ,**
**డఖిల భువనైక వర్తన యత్నమమర**
**మానితోదార జలరాశి మధ్యమునను,**
**యోగనిద్రా విలాసియై యొప్పుచుండు.**

**(భాగవతము, ప్రథమ స్కంధము, 62)**

**రూపము:-** సర్వదేవతలు ఇతడే. కావున అనేక కిరీటములు, దివ్యాభరణములు, హారములు, కుండలములు కలిగి సర్వాలంకారభాసితుడై అనేక దివ్య వస్త్రములు ధరించి ఉన్నాడు. సర్వ జీవరాసులు ఇతడే కావున అనేక శిరస్సులు, పాదములు, చేతులు, ముఖములు అనగా కర్మేంద్రియములు, చెవులు, కన్నులు, ముఖము, ముక్కు అనగా జ్ఞానేంద్రియములు కలిగి ఉన్నాడు. కావున ఇతడు సాకారుడు. బాహ్య



దృష్టికి గోచరుడు. దేవతా రూపమున బాహ్య దృష్టికి అగోచరుడు. ఈ విధముగా వ్యక్తావ్యక్త స్వరూపుడు.

**గుణము:-** ప్రకృతీపురుష సంయుతుడు. ప్రకృతి పంచదశకళలు కలిగి అనగా మహత్, అహంకారము, త్రిగుణములు, పంచతన్మాత్రలు, పంచభూతములు కలిగి ఉండును. విరాట్పురుషుడు ప్రకృతితో కూడి షోడశకళాసహితుడు. (ఈశ్వరుడు షోడశ కళాసహితుడు. జీవుడు ప్రకృతియుతుడైనను పంచదశాకళాసహితుడు అని చెప్పుదురు కావున రాముడు విశ్వామిత్రుని వెంట బయలుదేరునాటికి అతని వయస్సు పదిహేను సంవత్సరములు అని చెప్పబడినది)

**లక్షణము:-** పరుడు. అనంతుడు.

**నివాసము:-** సృష్టి కాలమున మఱియు లయకాలమున ఇతడు జలరాసి మధ్యలో యోగనిద్రా పరవశుడై ఉండును ఆత్మ ఆవిధముగా విరాడ్రూపము ధరియించినది.

**విరాట్పురుషుడు**

స్వయంభువు.

స్వయంజ్యోతి.

అక్షరుడు. పరుడు. అనంతుడు.

శ్వశ్వన్మూర్తి. మహామహిముడు. ప్రకృతీపురుషుల సమిష్టిరూపుడు.

సృష్టికారకుడు. భూతయోని.

సృష్టిలో భిన్నుడు.

సోపాధికము. ఆదిపురుషుడు హిరణ్మయకోశవర్తి. విరాట్పురుషుడు ప్రకృతి సంబంధమయిన ఉపాధిలో చరించువాడు.

ప్రకృతితో కూడి ఉండుట వలన గుణయుతుడు. రజోగుణమునాశ్రయించి బ్రహ్మగా, సత్వగుణమునాశ్రయించి విష్ణువుగా, తమోగుణమునాశ్రయించి రుద్రునిగా విరాజిల్లుచున్నాడు. కావుననే విశ్వజన్మస్థితి విలయంబులు ఎవ్వనివలననేర్పడు అని ఏకవచనమున విరాట్పురుషుని గుఱించి చెప్పబడినది.

**రూపము:-** సహస్ర శీర్షము, సహస్ర అక్షులు, సహస్రపాదములు కలిగి ఉన్నాడు. కావున ఇతడు విశ్వరూపుడు. సర్వరూపుడు. లోక స్వరూపుడు. యజ్ఞ స్వరూపుడు. వేద స్వరూపుడు. భూత భావన రూపుడు. ప్రకృతియుతుడగుట వలన ప్రకృతి కార్యంబైన మహతత్త్వరూపుడు. సృష్టి రూపమున వ్యక్తుడు. సమస్త జీవరూపుడు. జీవరూపమున ప్రాణేంద్రియ గుణ స్వరూపుడు. నిజయోగ మాయా మహిమంజేసి స్వేచ్ఛా పరికల్పిత చిద్ఘన లీలా విగ్రహుడు. భక్తులు కోరిన భంగి ఏరూపమయినా ధరించువాడు. దేవతా రూపమున బాహ్య చక్షువులకు అగోచరుడు. కావున వ్యక్తావ్యక్త రూపుడు. సమస్త దేవతారూపుడు.

**స బ్రహ్మ సశివ స్సహరి స్సేన్ద్రసోఽక్షరః పరమ స్స్వరాట్**

బ్రహ్మగా నాలుగు ముఖములు, విష్ణువుగా నాలుగు చేతులు, రుద్రునిగా త్రినేత్రములు కలిగి సృష్టిలో విరాజిల్లుచున్నాడు.

విష్ణువుయొక్క సాకారరూప వర్ణన ఈ క్రింది విధముగా చేయబడినది:

రూపము :- శుద్ధసత్వరూపుడు, శృంగార రూపుడు, సుందరాకారుడు, దర్శనీయుడు, కమనీయ శుభమూర్తి, కమలాకాంతుడు, తేజఃప్రచండుడు, నీలనీరదశ్యామవర్ణుడు, త్రిజగన్మోహన నీలకాంతి, లీలా మానుషుడు.

| | |
|---|---|
| కిరీటము | : ఘన కిరీటము గలవాడు. |
| జుట్టు | : నీలవేణి |
| ముఖము | : పూర్ణేందు మండల ముఖము, నగుమొగము, చిఱునవ్వు గలవాడు. |
| నేత్రములు | : పంకజ నేత్రుడు,అబ్జలోచనుడు, పుండరీకాక్షుడు, జలరుహాక్షుడు, పద్మలోచనుడు,తెల్ల తామర పూలవంటి కన్నులు గలవాడు, అరవింద సుందర పత్ర నేత్రుడు, కృపారస దృష్టి గలవాడు. |
| భుజములు | : చతుర్బాహుడు, మహాభుజుడు |
| నడుము-నాభి | : సుమధ్యమ నాభుడు-పంకజనాభుడు |
| వక్షస్థలము | : వక్షస్థలమున లక్ష్మీదేవి గలవాడు, లక్ష్మీయుతుడు, శ్రీవత్సకౌస్తుభము గలవాడు. |
| నడక | : ఏనుగు నడక వంటి నడక గలవాడు. |



| | |
|---|---|
| బట్టలు | : పీతాంబరుడు, పచ్చని వలువ కట్టిన వాడు. దిక్కులే అంబరముగా కలవాడు, దిగంబరుడు. |
| ఉత్తరీయము | : పీతకౌశేయవాసుడు, ప్రభాత నీరజబంధు ప్రభమైన చేలము పయిన్ రంజిల్లువాడు. |
| ఆభరణములు | : దివ్య భూషణములు ధరియించినవాడు, కేయూర కుండలములు గలవాడు |
| ఆయుధములు | : శంఖ చక్ర గదాధరుడు, శార్ఙ్గ కోదండము గలవాడు |
| నివాసము | : శ్వేత ద్వీపము, వైకుంఠ ధామము, పరంధామము, ఉత్తమ మందిరుడు, ధర్మమందుండును. |

సమస్త స్థావర జంగమ రూపుడు. విశ్వరూపుడు.

| స్థావరములు | జంగమములు |
|---|---|
| పదునాలుగు లోకములు | లోకపాలురు |
| సూర్య,చంద్ర,నక్షత్ర,గ్రహములు | దేవతలు ఋషులు |
| సముద్రములు, నదులు, | దానవయక్షరాక్షసులు |
| పర్వతములు, కొండలు | సిద్ధసాధ్యగంధర్వాదులు |
| వృక్షలతాదులు | సర్వమానవులు సర్వపశువులు |
| | సర్వమృగములు, |
| | సర్వ జలచరములు |
| | సర్వగగన చరములు |
| | కంటికి కనిపించని సూక్ష్మ జీవులు |

సర్వ భావములు, సర్వ కర్మలు, సర్వ విద్యలు, సర్వ ఛందస్సులు, సర్వ వేదములు ఈ సర్వమూ అతడే. విరాట్పురుషుడుకానిది పరమాణువు కూడా లేదు.

కింకర్మ అని అర్జునుడు శ్రీకృష్ణుని అడిగెను. దానికి శ్రీకృష్ణుడు భూతభావోద్భవ కరః విసర్గః కర్మ సంజ్ఞితః అని చెప్పినాడు. అనగా సర్వభూతములను, సర్వస్థావరాదులను, సర్వభావములను సృజియించుట కర్మ అని అందురు అని

చెప్పినాడు. కావున గుణయుతుడైన విరాట్పురుషుడు సృష్టి స్థితిలయములను చేయుటను కర్మగా చెప్పుదురు. విరాట్పురుషుడు ప్రారంభ సృష్టిని చేసెను. ఇది అయోనిజ సృష్టి.

ఇతడు కాలకర్మ స్వభావ ప్రేరకుడు. వాటికి ఆధీనుడు కాడు.

కర్మ విస్తారకుడు. ఇతనికి కర్మలు అంటవు. కర్మలు లీలలు అగును.

పంచభూతముల సమ్మేళనము వలన శరీరము అను పురములను సృజియించును. ఆ ఉపాధులలో ఆత్మగా జీవాత్మగా ప్రవేశించును. నామ రూపంబులు లేని జీవులందు నామరూపములు కల్పించును.

సచరాచరజాలంబును ఒక కాలమున కలుపును. ఒక కాలమున విడతీయును.

కర్మ సంసరణంబులైన జీవులకు యోగ వియోగములను నొందించు. భూతంబులను నొకదానితో నొకటి కలుపును విడతీయును.

భూతంబుల చేత భూతంబులకు జనన మరణ పోషణంబులు నిర్ణీతము చేయును. అనగా భూతంబుల చేత భూతంబులు పుట్టించు. భూతంబుల చేత భూతంబుల రక్షించు. భూతంబుల చేత భూతంబుల సంహరించు. పశువులకు ముక్కుకు త్రాడు వేసి యజమాని ఆడించునట్లు ఈశ్వరుడు జీవులను ఆడించును.

జీవులకు సంసారవృక్షమును కలుగ చేయును.

**సృష్టికి సంబంధించి :**
**హేతువు** :- సకల కార్య హేతువు, ప్రకృతి, పురుష, మహత్, అహంకార, తన్మాత్ర, తత్ క్షోభక హేతువు. అఖిల భావములకు హేతువు. జనన స్థితి విలయములకు హేతువు. సర్వ హేతువు. విద్యావిద్యలకు హేతువు. సృష్టికి మూల కారణము. సృష్టికి ఇతడే కారణము. విశ్వ కారకుడు, జగత్కారకుడు, నిఖిల కారకుడు, చేతనా చేతనాత్మక ప్రపంచమునకు కారణుండు. సద్గుణైశ్వర్య కారణుండు. కార్యా కారణ రూపకుండు. శబ్ద యోని, శాస్త్ర యోని.



**మూలము** :- మూడు మూర్తులకు, మూడు లోకములకు, మూడు కాలములకు మూలము. యజ్ఞము, వేదము, భూదేవ, క్రియాది మూలము. కావున చెట్టు మొదట నీరుపోసిన చెట్టు అంతటకు నీరు అందునట్లు ఇతనికి మ్రొక్కిన సర్వ దేవతలు సంతోషించెదరు.

**ఆధారము** :- కేవల పరమంబును బ్రహ్మము అయిన విరాట్ ఈ అఖిల జగమునకు ఆధారము. సర్వాధారము, జగములకు ఆధారము, దేవర్షి పిత్రాది లోకములకు, ధర్మాదులకు మహా ఆధారము. మహా భూత గణంబులకు ఆధార భూతుడు. సర్వ భూతాధారుడు, బ్రహ్మకు, ధర్మమునకు, నిరంతర సుఖమునకు ఆశ్రయుడు.

**ప్రేరకుడు** : -కాల, కర్మ, స్వభావ ప్రేరకుడు. విశ్వ, జన్మ,స్థితి, విలయంబులు ఇతని వలననే ఏర్పడుచున్నవి.

**స్థితికి సంబంధించి :**
**ఈశ్వరుడు** :- సర్వేశ్వరుడు, పరమేశుడు, దేవేశుడు, జగదీశుడు, రమేశుడు, యజ్ఞేశుడు, భూతేశుడు, పరేశుడు, యోగీశుడు, విశ్వేశుడు, అంతఃకరణ ప్రవర్త కర్తంబున హృషీకేశుడు, లోకేశ్వరుడు, యజ్ఞేశ్వరుడు, యోగీశ్వరుడు, సదసదీశ్వరుడు, మనోబుద్ధి చిత్తఇంద్రియములకు అధీశ్వరుడు. నియంత, సకల నియంత, సకల సృష్టి నియంత, లోక నియంత, నియామకుడు. కాల, దేవ, సత్త్వ, రజస్తమోగుణ, అహంకార, మహతత్త్వ ప్రదానంబులకు ప్రభుత్వంబు లేదు.
నిత్యవిభూతి నాయకుడు, సర్వలోక నాయకుడు.
**పతి** :- శ్రీపతి, యజ్ఞపతి, జగత్పతి, జగదధిపతి, ప్రజాపతి, భూపతి, బుద్ధిపతి,అధిపతి, సకల జీవులకు ఆత్మ నాథుండు. భూభర్త, జగద్భర్త, నిర్వాణ భర్త, క్షేత్ర పాలకుడు, త్రైలోక్యపాలకుడు. నిఖిల భూతములకు, ఇంద్రియములకు, అహంకారమునకు, ప్రాణమునకు, ప్రకృతికి, ప్రకృతి సంభవములయిన మహత్‌కు వీటన్నింటికి ప్రభువు. పరమేశ్వరుండు నిగ్రహ, అనుగ్రహ ప్రభువు. బంధ మోక్షములకు ప్రభువు. అఖిల జంతువులకు ఆత్మ కావున వల్లభుడు. భూతములను పాలించు విభుడు.

**పోషకుడు** :- గర్భస్థుడుగా ఉన్నప్పుడు ఎవడు పోషించునో అడవిలోనున్నను, అతడే పోషకుడు.

**రక్షకుడు** :- సర్వ రక్షకుడు,

**శరణ్యుడు** :- అఖిల లోక శరణ్యుడు. భూత శరణ్యుడు, ఆర్త శరణ్యుడు, సర్వ శరణ్యుడు.

**భక్తులకు** :- (జీవ కర్మ మార్గంబున ప్రవర్తించువారు భక్తులు. వారు ఈశ్వరునిని తాపత్రయ నివారణకు భజియింతురు.) భక్తజన పోషకుడు, భక్తజన పాలకుడు, భాగవత శ్రేష్ఠులకు ఆత్మ మూర్తి .ఆశ్రయించిన జనులకు ఆనందమిచ్చువాడు. భక్తుల తులసీదళ దూర్వాంకురములచే చేసిన పూజకు సంతోషించును. నీచ వర్తనుడై దుష్టాత్ముడైన వాడు హేమాచల తుల్యంబైన పదార్థము నొసంగినను అది భగవంతునికి సమ్మతంబు కాదు. మునిలోక శిఖామణి. భక్తి హీన దుర్లభుడు. ఆపన్న భక్త జనార్తి హరుడు. భక్తుల భవలతలను ద్రుంపును. భక్తుల మోహమును విచ్ఛేదము చేయును. భక్త వరదుడు, భక్త మందారుడు, ఆశ్రిత పారిజాతము, భక్త సులభుడు, భక్త వత్సలుడు, భక్త ధనుడు, భక్తులకు అభయప్రదుడు.

**గుణములు** :- అనంత గుణములు కలవాడు. సత్త్వ గుణ గరిష్ఠుడు, రజోగుణ విహీనుడు, నిత్యకళ్యాణ గుణ గరిష్ఠుడు,గుణత్రయాధీశ్వరుండు, గుణములను సృజియించును. గుణధర్మి, అహంకారదూరుడు, నిరహంకృతుడు, శాంతుడు, సౌమ్యుడు, కరుణాత్మ, కరుణాంబుధి. శుద్ధ కారుణ్యమూర్తి, కృప గల వాడు, కృపామయుడు, నిత్యానుకంపానిధి, పరకృతాపరాధ, నిష్పీడ్యమానమాన సుండయ్యు అనుకంపాయత్త చిత్తుండై వర్తించువాడు, దయాసింధువు, దయాపయోనిధి, సర్వ లోక శుభప్రదాత, కర్మఫల ప్రదాత, క్రతు ఫలదుడు, సచ్చిదానందమయుడు, పరితోషుడు, కామ ప్రదుడు, నిష్కాముడు, పూర్ణకాముడు, ఆడిన మాట తప్పడు. అలుగడు, సంసారభయ విదూరుడు, సర్వ భూతాత్మకుడైన పరమేశ్వరునికి వైషమ్యంబు లేదు. సర్వ సముడు, ప్రియా ప్రియులు లేవు, జననీజనక, దారా, పుత్ర బాంధవ, సఖ, శత్రు, ప్రియా, ప్రియంబులు లేరు. సాత్త్విక, రాజసిక, తామసిక, భావములు ఇతని వలన కలిగినవి. ఈ భావములు ఇతని ఆధీనములు.

**శక్తి** : - శక్తి మయుడు, అనంత శక్తి , దురంత శక్తి, శక్తి సహితుడు, త్రిశక్తి యుతుడు, సర్వశక్తి యుతుడు, స్వచ్ఛత శక్తియుతుడు, అనంత శక్తి ధరుడు, నిఖిల శక్తి ధరుడు, బహుశక్తి ధారణుడు, అఖండ శక్తి శాలి, చిచ్ఛక్తి కలవాడు,నాశనము చేయుచుండు వాడు. లోక సంహారమునకై విజృంభించిన పురుషుడు కాలమని చెప్పబడును.



**ధర్మము** :- ధర్మ సేతువు, ధర్మవిస్తారకుడు, ధర్మభావనుడు, యుగానుకూల ధర్మములను ప్రతిష్ఠించువాడు. నిజమార్గ సంస్థితుడు, నిమిత్త ధర్మ, అర్థ, కామ విషయుండు. భేద రహితుడు జాతి భేద రహితుడు. జీవుని భంగి కర్మగుణ బద్ధుడు కాడు. భక్త మానస చోరుడు. భూత మయుడు, సర్వ మయుడు, విశ్వమయుడు, అపవర్గ మయుడు. కామ ప్రదుడు, కోరినవారి కోర్కెలు తీర్చును, సర్వార్థ సాధకులకు సాధనీయుడు. సకామజనఫల ప్రాపకుడు. ఇతని పాదములందు పుట్టిన గంగానది జలములు సేవింప మనుష్యులకు నిర్మలత్వము కలుగును.

**స్థానము** :- జగన్నివాసుడు, గో, భూసుర, వేద, వర్ణ, ధర్మాశ్రమములందు ఉండును.

**ప్రపంచము** :- చరాచరాత్మకంబగు సకల ప్రపంచము ఇతని ఆధీనమై ఉండును. లోకములు నారాయణునిచే నియమింపబడినవి. వర్ణాశ్రమ లక్షణంబులు గల నామంబులచే బద్ధులై లోకపాల సహితంబైన లోకము ఈశ్వరుని ఆదేశమును వహించును. విశ్వము కార్యాకారణ రూపంబు. ఈ విశ్వము ఈశ్వరుని యందు అయస్కాంత సన్నిధానము కలిగిన లోహము చందంబున వర్తించు. విశ్వము నందు సర్వేశ్వరుండు నిమిత్త మాత్రంబుగా పరిభ్రమించు,

**కర్మ** :- సకల చరా చరములను పోషించును. శిష్ట రక్షణ చేయును. గుణియై, సర్వరక్షణ చేయుచుండును. దీన రక్షకుడు, సాధు రక్షకుడు, శిష్ట రక్షకుడు, సనాతన ధర్మ రక్షకుడు, ఆశ్రిత రక్షణ తత్పరుడు, శిష్ట, భృత్య, మునిజన, రక్షాప్రకారుడు, రక్షకులు లేని వారలకు రక్షకుడు, దిక్కులేని వారలకు దిక్కు, రజస్తమ, స్సత్త్వ గుణములనే బంధములను ఐశ్వర్య శత్రుమరణ ధర్మాది విశేషంబుల విడచి శరణుచొచ్చిన వారిని రక్షించు.

**లయమునకు సంబంధించి**:- శివుడు. కాలరూపమున సర్వము లయము చేయును. ఇతడు లయకారకుడు. మృత్యు దేవత. కాలుడు. దుష్ట శిక్షకుడు, దుష్ట వినాశకుడు, దుష్టదనుజ సంహారకుడు, దనుజహరుడు, సంహారకుడు, సర్వము హరించు మృత్యువు, జనుల సంసారమును సంహరించువాడు, లోక ద్రోహులగు రాజవంశములను దహించువాడు, సకల చరాచరములను లయము చేయును.

*****

## బిందు విశ్లేషణ

తాంత్రికులు  ఈ బిందు స్థానమును బైందవ స్థానమని చెప్పి ఈ బిందువును చేరుటకు సాధన రహస్యముగా శ్రీచక్రమును చెప్పిరి.  యోగులు దీనిని సహస్రార మధ్యగత బిందువు అని అందురు.  బిందువులో సగ భాగము పురుషుడు. సగ భాగము ప్రకృతి.  అనగా ప్రకృతి పురుషుల సమిష్టి రూపము బిందువు.  మరల పురుషుడు ఈశ్వర పురుషునిగా జీవ పురుషునిగా తనని తనే విభజించుకొనినాడు. ఈశ్వరుడు  ప్రకృతి ఒక జంట.  వీరినే శివపార్వతులనీ, లక్ష్మీనారాయణులని, బ్రహ్మ సరస్వతి అని స్వాయంభువుడు శతరూప అని చెప్పుదురు.  జీవుడు  ప్రకృతి ఒక జంట. పురుష ప్రకృతుల జంటను సీతారాములనీ, జీవుడు ప్రకృతుల జంటను రావణుడు, మండోదరి అని చిత్రీకరింపబడినది.  జీవుడు ప్రకృతితో కలసి రతి చేయుచు సంసార తాపత్రయములో చిక్కుకొనినాడు.  ప్రకృతి నుంచి జీవుడిని వేఱు చేసిన జీవుడు మోక్షమును పొందును.

ఈ రహస్యమునే వాల్మీకి రతి కాలమున ఉన్న పక్షుల జంటలోని మగ పక్షిని నిషాధుడు చంపినట్లు దానిపై జీవునికి కీర్తి కలుగును గాన కీర్తి అను అర్థము వచ్చు శ్లోకము ఇట్లు చెప్పెను.

**మానిషాద ప్రతిష్ఠాం త్వమగమః శాశ్వతీః సమాః**
**యత్ క్రౌఞ్చ మిథునాదేక మవధీః కామమోహితమ్**

శ్లోకమనగా కీర్తి. ఎవరైతే జీవ పక్షిని చంపుదురో వారు ఈశ్వరత్వమును పొంది కీర్తి బడయుదురు.  ఇదే విధానమును పురుష సూక్తములో దేవతల యజ్ఞములో జీవపురుషుని ఆహుతి చేసి ఈశ్వరుని దర్శించినట్లు వివరింప బడినది.




*****



## అవతారములు

**విరాట్ పురుషుడు (వ్యష్టిలో) :- జీవుడు :**  జీవాత్మ స్వరూపుడు.  జీవ లోకమున జీవాత్మ, కూటస్థుడు.

**యదాయదాహి ధర్మస్య గ్లానిర్భవతి భారత**
**అభ్యుత్థానమధర్మస్య తదాత్మానం సృజామ్యహమ్॥**

(భగవద్గీత, జ్ఞానయోగము,7)

ఎప్పుడు ప్రపంచమున ధర్మమునకు హాని కలుగునో అప్పుడు ధర్మమును ప్రతిష్ఠించుట కొఱకు నేను స్వయంభువుగా అవతరించెదను.

**పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతాం**
**ధర్మ సంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే**

(భగవద్గీత, జ్ఞానయోగము, 8) అని చెప్పినాడు.

సాధువుల రక్షించుటకు, దుష్టుల శిక్షించుటకు  అనగా ధర్మ సంస్థాపన కొఱకు యుగయుగముల మానవునిగ నేను అవతరించుచున్నాను.

సృష్టిలో విశిష్టములయినవి అవతారములుగ చెప్పుదురు.

**స్వయంభువులు :-**  **అయోనిజ సృష్టి**

1. **మత్స్యావతారము.** పూర్వ కల్పాంతమున చాక్షుష మన్వంతర సంప్లవంబున అనగా సంభవించిన జల ప్రళయములో జగము అంధకారముగా ఉన్న సమయమున అవతరించెను.  ద్రవిడ దేశాధీశ్వరుండగు సత్యవ్రతుని మహీరూపంబగు నావనెక్కించి ఉద్ధరించెను. ఆ రాజు వైవస్వతుడుగా జన్మించి సప్తమ మనువు అయ్యెను. మత్స్యావతారమున  బ్రహ్మ ముఖము నుండి పడిపోయిన వేద శాఖలు సంకీర్ణము గాకుండా విభజించి మరల బ్రహ్మకు ఇచ్చెను.

2. **హయగ్రీవ అవతారము** . ఇతడు బ్రహ్మ చేసిన యజ్ఞములో ఆవిర్భవించెను. ఇతని నుండి వేదములు ఉదయించినవి.

3. **యజ్ఞ వరాహావతారము** . భూమి జలములలో మునిగి ఉన్నది. భూమిని ఉద్ధరించుట గుఱించి బ్రహ్మ ఆలోచించుచున్న సమయములో బ్రహ్మ ముక్కు

నుంచి ఆవిర్భవించెను. వరాహ దేహము దాల్చి హిరణ్యాక్షుని సంహరించి రసాతల గతంబైన భూమిని ఉద్ధరించి జలములపై ఉంచెను.

4. **నరసింహావతారము.** ప్రహ్లాదుని కోరికపై స్తంభము నుండి ఆవిర్భవించి హిరణ్యకశిపుని సంహరించెను.

5. **హంసావతారము.** ఈ అవతారమున నారదునికి వైష్ణవ తంత్రము(భాగవతము) ఉపదేశించెను.

**క్షీర సాగర మథన వేళ** (ఆఱవ మన్వంతరము)

6. **కూర్మావతారము.** ఈ అవతారమున క్షీర సాగరమును దేవదానవులు మథించు సమయమున మందర పర్వతమును తన వీపుపై నేరుపరియై నిలిపెను.

7. **ధన్వంతరి.** క్షీర సాగర మధ్య భాగము నుండి అమృత కలశహస్తుడై ఆవిర్భవించెను. ఆయుర్వేదమును కల్పించెను.

8. **మోహిని** (స్త్రీ రూపము) అసురులను మోహితులను చేసి దేవతలకు అమృతమును పంచి ఇచ్చెను.

*****

## బ్రహ్మ సృష్టి - అయోనిజ సృష్టి

9. బ్రహ్మ సన అని పలుకుట వలన బ్రహ్మ యొక్క దివ్యదృష్టి నుండి 1. సనక, 2.సనందన, 3. సనత్కుమార 4. సనత్సుజాతుడు అనే నలుగురు **సనకసనందనాదులు** అను పేరిట జన్మించిరి. వీరు కల్పాంతమున నశించిన ఆత్మ తత్త్వమును శిష్యులకు చెప్పినారు.

10. **నారదుడు** బ్రహ్మ తొడల నుంచి జన్మించెను. బ్రహ్మ తత్త్వము, జ్ఞానమును శిష్యులకు బోధించెను.

**ప్రజాపతుల సృష్టిలో జన్మించిన వారు - మిథున ధర్మ సృష్టి**

11. **నరనారాయణులు.** ధర్మువు, దక్షుని కూతురు అయిన మూర్తికి నరనారాయణులు జన్మించినారు. వీరు బదరికా వనమున తపస్సు చేసిరి. వీరు కామ క్రోధములను జయించిరి. వీరల తపో భంగమునకై ఇంద్రుడు అప్సరసలను పంపగా నారాయణుడు తన తొడల నుంచి ఊర్వశీ ప్రముఖ స్త్రీలను సృష్టించెను.

12. **యజ్ఞుడు.** స్వాయంభువుని కూతురు ఆకూతికి ఆమె భర్త అయిన రుచికి జన్మించెను. స్వాయంభువ మనువు వేళ ఇంద్రుడై స్వాయంభువ మన్వంతరము రక్షించెను.

13. **కపిలుడు.** బ్రహ్మ యొక్క ఛాయ నుండి జన్మించిన కర్దమ ప్రజాపతికి స్వాయంభువుని కూతురగు దేవహూతికి జన్మించెను. ఇతడు ఆసురియను బ్రాహ్మణునకు సాంఖ్యయోగము చెప్పెను. కపిలుడు అతని తల్లికి తత్త్వ బోధ చేసి భక్తి యోగమును చెప్పెను.

14. **దత్తాత్రేయుడు.** బ్రహ్మ కన్నుల నుంచి జన్మించిన అత్రి మహామునికి కర్దమ ప్రజాపతి కూతురు అయిన అనసూయకు జన్మించెను. ఇతడు అలర్కునికి ప్రహ్లాద ముఖ్యులకు ఆత్మ విద్య చెప్పెను. హైహయ యదు వంశజులకు హైహిక ఆముష్మిక ఫల రూపమగు యోగ విద్య చెప్పెను.

15. **వామనావతారము:** (ఆఱవ మనువు కాలము): కశ్యప ప్రజాపతి అదితిలకు జన్మించెను. బలిని పదత్రయము యాచించి త్రివిక్రమావతారమున మూడు లోకములను ఆక్రమించెను.

మిథున ధర్మ సృష్టి

**స్వాయంభువుని వంశము**

**స్వాయంభువుని ఇద్దరు కొడుకులలో ఒక కొడుకు అయిన ఉత్తానపాదుని వంశము**

16. **ధ్రువుడు.** ఉత్తానపాదునికి సునీతికి జన్మించెను. ఇతడు తపస్సు చేసి ధ్రువస్థానమును పొందెను.

17. **పృథు చక్రవర్తి.** వేనుని మృత శరీరము నుంచి జన్మించెను. భూమిని ధేనువుగా చేసి సమస్త వస్తువులను పితికెను.

## స్వాయంభువుని మఱియొక కొడుకు ప్రియవ్రతుని వంశము

18. **ఋషభుడు.** నాభి మేరుదేవిలకు జన్మించెను. ఇతడు పరమహంస మార్గమును ఉపదేశించెను.

## సప్తమ మనువు కాలమున

19. **పరశురాముడు** . విశ్వామిత్రుని యొక్క అక్క సత్యవతి. ఈమె భర్త ఋచీకుడు వీరలకు జమదగ్ని జనియించెను. ఇతడు రేణుకను పెండ్లి ఆడెను. జమదగ్ని, రేణుకల సంతానము పరశురాముడు. పరశురాముడు దత్తాత్రేయుల వారి వలన యోగ విద్య బడసెను. హైహయ యదు వంశ రాజులు లోక విరోధులై చరింప వారలను సంహరించెను. కార్త వీర్యార్జునిని చంపెను. దుర్మార్గులయిన రాజులను 21 మార్లు వధియించెను. భూమండలమును బ్రాహ్మణులకు దానము చేసెను.

20. **శ్రీరాముడు. (సూర్యవంశము)** దశరథుడు కౌసల్యలకు జన్మించెను. సముద్రమునకు సేతువు కట్టెను. రావణ సంహారము చేసెను.

## ప్రజాపతి అయిన వసిష్ఠుని వంశము

21. **వ్యాస భగవానుడు** . వసిష్ఠుని యొక్క కుమారుడు శక్తి. శక్తి యొక్క కుమారుడు పరాశరుడు. ఈ పరాశరునకు, ఉపరిచర వసువు వీర్యంబున జన్మించిన సత్యవతుల యొక్క కుమారుడు వ్యాస భగవానుడు. ఇతడు వేద వృక్షమునకు శాఖలు ఏర్పరచెను. వేదములను విభాగించి అనగా ఇతని యొక్క ఐదుగురు శిష్యులలో నలుగురికి నాలుగు వేదములను ఇచ్చి ఐదవ వానికి పురాణేతిహాసములను ఇచ్చెను. భారత భాగవతములను రచియించెను.

## యదువంశము

22. **బలరాముడు.** వసుదేవుడు రోహిణిలకు జన్మించెను.

23. **శ్రీ కృష్ణుడు.** వసుదేవుడు దేవకిలకు జన్మించెను. శ్రీకృష్ణ బలరాములు, భూ భారము తగ్గించిరి.



## కలియుగము

24. **బుద్ధుడు.** రాక్షస సమ్మోహనంబు కొఱకు పాషండ ధర్మమును బోధించెను. **బుద్ధుని తరువాత కల్కి వఱకు భగవానుడు అవతరించడు.**

## భవిష్యత్తులో

25. **కల్కి** . విప్రయశుండను విప్రునకు కలియుగాంతమున జన్మించగలడు. దొంగలుగా, క్రూరులుగా, ఉన్న పాలకులను సంహరించును.

బలవంతము, ఐశ్వర్యవంతము, ఉత్సాహవంతము, తేజోవంతము అయినవి అవతారములుగా భావించవలయును.

మన్మథుడు, దేవతలలో ఇంద్రుడు, ద్వాదశాదిత్యులలో విష్ణువు, ఏకాదశ రుద్రులలో శంకరుడు, అష్టవసువులలో పావకుడు, వాయువులలో మరీచి, సేనాపతులలో కుమారస్వామి, ధర్మమూర్తులలో యమధర్మరాజు, హరించువారిలో మృత్యువు, జలదేవతలలో వరుణుడు, యక్షులలో కుబేరుడు, గంధర్వులలో చిత్రరథుడు, పురోహితులలో బృహస్పతి, జ్ఞానవంతులలో శుక్రాచార్యుడు, నాగులలో ఆదిశేషువు, పాములలో వాసుకి, పితృదేవతలలో అర్యముడు, మహర్షులలో భృగువు, స్త్రీలలో దక్షుని కమార్తెలు, ధర్ముని భార్యలు అయిన హ్రీ, శ్రీ, కీర్తి, పాండవులలో అర్జునుడు, మానవులలో రాజు, ఆవులలో కామధేనువు, గుఱ్ఱములలో ఉచ్చైశ్రవము, ఏనుగులలో ఐరావతము, మృగములలో సింహము, పక్షులలో గరుత్మంతుడు, జలచరములలో మొసలి, వెలగునిచ్చువాటిలో సూర్యుడు, నక్షత్రములలో చంద్రుడు, పర్వతములలో హిమాలయ పర్వతము, శిఖరములలో మేరువు, సరస్సులలో సముద్రము, వృక్షములలో రావి చెట్టు, ఆయుధములలో వజ్రాయుధము, వృత్తులలో వ్యవసాయము, విద్యలలో అధ్యాత్మ విద్య, జయాపజయములలో జయము, అధర్మములలో జూదము, వేదములలో సామవేదము, సామములలో బృహత్సామము, ఛందస్సులలో గాయత్రీ, యజ్ఞములలో జపయజ్ఞము తపస్సులలో తపస్సు, యోగసాధనలో మౌనము, బుద్ధిమంతులలో బుద్ధి, తేజోవంతులలో తేజము, బలవంతులలో బలము, మానవులలో పౌరుషము, జీవులలో ధర్మపరమైన కామము, జ్ఞానేంద్రియములలో

మనస్సు, గుణములలో సత్త్వ గుణము, జ్ఞానవంతులలో జ్ఞానము, రాజులలో రాజనీతి మఱియు దండము, రహస్యములలో అతి రహస్యము, కాలములో ఋతువులు, మాసములలో మార్గశీర్షము అని చెప్పబడినది.

మ॥ సరసిం బాసిన వేయు కాలువల యోజన్ విష్ణునం దైన శ్రీ
కర నానా ప్రకటావతారము లసంఖ్యాతంబు లుర్వీశులున్
సురలున్ బ్రాహ్మణ సంయమీంద్రులు మహర్షుల్ విష్ణునంశాంశజుల్
హరి కృష్ణుండు బలానుజన్ముఁ డెడ లే; దా విష్ణుఁడా నేర్పడన్

(భాగవతము, ప్రథమ స్కంధము, 64)

వేదములలో యజ్ఞవరాహావతారము తప్ప ఈ అవతార పురుషుల గుఱించిన సూక్తములు గానీ అవతార వర్ణనగానీ ఉండవు.

జననము లేక కర్మముల జాడలఁ బోక సమస్త చిత్త వ
ర్తనుఁడగు చక్రికిం గవు లుదార పదంబులు జన్మకర్మముల్
వినుతులు సేయుచుండుదురు వేద రహస్యములందు నెందుఁజూ
చిన మఱి లేవు జీవునికిఁజెప్పిన కైవడి జన్మకర్మముల్ .

(భాగవతము -ప్రథమస్కంధము -68)

సాధకునకు కావలసిన యోగ రహస్యములను సాధన విధానమును శాస్త్ర పాఠములైన సాంఖ్యాది యోగములను అవతారముల పేరిట వివరించినారు. ఈ అవతారములను చదివి వారు చెప్పిన శాస్త్ర పాఠములను గ్రహించి వారి వలె సాధన చేసి తిరిగి బ్రహ్మమై విరాజిల్లవలయునన్నది ఈ అవతారముల ప్రశంసలోని పరమార్థము.

అతిరహస్యమైన హరిజన్మ కథనంబు,
మనుజుఁడెవ్వఁడేని మాపు రేపుఁ
జాల భక్తి తోడఁ జదివిన సంసార,
దుఃఖరాశిఁ బాసి తొలఁగిపోవు.

( భాగవతము - ప్రథమ స్కంధము 66)

*****



# సృష్టివిచారణ

సృష్టిని ఐదు విభాగములుగా విభజించి చెప్పుదురు. ఇందు ఏ ఒక్క సృష్టిగుఱించి అయినా పూర్తిగా తెలుసుకున్న చాలును. ఉపనిషత్తులలో ప్రారంభ సృష్టినే వివరించినారు. రామాయణములో జటాయువు ద్వారా రామునికి ప్రజాపతి సృష్టి వివరింపబడినది. భాగవతములో ఈ ఐదు విధముల సృష్టిగుఱించి వివరించబడినది.

అయోనిజ సృష్టి.......................... 1. విరాట్ పురుషుని నుంచి వచ్చిన సృష్టి (ప్రారంభ సృష్టి)
2. బ్రహ్మ సృష్టి **(అనంతర సృష్టి)**
3. అండ సృష్టి (అవ్యక్తము)
మిథున ధర్మ సృష్టి.................... 4. ప్రజాపతుల సృష్టి
5. స్త్రీ పురుషుల వలన కలిగిన సృష్టి.

ఈ సృష్టి విచారణలో చెప్పిన వాటిని రామాయణ, భారతములలో పాత్రలుగా చిత్రీకరించినారు.

## ప్రారంభసృష్టి - అయోనిజ సృష్టి

విరాట్ పురుషుడు ప్రారంభ సృష్టిని చేసెను. విరాట్ పురుషుని దేహమునుంచి జనియించినవి. సర్వము రథనాభియందు రథచక్రపు ఆకులు అమరినట్లు ఈ సర్వము విరాట్పురుషుని దేహమున అమరియున్నవి. విరాట్ పురుషుని దేహము కానిది పరమాణువు కూడ లేదు. ప్రకృతినుంచి బ్రహ్మాండమును సృజియించెను. అది పదునాలుగు లోకములుగా, స్థావర జంగమములు ఉపాధులుగా రూపుదిద్దుకొన్నవి. ఆ ఉపాధులలో ఆత్మ, ఆత్మగా జీవాత్మగా ప్రవేశించినది. విరాట్ పురుషుడు పదునాలుగు లోకములను సృజియించెను. వీటిని ద్యౌ, అంతరిక్షము, పృథివీ, జలములు అను నాలుగు విభాగములుగా వర్గీకరించినారు. ఈ పదునాలుగు లోకములలో భూమి తప్ప మిగిలిన లోకములు బాహ్యా దృష్టికి గోచరము కావు. బ్రహ్మాండములోని ఈ పదునాలుగు లోకములను విరాట్ పురుషుని శరీరముగా చెప్పుదురు.

| విరాట్ పురుషుని శరీరము | లోకములు |
| --- | --- |
| శీర్షము | సత్యలోకము (దీనినే బ్రహ్మ లోకమని, స్వర్గలోకమని అందురు. ఈ లోకమున దేవతలు క్రీడింతురు.) |
| లలాటము | తపోలోకము |
| ముఖము | జన లోకము |
| మెడ | మహర్లోకము |
| వక్షస్థలము | నక్షత్ర లోకము |
| నాభి | ఆకాశము |

ఇంతవఱకు చెప్పిన లోకములు కాంతివంతమయిన లోకములు.

| | |
| --- | --- |
| కటి ప్రదేశము | భూమి. ఈ భూమిపై మరణము కలదు. ఆకాశము, భూమి, ఇవి బాహ్య దృష్టికి కనిపించును. |

వితలము నుంచి పాతాళము వఱకు కల లోకములన్నియు, జలమునకు దిగువున కలవు. ఈ లోకములు బాహ్య దృష్టికి గోచరము కావు.

| | |
| --- | --- |
| తొడలు | వితలము, అతలము |
| మోకాళ్ళు | సుతలము |
| పిక్కలు | తలాతలము |
| సీలమండ | మహీతలము |
| మునివ్రేళ్ళు | రసాతలము |
| అరికాళ్ళు | పాతాళము |

ఈ పదునాలుగు లోకములను పాలించుటకు లోకపాలురను సృజియించెను. విరాట్ నుంచి వచ్చిన దేవతలు మానవ దేహములో ప్రవేశించినారు. విరాట్ పురుషుని నుంచి, అయోనిజ సృష్టిగా సర్వ దేవతలు, దానవులు, యక్షులు, గంధర్వులు, రాక్షసులు,



మానవులు, పశుపక్ష్యాదులు, సూర్యుడు, చంద్రుడు, నక్షత్రములు, గ్రహములు, పర్వతములు, కొండలు, సముద్రములు, నదులు, కర్మలు, భావములు, మొదలయినవి అనగా సర్వ స్థావర జంగమములు వచ్చినవి. ఈ సర్వ విశ్వము అతని రూపమే. అందువలన అతనిని విశ్వం అనీ, విష్ణువు అనగా సర్వత్రా వ్యాపించిన విశ్వరూపుడు అని చెప్పుదురు.

| విరాట్ పురుషుని అవయవములు | ఆ అవయవములనుంచి వచ్చిన దేవతలు |
| --- | --- |
| చెవులు | దిశలు |
| చర్మము | వాయువు |
| కన్ను | సూర్యుడు |
| నాలుక | ప్రచేతసులు |
| ముక్కు | అశ్వనీ దేవతలు |
| నోరు | అగ్ని |
| బాహువులు | ఇంద్రుడు |
| పాదములు | ఉపేంద్రుడు |
| మేఢ్రము | ప్రజాపతి |
| వృషణములు | మిత్రావరుణులు |
| కోరలు | యముడు |
| మనస్సు | చంద్రుడు |
| బుద్ధి | మనువు |
| చిత్తము | మహత్ |
| అహంకారము | రుద్రుడు |
| హృదయము | ప్రధానము- ప్రకృతి |

విరాట్పురుషుని ఏ ఏ అవయవముల నుంచి దేవతలు వచ్చిరో వారు మానవ శరీరములో ఆ ఆ అవయవములలో ప్రవేశించిరి.

| | |
| --- | --- |
| వీర్యము | దేవతలు |
| స్మృతి | ప్రహ్లాదుడు |

గంధర్వాదులు:-

| (గానమునకు సంబంధించిన స్వర విశేషములు ) | గంధర్వ, విద్యాధర చారణ అప్సరసలు |
|---|---|
| సర్వ మానవులు :- | |
| ముఖము | బ్రాహ్మణులు |
| భుజములు | క్షత్రియులు |
| తొడలు | వైశ్యులు |
| పాదములు | శూద్రులు |
| పశువులు - పక్షులు :- | |
| గోళ్ళు | ఏనుగులు, గుఱ్ఱములు వగైరాలు |
| కటి ప్రదేశము | సర్వ పక్షులు |
| పంచతన్మాత్రలు -పంచభూతములు | |
| శ్రవణేంద్రియము | శబ్దము - ఆకాశము |
| త్వగింద్రియము | స్పర్శ - వాయువు |
| చక్షురింద్రియము | రూపము - అగ్ని |
| జిహ్వేంద్రియము | రసము - జలము |
| జ్ఞానేంద్రియము | గంధము - భూమి |
| స్థావరములు:- | |
| జఠరము | సముద్రములు |
| నాడులు | నదులు |
| ఎముకలు | పర్వతములు, కొండలు |
| రోమములు | చెట్లు |
| శిరోజములు | మేఘములు |
| ఱెప్పలు | రాత్రులు, పగలు |
| కట్టుబట్టలు | ఉభయ సంధ్యలు |
| ప్రాయము | కాలము |



భావములు - కర్మలు:-

| కర్మలు | సర్వ జంతువులు, చేయుపనులు, సర్వ యజ్ఞములు, హవిర్భాగములు, ద్రవ్యములు. |
|---|---|
| శబ్దములు | సర్వ మృగముల, సర్వ పక్షుల అఱుపులు, కూతలు. నామములు సర్వ దేవతానామములు, సర్వ జంతునామములు |
| స్థనములు | ధర్మము |
| వెన్ను | అధర్మము |
| నవ్వు | మాయ |
| దంతములు | పుత్రాది స్నేహ కళలు |
| కడగంటిచూపు | అనంత సృష్టి |
| పెదవులు | సిగ్గు, లోభము |

సర్వ భావములు, సర్వ కర్మలు విరాట్పురుషుని వలననే గలిగినవి. అనగా ఈ స్థావర జంగమాత్మక జగమంతయు విరాట్పురుషుడే. సర్వమూ అతడే. దీనిని దర్శించుటయే విశ్వరూప సందర్శనముగా చెప్పుదురు. ఈ సర్వ విశ్వము పరమాత్మగా భావించ వలయును.

*****

## బ్రహ్మ యొక్క జననము - సాధన

పూర్వము ప్రళయ సమయములో విశ్వము లయమై జలమయముగా ఉన్నది. ఆదిశేషువుపై నారాయణుడు యోగ నిద్రలో యుగ సహస్రములు పవళించి ఉన్నాడు. ఆ నారాయణుని గర్భములో సకల లోకములు, సమస్త సృష్టి నిబిడీకృతమై ఉన్నవి. అతడు సృష్టి కార్యము నిర్వర్తించుటకు సంకల్పించెను. అతడు సూక్ష్మార్థమయిన ప్రకృతిని సృజియించెను. ప్రకృతిలో రజోగుణము వ్యక్తమైనది. అలా వచ్చిన రజోగుణము వలన నారాయణుని నాభి ప్రదేశమున నళిన నాళము (తామరతూడు) జన్మించినది. ఆ తరువాత తామర మొగ్గ వచ్చినది. కాలము కర్మ వలనను, నారాయణ తేజము వలన ఆ తామర మొగ్గ వికసించి పద్మము అయినది. ఆ పద్మములో నారాయణుడు తన అంశమును నిలిపెను. ఆ పద్మము సర్వ లోకములకు ఆశ్రయము. సర్వ గుణ విభాసితము. ఆ పద్మము నుండి **"చతుర్ముఖ బ్రహ్మ"** జన్మించెను.

బ్రహ్మయొక్క సాధన :-

ఆ బ్రహ్మ ఆ పద్మము యొక్క కర్ణిక యందు నిలచి నలుదిశలు పరికించి ఈ నీటిలో ఈ పద్మము ఏవిధముగా పుట్టినది ? నేను ఎలా ఉద్భవమైనాను? ఈ పద్మములో ఎలా ఉన్నాను? నాపేరు ఏమిటి? నా జననమునకు హేతువు ఏమిటి? అని తనలో తానే వితర్కించుకొనెను. సమాధానము దొరకలేదు. ఆ సమయములో జల మధ్యంబున నుండి **"తప"** అనుశబ్దము వినబడినది. ఆ శబ్దము బ్రహ్మను తపము చేయమని చెప్పినదిగా తలచి తపస్సు చేయ సంకల్పించెను. బ్రహ్మ పరమేశ్వరుని గుఱించి యజ్ఞము చేయవలయుననే భావన కలిగినది. అప్పటికి బాహ్య యజ్ఞమునకు కావలసినవి యేవియు లేవు. అనగా యజ్ఞ పరికరములు, యజ్ఞ సామాగ్రి, వేద మంత్రములు, ఋత్విజులు, అగ్ని , భూమి మొదలయినవి ఏమియు పుట్టలేదు. అనగా ఏమియునూ లేవు.

**సీ. పశుయజ్ఞ వాటయూపస్తంభ పాత్ర మృ, ద్ఘట శరావ వసంత కాలములును**
**స్నేహౌషధీబహులోహచాతుర్హోత్ర, మత నామ ధేయసన్మంత్రములును**
**సంకల్పఋగ్యజుస్సామ నియుక్త వ, షట్కారమంత్రానుచరణములును**
**దక్షిణల్ దేవతాధ్యాన తదనుగత, తంత్రవ్రతోద్దేశ ధరణిసురులు**



**తే. సర్పణంబులు బోధాయనాదికర్మ,**
**సరణి మొదలగు యజ్ఞోపకరణ సమితి**
**యంతయును న మ్మహాత్ముని యవయవములు,**
**గాఁగఁ గల్పించి విధివత్ప్రకారమునను.**

( భాగవతము -ద్వితీయ స్కంధము -94)

అప్పుడు బ్రహ్మ మానసిక యజ్ఞము చేసెను.

బ్రహ్మ చేసిన మానసిక యజ్ఞమునే తపస్సు అని అష్టాంగ యోగమని చెప్పుదురు. బ్రహ్మ పద్మములో ఆసీనుడయ్యెను. యమ నియమములు రెండింటిని ఆచరించెను. ప్రాణాయామ పరాయణుడై ఉండెను. జ్ఞానేంద్రియ కర్మేంద్రియములను జయించి, ఏకాగ్ర చిత్తుడై తపము వేయి దివ్య సంవత్సరములు గావించెను. యోగ జనిత విజ్ఞానము కలిగినది. హృదయ కమల కర్ణికయందు గల పురుషునిని దర్శించెను. బ్రహ్మకు బ్రహ్మత్వము కలిగినది. బ్రహ్మకు సృష్టి చేయవలయుననే సంకల్పము కలిగినది. చాలా కాలము తపస్సు చేసెను. అప్పుడు తత్కాల వాయువుచే కంపితంబగు నిజనివాసంబైన పద్మంబును, వాయువును, జలమును కనుగొనెను. తన తపో శక్తి చేత అభివృద్ధి పొందిన విద్యా బలంబున వాయువును బంధించి జలమునంతా త్రాగి ఆకాశములో దాగి ఉన్న జలమును చూచి పరమాత్మను మనస్సులో ధ్యానించి ఆకాశములో ఒక పద్మమును చూచెను. ఆ పద్మములో దాగి ఉన్న లోకములను చూచెను. మెల్లగా ఆ పద్మములోనికి వెళ్లెను. అందులో ఉన్న మూడు లోకములను 14 లోకములుగా సృష్టించెను. సర్వమును సృజియించెను.

ఈ కథలో అనేక జలములు, అనేక పద్మములు కనబడును. ఇది యోగ పాఠము.

*****

సృష్టి 9 విధములు. ఇందు 6 ప్రాకృత సర్గము క్రింద మిగిలిన 3 వైకృత సర్గము క్రింద విభాగింపబడును.

### ప్రాకృత సర్గములు

1వ సర్గము :- **మహత్తు**. ఇది గుణ భేదమును పొందును.

2వ సర్గము :- **అహంకారము**. ఇది ద్రవ్య, క్రియా, జ్ఞానాత్మకము.

3వ సర్గము :- **తామసాహంకారము**. ఇది శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములనే పంచతన్మాత్రలు, ఆకాశము, వాయువు, అగ్ని, జలము, భూమి అనే పంచ భూతములు కలిగి ద్రవ్య శక్తి యుతము.

4వ సర్గము :- **రాజసాహంకారము**. ఇది సూక్ష్మ శరీరములోని చెవులు,చర్మము, కన్నులు, నాలుక, ముక్కు అనే జ్ఞానేంద్రియములు, నోరు, చేతులు, కాళ్ళు,గుహ్యము, గుదము అనే కర్మేంద్రియములు ప్రాణము, బుద్ధి కలిగి ఉండును.

5వ సర్గము :- **సాత్త్వికాహంకారము**. ఇది మనస్సు కలిగి మనోమయము, దేవమయము. జ్ఞానాత్మకము.

6వ సర్గము :- తామస సర్గము(అవిద్య). ఇది జీవలోకమునకు అజ్ఞానమును కలిగించును.

ఈ ఆఱు సర్గములు ఈశ్వరునకు లీలార్థములు. 1వ సర్గము నుంచి 6వ సర్గము వఱకు చెప్పబడినవి అండసృష్టి క్రిందకు వచ్చును. ఇవి బాహ్య దృష్టికి గోచరము కావు.

### వైకృత సర్గము

7వ సర్గము, 8వ సర్గము 9వ సర్గములు బాహ్యదృష్టికి కనపడును.

7వ సర్గము :- ఇది 6 విధములు.

1. పుష్పోత్పత్తి రహితంబులై ఫలించెడి అనగా పూలు పూయకనే కాయలు కాచే రావిచెట్టు, మేడి చెట్టు, పనస చెట్టు, మఱ్ఱి చెట్టు మొదలయినవి.
2. పుష్పితంబులై ఫల సాకాంతములయిన అనగా పంట పండగానే కోసివేయు ధాన్యము, యవలు , పెసలు మొదలయిన సర్వ పంటలు, ఓషధులు.
3. ఆరోహణా నపేక్షంబులయిన అనగా పైకి ఎగబాకే మాలతీ, మల్లె, మొదలయిన లతలు.
4. మొదలు గట్టిగా ఉండే వెదుళ్ళు.
5. మొదలు గట్టిగాఉండి, నేలపై బాగా విస్తరించే లతా విశేషాలు. అనగా పొదలు, దుబ్బులు, వగైరాలు.
6. పుష్పించి పండ్లనిచ్చే మామిడి మొదలయిన ఫల వృక్షాలు, పైకి ఎత్తుగా పెరిగే వృక్షములు. ఈ ఆఱు రకములు పూర్తిగా తమోగుణములు కలిగిఉన్నవి. ఇవి స్థావరములు. ఇవి అవ్యక్త చైతన్యములు కలవి. అనగా వీటికి ప్రాణమున్నది. అయితే వాటి సుఖదుఃఖములను సామాన్యులకు అర్థమగునట్లు ఇతరులకు వ్యక్తము చేయలేవు.

ఏడవ సర్గము లతలు, తీగలు, చెట్లు మొదలయిన వాటిని గుఱించి చెప్పినందున వృక్ష శాస్త్రము అనగా (Botany) చదివిన వారికి విపులముగా అర్థమగును.

భాగవతములో చెప్పిన ఈ విషయమును అనగా చెట్లకు కూడ ప్రాణమున్నది. వాటికి కూడా సుఖదుఃఖములు ఉన్నవి అనే విషయమును మన భారతీయుడైన జగదీశచంద్రబసు అనే విజ్ఞాన శాస్త్ర వేత్త ప్రయోగాత్మకంగా నిరూపించినాడు.

8వ సర్గము : (తిర్యక్ సర్గము) అనగా పశువులు, మృగములు, పక్షులు, వగైరాలు.

భూచరములు 27 రకములు.

1. చీలినగిట్టలు గల జంతువులు:- ఎద్దు-దున్నపోతు-మేక-పంది-ఒంటె-పొట్టేలు-గురుపోతు-నల్లచారల దుప్పి- జింక అని తొమ్మిది రకములు.
2. చీలని గిట్టలు గల జంతువులు:- గాడిద-కంచరగాడిద-గుఱ్ఱము-గౌరమృగము-శరభమృగము-చమరమృగము అని ఆఱు రకములు.
3. ఐదు గోళ్ళుకలవి:- కుక్క-నక్క-పిల్లి-తోడేలు-పులి- కుందేలు- ఏదుపంది-సింహము- కోతి- ఏనుగు - తాబేలు -ఉడుము అని పన్నెండు రకములు ఆవిధముగా 27 రకముల గుఱించి చెప్పబడినది.

   జల చరములు :-మొసలి వగైరాలు.

పక్షులు:- (గగనచరములు) రాబందు- గ్రద్ద -డేగ- గుడ్లగూబ - కొంగ - హంస - నెమలి-బెగ్గురుపక్షి- చక్రవాకం-తెల్లపిట్ట-కాకి-గబ్బిలము మొదలయినవి. ఇవి అన్నీ రేపటి దినము గుఱించి ఆలోచన లేనివి. అనగా జ్ఞానము లేనివి.

ఆహార నిద్రా, మైథునముల గుఱించి ఆలోచించేవి. మఱియు జన్మ రాహిత్యము గుఱించి ఆలోచన లేనివి. మనస్సులో పెద్దగా ఆలోచన లేనివి. అనగా భావము వ్యక్తీకరించలేనివి.వాసన వలన వస్తుజ్ఞానమును పసిగట్టగలవు. గ్రద్ద, డేగలు దూరముగా ఉన్న వస్తువును కూడా చూడగలవు. Zoology, Veternary చదివిన వారికి వీటి విషయమై బాగుగా అర్థమగును.

9వ సర్గము :- ఇది మానుష సర్గము. అనగా మానవుల గుఱించి చెప్పబడిన సర్గము. మానవులు కర్మలు చేయుటలో నేర్పు గలవారు. దుఃఖమునందును సుఖమును కోరుదురు. రజోగుణ ప్రేరితులు. (ఏడవ సర్గములో లతలు, తీగలు, చెట్లు మొదలయినవి చెప్పబడినవి. 8వ సర్గములో భూచరములు, జల చరములు, గగనచరములు చెప్పబడినవి. ఇందు కోతి చెప్పబడినది. 9వ సర్గములో మానవులు చెప్పబడినారు. Evolution theory 7వ, 8వ, 9వ సర్గములలో చెప్పబడినది. కోతి తరువాత మానవుడు వచ్చెనని చెప్పిన డార్విన్ సిద్ధాంతమునకు ఈ 7వ,8వ,9వ సర్గములు భావ సారూప్యమును కలిగి ఉన్నవి. వేద పురాణములలో చెప్పిన ఈ విషయములను మనము లోకమునకు శాస్త్ర విజ్ఞానముగా తెలియచేయలేక పోయితిమి. డార్విన్ మహాశయుడు శాస్త్ర రీత్యా ఋజువు చేసెను)

దేవ సర్గము:-

ఇవి 8రకములు. 1ఋషులు 2 పితృదేవతలు 3 దేవతలు 4.గంధర్వులు, అప్సరసలు 5యక్షులు,రాక్షసులు 6 భూతప్రేత పిశాచములు 7సిద్ధ, చారణ, విద్యాధరులు 8 కిన్నర, కింపురుషులు

కౌమార సర్గము (సనకసనందనాదుల సర్గము) :- ఇది దేవ సర్గములో ఒక భాగము. ఇందులో ప్రాకృత, వైకృతముల రెండిటి యొక్క స్వభావములు కలసి ఉండును. దైవత్వము, మానుషత్వము కలసి ఉండును.

*****



# బ్రహ్మసృష్టి (అనంతర సృష్టి)

## అయోనిజ సృష్టి

**బ్రహ్మయొక్క మొదటి శరీరము:**

దేవర్షుల సృష్టి

**1. తనదివ్యదృష్టిన** ఊర్ధ్వ రేతస్కులు, పరమ పవిత్రులు అయిన సనక, సనందన, సనత్కుమార, సనత్సుజాతులను కల్పించెను. బ్రహ్మ వారలను చూచి మీరు మీమీ అంశంబులతో ప్రజలను పుట్టించుడని పలికెను. వారు బ్రహ్మ మాటలను నిరాకరించిరి. అంత బ్రహ్మకు క్రోధము కలిగెను. ఆ క్రోధమును బుద్ధిచే నిగ్రహించెను.

**2. బ్రహ్మయొక్క ఊరువుల నుంచి నారదుడు జన్మించెను.**

**3. ఏకాదశ రుద్రులు:-**

భ్రూమధ్యము నుంచి : క్రోధ స్వరూపంబున నీలలోహితుడు జన్మించెను. ఇతడు సర్వ దేవతలకు అగ్రజుడు. ఇతడు జన్మించినప్పుడే రోదన చేసినందువలన బ్రహ్మ ఇతనికి రుద్రుడు అని పేరు పెట్టెను. ఆ రుద్రునకు పదకొండు నామములు. పదకొండు మంది భార్యలు. వసియించుటకు పదకొండు స్థానములు.

రుద్రుని యొక్క నామములు :- రుద్రుడు, మన్యువు, మనువు, మహాకాలుడు, మహా శివుడు, ఋతధ్వజుడు, ఉరునేత్రుడు, భవుడు, కాలుడు, వామదేవుడు, ధృతవ్రతుడు.

భార్యల పేర్లు:-ధీ, వృత్తి, ఉశన, ఉమ, నియుత్, సర్పి, ఇతి, అంబిక, ఇలావతి, సుధ, దీక్ష.

స్థానములు :- చంద్ర, సూర్య, ఆకాశము, వాయువు, అగ్ని, జలము, భూమి, హృదయము, ప్రాణము, ఇంద్రియములు, తపస్సు,

రుద్రుడు ప్రజలను సృజియించెను. వీరిని రుద్రగణములు అని అందురు. వీరు విశ్వమును నశింపచేయు చుండిరి. అంత బ్రహ్మ రుద్రునితో ఇంతవఱకు చేసిన సృష్టి చాలు. ఇకపై మీరు అరణ్యమునకు వెళ్లి తపస్సు చేసుకొనుడు అని పలికెను. అంత వారు బ్రహ్మ ఆజ్ఞపై తపస్సు చేసి ఈశ్వరుని దర్శించిరి.

### భారతము ప్రకారము

భారతములో ఏకాదశ రుద్రులుగా మృగవ్యాధ, శర్వ, నిరృతి, అజైక, పాద, వార్వుధ్న్య, పినాకి, దహనేశ్వర, కపాలి, స్థాణువు, భవుడు అనువారిని పేర్కొనెను.

**4. ప్రజాపతులు :- అయోనిజ సృష్టి**

| **రామాయణములో** | **భారతములో** | **భాగవతములో** | |
|---|---|---|---|
| **14 ప్రజాపతులు** | | | |
| పులస్త్యుడు | పులస్త్యుడు | చెవులు నుంచి | పులస్త్యుడు |
| - | భృగువు | చర్మము నుంచి | భృగువు |
| అత్రి | అత్రి | కన్నులునుంచి | అత్రి |
| అంగిరసుడు | అంగిరసుడు | ముఖమునుంచి (నోరు) | అంగిరసుడు, సరస్వతి |
| క్రతువు | క్రతువు | హస్తమునుంచి | క్రతువు |
| దక్షుడు | దక్షుడు | అంగుష్ఠమునుంచి | దక్షుడు |
| పులహుడు | పులహుడు | నాభినుంచి | పులహుడు |
| మరీచి | మరీచి | మనస్సు నుంచి | మరీచి |
| - | - | ప్రాణమునుంచి | వసిష్ఠుడు |
| కర్దముడు | - | ఛాయనుంచి | కర్దముడు |
| స్థాణువు | - | - | - |
| సుశ్రయుడు | - | - | - |
| శేషుడు | - | - | - |
| విక్రీతుడు | - | - | - |
| ప్రచేతసులు | - | - | - |
| వివస్వంతుడు | - | - | - |



| | | |
|---|---|---|
| గుహ్యము | సముద్రములు | |
| కుడి వైపు స్తనము | ధర్మము, ధర్మువు | |
| వెన్ను | అధర్మము , మృత్యువు | |
| | భ్రూయుగళము | క్రోధము |
| | అధరము | లోభము |
| | నీడ | కర్దముడు, దేవహూతి |
| | అపానము | నిరుతి, దానవులు |

బ్రహ్మ భారతితో సంయోగము చేయబూనగా మునీశ్వరులు ఈ సంయోగము నింద్యము అని చెప్పగా బ్రహ్మ ఆ శరీరమును విసర్జించెను. దిక్కులు వచ్చి , ఆ శరీరమును ఆక్రమించుకొన్నవి. ఆ దిక్కులలో నుంచి చీకటి, మంచు జన్మించినవి.

**బ్రహ్మ యొక్క రెండవ శరీరము :-**

ఆ రెండవ తనువున నాలుగు ముఖముల నుంచి నాలుగు వేదములు ఆవిర్భవించినవి. కర్మలు, యజ్ఞములు, తంత్రములు, సదాచారములు, జాతి ధర్మములు, ఆశ్రమ ధర్మములు వచ్చినవి. ఇతిహాస పురాణములు నాలుగు ముఖముల నుంచి ఆవిర్భవించినవి.

*****

| బ్రహ్మయొక్క | | | |
|---|---|---|---|
| తూర్పు ముఖము | దక్షిణ ముఖము | పడమర ముఖము | ఉత్తర ముఖము |
| ఋగ్వేదము | యజుర్వేదము | సామ వేదము | అథర్వ వేదము |
| హోత | అధ్వరుడు | ఉద్గాత | బ్రహ్మ |
| హోతకు సంబంధించిన గానము చేయవలసిన మంత్ర స్తోత్రంబులగు శస్త్రములు | అధ్వరునకు సంబంధించిన ఇజ్య, మంత్ర స్తోత్రములు | ఉద్గాతకు సంబంధించిన మంత్ర స్తోత్రములు | బ్రహ్మకు సంబంధించిన మంత్ర స్తోత్రములు |
| ఆయుర్వేదము | ధనుర్వేదము | గాంధర్వ వేదము | విశ్వకర్మకు సంబంధించిన స్థాపత్యమనే శిల్ప వేదము |
| షోడశి, ఉక్థ్యము | చయనం, అగ్నిష్టోమం | ఆప్తోర్యామము, అతిరాత్రం | వాజపేయం, గోసనం |
| విద్య | ధనం | దానం | తపస్సు |
| బ్రహ్మచర్యము | గార్హస్థ్యం | వానప్రస్థము | సన్యాసం |
| సావిత్రి, ప్రాజాపత్యం బ్రాహ్మ్యం, నైష్ఠికములు కలిగినవి. | వార్తా, ధన సంచయం, శాలీనము, శిలోంఛము | వైఖానస, వాలఖిల్య, ఔదుంబర, ఫేనపులస | కుటీచక, బహూదక, హంస, నిష్క్రియం |

నాలుగు ముఖముల నుంచి ఇతిహాస పురాణములు వచ్చినవి.

సావిత్రి -........... బ్రహ్మ చర్యము పాటించుట.

ప్రాజాపత్యం ..... ఉపనయనం మొదలుకొని మూడు దినములు గాయత్రీజపించుట.

బ్రాహ్మ్యము ...... సంవత్సరము పొడుగునా నాలుగు వేదాలు నేర్చుకొనుట

నైష్ఠికము ............ వేదాధ్యయనము పూర్తి అగు వఱకు బహ్మచారిగా ఉండుట.

వార్తా ................. వ్యవసాయము ద్వారా సంపాదన తద్వారా జీవనము సాగించుట. అనగా కుటుంబమును పోషించుట.

ధన సంచయము:-యజ్ఞ యాగాదులు చేసి ధనము సంపాదించి, తద్వారా కుటుంబ



పోషణ

శాలీనము .......... అయాచితముగా లభించిన ధనము తద్వారా కుటుంబ పోషణ

శిలోంఛము ....... పొలములలో పడిన పరిగ ఏఱుకొని జీవించుట

వైఖానసులు ....... దున్నకుండా పండిన సస్యములు ఆహారముగా తీసుకొనుట

వాలఖిల్యులు ..... క్రొత్త పదార్థములు లభించగనే పాత వాటిని వదలి వేయుదురు.

ఔదుంబరులు .. ఏదో ఒక దిక్కుకు బయలుదేరి ఆ దిక్కున లభించువాటితో జీవనము గడుపుదురు.

ఫేన పులుసులు .. చెట్ల నుండి పండి రాలిన పండ్లను తింటూ జీవనము గడుపుదురు.

కుటీచకుడు ....... సన్న్యాస ఆశ్రమ ధర్మములను పాటించును.

బహూదకుడు .... కర్మ త్యాగము చేసి జ్ఞాన ప్రధానుడు

హంస .............. జ్ఞానాభ్యాస నిష్ఠుడు

నిష్క్రియుడు ..... పరబ్రహ్మ తత్త్వమును పొందిన వాడు

అనగా బ్రహ్మవలన వేదములు, యజ్ఞ యాగాదులు ,ఋత్విజులు, బ్రహ్మచర్యాది ఆశ్రమములు, ఆశ్రమ ధర్మములు, ఇహలోక పరలోక కర్మలు వచ్చినవి.

**విద్యలు :-** ఇహలోకమునకు సంబంధించిన విద్యలు అనగా దండనీతి, రాజ్య పరిపాలన మఱియు పరలోకమునకు సంబంధించిన విద్యలు అనగా స్వర్గాది ఫలప్రదంబై కర్మవిద్యారూపంబగు **త్రయీ,** మోక్ష ఫల ప్రదంబై వివేక విద్యారూపంబగు అన్వీక్షికి అను విద్యలు వచ్చినవి.

భూః, భువః, సువః,- అను ఈ మూడు వ్యాహృతులు వచ్చినవి.

బ్రహ్మ యొక్క హృదయము నుండి శబ్ద బ్రహ్మమైన ఓంకారము వచ్చినది.

బ్రహ్మ వలన **సప్త ఛందస్సులు** కలిగినవి.

బ్రహ్మ యొక్క రోమము వలన - ఉష్ణిక ఛందస్సు,
చర్మము వలన - గాయత్రీ,
మాంసము వలన - త్రిష్టుపు,
నరముల వలన - అనుష్టుప్,

| | | |
|---|---|---|
| ఎముకలు వలన | - | జగతీ, |
| క్రొవ్వు వలన | - | పంక్తి |
| ప్రాణము వలన | - | బృహతీ |

బ్రహ్మ ఈ దేహమును పరిత్యజించెను.

**మూడవ శరీరము :**

బ్రహ్మ యొక్క శరీరము స్వాయంభువమనువుగా, శతరూపగా రెండు భాగములు అయినది. స్వాయంభువమనువు శతరూపలు దంపతులయిరి. వీరిరువురి వలన అనేక మంది ప్రజలు కలిగిరి.

**నాలుగవ శరీరము :**

బ్రహ్మ వలన యక్షులు, రాక్షసులు పుట్టిరి. వారు బ్రహ్మను భక్షించుదాము అని అన్నారు. కొందఱు రక్షించుదాము అని అన్నారు. అప్పుడు బ్రహ్మ మాజక్షత అనగా భక్షించవద్దు, రక్షత రక్షించండి అని అనెను. వారలే యక్షులు, రాక్షసులుగా పిలువబడిరి. బ్రహ్మయొక్క ఛాయ వలన తామిస్రము, అంధ తామిస్రము, చిత్తభ్రమ, మోహము, మహా మోహములు అనే అవిద్యాపంచకము కలిగెను. ఈ దేహము రాత్రి మయము. మఱియు ఆకలి దప్పికలకు స్థానము. బ్రహ్మ దేహమును విసర్జించెను.

**బ్రహ్మ యొక్క ఐదవ శరీరము:**

ఈ దేహమున సత్వగుణ గరిష్ఠులగు దేవతలను సృజియించెను. ఈ దేహము తేజోమయము. మఱియు పగటిమయము. ఈ దేహము దేవతలకు ఆశ్రయమైనది.

**బ్రహ్మ యొక్క ఆఱవ శరీరము**

ఈ దేహము నుంచి సంధ్యా అనే స్త్రీ మూర్తిని సృజియించినాడు. బ్రహ్మ తనకటి ప్రదేశము నుండి అసురులను సృజియించినాడు. ఈ అసురులు చంచలచిత్తులు, అతికాముకులు. ఈ అసురులు సంధ్యా అనే స్త్రీని భార్యగా గ్రహించినారు. ఈ అసురులు బ్రహ్మతో రతిక్రియ కోరగా బ్రహ్మ పరమాత్మ సూచనపై ఆ దేహమును విసర్జించినాడు.

**బ్రహ్మ యొక్క ఏడవ శరీరము**



బ్రహ్మ తన హస్తమును ఆఘ్రాణించినాడు. అంత గంధర్వులు, అప్సరసలు పుట్టినారు. ఈ దేహమును విశ్వావసువు మొదలయిన గంధర్వులు అప్సర స్త్రీలు గైకొనిరి. ఈ దేహము చంద్రికా రూపము.

బ్రహ్మ ఆ దేహమును విసర్జించినాడు.

**బ్రహ్మ యొక్క ఎనిమిదవ శరీరము**

బ్రహ్మ ఈ శరీరము నుంచి పిశాచములను, గుహ్యకులను, భూతములను, సిద్ధులను పుట్టించెను. వీరు దిగంబరులు, ముక్తకేసులు. ఈ పిశాచాదులు ఈ శరీరమును తీసుకొనిరి. బ్రహ్మ యొక్క ఈ శరీరము కునికిపాటు, నిద్ర, ఆవులింత, ఉన్మాదములకు నిలయము.

బ్రహ్మ ఆ దేహమును విసర్జించినాడు.

**బ్రహ్మ యొక్క తొమ్మిదవ శరీరము**

బ్రహ్మ తనను అన్నవంతునిగా భావించి అదృశ్య శరీరుడై పితృదేవతలను, సాధ్యులను పుట్టించెను. వీరు బ్రహ్మ యొక్క ఆ దేహమును స్వీకరించిరి. బ్రహ్మ ఆ దేహమును విసర్జించినాడు.

**బ్రహ్మ యొక్క పదవ శరీరము**

బ్రహ్మ తన తిరోధాన శక్తి వలన సిద్ధులను విద్యాధరులను సృజియించెను. వారికి ఆ శరీరమును ఇచ్చెను. బ్రహ్మ ఆ దేహమును విసర్జించినాడు.

**బ్రహ్మ యొక్క పదకొండవ శరీరము**

బ్రహ్మ తన శరీరము నుండి కిన్నరులను, కింపురుషులను పుట్టించెను. వీరు బ్రహ్మ దేవునికి సంబంధించిన గీతములను గానము చేసిరి. వీరు ఈ దేహమును స్వీకరించిరి. బ్రహ్మ ఆ దేహమును విసర్జించినాడు.

**బ్రహ్మయొక్క పన్నెండవ శరీరము**

బ్రహ్మకు సృష్టి అభివృద్ధి కాలేదని కోపము వచ్చి చేతులు కాళ్ళు విదలించగా, అప్పుడు రోమములు రాలినవి. ఆ రోమములు పాములు అయినవి. ఇవి ఆ దేహమును

స్వీకరించినవి. బ్రహ్మ ఆ దేహమును విసర్జించెను.

**బ్రహ్మయొక్క పదమూడవ శరీరము**

బ్రహ్మ మానవ రూపము ధరియించి, మనువులను (మానవులను) సృజియించినాడు. వారికి ఆ దేహమును ఇచ్చినాడు. బ్రహ్మ తన సృష్టి కార్యక్రమము పూర్తి అయినట్లు భావించినాడు. బ్రహ్మ ఆ దేహమును విసర్జించెను.

**బ్రహ్మయొక్క పదునాలుగవ శరీరము**

బ్రహ్మ ఋషి వేషధరుడై ఋషిగణములను పుట్టించెను. వారికి సమాధి, యోగము, ఐశ్వర్యము, తపస్సు, విద్య, వైరాగ్యములు కలిగిన తన శరీరమును బ్రహ్మ ఋషి గణములకు ఇచ్చెను.

**సారాంశము :-**

బ్రహ్మకు చైతన్యవంత శరీరము, జడశరీరము అని రెండు శరీరములు కలవు. చైతన్యవంత శరీరము నుంచి :

ఋషులు :- సనకసనందనాదులు, నారదుడు, ఋషిగణములు

ప్రజాపతులు :- అత్రి, అంగిరసుడు భృగువు మొదలయిన ప్రజాపతులు, స్వాయంభువ, శతరూపలు,

దేవతలు :- దేవతలు, ఏకాదశరుద్రులు(అష్టవసువులు, ద్వాదశ ఆదిత్యులు). పితృదేవతలు, గంధర్వులు, విద్యాధరులు, సిద్దులు, కిన్నరులు, కింపురుషులు, అప్సరసలు.

రాక్షసులు :- యక్షరాక్షసులు, అసురులు, పిశాచములు, భూతములు, గుహ్యకులు, నిర్రృతి

పాములు :- నాగులు, పాములు వచ్చినవి.

మానవులు :- అనగా సర్వ జీవ రాశులను సృజియించినట్లు భావించవలయును.

జడ శరీరమునుంచి:- ధర్మా ధర్మములు, అవిద్య , క్రోధము, లోభము మొదలయిన గుణములు, వేదములు, యజ్ఞములు, ఇహలోక పరలోక క్రియలు, వ్యాహృతులు, ఓంకారము, ఛందస్సులు, దిక్కులు, పగలు, రాత్రి, సంధ్య అనగా కాలము, మంచు,



సముద్రము వచ్చినవి. అనగా సర్వ స్థావరములను సృజియించెనని అర్థము. ఈ విధముగా బ్రహ్మ సర్వ స్థావర జంగమములను సృజియించెనని అర్థము చేసుకొనవలయును. బ్రహ్మ తన యొక్క శరీరమును ఇచ్చెను మఱియు శరీరమును విసర్జించెను అని చెప్పిన దానిని దేవతలు, రాక్షసులు, మానవులు మొదలయిన జంగమముల యొక్క ఉపాధులు, స్థావరముల యొక్క ఉపాధులు వేటికవి ప్రత్యేకము ఒకదానికంటే ఇంకొకటి భిన్నముఅని అర్థము చేసుకొనవలయును.

మిథున ధర్మ సృష్టిలో

అహం - నేను దేహమును అను దేహాభిమాన బుద్ధిగల .......................... మోహమును,

అంగనాసంగమము, చందనాదులు పూసుకొనుట,

ఇహలోక భోగములను అనుభవించాలనే కోరిక గల.......................మహా మోహమును,

కోరికలు నెఱవేఱక పోవునప్పుడు కలుగు కోపము గల........................ తామిస్రమము,

శరీరము నశించగనే తను చనిపోతున్నాననే, భావన గల చిత్తభ్రమ అంధ తామిస్రమము, అనే అవిద్యాపంచక మిశ్రమంబుగా సర్వ భూతావళిని పుట్టించెను.

*****

సృష్టిలో భిన్నత్వము - ఏకత్వము

| ప్రకృతి | | పురుషుడు | |
|---|---|---|---|
| ఉపాధులు ఏర్పడినవి | గుణములు వచ్చినవి | జీవ పురుషుడు | హృదయ గుహలో గల ఆత్మ |
| **ఉపాధులలో భిన్నత్వమున్నది.** ఆవు శరీరమునకు, ఏనుగు శరీరమునకు, కుక్క శరీరమునకు, బ్రాహ్మణ శరీరమునకు, భేదమున్నది. అనగా ఒక్కొక్క జీవి శరీరము ఒక్కొక్క విధముగా ఉన్నది. | **గుణములలో భిన్నత్వమున్నది.** సత్వగుణము, రజోగుణము, తమోగుణము. వీటి వలన గలుగు కర్మలలో భేదమున్నది. | **జీవులలో భిన్నత్వమున్నది.** జీవుడు ఉపాధిని గుణములను ఆశ్రయించి భిన్న భిన్న కర్మలు చేయుచున్నాడు. రాముడు మంచివాడు. రావణుడు దుర్మార్గుడు. దుర్యోధనుడు దుర్మార్గుడు. | సర్వ భూతములందు గల ఆత్మలో భిన్నత్వములేదు. **ఏకత్వమే ఉన్నది.** |

| **భిన్నత్వమున్నది** | **ఏకత్వమున్నది** |
|---|---|



## ప్రజాపతులు చేసిన సృష్టి

ఈ సృష్టి విషయములో సంస్కృత భాగవతమునకు గల పాఠాంతరముల వలనకూడా భేదము కనిపించుచున్నది. ప్రజాపతి సృష్టివిషయములో రామాయణ, భారత, భాగవతములలో బాహ్యముగా భేదము కనిపించినను ఆధ్యాత్మిక భావనతో చూచిన భేదము కనిపించదు.



(సు) యజ్ఞుడు+ దక్షిణ (వీరు ఆది మిథునము కావున నిషిద్ధము కాదు.) వీరికి 12మంది కొడుకులు, 1. తోషుడు 2. ప్రతోషుడు 3 సంతోషుడు 4 భద్రుడు 5 శాంతి 6 ఇడస్పతి 7 ఇద్మ్ముడు 8 కవి 9 విభుడు 10 వహ్ని 11 సుదేవుడు 12 రోచనుడు. ఈ 12మంది తుషితులన దేవగణము అయిరి.

స్వాయంభువుడు+ శతరూప

- కొడుకులు
  - ప్రియవ్రతుడు
  - ఉత్తాన పాదుడు
- కూతుళ్ళు
  - ఆకూతి
  - దేవహూతి
  - ప్రసూతి

బ్రహ్మ యొక్క నీడనుంచి వచ్చిన కర్దముడు + దేవహూతి

- కొడుకు
  **కపిలుడు**
  (అవతార పురుషుడు)
- తొమ్మిది మంది కూతుళ్ళు
  1. కళ, 2. అనసూయ 3. శ్రద్ధ
  4. హవిర్భువు 5. గతి 6. క్రియ
  7. ఖ్యాతి 8. అరుంధతి 9. శాంతి

కర్దముడు దేవహూతుల తొమ్మిది మంది పుత్రికల, సంతానము గురించి
**భాగవతమున**

1. బ్రహ్మ మనసు నుంచి వచ్చిన మరీచి +కళ

- కశ్యపుడు(మారీచుడు)
- పూర్ణిమ, ఈమె జన్మాంతరమున గంగగా పుట్టినది.
  - విరజుడు
  - దేవకుల్య

2. బ్రహ్మకన్నుల నుంచి వచ్చిన అత్రి + అనసూయ

ముగ్గురు కొడుకులు

- బ్రహ్మ అంశమున చంద్రుడు
  - చంద్రుడు+తార
    - బుధుడు
    - బుధుడు+ఇల
      - చంద్రవంశము
- విష్ణువు అంశమున **దత్తాత్రేయుడు** (అవతార పురుషుడు) ఇతడు హైహయ,యదు వంశజులకు యోగ విద్య నేర్పెను
- శివుని యొక్క అంశమున **దుర్వాసుడు**



**భారతములో** మానస పుత్రుడయిన అంగిరసునకు ప్రచధ్యుడు, బృహస్పతి, సంవర్తుడు అను ముగ్గురు కుమారులు, యోగసిద్ధి అను ఒక కుమార్తె గలరని చెప్పబడినది.

3. బ్రహ్మ ముఖము నుంచి వచ్చిన అంగిరసుడు+శ్రద్ధ

- 100మంది కొడుకులు
  అందులో
  1. ఉచధ్యుండు
  2.బృహస్పతి(దేవగురువు)
- 4గురు కూతుళ్ళు
  1. సినీవాలి 2.కుహూ 3.రాకా
  4. సుమతి వీరిని ధాత పెండ్లియాడెను.

4. బ్రహ్మచెవుల నుండి వచ్చిన పులస్త్యుడు+హవిర్భువు

- అగస్త్యుడు
  ఇతడు జన్మాంతరంబున జఠరాగ్ని రూపమున ప్రవర్తించె.
  అగస్త్యుడు వాతాపి-ఇల్వలులను సంహరించెను.
  వింధ్యపర్వతమును పెరగకుండా చేసెను.
  ఇతడు లోపాముద్రను పెండ్లియాడెను.
- విశ్రవసుడు
  - విశ్రవసు+ఇలబిల
    - కుబేరుడు
  - విశ్రవసు +కైకసి
    - రావణ
    - కుంభకర్ణ
    - విభీషణుడు

**భారతములో** పులస్త్యునికి అనేక మంది రాక్షసులు జన్మించినట్లు కలదు.

5. బ్రహ్మ నాభి నుంచి వచ్చిన పులహుడు + గతి

కొడుకులు

కర్మశ్రేష్ఠుండు    వరీయాంసుండు    సహిష్ణుండు

**భారతములో** పులహుని వలన కిన్నర కింపురుషాదులు జన్మించిరని చెప్పబడినది.

6. బ్రహ్మ చర్మము నుంచి వచ్చిన భృగువు+ఖ్యాతి

కొడుకులు    కూతురు

ధాత    విధాత    శ్రీ (లక్ష్మీ)

దాత + మేరువు కూతురు యయాతి

మృకండ మహాముని

**మార్కండేయుడు**

విధాత +మేరువు కూతురు నియతి

ప్రాణుడు

వేదశిరుడు



**భారతములో** భృగువు, ఉశనలకు కవి(శుక్రాచార్యులు), శుక్రాచార్యునకు దేవయాని, భృగువు మఱియొక భార్యఅయిన పులోమకు చ్యవనుడు; చ్యవనుడు, సుకన్యలకు రురుడు అను కుమారుడు కలిగిరి.

7. బ్రహ్మ హస్తము నుంచి వచ్చిన క్రతువు+క్రియ

కొడుకులుగా 60 వేల మంది వాలఖిల్యులు జన్మించిరి. వీరందఱు బ్రహ్మ తేజస్కులు.

భారతములో క్రతువువలన పక్షులు వచ్చినట్లు చెప్పబడినది.

8. బ్రహ్మ యొక్క ప్రాణము నుంచి వచ్చిన వసిష్ఠుడు+అరుంధతి (ఊర్జ)

కొడుకులు.7గురు

1. చిత్రకేతువు 2. సురోచుడు 3. విరజుడు
4.మిత్రుడు 5. ఉల్బణుడు 6.వసుభృద్ద్యానుడు 7.ద్యుమంతుడు

**భారతములో** వసిష్ఠుడు మఱియొక భార్యకు శక్తి, శక్తికి **పరాశరుడు;** పరాశరుడు, ఉపరిచర మనువు వీర్యము వలన జనియించిన సత్యవతికి **వ్యాసభగవానుడు,** వ్యాసభగవానునకు **శుక** బ్రహ్మ కలిగిరి.

9. అధర్వుడు +శాంతి(జిత్త)

కొడుకులు

ధృతవ్రతుడు

అశ్వశిరస్కుడైన దధ్యంచుడు

స్వాయంభువుడు+శతరూప

కొడుకులు

ప్రియవ్రతుడు

ఉత్తాన పాదుడు

కూతుళ్ళు

ఆకూతి

దేవహూతి

ప్రసూతి

బ్రహ్మయొక్క అంగుష్ఠము నుంచి వచ్చిన దక్షప్రజాపతి +ప్రసూతి

—

16 మంది కుమార్తెలు

1. శ్రద్ధ 2. మైత్రి, 3. దయ 4. శాంతి
5. తుష్టి 6. పుష్టి 7.క్రియ 8. ఉన్నతి
9 బుద్ధి 10. మేధ 11. తితీక్ష 12 హ్రీ
13. మూర్తి 14. స్వాహా 15 స్వధ
16 సతి (దాక్షాయణి )

దక్షప్రజాపతి యొక్క పదహారు మంది పుత్రికలు వారి సంతానము.

బ్రహ్మయొక్క కుడి స్తనము నుంచి జన్మించిన ధర్మువు ఈ క్రింది పద ముగ్గురిని పెండ్లిఆడెను :

1. ధర్మువు+శ్రద్ధ → శ్రుతము
2. ధర్మువు+మైత్రి → ప్రసాదము
3. ధర్మువు+దయ → అభయము
4. ధర్మువు+ శాంతి → సుఖము
5. ధర్మువు+తుష్టి → ముదము
6. ధర్మువు+పుష్టి → అస్మయము
7. ధర్మువు+క్రియ → యోగము
8. ధర్మువు+ఉన్నతి → దర్పము
9. ధర్మువు+బుద్ధి → అర్థము
10. ధర్మువు+మేధ → స్మృతి
11. ధర్మువు+తితీక్ష → క్షేమము
12. ధర్మువు+హ్రీ → ప్రశ్రేయము
13. ధర్మువు+మూర్తి → కొడుకులు: నారాయణుడు, నరుడు

**వీరు అవతారపురుషులు**



వీరు నరనారాయణులన ప్రసిద్ధులయిరి. వీరు బదరికా వనమున తపస్సు చేసిరి. నారాయణుని తొడల నుంచి ఊర్వశి మొదలయిన అప్సరసలు జన్మించిరి. ఈ నరనారాయణులు ద్వాపర యుగమున శ్రీకృష్ణుడు, అర్జునుడుగా జన్మించిరి.

14. అగ్ని+స్వాహా → కొడుకులు: పావనుడు, పవనుడు, శుచి

ఈ ముగ్గురిని త్రేతాగ్నులు అందురు. ఈ ముగ్గురి వలన 45అగ్నులు ఉత్పన్నమైనవి. అగ్ని-1. త్రేతాగ్నులు -3. త్రేతాగ్నుల వలన వచ్చిన అగ్నులు 45. అనగా మొత్తము 49 అగ్నులు ఉత్పన్నములయినవి. ఈ 49 అగ్నులు :- 1. అగ్నిష్వాతులు, 2. సౌమ్యులు 3. ఆజ్యపులు 4. నిరగ్నులు 5. బర్హిషదులు 6. పితలు 7. సాగ్నులు. అని 7తెఅంగులై ఉందురు.

15. పితృ దేవతలు+ స్వధ → కూతుళ్ళు: వాయుని, ధారిణి

వీరు పెండ్లి చేసుకొనక బ్రహ్మ నిష్ఠులయిరి.

**16. శివుడు+సతి :-**

వీరలకు సంతానము లేదు. ఈ సతి దక్ష యజ్ఞములో దేహ త్యాగము చేసినది. ఈ సతి మఱు జన్మలో హిమవంతునికి పార్వతిగా జన్మించినది. సతీదేవి యొక్క తండ్రి అయిన దక్ష ప్రజాపతి దక్షయజ్ఞములో శివుని యొక్క అనుచరులచే చంపబడి మఱుజన్మలో ప్రచేతసులకు జన్మించెను.

దీనితో దక్షుని 16 మంది కుమార్తెల గుఱించి చెప్పడమయినది.

ప్రచేతసులకు పుట్టిన దక్షుడు+పంచజన ప్రజాపతి కూతురు అసిక్ని

కొడుకులు — కూతుళ్ళు

60 మంది కూతుళ్ళు ✡

హర్యశ్వులు — శబలాశ్వులు

వీరిరువురు బ్రహ్మచర్యం పాటించి తపస్సు చేసి మోక్షమును పొందిరి.

✡ వీరిలో ధర్మునకు 10 మంది, అంగిరసునకు ఇద్దఱు, కృశాశ్వునకు ఇద్దఱు, భూతునకు ఇద్దఱు, చంద్రునికి 27 మంది, కశ్యపునికి 17 మందిని ఇచ్చి వివాహము చేసెను. ఈవిధముగా దక్షుని 60 మంది కుమార్తెల గుఱించి చెప్పడమయినది. **ధర్మువు అతని భార్యలు**

1 ధర్మువు+భానువు
- వేద ఋషభుడు
- ఇంద్రసేనుడు

2 ధర్మువు+లంబ
- విద్యోతుడు
- స్తనయిత్నువు

3 ధర్మువు+కకుప్పు
- సంకుటుడు
- కీకటుడు
- దుర్గాభిమాన దేవతలు

4. ధర్మువు+జామి
- స్వర్గుడు
- **నంది (నందీశ్వరుడు)**

వీరు దుర్గ భూములకు అధిష్ఠాన దేవతలు.

5. ధర్మువు+విశ్వ
- **విశ్వేదేవ గణములు**

వీరు అపుత్రకులు

6. ధర్మువు+సాధ్య
- **సాధ్యగణములు**
- అర్థ సిద్ధి



7. ధర్మువు+మరుత్వతి
- మరుత్వంతుడు
- జయంతుడు (ఉపేంద్రుడు)

8. ధర్మువు+ముహూర్త
- మౌహూర్తికులు అనుదేవగణము

వీరు సకల భూతములకు ఆయా కాలముల కలుగు ఫలాఫలంబులు ఇత్తురు.

9. ధర్మువు+సంకల్ప
- సంకల్పుడు
- కాముడు

10. ధర్మువు+వసువు
- **అష్ట వసువులు**

**అంగిరసుడు అతని ఇద్దరు భార్యలు**

అంగిరసుడు +స్వధ
- **పితృదేవతలు**

అంగిరసుడు+సతి
- అథర్వవేద అభిమాన దేవతలు

కృశాశ్యుడు అతని ఇద్దరు భార్యలు

కృశాశ్యుడు+అర్చి
- ధూమ్రకేశుడు

కృశాశ్యుడు+ధిషణ
- దేవలుడు
- వయునుడు
- మనువు
- వేదశిరుడు

భూతుడు అతని ఇద్దరు భార్యలు

భూతుడు+సరూప (శంకరాంశజుడు)
- కోట్ల సంఖ్యలైన రుద్రగణంబులు ఉదయించిరి. రుద్ర పారిషధులు ప్రేతలు వినాయకులు

భూతుడు + ఇంకొక భార్య
- రైవతుడు, అజుడు, భవుడు, భీముడు, వాయుడు, ఉగ్రుడు, వృషాకపి, అజైకపాదుడు, అహిర్బుధ్న్యుడు, బహురూపుడు, మహత్తు, అను ఏకాదశ రుద్రులు

**చంద్రుడు అతని భార్యలు**

ఈ 60 మంది కుమార్తెలలో అశ్వినీ, మొదలైన నక్షత్రములగు 27 మందిని చంద్రునకు ఇచ్చి వివాహము చేసెను. వీరికి సంతానము లేదు.

## భాగవతములో కశ్యప ప్రజాపతి అతని భార్యలు

(బ్రహ్మయొక్క మనస్సు నుంచి వచ్చిన) మరీచి+కళ(కర్దమునికూతురు)
- కశ్యపుడు

కశ్యపుడు +1. వినత
- అనూరుడు
- గరుత్మంతుడు
  - సంపాతి
  - జటాయువు

కశ్యపుడు+2. కద్రువ
- భుజంగములు

కశ్యపుడు+3.పతంగి
- పక్షులు

కశ్యపుడు+4.యామిని
- శలభంబులు

కశ్యపుడు+5.తామ్ర
- డేగ
- గ్రద్ద

కశ్యపుడు+6.తిమిమి
- జలచరములు

కశ్యపుడు+7.క్రోధవశ
- సర్పములు

కశ్యపుడు+8.సురభి
- గోవులు(ఎడ్లు, గేదెలు మొదలయిన రెండు గిట్టలు గల జంతువులు.)

కశ్యపుడు+9.సరమ
- శునకములు

కశ్యపుడు+10.ఇల
- వృక్షములు

కశ్యపుడు+11.ముని
- అప్సరసలు

కశ్యపుడు+12.సురస
- యాతుధానులు

కశ్యపుడు+13.కాష్ఠ
- కాలి గిట్ట ఒకటి గల అశ్వములు వగైరా

కశ్యపుడు+14అరిష్ట
- గంధర్వులు



కశ్యపుడు+15.దనువు
- 18మంది రాక్షసులు

1. ద్విమూర్ధుడు 2. శంబరుడు 3. అరిష్టుడు 4. హయగ్రీవుడు 5. విభావసు
6. అయోముఖుడు 7. శంకుశిరుడు 8. **స్వర్భానువు**
   - సుప్రభ అనే కూతురు. దీనిని నముచి పెండ్లియాడెను.
9. కపిలుడు 10. అరుణుడు 11. పులోముడు
12. **వృషపర్వుడు**
   - శర్మిష్ఠ ఈమెను యయాతి పెండ్లి యాడెను.
13. ఏకచక్రుడు 14. అనుతాపనుడు 15. ధూమ్ర కేశుడు 16. విరూపాక్షుడు
17. దుర్జయుడు 18. విప్రచిత్తి+సింహిక (హిరణ్యకశిపుని కూతురు)
   - 100 మంది. అందులో **రాహువు, కేతువు.** వీరు గ్రహములయిరి.

**కశ్యపుడు+16.దితి** : వీరలకు
1. హిరణ్యకశిపుడు
2. హిరణ్యాక్షుడు
3. సప్త మరుత్తులు
   సప్త మరుత్తులు ఇంద్రునితో కూడి దేవత్వంబు పొందిరి. వీరు అనపత్యులు.

హిరణ్యకశిపుడు+జంభాసురుని కుమార్తె కయాదు

ప్రహ్లాదుడు అనుహ్లాదుడు సంహ్లాదుడు హ్లాదుడు సింహిక అను కూతురు

ఈమెను విప్రచిత్తి పెండ్లియాడెను.

ప్రహ్లాదుడు+దేవి

విరోచనుడు

బలి+అశన

బాణుడు - పరమేశ్వరుని ఆరాధించి ప్రథమ గణంబులకు ముఖ్యుడయ్యె

ఉష - ఈమెను అనిరుద్ధుడు పెండ్లియాడెను.

అనుహ్లాదుడు +సూర్మ్య

బాష్కలుడు మహిషుడు

సంహ్లాదుడు+గతి

పంచజనుడు

హ్లాదుడు+దమని

**వాతాపి** **ఇల్వలుడు**

2. హిరణ్యాక్షుడు+జంభాసురుని కూతురు దత్త

శకుని శంబర కాలనాభ మదోత్కట

కశ్యపుడు+17.అదితి

**ద్వాదశ ఆదిత్యులు**

ద్వాదశ ఆదిత్యులు - వారి సంతానము

1. వివస్వంతుడు+సంజ్ఞ

యముడు. యమి మిథునంబుగా ఉదయించిరి.

శ్రాద్ధ దేవుడు (వైవశ్వత మనువు) ఇప్పటి 7వ మనువు

సంజ్ఞ బడబా స్వరూపము పొందగా

అశ్వినీ దేవతలు

వివస్వతుడు+ఛాయ

శని

తపతి అను కూతురు ఈమెను సంవరణుడు వరియించినాడు

సావర్ణి అను మనువు

2. అర్యముడు+మాతృక

చర్షణులు

మనుష్యజాతి

3. పూషుడు. ఇతడు భర్గుని చూచి నవ్విన అతడు క్రోధించి పూషుని దంతములను ఊడబెరికెను. ఇతనికి సంతానము లేదు.

4. త్వష్ట+దైత్య అనుజయైన రచన

**విశ్వరూపుడు :** ఇతడు కొంతకాలము దేవతలకు గురువు.

విశ్వ రూపునిని ఇంద్రుడు వధియించినాడు. అంత త్వష్ట చేయు యజ్ఞంబున దక్షిణాగ్ని యందు దానవయోని యందు వృత్రాసురుడు పుట్టెను. ఇంద్రుడు వృత్రాసురుని సంహరించెను.

5. సవితుడు+పృశ్ని: వీరికి ముగ్గురు కుమార్తెలు, అగ్నిహోత్రాదులు అనే 5గురు కొడుకులు కలిగిరి.

6. భగుడు+సిద్ధి

ముగ్గురు కొడుకులు — ఆశిష అనే కూతురు

7. ధాత+కుహు — సాయంకాలం
ధాత+సినీవాలి — దర్శ
ధాత+రాకా — ఉదయము
ధాత+అనుమతి — పూర్ణిమ

8. విధాత+క్రియ: వీరికి పురీషాఖ్యులు అను పంచ అగ్నులు జనియించిరి.

9. మిత్రుడు+రేవతి

ఉత్సర్గుడు — అరిష్ఠుడు — పిప్పలుడు

మిత్రావరుణులు ఊర్వశిని చూడగా వారి రేతస్సు పతనమయినది. దానిని కుండలో నుంచగా అందుండి అగస్త్యుడు, వసిష్ఠుడు జనియించిరి.

10. వరుణుడు+చర్షిణి

**భృగువు** — **వాల్మీకి**

11. ఇంద్రుడు(శక్రుడు)+పౌలోమి

జయంతుడు — ఋషభుడు — విధుషుడు

12. ఉరుక్రముడు+కీర్తి

బృహచ్ఛ్లోకుడు

సౌభాగాదులు

వామనుడైన ఉరుక్రముడు మూడు లోకములను మూడు పాదముల ద్వారా ఆక్రమించెను.



ఉపదానవి-హయశిరస్సు-పులోమ-కాలక ఈ 4గురు వైశ్వానరుని పుత్రికలు. అందులో ఉపదానవి హిరణ్యాక్షునికి భార్య అయినది. హయ శిరస్సు క్రతువునకు భార్య అయినది. మిగిలిన ఇద్దఱిని బ్రహ్మ ఆనతిని కశ్యపుడు పెండ్లియాడెను.

కశ్యపుడు+ పులోమ — **పౌలోముడు** (దానవుడు)

కశ్యపుడు+కాలక — **కాలకేయుడు** (దానవుడు)

వీరికి 60వేల మంది నివాత కవచకేయులను రాక్షసులు జనియించిరి. వీరలను అర్జునుడు సంహరించినాడు.

## భాగవతములో అష్టవసువులు వారి సంతానము

1. ద్రోణుడు+అభిమతి — హర్ష శోక భయాదులు

2. ప్రాణుడు+ఊర్జస్వతి — సహుడు, ఆయువు, పురోజవుడు

3. ధ్రువుడు+ధరణి — పట్టణములు

4. అర్కుడు+వాసన — తర్షాదులు

5. అగ్ని+వసోర్ధార — ద్రవిణకాదులు — కృత్తికలు — స్కంధుడు — విశాఖాదులు

6. దోషుడు+శర్వరి — **శింశుమారుడు**

7. వస్తువు +అంగిరస

విశ్వకర్మ

విశ్వకర్మ+ఆకృతి

చాక్షుడు (చాక్షుస మనువు)

విశ్వులు    సాధ్యులు

8. విభావసు+ఉష

వ్యుష్టి    రోచి    అతపుడు

పంచయాముడు
(దివసాభిమానదేవత)

**భారతములో అష్టవసువుల గుఱించి మఱియొక విధముగా ఉన్నది

**భారతములో అష్ట వసువులు వారి సంతానము**

దేవుడు అనే ప్రజాపతి

ప్రజాపతి. వీనికి 7గురు భార్యలు.
ఈ 7గురు వలన అష్ట వసువులు జన్మించినారు.

ప్రజాపతి+ధూమ్ర

**(1) ధరుండు**

ద్రవిముడు    హతహవి    అవహుడు

ప్రజాపతి+బ్రహ్మవిద్య

**(2) ధ్రువుడు**

కాలుడు



ప్రజాపతి+మనస్విని

**(3) సోముడు**+మనోహర

వర్చసుడు    శిబిరుండు    ప్రాణుండు    రమముడు    పృథ అనే కూతురు

10 మంది
గంధర్వులు

ప్రజాపతి+రత

**(4) అహుండు**

జ్యోతి

ప్రజాపతి+శ్వస

**(5) అనిలుండు**+శివ

మనోజవుండు    అవిజ్ఞానగతి

ప్రజాపతి+శాండలి

**(6) అగ్ని**

కుమారుడు

ప్రజాపతి+ప్రభాత

**(7) ప్రత్యూష**

దేవలుడు(ఋషి)

**(8) ప్రభాసుడు** + అంగిరసుని కుమార్తె యోగ సిద్ధి.
వీరలకు విశ్వ కర్మ జనియించెను

## భారతములో చెప్పిన ప్రకారము

బ్రహ్మ యొక్క మానస పుత్రులు:-

మరీచి, అంగిరసుడు, అత్రి, పులస్త్యుడు, పులహుడు, క్రతువు.
బ్రహ్మ యొక్క హృదయము నుంచి భృగు మహర్షి పుట్టెను.
బ్రహ్మ యొక్క దక్షిణ స్తనము నుంచి మనువు పుట్టెను. ధాత విధాతలు మనువు సహాయకులుగా పుట్టిరి.
బ్రహ్మ కుడిచేతి బొటన వ్రేలు నుంచి దక్షుడు, ఎడమ చేతి బొటన వ్రేలు నుంచి ధరణి పుట్టిరి.
బ్రహ్మకు లక్ష్మి అనే కుమార్తె పుట్టెను. ఈమెకు అనేక మంది మానస పుత్రులు పుట్టిరి.
మరీచికి కశ్యపుడు పుట్టెను.
అంగిరసునకు ఉతథ్యుడు, దేవ గురువైన బృహస్పతి, సంవర్తుడు అను కుమారులు, గణపతి అయిన యోగ సిద్ధి అనే కుమార్తె కలిగిరి.
అత్రికి అనేక మంది మునులు పుట్టిరి.
పులస్త్యునకు అనేక మంది రాక్షసులు పుట్టిరి.
పులహునకు కిన్నరకింపురుషాదులు పుట్టిరి.
క్రతువునకు పక్షులు పుట్టెను.
దక్షుడు ధరణిలకు వేయి మంది పుత్రులు యేబదిమంది కుమార్తెలు కలిగిరి. వీరిలో కీర్తి, లక్ష్మి, ధృతి, మేధ, పుష్టి, శ్రద్ధ, క్రియ, బుద్ధి, లజ్జ, మతి అనే పదిమందిని ధర్మువనే మనువుకు ఇచ్చి పెండ్లి చేసెను. 27 మందిని చంద్రునకిచ్చి పెండ్లి చేసెను. కశ్యపునకు అదితి, దితి, సింహిక, దనువు, వినత, కద్రువ, క్రోధ, కపిల, ముని, కాల, క్రూర, ఆయువ, ప్రాధా, అను పదముగ్గురిని ఇచ్చి పెండ్లి చేసెను. వీరుగాక కశ్యపునకు సురభి, తామ్ర అను భార్యలు కలరు.



## భారతములో కశ్యప ప్రజాపతి సంతానము

కశ్యపుడు + అదితి: వీరలకు ధాత, మిత్ర, అర్యమ, శక్ర, వరుణ, అంశు, భగ, వివస్వత, పూష, సవిత, త్వష్ట, విష్ణువు అనే ద్వాదశాదిత్యులు జన్మించిరి. వీరిలో సవితకు, బడబ రూపధారిణి అయిన త్వాష్ట్రి కి అశ్వనీ దేవతలు జన్మించిరి.

కశ్యపుడు+దితికి
- **హిరణ్యకశిపుడు**
  - ప్రహ్లాదుడు
    - విరోచన ☆
      - బలి చక్రవర్తి
        - బాణుడు
          - ఉష
    - కుంభ
    - నికుంభ
  - అనుహ్లాదుడు
  - సంహ్లాదుడు
  - ఆహ్లాదుడు
  - శిబి
  - భాస్కలుడు

☆విరోచనుని కుమార్తె మందర. ఈమె భూమిని సంహరింప తలపెట్టగా ఇంద్రుడు ఈమెను సంహరించెను.(రామాయణము, బాల కాండ)

**కశ్యపుడు + సింహిక**
- **రాహువు**

కశ్యపుడు+దనువు: వీరలకు శంబరుడు, పులోముడు, విప్రచిత్తి, నముచి, దుర్జయుడు, లోమకేని మొదలయిన 40 మంది పుత్రులు జన్మించిరి.

కశ్యపుడు+ వినత
- **అనూరుడు**
- **గరుత్మంతుడు**

అనూరుని భార్య శ్యేని, వీరలకు **సంపాతి, జటాయువులు** జన్మించిరి.

కశ్యపుడు+కద్రువ: వీరలకు ఆదిశేషువు, వాసుకి, మొదలయిన భుజంగ ముఖ్యులు పుట్టిరి.
కశ్యపుడు+క్రోధ: వీరలకు క్రోధవశగణములు పుట్టినవి.

కశ్యపుడు + క్రోధ

- మృగ
  - మృగములు
- మృగమంద
  - ఋక్ష
  - చామర
  - సృమరము
- హరి
  - వానరములు
- భద్రమనసి
  - ఐరావతము
    - దేవనాగము
- మాతంగి
  - ఏనుగులు
- శార్దూలి
  - సింహములు, పెద్దపులి
- శ్వేత
  - దిగ్గజములు
- సురభి
  - రోహిణి
    - పశుగణములు
  - గంధర్వ
    - గుఱ్ఱములు
  - అనల
    - గిరులు, వృక్షములు, లతలు, గుల్మములు
- సురస
  - సర్పములు

**కశ్యపుడు + కపిల**

- గోవులు
- ఘృతాచి, మేనక మొదలయిన అప్సరసలు
- అమృతము
- బ్రాహ్మణులు



కశ్యపుడు+ముని:- వీరలకు భీమసేన, ఉగ్రసేన మొదలయిన 16మంది గంధర్వులు పుట్టిరి.
కశ్యపుడు+కాల:- వీరలకు వినాశన, క్రోధ మొదలయిన 8 మంది పుట్టిరి. మఱియు మృగములు, స్థావరములు పుట్టినవి.
కశ్యపుడు + క్రూర:- వీరలకు సుచంద్ర, చంద్ర హంత పుట్టిరి.
కశ్యపుడు + ఆయుక:- వీరలకు విక్షత, బల, వీర, వృత్రుడు పుట్టిరి.
కశ్యపుడు + ప్రాధ:- వీరలకు సిద్ధులు జన్మించిరి.

కశ్యపుడు + తామ్ర - వీరికి 5గురు కుమార్తెలు

- కాకి
  - ఉలూకములు
- శ్యేని
  - శ్యేనంబులు
- భాసి
  - భాసి
  - గృధ్రము మొదలయినవి
- ధృతరాష్ట్రి
  - హంసలు
  - చక్రవాకములు
- శుక
  - శుకములు

కశ్యపుడు + సురభి:- వీరలకు నందిని జన్మించెను.

వరుణుడు+జ్యేష్ఠ

- బలుడు
- సుర అనే కూతురు
  - అధర్ముడు+నిరృతి
    - భయము, మహా భయము, మృత్యువు

కశ్యప ప్రజాపతికి, అరిష్టనేమి అనే నామాంతరము కలదు.

1. అదితి:- ద్వాదశాదిత్యులు, అష్టవసువులు, ఏకాదశ రుద్రులు, అశ్వనీ దేవతలు అనే 33 మంది దేవతలు పుట్టిరి.
2. దితి:- దైత్యులను కనెను. ఈ భూమి పూర్వము దేవతలకు దానవులకు సంబంధించి ఉండెను. ఇక్కడ భూమి అనగా శరీరము అని అర్థము. ఈ శరీరము దేవ దానవ మయము.
3. కాళి :- నరకాసురునిని, కాలకునిని కనెను.
4. దనువు :- హయగ్రీవుడను రాక్షసుని కనెను.
5. తామ్ర :- ఈమె క్రౌంచి, భాసి, శ్యేన, ధృతరాష్ట్రి, శుకి అను కుమార్తెలను కనెను. క్రౌంచికి గుడ్లగూబలు, భాసికి భసపక్షులు, శ్యేనకు డేగలు గ్రద్దలు, ధృతరాష్ట్రికి హంసలు చక్రవాక పక్షులు కలిగినవి. శుకికి నత, నతకు వినత కలిగిరి. వినతకు అరుణుడు, గరుత్మంతుడు కలిగిరి. అరుణుని భార్య శ్యేని. వీరికి సంపాతి, జటాయువు కలిగిరి.
6. క్రోధవశ:- ఈమెకు మృగ, మృగమంద, హరి, భద్రమద, మాతంగ, శార్దూలి, శ్వేత, సురభి, సురస, కద్రువ అను 10 మంది కుమార్తెలు కలిగిరి. మృగకు లేళ్ళు, మృగమందకు ఎలుగుబంట్లు, సృమరములు, చమర మృగములు కలిగినవి. హరికి సింహములు, వానరములు కలిగినవి. భద్రమదకు ఇరావతి అను కుమార్తె కలిగెను. ఈమెకు **ఐరావతము** అనే ఏనుగు పుట్టెను. మాతంగికి, ఏనుగులు, శార్దూలికి కొండముచ్చులు పెద్దపులులు, శ్వేతకు దిగ్గజములు పుట్టెను. సురభికి రోహిణి గంధర్వ అను ఇద్దఱు కుమార్తెలు కలిగిరి. అందు రోహిణికి గోవులు, గంధర్వకి అశ్వములు పుట్టెను. సురస అనేక శిరస్సులు గల నాగములను కనెను. కద్రువకు ఆదిశేషువు మఱియు సర్పములు పుట్టెను.
7. మనువు:- ఈమెకు మానవులు పుట్టిరి.
8. అనిల:- ఈమెకు వృక్షములు పుట్టెను.



## అండ సృష్టి




సప్తావరణములపై ప్రకృతి వ్యాపించియున్నది.
ఆత్మ - ప్రకృతికి అంటక, ప్రకృతికి పరముగా ఉన్నది.






అండము:- అండమును సప్తావరణలు కలిగి ఉన్నట్లు ఒకసారి, దశావరణలు కలిగి ఉన్నట్లు ఒకసారి, పంచదశ ఆవరణలు కలిగి ఉన్నట్లు ఒకసారి ఈవిధముగా మూడు విధములుగా వర్ణింతురు.

సప్తావరణలుగా చెప్పునపుడు భూమి, జలము, అగ్ని, వాయువు, ఆకాశము, అహంకారము, మహత్ అని చెప్పుదురు. దశావరణలుగా చెప్పునపుడు భూమి,జలము, అగ్ని, వాయువు, ఆకాశము, త్రివిధములయిన అహంకారము, మహత్తు, ప్రకృతిగా చెప్పుదురు. పంచదశిగా చెప్పునపుడు భూమి, జలము, అగ్ని వాయువు, ఆకాశము, అను పంచ భూతములు, శబ్ద, స్పర్శ,రూప, రస, గంధములనే పంచ తన్మాత్రలు, అహంకారము, మహత్, త్రిగుణములుగా చెప్పుదురు.

ఈశ్వరుడు ప్రకృతిని అధిష్ఠించుట వలన హిరణ్మయ అండము ఏర్పడినది. ఈ అండము నుంచి సర్వజీవురాసుల యొక్క ఉపాధులు ఏర్పడును. ఆ అండము అచేతనముగా చాలా కాలము జలములలో ఉన్నది. ఈశ్వరుడు ఆ అండమునకు చేతనత్వము కలిగించినాడు. జీవపురుషునిగా అండములో ప్రవేశించి ఆ అండమును భేదించి నిర్గమించెను. ఆవిధముగా బ్రహ్మాండమునుంచి సర్వజీవరాసుల ఉపాధులు ఏర్పడినవి.

ఈశ్వరుడు**(వాసుదేవుడు)** ప్రకృతిని అధిష్ఠించినాడు. ఆ విధముగా ప్రకృతి నుంచి మహత్తు,, మహత్తు నుంచి అహంకారము వచ్చినది. వాసుదేవ వ్యూహములో అహంకారమునకు సంకర్షణుడు అధిష్ఠాన దేవత. అహంకారము త్రివిధములయినది.

**తామస అహంకారము:-** భగవత్ శక్తిచే ప్రేరేపింపబడి తామసాహంకారము వలన శబ్ద తన్మాత్ర పుట్టె. శబ్ద తన్మాత్ర వలన ఆకాశము పుట్టె. ఆకాశమునకు శబ్దము గుణము. ఆకాశము వలన శ్రోత్రేంద్రియము పుట్టె. చెవులు - శబ్దమును గ్రహించును. శబ్దము అర్థమునకు ఆశ్రయము. శ్రోతకు జ్ఞానమును కలుగచేయును. ఆకాశము భూతంబులకు బయట, లోపల ఉండి దేహములో ఆత్మకు, ప్రాణములకు, ఇంద్రియములకు ఆశ్రయము.

కాలగతి వలన ఆకాశము వికారము చెందినది. అట్టి ఆకాశము వలన స్పర్శ తన్మాత్ర కలిగినది. దాని నుంచి వాయువు కలిగినది. వాయువు నుంచి త్వగింద్రియము

(చర్మము) పుట్టెను. చర్మము స్పర్శను గ్రహించును. ఒక వస్తువు యొక్క మృదుత్వము, కఠినత్వము, వేడి, చల్లదనమును గ్రహించును. చర్మమునకు సర్వేంద్రియాత్మకత్వము కలదు. అనగా సర్వ ఇంద్రియములపై పొర వలె ఉండి వాటిని రక్షించును. వాయువునకు జాలనంబును అనగా కదలుట, కదలించుట; పరస్పర విభాగ కరణంబును అనగా కలుపుట వేఱుచేయుట లక్షణములు. మఱియు వాయువునకు ద్రవ్యనేతృత్వము, శబ్ద నేతృత్వము లక్షణములు. ద్రవ్య నేతృత్వము అనగా ఒక వస్తువు యొక్క వాసనను ముక్కుకు చేర్చుట. శబ్ద నేతృత్వము అనగా దూరముగా ఉన్న శబ్దమును చెవులకు చేర్చుట. అనగా వాయువు వలన ముక్కుకు వాసన, చెవులకు శబ్దము కలుగును.

దైవప్రేరితంబై, కాలగతిచే వికారము నొందిన వాయువు వలన రూపతన్మాత్ర కలిగినది. దాని వలన తేజము కలిగినది. దానివలన నేత్రేంద్రియము (కన్ను) పుట్టెను. కన్ను రూపమును చూచును. నేత్రమునకు ఉపలంభకత్వము అనగా అనుభవము కలుగుట, ద్రవ్యాకార సమత్వము అనగా వస్తు స్వరూపమును యధాతధముగా చూపుట, ద్రవ్యంబునకు నుపసజ్జనం, ద్రవ్యపరిణామ ప్రతీతి అనగా వస్తువు యొక్క పరిణామము చూపుట మొదలయినవి నేత్రములకు లక్షణములు. తేజస్సు (అగ్ని)కి ప్రకాశము, వెలుతురు, వేడి, పచనంబన తండులాదుల పాకము అనగా అన్నము మొదలయినవి వండుట, పిపాసా నిమిత్తంబైన పానంబు. దాహము, దాహము తీరుటకు నీరు తీసుకొనుట, క్షున్నిమిత్తంబైన యోధనంబు అనగా ఆకలి, ఆకలి తీరుటకు ఆహారము, హిమ మర్దనంబగు సోషనంబు అనగా చలిపోవడానికి వేడి ఇవి గుణములు. అనగా అగ్ని వేడిని, వెలుతురుని, మంటను, వెచ్చదనమును, ఆకలిదప్పికలను కలుగ చేయును.

దైవప్రేరితంబై కాలగతిచే వికారము నొందిన తేజస్సు వలన రసతన్మాత్ర కలిగినది. దానివలన జలము కలిగినది. దాని వలన రసనేంద్రియము(నాలుక) పుట్టెను. నాలుక రుచిని గ్రహించును. కషాయ (వగరు), తిక్త(చేదు), కట్వ(కారం), ఆమ్ల (పులుపు), మధుర (తీపి), క్షార (ఉప్పు) అనే షట్ రుచులను గ్రహించును. జలమునకు ఆర్ద్రము, తడుపుట, ముద్ద కట్టుట, తృప్తి,(దాహంతీరుట) దాతృత్వము, జీవనము, ముఱికిని పోగొట్టుట, తాపాన్ని పోగొట్టుట, నూతిలోని నీరు ఊరి, ఉబికి, పైకి



రావటము జలము యొక్క లక్షణములు.

దైవ ప్రేరితంబై కాలగతిచే వికారము నొందిన జలము వలన గంధతన్మాత్ర కలిగెను. దానివలన భూమి కలిగెను. ఈ భూమి వలన ఘ్రాణేంద్రియము (ముక్కు) పుట్టెను. ఇంద్రియము - ముక్కు వాసనను గ్రహించును. హింగ్వాది నిమిత్తంబైన మిశ్రగంధంబును అనగా ఇంగువతో కలసిన వాసనను, కరంబము అనగా పెరుగుతో గాని, లేదా జంతు మాంసముతో గాని కలసిన వాసనను గృంజనాది గతంబైన పూతిగంధము అనగా దుర్గంధము, ఘనసారాది నిమిత్తంబైన సుగంధము అనగా కర్పూరంబుతో కలసిన మంచి వాసన, శత పత్రాది గతంబగు శాంత గంధము, అనగా తామర పూల వాసన, లసునాది గతంబైన ఉగ్ర గంధము, అనగా వెల్లుల్లితో కలసిన ఘాటు వాసన, పర్యుషిత చిత్రాన్నాది గతంబైన యామ్ల గంధము, అనగా పులిహోర, చద్ది అన్నముల వాసనలను ముక్కు గ్రహించును. భూమికి ప్రతిమల రూపము కలుగ చేయుట, సకల జీవరాసులకు దేహముగా ఉండుట, మిగిలిన ఆకాశాది భూతములకు ఆధారముగా ఉండుట, ఆకాశాది భూతముల గుణములు కలిగి ఉండుట, స్వతంత్రముగా ఉండుట, (అనగా భూమికి ఆధారము అవసరములేదు. ఇదే మిగిలిన భూతములకు ఆధారము.) మొదలయినవి భూమి యొక్క గుణములు.

**ఇంద్రియములకు విషయములు**

శబ్దమును చెవులు గ్రహించును. స్పర్శను చర్మము గ్రహించును. రూపమును కన్ను గ్రహించును. రసమును నాలుక గ్రహించును. గంధమును ముక్కు గ్రహించును.

**పంచ భూతములకు గుణములు:**

| | | |
|---|---|---|
| ఆకాశమునకు | - | శబ్దము గుణము |
| వాయువునకు | - | శబ్దము - స్పర్శ 2 గుణములు |
| తేజంబునకు | - | శబ్దము - స్పర్శ - రూపము 3 గుణములు |
| జలమునకు | - | శబ్దము- స్పర్శ - రూపము - రసము 4 గుణములు |
| పృథివికి | - | శబ్దము - స్పర్శ - రూపము- రసము- గంధము 5 గుణములు . |

భూమికి 5 గుణములు, జలమునకు 4 గుణములు. అగ్నికి 3 గుణములు,

వాయువునకు 2 గుణములు. ఆకాశముకు 1 గుణము. ఇవిఅన్నియు కలసి మొత్తము 15 గుణములు అగుచున్నవి. ఈ 15 గుణములను పాడ్యమి నుంచి అమావాస్య వఱకు కృష్ణ పక్షము గాను, పాడ్యమి నుంచి పౌర్ణమి వఱకు శుక్ల పక్షము గాను చెప్పుదురు. ఆకాశము నుండి భూమికి వచ్చిన అది కృష్ణ పక్షము. భూమి నుంచి ఉత్తర దిక్కుగా ఆకాశమునకు వెళ్ళిన అది శుక్ల పక్షముగా యోగములో చెప్పి శుక్ల పక్షమున దేహత్యాగము చేయుట మంచిదని చెప్పిరి. ఇదే ఉత్తరాయణము.

**రాజసాహంకారము :-** ఇది తైజసము. కావున దీనిని తైజసాహంకారము వలన సూక్ష్మ శరీరములోని జ్ఞానేంద్రియములు, కర్మేంద్రియములు ప్రాణము, బుద్ధి జనించినవి. ఈ ప్రాణము క్రియాశక్తి. ఈ బుద్ధికి ద్రవ్య ప్రకాశకంబైన జ్ఞానంబును,ఇంద్రియానుగ్రహంబును అనగా ఇంద్రియములు ఇంద్రియార్థములపై ప్రసరించునప్పుడు ఇది మంచి ఇది చెడు అని చెప్పుట, సంశయము అనగా ఈ పని చేయువలయునా వద్దా అనే మీమాంస, మిధ్యా జ్ఞానము, ఇంద్రియ నిశ్చయంబును, స్మృతియు లక్షణములు.

**సాత్త్వికాహంకారము :-** ఈసాత్త్వికాహంకారము వలన మనస్సు జనియించినది. మనస్సు ఉన్న దీనినే లింగ శరీరము అని అందురు. ఈ లింగ శరీరము భంగమైన జన్మ రాహిత్యమగును. మనస్సు సంకల్ప, వికల్పములకు నిలయము. విశేష చింత, సామాన్య చింత కలిగి ఉండును. మనస్సుకు అధిష్ఠానము మన్మథుడు. వాసుదేవ వ్యూహములో **ప్రద్యుమ్నుడు** అధిష్ఠాన దేవతగా చెప్పుదురు.

సాత్త్వికాహంకారములో ఇంద్రియములకు అధిష్ఠాన దేవతలైన దిక్కులు, వాయువు, సూర్యుడు, ప్రచేతసులు, అశ్వినీ దేవతలు, అగ్ని, ఇంద్రుడు, ఉపేంద్రుడు, ప్రజాపతి, మిత్రుడు అను దశ దేవతలు ఉందురు. ఇది సూక్ష్మ శరీరము. ఇది సకల యోగీంద్రులచే సేవింపబడునది. శరత్కాలము నందలి నల్లకలువవలె శ్యామల వర్ణముతో ఉండును. **వాసుదేవ వ్యూములో అనిరుద్ధుడు** అధిష్ఠానము. ఇంత వఱకు చెప్పిన దానినే వాసుదేవ వ్యూహముగా కూడ చెప్పుదురు.

*****



# వాసుదేవ వ్యూహము

**వాసుదేవుడు :-** శుద్ధ సత్వ గుణ ప్రధానము అనగా గుణ రహితము. స్వచ్ఛము. శాంతము. నిత్యము. ప్రాణ లక్షణములైన ఆకలి దప్పికలు, మనోలక్షణములైన శోకమోహములు, దేహ లక్షణములైన జరా మరణములు లేనిది. ఐశ్వర్యము, వీర్యము, యశస్సు, శ్రీ, జ్ఞానము, వైరాగ్యము అనే షడ్గుణములు కలిగి భక్తజనులచే సేవింపబడునది.

మహత్

**అహంకారము:-** దీనికి **సంకర్షణుడు** అధిష్ఠాన దేవత. ఈ సంకర్షుణునినే వేయి శిరస్సుల ఆది శేషువు అని- అనంతుడని అందురు. పురుషుడు, ఘనుడు, పంచభూత, ఇంద్రియ మానస-మయుడు. కారణము, కార్యము, కర్తృత్వము ఇతడే. ఇతడు శాంతత్త్వము, ఘోరత్త్వము మూఢత్వాది లక్షణములు కలిగి ఉండును.

సాత్త్వికాహంకారము
ప్రద్యుమ్నుడు
అనిరుద్ధుడు

రాజసాహంకారము

తామసాహంకారము

# మిథున ధర్మ సృష్టి

ఈశ్వరుడు జీవరాసులనను ఆడ, మగ భేదములుగ సృజియించినాడు. మిథున ధర్మ సృష్టిలో ఏ జీవరాసి ఆ జీవరాసినే సృజియించును. స్వాయంభువుడు శతరూపుల సంతానము అయిన ప్రియవ్రతుడు, ఉత్తానపాదుడు వలన మానవులు జన్మించిరి.

### మానవ దేహము- జీవుడు గర్భస్థుడగుట - జననము

తల్లిదండ్రుల వలన మానవ దేహము కలుగును. పితృదేహంబు చేత మాతృ దేహంబు వలన దేహము గలుగును. అనగా పురుష వీర్యము స్త్రీ రేతస్సు సంబంధమున దేహము ఏర్పడును. బీజంబు వలన వృక్షము, దాని నుండి బీజము పుట్టుచుండు విధంబున కర్మవలన ఉపాధి, ఉపాధి వలన కర్మ గలుగును. జీవుడు ఉపాధిలో ప్రవేశించును.

1. అండము తయారగుట :-

1 రాత్రికి - శుక్రశోణితములతో కలసి ఆ తరువాత
5రాత్రులకు - బుద్బుదమై
10వ దినమున - రేగు పండు అంతయై
20 దినములకు - 2 రేగుపండ్లు అంత అండము అగును.

2. అండములో పరమాత్మ చేరి అవయవములను నిర్మించుట :-

1 నెలకు - తల
2 మాసములకు - కర, చరణములు
3 మాసములకు - నఖ,రోమ,అస్థి,చర్మము,లింగచ్ఛిద్రము,
4. మాసములకు - సప్తధాతువులు

3. అండము సచేతనము అయినది :-

5 మాసములకు - ఆకలి, దప్పికలు కలిగి

4. జీవుడు ప్రవేశించుట :-

6మాసములకు మావిచేతం బొదువంబడి తల్లి కుక్షిని దక్షిణ భాగమున తిరుగుచూ మాతృభుక్తాన్న పానంబుల తృప్తిబొందుచూ క్రిమిభక్షిత శరీరుండై దైవకృతంబయిన జ్ఞానంబునం పూర్వ జన్మ దుష్కృతంబులం తలంచుచూ.

7 మాసములకు - లబ్ద జ్ఞానుండై చేష్టలు గలిగి
8. మాసములకు - ఒక దిక్కున ఉండక సంచరించుచూ
9. మాసములకు - దైవమును స్తుతించును. ఆత్మను అరసి రక్షించుకొందును అని తలచును.

జన్మించుట :- 10 వ మాసమున - అండమును భేదించి నిర్గమించును అనగా తల్లి గర్భము నుండి బయట పడును.

ఇంతవఱకు ఐదు విధములగా సృష్టి గుఱించి వివరించబడినది. సృష్టిలో ప్రకృతి నుంచి దేహము పుట్టును. జీవుడు దేనినుంచి పుట్టడు. దేహములోనికి జీవుడు తన పూర్వ జన్మ కర్మానుసారము ప్రవేశించును. హృదయ గుహలోనికి ఆత్మ సూక్ష్మరూపమున ప్రవేశించి వసియించును. దేహమును అధిభూతమని, జీవునిని అధిదైవతమని, హృదయగుహలోని ఆత్మను అధియజ్ఞమని అందురు. ఆత్మ, పురుషుడు, విరాట్ పురుషుడు, ప్రకృతి, మహత్, మొదలయిన విషయములు పాఠకులకు విసుగు పుట్టించకుండా ఉండుటకు ఈ విషయములను పాత్రలుగా చిత్రీకరించి రామాయణ, భారతములు రచియింప బడినవి.

*****

## రామాయణములో పాత్రలు

కవులకు, భాషా పండితులకు, అలంకారములు, వర్ణనలు, శృంగారాది రసములుగా, చిత్ర విచిత్ర పదములు, శ్లేషలు మొదలయినవి కలిగి అందముగా రామాయణము వర్ణింపబడినది. రాముడు సీతల కథ ఇది. ఇది ఇతిహాసము. అనగా ఒకనాటి చరిత్ర. చరిత్రగా ఆనాడు జరిగిన సన్నివేశములు వర్ణింపబడినవి. ఆత్మతో మొదలుపెట్టి సృష్టి వఱకు చెప్పిన ఈ సర్వ విషయములకు వేదాంత భాష్యముగా పాత్రలను కల్పించి కథా సన్నివేశమును బహు సుందరముగా నడిపినారు. వేదాంత విషయములకు సంబంధించిన వేదములోని అనేక మంత్రములకు విపుల వ్యాఖ్యానము రామాయణము. ఈ విధముగా కవితా సౌందర్యము, ఇతిహాసము, వేదాంతముల త్రివేణి సంగమము రామాయణము. ఒక వ్యక్తి సాధన చేసి తిరిగి బ్రహ్మలోకమును పొందు విధి విధానము రామాయణమున చెప్పబడినది.

ఆత్మ బ్రహ్మాండమునకు ఆవలను, ఆత్మగా హృదయ గుహలోను, జీవునిగా శరీరమందు ఉండును. శరీరమును, హృదయ గుహను ఈ రెండింటిని **అయోధ్యగా** అథర్వ వేదమున వర్ణింపబడినది. వీటినే కోశల దేశముగా, అయోధ్యగా రామాయణంలో చిత్రీకరించినారు.

సృష్ట్యాది యందు ఒక్కొండుగా ఉన్న ఆత్మ సృష్టిలో జీవాత్మ పరమాత్మగా రెండు విభాగములై మరల జీవాత్మ జాగ్రదావస్థ, స్వప్నావస్థ, సుషిప్తి అవస్థలలో విహరించుచూ, వేఱువేఱు పేర్లతో పిలువబడును. ఆ విధముగా సృష్ట్యాది యందు ఒక్కడుగా ఉన్న ఆత్మ సృష్టిలోనికి వచ్చి 4 భాగములయినది అని చెప్పిన మాండుక్య ఉపనిషత్‌కు వ్యాఖ్యానముగా దశరథుని 4గురు పుత్రులను పేర్కొనిరి.

| స్థూల శరీరము | సూక్ష్మ శరీరము | | హృదయ గుహలో గల ఆత్మ |
|---|---|---|---|
| జాగ్రతావస్థ | స్వప్నావస్థ | సుషుప్తి అవస్థ | |
| భరతుడు | శత్రుఘ్నుడు | లక్ష్మణుడు | రాముడు |

**తేన త్యక్తేన భుంజీథాః** అని చెప్పిన దానికి సీతా పరిత్యాగమును చెప్పినాడు. ఈ విధముగా వేదములలోని అనేక మంత్రములకు విపుల వ్యాఖ్యానము ఇవ్వబడినది.



ప్రకృతి - భూమి

మహత్ - సీత. భూమినుంచి జనియించినదని చెప్ప బడినది.

| సాత్త్వికాహంకారము | రాజసాహంకారము | తామసాహంకారము స్థూల శరీరమునకు సంబంధించి **రాక్షసులుగా** |
|---|---|---|
| **దేవతలు** | దేవతల పుత్రులుగా | చెవులు : కుంభకర్ణుడు, బ్రహ్మ కర్ణుడు, భాస కర్ణుడు, హ్రస్వకర్ణుడు |
| వాయువు | హనుమంతుడు | కన్ను : అక్ష కుమారుడు , విరూపాక్షుడు, ధూమ్రాక్షుడు,యూపాక్షుడు, శోణితాక్షుడు, మకరాక్షుడు |
| సూర్యుడు | సుగ్రీవుడు శ్వేతుడు జ్యోతిర్మయుడు | నాలుక : విద్యుజ్జిహ్వుడు, ఇంద్రజిహ్వుడు, వక్రుడు |
| అశ్వినీ దేవతలు | మైందుడు, ద్వివిదుడు | ముక్కు : శుకుడు, శుకనాసుడు |
| అగ్ని | నీలుడు, జ్యోతిర్ముఖుడు, వలి ముఖుడు, సంనాదకుడు | నోరు : దుర్ముఖుడు, హస్తి ముఖుడు |
| ఇంద్రుడు | వాలి | చేతులు : ప్రహస్తుడు |

**ప్రాణము :** మరల సూర్యుడుగా, అగ్నిగా, వాయువుగా, ఇంద్రుడుగా, పర్జన్యుడుగా ప్రశ్నోపనిషత్‌లో వివరింపబడినది, దానినే సూర్యునిగా సుగ్రీవుడు, అగ్నిగా నీలుడు, వాయువుగా హనుమంతుడు, బృహస్పతిగా తారుడు, పర్జన్యునిగా శరభుడులను వర్ణించినారు.

**సాత్త్వికాహంకారము** **రాజసాహంకారము**

దేవతలు - దేవతల పుత్రులుగా

| | |
|---|---|
| వరుణుడు | సుషేణుడు , హేమకూటుడు, ఋషభుడు |
| యముడు | సుముఖుడు, దుర్మ్ముఖుడు, వేగదర్శి శరభుడు, గంధమాదనుడు, గజుడు, గవాక్షుడు, గవయుడు |
| కుబేరుడు | గంధమాదనుడు, |
| విశ్వకర్మ | నలుడు |
| బ్రహ్మ (బుద్ధి) | ధూమ్రుడు **జాంబవంతుడు** |
| బృహస్పతి | తారుడు, కేసరి |
| చంద్రుడు(మనస్సు) | దధిముఖుడు |

ఈ విధముగా సాత్త్వికాహంకారములోని వారిని దేవతలుగా, రాజసాహంకారములోని వారిని దేవతల కుమారులుగా,(వానరులుగా) ఉత్ప్రేక్ష చేసి రామాయణంలో కథ నడిపినారు. ప్రాణము, బుద్ధి, మనస్సులను వానరులుగా, ఎలుగుబంట్లుగా ఉత్ప్రేక్ష చేసిరి.

స్థూల శరీరములోని ఈ క్రింది వాటిని రాక్షసులుగా వర్ణించినారు.

| | |
|---|---|
| స్థూల శరీరము | = వజ్రకాయుడు |
| రూపము | = విద్యుద్రూపుడు,వికటుడు |
| కంఠము | = ధ్వజ గ్రీవుడు |
| దవడ | = వజ్రహనువు |
| పండ్లు | = దంష్ట్రుడు, వజ్రదంష్ట్రుడు |
| ఉదరము | = మహోదరుడు |
| పార్శ్వము | = మహాపార్శ్వుడు |
| బలము | = భీముడు, ఘనుడు, విఘనుడు |
| మదము | = మత్తుడు, యుద్ధోన్మత్తుడు |
| మూర్ఖత్వము | = శరుడు |
| మాలిన్యం | = జంబుమాలి, విద్యున్మాలి, సుమాలి |
| శత్రుత్వము | = యజ్ఞ శత్రువు, సూర్య శత్రువు, బ్రహ్మ శత్రువు |
| అజ్ఞానము | = రశ్మి కేతువు, సూర్యకేతువు |
| సంహారకత్వము | = నరాంతకుడు |
| ఇతరులు | = సారణుడు, కరాళుడు, పిశాచుడు, దుర్ధరుడు, ప్రఘసుడు, 7మంది మంత్రి పుత్రులు, 80 వేల మంది కింకరులు. |



ఈ విధముగా తామసాహంకారము నుండి వచ్చిన స్థూలదేహంలోని ఇంద్రియములను, తమో గుణమును రాక్షసులుగా చెప్పిరి. **జీవునిని రామునిగా** పేర్కొని, సాధన రహస్యమును వివరించినారు. రామాయణంలోని రావణ సంహారమనగా జీవత్వమును నశింపచేసుకొని జీవుడు బ్రహ్మ దర్శనమునకు అర్హుడగుట అని అర్థము. దీనినే కూటస్థుడగుటగా చెప్పుదురు. ఇంతటి యోగ పాఠమును చక్కగా రమ్యముగా వాల్మీకి మహర్షి మనకు అందించినారు. ఇందలి ప్రతి కథ ఒక యోగ రహస్యము. అధ్యాత్మిక భావనలతో కూడి ఉండును. వీటిని సామాన్య కథలుగా చదవరాదు.

వేదములో చెప్పిన విషయములకు విపుల వ్యాఖ్యానము రామాయణము.మన కథను మనకు చెప్పిరి. కావుననే కుశీలవులు రామ కథను రామునికే వినిపించిరి అని రామాయణమున చెప్పబడినది. రామాయణంలో వలె ఆత్మ నుంచి సృష్టి వఱకు చెప్పిన విషయములకు పాత్రలు చిత్రీకరింపబడినవి.

*****

## భారతములో పాత్రలు

ఆత్మ = శ్రీకృష్ణుడు
ప్రకృతి = రుక్మిణి
అహంకారము = బలరాముడు
సనత్ కుమారుడు = ప్రద్యుమ్నుడు (సాత్త్వికాహంకారము మనస్సు)
అనిరుద్ధుడు

**దేవతలు : దేవతల అంశము**

బృహస్పతి = ద్రోణుడు (బుద్ధి)
సూర్యుడు = కర్ణుడు (కన్నులు)
యముడు = విదురుడు, ధర్మరాజు
వాయువు = భీముడు
ఇంద్రుడు = అర్జునుడు (చేతులు)
అశ్వినీ దేవతలు = నకుల సహదేవులు(ముక్కు)
అగ్ని = దృష్టద్యుమ్నుడు
స్త్రీ పుంస రూపధరుడైన
గుహ్యకుడు = శిఖండి
సిద్ధి- బుద్ధి = కుంతి, మాద్రి
శ్రీ = ద్రౌపది
మరుత్తులు = పాండురాజు, ద్రుపదుడు, విరాట్ రాజు, సాత్యకి
ఏకాదశ రుద్రులు = కృపాచార్యులు
అష్ట వసువులలో ప్రభాసుడు = భీష్ముడు
అప్సరసలు = 16 వేల మంది కృష్ణుని భార్యలు
వేల్పుల అంశ = యదు, వృష్టి, భోజ, అంధకులు
అరిష్టాపుత్రుండైన హంసుడు
అనే గంధర్వుడు = ధృతరాష్ట్రుడు
మతి అనే దేవత = గాంధారి (గాంధార నాడి)



తామసాహంకారమున జనియించిన స్థూల దేహమును, గుణములను రాక్షసుల అంశగా దుష్టులుగా చిత్రీకరించిరి.

**రాక్షసులు.**

ద్వాపరాంశము = శకుని
కలిఅంశము = దుర్యోధనుడు
పులస్త్యుని కుమారులు = దుశ్శాసనాదులు
హిరణ్యకశిపుడు = శిశుపాలుడు
హిరణ్యాక్షుడు = దంత వక్రుడు
ప్రహ్లాదుని సోదరులు అయిన సంహ్లాదుడు, అనుహ్లాదుడు, హ్లాదుడు
సంహ్లాదుడు, = శల్యుడు
అనుహ్లాదుడు = దృష్టకేతువు
హ్లాదుడు (శిబి భాస్కరుడు) = ద్రుమ శేనుడు, భగదత్తుడు.
విప్రచిత్తి = జరాసంధుడు
హయశిరుడు, అశ్వశీర్షుడు, నయశంఖుడు,
గగన మూర్ధండు, వేగవంతుడు అను 5గురు దానవులు = కేకయ రాజులు
కేతుమంతుడు = అమితేజుండు
అశ్వపతి = కృతవర్మ
వృపర్వుడు = దీర్ఘప్రజ్ఞుడు
అజరుడు = మల్లుడు
అహరుడు = బాహ్లికుడు
శరభుడు = సోమదత్తుడు
సుభ్రానుడు = ఉగ్రసేనుడు
కాలనేమి = కంసుడు

ఈ విధముగా ప్రజాపతుల సృష్టిలోని వారిని సాత్త్విక, రాజసిక, తామసిక అహంకారము వలన జనియించిన స్థూల దేహము సూక్ష్మ దేహములలో గల వాటిని కౌరవ పాండవ సేనలోని రాజులుగా చిత్రీకరించి **ఈ దేహములోని భూ భారమును** తొలగించు విధి విధానమును భారతముగా మనకు వేద సారమును వ్యాస భగవానుడు అందించినారు. **భూ భారమును తగ్గించుట అనగా జన్మరాహిత్యము.** దీనినే

స్థూల సూక్ష్మదేహములుగానూ, దేవదానవ యుద్ధముగానూ, రామ రావణ యుద్ధముగానూ, కౌరవ పాండవ యుద్ధముగానూ చెప్పినారు. ఇవి సాధకునికి యోగ పాఠములు . ఇట్టి యోగ రహస్యములను ఆత్మ దర్శనము చేసిన అనగా పరానుభూతిని పొందిన మహనీయులు మాత్రమే వైఖరీ శక్తితో వివరించ గలరు. అందువలన ఆత్మ దర్శనము చేసిన బ్రహ్మణ్యుడైన సూత మహర్షి శౌనకాది మహా ఋషులకు భారతమును భాగవతమును వివరించెను.

*****



## మాయ

లేని అర్థంబు దృశ్యమానంబగుటయు ఉన్నటువంటివి దర్శన గోచరము గాకుండుటయే మాయ. సృష్ట్యాది యందు ఒక్కడుగా ఉన్న ఈశ్వరుడు తన మాయ వలన తనని తను విభజించుకొని ప్రకృతి, కాలము, కర్మ, జీవుడుగా భిన్నుడై వేలు వేలు లక్షణములు కలిగి ఉన్నాడు. విద్యావిద్యలు మాయ వలన కలిగినవి. దేవ మాయ సులభముగా తెలియలేము. ఈ మాయ వలన దేవుడు గలడని, లేడని, సర్వజ్ఞుడని, బద్ధుడు, ముక్తుడని, ఒక్కడు భిన్నుడని, గుణి, నిర్గుణుడని అనేక వాదములు కలిగినవి. మాయ కామినీ రూపమున పురుషులకు మోహమును కలుగ చేయును. దీనినే కథా పరముగా విష్ణువు మోహినీ రూపమున అమృతమును పంచినట్లు కథగా చెప్పిరి. దేవ మాయ వలన జీవుడు దేహమును ప్రవేశించి గుణవ్యతిరిక్తుండయ్యు మాయ వలన గుణాభిమానియై నేను నాది అనే భావన కలిగి తనే అన్నింటికి కర్తనని తలచి సుఖదుఃఖములు పొంది దేహాత్మ బుద్ధి వలన బద్ధుడగుచున్నాడు.

*****

## అవిద్య

జీవ లక్షణములు దేహ లక్షణములు భిన్నములయినను దేహమే నేను అని భావించి కామ క్రోధాది గుణములతో సంయోగము చెంది చిత్త విభ్రమము పొందుటకు కారణము అవిద్య. అవిద్య సంసార హేతువు. అవిద్య వలన దేహసంబంధము కలుగును. అవిద్య వలన భ్రమ కలుగును. అవిద్య నివృత్తి అయిన సర్వమూ మిథ్య అయి విధినిషేధములు తొలగి స్వప్నావస్థలో కలిగిన అనర్థములు జాగ్రతావస్థలో లేనట్లు సుఖదుఃఖములు లేక ద్వందాతీతుడై ఆనందమయుడగును. ఇంద్రియములు ఈశ్వర విషయంబులైన, మనస్సు నిశ్చలముగా ఉన్న భక్తి కలిగినా అవిద్య నశించును.

*****

## అజ్ఞానము

అజ్ఞానము వలన బంధము, జ్ఞానము వలన మోక్షము కలుగును. అజ్ఞానము వలన స్వపర భేదములు కలుగును. అజ్ఞానము నశించి జ్ఞానము కలిగిన సర్వమూ ఆత్మ స్వరూముగా తోచును.

*****

## ప్రకృతి

అవ్యక్తము, మాయ, ప్రధానము అని ప్రకృతికి పేర్లు. ప్రకృతి త్రిగుణములతో కూడినది. ఇది జగత్కారణము. జగత్తు సత్తు అసత్తుల కలయిక. ప్రకృతి - పంచ తన్మాత్రలు, పంచభూతములు, పంచజ్ఞానేంద్రియములు, పంచ కర్మేంద్రియములు, అంతఃకరణ చతుష్టయము అను 24 తత్త్వములతో కూడి ఉండును.

పురుషప్రకృతులే సృష్టికి కారణము. పురుషుడు ప్రకృతిని సృజియించి ఆ ప్రకృతితో సంయోగము చెందినాడని కొందఱు చెప్పుదురు. దీనినే కథాపరముగా బ్రహ్మ సరస్వతిని సృజియించి ఆ సరస్వతిని భార్యగా పొందెనని చెప్పుదురు. కొందఱు పురుషునిలో సగభాగము ప్రకృతి అని చెప్పుదురు. దీనినే కథాపరముగా శివుడు అర్థనారీశ్వరుడు అని చెప్పుదురు. కొందఱు పురుషుడు ప్రకృతి సమాన వయస్కులు అని చెప్పుదురు. దీనినే కథాపరముగా శ్రీకృష్ణుడు యోగమాయ ఏకకాలమున జన్మించినట్లు ఆ యోగమాయను కంసుడు చంపబూనగా ఆమె ఆకాశమునకు ఎగిరి అదృశ్యమయినట్లు చెప్పిరి.

రామాయణములో ప్రకృతి గుఱించి ఇట్లు చెప్పబడినది.

**ఇమాం విరూపా మసతీం కరాళాం నిర్ణతోదరీం**

(రామాయణము, అరణ్యకాండ,17వ సర్గ, 28)



..... అని శూర్పణఖ రామునితో శ్లేషగా చెప్పినది. ఇదే విషయమును లక్ష్మణుడు రాముని సమక్షమున శూర్పణఖతో సీత గుఱించి ఇట్లు పలికెను.

**ఏనాం విరూపా మసతీం కరాళాం నిర్ణతోదరీం**
**భార్యాం వృద్ధాం పరిత్యజ్య త్వామేవైష భవిష్యతి॥**

(రామాయణము, అరణ్యాకాండ,18వ సర్గ, 11)

ఈ రెండు శ్లోకములు సీత గుఱించి, ప్రకృతి గుఱించి చెప్పినవి. ఏనాం అనగా ఈ ప్రకృతి; విరూపా అనగా రూపరహితమయినది అనగా బాహ్య దృష్టికి గోచరము కాదు. ప్రకృతి, మహత్తు, అహంకారము, పంచ తన్మాత్రలు మనకు గోచరము కావు; అసతీం అనగా ఇటు ప్రకృతి పరమేశ్వరునితోనూ అటు జీవునితోనూ సంబంధము కలిగి ఉన్నది. పరమేశ్వరుని ఆజ్ఞకు లోబడి ప్రకృతి ప్రవర్తించును. ఇటు జీవుడు ప్రకృతికి లోబడి పని చేయుదురు. అటు ఈశ్వరునితోనూ ఇటు జీవునితోనూ సంబంధముండుటవలన, ప్రకృతిని అసతిగా చెప్పుదురు; కరాళాం అనగా భయంకరమైనది. ప్రకృతి విజృంభించిన మహాప్రళయము సంభవించి సర్వ జీవరాసులు హాహాకారములు చేయును. ప్రకృతి ఎంత ఆహ్లాదకరమో ఆమె విజృంభించిన అంత భయంకరము. పార్వతిగా సౌమ్యురాలు. కాళీ రూపమున భయంకరమూర్తి; నిర్ణతోదరీం అనగా అణగిపోయిన పొట్టకలది. సర్వ జీవురాసులను మ్రింగి ఆకలి తీర్చుకొని పెద్దపొట్టగా ఉన్న ఈమెయే మరల అణగిపోయిన పొట్టకలిగి సృష్టికి కారణమగుచున్నది; వృద్ధా అనగా వృద్ధురాలు అనగా పురుషుని వలె ప్రకృతియు అనాది.

ప్రకృతియందు పరమ పురుషుడు తన వీర్యము పెట్టిన ఆ ప్రకృతి హిరణ్మయంబైన అండమును సృజియించెను. ఈ ప్రకృతి, అపరా ప్రకృతి, పరా ప్రకృతి అని రెండు విభాగములుగా చెప్పుదురు. ఆకాశాది పంచభూతములు, మనస్సు, బుద్ధి, అహంకారములు అనే ఈ ఎనిమిదింటిని అపరా ప్రకృతి అనియు, దేనిచేత ఈజగత్తు ధరింపబడుచున్నదో అట్టి గుణములను పరా ప్రకృతి అనియు చెప్పుదురు. ఈ రెండు ప్రకృతులే సృష్టికి మూల స్తంభములు.

ప్రకృతి వలన సత్త్వ రజస్తమో గుణములు గలిగినవి. సత్త్వరజస్తమో గుణములు

ఉత్పత్తి , స్థితి , లయ కారణములు. త్రిగుణ రహితమయిన ప్రాణి సృష్టిలో ఏదియు లేదు. సర్వులు గుణ బద్ధులే. అనగా త్రిలోకములందలి దేవతాసహిత సర్వులు గుణ బద్ధులే రజోగుణము సృష్టి కారణము. సత్త్వ గుణము స్థితికారము మరియు జ్ఞానకారణము. తమోగుణము లయకారణము. ఈశ్వరుడు సత్త్వ గుణంబున దేవ ఋషులను గల్పించెను. రజోగుణము వలన అసురులను పుట్టించెను. తమోగుణము వలన యక్షరక్షో గణంబులను విభజించెను. ఈశ్వరుని వలన బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులకు, కర్మంబులు మఱియు ప్రకృతి సంభూతములగు గుణములు, విభక్తములయినవి.

గుణము- దేహము - దేహము గుణములకు ఆశ్రయము.

గుణము- చిత్తము - గుణములు చిత్తములో ఉద్భవించుచున్నవి.

గుణము- బుద్ధి - త్రిగుణములు బుద్ధికి చెందినవి.

గుణము- ఆత్మ - గుణములు ఆత్మకు సంబంధించినవి కావు.

గుణము- మాయ - గుణములు మాయావరణలోనివి.

దేశము, కాలము, కర్మ, కారకములు, ద్రవ్యము,అవస్థ , ఆకృతి, శ్రద్ధా , నిష్ఠా, జ్ఞానం, ఫలము, ఇవి అన్నీ గుణ విభాగము క్రిందకు వచ్చును. దృష్టం, శ్రుతం, భావం, ఇవి అన్నీ గుణమయ భావములే.

**గుణములకు హేతువులు :-** జలము, దేశము, కాలము, కర్మ, జన్మ, ప్రజలు, సంసారం , ధ్యానం, మంత్రం, ఇవి గుణములకు హేతువులు.

**బంధము - మోక్షము :-** ఆత్మకు స్వతహాగా బంధము లేదు. మోక్షము లేదు. కాని గుణముల వలన బంధమున్నట్లు తోచుచున్నది. గుణములు జీవుని బంధించుచున్నవి. ప్రాణులకు నైజ గుణంబులు పోవు. అజ్ఞాని సత్త్వరజస్తమో గుణంబులు గలిగియుండు. అట్టివానికి గుణమయంబులయిన ఇంద్రియాదులే ఆత్మ అని తోచు. కావున వాడు ఆగుణంబుల చేత బద్ధుండగు. ఆగుణంబులకు సాక్షి మాత్రంబగు శరీరంబు వేఱని యెవ్వడెఱుంగనోపు వాడా గుణంబుల చేత బద్ధుండు కాడు. వెదురు వలన పుట్టిన అగ్ని వనమంతా దహించినట్లు ఈ దేహము గుణ సంఘర్షణ వలన నశించును. విషయములు ధ్యానించుటవలన



సంగం గలుగును. దాని వలన కామము క్రోధము గలుగును. తమోగుణము ప్రవర్తిల్లును. మంచి చెడుల విచక్షణ గోల్పోవును. విషయాభి నివేశము వలన పరమునుగాని తననిగాని తెలుసుకొనలేకున్నారు. మనోరథములయిన విషయములను ధ్యానించుటవలన భేదాత్మకులై నానాత్మకత్వమును చూచుచున్నారు. మనఃసంకల్పము వలన నానాత్మకముగా గోచరించుటకు కారణము గుణములు. గుణములు లేనిదర్శనము ఏకత్వము. గుణరహితుడు ఏకత్వమును చూచును. ఉదా - తన యందు అఖిల భూతములందు సమహితత్త్వము కలిగి ఉండును. గుణయుతుడు అనేకత్వమును చూచును. గుణ దోషములతో కూడిన పురుషులు జగత్తులో అనేకత్వము అనే భ్రమలో పడుదురు. తమోగుణము కంటె రజోగుణము, రజోగుణము కంటె బ్రహ్మ ప్రకాశంబగు సత్త్వ గుణము విశిష్టము. ఇంద్రియములు ఈశ్వర విషయంబులైన, మనస్సు నిశ్చలముగానున్న గుణములు పోవును.

*****

# గుణములు

**సత్త్వగుణము - దైవీసంపద: -** అభయము , సత్త్వ సంశుద్ధి, జ్ఞానముగలిగి ఉండుట, దానము, దమము , శమము, స్వాధ్యాయము, తపస్సు, ఆర్జవము (ఋజు ప్రవర్తన), అహింస, సత్యము, అక్రోధము, త్యాగము శాంతి, అపైశునము (చాడీలుచెప్పకుండుట నిందింప కుండుట) దయ, అలోలత్వము, ఆర్దవము (మృదుత్వము) హ్రీ (తప్పుడు పనులుచేయుటకు సిగ్గు పడుట) అచాపలమ్ (స్థిర బుద్ధి), తేజస్సు, క్షమ, ధృతి (ధైర్యము), శౌచము, అద్రోహము, న అతిమానితా (తనుగొప్పవాడినని భావింపకుండుట). ఇవి దైవీ సంపద .ఈగుణములు బంధవిముక్తిని గలిగించును.

**రజోగుణము, తమోగుణము** అసుర సంపద:- దంభము ( డాంబికము), దర్పము, అభిమానము, క్రోధము, పౌరుషము, అజ్ఞానము ఈగుణములు బంధమును గలిగించును. అసుర ప్రవృత్తి గలవారు ధర్మాధర్మములు యెఱుగరు. సత్కర్మాచరణ ఉండదు. శౌచము ఉండదు. సత్యభాషణ ఉండదు. నాస్తికులు ఈశ్వరుడు లేడని ఈశ్వరుని ద్వేషింతురు. సృష్టికి స్త్రీపురుషులేకారకులు అనిచెప్పుదురు. అల్పబుద్ధులు లోకమునకు హితము చేయరు. ఉగ్రకర్ములు జగత్తుయొక్కవినాశకారకులు. దర్పము, మిక్కుటమయిన కామము గలవారు. మోహము వలన అనాత్మతత్త్వమును గ్రహించి సదాచారమును పాటించరు. విషయ భోగాసక్తులు, ఆశపాశములచే బంధింపబడినవారు. కామక్రోధములు గలవారు, కోరికలు నెఱవేఱుటకు అన్యాయ మార్గానువర్తులై ధనమును సంపాదింతురు. ఉన్నదానితో తృప్తి చెందక ఇంకను సంపాదించతలతురు. ఇతరులను చంపి లోక కంటకులు అగుదురు. బలముతో విఱ్ఱవీగుదురు. గర్వితులు గొప్పధన వంతుడనని- హోదా గల వాడినని నాకు సమానుడు లేడని విఱ్ఱవీగుదురు. గర్వితులై యజ్ఞయాగములను దానములు చేయుదురు. యధేచ్ఛగా విలాసములను అనుభవింతురు, తమకు తామే గొప్పవారమని తలతురు. డాంబికముగా శాస్త్ర విరుద్ధములుగా మదాన్వితులై యజ్ఞములు చేయుదురు. అహంకారం, బలము, దర్పము, కామము, క్రోధము, అసూయ గలిగియుందురు. కామము, క్రోధము, లోభము ఈమూడు నరకద్వారములు.



## సత్త్వగుణము

**సత్త్వగుణంబున** సద్భక్తి సంభవించు. త్రిగుణ రహితుడు భగవంతునితో సమానుడగును.

**వాక్కు**,సత్యము, ఆర్దవము ( మృదుసంభాషణ ) కలిగి ఉండును.

**బుద్ధి:-** శాస్త్రవిచారము, వేద విజ్ఞానము, వివేకము, స్మృతి, జ్ఞానం కలిగిఉండును.

**స్వభావము :-** స్థైర్యం, ధైర్యం, ధృతి, హ్రీ, క్షాంతి, తేజస్సు, లాభములు గలుగునెడ ఉదాసీనుడైయుండుట, శరణము యిచ్చుట, స్వాతంత్ర్యము, శమము, దమము, సదాచారం, శీలము, శౌచము, ఆర్జవము (ఋజు ప్రవర్తన) గౌరవం, ఏకాంతవాసం, నిశ్చల భక్తి, తపస్సు కలిగి ఉండును.

**మనస్సు :-** విషయములు ఎదుటనున్నను చలింపకుండుట, సుస్థిరత్వము ఆత్మనిగ్రహం కలిగి ఉండును.

**రజోగుణము:** రజో గుణమువలన సృష్టి జరుగును. మేఘములు వర్షించును. వర్షము వలన పంటలు పండి ప్రజాభివృద్ధియగును.

**వాక్కు:-** హాస్య సంభాషణ, బహువికల్ప భాషలు మాటలాడుట కలిగి ఉండును.

**బుద్ధి: -** ఆలోచన ఉత్సాహం యశస్సు కోరుకొనుట కలిగి ఉండును.

**స్వభావము:-** సుఖదుఃఖములకు విచలితుడగుట, విషాదం, తృష్ణ కలిగి ఉండును.

**తమోగుణము:-** సర్వజీవులకు మోహము గలిగించును. తమోగుణము అజ్ఞాన జనితము. సత్త్వరజోగుణములను అణచి, తమోగుణము గలుగుచున్నది.

**వాక్కు :-** అసత్యము, వ్యంగ్యసంభాషణ, కొంటిమాటలు, చాడీలు చెప్పుట చేయుదురు.

**బుద్ధి :-** స్మృతి విభ్రమం, మఱపు కలిగి ఉండును.

**స్వభావము:-** మూర్ఖత్వం, దీనత్వం, ఇతరులకు భయంగలిగించుట, అలసట, బద్ధకం కలిగి ఉండును.

**నిద్ర :-** మొద్దునిద్ర,కలతనిద్ర కలిగి ఉండును.

**పనులు :-** పాపకార్యములు చేయుట, పాపకృతి, వికృతి కలిగి ఉండును.

**మిశ్రమ గుణములు :-** ధర్మ, అర్థ, కామములు మిశ్రమగుణముల వలన గలుగును. స్వధర్మాచరణ, గృహస్థాశ్రమము, ఇవి మిశ్రమ గుణముల వలన గలుగును. శ్రద్ధ, రతి, ధనాభిలాష, ఇవి మిశ్రమ గుణముల వలన గలుగును. నేను, నాది యను భావన మిశ్రమ గుణముల వలన గలుగుచున్నది.

| అరిషట్ వర్గములు | సత్త్వగుణము | రజోగుణము | తమోగుణము |
|---|---|---|---|
| **కామము** | కామం లేకుండుట యజ్ఞములు ఫలా పేక్ష లేకచేయుట. వ్యర్థ కార్యములు చేయకుండుట. ఆనందము. శ్రద్ధగా పనిచేయుట. | (ఈహ) ఆశ, కాంక్ష సుఖాపేక్ష, కామవృత్తి భోగకాంక్ష, కీర్తి, ఐశ్వర్యము, గౌరవము | బలాత్కారము స్త్రీలోలత్వము శోకం, ఉద్యమము ఏదో ఒక పనిచేయుట |
| క్రోధము | అలుక, (బాలుని స్వభావం) క్రోధము లేకుండుట, అక్రోధము, అక్రూరభావము, అహింస, జాలి, ప్రేమ, కరుణ, తితీక్ష, భూతదయ, క్షమ | క్రోధము, కోపము, కలహం | హింస, కరుణ లేకుండుట. |
| **లోభము** | దానం యిచ్చి కీర్తి ప్రతిష్ఠలు ఆశింపకుండుట | దానం యిచ్చి కీర్తి ప్రతిష్ఠలు ఆశించుట | లోభము, యాచన, స్వార్థం |



| అరిషట్ వర్గములు | సత్త్వగుణము | రజోగుణము | తమోగుణము |
|---|---|---|---|
| మోహము | ఏకాంత వాసం అసంగమము, కరుణ, ప్రియము, జన్మజరావ్యాధి మృత్యుదుఃఖ దోషములను సమముగాచూచుట సమత్వము విరక్తి | కార్పణ్యదోషం, ప్రీతి, రాగం, సంగత్వం | మోహము విమోహము సమ్మోహం |
| మదము | దంభములేకుండుట అమానిత్యం (తన్ని తాను పొగడుకొనకుండుట) ఎక్కువగా పూజింప తగినవాడననే భావము లేకుండుట. అహంకారం లేని విద్యా ప్రదర్శన గురుసేవ (ఆచార్యోపాసనం) అహంకారం లేకుండుట వినయము. పరాపరాధ సహనం ప్రతిభ, సామర్థ్యము కౌశలము, వీర్యం, జ్ఞానేంద్రియ కర్మంద్రియమనోబలం | శౌర్యం | అహంకారం, గర్వం, మదం, మదోత్సాహం దర్పము, అభిమానం అభిజాత్యం, దుర్మానము, వాదం, ఇంద్రియ నిగ్రహము లేకుండుట, అహంకారంతో గూడిన విద్యా ప్రదర్శన |
| మాత్సర్యం | అసూయలేకుండుట,ద్రోహ చింతన లేకుండుట ఇతరుల దోషములను వెల్లడి చేయకుండుట | పరితాపం | ఈర్ష్య, ఓర్వలేక పోవుట, నిష్ఠూరముగా మాటలాడుట, ద్రోహం |

# గుణములను జయించు విధానము

రజస్తమోగుణంబులను - సత్త్వ గుణంబున జయించవలయును. సత్త్వ గుణము గలిగి ఉండవలయును.

**కామము:** నిశ్చయాత్మకమగు బుద్ధి చేత మనస్సును స్థిరము ఒనర్చి బుద్ధి ద్వారా ద్రష్టయగు ఆత్మను తెలుసుకొని కామమును జయించవలయును. సంకల్ప వర్జనంబున కామమును జయించవలయును. వాంఛలేకుండా ఉండవలయును. సంభోగసుఖము ప్రాణాయామముచే జయించవలయును. ఇంద్రియములు మనస్సు, బుద్ధి యివి కామమునకు ఆశ్రయములు. కామము వలన కష్టము గలుగును.

**వాంఛ :-** శోక, మోహ, భయ, క్రోధ, రాగ, శమాదులు వాంఛ మూలంబులు.

**ఆశ :-** ఆశకు అంతములేదు. ఆశను బ్రహ్మ నిష్ఠ వలన, తృప్తి వలన జయించవలయును. తృప్తి - దొరికినదానితో తృప్తి చెందవలయును. తృప్తి లేనివాడు సప్త ద్వీపంబులనైన చక్కబడడు. సంతుష్టుడు ఈ మూడు జగములలో పూజ్యుడు.

**క్రోధము :-** క్రోధము ధర్మ క్రియలకు బాధాకరమగును. క్రోధము తపస్సును పాడు చేయును. తపస్వికి క్రోధముండరాదు. బుద్ధిమంతునకు క్రోధము తగదు. నియమవంతుడై దక్షిణలతో వేయి యజ్ఞములను చేసిన వారికంటె క్రోధము లేనివారుగొప్పవారు. కోపమును శమముచే జయించవలయును. కామవర్జనంబున జయించవలయును. క్రోధమును క్షమవలన జయించవలయును. క్షమ లేనిచో పగిలిన కుండలోని పాలవలె తపస్వియొక్క తపస్సు నేలపాలగును. శాంతస్వభావము ఎవ్వనికి గలుగు అతడు సర్వాతీతుండైన సర్వేశ్వరుండగు.

**రోషము :-** సర్వశుభహాని. రోషము జయించుట కష్టము. తాలిమితో జయించవలయును. సమస్త భూతములందు భగవంతుని కనుగొనుచూ భూతంబుల నాత్మకు వేఱుగా చూడక వర్తించవలయును. అలా వర్తించిన వానికి రోషముండదు.

**భయము :-** అద్వైతాను సంధానమున, జాగ్రత్త వలన జయించవలయును.



**యోగ అంతరాయము**ను మౌనమున జయించవలయును.

**లోభము :-** అర్థము, అనర్థముల విమర్శ వలన లోభమును జయించవలయును.

**మోహము :-** ఆత్మ అనాత్మ వివేకము వలన మోహమును జయించవలయును.

**శోకము :-** అజ్ఞానజనితము. దేహి, దేహ విమర్శనము, విజ్ఞాన విలోకనమున విడువ వలయును.

**దుఃఖము, వ్యధ :-** ఇవి తోటి వారివలన గలిగినచో కృప వలన మఱియు హితాచరణంబున, దైవము వలన గలిగినచో సమాధివలన జయించవలయును.

**వగచుట :-** దైవ తంత్రంబైన పనికి వగవంబనిలేదు.

**దంభము :-** సాధు సేవ వలన జయించవలయును.

**హింస :-** శరీర వాంఛ లేకుండుట వలనను, దేహములయందు అభిమానము వదలి హింసను జయించవలయును.

**నింద :-** సుజన నిందా దోషమున అధోగతి గలుగును. కావున ఇతరుల విషయము పట్టించుకొనకుండా ఉండి మౌనమున నిందను జయించవలయును.

**నిద్ర :-** సాత్త్వికాహారము వలన నిద్రను జయించవలయును.

*****

## అష్టమదములు

తమోగుణ, రజోగగుణములు విజృంభించిన - మదముగా వ్యక్తమగును

**మదము - అష్టవిధములు :** 1. విత్త, 2. వయో, 3. రూప,4. విద్యా, 5.బల, 6 ఐశ్వర్య, 7 . కర్మ, 8 జన్మంబు.

ఈ ఎనిమిది అష్టమదములు. ఈ అష్టమదములలో ఏఒక్క మదము ఉండరాదు. అట్టి మదములు లేనివారిని భగవంతుడు రక్షించును.

**సీ॥ విత్త వయోరూప విద్యా బలైశ్వర్య కర్మ జన్మంబుల గర్వముడిగి**
**తే॥ యేకవిధమున విమలుఁడై యెవ్వఁడుండు వాఁడు నాకూర్చి రక్షింప వలయు వాఁడు.** (భాగవతము, అష్టమ స్కంధము, 661)

ఈ అష్టమదములు లేనివాడు ప్రహ్లాదుడు.

**సీ॥ ఆకార జన్మ విద్యార్థ వరిష్ఠుఁడై గర్వ సంస్తంభ సంగతుఁడు గాడు**
**(భాగవతము, సప్తమ స్కంధము, 117)**

1. విత్తమదము, ధనమదము:- నలకూబరులు ధనమదమున నారద మహర్షిని లక్ష్యపెట్టలేదు.
2. ఐశ్వర్యమదము, రాజ్యమదము: - నహుషుడు ఆర్యవృత్తిని విడచి మాన్యులగు మునులచే పల్లకిని మోయించెను. పురూరవుడు రాజగర్వంబున సనత్కుమారులకు దర్శనం యివ్వలేదు . అంత వారు పురూరవుని ఉన్మత్తునిగా శపించిరి. ద్రుపదుడు సహాధ్యాయుడైన ద్రోణుని అవమానించెను.
3. వయోమదము:- రాకుమార్తె సుకన్య అతిశయ రూపయౌవన గర్వితయై పుట్టలో నున్న చ్యవనుని కన్ను పొడిచినది. యౌవన మదమున యయాతి రాగాంధుడై శర్మిష్ఠతో కలిసెను.
4. తపోమదము:- ఇంద్రుడు యయాతిని ఇటువంటి భోగములనుభవించుటకు కారణమడుగ తన తపస్సుతో సరిసమానముగా దేవదానవ యక్ష రాక్షస ముని గణంబుల తపస్సు సరికావని పల్కెను. ఇంద్రియజయుండనని పుట్టిన



అహంకారమున చిత్రకేతువు ఈశ్వరునిని అధిక్షేపించెను.

5. రూపమదము:- ఉదా - కబంధుడు.
6. విద్యా మదము- నేను విద్యా పాండిత్యము గలవానినని భావించుట.
7. బలమదము - బలవంతుడనని గర్వించుట.
8. కులమదము - నేను ఉన్నత కులమునందు పుట్టితిననే గర్వము.

ఈ మదములు గలవారిని శపించినట్లుగా కథలలో చెప్పుదురు. శాపవిమోచనముగా చెప్పిన కథలు అష్ట మదములను జయించుటకు చెప్పిన సాధనలుగా గ్రహించవలయును.

*****

## గుణములను అనుసరించి చేయబడు కర్మలు

ప్రకృతి వలన గుణములు జనియించినవి. ఆ గుణములననుసరించి జీవుడు కర్మలు చేయును. జీవుడు చేయు కర్మానుష్ఠానమును బట్టి అతని గుణమును గ్రహించ వచ్చును.

శాస్త్రవిధిని పాటింపనివాడు సిద్ధిని పొందజాలడు, సుఖమును పొందజాలడు, పరమగతిని పొందజాలడు. కావున శాస్త్రమును పాటింపవలయును.

**1. శ్రద్ధ :-** సాత్త్విక గుణము గలవారు దేవతలను;

రాజసగుణము గలవారు యక్షులను, రాక్షసులను;

తామసగుణము గలవారు భూత ప్రేతములను పూజింతురు.

**2. ఆహారము :-** సాత్త్వికులకు ఆయువు, బుద్ధి , బలము, ఆరోగ్యము, సుఖము, ప్రీతి అభివృద్ధిని పఱుచునవి అయినవి, రసయుక్తములయిన, స్నిగ్ధములయిన, మంచి ఆహారము ఇష్టము.

రజోగుణము గలవారికి చేదు, పులుపు, ఉప్పు, కారము, మిక్కిలి వేడి గలిగినవి ఇష్టములు . వీటి వలన దుఃఖము, శోకము గలుగును.

తమోగుణము గలవారికి చద్ది అన్నము, దుర్గంధముకలది, పాసిపోయినది, ఎంగిలి యైనది, రసహీనమైనది, అపవిత్రమైనది ఇష్టము.

**3. యజ్ఞము :-** యజ్ఞములు - తపస్సు, దానములు శ్రద్ధగా చేయవలయును. ఓం- తత్- సత్. ఓం అని పలికి ఆరంభింపవలయును. ఫలము పరమాత్మకు అర్పణము చేయవలయును. తత్ - అని భావనతో చేయవలయును. సత్ - అనగా శ్రద్ధతో చేయుట. అశ్రద్ధగా చేసినచో అది అసత్ అని చెప్పబడును. దానివలన ఇహలోకము నందును పరలోకమునందును ఫలము లేదు.

శాస్త్రము ప్రకారము చేయబడునది. ఫలాపేక్షలేకుండా చేయునది సాత్త్వికము. డాంబికముతో ఫలాపేక్షతో చేయునది రాజసికము.

విధివిహీనం, మంత్రవిహీనము, అదక్షిణము, శ్రద్ధా విరహితము, అన్నదానము లేకుండా చేయబడునది తామసికము.



**4. తపస్సు :-**

**శారీరక తపస్సు :** గురువులను, బ్రాహ్మణులను, పెద్దలను, పూజించుట, శౌచమునుపాటించుట. ఆర్జవము (ఋజుప్రవర్తన) బ్రహ్మచర్యము, అహింస ఇవి శారీరక తపస్సుగా చెప్పబడును.

**వాఙ్మయ తపస్సు :** ఉద్వేగము లేకుండానూ, ప్రియముగానూ, సంభాషించుట, సత్యమును చెప్పుట స్వాధ్యాయము ఇవి వాఙ్మయ తపస్సుగా చెప్పబడును.

**మానసిక తపస్సు :-** మనస్సు నిర్మలముగా నుండుట, సౌమ్యత్వము, మౌనము, ఆత్మ నిగ్రహము, భావసంశుద్ధి, ఇవి మానసిక తపస్సుగా చెప్పబడును.

**సాత్త్విక తపస్సు :** - ఫలాపేక్షలేక, మిక్కిలి శ్రద్ధతో చేయబడునది.

**రాజసిక తపస్సు :-** ఇతరుల నుండి సత్కారము, గౌరవము కోరబడునది. ఫలాపేక్షగలది, దంభముతో చేయబడునది.

**తామసిక తపస్సు :-** ఇతరులకు కీడు గలిగించుటకు చేయబడు ఉగ్రతపస్సు. దంభము, అహంకారము, బలగర్వితము, కామము, రాగము గలవారై శాస్త్ర విహితముగాని తపస్సు చేసి అంతర్యామిగానున్న ఆత్మను కృశింపచేయుదురు.

**5. దానము :-**

**సాత్త్విక** - దేశ, కాల, పాత్రలను గుర్తించి ప్రత్యుపకారము ఆశింపక దానము యిచ్చుట.

**రాజస** - మనః క్లేశము గలిగి , ప్రత్యుపకారము పొందుటకు చేయబడు దానము.

**తామస** - దేశ,కాల, పాత్రలను గుర్తింపక, తృణీకార భావముతో -(అశ్రద్ధగా) ఈసడింపుగా చేయబడు దానము.

**6. త్యాగము - సన్న్యాసము :** కామ్య కర్మలత్యాగము సన్న్యాసమనియు, మఱి కొందఱు కామ్యకర్మ ఫలత్యాగము సన్న్యాసమనియు చెప్పుదురు. కొందఱు యజ్ఞ, దానము, తపస్సులను పరిత్యజించరాదని చెప్పుదురు.

**సాత్త్విక :-** యజ్ఞము, తపస్సు, దానములు తప్పనిసరిగా ఆచరించవలయును, కర్మ

ఫలమును మాత్రము త్యాగము చేయవలయును. శాస్త్రవిహితముగాచేసి కర్మఫల త్యాగముచేయుటను సాత్త్విక త్యాగమని అందురు.

**రాజస:-**శారీరక క్లేశములకు భయపడు యజ్ఞము, తపస్సు, దానములను వదలుట రాజసత్యాగము అని చెప్పబడును.

**తామస:-** శాస్త్ర విహిత కర్మాచరణను వదలుట, మోహముతో వదలుట తామసత్యాగము అని చెప్పబడును.

**7. జ్ఞానము:**

**సాత్త్విక జ్ఞానము :-** సర్వ భూతములయందు - తనయందు గల ఆత్మను ఏకత్వముగా చూచునో ఆ జ్ఞానము సాత్త్వికము.

**రాజసిక జ్ఞానము :-** వేఱు వేఱని భావించుట.

**తామసిక జ్ఞానము:-** శాస్త్ర విరుద్ధమైనది, తత్త్వ విరుద్ధమైన జ్ఞానము.

**8. కర్మ**

**సాత్త్వికము :-** శాస్త్రవిహితమైనది , సంగరహితము, ఫలాపేక్ష లేనిది, రాగద్వేష రహితమైన కర్మ.

**రాజస :-** మిక్కిలి శ్రమగలది, అహంకారముతో చేయబడునది.

**తామస :-** నాశనమును, హింసను గలుగచేయునది. పౌరుషముతో ఫలితా ఫలితములను ఆలోచింపక చేయబడునది- మోహము (అజ్ఞానముతో ) చేయబడునది.

**9. కర్తా (కర్త) గుఱించి :-**

**సాత్త్విక :-** ముక్తసంగమము, అహంకారములేక ధృతి ఉత్సాహముతో గూడినవాడై సిద్ధి, అసిద్ధిలయందు నిర్వికారుడైనవాడు.

**రాజసిక :-** కర్మ ఫలమును కోరిన వారు లోభి, హర్షశోకాన్వితుడు, అశుచి, హింసా ప్రవృత్తి గలవాడు.



**తామసము :-** అయుక్తుడు, ప్రాకృతుడు, మూర్ఖుడు, శఠుడు, నిరంతరము విషాదములో ఉండువాడు, సోమరి, ఉపేక్షతో కాలము గడుపువాడు.

**10. బుద్ధి :**

**సాత్త్విక :-** ప్రవృత్తి నివృత్తి మార్గములను కర్తవ్య అకర్తవ్యములను భయము అభయములను, బంధము మోక్షములను యదార్థముగా ఎఱుగునది.

**రాజసిక :-** పైవాటిని యదార్థముగా తెలిసుకోలేని బుద్ధి

**తామసిక :-** అధర్మమును ధర్మముగానూ తలచి, ప్రతీది విపరీతముగా ఆలోచించునది.

**11. ధృతి :**

**సాత్త్విక :-** మనస్సు, ప్రాణము, ఇంద్రియములను నియమించి నిశ్చల ధ్యాన యోగము ద్వారా పరమాత్మను ధారణ చేయునది.

**రాజస :-** ధర్మ అర్థకామముల గుఱించి, కర్మ ఫలితము గుఱించి ఆలోచించునది.

**తామస :-** దుర్బుద్ధి, నిద్ర (మొద్దునిద్ర),అతి భయము, శోకము, దుఃఖము, మదము గలది.

**12. సుఖము :-**

**సాత్త్విక :-** ప్రారంభములో కష్టముగా నున్నను చివరలో అధిక సుఖమును గలుగ చేయునది.

**రాజసిక :-** విషయేంద్రియముల సుఖము. ఇది ప్రారంభములో సుఖము చివరకు అధిక కష్టము.

**తామసిక :-** నిద్ర, ఆలస్యము, తొందర పాటు వలన గలుగు సుఖము.

**కర్మకు కారణము :-** అధిష్ఠానము, సంకల్పము, కర్త( కర్తా ), వివిధ సాధనములు (కరణము), వివిధ చేష్టలు దైవము ఇవి కర్మకు కారణములు. కర్మకు మనస్సు, వాక్కు,శరీరములు హేతువులు. ఒక కార్యము సాఫల్యమగుటకు అధిష్ఠానము(శరీరము) కర్త(చేయువాడు) కరణము (వివిధ సాధనలు), వివిధ చేష్టలు, దైవము, అనే ఈ

ఐదు కారణములు. ఆత్మ కర్త కాదు. కర్మకు తను కర్తను గానని భావించిన వానికి కర్మఫలితము అంటదు.

**కర్మ ప్రేరణము :-** జ్ఞాత (తెలుసుకొనువాడు) జ్ఞానము, జ్ఞేయము( తెలిసికొనదగిన వస్తువు)

**కర్మ సంగ్రహము :-** కర్త, కరణము, కర్మ,

*****



## దేహ విచారణ

**దేహము:** అపరా ప్రకృతి వలన దేహము ఏర్పడును. దేహమును స్థూల దేహము, సూక్ష్మ శరీరము అని రెండుగా భేదమును చెప్పి కొందఱు దేహ విచారణ చేయుదురు. కొందఱు అన్నమయ కోశము, ప్రాణమయ కోశము, మనోమయ కోశము, విజ్ఞానమయ కోశము, ఆనందమయ కోశముగా వర్ణించి దేహ విచారణ చేయుదురు. కొందఱు కర్మేంద్రియములు, జ్ఞానేంద్రియములు, విషయేంద్రియములు, ప్రాణేంద్రియములు, అంతఃకరణ చతుష్టయము, అని 24 తత్త్వములుగా విభజించి దేహ విచారణ చేయుదురు. కొందఱు భూ తత్త్వము, జల తత్త్వము, అగ్ని తత్త్వము, వాయు తత్త్వము, ఆకాశ తత్త్వము అనే పంచ తత్త్వములు అహంకారము, మహత్తు, ప్రకృతిగా విభజించి దేహ విచారణ చేయుదురు. కొందఱు సప్త ద్వీపములగా దేహవిచారణ చేయుదురు. కొందఱు జీవుడు రథికుడని, శరీరము రథమని, బుద్ధి సారథి అని మనస్సు పగ్గమని, జ్ఞానేంద్రియములు గుఱ్ఱములని, జ్ఞానేంద్రియముల విషయములగు శబ్దస్పర్శరూపరసగంధాదులు గుఱ్ఱములయొక్క సంచార భూములని చెప్పి దేహ విచారణ చేయుదురు. దేహము జడము. ఇది ప్రకృతినుంచి జనియించును.

**స్థూల దేహము :-**

జీవేశ్వరులకు దేహ సంబంధము సృష్టిలో కానంబడుచుండును. ఈ స్థూల శరీరము పంచ భూతమయము. పాంచ భౌతికము. కర్మమూలము. పూర్వ జన్మంబున దేహి కర్మంబులు ఆచరించి కర్మ బద్ధుండై క్రమ్మఱ కర్మానురూపంబైన దేహము దాల్చును. అనగా పూర్వజన్మ కర్మవలన ఈ దేహము ఏర్పడుచున్నది. ప్రకృతి పురుష విచక్షణముగా వివేకముచే నింద, స్తుతి, సత్కార, తిరస్కార, నిమిత్తమునకై శరీరము కల్పించబడినది. ఈ దేహము అనిత్యము. నిత్యము కాదు. ఆద్యంతములు కలది. అనగా దేహము పుట్టి చనిపోవుచుండును. జరామరణములు కలిగి ఉండును. సత్త్వ, రజ తమో గుణమయము. జడము. ద్రవ్య, ప్రాణ, గుణాత్మకము. ద్రవ్య జ్ఞాన క్రియాత్మకము. కాల కర్మ గుణాధీనము, అహంకారాస్పదము. అతిమోహకలితము, సాంద్ర మమతాహంకార మూలము. శరీరము తోడ లావు, సన్నము(స్థౌల్య కార్శ్యములు) వ్యాధులు, నిద్ర, జాగరణములు, క్షుత్తృష్ణలు, మనోవ్యాధులు, రోష, ఇచ్ఛా, భయ, విరోధములు, అహంకార మమకార, మదశోషణములు, నేను, నాయది, అనియెడి వైషమ్యంబు భూతములకు

శరీరమునందు తోచు. దేవమాయంచేసి దేహాభిమానులైన మానవులకు పగవాడు, బంధుండు, ఉదాసీనుండు అను మోహము సిద్ధంబై ఉండు. గృహ దారాదులు దేహోత్పాతికములు. స్వామి భృత్య సంబంధము విధి కృతంబులగుచు వ్యవహారములను చేసి శరీరమునందు కలుగు. ఈ శరీరము పరుల రక్షింప సమర్థంబు కాదు. కలియక, పిండోత్పత్తి, పుట్టుక, బాల్య కౌమార, యౌవన, మధ్యవయసు, ముసలితనము మరణము, అనునవి స్థూల శరీరమునకు కలుగు అవస్థలు. దేహ ఆవిర్భావము జననము. దేహ నిరోధము మరణము. కర్మేంద్రియములు, జ్ఞానేంద్రియములు, శబ్దాది విషయములు, ప్రాణము, బుద్ధి మనస్సు, అహంకారము, చిత్తము, అనే (అంతఃకరణ చతుష్టయం) వీటి అన్నింటి కలయిక దేహము.

ఈ స్థూల దేహమునకు అధిపతి వైశ్వానరుడు. వైశ్వానరుడుగా పిలవబడే ఈ జీవుని స్థానము జాగ్రదావస్థ. ఇతడు బాహ్య విషయములనే గ్రహించును. బాహ్య విషయములను అనుభవించును. మహత్, అహంకారము, ఆకాశము, వాయువు, అగ్ని, జలము, భూమి అనే సప్త ఆవరణములు కలది ఈ స్థూల శరీరము. ఈ వైశ్వానరునకు 5 జ్ఞానేంద్రియములు, 5 కర్మేంద్రియములు, 5 ప్రాణములు, అంతఃకరణ చతుష్టయములయిన మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము అనే 4 వెరసి 19 ముఖములు.

కౌరవ సేనలోని ఏడుగురు ప్రముఖులు స్థూలదేహములోని జ్ఞానేంద్రియ, కర్మేంద్రియములలో ముఖ్యులుగా గ్రహించవలయును. వీరు నశించువారుకావున మహారథులనే పదప్రయోగము వీరికి చేయలేదు.

మానవ దేహము కలుగుట దుర్లభము. దానము, పరోపకారము, కీర్తి, కలిగి మానవుడు జీవించ వలయును. దేహము చేత, కీర్తి సుకృతంబులు ఆర్జింపనివాడు పాషాణాదుల కంటె కఠినుడు. దేహము ఉండగనే పుణ్య చరితుడై పాపము తొలగు విధమును ఆచరింపవలయును. పాప మూలము నశింప చేయవలయును. పాపాత్ముని శరీరమును నక్కలు కూడ ముట్టవు. సమరము నందుగాని యోగము నందుగాని శరీరమును వదల వలయును.



**కర్మేంద్రియములు :-** జ్ఞానేంద్రియముల ఆజ్ఞలను కర్మేంద్రియములు పాటించును. కర్మేంద్రియములలో వాక్కు, గుహ్యము ముఖ్యము. కావున సత్యము పలుకుట, మౌనము పాటించుటలు వాక్కుకు నియమములుగా చెప్పుదురు. ఆహారము వలన వీర్యము, తద్వారా గుహ్యము పనిచేయును కావున ఆహారము బ్రహ్మ చర్యము గుహ్యమునకు నియమములుగా చెప్పుదురు.

**జ్ఞానేంద్రియములు :-** జ్ఞానేంద్రియములు ఐదును శబ్ద, స్పర్శ, రూప, రస, గంధము అను విషయముల మీద ప్రసరించును. జ్ఞానేంద్రియములు పదార్థభేద గ్రాహకములు. కన్ను జ్ఞానేంద్రియములలో ముఖ్యము. సకల విషయ జ్ఞానము కలుగుటకు చక్షురింద్రియము సాధనము. ఇంద్రియ లోలత్వమున జ్ఞానము నశించును. షడింద్రియములలో నొకటి యందు తత్పరులై ఇచ్ఛాపూరణ విధానంబుల చరితార్థులమైతిమనువారు ధారణాభ్యాస సమాధి యోగంబులను సాధింపలేరు. ఇంద్రియములు ఆత్మను దర్శింపలేవు. పరమ యోగికైన బలిమిని ఇంద్రియ కామమధికపీడ కలుగచేయును. ఇంద్రియములు ఈశ్వర విషయములయిన, మనస్సు నిశ్చలముగా ఉన్నా, గుణములు పోవును. ఇంద్రియజయము ఉన్న వారికి మౌనవ్రతము, జపము, తపము, శ్రుతము, అధ్యయనము, నిజధర్మ వ్యాఖ్యానము విజనస్థల నివాసము, సమాధులు మొదలగునవి మోక్ష హేతువులు.

ఇంద్రియజయము లేనివారికి ఇవి భోగార్థంబులు. **డాంబికులకు జీవనోపాయంబులు.** విశ్రమించు వారికి వార్తా కరంబులై యుండుగాని సఫలములు కావు. కావున జ్ఞానేంద్రియములను వాటివాటి, విషయములపై ప్రసరించకుండ ఉంచవలయును.

**ప్రాణము:-** ఆత్మను ప్రాణ రూపమున గ్రహించవలయును. ఆత్మయొక్క ఛాయ ప్రాణము. ఆత్మ లక్షణములు, ప్రాణ లక్షణములు ఒకటి కావు. శరీరములో గల ఇంద్రియాదుల కంటే ప్రాణము శ్రేష్ఠము. శరీర వ్యాపారము ప్రాణముపై ఆధారపడి యున్నది. ప్రాణము శరీరమునందు, నఖ శిఖ పర్యంతము వ్యాపించి ఉండును. ముఖ్య ప్రాణము తనని తను - ప్రాణము, అపానము, వ్యానము, సమానము,

ఉదానము అను ఐదు విధములుగా విభజించుకొని శరీరములో ఉన్నది.

**స్థానములు :-** ప్రాణము - కన్నులు, చేవులు, నోరు, ముక్కులలో ఉండును.
అపానము - గుద స్థానమున ఉండును.
సమానము - నాభి స్థానము ఉండును.
వ్యానము - 101 నాడులలో సుషుమ్నానాడి తప్ప మిగిలిన 100 నాడులలో ఉండును.
ఉదానము - సుషుమ్నానాడిలో ఉండును.

**చేయుపనులు :-** ప్రాణము - ఆకలి, దప్పికలను గలుగ చేయును.
సమానము - ఆహారమును పచనముచేసి శరీరభాగములకు సమానముగా పంచును.
అపానము - మలమూత్రములను విసర్జించును.
వ్యానము - శరీరమునకు చలి, వేడిని తెలియజేయును.
ఉదానము - జీవునుని సుషుప్తి అవస్థకు చేర్చును.

దృష్టిని భ్రూమధ్యమున నిలుపుట వలన ప్రాణము వశమగును.

**అంతఃకరణ చతుష్టయము :-** అంతఃకరణ చతుష్టయము సకల పదార్థ పరిజ్ఞాన కారణము. జాగ్రత్, స్వప్న అవస్థలలో అంతఃకరణము కలదు. సుషిప్తి కాలమున అంతఃకరణము లేనిదగును. ద్రష్టయైన ఆత్మకు దృశ్యంబైన యింద్రియార్థములు అనువీటికి అహంకారము సంబంధంబగుటంచేసి అంతర బాహ్య గుణంబులు, గుణముల చర్య వలన అంతః కరణంబున దృశ్యము గలుగుచుండు. కావున అంతఃకరణంబు విలయంబు నొందిన బాహ్య అంతర భేదంబు కానకుండుట నిశ్చయము. అభావంబున దృశ్య భేదంబు లేదు. అంతఃకరణమును భక్తిచే శుద్ధి చేసుకొనవలయును.

**అహంకారము:-** శోక, హర్ష, భయ, క్రోధ, లోభ, మోహ, స్పృహ ఇవి అహంకారమునకు చెందినవి. అహంకారము బంధహేతువు. అహంకారము పోవుటకు శాస్త్రార్థ విచారము, భక్తి, జ్ఞానము అవసరము. అహంకారము ఆత్మజ్ఞానంబున నశించినప్పుడే నిర్మలంబై పరమాత్మ తోచును.



**చిత్తము - లక్షణములు :-** చిత్తము ధర్మాధర్మ వాసనాయుతము. విషయానురక్తము. ధర్మ నిరతులైన వారి చిత్తములు కూడ చంచలములు. అనవరతము జీవునకు ఇది ప్రత్యక్షమగును. చిత్తము స్థూల, సూక్ష్మ ,రూపమున ఉండు.

| | | |
|---|---|---|
| చిత్తము,ఇంద్రియములు | = | చిత్తము ఇంద్రియములను దండించి మరల కామాదులకు చోటిచ్చును. |
| చిత్తము, మనస్సు | = | చిత్తము కామాదులను మనస్సును ఉద్రేకింపచేయును. |
| చిత్తము, విషయములు | = | చిత్తము విషయములను చింతించిన రజోగుణము నందుండి ధర్మ, జ్ఞాన, వైరాగ్యముల నుండి విముఖురాలగును. |
| చిత్తము, గుణములు | = | పురుషుని చిత్తము గుణంబులు చెంది ఎంతకాలముండునో అంతకాలము విజ్ఞాన కర్మేంద్రియంబులచేత మరగి ధర్మము అధర్మముగా కన్పట్టును. |

సత్త్వగుణముచే చిత్తము శాంతమైనప్పుడు ధర్మజ్ఞాన వైరాగ్య సర్వశక్తులు గలుగును. చిత్తము రోష కలితమైన అజ్ఞాన కలితమగును. మార్గము తప్పి వర్తించును. చిత్తము గుణ ప్రవాహంబుల చేత వికారము నొందును.

| | | |
|---|---|---|
| చిత్తము | - | చెడ్డది. అంగనాసక్త చిత్తము చెడ్డది. |
| చిత్తము | - | మంచిది. అంబుజోదర దివ్యపాదార వింద చిత్తము యితర విషయములను చేరదు. |
| అద్వైతాను సంధానము | - | బ్రహ్మచారి, యతి, గృహస్థులందెవ్వడైన చిత్తము పరిపక్వము గాక అద్వైతాను సంధానము చేసిన మూఢుండగు. |
| చిత్తము - సంసారము | - | చిత్తంబెంత కాలము విషయాసక్తంబగు |

అంతతడువు సంసార చక్రమున జీవుడు సంచరించు. చిత్తము సంసారమందుండగా తత్త్వ యోగము తెలియలేము. కుటుంబ సంగమంబున చిత్త చాంచల్యము అగును. ఎంత జితేంద్రియుడయినను, ఎంత శాంతులయినను ఏకాంతమున స్త్రీలతో నున్న చిత్త చలనము గలుగును. చిత్తము గుణప్రవాహంబులచే వికారమునొంది దేవ తిర్యక్ మనుష్య రూపంబులయిన దేహంబులను పొందును. కాలప్రాప్తంబులయిన సుఖదుఃఖ ఫలములను అనుభవించును.

**చిత్తము - బంధము :** - చిత్తము యింద్రియార్థసంగంబయిన జీవునికి బంధ కారణము. చిత్తము త్రిగుణాసక్తంబయిన బంధము.

**చిత్తము - మోక్షము:** - చిత్తము యింద్రియార్థముల తగులక యుండవలయును. చిత్తము సద్విషయంబైన అంతఃకరణ సంయమన హేతు భూతంబగుచు సాధు జనులకు మోక్ష ద్వారంబగు(హరిద్వారము). గుణ రహితంబైన ముక్తి కారణము. చిత్తము నారాయణాసక్తంబయిన మోక్షము. కామాదులచే వేధింపబడక ప్రశాంత వృత్తంబయిన చిత్తము బ్రహ్మ సుఖ సమ్మర్శనంబున లీనమై తిరిగి నెగయ నేరదు.

**చిత్తము -యోగము :-** ఈశ్వరునిని చిత్తమునందు నిలుపవలయును. యోగాభ్యాసమున చిత్తము కట్టెలేని అగ్ని వలె శాంతిని పొందును.

**చిత్తము -భక్తి :-** భక్తియుతంబైన చిత్తము నింద్రియ వృత్తులచే సమంబగు అర్థము నందు వైషమ్యంబును, ప్రియా ప్రియులు లేక నిస్సంగంబును, సమదర్శనమును, హేయోపాదేయ విరహితంబునై ఆరూఢంబైన ఆత్మపదంబు ఆత్మచే చూచుచుండును. భక్తి కలుగ రజ, స్తమో, గుణ, ప్రభూతంబైన కామలోభాదులకు, చిత్తము వశము గాక, సత్త్వ గుణంబున ప్రసన్నంబగు. ప్రసన్నమనస్కుండైన ముక్తసంగుడగు. ముక్తసంగుండైన ఈశ్వర తత్త్వ జ్ఞానంబు కలుగు. ఈశ్వర దర్శనము వలన అజ్ఞాన రూపమయిన అహంకారము నశించును. అహంకారము నశించగానే సంశయములు తొలగిపోవును. సంశయములు నశించగనే కర్మ నశించును. చిత్తము, అహంకార, మమకార రూపాభిమాన జాతంబులగు కామలోభాది కలుష వ్రాతంబుల చేత నెప్పుడు విడివడి పరిశుద్ధయగు అప్పుడు సుఖదుఃఖ వివర్జితంబు నేకరూపంబునై ప్రకృతి కంటె పరుండునైన



పరమాత్మను జ్ఞాన వైరాగ్యభక్తి యుక్తంబగు మనంబు చేత బొడగందురు. నిజధర్మ పరిశోభితంబైన ఏకాగ్ర చిత్తమున పరమాత్మను సేవింప వలయును. భక్తియుతమగు చిత్తంబు భవ్యమగును. చిత్తమును భక్తితో పరమాత్మ యందు లగ్నము చేసిన వారికి ఈ జన్మలోనే మోక్షంబు సిద్ధించు.

**బుద్ధి - లక్షణములు :**

1. ద్రవ్య ప్రకాశకంబైన జ్ఞానము, 2. ఇంద్రియానుగ్రహము 3.సంశయము 4.మిథ్యాజ్ఞానము, 5. ఇంద్రియ నిశ్చయంబు 6. స్మృతి అను ఈ ఆఱు బుద్ధి లక్షణములు.

బుద్ధిని దేహాత్మానుసంధానంబు చేసిన, కర్మబంధ,దుఃఖాదికములు అనుభవించు. మాయ చేత, వాడు, తాను అనియెడి బుద్ధి వికల్పంబై తోచును. విషమ బుద్ధి చేత నేను, నీవు, నాకు, నీకు అని వచియించుచున్నవాడు అధర్మ నిరతుడై క్షీణించుచుండు. కావున పుట్టని, చావని త్రోవ వెదకు కొనుట దొడ్డబుద్ధి. కపట నిర్ముక్తులై కాంక్ష సేయక ఉండుట మహత్తత్త్వ బుద్ధి. ఆత్మాశ్రయంబైన బుద్ధి ఆత్మయందున్న ఆనందాదుల తోడ కూడును.

మనస్సు :- ప్రాణము, ఆత్మవలన శరీరములోనికి వచ్చును. మనస్సు, వాక్కు, కాయములలో మనస్సు ప్రధానము.

మనస్సు యొక్క లక్షణములు :- చంచలము, మనస్సు అన్నమయము, ప్రాణాధీనవృత్తి మనస్సు.

మనస్సు - ఇంద్రియములు :- ఇంద్రియములకు విషయజ్ఞానము కలుగుటకు మనస్సు కారణము. వాయువు పూల సుగంధమును గ్రహించినట్లు జీవుడు శరీరమును పొందగనే మనస్సు ఇంద్రియముల ద్వారా ఇంద్రియార్థములను గ్రహించును. ఇంద్రియంబుల చేత మనస్సు విషయ ఆసక్తి తగిలి అంతర్విచార సామర్థ్యంబు కోల్పోవును. స్మృతి నశించు. విజ్ఞానము తొలగు. ఆత్మ నాశనము అగును.

మనస్సు - గుణములు :- మనస్సు రజో గుణములైన కామ, క్రోధాదులతో కలసి ఉండును. బంధనములోకెల్ల ముఖ్యమైనది కామము. భోగము వలన కామము పోదు.

కామమును జయింపవలయును.

మనస్సు - కర్మ : - పూర్వ జన్మ కర్మరాశికి అనుచరమై బహు వికారమై మనస్సు పనిచేయును. కర్మంబులచేత ధ్యానము చేయుచుండు మనంబు నానా కర్మంబులయందు తిరుగుచుండును.

మనస్సు - జన్మ :- మనస్సే జన్మకు కారణము. మనస్సు గుణ కర్మానుబంధంబైన జన్మాదులను పుట్టించును. అభిమానంబునంకూడి మనంబు జీవునికి అసంఖ్యాక జన్మంబులం బొందించును. అభిమానము, ఏకాదశ వృత్తులను కూడిన మనంబు జీవునికి అనేక జన్మంబులను కలుగచేయును. మనస్సు పురుషులకు శుభాశుభ నిమిత్తంబైన పూర్వా పర దేహంబులం ప్రకాశింపచేయుచుండు. ఈ లోకము నిస్సారమని ఎవరు భావింతురో వారి మనస్సుకు సుఖ దుఃఖములు ఉండవు. సుఖ దుఃఖములను మనస్సు గుణములతో కలసి సృజియించుచున్నది. సాక్షిగా ఉండవలసిన జీవుడు మనస్సుతో సంయోగము చెందుచున్నాడు. హరిచరణకమలములందు మనః ప్రధానుండైన పురుషుండు ఒకవేళ సాధనలో విఘ్నములు కలిగినను పూర్వ మార్గమైన సాధనను వీడడు. నిఖిల భూత అంతరాత్ముడైన భగవంతుని యందు భూతగణము నందు అతి భేద దృష్టిగలవారికి, వైరానుబంధ నిరతులగు వారికి, మనస్సులో శాంతి కలుగదు.

మనస్సు -మోక్షము :- మనస్సు గుణ కర్మంబులం బాసెనేని పరతత్త్వము నొందు. మనో వృత్తుల నతిక్రమించిన జీవుడు పరంజ్యోతి అయిన నారాయణ స్వరూపుడు కావున నిర్మలమైన మనంబు చేత ఆత్మగతి వెతకి ధ్రువంబైన పదవినొంద వలయును. మనోగతులు పరమాత్మను చెందిన అవి ఫలించును.

మరణము :- స్థూల దేహమునుండి జీవుడు నిష్క్రమించుటయే మరణము. మానవుడు చినిగిపోయిన వస్త్రములను వదలి నూతన వస్త్రములను ధరియించునట్లు జీవుడు ఈ స్థూల దేహమును వదలి లింగ శరీరము నశించనంత వఱకు అతని కర్మానుసారము అనేక దేహములను ధరియించు చుండును. మరణానంతరము మానవులు తమ బంధు వర్గములను చూడజాలరు. మరణించిన వారి ముఖములు సాధారణముగా చాలా వికృతముగా ఉండును. ప్రతి ప్రాణికి ఏదో ఒక నిమిత్తము



లేకుండా మరణము రాదు. అకాలములో మృత్యువు పురుషులకు గాని, స్త్రీలకు గాని దుర్లభము.

**సూక్ష్మ శరీరము:-** సూక్ష్మ శరీరమునకు అధిపతి తైజసుడు. ఈ స్థూల దేహమునకు సూక్ష్మ దేహమునకు వలె సప్త ఆవరణలు. మఱియు స్థూల దేహమునకు వలె 19ముఖములు. కాని స్థూల దేహముకంటె సూక్ష్మదేహము విశిష్టమైనది. పాండవ సేనలోని 19 మంది వీరులు సూక్ష్మ శరీరములోని 19 మందిగా గ్రహించవలయును. స్థూలశరీరము నశించినా సూక్ష్మ శరీరము నశింపదు. కావున ఈ19 మందిని సర్వయేవ మహారథాః అని చెప్పినారు.

**లింగ శరీరము:-** ఈ లింగ శరీరమునకు అధిపతి ప్రాజ్ఞుడు. లింగ శరీరము నశించిన జీవుడు ఈశ్వరుడగును. లింగ శరీరము త్రిగుణాత్మకము. జీవుడు గుణసంగమంబున తనకు సంసారోపాధియైన లింగశరీరము దాల్చును. మనః ప్రధానంబైన లింగశరీరమునకే కర్తృత్వంబు ఉపపన్నంబగు. పురుషుండు లింగశరీరమునజేసి కర్మంబులాచరించు. లింగదేహము ఎంత తడవు ఉండు అంత తడవును మనంబు కర్మ వశంబై జ్ఞానవంతముగాక అవిద్య బాయకుండు. అజ్ఞాన బంధకమగు లింగశరీరమును అతి సూక్ష్మ బుద్ధిచే తెలియకున్న మోక్షములేదు. దేహము నశింపగా ఇందులో దేహి ఈ దేహమును వీడి కర్మ ఫలితమును అనుభవించి తిరిగి కర్మానుసారము భూలోకమున జన్మించును.

**నాడులు:-**

సూక్ష్మ శరీరములో 101 నాడులు కలవు. అందు సుషుమ్నానాడి ముఖ్యము.
మిగిలిన 100 నాడులలో 14 నాడులు ముఖ్యము.
నాడులు - శంకరాచార్యుల ప్రకారము నాడులు 101. అవి ఒక్కొక్కటి నూఱు భాగములు అయినవి. 101 x 100 = 10100
అవి మఱల ఒక్కొక్కటి 72,000 (72 వేలు అయినవి)
10,100 x 72,000 = 72,72,00,000

| కావున | 72,72,00,000 |
|---|---|
| | 10,101 |
| | 101 |
| | 72,72,10,201 = 72.7 కోట్లు |

వ్యాసభగవానుని ప్రకారము 76 కోట్ల 20 లక్షలు.
బ్రహ్మవిద్యా సంప్రదాయము ప్రకారము - 518.4 కోట్లు
వాల్మీకి ప్రకారము - అసంఖ్యాకము
వీటిని అంకెల ద్వారా కాక అసంఖ్యాకము అని గ్రహించవలయును.

ఈ 100 నాడులనే అప్సరసలు అని అందురు. ఈ అప్సరసలు యోగ విఘ్నమును గలుగచేయుదురు. అనగా సుషుమ్నానాడి తప్ప మిగిలిన నాడుల వలన అమృతత్త్వమును పొందలేము.

యోగములో కొంత స్థాయికి వచ్చిన తరువాత సూక్ష్మ శరీరములో ఆకాశములో మెఱుపుల వలె ఇవి లోచూపులో కనబడును. ఈ స్థాయిలో కామ క్రోదములు ఎక్కువగును. వాల్మీకి మహర్షి ఈ నాడీ ప్రస్తారములో కొంత భాగము దండకారణ్యమని ఆపై భాగమును చిత్రకూటమని విభజించి సాధన రహస్యములను అందించిరి. పంపాసరస్సు నుండి చిత్రకూటము వఱకు రాక్షసమయము.

*****



# దేహి - అవస్థలు

దేహికి జాగ్రత్, స్వప్న, సుషుప్తి అను అవస్థలు కలవు.

**జాగ్రదావస్థ :-** ఈ అవస్థలో జీవునిని **వైశ్వానరుడు** అని పిలిచెదరు. సృష్ట్యాది యందున్న ఆత్మయే జీవాత్మగా శరీరములో ప్రవేశించి ఆత్మ వలన కలిగిన మాయచే మాయా మోహితుడై జాగ్రతావస్థలో స్థూల దేహముతో అన్నపానాదులు, అనేక భోగములు, స్త్రీ సంభోగాదులు మొదలయిన సర్వ కార్యములు చేయుచున్నాడు. పుణ్య పాప యుతమయిన కర్మలు చేయుట వలన ఆ జీవుడే జాగ్రతావస్థలో సుఖదుఃఖములను అనుభవించుచున్నాడు. జాగ్రతావస్థలో జీవుడు దైవ సంబంధంబైన మాయ వలన భిన్న దర్శనుండగు.

అయస్కాంత సన్నిధానమున ఇనుము కదలునట్లు హృదయగుహలోని ఆత్మ యొక్క సన్నిధానమున జీవుడు, దేహము పనిచేయును. జీవాత్మ మణిగణంబుల చొచ్చియున్న సూత్రంబు చందంబున ఈ శరీరములోని అన్నిటియందు అనగా ఆపాదతల మస్తకము చొచ్చి దీపించు. సాక్షిత్వమున ఈ దేహమున ఆత్మ కూడియుండు. అనగా జీవాత్మగా శరీరమంతటనూ మమేకమై ఉండును. ఈ స్థితిలో దేహము వేఱు ఆత్మ వేఱు అని చెప్పుట పొసగదు. కావుననే భీష్ముని బాణములకు శరీరము బాధపడగా శ్రీకృష్ణుడు చక్రమును చేబూని భీష్ముని పైకి లంఘించినాడు. దేహి దేహము వేఱు వేఱు అయిననూ, దేహి దేహ సంబంధము కలిగి ఉండును. పాము కుబుసమును విడుచునట్లు సాధన చేసి దేహి దేహమునుండి విడివడి స్వస్వరూపమును పొందవలయును.

**స్వప్నావస్థ :-** జాగ్రతావస్థలోని ఈజీవుడే తన మాయచే కల్పింపబడిన జీవలోకమయిన స్వప్నమందు సూక్ష్మ శరీరముతో సుఖదుఃఖములను అనుభవించును. స్వప్నావస్థలోని జీవునిని **తైజసుడు** అని అందురు. కలలో ఇంతకు పూర్వము చూచిన ప్రదేశములను మరల చూచును. ఇంతకు పూర్వము చూడని వాటిని కూడా చూచును. స్వప్నావస్థయందు లింగశరీరాదిష్ఠాతయైన జీవుండు దేహాభిమానంబు విడచి అట్టిది కాని అట్టిదియైన శరీరాంతరంబు నొందు. మనంబునందు సంస్కార రూపంబున కలలు కనును.

**సుషుప్తి అవస్థ :-** నిద్రించునప్పుడు కోరికలు, స్వప్నావస్థ లేని స్థితి సుషుప్తి . గాఢ

నిద్రనే సుషుప్తి అవస్థ అని అందురు. సూక్ష్మ శరీరములో సుషుప్తి అవస్థలో ఉన్న జీవునిని **ప్రాజ్ఞుడు** అని పిలచెదరు. ఈ స్థితిలో దేహ ధ్యాస ఉండదు గాన శరీరమునకు సంబంధించిన విషయములు చెప్పలేదు. ఈ స్థితిలో సకలము విలీనమై అనగా సుఖదుఃఖములు రెండు లేకుండా కేవలము ఆనందమునే అనుభవించును. సుషుప్తి అవస్థయందు సర్వము లీనంబగుటం చేసి సంజ్ఞా మాత్రుండును అవ్యక్తుండునుగానుండు. సుషుప్తి సమయంబున తాను నిస్తంద్రుండగుచు నితరంబు చేత గప్పబడనివాడై పరమాత్మానుభవంబు సేయు. జీవుండు సుషుప్త్యాద్యవస్థల యందు పరమాత్మానుసక్తుండైన భూతాది తత్త్వంబులు లీనంబులై ప్రకృతి యందు వాసనామాత్రము గలిగి అకార్య కారణములుగానున్న నితరంబు చేత గప్పబడని వాడై పరమాత్మాను భవంబు సేయు.

ఈమూడు అవస్థలు కాని అవస్థగా యోగములో తురీయావస్థను చెప్పుదురు. దేహాంతర ప్రాప్తికూడా ఒక అవస్థగా చెప్పుదురు.

*****



## జీవుని యొక్క విచారణ

జీవులలోని తారతమ్యములు :

అచేతన దేహముల కంటె - చేతన దేహము గలవి శ్రేష్ఠము
వీటికంటె - అందు ప్రాణవంతముగల స్పర్శనజ్ఞానము గల, చైతన్యవృక్షము శ్రేష్ఠము.
వీటికంటె - రసజ్ఞానసంకలితములగు చేతనములు
వీటికంటె - గంధజ్ఞాన కలిత చేతనములు
వీటికంటె - శబ్ద జ్ఞాన కలిత చేతనములు
వీటికంటె - వాయుసాదులు శ్రేష్ఠములు
వీటికంటె - బహు పాదములు గలవి
వీటికంటె - చతుస్పాదులు శ్రేష్ఠములు
వీటికంటె - మనుజులు
వీరికంటె - బ్రాహ్మణులు
వీరికంటె - వేదవేత్తలు
వీరికంటె - వేదార్థ విదులు
వీరికంటె - శాస్త్ర సంశయము మాన్పు మీమాంసకులు
వీరికంటె - నిజధర్మవిజ్ఞాన నిపుణులు
వీరికంటె - సంగవర్జితులు
వీరికంటె - సద్ధర్మపరులు
వీరికంటె - సకల ధర్మములు విడచి భగవంతుని సేవించువారు శ్రేష్ఠులు.

స్థావర జంగమంబులయిన జీవులకు ఈశ్వరుడు సర్వ భూతాంతర్యామి యగుచు జీవరూపంబుననుండు.

**జీవుడు : అరూపుడు, చిదాత్మకుండు.** జీవుడు, ఈశ్వరుడు బింబ ప్రతిబింబములని కొందఱి అభిప్రాయము. జీవుడు ఈశ్వరుని యొక్క అంశ అని కొందఱి అభిప్రాయము. సృష్ట్యాది యందున్న ఆత్మ తనని తాను జీవునిగా, ప్రకృతిగా, కాలము, కర్మగా విభజించుకొనినది అని కొందఱి అభిప్రాయము. జీవేశ్వరులిద్దఱు

ఒకేచెట్టు అనే దేహమును ఆశ్రయించుకొని ఉన్న సమాన వయస్కులని, జీవుడు సుఖ దుఃఖములను అనుభవించుచున్నాడని, ఈశ్వరుడు సాక్షీమాత్రుడుగా ఉన్నాడని కొందఱి అభిప్రాయము. ఈశ్వరుడు నియంత. జీవుడు అతని ఆజ్ఞకు లోబడి వర్తించునని కొందఱి అభిప్రాయము. ఈశ్వరుడు రాజు. జీవుడు యువరాజు అని కొందరి అభిప్రాయము. సమస్త జనంబును జీవరూపంబున ధ్రువంబును దేహరూపంబున అధ్రువంబై ఉండు. మఱియొక పక్షమున ధ్రువంబును, అధ్రువంబును గాక ఉండు. శుద్ధ బ్రహ్మ స్వరూపంబున అనిర్వచనీయంబున రెండునై ఉండు అని కొందరి అభిప్రాయము.

లింగ శరీరము అధిష్ఠించి చేతనాయుక్తుండయిన వాడు జీవుండు అని చెప్పబడును.

**జీవుడు - స్త్రీత్వము :- పురుష రూపమునొందిన జీవుండు నిరంతర స్త్రీ సంగంబుచే విత్తాపత్యగృహాది ప్రదంబగు స్త్రీత్వంబు నొందు.** (భాగవతము, మూడవ స్కంధము, 1012). అంగనారూపుండగు జీవుండు ఆత్మబంధ కారణంబగు మృత్యువును ఎఱుగలేడు. ఇట్టి స్త్రీలు ఆధ్యాత్మిక విషయములు గ్రహించుటకు, సాధనకు అనర్హులు అనగా ఎవడు మగవాడుగా పుట్టి సంసార తాపత్రయములను పొంది స్త్రీత్వమున ఉండునో అట్టివాడు ఈశ్వరార్చనకు యోగ్యుడు కాడు అన్నది సద్గురువుల భావన. స్త్రీలు అయినా సంసార తాపత్రయములను వీడినచో శివపూజకు అర్హులు.

**జీవుడు - సామాన్య లక్షణములు :-** ప్రాణులకు ద్రవ్యాగార సుహృన్నిమిత్తంబయిన భయంబును, దన్నాశ నిమిత్తంబయిన శోకంబును, ద్రవ్యాది స్పృహయును, తన్నిమిత్తంబయిన అవమానము, తృష్ణ , ఆర్తి అనునవి సామాన్య లక్షణములు. జీవుడు స్వతంత్రుండు కాడు. జంత్రగాని చేతి జంత్రపు బొమ్మకైవడి ఈశ్వర తంత్ర పరాధీనుండై సుఖ దుఃఖములందు వర్తనంబులు సలుపు. ఈశ్వరాధీనుండై జీవుడు ప్రియాప్రియములను పొందును.

**జీవుడు - ప్రకృతి :-** జీవుని లక్షణములు వేఱు, ప్రకృతి లక్షణములు వేఱు. ప్రకృతి వలన జనియించిన గుణముల వలన జీవుడు మోహితుడై విజ్ఞానము లేక ప్రకృతి గుణములను తనయందు ఆరోపించుకొని సంసారబద్ధుండై ఉండును. గుణముల వలన కర్మలు చేయుచు ఆ కర్మవాసనల చేత జన్మ పరంపరలలో చిక్కుకొనును.



**జీవుడు - అవిద్య :-** అవిద్యోపాధి అయిన జీవుండు తమో గుణయుక్తుండై ప్రాచీన కర్మంబుల చేత నేర్పడిన వర్తమాన దేహము నేనని తలంచుచుండి నష్ట జన్మ స్మృతి గలవాడై పూర్వాపరంబు లెఱుంగజాలడు. అవిద్యతోడ ఎంత తడవు వికల్పంబుతోచునంతతడవు భ్రమయు తోచు. అవిద్యానివృత్తియైన సర్వమును మిథ్యయగును. శాస్త్ర నిషేధములు కలలోపల మేలు గన్న తెఱంగగు. అవిద్యా కర్మ నిర్మితంబైన జీవుడు దక్షిణాయన, ఉత్తరాయణ, జ్యోతిర్మార్గములలో దేహత్యాగానంతరము పయనించును. అవిద్య వలన ఈ దేహము నేను అని తలచుచు నష్ట స్మృతి కలవాడై పూర్వాపరములు ఎఱుంగజాలడు. అవిద్య వలన జీవుడు సంసార బద్ధుడై త్రివిధ క్లేశములను అనుభవించుచున్నాడు. దేహసంబంధీకులయందు మోహము కలిగి ఉన్నాడు.

**జీవుడు - దేహము :-** అరూపుడు చిదాత్మకుండయి పరగు జీవునకు పరమేశ్వర మాయాగుణంబులైన మహదాది రూపంబుల చేత ఆత్మ స్థానముగా విరచితంబైన స్థూలశరీరము ద్రష్ట యగు ఆత్మయందు దృశ్యమై బుద్ధిమంతులు గాని వారిచేత ఆరోపింపబడు. ఈ స్థూల రూపంబుకంటె అదృష్ట గుణంబై యశ్రుతంబైన వస్తువగుటం చేసి వ్యక్తంబుగాక సూక్ష్మంబై కరచరణాదులు లేక నొండొక రూపము జీవునికి విరచితంబైనుండు. సూక్ష్ముడయిన జీవుని వలన నుత్క్రాంతి గమనాగమనంబులు తోచు. జల ఘటాదులందు గాలికి సూర్య చంద్రులు కదలినట్లు రాగ కలితుడగుచు కర్మ నిర్మితాంగంబుల ప్రాణి కదలుచుండును. సుజ్ఞాన స్వరూపుడగు ఆత్మకు ఈశ్వర మాయ వలన దేహ సంబంధము గలుగుచున్నది. జీవుడు అవిద్యా మహిమం చేసి కర్మాను గతంబయిన మిథ్యారూప దేహ సంబంధుడు. జీవుడు దేహమునకు వేత్రై, ముఖ్యుడై, ఇంద్రియవంతుడై, భూత పంచ కేంద్రియమనో లింగ శరీరములను లీల కూడును. దేహము చెడు గాని దేహి చెడడు. పూర్వ కర్మ వశమున నొక వేళ వర్తించు, దీపించు, తొలగి పోవు, కర్మ యోగము ఎంత కాలముండునో అంత వఱకు జీవుడు ఈదేహమందుండును. పురుషుడు దేహములో పూర్వ జన్మ కర్మ వశమున ఉండును. కాలమయిన వెడలి పోవును. స్థూల దేహ సంబంధము జీవునికి లింగ శరీర భంగ పర్యంతము గలుగుచుండును. దేహి సుఖము కొఱకు దేహమును కోరును. కావున దేహమును విడువ లేడు. దేహి దేహము కొఱకు భోగంబుల నపేక్షించు. దేహము పరమ సుఖముగా వర్తించు. లింగ శరీరమునకే కర్తృత్వము.

**జీవుడు-కర్మ :** పూర్వ జన్మ కర్మ వలన దేహియై పుట్టుచుండు. దేహి పూర్వ జన్మ కర్మ ఫలమును అనుభవించును. కాల కర్మ వశమున సుఖదుఃఖములను పొందును. పూర్వ భవ కర్మాధీనమై ప్రాణులు కీడును మేలును చెందును. దేహి తన కర్మానుసారము అనేక జన్మలను పొందును.

**దేహ సంబంధీకులు :-** కర్మానుబంధము వలన దేహ సంబంధీకులగు తల్లి తండ్రులు, భార్య, సుతుడు, భర్త, మొదలయినవారు గలుగుదురు. అటులనే విడిపోవుదురు. ఉదాహరణకు చలి వేంద్రమున బాటసారులు కలియునట్లు సంసారమున కర్మ సంబంధులైవచ్చి ఆలు బిడ్డలు మగండనుచు గూడియుండుట గాని సంయోగంబు నిత్యంబు కాదు. పూర్వ జన్మ కర్మానుసారము పుట్టుచున్న నరునకు పత్ని, బంధు, శత్రు మిత్ర ఉదాసీనత్వము లెక్కడివి? పుత్ర మిత్రాదులు పూర్వ జన్మంబున నెవ్వరివారలో యెఱుగ లేము కదా. అన్యజన సంగమంబు జన్మ పరంపరలకు కారణము. అజ్ఞానము చేత వివేకము కప్పబడి జీవుడు మోహము నొందుచున్నాడు. కామము విడచిన పురుషుండు సుఖపడును. ప్రకృతి నుంచి జనించిన త్రిగుణములు దేహిని దేహమున బంధించుచున్నవి.

**జీవుడు - గుణములు :-** అజ్ఞాని సత్త్వరజస్తమో గుణములు గలిగియుండు. అట్టి వానికి గుణమయంబులయిన ఇంద్రియాదులే ఆత్మయనితోచు. కావున వాడు ఆగుణంబుల చేత బద్ధుండు. జీవునకు అవిద్యా మహిమంచేసి కర్మ బంధనాది క్లేశంబును సంప్రాప్తంబగు. పూర్వ జన్మ కర్మాను సారము గలిగిన దేహమందుండి ఇంద్రియములచే చేయబడిన కర్మకు తనే కర్తనని భావించి బద్ధుడగుచున్నాడు.

**జీవుడు - బంధము :-** ద్రవ్యంబులయిన మహభూతంబును, జ్ఞానమూర్తులయిన దేవతలును, క్రియారూపంబులయిన ఇంద్రియములును ఆశ్రయంబుగా నిత్యముక్తుడయ్యును మాయా సమన్వితములై జీవుని బంధించుచున్నవి.

**జీవుడు- సుఖ దుఃఖములు :-** ఆత్మతత్త్వం బెఱుంగకుండుట చేసి దేహికి దుః ఖము అధికంబై యుండు. దేహ సంయోగంబున ద్వంద్వాది సుఖదుఃఖములు ఆత్మయందు అజ్ఞానంబున భేదంబు సేయంబడియె. ప్రాచీన కర్మంబులం ప్రాప్తంబైన సంసార చక్రంబు చేత అజ్ఞాన మోహితులై తిరుగుచున్న జంతువులకు సుఖ దుఃఖములు నైజంబులై ప్రవర్తిల్లు, సుఖ దుఃఖములకు లోనైన పురుషులకు శమము దుర్గమము. సుఖదుఃఖములలో ఏది దైవవశమున చేకూరు దానిని గ్రహించి సంతుష్టినొందువాడు విమలజ్ఞాని. వివేకంబు గల పురుషుండు తనకు సంప్రాప్తంబులగు దుఃఖములను దైవవశంబులుగా తలంచి తావన్మాత్రంబునం పరితుష్టుండగు. అవమానము, మానము లేని వివేకము గలిగినేని సుఖదుఃఖ ములుండవు. అవమాన మానములు బాలురకు లేవు. ఇట్టి బాలురే ప్రహ్లాదుడు, ధ్రువుడు మొదలైన వారు. దుఃఖమునకు కారణము ఎవ్వరూ కాదు.

తన పూర్వ జన్మ దుష్కృత కర్మము బలవంతములై దుఃఖమును గలిగించు. యోగీశ్వరులు మోహితులై భేదంబు నాచ్ఛాదించి తమకు ఆత్మ సుఖదుఃఖములనిచ్చు ప్రభువని చెప్పుదురు. దైవజ్ఞులు గ్రహదేవతాదులకు ప్రభుత్వంబునాపాదింతురు. మీమాంసకులు కర్మంబునకు ప్రాభవంబు ప్రకటింతురు. లోకాయుతులు స్వభావంబునకు ప్రభుత్వంబు పలుకుదురు. ఇందెవ్వరికిని సుఖ ప్రదానంబు సేయ ప్రభుత్వంబు లేదు. పరులవలన దుఃఖంబు వచ్చిన, అధర్మంబు పరులు సేసిరని విచారింప వలదు. తర్కింపను నిర్దేశింపను రాని పరమేశ్వరుని వలన సర్వంబును గలుగుచుండు. జంత్ర గాని చేతి జంత్రపు బొమ్మకైవడి ఈశ్వర తంత్ర పరాధీనుండై సుఖ దుఃఖములందు వర్తనంబు సలుపు . ఈశ్వరుని మాయగుణ విసర్గంబు జంతువులకు సుఖదుఃఖములు, బంధమోక్షమును గల్పించును. జీవుడు ప్రియా ప్రియములు పొందును.

**జీవుడు - ఈశ్వరుడగుట :-** జీవాత్మ మాయను ఎంతకాలము యెఱుంగకుండు నంత కాలము ముక్త సంగుండు కాడు. అనగా మాయావరణ దాటిన జీవుడు ఈశ్వరుడగును. ప్రకృతి పురుష వివేకమున మోక్షము కలుగును. గృహస్థాశ్రమమున ఉన్ననూ జితేంద్రియుడై ఆత్మ జ్ఞానము గల పురుషునకు మోక్షంబు సిద్ధించు. జీవుడు ఈశ్వరుడగుటకు కర్మ, యోగ, భక్తి - ఇవి సాధనములు. కొందఱు భూతత్త్వము, జలతత్త్వము మొదలయిన తత్త్వములను ఒకదానియందు ఒకటి లయింప చేసి అహంకారావరణము దాటి మహతత్త్వమును జయించి ప్రకృతిని వీడిన జీవుడు ఈశ్వరుడగునని చెప్పుదురు. కొందఱు జితేంద్రియుడై ప్రకృతిని వీడి శాంతతత్త్వమును పొందిన జీవుడు ఈశ్వరుడగునని చెప్పుదురు.

ద్రష్ట దర్శనీయ యోగ్యతా ప్రకారంబునం జీవునకు జనన మరణములు లేవు. కావున భయ కార్పణ్యంబులు విడిచి సంభ్రమంబు మాని జీవ ప్రకారంబు జ్ఞానంబును తెలిసి ధీరుండై ముక్త సంగుండగుచు యోగ వైరాగ్య యుక్తంబయిన జ్ఞానంబునం మాయావిరచితంబైన లోకంబున దేహాదులందాసక్తిమాని వర్తింపవలయు. విషయసంబంధుడు ఆత్మవంచకుండనబడును.

*****

విరాట్పురుషుని దేహము నుంచి దేవతలు జనియించిరి. ఆ దేవతలు మానవ శరీరములో ప్రవేశించిరి. దేవతా ముఖ్యుడైన ఆత్మ జీవ శరీరములో ప్రవేశించినది. అప్పుడు దేహము పనిచేయడం ప్రారంభించినది. విరాట్పురుషుని దేహమునుంచి వచ్చిన దేవతలనే అండ సృష్టిలో సాత్త్వికాహంకారములో అధిష్ఠాన దేవతలుగా చెప్పబడినది.

| **విరాట్పురుషుని దేహము** | **అందుండి వచ్చిన దేవతలు** | **జీవ శరీరములో ఆ దేవతల స్థానము** |
|---|---|---|
| ముఖము | అగ్ని | ముఖమును పొందినది |
| ముక్కు | అశ్వనీ దేవతలు | ఘ్రాణేంద్రియమును పొందినది |
| కన్నులు | సూర్యుడు | చక్షురింద్రియమును పొందినది |
| కర్ణము | దిగ్దేవత | శ్రోత్రేంద్రియమును పొందినది |
| రోమము | ఓషధులు | రోమమును పొందినది |
| గుహ్యము | ప్రజాపతి | గుహ్యేంద్రియమును పొందినది |
| గుదము | మృత్యువు | గుదమును పొందినది |
| పాదము | ఉపేంద్రుడు | పాదమును పొందినది |
| చేతులు | ఇంద్రుడు | హస్తేంద్రియమును పొందినది |
| నాడులు | నదులు | నాడులను పొందినది |
| ఉదరము | సముద్రము | ఉదరమును పొందినది |
| మనస్సు | చంద్రుడు | మనస్సును పొందినది |
| బుద్ధి | బ్రహ్మ | బుద్ధిని పొందినది |
| చిత్తము | రుద్రుడు | చిత్తమును పొందినది. |



ఈవిధముగా దేవతలు మానవ శరీరములో ప్రవేశించుటవలన ఇంద్రియములు వాటి వాటి పనులను చేయగలుగు చున్నవి. విజ్ఞాన శాస్త్రరీత్యా మెదడులోని భాగములుగా వీటిని గమనించ వలసి ఉండును.

జీవునికి ప్రకృతి సంబంధమున బంధము కలుగును. ప్రకృతి పురుష వివేకమున మోక్షము కలుగును. స్వధర్మము ఆచరించుట వలన, నిర్మలాంతఃకరణము వలన చిత్త ఏకాగ్రత వలన, తపస్సువలన, భక్తి వలన, వైరాగ్య విరక్తుల వలన, ప్రకృతి జీవుని చేత విడువంబడు.

ఆత్మ అంతర్యామి రూపంబున ఉండుట వలననూ, సూక్ష్ముడగుట వలననూ తెలియబడకున్నది. శాస్త్రములు చదువుట వలననూ పుణ్య కర్మానుష్ఠానము వలననూ కూడా ఆత్మ దర్శనము కాదు. కుతర్కవాదికి, దుష్కర్మ పరులకు గుణయుతులకు, సంసారాసక్త మతి గలిగిన వానికి ఆత్మ దర్శనము కాదు. కార్యమును చూచి కారకునిని బుద్ధిచేత ఊహించ వలయును. అనగా విశ్వము కనబడుచున్నది. కావున విశ్వ సృష్టి కారకుడు ఒకడు ఉండి ఉండవలయునని ఊహించ వలయును. బాహ్యేంద్రియములను నియంత్రించి జ్ఞానేంద్రియములను వాటి విషయములనుంచి మరలించి అంతఃకరణమును పరిశుద్ధముగా ఉంచుకొని దుర్గుణములు వదలి కర్మ ఫల త్యాగము చేసి ఇంచుక మాయ లేక వైరాగ్యయుక్తులై భక్తితోడ సేవించువారు ఆత్మ గుఱించి గ్రహించెదరు.

సర్వము ఆత్మ స్వరూపమని చెప్పిన మాటలు అనుభవ జ్ఞానము లేనిచో విపరీత జ్ఞానమును కలుగ చేయును. కావున అద్వైతానుసంధానమును గుఱించి గ్రహించ వలయును. భావాద్వైతము, క్రియాద్వైతము, ద్రవ్యాద్వైతము అని అద్వైతము మూడు తెఱంగులు. పటుతంతు న్యాయమున కార్యా కారణములందు వస్తువు ఒక్కటేయుండునని ఎఱిగి ఏకత్వాలోచనము చేసి వికల్పము లేదని భావించుట భావాద్వైతము. సర్వ కర్మంబులు ఫల భేదము చేయక పరబ్రహ్మార్పణము చేయుట క్రియాద్వైతము. పుత్రమిత్ర కళత్రాది సర్వ ప్రాణులకును తనకును దేహమునకు, పంచభూతాత్మకత్వమున భోక్త ఒక్కడే అని పరమాత్మ తత్త్వమున అర్థకామములయెడ ఐక్య దృష్టి చేయుట ద్రవ్యాద్వైతము. నేర్పున ఆత్మ తత్త్వానుభవంబున అద్వైత త్రయంబును విలోకించి భేద దృష్టియు కర్మ భేద దృష్టియు స్వకీయ పరకీయ

బుద్ధియు స్వప్నంబులుగా దలంచి మునియైన వాడు భేద దృష్టిని మానవలయును. ఎందాక జీవుండు స్వతంత్రుండైన ఈశ్వరుడు గాకుండు అంత తడవు అంగన యిది పురుషుడు నేను అనియెడి బుద్ధి మానుట కర్తవ్యంబు కాదు. అలా చేసినవాడు మూఢుండగు.

*****

## పునర్జన్మ

సూక్ష్మండైన జీవుని వలన ఉత్క్రాంత గమనాగమనంబులు, పునర్జన్మ తోచును. జీవోపాధి భూతంబగు లింగశరీరముచే ఈలోకమునుండి ఊర్ధ్వ లోకములు పొందుచు ప్రారబ్ధకర్మ ఫలంబుల అనుభవించుచు మరల భూతేంద్రియ మనోమయంబైన దేహంబు కలిగి అనగా పునర్జన్మకు వచ్చి కర్మాదులందు నాసక్తులగుచుండు. స్థూలదేహ సంబంధము జీవుని యందు బుద్ధి, మనో, గుణ, వ్యూహ, రూపాది లింగశరీరభంగ పర్యంతము గలుగు చుండు.

*****

## ప్రయాణకాలమున జీవుడు పయనించు మార్గము

ప్రయాణకాలే కథం జ్ఞేయః? అనగా అంత్యకాలమున ఎట్లు ప్రయాణము చేసి ఊర్ధ్వలోకములను పొందుదురు మఱియు ఆత్మతో ఏకీభూతుగుట ఎట్లు అని అర్జునుడు శ్రీకృష్ణుని అడిగెను. అంత శ్రీకృష్ణుడు ఇట్లు చెప్పినాడు.

**అంతకాలేచ మామేవ స్మరన్ ముక్త్వాకళేబరం**
**యః ప్రయాతి సమద్భావం యాతి నాన్యత్ర సంశయః**

అధోలోక ఊర్ధ్వలోకములకు చేర్చు కర్మలను ప్రధానముగా ఇహలోకమునకు సంబంధించిన కర్మలు అని పరలోకమునకు సంబంధించిన కర్మలు అని రెండు విభాగముల క్రింద యోజింపబడును.



### ఇహలోకమునకు సంబంధించిన కర్మ

**పాప కర్మ:-** జాతి ధర్మములు, ఆశ్రమ ధర్మములు, వ్యక్తిగత విధులు బాధ్యతలు నెఱవేర్చుకుండుట, ఇతరులను హత్య చేయుట, హింసించుట, పరస్త్రీలను బలాత్కరించుట, దారిదోపిడి, దొంగతనాదులు మొదలయినవి పాప కర్మ క్రింద పరిగణింపబడును. ఇవి నరకమును కలిగించును. జీవులు నరకబాధలనుభవించి తిరిగి భూలోకమున పశుపక్ష్యాది నీచ జన్మలు ఎత్తుదురు.

**పుణ్యకర్మ:-** జాతి ధర్మములు, ఆశ్రమ ధర్మములు, వ్యక్తిగత విధులు బాధ్యతలు నెఱవేర్చుట, ధర్మయుతముగ జీవితము గడపి, ధర్మయుతముగ అర్థమును సంపాదించి ధర్మ పద్ధతిని సుఖభోగములను అనుభవించుట. ఇతనికి ఇహలోకమున ధర్మజ్ఞుడని కీర్తి కలుగును పరలోకమున పుణ్యాలోకములు కలుగును.

### పరలోకమునకు సంబంధించిన కర్మ

**పాప కర్మ:-** శాస్త్ర విహితముగాని పుణ్యా కర్మానుష్ఠానము పాపకర్మగా పరిగణింప బడును. దీని వలన నరక ప్రాప్తి కలుగును. జీవులు నరకబాధలనుభవించి తిరిగి భూలోకమున పశుపక్ష్యాది నీచ జన్మలు ఎత్తుదురు.

**పుణ్యకర్మ:-** ధర్మపరుడయినవాడు శాస్త్రవిహితమయిన పుణ్యా కర్మలు చేసిన ఊర్ధ్వలోకములు కలుగును.

**ప్రవృత్తి కర్మ:-** విధివిహితముగా పుణ్యా కర్మలు చేసి ఫలితము కోరిన అది ప్రవృత్తి కర్మగా చెప్పబడును. ఈ ప్రవృత్తి కర్మ వలన కోరిన కోరికలు నెఱవేఱును. బ్రహ్మలోక ప్రాప్తి కలిగి పుణ్యము క్షీణించగనే తిరిగి మానవునిగ భూలోకమున జన్మించెదరు. ఇది దక్షిణాయనము.

**నివృత్తి కర్మ:-** పుణ్యా కర్మలు విధివిహితముగ చేసి పుణ్యా ఫలితము కోరనిచో అది నివృత్తికర్మగ చెప్పుదురు. నివృత్తి కర్మ వలన శాశ్వత బ్రహ్మలోక నివాసము కలుగునను. భూలోకమున ఎన్నటికి జన్మించరు. వీరు అధికారపురుషులగుదురు. ఇది ఉత్తరాయణము.

**క్రమముక్తి:-** యోగము చేసి ఇంద్రియములతోటి సంగమము విడువని వాడు మొదట మహర్లోకము చేరి ఆ పై బ్రహ్మలోకము చేరి, ఆత్మతో ఏకీభూతుడగును.

**సద్యోముక్తి:-** ప్రకృతిని వీడి ఆనందమయుడై జీవాత్మను హృదయగత ఆత్మతో చేర్చి జీవన్ముక్తుడయి దేహమును వీడి ప్రాణమును బ్రహ్మ రంధ్రము చేర్చి బ్రహ్మ రంధ్రమును చీల్చి దేహమును వీడి ఆత్మతో ఆత్మలో ప్రవేశించి ఏకీభూతుడై బ్రహ్మలయి విరాజిల్లును. ఇది జ్యోతిర్మార్గము.

*****





# హిరణ్య కశిపుడు చెప్పిన శాస్త్ర పాఠము

ఈ ప్రకరణములో మనము చదువుకున్న అధ్యాత్మ తత్త్వమును సంగ్రహముగా **హిరణ్యకశిపుడు** శాస్త్రపాఠముగా వివరించి సాధనలో ఆత్మ దర్శనము చేసినాడు.

**ఆత్మ - ఆది పురుషుడు :-** సర్వజ్ఞుడు, ఈశుడు, సర్వాత్ముడు, అవ్యయుడు, అమరుడు, సత్యుడు, అనంతుడు, ఆఢ్యుడు, ఆత్మరూపుడు, ఆత్మ మయుడు, స్వయంభవుడు, అగమ్యుడు.

**విరాట్పురుషుడు :-** ప్రజాపతి, సర్వలోకములకు ఆధారము, దేవ, ఋషి, పిత్రాది లోకములకు, ధర్మాదులకు, మహా ఆధారము. దేవతా ముఖ్యుడు. యజ్ఞము, వేదము, భూదేవక్రియాది మూలము. ప్రాణులను పుట్టించు, రక్షించు సంహరించును. మహా భూత గణములకు ఆధారము. మూడు మూర్తులకు అనగా బ్రహ్మవిష్ణురుద్రులకు మూలము.

**సృష్టి :-** మాయవలన గుణములను కల్పించి అనగా ప్రకృతిని సృజియించి ప్రకృతిని గూడి బ్రహ్మాండమును సృజియించినాడు.

**కాలము :-** కాలరూపంబున జనులకు ఆయుర్నాశనము చేయును. పంచ భూతములలో సృష్టిలో అంతర్యామి. అంతరాత్మ.

**దేహము :-** దేహము పంచభూతమయము. కాలకర్మ వశమున దేహము కలుగును. కాలకర్మాంతమున దేహము నశించును. దేహమునకు పుట్టుక, వినాశనములు కలవు.

**అంతరాత్మ :-** దేహములో ముఖ్యప్రాణము. హృదయగుహలో ఆత్మ. అంతరాత్మ. సాక్షి. సకల భావ రహితుడు. మనస్సు, బుద్ధి చిత్తము ఇంద్రియాదులకు అధీశ్వరుడు.

**జీవాత్మ :-** జీవ రూపంబున జీవాత్మ. గుణసంగమంబున లింగ శరీరము దాల్చును. జలములలో ప్రతిబింబితమైన చెట్లు నీటి అలలకు కదలినట్లు తోచు భంగి జీవాత్మ సుఖదుఃఖములకు విచలితుడగును. పూర్వ జన్మ కర్మ వశమున దేహములో ప్రవేశించును. దేహములో ఉండి ఇంద్రియముల ద్వారా కర్మలు చేయును. జీవుడు ఇంద్రియ, మనోలింగ దేహములను కూడును. జీవుడు అస్వతంత్రుడు. కాలము

తీరగానే దేహమునుండి వెడలి పోవును. దేహము వేఱు, దేహి వేఱు. ఇద్దఱు ఒకటి కాదు. దేహి ఎచ్చట పుట్టెనో అచ్చటకేగుట నైజము. దేహి నశింపడు.

**దేహికి దేహ సంబంధీకులతో సంబంధము :-** మహామాయా గుణభ్రాంతులై వీరు నాతల్లిదండ్రులు, భార్య, పుత్రులు, చుట్టాలు, స్నేహితులు అని దేహసంబంధీకులను తనవారిగా భావించును. చలివేంద్రములో బాటసారులు కలసి విడిపోవునట్లు సంసారములో దేహికి దేహసంబంధీకులతో సంబంధము కలుగును. కర్మ సంసరణంబున జీవుడు యోగ వియోగములు చెందును. కర్మ వలన దేహ సంబంధీకులతో సంగమము కలుగును. కర్మాంతమున విడిపోవును.

**అజ్ఞానులు :-** యోగవియోగములకు, సుఖదుఃఖములు పొందుదురు. మీరు మేము అని అజ్ఞానులు భావించెదరు. త్రిగుణముల వలన కలిగిన వివేకము, చింత, స్మరణ, శోకము మొదలయిన భావములను అనుభవింతురు.

**జ్ఞానులు :-** సర్వ ప్రపంచము నిత్యంబు కాదని తలచి శోకింపరు. నిత్యానిత్యములను గూర్చి సుఖదుఃఖ ములను చెందరు. సర్వము ఆత్మ అని జ్ఞానులు భావించెదరు. వీరు భావ రహితులు. ద్వందా తీతులు.

సర్వంబునూ ఆత్మయే. ఆత్మ గానిది లేశంబును లేదు. హిరణ్యకశిపుడు పరీక్షాధికారిగా ప్రహ్లాదునిని పరీక్షించెను. ప్రహ్లాదుడును ఇవే విషయములను చెప్పెను. వీరిరువురి సాధనలు మాత్రమే వేఱు వేఱు. ఒకరిది యోగ పద్ధతి. ఇంకొకరిది భక్తి పద్ధతి. ఇరువురి మార్గము ఒక్కటే.

**మ॥ దితి జఠరంబునందుఁ దన తేజము మున్నిడినట్టి పుత్త్రు న**
**ద్భుత చరితున్ "హిరణ్యకశిపుం"డను పేరఁ, బ్రసూతి వేళనా**
**దితి మును గన్న పట్టి రవితేజునిఁ "గాంచనలోచనుండు" నా**
**హిత మతిఁ బేరు వెట్టి చనియన్ నిజ నిర్మల పుణ్యభూమికిన్**

(భాగవతము, తృతీయ స్కంధము, 611)

అనగా గర్భములో మొదట ఉంచిన తేజస్సు వల్ల జన్మించినవాడు హిరణ్యకశిపుడు. ప్రసవ సమయమున గర్భమునుండి ముందు పుట్టిన వాడు హిరణ్యాక్షుడు.



**.......... విష్ణుచే**
**సమయుట జేసి మీఁద నగు జన్మమునన్ జలజాక్షు నిత్య వా**
**సమున వసింతు రెన్నఁటికిఁ జావును బుట్టువు లేవు వీరికిన్**

(భాగవతము, తృతీయ స్కంధము, 704)

వీరికి పునర్జన్మ లేదు.

**హిరణ్యాక్ష, హిరణ్యకశిపులు భద్రుడు, అనుభద్రుడు అను పేరున రుద్రానుచరులు.**

(భాగవతము, తృతీయ స్కంధము, 479)

సనక సనందనాదులు వైకుంఠము చేరి ఏడవ కక్ష్య యందుగల విష్ణు ద్వార పాలకులయిన జయవిజయులను శపించిరి. వారు హిరణ్యాక్ష, హిరణ్యకశిపులుగా పుట్టిరి.

ఒక సారి శివుని అనుచరులని, మఱియొకసారి విష్ణుమందిర ద్వార పాలకులని రెండు విధములయిన వృత్తాంతములను చెప్పినారు. అటులనే దితి గర్భములో ముందు ప్రవేశించిన వాడు హిరణ్యకశిపుడని, గర్భమునుంచి ముందు జన్మించిన వాడు హిరణ్యాక్షుడని చెప్పిన విషయములను గమనించి - అర్థము చేసికొన్న హిరణ్యకశిపుడు-హిరణ్యాక్షుడనగా ఎవ్వరో తెలియును. ఇది యోగ పాఠము.

*****

## జీవుడు ఈశ్వరుడగు విధానము

భీష్మపర్వమున అర్జునుడు శ్రీకృష్ణపరమాత్మను అడిగిన ప్రశ్న.

**యచ్ఛ్రేయః స్యాన్నిశ్చితం బ్రూహి తన్మే** (గీత సాంఖ్యయోగము-7)

**న హి ప్రపశ్యామి మమాపనుద్యాత్**
**యచ్ఛోకముచ్ఛోషణమింద్రియాణామ్** (గీత సాంఖ్యయోగము-8)

శ్రేయస్సును కలిగించు శ్రేయోమార్గమును నిశ్చయించి దానిని నాకు చెప్పుము. ఇంద్రియముల యొక్క తాపమును జీవుని దుఃఖమును దూరముచేయగల దానిని నేను తెలియకున్నాను. కావున నాకు దుఃఖనివారణ కలుగు మార్గమును ఉపదేశింపుము.

భారతము, అనుశాసనిక పర్వములో ధర్మరాజు భీష్ముని అడిగిన ప్రశ్న

**కిమేకం దైవతం లోకే కిం వాప్యేకం పరాయణమ్ ।**
**స్తువంతః కం కమర్చంతః ప్రాప్నుయుర్మానవాః శుభమ్ ॥**
**కో ధర్మః సర్వధర్మాణాం భవతః పరమో మతః ।**
**కిం జపన్ ముచ్యతే జంతుః జన్మసంసారబంధనాత్ ॥**

అనగా సర్వధర్మములలో ఏ ధర్మము ఉత్కృష్టమైనది. లోకములో దైవతము ఎవడు? ఎవనిని అర్చించిన ఎవనిని స్తుతించిన ఎవనిని జపించిన మానవులు శుభమును పొందుదురు ? మానవులు సంసారబంధముల నుంచి జన్మబంధముల నుంచి విడివడి మోక్షమును ఎటుల పొందుదురు?

శౌనుకాదులు సూత మహర్షిని అడిగిన ప్రశ్న

**అచల స్థిర కల్యాణం బెయ్యది, పురుషులకును నిశ్చయించి బోధింపు తగన్.**
**నెయ్యది సర్వసౌఖ్యమై యలవడు? నేమిటం బొడము నాత్మకు శాంతి?**
**తపసు లెవ్వని పాదంబు దగిలి శాంతి, తెరువుఁ గాంచిరి !**

(భాగవతము ప్రథమస్కంధము - 42, 44, 45)



పరిక్షిత్ శుకబ్రహ్మను అడిగిన ప్రశ్న

**దేహధారి కేమి చింతించిన నేమి జపించిన, నేమి గావించిన, నేమి వినిన,**
**నేమి సేవించిన నెన్నఁడు సంసార పద్ధతిఁ బాసిన పదవి గులుగు....**
**జెప్పనే తండ్రి ముక్తికిఁ జేరు తెరువు !** (భాగవతము ప్రథమస్కంధము - 525)

ఇవి అన్ని ఒకే కోవకు చెందిన నిఖిలలోక మంగళము అయిన ప్రశ్నలు. ఈ ప్రశ్నలకు సమాధానము ఈ పరవిద్య యందు వివరింపబడినది.

జీవునకు ఆత్మదర్శన ప్రాప్తిగలిగి జీవన్ముక్తుడయి శాంతత్త్వమును పొంది దేహత్యాగానంతరము ఆత్మతో ఏకీభూతుడయి బ్రహ్మత్వమును పొందుటకు చేయు విధివిధానమును **సాధన** అని **లేదా దీక్షయని లేదా వ్రతము** అని అందురు. ఆత్మ స్థానమునకు చేరు సాధన ఏ యుగమైనా ఒకటిగానే ఉండును. ఈ సాధనను అనేక వేలమందిలో ఒకడు ఆచరించును. ఆవిధముగా ఆచరించిన అనేక వేల మందిలోనొకడు ఆత్మ స్థానమునకు చేరి ఆత్మయై విరాజిల్లును. ఈవిషయమునే శ్రీకృష్ణుడు ఇట్లు చెప్పినాడు.

**మనుష్యాణాం సహస్రేషు కశ్చిద్యతతి సిద్ధయే**
**యతతామపి సిద్ధానాం కశ్చిన్మాం వేత్తి తత్త్వతః ॥**

(భగవద్గీత, విజ్ఞానయోగము, 3)

వేల మంది మనుష్యులలో నొకడు ఆత్మ స్థానమును పొంది ఆత్మ యగుటకు ప్రయత్నించును. ఆవిధముగా ప్రయత్నించిన వారిలో నొకడు మాత్రమే ఆత్మను దర్శించి ఆత్మస్థానమును పొంది ఆత్మయగుచున్నాడు.

జీవుడు ఆత్మతో ఏకీభూతుడగు విధానమును సూత మహర్షి శౌనకాదులకు భాగవతములో ప్రథమ స్కంధము, 67 లో ఇట్లు వివరించినారు.

**సృష్టిలో జీవుడు:-** జీవుడు కరచరణాది అవయవములు లేనివాడు. కావున అరూపుడు. అవ్యక్తుడు. సూక్ష్ముడు. చిదాత్మకుడు. గుణయుతుడు. జీవుడు స్థూల దేహ త్యాగానంతరము సూక్ష్మ శరీరముతో ఊర్ధ్వ లోకములకు పయనించి పుణ్యకర్మ, పాప కర్మల ఫలితమును అనుభవించి పుణ్యాపాపములు క్షీణించగనే తిరిగి భూలోకమున

పూర్వ జన్మ కర్మానుసారము జన్మించును. అనగా జీవునకు పునర్జన్మ కలుగును. గాలియందు బార్థివ ధూళి ధూసరత్వంబును నేరీతి నారీతి అనగా గాలిలో ధూళి కణములు కలసి నట్లు దేహముతో జీవాత్మ మమేకము అయి ఉండును.

**ఆత్మ:-** దేహములోని హృదయగుహ ఇతని నివాస స్థానము. ఇతడు అరూపుడు. నిర్గుణుడు. సాక్షి. ఇతని వలననే దేహేంద్రియ మనోబుద్ధులు పనిచేయుచున్నవి.

**హృదయగుహలోని ఆత్మ:-** పవనాశ్రిత మేఘ సమూహము వలె అనగా ఆకాశములో మేఘముల వలె శరీరములో విలక్షణముగా హృదయగుహలో ఆత్మ ఉండును.

**శరీరములు:-** ఈశ్వరుని మాయాగుణంబులయిన మహదాది రూపంబుల చేత స్థూల సూక్ష్మ శరీరములు జీవాత్మకు హృదయ గుహలోని ఆత్మకు నివాస స్థానముగా విరచితంబయ్యి ఉండు.

జీవాత్మ ద్రష్ట. దేహము దృశ్యము. కావున ద్రష్ట వేఱు దృశ్యము వేఱు. అజ్ఞానులు దేహమే ఆత్మయని భావింతురు. ద్రష్టకు అంతఃకరణ సంబంధమున దృశ్యము కానబడుచున్నది. అంతఃకరణము విలయంబునొందిన దృశ్యము నశించి ద్రష్టఒక్కడే మిగులును.

**స్థూల శరీరము:-** దీనికి పుట్టుక, పెరుగుట, జరామృత్యువులు గలవు. ఇది పంచభూతాత్మకము. తమో అహంకారజనితము. ఈ స్థూల శరీరము కాల కర్మలచే గలుగు జరా వ్యాధులచే నశించును. స్థూలశరీరము నశించినా సూక్ష్మ శరీరముండును. ఈ సూక్ష్మ శరీరము నశించనంతవఱకు జీవుడు ఈశ్వరుడు కాడు. అనేక జన్మలు ఎత్తును. స్థూలశరీరము తమో అహంకారయుతము.

**సూక్ష్మ శరీరము:-** స్థూల శరీరముతో చేసిన కర్మ బీజరూపమున సూక్ష్మ శరీరములో నిల్వ ఉండును. ఈ సూక్ష్మ శరీరము అదృష్టము. అనగా బాహ్యా చక్షువులకు గోచరము కాదు. అశ్రుతము. అనగా ఈ శరీరము గుఱించి సామాన్యులు వినలేరు. గుణంబయిన వస్తువు. అనగా ద్రవ్యము, గుణములు, లక్షణములు కలది. కావున ఇది ద్రవ్యంబులయిన సాత్త్విక, రజో అహంకారము వలన ఏర్పడినది. గుణయుతము. అనగా త్రిగుణములు కలది. ఇది సూక్ష్మము. అనగా బాహ్యా చక్షువులకు గోచరము కాదు. ఇది మనోమయము. స్థూల శరీరము నశించినా ఈ సూక్ష్మ శరీరము నశింపదు.



ఈ శరీరముతోనే జీవుడు ఊర్ధ్వలోకములకు పుణ్యా పాప కర్మానుభవమునకై పయనించి అవి క్షీణము అవగానే తిరిగి పునర్జన్మకు వచ్చును. ఈ శరీరమునే లింగ శరీరమనియు అందురు. దేహ త్యాగానంతరము లింగశరీరము నశించిన జన్మరాహిత్యము కలుగును. ఈ లింగశరీరమును నశింపచేయు విధి విధానమును పరవిద్య బోధించును.

దేహము కంటె వేఱు అయిన జీవాత్మకు, అవిద్య వలన దేహ సంబంధము కలుగును. దాని వలన జన్మ, సంసారబంధము కలుగును. ఈ బంధము తొలగి స్వస్వరూపమును పొందుటకు అవిద్య నశింప వలయును. అవిద్య నశించిన జీవుడు బ్రహ్మ దర్శనమునకు అధికారియగును. అనగా దేహము వేఱు జీవుడయిన తను వేఱు అని స్వానుభవంలో తెలిసినపుడు ఆత్మ దర్శనమునకు అధికారియగును. ఆత్మ దర్శనమే జ్ఞానము. సృష్టిలో మాయ వలన కలిగిన దేహములో ప్రవేశించిన జీవుడు అవిద్య వలన తనే దేహము అనుకొని దేహ సంబంధీకులు తనవారని భావించి కర్తృత్వము వహించి శ్రౌత, స్మార్త కర్మంబులు చేయుచు భోక్తగా సుఖదుఃఖములను అనుభవించుచున్నాడు. రాగ ద్వేషములు, మమత అహంకారములు కలిగి నేను నాది అనుభావన కలిగి వర్తించుచున్నాడు. ఈ అవిద్య ఎప్పుడు విద్యారూపంబున పరిణతయగు అనగా త్రిగుణములు నశించి గుణరహితుడయి ద్వందాతీతుడయి నప్పుడు జీవుడు కాష్టంబు లేక తేజరిల్లు వహ్ని చందంబున దానుయుపరతుండయి బ్రహ్మ స్వరూపంబునంబొంది పరమానందమున విరాజమానుండగు. దీనినే **కర్పూర దీప సంయోగము** అని అందురు. ఈ విషయమును గుర్తుచేయుటకు ఆచారకాండలో పూజలో చివరగా కర్పూరహారతిని ఇత్తురు.

జీవుడు ఈశ్వరుడగు విధానమును **కర్మ, యోగ, భక్తి** బోధించినవి. ఒక వ్యక్తి పుట్టిన కులమును ఆధారముగా చేసికొని జీవుడు ఈశ్వరుడగు విధానమును కర్మయోగము చెప్పినది. ఒక వ్యక్తి యొక్క గుణమును ఆధారముగా చేసికొని ఆచరణ విధానమును యోగ, భక్తి వివరించినవి. సాధన ప్రారంభములో కర్మ యోగ భక్తి పద్ధతులలో కొంచెము తేడా ఉన్ననూ కొంత స్థాయికి వచ్చిన తరువాత అన్నియు ఒక్కటే చెప్పును. అపర విద్యను గుఱించి విపులముగా శాస్త్రములు బోధించును. శాస్త్రములను అనేక మారులు చదువుటవలన అపరవిద్యను గుఱించిన జ్ఞానము కలుగును. కానీ పరవిద్య

విపులముగా ఏ గ్రంథములందును వివరింపబడదు. పరవిద్యకు సంబంధించి కొన్ని సూచనలు మాత్రము ఇవ్వబడును. కావున పరవిద్యను గురువులనాశ్రయించియే గ్రహించవలసి ఉండును. గురువు, శిష్యునినుంచి ధనకనక వస్తువాహనాదులను ఆశించని వాడై ఉండవలయును. శిష్యులు పుణ్యకర్మల ఫలితమును కోరనివారై ఇహలోక పరలోక సుఖాపేక్ష లేని ధీరులై ఉండవలయును. ఇట్టి శిష్యుడు మాత్రమే పరవిద్యను గ్రహించ గోరి దర్భలను చేతగ్రహించి నిరహంకారియై గురువును చేరి సేవించవలయును. ఈవిషయమునే శ్రీకృష్ణుడు జ్ఞానయోగము 34 లో ఇట్లు చెప్పినాడు.

**తద్విద్ధి ప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా**
**ఉపదేక్ష్యంతి తే జ్ఞానం జ్ఞానిన స్తత్త్వ దర్శినః** (భగవద్గీత, జ్ఞానయోగము, 34)

తత్త్వ దర్శనులయిన జ్ఞానులను ఆశ్రయించి వారికి సాష్టాంగ నమస్కారము, సేవలు చేసి వారి అనుగ్రహమును సంపాదించి పరవిద్యకు సంబంధించిన ఆచరణ విధానమును అడిగి తెలిసికొనుము. నీ జిజ్ఞాసకు మెచ్చి నీ యందు ప్రసన్నులయి వారు ఆవిషయములను ఉపదేశించెదరు. అయితే సంసార తాపత్రయములలో మునిగి ఉన్నవారియందు దయ తలచి ఒకవేళ పరవిద్యకు సంబంధించిన సాధనను చెప్పిననూ అవి నీటిమీద వ్రాతల వలె నిరర్థకములు.

ఉ॥ **అచ్చపుఁజీఁకటిం బడి గృహవ్రతులై విషయ ప్రవిష్టులై**
**చచ్చుచుఁ బుట్టుచున్ మరలఁ జర్విత చర్వణులైన వారికిం**
**జెచ్చెరఁ బుట్టునే పరులు సెప్పిననైన నిజేచ్ఛనైన నే**
**మిచ్చిననైనఁ గానలకు నేఁగిననైన హరి ప్రబోధముల్?**
(భాగవతము, సప్తమ స్కంధము, 181 )

ఆత్మ స్థానమును పొంది ఆత్మయై విరాజిల్లుటకు చేయు సాధన బహు కష్టతరమైనది. ఈ సాధన రహస్యములనున పెద్దలను సేవించియే తెలుసుకొనవలయును. కావుననే కఠోపనిషత్తులో యముడు నచికేతునితో " **ఉత్తిష్ఠత జాగ్రత ప్రాప్య వరాన్నిబోధత క్షురస్య ధారా నిశితా దురత్యయా దుర్గం పథస్తత్కవయో వదంతి**" అని చెప్పెను.

*****



## సాధనకు అవసరమైనవి

జాతి ధర్మములు ఆశ్రమ ధర్మములు, విధులు, బాధ్యతలు పాటించవలయును

**స్థలము:-** శరీరమునకు బాధ కలుగని ప్రదేశము. అనగా చీమలు, పురుగులు, పాములు, తేళ్ళు లేని ప్రదేశము. మనస్సుకు ఆనందమును హాయిని గొలుపు సుందర ప్రదేశము. సత్పురుషులు ఉండు ప్రదేశము. పుణ్య ప్రదేశము. గురుకులాశ్రమము. తను నివాసమున్న గృహము. వీటిలో నేదైనా నొకటిని ఎన్నుకొనవలయును.

**సాంగత్యము:-** సజ్జనులతో సాంగత్యము కలిగి ఉండవలయును. బ్రహ్మ నిష్టులతో చెలిమి కలిగి ఉండవలయును. శాంత జనులతో సత్త్వగుణయుతులతో కలసి తిరుగ వలయును. భగవంతుని యందలి స్నేహమే ప్రయోజనముగా కలిగి ఉండవలయును. దుష్ట సాంగత్యము కూడదు. శిశ్నోదరముల తృప్తికై పాటుబడువారితో మోక్షాసక్తుడు కలియరాదు. సాధనకు ఏకాంత ప్రదేశమున ఒంటరిగా ఉండవలయును.

**ప్రవర్తన:** గుణాఢ్యుండగు వాని చూచి సంతోషించుచు, అభాసుండగు వాని చూచి కరుణించుచు, సమానుని యందు మైత్రి సలుపుచు ఉండవలయును. ఋజు ప్రవర్తన కలిగి ఉండవలయును. సదాచారము, సుశీలము కలిగి ధర్మ పరుడై యోగక్షేమ క్రియా రాహిత్యము కలిగి ఉండవలయును. గృహస్థాశ్రమమునందును జితేంద్రియుడై ఆత్మ జ్ఞానముగల పురుషునకు మోక్షంబు సిద్ధించు. వనవాసి యైనను జితేంద్రియుడు కాకుండునేని సంసార బంధము కలుగును.

**వస్త్ర ధారణ:-** బ్రహ్మచారి, గృహస్థు, వానప్రస్థ, సన్న్యాస ఆశ్రమ ధర్మములందుగల వారు ఎవరునూ కాషాయ రంగు వస్త్రములు ధరించరాదు. కాషాయ రంగు వస్త్రములు ధరించుట పాషండ ధర్మము. అందు వలన వైదిక ధర్మ నిష్టాపరులు శుభ్రమైన తెల్లని వస్త్రములను ధరించవలయును. ఆడంబరమునకు అహంకారమునకు దర్పమునకు చిహ్నములైన విలువగల బట్టలు ధరించరాదు. నారచీరలు అనగా నిరాడంబరముగా ఉండే సాధారణ వస్త్రములు ధరించ వలయును.వస్త్ర ధారణను బట్టి అతని **గుణము** గ్రహించవచ్చును. రామాయణములో

రావణుడు కాషాయ వస్త్రములు ధరియించి భిక్షురూపమున సీత వద్దకు వచ్చినట్లు అరణ్య కాండలో వర్ణింపబడినది.

**శ్రద్ధ:-** సాత్త్విక శ్రద్ధకలిగి ఉండవలయును. ఈశ్వర విషయజ్ఞానాపేక్షకలిగి ఉండవలయును.

**స్నానము:-** శారీరక స్థితిననుసరించి శరీర శుభ్రతకు దేశ కాల పరిస్థితులను బట్టి మూడు పూటలగానీ లేదా రెండు పూటల గానీ స్నానము చేయవలయును. బాహ్య శౌచమును పాటించవలయును.

**ఆహారము:-** ఈ ఆహారము తమోగుణ ప్రధానులకు ఇష్టమగు ఆహారమని, రజోగుణ ప్రధానులకు ఇష్టమగు ఆహారమని, అటులనే సత్త్వగుణ ప్రధానులకు ఇష్టమగు ఆహారమని మూడు విధములుగా చెప్పుదురు. అందు జాగ్రతావస్థలో శరీరమునకు పుష్టిని ఆరోగ్యమును ఇచ్చు సత్త్వగుణ ప్రధానమయిన ఆహారమును సాధన ప్రారంభములో తీసికొనవలయును. ఆ తరువాత మితాహారమును స్వీకరించవలయును. ఆ తరువాత పదిహేనుదినముల కొకసారి ఉపవాసముండ వలయును. ఆ తరువాత రెండు మూడు దినములకు ఒకసారి ఆహారమును స్వీకరించుచు ఉండవలయును. ఈ విధముగా ఉపవాస కాలమును శారీరక స్థితిని గమనించుచు ఉండవలయును. సవికల్ప సమాధిని జల భక్షణగను, నిశ్చల నిర్వికల్ప సమాధిని వాయు భక్షణగను వర్ణింతురు.

పుణ్య కర్మానుష్ఠానము సాత్త్వికముగా చేయవలయును. దేవ ఋణము, పితృదేవతల ఋణము, ఋషి ఋణము తీర్చవలయును. ఆహారమును బట్టి అతని **గుణమును** గ్రహించ వచ్చును.

కర్మ పద్ధతిలో కర్మేంద్రియ జ్ఞానేంద్రియములతో పాప కర్మలు చేయించక, పుణ్య కర్మలు చేయింతురు. యోగములో ఇంద్రియములను నిగ్రహింతురు. భక్తిలో కర్మేంద్రియ జ్ఞానేంద్రియములను ఈశ్వరపరముగా పనిచేయింతురు.

**కర్మేంద్రియములు:-** కర్మేంద్రియములతో చేయ వలసిన పనులు చేసి, చేయకూడని పనులు చేయకుండా ఉండి, ఆపై కర్మేంద్రియములను నిగ్రహించవలయును.



1. **వాక్కు:** **చేయ వలసిన పనులు:** స్వాధ్యాయము, సత్యము. మితముగానూ ప్రియముగానూ మధురముగానూ మాటలాడవలయును. నారాయణ కథాలాపములు, నామ స్మరణ, ఓంకారమును జపించవలయును.
   **చేయరాని పనులు:** పరులను నిందించ రాదు. ఇతరులపై చాడీలు చెప్పరాదు. పరిహాసము చేయరాదు. వ్యంగ్యముగా మాటలాడరాదు. అనవసరపు సంభాషణ కూడదు. పరుషముగా మాటలాడరాదు. వాదములు సలుపరాదు.
   **నిగ్రహించుట:** మౌనము పాటించ వలయును. అతని మాటలను బట్టి అతని **గుణమును** గ్రహించ వచ్చును.
2. **చేతులు:** **చేయ వలసిన పనులు:** పెద్దల పాద సేవ చేయవలయును. కొడుకు తల్లి తండ్రులకు, భార్య భర్తకు, ఇతరులు వారి కంటె పెద్దవారికి వినయముగా సేవ చేయవలయును. ఈశ్వరార్చన చేయవలయును. దానము, ధర్మము చేయవలయును.
   **చేయరాని పనులు:** దొంగతనము చేయరాదు. హింసచేయరాదు. మానసిక, వాచిక కాయక రూపంబయిన హింస చేయరాదు. బలాత్కారము చేయరాదు.
   **నిగ్రహించుట:** అపరిగ్రహమును పాటించవలయును.
3. **పాదములు:** **చేయ వలసిన పనులు:** పుణ్యప్రదేశములకు వెళ్ళవలయును.
   **చేయరాని పనులు:** పాప ప్రదేశములయిన వేశ్యావాటికలు, పానశాలలు, జూదశాలలకు వెళ్ళరాదు.
   **నిగ్రహించుట:** దైవ సాన్నిధ్యమున మెత్తని ఆసనముపై ఆసనము వేసుకొని కూర్చొనవలయును.
4. **గుహ్యము:** **చేయ వలసిన పనులు:** ఋతుకాలమున భార్యతో సంసారము చేయవలయును.
   **చేయరాని పనులు:** బలాత్కారము చేసి స్త్రీని అనుభవించరాదు. స్త్రీలతోగానీ స్త్రీ సంపర్కము గలవారితోగానీ సంబంధము

పెట్టుకొనరాదు. నిషిద్ధ కాలములో భార్యతో రతి చేయరాదు. పరదారాసక్తత కలిగి ఉండరాదు.

**నిగ్రహించుట:** బ్రహ్మచర్యమును పాటించవలయును.

గుహ్యము చేయు పనిని బట్టి అతని **గుణము**ను గ్రహించ వచ్చును.

5. **గుదము:** దీనికి ఏమియు చెప్పబడలేదు.

కర్మేంద్రియములలో వాక్కును, గుహ్యమును నిగ్రహించుట కష్టము. రజోగుణము నశించి కామ క్రోధములు వశమయినగాని గుహ్యమును జయించలేము. హనుమంతుడు లంకలో నగ్నముగా ఉన్న స్త్రీలను చూచియు చలింపనట్లు వర్ణింపబడినది. అనగా హనుమంతుడు రజోగుణమును జయించి సత్త్వ గుణాశ్రయుడై ఉండెనని అర్థము.

**జ్ఞానేంద్రియములు:** జ్ఞానేంద్రియములు ఇంద్రియార్థములపై ప్రసరించును. ఈ ఇంద్రియార్థములనే విషయములనియు చెప్పుదురు.

1. **చెవులు:** **చేయ వలసిన పనులు:** మనస్సునకు హాయినిగొలుపు శుభవార్తలు, భగవత్సంబంధమయిన కథలు వినవలయును.

**చేయరాని పనులు:** మనస్సును ఉద్రేకపఱచు వార్తలు, లోకవ్యవహారమునకు సంబంధించిన వార్తలు, దూషణ వాక్యములు వినరాదు. ఇట్టివి విన్నచో మనస్సు తమోగుణమునకు లోబడి పరుషవాక్కువచ్చును. ఆపై హింస చేయును.

**నిగ్రహించుట:** జ్ఞానేంద్రియములలో చెవులను నిగ్రహించుట కష్టము. నిశ్చల సమాధికి చేరినగాని శబ్దమును జయించలేము.

శబ్దము వలన మనస్సులో గుణములు ప్రకోపించి కర్మేంద్రియముల ద్వారానూ కన్ను ద్వారానూ బహిర్గతమగును.

2. **చర్మము:** **చేయ వలసిన పనులు:** బాహ్య శౌచమును పాటింపవలయును.

**చేయరాని పనులు:** సౌందర్య పోషణకు ఎక్కువ శ్రద్ధ చూపరాదు.



**నిగ్రహించుట:** శీతోష్ణాది ద్వంద్వములను సహించ వలయును. దీనినే పురాణములలో వేసవికాలమున పంచాగ్నిమధ్యంబున, వానాకాలములో వానలో తడుస్తూ, శీతాకాలములో చన్నీటిలో ఉండి, తపస్సు చేసినట్లు వర్ణింతురు.

3. **కన్ను:** **చేయ వలసిన పనులు:** మనస్సుకు ఆహ్లాదము కలిగించు సుందర దృశ్యములను చూడవలయును. మహాత్ములను దర్శించ వలయును.

**చేయరాని పనులు:** మనస్సుకు ఉద్వేగము కలిగించు వాటిని చూడరాదు.

**నిగ్రహించుట:** స్వనాసాగ్రమును అవలోకించవలయును. కన్నులు మూసికొని భ్రూమధ్య స్థానమును నిశ్చలముగా చూడవలయును.

జ్ఞానేంద్రియములలో మనస్సును ఉద్రేకపఱచు వాటిలో చెవులు కన్నులు ముఖ్యము. జ్ఞానేంద్రియములలో కన్నును నిగ్రహించనిచో మనస్సుకు ఉద్రేకము కలిగి సాధకుడు పతనమగును. కావున కన్నును నిగ్రహించుట ముఖ్యము. కన్నును నిగ్రహించుటనే తారక యోగము అని అందురు.

4. **నాలుక:** **చేయ వలసిన పనులు:** మితమైన, శుద్ధమైన, సాత్త్విక ఆహారమును తీసికొనవలయును.

**చేయరాని పనులు:** మత్తుపానీయములు తీసికొనరాదు. జిహ్వా చాపల్యముండరాదు.

**నిగ్రహించుట:** ఉపవాసము ఉండవలయును.

ఆహారమందలి ఇష్టమును బట్టి అతని **గుణము** గ్రహించ వచ్చును.

5. **ముక్కు:** **చేయ వలసిన పనులు:** సుగంధములను పీల్చవలయును.

**చేయరాని పనులు:** దుర్గంధమును పీల్చరాదు.

**నిగ్రహించుట:** వాసనలను పీల్చియు మనస్సు వాటిపై ప్రసరించరాదు. ఈ విషయమునే హనుమంతుడు రావణుని భోజన శాలలోని వివిధ

వంటకముల, మత్తుపానీయముల వాసనలను పీల్చియు వాసనలను నిగ్రహించినట్లు వర్ణింప బడినది.

జ్ఞానేంద్రియములు ఉద్రేకపడి పదే పదే వాటి వాటి ఇంద్రియార్థములపై ప్రసరించుటను లాలస అని అందురు. ఈ జ్ఞానేంద్రియములయొక్క ఉన్మాదమును పోగొట్టుటను నిగ్రహించుటగా చెప్పుదురు. ఈ విషయమునే గజేంద్రమోక్షములో పంచేంద్రియోన్మాదమున్ పరిమార్చి అని వర్ణించినారు. కర్మేంద్రియ జ్ఞానేంద్రియముల ద్వారా చేయబడు కర్మ వలన సాధకుని **గుణములు** తెలియును. తద్వారా అతని బాహ్య ప్రవర్తన ఉండును. చేయవలసినవి చేయుట, చేయకూడనివి చేయకుండుటను సంస్కారము అని అందురు. కర్మేంద్రియ జ్ఞానేంద్రియములకే సంస్కారములు చెప్పబడును. కొందఱు కర్మేంద్రియములను నిగ్రహించి మనస్సులో ఇంద్రియార్థములను స్మరింతురు. వీరిని మిధ్యాచార్యులు అని అందురు.

**ప్రాణము:-** ప్రాణమునకు సంస్కారము చెప్పబడలేదు. ప్రాణవాయువును తన వశములో ఉంచవలయును. మెల్లన యోచించి ప్రాణమార్గమున కుంభక రేచక పూరకంబుల కోశ శోధనంబుజేసి ప్రాణాయామమను పావకుని చేత వాత పిత్త శ్లేష్మంబులను దోషంబుల భస్మీకరణంబుజేసి కుంభక పూరకంబులచేత ప్రతికూలంబు గావించి జితమారుతుండై ఉండవలయును.

కర్మ పద్ధతిలో అంతఃకరణమున పాపపు భావనలు లేక పవిత్రముగా అంతఃకరణమును ఉంచుకొనవలయును. యోగములో వీటితోపాటు అంతఃకరణమును నిగ్రహింతురు. భక్తిలో అంతఃకరణమును ఈశ్వరపరము చేయుదురు.

**అంతఃకరణము:-** అంతఃకరణ శుద్ధిలేని కర్మ, యోగ, భక్తి సాధనలు నిష్ఫలము. దీనినే భాండశుద్ధిలేని పాకమేల అనియు మఱియు చిత్తశుద్ధిలేని శివపూజలేల అని పెద్దలు పేర్కొనినారు. దైవీ సంపద కలిగి ఉండవలయును. ధన, కనక, వస్తువాహన, గృహక్షేత్రాదులందు ఆపేక్షలేక విరక్తి కలిగి ఉండవలయును. వైరాగ్యము కలిగి ఉండవలయును. అసుర సంపద ఉండరాదు. ధనేషణ, దారేషణ, పుత్రేషణ అనే ఈషణత్రయము ఉండరాదు. కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యములనే అరిషడ్వర్గములు ఉండరాదు. అంతఃకరణములను జయించ వలయును.



**అహంకారము:-** అహంకారము వలన ద్రష్టయైన జీవునకు దృశ్యము కనబడుచున్నది. అందువలన భేద దృష్టి కలుగు చున్నది. ఈ భేద దృష్టివలన తను, ఇతరులు, నేను, నాది అను అహంకార మమకారములు కలుగుచున్నవి. కావున అహంకారమును నశింపచేసుకొనవలయును. పుణ్యాకార్యములు చేయుచు కర్తృత్వ భావనను వీడి కర్మ ఫలితమును భగవంతునికి సమర్పించవలయును. అనగా పుణ్యఫలితమును కోరరాదు. మనోదృష్టంబైన అసన్మార్గంబు పరిహరించ వలయును. కర్తవ్యతా పరిత్యాగము చేయవలయును.

**చిత్తము:-** చిత్తము సంసారాసక్తమయిన బంధము. ఈశ్వరాసక్తమయిన మోక్షము. చిత్తము మోక్షార్థికి శత్రువు. రజస్తమో గుణంబులచేత నాక్షిప్తంబగు విరూఢంబులగు చిత్తంబునం తద్గుణంబుల వలన నయ్యెడి మలంబులం ధారణా వశంబునం బోనడచి ధారణా నియమంబు గలుగ సుఖాత్మకంబగు విషయంబు నవలోకించు యోగి పరమంబైన విష్ణుపదంబునకుం చనును. మోక్షంబు సిద్ధించు. చిత్తమును సుస్థిరము గావించి ఆపై చిత్తమును నిర్మలము చేసికొని భగవంతునిని ధ్యానించవలయును. దీనినే చిత్త శుద్ధి అని అందురు.

**మనస్సు:-** దట్టంబయిన కర్మ ఘట్టంబుల నిట్టట్టు మెట్టెడి మనంబును శేముషీ బలంబున నిరోధించి నిర్విషయంబయిన మనంబున భగవత్ అవయవంబులన్ క్రమంబున ధ్యానంబు చేయుచు భగవతాకారంబు తోడ బంధించి మానసంబున జగత్పవిత్రీకరణ సమర్థంబయి అకారాది త్రివర్ణ కలితంబై బ్రహ్మ బీజంబయిన ప్రణవంబు సంస్మరించ వలయును. సంసారమునందుండియు మనంబున నెప్పుడు ముక్తి చింతచేయు నప్పుడు సంసారమును బాయును.

**బుద్ధి:-** విషయంబుల వెంటనంటి పాఱెడి ఇంద్రియములనెల్ల బుద్ధి సారథియై మనో నామకంబులయిన పగ్గంబులం బిగపట్టి మొగ్గందిగిచి హృదయంబు నందు తదీయ మూర్తిని ధ్యానము చేయుచు ఆత్మాను సంధానము చేయవలయును. అంతఃకరణమునే తాంత్రికులు బ్రహ్మ గ్రంథి, విష్ణు గ్రంథి, రుద్ర గ్రంథి విభేదనముగా చెప్పుదురు.

జీవుడు రథికుడు. శరీరము రథము. బుద్ధి సారథి. మనస్సు పగ్గము మఱియు

కొరడా. ప్రాణము ఇరుసు. ధర్మాధర్మములు రెండు చక్రములు. ఇంద్రియములు గుఱ్ఱములు. శబ్దాది విషయములు సంచార భూములు. అనగా అమృతత్త్వమును పొందగోరిన జీవుడు బుద్ధి ద్వారా మనస్సును, మనస్సు ద్వారా ఇంద్రియములను స్వాధీనము చేసికొనవలయును. ఇంద్రియములను సక్రమ మార్గమున అనగా ధర్మమార్గమున నడిపించ వలయును. అంతఃకరణ శుద్ధి కలిగి ఉండవలయును.

**న కర్మణా న ప్రజయా ధనేన** అని కర్మల ద్వారా అమృతత్త్వము పొందలేరు అన్నది కైవల్య ఉపనిషత్. పెద్దలు కర్మ బంధమనిరి. ఈశోపనిషత్ **కుర్వన్నే వేహ కర్మాణి** మఱియు **న కర్మ లిప్యతే నరే** అని చెప్పినది. అనగా మానవుడు కర్మాచరణ చేయవలయును. కర్మ బంధము కాదు. **అవిద్యయా మృత్యుంతీర్త్వా విద్యయాఽమృత అశ్నుతే** అని ఈశోపనిషత్ చెప్పినది. ఈవిధముగా ఒకరు కర్మ బంధమని అనగా పుణ్యలోక ప్రాప్తి పొంది తిరిగి పునర్జన్మకు వత్తురని, మఱియొకరు కర్మ బంధము కాదని మఱియు అమృతత్త్వమును పొందవచ్చునని చెప్పిరి. దీనిపై శ్రీకృష్ణుడు కర్మలు ఎవరెవరు చేయుదురు? కర్మలు ఏవిధముగా చేయవలయును? ఏ కర్మలు బంధము? ఏకర్మలు బంధము కావు? జ్ఞాని కూడా కర్మలు చేయవలయునా? అజ్ఞానికి జ్ఞాని కర్మబంధము గుఱించి వివరించవచ్చునా అన్న విషయముపై కర్మయోగము జ్ఞానయోగము కర్మసన్న్యాసయోగములో వివరించినాడు. జనకాదులు కర్మద్వారా స్వస్వరూపమును పొంది అమృతత్త్వమును పొంది విదేహులయినారు అని చెప్పినాడు.

పుణ్యకర్మలు ఇరువురు చేయుదురు. ఒకరు కీర్తి, ప్రతిష్ఠలు కోరి మఱియు ఇహలోక పరలోక సుఖములగు భార్యాపుత్రాదులు, ధనధాన్యములు, సంపదలు, భోగభాగ్యములు, స్వర్గాది సుఖములు కోరి చేయుదురు. ఈ కర్మ బంధము. ఇట్టి కర్మణ్యులకు జ్ఞాని బుద్ధి భేదము కలిగించరాదు. అమృతత్త్వమును పొందుటకు కొందఱు కర్మలు చేయుదురు. ఆవిధముగా అమృతత్త్వము పొందు కర్మయోగము శ్రీకృష్ణుడు భగవద్గీతలో చెప్పినాడు. మనోవాక్కాయములతో చేయునది అంతా కర్మగానే చెప్పబడును.

*****



# కర్మయోగము

కర్మలో వికర్మ,అకర్మ, సకర్మ అని కలవు. శాస్త్ర విహిత కర్మ, కర్మ బాహుళ్యము, అపభ్రంశములు కలవు. కర్మ బాహుళ్యము, అపభ్రంశములు మాని శాస్త్ర విహిత పద్ధతిన కర్మలు చేయవలయును. కర్మానుష్ఠానములో సందేహము కలిగినపుడు సమదర్శులు, ధర్మ పరులు, స్వతంత్ర జీవనము గడుపువారు, మోక్షార్థులు అయిన పెద్దల ఆచరణ పద్ధతిని పాటించ వలయును. కర్మయోగము ద్వారా జీవుడు ఈశ్వరుడగును. ఈవిధముగా ఆచరించిన కర్మలు బంధముకావు.

**ధర్మము:-** తన దేహనిర్వహణకు అవసరమయిన కర్మలు చేయవలయును. తన జాతి ధర్మములను, ఆశ్రమ ధర్మములను పాటించ వలయును. వ్యక్తియొక్క విధులు, బాధ్యతలు నెఱవేర్చ వలయును. దేవతల ఋణము, పితృదేవతల ఋణము, ఋషుల ఋణము తీర్చవలయును. తోటి మానవులయందు పశు, పక్ష్యాదులయందు, కరుణ కలిగి ఉండవలయును.

**అర్థము:-** ధర్మయుతముగా జీవనోపాధికి అవసరమైనంత ధనము మాత్రమే సంపాదించవలయును. ఆధనముతోనే కుటుంబపోషణ చేయుచు కొంత దాన ధర్మముల క్రింద వినియోగము చేయవలయును.

**కామము:-** జీవుడు ఇంద్రియములతో ఇంద్రియార్థములను, భోగించుట కామముగా చెప్పబడును. ధర్మయుతముగా సంపాదించిన ధనముతో ధర్మ పద్ధతిని సుఖభోగములను అనుభవించవలయును.

కర్మ

| వస్తువినియోగముతో చేయు పనులు | ధనముతో పనిలేకుండా చేయు పనులు |
| --- | --- |
| బాహ్య యజ్ఞము చేయవలయును | స్వాధ్యాయము, తపస్సు మొదలగునవి చేయవలయును |

బ్రహ్మమనే అగ్నియందు సర్వ కర్మలు హోమము చేయవలయును. అనగా సర్వ కర్మలు ఈశ్వరార్పణగా చేయవలయును.

**ఇంద్రియములు:-** కర్మేంద్రియ జ్ఞానేంద్రియములను నిగ్రహించ వలయును. ఇంద్రియ విషయములను జ్ఞానేంద్రియములు గ్రహింపకుండా నిగ్రహించ వలయును. జ్ఞానేంద్రియములను ఇంద్రియార్థములపై ప్రసరించకుండా నిగ్రహించ వలయును. జితేంద్రియుడై కర్మలను ఆచరించవలయును.

**అంతఃకరణము - ఉండకూడని గుణములు:-** తమోగుణము, రజోగుణములను వదలి అనగా దుర్గుణములు లేకుండా కర్మలు చేయవలయును. **నిరాశి నిర్మమో భూత్వా** అనగా ఆశలేకుండా, మమకారము లేకుండా; **కామసంకల్ప వర్జితాః**- కామము క్రోధము లేకుండా; **వీతరాగ భయక్రోధాః**- రాగము భయములేకుండా, ప్రియాప్రియములు లేకుండా; **నద్వేష్టి నకాంక్షతి**, ద్వేషము, కోరిక లేకుండా, **విమత్సరః** -మత్సరము లేకుండా కర్మలు చేయవలయును.

**ఉండవలసిన గుణములు:-** సత్త్వ గుణము కలిగి ఉండవలయును. **నిత్య తృప్తస్సన్ యదృచ్ఛాలాభ సంతుష్టః** - దొరికిన దానితో తృప్తిపడి; **నిరాశ్రయస్సన్** అనగా రాజులను, ధనమదాంధులను ఆశ్రయింపక; **త్యక్త పరిగ్రహః** - అపరిగ్రహము పాటించుచు, త్యక్త సర్వ అనగా వైరాగ్యము విరక్తి కలిగి; **మత్మయ మాం ఉపాసితాః** - భగవంతుని ఆశ్రయించి కర్మలు చేయవలయును.

**గుణరహిత స్థితి:-** యత చిత్తాత్మా, విశుద్ధాత్మా, విజితాత్మా, ద్వందాతీతః, నిర్ద్వందః అనగా ద్వంద రహితుడయి కర్మలు చేయవలయును.

**సారాంశము:-** కర్మలయందు ఆసక్తి లేక భగవత్ప్రీతికై కర్మలు చేయవలయును. నేను, నాది, అనే మమకారము లేకుండా కర్మలు చేయవలయును. ఈషణాత్రయములను వదలవలయును. అరిషడ్వర్గములను జయించ వలయును. **సిద్ధావసిద్ధౌచ సమః కృత్వా** అనగా సిద్ధి, సిద్ధి పొందకుండుట అనునవి సమముగా భావించి కర్తృత్వము లేకుండా కర్మలు చేయవలయును. కర్మ ఫలా సంగం త్యక్త్వా కర్మ ఫలితమును భగవంతునికి సమర్పించ వలయును. సర్వ భూతాత్మ భూతాత్మా అనగా సర్వభూతములు తనయందు, తనని సర్వభూతములయందు దర్శించ వలయును. సర్వము పరబ్రహ్మ స్వరూపమని గ్రహించ వలయును. జ్ఞానాగ్ని దగ్ధ



కర్మాణి ఇటువంటి జ్ఞానము కలిగి చేసిన కర్మలు అమృతత్త్వమును కలిగించును. జీవుడు ఈశ్వరుడగును. అంతఃకరణ శుద్ధిలేని కర్మలు పునర్జన్మను కలుగజేయును. విధివిహితముగా పుణ్యకర్మలు చేసి పుణ్య ఫలితమును కోరినవారు దక్షిణాయన మార్గమున పయనించి బ్రహ్మలోకము చేరి పుణ్యము క్షీణించగనే తిరిగి భూలోకమున మానవునిగా పుట్టుదురు.

పుణ్యకర్మల ఫలితము కోరని వారు శాశ్వత బ్రహ్మలోక ప్రాప్తి పొందుదురు. ఇది ఉత్తరాయణమార్గము. వీరు కల్పాంతమున అధికార పురుషులగుదురు.

**అసక్తో హ్యాచరన్ కర్మ పరమాప్నోతి పూరుషః** (భగవద్గీత కర్మయోగము, 19)లో చెప్పిన ఈ ఆచరణకు ఉదాహరణగా భాగవతములో నారదుని పూర్వజన్మ వృత్తాంతముగా, వైవస్వత మనువు యొక్క పూర్వజన్మ వృత్తాంతముగా వివరించబడినది.

*****

# పూర్వజన్మలో నారదుని సాధన

నారదుడు, పోయిన మహాకల్పమునందు గంధర్వులలోన ఉపబర్హనుండను గంధర్వుడు. ఇతడు విశ్వ స్రష్టలయిన బ్రహ్మలు(ప్రజాపతులు) దేవ సత్త్ర యాగము చేయుచుండగా ఆ యాగమున ఇతడు కొన్ని విష్ణు కథలు పాడి, సతులంగూడి మోహితుడై ఆ యాగమునుండి వెడలి పోయెను. అంత బ్రాహ్మణులు ఇతనిని శూద్రజాతి సతికి కొడుకువు కమ్మని శపించిరి. అంత ఉపబర్హణుడను పేరు గల గంధర్వుడు మఱుజన్మలో శూద్రుడుగా జన్మించెను.

ఈ కథలో సారాంశము:- విష్ణు సేవగా వాక్కుతో విష్ణుకథలు పాడినను అంతఃకరణములో స్త్రీ వ్యామోహితుడగుటవలన, అంతఃకరణ శుద్ధి లేదు. కావున అమృతత్త్వమును పొందక పునర్జన్మకు వచ్చెను. ఈ కథలో పునర్జన్మ వచ్చుటకు గల కారణము చెప్పబడినది. ఈ దోషము సరిదిద్దుకొనిన అమృతత్త్వమును పొందును. ఈ విషయమును నారదుడు శూద్రజాతి కొడుకుగా పుట్టినప్పుడు చేసిన ఆచరణ విధానమును వివరింపబడినది.

చ॥ **తన కులధర్మమున్ విడిచి దానవ వైరి పదారవిందముల్**
**పనివడి సేవసేసి పరిపాకము నొందక యెవ్వఁడేనిఁ జ**
**చ్చిన మఱు మేనవైన నది సిద్ధి వహించుఁ దదీయ సేవఁ బా**
**సినఁ గుల ధర్మ గౌరవము సిద్ధి వహించునె యెన్నిమేనులన్**

(భాగవతము, ప్రథమ స్కంధము, 100)

కేవలము కులధర్మములను అనగా జాతి ధర్మములు, ఆశ్రమ ధర్మములు పాటించుచు శ్రౌత, స్మార్త కర్మలు చేయుచు, కుటుంబ భారమును వహించుచు, నిజకుటుంబ పారవశ్యములో ఉండి చచ్చినవాడు అమృతత్త్వమును పొందక, పునర్జన్మకు వచ్చును. కులధర్మములు, ఆశ్రమ ధర్మములు, విధులు, బాధ్యతలు పాటించుచు భగవత్సేవ చేయుచు అంతఃకరణ శుద్ధి కలిగి దేహమును వదలిన అమృతత్త్వమును పొందును. దీనికి ఉదాహరణగా నారదుని పూర్వజన్మ వృత్తాంతమునకు సంబంధించిన కథ చెప్పబడినది. తన జాతి ధర్మములను ఆశ్రమ ధర్మములను పాటించుచు, చేయరాని పనులను, దుర్గుణములను, ఈషణత్రయములను, కామ, క్రోధ, లోభ, మోహ,



మద, మాత్సర్యములనే అరిషడ్వర్గములను విడచి, విరక్తి, వైరాగ్యములు కలిగి, ఇంద్రియములు, అంతఃకరణములు భగవంతునిపై ఉంచి భగవత్సేవ చేసినవాడు పునర్జన్మకు రాడు. అధికార పురుషుడై బ్రహ్మయగును.

**హరి సేవ:-** కాలక్రమమున సుఖదుఃఖములు ప్రాప్తంబులయినను హరి సేవ విడువందగదు. హరి సేవకుండగువాడు జననంబు నొందియు నన్యుని క్రియ సంసారంబున చిక్కండు. భక్త రస వశీకృతుండై విడువ నిచ్చగింపడు. (భాగవతము, ప్రథమ స్కంధము, 101)

**నారదుని గత జన్మసాధన:-**

జాతి: శూద్రుడు. ఆశ్రమము: బ్రహ్మచారి. ప్రదేశము: స్వస్థలము.

కర్మయోగములో ఒక వ్యక్తి జాతి ఆశ్రమ ధర్మములను పాటించవలయును. దీనికి ఉదాహరణగా శూద్రకులమునందు జన్మించిన ఇతడు బ్రాహ్మణాది కులములకు విధింపబడిన యజ్ఞయాగాదులు, అగ్నిహోత్రము, స్వాధ్యాయములను కాక శూద్రజాతికి చెప్పబడిన సేవను ఆచరించెను. యోగిజనుల సేవకై యజమానిచే నియోగింపబడెను. అనగా మహాత్ముల సేవ ప్రారంభించెను.

**సేవచేయు విధానము:-** ఓర్పుతో, నేర్పుతో, భయభక్తులతో సేవ చేసెను. వివేకము కలిగి, విపరీత జ్ఞానము లేకుండా ఉండెను. సంసార తాపత్రయములు అనగా జంజాటములు లేకుండా సేవ చేసెను. ఎండకు వానకు ఓర్చుకొనెను. అనగా తితీక్ష కలిగి సేవ చేసెను. చపలత్వము లేకుండా ఏకాగ్రతతో శ్రద్ధగా మహాత్ముల మెప్పుపొందునట్లు సేవ చేసెను. ఈవిధముగా తను, హృత్, భాషల సేవ చేసెను. ఆవిధముగా సేవ చేయగా గురువులు సంప్రీతులై నిష్కపటత్వమున దీనవత్సలతో కారుణ్య సంయుక్తులై ఈశ్వర విజ్ఞానమును ఉపదేశించిరి. అనగా ఆత్మ, ఈశ్వరుడు, విరాట్పురుషుడు, అతను చేసిన సృష్టి, దేహము, ఇంద్రియములు, ఇంద్రియార్థములు, ప్రాణము, అంతఃకరణ చతుష్టయము, గుణములు, అరిషడ్వర్గములు, సంసారము, కర్మ, కర్మ లక్షణములు, జీవుడు ఈశ్వరుడగు విధానమును శాస్త్ర పాఠముగా బోధించిరి. తద్వారా మాయా స్వరూపము అవగతమయినది. జీవుడు బ్రహ్మ స్వరూపుడు. దేహము మాయాకల్పితము. ఈవిధముగా దేహి, దేహములు వేఱు

అని శాస్త్రము వలన తెలిసినది. కర్మంబులు సంసార హేతుకంబులు అయినను ఈశ్వరునియందు సమర్పితంబయిన తాపత్రయంబు మానుప ఔషధంబగునని తెలిసినది. ఆ యోగి జనులు శ్రీకృష్ణుని అనగా భగవంతునిని వర్ణింపగా, పాడగా, చదవగా వినెను. మది సంతోషించి విష్ణుసేవ ప్రారంభించెను. ఆయోగి జనులనలన రజస్తమోగుణ పరిహారిణియైన భక్తి సంభవించినది. ఈవిధముగా గురువుల ద్వారా శాస్త్ర జ్ఞానమును పొంది ఆచరణ విధానమును చేపట్టినాడు.

కొంతకాలమునకు తల్లి చనిపోయినది. అంత ఇతడు దుఃఖసాగరములో మునిగి విషాదమును పొందలేదు. కాల క్రమమున సుఖదుఃఖములు ప్రాప్తంబులగునని గ్రహించి హరిసేవ విడువలేదు. దేహసంబంధీకుల యందు మోహ రుచి పొందలేదు. ఇల్లు వదలి ఉత్తరాభిముఖుడై అరణ్యములో ఒక రావి చెట్టు వద్ద అనగా విజన స్థలమున, ఏకాంతమున కూర్చుండి హృదయగతుడైన పరమాత్మను నిరంతరము స్మరించినాడు. మోహిగాక ఎఱుక కలిగి మాయావరణలో చిక్కుకొనక అనగా మోసపోక మాఱు చింతలేక అనగా ఏకాగ్రతతో భగవంతుని చింతించినాడు. మౌనియై అనగా కర్మేంద్రియ జ్ఞానేంద్రియములను నిగ్రహించినాడు. కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యములనే అరిషడ్వర్గములను జయించినాడు. నిర్మల అంతఃకరణంబులతోడ విషయ విరక్తుడైనాడు. దేహధ్యాస పోయినది. ఈవిధముగా సాధనచేయగా ఆత్మ దర్శనమైనది. దేహత్యాగానంతరము శుద్ధ సత్త్వమయంబైన భాగవత దేహమున ప్రవేశించినాడు.

ఈవిధముగా కర్మలను అనుష్ఠించిన అమృతత్త్వము కలుగును.

సాధారణముగా ప్రతి వ్యక్తియు గుడికి వెళ్ళుట, కొబ్బరికాయలు కొట్టుట, వ్రతములు చేయుట, యజ్ఞముచేయుట, పూజలు చేయుట, భజనలుచేయుట, పుణ్యా నదీ స్నానము, దానము, ధర్మము, ఏకాదశి ఉపవాసములు అను పుణ్యకర్మలను చేయుదురు. కానీ సంసార తాపత్రయములను వీడి కర్మయందు కర్తృత్వ భావనను వీడి అంతఃకరణ శుద్ధి కలిగి చేయువారి సంఖ్య అతి స్వల్పము. కావుననే అనేక వేల మందిలో ఒకడు మాత్రమే కర్మానుష్ఠానము చేసి అమృతత్త్వమును పొందునని శ్రీకృష్ణుడు భగవద్గీతలో చెప్పినాడు. ఉదాహరణగా జనకాదులను పేర్కొనినారు.



## వైవస్వతమనువు

పోయిన కల్పమున ద్రవిడ దేశపు రాజు అయిన సత్యవ్రతుడు జలభక్షణము చేయుచు నిష్ఠతోడ ఒక నదీ సమీపమున తపస్సు చేసెను. ఆరాజునకు సాంఖ్యయోగ క్రియా సహితయగు పురాణ సంహితను భగవంతుడు ఉపదేశించెను. ఆత్మ దర్శనమయినది. భగవంతుడు కాలజ్ఞానమును చెప్పి నేటికి ఏడవ దినమున జలార్ణవము అగునని ఈ రాజునకు, మునులకు అలజడి కలుగకుండ కాపాడుదునని పలికి అదృశ్యుడాయెను. దేహత్యాగ సమయమున తూర్పుదిక్కున దర్భశయ్యపై సత్యవ్రతుడు పరుండినాడు. దేహమును పరిత్యజించినాడు. ఆ రాజు బ్రహ్మ స్వరూపంబు విని కృతార్థుడై సూర్యునకు శ్రాద్ధ దేవుండన జన్మించి ఏడవ మనువయ్యెను. నేడు ఆమనువు కాలము నడుచుచున్నది.

*****

# యోగసాధన

## పతంజలి యోగసూత్రములు

### ప్రథమోऽధ్యాయః

1. **అథ యోగాను శాసనమ్**

యోగము గుఱించి విపులీకరించబడుచున్నది.

2. **యోగః చిత్త వృత్తి నిరోధః**

చిత్తవృత్తి నిరోధము యోగమనబడును. పరిపరి విధములయిన ఆలోచనలు అరికట్టుట యోగమనబడును. పరిపరి విధములయిన ఆలోచనలనే చిత్త చాంచల్యమందురు. చిత్త చాంచల్యముండకుండుట యోగము.

3. **తదాద్రష్టుః స్వరూపేऽవ స్థానమ్**

చిత్తవృత్తి నిరోధమయినప్పుడు జీవుడు పరమాత్మతో ఏకీభూతస్థితి యందుండును.

4. **వృత్తి సారూప్యమితరత్ర**

చిత్తవృత్తి నిరోధము కానప్పుడు చిత్తము భావములతో స్వారూప్యము పొందును. అనగా ఒకడు తనను పొగడిన చిత్తము పొగడ్తకు ఉప్పొంగును. ఆభావము పైకి బహిర్గతమగును. అనగా ఆవృత్తితో జీవుడు తాదాత్మమును బొందును.

**చిత్త వృత్తులు 5 విధములు**

5. **వృత్తయః పంచతయ్యః క్లిష్టా ऽక్లిష్టాః**

క్లేశములు గలవి, క్లేశములు లేనివి అని చిత్తవృత్తులు 5 విధములు. అవి ఏవనగా

6. **ప్రమాణ, విపర్యయ వికల్ప, నిద్రా, స్మృతయః**



ప్రమాణ వృతి, విపర్యయ,వృత్తి, వికల్ప వృత్తి, నిద్రావృత్తి, స్మృతి వృత్తి అని 5 విధములు.

**ప్రమాణ వృత్తి**

7. **ప్రత్యక్ష, అనుమాన, ఆగమాః, ప్రమాణాని**

ప్రత్యక్ష, అనుమాన, శబ్ద ప్రమాణములు 3 విధములు

**విపర్యయ వృత్తి**

8. **విపర్యయో మిథ్యాజ్ఞాన మతద్రూప ప్రతిష్ఠమ్**

ఒకవస్తువును చూచి వేఱొక వస్తువని భ్రాంతి లేక మిథ్యాజ్ఞానము విపర్యయ వృత్తి.

**వికల్ప వృత్తి**

9. **శబ్ద జ్ఞానానుపాతీ వస్తుశూన్యో వికల్పః**

శబ్దానుగుణమయిన వస్తువు లేకున్నను ఒక వార్త చెవిని పడగనే భావావేశము గలుగును. ఇదియే వికల్ప వృత్తి.

**నిద్రా వృత్తి**

10. **అభావ ప్రత్యయాలంబనా వృత్తిర్నిద్రా**

అభావము నాశ్రయించి యుండునట్టి వృత్తి నిద్రా వృత్తి. చిత్తములో బీజరూపముగా నున్న వాసనలు నిద్రలో, స్వప్నములో కలల రూపమున అనుభవమునకు వచ్చును.

**స్మృతి వృత్తి**

11. **అనుభూత విషయా సంప్రమోషః స్మృతిః**

ఇంతకు పూర్వం పై నాలుగు వృత్తులచే అనుభవింపబడిన విషయములు జ్ఞప్తికి వచ్చుట.

**అయితే చిత్త స్వాధీనమెటుల?**

**12. అభ్యాస వైరాగ్యాభ్యాం తన్నిరోధః**

అభ్యాస వైరాగ్యములచే చిత్త వృత్తులు నిరోధింపబడవలయును.

**అభ్యాస మనగా నేమి?**

**13. తత్ర స్థితౌ యత్నోఽభ్యాసః**

చిత్తవృత్తులను అరికట్టుటకు చేయు నిరంతరయత్నము అభ్యాసము.

**14. స తు దీర్ఘకాల నైరంతర్య సత్కారాసేవితో దృఢభూమిః**

ఆ అభ్యాసము బహుకాలము నిరంతరము ఆదరాతిశయముతో సేవింపబడిన యెడల స్థిరమైన స్థితి కలుగును.

**వైరాగ్యం**

**15. దృష్టానుశ్రవిక విషయ వితృష్ణస్య వశీకార సంజ్ఞా వైరాగ్యమ్**

ఇంద్రియార్థములు తనకు వశములో వుండుట లేక యిహముత్రార్థఫల భోగ విరాగము వైరాగ్యమనబడును.

**16. తత్పరం పురుష ఖ్యాతేర్గుణ వైతృష్ణ్యమ్**

త్రిగుణ రహిత స్థితి వైరాగ్యము. దీని వలన పరమ పురుషుని దర్శించగలము.

**సమాధి స్థితులు**
**సంప్రజ్ఞాత సమాధి**

**17. వితర్క విచారానందాస్మితాను గమాత్ సంప్రజ్ఞాతః**

వితర్క మనియు, విచారమనియు, ఆనందమనియు, అస్మిత మనియు, సంప్రజ్ఞాత సమాధి నాలుగు విధములు. యోగ శక్తులు గలుగును.

**అసంప్రజ్ఞాత సమాధి**

**18. విరామ ప్రత్యయాభ్యాస పూర్వః సంస్కార శేషోఽన్యః**



జన్మరాహిత్యము. చిత్తవృత్తులు నన్నింటిని నిరాకరించునట్టి, నిరంతర అభ్యాసము వలన పొందబడు ఉపాధి పరంపరావస్థానమును ప్రకృతి నశించి ఆత్మ మాత్రము శేషించి యుండునట్టిదగు సమాధి.

**19. భవ, ప్రత్యయో విదేహ, ప్రకృతిలయానామ్**

ఉపాధి పరంపరలకు కారణమగు ప్రకృతి లయమగుట వలన కేవలం ఆత్మ శేషించి యుండుటవలన వీరు విదేహులు.

**20. శ్రద్ధా,వీర్య, స్మృతి, సమాధి, ప్రజ్ఞా, పూర్వక ఇతరేషామ్**

బ్రహ్మచర్యము, శ్రద్ధ, వీర్యము,స్మృతి, ఏకాగ్రత, ప్రజ్ఞ మొదలయిన వాటి వలన అసంప్రజ్ఞాత సమాధి గలుగుచున్నది.

**21. తీవ్ర సంవేగానామాసన్నః**

తీవ్రేచ్ఛ గలవారికి త్వరితముగ ఫలము గలుగును. సిద్ధి గలుగును.

**22. మృదు మధ్యాది మాత్ర త్వాత్తతోఽపి విశేషః**

మందము, సామాన్యము, తీవ్రము అను సాధన భేదముల ననుసరించి సిద్ధియందు తారతమ్యము కలదు

**కర్మసన్యాసము**

**23. ఈశ్వర ప్రణిధానాద్వా**

కర్మఫలితము ఈశ్వరునికి సమర్పించవలయును. లేదా నిష్కామ కర్మాచరణ చేయవలయును.

**ఈశ్వరుడనగానెవడు?**

**24. క్లేశ కర్మ విపాకాశయై రసరామృష్టః పురుషవిశేష ఈశ్వరః**

(ఈశ్వరుడు జగత్కర్త) క్లేశము, కర్మము, కర్మఫలము, కామము అను వానిచే బాధితుడు కాని పురుషుడు.

25. **తత్ర నిరతిశయం సర్వజ్ఞత్వబీజమ్**

జీవుని యందు సర్వజ్ఞత్వము అల్పము. ఇతని యందు అనంతము.

26. **న పూర్వేషామపిగురుః కాలేనాన వచ్ఛేదాత్**

మనకంటేపూర్వ ఆచార్యులకు కూడ యితడు గురువు. ఆది గురువు జగద్గురువు. ఇతడు కాలమునకు వశము కాదు. కాలాతీతుడు.

27. **తస్యవాచకః ప్రణవః**

ఈశ్వరునియొక్క స్థానమును పొందుటకు ఓంకారము సాధనము

28. **తజ్జపస్తదర్థభావనమ్**

ఓంకారమును జపించుచు దాని అర్థమును భావించ వలయును. జపము ఒకటి చేస్తుంది. ఇంకొకటి లౌకికమును ఆలోచించుచుండును. కావున ఆ ఆలోచనలను మరలించి ఓంకార అర్థమును భావించ వలయును.

29. **తతః ప్రత్యక్చేతనాధిగమో౽ప్యంతరాయాభావశ్చ**

ఓంకార జపము వలన యోగ విఘ్నములు తొలగును. అంతర దృష్టి గలుగును.

**యోగఅంతరాయములు**

30. **వ్యాధి,స్త్యాన సంశయ, ప్రమాదాలస్యా విరతి, భ్రాంతి దర్శనాలబ్ధ, భూమికత్వానవస్థితత్వాని చిత్తవిక్షేపాస్తే౽న్తరాయాః**

వ్యాధి,మానసిక జడత్వము, సంశయము, అజాగ్రత్త, ఆలస్య ( మత్తత) విరతి (అతృప్తి), భ్రమ, చిత్త స్థైర్యము నిలవకుండుట, యోగ అంతరాయములు.

**చిత్త విక్షేప నివారణ**

31. **దుఃఖ, దౌర్మన స్యాంగమే జయత్వ శ్వాస ప్రశ్వాసా విక్షేప సహభువః**

దుఃఖము, చిత్తక్షోభము, శరీరమునందు కంపము, క్రమ విరహితమైన శ్వాస చిత్త విక్షేప కారణములు.





32. **తత్ప్రతిషేధార్థమేక తత్త్వాభ్యాసః**

దానిని నివారించుటకు చిత్తమును ఒకే విషయముపై నిలిపి ధ్యేయాకారమును పొందునట్లు చేయవలయును. హరి తలచి తలచి జగము హరియని తలచె కనుడు.

చిత్త ప్రసన్నత : మంచి గుణములను పెంపొందించుకొనవలయును.

33. **మైత్రీ కరుణా ముదితోపేక్షాణాం సుఖ దుఃఖ పుణ్యా పుణ్య విషయాణాం భావనా తశ్చిత్త ప్రసాదనమ్**

మైత్రి, కరుణ (దయ), ముదిత (సంతోషము), ఉపేక్ష (ఉదాసీనత), సుఖదుఃఖ పుణ్యా పాప విషయములపై భావన అనగా ఆలోచన వలన చిత్త ప్రసన్నత గలుగును.

34. **ప్రచ్ఛర్దన విధారణాభ్యాం వా ప్రాణస్య**

( కొలదిగా రేచక పూరక కుంభకముల నభ్యసించిన చాలును) ప్రాణమును నిలుపుట విడుచుట చేత చిత్త ప్రసన్నత గలుగును.

35. **విషయవతీ వా ప్రవృత్తిరుత్పన్నా మనసః స్థితి నిబంధినీ**

కొన్ని విషయానుభవముల వలన గలుగు ప్రవృత్తి చిత్త స్థైర్యమును గలుగచేయును. నాసికాగ్రమున చిత్త ఏకాగ్రత వలన దివ్య పరిమళముల ఆఘ్రాణము కలుగును.

36. **విశోకావా జ్యోతిష్మతీ**

దివ్యజ్యోతిని ధ్యానించ వలయును.

37. **వీతరాగ విషయం వాచిత్తమ్**

విషయములను, విషయ వాసనలను పరిత్యజించిన చిత్తము ప్రసన్నత గలుగును, విషయ చింతన వలన కామము, క్రోధము, బుద్ధి నాశము గలుగునని గీత

బోధించుచున్నది.

**38. స్వప్న నిద్రా జ్ఞానాలంబనం వా**

చక్కని స్వప్నము, సుఖనిద్ర, జ్ఞానము వలన చిత్త ప్రసన్నత గలుగును.

**39. యథాభిమత ధ్యానా ద్వా**

తన కిష్టమయిన దైవపుణ్యావిషయమును ధ్యానించుట వలన అనగా ముచ్చటించుట, సంభాషించుట, భావించుట.

**నిరంతర నామస్మరణ**

**40. పరమాణు పరమ మహత్త్వాంతోఽ స్యవశీకారః**

పరమాణువు నుంచి పరమాత్మ వఱకు వశీకారమై యుండును.

**మాలిన్య రహితమైన చిత్తము**

**41. క్షీణ వృత్తే రభిజాత స్యేవ మణేర్గ్రహీతృ గ్రహణ గ్రాహ్యేషు తత్స్థతదంజనతా సమాపత్తిః**

స్ఫటికమునందు వస్తువులు ప్రతిబింబించునట్లు నిర్మలమైన చిత్తమున ధ్యేయ వస్తువుతో యోగి ఏకత్వమును బొందును. అనగా ఈశ్వరునితో తాదాత్మము చెందును.

**సవితర్క సమాధి శాస్త్రజ్ఞానము**

**42. తత్ర శబ్దార్థ జ్ఞాన వికల్పైః సంకీర్ణా సవితర్కా సమపత్తిః**

శబ్దము, అర్థము, జ్ఞానము అనునవి మూడు కలసియున్న సవితర్క సమాధి. పురాణాది గ్రంథములు చదివిన విషయము సుబోధకమగును.

**నిర్వితర్క సమాధి అనుభవజ్ఞానము**

**43 స్మృతి పరిశుద్ధౌ స్వరూప శూన్యేవార్థమాత్ర నిర్భాసా నిర్వితర్కా**

స్మృతి పరిశుద్ధమై లేక స్వరూప శూన్యమై ధ్యేయము చిత్తములో భాసించిన, నిర్వితర్కసమాధి. శాస్త్రజ్ఞానము పూర్తిగా అనుభవములోనికి వచ్చును .



**44. ఏతయైవ సవిచారా నిర్విచారాచ సూక్ష్మ విషయా వ్యాఖ్యాతా**

శాస్త్రమందలి అంతర్గత రహస్యములు విశదమగును. శాస్త్రమందలి సూక్ష్మ విషయములగు అంతర్గత రహస్యములు అవగతమగును. ఇది సవిచార సమాధి అని ఇది నిర్విచార సమాధి అని అనుభవమునకు వచ్చును.

**45. సూక్ష్మ విషయ త్వంచాలింగ, పర్యవసానమ్**

ఈశ్వర తత్త్వము స్థూల విషయముగా గాక సూక్ష్మ విషయముగా బుద్ధికి గోచరించును. ఈశ్వర తత్త్వము తెలియును.

**46. తా ఏవ స బీజఃసమాధిః**

అవి బీజ మాత్రములై యుండును. అనగా బుద్ధికి మాత్రము గోచరించును. (కాని ఈశ్వరునితో బుద్ధి సంయోగము చెందదు)

**47. నిర్విచార వైశారద్యేఽ ధ్యాత్మప్రసాదః**

ఈశ్వరునితో బుద్ధి సంయోగము చెందును. ఈశ్వరుడు కానంబడును. ఈశ్వరుడు కానంబడిన సంశయములు నశించును.

**48. ఋతంభరా తత్ర ప్రజ్ఞా**

ఆ ప్రజ్ఞ సత్యము, పరిపూర్ణము. దీనినే జ్ఞానమందురు.

**49. శ్రుతాను మాన ప్రజ్ఞాభ్యామన్య విషయా విశేషార్థత్వాత్**

ప్రత్యక్ష, అనుమానములచే లభించు జ్ఞానము లోక వ్యవహారములను తెలుపును. ఈ ఋతంభరా ప్రజ్ఞ, యతో మనసా వాచానివర్తంతే అని చెప్పిన ఈశ్వర జ్ఞానము ఈశ్వర తత్త్వమును తెలుపును.

**50. తజ్జః సంస్కారోఽ న్య సంస్కార ప్రతిబంధీ**

కావున ఈ ఋతంభరా ప్రజ్ఞ వలన గలిగిన సంస్కారము, ఇతర సంస్కారముల నన్నింటిని త్రోసిరాజగును.

**51. తస్యాపి నిరోధే సర్వనిరోధాన్నిర్బీజః సమాధిః**

ఇతర సంస్కారములను నిరోధించిన దానిని సమాధి అని అందురు.

*****

# ద్వితీయాధ్యాయము

క్రియా యోగ మనగా

1. **తపః స్వాధ్యాయేశ్వర ప్రణిధానాని క్రియాయోగః**

తపస్సు స్వాధ్యాయము కర్మఫలితమును ఈశ్వరునికి సమర్పించుట, క్రియాయోగ మనబడును.

2. **సమాధి భావనార్థః క్లేశ తనూకరణార్థశ్చ**

సమాధిని సిద్ధింపచేయుటకు, క్లేశమును క్షీణింప చేయుటకు క్రియా యోగ మేర్పడినది.

**క్లేశములు.**

3. **అవిద్యాస్మితా, రాగ, ద్వేషాభినివేశాః క్లేశాః**

అవిద్య, అహంకారము, రాగము, ద్వేషము, ప్రాణమునందలి తీపి ఈ 5ను క్లేశములు.

4. **అవిద్యా క్షేత్రముత్తరేషాం ప్రసుప్త, తను, విచ్ఛిన్నోదారాణామ్**

అవిద్యయే క్లేశములకు కారణము. క్లేశములు నిద్రాణములైయున్నను, అణగియున్నను, విజృంభించియున్నను అన్ని క్లేశములకు అవిద్యయే కారణము.

అవిద్య

5. **అనిద్యాశుచి, దుఃఖానాత్మసు నిత్య శుచి సుఖాత్మాఖ్యాతిరవిద్యా**

అనిత్యమైన వానిని నిత్యముగను, అశుచియైనవాటిని శుచిగలవాటిగా, దుఃఖాత్మకమగు వాటిని సుఖాత్మగా భావించుటయే అవిద్య.

**అస్మిత (అహంకారం)**

6. **దృగ్దర్శన శక్త్యోరేకాత్మ తైవాస్మితా**

దృక్, దర్శనములతో పురుషుడు తాదాత్మ్యమును బొందుటయే అస్మితము.

7. **సుఖానుశయీ రాగః**

సుఖమునను‌సరించి యుండునది రాగము. రాగమందలి అభిలాష క్లేశము.

8. **దుఃఖానుశయీ ద్వేషః**

దుఃఖము ననుసరించి యుండునది ద్వేషము. ద్వేష భావన క్లేశము.

9. **స్వ రసవాహీ విదుషోఽపి తథారూఢో ఽభినివేశః**

పండితులకు సహితము ప్రాణమునందు మమకారము మెండు. ప్రాణ భీతి క్లేశము.

10. **తే ప్రతి ప్రసవహేయాః సూక్ష్మాః**

బాహ్యముగా కనిపించక మనస్సులోని అంతః పొరలలో వుండు వీటిని ప్రతిలోమ ఆచరణచే నిరాకరించవలయును. అనగా ఈ క్లేశములను నశింప చేయవలయును.

11. **ధ్యాన హేయాస్త ద్వృత్తయః**

ఈక్లేశములను ధ్యానము ద్వారా తొలగించ వలయును.

12. **క్లేశమూలః కర్మాశయో దృష్టా దృష్ట జన్మవేదనీయః**

క్లేశములే కామ్య కర్మములకు మూలకారణములు. దృష్టమగు యీ జన్మమున గాని, అదృష్టమగు జన్మాంతరమున గాని కర్మానుభవము గలుగుచుండును.

13 **సతి మూలే తద్విపాకో జాత్యాయుర్భోగాః**

క్లేశముల వలన గలుగు కామ్య కర్మ కర్మానుభవము వలన జాతి, ఆయువు, భోగములు గలుగుచున్నవి.

14. **తే హ్లాదపరితాపఫలాః పుణ్యా పుణ్య హేతుత్వాత్**

క్లేశముల వలన చేయబడు పుణ్య పాప కర్మల వలన సుఖ దుఃఖఫలములు గలుగుచున్నవి.

**15. పరిణామ తాప సంస్కార దుఃఖైర్గుణ వృత్తి నిరోధాచ్చ దుఃఖమేవ సర్వం వివేకినః**

పుణ్య కర్మ బంగారు సంకెల. పాప కర్మ ఇనుప సంకెల. కావున గుణములచే ప్రకోపింపబడి చేయబడు పునర్జన్మకు హేతుభూతములగు కామ్య కర్మలు సర్వము వివేకి దుఃఖములుగనే భావించును.

**16. హేయం దుఃఖమనాగతమ్**

ఆగామి, సంచిత ప్రారబ్ధమని కర్మ త్రివిధములు. గత జన్మలో చేసుకున్న కర్మ ఫలము ప్రారబ్ధమని వ్యవహరింపబడుచూ యీ జన్మలో ఆకర్మ ఫలమునను భవించుచున్నాము. ఈజన్మలో చేసుకున్న అహం ప్రవృత్తిలో చేసుకున్న కామ్యకర్మ సంచితమై రాబోవు జన్మకు ఆగామి కర్మయగును. మరల రాబోవు జన్మలో యీ ఆగామి కర్మవలన సుఖ దుఃఖానుభవము గలుగును కావున కామ్యకర్మ హేయము. దుఃఖమును గలిగించు కామ్యకర్మ విడువ వలయును అనగా నిష్కాను కర్మ చేయవలయును.

**17. ద్రష్టృదృశ్యయోః సంయోగో హేయహేతుః**

ద్రష్ట - చూచువాడు-జీవాత్మ. దృశ్యం దృశ్యమాన ప్రపంచం. దృశ్యమాన ప్రపంచంలో జీవాత్మ యొక్క సంయోగము హేయము

**దృశ్యమనగా**

**18. ప్రకాశ, క్రియా, స్థితిశీలం భూతేంద్రియాత్మకం భోగాపవర్గార్థం దృశ్యమ్**

ప్రకాశము, క్రియ, స్థితి యనునవి స్వభావముగా గల్గినదియు, పృథివ్యాది భూతములతోడను, ఇంద్రియములతోడను గూడి పురుషునికి భోగ మోక్షములు గలిగించునది దృశ్యము.

**గుణములు**

**19. విశేషా విశేష లింగమాత్రాలింగాని గుణపర్వాణి**

నిర్దేశింపబడినవి, బడనివి, సూచింపబడినవి, బడనివి అని త్రిగుణములు సూచింపబడినవి.



**పురుషుడు (జీవాత్మ)**

**20. ద్రష్టా దృశిమాత్రః శుద్ధోఽపి ప్రత్యయానుపశ్యః**

పురుషుడు గుణరహితు డయినను, శుద్ధుడయినను బుద్ధి లక్షణములతో గూడి ద్రష్టయై దృశ్యమును చూచుచున్నాడు. దృశ్యము ప్రకృతి.

**21. తదర్థ ఏవ దృశ్యస్యాత్మా**

దృశ్యము, దృశ్యమాన ప్రపంచము, జీవాత్మ యొక్క అనుభవమునకే ఏర్పడినది. అనగా సుఖదుఃఖానుభవము గలుగుచున్నది. ఆ ప్రకృతి జీవన్ముక్తునకు సుఖ దుఃఖానుభవము గలుగచేయదు.

**22. కృతార్థం ప్రతి నష్టమప్యనష్టం తదన్యసాధారణ త్వాత్**

కృతార్థుడైన వానికి (జీవన్ముక్తునకు) ప్రకృతి నివర్తించినను యితరులకు ప్రకృతి సంయోగము సహజమగుటచే జీవాత్మకు ప్రకృతి యొక్క అనుభవము నశింపదు.

**23. స్వస్వామి శక్త్యోః స్వరూపోపలబ్ధిహేతుః సంయోగః**

ప్రకృతియు, ప్రకృతికి ప్రభువైన పురుషుడు, అను నీ శక్తులు రెంటి యొక్కయు స్వరూపానుభవమునకు సంయోగమే కారణము. ప్రకృతి, పురుషుల సంయోగము వలననే సుఖ దుఃఖానుభవము గలుగుచున్నది.

**24. తస్య హేతుర విద్యా**

ప్రకృతి పురుషుల సంయోగమునకు అవిద్య కారణము.

**అవిద్య నశించిన**

**25. తదభావాత్సంయోగాభావో హానం తద్దృశేః కైవల్యమ్**

అవిద్య నివర్తించిన ప్రకృతి పురుష సంయోగము నివర్తించును. అప్పుడు జీవుడు కర్తగాక సాక్షీ భూతుడగును. ఈసాక్షీభూతస్థితియే కైవల్యము.

## అవిద్య నాశనమునకు

**26. వివేకఖ్యాతిరవిప్లవా హానోపాయః**

వివేకము అవిద్యానాశనమునకు ఉపాయము

**27. తస్య సప్తధా ప్రాంతభూమిః ప్రజ్ఞా**

అవిద్యా నాశనము వలన గలుగు ప్రజ్ఞకు సప్తభూమికలు సోపానములు.

**28. యోగాంగానుష్ఠానాదశుద్ధిక్షయే జ్ఞానదీప్తిరావివేకఖ్యాతేః**

యోగాంగముల ననుష్ఠించుట వలన అశుద్ధి అనగా అవిద్య నశించి జ్ఞానము వెలుగొంది వివేక ఖ్యాతి గలుగును.

## యోగాంగములు

**29. యమ, నియమ,ఆసన, ప్రాణాయామ, ప్రత్యాహార ధారణా, ధ్యాన, సమాధయోఽ ష్టావంగాని**

యోగాంగములు 8. అవి ఏమనగా యమ, నియమ, ఆసన, ప్రాణాయామ, ప్రత్యాహార, ధ్యాన,ధారణ, సమాధి.

## యమము.

**30. అహింసా, సత్యాస్తేయ, బ్రహ్మచర్యాపరిగ్రహా యమాః**

అహింస, సత్యము, దొంగిలింపకుండుట (అనగా దొంగతనము, లంచగొండితనము, నల్ల బజారు, కల్తీ, మోసము, దగా), బ్రహ్మచర్యము, అపరిగ్రహము అనునవి యమము అనబడును. యమములో కర్మేంద్రియములకు శిక్షణ ఇవ్వబడును. వాక్కుకు అహింసా సత్యములు, చేతులకు దొంగలింపకుండుట, అపరిగ్రహము, గుహ్యమునకు బ్రహ్మచర్యము పాటించుట అనునవి చెప్పబడినవి.

**31. ఏతే జాతి, దేశ, కాల, సమయానవచ్ఛిన్నాః సార్వభౌమా మహావ్రతమ్**

యమమునందు చెప్పబడినవి జాతి, దేశ, కాల, సమయములని చెప్పక సర్వులు పాటించవలయును. ఇదే మహావ్రతం.





**32. శౌచ, సంతోష, తపః, స్వాధ్యయేశ్వరప్రణిధానాని నియమాః**

శౌచము, (బాహ్యాశౌచము, అంతఃశౌచము). సంతోషము, తపస్సు, స్వాధ్యాయము, ఈశ్వరారాధన వీటిని నియమములుగా చెప్పుదురు.

**33. వితర్క బాధనే ప్రతిపక్షభావనమ్**

యోగ ప్రతిబంధకములు అయిన భావములు తొలగుటకు వ్యతిరేకమయిన భావమును పెంపొందించుకొనవలయును.

## ప్రతిపక్షభావనలనగా

**34. వితర్కా హింసాదయః కృతకారితాను మోదితా లోభక్రోధమోహపూర్వకా మృదుమధ్యాధిమాత్రా దుఃఖజ్ఞానానంతఫలా ఇతి ప్రతిపక్షభావనమ్.**

లోభ, క్రోధ, మోహములు తక్కువ, సామాన్య, హెచ్చుస్థాయిలలో యున్నను వితర్కము, హింస తనుచేసినను యితరులచే చేయించినను యోగ ప్రతి బంధకములై అజ్ఞానావృతమై దుఃఖ జనకములగుచున్నవి. ఇదియే ప్రతి పక్ష భావన

## అహింస గొప్పతనము

**35. అహింసా ప్రతిష్ఠాయాం తత్సన్నిధౌవైరత్యాగః**

అహింసా వ్రతనిష్ఠాపరుని సాన్నిధ్యమున వైరము అనగా వైర లక్షణములు పొడచూపవు. ఈవిషయమునే ఋషుల ఆశ్రమములందు ఏనుగు, సింహము, పాము, నెమలి కలసి సహజీవనము చేయునట్లు వర్ణింపబడును.

## సత్యము

**36. సత్యప్రతిష్ఠాయాం క్రియాఫలాశ్రయత్వమ్**

సత్యవ్రతనిష్ఠాపరుడు సర్వ పుణ్యాకార్య ఫలప్రాప్తిని బొందును. సత్య వాక్పరిపాలన ముఖ్యము.

### అస్తేయం

**37. అస్తేయ ప్రతిష్ఠాయాం సర్వరత్నోపస్థానమ్**

దొంగబుద్ధి లేనివాడు సర్వసంపదలు గలిగియుండును.

### బ్రహ్మచర్యం

**38. బ్రహ్మచర్య ప్రతిష్ఠాయాం వీర్యలాభః**

బ్రహ్మచర్యవ్రతనిష్ఠాపరుడు తేజోవంతుడగును. వీర్య లాభము వలన నీరసముండదు. బ్రహ్మ చర్యమును పరిమిత కాలమున అనగా యోగ సాధన కాలముననే పాటించ వలయును. జీవితాంతము కాదు. ఈవిషయము చెప్పుటకు తపోవంతులైన వసిష్ఠ విశ్వామిత్రాదులకు అనేక మంది పుత్రులు ఉన్నట్లు కథలు చెప్పుదురు.

### అపరిగ్రహము

**39. అపరిగ్రహ స్థైర్యే జన్మకథంతా సంబోధః**

అపరి గ్రహము పాటించిన వానికి పూర్వ జన్మ జ్ఞానము గలుగును. అపరి గ్రహమును పాటించువాడు యితరులకు బద్ధుడు గాక స్వతంత్రుడై యుండును.

### అంతఃశౌచము

**40. శౌచాత్స్వాంగ జుగుప్సా పరైరసంసర్గః**

అంతఃశౌచము వలన ఇతరులతోడి సంసర్గము తొలగును. లౌకిక విషయములందు జుగుప్స ఏర్పడును.

**41. సత్త్వశుద్ధి సౌమన స్యైకాగ్రేంద్రియ జయాత్మ దర్శన యోగ్యత్వానిచ**

అంతః శౌచము వలన సత్త్వశుద్ధి, మంచిమనస్సు, ఏకాగ్రత, ఇంద్రియ జయము మఱియు ఆత్మదర్శన యోగ్యత గలుగును.



**42. సంతోషాదనుత్తమః సుఖలాభః**

సంతోషమువలన ఉత్తమ సుఖలాభము గలుగును.

### తపస్సు

**43. కాయేంద్రియసిద్ధిరశుద్ధి క్షయాత్తపసః**

శరీరమునకు ఇంద్రియమునకుగల మాలిన్యము తొలగి సిద్ధి గలుగుటయే తపస్సు.

### స్వాధ్యాయము

**44. స్వాధ్యాయాదిష్టదేవతా సంప్రయోగః**

స్వాధ్యాయము వలన ఇష్ట దేవతతో (సంప్రయోగము) దర్శనము కలుగును.

### సమాధి

**45. సమాధి సిద్ధిరీశ్వర ప్రణిధానాత్**

కర్మఫల త్యాగము లేక సర్వము ఈశ్వరార్పణ చేయుట వలన సమాధి సిద్ధించును.

### ఆసనం

**46. స్థిరసుఖమాసనమ్**

స్థిరముగను సుఖముగను నుండునది ఆసనము.

**47. ప్రయత్న శైథిల్యానంత సమాపత్తిభ్యామ్**

శరీరమును అటుయిటు కదల్చక (శరీర చలనమును నిరోధించి) అనగా చూపును లక్ష్యముపై నిలిపి ఈశ్వరుని ధ్యానించుట వలన ఆసనము స్థిరమై సుఖకరమగును.

**48. తతో ద్వంద్వానభిఘాతః**

ఆస్థితిలో, అప్పుడు ద్వంద్వములు బాధింపవు.

**49. తస్మిన్ సతి శ్వాసప్రశ్వాసయోర్గతివిచ్ఛేదః ప్రాణాయామః**

అట్టిస్థితి యందు ఉచ్ఛ్వాసనిశ్వాసముల గతి విచ్ఛేదము ప్రాణాయామము.

**50. బాహ్యాభ్యంతరస్తంభవృత్తిః దేశకాలసంఖ్యాభిః పరిదృష్టోదీర్ఘసూక్ష్మః**

బాహ్యకుంభకము అంతఃకుంభకము అని ప్రాణాయామము రెండు తెఱుగులు. ఇవి మరల శరీరములో ఏ స్థానమున ఎంతసేపు నిలుపుట గ్రహించవలయును. గాలి పీల్చి వదలుటలో దీర్ఘము, సూక్ష్మము అని రెండు తెఱుగులు గలవు.

**51. బాహ్యాభ్యంతర విషయాక్షేపీ చతుర్థః**

బాహ్య కుంభకము, అంతఃకుంభకములు గాలి పీల్చుట, వదలుట, ఇవి నాలుగు పద్ధతులు.

**52. తతః క్షీయతే ప్రకాశావరణమ్**

ప్రాణాయామము వలన చిత్త ప్రకాశము అనగా చిత్త చాంచల్యము నశించును.

**53. ధారణాసు చ యోగ్యతా మనసః**

మనస్సు ధారణ పొందుటకు యోగ్యమగును.

ప్రత్యాహారము

**54. స్వవిషయాసంప్రయోగే చిత్తస్వరూపాను కార ఇవేంద్రియాణాం ప్రత్యాహారః**

ఇంద్రియములు తమ తమ విషయములను విసర్జించి చిత్త స్వరూపమును పొందుట అనగా శబ్దాది విషయములు చిత్తమునందు లయమగుటయే ప్రత్యాహారము. చిత్తము శబ్దాది విషయములందు ప్రవర్తింపకుండుట ప్రత్యాహారము. పంచేంద్రియోన్మాదమును పరిమార్చుట ప్రత్యాహారము.

**55. తతః పరమా వశ్యతేంద్రియాణామ్**

ప్రత్యాహారము వలన ఇంద్రియముల యొక్క గొప్ప వశీకరణము గలుగును.

*****



# తృతీయాధ్యాయము

ధారణ

**1. దేశబంధశ్చిత్తస్య ధారణా**

ధారణ యనగా చిత్తమును ఏదైనా ఒక చోట నిలుపుట.

ధ్యానమ్

**2. తత్ర ప్రత్యయైకతానతా ధ్యానమ్**

చిత్తమును నిలిపి ఏక భావమున నుండుటయే ధ్యానము. తైల ధారవత్‌గా ఉదాహరణ చెప్పుదురు.

**3. తదేవార్థమాత్రనిర్భాసం స్వరూపశూన్యమివ సమాధిః**

రూపరహితమై అర్థము మాత్రము భాసింప చేయుచున్న స్థితియే సమాధి.

సంయమము.

**4. త్రయమేకత్ర సంయమః**

ధారణ, ధ్యాన, సమాధులు మూడు కలసి యుండుట సంయమము.

**5. తజ్జయాత్ ప్రజ్ఞాఽఽలోకః**

సంయమ స్థితిని దాటిన ప్రజ్ఞ గలుగును.

**6. తస్య భూమిషు వినియోగః**

ఆ ప్రజ్ఞను సక్రమముగా వినియోగించ వలయును.

**7. త్రయమంతరంగం పూర్వేభ్యః**

ఇంతకు ముందు చెప్పిన యమ నియమ ఆసన ప్రాణాయామ ప్రత్యాహారముల కంటే ధారణ, ధ్యాన, సమాధులు మూడు విశేషముగా అంతరంగములు అనగా అంతః కరణ చతుష్టయములకు సంబంధించినవి.

8. **తదపి బహిరంగ నిర్బీజస్య**

యమ నియమాదుల కంటే ధారణ, ధ్యాన, సమాధులు గొప్పవైనను నిర్వికల్ప సమాధి కంటే తక్కువ స్థితి గలిగి నిర్వికల్ప సమాధికి పూర్వాంగములే యగును.

9. **వ్యుత్థాన, నిరోధ సంస్కారయోరభిభవ, ప్రాదుర్భావౌ నిరోధక్షణ చిత్తాన్వయో నిరోధపరిణామః**

చిత్తమునందు గలిగిన ఆలోచనలను నిరోధించుట వలన, నిరోధించాలనే భావన గలుగుట వలన - చిత్తము, నిరోధ సంస్కారములను పొందినదని చెప్పబడుచున్నది. చిత్తవృత్తులు మొదట సంపూర్ణముగా నిరోధముగాకున్నను చాల వఱకు నిరోధింపబడియుండును. సంపూర్ణ నిరోధము లభించిననాడు చిత్తశుద్ధి గలిగి ఇక సంస్కారములు లేకుండును.

10. **తస్య ప్రశాంతవాహిత సంస్కారాత్**

సంస్కార బలము వలన చిత్తమున ప్రశాంతత నెలకొని యుండును.

11. **సర్వార్థతైకాగ్రతయోః క్షయోదయౌ చిత్తస్య సమాధి పరిణామః**

చిత్తము వివిధ రకములైన ఆలోచనలను వదలి (ఆలోచనలను నశింప చేసుకొని) ఏక చిత్తమున అనగా ఈశ్వరుని యందే ఆలోచనలను నిలుపుటమనే ఏకాగ్రతను పొందినంతనే, చిత్తము సమాధి స్థితికి చేరుచున్నది.

12. **శాంతోదితౌతుల్యప్రత్యయౌ చిత్తస్యైకాగ్రతా పరిణామః**

చిత్తము ఏకాగ్రత పొందినంతనే అశాంతి తొలగి శాంతి గలుగును. ఈ స్థితిలో కాలము గుఱించిన ధ్యాసవుండదు. రామాయణంలో ఋశ్యశృంగుడు శాంతను పెండ్లియాడుటగా కథగా వర్ణింపబడినది.

13. **ఏతేన భూతేంద్రియేషు ధర్మలక్షణావస్థా పరిణామావ్యాఖ్యాతాః**

చిత్త ఏకాగ్రత అనబడే సమాధి స్థితికి చేరునప్పటికి పంచభూతాత్మకమైన శరీరమునందు, ఇంద్రియములందు గలుగు ధర్మ, లక్షణ, అవస్థ పరిణామముల గుఱించి విశదీకరింపబడుచున్నవి.



14. **శాంతో దితా వ్యపదేశ్యధర్మానుపాతీ ధర్మీ**

కాలపరిణామము వలన వికారము చెందునది ధర్మి.

15. **క్రమాన్యత్వం పరిణామాన్యత్వే హేతుః**

క్రమమునందలి భిన్నత్వమునకు, పరిణామ మందలి భిన్నత్వమునకు హేతువగుచున్నది.

16. **పరిణామత్రయసంయమాదతీతానాగతజ్ఞానమ్**

ధర్మ, లక్షణ, అవస్థ అను యీ పరిణామమును మూడింటి యందును సంయమము చేయుట వలన, భూత భవిష్యత్ జ్ఞానము గలుగును.

17. **శబ్దార్థ ప్రత్యయానామితరేతరాధ్యాస్యాత్ సంకరస్తత్ ప్రవిభాగసంయమాత్ సర్వభూతరుతజ్ఞానమ్**

(ఇది శబ్దమిది యర్థమని ప్రత్యయమను విభేద జ్ఞానము లేకుండుటచే ) సాధారణమైన యనుభవములో సాంకర్యము పొందుచున్న శబ్దార్థప్రత్యయములందు సంయమము చేయుట వలన సర్వ ప్రాణుల యొక్క ధ్వని (భాషా ) జ్ఞానము గలుగును.

18. **సంస్కారసాక్షాత్కారణాత్ పూర్వజాతి జ్ఞానమ్**

చిత్తము నందు అణగి యుండు పూర్వసంస్కారములపై యోగి సంయమము చేయగలిగినయెడల, సంస్కారములను కనుగొనుటచే, పూర్వ జన్మములు జ్ఞప్తికి వచ్చును.

19. **ప్రత్యయస్య పరచిత్త జ్ఞానమ్**

ఇతరుల చిత్తముపై సంయమము చేయుటవలన వారి చిత్తమును గూర్చి జ్ఞానము గలుగును అనగా వారి మనోభావములు మనకు తెలియును.

20. **న చ తత్ సాలంబనం తస్యావిషయీభూతత్వాత్**

ఆ చిత్తము యొక్క ఆలంబనము మాత్రము సంయమమునకు విషయము కాకుండుటచే గ్రహింపబడును.

**21. కాయరూప సంయమాత్తద్ గ్రాహ్యశక్తి స్తంభే చక్షుః ప్రకాశ సంయోగేఽ ంతర్ధానమ్**

యోగి తన శరీరముపై సంయమము చేయుట వలన అతనిరూపము మన కన్నులకు కనిపింపక రూప గ్రాహక శక్తి స్తంభించును. యోగి అదృశ్యమగును.

**22. ఏతేన శబ్దాద్యంతర్ధానముక్తమ్**

అటులనే యోగి యొక్క శబ్దాదులు మనకు తెలియవు.

**23. సోపక్రమం నిరుపక్రమం చ కర్మ తత్సంయ మాదపరాంత జ్ఞాన మరిష్టేభ్యో వా**

సోపక్రమము నిరుపక్రమము అని కర్మ రెండు విధములు. యోగి తన కర్మపై సంయమము చేయుట వలన అరిష్టసూచనలు, మరణము తెలియును. అనగా ఎప్పుడు మరణము సంభవించునది తెలియును.

**24. మైత్ర్యాదిషు బలాని**

యోగి యొక్క సంయమము వలన మైత్రి, కరుణ మొదలగు సద్గుణములు వృద్ధి పొందును.

**25. బలేషు హస్తిబలాదీని**

ఏనుగు, సింహము, మొదలయిన జంతువుల బలము నందు సంయమము చేయుట వలన ఆయా బలములు యోగికి కలుగును.

**26. ప్రవృత్త్యాలోకస్యాసాత్ సూక్ష్మ, వ్యవహిత, విప్రకృష్ట జ్ఞానమ్**

హృదయమందలి దివ్యజ్యోతి పై సంయమము చేయుట వలన అతి సూక్ష్మములయిన వస్తువులను, రహస్యముగా ఉన్న వస్తువులును, అతి దూరస్తములయినవియునగు వస్తువులను గూర్చిన జ్ఞానము గలుగును.

**27. భువనజ్ఞానం సూర్యే సంయమాత్**

సూర్యుని యందు సంయమము చేయుట వలన చతుర్ధశ భువనముల గుఱించిన జ్ఞానము కలుగును.



**28. చంద్రే తారావ్యూహజ్ఞానమ్**

చంద్రుని యందు సంయమము చేయుట వలన నక్షత్రముల గుఱించిన జ్ఞానం గలుగును.

**29. ధ్రువే తద్గతిజ్ఞానమ్**

ధ్రువుని యందు సంయమము చేయుట వలన గ్రహ నక్షత్రముల గుఱించిన జ్ఞానము గలుగును.

**30. నాభి చక్రే కాయవ్యూహజ్ఞానమ్**

నాభి చక్రము నందు సంయమము చేయుట వలన శరీర జ్ఞానము అనగా నాడీ జ్ఞానముగలుగును. నాభి చక్రమునే కిష్కింధగా వర్ణింపబడినది.

**31. కంఠకూపే క్షుత్పిపాసానివృత్తిః**

కంఠములోపలి భాగమునందు సంయమము చేయుట వలన ఆకలిదప్పులు నివారణమగును. దీనినే రామాయణములో బల, అతిబలలుగా చెప్పబడినవి.

**32. కూర్మనాడ్యాం స్థైర్యమ్**

కూర్మనాడియందు సంయమము చేయుట వలన శరీరము నిలకడగా వుండును. పాల సముద్ర మధనం మందర పర్వతం మునుగుట, ఆపై విష్ణువు కూర్మావతారమున మందర పర్వతము స్థిరముగా నిలుచుటగా కథగా వర్ణించిరి. కొన్ని దేవాలయములలో తాబేలు బొమ్మను దీనికి గుర్తుగా ఉంచెదరు.

**33. మూర్ధ జ్యోతిషి సిద్ధ దర్శనమ్**

శిరస్సు నుండి వెలువడుచున్న సుషుమ్నానాడి యందు గల తేజస్సునందు సంయమము చేయుట వలన సిద్ధ పురుషుల (ఋషుల) దర్శన భాగ్యము కలుగును.

**34. ప్రాతిభాద్వా సర్వమ్**

పైన వివరింపబడిన యోగ శక్తు లన్నియు, ప్రతిభావంతునికి సిద్ధించును.

ఈశ్వరార్పిత మనస్సు గల నిష్కళంక వర్తనుడు ప్రతిభావంతుడు

**35. హృదయే చిత్తసంవిత్**

హృదయమునందు సంయమముచేయుట వలన మనో భావనలను గూర్చిన జ్ఞానము గలుగును.

**36. సత్త్వపురుషయోరత్యంతా సంక్లీరయోః ప్రత్యయా విశేషాద్ భోగః పరార్థత్వాత్ స్వార్థ సంయమాత్ పురుషజ్ఞానమ్**

బుద్ధి తత్త్వమును గూర్చియు జీవుని గుఱించియు వివేకజ్ఞానము లేకుండుట వలన విషయానుభవము (భోగము) కలుగుచున్నది. పురుషుని (జీవుని) గుఱించి సంయమము చేయుట వలన పురుషుని గూర్చిన జ్ఞానము కలుగును.

**37. తతః ప్రాతిభ శ్రావణ వేదనా దర్శాసాదవార్తా జాయంతే**

పురుషజ్ఞానము వలన దివ్య శబ్దనాదమును, దివ్య స్పర్శ జ్ఞానమును, దివ్యరూప జ్ఞానమును, దివ్యరస జ్ఞానమును, దివ్య గంధ జ్ఞానమును కలుగును. **అప్సరసల** రాక కలుగును.

**38. తే సమాధావుపసర్గా వ్యుత్థానే సిద్ధయః**

పైన వివరించిన సిద్ధులు సమాధిని విడచిన కాలమున వ్యావహారిక స్థితి యందు సిద్ధులుగానున్నవి. ఈ యోగ సిద్ధులు నిర్వికల్ప సమాధికి ప్రతిబంధకములు.

**39. బంధకారణ శైథిల్యాత్ ప్రచార సంవేదనాచ్చ చిత్తస్య పరశరీరావేశః**
బంధకారణము నశించుట వలన, శరీరమందలి నాడీ సంచారము గ్రహించుటచేతను పరకాయ ప్రవేశము యోగి చేయగలుగును.

**40. ఉదానజయాజ్జల పంకకంటకాదిష్వసంగ ఉత్క్రాంతిశ్చ**

ఉదాన వాయువును జయించుటచే యోగి నీటిపైన బురదపైన, ముండ్లపైన నడవగలడు. మఱియు ఇచ్ఛా మరణమును పొందును.



**41. సమానజయాత్ ప్రజ్వలనమ్**

సమాన వాయువును జయించుట వలన దేదీప్యమానమైన శరీర కాంతి గలుగును. పూర్ణ కుంభకమునందున్న శీతోష్ణములు తెలియవు.

**42. శ్రోత్రాకాశయోః సంబంధసంయమాద్దివ్యం శ్రోత్రమ్**

శబ్దకారణమగు ఆకాశమునందు సంయమము చేయుట వలన దివ్య శ్రవణ శక్తి గలుగుచున్నది.

**43. కాయాకాశయోః సంబంధసంయమాల్లఘు తూలసమాపత్తేశ్చాకాశగమనమ్**
శరీరము, ఆకాశముల సంబంధమునందు సంయమముచేయుట వలన దూదివలె శరీరము తేలికై ఆకాశ సంచారము గలుగును.

**44. బహిరకల్పితా వృత్తిర్మహావిదేహా తతః ప్రకాశావరణక్షయః**

దేహ లక్షణములులేని ఆత్మ స్థితి మహావిదేహమనబడును. ఆ ఆత్మయందు సంయమము చేసిన అజ్ఞానాంధకారము నశించును.

**45. స్థూల స్వరూప సూక్ష్మాన్వయార్థవత్త్వ సంయమాత్ భూతజయః**
పృథివ్యాది పంచభూతములు, పంచతన్మాత్రలయందు సంయమము చేయుట వలన పంచభూతములపై జయము కలుగును.

**46. తతోఽణిమాది ప్రాదుర్భావః కాయంసంపత్తద్ధర్మానభిఘాతశ్చ**

పంచభూత జయమువలన అణిమాది అష్టసిద్ధులు, (శరీర సంబంధ) కాయ సంపద, దేహరూపాదులకు వినాశము లేకుండుటయు గలుగుచున్నది.

**47. రూప, లావణ్యా, బల, వజ్రసంహననత్వాని కాయసంపత్**

రూపము, లావణ్యము, బలము, వజ్రముచేతనైనను భేదింపబడని కఠినత అనే కాయసంపద గలుగును.

**48. గ్రహణ స్వరూపాస్మితాన్వయార్థ వత్త్వ సంయమాదింద్రియజయః**

శబ్దమును ఆత్మ యందు సంయమము చేయుటచే ఇంద్రియజయము

గలుగుచున్నది. పురాణములలో శబ్ద భేదిగా చెప్పుదురు.

**49. తతో మనోజవిత్వం వికరణ భావః ప్రధానజయశ్చ**

ఇంద్రియ జయము వలన మనోజవం, ఇంద్రియములపై ఆధిపత్యం, ప్రకృతి స్వాధీనము గలుగును.

**50. సత్త్వపురుషాన్యతాఖ్యాతిమాత్రస్య సర్వభావాధిష్ఠాతృత్వం సర్వజ్ఞాతృత్వంచ**
ప్రకృతి, పురుషులపై సంయమము చేయుట వలన సర్వశక్తిత్వమును సర్వేంగితజ్ఞత్వమును గలుగును.

**51. తద్వైరాగ్యాదపి దోషబీజక్షయే కైవల్యమ్**

ఈయోగశక్తులందు ఉదాసీనత లేక వైరాగ్యము పొందిన సమస్త దోషములు నశించి కైవల్యప్రాప్తి లభించును.

**52. స్థాన్యుపనిమంత్రణే సంగస్మయాకరణం పునరనిష్ట ప్రసంగాత్**

యోగి, దేవతలు చేయు ప్రశంసలను, మానవులు చేయు ప్రార్థనలవలనను ఆయా అభిలాషగాని గర్వమును గాని పొందరాదు. అట్లు అభిలషించిన యోగి పతనమగును.

**53. క్షణతత్క్రమయోః సంయమాద్వివేకజం జ్ఞానమ్**

ప్రలోభములకు లోను గాక క్షణకాలము దేవతా ప్రశంసలు, మానవుల పొగడ్తల వలన గలుగు అనర్థమును తెలుసుకొని, వివేకవంతుడై వివేకము నందు సంయమము చేసిన వివేకముచే జ్ఞానము గలుగును.

**54. జాతి, లక్షణ, దేశై రన్యతాఽనవచ్ఛేదాత్తుల్యయోస్తతః ప్రతిపత్తిః**
జాతిచేతను, లక్షణములచేతను దేశములచేతను, స్థాన విశేషము చేతను విభజన చేయబడక, సంయమము వలన జ్ఞానము కలుగును.

**55. తారకం సర్వవిషయం సర్వథావిషయమక్రమంచేతి వివేకజం జ్ఞానమ్**
మహదాది సమస్త తత్త్వ విషయములును ఏకకాలమునందు ఆవరించునట్టి వివేక జ్ఞానము తారక జ్ఞానము అనబడును.



**56. సత్త్వపురుషయోః శుద్ధిసామ్యే కైవల్యమితి**

బుద్ధి తత్త్వము నందును, జీవత్వమునందును పరిశుద్ధతయే కైవల్యమని చెప్పబడును.

సంయమమునే అష్టాంగ యోగములో ప్రత్యాహారమని అందురు. ప్రత్యాహార స్థాయిలో మనస్సు, ప్రాణము నిర్ణీత స్థలములలో నియమించుట వలన అణిమాది అష్టసిద్ధులు పైన చెప్పిన సిద్ధులు కలుగును. ఈ సిద్ధులు యోగికి ప్రతిబంధకములు. యోగి వీటివలన భ్రష్టుడగును. సమాధి స్థితికి చేరిన ఈ సిద్ధులన్నియు కోరకనే లభించును. ఆ స్థితిలో ఈ సిద్ధులు యోగ భ్రష్టతను కలుగ చేయవు.

*****

# చతుర్థాధ్యాయము

1. **జన్మౌషధి మంత్ర తపః, సమాధిజాః సిద్ధయః**

కొంత మందికి జన్మముచే, మూలికలచే, మంత్రములచే, తపస్సుచే, సమాధిచే సిద్ధులు కలుగుచున్నవి.

2. **జాత్యంతర పరిణామః ప్రకృత్యాపూరాత్**

గుణ, కర్మ విభాగము వలన జాతి గలుగుచున్నది. గుణ, కర్మలు ప్రకృతిలోనివి. ప్రకృతి పూర్తిగా తొలగిన మఱియొక జాతిగా పరిణమించుట గలుగును. ఇందు వలననే ఏజాతిలో పుట్టినను ఎందఱో ఋషులుగా మారిరి.

3. **నిమిత్తమ ప్రయోజకం ప్రకృతీనాం వరణభేదస్తు తతః క్షేత్రికవత్**

ఉదాహరణగా పైన చెప్పిన విషయము చెప్పబడుచున్నవి. పొలములను సాగుచేయుటకై నీరు. ఇది వఱకే కాలువలోనున్నది. కాలువ యొక్క ద్వారములు మాత్రము మూయబడియున్నవి. ఆ ఆటంకమును తొలగించిన నీరు పొలము లోనికి ప్రవహించును. వ్యవసాయదారుడు ప్రవాహమునకు గల ఆటంకములను తొలగించిన తోడనే స్వాభావికముగా నీరు పొలములోనికి ప్రవహించును. అటులనే ప్రకృతి యొక్క ఆవరణలను తొలగించిననే జ్యోతిప్రకాశమును దర్శించగలము. కర్మలు ప్రకృతి ఆవరణ తొలగించుటకు చాలా వఱకు ఉపయోగపడును.

4. **నిర్మాణ చిత్తాన్యస్మితామాత్రాత్**

వాసనా యుతమైన చిత్తమును యోగి తన సాధనచే (అస్మితం) నిర్మల చిత్తమును కలుగ చేయుచున్నాడు.

5. **ప్రవృత్తిభేదే ప్రయోజకం చిత్తమేకమనేకేషామ్**

వివిధ వ్యక్తులయందు ఈచిత్తము వారి ప్రవృత్తిననుసరించి అనేక విధములుగ నున్నది. కొందఱు కైవల్యమునకు, కొందఱు యోగశక్తులకు పాటు పడుదురు.



6. **తత్ర ధ్యానజమనాశయమ్**

సమాధి బలమున పొందిన వాసనారహిత చిత్తము గొప్పది.

7. **కర్మాశుక్లాకృష్ణం యోగిన స్త్రీవిధమితరేషామ్**

సామాన్య మానవుల కర్మ, పుణ్యకర్మయని,పాపకర్మయని,శుభాశుభ మిశ్రమకర్మయని మూడు విధములుగా యుండును. కాని యోగుల కర్మ నిష్కామకర్మ యగుట వలన పుణ్య పాపయుతమై యుండదు.

8. **తతస్తద్విపాకానుగుణానామేవాభివ్యక్తిర్వాసనానామ్**

వాసనల వలన పుణ్యాపాపమిశ్రమ కర్మలు వ్యక్తమగుచుండును.

9. **జాతి, దేశ, కాల, వ్యవహితానామప్యానంతర్యం స్మృతి సంస్కారయోరేక రూపత్వాత్**

స్మృతియును, సంస్కారమును ఏకరూపమును పొందియుండుటచే జాతి, దేశ, కాలము అనువానిచే వేఱు పఱుపబడియున్నను వాసనలు నశింపవు.

10. **తాసామనాదిత్వం చాశిషో నిత్యత్వాత్ సుఖపిపాస**

సుఖము కొఱకు తీవ్రమైన వాంఛ అనాదియై యుండుటచే వాంఛలకు ఆది యనునది లేదు. ఆది లేనందున అంతమును లేదు.

11. **హేతుఫలాశ్రయాలంబనైః సంగృహీతత్వాదేషామభావే తదభావః**

వాంఛ అనునది కారణము, కార్యము, ఆశ్రయము, శబ్దాది విషయములు అనువానితో కూడు కొని యుండుటచే యివియన్నియు లేకున్నప్పుడు వాంఛయు లేకుండును.

12. **అతీతానాగతం స్వరూపతోఽస్త్యధ్వభేదాద్ధర్మాణామ్**

భూత, భవిష్యత్, వర్తమాన కాలములలోని వాంఛ జీవ స్వభావమునందేగలదు. గతకాలములో మనమనుభవించిన వాంఛలు, వర్తమాన కాలములోని వాంఛలు, రాబోవు కాలములోని వాంఛలకు కారణము మన స్వభావము.

**13. తే వ్యక్త, సూక్ష్మా గుణాత్మానః**

ఆవాంఛలు మన గుణములననుసరించి కొన్ని సార్లు వ్యక్తముగను, కొన్ని సార్లు మన మనస్సునందే అణగియుండును.

**14. పరిణామైకత్వాద్వస్తుతత్త్వమ్**

వస్తు తత్త్వము పరిణామము అనగా మార్పు గలిగియుండును. ఒకే వస్తువు ఒకని యందు గలిగించు భావనకు, యింకొకనికి గలిగించు భావనకు తేడా గలదు.

**15. వస్తుసామ్యే చిత్తభేదాత్తయోర్విభక్తః పన్థాః**

వేర్వేఱు వ్యక్తుల చిత్తము వేర్వేఱుగా ఉండుట వలన ఒకే వస్తువునందు గలుగు భావనలు వేఱు వేఱుగానుండును. ఒకనికి కోడికూరయందు ఆపేక్ష, ఇంకొకనికి అది అసహ్యము.

**16. తదుపరాగాపేక్షిత్వాచ్చిత్తస్య వస్తు జ్ఞాతాజ్ఞాతమ్**

వస్తువులు చిత్తముపై ప్రతిబింబించునట్టి విధము ననుసరించి ఆవస్తువునందు లాలస (జ్ఞాతం), విముఖత (అజ్ఞాతం) లు గలుగును.

**17. సదా జ్ఞాతాశ్చిత్తవృత్తయస్తత్ ప్రభోః పురుషస్యా పరిణామిత్వాత్**

పురుషుడు (జీవాత్మ) పరిణామము చెందక యుండుట వలన అతని చిత్త వృత్తులు అతనికి సదా తెలియబడుచున్నవి.

**18. న తత్ స్వాభాసం దృశ్యత్వాత్**

జీవుడు స్వయం ప్రకాశుడు, చిత్తము స్వయం ప్రకాశము కాదు. కావున చిత్తము పురుషునకు దృశ్య విషయము.

**19. ఏకసమయే చోభయానధారణమ్**

చిత్తము స్వయం ప్రకాశము కాదు. అది పురుషుని యిచ్ఛాను సారము పనిచేయును అని ఏల చెప్పుదుమన్న, చిత్తము ఒకే సమయమున అటు ఈశ్వరుని గుఱించి ఇటు సంసార విషయముల గుఱించి ఆలోచన చేయలేదు. ఏదో ఒకదాని గుఱించి మాత్రమే ఆలోచించ గలదు.

**20. చిత్తాంతర దృశ్యే బుద్ధి బుద్ధే రతిప్రసంజ్గః స్మృతి సంకరశ్చ**

రెండు చిత్తములు యుండి యుండవచ్చును గదా యను సందేహమునకు తావులేదు. ఏలయన చిత్తము నందలి వాంఛ అనుభవము పొందిన వెంటనే అది స్మృతిగామారును. అనగా అది మనకు గుర్తుండును. మనకు రెండు స్మృతులుండనందున రెండు చిత్తములు లేవు. మఱియొక చిత్తము వలన దర్శన యోగ్యత కలుగుచున్నదని ఊహించిన యెడల అట్టి ఊహలకు అంతమనునది లేకుండుటయు స్మృతి సంకరమగుట సంభవించును.

**21. చితేర ప్రతి సంక్రమాయాస్తదాకారాపత్తౌ స్వబుద్ధిసంవేదనమ్**

చిత్తము పురుషుని స్వరూపమును పొందినప్పుడు అనగా పురుషుడు చిత్తముతో కలసినప్పుడు విషయ పరిజ్ఞానము గలుగుచున్నవి.

**22. ద్రష్టృదృశ్యోపరక్తం చిత్తం సర్వార్థమ్**

ద్రష్ట-పురుషుడు, దృశ్యము- ప్రకృతి, నానార్థములు. దృశ్యమునందు, పురుషునిచే చిత్తము ప్రతిఫలింపబడిన చిత్తము సర్వవిషయములను గ్రహింప గలుగుచున్నది.

**23. తదసంఖ్యేయవాసనాభిశ్చిత్రమపి పరార్థం సంహత్యకారిత్వాత్**

అసంఖ్యాక మగు కోరికలచే చిత్తము నిండియున్నను చిత్తము తన కొఱకు గాక, జీవుని అనుభవమునకు పనిచేయుచున్నది. చిత్తమునందలి కోరికలు చిత్తముచే అనుభవింపబడవు. అవి పురుషునిచే అనుభవింపబడుచున్నవి.

**24. విశేష దర్శిన ఆత్మభావ భావనానివృత్తిః**

చిత్తము ఆత్మ కాదు. అను భావన యోగి గ్రహించును. అది వివేకము.

**25. తదా వివేక నిమ్నం కైవల్య ప్రాగ్భావం చిత్తమ్**

అప్పుడు, అనగా వివేకమందుయున్న చిత్తము పూర్వావస్థయైన కైవల్యమును బొందుచున్నది.

**26. తచ్ఛిద్రేషు ప్రత్యయాన్తరాణి సంస్కారేభ్యః**

కైవల్య ప్రాప్తికి ఆటంకములగు సుఖ ప్రాప్తి భావములు మన సంస్కారముల వలన గలుగుచున్నవి.

**27. హానమేషాం క్లేశవదుక్తమ్**

క్లేశములు, అవిద్య అస్మితాదులను నిగ్రహించిన రీతినే ఈ సంస్కారములను గూడ నిగ్రహింపవలయును.

**28. ప్రసంఖ్యానే ఽ ప్యకుసీదస్య సర్వధా వివేకఖ్యాతేర్ధర్మ మేఘః సమాధి**

మేఘము కోరకయే వర్షించును. ధర్మమేఘము ధర్మయుతమైన సమస్తకామములను కోరకయే వర్షించును. అటులనే ఆత్మానాత్మవివేకము, కామ్యకర్మల ఫలితమును బాగుగా విచారించి శాశ్వతానందము నిచ్చు ఆత్మాను భూతిని సమాధిస్థితి యందు పొందిన యోగికి సర్వసిద్ధులు అయాచితముగా లభించును. వసిష్ఠుడు ఉదాహరణ .

వసిష్ఠులవారు బ్రహ్మదండము (బ్రహ్మానుభూతి) వలన విశ్వామిత్రుడు తపోధనముగా సంపాదించిన సర్వశక్తులను అవలీలగా తృణీకరించినాడు. సకల చిత్తములను చక్కగా వివేచించునట్టి జ్ఞానము పొందియు, ఫలాపేక్ష లేక యుండు వానికి అట్టి పరిపూర్ణ వివేక ఫలితముగ ధర్మమేఘమను సమాధి కలుగుచున్నది

**29. తతః క్లేశ కర్మనివృత్తిః**

అట్టి ఆత్మాను భూతియను నిర్వికల్పసమాధి వలన సమస్త క్లేశముల సమస్త కర్మల నివృత్తి గలుగుచున్నది.

**30. తదా సర్వావరణమలాపేతస్య జ్ఞానస్యాఽ నంత్యాత్ జ్ఞేయమల్పమ్**

అప్పుడు నిర్వికల్ప సమాధి బలముచే పొందిన జ్ఞానము ఆవరణమునుండియు, సమస్తమైన మాలిన్యముల నుండియు విడువబడి అనంతమైయుండుటచే జ్ఞేయము గ్రహింపదగినది అల్పమగుచున్నది.



**31. తతః కృతార్థానాం పరిణామ క్రమసమాప్తిర్గుణానామ్**

అప్పుడు త్రిగుణములు కార్యసాఫల్యము నొందిన వగుటచే పరిణామ క్రమము పరిసమాప్తమగును.

**32. క్షణప్రతియోగీ పరిణామాపరాన్తనిర్గ్రాహ్యః క్రమః**

కాలమునునుసరించి కలుగుచున్నవియు, కార్య సమాప్తమైన తరువాత తెలుసుకొనబడునవియు అగు మార్పులే పరిణామ క్రమమునందలి క్రమమైయున్నవి.

**33. పురుషార్థశూన్యానాం గుణానాం ప్రతిప్రసవః కైవల్యం స్వరూపప్రతిష్ఠా వా చితిశక్తే రితి**

పురుష ప్రయోజనము కంటే వేఱొక ఫలాపేక్ష లేని సత్త్వాది గుణములను విలోమక్రమమున లయించుట గాని, చిత్ప్రకాశమును స్వస్వరూపమునందు నెలకొల్పుట గాని కైవల్య మనబడును.

నేడు ఆరోగ్య విషయములో చెప్పబడు ఆసనముల గుఱించి పతంజలి చెప్పలేదని ఈ యోగ సూత్రములు చదివిన అర్థమగును.

*****

# యోగము గురించి భాగవతములో

దేహి దేహ పుత్ర కళత్రాది సందోహంబువలని మోహపాలంబు నిష్కామ కరవాలంబున నిర్మూలనంబు చేసి, గేహంబు వెడలి, పుణ్య తీర్థ జలావగాహంబుసేయుచు, నేకాంత, శుచి ప్రదేశంబున, విధివత్ప్రకారంబునం కుశాజిన చేలంబులతోడం కల్పితాసనుండై , మనంబున నిఖిల జగత్పవిత్రీకరణ సమర్థంబై యకారాది త్రివర్ణకలితంబై బ్రహ్మ బీజంబైన ప్రణవంబు సంస్మరించుచు, వాయువుల జయించి, విషయంబుల వెంట నంటి పాఱెడి ఇంద్రియంబుల బుద్ధిసారథియై మనోనామకంబులయిన పగ్గంబుల బిగ్గబట్టి మ్రొగ్గందిగిచి దట్టంబులయిన కర్మ ఘట్టంబులు నిట్టట్టుమెట్టెడి మనంబును శేముషీ బలంబున నిరోధించి భగవదాకారంబుతోడ బంధించి, నిర్విషయంబైన మనంబున భగవత్పాదాద్యవయవంబులం గ్రమంబున ధ్యానంబు సేయుచు, రజస్తమో గుణంబులచేత నాక్షిప్తంబును విమూఢంబునగు చిత్తంబునం తద్గుణంబుల వలన నయ్యెడి మలంబులం ధారణావశంబునంబోనడిచి, నిర్మల చిత్తంబునం, బరమంబయిన విష్ణుపదంబునకుం జను, ధారణా నియమంబు గలుగ సుఖాత్మకంబగు విషయంబు నవలోకించు యోగికి భక్తి లక్షణంబయిన యోగాశ్రయంబున వేగంబ మోక్షంబు సిద్ధించు. (భాగవతము, ద్వితీయ స్కంధము, 12). యోగి దేహ త్యాగ కాలమున ప్రాణములను బ్రహ్మ రంధ్రము చేర్చి మనస్సును లయించి క్షేత్రజ్ఞుని ఆత్మతో చేర్చి ప్రకృతిని వీడి ఆనంద మయుండై బ్రహ్మమందు కలియును. యోగ మార్గమున కాని ఈశ్వరుని దర్శింపలేము.

**యోగములోని దోషము:-** యమనియమాది యోగముల ఆత్మ నియంత్రితమయ్యు కామ రోషముల ప్రచోదితంబయగు. శాంతి వహింపదు.

**యోగభ్రష్టత:-** పూర్వ జన్మ కర్మ వశమున యోగభ్రష్టుండగు.

**యోగిలక్షణములు:-** ఆత్మ తత్త్వము కలవాడై యావత్ కర్మఫలాను పర్యంతము పుత్రదారసమేతంబగు ప్రపంచమునను భవించి ఆపై విరక్తి వైరాగ్యములు కలిగి దేహధ్యాసలేక మత్తుని వలె జడుని వలె ఉండును. శరీరము అనిత్యమని తలచి



ఆత్మ తత్త్వనిష్ఠుడై ఉండును. ప్రకృతిని వీడి సుఖదుఃఖములకు విచలితుడు కాక అవి అహంకార ధర్మములని తెలుసుకొని చిత్తము భగవంతుని యందు చేర్చి నిర్మలుండై, విగతసంగుండై, అణిమాది సిద్ధులను స్వీకరించక, సమాహిత మనస్కుండై ఉండును. శాంతుడై ద్వంద్వాతీతుడై అఖిల ప్రపంచమునందు ఆత్మను, ఆత్మయందు అఖిలభూతములను దర్శించుచు పరమ పురుషునితో ఏకీభూతుడై ఉండును. దేహత్యాగ కాలమున పాము తనకుబుసమును విడచునట్లు శరీరమును వీడి ముక్తిని పొందును అనగా ఆత్మయై విరాజిల్లును.

**సద్యోముక్తి:-** యోగి దేశకాలములను గూర్చి పట్టించుకొనడు. ఆసన్న మరణార్థియైన యోగి దేహత్యాగ కాలమున ఇంద్రియములతో సంగమము లేకుండా సకల కార్యములను దిగనాడి భద్రాసనస్థుడై ప్రాణాయామమున ప్రాణములను ఆధారమునుంచి నాభితలము చేర్చి ఆపై హృదయస్థానము ఆపై భ్రూమధ్యము చేర్చి, విజ్ఞానదృక్‌వీర్యజలనంబున విషయ వాసనలు దగ్ధము చేసి నిరపేక్షమున మనోవేగమును బుద్ధిచే భంగించి బుద్ధిని క్షేత్రజ్ఞునితో కూర్చి క్షేత్రజ్ఞునిని ఆత్మలోపల చేర్చి శాంతుడై బ్రహ్మ రంధ్రము చీల్చి, ఆత్మను బ్రహ్మమందు కలిపి ఏకీభూతుడై ఉండును. ఆకాశమునందు శరీర రంధ్రములను, వాయువునందు నిశ్వాసంబును, తేజంబులో ఉష్ణంబును, జలంబులో రసంబును, ధరణియందు శల్య మాంస ప్రముఖంబులను, వహ్నియందు వక్త్రంబుతోడ వాక్కును, ఇంద్రుని తోడ కరములను, విష్ణువుతో గతితోడ పాదంబులను, ప్రజాపతియందు రతితోడ ఉపస్థంబును, మృత్యువునందు విసర్గంబుతోడ పాయువును, దిక్కులందు శబ్దంబుతోడ శ్రోత్రంబును, వాయువునందు స్పర్శంబుతోడ త్వక్కును, సూర్యుని యందు రూపంబుతోడ చక్షువులను, సలిలమందు జిహ్వాయు, క్షితి యందు గంధముతోడ ఘ్రాణమును, చంద్రుని యందు మనోరథంబులతోడ మనంబును, బ్రహ్మముతోడ బుద్ధిని, రుద్రుని యందు అహంకారమును, క్షేత్రజ్ఞునియందు సత్త్వంబు తోడ చిత్తంబును, గుణంబులతోడ వైకారికంబును లయించి అటమీద పృథివిని జలంబులందు, జలంబులు తేజమునందు, తేజమును వాయువునందు, వాయువును ఆకాశమునందు, ఆకాశమును అహంకార తత్త్వమునందు, అహంకారమును మహతత్త్వమునందు, మహతత్త్వమును ప్రకృతియందు, ప్రకృతిని అక్షరుండైన పరమాత్మయందును

లయమునొందించి చిన్మాత్రావశేషితుండైన క్షేత్రజ్ఞుని పరమాత్మయందు లయముచేసి బ్రహ్మయై విరాజిల్లును. దీనిని లయయోగమందురు. అండ సృష్టిలో ఎందుండి ఏమేమి వచ్చినవో వాటిని అందులో లయముచేసి దేహమును వీడి, ఆత్మయై విరాజిల్లుటయే యిందు చెప్పబడినది. యోగి దేహత్యాగ కాలమున ఇంద్రియములతో సంగమంబు విడచి బ్రహ్మలోకమునకు ఆకాశపథంబునబోవుచు సుషుమ్నా నాడివెంట అగ్నించేరి జ్యోతిర్మయంబైన తేజంబున నిర్మలుండై, ఎందును తగులువడక తారామండలము మీద సూర్యాది ధ్రువాంత పదంబుల క్రమక్రమంబున అతిక్రమించి హరి సంబంధమైన శింశుమార చక్రంబు చేరి బ్రహ్మవిదులకు నెలవైన బ్రహ్మలోకముచేరి బ్రహ్మయగును.

**క్రమ ముక్తి:-** యోగి దేహ త్యాగ సమయమున ఇంద్రియములతో సంగమము విడువనివాడు వానితోడన బ్రహ్మాండమునందు ఖేచర, సిద్ధ, విహార యోగ్యంబు అణిమాది సకలైశ్వర్య సమేతంబైన మహర్లోకంబు చేరి మహాకల్పకాలంబు క్రీడించి బ్రహ్మలో ఐక్యమగును.

యోగము గురించి చెప్పిన ఇతర గ్రంథములు

యోగము గురించి కైవల్య ఉపనిషత్, శ్వేతాశ్వర ఉపనిషత్,సాంఖ్య సూత్రములు, భగవద్గీత, పతంజలి యోగసూత్రములు, యాజ్ఞవల్క్య ప్రవచనములుగా కనిపించుచున్నవి. ఈ ప్రకరణములో సాంఖ్య సూత్రములందు శ్వేతాశ్వర ఉపనిషత్ నందు , యాజ్ఞవల్క్య ప్రవచనములలో చెప్పబడినవి ప్రస్తావించ బడుచున్నవి.

**యోగికి ఉండవలసిన లక్షణములు:** యోగ సాధకుడు తనకు, దేహనిర్వహణకు, కుటుంబ నిర్వహణకు కావలసినంత మాత్రమే స్వీకరించుచూ నిత్యసంతోషిగా ఉండవలయును.

**ఆవృత్తి రస కృదుపదేశాత్:** (సాంఖ్య సూత్రములు, చతుర్థాధ్యాయము, 3).

| | | |
|---|---|---|
| అసకృత్ | = | ఇది సత్తు ఇది అసత్తు అని |
| ఆవృత్తిః | = | మరల మరల గురువు |
| ఉపదేశాత్ | = | ఉపదేశించుట వలన యోగికి సత్తు గురించి అసత్తు గురించి జ్ఞానము కలుగును. |



**శ్యేనవత్ సుఖదుఃఖీ త్యాగ వియోగాభ్యామ్:** (సాంఖ్య సూత్రములు, చతుర్థాధ్యాయము, 5)

ఉదాహరణగా చెప్పిన కథ. ఒక డేగకు మాంసము దొరికినది. ఆ మాంస ఖండమును తీసికొని వెళ్ళుచుండగా ఇంకొక డేగ ఆ మాంస ఖండమునకై యుద్ధమునకు తలపడెను. అంత డేగ ఆ మాంస ఖండమును వదలి మానసిక ఆరాటము లేక సుఖముగా ఉండెను.

ఆ విధముగా ధనకనక వస్తువాహనాదుల యందు ఆపేక్షలేక, భార్యా పుత్రాదులయందు వ్యామోహములేక ఉండవలయును. దీనినే వైరాగ్యము అని అందురు.

**అహి నిర్ల్వయనీవత్** (సాంఖ్య సూత్రములు, చతుర్థాధ్యాయము, 6)

| | | |
|---|---|---|
| అహి | = | పాము |
| నిర్ల్వయనీవత్ | = | తన కుబుసమును వీడి సుఖించునట్లు సాధకుడు రాగ ద్వేషములను, కోపమును వదల వలయును. |

**అసాధనాను చింతనమ్ బుధాయ భరతవత్** (సాంఖ్య సూత్రములు, చతుర్థాధ్యాయము, 6)

| | | |
|---|---|---|
| బుధాయ | = | బుద్ధిమంతుడు |
| అసాధనా+అనుచింతనమ్ | = | మోక్షమార్గమునకు సంబంధించని విషయములను గురించి ఆలోచింపరాదు. అలా లేడిపిల్ల గురించి ఆలోచించిన |
| భరతవత్ | = | భరతుని వలె పునర్జన్మకు వచ్చును. |

**బహుభి ర్యోగే విరోధో రాగాదిభిః కుమారీ శంకవత్**

(సాంఖ్య సూత్రములు, చతుర్థాధ్యాయము, 6)

| | | |
|---|---|---|
| బహుభిః+రాగాదిభిః | = | అనేక విషయములు చింతించుట చేత |
| యోగే | = | యోగమునందు |
| విరోధః | = | విఘ్నము కలుగును |
| కుమారీ శంకవత్ | = | అమ్మాయి చేతులకు గల గాజుల వలె. |

ఇది ఒక ఉదాహరణగా చెప్పబడిన కథ. ఒక అమ్మాయి చేతులకు చాలా గాజులు ఉంచి ధాన్యమును దంచుచున్నది. చేతులకు చాలా గాజులు ఉండుట వలన దంచుచున్నప్పుడు శబ్దము కలుగుచున్నది. అప్పుడు ఆ అమ్మాయి అ గాజులన్నింటినీ తీసి ఒక గాజును మాత్రమే ఉంచి దంచ సాగెను. అప్పుడు శబ్దము లేదు. అటులనే సాధకుడు ఒంటరిగా ఉండి యోగ సాధన చేయవలయును.

**ద్వాభ్యామపి తథైవ** (సాంఖ్య సూత్రములు, చతుర్థాధ్యాయము, 10).

| | | |
|---|---|---|
| ద్వాభ్యామ్+అపి | = | ఇద్దఱు ఉన్నా |
| తథాయేవ | = | అట్లే జరుగును. కావున ఒంటరిగానే ఉండవలయును. |

నిరాశః సుఖీ పింగళావత్ (సాంఖ్య సూత్రములు, చతుర్థాధ్యాయము, 11)

ఇది ఉదాహరణగా చెప్పిన కథ. ఒక ఊరిలో పింగళ అను పేరుగల ఒక వేశ్య ఉండెను. ఆమె ఒక రాత్రి విటునకై ఎదురు చూచి చూచి విసిగి ఇక విటుడు రాడని నిశ్చయించి తలుపులు వేసుకొని సుఖముగా నిద్రపోయినది. ఆ విధముగా సాధకుడు ఆశను వదలి యదృచ్ఛాలాభ సంతుష్టి కలిగి ఉండవలయును.

**బహుశాస్త్ర గురూపాసనేఽపి సారాదానమ్ షట్పదవత్**

(సాంఖ్య సూత్రములు, చతుర్థాధ్యాయము).

| | | |
|---|---|---|
| బహుశాస్త్ర గురూ ఉపాసనే + అపి | = | బహు శాస్త్రములను చదివి ఇద్దఱు గురువులను సేవించినవూ |
| సారాదానమ్+షట్పదవత్ | = | తేనెటీగ పూల మకరందమును గ్రహించినట్లు సారమును గ్రహించవలయును. దీనికే ప్రహ్లాదుడు చండామార్కులను, నారదుని సేవించి చదువులలో మర్మమెల్ల చదివితి అని చెప్పినాడు. |

**యోగసిద్ధయోఽప్యౌషధాదిఽసిద్ధి వర్ణాప లపనీయాః**

(సాంఖ్య సూత్రములు, పంచమాధ్యాయము, 23.)

| | | |
|---|---|---|
| ఔషధాది | = | కొన్ని మూలికల వలన |
| అపి | = | కూడా |
| యోగ సిద్ధయః | = | యోగసిద్ధుల వలన |
| సిద్ధివత్ | = | సిద్ధులు కలుగును. ఏవిధముగానైనను |
| న అపలపనీయాః | = | యోగ సిద్ధులను స్వీకరించ రాదు. |

**తత్వాభ్యాసాన్నేతి నేతిఈతి త్యాగా ద్వివేక సిద్ధిః**

(సాంఖ్య సూత్రములు, తృతీయాధ్యాయము, 14).

| | | |
|---|---|---|
| త్యాగాత్ | = | ఇంద్రియములు ఇంద్రియార్థములను త్యజించుట చేత |
| న ఇతి + న ఇతి | = | ఇది కాదు ఇది కాదు అనగా వస్తు దృష్టి వీడుట చేత |
| తత్వాభ్యాసాత్ ఇతి | = | ఆత్మ దర్శనము పొందాలనే నిరంతర తపన వలన |
| వివేక సిద్ధిః | = | జ్ఞానము కలుగును. అనగా యోగికి వస్తు దృష్టి ఉండరాదు. ఆత్మ దర్శనము పొందవలయుననే తపన ఉండవలయును. |

**నాభోగాత్ రాగ శాంతి ర్మునివత్** (సాంఖ్య సూత్రములు, చతుర్థాధ్యాయము, 27).

| | | |
|---|---|---|
| భోగాత్ | = | అగ్నిలో ఆజ్యము పోసిన అగ్ని శాంతించనట్లు కామము భోగములు ఎంత అనుభవించినా |

న రాగ శాంతిః = మనస్సుకు శాంతి కలుగదు. రాగము నశింపదు. కావున

మునివత్ = జితేంద్రియుడై మునుల వలె ఉండవలయును.

**సాంగత్యము:-** దేహ, పుత్ర, కళత్రాది సందోహము వలన మోహమును వీడి, తీవ్రమోక్షేచ్ఛ కలిగి సంగము వర్జించి ఏకాంతియై ఉండవలయును.

**ప్రదేశము:-** ఏకాంతము, నిర్బాధకంబైన స్థానము, శుచియైన ప్రదేశమును ఎన్నుకొనవలయును.

**సమే శుచౌ శర్కరా వహ్ని వాలుకా**
**వివర్జితే శబ్ద జలాశ్రయాదిభిః** (శ్వేతాశ్వరోపనిషత్, ద్వితీయ అధ్యాయము, 10)

సమే = సమ ప్రదేశము

శుచౌ = శుచి ప్రదేశము నందు యోగమును అభ్యసించ వలయును

శర్కరా = గులకరాళ్ళు

వహ్ని = అగ్ని భయముండు తావున

వాలుకా = ఇసుక ప్రదేశమున

శబ్ద = రణగొణ ధ్వనిగల ప్రదేశమును

జలాశయాదిభిః = జలపాతము మొదలయిన శబ్దములు గల ప్రదేశములను

వివర్జితే = వదలి పెట్టవలయును

**మనోஉనుஉకూలే న తు చక్షుపీడనే**
**గుహా నివాతాశ్రయణే ప్రయోజయేత్**

(శ్వేతాశ్వరోపనిషత్, ద్వితీయ అధ్యాయము, 10)

న చక్షుపీడనే = కన్నులకు చూడగానే అసహ్యము గొలిపే ప్రదేశములు అనగా స్మశానము తుప్పలు ముళ్ళు గల ప్రదేశమును విడిచి పెట్టవలయును

మనః+అనుకూలే = మనస్సుకు ఆనందము కలిగించు సుందర ప్రదేశములను ఆశ్రమమునకు నిర్ణయించుకొనవలయును

నివాతా = విపరీతముగా గాలులు వీచు ప్రదేశమును విడిచి పెట్ట వలయును

గుహా ఆశ్రయేత్ = గుహలను ఆశ్రయించి ఉన్నా

ప్రయోజయేత్ = యోగమునకు ప్రయోజనముండును.

**ఆహారము:-** మితము, శుద్ధమైన ఆహారమును స్వీకరించవలయును.

**లఘుత్వ మారోగ్య మలోలుపత్వం**
**వర్ణ ప్రసాదం స్వర సౌష్టవంచ**
**గన్ధ శ్శుభో మూత్రపురీషమల్పం**
**యోగ ప్రవృత్తిం ప్రథమాంవదంతి** (శ్వేతాశ్వరోపనిషత్, ద్వితీయ అధ్యాయము,13)

లఘుత్వం = మితాహారము స్వీకరించుట వలన శరీరము తేలికగా ఉండును

ఆరోగ్యం = ఆరోగ్యమును కలిగించు ఆహార పానీయములను తీసికొనవలయును

అలోలుపత్వం = లోలత్వముండరాదు. అనగా ఏది కనిపించితే అది ఆకలి ఉన్నా లేకపోయినా జిహ్వ చాపల్యము వలన తినవలెనను కొనుటను లోలత్వము అందురు. అట్టి లోలత్వముండకుండా యోగి ఆకలి కలిగినప్పుడే భుజించ వలయును.

వర్ణ ప్రసాదం = సూక్ష్మ శరీరము తేజోవంతముగా ఉండును. స్థూల శరీరములో చెప్పుకోదగ్గ మార్పు ఉండదు. ఆవిధముగా స్థూల

| | | |
|---|---|---|
| | | శరీరములో మార్పు లేక నల్లగా ఉండుట వలన అంబ, అంబాలికలు వ్యాసునితో సంభోగమునకు ఇష్టపడలేదు. |
| స్వరసౌష్టవంచ | = | అమోఘ వాక్కు కలిగి ఉండును |
| శుభః గంధః | = | శరీరమునకు సుగంధపు వాసన ఉండును |
| ప్రథమామ్ మూత్ర పురీషం + అల్పం | = | మొదటి దశగా మూత్ర పురీషములు అల్పముగా ఉండును. మూత్ర పురీష ములనే మలద కరూశ దేశములుగా రామాయణములో చెప్పబడినవి. ఇవి సంపన్నముగా ఉండెడివి. తాటక వీటిని పాడు చేసెను. తాటక ఒక యోగ రహస్యము. తాటకను సంహరించిన యోగి సిద్ధాశ్రమమునకు చేరును అని |
| వదంతి | | = చెప్పుదురు. |

**అతి భుక్తమభుక్తంచ వర్జయిత్వా ప్రయత్నత ఉక్త మార్గేణ యత్నతః**

(యాజ్ఞవల్క్య ప్రవచనము) ఎక్కువగా భుజించుట, అసలు తినకుండా ఉండుట, అతి నిద్ర, నిద్రపోకుండా మేలుకొనుట వలన యోగము సిద్ధిపొందదు. అనగా యుక్తాహార విహారములు కలిగి ఉండవలయును.

**స్నానము:-** యోగప్రారంభములో బాహ్య శుచి పాటించవలయును. మూడు పూటలా స్నానము చేయవలయును. యోగారూఢునికి స్నానముతో పనిలేదు. ఈవిషయమునే రామాయణములో సుతీక్షణుని శరీరముపై మట్టి మరకలు ఉన్నట్లు వర్ణింపబడినది. యోగమును అష్టాంగములుగా విభజించి విపులముగా అర్థమగుటకు చెప్పుదురు.

**1, 2. యమ నియమములు:-** యమనియమములలో కర్మేంద్రియ నిగ్రహము మఱియు పుణ్యకర్మానుష్ఠానము చెప్పబడును. పుణ్య కర్మలు శాస్త్రవిధిని అనుసరించి చేయవలయును. పాపకార్యములు చేయరాదు. స్వధర్మాచరణ చేయవలయును. వ్రతములు, యజ్ఞయాగాదులు, కులధర్మములను ఆశ్రమ ధర్మములను అనుసరించి



చేయవలయును. పుణ్య ఫలితమును కోరరాదు. కర్మేంద్రియములకు ఈక్రింది పనులు విధులుగా చెప్పబడినవి.

నోరు:- సత్యము, స్వాధ్యాయము, మౌనము, ఓంకార జపము.

చేతులు:- ఆస్తేయము అనగా దొంగిలించకుండుట, అహింస, ఈశ్వరార్చన, సేవ, భాగవత సేవ.

గుహ్యము:- బ్రహ్మచర్యము.

| | యమము | నియమము |
|---|---|---|
| పతంజలి ప్రకారము | సత్యము, అహింస ఆస్తేయము, అపరిగ్రహము, బ్రహ్మచర్యము | స్వాధ్యాయము, ఆచార్యోపాసన |
| శ్రీకృష్ణుని ఉద్ధవగీత ప్రకారం | సత్యము, అహింస, మౌనము ఆస్తేయము, అపరిగ్రహము, బ్రహ్మచర్యము, అసంగము (ఏకాంతము), హ్రీ (సిగ్గు), అసంచయము, ఆస్తిక్యము, స్థైర్యము, క్షమ, అభయము | స్వాధ్యాయము, ఆచార్యోపాసన ఆతిథ్యము, అర్చన, హోమము, తీర్థాటనము, జపము, తపము,శ్రద్ధ తుష్టి |

తీవ్రంబైన యమంబున తమోగుణము, రజోగుణములను జయించవలయును. సర్వమును పరమాత్మగా భావించ వలయును.

**నీహార ధూమార్కానిలా నలానాం**
**ఖద్యోత విద్యుత్స్ఫటిక శశీనామ్**
**ఏతాని రూపాణి పురస్సరాణి**
**బ్రహ్మణ్యభివ్యక్తి కరాణి యోగే** - (శ్వేతాశ్వరోపనిషత్, ద్వితీయ అధ్యాయము,11)

యోగే = యోగమునందు

| | | |
|---|---|---|
| అనిల | = | వాయువు |
| అర్క | = | సూర్యుడు |
| శశీనాం | = | చంద్రుడు |
| అనలానాం | = | అగ్ని యొక్కయు |
| విద్యుత్ | = | మెఱుపు |
| ఖద్యోత | = | మిణుగురు పురుగు |
| నీహార | = | మంచు |
| ధూమ | = | పొగ |
| స్ఫటిక | = | స్ఫటికము మొదలయిన |
| ఏతాని రూపాణి | = | ఈ రూపములు |
| పురస్సరాణి | = | కనుల ముందు కనబడు ఈ దృశ్యమాన ప్రపంచమందలి రూపములు |
| బ్రహ్మణి+అభివ్యక్తి కరాణి | = | బ్రహ్మము నందు ప్రకటితమగుచున్నవి అనగా ఈ సర్వమూ విరాట్ రూపముగా భావించ వలయును. ఇదే విషయమును భాగవతము ద్వితీయ స్కంధమున ముముక్షువైన వాడు విరాట్ స్వరూపమును మనంబున అనుసంధానము చేయువల యునని శుక బ్రహ్మ పరీక్షిత్తుకు చెప్పినట్లు వర్ణింప బడినది. |

**3. ఆసనము:-** నేలపై దర్భలు పఱచి దానిపై జింకచర్మము వేసి దానిపై వస్త్రము వేసుకొని కూర్చొన వలయును. అనగా ఆసనము మెత్తగా ఉండవలయునని దీని అర్థము. ఆసనములో స్థిరత్త్వమును సాధించ వలయును. స్థిరమైన ఆసనములో కూర్చొని ఓంకారమును జపించవలయును.

**స్థిర సుఖమాసనమ్:** (సాంఖ్య సూత్రములు, తృతీయాధ్యాయము, 34)

| | | |
|---|---|---|
| స్థిర సుఖమ్ | = | స్థిరముగా సుఖముగా కూర్చొనుటయే |
| ఆసనమ్ | = | ఆసనమని చెప్పబడును. |

**స్థిర సుఖమాసన మితి న నియమః** (సాంఖ్య సూత్రములు, షష్టి అధ్యాయము, 24.)

| | | |
|---|---|---|
| స్థిర సుఖమ్ | = | స్థిరముగా సుఖముగా కూర్చొనుటయే |
| ఆసనమ్ ఇతి | = | ఆసనమని చెప్పబడును |
| న నియమః | = | ఇటువంటి ఆసనము వేయవలయును అటువంటి ఆసనము వేయవలయును అనే నియమము లేదు |

**ఆసనాని సమభ్యస్య వాంఛితాని యధావిధి** (యాజ్ఞ వల్క్య ప్రవచనము)

| | | |
|---|---|---|
| యధావిధి | = | యధావిధిగా పుణ్య కర్మానుష్ఠానము చేసి |
| వాంఛితాని | = | ఇష్ట దేవతా ప్రార్థన చేసి |
| ఆసనాని | = | ఆసనమందు కూర్చొని |
| సం+అభ్యస్య | = | యోగమును అభ్యసించ వలయును. ఈ విషయమునే సుందర కాండలో హనుమంతుడు నమోస్తురామాయ **సలక్ష్మణాయ..** అని సీతారామ లక్ష్మణులను సమస్త దేవతలను ధ్యానించినట్లు చెప్పబడినది. దీనినే కైవల్య ఉపనిషత్ తన స్వగురువుకు నమస్కారము చేయువల యును అని చెప్పినది. |

**మృద్వాసనే కుశాన్ సమ్యదాస్తీ ర్యాజినమేవచ తదాసనే సుఖాసీనః సవ్యే న్యస్యే తతం కరం సమగ్రీవ శిరః సమ్యక్ సంవృతాస్యః సునిశ్చలః ప్రాఙ్ముఖోదఙ్ముఖో వాపి నాసాగ్ర న్యస్త లోచనః ...** (యాజ్ఞ వల్క్య ప్రవచనము)

భూమిపై చక్కగా దర్భలు పరచి దానిపై జింక చర్మము ఆపై వస్త్రమువేసి ఆవిధముగా ఆసనము తయారు చేసి ఆ ఆసనముపై సుఖముగా ఆసీనుడై మెడను శిరస్సును సమముగా ఉంచి చేతులు ఒకదానిపై ఒకటి వేసుకొని మౌనముగా ఉండి

తూర్పుముఖముగా గానీ ఉత్తరముఖముగా గానీ కూర్చుని నాసాగ్రముపై దృష్టిని నిల్పి ఉంచవలయును.

**త్రిరున్నతం స్థాప్య సమం శరీరం** (శ్వేతాశ్వరోపనిషత్, ద్వితీయ అధ్యాయము,8)

బొమ్మ, మెడ, శిరస్సు అను ఈ మూడూ ఉన్నతముగా ఉంచి శరీరమును సమముగా ఉంచి ఆసనముపై కూర్చొన వలయును.

**4. ప్రాణాయామము:-** రేచక పూరక కుంభముల ఉచ్ఛ్వాసనిశ్వాస ప్రాణాపానములను నిరోధించి కోశశోధనము చేసి అనగా వాతపిత్తశ్లేష్మములను దోషములను భస్మీకరణము చేసి అన్నమయాది కోశములను శుద్ధి చేసికొని నాడీ శుద్ధిగావించవలయును. ప్రాణమును మనస్సుతోడంగూర్చి మూలాధారాది స్థానములలో ఒక్కొక్క స్థానమునందు నిలుప వలయును. ఈవిధముగా ప్రాణవాయువును స్వాధీనము గావించుకొనవలయును. ధ్యానయోగమున ప్రాణాయామము యొక్క ప్రాముఖ్యము అతి స్వల్పము.

**నిరోధశ్ఛర్ది విధారణాభ్యామ్** (సాంఖ్య సూత్రములు, తృతీయాధ్యా యము, 33)

| | | |
|---|---|---|
| ఛర్ది విధారణాభ్యామ్ | = | రేచక కుంభకములు రెండింటి |
| నిరోధః | = | నిరోధము వలన పూర్ణ కుంభకము కలుగుచున్నది. ఆ విధముగా యోగి జితశ్వాస కలిగి పూర్ణ కుంభకమున ఉండవలయును. |

**ప్రాణాన్ ప్రపీడ్యేహసన్ యుక్త చేష్టః క్షీణ ప్రాణేనాసికయోచ్ఛ్వసీత**

(శ్వేతాశ్వరోపనిషత్, ద్వితీయ అధ్యాయము,9)

| | | |
|---|---|---|
| యుక్త చేష్టః సన్ | = | అతిగా భోజనము చేసినవానికి ఆహారము తీసికొనకుండా నిరాహారముగా ఉన్న వానికి, అతి నిద్రాపరునికి నిద్రపోకుండా మెలకువగా ఉన్న వానికి పూర్తిగా బ్రహ్మచర్యము చేయువానికి అటులనే సురతాపేక్ష కలవానికి యోగము రాదు. కావున ఆహార విహారములో యుక్తమగు ఆచరణ కలవాడై |



| | | |
|---|---|---|
| ప్రపీడ్య | = | మడమలచే మూలాధార చక్రమును పీడించి |
| నాసికయా | = | ముక్కు రంధ్రముల ద్వారా |
| ఉచ్ఛ్వసీత | = | పూర్ణ కుంభకములో ఉండుటకు దృష్టిని ముక్కుకొనపై నిలిపి శ్వాసను గమనించుచు |
| క్షీణే ప్రాణే | = | వాయువుయొక్క ఉధృతి తగ్గినప్పుడు అనగా వదలుచున్న గాలియొక్క నిలుపు తగ్గి ప్రాణవాయువు ముక్కు రంధ్ర ములలో తిరుగుచున్న సమయములో |
| ప్రాణాన్ | = | ప్రాణములను వశము చేసికొనవలయును. ఈ స్థితిని పూర్ణ కుంభము అని అందురు. |

**ప్రాణాయామం తతో గార్గి జితాసన గతోఽభ్యసేత్**
**నాడీ శోధనం కుర్యాత్ తత్ శోధనం అకుర్వతః వ్యధా క్లేశః భవతి**

(యాజ్ఞ వల్క్య ప్రవచనములు)

| | | |
|---|---|---|
| గార్గి | = | ఓ గార్గీ |
| జితాసన గతః | = | ఆసనముపై పట్టు సాధించిన పిదప |
| ప్రాణాయామం | = | ప్రాణాయామమును |
| అభ్యసేత్ | = | అభ్యసించవలయును |
| తతః | = | అటుపిమ్మట |
| నాడీ శోధనం కుర్యాత్ | = | నాడీ శుద్ధిని చేయవలయును |
| తత్ శోధనం అకుర్వతః | = | అలా నాడీ శోధనం చేయనిచో |
| తస్య | = | ఆ సాధకునికి |
| వృధా క్లేశః భవతి | = | శారీరక క్లేశములు కలుగును. |

**5. ప్రత్యాహారము:-** జ్ఞానేంద్రియములయిదింటిని నిగ్రహించుట ప్రత్యాహారము అనబడును. విషయంబుల వెంటనంటి పారెడి ఇంద్రియములను బుద్ధిసారధియై మనో నామకంబులైన పగ్గంబుల బిగబట్టి ఉంచవలయును. ప్రత్యాహారము చేత సంసర్గమును దహనము చేసి చంచలంబైన చిత్తమును సుస్థిరము గావించవలయును.

**చూపు:-** స్వనాసాగ్రావలోకనంబు చేయుచు కామహతంబైన చిత్తంబున పరిభ్రమణంబు మాని **కామవిసర్జనంబు చేసి మరలునంతవరకు** నిజనాసాగ్ర నిరీక్షణము సేయుచుండవలయును. ముక్కు గుఱించి, నాలుక గుఱించి ఆహారము గుఱించి ప్రత్యేకముగా ముందుగానే వివరించబడినది. జ్ఞానేంద్రియములను నిగ్రహించుటను ప్రత్యాహారమని చెప్పుదురు.

**హృదీంద్రియాణి మనసా సన్నివేశ్య** (శ్వేతాశ్వరోపనిషత్, ద్వితీయ అధ్యాయము,8)

| | | |
|---|---|---|
| ఇంద్రియాణి | = | జ్ఞానేంద్రియములను వాటి ఇంద్రియార్థముల నుంచి |
| మనసా | = | మనస్సు చేత నిగ్రహించి |
| హృది | = | మనస్సును బుద్ధితో కలిపి హృదయము నందు |
| సన్నివేశ్య | = | ప్రతిష్ఠించ వలయును. దీనినే పంచేంద్రియోన్మాదమున్ పరిమార్చి అని చెప్పు దురు. |

**అగ్నిర్యత్రాభి మధ్యతే వాయు ర్యత్రాభిరుధ్యతే**
**సోమో యత్రాతి రిచ్యతే తత్ర సంజాయతే మనః**

(శ్వేతాశ్వరోపనిషత్, ద్వితీయ అధ్యాయము,6)

**దుష్టాశ్య యుక్తమివ వాహమేనం**
**విద్వాన్మనో ధారయేతా ప్రమత్తః**

(శ్వేతాశ్వరోపనిషత్, ద్వితీయ అధ్యాయము,9)

| | | |
|---|---|---|
| దుష్టాశ్వ యుక్తం+ ఇవ వాహం యేనం | = | దుష్టాశ్వములు పూన్చిన రథమును సారథి ఆ అశ్వములను నిగ్రహించి రథమును సక్రమ మార్గమున నడుపు నట్లు |
| విద్వాన్ | = | విద్వాంసుడు |
| మనః అప్రమత్తః ధారయేత్ | = | మనస్సును నిగ్రహించి తద్వారా ఇంద్రియములను సక్రమమార్గములో నడుపవలయును |



భగవద్గీతలో కొందఱు జ్ఞానేంద్రియములను వాటి ఇంద్రియార్థములనుంచి మరలింతురు. దీనినే కొందఱు శ్రోత్రాది జ్ఞానేంద్రియములను సంయమము అను అగ్నియందు హోమము చేయుదురనియు మఱికొందఱు శబ్దాది విషయములను ఇంద్రియములను అగ్ని యందు హోమము చేయుదురనియు, కొందఱు ఇంద్రియముల కర్మలనన్నింటిని అటులనే ప్రాణములను ఆత్మ సంయమము అనే అగ్నియందు హోమము చేయుదురనియు చెప్పినాడు.

జ్ఞానేంద్రియములు వాటి వాటి ఇంద్రియార్థములందు ప్రసరించి మనస్సును ఆకర్షించును. ఈ విషయమునే రామాయణములో ఋశ్యశృంగుని కథలో వివరింపబడినది. జ్ఞానేంద్రియములను వాటి ఇంద్రియార్థములపై ప్రసరించకుండా అంతఃకరణములలో ఒకటైన బుద్ధి అనే సాధనచే మనస్సు అనే పగ్గములు పట్టి జ్ఞానేంద్రియములు అనే గుఱ్ఱములను నిగ్రహించి సాధకుడు తన వశమునందు ఉంచుకొనవలయును. లేనిచో సముద్రములో తుఫానులో చిక్కిన నావవలె మునిగిపోవునట్లు సాధకుడు పతనమగును. మనస్సుచే విషయములను ధ్యానించుట వలన మనస్సుకు విషయములతో సంబంధము ఏర్పడును. అప్పుడు ఆ ఇంద్రియార్థములపై రాగము ఏర్పడి కామము మోహము కలుగును. కామము నెఱవేఱనిచో క్రోధము కలుగును. ఆపై స్మృతి భ్రంశము కలుగును. బుద్ధినాశనమగును. విచక్షణా జ్ఞానము కోల్పోయి మంచి చెడులు తెలియక ప్రవర్తిల్లును. ఆవిధముగా సాధకుడు పతనమగును. ఇంద్రియ విషయములు ఇంద్రియములకు దుఃఖము కలిగించుట వలన వాటిపై ద్వేషము ఏర్పడును. ఉదాహరణకు నాలుక మధుర పదార్థము గ్రహించుటకు ఇష్ట పడును. అప్పుడు రాగమేర్పడును. నాలుకకు నచ్చని పదార్థములను గ్రహించుటకు ఇష్టపడదు. అప్పుడు ఇంద్రియార్థములపై ద్వేషము కలుగును. ఆవిధముగా రాగ ద్వేషములు కలుగును. కావున మనస్సు నిగ్రహించి రాగ ద్వేషము లేనివాడై తితీక్ష కలిగి ఉండవలయును. ఉపవాసము వలన విషయములు తగ్గుముఖము పట్టును. ఆత్మ దర్శనము అయినగానీ విషయములు నశించవు. దీనినే జితేంద్రియుడు అని అందురు. ఈ విషయమునే విశ్వామిత్రుడు బ్రహ్మతో తను జితేంద్రియుడు అయితినా అని అనేక మారులు అడుగును. మనస్సుచే విషయములు ధ్యానించుట వలన మనస్సుకు విషయములతో

సంబంధము ఏర్పడును. కావున విషయములను మనస్సుతో ధ్యానించరాదు. ఈ స్థితిలోనే ప్రత్యాహారముపై పట్టు సాధించవలయునని కంసుడు చెప్పినాడు.

**6. ధ్యానము:-** ఇందు అంతఃకరణముల గుఱించి వివరించబడును. అహంకారము, చిత్తము,మనస్సు, బుద్ధి అను అంతఃకరణముల లక్షణములను గ్రహించవలయును. రజోగుణమును వీడి సత్త్వగుణము కలిగి నిరంతరము ఓంకారమును జపించుటను ధ్యానమని అందురు.

**చిత్తము:-** కుంభక, పూరకములచేత చంచలమైన చిత్తమును సుస్థిరము గావించవలయును. చూపు లక్ష్యముపై నిలిచిన చిత్తము సుస్థిరము. చిత్తము కుటుంబ సంగమున చిత్త చాంచల్యము కలుగును. ఇట్టి చిత్తమును విరాట్పురుషుని సర్వ అవయవములను అనుసంధానము చేయుచు ఉన్నచో కొంతకాలమునకు చిత్తము విషయశూన్యంబై విరక్తి పొందును. అప్పుడు చిత్తములో ప్రశాంతత కలిగి సమస్త నివృత్తంబైన చిత్తము శాంతిని పొందును.

**మనస్సు:-** మనస్సు సంకల్ప వికల్పములకు పుట్టినిల్లు. ఇందు వికల్పమును నశింపచేసి మనస్సును నిశ్చలము చేసి పరిశుద్ధమైన మనస్సుతో ఈశ్వరుని ధ్యానించవలయును. జ్ఞానేంద్రియములను వాటివాటి విషయములనుంచి మనస్సుచే మరలించవలయును. చంచలమైన మనస్సును శేముషీబలమున నిరోధించి అనగా బుద్ధిచే నిరోధించి భగవదాకారముతోడ బంధించి నిర్విషయంబైన మనంబున ఈశ్వరుని ధ్యానించవలయును. మనస్సు చంచలము. దీనిని నిగ్రహించుట కష్టము. అయినను అభ్యాస వైరాగ్యములచే మనస్సును సుస్థిరము గావించ వలయును. సాధన ప్రారంభములో ఓంకారమును జపించుచు మనస్సులో భగవంతుని గుఱించి ఆలోచన చేయవలయును. అనగా భగవంతుని అవయవముల గుఱించి అతని రూపము గుఱించి అతను చేసిన ఘనకార్యముల గుఱించి అటులనే అతని ఆయుధముల గుఱించి ధ్యానము చేయవలయును. ఈధ్యానము గుఱించి గజేంద్రమోక్షమున అపరరాత్రమున మేల్కాంచి భగవంతునిని, ఈ సరోవరమును మొదలైనవాటిని ధ్యానించ వలయునని వికల్పము నశించుటకు సూత్రమును చెప్పినారు. భగవంతుని యందు శ్రద్ధ, ఆసక్తి, పెద్దల సేవ మొదలయినవాటిచే ధ్యానము సిద్ధించును. నిరంతర



నామ స్మరణను ధ్యానము అందురు. ఈ ధ్యానముచే అహంకార నిబద్ధంబైన కర్మంబు తుంచివైతురు. దీనినే కథగా ప్రహ్లాదుని పరముగా పానీయంబులు త్రాగుచున్, కుడుచుచున్ అని చెప్పినారు. దీనినే గోపికల పరముగా నిరంతరము అతని గుఱించిన అలోచనలో ఉన్నట్లు వర్ణించినారు.

**రాగోపహతి ర్ధ్యానమ్** (సాంఖ్య సూత్రములు, తృతీయాధ్యాయము, 30)

| | | |
|---|---|---|
| రాగ + ఉపహతి | = | రాగ ద్వేషములనుండి విడివడి భగవన్నామము చేయుటయే ధ్యానము |

<u>వైరాగ్యా దభ్యాసాచ్చ</u> (సాంఖ్య సూత్రములు, తృతీయా ధ్యాయము, 36)

| | | |
|---|---|---|
| <u>వైరాగ్యాత్</u> | = | విరక్తి వైరాగ్యములు కలిగి |
| చ | = | మఱియు ఈషణత్రయములు వదలి అరిషడ్వర్గములను జయించి |
| అభ్యాసాత్ | = | నిరంతర అభ్యాసము వలన అనగా నిరంతర నామ స్మరణ వలన ధ్యానము సిద్ధించును. ఈ ధ్యానమును చేయుటను కంసుని పరముగా భాగవతము దశమ స్కంధములో (82)ఇట్లు వివరించినారు. "క్రౌర్యంబు విడచి, ధైర్యంబు నొంది, గాంభీర్యంబు పాటించి, శౌర్యంబు ప్రకటించుకొనుచు, మౌనియుంబోలె" |

క॥ **తిరుగుచుఁ గుడుచుచుఁ ద్రాగుచు**
**నరుగుచుఁ గూర్చుండి లేచు చనవరతంబున్**
**హరిఁ దలఁచి తలఁచి జగమా**
**హరి మయమని చూచెఁ గంసుఁడాఱని యలుకన్**

(భాగవతము దశమ స్కంధము85)

ఇదే విషయమును ప్రహ్లాదుని పరముగా భాగవతము సప్తమ స్కంధమున పానీయంబులు త్రాగుచున్, గుడుచుచున్,భాషించుచున్....మరచెన్ ఏతత్ విశ్వమున్ భూవరా అని చెప్పినారు.

**వృత్తి నిరోధా త్తత్ సిద్ధిః** (సాంఖ్య సూత్రములు, తృతీయాధ్యాయము, 31)

| | | |
|---|---|---|
| వృత్తి నిరోధాత్ | = | చిత్త వృత్తులను నిరోధించుట వలన అనగా సంసార తాపత్రయములను వీడుట వలన |
| తత్ | = | ధ్యానము |
| సిద్ధిః | = | సిద్ధించును. |

**7. ధారణ:-** ధ్యానము యొక్క పరాకాష్టనే ధారణ అందురు. తమోగుణము, రజోగుణము, పూర్తిగా నశించి సత్త్వగుణమున ఉండి ఓంకారమును జపించుటను ధారణ అని అందురు. అహంకార మమకారములు లేక రాగద్వేషములు లేక సుఖదుఃఖములకు విచలితుడుగాక ద్వంద్వాతీతుడై ఉండుటను ధారణగా చెప్పుదురు.

రజస్తమోగుణంబులచేత నాక్షిప్తంబగు చిత్తంబు విమూఢంబైన ఆ గుణముల వలన కలిగిన మలములు పోయి నిర్మలచిత్తులైన యోగికి సమాధి స్థితి సిద్ధించును. మలములనే దుర్గుణములు అని అందురు. దుర్గుణములు పూర్తిగా నశించిన స్థితిని అమలము అని అందురు. ఈ అమలము అను స్థితికి చేరవలయును. సంస్కృత భాషలో అమలమనగా ఉసిరికాయ. ఇది ఆచారకాండలో కార్తీకమాస వనభోజనముగా కనబడుచున్నది.

కం॥ **ధారణ యేక్రియ నిలుచును**
**ధారణకే రూపమెద్ది ధారణయనఁగా**
**ధారణ పురుషు మనోమల**
**మేరీతి హరించు నాకు నెఱిఁగింపఁగదే**

(భాగవతము, ద్వితీయ స్కంధము, 13)

దీనికి సమాధానముగా శుక యోగీంద్రుడు ఇట్లు చెప్పినాడు:

ఆ॥ **పవనములు జయించి పరిహృత సంగుఁడై**
**యింద్రియముల గర్వమెల్లమాపి**
**హరి విశాలరూపమందు జిత్తముఁజేర్చి**
**నిలుపవలయు బుద్ధి నెఱపి బుధుఁడు.**

(భాగవతము, ద్వితీయ స్కంధము, 15)



**భావనోప చయాత్ శుద్ధస్య సర్వం ప్రకృతివత్**

(సాంఖ్య సూత్రములు, తృతీయాధ్యాయము, 29)

| | | |
|---|---|---|
| భావన ఉపచయాత్ | = | ధ్యాన సిద్ధివలన ధారణా యోగంబున |
| శుద్ధస్య | = | నిర్మలాంతఃకరణము కలిగిన పురుషునకు |
| ప్రకృతివత్+సర్వం | = | ప్రకృతి వలన గలిగిన సర్వ బంధములు తొలగును. ఆ స్థితిలో యోగి |

సీ॥ **శ్రవణ రంధ్రముల నేశబ్దంబు వినఁబడు నది హరి రవమని యాలకించు**
**నక్షిమార్గమున నెయ్యది సూడఁబడు నది హరిమూర్తి గానోపు నంచు జూచుఁ**
**దిరుగుచో దేహంబు తృణమైన సోఁకిన హరి కరాఘాతమోయనుచు నులుకు**
**గంధంబులేమైన ఘ్రాణంబు సోఁకిన హరి మాలికా గంధ మనుచు నడరుఁ**

ఆ॥ **బలుకు లెవ్వియైనఁ బలుకుచో హరిపేరు**
**పలుకఁ బడియెననుచు భ్రమసి పలుకుఁ**
**దలఁపు లెట్టివైనఁ దలఁచి యా తలఁపులు**
**హరితలంపులనుచు నలుగఁదలఁచు** (భాగవతము, దశమస్కంధము, 87)

అనగా సర్వము పరమాత్మగా గోచరమగును. తనయందు అఖిల భూతములందు సమభావన కలుగును. ఇతడు జీవన్ముక్తుడు. ఇట్టి స్థితిలోనివాడు పునర్జన్మకు రాడు.

**8.సమాధి:-** పూర్వజన్మ కర్మ వాసనలు నిర్మూలమైన నిశ్చల సమాధికలుగును.

**కృతి నియమ లంఘనా దావర్థక్యం లోకవత్**

(సాంఖ్య సూత్రములు, చతుర్థాధ్యాయము, 15)

| | | |
|---|---|---|
| కృతి నియమ లంఘనాత్ | = | యోగములో చెప్పబడిన విధి నియమములు పాటింపకపోవుట వలన |
| అవర్థక్యం లోకవత్ | = | లౌకిక విషయములలో మునిగి తేలుతున్నా యోగము సిద్ధింపదు |

**ఇషుకార వన్నైకచిత్తస్య సమాధి హానిః** (సాంఖ్యసూత్రములు, చతుర్థాధ్యాయము, 14)

| | | |
|---|---|---|
| ఇషుకారవన్ | = | బాణమును తయారుచేయువాడు ఆ బాణమును పదును పెట్టునట్లు నిరంతర నామ స్మరణ వలన చిత్తమును ఏకాగ్రతకు చేర్చ వలయును. |
| న+ఏక చిత్తస్య | = | చిత్త ఏకాగ్రత లేనివానికి |
| సమాధి హానిః | = | సమాధి భంగము కలుగును.(రణగొణ ధ్వనులు, ఆత్మీయుల రోదనలు చెవులకు సోకి సమాధి భంగము కలుగును. శృంగి బిగ్గరగా ఏడ్చుట వలన శమీకునికి సమాధి భంగము కలిగి జాగ్రతావస్థకు వచ్చినాడు.) |

**ధారణాసన స్వకర్మణా తత్ సిద్ధిః** (సాంఖ్య సూత్రములు, తృతీయాధ్యాయము, 32)

| | | |
|---|---|---|
| స్వకర్మణా | = | జాతి ఆశ్రమ ధర్మములలో చెప్పబడిన పుణ్య కర్మాచరణ వలన అనగా యమనియమములు పాటించుట వలన |
| ఆసన | = | స్థిరాసనము కలిగి, చూపును ముక్కుకొనపై నిలిపి, నిరంతర నామ స్మరణ చేయుచు కర్మవాసనలు నశించిన |
| తత్ | = | నిశ్చల సమాధి |
| సిద్ధిః | = | సిద్ధించును |

**ప్రణతి బ్రహ్మచర్యోప సర్పణాని కృత్వా సిద్ధి ర్బహు కాలా తద్వత్**
(సాంఖ్య సూత్రములు, చతుర్థాధ్యాయము,)

| | | |
|---|---|---|
| ప్రణతి+బ్రహ్మచర్య+ ఉపసర్పణాని | = | పెద్దలకు నమస్కారము, బ్రహ్మ చర్యము, గురు కృప, |
| తత్+వత్ కృత్వా | = | మొదలయిన దైవీ సంపదలు కలిగి ఉండుట వలన |
| బహుకాలా | = | చాలా కాలమునకు |
| సిద్ధిః | = | సిద్ధి కలుగును. |

**నకాల నియమో వామదేవవత్** (సాంఖ్య సూత్రములు, చతుర్థాధ్యాయము, 20)

| | | |
|---|---|---|
| వామ దేవ వత్ | = | వామదేవుడనే ఋషి తల్లి గర్భములో ఉండగనే ఆత్మ దర్శనము పొందెను కావున ఆత్మ దర్శనమునకు |
| న కాల నియమః | = | కాల నియమము లేదు. |

**లబ్ధ్వాతిశయ యోగాద్వా తద్వత్** (సాంఖ్య సూత్రములు, చతుర్థాధ్యాయము, 24)

| | | |
|---|---|---|
| లబ్ద్వా+అతిశయ+యోగాత్ | = | నిరంతర యోగ సాధన వలన |
| వా | = | మఱియు |
| తత్ + వత్ | = | భగవంతుని కృపవలన ఆత్మ దర్శనము కలుగును. బ్రహ్మ నూఱు సంవత్సరములు తపస్సు చేసిన పిదప నారాయణుడు దర్శనమిచ్చి నీ తపస్సు వలనకాక నేను దర్శనమివ్వ సంకల్పించుట వలన నీకు దర్శనము కలిగినది అని చెప్పినాడు. |

**బ్రహోడుపేన ప్రతరేత విద్వాన్**
**స్రోతాంసి సర్వాణి భయాప హాని** (శ్వేతాశ్వరోపనిషత్, ద్వితీయ అధ్యాయము, 8)

| | | |
|---|---|---|
| విద్వాన్ | = | విద్వాంసుడు |
| బ్రహ్మ+ఉడుపేన | = | బ్రహ్మమనే తెప్పచేత |
| సర్వాణి +భయాపహాని | = | సర్వ భయములకు ఆలవాలమైన |
| స్రోతాంసి | = | సంసార సాగరమును(నదులను) |
| ప్రతరేత | = | దాటుచున్నాడు. తెప్పచేత సముద్రమును దాటలేము. కానీ ఇచ్చుట దాటుచున్నాడు |

అని చెప్పుట వలన దైవ కృప వలన అసాధ్యము సాధ్యమగును అని భావము.

యోగి గుఱించి శ్రీకృష్ణుడు ఇట్లు చెప్పినాడు.

**ఆరురుక్షోర్ముమేర్యోగం కర్మ కారణముచ్యతే ।**
**యోగారూఢస్య తస్యైవ శమః కారణముచ్యతే॥**

(భగవద్గీత ఆత్మ సంయమ యోగము, 3)

యోగమును పొందగోరువాడు ప్రారంభములో జాతి ధర్మములు, ఆశ్రమ ధర్మములు పాటించుచు పాషండ ధర్మము, అభాస ధర్మములను పాటింపక పుణ్యాకర్మానుష్ఠానము చేయుచు, కర్మేంద్రియములను నియమించి, ఆసనమును అభ్యసించ వలయును. దీనినే కర్మ కారణము అని చెప్పబడుచున్నదని పై శ్లోకములో చెప్పబడినది. అనగా యమ నియమ ఆసన ప్రాణాయామములు ప్రారంభ స్థాయివి. జ్ఞానేంద్రియములను, అంతఃకరణములను నియమించుట యోగారూఢునకు అవసరము. అనగా ప్రత్యాహారము, ధ్యాన, ధారణలు ఆరూఢ స్థితి. దీనినే శమము కారణముచ్యతే అని పైన చెప్పబడినది.

## యోగమునకు భక్తికి గల స్వల్ప భేదము

యోగములో ఇంద్రియములు నిగ్రహించి మనస్సులో ఓంకారమును జపించుచు ఆత్మానుసంధానము చేయుదురు. భక్తిలో ఇంద్రియములను భగవత్పరముగా ఉపయోగించి మనస్సులో భగవన్నామమును అనగా ఇష్టదేవతా నామమును స్మరించుచు తదీయ మూర్తిని అవలోకించెదరు.

## గజేంద్రమోక్షము

ఇంద్రద్యుమ్నుడనువాడు ద్రవిడ దేశపు రాజు. ఇతడు ఒకరోజు మనస్సులో అచ్యుతుని అనగా ఈశ్వరుని ఊహించుచుండెను. అగస్త్యుడు వచ్చినను రాజు లేచి పూజించలేదు. దానిపై అగస్త్యుడు కోపించి రాజును గజేంద్రునిగా పుట్టుమని శాపము ఇచ్చినట్లు కథగా వర్ణింప బడినది. ఈ కథలో సాధకుడు ధారణనుంచి సమాధి



స్థితికి చేరుటను రహస్యముగా చెప్పినారు. బాహ్యముగా శాపమిచ్చినట్లు కథలో కనిపించును. రాజుపేరు ఇంద్రద్యుమ్నుడు అనగా ఇంద్రునితో సమానమైన కాంతి గలవాడు అని అర్థము. జీవుడు ఈశ్వరుడు బింబ ప్రతిబింబములు. కావున జీవుడు ఇంద్రునితో సమానమైన ప్రకాశము కలవాడు. సృష్ట్యాదియందున్న ఈశ్వరుడే దేహములోనికి వచ్చి జీవునిగాను ఈశ్వరునిగానూ నటించుచున్నాడు. కావున ఇతడు ఇంద్రద్యుమ్నుడు. ఈ రాజు సంసారబంధము నుండి విడివడక అహంకార మమకారములు కలిగి నామస్మరణ చేయుచున్నాడు. ఇలా ఎంతకాలము చేసినా ప్రయోజనము లేదు. సమాధి స్థితికి జీవుడు చేరలేడు. ఈశ్వరుడు కాలేడు. ఈవిషయమునే అగస్త్యుని శాపముగా కథాపరముగా చెప్పబడినది. ఇలా ఆ రాజుకు యోగ భ్రష్టత్వము కలిగి మఱుజన్మలో గజేంద్రునిగా జన్మించినాడు.

**గజేంద్రుడు- సాధనకు పూర్వము:-** పాలసముద్రములో త్రికూటమను పర్వతము కలదు. ఆపర్వతములో బంగారము, వెండి, ఇనుము కలిగిన మూడు శిఖరములు కలవు. ఆ శిఖరములపై భూమి, ఆకాశము, దిశలు తేజరిల్లును. ఆపర్వతముపై గజేంద్రుడు దశలక్షకోటి కరణీ నాథుడై ఉండెను. గజేంద్రుడు భార్యలతో ఇచ్ఛావిహారములు సలుపుచుండెను. చెవులకు కలహంసరవములు, చర్మమునకు మంచి పిల్లగాలి, కన్నులకు వనసౌందర్యము, నాలుకకు కొలనులలోని నీటిసారము, ముక్కుకు పద్మసుగంధము ఆఘ్రాణించుచు ఇలా జ్ఞానేంద్రియ వ్యవహారముల వలన సంసారములో ఆనందమును పొందుచు ఆత్మ తత్త్వమును మఱచెను. ఈవిధముగా జీవుడు పంచేంద్రియ వ్యవహారమున ఆత్మ తత్త్వమును మఱచి సంసార సాగరములో పడి దారి తెన్నుకానక విహరించుచుండెను. చిత్తము ఈశ్వరునియందు కాక మార్గంబు తప్పి అనగా ఈశ్వరఅన్వేషణవదలి కామములను అనుభవించుచు మోహలతానిబద్ధపదమున్ విడిపించుకొనంగలేక అనగా నేను నాది అనే అహంకార మమకారములు కలిగి దేహసంబంధీకులైన భార్య, పిల్లలు, బంధువులను తనవారని భావించి సంసారమునుండి విడివడు మార్గంబు తెలియక సుఖదుఃఖములను పొందుచు దీన దశలో ఉండెను. మాయావరణలో చిక్కుకున్నాడు. జ్ఞానదీపము ప్రకాశించుట లేదు. జీవుడు గజేంద్రుడు. మొసలి మనస్సు. ఈ మనస్సు జీవునకు బంధకారణము.

మనస్సులయమైన అనగా అంతఃకరణములు నశించిన జీవుడు మోక్షమును పొందును. దీనినే కథగా వివరించినాడు.

**సాధన:-** మొసలి గజేంద్రుని పట్టుకొన్నది. గజేంద్రుని భార్యలు గజేంద్రుని వదలి వెడలిపోయినారు. అనగా జీవునకు సంసారమునందు విరక్తి కలిగినది. అంత పూర్వపుణ్యఫలదివ్యసంపత్తితో ఈశ్వరుని శరణుకోరవలయుననే భావన కలిగినది. మనస్సు, జీవుడు ఎవరి ఇష్టానుసారము వారు తిరుగుచుందురు. మనస్సనే మొసలి గజేంద్రుడనే జీవుని పట్టుకొనుటకు అనగా జీవుడు మనస్సును స్వాధీనము చేసికొనుటకు యోగమును అవలంబించవలయును. దీనిని గజేంద్రుని పరముగా గాక మొసలి పరముగా చెప్పబడినది. పాదద్వంద్వము నేలమోపి అనగా ఆసనములో కూర్చుని, పవనుంబంధించి అనగా ప్రాణాయామము చేసి, పంచేంద్రియోన్మాదమున్ బరిమార్చి అనగా ప్రత్యాహారము చేసి, తనమనంబున ఈశ్వర సన్నిధానమును కల్పించుకొని బుద్ధిలతకు మాఱాకు హత్తించి అనగా ధ్యానము, ధారణలో ఈశ్వరుని ప్రార్థించినాడు. ఈశ్వరుని శరణుకోరెను. అనగా గుణరహిత స్థితికి వచ్చెను అని అర్థము. అంత విష్ణువు గజేంద్రుని శరణాగతిని విని సుదర్శన చక్రము చేబూని మొసలిని సంహరించెను. అనగా మనస్సు కర్మబంధమునుంచి విడివడినది. అంతఃకరణము నశించినది. జీవుడు జీవన్ముక్తుడయినాడు. గజేంద్రుడు అజ్ఞాన రహితుడై విష్ణురూపుడగుచు వెలుగుచుండి అని ముగించినాడు. అనగా సాధన ఫలించినది. జీవుడు ఈశ్వరుడైనాడు. ఈ కథను అనేకసార్లు చదివి ఆచరించ వలయును అని చెప్పుటకు ఫలశృతి చెప్పబడినది.

కం॥ **గజరాజ మోక్షణంబును**
**నిజముగఁ బఠియించునట్టి నియతాత్ములకున్**
**గజరాజ వరదుఁడిచ్చును**
**గజతురగ స్యందనములుఁ గైవల్యంబున్**

(భాగవతము, అష్టమ స్కంధము, 137)

గజేంద్రుని పరముగా జీవుడు ఈశ్వరుడగు విధానము చెప్పబడినది.

*****



# క్షీరసాగరమథనము

**కథాభాగము:** దుర్వాస శాపమున ఇంద్రుడు, దేవతలు, జగము, నిర్వీర్యులు అయినారు. అంత ఇంద్రాది దేవతలు విష్ణువు వద్దకు వెళ్ళి తమ దీన స్థితిని మొరపెట్టుకొనిరి. విష్ణువు మీరు రాక్షసులు కలసి పాలసముద్రములో సర్వతృణలతఔషధములు వేసి మందర పర్వతమును కవ్వముగా చేసి వాసుకిని త్రాడుగా చేసి నా సహాయముతో పాలసముద్రమును కామరోషములు లేకుండా మథించండి, అలసట లేకుండా అఖిలార్థములు కలుగును అని చెప్పినాడు.

**అధ్యాత్మిక భాగము:-** జగములు అనగా స్థూల సూక్ష్మదేహములు; ఇంద్రుడనగా జీవుడు; దేవతలనగా ఇంద్రియములు. ఈవిధముగా జీవుడు దైవత్వము లేక జీవుడుగా నిర్వీర్యముగా ఉన్నాడు. స్థూల దేహము దానవులు. సూక్ష్మ శరీరము దేవతలు. యోగములో స్థూల సూక్ష్మ శరీరములు కలసి పనిచేయవలయును. కరచరణాదులు అనే దానవులు స్థూల శరీరమునకు సంబంధించినవి. అంతఃకరణము అనే సూక్ష్మ శరీరము దేవతలకు సంబంధించినది. కర్మేంద్రియ, జ్ఞానేంద్రియ, అంతఃకరణముల సమిష్ఠి సాధనయే యోగము. పాల సముద్రమనగా భ్రూమధ్య స్థానము. దీనిపై దృష్టిని నిలుపుటయే క్షీరసాగర మథనము. ప్రాణవాయువు మఱియు స్థూలశరీరమును మందర పర్వతము అని అందురు. వాసుకి త్రాడు. ఇదే కుండలిని. మందర పర్వతమును కవ్వముగా చేసి త్రిప్పవలయును. అనగా ప్రాణవాయువును కుడినుండి ఎడమకు ఎడమనుండి కుడికి త్రిప్పవలయును. విష్ణువు గురువు. అనగా గురుసాన్నిధ్యములో గురువుతో కలసి యోగ సాధన చేయవలయును. యోగములో తమోగుణము, రజోగుణము ఉండరాదు. రజోగుణము పోవు వఱకు పుణ్యా కర్మానుష్ఠానము చేసి ఆపై తీవ్రమోక్షేచ్ఛ కలిగినవారు యోగమును సాధన చేయ వలయును. తమోగుణయుతులు ఆసనమున కూర్చున్ననూ యోగము చేసినను జీవుడు ఈశ్వరుడగుట అనే ఫలితము కలుగదు. క్షీరసాగరమున మందర పర్వతము ఉంచి వాసుకిని త్రాడుగా చేసి మథించుచుండిరి. ఆసమయములో మందర పర్వతము మునిగి పోయినది. అనగా శరీరము ఆసనములో స్థిరత్వము పొందలేదు అని భావన. విష్ణువు కూర్మావతారియై మందర పర్వతమును తన వీపుపై నిలిపెను. అనగా ఆసన

సిద్ధి జరిగినది. కూర్మావతార ఆవిర్భావము అనగా యోగములో ఆసనము శుద్ధికలుగుట అని అర్థము. పాల సముద్రమథనములో హాలాహలము జనియించినది. ఆసన సిద్ధికలిగి మనస్సును నిశ్చలము చేసి చూపును భ్రూమధ్యమున నిలిపి ప్రాణాయామము చేయుచుండగా అగ్ని, వాయువుల సంబంధము వలన ఆధార చక్రమునందు నిద్రాణమైయున్న కుండలినీ శక్తి మేల్కొనును. ఈ కుండలినీ శక్తివలన అణిమాది సిద్ధులు కలిగి యోగి పతనమగును. ఇక ఎప్పటికీ ఈశ్వరుడు కాలేడు. ఈ కుండలినీ శక్తిని రామాయణములో వాలిగా చెప్పిరి. ఈ వాలిని సంహరించ వలయును. సాధకుడు అనాహతమున ఉన్నచో కుండలినీ శక్తి ప్రభావము ఉండదు. దీనినే చెట్టుగా చెప్పుదురు. ఈ చెట్టుచాటున ఉండియే వాలిని సంహరించవలయును. ఈ యోగ రహస్యమును వాల్మీకి మనకు అందచేసినాడు. ఈ కుండలినీ శక్తిని లేదా హాలా హలమును ఈశ్వరునికి సమర్పించవలయును. ఇదియే హాలాహలభక్షణ. ఆవిధముగా యోగము నిరంతరము ఈశ్వర కృపతో చేయుచుండగా మనస్సులోని రజోగుణము నశించి సత్త్వగుణము కలుగును. దీనినే కామధేనువు అని అందురు. యోగి సంకల్పించిన సత్కార్యములు సునాయాసముగా పూర్తియగును. ఇదియే కామధేనువు యొక్క ఆవిర్భావము. మనస్సు అతి వేగవంతమైనది అగుట వలన దీనిని గుఱ్ఱముగా చెప్పుదురు. మంచి మనస్సునే ఉచ్ఛైశ్రవము యొక్క ఆవిర్భావముగా చెప్పుదురు. అహం ప్రవృత్తిని ఏనుగు అని అందురు. శుద్ధాహం ప్రవృత్తిని తెల్ల ఏనుగుగా చెప్పుదురు. ఇదే ఐరావతముగా వర్ణింపబడినది. ఈశ్వరుడు సంతోషించుట వలన ఇహలోకమునందలి కోరికలు, పుణ్యలోక ప్రాప్తి కోరకనే లభ్యమగును. ఇదే కల్పవృక్షము. సూక్ష్మ శరీరమందలి నాడీమండలము అప్సరసలు. వైద్య శాస్త్రములోని నాడీమండలమునకు ఈ నాడీమండలమునకు సంబంధము లేదు. ఈనాడీ మండలము యోగపరిభాష. ఈ నాడీ మండలములో ఆత్మ శక్తి ప్రవహించినపుడు మెఱుపు వలె ప్రకాశించుచుండును. ఈ స్థితిలో నిశ్చల సమాధి భంగము కలిగి ఎఱుక కలిగి యోగి తిరిగి జాగ్రతావస్థకు వచ్చును. అప్సరసలు యోగ భ్రష్టతకు కారకులు. కావున ఆత్మ స్థానమునకు చేరదలచిన యోగి ఈ అప్సరసలతో సంయోగమును కోరుకొనడు. మనస్సు సత్త్వగుణమును వీడి ద్వందాతీత స్థితికి చేరి త్రిగుణ రహితమగును. ఇదే ధ్రువస్థానము. దీనిని చంద్రునిగా చెప్పుదురు. చది



ఆహ్లాదనే(సంతోషింప చేయువాడు) అనగా యోగి బ్రహ్మానందమును అనుభవించును. ఇట్టి బ్రహ్మానంద స్థితికి గుర్తుగా శివుని జటాజూటముపై చంద్రవంకను సాకార వర్ణనలో చిత్రించెదరు. ఈ స్థానమునే లక్ష్మిగా, వారుణిగా, కౌస్తుభమణిగా చెప్పుదురు. తాంత్రికులు దీనిని మణిమండపము అని అందురు. ఇది బిందు స్థానము. ఇక్కడకు చేరిన యోగి బ్రహ్మానందమును అనుభవించును. చివరగా సాధకునకు ఈశ్వరత్వము సిద్ధించును. దీనినే అమృతకలశ హస్తుడై ధన్వంతరి ఆవిర్భవించినట్లు కథగా చెప్పుదురు. నశించిపోయే దేహము రాక్షసులు. కావున వీరికి అమృతము దొరకలేదు. నశించిపోని లింగ శరీరము దేవతలు. వీరికి అమృతత్త్వము కలిగినది. జీవుడు ఈశ్వరుడైనాడు. యోగసాధననే క్షీరసాగరమథనము పూర్తిఅయినది. గుణములను, మోహినిగా చెప్పుదురు. గుణయుతులయినచో అమృతత్త్వము లభింపదు. గుణరహిత స్థితిలో అమృతత్త్వము కలుగును. దీనినే కథగా మోహిని రాక్షసులకు కాక దేవతలకు అమృతమును పంచినట్లుగా చెప్పబడినది.

*****

## యోగసాధకులు

### బ్రహ్మ

ప్రదేశము: నిజనివాసంబగు పద్మము.
కర్మ ఫలితమును భగవంతునికి అర్పించినాడు.
అష్టాంగ యోగ విధివిధానముగా యోగమును చేసినాడు.
ప్రాణాయామము: పవనున్ బంధించి

ధారణ : భగవంతుని రూపమును గట్టిగా బుద్ధిలో నిలిపి మానస యజ్ఞము చేసినాడు.

సమాధి : తపస్సమాధిలో నూఱు సంవత్సరములు ఉండి పరమాత్మ దర్శనము చేసినాడు. బ్రహ్మత్వమును పొందినాడు. బ్రహ్మత్వము పొంది సృష్టిచేయ సంకల్పించి తత్కాలవాయువుచే కంపితంబగు నిజనివాసంబైన పద్మమును వాయువును జలములను కనుగొని ఆత్మీయ తపశ్శక్తిచేత అభివృద్ధి పొందిన విద్యాబలంబున వాయువుని బంధించి తోయంబులతోడ నొక్కతోయంబు సమస్తంబును గ్రోలి గగనవ్యాపియగు జలములను కనుగొని అందు పద్మమును గగనతలంబున చూచి ఆ పద్మములో లీనమైయున్న లోకములను చూచి వాటిని పధ్నాలుగు లోకములుగా సర్వ స్థావర జంగములుగా సృజియించెను.

### ప్రజాపతులు

ప్రజాపతులు బ్రహ్మను అనుసరించి మానసిక యజ్ఞమును చేసి యజ్ఞఫలమును పరమేశ్వరునికి సమర్పించిరి.

### దేవతలు

దేవతలు చేసిన యోగసాధన గుఱించి పురుష సూక్తములో వర్ణింప బడినది. వీరి యజ్ఞమునకు ఆవరణలు ఏడు. అనగా భూమి, జలము, అగ్ని, వాయువు, ఆకాశము, అహంకారము, మహత్తు - ఇవే ఆ ఏడు ఆవరణలు. ఆ యజ్ఞములో ఇరువది ఒక్క సమిధలను ఆహుతి చేసిరి. అనగా కర్మేంద్రియములు ఐదు, జ్ఞానేంద్రియములు ఐదు, రసనేంద్రియములు అనే శబ్ద, స్పర్శ, రూప, రస, గంధాదులు ఐదు, ప్రాణము,



అపానము, వ్యానము, ఉదానము, సమానము అనేవి ఐదు, అంతఃకరణ చతుష్టయము సమిష్టిగా ఒకటి మొత్తము ఇరువది ఒకటి. వీటిని యోగములో కర్మేంద్రియములను నియమించుటను ఆసనముగా చెప్పుదురు. ప్రాణమును నియమించుట ప్రాణాయామము. జ్ఞానేంద్రియములను నియమించుట ప్రత్యాహారము. అంతఃకరణమును నియమించుటను ధ్యానము, ధారణగా చెప్పుదురు. ఈ దేవతలు **అబధ్న న్పురుషం పశుమ్** అనగా జీవపురుషుని ఈశ్వరునితో కలపి కట్టిరి. అనగా నిశ్చల సమాధికి చేరినారు. ఆ విధముగా మానసిక యజ్ఞము చేయుట వలన దేవతలు ఆత్మను దర్శించిరి. దీనినే **పురుషం జాతమగ్రతః** అని వేదము చెప్పినది.

### హిరణ్యకశిపుడు

బ్రహ్మ ఏవిధముగా తపస్సుచేసి సృష్టిచేసెనో ఆవిధముగా బ్రహ్మత్వము పొంది సృష్టి చేయవలయునని సంకల్పముతో తపస్సు ప్రారంభించెను.

ప్రదేశము : మందరాచలము(బ్రహ్మ రంధ్రము)
ఆహారము : జలాన్నములు స్వీకరింపక వాయుభక్షకుడై
ఆసనము : ఊర్ధ్వ బాహుడై
ప్రాణాయామము : ప్రాణవాయువులను శరీరమున నిల్పి
ప్రత్యాహారము : ఇంద్రియ భ్రంశము కొంచెము కూడా లేకుండా

ధ్యానధారణసమాధులు : నూఱు సంవత్సరములు ఉగ్ర తపస్సు చేసెను. సృష్ట్యాదియందుగల బ్రహ్మను దర్శించి బ్రహ్మత్వమును పొందెను. బ్రహ్మానందమున ఉండెను. దీనినే ప్రహ్లాదునిగా వ్యక్తి వాచకముగా చెప్పిరి.

దోషము : తపస్సులోని తమోగుణ సంబంధము అయిన దోషమును చెప్పుటకు హిరణ్యకశిపుని ఉదాహరణగా తీసుకొని ఈవిధముగా వర్ణించినాడు. "దేహము అశాశ్వతము. దేహమునకు జరామరణములు సహజ స్వభావములు. అట్టిదేహమునకు నిత్యత్వము సంపాదింతునని బ్రహ్మ గుఱించి తపస్సు చేసి భూమి, జలము, అగ్ని, వాయువు ఆకాశము అనే పంచభూతముల వలన కానీ, దిశలలోగానీ, పగలు రాత్రి అనే కాలములో కానీ, జంతువులు, మృగములు, సర్పములు మొదలయిన ప్రాణమున్నవాటిచే గానీ ప్రాణములేనివైన సమస్త శస్త్రములచే గానీ దేహము

నశింపకుండా ఉండే వరము కోరెను. దేహము అశాశ్వతము. ఆత్మ శాశ్వతము. ఈ విషయము గ్రహించవలయునని బుద్ధి సంపన్నత్వమున ఉండమని బ్రహ్మ హితవు చెప్పెను. ఇహలోక పరలోక సుఖములు మోక్షార్థికి హేయములు అని చెప్పుటకు అజరామరభావము, త్రిజగద్రాజ్యము, అఖిల శత్రుజయము, అప్రతి ద్వంద్వము కావలయునని కోరికతో తపస్సు చేసి బ్రహ్మను దర్శించెను. ఈవిధముగా తమోగుణ, రజోగుణ తపస్సుగుఱించి వర్ణింపబడినది.

## వృత్రాసురుడు

గతజన్మలో చిత్రకేతువు అనే విద్యాధరుడు. అష్టమదములలో ఒకటైన తపోమదము వలన బ్రహ్మత్వమును పొందలేక జన్మ పరంపరలలో చిత్రకేతువు చిక్కుకొనినాడు.

చిత్రకేతువు సాధన :
ప్రదేశము - స్నానము : కాళిందీ నది
ఆహారము : నిరాహారుడై(నిశ్చల సమాధి)
కర్మేంద్రియములు : వాక్కు - మౌనము.

ధ్యానము, ధారణ : నారదునిచే మంత్రమును బడసి ఆ మంత్ర జపము చేయుచు

సమాధి : సమాధి స్థితిలో సంకర్షణుని చూచినాడు. అతని అనుగ్రహమున ఒక దివ్య విమానమును పొందినాడు.

దోషము : సంకర్షణుని దర్శించెను అనగా అహంకారావరణకు చేరినాడని అర్థము. రామాయణ పరముగా అహంకారావరణమున ఉండువాడు రావణుడు. చిత్రకేతువు ఇంద్రియ జయుండనని పుట్టిన అహంకారమున అనగా తపో మదమున శివపార్వతులను అపహాస్యము చేసినాడు. ఈ తపోమదమును గుర్తించిన పార్వతి ఇతనిని రాక్షసునిగా పుట్టమని శపించినది. చిత్రకేతువు మఱు జన్మలో త్వష్ట చేసిన దక్షిణాగ్నిలో వృత్రాసురునిగా పుట్టినాడు.

వృత్రాసురుని సాధన : ఇతడు సాంఖ్యయోగమును అవలంబించి, ఇంద్రునిచే వధింప బడినాడు. వృత్రాసురుని తేజస్సు విష్ణువులో కలసి పోయినది. అనగా ఆత్మ ఆత్మతో ఏకీభూతమయినది.



## అజామీళుడు

జాతి : బ్రాహ్మణుడు
ఆశ్రమము : గృహస్తుడు

కర్మానుష్ఠానములో కలుగు పాపమును నామస్మరణ అనే అగ్ని దహించును. దీనికి ఉదాహరణగా అజామీళోపాఖ్యానము చెప్పబడినది.

అజామీళుడు సకల వేదమును చదివినవాడు. గురువులను, అతిథులను, పెద్దలను, సేవించినాడు. నిత్యనైమిత్తికాదులను నెఱపినాడు. బహుమంత్ర సిద్ధులు బడసినాడు. సత్యము పలికినవాడు. ధర్మ సంశీలుడు. లోభాది గుణములు లేనివాడు. శాంతుడు. దాంతుడు. సర్వ భూతములయందు సమబుద్ధి కలవాడు. బ్రాహ్మణ స్త్రీని వివాహమాడి ధర్మ పద్ధతిని సంసార జీవితమును గడుపుచుండెడి వాడు.

దోషము : ఒకరోజు తండ్రి ఆనతిని కుశలు, సమిధలు, పూలు, పండ్లు తెచ్చుటకు అరణ్యమునకు వెళ్ళి తిరిగివచ్చు సమయములో ఒక లతా గృహమున ఒక శూద్ర స్త్రీ ఆమె విటుడు సంభోగము చేయుచుండగా చూచినాడు. అనగా కన్ను దారి తప్పినది. దానితో అంతఃకరణము పాడయినది. ఇన్ని మంచి గుణములను ఆ ఒక్క దృష్టి నాశనము చేసినది. జ్ఞానేంద్రియములలో ఏ ఒక్కటి దారి తప్పినను అంతఃకరణము పాడయి సర్వనాశనమునకు హేతువు అగును అని దీని సారాంశము. అజామీళుడు ఆ శూద్ర స్త్రీతో కాపురము చేసి కొడుకులను కనెను. ఈ విధముగా అతడు దురాచారి అయినాడు. స్త్రీలోలుడు అయినాడు. ఒక్కొక్క మెట్టు దిగజారుతూ జూదరిగా దొంగగా మారి క్రూరుడై, ధూర్తుడై, కుటిలుడు అయినాడు. పుత్రులయందు భార్య యందు చాలా వ్యామోహము కలిగి మత్సరుడై సుజనులను బాధించి పాతకుడయ్యెను. మరణ సమయమున యమ భటులను చూచి తన కొడుకులలో ఒకడైన నారాయణుని నారాయణా అని పిలిచినాడు. నారాయణ శబ్దమును ఉచ్చరించినంతనే వైష్ణవ భటులు వచ్చి ఇతనిని యమభటులనుంచి విడిపించినారు. అలా యమపాశమునుంచి విడివడిన తరువాత యోగమునాశ్రయించినాడు. వైష్ణవ జ్ఞాన దీపంబున బంధు మిత్ర సుత పత్నీ మోహ విభ్రాంతుడై అనగా విరక్తి వైరాగ్యములు పొందెను.

ప్రదేశము : గంగా ద్వారము

ప్రాణాయామము : ప్రాణాయామము చేసి వాయువును బంధించి

ప్రత్యాహారము : ఇంద్రియములను జయించి

ధ్యానము : చిత్తమును పరతత్త్వముతో కలపి

ధారణ : అరిషడ్వర్గములను జయించి మాయను వీడి జ్ఞానవంతుడై అనగా గుణ రహితుడై

సమాధి : నిశ్చల సమాధిలో

దేహత్యాగకాలము : దేహమును వీడి బ్రహ్మ పదమునకు చనియెను. అనగా ఆత్మయై విరాజిల్లెను.

**స్వాయంభువుడు**

జాతి : క్షత్రియుడు

ఆశ్రమము : వానప్రస్థాశ్రమము అనగా స్వాయంభువుడు అతని భార్య అయిన శతరూపతో కలసి

ప్రదేశము : సునందా నది వద్ద.

పుణ్యకర్మానుష్ఠానము : వ్రతములు ఆచరించుచూ యమనియమములను పాటించెను.

వాక్కు : వాక్కును నియమించెను.

ఆసనము : ఏక పదస్థుడై ఉండెను.

ప్రాణాయామమునుండి ధారణ వరకు యోగమును అవలంబించి, నిశ్చల సమాధికి చేరి తపస్సు చేసి దేహమును పరిత్యజించెను.

**ధ్రువుడు**

జాతి : క్షత్రియుడు

ఆశ్రమము : బ్రహ్మచారి

ప్రదేశము : యమునా నది ఒడ్డునగల మధువనము



పుణ్యకర్మానుష్ఠానము: యమునా నదిలో స్నానము చేసెను. యమనియమములు ఆచరించెను.

ఆహారము : ఆహారమును సాధారణముగా తీసికొను స్థాయి నుంచి తక్కువగా తీసికొనవలయును. అనగా మితాహారము స్వీకరించవలయును. ఆవిధముగా ధ్రువుడు మితాహారము స్వీకరించుచూ ఆహారపరిమాణమును తగ్గించి మూడు దినములకొకసారి ఆఱుదినములకొకసారి, తొమ్మిది దినములకొకసారి, పన్నెండు దినములకొకసారి ఆహారమును వెలగ పండు అంత రేగి పండు అంత ప్రమాణముగా స్వీకరించుచు సాధన చేసి ఆతరువాత సవికల్ప స్థితిలో జల భక్షణ చేయుచు నిశ్చల సమాధిలో వాయుభక్షకుడై ఉండెను.

వాక్కు : మిత భాషణ

ఆసనము : దర్భలు పఱచి ఆపై జింకచర్మమును వేసి ఆపై వస్త్రమును వేసి ఆసనమును తయారుచేసి స్వస్తి ప్రముఖ ఆసనముపై కూర్చుండెను. ఆతరువాత కొంతకాలమునకు ఏక పాదమున నిలచి ఉండెను.

ప్రాణాయామము : తీవ్రప్రాణాయామము చేసెను. ప్రాణమును నిరోధించి నిరుచ్ఛ్వాసుండై అనగా పూర్ణ కుంభకమున ఉండెను.

ప్రత్యాహారము : దృష్టిని ఏకాగ్రత చేసెను. మనసును నిగ్రహించి స్థిరమైన చిత్తంబున చాంచల్యదోషమును హరించి అనన్య దృష్టిని చిత్తమందు పరమేశ్వరుని అనుసంధానంబు గావించి విషయంబుల చెందనీక వివేకశాలియై ఉండెను.

ధ్యానము : బ్రహ్మమును హృదయపద్మమునందు నిలిపి హరి రూపము కంటె అన్యము ఎఱుగక ఉండెను.

ధారణ : సత్త్వగుణమునకు వచ్చి శాంతతత్త్వము కలిగి మనస్సులోని మాలిన్యమును పోగొట్టుకొని ఉండెను.

సమాధి : అవిద్యాగ్రంథిని త్రెంచి స్థాణువునుబోలె ఉండి విష్ణువును దర్శించెను.

దేహత్యాగ కాలము : విరక్తి చెంది పురంబు వెడలి బదరికావనంబు చేరి విశాలానదిలో స్నానము చేసి పద్మాసనస్థుడై, ముకుళిత నేత్రుడై, పవనుని బంధించి, పరిశుద్ధ అంతః

కరణుడై హరిరూపంబు ధ్యానంబు చేయుచు నిశ్చల భక్తి కలిగి తన్ను తాను మఱచి విగత క్లేశుడై, ముక్తలింగుండునై, హిరణ్మయరూపంబు ధరియించి విష్ణుపార్శ్వచరులగు సునంద నందులతో తల్లి గుఱించి ఆలోచించి ఆమెకూడా విమానములో వెళ్ళడంచూచి ఆనందించి ధ్రువపదము చేరినాడు.

**ఉత్కలుడు (ధ్రువుని కుమారుడు)**

జాతి : క్షత్రియుడు - రాజ్యము స్వీకరించ లేదు.
లక్షణములు : శాంతమూర్తి. (సత్త్వగుణ ప్రధానుడు)
నిస్సంగుడు, (విరక్తి, వైరాగ్యములు కలవాడు)
సమదర్శనుడు(బ్రహ్మ స్వరూపమును మనస్సులో భావించుచు ఇతర పదార్థమును మనస్సులో ఎఱుగడు)
యోగి. యోగాగ్నిలో కర్మవాసనలు దహింపచేసెను. (బంధ ముక్తుడు)
సర్వజ్ఞుడు అయినా మంద బుద్ధివలె, వెఱ్ఱివానివలె, గ్రుడ్డివానివలె, మూగవానివలె, చెవిటి వానివలె ప్రవర్తించినాడు. చివరకు బ్రహ్మత్వమును పొందినాడు.

**పృథుచక్రవర్తి**

జననము : వేనుని కుడి బాహువు నుండి పృథుచక్రవర్తి, ఎడమ బాహువునుండి అర్చి జన్మించి దంపతులయినారు.

కుల ధర్మము :రాజధర్మమును పాటించి ప్రజలను పాలించినాడు. గంగా యమునల మధ్యమందుండి సప్త ద్వీపములను పాలించినాడు. అహంకార రహితుడు. ఇంద్రియార్థములలో చిక్కుకొనలేదు.

పుణ్యకర్మానుష్ఠానము : అశ్వమేథ యాగము చేసెను. దీర్ఘ సత్రయాగము చేసెను.
అధిభౌతికముగా : భూమిని మిట్ట పల్లములు లేక సమంగా చేసెను.
అధిదైవికముగా : భూమిని ధేనువుగా చేసి పాలు పితికెను.
కర్మసాక్షిగా భావించి కర్మలు చేసెను. కర్మఫలమును బ్రహ్మార్పణము చేసి, సనత్కుమారుని వలన తత్త్వోపదేశము పొందెను.



వానప్రస్థాశ్రమము :

వార్ధక్యములో :భార్యాసమేతుడై, మందరగిరి ప్రాంతమునకు తపోవనమునకు వెళ్ళెను.

ఆహారము : కందమూలములు, తృణపర్ణములు, వాయు భక్షణ.

కర్మేంద్రియములు :

వాక్కు : నియత పరిభాషణుడు.

గుహ్యము : బ్రహ్మచర్యమును పాటించెను. ఊర్ధ్వరేతస్కుడయ్యెను.

జ్ఞానేంద్రియములకు శిక్షణ :

చర్మము : మండు వేసవిలో పంచాగ్నుల మధ్యమమున, శీతాకాలములో నీటిలో ఉండి వానాకాలములో వానలో తడుస్తూ తపస్సుచేసెను.

శయనము : శీతాకాలములో భూశయనము చేసెను.

తితీక్షా సమన్వితుడు : ఈశ్వరార్పిత బుద్ధికలిగి యోగము అవలంభించెను.

ధారణ :

కర్మ మలమును పోగొట్టుకొనెను.

**దేహత్యాగకాలము :** ప్రాణాయామముచే ప్రాణములను జయించి మూలాధారము నుండి నాభికి, అక్కడనుండి హృదయమునకు, అక్కడనుండి కంఠమునకు ఆపై భ్రూమధ్యమునకు, భ్రూమధ్యమునుండి శిరస్సునగల బ్రహ్మరంధ్రమునకు ప్రాణములను చేర్చెను.

అరిషడ్వర్గములు: అరిషడ్వర్గములను జయించెను.

భూమిని జలములలో, జలమును తేజంబులో, తేజమును వాయువులో, వాయువును ఆకాశములో, ఆకాశమును మనంబులో, మనంబును ఇంద్రియంబులలో, ఇంద్రియములను తన్మాత్రలలో, తన్మాత్రలను అహంకారమున, అహంకారమును మహత్తులో, మహత్తును ప్రకృతిలో కలిపి, ఆకాశమును ఆకాశములో, వాయువును వాయువులో, తేజమును తేజములో, జలమును జలములో, భూమిని భూమిలో కలిపి

ఉపాధింబాసి ముక్తుండయ్యె.

### ప్రచేతసులు

తండ్రిమాటపై తపస్సు చేయుటకు బయలు దేరినారు. ఒక పెద్ద సరస్సును చూచినారు. ఆ సరస్సులో ఒక దివ్య పురుషునిని(శివుని) చూచినారు. ఆ దివ్య పురుషుడు ప్రచేతసులకు విష్ణు స్తోత్రమును వినిపించెను. ప్రచేతసులు ఆదివ్య పురుషుని తమకు భాగవతుల తోడి సంగమము కలుగచేయుమని ప్రార్థించిరి. ప్రచేతసులు సముద్ర జలములలో పదివేల సంవత్సరములు విష్ణువు గుఱించి తపస్సు చేసిరి. విష్ణువు ప్రత్యక్షమయ్యెను. అనగా ఆత్మ దర్శనమయినది. విష్ణువు ప్రచేతసుల పదిమందిని కండుమహామునికి ప్రమ్లోచని అనే అప్సరసకు జనియించిన మారిషను పెండ్లాడమని చెప్పెను. ప్రచేతసులు తపస్సు అనంతరము సముద్రజలముల నుండి వెలుపలకు వచ్చి చెట్లను దహింప సాగిరి. అంత ఆ వృక్షములు వారి వద్దగల మారిషను ఇచ్చి వివాహము చేసిరి. ప్రచేతసులకు మారిషకు దక్షుడు మరల జన్మించెను.

### దక్షుడు

**మొదటి జన్మ :** బ్రహ్మ యొక్క అంగుష్ఠము నుంచి దక్షుడు జన్మించెను. ఇతడు స్వాయంభువుని కుమార్తెయగు ప్రసూతిని వివాహము చేసికొనెను. వీరికి పదహారు మంది కుమార్తెలు. అందులో సతీ దేవి ఒకరు. ఇతడు శివునిపై ద్వేషంతో శివునిని ఆహ్వానింపకుండా శివరహితముగా యాగము చేసి చనిపోయెను. ఆ తరువాత బ్రతికి మేష శిరస్సు కలవాడయ్యెను.

**రెండవ జన్మ :** ప్రచేతసులకు మారిషకు జన్మించెను. ఇతడు వింధ్య పర్వత పాదంబున అఘమర్షణంబను తీర్థంబున అతి ఘోరంబైన తపస్సు చేసి హరిని ప్రసన్నుని చేసికొనెను.

### హర్యశ్యులు శబలాశ్యులు వీరు దక్షుని కుమారులు.

1. హర్యశ్యులు : వీరు సింధు సముద్ర సంగమమున, నారాయణ సరస్సు వద్ద ప్రజాసర్గంబునకై తపస్సు చేయుచుండగా నారద మహర్షి వచ్చి ఉపదేశింపగా వారు



తపస్సు చేసి మోక్షము పొందిరి.

2. శబలాశ్యులు :
ప్రదేశము : వీరు నారాయణ సరస్సు వద్ద
ఆహారము : వాయు భక్షణ చేసి అనగా నిరాహారులై ఉండిరి.
ఆసనము : పాదాంగుష్ఠము మీద నిలచిరి.
ప్రత్యాహారము : చూపు: పెను బయలు గుట్టు పట్టి చూచు చుండిరి
సమాధి : ఘోర తపస్సు చేసిరి. మోక్షము పొందిరి.

### ప్రియవ్రతుడు

ఇతడు స్వాయంభువుని కుమారుడు. ఇతడు సూర్య రథముతో సమానముగా వ్యతిరేక దిశలో రథము నడపి భూమిని సప్త ద్వీపములుగా సప్త సముద్రములుగా విభజన చేసి పాలించెను. ఇతడు ఆత్మ విద్యని కలిగి భార్యలను వదలి ధనమును విడచి పాతాళభూస్వర్గాది సుఖంబులు నరక సమానముగా తలచి విరక్తి పొంది, అన్నింటిని రోసి చిత్తము హరియందు నిలిపి, దేహ త్యాగానంతరము కైవల్య పదము పొందెను.

### నాభి

ప్రియవ్రతుని కుమారుడు ఆగ్నీధ్రుడు. ఆగ్నీధ్రుని కుమారుడు నాభి. ఇతడు నారాయణస్థానంబైన బదరికాశ్రమంబునకు చని వాసుదేవుని ఆరాధించి, మహాయోగ సమాధిచే క్షీణ దేహుండై లయ యోగమున హరిని చెందెను.

### ఋషభుడు

ఇతడు నాభి యొక్క కుమారుడు. యోగమున అష్ట సిద్ధులు వచ్చిన వాటిని స్వీకరించలేదు. మనంబున దేహాభిమానంబులు వర్జించి బాల్య స్థితిలోవలె మూత్రపురీషములు తన శరీరమున నంట పొరలుచు మహానందంబు అనుభవించుచు తనయందు సర్వ భూతములయందు అంతర్యామియగు వాసుదేవుని ప్రత్యక్షంబుగా కనుగొనుచు కార్చిచ్చు వనంబు దహింప నందు దగ్ధుండయ్యె.

### భరతుడు

ఇతడు ఋషభుని కుమారుడు.

**మొదటి జన్మ :**

ప్రదేశము : ఆలు బిడ్డలను, రాజ్యమును వదలి, వైరాగ్యము కలిగి, పులస్త్యాశ్రమమునకు వెళ్ళి, తపస్సు చేసెను.

దేహత్యాగ సమయము : లేడి పిల్ల వలన మోహములో చిక్కుకొని మరణ సమయములో ఆ లేడి పిల్లను తలచుచు మరణించెను.

రెండవ జన్మ : మరణ సమయమున లేడిపిల్లను తలచుచు చనిపోయినందున అ లేడి కడుపున పుట్టెను. కొంతకాలమునకు ఆ లేడి శరీరమున మరణించెను.

మూడవ జన్మ : బ్రాహ్మణ వంశమున జన్మించినాడు.

వాక్కు : మౌన వ్రతము.

నాలుక: రుచులను జయించినాడు.

చర్మము : శీతోష్ణములకు దుప్పటి కప్పుకొనక ఓర్చుకొని నేలపై పరుండినాడు.

దేహ ధ్యాస : దేహంబునందు అహంకార మమకారములు లేక అనగా దేహాభిమానము లేక ఉండెను. ఈ స్థితినే బాలుడు అని అందురు. అట్టి బాలుడుగా ఉన్నాడు.

ద్వందాతీత స్థితి : మానావమానములను జయించినాడు.

జీవన్ముక్తుడు : గృహకృత్యములందు ప్రీతి లేక మిధ్యాజ్ఞాన రహితుడై అన్యజన సంగమంబు జన్మ పరంపరలకు కారణంబని తలంచి, ఉన్మత్త, జడ, అంధ, బధిర రూపంబుల చరించి నిత్యానంద సుఖలాభంబులు కలిగి సర్వము పరమాత్మగా దర్శించినాడు. దీనికి ఉదాహరణగా ఇతనిని చంపుటకు కాళికాలయమునకు దొంగలు తీసికొని వెళ్ళగా ఇతడు కాళియందు, కరవాలమునందు అచ్యుత భావమును ఉంచినట్లు వర్ణింపబడినది. సర్వత్రా ఆత్మను దర్శించి బ్రహ్మీభూతుడై ఉన్నాడు.

## పృషద్ధ్రాఖ్యుడు

ఇతడు వైవస్వత మనువు కుమారుడు. ఇతడు విమల ధర్మమును పాటించినాడు. వసిష్ఠుని ఆజ్ఞపై పశువుల మంద కాచుచు ఒకనాటి నడిరాత్రి జోరున వానకురియుచుండగా మందచుట్టూ కాపలా ఉండెను. ఆ దినము చీకటి బాగా ముదిరినది. ఆ చీకటిలో ఒక పెద్దపులి ఆవును పట్టుకొనినది. అంత పులిదాడికి ఆవుల మంద లేచి చెల్లా చెదరైనది. ఇతడు పులి అనుకొని కపిలగోవు శిరమును



ఖండించినాడు. వెనువెంటనే పులినికూడా చంపినాడు. అంత వసిష్ఠుడు ఇతనిని శూద్రుడవు కమ్మని శపించినాడు. అంత వసిష్ఠులవారి పాదములపై పడి ప్రార్థించి సాధన చేసి బ్రహ్మీభూతుడైనాడు.

ఈ కథ కొన్ని సాంకేతిక పదములతో చెప్పినదిగా గుర్తించవలయును. ఆవులనగా ఇంద్రియములు. పులి అనగా ఇంద్రియార్థములు. చీకటి అనగా అజ్ఞానము. సారాంశమేమనగా జీవుని యొక్క ఇంద్రియములు ఇంద్రియార్థములపై ప్రసరించి జీవుని అధోగతిపాలు చేయుచున్నవి. జీవుడు అజ్ఞానములో ఉండి నశించిపోవుచున్నాడు. ఇట్టివానికి ప్రతినిధిగా పృషద్ధ్రాఖ్యుని గుఱించి చెప్పి తరుణోపాయమును సూచించినాడు.

**పృషద్ధ్రాఖ్యుని సాధన:** ఇతడు వసిష్ఠుని (గురువును) ఆశ్రయించినాడు.

ప్రదేశము : అడవి

స్నేహము : సంగ రహితుడై

కర్మేంద్రియములు :

చేతులు : అపరిగ్రహమును పాటించుచు

గుహ్యము : ఊర్ధ్వరేతస్కుడై

సర్వ కర్మేంద్రియములను, సర్వజ్ఞానేంద్రియములను గెలిచినాడు. తనకు లభించినదానితో జీవనముగావించుచు కోరికలు లేక ప్రాణులకెల్ల ఆప్తుడై జడుని తెఱంగున, అంధుని చందంబున, చెవిటి భంగి భూమిని చరించుచు హరిభక్తి కలిగి శాంతుడై అనగా గుణరహితుడై ఉండెను.

దేహత్యాగ సమయము : కార్చిచ్చులో దేహమును వదలి బ్రహ్మమును చేరెను.

## కవి

ఇతడు వైవస్వత మనువు కుమారుడు. ఇతడు రాజ్యమును విడచి వనంబునకుం జని పరమాత్మను తలచి పరమపదము చేరెను.

## దధీచి

నిశ్చితాత్ముడై తత్త్వావలోకంబున బుద్ధిఇంద్రియమానసంబులతో కూడిన క్షేత్రజ్ఞుని పరబ్రహ్మ స్వరూపుండైన పరమాత్మయందు ఏకీభూతము చేసి యోగజ్ఞానంబున శరీరము విడచి బ్రహ్మయై విరాజిల్లెను.

## ఖట్వాంగుడు

ఇతడు ఏడు దీవులను ఏలుచుండి స్వర్గలోకమునకు వెళ్ళి దేవతలు తోడుగా ఉండి రాక్షస సంహారము చేసినాడు. దేవతలను తన ఆయుఃప్రమాణము చెప్పమని అడిగి తెలుసుకొని భూమిపైకి వచ్చినాడు. ఏడు దీవులను ఏలుట అనగా శరీరముపై ఆధిపత్యమును సంపాదించెనని అర్థము. రాక్షస సంహారమనగా అసుర సంపదను జయించి దైవీ సంపద కలిగిఉన్నాడని అర్థము. మరణ సమయమున స్వర్గలోకమును వీడి భూలోకమునకు వచ్చెననగా దైవీ సంపదనుకూడా వీడి గుణరహితుడై జీవన్ముక్తుడై ఉన్నాడని అర్థము. ఇట్టి జీవన్ముక్తుడు

దేహత్యాగ కాలమున: భార్యాపుత్రబంధుమిత్ర పరివారమును వర్జించి గాఢవైరాగ్యమును పొంది తను దేహముకాదని ఆత్మయని గ్రహించి మృత్యుభయములేక గోవిందనామ కీర్తనగావించుచు, రెండు ఘడియలలో దేహమును పరిత్యజించి కైవల్యమును పొందెను.

## ద్వాపరయుగము

## మైత్రేయుడు

స్వభావము : దయాపారగుడు. బుధజన విధేయుడు. సుజన హితుడు. వ్యాసుని సఖుడు. మునిజన సత్తముడు. వృద్ధజన సేవ్యుడు. వృద్ధశ్రవుడు. అఖిల జనమాన్యుడు. మహితగుణ సంగుడు. విమలాంతరంగుడు. హరిపాద కమల భృంగుడు. భాగవతోత్తముడు. మహాయోగి. తాపసుడు. అఘశూన్యుడు. పాప తమఃపతంగుడు.

ప్రదేశము : గంగానదీ ప్రాంతము.

పుణ్యకర్మానుష్ఠానము : గంగా నదిలో స్నానము చేసి అనేక పుణ్య వ్రతములు చేసినాడు.

ఆహారము : సముచిత ఆహారమును స్వీకరించి ఉపవాసములు చేసినాడు.



ఆసనము : పద్మాసనాసీనుడై ఇసుక తిన్నెమీద కూర్చొనెను. యోగారూఢునకు ఆసనము అంత ప్రాముఖ్యము కాదు అని దీని అర్థము.

ప్రాణాయామము : -

ప్రత్యాహారము : బాహ్యేంద్రియ వ్యాప్తి పాఱద్రోలినాడు.

ధ్యానము : హరిపాదములయందు చిత్తము చేర్చినాడు.

ధారణ, సమాధి స్థితి చేరి నిశ్చల సమాధిలో ఆత్మను దర్శించినాడు.

## ఉద్ధవుడు

పూర్వ జన్మలో వసుబ్రహ్మలు చేయు సత్రయాగమున వసువై కోరికలు లేక పరమాత్మనే కోరెను. ఈ జన్మలో ఉద్ధవునిగా పుట్టి ఐదేండ్ల బాలకునిగా ఉన్నప్పుడు ఆటలాడుచు ఒకబాలుని శ్రీకృష్ణునిగా భావించి ఆ బాలునికి పూజచేసినాడు. అనగా వస్తు దృష్టి నశించి సర్వత్రా ఆత్మను దర్శించినాడని అర్థము. సద్గుణ విశారదుడు. శాంతుడు. మహిత ప్రబుద్ధుడు. భాసుర పుణ్యుడు. పరిశోషిత దోషుడు. శ్రీకృష్ణ పద సేవారక్తుడు. శ్రీకృష్ణుడు విష్ణువుగా పద్మకల్పములో బ్రహ్మకు చెప్పిన ఆత్మ తత్త్వమును ఉద్ధవునకు ఉపదేశించెను. ఈ ఆత్మతత్త్వమును సాధకులకు వివరించుటకు కల్పాంతము వఱకు ఉండమని శ్రీకృష్ణుడు ఆదేశించెను. ఆ ఆదేశానుసారము చిరంజీవియై బదరికావనమున ఉండి శిష్యులకు గురువుగా ఆత్మ తత్త్వమును ఉపదేశించుచున్నాడు.

## భీష్ముడు

అతి భక్తి - చిత్తముచేర్చి - ఎవ్వనినామము ఊహించి పొగడి - కామకర్మాది నిర్మూలనుండై కాయంబు విడుచు అట్టియోగి ముక్తినొందు. దీనికి ఉదాహరణగా భీష్ముని గుఱించి వివరించబడినది.

సాధన :- క్షత్రియుడు, బ్రహ్మచారి. క్షత్రియ జాతి ధర్మమైన యుద్ధము చేసెను. అనగా జాతి ధర్మములను పాటించినాడు.

కోరిక :- ప్రకృతి వలననైన సృష్టి పరంపరల పరిహరించు తలంపు. అనగా మోక్షము పొందుట.

ప్రదేశము :- కురుక్షేత్రము.

స్నానము - ఆహారము:- చెప్పబడలేదు.

కాలము :- స్వచ్ఛంద మరణులైన యోగీశ్వరులచేత వాంఛితంబగు ఉత్తరాయణము.

యమ, నియమములు :- ఆచరించెను. శ్రీకృష్ణునిని పూజించెను.

వాక్కు :- శ్రీకృష్ణుడు చేసిన ఘనకార్యములను వర్ణించినాడు. ఆలాపంబులు మానినాడు అనగా మౌనమును పాటించినాడు.

చేతులు :- అతిథి పూజచేయించినాడు.

పుణ్యకర్మానుష్ఠానము:- అనేక పుణ్య కర్మలు చేసినాడు. జాతి ధర్మములను, ఆశ్రమ ధర్మములను పాటించినాడు.

ఆసనము :- అంపశయ్య.

ప్రాణయామము :- నిశ్వాసంబులు మానినాడు. అనగా పూర్ణ కుంభకములో ఉండెను.

ప్రత్యాహారము :-

కన్ను :- దృక్‌జాలమున్ హరిమోముపై నిలిపినాడు. అనగా దృష్టిని నిశ్చలము చేసినాడు.

ధ్యానము :-

చిత్తము :- చిత్తము మనీషాయత్తముంజేసి హరిపాద భక్తి కలిగి అశ్రాంతమున్ చింతించినాడు. అనగా నిరంతరము హరినామ స్మరణ చేసినాడు.

హృదయము :- పరమాత్మను హృదయమునందు నిలుపుకొనినాడు.

ధారణ, సమాధి :- సమాధి స్థితికి చేరినాడు.

దేహత్యాగ కాలము :- దేహత్యాగ కాలమున ఒక సూర్యుడే అనగా ఆత్మ సమస్త జీవులలోనూ కలడని స్వానుభవంలో గ్రహించి నిరుపాధికంబైన బ్రహ్మమందు కలసెను.

### విదురుడు

యమునా నది వద్ద ఉద్ధవుని కలసి అతని మాటపై గంగానది వద్ద గల మైత్రేయుని చేరి అధ్యాత్మిక విషయములను గ్రహించినాడు.



జాతి :- శూద్రుడు. అవివాహితుడు.

స్థలము :- ప్రభాస తీర్థము.

శరీరము :- శరీరమునకు సంస్కారములు లేకుండా ఉన్నాడు.

ఆహారము :- కూరలు, కాయలు, నీళ్ళు ఆహారముగా తీసికొనెను.

పుణ్యకర్మానుష్ఠానము :- తీర్థయాత్రలు చేసెను. గురు సేవ (మైత్రేయుని) సేవించినాడు. నియమ వ్రతుడై ఉండెను.

యమనియమములు :-

వాక్కు :- దుర్యోధనుడు అవమానించినా తిరిగి పరుషవాక్కు పలుకలేదు.

ఆసనము :- కలిగి

ప్రాణాయామము :-

ప్రత్యాహారము :- క్రోధము లేకుండా ఉన్నాడు. అనగా జ్ఞానేంద్రియములను వాటి ఇంద్రియార్థములపై ప్రసరించకుండా నిగ్రహించి తమోగుణమును, రజోగుణమును జయించినాడు.

ధ్యానము :- చిత్తము హరియందు చేర్చినాడు.

ధారణ :- సత్త్వగుణము కలిగి పరమ శాంతుడై ఉన్నాడు.

సమాధి:-

దేహత్యాగము :- భగవంతునిని చింతించుచు శరీరమును విడచినాడు. స్వస్వరూపమును పొందినాడు. అనగా తిరిగి యముడైనాడు.

### ధృతరాష్ట్రుడు

దేహము నిత్యముకాదని - మోహము దెగగోసి - సిద్ధముని వర్తనుడై - గేహము వెలువడు నరుడు ఉత్సాహముతో చెందు ముక్తి సంపద. దీనికి ఉదాహరణగా ధృతరాష్ట్రుని సాధన చెప్పబడినది.

జాతి :- క్షత్రియుడు.

ఆశ్రమము :- వానప్రస్థ ఆశ్రమము.

విదురుడు విరక్తి మార్గము ఉపదేశింప భార్యతో కలసి దేహము నిత్యముకాదని గ్రహించి మోహమును వదలి ఇల్లువదలి వెడలినాడు.

స్థలము :- పూర్వము ఆకాశ గంగ సప్తర్షులకు సంతోషము చేయుటకు ఏడు ప్రవాహములుగా ప్రవహించిన హిమవత్పర్వత దక్షిణ భాగమున ఒక ముని వనము చేరినాడు. అందు పర్ణశాల నిర్మించుకొని ఉండెను.

స్నానము:- పుణ్య తీర్థమున, కృతస్నానుడైనాడు. అనగా గంగలో నిత్యము స్నానము చేయుచుండెను.

ఆహారము :- ఇది మూడు స్థాయిలలో చెప్పబడినది. జలభక్షణము కొంతకాలము చేసినాడు. ఆపై అఖిల ఆహారములు వర్జించి నిరాహారుడై కొఱడు చందంబున ఉండెను. అనగా యోగవిఘ్నములు లేక నిర్వికల్ప సమాధిలో ఉండెనని చెప్పుటకు ఆవిధముగా ఆహారమును చెప్పుదురు.

పుణ్యకర్మానుష్ఠానము :- కొంతకాలము యథావిధి హోమంబులు ఆచరించి ఆపై సకల కర్మంబులు విసర్జించి ఉండెను.

యమనియమములు :- పుణ్యకర్మానుష్ఠానము చేసెను.

ఆసనము :- విన్యస్త ఆసనుండై ఉండెను. అనగా ఆసన జయము కలిగి ఉన్నాడు.

ప్రాణాయామము :- ప్రాణములను నియమించినాడు.

ప్రత్యాహారము :- మనస్సహితంబులయిన చక్షురాది ఇంద్రియంబుల ఆఱింటిని విషయంబులందు ప్రవర్తింప నీక నివర్తించి అనగా వెలుపలి ఇంద్రియవిక్షేపము లేక ఉండెను. విశుద్ధంబులగు మనస్సు, చక్షురాది ఇంద్రియములు కలిగి ఉండెను.

ధ్యానము :- ప్రజ్ఞాచక్షుడై సంసారము దిగనాడి మోహము లేక విజ్ఞానమార్గమునకూడి ఉండెను.

అహంకారము :- ఈషణత్రయములగు దార, పుత్ర, అర్థములను వర్జించి ఉన్నాడు.

చిత్తము :- వెలుపలి ఇంద్రియ విక్షేపంబును, లోపలి గుణక్షోభంబును లేక ఉన్నాడు.

మనస్సు - బుద్ధి :- మనస్సును అహంకారాస్పదంబైన స్థూలదేహమువలన బాసి బుద్ధియందు ఏకీకరణము చేసినాడు.



ధారణ :- హరిభావనచే ధారణయోగము వహించి నిర్మలుడై తమో,రజో, సత్త్వ రూపంబులగు మూడింటిని హరించినాడు. అనగా గుణరహితుడై శాంతత్త్వమును కలిగి ఉండెను.

సమాధి :- హృదయములో ఈశ్వరుని దర్శించి క్షేత్రజ్ఞుని హృదయగత ఆత్మతో కలపి విజ్ఞానాత్మను దృశ్యాంశము వలన నియోగించి అనగా ద్రష్ట దృశ్యమును ఏకము చేసి నిర్మూలిత మాయాగుణ వాసనుండగుచు ఉండెను. అనగా జీవన్ముక్తుడైనాడు.

దేహత్యాగము :- మహాకాశంబుతోడ ఘటాకాశంబు కలుపు కైవడి యోగాగ్నిలో దేహమును దహింపచేసి ఆధారభూతమైన బ్రహ్మమందు కలసెను. అనగా ఆత్మ అయినాడు.

గమనిక :- సంజయుని వలన విన్న గీతాసారమును అనుభవములో సాధనచేసి బ్రహ్మఅయినాడు.

## ధర్మరాజు

జాతి :- క్షత్రియుడు

ఆశ్రమము:- వానప్రస్థాశ్రమము.

పరీక్షిత్తునకు రాజ్యభారమును అప్పచెప్పెను. అనగా వ్యక్తిగత బాధ్యతలను నిర్వర్తించెను. ఆ తరువాత బహిరంగ వ్యాపారములు విడచి నిరపేక్షకత్వమున విరక్తి కలిగి ఉండెను.

వేషము :- నారచీరలు ధరియించి ముక్తకేశుండై ఉండెను.

ప్రదేశము :- విజ్ఞానధనాయత్తులు ఉండెడి ఉత్తరదిశకు ప్రయాణమై వెడలెను.

పుణ్యకర్మానుష్ఠానము :- కొంతకాలము ప్రాజాపత్యంబనియెడి ఇష్టిగావించినాడు. ఆపై అగ్నులకు ఆత్మారోపణము చేసినాడు.

ఆహారము :- కొంతకాలము ఆహారనియమములను పాటించి నిశ్చల సమాధికి చేరి నిరాహారుడైనాడు.

యమనియమములు :-

వాక్కు :- మౌనియై ఉండెను.

చేతులు :- భగవత్సేవ కలిగి ఉండెను.

ఆసనము :-

ప్రాణాయామము :-

ప్రత్యాహారము :- సకల ఇంద్రియములను మానసంబున నడంచి అనగా జ్ఞానేంద్రియములను ఇంద్రియార్థములపై ప్రసరించకుండా నిగ్రహించినాడు.

ధ్యానము :-

అహంకారము :- నిరహంకారుడై

చిత్తము :- చిత్తమును బ్రహ్మమందు ఆవృత్తంబు గావించి

మనస్సు - బుద్ధి :- బుద్ధినాశ్రయించి విజ్ఞానము కలిగి ఉండెను.

ధారణ :- నిర్మలుండై ఉండెను. అనగా త్రిగుణములను వదలి గుణరహిత స్థితిలో ఉండెను.

సమాధి :-

దేహత్యాగకాలము :- లయయోగము. అనగా వాక్కునుఅగ్నితో, మనస్సును చంద్రునితో, ప్రాణాధీనంబగు మనమును ప్రాణమందును, ప్రాణమును అపానమునందును, అపానమును మృత్యువు నందును, మృత్యువును పంచభూతంబులకు నైక్యంబైన దేహంబునందును, దేహమును గుణత్రయమునందును, గుణత్రయమును అవిద్యయందును, అవిద్యను జీవునియందును, జీవుండైన తనను అవ్యయంబైన బ్రహ్మమందును లయింప చేసినాడు. దేహమును వదలి ఆత్మయైనాడు.

### (కలియుగములో) శమీకుడు

ఇతడు అంగిరస గోత్రజుడు.

బాహ్య చిహ్నములు : మృగ చర్మము ధరించినాడు. అతి దీర్ఘ జటలు కలిగి ఉన్నాడు.

స్వభావము : భాగవత ధర్మము కలిగి, విరక్తి కలిగి ఉన్నాడు. అనగా ఇతరులు తనకు అపకారము చేసినా కోపము ద్వేషము లేక రాగ ద్వేషములు లేక సత్త్వగుణమున ఉండెనని అర్థము.



ఆసనము : అపరిగ్రహమును పాటించి, విక్రియుడై, మెలగుట చాలించి అనగా స్థిరాసనమున ఉన్నాడని అర్థము. కర్మేంద్రియములను నిగ్రహించి స్థిరాసనమున ఉండుటను ఆసన జయముగా చెప్పుదురు.

ప్రాణాయామము : ప్రాణాయామ పరాయణుడై

ప్రత్యాహారము : నిమీలిత నేత్రుడై ఉన్నాడు. పంచేంద్రియములు బహిరంగ వీధులు బారనీక విస్మృత బాహ్యేంద్రియ కృత సంచారుడై ఉన్నాడు. జ్ఞానేంద్రియములను వాటి వాటి ఇంద్రియార్థములపై ప్రసరించకుండా నిగ్రహించుటను ప్రత్యాహారమని అందురు.

ధ్యానము : హరి చింతా పరుడై ఉండెను.

ధారణ : శాంతుడై ఉన్నాడు. అనగా సత్త్వగుణాశ్రయమును ధారణ అని అందురు.

సమాధి : జాగరణాది స్థాన త్రయమును దాటి, సమాధి నిష్ఠాగరిష్టుడై జడతలేక ఆత్మ స్థానము తెలసి ఆత్మతో ఏకీ భూతుడై ఉండెను. గుణరహిత స్థితిని నిశ్చల సమాధి అని అందురు. ఈ స్థితిలో కలవారిని విదేహుడు అని అందురు. రామాయణములోని సీత తండ్రియగు జనకుడు విదేహుడు. ఇతడు పూర్ణబిందువు గుఱించి సంపూర్ణముగా తెలిసినవాడు. ఈ పూర్ణబిందువు గుఱించి వేదములో **"హగ్ంస శ్శుచిషద్వసురంతరిక్షసద్ధోతా వేదిష రతిథిర్దురోణసత్ నృష ద్వరస దృతస ద్వ్యోమన దబ్జా గోజా ఋుతజా అద్రిజా ఋుతమ్బృహత్"** అని చెప్పబడినది. పూర్ణ బిందు స్థానమును పొందుటయే నిశ్చల సమాధియని అందురు. ఇట్టి స్థానమును పొందినవాడు బ్రహ్మణ్యుడు. ఇట్టి బ్రాహ్మణత్వము పొందు విధివిధానము సంధ్యావందనము.

### కర్దముని భార్య దేవహూతి

వైరాగ్యము : తన భర్త అయిన కర్దమ ప్రజాపతి తపఃప్రభావంబున కల్పితంబైన తపోవనమును, ఆశ్రమమును, అందలి వస్తు సంపదను పరిత్యజించెను. అనగా అధిక వైరాగ్యము కలిగి ఉండెను.

ప్రదేశము : సరస్వతీ బిందు సరోవర ప్రాంతము

పుణ్య కర్మానుష్ఠానము : ఉగ్ర తపో భారంబున కృశీభూత శరీరయై త్రిషవణ స్నానముచేసి

ప్రత్యాహారము : ఇతర చింతలు మాని

ధ్యానము : విశుద్ధ మనంబుకలిగి మనస్సును పరమాత్మయందు లగ్నంబు చేసి

ధారణ : నిరంతరము భగవంతునిని ధ్యానించుచుండెను.

సమాధి : జ్ఞానవంతురాలై అనగా గుణరహితయై తన అస్థిత్వమును మఱచి పోయినది. అనగా విదేహ స్థితికి చేరినది.

దేహత్యాగకాలము : యోగ శక్తిచే పరమాత్మలో కలసిపోయినది. అనగా ఆత్మయై విరాజిల్లినది. ఆమె తపస్సు చేసిన ప్రదేశము **సిద్ధ పదము** అని ప్రసిద్ధి పొందినది.

**సతీదేవి(శివుని భార్య)**

దేహత్యాగకాలము : కామ క్రోధాది శత్రు విఘాతిని అయిన సతీదేవి ఉత్తరదిక్కు ముఖమై జలంబులను ఆచమనము చేసి శుచియై యోగమార్గంబున

ఆసనము : జితాసనయై

వాక్కు : మౌనము

ప్రత్యాహారము : అన్యంబు చూడక

ధ్యానము : శివుని చింతించుచు ప్రాణాపానవాయు నిరోధము గావించి నాభితలమున చేర్చి, ఆపై హృదయ పద్మము, కంఠము, భ్రూమధ్యము చేర్చి తనువు అనిల అగ్ని ధారణంబుల చేసి ఆ అగ్నిలో దేహము దగ్ధము గావించి శరీర త్యాగము చేసినది.

**పృథుచక్రవర్తి భార్య అర్చి**

తన భర్తయైన పృథు చక్రవర్తితో కలసి మందరగిరి ప్రాంతమున గల తపోవనమునకు వెళ్ళినది. పృథు చక్రవర్తి లయయోగమున శరీరమును పరిత్యజించి ఆత్మ స్థానము చేరగా **ఈమె భర్తకు దహన సంస్కారములు చేసి ఉదక దాన క్రియలు చేసినది.** తదనంతరము పృథు చక్రవర్తివలె సాధన చేసి అనగా సహ-గమనము వలన ఆత్మ స్థానము చేరినది.



**దితి**

రామాయణ పరముగా :

దితి తన భర్తయైన కశ్యప ప్రజాపతితో తనకు బలముగలవాడును ఇంద్రుని చంపగలవాడును అయిన కుమారుడు కావలయునని కోరినది. అంత కశ్యపుడు వేయి సంవత్సరములు పవిత్రముగా తపస్సు చేసిన యుద్ధములో ఇంద్రుని చంపగల కుమారుని కనగలవని చెప్పెను. భర్త మాటపై తన కోరిక తీరుటకు తపస్సు ప్రారంభించెను.

ప్రదేశము : **కుశ ప్లవనము**

ఇంద్రుడు తల్లికి నీరు, అగ్నిహోత్రములకు కావలసిన దర్భలు, సమిధలు ఆహారమునకు కందమూలములు, ఫలములు తెచ్చి ఇచ్చుచు ఆమెకు పాదసేవ చేయుచు, శ్రమతీరుటకు వలయు సేవలు చేయుచుండెను. ఆ సేవలకు మెచ్చి దితి ఇంద్రునితో నాకుమారుడు నీవు కలసి మూడు లోకములు నిరాటంకముగా అనుభవించగలరు అని పలికెను.

దోషము : మధ్యాహ్న సమయమున పాదములను తలవైపు, తలను పాదములవైపు ఉంచి అనగా ఉత్తర దిక్కున తలఉంచి నిదుర పోయెను. ఈ దోషమును అదనుగా చేసికొని ఇంద్రుడు దితి గర్భములో ప్రవేశించి ఆ గర్భ పిండమును ఏడు ముక్కలు చేసెను. అంత దితి మేల్కొనెను. ఇంద్రునితో ఇందు నీ అపరాధము లేదు అని పలికి ఈ ఏడుగురిలో ఒకరు బ్రహ్మలోకమున, ఒకరు ఇంద్రలోకమున, ఒకరు వాయువు అను పేరున అంతరిక్షమున, మిగిలిన నలుగురు నలుదిక్కుల సంచరింతురని దితి ఇంద్రునితో పలికెను. ఈ ఏడుగురు మరుత్తులను పేరున వ్యవహరింప బడుచుండిరి. వీరికి వేదములలో సూక్తములు గలవు.

సందేశము : ఈ కథ ద్వారా మనకు అందచేసిన యోగరహస్యములు:- ఇంద్రుని చంపగలవాడగు కొడుకును కనవలెనని దీక్ష చేయుచూ ఇంద్రుడు సేవచేయుటకు రాగా అతనిని సేవకు అంగీకరించినది. అనగా ఈమెలో వైరభావము పోయి సమభావన కలిగినది అని అర్థము. యోగికి సమభావన ఉండవలయును అని దీని భావన. ఇంద్రుడు తన గర్భమును ఏడు ముక్కలుగా ఖండించినను ఆమె ఇంద్రునితో

ఇందు నీ అపరాధములేదని పలికినది. అనగా పరాపరాధ సహనము కలిగి ఉన్నది. యోగికి పరాపరాధ సహనము ఉండవలయునని సూచింప బడినది. సమభావన పరాపరాధ సహనము మొదలగునవి దైవీ సంపదగా చెప్పబడును. కావున యోగి దైవీ సంపద గలిగి అసుర సంపదను వీడి చాలా కాలము యోగము చేయుచుండగా ముఖ్యప్రాణము సప్త ప్రాణములగుననే యోగ రహస్యము ఇందు చెప్పబడినది. ఈ కథలోని ఇంద్రుడు అనగా ముఖ్య ప్రాణము. ఈ ముఖ్యప్రాణము ఏడు భాగములై బ్రహ్మలోకమున, ఇంద్రలోకమున, అంతరిక్షమున, నలుదిక్కుల సంచరించుచుండును. ఈ సప్త ప్రాణములనే పంచ ప్రాణములనీ, శుద్ధవాయువనీ, పరిశుద్ధ వాయువనీ అందురు. ఈ యోగ రహస్యము ఈ కథ ద్వారా అందచేయబడినది.

**భాగవతము పరంగా :**

మార్గశీర్ష శుద్ధ పాడ్యమి నుంచి ఒక సంవత్సరము పుంసవనము అనేపేరుగల వ్రతము చేసినది. భాగవతమున పుణ్యాకర్మానుష్ఠానములో విధులకు బదులు నిషేధములు చెప్పబడినవి. అస్థికపాలాదులైన అమంగళములు అంటక, నదీతటాకాదులలో తప్ప ఇతర విధముగా స్నానము చేయక, నగ్నముగా ఉండక, కట్టినకోక మఱల ధరియింపక, తెల్లని వస్త్రములు కాక ఇతర రంగు వస్త్రములు కట్టక, ముడిచినపూవులు మఱల ముడవక, అలంకార విహీనగాక, వెలుపల తిరగక, సంధ్యాకాలమునందు ముక్తకేశికాక, నఖరోమఛేదనంబులు చేయక, నగ్నంబుగా నిద్రింపక, సంధ్యాకాలమున నిద్రింపక, పడమర దిక్కున నిద్రింపక, పాద ప్రక్షాళనంబు చేసికొనికానీ శయనింపక, తడికాళ్ళతో శయనింపక ఉండవలయునని ఆ వ్రతముయొక్క నియమము. ఆవిధముగా నిషేధములు పాటించుచు వ్రతము చేసినది.

పుణ్య కర్మానుష్ఠానము : ప్రాతఃకాలమున తూర్పు ముఖముగా భగవంతునిని ఆరాధించినది.

కర్మేంద్రియములు :

వాక్కు : దుర్జన సంభాషణ వర్జించి మితభాషియై, పరుష వాక్యములు, అసత్యము పలుకక,

చేతులు : హింసాభావము లేక

జ్ఞానేంద్రియములు :

ఆహారము : మాంసాహారము వర్జించి

అంతఃకరణము : కోపము లేక తపస్సు చేసెను

దోషము : సంధ్యవేళ అశుచియై పాదప్రక్షాళనము చేయక నిదురించెను. ఈ దోషమును గమనించి ఇంద్రుడు దితి గర్భమును ఏడు ముక్కలు చేసెను. అవి సప్త మరుత్తులయ్యెను.

భాగవతములో కర్మ పద్ధతిన సాధనగా నారదాదులను ఉదహరించియు యోగ పద్ధతిలో అనేక మంది స్త్రీపురుష సాధకులను ఉదహరించియు భక్తి పద్ధతిలో ప్రహ్లాద, గోపికాదులను ఉదహరించియు కర్మ, యోగ, భక్తి గుఱించి విపులముగా చెప్పబడినది.

రామాయణములో ఒక్క రామునినే ఉదాహరణగా తీసికొని ఈ పద్ధతులన్నింటినీ మేళవించి చెప్పబడినది. కర్మ పద్ధతిలో రాముడు చిత్రకూట నివాసము, ఋషుల ఆశ్రమ సందర్శనము, ఖరదూషణ సంహారము, శబరిని దర్శించుట, సముద్రమునకు చేరుట, సేతువు నిర్మాణము, రావణ సంహారముగా చెప్పబడినది. చివరకు రాముడు అయోధ్య చేరినాడు. ఇది కర్మ పద్ధతి. యోగ పద్ధతిలో విరాధుని సంహారము, కబంధుని సంహారము, హనుమంతుడు సుగ్రీవాదులతోడి మైత్రి, వాలి సంహారము, లంక చేరి రావణ సంహారములు వర్ణింప బడినవి. తిరిగి రాముడు అయోధ్య చేరినాడు. ఇది యోగ పద్ధతి. కర్మ యోగ పద్ధతుల రెండింటిలోనూ సీత అగ్ని ప్రవేశము, బ్రహ్మ దర్శనము, సీతా పరిత్యాగము ఉండును. భక్తి పద్ధతి, సాంఖ్య పద్ధతులలో భరతునిని ఉదాహరణగా తీసికొని వర్ణించినారు. ఈ విధముగా రామాయణములో సాధన రహస్యములగు కర్మ జ్ఞాన భక్తి సాంఖ్య పద్ధతులు వర్ణింపబడినవి. జీవుడు ఆత్మ స్థితిని చేరుటకు **నాన్యఃపంథా అయనాయ విద్యతే** అనగా పద్ధతులు వేఱు అయినను మార్గము ఒక్కటే అని చెప్పుటకు రాముడు ఏమార్గమున లంక చేరెనో లంక నుంచి తిరిగి అదే మార్గములో అయోధ్య చేరినట్లు అనగా ఆరోహణ అవరోహణ క్రమములు చెప్పబడినవి.

ఈ విధమైన కర్మ యోగ భక్తి సాంఖ్య పద్ధతులను మేళవించి వాల్మీకి రామాయణములో రామునిని వర్ణించినట్లుగనే వీటన్నింటినీ మేళవించి దశమ స్కంధములో వ్యాసభగవానుడు కంసునిని చిత్రీకరించినారు.

ఏ యుగమయినా మోక్షమార్గమునకు చేయు సాధన ఒకటే. ఆ పద్ధతిని ఆచరించిన సాధకుల గుఱించి ఇందు వర్ణింపబడినది.

**ముగింపు:-**

01. జాతిధర్మములు, ఆశ్రమ ధర్మములు, విధులు, బాధ్యతలు పాటించవలయును.

02. నిష్కామ కర్మాచరణ చేయవలయును.

03. గుణరహితుడై మనస్సును బుద్ధితోనూ, ఆరెండింటినీ కూటస్థునితోనూ, కూటస్థునిని క్షేత్రజ్ఞునితోనూ కలపవలయును. ఈ స్థితి పొందిన వానిని జీవన్ముక్తుడని అందురు.

04. దేహత్యాగ కాలమున ప్రాణములను బ్రహ్మ రంధ్రము చేర్చి, బ్రహ్మ రంధ్రము చీల్చి ఆత్మతో ఆత్మయందు కలియును.

*****

# నారద భక్తి సూత్రములు

## ప్రథమాధ్యాయము

**1. అథాతో భక్తిం వ్యాఖ్యాస్యామః**

అథ = ఆ తర్వాత

అతః = ఇందువలన-ఆత్మదర్శనం పొందుట కొఱకు

భక్తిమ్ = భక్తిని గుఱించి

వ్యాఖ్యాస్యామః = భక్తికి సంబంధించిన ఆచార్యులమైన మేము వివరించుచున్నాము.

గ్రంథమును మంగళప్రదమయిన అథ శబ్దముతో ప్రారంభించినారు. బంధవిముక్తి పొందవలయుననే తపన గలిగిన తర్వాత జీవుడు ఆత్మదర్శనం పొందుట కొఱకు సాధన చేయుటకై భక్తిని గుఱించి విపులీకరించు చున్నాము.

భక్తిఅనగా నేమి - భక్తి నిర్వచనం

**2. సా త్వస్మిన్ పర(మ)ప్రేమరూపా.**

సా = ఆ భక్తి

తు = సంసారములో

అస్మిన్ = భగవంతునియందు

ప్రేమరూపా = ప్రేమస్వరూపముగా -

(భవతి) = ఉన్నది.

ఏవిధముగా సంసారములో జీవుడు భార్యాపుత్రాదులను ప్రేమించునో - అదేవిధముగా భగవంతుని గాఢముగా ప్రేమించుటయే భక్తి.

**3. అమృత స్వరూపా చ,**

చ = మఱియు ఆ భక్తి

అమృత స్వరూపా = అమృత స్వరూపము.



భార్యాపుత్రాదులయందు కాలము, కర్మవలన ప్రేమ తగ్గవచ్చును. లేదా కోపము ద్వేషములవలన ప్రేమనశించవచ్చును. కాని భక్తి అమృత స్వరూపము అనగా భగవంతుని యందలి ప్రేమ తగ్గక, నశింపక శాశ్వతముగా ఉండును. కాలాను గతముగా సుఖ దుఃఖములు ప్రాప్తంబులయినను హరిభక్తి విడువరాదు.

భక్తి వలన లాభము

**4 యల్లబ్ధ్వా పుమాన్ సిద్ధోభవతి, అమృతోభవతి, తృప్తో భవతి.**

యత్ = ఏది దేనిని అనగా భక్తిని

లబ్ధ్వా = పొంది

పుమాన్ = పురుషుడు అనగా భక్తుడు

సిద్ధః + భవతి = సిద్ధత్వము పొందును.

భగవంతుడు సంతోషించుటయే సిద్ధి. భక్తి గలిగిన పురుషుని చూచి భగవంతుడు సంతోషించును. భగవంతుడు సంతసించిన అలభ్యంబెయ్యదియు లేదు. కావున సర్వకోరికలు నెఱవేరును

తృప్తః + భవతి = తృప్తుడగును. కోరకనే వాంఛితంబులు సేకూరు. పూర్ణకాముడగును.

అమృతః + భవతి = అమృత స్వరూపుడగును. ఆత్మస్వరూపుడగును.

భక్తియొక్క లక్షణములు

**5. యత్ ప్రాప్య న కించిద్వాంఛతి, న శోచతి, న ద్వేష్టి న రమతే, నోత్సాహీభవతి.**

యత్ = దేనిని అనగా భక్తిని

ప్రాప్య = పొంది అనగా భక్తిగలిగిన వాడు; భక్తుడు యాగప్రముఖ పుణ్యాలబ్ధంబైనస్వర్గాది లోక భోగంబులు పుణ్యానుభవ క్షీణంబులు గాని నిత్యంబుకావని తెలిసి ఇహలోక పరలోక సుఖభోగములను

| | | |
|---|---|---|
| న+కించిత్ + వాంఛతి | = | వాంఛింపడు |
| న+శోచతి | = | ఇహలోక పరలోక సుఖ భోగముల గుఱించి ఆలోచింపడు |
| న+ద్వేష్టి | = | సర్వభూతములయందు ఈశ్వరుని దర్శించుట వలన ఇతరుల వలన కీడు కలిగినా అది దైవకృతమని భావించుట వలన ఎవరినీ ద్వేషింపడు |
| న+రమతే | = | నిమిష భంగుర ప్రాణులయిన మర్త్యులకు మమతాస్పదంబులును చంచలములునైన పుత్ర మిత్ర కళత్ర పశుభృత్యబల బంధు రాజ్య కోశ మణి మందిర మంత్రి మాతంగ మహీప్రముఖ విభవంబులు నిరర్థకంబులని భావించి వాటియందు ఆసక్తి చూపడు. |

-- కామినీప్రముఖ భోగములెన్నిగలిగిన వ్యసన సంసక్తి నావంక బోడు -- ప్రహ్లాదుడు

| | | |
|---|---|---|
| న+ఉత్సాహీ + భవతి | = | లోకవ్యవహారములందు ఉత్సాహము చూపడు మఱియు సర్వారంభ పరిత్యాగిగా ఉండును. **అంధప్రక్రియ నున్నవాడు - ప్రహ్లాదుడు.** |

**6. యత్ జ్ఞాత్వా మత్తో భవతి, స్తబ్ధో భవతి, ఆత్మారామో భవతి.**

| | | |
|---|---|---|
| యత్ | = | దేనిని, అనగా సంసారము గుఱించి |
| జ్ఞాత్వా | = | తెలుసుకొని; మఱియు భక్తి గుఱించి తెలిసికొని |
| మత్తః + భవతి | = | మత్తుడువలె ఉండును. మదిరాపానమత్తుడు దేహధ్యాసలేక యుండునట్లు - భక్తుడు కూడ దేహధ్యాస లేకుండా ఆత్మయందు ధ్యాస గలిగి-ఈవిశ్వమును మఱచి యుండును |

**మఱచెన్ సురారి సుతుడేతద్విశ్వమున్ భూవరా - ప్రహ్లాదుడు**

| | | |
|---|---|---|
| స్తబ్ధః +భవతి | = | జడుని భంగి యుండును. **నిత్యపరిపూర్ణుడగుచు నన్నియును మఱచి-ప్రహ్లాదుడు** |
| ఆత్మారామః+ భవతి | = | ఆత్మారాముడై అనగా ఆత్మతో రమించుచూ ఉండును. |

**జడత లేకయునుండును జడుని భంగి-ప్రహ్లాదుడు**

**7. సా న కామయమానా, నిరోధరూపత్వాత్.**

| | | |
|---|---|---|
| సా | = | ప్రేమస్వరూపమయిన భక్తి; |
| న+కామయమానా + నిరోధరూపత్వాత్ | = | విషయాసక్తి లేని ప్రేమ స్వరూపము. |

**భక్తినిర్వచనం**

**8. నిరోధస్తు లోక వేద వ్యాపారన్యాసః.**

| | | |
|---|---|---|
| వేద | = | కామ్యకర్మానుష్ఠానము |
| లోక వ్యాపార+నిరోధః + తు+న్యాసః | = | లౌకిక విషయానుష్ఠానములు లేకుండా ఉండి మఱియు |

**సర్వమున్ అతని దివ్యకళామయమంచు విష్ణునందుల్లము చేర్చి ఉండుటయే భక్తి.**

**భక్తుని లక్షణములు**

**9. తస్మిన్ననన్యతా తద్విరోధి షూదాసీనతా చ.**

| | | |
|---|---|---|
| తస్మిన్ | = | ఆత్మయందు |
| అనన్యతా | = | శరీరమునకు కరచరణాదులు వేఱుగా తలంపని చందంబున భక్తుడు ఆత్మకు భూతజాలములు వేఱు అనే భావన ఉండదు |

| | | |
|---|---|---|
| చ | = | మఱియు |
| తత్ + విరోధిషు | = | ఆత్మ కంటె భిన్నములయిన దేహధారులయందు |
| ఉదాసీనత | = | శత్రు మిత్రత్వములు లేక ఉదాసీనత గలిగి ఉండును. |

**10. అన్యాశ్రయాణాం త్యాగోఽనన్యతా.**

| | | |
|---|---|---|
| అన్య | = | ఇతరములైన అనగా అనాత్మను లేక ఇతర జనములను |
| ఆశ్రయాణాం | = | ఆశ్రయించుటలో |
| త్యాగః | = | త్యాగము అనగా పరమాత్మనే శరణు కోరి ఇతర జనములను ఆశ్రయించడు. |
| అనన్యతా | = | తను దేహి అనే భావన వీడి, ఆత్మయందు పరమాత్మను పొడగందురు తను వేఱు ఈశ్వరుడు వేఱు అనే భావన లేకుండా సర్వము ఈశ్వర మయమనే భావన గలిగి ఉండును. ఈశ్వరుని తప్ప ఇతరులను ఆశ్రయింపడు. విషయములందు త్యాగము కలిగి ఉండును. |

**11. లోకవేదేషు తదనుకూలాచరణం తద్విరోధి షూదాసీనతా**

| | | |
|---|---|---|
| లోక | = | లోకములో అందరివలె ప్రవర్తించును కాని లౌకిక కార్యములలో, లోక వ్యవహారము లలో ఉదాసీనత కలిగి యుండును. |
| వేదేషు | = | వేదములో చెప్పిన పుణ్య కర్మానుష్ఠానము చేసి పుణ్య ఫలితములు కోరక యుండును |
| తదనుకూలాచరణం | = | వేదవిహిత కర్మలను పాటించును. |
| తద్విరోధిషు+ ఉదాసీనతా | = | శత్రుమిత్ర భేదములు లేక సమభావన గలిగి యుండును. |





**12. భవతు నిశ్చయదార్ఢ్యా దూర్ధ్వం శాస్త్రరక్షణమ్**

**13. అన్యథా పావిత్ర్య శంకయా.**

| | | |
|---|---|---|
| శాస్త్ర రక్షణమ్ | = | వేద వేదాంగముల గుఱించి |
| నిశ్చయ దార్ఢ్యాత్ ఊర్ధ్వం | = | నిశ్చయమయిన ధృడత్వము వలన అత్యున్నత స్థితి |
| భవతు | = | గలుగుగాక. అనగా వేద వేదాంగములు చదివి సత్తు అసత్తుల గుఱించి అనుభవ జ్ఞానమును పొందవలయును. |
| అన్యథా | = | ఆ విధమయిన వేద వేదాంగముల గుఱించి శాస్త్ర జ్ఞానములేక పోవుటవలన |
| పావిత్ర్య | = | పతనము గలుగుననే |
| శంకయా | = | అనుమానము గలుగును. అనగా శాస్త్ర జ్ఞానములేనిచో శాస్త్ర విధిని అనుసరించి కర్మానుష్ఠానము చేయుటకు వీలుపడదు అనే అనుమానము కలుగు చున్నది. కావున వేద వేదాంగములు చదువ వలయును. |

**చదివితి ధర్మార్థ ముఖ్య శాస్త్రంబులు నే చదివినవి గలవు పెక్కులు .. ప్రహ్లాదుడు**

**భక్తుడు లోకములో ఎలా ప్రవర్తించాలి?**

**14. లోకోఽపితావదేవ; భోజనాది వ్యాపారస్త్వా శరీరధారణావధి.**

| | | |
|---|---|---|
| శరీరధారణ+ అవధి | = | ఎంత వఱకు శరీరము పతనము గాకుండా ఉండునో అనగా శరీర నిర్వహణకు ఎంత అవసరమో |
| తావత్ + ఏవ | = | అంత మాత్రమే |
| లోకః + భోజనాది వ్యాపారః + అపి | = | లోకమున భోజనాది వ్యాపారములు |

త్వా = నిన్ను - పొందుగాక. అనగా సంసార తాపత్రయములలో కూరుకొనక - శరీర ధారణకు అవసరమయినంత మేర స్వీకరించుచూ విలాసవంతమయిన జీవితము గడపక భక్తుడు లోక వ్యవహార మున చరించ వలయును. సంసారములో తామరాకుపై నీటిబొట్టువలే ఉండ వలయును.

**భక్తి లక్షణములు - భక్తి నిర్వచనము**

**15. తల్లక్షణాని వాచ్యంతే నానామతభేదాత్**

తత్ = ఆ భక్తి యొక్క

లక్షణాని = లక్షణములు

నానామతభేదాత్ = ఒకొక్కరు ఒక్కొక్క విధముగా

వాచ్యంతే = చెప్పుదురు.

**16. పూజాదిష్వనురాగ ఇతి పారాశర్యః**

పారాశర్యః = పరాశరుని కుమారుడయిన వ్యాస భగవానుడు - సంసార తాపత్రయములు లేకుండా - అరిషట్ వర్గములను వదలి

పూజాదిషు = పూజాదులందు

అనురాగః + ఇతి = అనురాగము - భక్తి అని పలికెను

**17. కథాదిష్వితి గర్గః**

నారాయణ కథా ప్రసంగములయందు ఆసక్తి భక్తి యని గర్గి చెప్పెను

**18. ఆత్మ రత్య విరోధే నేతి శాండిల్యః**

నిరంతర ఆత్మాను సంధానము భక్తియని శాండిల్యుని అభిప్రాయము

**19. నారదస్తు తదర్పితాఖిలాచరతా తద్విస్మరణే పరమవ్యాకులతేతి (చ).**

**20. అస్త్యేవ మేవమ్**



**21. యథావ్రజగోపికానామ్**

నారదః + తు = నారదమహర్షి

తత్ + అర్పితా + అఖిలఆచరతా = సర్వము పరమాత్మకు అర్పించి - సర్వమున్ అతని దివ్య కళామయమంచు విష్ణునందుల్లముచేర్చి - తామరాకుపై నీటి బొట్టువలే సంసారములో ఉంటూ సంసార తాపత్రయములకు అంటక ఉండుటను భక్తి అని పలికెను

తత్ + విస్మరణే = ఈశ్వరుడు కనబడకపోయినచో

పరమ + వ్యాకులత + ఇతి = అతనికై పరితపించుటయే భక్తి అని పలికెను.

ఏనమ్ +ఏవమ్+అస్తి = ఇట్టివారు కలరు

యథా = ఏ విధముగా

వ్రజగోపికానామ్ = గోకులమందలి గోపికల యొక్క వ్యాకులత ఉన్నట్లు ఉండవలయును. అదియే భక్తి.

**22. తత్రాపి న మాహాత్మ్యజ్ఞానవిస్మృత్యపవాదః**

తత్ర = గోపికలది ఆవిషయమున అనగా లోక వ్యవహార వ్యాకులత

న = కాదు

జ్ఞాన విస్మృతి+అపవాదః+ న +అపి = ఆత్మజ్ఞానము మఱచిన అజ్ఞాన అపవాదము కూడా కాదు.

మాహాత్మ్య = ఆగోపికల వ్యవహారశైలి ఆత్మజ్ఞానమునకు సంబంధించినది. శ్రీ కృష్ణుడు ఆత్మ అని గ్రహించిన వారు గోపికలు. వారు ఆ విధముగా ప్రవర్తించిరి. అటులగానిచో

**23. తద్విహీనం జారాణామివ.**

| | | |
|---|---|---|
| తత్ + విహీనం | = | ఆవిధముగా ఆత్మజ్ఞానము లేనిచో వారి ప్రవర్తన శారీరక సుఖాపేక్షకోరిన |
| జారాణామ్ + ఇవ | = | జారణుల యొక్క ప్రవర్తన వంటిదే అగును |

**24. నాస్త్యేవ తస్మిన్ తత్సుఖసుఖిత్వమ్**

| | | |
|---|---|---|
| తస్మిన్ | = | ఆ శ్రీకృష్ణుని యందు వారికి |
| తత్ + ఏవ | = | శారీరక సంపర్కము అనే |
| సుఖసుఖిత్వమ్ | = | సుఖము కాముక భావము |
| న + అస్తి | = | లేదు. వారిది ఆత్మరతి. గోపబాలురది ఆత్మక్రీడ . |

### జార శబ్దము, జారిణి శబ్దముల నిర్వచనము

సంస్కృత భాషలో జార శబ్దమునకు వ్యభిచారము అని అర్థము. వ్యభిచారము చేయు స్త్రీ పురుషులను జారిణి, జారుడు అని పేర్కొనెదరు. బ్రహ్మ విద్యా సంప్రదాయములో ఈ పదముల అర్థము వేఱు. అయస్కాంతమునందు గల శక్తి ఆ అయస్కాంతమును ఇనుముపై రుద్దిన ఆ శక్తి ఇనుములో ప్రవేశించును. ఇటుల ఒకదానియందుగల శక్తి ఇంకొకదానిలో ప్రవేశించుటను **జార** అని అందురు. ఈశ్వరుడు జీవుడు సంయోగము చెందగా ఈశ్వర లక్షణములు జీవుని యందు కలిగి జీవుడు ఈశ్వరుడగును. ఈ విధముగా ఈశ్వరుడు జారుడు. జీవుడు **జారిణి.** జీవేశ్వరుల కలయికను రతి అని అందురు. ఈశ్వరుడు జీవునితో కలసినచో అది ఉపరతి. జీవుడు ఈశ్వరునితో కలసినచో అది రతి. ఈ సంయోగమును కర్పూరదీప సంయోగమని అందురు. అనగా కర్పూరము దీపముతో సంయోగము చెందగా కర్పూరము కూడా దీపము వలె జాజ్వల్యమానముగా ప్రకాశించును. దీనికి గుర్తుగా ఆచారకాండలో కర్పూరహారతిని యిచ్చెదరు.

*****



# ద్వితీయాధ్యాయము

భక్తి ప్రకృతి ఆవరణ దాటుటకు సాధనము గావున గొప్పది

**25. సా తు కర్మజ్ఞానయోగేభ్యోఽప్యధికతరా.**

| | | |
|---|---|---|
| సా | = | భక్తి |
| కర్మజ్ఞానయోగేభ్యః +తు | = | కామ్యకర్మవలన గలిగే పుణ్య ఫలితము, లౌకిక జ్ఞానము, ఇంద్రియ నిగ్రహముగా చెప్పబడే యోగముకంటె |
| అపి | = | కూడ |
| అధికతరా | = | అధికతరమయినది. (భక్తి లేకున్న జ్ఞానము విశేషంబుగా శోభితంబు కాదు అని అర్థము). ఇదే విషయమును భాగవతమున |

చిక్కడు వ్రతముల, గ్రతువల జిక్కడు దానముల శౌచశీల తపములం జిక్కడు. చాలదు భూదేవత్వము అనియు, యోగములో ఆత్మ నియంత్రతమయ్యు కామరోషముల ప్రచోదితంబ యగు. శాంతి వహింపదు అనియు ఆత్మ ఉపాధి రహితము కావున ఆత్మను మనస్సులో ధ్యానించుట కష్టమనియు చెప్పబడినది. వంశము, తేజము, సౌందర్యము, ఉద్యోగము, నిపుణత్వము, ప్రతాప పౌరుషములు, బలము, ప్రజ్ఞ, శ్రుతము, నిష్ఠ, జపహోమములు భక్తితో సరిగావు.

**26. ఫలరూపత్వాత్.**

| | | |
|---|---|---|
| ఫలరూపత్వాత్ | = | కామ్యకర్మ యిచ్చు ఫలము వలనకూడ కర్మాదులకంటె భక్తి అధిక తరమని చెప్పవచ్చును. కర్మలు శాస్త్ర విహితముగా వేదోక్తముగా అధిక ప్రయాసలతో వివిధ దేవతలను యజ్ఞముల ద్వారా యజించిన గానీ కోరికలు నెఱవేఱవు. కానీ భక్తిలో కేవలము ఒక్క ఇష్ట దేవతను ధ్యానించిన మాత్రముననే సర్వ కోరికలు నెఱవేఱును. |

**27. ఈశ్వరస్యాప్యభిమాన ద్వేషిత్వాత్ దైన్య ప్రియత్వాత్.**

| | | |
|---|---|---|
| అభిమాన ద్వేషిత్వాత్ | = | అభిమానము, ద్వేషముల కంటె |
| దైన్యప్రియత్వాత్ | = | దైన్యము, ప్రియముల కంటె ; |
| అపి | = | కూడ అనగా త్రిగుణములతో కూడిన కర్మ కంటె |
| ఈశ్వరస్య | = | ఈశ్వరుని యొక్క భక్తి గొప్పది. అనగా గుణరహితము భక్తి యనబడును. గుణరహిత స్థితి గొప్పది గావున భక్తి గొప్పది |

**28. తస్యాః జ్ఞానమేవ సాధనమిత్యేకే.**

| | | |
|---|---|---|
| తస్యాః | = | ఆ భక్తికి |
| జ్ఞానమ్ + ఏవ +ఏకే + సాధనమ్ | = | జ్ఞానమే కేవల సాధనము |
| ఇతి | = | అని చెప్పుదురు. |

**29. అన్యోన్యాశ్ర యత్వమిత్యన్యే.**

| | | |
|---|---|---|
| అన్యే | = | కొందఱు |
| అన్యోన్య +ఆశ్రయమత్వమ్ +ఇతి | = | ఒక దాని కొకటి ఆశ్రయత్వము అని చెప్పుదురు. జ్ఞానము భక్తి ఇవి ఒక దాని కొకటి ఆశ్రయములు. |

**30. స్వయం ఫలరూపతేతి బ్రహ్మకుమారః**

| | | |
|---|---|---|
| బ్రహ్మకుమారః | = | నారదుడు భక్తిగుఱించి సంసార ప్రవిష్టుండైన వానికి తపోయోగాదులైన మోక్షమార్గములు పెక్కులు గలవు. అందు భక్తి మార్గంబు కంటె సులభము లేదు అని మఱియు భక్తి |
| స్వయం | = | స్వయముగా |
| ఫలరూపత్ + ఇతి | = | ఆత్మదర్శనమనే ఫలరూపము కలది అని భక్తి గుఱించి చెప్పెను. |

**31. రాజగృహ భోజనాదిషు తథైవ దృష్టత్వాత్.**

**32. నతేన రాజా పరితోషః, క్షుచ్చాంతిర్వా.**

**33. తస్మాత్ సైవ గ్రాహ్యా ముముక్షుభిః**

ఆత్మదర్శన ప్రాప్తి ఎంత గొప్పది అనేదానికి ఒక ఉదాహరణ చెప్పుచున్నాడు.

| | | |
|---|---|---|
| రాజ గృహ భోజనాదిషు | = | ఒక భిక్షకునికి రాజగృహమునందు షడ్రసోపేతమయిన విందు దొరికినది, ఆభిక్షకుడు రాజసత్కారము పొంది ఆనందపడినట్లు |
| తత్ + ఏవ | = | ఆవిధముగా ఇహలోక పరలోక సుఖములు భిక్షాన్నమయితే ఆత్మదర్శన ప్రాప్తి అనే రాజ భోగమును |
| దృష్టత్వాత్ | = | ఈ దృష్టాంతరమువలన గ్రహించ వలయును. |
| సహ రాజా పరితోషః | = | భిక్షకునికి ఆతిథ్యమిచ్చి రాజు ఆనంద పడెను. |
| తేన+క్షుత్+చ+అంతిర్వా | = | భిక్షకుడు కూడా ఆ విధముగా ఆకలి తీరి ఆనందించెను. |
| తస్మాత్ | = | అందు వలన ఆకలి తీరి భిక్షకుడు, సత్కారము చేసి రాజు ఆనంద పడినట్లు |
| ముముక్షుభిః | = | మోక్షార్థిచేత |
| సః ఏవ గ్రాహ్యా | = | గ్రహించవలయును. అనగా సామాన్య సుఖభోగముల కంటె జీవునకు ఆత్మ దర్శన ప్రాప్తి పొంది మహానంద పడును. ఈశ్వరుడు కూడా భక్తులు కోరిన కోర్కెలు తీర్చినందుకు ఆనంద పడును. |

*****

# తృతీయాధ్యాయము

## భక్తునికి ఉండవలసిన లక్షణములు - సాధన

**34. తస్యాః సాధనాని గాయంత్యాచార్యాః**

| | | |
|---|---|---|
| తస్యాః | = | ఆ భక్తి యొక్క |
| సాధనాని | = | సాధనలను |
| ఆచార్యాః | = | గురువులు |
| గాయంతి | = | ఈ క్రింది విధముగా చెప్పుదురు |

**35. తత్తు విషయత్యాగాత్ సంగత్యాగాత్ చ.**

| | | |
|---|---|---|
| తతః + తు | = | సంసారమందు ఇహలోక పరలోక సుఖ-భోగములందు అనాసక్తిగలిగిన పిమ్మట |
| విషయత్యాగాత్ | = | ఇంద్రియములు ఇంద్రియార్థముల నుంచి మరలించుటవలన |
| చ | = | మఱియు |
| సంగత్యాగాత్ | = | దుర్జన సాంగత్యమునుండి విడివడుట వలన |

అనగా దుర్జన సాంగత్యముండరాదు. ఇంద్రియములను విషయముల నుండి మరల్చవలయును

**36. అవ్యావృత భజనాత్.**

| | | |
|---|---|---|
| అవ్యావృత | = | ఎవ్వడు ధనపశుమిత్ర పుత్ర వనితపై తగులంబుమాని భగవంతుని అనఘుని విశ్వతోముఖుని అనన్యగతిన్ |
| భజనాత్ | = | భజన చేయుట వలన వాడు మృత్యువు నుండి తరించును |

**37. లోకేఽపి భగవద్గుణ శ్రవణకీర్తనాత్**

| | | |
|---|---|---|
| లోకే | = | లోకము నందు |
| భగవద్గుణ శ్రవణకీర్తనాత్ | = | భగవద్గుణములను శ్రవణముచేయుట కీర్తించుటవలన భక్తుడు తరించును. అనగా శ్రవణము కీర్తన చేయవలయును. |



### భాగవతుల (సత్పురుషుల) సాంగత్యము అపేక్షణీయము

**38. ముఖ్యతస్తు మహత్కృపయైవ భగవత్కృపాలేశాత్ వా**

| | | |
|---|---|---|
| మహత్కృపయా + ఏవ | = | భాగవతుల కృపవలన |
| చ | = | మఱియు |
| భగవత్కృపాలేశాత్ | = | భగవంతుని కృప వలన భక్తి కలుగును. |
| ముఖ్యతః + తు | = | భక్తికి భాగవత సేవ భగవత్కృప ముఖ్యము. అనగా భాగవతులసేవ, భగవత్ కృపవలన నిశ్చలభక్తి ఉదయించును. కావున వారిని సేవించవలయును. |

**39. మహత్సంగస్తు దుర్లభోఽగమ్యోఽమోఘశ్చ**

| | | |
|---|---|---|
| మహత్సంగః + తు | = | మహాపురుషుల సాంగత్యము |
| దుర్లభః | = | దుర్లభము |
| అగమ్యః +చ | = | సంసారులకు పొందరానిది |
| అమోఘః | = | వారి సాంగత్యము అమోఘము |

**40. లభ్యతేఽపి తత్కృపయైవ**

| | | |
|---|---|---|
| తత్+కృపయా+ఏవ+అపి | = | అట్టి మహా పురుషుల సాంగత్యము చేత భగవంతుని కృప చేత కూడా |
| లభ్యత్ | = | పొందబడును. |

### భగవత్ కృపవలన సజ్జన సాంగత్యము లభించును

**41. తస్మిన్ తజ్జనే భేదాభావాత్.**

| | | |
|---|---|---|
| తస్మిన్ + జనే | = | ఆ భక్తులయందు |
| తత్ | = | పరమాత్మ యందు |

భేద = భేదము

అభావత్ = లేనందువలన అనగా భక్తునికి భగవంతునికి భేదము లేదు.

**42. తదేవ సాధ్యతాం తదేవ సాధ్యతామ్**

తత్ + ఏవ + సాధ్యతాం + తత్ + ఏవ + సాధ్యతాం = భాగవతజనుల సంగమమే అపేక్షణీయము.

**దుర్జనుల సాంగత్యము కూడదు**

**43. దుస్సంగః సర్వథైవ త్యాజ్యః.**

దుస్సంగః = దుర్జన సాంగత్యము

సర్వత్ + ఏవ = సర్వవిధములా

త్యాజ్యః = విడువ వలయును. దుర్జన సాంగత్యము విడువవలయును

**44. కామక్రోధ మోహ స్మృతి భ్రంశ బుద్ధినాశ కారణత్వాత్.**

కామక్రోధ మోహ స్మృతి భ్రంశబుద్ధినాశ కారణత్వాత్ = దుర్జన సాంగత్యము వలన కామ, క్రోధములు, మోహములు, స్మృతి భ్రంశము, బుద్ధినాశములు కలుగుట వలన అట్టి దుర్జన సాంగత్యము వదల వలయును. ఈవిషయమునే భగవద్గీతలో శ్రీకృష్ణుడు విషయములను ధ్యానించుట వలన ఆ విషయములతో సంగమము ఏర్పడి బుద్ధి నాశనమగును అని చెప్పినాడు.

**45. తరంగాయితా అపీమే సంగాత్ సముద్రాయంతే.**

సంగాత్ = దుర్జన సాంగత్యమువలన

ఇమే + అపి = వీరు ఈ సాధకులు మంచివారయినా కూడ

సముద్రాయంతే + తరంగాయితా = సముద్ర కెరటములు ఉవ్వెత్తున ఎగసి ఓడను ముంచునట్లు సాధకుడు సర్వనాశ మును పొందును



**ఎవడు మాయను దాటి ఆత్మస్థానమును పొందును**

**46. కస్తరతి కస్తరతి మాయామ్ ? యః సంగం త్యజతి, యో మహానుభావం సేవతే, నిర్మమో భవతి**

మాయామ్ = ఈశ్వర మాయను

కః+ తరతి = ఏవడు దాటగలడు?

యః+ సంగం+ త్యజతి = ఎవడు దుర్జన సాంగత్యమును వదలునో

యః+మహానుభావం+సేవతే= ఎవడు సజ్జనులను సేవించునో వాడు ఈశ్వర మాయను దాటును. అతడు

నిర్మమః + భవతి = మోహరహితుడగును. నరుండు వృద్ధసం సేవం చేసి సంసార మోహంబు బాసి ఆత్మ స్థానము చేరును.

**47. యో వివిక్తస్థానం సేవతే యో లోకబంధమున్మూలయతి, (యో) నిస్త్రైగుణ్యోభవతి (యో) యోగక్షేమం త్యజతి.**

యః = ఎవడు

వివిక్త స్థానం = ఏకాంత ప్రదేశమున

సేవతే = ఉండునో

యః = ఎవడు

లోకబంధమ్ = భార్యా పుత్ర మిత్రాది సంసార తాపత్రయ ములను, సంసార బంధములను

ఉన్మూలయతి = సమూలముగా తొలగించుకొనునో

యః = ఎవడు

నిః త్రైగుణ్యాః + భవతి = త్రిగుణములను పూర్తిగా నశింపచేయునో

యః = ఎవడు తన

యోగక్షేమం = యోగక్షేమములను

త్యజతి = పట్టించుకొనడో అతడు ఆత్మ స్థానము చేరును.

**48. యః కర్మఫలం త్యజతి, కర్మాణి సంన్యస్యతి, తతో నిర్ద్వంద్వో భవతి.**

యః = ఎవడు

కర్మఫలం + త్యజతి = పుణ్యకర్మానుష్ఠానం చేసి కర్మఫల త్యాగము చేయునో

కర్మణి = ఎవడు ఇహలోకమున బంధ కారణములగు కర్మలను

సంన్యస్యతి = వదులునో

తతః = పిమ్మట

నిర్ ద్వంద్వః = ఎవడు ద్వంద్వాతీతుడో వాడు ఆనంద మయుడై జీవన్ముక్తుడై శాంతత్త్వము కలిగి

భవతి = ఉండును

**49. (యో) వేదానపి సంన్యస్యతి కేవలమవిచ్ఛిన్నానురాగం లభతే ॥**

వేదాన్ +అపి + సంన్యస్యతి = వేదములు అందు చెప్పబడిన నిత్య నైమిత్తిక ధర్మాచరణ చేయుచూ కర్మసంగి కాకుండా ఉండి పరిత్యక్త కర్మఫల స్వభావులు అయిన సర్వవర్ణాశ్రమవాసులు కూడ

కేవలమ్ + అవిచ్ఛన్న + అనురాగం + లభతే = అద్వితీయమైన అవిచ్ఛన్నమయిన ఆత్మ యొక్క ఆనందమును పొందుదురు.

**50. సతరతి సతరతి, సలోకాం స్తారయతి**

సః = పైనచెప్పిన లక్షణములుగల భక్తుడు

తరతి = సంసారసాగరమును తరియించును

సః + తరతి = అతడు సంసార సాగరమును తరియించును. శేముషీ తరణి సాంగత్యంబునన్ గాక దుర్మేధన్ దాటగ వచ్చునే ? అనగా దాటలేము.

సః = అట్టి భక్తుడు

లోకాన్ = ఇతరులను కూడ

తారయతి = సంసార సాగరమును దాటించును. అనగా ఇతరులను తరింపచేయును.

*****



# చతుర్థాధ్యాయమ్

## భక్తి ప్రేమ స్వరూపము - భక్తి లక్షణములు

**51. అనిర్వచనీయం ప్రేమస్వరూపమ్**

అనిర్వచనీయమ్ = భక్తి ఆంతరంగిక మగుటవలన అనిర్వచనీయము

ప్రేమస్వరూపమ్ = నిష్కళంక ప్రేమ స్వరూపము -హృదయగతము అనుభవైక వేద్యము

## భక్తి అనిర్వచనీయము

**52. మూకాస్వాదనవత్**

ఒక మధుర పదార్థమును

మూకా = మూగవాడు

ఆస్వాదనవత్ = ఆస్వాదించినదానివలె.

మూగవాడు తన అనుభవమును ప్రకటింప చేయలేక పోయినను, అతనికి ఆమధుర పదార్థము యొక్క రుచి స్వానుభవమేగదా. అటులనే భగవంతుని పై తనకు గల ప్రేమ బాహ్యముగా వ్యక్తీకరించ సాధ్యపడక పోయినా అతనికి అది అనుభవైక వేద్యము. ప్రేమ స్వానుభవము

## భక్తి - సహజముగా గలుగవలయును

**53. ప్రకాశ(శ్య)తే క్వాపి పాత్రే.**

క్వా = భక్తి ఏ భక్తి అయితే ప్రేమస్వరూపము, అనిర్వచనీయము అని చెప్పబడుచున్నదో అది లోకములో భార్యా పుత్రాదులందు

పాత్రే + అపి = కొందఱు మహానుభావులయందు, కారణము లేకుండాకూడ

ప్రకాశతే (ప్రకాశ్యతే) = ప్రకాశించుచున్నది (ప్రకాశింపబడుచున్నది)

భక్తిగలుగుటకు ప్రత్యేకించి ఇదమిత్థమ్ అనే కారణం అంటూ ఏది ఉండదు సహజంగానే గలుగుతుంది. ఆ ప్రేమసహజము.

### లోకములోని ప్రేమకు - ఈ ప్రేమకు గల తేడా

### భక్తి - గుణరహితం - కామనారహితం

**54. గుణరహితం కామనారహితం ప్రతిక్షణవర్ధమానం అవిచ్ఛిన్నం సూక్ష్మతరం అనుభవరూపమ్.**

| | | |
|---|---|---|
| గుణరహితం | = | త్రిగుణ రహితమైనదియు |
| కామనారహితం | = | కామనారహితమయినదియు |
| ప్రతిక్షణవర్ధమానం | = | భక్తి దిన దిన ప్రవర్ధమానంబగు చుండునదియు |
| అవిచ్ఛిన్నం + సూక్ష్మతరం | = | అవిభక్తము, సూక్ష్మాతి సూక్ష్మము అయిన |
| అనుభవరూపమ్ | = | అనుభవములో పొందదగినదియు అయిన జ్యోతి స్వరూపము అగు హృదయగత ఆత్మను భక్తిచే పొడగాంచెదరు. |

**55. తత్ ప్రాప్య తదేవావలోకయతి. తదేవ శృణోతి, (తదేవ భాషయతి), తదేవ చింతయతి.**

| | | |
|---|---|---|
| తత్ | = | ఆ బ్రహ్మ ప్రేమ స్వరూపమును |
| ప్రాప్య | = | పొంది దర్శించి |
| తత్ + ఏవ + శృణోతి | = | ఆత్మ గుఱించియే వినును |
| తత్+ఏవ+అవలోకయతి | = | సర్వత్ర ఆత్మనే దర్శించును. |
| తత్ + ఏవ+ భాషయతి | = | నిరంతరము ఆత్మనే భావించును. |
| తత్ + ఏవ+చింతయతి | = | నిరంతరము ఈశ్వరునినే చింతించును. |

దీనినే యోగములో ధారణ అని అందురు. ఆచార కాండలో శివలింగముపై ధారా పాత్రద్వారా నీరు పడునట్లుచేయుదురు. దీనికి ఉదాహరణగా శ్రవణ రంధ్రముల వలన ఏ శబ్దంబు వినబడునది హరిశబ్దమని ఆలకించు అని కంసుని పరముగా వర్ణించినారు.



### భక్తి - త్రివిధములు - భక్తులు చతుర్విధములు

**56. గౌణీత్రిధా, గుణభేదాత్ ఆర్తాదిభేదాద్వా.**

భక్తి గుణరహితమైన భక్తి అని, గుణ యుతమయిన భక్తి అని రెండు విధములు. మరల గుణయుతమైన భక్తి

| | | |
|---|---|---|
| గుణభేదాత్ | = | సత్త్వ, రజో, తమోగుణ భేదములవలన |
| గౌణీత్రిధా | = | సాత్త్విక భక్తి - రాజసిక భక్తి - తామసిక భక్తి అని మూడు తెఱుగులు |
| ఆర్తా + ఆది +భేదాత్ + వా | = | మఱియు ఆర్తుడు, జిజ్ఞాసువు, అర్థార్థీ. జ్ఞాని అని భక్తులు నాలుగు రకములు |

ఆర్తుడు .. -- గజేంద్రుడు; అర్థార్థీ - కుచేలుడు; జిజ్ఞాసి -- పరీక్షిత్తు; జ్ఞాని -- గోపికలు, కుంతి.

**57. ఉత్తరస్మా దుత్తజస్మాత్ పూర్వ పూర్వా శ్రేయాయ భవతి.**

| | | |
|---|---|---|
| పూర్వా | = | మూడు విధములయిన భక్తిలో |
| పూర్వః | = | మొదటిదయిన తామసిక భక్తి కంటె |
| ఉత్తరస్మాత్ | = | రాజసిక భక్తి దానికంటె |
| ఉత్తజస్మాత్ | = | సాత్త్వికభక్తి |
| శ్రేయాయ | = | శ్రేయస్సు కొఱకు |
| భవతి | = | అగును |

అనగా తామసిక భక్తి కంటె రాజసిక భక్తి దానికంటె సాత్త్విక భక్తి శ్రేయస్సును గలుగ చేయును. తామసిక భక్తి మఱియు రాజసిక భక్తి ప్రేయస్సును కలుగ చేయును. సాత్త్విక భక్తి శాంతిని కలుగ చేయును. గుణ రహిత భక్తి శ్రేయస్సును కలుగ చేయును.

### గుణరహిత భక్తి ప్రశంస

**58. అన్యస్మాత్ సౌలభ్యం భక్తౌ**

| | | |
|---|---|---|
| భక్తౌ | = | భక్తి యందు |
| అన్య | = | గుణరహితమైన భక్తి |
| సౌలభ్యం + స్యాత్ | = | శ్రేయస్కరమయినది |

**59. ప్రమాణాంతరస్యా నపేక్షత్వాత్ స్వయం ప్రమాణత్వాత్.**

త్రిగుణరహితమయిన భక్తి గొప్పదని చెప్పుటకు

| | | |
|---|---|---|
| స్వయం ప్రమాణత్వాత్ | = | స్వయం ప్రమాణ మగుటవలనను |
| నపేక్షత్వాత్ + ప్రమాణాంతరస్యా | = | దేనియందు అపేక్ష లేక పోవుటవలనను త్రిగుణరహిత భక్తి గొప్పది అని చెప్పుటకు ఇతర ప్రమాణముల యొక్క అవసరము లేదు. |

**60. శాంతిరూపాత్ పరమానందరూపాచ్చ.**

| | | |
|---|---|---|
| శాంతిరూపాత్ | = | త్రిగుణరహిత భక్తి వలన ఆత్మకు శాంతి గలుగును. ఆ విధముగా శాంతి గలుగుట వలన |
| పరమానంద రూపాత్+చ | = | ఆనందమయుండై పరమానందమును అనుభవించుట వలన గుణరహితస్థితి గొప్పదని అర్థమగును. |

**భక్తుడు - లక్షణములు**

**61. లోకహానౌ చింతా నకార్యా; నివేదితాత్మ లోకవేద (శీల) త్వాత్.**

| | | |
|---|---|---|
| లోకహానౌ | = | సుఖ దుఃఖముల గుఱించి భక్తుడు |
| చింతా + న + కార్యా | = | చింతింపడు. మఱియు అతడు |
| నివేదిత ఆత్మ | = | తన సర్వస్వము భగవంతునికే నివేదించును |
| లోక వేద శీల త్వాత్ | = | తన పరివారమును, వేదవిహిత ధర్మాచరణ వలన కలుగు తత్ఫలితమును శీలమువలన గలుగు కీర్తి ప్రతిష్ఠలను సరకు చేయడు. తనదంటూ ఏమీ లేక సర్వసంగ పరిత్యాగియై ద్వందాతీతుడై యుండును. |



**62. నతత్సిద్ధౌ లోకవ్యవహారో హేయః కింతుఫలత్యాగః తత్సాధనం చ (కార్యమేవ)**

| | | |
|---|---|---|
| తత్+ సిద్ధౌ | = | ఆత్మదర్శన ప్రాప్తికై జీవితమందు |
| లోక వ్యవహారః + హేయః + న | = | లోకవ్యవహారములు హేయములనితలచి వాటి యందు తగుల్కొనక తామరాకు యందలి నీటిబొట్టువలె జీవన యాత్ర సాగించును |
| కిం + తు + ఫలత్యాగః | = | అందఱిలాగానే జీవన యాత్ర సాగించుచూ అందఱూ ఎలా ఉందురో అలానే ఉంటూ కర్మ ఫలత్యాగముచేసి జయాపజయములు, మానావమానములు, సుఖ దుఃఖములనే ద్వందములకు అతీతుడుగా ఉండును |
| చ | = | మఱియు |
| తత్ + సాధనం + కార్యమేవ | = | సంసారంబు సుఖాత్మకంబని నిశ్చయింపక ఒండు మార్గంబున సిద్ధి గలదని తలంచి ఆ మార్గాన్వేషణములో ప్రయత్నించుటయే కర్తవ్యమని తలచి ఆ విధముగా ప్రయత్నించును. |

**భక్తునికి కూడని పనులు**

**63. స్త్రీధన నాస్తిక (వైరి) చరిత్రం న శ్రవణీయమ్**

| | | |
|---|---|---|
| స్త్రీ | = | స్త్రీలను గుఱించి |
| ధన | = | ధన సంపాదన మార్గముల గుఱించి |
| నాస్తిక | = | దైవము లేడని చెప్పువారి యొక్క మాటలు |
| చరిత్రం | = | దైవ సంబంధ కథలు కాని కథలు |
| న శ్రవణీయమ్ | = | వినకూడదు |

మనస్సును ప్రభావితం చేయు వానిలో చెవులు, కన్నులు ప్రధాన పాత్ర పోషించును. మనస్సు ప్రభావితం కాగానే ఇంద్రియార్థములపై ప్రసరించివాటి విషయములతో సంయోగము చెంది మనస్సు సుఖ దుఃఖములను పొందును. కావున మనస్సును ప్రభావితం చేయువాటిలో ముఖ్యమైనది స్త్రీ. జీవితమును ప్రభావితం చేసే వాటిలో ముఖ్యమైనది ధనము. ఇవి వ్యక్తిని పతనము గావించును. పుణ్య పాపములు లేవు, ఈశ్వరుడు లేడు అనే నాస్తిక వాదనవలన దుర్మార్గము పెచ్చు పెరుగును. సంఘములో అశాంతి తాండవించును. ఇటు వ్యక్తికి, అటు సంఘమునకు హాని గలిగించుటవలన యివి వినరాదు.

**భక్తుడు చేయవలసిన పని**

**64. అభిమాన దంభాదికం త్యాజ్యమ్.**

| | | |
|---|---|---|
| అభిమాన దంభాదికం | = | అభిమానము, దంభము, గర్వము, క్రోధము, పౌరుషము కఠినత్వము ఇవి అసుర సంపద వీటిని అనగా దుర్గుణ ములను |
| త్యాజ్యమ్ | = | త్యజింపవలయును. (అసుర సంపదను వదలవలయును) దైవ సంపదను అలవరచు కొనవలయును. సుగుణ ములను పెంపొందించు కొనవలయును |

**65. తదర్పితాఖిలాచారః సన్ కామక్రోధాభిమానాదికం, తస్మిన్నేవ కరణీయమ్.**

| | | |
|---|---|---|
| తత్ + అర్పిత + అఖిలాచారః సన్ | = | భగవంతుని యందు కులాచార, దేశాచారములు సర్వము సమర్పించి |
| తస్మిన్ | = | ఆ పరమాత్మలో |
| కామక్రోధాభిమానాదికం కరణీయమ్ | = | కామ, క్రోధ, అభిమానము మొదలయిన తమోగుణ రజోగుణములను సమర్పించ వలయును ఇట్టి విధానమును వైరాను బంధము అని అందురు. |



కామమున గోపికలు, భయమున కంసుడు, వైరము ద్వేషము అలుక వలన శిశుపాలాదులు, మాత్సర్యమువలన పౌండ్రక వాసుదేవుడు, బంధుత్వమున వృష్ణులు, స్నేహము ప్రేమ వలన ధర్మరాజాదులు సేవ వలన నారదుడు, చిత్తమును హరి పరాయత్తము గావించి తద్గతించెందిరి.

**నిశ్చలభక్తి**

**66. త్రిరూప భంగపూర్వకం నిత్యదాస్య నిత్యకాంతా భజనాత్మకం ప్రేమకార్యం ప్రేమైవ కార్యమ్.**

| | | |
|---|---|---|
| త్రిరూప భంగ పూర్వకం | = | తమోగుణ రజోగుణ సత్త్వగుణములనే మూడు గుణములు లేని త్రిగుణాతీతము అయినదియు, |
| నిత్యదాస్య నిత్యకాంతా భజనాత్మకం | = | అనుకూలవతి యైన భార్య తన భర్తను ప్రేమతో సేవించునట్లు పూజించునట్లు అయినదియు, |
| ప్రేమకార్యంప్రేమైవకార్యమ్ | = | ప్రేమస్వరూపమయినదియు ప్రేమయే స్వరూపముగా గలదియు అగు నిశ్చలభక్తి గలిగి యుండవలయును. నిశ్చల భక్తి లింగ దేహ నాశకంబు. |

*****

# పంచమోఽ ధ్యాయము

## ఏకాంత భక్తుడు

**67. భక్తా ఏకాంతినో ముఖ్యాః**

| | | |
|---|---|---|
| భక్తాః | = | భక్తులలో అనగా ఆర్తుడు, అర్థార్థి, జిజ్ఞాసువు, జ్ఞానీ అను ఈ నలుగురిలో |
| ఏకాంతినః | = | కామనారహితుడయిన జ్ఞాని ఏకాంత భక్తుడు |
| ముఖ్యాః | = | ముఖ్యుడు, శ్రేష్ఠుడు. |

భగవంతుడు ఏకాంత భక్తునికి అత్యంత ప్రియుడు. అర్థార్థిగా కుచేలునిని, ఆర్తునిగా గజేంద్రునిని, జిజ్ఞాసువుగా పరీక్షిన్నరేంద్రుని, జ్ఞానిగా అగ్నిద్యోతనుని ఏకాంత భక్తునిగా ఉద్ధవునిని భాగవతములో కథలుగా వ్యాసభగవానుడు చిత్రీకరించినాడు.

**68. కంఠావరోధరోమాశ్రుభిః పరస్పరం లపమానాఽ పావయన్తి కులాని పృథివీంచ**

**69. తన్మయా**

| | | |
|---|---|---|
| కంఠావరోధ రోమాః చ అశ్రుభిః | = | భక్తుడు ఆత్మ దర్శన ప్రాప్తిని పొంది ఆ ఆనందములో ఉబ్బితబ్బిబై గద్గద కంఠుడగుచు పులకించి ఆనంద బాష్పములు గలిగి ఉండును. ఇది భక్తుని స్థితి. |
| తన్మయా | = | తన్మయుడై ఉండును. |
| పరస్పరం లపమానా కులాని చ పృథివీమ్ అపావయన్తి | = | భక్తుడు భగవంతుని, భగవంతుడు భక్తుని పరస్పరము పొంది వారు ఈ లోకమున వారి కులమును పవిత్రముగా చేయుదురు. |

**70. తీర్థీ కుర్వన్తి తీర్థాని, సుకర్మీ కుర్వన్తికర్మాణి, సచ్ఛాస్త్రీ కుర్వన్తి శాస్త్రాణి.**

| | | |
|---|---|---|
| తీర్థాని | = | తీర్థములను |
| తీర్థీ | = | వారునివసించు ప్రదేశములను తీర్థములుగా |
| కుర్వన్తి | = | చేయుదురు |
| కర్మాణి | = | కర్మలను |
| సుకర్మీ | = | నిష్కామముగా ఆచరించి సుకర్మలుగా |
| కుర్వన్తి | = | చేయుదురు |
| శాస్త్రాణి | = | వేద వేదాంగాది శాస్త్రములను |
| సత్ + శాస్త్రీ + కుర్వన్తి | = | చదివి అర్థములను గ్రహించి, ఆచరించి వాటికి ప్రామాణికత్వమును, ఋజువు చేయుదురు. |

భక్తులు తీర్థములకు, కర్మలకు, వేద వేదాంగములకు వారి ఆచరణవలన వాటి ఔన్నత్యమును పెంపొందింప చేయుదురు. ధర్మరాజు విదురునితో

**...."మీవంటి భాగవతులు**

**తీర్థసంఘంబుల ధిక్కరింతురుగదా మీయందు విష్ణుండు మెఱయుకతన**

**మీరు తీర్థంబులు; మీకంటె మిక్కిలి తీర్థంబులున్నవె తెలిసిచూడ వేఱు తీర్థంబు లవనిపై వెదకనేల**

**మిమ్ముఁ బొడగని భాషించు మేల చాలు**"- అని అనును.

(భాగవతము ప్రథమస్కంధము, 301)

**71. మోదన్తే పితరో, నృత్యన్తి దేవతాః సనాధా చేయం భూర్భవతి.**

| | | |
|---|---|---|
| పితరః | = | పితృదేవతలు |
| మోదన్తే | = | మోదింతురు |
| దేవతాః | = | దేవతలు |
| నృత్యన్తి | = | ఆనందమున ఉబ్బి గంతులు వేయుదురు. అప్సరసలు నాట్యమాడుదురు |

| | | |
|---|---|---|
| చ | = | మఱియు |
| ఇయం + భూః | = | ఈ భూమి |
| సనాధా | = | నాధుడుగలది |
| భవతి | = | అగును. |

**అష్ట మదము లుండవు**

**72. నాస్తి తేషు జాతి విద్యారూప కుల ధన క్రియాది భేదః.**

| | | |
|---|---|---|
| తేషు | = | భక్తులయందు |
| జాతి, విద్యా, రూప, కుల, ధన క్రియాది భేదః | = | వయో రూప కర్మ జన్మ, విద్యా, ఐశ్వర్య, విత్తములనే అష్ట మదములు |
| న + అస్తి | = | ఉండవు. |

**73. యతస్తదీయా.**

| | | |
|---|---|---|
| యతః | = | ఎందువలన అనగా అష్టమదములు లేని వారగుటవలన భక్తులు |
| తదీయా | = | ఆత్మతో సమానులే |

బలి చక్రవర్తి యందు అష్టమదములు లేనందున శ్రీమహా విష్ణువు బలి చక్రవర్తి వాకిట ఉండెను.

**74. వాదో నావలంబ్యః**

**భక్తులు**

| | | |
|---|---|---|
| వాదః | = | వాదమును |
| న + అవలంబ్యః | = | అవలంబించరు |

వాదము రజోగుణమువలన జనియించును. రజోగుణలక్షణమయిన వాదమువలన మానసిక అశాంతి గలుగును. కావున వాదము చేయరు. ఆత్మ పరంబులు గాని శాస్త్రంబులు తర్కింపక యెందును బక్షీకరింపక - శిష్యులకు గ్రంథంబులు వంచించి యుపన్యసింపక ఉందురు.



**75. బాహుళ్యావకాశత్వాత్ అనియతత్వాశ్చ.**

| | | |
|---|---|---|
| అనియతత్వాః + చ | = | ఆత్మ నిత్యుండు, శుద్ధుండు,అవ్యయుడు, పరిపూర్ణుడు, స్వప్రకాశకుడు, ఒక్కండు, నిస్సంగుడు, సృష్టిహేతువు, క్షేత్రజ్ఞుండు మొదలయిన లక్షణములు గలిగి యుండుట; మఱియు |
| బాహుళ్యావకాశత్వాత్ | = | ఒక్కటిగా యున్న ఆత్మ సృష్టిలో స్థావర జంగమాత్మకమయిన విశ్వమును సృజియించి బహుభంగుల ఆ జీవరాసు లలో అంతర్యామిగా వసియించుటవలన భక్తుడు సర్వభూత సమదర్శనుడు. |

**76. భక్తి శాస్త్రాణి మననీయాని త(దు) ద్భోధక కర్మాణి కరణీయాని.**

| | | |
|---|---|---|
| భక్తి శాస్త్రాణి | = | భక్తిని బోధించు వేదాది శాస్త్రములను భక్తుల కథలను శ్రద్ధగా |
| మననీయాని | = | విని మననము చేయవలయును. |

ఈ కథలు కర్మనిర్మూలన హేతువులు. జీవుడు మోహంబువలన బాసి వర్తించు. సర్వపాప పరిత్యాగము చేయును. సంసార జలధిలో కర్మవాంఛలనే బాధ పొందువారికి విష్ణు గుణ వర్ణనములయిన భక్తి శాస్త్రములు తెప్పవంటివి

| | | |
|---|---|---|
| తత్ | = | ఆ శాస్త్రములు |
| ఉద్భోధక కర్మాణి | = | శ్రద్ధగావిని మననము చేసి ఆ శాస్త్రములలో చెప్పిన విధముగా ఆ భక్తులు ఆచరించి నట్లు |
| కరణీయాని | = | ఆచరించవలయును |

ఇవే అవతారములుగా వర్ణించుదురు. శ్రీరామ, శ్రీకృష్ణ అవతారాది కథలు శ్రద్ధగా విని చదివి, మననము చేసి అందలి ఆధ్యాత్మిక రహస్యము గ్రహించి, వారివలె ఆచరించవలయును.

**77. సుఖదుఃఖేచ్ఛాలాభాది త్యక్తే కాలే ప్రతీ(క్ష్య) క్షమాణే క్షణార్థమపి వ్యర్థం న నేయమ్**

| | | |
|---|---|---|
| సుఖ దుఃఖ | = | సుఖ దుఃఖములు మొదలయిన ద్వంద ములు |
| ఇచ్ఛాలాభాది | = | కోరిక, స్వంతలాభము, సంసార తాపత్ర యములు, భోగములు ఇహలోక పరలోక భోగముల యందు ఆసక్తి, దేహధ్యాస, అరిషడ్వర్గములు, ఈషణ త్రయములు మొదలయినవి |
| త్యక్తే | = | పరిత్యజించి అనగా ప్రకృతిని వీడి జీవన్ముక్తుడై , ఆనందమయుండై |
| కాలే ప్రతీక్ష్యమాణే | = | కాలమునకు ఎదురుచూచుచు |
| క్షణార్థమ్ + అపి | = | ప్రతిక్షణము కూడ |
| వ్యర్థం | = | వ్యర్థముగా |
| న + నేయమ్ | = | గడపరాదు, ఆ విధముగా నిరంతర ధ్యానముతో దేహమును విడువ వలయును |

**78. అహింసా సత్య శౌచ దయాస్తిక్యాది చారిత్ర్యాణి పరిపాలనీయాణి.**

| | | |
|---|---|---|
| అహింసా సత్య శౌచ దయ | = | అహింస, సత్యము, శౌచము, దయ, |
| ఆస్తిక్య ఆది చరిత్రాణి | | ఆస్తిక్యము మొదలయిన సద్గుణములు |
| సచ్చరిత్ర పరిపాలనీయాణి | | గలిగి ఉండవలయును. దైవీ సంపద గలిగి ఉండవలయును. |

**79. సర్వదా సర్వభావేన నిశ్చింతైః (చితైః) భగవా నేవ భజనీయః**

| | | |
|---|---|---|
| నిశ్చింతైః | = | నిశ్చింత చేత యోగ క్షేమములు గురించి ఆలోచింపక |
| సర్వదా | = | నిరంతరము |
| సర్వభావేన | = | సర్వభావముల చేత |
| భగవాన్ + ఏవ | = | భగవంతునినే |
| భజనీయః | = | భజియింపవలయును |



గోపికలు సర్వభావములు అనగా ... పతి పుత్త్రాదిక నామమూర్తి వగుచున్ భాసిల్లు నీయందు అనుచు శ్రీకృష్ణుని భజించిరి.

బ్రహ్మ శ్రీకృష్ణుని తో

శా॥ ఏలా బ్రహ్మ పదంబు? వేదములకున్ నీక్షింపఁగా రాని ని
న్నీలోకంబున నీవనాంతరమునం దీమందలోఁ గృష్ణ యం
చాలాపాది సమస్త భావములు నీ యందే సమర్పించు నీ
వ్రేలం దొక్కని పాదరేణువులు పై వేష్టించినం జాలదే ?

(భాగవతము, దశమస్కంధము, 572 )

**80. స కీర్తనీయః (కీర్త్యమానః) శీఘ్రమేవావిర్భవ త్యనుభావయతి (చ) భక్తాన్.**

| | | |
|---|---|---|
| సః + కీర్తనీయః | = | భగవంతుడు కీర్తనీయుడు. అలా నిరంతర కీర్తన చేయువారికి |
| చ | = | మఱియు |
| శీఘ్రమ్ + ఏవ + ఆవిర్భవతి | = | సుఖ దుఃఖాది సహిష్ణత గలిగి - ద్వందాతీతుడై నిరంతర నామస్మరణ చేయువారికి శీఘ్రముగా హృదయ గుహలో గల జ్యోతి చుట్టూ కప్పివేసిన అవిద్య పొరలు తొలగి ఆత్మదర్శన ప్రాప్తి |
| అనుభావయతి | = | ఆత్మాను భూతి గలుగును. |
| భక్తాన్ | = | భక్తులను భగవంతుడు రక్షించును. |

**81. త్రి సత్యస్య భక్తి రేవ గరీయసీ, భక్తిరేవ గరీయసీ॥**

| | | |
|---|---|---|
| భక్తిః + ఏవ | = | భక్తియే |
| గరీయసి | = | ఉత్కృష్టమైనది |
| భక్తి : + ఏవ + గరీయసి | = | భక్తియే గొప్పది |
| త్రి + సత్యస్య | = | ముమ్మాటికి సత్యము యొక్క స్వరూపము అయిన భక్తి గొప్పది. |

**82. గుణమాహాత్మ్యాసక్తి, రూపాసక్తి, పూజాసక్తి, స్మరణాసక్తి, దాస్యాసక్తి, సఖ్యాసక్తి, వాత్సల్యాసక్తి, కాంతాసక్తి, ఆత్మనివేదనాసక్తి, తన్మయతాసక్తి, పరమవిరహాసక్తి, రూపా ఏకధా అపి ఏకాదశధా భవతి.**

| | | |
|---|---|---|
| గుణమాహాత్మ్య +ఆసక్తి | = | ఈశ్వర కథలు వినాలనే ఆసక్తి, శ్రవణాసక్తి సంకీర్తనయందాసక్తి |
| రూపాసక్తి | = | "**త్రిజగన్మోహన నీలకాంతి తనువుద్దీపింప, బ్రాభాతనీరజబంధు ప్రభమైన చేలము పయిన్ రంజిల్ల నీలాలక వ్రజ సంయుక్త ముఖారవింద మతి సేవ్యంబై విజృంభింప**" అలా ఆమోహనరూపము చూడాలనే ఆసక్తి. (తను హృద్భాషల ఆసక్తి) |
| పూజాసక్తి | = | మనోనిగ్రహము శాంతత్వము నియత పరిభాషణ, సమహితారము, మితాహారము గలిగి మనోవాక్కాయ కర్మంబుల చేత మనోగతంబగునట్లుగా భక్తి యుక్తంబయిన భావనతో భగవంతుని అర్చించాలనే ఆసక్తి. (వందన అర్చనముల్) |
| స్మరణాసక్తి | = | నిరంతర స్మరణయందు ఆసక్తి. (చింతనాసక్తి ) |
| దాస్యాసక్తి | = | భగవంతుని ఏ జంఝాటములేక సేవించాలనే ఆసక్తి . (దాసత్వము) |
| సఖ్యాసక్తి | = | జీవునికి ఈశ్వరుడు పూర్వ సఖుడు - అట్టి ప్రియమిత్రుని మఱచి సంసారకూపంలో తిరుగుచున్నాడు. ఈ సంసారమునుండి విడివడి తన పూర్వమిత్రునితో జత కట్టాలనే ఆసక్తి. (సఖ్యము గలిగి యుండుట.) |
| వాత్సల్యాసక్తి | = | భగవంతుడు కొడుకుగా తను తండ్రిగా భావించి భగవంతునిపై వాత్సల్యము గలిగిన ఆసక్తి |



| | | |
|---|---|---|
| కాంతాసక్తి | = | భార్యకు భర్తయందు ఉండు అనురాగము వలె - ప్రియభావనతో సేవించాలనే ఆసక్తి. (సేవయు. ) |
| ఆత్మనివేదనాసక్తి | = | ఆత్మనివేదన యందు ఆసక్తి. (ఆత్మనివేదనాసక్తి ఆత్మలో నెఱుకయున్.) |
| తన్మయతాసక్తి | = | తన్మయుడయి ఉండాలనే ఆసక్తి |
| పరమవిరహాసక్తి | = | గొప్పవిరహావేదన యందు ఆసక్తి |
| ఏకదా | = | ఇలా భక్తి ఒక్కొక్కప్పుడు |
| ఏకదశధా+అపి | = | పదునొకండు విధములుగా ఆచరణలో కన్పట్టినను కూడ |
| భవతి | = | భక్తునియొక్క స్థితి ఒక్కటే. |

తను హృద్భాషల సఖ్యమున్, శ్రవణమున్ , దాసత్వమున్, వందనార్చనముల్ , సేవయు, నాత్మలో నెఱుకయున్, సంకీర్తనల్, చింతనము అని భక్తిని తొమ్మిది విధములుగా ప్రహ్లాదుడు చెప్పినాడు. (భాగవతము సప్తముస్కందము, 167)

| | ప్రహ్లాదుడు చెప్పినవి | | నారద మహర్షి చెప్పినవి |
|---|---|---|---|
| 1. | తనుహృత్ భాషల | - | వాత్సల్యాసక్తి, పరమవిరహాసక్తి , తన్మయతాసక్తి |
| 2. | సఖ్యమున్ | - | సఖ్యాసక్తి |
| 3. | శ్రవణమున్ | - | గుణమహాత్మ్యాసక్తి |
| 4. | దాసత్వమున్ | - | దాస్యాసక్తి |
| 5. | వందన అర్చనముల్ | - | పూజాసక్తి - రూపాసక్తి |
| 6. | సేవయు | - | కాంతాసక్తి |
| 7. | ఆత్మలో నెఱుకయున్ | - | ఆత్మనివేదనాసక్తి |
| 8. | సంకీర్తనల్ | - | స్మరణాసక్తి |
| 9. | చింతనయు | | |

విరహాసక్తికి ఉదాహరణగా గోపికల విరహవేదనను, తన్మయతాసక్తికి ఉదాహరణగా పూతనయై **యొక్క పాలతి చరింపగ శౌరియై యొక కాంత చన్నుగుడుచె-** అనియు, మిగిలినవాటికి గోపికలు కృష్ణునితో తిరిగి కృష్ణుని పొందిన విధముగా గోపికలను చిత్రీకరించినారు. గోపికల కథలో ఈ 11 విధములు కనిపించును. అందుకే భక్తికి ఉదాహరణ వ్రజగోపికలు.

**83. ఇత్యేవం వదంతి జనజల్పనిర్భయాః ఏకమతాః కుమార వ్యాస శుక శాండిల్య గర్గ విష్ణు కౌండిన్య శేషోద్ధవారుణి బలి హనుమద్ విభీషణాదయో భక్త్యాచార్యాః**

నారదుడు అతని సమకాలికులు తదనంతరకాలమున వచ్చిన ఆచార్యులందఱు భక్తి గుఱించి నారదుడు చెప్పిన దానినే చెప్పిరి అని గురువు శిష్యులకు బోధించుచున్నాడు.

| | | |
|---|---|---|
| జన + జల్ప | = | జనులు మాటలాడే పొల్లుమాటలుగాక |
| నిర్భయాః + ఏకమతాః | = | నిర్భయముగా ఏకాభిప్రాయమును విష్ణువు, ఆది శేషువు, సనకసనందనాదులు, నారదుడు, శాండిల్య,కౌండిన్యబలివారుణి, హనుమంతుడు, విభీషణుడు,వ్యాసుడు, శుకుడు,గర్గిమొదలయినవారు భక్తి గుఱించి ఈవిధముగనే చెప్పిరి. |

**84. య ఇదం నారద ప్రోక్తం శివానుశాసనం విశ్వసితి శ్రద్ధత్తే, సభక్తిమాన్ భవతి సఃప్రేష్ఠం లభతే, సఃప్రేష్ఠం లభతే**

| | | |
|---|---|---|
| యః | = | ఎవడు |
| ఇదం | = | ఈ |
| శివాను శాసనం | = | మంగళకరుడయిన హంసావతారమున భగవంతుడు చెప్పినదియుఅగు భక్తి విషయములను. |
| విశ్వసితి శ్రద్ధత్తే | = | విని, మననము చేసి ఆత్మదర్శన ప్రాప్తికి యిది ముఖ్యసాధనమని విశ్వసించి శ్రద్ధగా ఆచరించునో |
| సః | = | అతడు |
| భక్తిమాన్ + భవతి | = | భక్తుడు ఆత్మదర్శన ప్రాప్తిని పొందును |
| సః ప్రేష్ఠం లభతే | = | అతడు ఆత్యంత ప్రియమైన దానిని పొందును. |



# భగవద్గీతలో భక్తి

భగవంతునిని సాకారముగా ఉపాసించు భక్తుడు విశిష్ఠుడా లేక నిరాకారముగా ఉపాసించు యోగి గొప్పవాడా?

ఈ రెండు పద్ధతులు విశిష్ఠమైనవే. ఐతే యోగములో నిరాకారముగా ఆత్మను ఉపాసించుట అనే సాధన ప్రారంభ సాధకులకు కష్టము. యోగి అయినా భక్తుడయినా ఆత్మ స్థానమునకు చేరును. రెండింటియందును పాటింప వలసిన పద్ధతులు:-

సమస్త కర్మలు, ఆ కర్మ ఫలితములు భగవంతునికి సమర్పించ వలయును. ఈశ్వరార్పణముగా కర్మలు చేయుచు కర్మ ఫల త్యాగము చేయవలయును. జ్ఞానేంద్రియములను వశము చేసికొని వాటిని విషయముల నుంచి మరలించవలయును. విషయ త్యాగము వలన శాంతి కలుగును. మనస్సును అభ్యాసము ద్వారా నిశ్చలము చేసి చిత్త శుద్ధి కలిగి మనో బుద్ధులను సంయోగము చేసి నిరంతర నామస్మరణ చేయుచు నిశ్చలముగా ధ్యానించ వలయును. ఈవిధమైన ఆచరణ వలన సాధకుడు మృత్యువును దాటును. అనగా అమృతత్త్వమును పొందును.

**భక్తుని లక్షణములు:-** మైత్రి, కరుణ, క్షమ, నిత్య సంతోషము, శుచిత్వము, ఉదాసీనత, దక్షత్వము కలిగి దైవీ సంపద కలిగి ముని వలె ఉండును. అహంకార మమకారములు లేకుండా దేనియందు ఆపేక్ష లేకుండా, ఏదీ కోరక, తన యోగక్షేమముల గుఱించి పట్టించుకొనక, శుభాశుభములను పరిత్యజించి అసుర సంపద లేకుండా ఉండును. సంగ వర్జితుడై గృహదారాదుల యందు తామరాకుపై నీటి బొట్టువలె ఉండును. మానావమానములు, శీతోష్ణములు, సుఖదుఃఖములు, నిందాస్తుతులు, శత్రు మిత్రులయందు సమభావన కలిగి ద్వందాతీతుడై ఉండును. ధృఢ నిశ్చయము గలవాడై భగవంతునియందే మనోబుద్ధులు కలవాడై స్థిరమతియై ఉండును. సర్వ భూతములను తన వలె చూచుట వలన ప్రాణులు ఇతనిని చూచి భయపడవు. అటులనే సర్వమూ తనే అగుట వలన ఆ ప్రాణులను చూచి ఇతడు భయపడడు.

# భాగవతంలో భక్తి

భక్తి యోగంబుననేని, యోగంబుననేని పురుషుండు పరమాత్మంబొందు. జ్ఞాన యోగంబును భక్తి యోగంబునునను రెండుయు ఒకటియే.

**భక్తి ఎలా గలుగుతుంది?** ఈశ్వరుని యందు చేయంబడు కర్మంబు విజ్ఞాన హేతుకంబై ఈశ్వర సంతోషంబును భక్తి యోగంబును పుట్టించు. భాగవతులసేవ, శాస్త్రవిచారణ వలన నిశ్చలభక్తి ఉదయించును. సత్ సంగంబువలన భగవంతుని కథా ప్రసంగంబులు గలుగును. తద్వారా శ్రద్ధాభక్తులుదయించును. భాగవతసేవ విశేషంబున నిశ్చలభక్తి ఉదయించును.

**భక్తి వేటిని గలుగచేయును?** నిర్విఘ్నయు నిర్హేతుకమయిన భక్తి యోగంబు వైరాగ్య విజ్ఞానంబుల పుట్టించు. భక్తి యోగంబు బ్రహ్మసాక్షాత్కార సాధనంబులగు వైరాగ్య జ్ఞానంబుల చేయు. వాసుదేవుని యందు ప్రయోగింపబడిన భక్తి యోగంబు వైరాగ్య విజ్ఞానంబుల పుట్టించు. హరివార్తలు తెలుసుకునేవారికి, హరిపదములు తలచువారికి, హరికథలు వినేవారికి మరణ సమయములో కూడ మోహ సంభ్రమము లుండవు.

**భక్తి ఎన్ని తెఱంగులు?** జనుల యొక్క సంకల్పమును బట్టి భక్తి తామస, రాజస, సాత్త్విక భేదంబులు త్రివిధంబైయుండు.

| | | |
|---|---|---|
| కామమున | - | గోపికలు |
| భయమున | - | కంసుడు |
| వైరము - ద్వేషము-అలుకన | - | శిశుపాలాదులు |
| స్నేహము -ప్రేమ | - | ధర్మరాజాదులు |
| సేవ | - | నారదుడు |
| బంధుత్వము | - | వృష్ణులు |

చిత్తము హరి పరాయత్తంబు గావించి తద్గతించెందిరి. వేనునికి వీటిలో ఏ ఒక్కటి లేదుగావున నశించిపోయినాడు. భక్తి తోడ సేవించుట కంటె వైరమున భగవంతునికి వేగమున చేరగవచ్చు.



**భక్తిగొప్పది :** యోగిజనులు భక్తి మార్గంబునకు యితరమార్గంబులు సరిగావందురు. వంశము, తేజము, శ్రుతము, సౌందర్యము, ఉద్యోగము, నిపుణత్వము, ప్రతాపపౌరుషములు, నిష్ఠాబల ప్రజ్ఞలు, జపహోమములు భగవంతుని సంతుష్టికి చాలవు. భక్తి చేయవలయును. సంసార ప్రతిష్టుండైన వానికి తపోయోగాదులయిన మోక్షమార్గములు పెక్కులుగలవు. అందు భక్తి మార్గంబు కంటె సులభము లేదు. జీవుడు త్రిగుణత్వాభిమానంబున కర్తయు, భోక్తయునను ననర్థంబు నొందు. ఈ అనర్థంబునకు నారాయణ భక్తి యోగమునంగాని యుపశమనము వేఱొకటిలేదు. హరి భక్తి పురుషులకు పరమధర్మము.

భక్తి యోగము సాలోక్య సామీప్య సారూప్యసాయుజ్యంబులకు సాధనంబు. భక్తికి దృష్ట శ్రుత ప్రపంచార్థంబు ఫలంబుకాదు. భక్తివలన కర్మ నిర్మూలన జరుగును. వివేకవంతులు అహంకార నిబద్ధంబైన కర్మను భక్తి వలన త్రుంచివైతురు. మాయను దాటుదురు. ఇతరములు మాని మదినమ్మి భజించువారిని భగవంతుడు కరుణించు. వారు విష్ణు మాయను దాటుదురు. భక్తి వలన అవిద్య నశించును. నారాయణ భక్తి పరాయణత్వంబున జనిన వారు బ్రహ్మాండంబు భేదించి వైష్ణవ పదారూఢులయి తేజరిల్లుదురు. విరక్తుండగువాడు నిరంతర భావంబున భక్తి యోగంబునంచేసి మోక్షంబు కొఱకు ఈశ్వరుని భజియించు. జ్ఞాన వైరాగ్యంబుల తోడంగూడిన భక్తి చేత తత్పరులైన పెద్దలు క్షేత్రజ్ఞుండైన ఆత్మయందు పరమాత్మం బొడగందురు. భగవత్ భక్తి మోక్షప్రదంబగు. అచ్చపు భక్తిని మోక్షప్రాప్తి చేకూరును. భక్తి చేత దోషములు అడంతురు. భక్తి మార్గంబున యున్నవారు సుఖానంద పరిపూర్ణులై అభివృద్ధి పొందుదురు. దేహత్యాగసమయమున బ్రహ్మాది దేవతా భజనంబున చనువారు బ్రహ్మ జీవిత కాలమెల్ల బ్రహ్మలోకమున వసియించి చివరకు ముక్తులగుదురు. ధన, పశు, మిత్ర వనితాతతితో సంబంధము మాని ఈశ్వరుని భజియించు వానిని మృత్యురూప భవనీరధిని భగవంతుడు తరింపచేయును. ఏకాంతమతి యైన తత్త్వవిదుడు అన్యంబుల కోరడు. తపస్సు, దాన, ధర్మాది కర్మలచే పొందు ఫలము భక్తి యోగమువలన పొందుదురు. సమిధలను అగ్ని భస్మము చేయునటుల భక్తి పాపములను దహించును. హృదయ గ్రంథి విడిపోవును. భక్తి హీనంబులయిన (లౌకిక) జ్ఞానము, వాక్కు, కర్మ కౌశలంబులు నిరర్థకములు.

నిరుపాధికంబైన జ్ఞానంబు హరి భక్తి లేకున్న విశేషంబుగ శోభితంబుకాదు.

భక్తుని లక్షణములు :- బ్రహ్మవిష్ణు శివులయందు వేఱు సేయకుండువాడు కృతార్థుండు. అనగా శివ-కేశవులయందు భేదభావన ఉండరాదు.

వస్త్రధారణ : వల్కలాదులు ధారణ సేయును.

ధర్మాచరణ : తమ జాతి ఆశ్రమ ధర్మములను పాటించును. నిష్కామముతో పుణ్య కర్మలు చేయును. గురువులను పెద్దలను సేవించును.

కర్మేంద్రియములు :-

నోరు : సత్య వాక్కు,వేద శాస్త్రాది అధ్యయనము, ఆవిధమైన ఆచరణ భగవత్కథా ప్రసంగము కలిగి దేవతాంతరనింద సేయక ఉండును. మౌనమును పాటించును.

చేతులు : అహింస కలిగియుండును.

గుహ్యము : విహిత కాలమున బ్రహ్మ చర్యము కలిగి ఉండును.

జ్ఞానేంద్రియములు:

చెవులు : భగవంతుని కథలు వినుట.

కన్నులు : భగవంతుని తప్ప ఇతర దర్శన వర్జనము. అనగా కర్మేంద్రియ జ్ఞానేంద్రియములను భగవత్పరముగా పనిచేయించి త్రికరణ శుద్ధి కలిగి ఉండును.

అంతఃకరణము : జ్ఞానేంద్రియములు వాటి విషయములతో మనస్సు కలియకుండునట్లు చేసి మనో చాంచల్యము లేకుండా మంచి బుద్ధి కలిగి అహంకారము లేకుండా ఉండును.

గుణములు :- యదృచ్ఛాలాభ సంతుష్టి కలిగి పరమ శాంతత్వము, సుఖ దుఃఖాది ద్వంద సహిష్ణత, భూత దయ, వినయ సంపత్తి, శ్రద్ధ, క్షమ కలిగి ఉండును. ముముక్షత్వము కలిగి ద్వందాతీత స్థితి కలిగి ఉండును.

ఆచరణ : పెద్దల సేవ చేయును. గృహారామ, క్షేత్ర, కళత్ర విత్తాదులయందు ఉదాసీనత కలిగి భగవంతునియందు పూజాదికములు కలిగి సాధనలో విఘ్నములు కలిగిననూ భక్తి మార్గమును విడువక ఉండును. శరీరమునకు కరచరణాదులు వేఱుగా తలంపని చందంబున ఆత్మకు భూతజాలములను భిన్నముగా చూడడు. శత్రు మిత్ర వివేకంబు లేక సమచిత్తులు. సకలభూతదయాపరులు. క్రోధరహితులు.



శాంతులు. సాధులు. తమ దేహగృహ మిత్ర దారాత్మజాదులందు ప్రీతిలేక యుందురు. ఇతరులు పొడిచిన తిట్టిన కొట్టినను పరమభాగవతులు యితరులకు హాని చేయరు. ఆత్మకు సుఖ దుఃఖములు లేవని తెలియుటవలన సాధువులు పరుల వలన మేలుకీడుగలిగినను చెలగరు, ఆందోళన చెందరు.

**భక్తి యోగంబున ముక్తి సంభవించుట ఎట్లు ?**

జీవుడు ప్రకృతి పురుష అతీతంబైన బ్రహ్మ స్వరూపమునందు మహితధ్యాన నిష్ఠుండగు అప్పుడు విగత మోహుండై అహంకార మమకారాత్మకంబైన సంస్మరణములు తొలగి ముక్తుండై యుండు.

**ఆచారకాండలో వివిధ పద్ధతులు**

**1. దాసత్వము (సేవ)**

**భాగవతసేవ :-** భాగవత సేవ వలన బహు సౌఖ్యములు పొందుదురు. నరుండు వృద్ధసంసేవంచేసి సంసారమోహంబు బాసి పుండరీకాక్షుని పూజించుచు పరలోకంబునొందు. భగవత్ భక్తినుపదేశంచు మహాత్ములకు ధనకనక వస్తువాహనాదులు కాక హృదయపూర్వకముగా వారి పాదములకు నమస్కరించ వలయును.

**భగవత్ సేవ :-** భగవంతుని సేవ సంసార సంతాప వినాశని. భగవంతుని సేవచే తప్ప అన్యసేవ వలన కైవల్యము గాని, గౌరవముగాని గలుగదు. సంసార బంధమువీడదు. భగవత్ సేవ లింగదేహ నాశకంబు. హరి సేవకుండయినవాడు జననంబు నొందియు నన్యుని క్రియ సంసారములో చిక్కుకొనడు. హరిసేవ విడువందగదు. దానంచేసి యూర్ధ్వంబున బ్రహ్మ పర్యంతంబు, క్రింద స్థావర పర్యంతము దిరుగుచున్న జీవులకు నెయ్యది పొందరాదట్టిమేలు సిద్ధించు. అనగా జన్మ రాహిత్యము కలుగును. భక్తుడు భక్తిరసమున వశీకృతుండై భగవంతుని విడువడు. భగవత్ సేవ వలన ఆత్మ శాంతి వహించును. భగవత్ సేవల బహు సౌభాగ్యంబులు కలుగును. కేవలము శాస్త్రములు ప్రపంచింపక కేవల భక్తి జ్ఞాన యోగమున సేవించి వేద విహిత కర్మాచారములు గలిగి సకల పదార్థ పరిజ్ఞాన తత్త్వపరీణమగుచు పరమపదము కొఱకు యోగులు విజ్ఞాన వైరాగ్య కలితమైన భక్తి యోగంబునన్ చేసి భగవంతుని సేవ చేయుచుందురు. మహాత్ములగువారు

నిజమనోరథ ఫలదాయకములయిన భగవత్ సేవ విరహితంబులయిన యితర కర్మంబు లాచరింపనొల్లరు. ఇదే ఆత్యంతిక భక్తియోగం. సర్వభూతముల మానసంబులకు వాసుదేవుండు భర్త. పతివ్రతలు ఏకచిత్తంబున ఆత్మేశ్వరుండయిన పరమేశ్వరుని భర్తృ భావంబున సేవించుచుందురు. దీనినే పాతివ్రత్యము అని అందురు.

**2. ఉపాసన:-** హిరణ్యగర్భునుపాసించు వారు సత్యలోకంబున ప్రళయంబు దనుక బ్రహ్మతోడంగూడి పుణ్యపురుషునిం బొడగందురు.

**3. సాంగత్యము:-**

**దుర్జన సాంగత్యము:-** దుర్జనుల యొక్క దర్శన, స్పర్శన, సంభాషణ, సహవాసము చేసి జనులు ధర్మహీనులగుదురు. అన్యజన సంగమంబు జన్మపరంపరలకు కారణము.

**సజ్జన సాంగత్యము:-** యోగ, సాంఖ్య, ధర్మ, స్వాధ్యాయము, యిష్టా పూర్తులు, దక్షిణలు, వ్రతములు, వేదమంత్రములు, తీర్థములు, యమనియమాదులు, తపస్సు కంటె సత్సంగము ముఖ్యమైనది. సత్పురుషులతో స్నేహము సద్గతికి కారణము. పెద్దల సంగంబు మోక్షద్వారంబగు. సత్సంగము పొంది భగవంతుని ఉపాసించి భగవంతుని పొందును. బుధుడు సత్ సంగమము వలన ముక్తిని పొందును. పరమ భాగవతజనుల సంగంబు అపేక్షనీయము. అది సకల దోష నివారకము. భాగవతుల అనుగ్రహము అనే నావలేకుండా ఈ సంసార సాగరమును దాటలేము. భాగవతులయందు విష్ణుండుండుట వలన వారే తీర్థములు. కావున వారు తీర్థములను ధిక్కరింతురు.

**4. కథా శ్రవణము :-** అజ్ఞానముచే కామ్యకర్మలలో తిరుగు వేదనాతురులకు తన్నివృత్తి చేయ శ్రవణ, చింతన, వందన, అర్చన దివ్యచారిత్రములు వినుచూ, పాడుచూ, పొగడుచూ భగవంతుని చూతురు. భగవంతుని కథలు కర్మ నిర్మూలను హేతువులు. భగవంతుని కథలు వినుటవలన మోహంబు బాసి వర్తించు. అపశబ్దంబులు గూడియున్ హరి చరిత్రాలాపముల్ సర్వపాప పరిత్యాగము చేయు. సంసారజలధిలో కర్మవాంఛలచే బాధ పొందువారికి విష్ణువర్ణనము తెప్పవంటిది.



భగవంతుని కథలు ఆసక్తి తో వినేవారికి యితర విషయములు రుచి పుట్టింపనేరవు. భగవత్ గుణకథామృతము ఆత్మలగ్రోలువారు సర్వతీర్థస్నాన ఫలితమును పొందుదురు. ఎవరయినా శ్రద్ధా భక్తి యుక్తుడై కృష్ణ గుణకీర్తనములు వినుచూ పలుకుచూనుండునో వారి కర్ణరంధ్రమార్గములను కృష్ణుండు ప్రవేశించి ఆత్మ గతంబైన మాలిన్యము పోగొట్టును. భగవంతుని కథలు వింటూ ఎవరు కాలం గడపుదురో వారి ఆయువు తక్కమిగిలిన వారి ఆయువును సూర్యుడు ప్రతిదినము లాక్కొని పోవుచుండును. భాగవత దివ్య కథా శ్రవణాను రక్తిచే వేదములు చదివినఫలము పొందును. కులహీనుడు నారాయణ కథలు వినిపించిన అతని కులహీనత పోవును. నిఖిలబంధ విమోచనంబు కొఱకు వాసుదేవుని లీలా విశేషంబులు భక్తి తోడ వర్ణింపవలయును. భక్తులు దేవతాంతరనిందసేయక శాంతులయి నారాయణ కథలయందు ప్రవర్తింతురు.

వేదాంత శ్రవణంబున గ్రహింపబడి జ్ఞానవైరాగ్యంబుల తోడన్ గూడిన భక్తి చేత తత్పరులైన పెద్దలు క్షేత్రజ్ఞుండైన ఆత్మయందు పరమాత్మను బొడగందురు.

**5. భజన :-** అష్టరాగంబులు గలవారు, భగవంతుని స్తుతించలేరు. దేవతా భజనంబు సేయువారిని దేవతలు అనుగ్రహింతురు. హరిభజనము మునులు నిష్కారణముగ చేయుదురు. ఎవడు ధన, పశు, మిత్ర, పుత్ర, వనిత పై తగులంబుమాని భగవంతుని అనఘుని విశ్వతోముఖుని అనన్యగతిన్ భజియించెనేనివాడు మృత్యువు నుండి తరించును. భగవంతుని స్మరించిన, ఆయనను కీర్తించుచు, ఆయనపై పాటలు పాడుతూ, జపములు చేయుచూ తపసులు, సాధువులు ధన్యులగుదురు. భగవంతుని నామసంకీర్తనంబుల సకల యజ్ఞ విఘ్నంబుల నాశంబునొందు. ఇతర చింతనలు మాని శ్రీమన్నారాయణుని మదినెంతయు నమ్మి భజించువారు ఆ విభుని మాయను తరింతురు.

**6. నామస్మరణ :-** ఛండాలుడైనను హరినామస్మరణచే కైవల్యపదవిని పొందును. హరినామస్మరణ చేసినచో (ముహూర్తమాత్రము) ముక్తిని పొందును. హరిసంస్మరణము జీవులకు అఖిల సౌఖ్యదము. భగవంతుని నామస్మరణ కీర్తనము గలవారు శ్రీమంతులు. అట్టి శ్వపచుడు బ్రాహ్మణుని కంటె గొప్పవాడు. చండాలుడైనను

హరినామస్మరణ చేసిన కైవల్యపదవినిపొందును. హరిచరణ స్మరణంబు చేయు భక్తుడు భక్తిరస వశీకృతుండయి విడువ నిచ్ఛగింపడు. భగవంతుని పేరు ఏచందంబున పలికినను కలుషహరమే. పాపకర్ములైనను సతతము నారాయణ నామములు జపించిన వారలను కొనియాడ బ్రహ్మకు తరముకాదు. అవసాన కాలమున సంస్మరించి జన్మ జన్మాంతరసంచిత దురితము బాసి కైవల్య సంప్రాప్తులగుదురు. హరిని తలంచక మత్తుడై సంసారములో పొరలు చుండెడి వెఱ్ఱివాడు ముక్తిపొందడు. ఈశ్వరునుని చిత్తమున నిలిపిన ఈశ్వర మాయను దాటుదురు. పరమాత్మను చిత్తములో భావించినవారినుంచి అవిద్య దూరముగా పోవును. పరమాత్మను కొనియాడనిచో చిత్తము ప్రకృతి పరమైన నిర్గుణ పరబ్రహ్మమును చేరదు. నిర్గుణ పరబ్రహ్మము నాశ్రయించి, విధినిషేధము లొల్లని భాగవతులు మనస్సులో ఎప్పుడూ హరిని గుఱించి చింతన చేయుదురు.

**7. శరణు :-** కమలాక్షుని శరణంబు వేడని జనులు కళ్యాణ సంయుక్తులుకారు. బ్రహ్మకూడ బ్రహ్మత్వమనే రాజసము విడచి ఆమహాత్ముని పాదారవిందములను శరణు కోరినవేళ భగవంతునిని తెలియును. రాజస గుణుండగువేళ తెలియజాలడు. భగవంతుని ఆశ్రయించిన భయనివృత్తి హేతువైన మోక్షంబుగలుగు.

**8. పూజ :-**

**ఎలా పూజించాలి :-** మనోనిగ్రహము, శాంతత్వము నియతపరిభాషణ, సుమహితాచారము, మితాహారము గలిగి పూజింపవలయును. కార్యబుద్ధించేసి చేయంబడు పూజావిశేషంబులు వాసుదేవ మంత్రంబున సర్వేశ్వరునికి సమర్పింప వలయును. భగవంతుని గుణ, నామ, వర్ణన సేయుచూ వాసుదేవ, ప్రద్యుమ్న, సంకర్షణ, అనిరుద్ధ అను వాసుదేవ వ్యూహమును తెలిసి ప్రణవపూర్వకంబుగా భగవన్నామములు భక్తిపూర్వకంబుగా పలికి నమస్కారంబుసేసి యజ్ఞ పురుషుని పూజించు పురుషుండు సమ్యగ్దర్శనుండగు. మనోవాక్కాయ కర్మంబుల చేత మనోగతంబగునట్లుగా భక్తియుక్తంబయిన పూజచేత పూజింపబడి సర్వేశ్వరుండు ధర్మాది పురుషార్థములలోన అభిమతార్థంబు నిచ్చును. విరక్తుండగువాడు నిరంతరభావంబు కలిగి మోక్షంబుకొఱకు భజియించు. మందాధికారులకు



ప్రతిమార్చనంబు పురుషార్థ ప్రదంబగు. కొందఱు ప్రతిమార్చనంబు సేయుదురు. పవిత్రగాత్రుండయి జనార్దనుసన్నిధిం పూతచిత్తుండై షోడశోపచారంబుల భగవంతునినారాధించి గంధపుష్పధూపదీపనైవేద్యంబులు సమర్పించి సాష్టాంగ దండ ప్రణామంబు లాచరించి భక్తి భావనా విశేషుండగునతండు హరినిచేరును.

**ఎవరికొఱకు దేవతావిగ్రములు కల్పింపబడినవి ?** పరస్పర పాత్రంబులకు సహింపని మనుష్యులకు అనగా తోటి మానవులను దైవముగా చూడలేని అసమర్థులకై పూజనార్థంబుగా త్రేతాయుగమునందు హరిప్రతిమలు కల్పింపబడియె. పాత్ర నిర్ణయ నిపుణులైన పెద్దలు నారాయణుండు ముఖ్యపాత్రంబని పలుకుదురు. సర్వభూత హృదయంబునందు వర్తించునీశుని అలక్ష్యము చేసి ప్రతిమార్చనచేయు మూఢుండు భస్మకుండమున హవిస్సు వ్రేల్చిన యట్టివాడు. అనగా పూజ బూడిదలో పోసిన పన్నీరగును. పాత్రపురుష ద్వేషంబయినవారలకు ప్రతిమార్చనంబు ముఖ్యార్థ ప్రదంబుకాదు.

శ్రుత, ధన, కుల, కర్మంబుల మదమున సజ్జనులకు కీడుచేయువారి పూజ భగవంతుడు గైకొనడు. నిఖిల భూతాంతరాత్ముడయిన భగవంతుని యందు భూతగణమునందు భేద దృష్టి గలవారు అధిక ద్రవ్య సమితిచే అర్చన చేసినను భగవంతుడు సంతోషించడు.

**సాత్త్విక భక్తి** గలవాడు **:-**జనహిత కారియై సర్వకర్మలు భగవదర్పణ బుద్ధి తో చేయును. కేవలం భగవంతునినే ఆరాధించును. దీనినే ఆత్యంతిక భక్తి యోగం అని అందురు.

**రాజస భక్తి** గలవాడు :- విషయ ప్రావీణ్యములను, ఐశ్వర్యములను, యశమునుకోరి ఆడంబరముతో పూజించును.

**తామస భక్తి** గలవాడు :- ఇతరులకు హింసచేయుట దంభము, మాత్సర్యం, రోషం, ఆడంబరం, అసూయ, అజ్ఞానం, భేద బుద్ధి గలిగి పూజించును.

భక్తి యొక్క ఆచరణలో అనేక పద్ధతులు ఉన్ననూ భక్తునియొక్క లక్షణములు,

స్థితి ఒక్కటియే. దాసత్వము అనగా పెద్దల సేవకు ఉదాహరణగా నారదుడు, సంకీర్తనకు ఉదాహరణగా ప్రహ్లాదుడు, తనుహృత్భాషల సఖ్యమునకు గోపబాలురు, విరహోత్కంఠితకు ఉదాహరణగా గోపికలు, భయమునకు ఉదాహరణగా కంసుడు, వాత్సల్యమునకు ఉదాహరణగా యశోద, ఆత్మలో ఎఱుకకు ఉదాహరణగా నందుడు, అర్చనకు ఉదాహరణగా అంబరీషుడు, వైరమునకు ఉదాహరణగా కొంగరూపమున వచ్చిన బకాసురుడు, శరణాగతికి ఉదాహరణగా కాళీయుడు మొదలయినవారిని భక్తి పద్ధతులకు ఉదాహరణగా భాగవతమున విపులముగా వర్ణింపబడినది. ఆత్మ క్రీడకు ఉదాహరణగా గోపబాలురు, ఆత్మ రతికి ఉదాహరణగా గోపికలు ఉదహరింపబడిరి. ఆర్తులకు, ఉదాహరణగా ద్రౌపదియు మఱియు ఆమె కోడలయిన ఉత్తరను, అర్థార్థికి ఉదాహరణగా కుచేలుని, జిజ్ఞాసువులకు ఉదాహరణగా పరీక్షిత్తుని, జ్ఞానులకు ఉదాహరణగా అగ్నిద్యోతనుడు, ఉద్ధవుడు, కుంతి మొదలయినవారిని ఉదహరించినారు.

*****



## సాధకులు

**నారదుడు :** చాతుర్మాస్య వ్రత దీక్షలోనున్న **యోగి జనులకు సేవ చేసి** వారి కృపచే ఆధ్యాత్మిక రహస్యమును గ్రహించి సాధన చేసి అరిషడ్వర్గములను జయించి భగవంతుని దర్శించినాడు.

**ప్రహ్లాదుడు :-** పానీయంబులు త్రాగుచున్ కుడుచుచున్ అని నిరంతరము **భగవన్నామ స్మరణ** చేయుచు నామస్మరణ అనే పద్ధతిని పాటించినాడు. దుర్జన సాంగత్యము వదలి, చిత్తము అన్యాయత్తముగానీయక స్వాధీనము చేసికొని సంసారంబు సుఖంబని నిశ్చయింపక, సంసారతాపత్రయములలో చిక్కుకొనక, మాయకు వశముగాక, ఇహలోక పరలోక సుఖములు హేయములని తలచి లభ్యంబైన సురాదిరాజపదములను లక్షింపక, కర్మబంధములను ఛేదించి దేహ ధ్యాస లేక విశ్వమును మఱచి ఉండెను.

సర్వమును ఈశ్వర స్వరూపముగా దర్శించి హృషీకేశుడై సంసార నిమగ్నులయిన వారిని చూచి అనుకంపాయుత చిత్తుడయి వారికి వేదాంత రహస్యములను బోధించినాడు. పూర్ణకాముడు. జడత లేకయు జడుని భంగి ఉండును.

**లక్షణములు :-** వేద వేదాంగములను గురు ముఖతా అభ్యసించినవాడు. ఆత్మ దర్శనము చేసినవాడు. శత్రు మిత్రాదుల యందు సమభావన గలవాడు. అనగా రాగ ద్వేషములు లేనివాడు. వస్తు దృష్టి లేనివాడు. జీవుడు అస్వతంత్రుడు. ఇతరులను రక్షింప సమర్థుండు కాడు. దేహి తన కర్మానుసారము పుట్టును. పెరుగును, చనిపోవును అని తెలిసినవాడు తల్లిదండ్రులు తమ సంతానమునకు పాలన, పోషణ చేయునట్లు తన చేతనైనంతలో దీనులకు పోషణ చేయ తలచును. మోహరహితుడు కావలయునని భక్తి లక్షణములలో చెప్పిరి. కాబట్టి తల్లి తండ్రులను, భార్యాపుత్రాదులను, గురువులను, బంధువులను, చుట్టాలను, స్నేహితులను వదలమని కాదు. అంతరంగమున తామరాకుపై నీటి బొట్టువలె మోహ రహితుడై ఉండవలయును. ఇది చెప్పుటకు స్నేహితులను కూడ తన సోదరుల వలె ఆదరణ, ప్రేమలతో చూచువాడు. అపరవిద్యలను బోధించు గురువులను

కాక, పర విద్యను ఆచరించి బోధించు గురువులను దైవముగా చూచువాడు. సత్యవాక్పరిపాలకుడు. అర్థము, వయస్సు, ఆకారము, విద్య, బలము, ఐశ్వర్యము, వరిష్టత్వము, జన్మలనే అష్ట మదములు లేనివాడు. ఇంద్రియములు ఇంద్రియార్థములపై ప్రసరించినను తను కర్తనుగానని ప్రకృతిచే జనియించిన గుణములచే కర్మ చేయబడుచున్నది అని గ్రహించుట వలన పంచేంద్రియములచే పట్టుబడలేదు. తమో గుణము, రజోగుణముల వలన కలుగు కామ, క్రోధ, లోభ, మోహ,మదమాత్సర్యములు లేనివాడు. సత్త్వగుణ గరిష్ఠుడు. సుఖభోగములయందు ఆసక్తి లేనివాడు. నిర్మలాత్ముడు.

**అంబరీషుడు :-** ఇతనిది పూజా పద్ధతి. అంబరీషుడు దోషరహితుడు. అనగా దుర్మార్గపు ప్రవర్తన లేనివాడు. ఇతడు సరస్వతీ నదీ తీరమున వసిష్ఠాది ఋషులతో కూడి అశ్వమేథయాగములు చేసినాడు. సర్వ కర్మలు హరిపరంబులుగా కర్మ ఫల త్యాగము చేసినాడు. ద్వాదశీ వ్రతము చేయుచు కార్తీకమాసమున మూడు రాత్రులు ఉపవసించి కాళిందీ నదీ జలంబుల స్నానాదులు చేసి, మధువనంబున మహాభిషేక విధానంబున హరినభిషేకము చేసి, పూజించి, గోవులను దానమిచ్చినాడు. ఇతడు వైష్ణవ అర్చనలచే కాలము గడుపుచుండెను.

**సాధన :-** సంసార తాపత్రయములను వీడి -

కర్మేంద్రియములు :- నోరు : మితభాషి, హరి గుణములు కీర్తించును.

చేతులు : విష్ణు మందిరములను శుభ్రము చేయును.

పాదములు : విష్ణు దేవుని ఆలయములు తిరుగును.

జ్ఞానేంద్రియములు : శిరము : ఈశ్వరునికి శిరస్సువంచి నమస్కారము చేయును.

చెవులు : హరి కథలు వినును.

కన్నులు : గోవిందరూప వీక్షణము చేయును.

అంతఃకరణము : చిత్తము - విష్ణు పాదములయందు చిత్తము ఉంచెను.

మనస్సు : విష్ణు భక్తులయందు, విష్ణువునందు ఉంచెను.

కామము : చక్రి కైంకర్యమున ఉండెను.



ఆత్మ రతి : భగవంతుని పుణ్య సంగతులు వినుటయందు.

స్నేహము : భగవంతునితో.

ఈవిధముగా కర్మేంద్రియ, జ్ఞానేంద్రియ అంతఃకరణములను భగవంతుని యందు ఉంచెను.

**లక్షణములు:-** మహా విభవ సంపదలు కలిగి కూడా ఐశ్వర్య మదము లేనివాడు. సర్వత్రా సమదర్శనుడు. హరి భావన కలిగి ఉన్నవాడు. పుణ్యమూర్తి. ఈశ్వరాయుత చిత్తుడు. దయాపరుడు. గుణరహితుడు. సంసారమునందు తగులంబు మాని అనగా భార్యా పుత్రాదులయందు, బంధు మిత్రాదులయందు, ధనకనక వస్తువాహనాదులయందు, రాజ్యమునందు విరక్తి వైరాగ్యములు కలగి ఉండెను. ఇతని గుణములకు మెచ్చి విష్ణువు సుదర్శన చక్రమునిచ్చెను. గురువు అగు దుర్వాసుడు శిష్యునిని పరీక్షించుట అనే నెపముతో భక్తుని లక్షణములు చెప్పబడుచున్నవి. ధర్మ సందేహము కలిగినపుడు అక్కడ గల సద్బ్రాహ్మణులను అడిగి వారు ఆచరించుచున్నట్లు ఆచరించవలయును అని తైత్తిరీయోపనిషత్‌లో చెప్పినదానికి ఉదాహరణగా దుర్వాసుడు భోజనమునకు వచ్చునని చెప్పి ద్వాదశ ఘడియలు అయిపోవుచున్నను ఇంకనూ రానప్పుడు ఏమి చేయవలయునని అడిగి బ్రాహ్మణుల మాటపై అంబరీషుడు జల భక్షణ చేసినాడు. అటులనే దేహము నశించును. దేహి నశింపడు. భక్తుడు తన యోగ క్షేమములను పట్టించుకొనడు అన్నదానికి ఉదాహరణగా దుర్వాసుడు ఒక కృత్యను అంబరీషుని చంప ప్రయోగించగా రాజు తన యోగ క్షేమములను పట్టించుకొనక పోయిననూ విష్ణువు సుదర్శన చక్రమును పంపి ఆ కృత్యను సంహరింపచేసినాడు. అంబరీషుడు అహంకార వర్జితుడు అని చెప్పుటకు గురువు అబరీషుని పాదములంటి శరణు కోరినను గురువంతటి వాడు తనను శరణు కోరెనని అహంకారపూరితుడు కాక గురు క్షేమమునకై సుదర్శన చక్రమును వినయముగా ప్రార్థించినాడు. ఈ విధముగా అంబరీషుని సాధన, లక్షణములు, స్థితి వర్ణింప బడినది.

**గురువు-దుర్వాసుడు :-** ఇతడు త్రిలోకములు సంచారము చేయగల సమర్థుడు. ఆత్మ దర్శన ప్రాప్తిని పొందినవాడు. తనయందు అఖిల భూతములందు అనగా

సర్వత్రా ఆత్మను దర్శించినవాడు. నిరహంకారి. భేద దృష్టి లేనివాడు. దీనికి ఉదాహరణగా విష్ణువుని శరణు కోరినటులనే అంబరీషుని శరణు కోరినాడు. గురువు అంబరీషుని పరీక్షించి అంబరీషునికి శాశ్వత కీర్తిని కలుగచేసినాడు. అంబరీషుని వలె సాధన చేసిన అది ఏకాదశి చేసినట్లు అగును.

**గోప బాలురు :-** తనుహృత్భాషల సఖ్యమునకు గోపబాలురు ఉదాహరణ. సమస్త భావములు పరమాత్మ యందే ఉంచి రాగద్వేషములు లేక యోగక్షేమములు పట్టించుకొనక నిరంతరము సర్వత్రా ఆత్మనే చూచుచు గడుపువారు. దీనికి ఉదాహరణగా అఘాసురుడు అను రాక్షసుడు కొండచిలువ రూపమున మ్రింగుటకు రాగా వీరు వెఱువక చిరునవ్వు నవ్వుచు శ్రీకృష్ణునినే వీక్షించుచు కృష్ణుడుండ మనకు భయమెందుకని ఆ కొండచిలువలోపలికి వెళ్ళినారు. అంత కృష్ణుడు అఘాసురుని చంపి వీరిని రక్షించినాడు. గోపబాలురను చూచి బ్రహ్మ అంతటి వాడు ఈ భక్తుల పాదరేణువుగా ఉంటే చాలును అని అనుకొనెను. అంతటి గొప్పతనము వీరిది. దీనినే **ఆత్మ క్రీడ** అని అందురు.

**కొంగ రూపమున వచ్చిన బకాసురుడు :-** వనములోన నిలచి, ఎల్లపనులు మాని ఇతర - మమత విడిచి వనజాక్షుపై దృష్టి చేర్చి ఏకాగ్రచిత్తుడై మౌనవృత్తి తపసి చెలువు దాల్చి ఉండెను. **వైరాను బంధమునకు** ఇది ఉదాహరణ. అరణ్యవాసమున ఉండి వ్యర్థ కర్మంబులు మాని ఇంద్రియములను భగవత్పరము గావించి సంసారతాపత్రయములను, రాగద్వేషములను, ఈషణత్రయములను, అరిషడ్వర్గములను, మమతాహంకారములను విడచిపెట్టి సత్త్వగుణాశ్రయుడై దృష్టిని పరమాత్మపై ఉంచి ఏకాగ్రచిత్తుడై, మౌనమును పాటించి మహాయోగి వలె ఉండెను. శ్రీకృష్ణుడు ఇతనిని కథాపరముగా సంహరించినాడు. అనగా కర్పూర దీప సంయోగము జరిగినది.

**గోపికలు :- కామక్రోధాది రహితులకు జీవనంబైన బృందావనంబు.** (భాగవతము, దశమ స్కంధము, పూర్వభాగము, 543). అనగా కామము క్రోధము అనే అరిషడ్వర్గములు లేనివారు ఉండునది బృందావనముగా చెప్పుదురు. పరీక్షిత్తు శుక బ్రహ్మను గుణమయ దేహములను గోపికలు ఏరీతి విడిచిరి? అని ప్రశ్నింపగా



దానికి సమాధానముగా గోపికలను ఉదహరించినాడు. నారదుడు తన భక్తి సూత్రములలో భక్తి అనగా యథా వ్రజగోపికాః అని నిర్వచించినాడు. నారదుడు చెప్పిన పదకొండు పద్ధతులు అనగా **"గుణమాహాత్మ్యాసక్తి, రూపాసక్తి, పూజాసక్తి, స్మరణాసక్తి, దాస్యాసక్తి, సఖ్యాసక్తి, వాత్సల్యాసక్తి, కాంతాసక్తి, ఆత్మనివేదనాసక్తి, తన్మయతాసక్తి, పరమవిరహాసక్తి"** గోపికల ఆచరణలో కనిపించును. ముఖ్యముగా వీరి ఆచరణ పద్ధతి **పరమవిరహాసక్తి.**

**సంగ్రహముగా గోపికల ఆచరణ పద్ధతి :** కృష్ణునిని ఒక నిమిషము చూడక పోయినా వారికి ఎన్నోయుగములు అయినట్లుగా ఉండెడిది. ఇదే విరహోత్కంఠితగా చెప్పుదురు. వీరు అపరధర్మమును వీడి పరధర్మమును ఆశ్రయించినారు. కర్మేంద్రియ జ్ఞానేంద్రియములు అంతఃకరణము, భగవంతునియందు తప్ప లౌకిక వ్యవహారములకు కావని గ్రహించి శ్రీకృష్ణునిని వర్ణించుచున్, పాడుచున్, మనముల, మాటల, చేష్టల,క్రియల, శ్రీకృష్ణునినే నిరంతరము స్మరించినారు. ఆవిధముగా నిరంతర నామ స్మరణ చేసినారు. కృష్ణుడు అంతకు పూర్వము చేసిన పూతన సంహారాది క్రియలను వీరు కృష్ణలీలలను అనుకరించినారు. సర్వులకు ఆత్మ భర్త అని గ్రహించి శ్రీకృష్ణుడు తమకు భర్తగా కావాలని కాత్యాయనీ దేవిని కొలిచినారు. అనగా ఆత్మ దర్శన ప్రాప్తికై ప్రార్థించినారు. పాయని గేహ శృంఖలములు వీడి అనగా సంసార తాపత్రయములను వీడినారు. దీనికి ఉదాహరణగా సంసారములో ఎలా ఉన్న పనులను అలా వదలి పెట్టి భర్త పిల్లలు అడ్డు పెట్టినా వారిని కాదని అనగా సంసార బంధమునుండి విడివడి శ్రీకృష్ణుని సన్నిధికి చేరినారు. అడవిలో పులులు సింహములు ఉన్నవని తెలిసినా రాత్రివేళ శ్రీకృష్ణుడున్న అరణ్యమునకు వెళ్ళిరి. అనగా మృత్యు భయమును నిరసించిరి. వీరికి తీవ్రమోక్షేచ్ఛ కలిగినది. కృష్ణుడు మీ పాదలమాటున లేడుగదమ్మా అని విశ్వమంతా నిండియున్న ఈశ్వరుని విశ్వములో వెదకినారు. ధ్యానము, ఆకర్ణనము, దర్శన, గానంబుల హరితలంపు గలిగి ఉన్నారు. అతని రూపమును హృదయమున నిలిపి కన్నులు మూసికొని యోగి కైవడి ఉన్నారు. గోపికలు జ్ఞాన కాండమున ఈశ్వరుని గాంచి పరిపూర్ణ మనోరథులై ఉండిరి.

**డుకృఞ్ కరణే** అనే ధాతువు నుంచి కృష్ణ పదము ఉత్పన్నమయినది. కృష్ణుడనగా సర్వమూ చేయువాడని అర్థము. సృష్ట్యాదియందున్న ఆత్మనే కృష్ణుడని అందురు. కావున రామాయణములో బ్రహ్మ దేవుడు రామునితో నీవు కృష్ణుడవు అని పలికెను. ఆధ్యాత్మిక భావన తెలియని కవుల వలన శ్రీకృష్ణుడు గోపికలు, అటులనే, శ్రీకృష్ణుడు రాధ కథలు శృంగారకథలుగా తయారైనవి.

**కంసుడు :-** ఆహుకుడునకు దేవకుడు ఉగ్రసేనుడు అను ఇరువురు కుమారులు. అందు దేవకునకు నలుగురు కుమారులు ఏడుగురు కుమార్తెలు కలరు. అందు దేవకి ఒక కుమార్తె. ఆహుకునికి మఱియొక కుమారుడయిన ఉగ్రసేనునకు నలుగురు కుమార్తెలు, తొమ్మిది మంది కుమారులు కలరు. ఆ తొమ్మిది మందిలో కంసుడు ఒకడు. కంసునకు దేవకి స్వంత చెల్లెలు కాదు. చెల్లెలియందు మిక్కిలి ప్రేమ కలిగి ఉన్నాడు అనగా మోహములో కూరుకొని ఉన్నాడు.

శూరసేనుడు అను ఇంకొకనికి పదిమంది కుమారులు, ఐదు మంది కుమార్తెలు కలరు. శూరసేనుని కుమారులలో వసుదేవుడు ఒకడు. వసుదేవుని భార్యలలో దేవకి ఒకరు. రోహిణి ఒకరు.

కంసుని ఆచరణ పద్ధతి- **భయము.** కంసుడు వసుదేవుని వద్ద మేనితోడన పుట్టు మృత్యువు. దేహము నశింపగా దేహి తనకర్మానుసారము ఈ దేహమును వీడి ఇంకొక దేహమును పొందును. ఈ విధముగా దేహి జన్మ పరంపరలలో చిక్కుకొనును. కర్మ వలన మేలు కీడు కలుగును. కావున పరులకు హింసలు చేయవద్దు. దేహి సాధన చేసి ఆత్మ స్థానము చేరవలయును అనే శాస్త్ర పాఠమును నేర్చుకొనినాడు.

**సాధన :** అపర ధర్మమును పాటించినాడు. వసుదేవునికి జన్మించిన ఆఱుగురు కుమారులను చంపక వసుదేవునికి అప్పగించినాడు. దేవకిని అనగా ఆడుదానిని చంపిన ఐశ్వర్యము, కీర్తి, ఆయువు, ధర్మము నశించునని గ్రహించి దేవకిని వసుదేవునిని చంపలేదు. అనగా కంసుడు దేహసంబంధీకులు తనవారని భావించి అజ్ఞానములో ఉండెను. అంతలో ఈ అవిద్యను నశింపచేయుటకు నారదుడు వచ్చి నీవు కాలనేమివి, నీ బంధువులు దేవతలు అని చెప్పినాడు. దీనివలన కంసునకు



మోహవిచ్ఛేదమయినది. దేవకి వసుదేవుడు, ఉగ్రసేనుడు మొదలయినవారు దేహ సంబంధీకులు తప్ప ఆత్మ స్వరూపుడయిన తనకు వీరేమీ కాదని గ్రహించినాడు. ఆత్మ దర్శనమునకై క్రౌర్యంబు విడచి, ధైర్యంబు నొంది, గాంభీర్యము పాటించి, శౌర్యంబు ప్రకటించుకొనుచు మౌనింబోలె ఉండి తిరుగుచు కుడుచుచు త్రాగుచు నిరంతరము హరినామ స్మరణ చేసినాడు. తత్ఫలితముగా **విశ్వమంతా హరిమయమని చూచినాడు.** సాధన ఆరూఢ స్థితికి వచ్చినది. కంసుడు వెలుగున నిలుచుండి వీక్షింపగా మేని నీడ సరంధ్రమై నేల తోచె. అనగా జ్ఞానముతో దేహ విచారణ చేయగా దేహము వేఱని దేహి అయిన తను వేఱు అని స్వానుభవంలో అవగతమయినది. తరువులెల్ల హేమతరువులగుచు మెఱయు చుండె. అనగా సర్వత్రా-ఈశ్వరునినే దర్శించుచున్నాడు. వస్తు దృష్టి నశించినది. గుణరహితు డయినాడు.

**కం॥ రోష ప్రమోద నిద్రా,**
**భాషాశన పానగతులఁ బాయక చక్రిన్**
**దోషగతిఁ జూచి యైన వి,**
**శేషగతిన్ గంసుఁ డతినిఁ జెందె నరేంద్రా!**

(భాగవతము దశమస్కంధము, 1377)

అనగా కర్పూర దీప సంయోగము జరిగినది. దేహి ఆత్మయై ఆత్మలో ఏకీభూతమయినది. కంసుడు బ్రహ్మత్వమును పొందినాడు.

కంసుని కథలో దేవతా పరముగా బ్రహ్మ ఇంద్రులను చిత్రీకరించినారు. రాక్షసుల పరముగా పూతన, శకటాసురుడు, ధేనుకాసురుడు, కేశి మొదలయిన రాక్షసులను ఉదహరించినారు. కర్మ విభాగములో అపర ధర్మములను ఉదహరించినారు. యోగ విఘ్నములను జయించుటగా రాక్షస సంహారము చెప్పబడినది. భక్తి పద్ధతులుగా నంద యశోదలు, గోపబాలురు, గోపికలు మొదలయినవారిని చెప్పినారు. కర్మ, యోగ, భక్తి పద్ధతులు వేటికి అవి వేఱు వేఱు కావు. ఆచరణలో అవి అన్నీ కలసి త్రివేణీ సంగమముగా ఉండును. ఈ త్రివేణీ సంగమము చేరిన సాధకులు ధన్యులు. రామాయణములో రామునిని ఉదాహరణగా తీసుకొని కర్మ యోగ భక్తి అనే త్రివేణీ

సంగమమును రచియింప వ్యాసభగవానుడు కంసుని ఉదాహరణగా తీసుకొని భాగవతము దశమ స్కంధములో త్రివేణీ సంగమమును వివరించినారు.

ద్రౌపది

భక్తులలో ఈమె ఆర్తులు అనుకోవకు చెందినది. అన్ని ఆపద సమయములందు అన్యమెఱుగక శ్రీకృష్ణునినే ప్రార్థించినది. కృష్ణుని అనుగ్రహమున ఆపదలు తొలగి పోయినవి.

**ఉత్తర**

భక్తులలో ఈమె ఆర్తులు అనుకోవకు చెందినది. ఈమె పరీక్షిత్తుని తల్లి. పరీక్షిత్తుడు ఈమె గర్భములో ఉండగా అశ్వత్థామ ఈమె గర్భమును నశింపచేయుటకు అస్త్రమును ప్రయోగించెను. అస్త్రముయొక్క వేదనకు బాధపడుచు ఓ శ్రీకృష్ణా నీ పాద పద్మములు తప్ప ఇంకొకటి నాకు తెలియదు. నీవు విశ్వ గర్భుడవు. నీవు నా గర్భమును రక్షిచుట ఎంతపని. ఆపదలో ఉన్న నన్ను ఆదుకొని నా గర్భస్థ శిశువును బ్రతికించుమని ప్రార్థించినది. అంత శ్రీకృష్ణుడు పరీక్షిత్తుని రక్షించినాడు. ఈమె భగవంతుని పాదపద్మములు తప్ప అన్యమెఱుగని స్థితిగల భక్తురాలు.

**కుంతి**

ఈమె జ్ఞానుల కోవకు చెందినది. దుర్వాస మంత్ర ప్రభావమున ఆదిత్యునిని దర్శించినది. అనగా ఆత్మను దర్శించిన సాధకురాలు. ఈమె తన కన్నకొడుకైన కర్ణుని నీటిపాలు చేసినది. అనగా అహంకార మమకారములను వీడినది అని అర్థము. తన కొడుకులయిన పాండవులను రాజ్య భ్రష్టులను గావించి, కోడల చీరలు విప్పి అడవులకు పంపిన దుర్యోధనాదుల యింటనే ఉన్నది. కొడుకులతో అడవులకు వెళ్లలేదు. అనగా శత్రు మిత్రులు లేక ఉదాసీనత గలిగి, రాగ ద్వేషములు లేక సాక్షీ మాత్రముగా ఈశ్వరలీలలను గమనించినది.

ఆత్మ తత్త్వమును గ్రహించిన పూర్ణురాలు. ఆత్మను కాలరూపకుడు ఆద్యంత శూన్యుడు, పురుషుడు, ఆఢ్యుడు, ప్రకృతికి పరుడు, అవ్యయుడు, లోకనియంత, బహిరంతర్భాసురుడు, సర్వ సముడు, రాగాది రహితుడు, భక్త ధనుడు, అంతర్యామి



అని స్వానుభవములో గ్రహించిన ధీమంతురాలు. సంసార తాపత్రయములలో చిక్కుకొన్నవారికి కులమదము, ధనమదము, విద్యామదము, మొదలయిన అష్ట మదములలో ఏ ఒక్క మదమున్ననూ వారికి ఆత్మ దర్శనము కాదు అని గ్రహించినది. రాగద్వేషములు లేనివారికి నిర్మలాత్ములయినవారికి, పరమహంసలకు, మునులకు, ఆత్మ దర్శనీయము అని స్వానుభవమున చెప్పినది. ఈమె ఆత్మను దర్శించుట వలన పరమహంసల స్థాయికలది. ఈమె శ్రీకృష్ణుని సాకారముగా అతడు చేసిన ఘనకార్యములను పొగిడినది. ఈమె పరమాత్మని యాదవులందు పాండవులయందు మోహవిచ్ఛేదము చేసి భగవంతుని పాదపద్మములపై నిరంతరమూ ఆమె బుద్ధి ఉండునట్లు భవబంధములనుంచి విముక్తి కల్పించమని ప్రార్థించినది. ఈమె ఆరూఢ స్థాయికి చెందిన భక్తురాలు.

**రామాయణములో భక్తులు**

తనుహృత్భాషలసఖ్యముగా గుహుని, సేవకు హనుమంతునిని, లక్ష్మణుని, అర్చనగా శబరిని, ఆత్మలో ఎఱుకగా భరతునిని కథలుగా వాల్మీకి చిత్రీకరించినారు.

**ముగింపు:-** భక్తుడు గుణరహితుడై - దేహత్యాగ సమయమున పరమాత్మను ధ్యానించుచూ - ఆత్మతో ఆత్మయందు కలియును.

*****



# సాంఖ్య పద్ధతి



విద్యార్థి పరీక్షలో ఉత్తీర్ణుడగుటకు పాఠమును కష్టపడి చదివి ఉత్తీర్ణుడగును. ఈ విద్యార్థి గురువుగా ఉండి శిష్యునకు పాఠమును చెప్పుటకు పాఠమును చదువును. శిష్యునిగా ఉండి చదువు విభాగమును కర్మయోగము అని చెప్పుదురు. గురువుగా శిష్యులకు పాఠమును బోధించుటకు చదువు విభాగమును సాంఖ్య పద్ధతిగా చెప్పుదురు.

పుణ్య కర్మానుష్ఠానము, యోగము, భక్తి, అను ఈ మూడు సాధనలు కర్మ విభాగము క్రింద పరిగణింపబడును. కర్మ విభాగములో కర్మేంద్రియములు, జ్ఞానేంద్రియములు నిషిద్ధ కర్మలను చేయక పుణ్యకర్మలు ఆచరించును. అంతఃకరణమున అసుర సంపద లేక దైవీ సంపద కలిగి, పుణ్యకర్మల ఫలితములు ఈశ్వరార్పణ చేసి, విరక్తి వైరాగ్యములు కలిగి, ఈషణ త్రయములను వదలి, అరిషడ్వర్గములను జయించి, తను జీవుడను కాను ఈశ్వరుడను అని గ్రహించి, ప్రకృతిని వీడి, విదేహుడై బ్రహ్మత్వమున ఉండును. ఇది కర్మ విభాగము. యోగ పద్ధతిలో కర్మేంద్రియ జ్ఞానేంద్రియములను నిగ్రహించి నిషేధములో చెప్పిన కార్యములను చేయక అంతఃకరణమును నిగ్రహించి ఓంకారమును జపించుచు అంతఃకరణమున అసుర సంపద లేక దైవీ సంపద కలిగి పుణ్యకర్మల ఫలితములు ఈశ్వరార్పణ చేసి విరక్తి వైరాగ్యములు కలిగి ఈషణ త్రయములను వదలి అరిషడ్వర్గములను జయించి, తను జీవుడను కాను ఈశ్వరుడను అని గ్రహించి ప్రకృతిని వీడి విదేహుడై బ్రహ్మత్వమున ఉండును. ఇది యోగ పద్ధతి. భక్తిలో కర్మేంద్రియ జ్ఞానేంద్రియములను నిగ్రహించకుండా వాటిని భగవత్పరమైన కర్మలయందు నియమించి అంతఃకరణ శుద్ధి కలిగి ఇష్టదేవతా స్మరణ చేయుచు, అంతఃకరణమున అసుర సంపద లేక దైవీ సంపద కలిగి, పుణ్యకర్మల ఫలితములు ఈశ్వరార్పణ చేసి విరక్తి వైరాగ్యములు కలిగి ఈషణ త్రయములను వదలి అరిషడ్వర్గములను జయించి తను జీవుడను కాను ఈశ్వరుడను అని ప్రకృతిని వీడి విదేహుడై బ్రహ్మత్వమున ఉండును. ఇది భక్తి పద్ధతి.

సాంఖ్య పద్ధతిలో దేహము, దేహలక్షణములు, గుణములు, గుణముల చర్య, జీవ లక్షణములు, జీవునికి ప్రకృతితో గల సంబంధము, జీవుడు తను కానని తను

ఈశ్వరుడనని భావించి జ్ఞానియై వర్తిల్లుటను సాంఖ్య పద్ధతిగా చెప్పుదురు. దీనినే జ్ఞానము అని కూడా అందురు.

**అజ్ఞానము:** అజ్ఞాని ప్రకృతితో కూడి, పంచభూతముల వలన ఏర్పడిన దేహము, ఇంద్రియముల చేత బద్ధుడై, సంసార తాపత్రయములలో మునిగి తేలుచు నీవు నేను అనే భేద భావన కలిగి ఉండును. జీవుడుగా బంధమును పొందినట్లు భావించి మోక్షమును కోరును.

**జ్ఞాని:** తను జీవుడను కానని ఈశ్వరుడనని భావించి బంధమోక్షములు లేక ఉండును. ఇతనికి శత్రు మిత్రులు లేక సుఖదుఃఖములందు విచలితుడు గాక ద్వంద్వ రహితుడై, క్రోధరహితుడై, పరమ శాంతుడై, తనయందు అఖిల భూతములయందు గల ఆత్మను దర్శించును. తను జీవుడు కాడని ఈశ్వరుడని తెలియుట వలన ఇతనికి బంధము లేదు మోక్షములేదు. ఇతడు ప్రకృతిని వీడి సుఖియించును. లింగ శరీర భంగము గావించి బ్రహ్మానందము అనుభవించును. ఇంద్రియములు మనస్సును ఆకర్షించును. ఇంద్రియములు ఇంద్రియార్థములతో ప్రసరించగా వాటితో మనస్సు కలసి జీవునికి ద్వంద్వములు కలుగ చేయుచున్నవని గ్రహించును. ఇంద్రియములు విషయములందు చరించిన బుద్ధి నశించునని అప్పుడు జీవుడు అశాంతిని పొందునని గ్రహించును. అంతఃకరణము విషయములతో కలియక ఇంద్రియములు ఇంద్రియార్థములయందు ప్రసరించినప్పటికీ అశాంతి కలుగదని గ్రహించి అంతఃకరణమును ఈశ్వరుని యందు ఉంచి గుణరహితుడై విరక్తి వైరాగ్యములు కలిగి ఈషణ త్రయములను వదలి అరిషడ్వర్గములను జయించి తను జీవుడను కాను ఈశ్వరుడను అని ప్రకృతిని వీడి విదేహుడై బ్రహ్మత్వమున ఉండును. ఇతడు పుణ్య కర్మలు చేయుచు కర్మ ఫలితమును కోరడు. ఇంద్రియములను తన వశమునందుంచుకొని కర్మకు ప్రకృతి దానినుండి జనియించిన గుణములు కారణమని, తను కర్తను కాదని భావించి సంగ రహితుడై చిత్త ఏకాగ్రత కలిగి, స్థిరబుద్ధి కలిగి, ఈశ్వర సంయోగము చెంది, అసూయా ద్వేషము, రాగ ద్వేషములు, భయ క్రోధాదులు లేకుండా అహంకార మమకారములను వదలి, సుఖ దుఃఖములందు విచలితుడు గాక అవి కాలాను



సారము వచ్చునని గ్రహించి అరిషడ్వర్గములను జయించి సమస్త కోరికలను వదలి, సమత్వ బుద్ధి కలిగి, అంతఃకరణము లేనివాడై, విరక్తి వైరాగ్యములు కలిగి ఈషణ త్రయములను వదలి బ్రహ్మానందమును అనుభవించును. తను జీవుడు కాడని ఈశ్వరుడని భావించి సాక్షీ భూతుడై ఉండును. ఇదే బ్రాహ్మీ స్థితి. ఈ సాంఖ్య పద్ధతిన బ్రహ్మీ స్థితిని పొందుదురు.

**ప్రహ్లాద అజగర సంవాదములోని ఒక మహానుభావుడు**

ప్రదేశము : కావేరీ తీరము, సహ్య పర్వత ప్రాంతము.

జనులను నిందించడు, పొగడడు. భూశయనము. ప్రవృత్తి నివృత్తి లక్షణములు సంపూర్ణముగా తెలిసినవాడు. సర్వ క్రియా నివృత్తి కలిగి జీవుడు స్వతంత్రుండై ప్రకాశించునని గ్రహించి ప్రారబ్ద కర్మను అనుభవించుచు యదృచ్ఛాలాభ సంతుష్టి కలిగి అనగా ఎవరైనా చీని చీనాంబరములు తెచ్చిన కట్టి లేదా నారచీరలైనా కట్టి సుఖభోగములకు కర్పూరము, చందనము, కస్తూరి మొదలయినవి ఎవరైనా ఇచ్చినచో వాటిని శరీరమునకు పూసికొని పల్లకి ఎక్కి తిరుగుచు, లేని యడల కాలి నడకన నడుచుచు, లభించినచో పూల పాన్పుపై గానీ లేనిచో కటిక నేలపైగానీ పరుండుచు మానావమానములు లేక గుణవర్జితుడై ఆ దినము తినుటకు లభించినది తినుచు ఎవరియందు ప్రేమ ద్వేషములు లేక ఏదీ కోరక ఎవరినీ యాచింపక అయాచితముగా లభించినదానిని వర్జింపక, సంపదలకు ఆనందింపక, లేదని విచారింపక, వికల్పంబులు లేక, చిత్తమును మనంబున, మనమును అహంకారమున, అహంకారమును మహత్తునందు, మహత్తును ప్రకృతియందు, ప్రకృతిని అవ్యక్తమునందు లయింప చేసి విరక్తి వైరాగ్యము పొంది ఆత్మ స్థితుడై ఆత్మానుభూతియందు ఉండుదునని ఆ మహానుభావుడు ప్రహ్లాదునకు ఈ పరమ హంస ధర్మమును చెప్పెను.

*****

## అర్జునుడు

కురుక్షేత్రమున శ్రీకృష్ణుడు, మోక్షమార్గముగా సాంఖ్య పద్ధతిని, యోగ పద్ధతిని చెప్పినాడు. ఇందు **సాంఖ్య పద్ధతి**కి ఉదాహరణగా అర్జునుని సాధనను వివరించినాడు.

అంతఃకరణ సంతాప శమనంబులగు హరివచనంబులను దలంచి కాల కర్మ భోగ అభినివేశంబులచేత ఆవృతంబైన విజ్ఞానంబు క్రమ్మర అధిగమించి హేతు మద్భావంబున శోకహేతువు అహంకార మమకారాత్మకంబైన ద్వైత భ్రమయనియు, ద్వైత భ్రమకు కారణము దేహమనియు, దేహమునకు బీజము లింగంబనియు, లింగంబునకు మూలము గుణములనియు గుణమునకు మూలము ప్రకృతియనియు బ్రహ్మమనియెడు జ్ఞానంబున లీనమై ప్రకృతి లేకుండుననియు ప్రకృతి అడంగుట నైర్గుణ్యమనియు నైర్గుణ్యము వలన కార్యలింగనాశంబనియు కార్యలింగనాశంబున అసంభవంబగు ప్రకృతిని బాసి క్రమ్మఱ స్థూలశరీర ప్రాప్తుండుగాక పురుషుండు సంయక్భోగంబున నుండునని వితర్కించి శోకంబు వర్జించి సదా ధ్యాన భక్తి వివేకంబుల కామ క్రోధముల జయించి నిరంతర హరిచరణారవింద చింతామల బుద్ధియై దేహమును వదలి జీవత్వమును నశింప చేసికొని ఆత్మయైనాడు.

బ్రాహ్మీ స్థితి పొందిన వారిని పండితుడని, యోగారూఢుడని, పరమ హంసఅని, ఏకాంత భక్తుడని, యోగి అని, జ్ఞాని అని, మహాత్ముడని, ఆత్మజ్ఞుడని, విదేహుడని అందురు.

**ముగింపు:-** **నాన్యపంథావిద్యతేఽ యనాయ.**

| | | |
|---|---|---|
| అయనాయ | = | జీవుడు అమృతత్త్వము కొఱకు పయనించుటకు ఈ మార్గము తప్ప |
| అన్యః పంథా | = | ఇంకొక మార్గము |
| న విద్యతే | = | లేదు. |

జీవుడు ఆత్మను చేరు మార్గము ఒక్కటే. మార్గములలో భిన్నత్వము లేదు. ఆచరణ పద్ధతులలో కర్మ, యోగ, భక్తి, సాంఖ్యములు ప్రారంభములో భిన్న పద్ధతులుగా చెప్పబడిననూ, ఆరూఢ స్థాయిలో ఇవి అన్నియు ఒక్కటిగా త్రివేణీ సంగమముగా రూపు దాల్చును.



జీవుడు సృష్టిలోనికి ప్రకృతి నుంచి ఏమార్గమున వచ్చెనో అదే మార్గమున తిరిగి పయనించి ప్రకృతిని వీడి పరబ్రహ్మమును చేరవలయును. అందు వలన రామాయణములో రాముడు అయోధ్యనుంచి ఏమార్గమున లంక చేరెనో అదే మార్గమున తిరిగి అయోధ్యకు చేరినట్లు వర్ణింప బడినది. ఒకటి అవరోహణ. అనగా జీవుడు దేహములోనికి ప్రవేశించుట. ఇంకొకటి ఆరోహణ. జీవుడు ఏమార్గమున దేహములోనికి వచ్చెనో ఆ మార్గములో క్రిందనుంచి పైకి ఒక్కొక్క మెట్టు ఎక్కి జీవుడు ఆత్మను చేరవలయును. ఈ మార్గమునే భాగవతము ద్వితీయ స్కంధములో ఇట్లు వివరించెను.

**".. వైష్ణవ పదారోహణంబు సేయువాఁడు నిర్భయుండై మెల్లన లింగ దేహంబునఁ బృథివ్యాత్మకత్వంబు నొంది యట్టి పృథివ్యాత్మకత్వంబున ఘ్రాణంబున గంధంబును, జలాత్మకత్వంబున రసనేంద్రియంబున రసంబును, దేజోరూపకత్వంబున దర్శనంబున రూపంబును, సమీరణాత్మకత్వంబున దేహంబున స్పర్శనంబును, గగనాత్మకత్వంబున శ్రవణంబున శబ్దంబును, నతిక్రమించి భూతసూక్ష్మేంద్రియ లయస్థానంబైన యహంకారావరణంబున సంప్రాప్తుండై యందు మనోమయంబును, దేవమయంబునునైన సాత్త్వికాహంకార గమనంబున మహత్తత్త్వంబు సొచ్చి, గుణ త్రయంబున లయించి, ప్రధానంబు నొంది, ప్రధానాత్మకత్వంబున దేహంబును, నుపాధి పరంపరావసానంబునం బ్రకృతిం బాసి యానందమయుండై యానందంబునం బరమాత్మరూపంబైన వాసుదేవ బ్రహ్మంబునందుఁ గలయును.."**(భాగవతము, ద్వితీయస్కంధము, 32)

అనగా దేహము నశించునని, దేహి నశించడని గ్రహించి మృత్యు భయమును నిరసించి లింగదేహమున అనగా మనస్సుచే జ్ఞానేంద్రియములగు చెవులు, చర్మము, కన్ను, నాలుక, ముక్కు వీటిని వాటి ఇంద్రియార్థములగు శబ్ద స్పర్శరూపరస గంధములనుంచి మనస్సుచే నిగ్రహించి వేఱుచేయవలయును. ఆ తరువాత చిత్త శుద్ధి కలిగి మనస్సును బుద్ధిని ఏకీకృతము చేసి హృదయగత ఆత్మ యందు ఉంచవలయును. తదుపరి ప్రకృతిని వీడవలయును. అనగా గుణములను వీడి గుణ రహితుడయి ఉండవలయును. ఆనందమయుడై జీవన్ముక్తుడయి

ఉండవలయును. దేహ త్యాగసమయమున ప్రాణములను బ్రహ్మ రంధ్రము చేర్చి, మనస్సుచే నామస్మరణ చేయుచు మనస్సు లయింప చేసి బ్రహ్మ రంధ్రము చించి బ్రహ్మమందు కలియును.

*****

స్వస్తి ప్రజాభ్యః పరిపాలయంతాం న్యాయేన మార్గేణ మహీం మహీశాః
గోబ్రాహ్మణేభ్యః శుభమస్తు నిత్యం లోకాః సమస్తాః సుఖినో భవంతు
కాలే వర్షతు పర్జన్యః పృథివీ సస్యశాలినీ,
దేశోఽయం క్షోభరహితో బ్రాహ్మణాః సంతు నిర్భయాః
అపుత్రాః పుత్రిణః సంతు పుత్రిణః సంతు పౌత్రిణః
అధనాః సధనా సంతు జీవంతు శరదాం శతమ్
కాయేనవాచా మనసేంద్రియైర్వా బుద్ధ్యాత్మనా వా ప్రకృతేః స్వభావాత్
కరోమి యద్యత్ సకలం పరస్మై నారాయణాయేతి సమర్పయామి

పరమ ఋషిభ్యో నమః పరమ ఋషిభ్యో నమః
ఓం శాంతిశ్శాంతిశ్శాంతిః

*****



# అథర్వవేదము

యే త్రిషప్తాః పరియన్తి విశ్వా రూపాణి బిభ్రతః ।
వాచస్పతి  ర్బలా తేషాం తన్వో అద్య దధాతు మే ॥

(అథర్వ వేదము, ప్రథమః కాండః ప్రథమ ప్రపాఠకః-1)

లోకములో ప్రసిద్ధులైన అగ్ని, వాయువు, ఆదిత్యులు, సప్త మరుద్గణములు, సర్వ స్థావర జంగమ రూపములు, ధరియించి తిరుగుచున్న వారియొక్క శరీర బలములను మఱియు వారియొక్క జ్ఞానమును నాకు పరబ్రహ్మ ఇప్పుడు ఇచ్చుగాక.

*****



# ముండక ఉపనిషత్

# శాంతి పాఠము

ఓం ॥ భద్రం కర్ణేభిః శృణు యామ దేవాః భద్రం పశ్యేమాక్షభిర్యజత్రాః ।
స్థిరై రంగై స్తుష్టువాగ్ం సస్తనూభిః వ్యశేమ దేవహితం యదాయుః ॥
స్వస్తి న ఇంద్రో వృద్ధ శ్రవాః స్వస్తి నః పూషా విశ్వవేదాః ।
స్వస్తి న స్తార్క్ష్యో౽రిష్టనేమిః స్వస్తి నో బృహస్పతి ర్దధాతు॥

**ఓం శాంతి శాంతి శాంతిః**

భద్రం - కర్ణేభిః - శృణుయామ - దేవాః - భద్రం - పశ్యేమ - అక్షిభిః - యజత్రాః స్థిరైః - అంగైః - తుష్టువాగ్ంసః - తనూభిః - వ్యశేమ - దేవహితం - యత్ - ఆయుః - స్వస్తి - నః - ఇంద్రః - వృద్ధశ్రవాః - స్వస్తి - నః - పూషా - విశ్వవేదాః - స్వస్తి - నః - తార్క్ష్యః - అరిష్టనేమిః - స్వస్తి - నః - బృహస్పతిః - దధాతు.

| | | |
|---|---|---|
| (హే) దేవాః | = | ఓ దేవతలారా! మేము |
| కర్ణేభిః | = | చెవులచేత |
| భద్రం | = | శుభమైన దానిని అనగా మంచి వాటిని |
| శృణుయామ | = | వినెదము గాక. అనగా చెడు మాటలను వినకుందుము గాక |
| యజత్రాః | = | పూజింపదగిన ఓ దేవతలారా |
| అక్షభిః | = | కన్నుల ద్వారా |
| భద్రం | = | శుభమైన వాటిని అనగా మంచి వాటిని |
| పశ్యేమ | = | చూచెదము గాక. అనగా చెడును చూడ కుందుము గాక. అటులనే చెడు మాటలను మాటలాడ కుందుము గాక |
| దేవహితం | = | దేవతలకు ఆనందము గలుగునట్లు పుణ్య కార్యములను |
| స్థిరైః | = | స్థిరమైన అనగా అచంచల దీక్షతో |
| అంగైః | = | ఇంద్రియములచేత |
| తనూభిః | = | శరీరముచేత- దేవతల కొఱకు యజ్ఞ యాగములు చేయుచూ |
| యత్+ఆయుః+ తుష్టువాగ్ం సః | = | జీవించి యున్నంత కాలము పుణ్యకార్య ములు చేసి ఉన్నదానితో తృప్తిపడి - మీ కీర్తిని గానము చేయుచూ |
| వ్యశేమ | = | జీవించెదము గాక |
| నః | = | మాకు |
| వృద్ధశ్రవాః+ఇంద్రః | = | సనాతన పురుషుడయిన, కీర్తివంతుడు అయిన ఇంద్రుడు |
| స్వస్తి | = | శుభము చేయుగాక |
| నః | = | మాకు |
| విశ్వవేదాః+పూషా | = | సర్వజ్ఞుడయిన సర్వజీవపోషకుడయిన సూర్య భగవానుడు |
| స్వస్తి | = | శుభము చేయుగాక |
| నః | = | మాకు |
| అరిష్టనేమిః+తార్క్ష్యః | = | (అరిష్ట- అశుభము; నేమి- శత్రువు) అనగా శుభకరుడయిన గరుత్మంతుడు |
| స్వస్తి | = | శుభము చేయుగాక |
| నః | = | మాకు |
| బృహస్పతిః | = | దేవతలకు గురువయిన బృహస్పతి |
| స్వస్తి | = | శుభములు |
| దధాతు | = | ఇచ్చుగాక |

*****

# ప్రథమ ముండకే - ప్రథమ ఖండః

వేదము భావ బాహుళ్యముగలది. సృష్ట్యాదియందున్న ఆత్మకు, ఆదిపురుషునకు, విరాట్‌పురుషునకు, సృష్టిలోని అంతర్యామికి, దేహములో హృదయగుహలోగల ఆత్మకు, జీవాత్మకు కూడ ఆత్మ అను పదమును వాడుదురు. సందర్భానుసారముగా వీటిలో గల ఒకదానిని గ్రహించవలయును.

పరబ్రహ్మ, చతుర్ముఖబ్రహ్మ మఱియు బ్రహ్మవిద్య యొక్క విశిష్టత గుఱించి వివరింపబడినది.

**ఓం బ్రహ్మా దేవానాం ప్రథమః సంబభూవ విశ్వస్య కర్తా భువనస్య గోప్తా।**
**స బ్రహ్మవిద్యాం సర్వవిద్యాప్రతిష్ఠా మథర్వాయ జ్యేష్ఠ పుత్రాయ ప్రాహ ॥**

బ్రహ్మా - దేవానాం - ప్రథమః - సంబభూవ - విశ్వస్య - కర్తా - భువనస్య - గోప్తా- సః - బ్రహ్మవిద్యాం - సర్వవిద్యా ప్రతిష్ఠామ్ - అథర్వాయ - జ్యేష్ఠపుత్రాయ - ప్రాహ.

బ్రహ్మ విచారణ

ఆత్మ స్వయంభువు, స్వయంజ్యోతి, నిరుపాధికము, ఆత్మ హిరణ్మయ కోశమును నిర్మించుకొని అందువసియించి పురుషుడు అయినాడు. ఇతడు ఆదిపురుషుడు, ఇతడు స్వయంభువు, స్వయంజ్యోతి, హిరణ్మయకోశసహితుడు. ఆత్మకు, ఆదిపురుషునకు సృష్టితో సంబంధము లేదు. అతడు విరాట్‌పురుషుడుగా ఆవిర్భవించి తన నుంచి ప్రకృతిని సృజియించినాడు. దానిని అధిష్ఠించినాడు. ఇతడు స్వయంభువు, స్వయంజ్యోతి. ప్రకృతి పురుషుల సమిష్టి. ఇతడు సృష్టి-స్థితి-లయకారకుడు. ఊర్ణనాభి పగిది సృష్టి-స్థితి-లయములు చేయును.

| | | |
|---|---|---|
| బ్రహ్మా | = | స్వయంభువు అయిన విరాట్‌పురుషుడు |
| విశ్వస్య | = | విశ్వము యొక్క ప్రారంభ |
| కర్తా | = | సృష్టికర్త. |
| భువనస్య | = | విశ్వము యొక్క |
| గోప్తా | = | రక్షకుడు. అనగా విశ్వరక్షకుడు మఱియు లయకారకుడు. **చతుర్ముఖ** బ్రహ్మ నారాయణుని నాభికమలములో నుంచి |
| సంబభూవ | = | అభివ్యక్తుడయ్యెను. ఉద్భవించెను. ఈ బ్రహ్మ |
| దేవానాం | = | దేవతలలో |
| ప్రథమః (సన్) | = | ప్రథముడు, దేవతలందరి కంటే ప్రథముడు. అనగా దేవతా జ్యేష్ఠుడు |



బ్రహ్మ విద్య - గురు పరంపర

| | | |
|---|---|---|
| సర్వవిద్యా ప్రతిష్ఠాం | = | మధు విద్య, భార్గవీవిద్య వారుణీ విద్య మొదలయిన సర్వ విద్యలు ప్రతిష్ఠితమై ఉన్నదియు, పరవిద్య అపరవిద్యలు ప్రతిష్ఠితమైయున్న |
| బ్రహ్మ విద్యాం | = | బ్రహ్మవిద్యను అనగా ఇహలోక పరలోకములకు సంబంధించిన సర్వవిషయములను మఱియు ఆత్మను దర్శించు విధి విధానమును, ఆత్మలో ఐక్యమగు విధానమును విమల జ్ఞానమును - ''యేనాఽశ్రుతం శ్రుతం భవతి అమతం మత **మవిజ్ఞాతం విజ్ఞాతం**''- అగు బ్రహ్మ విద్యను |
| సః | = | ఆ పర బ్రహ్మ అతని |
| జ్యేష్ట పుత్రాయ | = | జ్యేష్ఠ పుత్రుడయిన చతుర్ముఖ బ్రహ్మకు |
| ప్రాహ | = | ప్రసాదించెను. ఆ చతుర్ముఖ బ్రహ్మ ఆ బ్రహ్మ విద్యను |
| అథర్వాయ | = | అథర్వునకు బోధించెను. |

**బృంహతి వర్ధయతి ప్రజాఇతి బ్రహ్మ.** బృహి వృద్ధౌ - ప్రజలను వృద్ధి పొందించువాడు అని బ్రహ్మపదము పుంలింగమైనప్పుడు అర్థము. బ్రహ్మన్ శబ్దము నపుంసకమయినప్పుడు పరమాత్మ అని అర్థము. స్వయంభువు అయిన విరాట్ పురుషునిని **సబ్రహ్మ సశ్శివ స్సహరిస్సేన్ద్రస్సోఽక్షరః పరమ స్స్వరాట్** - అన్నది వేదము. "**సబ్రహ్మా సశ్శివః సేన్ద్రః సోఽక్షరః పరమః స్వరాట్ స ఏవ విష్ణుః సప్రాణః సకాలోఽగ్నిః స**

చంద్రమాః'' అన్నది కైవల్య ఉపనిషత్.

**తత్త్వవిదులు జ్ఞానంబను పేర నద్వయంబైన యది తత్త్వంబని యెఱుంగుదురు. ఆ తత్త్వంబు నౌపనిషదులచేత బ్రహ్మమనియు, హైరణ్య గర్భులచేతం బరమాత్మ యనియు, సాత్త్వతులచేత భగవంతుండనియును బలుకంబడు.**

( భాగవతం - ప్రథమ స్కంధము -58).

ఆత్మ సర్వవ్యాపకత్వము గలది. కావున విష్ణువు అని అందురు. **విష్ణుః - విశ్వం వేవేష్టి వ్యాప్నోతీతి విష్ణుః** విష్ణ వ్యాప్తౌ విశ్వమును వ్యాపించియుండువాడు. సృష్ట్యాది యందున్న బ్రహ్మ (ఆత్మ) స్వయంజాతుడు. ఇతనిని పరబ్రహ్మమని-లోకవ్యవహారమున చెప్పుదురు. నారాయణుని, నాభికమలములో నుంచి చతుర్ముఖ బ్రహ్మ అభివ్యక్తుడయ్యెను లేక ఉద్భవించెను. ఇతనిని బ్రహ్మ యని వ్యవహరింతురు. ఇతడు అయోనిజుడు. ప్రారంభసృష్టి విరాట్‌పురుషుడు చేసినాడు. ఈ సృష్టిని సర్గము అని అందురు. ఇతడు అనంతర సృష్టిచేయు సామర్థ్యమును చతుర్ముఖ బ్రహ్మకు ఒసగినాడు.

శా॥ నానా స్థావర జంగమ ప్రకరముల్ నాయంత నిర్మింప వి
**జ్ఞానం బేమియు లేక తొట్రుపడ నిచ్చున్ నాకు సర్వానుసం**
**ధానారంభ విచక్షణత్వము మహోదారంబుగా నిచ్చె ము**
**న్నే నా యీశ్వరునాజ్ఞఁగాక జగముల్ నిర్మింప శక్తుండనే**

(భాగవతం - ద్వితీయ స్కంధం - 81)

ఆ విజ్ఞానముతో (చతుర్ముఖ) బ్రహ్మ సృష్టి చేసినాడు. ఇదియు అయోనిజ సృష్టియే. దీనిని అనంతర సృష్టి లేక విసర్గము అని అందురు.

**పరబ్రహ్మ - చతుర్ముఖ బ్రహ్మ**

చతుర్ముఖ బ్రహ్మ - నారాయణుని నాభి నుండి జనియించిన పద్మములో ఆవిర్భవించినాడు అని రూఢికార్థమున చెప్పబడును.

యౌగికార్థమున - చతుర్ముఖ బ్రహ్మ - ఆవిర్భవించుటగా చెప్పబడే కథ - ఆధ్యాత్మిక భావన అర్థమగుటకు ఋషులు చెప్పిన కథ. ఆత్మ - నారాయణుడు. ఆత్మయే -



జీవ ఆత్మగా సృష్టిలో విరాజిల్లుచున్నది. ఇదే చతుర్ముఖ బ్రహ్మ ఆవిర్భావము.

| | | |
|---|---|---|
| (జీవ) ఆత్మకు | - | అంతఃకరణ చతుష్టయములయిన,మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారములు నాలుగు- ముఖములు. |
| బ్రహ్మకు | - | ఇవియే నాలుగు ముఖములు. |

(చతుర్ముఖ) బ్రహ్మ-దేవతలకంటె శ్రేష్ఠుడు అనగా (జీవ) ఆత్మ - అంతః కరణములు-జ్ఞానేంద్రియ కర్మేంద్రియములకంటె శ్రేష్ఠుడు. జ్యేష్ఠుడు. జీవుడు దేహేంద్రియ మనోబుద్ధుల కంటే శ్రేష్ఠుడు.

**అథర్వఋషి వంశము :** అథర్వఋషి వంశము గుఱించి నైమిశారణ్యములోగల దధీచికుండ్ వద్ద గల దేవాలయములలో అథర్వుడు మఱియు అతని కుమారుడయిన దధీచి, దధీచి భార్య అయిన సువర్చల, దధీచి సువర్చల కుమారుడయిన పిప్పలాదులు విగ్రహరూపమున పూజింపబడుచున్నారు. దధీచి దేహత్యాగము గుఱించి అక్కడ గల పండాలు యిట్లు చెప్పుచున్నారు.

దధీచి - దేహ త్యాగసమయమున అతని శరీరమును స్నానం చేయించ గోరి ఆకాశ గంగతో సహా సమస్త నదులను ఒక చెఱువు లోనికి ఆహ్వానించిరి. అది దధీచి పేరుతో దధీచికుండ్‌గా పిలువ బడుచున్నది. ఆ నీళ్ళతో స్నానం చేయించిరి. ఆ తర్వాత దధీచి శరీరమునకు ఉప్పు రాసి, ఆవుచే నాకించగా-దధీచి శరీరమందలి రక్త మాంసాదులను ఆవు తినివేసినది. ఎముకలు మాత్రము మిగిలినవి. ఆతని వెన్నెముకతో-వజ్రాయుధము నిర్మింపబడినది. ఆ వజ్రాయుధము ఇంద్రునకు ఆయుధముగా యివ్వబడినది.

*****

బ్రహ్మవిద్యలో అనేక గురు పరంపరలు కలవు. అందు ఈ గురు పరంపర ఒకటి. ఈ గురు పరంపర

2. **అథర్వణే యాం ప్రవదేత బ్రహ్మాఽ**
**థర్వా తాం పురోవాచాఙ్గిరే బ్రహ్మవిద్యామ్ ।**

**స భారద్వాజాయ సత్యవహాయ ప్రాహ**
**భారద్వాజోఽఙ్గిరసే పరావరామ్ ॥**

అథర్వణే - యాం - ప్రవదేత - బ్రహ్మా- అథర్వా - తాం - పురా - ఉవాచ- అంగిరే - బ్రహ్మ విద్యాం - సః - భారద్వాజాయ - సత్యవహాయ- ప్రాహ - భారద్వాజః - అంగిరసే - పర- అవరామ్.

| | | |
|---|---|---|
| పురా | = | పూర్వము |
| యాం | = | దేనిని - అనగా బ్రహ్మ విద్యను పరబ్రహ్మ - చతుర్ముఖ బ్రహ్మకు చెప్పెనో అలాగ్రహించిన |
| తాం | = | ఆ |
| బ్రహ్మవిద్యాం | = | బ్రహ్మ విద్యను |
| బ్రహ్మ | = | దేవతా జ్యేష్ఠుడయిన చతుర్ముఖ బ్రహ్మ |
| అథర్వణే | = | అథర్వణు కొఱకు |
| ప్రవదేత | = | చెప్పెను. ఆ బ్రహ్మవిద్యను |
| అథర్వా | = | అథర్వణుడు |
| అంగిరే | = | అంగిరుడు అను నామము గల వానికి |
| సః | = | ఆ అంగిరుడు |
| భారద్వాజాయ+ సత్యవహాయ | = | భారద్వాజ గోత్రుడగు సత్యవహునికి |
| ప్రాహ | = | ఉపదేశించెను |
| భారద్వాజః | = | సత్యవహుడు |
| అంగిరసే | = | అంగిరసుడను వానికి |
| పర+అవరామ్ | = | గురుపరంపరా న్యాయముగా బ్రహ్మ విద్యను |
| ఉవాచ | = | ఉపదేశించెను. |

*****



గురువు అగు అంగిరసుని శిష్యుడు అయిన శౌనకుడు ఈ సర్వము దేనియందు ప్రతిష్ఠితమై ఉన్నవి ? మఱియు సర్వము తెలియుటకు దేనిని తెలుసుకొనవలయును? అనగా ఏది తెలసుకున్నచో ఈ సర్వము తెలియును? అని అడిగెను.

3. **శౌనకో హ వై మహాశాలోఽఙ్గిరసం విధివదుపసన్నః పప్రచ్ఛ కస్మిన్ను భగవో విజ్ఞాతే సర్వ మిదం విజ్ఞాతం భవతీతి**

శౌనకః - హ - వై - మహాశాలః - అంగిరసం - విధివత్ - ఉపసన్నః - పప్రచ్ఛ - కస్మిన్ - ను - భగవః - విజ్ఞాతే - సర్వమ్ - ఇదమ్ - విజ్ఞాతం - భవతి - ఇతి.

| | | |
|---|---|---|
| మహాశాలః | = | మంచి గృహస్థుడయిన |
| శౌనకః | = | శునకుని పుత్రుడు అయిన శౌనకుడు అను వాడు |
| అంగిరసం | = | గురువగు అంగిరసుని |
| విధివత్ | = | విధి విహితముగా - అనగా బ్రహ్మ విద్యను నేర్చుకొనకోరు శిష్యుడు గురువును సమీపించు విధి విధానముగా |
| ఉపసన్నః | = | సమీపించినవాడై |
| భగవః | = | ఓ భగవన్ |
| | | **మొదటి ప్రశ్న** |
| కస్మిన్+ను | = | ఎందు ఈ సర్వ విశ్వము అనగా ఈ లోకములు స్థావర జంగమములు సర్వము ప్రతిష్ఠితమై ఉన్నది? |
| | | **రెండవ ప్రశ్న** |
| విజ్ఞాతే | = | దేనిని తెలుసుకున్నచో |
| ఇదమ్ | = | ఈ |
| సర్వమ్ | = | సర్వము |
| హ +వై | = | అనగా లోక వ్యవహారములు, పుణ్యకర్మలు వాటి వలన గలుగు ఫలితములు మఱియు సృష్టి, సృష్టికర్త గుఱించి, ఆత్మదర్శనం, ఆత్మతో ఏకీభూతుడగుట మొదలగు సర్వవిషయములు |

| | | |
|---|---|---|
| విజ్ఞాతం +భవతి | = | తెలియును |
| ఇతి | = | అని - రెండు ప్రశ్నలను |
| పప్రచ్ఛ | = | వినయముగా అడిగెను. |

బంగారం గుఱించి తెలిసిన - ఆభరణముల గుఱించి, మట్టి గుఱించి తెలిసిన దాని వలన తయారగు వస్తువుల గుఱించి తెలియును. అటులనే ఈ సర్వము ఎలా వచ్చినదో తెలియుటకు దేనిని తెలుసుకొనవలయును? అని అడిగెను.

బ్రహ్మ విద్యను బోధించు గురువు - బ్రహ్మ విద్యను నేర్చుకో గోరు విద్యార్థి వీరు ఇరువురు మంచి గృహస్థులై ఉండవలయును. మంచి గృహస్థులు అనగా ధర్మయుతమయిన సంసార జీవితమును గడుపువారు - అని అర్థము.

ఇందు చెప్పబడిన 'విధివత్' -అను పదమునకు శ్రీకృష్ణ భగవానుడు భగవద్గీతలో ఇట్లు నిర్వచించినారు.

**తద్విద్ధి ప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా**
**ఉపదేక్ష్యన్తి తే జ్ఞానం జ్ఞానిన స్తత్త్వదర్శినః** (జ్ఞానయోగం-34)

| | | |
|---|---|---|
| తత్త్వదర్శినః+జ్ఞానినః | = | ఆత్మను దర్శించిన జ్ఞానులను |
| ప్రణిపాతేన | = | సాష్టాంగ నమస్కారము చేసి |
| సేవయా | = | గురువును సేవించి |
| పరిప్రశ్నేన | = | వారు చెప్పిన విషయమును ఆచరించుటకు గురువును వినయముగా అడిగి |
| తత్ | = | బ్రహ్మ తత్త్వమును |
| విద్ధి | = | తెలుసుకొనుము<br>నీ ఆచరణాభిలాషను గుర్తించి |
| తే | = | నీ కొఱకు గురువులు |
| జ్ఞానం | = | జ్ఞానమును, అనగా బ్రహ్మ విద్యను నీకు |
| ఉపదేక్ష్యన్తి | = | ఉపదేశింతురు. |

శిష్యుల యొక్క ధనకనక వస్తు వాహనాదులను గురువు కోరరాదు అని చెప్పుటకు శిష్యులు చేతులలో దర్భలు ధరియించి బ్రహ్మవిద్యకై గురువును సమీపించ



వలయునని - ప్రశ్నోపనిషత్‌లో చెప్పబడినది. శిష్యులు నిరహంకారముగా ఆడంబర రహితముగా గురువును సమీపించ వలయును మఱియు గురువు ఫలాపేక్ష రహితుడై ఉండవలయునన్నది దీని సారాంశము.

*****

### గురువు చెప్పిన సమాధానము

**4. తస్మై స హోవాచ। ద్వే విద్యే వేదితవ్యే ఇతి హ స్మ యద్బ్రహ్మ విదో వదన్తి పరా చైవాపరా చ ।**

తస్మై - సః - హ - ఉవాచ - ద్వే - విద్యే - వేదితవ్యే - ఇతి - హ - స్మ - యత్ - బ్రహ్మవిదః - వదన్తి - పరా - చ - ఏవ - అపరా - చ.

ఏది తెలుసుకున్నచో ఈ సర్వము తెలియును? అని నీవు అడిగిన ప్రశ్నకు

| | | |
|---|---|---|
| బ్రహ్మ విదః | = | బ్రహ్మతత్త్వము తెలిసిన వేదజ్ఞులు వేదములో |
| అపరా+చ+పరా+చ | = | అపరవిద్య మఱియు పరవిద్య-అనే |
| ద్వే+విద్యే+ఏవ | = | రెండు విద్యలే వివరింప బడినవని |
| వేదితవ్యే+ఇతి+ | = | ఆ రెండు విద్యలు తెలియదగినవి అని సాధన చేసి |
| హ+స్మ | | ఆత్మను దర్శించినచో ఈ సర్వము తెలియునని అనాదినుంచి |
| వదన్తి | = | చెప్పుచున్నారు. |
| యత్+హ | = | దేనిని అనగా - పరవిద్య - అపర విద్యల సమ్మేళనమయిన బ్రహ్మవిద్యను - మాకు మా గురువులు ఉపదేశించినట్లు నీకు వివరింతును అని |
| సః | = | గురువగు అంగిరసుడు గురుపరంపరా న్యాయముగా తన శిష్యుడయిన |
| తస్మై | = | శునకుని పుత్రుడయిన శౌనకునకు |
| ఉవాచ | = | వివరించెను, బోధించెను. |

బ్రహ్మవిద్య అనే మహావృక్షమునకుగల అనంత శాఖలలో అంగిరసుడు శౌనకుడు

అనే ఈ గురు పరంపర ఒకటి.

అపరవిద్యలో తను పెద్దల యడల వ్యవహరింప వలసిన విధి విధానము - తల్లి తండ్రి, అన్నదమ్ములు, బాంధవుల యెడ గల తన ధర్మము - ఇహ లోకములో ధర్మ పద్ధతిన నడుచుకొనవలసిన విధి విధానము - ధర్మ అర్థ, కామములు- జాతి ధర్మములు - ఆశ్రమధర్మములు - పుణ్యలోక ప్రాప్తికి వలయు పుణ్యకర్మాను ష్ఠానము విధి నిషేధములతో వివరింపబడును. అనగా అగ్నిహోత్రం, ఇష్టాపూర్తములు, దాన ధర్మములు మొదలయినవి వివరింపబడును. మఱియు - ఆత్మ - పురుషుడు - సృష్టి - విరాట్ పురుషుడు - జీవుడు- హృదయ గుహలో గల ఆత్మ - ఉపాధిల గుఱించి చెప్పబడును. శాస్త్రజ్ఞానము వివరించబడును. పరవిద్యలో - సాధన రహస్యములు - సాధన ఫలితము చెప్పబడును.

*****

వేద వేదాంగములు చదివి అపరవిద్యను గ్రహించి, పరవిద్యను ఆచరింపవలయును

**5. తత్రా పరా ఋగ్వేదో యజుర్వేదః సామవేదో ఽథర్వవేదః**
**శిక్షా కల్పో వ్యాకరణం నిరుక్తం ఛన్దో జ్యోతిష మితి ।**
**అథ పరా యయా తదక్షర మధి గమ్యతే ॥**

తత్ర - అపరా - ఋగ్వేదః - యజుర్వేదః - సామవేదః - అథర్వవేదః - శిక్షా - కల్పః - వ్యాకరణమ్ - నిరుక్తమ్ - ఛన్దః - జ్యోతిషమ్ - ఇతి - అథ - పరా - యయా - తత్ - అక్షరమ్ - అధిగమ్యతే

ఋగ్వేదః = ఋగ్వేదము

యజుర్వేదః = యజుర్వేదము

సామవేదః = సామవేదము

అథర్వవేదః = అథర్వవేదము అనే ఈ నాలుగు వేదములు చదవవలయును. వేదములు అపర విద్య, పరవిద్యలను బోధించినవి. (విదం త్యనేన ధర్మా ధర్మవితి వేదః విద జ్ఞానే. దీని చేత ధర్మా ధర్మముల



నెఱుంగుదురు. వేదమనగా జ్ఞానమును తెలుపు గ్రంథమని అర్థము.) వేదములను - ఈ క్రింద చెప్పబడిన వేదాంగముల ద్వారా చదివి వాటి అర్థమును గ్రహించవలయును. ఇది ఒక స్థాయి.

శిక్షా = వేదమంత్రములను ఎలా పలకవలయునో చెప్పును.

వ్యాకరణం = సంధులు, సమాసములు, అలంకారములు వివరించును. సంస్కృత భాషకు పాణిని వ్యాకరణమును రచించినాడు.

ఛన్దః = మంత్రములు - వాటి ఛందస్సు గుఱించి వివరించును.

నిరుక్తమ్ = వేదములలోని మంత్రములకు అర్థము వివరించును. యాస్కుడు నిరుక్తమును రచించినాడు.

కల్పః = పుణ్యకర్మలు చేయు విధి విధానమును వివరించును.

జ్యోతిషమ్ = పూర్వ జన్మలో చేసిన కర్మల ఫలితము వలన గలుగు సుఖదుఃఖములు కాలానుసారము ఎప్పుడు కలుగునో వివరించును.

తత్ర = ఆ వేదములందు వివరింపబడిన లోక వ్యవహారములు యజ్ఞయాగాది పుణ్య కర్మానుష్ఠానము, జీవుడు, ఆత్మ మొదలయిన వాటి గుఱించి చెప్పిన శాస్త్రజ్ఞానము

అపరా = అపర విద్య

ఇతి = అని చెప్పబడును

అథ = ఆ తర్వాత, పుణ్యకర్మలు విధి విధానముగా ఆచరించుచూ - నిష్కామపరుడై

యయా = ఏ సాధనచేత

తత్+అక్షరమ్ = అవిద్య తొలగి, జ్ఞానేంద్రియములకు అగోచరము, అగ్రాహ్యమయిన ఆ అక్షర పరబ్రహ్మ లేక ఆత్మను

| | | |
|---|---|---|
| అధిగమ్యతే | = | పొందగలుగు విద్యను అనగా ఆత్మను పొందబడు సాధనను |
| పరా | = | పర విద్య అని చెప్పబడును. ఈ పరవిద్యను తెలిసిన వాడు వేదజ్ఞుడు. |

శాస్త్రజ్ఞానము - అపరవిద్య; ఆచరణ - పరవిద్య. ఇది దేహి దేహముల సంబంధము తెలియుట - జ్ఞానము.

దేహము - దేహి - హృదయగుహలోగల ఆత్మను స్వానుభవములో తెలుసుకొనుట జ్ఞానమని శ్రీకృష్ణుని అభిప్రాయము.

**“ క్షేత్ర క్షేత్రజ్ఞయోః జ్ఞానం యత్తత్ జ్ఞానం మతం మమ”** - అని చెప్పినాడు.

(భగవద్గీత - క్షేత్రక్షేత్రజ్ఞ విభాగయోగం-2)

| | | |
|---|---|---|
| క్షేత్ర క్షేత్రజ్ఞ యోః | = | క్షేత్రము, క్షేత్రజ్ఞుల గురించి |
| జ్ఞానం | = | తెలియుట |
| యత్ + తత్ | = | ఏదో - అది |
| జ్ఞానం | = | జ్ఞానము అని |
| మమ | = | నా యొక్క |
| మతం | = | అభిప్రాయము |

క్షేత్రమును దేహమని, ఉపాధి యని అందురు. దేహము గురించి తెలిసిన, దేహ సంబంధీకులగు తల్లి, తండ్రి, పుత్రులు, బాంధవులతో గల సంబంధము తెలియును. క్షేత్రజ్ఞుడు అనగా ఆత్మ. ఈ ఆత్మయే జీవాత్మగా అయినది. ఈ జీవాత్మ, దేహమునందు ఉండి లోక వ్యవహారములు నడుపుచున్నది మరియు పుణ్యకర్మానుష్ఠానము చేయుచున్నది. హృదయ గుహలో గల ఆత్మ సాక్షిగా ఉన్నది. జ్ఞానము కలుగుట కొరకు క్షేత్ర - క్షేత్రజ్ఞుల గురించి తెలుసుకొనవలయును. కావున క్షేత్రజ్ఞుని గురించి వివరించుచున్నాను.

*****



**ఆత్మ గురించి చెప్పుచున్నాడు**

ఆత్మ గురించి ఇంతకు పూర్వము-స్వయంజాతుడు అని, సృష్టికర్త అని, లోకరక్షకుడని చెప్పితిని. ఇప్పుడు ఆత్మ గురించి మరికొన్ని లక్షణములను చెప్పుచున్నాను. సృష్ట్యాదియందున్న ఆత్మయే ఉపాధులను సృజియించి ఆ ఉపాధులలో వసియించుచున్నది. సృష్ట్యాది యందున్న ఆత్మ లక్షణములు, ఉపాధిలో ఉన్న ఆత్మ లక్షణములు ఒకటే. కావున రెండుగాగాక, ఆత్మ లక్షణములను ఒకటి గానే చెప్పుచున్నాడు. భగవద్గీతలో సాంఖ్య యోగములో సృష్ట్యాది యందున్న ఆత్మ లక్షణములను, దేహమందుగల ఆత్మ లక్షణములను ఒక్కటిగా వివరించినారు. సృష్ట్యాది యందున్న ఆత్మ మహత్. దేహములో ఉన్న ఆత్మ సూక్ష్మాతి సూక్ష్మము. అనగా పరిమాణములో భేదము తప్ప మిగిలిన లక్షణములలో భేదము లేదు.

*****

ఆత్మ గురించి వివరింపబడినది. - ధీరులు ఆత్మను దర్శించెదరు.

6. **యత్త దద్రేశ్య మగ్రాహ్య మగోత్ర మవర్ణ**
   **మచక్షుః శ్రోత్రం తదపాణి పాదమ్ ।**
   **నిత్యం విభుం సర్వగతం సుసూక్ష్మం**
   **తదవ్యయం యద్భూతయోనిం పరి పశ్యంతి ధీరాః ॥**

యత్ - తత్ - అద్రేశ్యమ్ - అగ్రాహ్యమ్ - అగోత్రమ్ - అవర్ణమ్ - అచక్షుః - శ్రోత్రమ్ - తత్ - అపాణిపాదమ్ - నిత్యం - విభుం - సర్వగతం - సుసూక్ష్మం - తత్ - అవ్యయమ్ - యత్ - భూతయోనిం - పరిపశ్యంతి - ధీరాః

సృష్ట్యాదియందున్న ఆత్మ - నిత్యం, విభుం, పుట్టుకలేనిది, అగోత్రం, అవర్ణం, రూపములేనిది, , అపాణిపాదం, అచక్షుః శ్రోత్రం, అవ్యయం, అద్రేశ్యం.

సృష్టిలో ఆత్మ - సుసూక్ష్మం, అంతర్యామి.

సృష్టికారకుడు అయిన విరాట్పురుషుడు - భూతయోనిం.

గురువు పది ప్రశ్నలకు సమాధానముగా ఆత్మ గుఱించి వివరించు చున్నాడు.

| | ప్రశ్న | | సమాధానము |
|---|---|---|---|
| 1. | ఆత్మకు ఉపాధులకు వలె పుట్టుక గలదా ? | = | లేదు. పుట్టుక లేనిది. సృష్ట్యాది యందున్న ఆత్మ స్వయంభువు |
| | యత్+తత్+అగోత్రం+ అవర్ణమ్ | = | ఏది సృష్ట్యాది యందు గలదో మఱియు ఏది ఉపాధి యందు గలదో ఆ ఆత్మ గోత్రము లేనిది. వర్ణము లేనిది. అనగా పుట్టుక లేనిది. |

పుట్టినచో వారు ఏదో ఒక గోత్రమునకు సంబంధించి ఉందురు. అటులనే బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర అనే చాతుర్వర్ణములలో ఏదో ఒక వర్ణమునకు చెంది ఉందురు. ఆత్మ పుట్టుక లేనిది గావున అగోత్రం. అవర్ణం. పుట్టిన ప్రతిదీ నశించును. ఆది అంటూ ఉంటే అంతము కూడ ఉండును. ఆత్మకు పుట్టుక లేదు గావున నశింపదు. ఆది అంతములు లేనిది. పుట్టుక లేదు అనగా స్వయంభువు.

| | | | |
|---|---|---|---|
| 2. | ఆత్మకు ఉపాధికివలె కరచరణాది కర్మేంద్రియములు జ్ఞానేంద్రియములు గలవా? | | లేవు. ఆత్మ రూపరహితుడు కావున అవ్యక్తము. |
| | తత్+అపాణిపాదమ్ | = | కాళ్ళు చేతులు లేనిది. అనగా కరచరణాదులగు కర్మేంద్రియములు లేనిది. |

కర్మేంద్రియములు లేకపోయినా కర్మేంద్రియములు చేయు పనులన్నీ చేయును అని కైవల్య ఉపనిషత్ ఇట్లు వివరించినది.

**"అపాణిపాదః అచిన్త్యశక్తిః (కైవల్య-21)"** కాళ్ళు చేతులు లేకుండా అపరి మితమైన శక్తి గలిగి యున్నాను.

అచక్షుః శ్రోత్రం = నేత్రములు, చెవులు లేనిది.

అనగా జ్ఞానేంద్రియములు లేనిది. జ్ఞానేంద్రియములు లేకపోయినా జ్ఞానేంద్రియములు చేయు పనులన్నీ చేయును అని కైవల్య ఉపనిషత్ ఇట్లు వివరించినది. **"అచక్షుః పశ్యామి అకర్ణః శృణోమి"** - (కైవల్య 21). కన్నులు లేకుండా చూచెదను. చెవులు లేకుండా వినెదను.

| | | | |
|---|---|---|---|
| 3. | ఆత్మ-ఎక్కడ గలదు? సర్వగతం | = | సర్వత్రా గలదు. అనగా విశ్వమునకు వెలుపల, విశ్వములోనూ గలదు. సర్వత్రాగలదు. |
| 4. | ఉపాధి నశించిన ఆత్మ కూడా నశించునా? | = | నశింపదు |
| | నిత్యం | = | ఆత్మ శాశ్వతమైనది. |

ఉపాధి నశించు స్వభావముగలది. ఆత్మ - ఉపాధివలె నశించు స్వభావము లేదు. ఉపాధి నశించినా ఆత్మ నశింపదు.

| | | | |
|---|---|---|---|
| 5. | సృష్ట్యాదియందున్న ఆత్మ- సర్వ ఉపాధులలోనికివచ్చినది గదా. అటువంటప్పుడు ఆత్మ ఏమయినా వ్యయమయినదా ? | | లేదు. ఆత్మ అవ్యయము |
| | తత్+అవ్యయం | = | వ్యయము కాలేదు. |

ఒక బస్తా పంచదారలోనుంచి కొంత పంచదార వాడినచో - ఆ వాడిన పంచదార, మొత్తం పంచదార బస్తా నుంచి వ్యయమగును గదా. అటులనే మన వద్ద 100 రూపాయలు ఉన్నవి. అందులో నుంచి 20 రూపాయలు ఖర్చుపెట్టిన - ఆ 20/- రు. వ్యయం అయి మన వద్ద 80/- రు. ఉండును. ఆ విధముగా సృష్ట్యాది యందున్న ఆత్మ - సమస్త జీవరాసులలో వసియించునప్పుడు ఏమయినా వ్యయమయినదా? వ్యయం కాలేదు. ఎందుకంటే మనము అద్దములో చూచు కుంటే మనవంటి ప్రతిబింబము అద్దంలో కనిపించును. అటులనే ఒక అద్దంకు ఎదురుగా (180 డిగ్రీ) మఱి యొక అద్దం వుంటే అసంఖ్యాక ప్రతిబింబములు కనిపించును గదా. అప్పుడు మనము ఏమయినా వ్యయము అయితిమా? కాలేదు గదా. అటులనే ఆత్మ - మాయావరణ అనే అద్దంలో సర్వజీవరాసులుగా ప్రతిబింబితమయినది.

కావున ఆత్మ వ్యయం కాలేదు. కావున ఆత్మ అవ్యయము.

6. ఆత్మ స్వయంగా పనిచేయునా? లేక చక్రవర్తి వలె-సేవకులు చేయు పనులను గమనించుచూ, సేవకులచే పనిచేయించునా? — చక్రవర్తి వలె ప్రేరకుడు

విభుం = ప్రభువు, సర్వనియామకుడు.

ఇంద్రుడు, అగ్ని, వాయువు, మృత్యువు ఇలా సర్వదేవతలకు విధులను నిర్దేశించినాడు. అటులనే ఉపాధిలోని కర్మేంద్రియ, జ్ఞానేంద్రియ, ప్రాణము మనస్సులలో ఒక్కొక్క దానికి ఒక్కొక్క పనిని నిర్దేశించి వాటిచే ఆ పనులను చేయించును. ఆత్మ నిరీక్షకుడు, పర్యవేక్షకుడు, సాక్షియే తప్ప స్వతహాగా ఏ పనీ చేయదు. చక్రవర్తి పర్యవేక్షణ లేనిచో సేవకులు తమ విధులు సరిగా పనిచేయనట్లు ఆత్మ లేనిచో ఉపాధి పని చేయదు. చక్రవర్తి రాజ్యమును వీడి కారడవుల పాలయిన రాజ్యం పరుల పాలగును. అటులనే ఆత్మ దేహమును వీడిన దేహము బూడిద పాలగును. ఆత్మ-ఉపాధిలోని ఇంద్రియాదులకు పనులను నిర్దేశించును.

ఈ విషయమునే ఈశ ఉపనిషత్ ఇట్లు చెప్పినది. **"మాతరిశ్వా ఆపః దదాతి"-ఈశ.8 "అర్థాన్ వ్యదధాత్ శాశ్వతీభ్య సమాభ్యః" ఈశ -8.**

7. ఉపాధులకు పుట్టిన చోటు ఏది? — విరాట్పురుషుడు (హిరణ్యాగర్భుడు)

భూత యోనిం = దేవ, దానవ, మానవ, పశు పక్ష్యాది సర్వ స్థావర జంగమములకు పుట్టుక స్థానము విరాట్ పురుషుడు

8. ఆత్మను జ్ఞానేంద్రియముల ద్వారా గ్రహించగలమా? — గ్రహించలేము

అద్రేశ్యం (అదృశ్యం) = కన్నులకు కనబడదు స్థూల చక్షువులకు గోచరము కాదు. ఆత్మను మనస్సు, ప్రాణము, ఇంద్రియములు దర్శించలేవు.



ఈ విషయమునే కేన ఉపనిషత్ ఇట్లు చెప్పినది. **న తత్ర చక్షుర్గచ్ఛతి** - (కేన 1-3) అక్కడకు స్థూల చక్షువులు చేరలేవు. అనగా బాహ్య చక్షువులకు ఆత్మ గోచరము కాదు.

8. (ఆ)

గాలిని కన్నులతో చూడలేము. అయితే గాలిని స్పర్శ వలన గ్రహించగలము అటులనే ఒక పదార్థము యొక్క రుచిని నాలుక ద్వారా గ్రహించగలము. శబ్దమును చెవుల ద్వారానూ, పరిమళమును ముక్కు ద్వారానూ, భావములను మనస్సు ద్వారానూ గ్రహించగలము. ఆ విధముగా ఆత్మను మిగిలిన జ్ఞానేంద్రియముల ద్వారా గ్రహించగలమా? — గ్రహించలేము.

అగ్రాహ్యం = ఇతర జ్ఞానేంద్రియములయిన చెవులు, చర్మము, నాలుక, ముక్కు మనస్సు ద్వారా కూడ గ్రహించ లేము.

ఈ విషయమునే కేన ఉపనిషత్ ఇట్లు చెప్పినది. **"నవా గచ్ఛతి నో మనః"** (కేన1-3) అక్కడకు మనస్సు కూడ వెళ్లలేదు. అనగా మనస్సు ద్వారా కూడ గ్రహించలేము.

9. ఉపాధులలో గల ఆత్మ పరిమాణం ఎంత? — సూక్ష్మాతి సూక్ష్మము

సుసూక్ష్మం = మిక్కిలి సూక్ష్మమయినది.

కంటికి కనబడని సూక్ష్మజీవులలో కూడ ఆత్మగలదు కావున ఆత్మ సుసూక్ష్మము. ఈ విషయమునే కైవల్య ఉపనిషత్ ఇట్లు చెప్పినది. **"సూక్ష్మాత్ సూక్ష్మతరం"** - (కైవల్య 16).**" అణోరణీయాన్"**- (కైవల్య 22)

10. అద్రేశ్యం, అగ్రాహ్యం అయితే ఆత్మను ఎవరు మాత్రము గ్రహించగలరు? — ప్రజ్ఞా చక్షువులచే ధీరులు గ్రహించగలరు.

| | | |
|---|---|---|
| యత్ + తత్ | = | దేని గుఱించి యింతవఱకు వివరించితినో దానిని అనగా ఆత్మను |
| ధీరాః + పరిపశ్యంతి | = | ధీరులు సాధన వలన ఆత్మను దర్శింతురు. |

ఆత్మను జీవుడు గ్రహించగలడు. ఇంద్రియములు గ్రహించలేవు. ఈ విషయమునే కేన ఉపనిషత్ ఒక చిన్న కథగా చెప్పినది.

జీవుడే ఇంద్రుడు. సర్వదేవతలకు అధిపతి ఇంద్రుడు. సర్వేంద్రియములకు అధిపతి జీవుడు. సర్వేంద్రియములే సర్వదేవతలు. స్థూల, సూక్ష్మ, కారణ శరీరములనే మూడు శరీరములే మూడు లోకములు, ఈ మూడు శరీరములకు అధిపతి జీవుడు. త్రిలోకములకు అధిపతి ఇంద్రుడు. ఆత్మయే జీవాత్మ అయినది గావున అటు ఆత్మ పరంగానూ, ఇటు జీవాత్మ పరంగానూ అనేక కథలుగా సాధన రహస్యములను ఇంద్రుని పరంగా పురాణములలో చిత్రీకరించినారు.

ఆత్మను జీవుడు ఎట్లు గ్రహించగలడు? అన్న ప్రశ్నకు కఠోపనిషత్ బుద్ధి ద్వారా ఆత్మతత్త్వమును గ్రహించవలయును అని నచికేతుడు యమునిద్వారా, ఆత్మ తత్త్వమును గ్రహించెనని చెప్పినది. నచికేతుడు అనగా బుద్ధి.

**"హిరణ్మయేన పాత్రేణ సత్యస్యాపిహితం ముఖమ్"- ఈశ-14**
బంగారు మేలిముసుగు అనగా హృదయ కోశంలో
జాజ్వల్యమానంగా ప్రకాశించే అగ్ని జ్వాలల మధ్యలో ఆత్మ కలదు.
ఆత్మను దర్శించి

**"యోఽసావసౌ పురుషఃసోఽహమస్మి" - (ఈశ 15)**

ఎవడు అక్కడగలడో ఆ పురుషుడు నేనే అని గ్రహించినాడు. జీవుడే ఈశ్వరుడని ఈశఉపనిషత్ చెప్పినది.

ముండక ఉపనిషత్ ఆత్మ లక్షణములు చెప్పగా కేన ఉపనిషత్ ఆత్మను ఎవరు గ్రహించగలరనియు, కఠోపనిషత్ బుద్ధి ద్వారా గ్రహించవలయుననియు ఈశ ఉపనిషత్ ఆత్మను దర్శించి, తనే ఆత్మయని స్వానుభవంతో గ్రహించవలయు ననియు వివరించినవి.

*****



సృష్టి :-

1. సాలెపురుగువలె అనగా ప్రధానకారణము తనే అయి తన నుంచి ఉపాదానకారణమయిన ప్రకృతిని సృజియించి - ఆ ప్రకృతిని అధిష్ఠించి సృజియించుట.
2. క్షేత్రమున బీజము నుంచి అనగా భూమిలో విత్తనమును ఉంచి సృజియించుట.
3. స్త్రీ యోనియందు పురుషుడు వీర్యమునుంచుట, తద్వారా స్త్రీ గర్భము దాల్చి ప్రసవించుట.
4. అండసృష్టి - అండమునుంచి పిల్ల వచ్చినట్లు సృష్టి బహిర్గతమగుట.

ఈ నాలుగు విధములయిన సృష్టులలో ఊర్ణనాభి పగిది సృష్టి గుఱించి ఇందు వివరించినాడు.

ప్రారంభ సృష్టి - విరాట్పురుషుడు చేసినాడు
అనంతర సృష్టి - చతుర్ముఖ బ్రహ్మ చేసినాడు.
ఉపాధులు మాత్రమే సృజియింపబడును. ఆ ఉపాధులలో జీవరూపమున, ఆత్మ రూపమున సృష్ట్యాదియందున్న ఆత్మ ప్రవేశించి వసియించును.

*****

7. **యథోర్ణనాభిః సృజతే గృహ్ణతే చ యథా పృథివ్యా మోషధయః సంభవన్తి।**
   **యథా సతః పురుషాత్ కేశలోమాని తథాఽక్షరాత్ సంభవ తీహ విశ్వం ॥**

యథా - ఊర్ణనాభిః - సృజతే - గృహ్ణతే - చ - యథా - పృథివ్యామ్ - ఓషధయః - సంభవన్తి - యథా - సతః - పురుషాత్ - కేశలోమాని - తథా - అక్షరాత్ - సంభవతి - ఇహ - విశ్వం.

| | | |
|---|---|---|
| ఇహ | = | ఇక్కడ |
| యథా | = | ఏవిధముగా |
| ఊర్ణనాభిః | = | సాలెపురుగు |
| సృజతే | = | తన నోటి నుంచే ఒక ద్రవ పదార్థమును తీసి |

| | | |
|---|---|---|
| | | గూడును నిర్మించునో (ఇది సృష్టి) |
| చ | = | మఱియు ఆ గూడులో విహరించునో (ఇది స్థితి) |
| గృహ్ణతే | = | తిరిగి ఆ గూడును లయము చేయునో (ఇది లయము) ఆ విధముగా విరాట్‌పురుషుడు - విశ్వమును తన వలన గలిగిన ప్రకృతి వలన సృజియించును. ఆ విశ్వములో అంతర్యామి రూపంబున విహరించును. తిరిగి ఆ విశ్వమును లయము చేయును. |
| తథా | = | ఆ విధముగా |
| అక్షరాత్ | = | విరాట్‌పురుషుని వలన |
| విశ్వం | = | ఈ విశ్వము |
| సంభవతి | = | గలుగుచున్నది మఱియు లయమగుచున్నది. |
| యథా | = | ఏ విధముగా |
| పృథివ్యామ్ | = | భూమిని దున్నుట వలన కాలానుసారము భూమి యందు |
| ఓషధయః | = | ఓషధులు/పంటలు |
| సంభవన్తి | = | గలుగుచున్నవో |

ఆ విధముగా ఆత్మ వలన **కాల పరిణామమున** సృష్టిగలుగు చున్నది అనగా విశ్వము గలుగుచున్నది.

### సృష్టి అభివృద్ధి

| | | |
|---|---|---|
| యథా | = | ఏ విధముగా |
| సతః | = | జీవించియున్న మానవుడు ఆహారము గ్రహించుట వలన |
| పురుషాత్ | = | మానవుని శరీరముపై అతడు పుట్టిన నాటి కంటె |
| కేశలోమాని | = | కేశములు, రోమములు అభివృద్ధి అగుచున్నవో ఆ విధముగా జీవరాసులు **ఆహారమును గ్రహించి** అభివృద్ధి పొందుచున్నవి. |



గత మంత్రంలో విరాట్‌పురుషుడు - భూతయోని అని చెప్పి అధిభౌతికమయిన విశ్వములేక ఉపాధి లేక క్షేత్రము ఎటుల ఏర్పడినదో ఇప్పుడు వివరించినాడు.

గత శ్లోకములో క్షేత్రజ్ఞుని గుఱించి చెప్పి ఇప్పుడు క్షేత్రము గురించి చెప్పినాడు.

1. ఉపాధి ఏల అవసరము? సృష్ట్యాది యందున్న ఆత్మ నిరుపాధికము గదా. విశ్వంలో కూడ ఆత్మ-ఉపాధి లేకుండా ఉండ లేదా?

గంగానదిలో ప్రవహించే గంగాజలమునకు ఏ పాత్ర అవసరము లేదు. కాని ఆ గంగా జలమునే ఇంటిలో ఉంచుటకు ఒక బిందెగాని, ఒక కుండగాని, ఒక చెంబుగాని, ఒక గ్లాసుగాని లేదా ఏదో ఒక పాత్ర గాని అవసరము గదా. అటులనే సృష్ట్యాది యందున్న ఆత్మకు - ఉపాధి అవసరము లేదు. కాని సృష్టిలో గల ఆత్మకు విశ్వము లేదా ఉపాధి అనేది అవసరము. సృష్ట్యాదియందున్న ఆత్మ - గంగానదిలోని గంగా జలము - విశ్వంలో చరించే ఆత్మ ఒక పాత్రలో గల గంగాజలము.

ఉదా:- సాలె పురుగు తన నోటి నుంచి జనియించిన ఒక ద్రవ పదార్థముతో గూడును నిర్మించును. ఇది సృష్టి. సాలెపురుగు ఆ గూడులో విహరించును - ఇది స్థితి. మరల ఆ గూడును తన లోనికి గ్రహించును - ఇది లయము. అటులనే విరాట్ పురుషుడు, కారణము అనే ప్రకృతి నుంచి కార్యము అనే విశ్వమును సృజియించి అందు విహరించి తిరిగి లయము చేయును. సాలె పురుగు - గూడును నిర్మించుటలో స్వప్రయోజనం కలదు. అటుల బ్రహ్మ లేక ఆత్మకు విశ్వం నిర్మించుటలో ఏమయినా స్వప్రయోజనం గలదా ? ఏ లాభంబు రాదలంచి జగముల్ నిర్మించే? అని నారదుడు బ్రహ్మను అడిగెను. విరాట్‌పురుషునకు సృష్టి వలన స్వప్రయోజనము లేదు.

విశ్వము - ఆత్మ యొక్క సంకల్పము వలన అకస్మాత్తుగా ఆవిర్భవించినదా? లేక కొంతకాల వ్యవధిలో ఆవిర్భవించినదా ? కొంత కాలవ్యవధిలో వచ్చినది.

వ్యవసాయదారుడు పంట వేయుదునని సంకల్పించును. ఆ సంకల్పానుసారము పంటను పండించును. ఆ పంట కొంతకాలమునకు పండును. అటులనే విరాట్ పురుషుడును విశ్వమును సృజియించ సంకల్పించి తన వీర్యమును ప్రకృతి

యందుంచెను. కొంతకాలమునకు **క్రమ పరిణామమున** విశ్వము ఆవిర్భవించినది.

విజ్ఞానశాస్త్రము కూడ ఇదే విషయమును చెప్పుచున్నది. ఈ విశ్వము కలవంటిది కాదు. రజ్జు సర్పభ్రాంతికాదు. శుక్తి రజత భ్రాంతి కాదు. ఎండమావులలోని నీరు వంటిది కాదు. బ్రహ్మకు అనగా - ఆత్మకు - సృష్టి స్థితి లయము లేవు. విశ్వమునకు సృష్టి స్థితి లయములు గలవు. కావున బ్రహ్మ సత్యము లేక సత్. విశ్వము అసత్.

**సృష్టి అభివృద్ధిలో ఆత్మ యొక్క ప్రాధాన్యత ఏమిటి?**

సృష్టి అభివృద్ధిలో ఆత్మకు నేరుగా సంబంధము లేదు. ఆహారము వలన గలిగిన వీర్యము వలన సృష్టి అభివృద్ధి అగుచున్నది.

*****

లోకములు - మనస్సు- ప్రాణము- అన్నము- కర్మలు సృజియింప బడినవి

8. **తపసా చీయతే బ్రహ్మ తతోఽన్నమ భిజాయతే ।**
 **అన్నా త్ప్రాణో మనః సత్యం లోకాః కర్మసు చా మృతమ్ ॥**

తపసా - చీయతే - బ్రహ్మ - తతః - అన్నమ్ - అభిజాయతే - అన్నాత్ - ప్రాణః - మనః - సత్యం - లోకాః - కర్మసు - చ - అమృతం.

| | | |
|---|---|---|
| బ్రహ్మ | = | ఆత్మ |
| సత్యం | = | శాశ్వతము |
| అమృతం | = | అమృతము |
| తపసా | = | విరాట్పురుషుడు సంకల్పముచే ఒక అండమును సృజియించి ఆ అండము నుంచి |
| లోకాః | = | లోకములను అనగా 14 లోకములను, స్థావర జంగమాత్మకమయిన విశ్వమును - లోకపాలురను సృజియించెను. |
| ప్రాణః | = | ఉపాధి నశింపకుండుటకు ప్రాణమును |
| మనః | = | ఉపాధిలో సంకల్ప వికల్పములకు పుట్టినిల్లు అగు మనస్సును-ఇంద్రియములను, ఇంద్రియయార్థములను |
| కర్మసు | = | కర్మలయందు, అనగా కర్మలను, కర్మ ఫలితములను |
| అభిజాయతే | = | సృజియించెను. |
| చ | = | మఱియు |
| అన్నం | = | అన్నమును సృజియించెను. సర్వజీవరాసులను సృజియించెను. ఉపాధులను సృజియించెను. |
| తతః | = | అటు పిమ్మట ఆ జీవరాసులు - ఉపాధులు |
| అన్నాత్ | = | అన్నము వలన అభివృద్ధి పొందుచున్నవి మఱియు ఆ అన్నము వలన గలిగిన వీర్యము వలన జీవరాసులు |
| చీయతే | = | అభివృద్ధి అగుచున్నవి. |



విరాట్పురుషుడు - లోకములను, లోకపాలురను, సమస్త స్థావర జంగమములను, ఉపాధిలోగల ప్రాణము - మనస్సు - ఇంద్రియములను - ఇంద్రియార్థములను, సృష్టి అభివృద్ధికి అన్నమును సృజియించెను.

ప్రకృతి మొదట బీజరూపమున ఉన్నది. అప్పుడు అవ్యక్తము. ఆపై సృష్టి లేక విశ్వము వ్యక్తమయినది. ఆ తర్వాత శాఖోపశాఖలుగా అన్నము వలన విస్తరిల్లినది. దీనిని మూడు ఉదాహరణల ద్వారా తెలుసుకుందాము.

| | | |
|---|---|---|
| 1. | అండము | - అవ్యక్తస్థితి |
| | అండము నుంచి (కోడి) పిల్ల | - వ్యక్తమయిన స్థితి వచ్చినది |
| | ఆ కోడి పిల్ల పెరిగి పెద్దదయినది | - ఇది అభివృద్ధి అయిననాటి స్థితి |
| 2. | మామిడి టెంక | - మామిడి చెట్టు యొక్క అవ్యక్త స్థితి |
| | మామిడి టెంకను భూమిలో ఉంచుట వలన మామిడి మొక్క వచ్చినది | - ఇది వ్యక్త మయిన స్థితి. |

ఆ మామిడి మొక్క పెరిగి
పెద్దదై కాలక్రమమున శాఖోప - ఇది అభివృద్ధి అయిన స్థితి.
శాఖలుగా అభివృద్ధి అయినది

3. మానవుని వీర్యము
ఆ వీర్యమును స్త్రీ యోని - ఇది అవ్యక్త స్థితి
యందుంచుట వలన పిండము
ఏర్పడినది
9 మాసములు అనంతరము ఇది వ్యక్తమయిన స్థితి
పిల్లవాడు జన్మించినాడు -
ఆ పసిపిల్లవాడు పెరిగి పెద్దవాడు ఇది అభివృద్ధి అయిన స్థితి
అయినాడు

అన్నము తినుట వలన శక్తిగలుగును. అన్నము వలన వీర్యము గలుగును. (శక్తి, వీర్యము వలన) సంభోగము వలన అనగా మిథున ధర్మమున సృష్టి గలుగును - మఱియు అభివృద్ధి అగును.

అన్నము తినుట వలన శక్తి గలుగును. ఈ శక్తి క్రియాశక్తిగా ప్రాణరూపమున దేహంలో చరించి,ఇంద్రియాదులను పని చేయించును. అదే ఇచ్ఛాశక్తిగా మనస్సును పనిచేయించును. జ్ఞానశక్తిగా మంచి చెడులను చెప్పు బుద్ధిని పని చేయించును. ఇటుల జీవులకు జాగ్రతావస్థలో అన్నము నీరు అవసరము. నిద్రలో మెలకువవచ్చినచో మనము నీరు త్రాగుదుము. నిశ్చల సమాధి భంగమయినదని చెప్పుటకు జలభక్షణ చేసినట్లు వర్ణింతురు. గాఢనిద్రలో ఆహారము, నీరు అవసరము లేదు. అటులనే నిశ్చల సమాధిలో ఆహారము, నీరు అవసరము లేదు. కావున వాయుభక్షణ చేసినట్లు వర్ణింతురు.

హిరణ్యా కశిపుడు ఆహారము, నీరు లేకుండా అనేక వేల సంవత్సరములు తపస్సు చేసెనని భాగవతమున సప్తమ స్కంధమున వర్ణింపబడినది. అలా తపస్సు చేయగా బ్రహ్మ (ఆత్మ) దర్శనమయినది. అనగా హిరణ్యాకశిపుడు నిశ్చల సమాధిలో అనేక వేల సంవత్సరములు ఉండి ఆత్మ దర్శనము చేసిన మహనీయుడని అర్థము.



నిశ్చల సమాధిలో ఉండెను అని చెప్పుటకు సాధకుడు వాయు భక్షణ చేసెనని చెప్పుదురు. ధృతరాష్ట్రుడు వాయుభక్షణ చేసినట్లు భాగవతమున ప్రథమ స్కంధంలో వర్ణింపబడినది. అనగా ధృతరాష్ట్రుడు నిశ్చల సమాధిలో ఉండెనని అర్థము. ఆహారము-జలభక్షణ-వాయు భక్షణగా చెప్పిన దానిని సాధకుని జాగ్రతావస్థ - సవికల్ప సమాధి, నిశ్చల సమాధి స్థితిగా చెప్పినట్లు గ్రహించవలయును.

*****

9. **యః సర్వజ్ఞః సర్వ విద్యస్య జ్ఞానమయం తపః ।**
**తస్మాదేతద్బ్రహ్మ నామరూప మన్నంచ జాయతే ॥**
(ఇతి ముండకోపనిషది ప్రథమ ముండకే ప్రథమ ఖండః)

యః- సర్వజ్ఞః - సర్వవిత్ - యస్య - జ్ఞానమయం - తపః - తస్మాత్ - ఏతత్- బ్రహ్మ- నామ- రూపమ్ - అన్నం - చ- జాయతే.

గురువు ఆత్మ గుఱించి ఇంత వఱకు చెప్పిన దాని సారాంశమును మఱియొకసారి చెప్పి ముగించుచున్నాడు.

యః = ఎవడు
బ్రహ్మ = బ్రహ్మ శబ్ద వాచ్యుడో అనగా ఆత్మయో - అతడు
సర్వజ్ఞః = సర్వజ్ఞుడు
సర్వవిత్ = భూత భవిష్యత్ వర్తమానములలోని సర్వమును తెలిసినవాడు. కావున ఆత్మను తెలుసుకున్న సర్వము తెలియును. విరాట్పురుషుని యందు ఈ సర్వస్థావర జంగమములు ప్రతిష్టితమై ఉన్నవి.
యస్య = ఎవని యొక్క అనగా విరాట్పురుషుని యొక్క
తపః = తపస్సు అనగా సంకల్పము
జ్ఞానమయం = జ్ఞానమయము. ఆ జ్ఞానమయ తపస్సు వలన సృష్టి చేసెను.
ఏతత్ = ఈ సృష్టి త్రిగుణాత్మకము మఱియు
నామ +రూపం+ చ = వివిధ నామములతోనూ, రూపములతోనూ,

| | | |
|---|---|---|
| | | గుణములతోనూగల సర్వ స్థావర జంగమాత్మకమైన విశ్వముగా విస్తరిల్లినది. విరాట్‌పురుషుని సంకల్పము వలన జీవుల ఆకలి తీరుటకు |
| అన్నం | = | అన్నము |
| జాయతే | = | గలిగినది. ఆ అన్నము వలన వీర్యము గలిగినది. |
| తస్మాత్ | = | అందువలన సృష్టి అభివృద్ధి అయినది. |

*****



## ప్రథమ ముండకే ద్వితీయ ఖండః

వేదము అపరవిద్య గుఱించి మఱియు పర విద్య గుఱించి బోధించును.

**అపరవిద్య:**

1. **ఇహలోకము గుఱించి తల్లి, తండ్రి, అన్నదమ్ములు, బాంధవుల యెడ వ్యవహరించవలసిన విధులను బోధించును.**

| | | |
|---|---|---|
| మాతృ దేవోభవ | - | తల్లిని దైవముగా భావింపుము |
| పితృదేవో భవ | - | తండ్రిని దైవముగా భావింపుము |

2. **తను పెద్దల యెడ వ్యవహరించవలసిన విధి విధానములను బోధించును.**

| | | |
|---|---|---|
| అతిథి దేవో భవ | = | అతిథిని దైవముగా భావింపుము |
| ఆచార్యదేవోభవ | = | గురువును దైవముగా భావింపుము |

3. **ఇహలోకములో నడచుకోవలసిన ధర్మ పద్ధతిని బోధించును - ధర్మము**

| | | |
|---|---|---|
| ధర్మం చర | = | ధర్మమును ఆచరింపుము |
| సత్యం వద | = | సత్యమును పలుకుము. |

4. **వృత్తి వ్యాపారములు అనగా ధనము సంపాదించు పద్ధతిని బోధించును - అర్థము**

   ధర్మ పద్ధతిన మాత్రమే ధనము సంపాదించ వలయును. అలా సంపాదించిన ధనముతోనే ఇహ లోక సౌఖ్యములను అనుభవింప వలయును. ధర్మ పద్ధతిన సంపాదించిన ధనముతో మాత్రమే పుణ్యాకార్యములు చేయ వలయును.

5. **కామము- న్యాయార్జిత ధనముతో అనుభవించవలసిన భోగ భాగ్యముల గుఱించి బోధించును.**

6. బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య శూద్రులు ఎవరెవరు యేయే పనులు చేయవలయునో. ఈ నాలుగు వర్ణముల వారు ఏ ఏ లక్షణములు గలిగి **యుండవలయునో చెప్పును. వీటిని జాతి ధర్మములు అని అందురు.**

7. బ్రహ్మచర్య, గృహస్థ, వానప్రస్థ, సన్న్యాస ఆశ్రమములలో ఏ ఆశ్రమములలో ఉన్నవారు ఏ విధముగా ప్రవర్తించవలయునో చెప్పును. వీటిని ఆశ్రమ ధర్మములు అని అందురు.

8. **వంశాభివృద్ధి- ప్రజాతంతుం మావ్యవచ్ఛేత్సీః వంశమును వృద్ధి చేయుము అని వంశాభివృద్ధిని గుఱించి చెప్పును.**

9. **విజ్ఞాన శాస్త్ర విషయముల గుఱించి చెప్పును.**

10. **పరలోకము గుఱించి - పుణ్యకర్మలను బోధించును**

| | నిత్యకర్మానుష్ఠానం | | | నైమిత్తిక కర్మానుష్ఠానం |
|---|---|---|---|---|
| 1. | అగ్నిహోత్రం | | 1. | యజ్ఞము |
| 2. | వేదాధ్యయనం* | | 2. | యాగము |
| 3. | సంధ్యావందనం | | 3. | క్రతువు |
| 4. | జపం | | 4. | పితృదేవతారాధన** |
| 5. | పూజ | | 5. | ఇష్టాపూర్తములు |
| 6. | సద్గుణములు గలిగి ఉండుట | | 6. | తీర్థయాత్ర |
| 7. | దానము | - | | కన్యా, భూ, గృహ, బంగారం, అన్న, జల, వస్త్ర, మంచము ,ఆసనం , వాహనం , ఇవిగాక విద్యా, ప్రాణ, నువ్వులు, దాసదాసీలు, దీప, నెయ్యి, గోదానం |

* **"స్వాధ్యాయప్రవచనాభ్యాం న ప్రమది తవ్యమ్"** వేదము చదువుట మఱియు నేర్పుట అన్నది చేయవలయును ఇది నిత్య కర్మానుష్ఠానం గుఱించి చెప్పబడినది

** **"దేవపితృకార్యాభ్యాం న ప్రమది తవ్యమ్"** దేవతల కొఱకు యజ్ఞ యాగాదులు పితృదేవతల కొఱకు తద్దినములు చేయవలయును. ఇది నైమిత్తిక కర్మానుష్ఠానం గుఱించి చెప్ప బడినది.

11. ఆత్మ, ప్రకృతి జీవుల గుఱించి అనగా ఆత్మ - ఆదిపురుషుడు - విరాట్పురుషుడు; జీవుడు - దేహము; కర్మఫలితముననుసరించి జీవుల ప్రయాణము చెప్పును.

ఇటుల నిత్య కర్మానుష్ఠానం, నైమిత్తిక కర్మానుష్ఠానం గుఱించి వేదములలో అనేక విషయములు చెప్పబడినవి. వేదములలో చెప్పబడిన ఈ కర్మానుష్ఠాన విధాన మంతయు భారత, భాగవత, రామాయణములలో నీతి వాక్యములుగానూ, ధర్మములుగానూ, కథలుగానూ చెప్పబడినవి.

కర్మలను పాపకర్మలని, పుణ్య కర్మలని రెండు భాగములుగా విభజించినారు. పాపకర్మ వలన చీకటి లోకములు అనగా నరకము గలుగును. ఈ విషయము ఈశ ఉపనిషత్ 3వ మంత్రంలో చెప్పబడినది.
పుణ్య కర్మలు మరల విధి నిషేధము అని రెండు భాగములు. పుణ్యకర్మ విధి విహితముగా చేయక నిషేధముగా చెప్పబడిన పద్ధతిలో చేసిన నరకము గలుగును. కావున పుణ్య కర్మలు వేదములో చెప్పిన విధముగానే ఆచరించవలయును. లేనిచో నరకప్రాప్తి గలుగును. పుణ్యకర్మ వేద విహితముగా చేసిననూ - ఆ చేసినవారు పుణ్యకర్మ ఫలితము కోరిచేసినారా? పుణ్యకర్మ ఫలితము కోరక చేసినారా? అన్న ప్రశ్న ఉదయించును.

పుణ్యకర్మలు చేసి ఆ ఫలితమును కోరినచో-బ్రహ్మలోక ప్రాప్తి గలిగి ఆ పుణ్య ఫలితము క్షీణించగా తిరిగి భూలోకమున జన్మింతురు. వీరు ప్రయాణించెడి మార్గమును దక్షిణాయనము లేక పితృయానము అని అందురు.

పుణ్యకర్మలు చేసి - ఆపుణ్య కర్మల ఫలితమునుగోరని వారు బ్రహ్మలోకము చేరి అక్కడనే వసియించెదరు. భూలోకమునకు తిరిగిరారు. కల్పాంతమున అధికార పురుషులుగా పుణ్య లోకములలోనే ఆవిర్భవించెదరు. దీనిని ఉత్తరాయణమని, దేవయానమని చెప్పుదురు.

ఇప్పుడు చెప్పబడిన ఉత్తరాయణ, దక్షిణాయనములకు పంచాంగములోని ఉత్తరాయణ, దక్షిణాయనములకు సంబంధము లేదు. ఆత్మ స్థానమును చేరుటకు అపరవిద్య ప్రథమ సోపానము. ఇహలోక జీవనములో ధర్మపరుడై యుండవలయును. శ్రీరాముడు ధర్మపరుడు. ధర్మరాజు ధర్మపరుడు. ధర్మపరుడుగా ఇహలోక జీవనము

ఎటుల సాగించవలయునో రామాయణ, భారతములలో విపులముగా వర్ణింపబడినది. అవి చదివి వారివలె ధర్మ జీవనము గడపవలయును.

పుణ్య కర్మలు చేయవలయును. పుణ్య కర్మానుష్ఠానములో ఫలితమును కోరినచో అది ప్రవృత్తి కర్మ అనియు, ఫలితము కోరక చేసినచో అది నివృత్తి కర్మ అనియు అందురు. పుణ్యకర్మానుష్ఠానం తప్పనిసరి అని ఈశోపనిషత్‌లో చెప్పబడినది.

ప్రవృత్తి కర్మలు బోధించు గురువులకు ప్రతినిధులు చండా మార్కులు. ఈ కోవకు చెందిన గురువులు /శిష్యులు అధిక సంఖ్యలో ఉందురు. అయితే ఈ ప్రవృత్తి కర్మను బోధించు గురువులు వారిని అనుసరించు శిష్యులు - వీరిరువురు బ్రహ్మలోకము చేరి పుణ్యము క్షీణించగా తిరిగి భూలోకమున జన్మించి జనన మరణ వలయములలో చిక్కుకొందురు.

ఈ ద్వితీయ ఖండము ఈ కోవకు చెందిన గురువులను నిరసించినది. వీరు బ్రహ్మవిద్యకు అనర్హులు.

నివృత్తి కర్మలు బోధించు గురువులకు ప్రతినిధులు సనకసనందనాదులు, నారదుడు, ఋషులు. ఈ కోవకు చెందిన గురువులు, శిష్యుల సంఖ్య అతి స్వల్పము. **మనుష్యాణాం సహస్రేషు కశ్చిద్యతతి సిద్ధయే (భగవద్గీత- విజ్ఞాన యోగం -3)** అనేక వేలమంది మనుష్యులలో ఒకానొకడు నివృత్తి కర్మమార్గమును ఎన్నుకొనును. బ్రహ్మత్వమును పొంద ప్రయత్నించును. ప్రవృత్తి కర్మలను బోధించు గురువులను నిందింపక, వారి మాటలను పాటించవద్దని శ్రీకృష్ణ భగవానుడు అర్జునునకు భగవద్గీత సాంఖ్యయోగంలో ఉపదేశించినాడు.

ప్రారంభములో ప్రాచీన బర్హి ప్రవృత్తి కర్మను పాటించువాడు. అయితే నారదుడు అతనికి ప్రవృత్తి కర్మల యందలి గుణ దోషములను వివరించి నివృత్తి కర్మమార్గమునకు మరలించినట్లు భాగవతము - 4వ స్కంధములో వివరింపబడినది.

అపరవిద్యకు సంబంధించిన విషయములను సూటిగా అందఱికీ అర్థమగునట్లు వివరింపబడును. అయితే అపరవిద్యలో చెప్పబడిన ధర్మములపై యుగప్రభావము ఉండును.

పరవిద్యకు సంబంధించిన సాధనను మఱియు పరవిద్యకు సంబంధించిన



విషయములను అర్హతగల శిష్యులకే బ్రహ్మవిద్యా సంప్రదాయ ప్రవర్తకులగు గురువులు ఏకాంతమున బోధింతురు.

ఈ పరవిద్యను గుఱించి చెప్పు కథలు గందరగోళముగా ఉండును. బాహ్యముగా కథ ఒక విధముగ గోచరించిన అంతరార్థములో ఆ కథ పరవిద్యకు సంబంధించిన సాధన రహస్యములను వెల్లడి చేయును. ఈ కథల గుఱించి ఒకటిరెండు ఉదాహరణలు చెప్పుకుందాము.

ఆఱవ మనువుకాలంలో సముద్రము మథనము జరిగి అందు ఉచ్చైశ్రవము పుట్టినది. ఆ గుఱ్ఱముతోక తెలుపా? నలుపా అని వినతా, కద్రువలు పందెం వేసుకున్నారు. వినతా పుత్రులయిన పాములలో కొన్ని తల్లిమాట వినలేదు. అంత ఆమెకోపంగా వెంటనే చనిపోవుదురు గాక అని శపించక, ఏడవమనువు కాలంలో ఎన్నో మహాయుగములో్నో వచ్చే కలియుగంలో పుట్టబోయే జనమేజయుడు చేయు సర్ప యాగములో మీరు నశించెదరు గాక అనిశపించుతుంది. ఇంతకాల వ్యవధి ఏల?

కృతయుగంలో సనకసనందనాదులు - ఎప్పుడో పుట్టబోయే దశరథునకు నలుగురు పుత్రులు గలుగుదురని ఋషులకు చెప్పినట్లు తను విన్నట్లు సుమంత్రుడు దశరథునికి చెప్పును. దశరథునికి ముందు గల రాజులలో కొంతమందికి సంతానము లేక పోవుట వలన వారు వారి కులగురువగు వసిష్ఠుని తపః ప్రభావమున సంతానమును పొందినారు. మరి దశరథుడు వారి కులగురువును ఆశ్రయించి సంతానమును ఏల పొందలేదు? ఎప్పుడో త్రేతాయుగంలో పుట్టుబోయే దశరథుని గుఱించి సనత్కుమారుడు ఏల ప్రసంగించినాడు? అశ్వమేథ యాగము చేస్తే నలుగురు పుత్రులు గలుగుదురని యజుర్వేదము చెప్పినది. దశరథుడు అశ్వమేథ యాగము చేసి మరల పుత్రకామేష్ఠి ఏల చేయవలసివచ్చినది? ఇలా ఎన్నియో కథలు భారత, భాగవత, రామాయణములలో గలవు. ఇటువంటి కథలలోని అంతరార్థమును చెప్పగల సద్గురువులను ఆశ్రయించవలయును.




పుణ్యకర్మానుష్ఠానములలో ఒకటయిన నిత్య కర్మానుష్ఠానమయిన అగ్నిహోత్రము చేయు విధి విధానము, నైమిత్తిక కర్మానుష్ఠానములయిన ఇష్టాపూర్తముల గుఱించి గురువు-శిష్యుల గుఱించి ఈ ప్రథమముండకం ద్వితీయ ఖండంలో చర్చింపబడినది.

ప్రవృత్తి కర్మావలంబులు దక్షిణాయన మార్గమున పయనించి పునర్జన్మకు వత్తురు. నిష్కామకర్మపరులు పునర్జన్మకు రారు. కావున నిష్కామకర్మపరులై ఆత్మ అగు విధివిధానమును గ్రహించ గురువును ఆశ్రయించవలయునని పరవిద్యకు సంబంధించిన ఆచరణ పాఠమును చెప్పుచున్నాడు.

ధర్మపరుడై విధివిహితముగా పుణ్యకర్మానుష్ఠానము చేయవలయును. ఉదాహరణగా నిత్యాగ్నిహోత్రము గుఱించి చెప్పుచున్నాడు.

*****



## పుణ్యకర్మలు చేయవలయును

**1. తదేతత్ సత్యం**
**మంత్రేషు కర్మాణి కవయో యాన్య పశ్యం**
**స్తాని త్రేతాయాం బహుధా సన్తతాని ।**
**తాన్యాచరథ నియతం సత్యకామా**
**ఏష వః పన్థాః సుకృతస్య లోకే ॥**

తత్ - ఏతత్ - సత్యం - మంత్రేషు - కర్మాణి - కవయః - యాని - అపశ్యన్ - తాని - త్రేతాయాం - బహుధా - సన్తతాని - తాని - ఆచరథ - నియతం - సత్య కామాః - ఏషః - వః - పన్థాః - సుకృతస్య - లోకే.

**తత్** - అది (ఆ విషయం. ఏ విషయమనగా) పుణ్య కర్మలు చేయని వారు మరణానంతరము నరకము పాలగుదురు అన్న విషయము సత్యము.

**ఏతత్** - ఇది. అనగా వేదములలో చెప్పబడిన అపరవిద్యలో చెప్పినట్లు విధివిధానముగా ఆచరించి ధర్మ పరుడు కావలయును. వేద విహితముగా పుణ్యకర్మలు చేయ వలయును. పుణ్య కర్మలు చేయుటకే నూఱు సంవత్సరములు జీవించ వలయును. విధి విహితముగా పుణ్యకర్మలు చేయనిచో నరకప్రాప్తి గలుగును. అపరవిద్యలో చెప్పబడిన విధానమును ఆచరించి ధర్మపరుడు కావలయును. ఆపై విధి విహితముగా పుణ్యకర్మలు ఆచరించ వలయును, బ్రహ్మలోక ప్రాప్తి గలుగును. ధర్మపరుడు గాక పోయినా, పుణ్య కర్మలు విధివిహితముగా ఆచరించకపోయినా నరకము గలుగును అని చెప్పబడిన ఈ విషయము

| | | |
|---|---|---|
| సత్యం | = | సత్యము. |
| త్రేతాయాం | = | అథర్వవేదముతో సహా మిగిలిన మూడు వేద ములయందు |
| బహుధా | = | అనేక |
| మంత్రేషు | = | మంత్రములందు చెప్పబడిన |
| యాని | = | ఏ |
| తాని + కర్మాణి + | = | ఆ అగ్నిహోత్రాది పుణ్యకర్మలు - |

సన్తతాని ఆ పుణ్యకర్మలను విధివిహితముగా నిరంతరము ఆచరించుట వలన గలుగు ఫలితములను విస్తరింప బడినవి.

సత్య కామాః = ఓ సత్యాన్వేషీ!

కవయః = వసిష్ఠాది ఋషులు - జ్ఞానులు ఆ పుణ్యకర్మల వలన గలుగు ఫలితములను

అపశ్యన్ = చూచి, (అభీష్టములు నెఱవేఱుటకు పుణ్య కర్మానుష్ఠానము ప్రథమ సోపానమని గ్రహించిరో ఆకర్మలు, ఆకర్మఫలితములు సత్యము. కావున)

తాని = వాటిని - (అగ్నిహోత్రాది పుణ్యకర్మలను కోరికలు నెఱవేఱుటకు, శాశ్వత బ్రహ్మ లోక నివాసమునకు కూడ పనికి వచ్చును. కావున వాటిని)

నియతం = విధివిధానముగా నిత్యము మీరు

ఆచరథ = ఆచరించండి - అని చెప్పిరి. కావున

సుకృతస్య = సుకృతము యొక్క ఫలితము కొఱకు

లోకే = బ్రహ్మలోకము కొఱకు

వః = మీకు అనగా మీమీ కోరికలు నెఱవేఱుటకు బ్రహ్మలోకప్రాప్తికి

ఏషః+పన్థాః = విధివిహితమైన పుణ్యకర్మానుష్ఠానమే మార్గము. కావున పుణ్యకర్మలు ఆచరించండి.

బ్రహ్మలోక ప్రాప్తికి శరభంగమహర్షి, సుతీక్ష్ణుడు, సుదర్శనుడు, అగస్త్యుడు మొదలయిన ఋషులు అందఱూ నిత్యము అగ్నిహోత్రము చేసినట్లు రామాయణంలో వర్ణింపబడినది. వాల్మీకి తన రామాయణంలో యథాశాస్త్రం - యథావిధిః అని పుణ్యకర్మానుష్ఠానం గుఱించి వివరించినారు. శ్రీకృష్ణభగవానుడు భగవద్గీతలో - కర్మయోగము 9లో పుణ్యకర్మాచరణ ఏ విధముగా చేయవలయునో చెప్పినాడు.

*****



**అగ్నిహోత్రం చేయు విధివిధానము చెప్పబడినది.**

**2. యదా లేలాయతే హ్యర్చిః సమిద్ధే హవ్యవాహనే।**
**తదాఽఽజ్య భాగా వన్తరేణా హుతీః ప్రతిపాదయేత్॥**

యదా - లేలాయతే - హి - అర్చిః - సమిద్ధే - హవ్యవాహనే-
తదా - ఆజ్యభాగౌ - అన్తరేణ - ఆహుతీః - ప్రతిపాదయేత్

**ఆహవనీయాగ్ని**




యదా = ఎప్పుడు

సమిద్ధే+హవ్యవాహనే = ప్రజ్వరిల్లుచున్న అగ్నిహోత్రమునందు సమిధలు వేయగా

అర్చిః = చక్కగా పొగలేక జ్వాలలు గలిగి అగ్నిహోత్రము

లేలాయతే = ప్రజ్వరిల్లుచుండునో

తదా = అప్పుడు

ఆజ్యభాగౌ = ఆజ్యభాగములలో - దర్శ పూర్ణ మాస యాగము చేయు సందర్భములో ఆహవనీయాగ్ని యొక్క ఆజ్య భాగములలో ఉదయం, అగ్నయేస్వాహా, సోమాయస్వాహాఅని -సాయంకాలం. అగ్నయేస్వాహా, ప్రజాపతయేస్వాహా అని

ఆహుతీః + హి = రెండు ఆహుతులు ప్రతి నిత్యము ఉదయము, సాయంత్రము ఇవ్వవలయును.

అన్తరేణ = ఆరెండు ఆజ్య భాగముల నడుమ అనగా ఆవాస స్థానములో

ప్రతి పాదయేత్ = మిగిలిన ఆహుతులను ఇవ్వ వలయును.

నిత్యకర్మానుష్ఠానమయిన అగ్నిహోత్రము చేయు విధివిధానము ఈ మంత్రములో చెప్పబడినది. అటులనే పుణ్యకర్మానుష్ఠానమునకు సంబంధించినవి అన్నియు విధివిధానముగా చేయవలయునని గ్రహించవలయును.

*****

**ఇందు నిషేధం చెప్పబడినది**

3. **యస్యాగ్నిహోత్ర మదర్శ మపౌర్ణమాస**
   **మచాతుర్మాస్య మనాగ్రాయణ మతిథివర్జితం చ।**
   **ఆహుత మవైశ్యదేవ మవిధినా హుత**
   **మా సప్తమాంస్తస్య లోకాన్ హినస్తి॥**

యస్య - అగ్నిహోత్రమ్ - అదర్శమ్-అపౌర్ణమాసమ్ - అచాతుర్మాస్యమ్ - అనాగ్రాయణమ్ - అతిథివర్జితం - చ- ఆహుతమ్ - అవైశ్యదేవమ్- అవిధినా-హుతమ్ - ఆసప్తమాన్- తస్య - లోకాన్ - హినస్తి

నిత్య కర్మానుష్ఠానంలో

అవిధినా + హుతం = ఎవడు సకాలంలో అగ్నిహోత్రము చేయలేదో, అనగా ఎవడు విధి విధానముతో ఆహుతులు ఇవ్వలేదో

యస్య = ఎవని యొక్క

అగ్నిహోత్రం = అగ్నిహోత్రము అనగా ఎవడు అగ్నిహోత్రము చేయుచూ

అదర్శం = అమావాస్యనాడు చేయవలసిన దర్శ కర్మ చేయలేదో

అపౌర్ణమాసం = పౌర్ణమినాడు చేయవలసిన పౌర్ణమాస కర్మచేయలేదో

అచాతుర్మాస్యం = చాతుర్మాస్యములలో చేయవలసిన కర్మ చేయలేదో

అనాగ్రాయణం = పంటనూర్చిన పిదప మొట్ట మొదట కొంత అగ్నికి



అర్పించి ఆపై మిగిలిన పంటను తినవలయును. అలా ప్రథమ ఫల అర్పణ అనే కర్మ చేయలేదో

అవైశ్యదేవం+చ = వైశ్యదేవము చేయలేదో

అతిథి వర్జితం = అతిథి ఇంటికి వచ్చినా- అతనికి భోజనం పెట్టకుండా అగ్నిహోత్రం చేయునో

అహుతమ్ = విధివిహితముగా అగ్నిహోత్రము చేయలేదో

తస్య = వాని యొక్క పుణ్యమును తద్వారా వానికి గలిగిన

ఆసప్తమాన్+లోకాన్ = ఏడు లోకములను అనగా ఏడు ఊర్ధ్వలోకముల పర్యంతము గలుగు పుణ్య ప్రాప్తిని లేదా అటు ఏడు తరములను, ఇటు ఏడు తరములను అగ్నిహోత్రము లేక అగ్ని

హినస్తి = నాశనము చేయును.

అగ్నిహోత్రము జాతి ధర్మములుగా ఎవరికి చెప్పబడినదో వారు విధివిహితముగా చేయవలయును. విధివిహితముగా చేయని అగ్నిహోత్రము వలన నరకప్రాప్తి గలుగును.

అతిథి వర్జితంగా అగ్నిహోత్రము చేయరాదు అని యిందు చెప్పిన దానికి వాల్మీకి తన రామాయణంలో అరణ్యకాండ ద్వాదశ సర్గ 29వ శ్లోకములో వివరణగా ఇలా చెప్పినారు.

**అగ్నిం హుత్వా ప్రదాయార్ఘ్య మతిథిం ప్రతిపూజయేత్**
**అన్యథా ఖలు కాకుత్స్థ తపస్వీ సముదాచరన్**
**దుః సాక్షీవ పరే లోకే స్వాని మాంసాని భక్షయేత్**

కాకుత్స్థ = కకుత్స్థ వంశజుడవయిన రామా!

తపస్వీ = తపస్సు చేయువాడు, పుణ్యకర్మానుష్ఠాన పరుడు

అగ్నిం = అగ్నికి

హుత్వా = ఆహుతులు యిచ్చి అనగా ముందు అగ్నిహోత్రము చేసి ఆ తర్వాత

అతిథిం = ఇంటికి వచ్చిన అతిథికి

అర్ఘ్యం+ప్రదాయ = అర్ఘ్యపాద్యాదులు యిచ్చి సుఖాసీనుని చేసి

ప్రతి పూజయేత్ = భోజనమును పెట్టవలయును. ముందు అగ్నిహోత్రం చేయవలయును. ఆతర్వాత అతిథికి భోజనం పెట్టవలయును.

అన్యథా = అలాగాక ఇంకొక విధముగా

సముదాచరన్ = చేయుచున్న

ఖలు = పాపాత్ముడు

దుఃసాక్షీ+ఇవ = కూట సాక్ష్యము చెప్పిన వానివలె

పరే లోకే = నరకమునందు

స్వాని+మాంసాని = తన మాంసమును తనే

భక్షయేత్ = భక్షించును.

తప్పుడు సాక్ష్యము చెప్పరాదు అని అపరధర్మము చెప్పి అగ్నిహోత్రము చేసి ఆపై అతిథికి భోజనం పెట్టవలయును అని చెప్పినాడు.

పుణ్యకర్మలు చేయునపుడు తను చేస్తున్నది మంచి పనేగదా యని తనకు తోచినట్లు చేయరాదు. వేదములలో చెప్పిన విధి నిషేధములను పాటించుచూ మాత్రమే పుణ్యకర్మలు చేయ వలయును. వేదము చెప్పినట్లు చేసిన పుణ్యప్రాప్తి. తద్విరుద్ధముగా ఏ ఒక్క నిషేధమును ఆచరించినా పుణ్యలోకప్రాప్తి ఉండదు. నరకప్రాప్తి గలుగును.

*****

### అగ్నిహోత్రుని సప్త జిహ్వాలు

**4. కాలీ కరాలీ చ మనోజవా చ సులోహితా యా చ సుధూమ్రవర్ణా।**
**స్ఫులిఙ్గినీ విశ్వరుచీ చ దేవీ లేలాయమానా ఇతి సప్తజిహ్వాః॥**

కాలీ - కరాలీ - చ - మనోజవా - చ - సులోహితా - యా - చ - సుధూమ్ర వర్ణా - స్ఫులింగినీ - విశ్వరుచీ - చ - దేవీ - లేలాయమానాః - ఇతి - సప్తజిహ్వాః

యా = ఏది



కాలీ = నల్లనిది

కరాలీ + చ = భయంకరమైనది

మనోజవా+చ = మనస్సువలె చంచలముగా అటు యిటు కదలునది

సులోహితా = రక్త వర్ణము వలె ఎఱుపు రంగు కలది

సుధూమ్రవర్ణా+చ = మండుతూ ఉన్నపుడు వచ్చే బూడిద రంగు వంటి రంగు కలది

స్ఫులింగినీ+చ = అగ్నికణములు వెదజల్లునది

విశ్వరుచీ + దేవీ = విశ్వరుచీ దేవి - అనగా చక్కగా జాజ్వల్య మానముగా వెలుగుచున్నది

లేలాయమానాః = ఇవే జ్వలించుచున్న అగ్నిహోత్రునకు

సప్తజిహ్వాః+ఇతి = ఏడు నాలుకలు.

కావున అగ్నిహోత్రంలో ఆహుతులు వ్రేల్చునపుడు విశ్వరుచీ దేవిగా చెప్పబడే అనగా బాగా ప్రజ్వరిల్లుచున్న అగ్నిలోనే ఆహుతులు వ్రేల్చవలయును. ఇందు విధి చెప్పబడినది. అలా ఇవ్వబడిన ఆహుతులు

*****

### పుణ్యకర్మానుష్ఠాన ఫలితం

**5. ఏతేషు యశ్చరతే భ్రాజమానేషు**
**యథాకాలం చాహుతయో హ్యాదదాయన్।**
**తం నయన్త్యేతాః సూర్యస్య రశ్మయో**
**యత్ర దేవానాం పతిరేకోఽధి వాసః॥**

ఏతేషు - యః - చరతే - భ్రాజమానేషు - యథాకాలం - చ- ఆహుతయః - హి - ఆదదాయన్ - తం - నయన్తి - ఏతాః - సూర్యస్య - రశ్మయః - యత్ర - దేవానాం - పతిః - ఏకః - అధివాసః

యః = ఎవడు పుణ్యఫలితము కోరి

ఏతేషు = ఈ

| | | |
|---|---|---|
| భ్రాజమానేషు | = | విశ్వరుచీదేవిగా చెప్పబడే బాగా ప్రజ్వలించుచున్న ఈ అగ్నిహోత్రము నందు |
| యథాకాలం | = | సరియైన సమయములో |
| చ | = | సరియైన విధివిధానముతో |
| ఏతాః | = | ఈ |
| ఆహుతయః | = | ఆహుతులు |
| చరతే | = | వ్రేల్చునో |
| తం | = | అతనిని ఆహుతులు సూర్యకిరణములై అధిదైవిక మయిన |
| యత్ర | = | ఎక్కడ |
| దేవానాం | = | దేవతల యొక్క |
| పతిః+ఏకః | = | ముఖ్యుడొక్కడు అనగా బ్రహ్మ లేక ఆత్మ |
| అధివాసః | = | నివసించునో అక్కడకు |
| సూర్యస్య | = | సూర్యుని యొక్క |
| రశ్మయః | = | కిరణములు |
| ఆదదాయన్ | = | తోడ్కొని |
| నయంతి | = | సాదరముగా తీసుకొనిపోవును. అతడు |
| హి | = | బ్రహ్మలోకమునందు కొంతకాలమే వసియించును |

వేదకాలములో ఆత్మయే దేవతా ప్రభువు. ఆత్మయే సబ్రహ్మ సశ్శివ స హరిః స ఇంద్రః అనగా అతడే బ్రహ్మ, శివుడు, విష్ణువు కావున అదే బ్రహ్మలోకము. అదే శివుడుండే కైలాసము. అదే విష్ణువు ఉండే వైకుంఠము. అదే ఇంద్రుడు ఉండే స్వర్గము. అదే నందనవనము.

*****



**పుణ్యలోక ప్రాప్తి గలుగును**

6. **ఏహ్యే హీతి తమాహుతయః సువర్చసః**
**సూర్యస్య రశ్మిభిర్యజమానం వహన్తి**
**ప్రియాం వాచ మభివదన్త్యోఽర్చయన్త్య**
**ఏష వః పుణ్యః సుకృతో బ్రహ్మలోకః**

ఏహి - ఏహి - ఇతి - తమ్ - ఆహుతయః - సువర్చసః - సూర్యస్య - రశ్మిభిః- యజమానం - వహన్తి - ప్రియాం - వాచమ్ - అభివదన్త్యః - అర్చయన్త్యః - ఏషః - వః-పుణ్యః - సుకృతః - బ్రహ్మలోకః.

| | | |
|---|---|---|
| తమ్+యజమానం | = | విధి విహితముగా అగ్నిహోత్రము చేసిన ఆ యజమానిని |
| సువర్చసః | = | తేజోవంతమైన |
| ఆహుతయః | = | ఆహుతులు |
| ఏహి+ఏహి+ఇతి | = | స్వాగతం సుస్వాగతం అని |
| ప్రియాం + వాచమ్ | = | మధురోక్తులను పలుకుచూ |
| ఏషః+సుకృతః+పుణ్యః+ బ్రహ్మలోకః | = | ఈ సుకృతము అయినదియు, పుణ్యప్రదమయి నదియు అయిన బ్రహ్మలోక ప్రాప్తి |
| వః | = | మీ యొక్క అగ్నిహోత్రము లేక పుణ్యకర్మానుష్ఠానము విధివిహితముగా చేయుట వలన గలిగిన |
| అభివదన్త్యః | = | పుణ్య ఫలితము అని పలుకుచూ ఆ ఆహుతులు |
| అర్చయన్త్యః | = | రాజును ప్రజలు పూజించునట్లు పూజించుచూ |
| సూర్యస్య | = | అధి దైవికమయిన సూర్యుని యొక్క |
| రశ్మిభిః | = | కిరణములచేత |
| వహంతి | = | రాజును పల్లకిలో కూర్చుండబెట్టుకొని సేవకులు ఆ పల్లకిని మోయునట్లు - మోసుకొని పోవుదురు. |

పుణ్యకర్మలు విధివిహితముగా చేయుటవలన ఇహలోకమున కోరిన కోరికలు నెఱవేఱును. పరలోకమునకు సంబంధించి బ్రహ్మలోకప్రాప్తి గలుగును. కామ్య

కర్మల వలన కలిగిన పుణ్య ఫలితము క్షీణించగనే పునర్జన్మ కలుగును.

*****

7. ప్లవా హ్యేతే అదృఢా యజ్ఞరూపా
అష్టాదశోక్త మవరం యేషు కర్మ।
ఏతచ్ఛ్రేయో యే౽భినందంతి మూఢా
జరా మృత్యుం తే పునరేవాపియన్తి॥

ప్లవాః - హి- ఏతే - అదృఢాః - యజ్ఞరూపాః - అష్టాదశ - ఉక్తమ్ - అవరం - యేషు - కర్మ - ఏతత్ - శ్రేయః - యే - అభినందంతి - మూఢాః - జరామృత్యుం - తే - పునర్ - ఏవ - అపియన్తి.

ఎవడు పుణ్యాకర్మల ఫలితమును కోరి

| | | |
|---|---|---|
| అష్టాదశ+ | = | 18 మంది అనగా 16 మంది ఋత్విజులు, |
| యజ్ఞరూపాః+హి | | యజమాని, యజమాని భార్య మొత్తం 18 మందిచే చేయబడే ఈ యజ్ఞములు, యాగములు మఱియు పుణ్యకర్మలు |
| యేషు | = | వేటి యందు అనగా ఆ పుణ్యాకర్మల వలన గలుగు పుణ్యఫలితము వలన గలుగు ఇహలోక పరలోక ములకు సంబంధించిన కోరికలు నెఱవేఱుట అనే భావనయందు ఉందురో - ఆ పుణ్య ఫలితము |
| ఏతే+అదృఢాః+ప్లవాః | = | ఈ ఓటి పడవలు అనగా భవసాగరమును దాటించలేవు. అందువలన ఈ |
| కర్మ | = | పుణ్యాకర్మల వలన గలుగు ఫలితములు |
| అవరం | = | క్షణికమని, అశాశ్వతములని |
| ఉక్తం | = | చెప్పబడినవి. |

పుణ్యాకర్మలు చేసి పుణ్యఫలితమును కోరి

| | | |
|---|---|---|
| ఏతత్ | = | బ్రహ్మలోకప్రాప్తి తాత్కాలికముగా పొంది ఇదే |



| | | |
|---|---|---|
| శ్రేయః | = | శ్రేయస్కరము అని |
| యే | = | ఎవరు |
| అభినందంతి | = | ఆనందించెదరో |
| తే | = | వారు |
| మూఢాః | = | మూర్ఖులు. వారు పుణ్య లోకములను పొంది పుణ్య ఫలితము క్షీణించగానే |
| పునః(పునర్)+ | = | మరల, మరల |
| జరా మృత్యుం+ ఏవ | = | ముసలితనము మృత్యువు - అనగా జనన మరణ వలయములోనే |
| అపియన్తి | = | తిరుగుచున్నారు. అనగా చావు పుట్టుకలనే పొందుచున్నారు. |

ఇహలోకమునకు సంబంధించిన ఆయుర్దాయము, పుత్రులు, పౌత్రులు, ధనము, బంగారము, సామ్రాజ్యము, పశు సంపదలు అనగా గోవులను గుఱ్ఱములను, ఏనుగులను మొదలయినవి, సకల భోగభాగ్యములు, అష్టఐశ్వర్యములు - స్త్రీలు మొదలయినవి కోరి మఱియు పరలోకమునకు సంబంధించినవి, మానవ లోకములో దొరకనివి అగు సుఖభోగములు అప్సరసల తోటి సంభోగ సుఖములు కోరి ఇటుల ఇహలోక, పరలోక సుఖములు కాంక్షించియే పుణ్య కర్మానుష్ఠానము చేయుదురు. ఇందలి దోషములు ఏవి అని విచారించినచో - మానవుడు జీవించి యున్నంత వఱకే ఇహ లోక సుఖములను అనుభవించగలడు. అతడు చనిపోయినచో ఈ భోగభాగ్యములను అనుభవించలేడు. పుణ్యాఫలితము నశించగానే పుణ్య లోకానుభవము కూడ నశించును. ఈ విషయములే కఠోపనిషత్‌లో నచికేతుడు - యమునితో చెప్పినట్లు వర్ణింపబడినది.

బ్రహ్మలోకమును పొంది శాశ్వతముగా అక్కడ వసియించక తిరిగి భూలోకమున జన్మించువాడు మూర్ఖుడు కాడా? మూర్ఖుడే.

*****

కామ్యకర్మలను బోధించు గురువులు వారిని అనుసరించు శిష్యులు నిరసింపబడిరి.

**8. అవిద్యాయా మన్తరే వర్తమానాః స్వయం ధీరాః పండితం మన్యమానాః।**
**జంఘన్యమానాః పరియంతి మూఢా అన్ధేనైవ నీయమానా యథాऽన్ధాః॥**

అవిద్యాయామ్-అన్తరే - వర్తమానాః - స్వయం - ధీరాః - పండితం - మన్యమానాః -జంఘన్యమానాః - పరియంతి - మూఢాః - అన్ధేన - ఏవ - నీయమానాః - యథా - అన్ధాః

రజోగుణయుతులై పుణ్యకర్మలు అనుష్ఠించి ఆపుణ్యాకర్మల ఫలితము కోరి అనగా కర్మములు గైకొని  అనగా కర్మబద్ధులై బ్రహ్మలోకము చేరి, పుణ్యానుభవం పూర్తికాగానే తిరిగి బ్రహ్మలోకం నుంచి భ్రష్టులై భూలోకంలో జన్మించి సుఖదుఃఖములను పొందుదురు. ఈ విషయమును గ్రహించలేక పోవుటయే అవిద్య. అవిద్యలో ఉండి వారు చనిపోయిన తర్వాత వారు చేయు ప్రయాణమును దక్షిణాయనము అని లేక పితృయానమని అందురు. అట్టి ఈ ప్రయాణము చేయు

| | | |
|---|---|---|
| మూఢాః | = | మూర్ఖులు |
| అవిద్యాయామ్ | = | అవిద్య అనగా భవసాగరము నందు |
| అన్తరే | = | మధ్యలో దరికానక కూరుకుపోయి |
| వర్తమానాః | = | ఉంటూ |
| స్వయం+పండితం | = | (సమదర్శనుడు పండితుడు. వీరికి సమదర్శనము లేకపోయినా) ఈ మూర్ఖులు వారంతట వారే వేద పండితులము అనుకొని |
| ధీరాః | = | జీవిత పరమార్థము సాధించిన ధీరుల మనుకొని (ఇహలోక, పరలోక సుఖ భోగములు కోరనివాడు ధీరుడు. వీరు భోగాపేక్షపరులు అయినప్పటికి ఈ మూర్ఖులు వారంతతట వారే) |
| మన్యమానాః | = | కృతార్థులము అయితిమి అని భావించి వీరు గురువులై తమ శిష్యులకు పుణ్యాకర్మానుష్ఠానము తద్వారా గలుగు పుణ్యాలోకములను గుఱించి బోధించుచున్నారే తప్ప ఆత్మదర్శన ప్రాప్తిని గుఱించి బోధించుట లేదు. ఇట్టి గురుశిష్యుల గుఱించి ఒక ఉదాహరణ చెప్పుచున్నాడు. |
| యథా | = | ఏ విధముగా |
| అన్ధేన+ఏవ | = | గ్రుడ్డివాని చేతనే |
| నీయమానాః | = | నడిపింపబడే మిగిలిన |
| అన్ధాః | = | గ్రుడ్డివాళ్ళవలె రజోగుణయుతులై పుణ్యకర్మాను ష్ఠానము చేసి పుణ్యకర్మల ఫలితములను కోరి కొందఱు వీరిని అనుసరించుచున్నారు. అయితే ఈ గురువులు, వారిని అనుసరించే వారు కూడ |
| జంఘన్యమానాః | = | దుఃఖ పరంపరలచేత పీడింపబడుతూ అనగా ముసలితనము, వ్యాధులచే బాధపడుచూ జనన మరణవలయములో |
| పరియంతి | = | తిరుగుచున్నారు. అలా పరమ పురుషార్థమును పొందక అధోగతి పాలగుచున్నారు. |

**ఉ॥ కానని వాని నూఁతగొని కాననివాఁడు విశిష్టవస్తువుల్**
**గానని భంగిఁ గర్మములు గై కొని కొందఱు కర్మబద్ధులై**
**కానరు....... (భాగవతము, సప్తమ స్కంధం 182)**

కావున తత్త్వజిజ్ఞాసగల జీవునకు పుణ్యకర్మ ఫలితము నిరర్థకము - అని వ్యాసభగవానుడు భాగవతమున వివరించినాడు.

*****

ఇదే విషయమునే మరల చెప్పుచున్నాడు. కామ్యకర్మలు - (ప్రవృత్తి కర్మలు), పునరావృత్తిని గలుగ చేయును

**9. అవిద్యాయాం బహుధా వర్తమానా**
**వయం కృతార్థా ఇత్యభిమన్యంతి బాలాః।**

**యత్కర్మిణో న ప్రవేదయంతి రాగాత్**
**తేనాతురాః క్షీణలోకాశ్చ్యవన్తే ॥**

అవిద్యాయాం - బహుధా - వర్తమానాః - వయం - కృతార్థాః - ఇతి - అభిమన్యంతి - బాలాః - యత్ - కర్మిణః - న- ప్రవేదయంతి - రాగాత్ - తేన - ఆతురాః - క్షీణలోకాః - చ్యవంతే.

| | | |
|---|---|---|
| యత్ | = | ఏది అనగా రజోగుణము వలన గలిగిన పుణ్యకర్మల ఫలితము పొందాలనే |
| రాగాత్ | = | ఆసక్తి వలన |
| బాలాః | = | జ్ఞాన శూన్యులయిన బాలుర వంటి |
| కర్మిణః | = | పుణ్యకర్మానుష్ఠాన పరులు |
| అవిద్యాయాం | = | అవిద్యలో |
| వర్తమానాః | = | ఉంటూ |
| బహుధా | = | అగ్నిహోత్రాది పుణ్యకర్మలు అనేకము అనుష్ఠించి కర్మ ఫలితము కోరి. |
| తేన | = | ఆ పుణ్య ఫలితముచే బ్రహ్మలోకము పొంది |
| వయం | = | మేము |
| కృతార్థాః+ఇతి | = | కృతార్థులము అయితిమి అని |
| అభిమన్యంతి | = | తలంచెదరు. వారు కృతార్థులు కాలేదు అనే విషయమును వారు |
| న+ప్రవేదయంతి | = | తెలుసుకోలేరు. అట్టి వారు |
| క్షీణలోకాః | = | పుణ్యానుభవము క్షీణించగా - బ్రహ్మలోకాది పుణ్యలోకముల నుండి |
| ఆతురాః | = | దుఃఖితులై అనగా యిక పుణ్యలోకములలో నివాసము లేదు గదా అని దుఃఖితులై |
| చ్యవంతే | = | ఊర్ధ్వలోకముల నుండి అధోగతి పాలగుదురు. అనగా తిరిగి భూలోకమున జన్మింతురు. |

*****



అదే విషయమును మరల చెప్పుచున్నాడు

**10. ఇష్టా పూర్తం మన్యమానా వరిష్ఠం**
**నాన్యచ్ఛ్రేయో వేదయన్తే ప్రమూఢాః ।**
**నాకస్య పృష్ఠే తే సుకృతేఽనుభూత్వా**
**ఇమం లోకం హీనతరం వా విశంతి ॥**

ఇష్టా- పూర్తమ్ - మన్యమానాః - వరిష్ఠం - న - అన్యత్- శ్రేయః - వేదయన్తే - ప్రమూఢాః - నాకస్య - పృష్ఠే - తే - సుకృతే - అనుభూత్వా- ఇమం- లోకం- హీనతరం- వా - విశంతి.

| | | |
|---|---|---|
| ప్రమూఢాః | = | జ్ఞానశూన్యులయిన బాలురవంటి వీరు, పుణ్యకర్మానుష్ఠానపరులై, కర్మఫలితమును కోరిన మూఢులు |
| ఇష్టా | = | అగ్నిహోత్రము, వేదోక్తములయిన యజ్ఞయాగాది కర్మలు, వేదాధ్యయనము |
| పూర్తం | = | చెఱువులు, బావులు త్రవ్వించుట, ఉద్యానవనములు నిర్మించుట, అన్నదానము మొదలయిన పుణ్యకర్మలు వాటి వలన గలుగు పుణ్యఫలితము |
| వరిష్ఠం | = | ఆత్మజ్ఞానము కంటె శ్రేష్ఠములని |
| మన్యమానాః | = | భావించుచూ |
| అన్యత్ | = | బ్రహ్మలోకము పొంది ఇంతకంటె |
| శ్రేయః | = | శ్రేయస్సు యింకొకటి గలదనే విషయమును |
| న+వేదయంతే | = | గ్రహించలేరు. కామ్యకర్మల ఫలితమును అనుభవించుట ప్రేయోమార్గము. ఆత్మను దర్శించి ఆత్మయై విరాజిల్లుట శ్రేయోమార్గము. కాని ఈ మూర్ఖులు ప్రేయోమార్గమునే శ్రేయో మార్గముగా భావించుచున్నారు. బ్రహ్మలోకమును పొంది తిరిగి భూలోకమున జన్మించకుండుట శ్రేయోమార్గము. అదే శ్రేయస్సు. కాని |

| | | |
|---|---|---|
| తే | = | వారు |
| సుకృతే | = | సుకృతకర్మ చేసి ఫలితమును కోరుట వలన పుణ్యఫలితము నందు లభ్యమగు సౌఖ్యములను |
| అనుభూత్వా (అనుభూయ) | = | అనుభవించి |
| వా | = | మరల |
| నాకస్య+పృష్ఠే | = | ఉన్నతమైన బ్రహ్మలోకముయొక్క నిర్గమన ద్వారమునుండి |
| ఇమం | = | ఈ |
| హీనతరం | = | హీనతరమయిన |
| లోకం | = | భూలోకమును |
| విశంతి | = | ప్రవేశించెదరు అనగా భూలోకమున జన్మించెదరు. |

ఇంతవఱకు దక్షిణాయన మార్గమును గుఱించి వివరించినారు.

**కావున శృతి గర్మపర మని చూపుచుండు వారు వేదజ్ఞులన(దగువారు గారు - మఱియు గర్మనిష్ఠు లగు నుపాధ్యాయు లైనవార లీ యాత్మ తత్త్వంబును నెఱుంగరు**

అని భాగవతము చతుర్థస్కంధమున (877, 883) వివరింపబడినది.

ఇట్టి గురువులను గుఱించి ప్రహ్లాదుడు

**కం॥ గురువులు దమకును లో(బడు**
**తెరువులు సెప్పెదరు, విష్ణుదివ్య పదవికిం**
**దెరువులు సెప్పరు...**

(భాగవతము, సప్తమ స్కంధం- 246)

**యాగప్రముఖ పుణ్యలబ్ధంబు లైన స్వర్గాదిలోక భోగంబులు, పుణ్యానుభవ క్షీణంబులు గాని నిత్యంబులుగావు. నరుండు విద్వాంసుండ నని యభిమానించి కర్మంబు లాచరించి యమోఘంబు లయిన విపరీతఫలంబుల నొందు( (సప్తమ స్కంధం - 241).**

**లోకంబున సకల జనులు మనంబుల ఘనంబులగు సౌఖ్యంబు లందం తలంచి**



**తత్ ఫల ప్రాప్తి హేతువు లయిన కర్మంబులు ఆచరించి, దైవోపహతులై తత్ కర్మంబుల చేత నిష్ఫల ఆరంభులు అగుదురు అని వ్యాసభగవానుడు భాగవతమున వివరించినారు.**

గురువులను నిందించి ప్రయోజనము లేదు. ఈ గురువులు వారి ధోరణిని మార్చుకొనరు. కావున ఈ కోవకు చెందిన గురువుల మాటలను ఆత్మజ్ఞానమును పొందగోరువాడు అనుసరించరాదని శ్రీకృష్ణుడు అర్జునునికి భగవద్గీతలో హితబోధ చేసినాడు.

**సాంఖ్యయోగము**

**యా మిమాం పుష్పితాం వాచం ప్రవదన్త్య విపశ్చితః**
**వేదవాదరతాః పార్థ నాన్యదస్తీతి వాదినః... (42)**

**కామాత్మానః స్వర్గపరా జన్మకర్మ ఫలప్రదామ్**
**క్రియా విశేష బహులాం భోగైశ్వర్య గతిం ప్రతి.... (43)**

**భోగైశ్వర్య ప్రసక్తానాం తయాఽప హృత చేతసామ్**
**వ్యవసాయాత్మికా బుద్ధి స్సమాధౌ న విధీయతే.... (44)**

పార్థ = ఓ అర్జునా; వేదవాదరతాః = వేదములయందు చెప్పబడిన యజ్ఞయాగాది పుణ్యకర్మలు ఆ పుణ్యకర్మల వలన గలుగు ఫలితముల యందు ఆసక్తిగలవారు; న+అన్యత్+ అస్తి + ఇతి + వాదినః = బ్రహ్మలోకము పొందుటకంటె అధికమయినది యింకొకటి లేదని వాదించువారు; కామ+ఆత్మానః= పుణ్యకర్మల వలన గలుగు భోగభాగ్యములు అనుభవించుటయందు ఆసక్తి గలవారు; స్వర్గపరాః =భూలోకమున లభ్యమవని సౌఖ్యములు అనగా స్వర్గలోక సుఖములు ఆశించువారు; అయిన; అవిపశ్చితః = ఈ మూర్ఖులు - లేక అవివేకులు; జన్మ కర్మ ఫల ప్రదామ్ = జాతి ధర్మములు ఆశ్రమ ధర్మములు గలిగి చేయు పుణ్యకర్మ తద్వారా ఫలితము నిచ్చునట్టిదియు; క్రియా విశేషబహులాం = విధినిషేధములతో క్రియావిశేషము ఎక్కువగా గలదియు; భోగైశ్వర్యగతిం ప్రతి=భోగైశ్వర్యములు గలిగించు నట్టివియు అగు; పుష్పితాం + యామ్ + ఇమామ్ + వాచం = కంటికి పూవులు ఆనందము గలిగించునట్లు చెవులకు ఇంపైన పుణ్యకర్మల ఫలితము లను గుఱించి; ప్రవదన్తి

= విశేషముగా చెప్పుచున్నారు. తయా+ అపహృత + చేతసామ్ = వీరిని గురువులుగా భావించి వారు చెప్పిన మాటలచే విన్న వారి మనస్సు వారి స్వాధీనములో లేక అనగా అపహరింప బడిన మనస్సు గలవారికి; భోగైశ్వర్య ప్రవక్తానామ్= భోగములను ఐశ్వర్యములందు గల కోరికలచే వాటిని అనుభవించాలనే తలంపు గల వారికి; వ్యవసాయాత్మికా బుద్ధిః = ఆత్మ తత్త్వము తెలుసుకోవాలనే బుద్ధి ; సమాధౌ = ఆత్మతత్త్వము పొందుటకు అవసరమగు యోగము; న+విధీయతే = బుద్ధిగలుగదు. యోగమును అనుష్ఠించలేరు.

కావున తత్త్వజిజ్ఞాస గలవారు - ఇట్టి గురువుల బోధలను వినరాదు. దీనికి ఉదాహరణగా ప్రహ్లాదుని చిత్రీకరించి - అతడు చండామార్కుల బోధలను పాటించలేదని వివరించినారు. కామ్యకర్మల యందలి దోషములను ఉపన్యాసముల ద్వారానో లేక ఆశ్రమములను స్థాపించి ప్రచారము చేసినచో ఎటులుండును? అన్న ప్రశ్నకు సమాధానముగా భాగవతమున ఇట్లు చెప్పబడినది.

ఉ॥ **అచ్చపుఁ జీఁకటిం బడి గృహవ్రతులై విషయ ప్రవిష్టులై**
**చచ్చుచుఁ బుట్టుచున్ మరలఁ జర్విత చర్వణు లైన వారికిం**
**జెచ్చెరఁ బుట్టునే పరులు సెప్పిననైన నిజేచ్ఛనైన నే**
**మిచ్చిన నైనఁ గానలకు నేఁగిన నైన హరి ప్రబోధముల్ ?**

(భాగవతము, సప్తమస్కంధము- 181)

ఇంతవఱకు రజోగుణయుతులైన వారు చేయు పుణ్యకర్మానుష్ఠానం వారు కోరు కోరికలు - అందలి దోషములను వివరించినాడు.

*****

పుణ్యకర్మానుష్ఠానం చేసి కోరికలు కోరనివారు పొందు ఫలితము - నివృత్తి కర్మఫలము

**11.** **తపః శ్రద్ధే యే హ్యుపవసంత్యరణ్యే**
**శాంతా విద్వాంసో భైక్షచర్యాం చరంతః।**
**సూర్యద్వారేణ తే విరజాః ప్రయాంతి**
**యత్రామృతః స పురుషో హ్యవ్యయాత్మా॥**



తపః - శ్రద్ధే - యే - హి - ఉపవసంతి - అరణ్యే - శాంతాః- విద్వాంసః - భైక్షచర్యాం - చరంతః -సూర్యద్వారేణ - తే- విరజాః - ప్రయాంతి -యత్ర - అమృతః - సః- పురుషః- హి-అవ్యయ - ఆత్మా.

ఇప్పుడు ఉత్తరాయణ మార్గమును వివరించుచున్నాడు. పుణ్య కర్మలు చేసి కర్మఫలితములను కోరనివారు ఆత్మస్థానమును చేరి అనగా బ్రహ్మలోకము చేరి అక్కడ శాశ్వతముగా నివసించెదరు.

| | | |
|---|---|---|
| యే | = | ఎవరయితే అనగా |
| విరజాః+హి | = | (రజో గుణము వలన కర్మ పలితమును కోరుదురు. కావున) రజోగుణము లేకుండా కామ క్రోధాదులు లేకుండా సత్త్వగుణప్రధానులై పుణ్యకర్మానుష్ఠానము విధివిహితముగా చేసి ఆ పుణ్య కర్మల వలన గలుగు పుణ్యఫలితమును కోరని వారు |
| శాంతాః | = | త్రిగుణ రహితులయిన వారు, శాంతులు |
| శ్రద్ధే | = | పుణ్యకర్మలను శ్రద్ధగా ఆచరించువారు |
| అరణ్యే+తపః | = | జితేంద్రియులై అరణ్యమునందు తపస్సు చేయుటకు |
| ఉపవసంతి | = | నివసించువారు అనగా మీరు, నేను అనే మతి భ్రమణంబున భిన్నులై ప్రవర్తిల్లక సర్వము అతని దివ్యకళామయమంచు తలంచి విషయాభిలాష లేకుండా తపస్సు చేయుటకు అరణ్యమునందు నివసించువారు మఱియు |
| భైక్ష్యచర్యాం | = | గ్రామ, పురనివాసియైనను సంగరహితులై ధనకనక వస్తువాహనములు సంపాదించుట యందు ఆసక్తి లేక - విరక్తి కలిగి - తనదంటూ ఏదీ లేక దొరికిన దానితో తృప్తిపడుట అనే భిక్షాటన |
| చరంతః | = | చేయువారు అట్టి |
| తే+విద్వాంసః | = | ఆ విద్వాంసులు |

| | | |
|---|---|---|
| సూర్యద్వారేణ | = | అధి దైవికమగు సూర్యద్వారము ద్వారా అనగా ఉత్తరాయణ మార్గము ద్వారా |
| యత్ర | = | ఎక్కడ |
| అమృతః | = | అమృత స్వరూపుడు |
| సః+పురుషః | = | (ఆది) పురుషుడు అగు |
| అవ్యయ+ఆత్మా | = | అవ్యయమైన ఆత్మ అనగా ఆత్మస్థానమును లేదా బ్రహ్మ లోకమును |
| ప్రయాంతి+హి | = | చేరుకొని అక్కడ వసియించెదరు. వీరు తిరిగి జన్మించరు. పుణ్యఫలితము కోరిన వారు మరల జన్మించెదరు. పుణ్యకర్మ ఫలితము కోరని వారు మరల జన్మించరు. కల్పాంతమున అధికార పురుషులగుదురు. |

1. మోక్షార్థి పుణ్యకర్మలు చేయక పోయినట్లయిన ఆత్మ జ్ఞానమును పొందడు. 2. మనస్సు చేత కర్మేంద్రియ జ్ఞానేంద్రియములను నియమించి ఆసక్తిలేక పుణ్యఫలితమునందు ఆసక్తిలేక కర్మానుష్ఠానం చేయవలయును. అప్పుడు కర్మబంధము కాదు. 3. ఆత్మ ప్రాప్తిగలుగు పర్యంతము కర్మానుష్ఠానం శ్రద్ధగా చేయవలయును. 4. జ్ఞాని కూడ పుణ్యకర్మలను ఆచరింపవలయును. 5. కర్తృత్వ భావనలేక నిరాశీ అనగా ఆశలేక, నేను నాది అనే అహంకార మమకారము లేక పుణ్యకర్మానుష్ఠానం చేయవలయునని శ్రీకృష్ణుడు చెప్పినాడు. అలా కర్మానుష్ఠానం చేయుచూ సర్వత్రా సమదర్శనుడయిన విద్వాంసుడు మాత్రమే ఉత్తరాయణ మార్గమున బ్రహ్మలోకము చేరుకొనును.

దీనిపై వ్యాసభగవానుడు తన భాగవతము ద్వితీయ స్కంధములో మఱికొంత వివరణ యిచ్చినారు.

**పుణ్యాతిరేకంబున బ్రహ్మలోకగతు లైన వారు కల్పాంతరంబునం బుణ్యతార తమ్యంబుల నధికారవిశేషంబు నొందువార లగుదురు.**

(భాగవతము, ద్వితీయ స్కంధం - 32).



నిష్కామ కర్మ పరులు బ్రహ్మలోకము చేరి అక్కడనే వసియించెదరు.

ఈ విషయమునే శ్రీకృష్ణ భగవానుడు ఇట్లు చెప్పినాడు.

**తస్మాదసక్త స్సతతం కార్యం కర్మ సమాచర**
**అసక్తో హ్యాచరన్ కర్మ పరమాప్నోతి పూరుషః (కర్మయోగం -19)**

తస్మాత్ = అందువలన, ఓ అర్జునా; ఆసక్తః = రాగములేని వాడవై అనగా పుణ్యకర్మల యందు ఫలాపేక్షలేని వాడవై; సతతమ్ = నిత్యము శ్రద్ధగా; కార్యమ్+కర్మ+సమాచర=చేయవలసిన అగ్నిహోత్రాది పుణ్యకర్మలను ఆచరింపుము; అలా; ఆసక్తః+కర్మ+ఆచరన్+పూరుషః+హి= రాగరహితుడై జాతిపరంగా ఆశ్రమ పరంగా విధింపబడిన పుణ్యకర్మలను చేయువాడు; పరమ్+ఆప్నోతి =పరమపదమయిన బ్రహ్మ లోకమును పొందు చున్నాడు.

*****

బ్రహ్మ విద్యను పొందగోరు విద్యార్థి ప్రవృత్తి కర్మయందలి దోషమును గ్రహించి బ్రహ్మ విద్యను బోధించు గురువును ఆశ్రయించవలయును.

**12. పరీక్ష్య లోకాన్ కర్మచితాన్ బ్రాహ్మణో**
**నిర్వేద మాయానాస్త్యకృతః కృతేన।**
**తద్విజ్ఞానార్థం స గురు మేవాభి గచ్ఛేత్**
**సమిత్పాణిః శ్రోత్రియం బ్రహ్మనిష్ఠమ్॥**

పరీక్ష్య - లోకాన్ - కర్మచితాన్ - బ్రాహ్మణః - నిర్వేదం - ఆయాత్ - న - అస్తి - అకృతః - కృతేన - తత్ - విజ్ఞానార్థం - సః - గురుమ్ - ఏవ - అభిగచ్ఛేత్ - సమిత్పాణిః - శ్రోత్రియం - బ్రహ్మనిష్ఠమ్.

| | | |
|---|---|---|
| కర్మచితాన్ | = | పుణ్యకర్మలచే పొందదగిన అనగా కర్మఫలములయిన పుణ్య |
| లోకాన్ | = | లోకములను |

| | | |
|---|---|---|
| పరీక్ష్య | = | పరీక్షించి అనగా పుణ్యకర్మలు తద్వారా గలుగు పుణ్యలోకముల నివాసము ఆ తర్వాత పుణ్య ఫలితము క్షీణించగా తిరిగి భూలోకమున జన్మించుట మొదలయిన విషయములను గ్రహించి పుట్టని చావని త్రోవవెతకు కొనుట దొడ్డ బుద్ధి అని తెలుసుకొని |
| నిర్వేదం | = | పుణ్య కర్మ ఫలితములయందు ఉదాసీనత |
| ఆయాత్ | = | గలుగుగాక. అనగా ఇహలోక పరలోక భోగ భాగ్యములు అశాశ్వతములని తనంతతానే గ్రహించి వాటియందు నిర్వేదము పొందవలయును. |
| అకృతః | = | ఆత్మతత్త్వము |
| కృతేన | = | అగ్నిహోత్రము, యజ్ఞము, ఇష్టా పూర్తములు మొదలయిన పుణ్యకర్మానుష్ఠానంచేత |
| న+అస్తి | = | పొందలేము అని స్వయంగా గ్రహించి |
| తత్ | = | ఆత్మ తత్త్వము |
| విజ్ఞానార్థం | = | తెలుసుకొనుటకు |
| సః+బ్రాహ్మణః | = | పుణ్యకర్మానుష్ఠానపరుడై పుణ్యఫలితము కోరని సత్వగుణ ప్రధానుడయిన జ్ఞానార్థి అయిన - బ్రాహ్మణుడు |
| శ్రోత్రియం | = | వేదవేదాంగములు చదివి వాటి అర్థము గ్రహించిన శ్రోత్రియుడు - పరానుభూతిని పొందినవాడూ |
| బ్రహ్మనిష్ఠం | = | బ్రహ్మనిష్ఠుడు అయిన |
| గురుం + ఏవ | = | ఆత్మ దర్శనం చేసిన మహనీయుడయిన గురువును మాత్రమే |



| | | |
|---|---|---|
| సమిత్పాణిః | = | చేతిలో దర్భలు తీసుకొని (అనగా పవిత్రతకు దర్భలు చిహ్నము గావున పవిత్రభావనతో శిష్యుడు) |
| అభిగచ్ఛేత్ | = | ఆశ్రయించవలయును |

ఇట్టి గురువులకు ప్రతినిధులుగా భాగవతమున నారదుడు - వ్యాసభగవానుడు - శుకబ్రహ్మ - సూత మహర్షి - మైత్రేయుడు - కపిలుడు - ఋషభుడు - జడభరతుడు - మొదలయిన వారిని ఎందఱినో ఉదహరించినారు. శిష్యులకు ప్రతినిధులుగా శౌనకాదిమహామునులు - పరీక్షిత్ మహారాజు మొదలైన వారిని ఉదహరించినారు. రామాయణంలో నారదుడు గురువుగా వాల్మీకిని శిష్యునిగా తీసుకొని గురుశిష్య లక్షణములు వివరించినారు.

*****

**బ్రహ్మ విద్యను శిష్యునకు బోధించవలయును.**

బ్రహ్మ విద్యను అభ్యసించగోరు విద్యార్థికి ఉండవలసిన లక్షణములు :

**13. తస్మై స విద్వానుపసన్నాయ సమ్యక్**
**ప్రశాంత చిత్తాయ శమాన్వితాయ।**
**యేనాక్షరం పురుషం వేద సత్యం**
**ప్రోవాచ తాం తత్త్వతో బ్రహ్మవిద్యామ్॥**

**(ఇతి ముండకోపనిషది ప్రథమ ముండకే ద్వితీయఃఖండః)**

తస్మై - సః - విద్వాన్ - ఉపసన్నాయ - సమ్యక్ - ప్రశాంత చిత్తాయ - శమాన్వితాయ - యేన - అక్షరం - పురుషం - వేద - సత్యం - ప్రోవాచ - తాం - తత్త్వతః - బ్రహ్మవిద్యామ్.

| | | |
|---|---|---|
| శమాన్వితాయ | = | బాహ్యేంద్రియ నిగ్రహము గలవాడును |
| ప్రశాంత చిత్తాయ | = | అంతరేంద్రియ నిగ్రహము గలిగి ప్రశాంతచిత్తము గలవాడును |
| సమ్యక్ | = | విధివిహితముగా |
| ఉపసన్నాయ | = | గురువును ఆశ్రయించినవాడును అగు |

| | | |
|---|---|---|
| తస్మై | = | శిష్యునకు |
| సః+విద్వాన్ | = | బ్రహ్మ విద్యను బోధించగల సద్గురువు |
| అక్షరం | = | అక్షరము |
| పురుషం | = | (ఆది) పురుషుడు |
| సత్యం | = | సత్యము అయిన |
| తాం | = | ఆత్మ తత్త్వమును |
| బ్రహ్మవిద్యాం | = | తెలుపు బ్రహ్మవిద్యను |
| తత్త్వతః | = | సత్యముగా అరమరికలు లేకుండా |
| యేన | = | దేనిచేత అనగా ఏ విధముగా ఉపదేశించిన ఆత్మతత్త్వమును శిష్యుడు |
| వేద | = | గ్రహించునో ఆవిధముగా శిష్యునకు |
| ప్రోవాచ | = | ఉపదేశించవలయును |

*****



## ద్వితీయ ముండకే ప్రథమః ఖండః

సృష్ట్యాదియందున్న ఆత్మ , పురుషుడు , విరాట్‌పురుషుల గురించి , సృష్టి గురించి- హృదయగుహలో గల ఆత్మ గురించి ఈ అధ్యాయమున వర్ణింపబడినది. సృష్ట్యాదియందు గల ఆత్మనుంచి - దేహములో వసియించు ఆత్మ ప్రభవించినది.

1. **తదే తత్ సత్యం**
**యథా సుదీప్తాత్ పావకాత్ విస్ఫులింగాః**
**సహస్రశః ప్రభవంతే సరూపాః ।**
**తథాఽక్షరాత్ వివిధాః సోమ్య భావాః**
**ప్రజాయంతే తత్ర చై వాపి యన్తి ॥**

తత్ - ఏతత్ - సత్యం - యథా - సుదీప్తాత్ - పావకాత్ - విస్ఫులింగాః - సహస్రశః - ప్రభవంతే - సరూపాః - తథా - అక్షరాత్ - వివిధాః - సోమ్య - భావాః - ప్రజాయంతే - తత్ర - చ - ఏవ - అపి - యంతి.

ప్రభవంతే, ప్రజాయంతే అనే ఈ రెండు పదములు ఈ మంత్రమునకు ఆయువు పట్టులు. ప్రభవంతే అనే పదమునకు స్వయంజాతమని, ప్రజాయంతే అనే పదమునకు పుట్టినదని అర్థము. పుట్టినవి కాల ప్రభావమున వికారమునకు లోనై చివరకు మరణించును. జీవాత్మ కాలమునకు అధీనము. స్వయం జాతమయినది కాలాతీతము. ఇది అమృతము.

| | | |
|---|---|---|
| ఏతత్ | = | ఈ జీవాత్మ కాలాధీనము |
| తత్+సత్యం | = | అనగా స్వయంజాతమయిన ఆత్మ నిత్యము. సత్యము. అమృతము. కాలాతీతము |
| సోమ్య | = | ఓ స్నేహితుడా |
| యథా | = | ఏ విధముగా |
| సుదీప్తాత్ | = | బాగా ప్రజ్వలించే |
| పావకాత్ | = | అగ్నినుంచి |

| | | |
|---|---|---|
| సరూపాః | = | అలాంటి |
| విస్ఫులింగాః | = | అగ్నికణములే |
| సహస్రశః | = | వేనకు వేలు అనగా అసంఖ్యాకముగా |
| ప్రభవంతే | = | వాటి అంతతట అవే వచ్చినవో |
| తథా | = | ఆవిధముగా |
| అక్షరాత్ | = | అక్షర పరబ్రహ్మనుంచి అనగా కాలాధీనముగాని అమృత స్వరూపమయిన సృష్ట్యాదియందున్న ఆత్మ నుంచి- హృదయగుహలోగల అసంఖ్యాకమయిన ఆత్మలు వచ్చినవి. |

అగ్ని స్వరూప, స్వభావము అగ్నికణముల స్వరూప స్వభావములు ఒకటే. అగ్ని అపరిమితం లేక అఖండము, అగ్నికణం ఖండములేక పరిమితం. లేక సూక్ష్మము. ఒకటి గంగానది. మఱియొకటి కడవలోని గంగా జలము. కావున భేదము పరిమాణములోనే తప్ప స్వరూప స్వభావములలో లేదు. ఆత్మ హృదయ గుహలోవసియించి ఉపాధి లక్షణములను అంటక విలక్షణముగా ఉంది. ఇది **అధియజ్ఞము**. ఆత్మ ఉపాధిలో చరించి జీవాత్మ అయి జీవ పురుషుడయినది. ఉపాధి లక్షణములను గ్రహించినది. ఇది **అధిదైవికము.** ఆత్మ ఉపాధిని నిర్మించినది. ఉపాధి **అధిభౌతికము.**

| | | |
|---|---|---|
| వివిధాః+భావాః | = | విరాట్ వలన సమస్త భావములు, సమస్త స్థావర జంగమములు కలిగినవి. |

విరాట్ వలన జ్ఞానము, అహింస, సమత్వము, ఓర్పు, సత్యము, సంతుష్టి, దమము, శమము, దానము, తపస్సు, సుఖము, దుఃఖము, భయము, అభయము, కీర్తి, అపకీర్తి యీ విధముగా సమస్తభావములు గలిగినవి.

| | | |
|---|---|---|
| చ | = | మఱియు అధిభౌతికములయిన సమస్త ఉపాధులు అనగా విరాట్పురుషుని వలన స్థావర జంగమములు |



| | | |
|---|---|---|
| ప్రజాయంతే | = | సృజియింపబడినవి. జీవాత్మ ఉపాధి లక్షణములను గ్రహించుట వలన అనగా పులి ఉపాధిలోనికి ప్రవేశించి, క్రూర భావమును, రాక్షస శరీరములోనికి ప్రవేశించి రాక్షసభావమును, దేవతల శరీరములోనికి వచ్చి దైవభావమును ఇటుల త్రిగుణభావములు పొందినది. |
| తత్ర+ఏవ | = | ప్రకృతి యందు అనగా-ప్రకృతినుంచి సృజియింప బడినవి మరల లయకాలమున |
| అపి+యంతి | = | ప్రకృతియందే లయమగుచున్నవి. ఆత్మ నుంచి వచ్చిన హృదయగుహలోని ఆత్మ, జీవాత్మలు ఆత్మ యందే లయము అగుచున్నవి. |

*****

ఆత్మయే హిరణ్మయకోశమును నిర్మించుకొని అందు వసియించి పురుషుడైనది. ఇందు ఆదిపురుషుని లక్షణములు వివరింపబడినవి.

2. **దివ్యో హ్యమూర్తః పురుషః। స బాహ్యాభ్యంతరో హ్యజః ।**
   **అప్రాణో హ్యమనాః శుభ్రో । హ్యక్షరాత్ పరతః పరః ॥**

దివ్యః - హి - అమూర్తః - పురుషః - సః - బాహ్యః - అభ్యంతరః - హి - అజః- అప్రాణః - హి - అమనాః - శుభ్రః -హి - అక్షరాత్ - పరతః - పరః

| | | |
|---|---|---|
| పురుషః+హి | = | సృష్ట్యాది యందు నిరాకారముగా ఉన్న ఆత్మయే తనకు తానుగా హిరణమ్మయ కోశమును నిర్మించుకొని సాకారమును పొంది పురుషుడ యినది. ఆత్మ లక్షణములకు, పురుషుని లక్షణములకు భేదము లేదు. ఈ ఆది పురుషుడు |
| అజః | = | స్వయంభువుడు **(స్వయంభూః ఈశ ఉపనిషత్ 8)** |

దివ్యః = స్వయం ప్రకాశమైనవాడు

అమూర్తః+హి = రూప రహితుడు. కాని ఏ రూపము కావాలను కుంటే ఆ రూపమును ధరించును. ఉదా హరణకు మత్స్యావతారమున మత్స్య రూపము, కూర్మావతారమున కూర్మరూపము, నరసింహావ తారమున నరసింహరూపము ఇలా ఏ రూపము కావాలనుకుంటే ఆ ఉపాధిని నిర్మించుకొని ఆ రూపమున భాసిల్లును. **(యథా తథ్యతః - ఈశ ఉపనిషత్ 8)**

శుభ్రః = కళంకరహితుడు. అనగా పరిశుద్ధుడు. ఉపాధిలో ఉన్నను ఆ ఉపాధి లక్షణములను గ్రహించడు. **(శుద్ధం - ఈశ ఉపనిషత్-8)**

అప్రాణః+ = ఇంద్రియ లక్షణములు, ప్రాణ లక్షణములు

అమనాః+హి లేనివాడు మనో లక్షణములు లేనివాడు. అనగా ఉపాధి లక్షణములను గ్రహించనివాడు. ఇతడు సాక్షీభూతుడు.దివ్యదేహుడు **(అకాయం-ఈశ ఉపనిషత్ 8)**

పరతః+పరః = ప్రకృతికి అవ్వలివాడు. అనగా తమస్సుకు అవ్వలి వాడు.

సః = ఆత్మ

బాహ్యః = విశ్వమునకు ఉపరిచరమున అనగా విశ్వమునకు వెలుపల

అభ్యంతరః = విశ్వములోపల అనగా సర్వ ఉపాధులలోపల అనగా అంతర్యామిగా

హి = మఱియు సర్వత్రా గలడు.



గంగానదిలో ఒక కడవ మునిగి ఉన్నది అని అనుకొనుము. ఆ కడవకు బయట గంగానది కలదు. కడవలోపల గంగా జలము కలదు. కడవ బయట, కడవలోపల, కడవచుట్టూ సర్వత్రా గంగానది కలదు.

అక్షరాత్ = అట్టి పురుషుని సంకల్పము వలన విశ్వము గలిగినది.

ఇందు చెప్పబడిన ఉపరిచరమయిన ఆత్మను భారతమున ఉపరిచర మనువుగా వ్యాసుడు చెప్పినాడు. ఈ ఉపరిచరమనువు వీర్యము నదిలో పడినది. దానిని చేప మ్రింగినది. గర్భము దాల్చినది. ఆ గర్భము నుండి ఒక మగపిల్లవాడు, ఒక ఆడపిల్ల వచ్చినారు. ఆ ఆడపిల్లను దాశరాజు కూతురుగా పెంచినారు. మగపిల్లవాడు మత్స్యదేశమునకు రాజు అయినాడు.

ఉపరిచర మనువు = సృష్ట్యాది యందున్న ఆత్మ

అతని వీర్యం వలన ప్రకృతి గర్భము ధరించినది

సత్యవతి = దేహము / ప్రకృతి

మత్స్యదేశాధిపతి = జీవుడు / పురుషుడు

ఈ సత్యవతితో అనగా దేహముతో - పరాశరమహర్షి అనగా ఆత్మ జ్ఞాని సంసారము చేయగా అనగా సాధన చేయగా - వ్యాసభగవానుడు ఆవిర్భవించినాడు. అనగా ఆత్మజ్ఞాని వలన మఱియొక ఆత్మజ్ఞాని ప్రాదుర్భవించినాడు. అట్టి ఆత్మజ్ఞాని, ఆత్మ జ్ఞానము పొందతలచినవారలకు భాగవతమును రచించినాడు.

*****

విరాట్‌పురుషుడు సృష్టిచేయ సంకల్పించి సృష్టిచేసినాడు. దీనిని ప్రారంభసృష్టి అని అందురు. ప్రకృతిని అధిష్ఠించిన ఈశ్వరుని వలన ఉపాధులు గలిగినవి.

3. **ఏతస్మాజ్జాయతే ప్రాణో మనః సర్వేంద్రియాణి చ ।**
**ఖం వాయుర్జ్యోతి రాపః పృథివీ విశ్వస్యధారిణీ ॥**

(కైవల్య ఉపనిషత్-15లో కూడ యిదే మంత్రము కలదు).

ఏతస్మాత్ - జాయతే - ప్రాణః - మనః - సర్వేంద్రియాణి - చ- ఖం- వాయుః - జ్యోతిః - ఆపః - పృథివీ - విశ్వస్యధారిణీ.

| | | |
|---|---|---|
| ఏతస్మాత్ | = | ఈ విరాట్ పురుషుని వలన |
| విశ్వస్యధారిణీ | = | విశ్వమును ధరించు అనగా విశ్వసృష్టికి కారణ మయిన ప్రకృతి-మహత్, మహత్ వలన అహంకారము, అహంకారము మూడు విధముల యినవి. **తమో అహంకారము** వలన |
| ఖం | = | ఆకాశము |
| వాయుః | = | వాయువు |
| జ్యోతిః | = | తేజస్సు అనగా అగ్ని |
| ఆపః | = | జలము |
| పృథివీ | = | భూమి |
| చ | = | మఱియు పంచభూతములకు గుణములు గలిగినవి. ఈపంచ భూతముల వలన **స్థూల శరీరము** గలిగినది. **సాత్త్వికాహంకారము** వలన |
| మనః | = | లింగ శరీర అధిష్ఠాత అయిన మనస్సు మఱియు ఇంద్రియ అధిష్ఠానదేవతలు- **రజో అహంకారము వలన** బుద్ధి |
| సర్వేంద్రియాణి | = | సూక్ష్మ శరీరములోని సర్వ ఇంద్రియములు |
| ప్రాణః | = | ప్రాణము |
| జాయతే | = | గలిగినవి వీటి అన్నింటి సమ్మేళనమున సర్వ ఉపాధులు గలుగుచున్నవి. అనగా విశ్వ నిర్మాణము జరుగుచున్నది. |

ఈ మంత్రమునకు విపుల వ్యాఖ్యానము వ్యాసభగవానుడు తన భాగవతం ద్వితీయ



స్కంధంలో పొందుపఱచినారు. ఆ వ్యాఖ్యానము లేనిచో ఈ మంత్రార్థము తీర్థమునకు తీర్థము ప్రసాదమునకు ప్రసాదమువలె ఏమియు అర్థము కాదు. కావున వ్యాసభగవానుడు యిచ్చిన వివరణను యిక్కడ చదువుకొనవలయును.

ప్రకృతిని-ఈశ్వరుడు అధిష్ఠించినాడు. అట్టి ప్రకృతి యొక్క అంశంబున మహతత్త్వంబగు. మహత్ తత్త్వము యొక్క అంశంబున అహంకారంబగు. ఆ అహంకారము మూడు విధములయినది.

| సాత్త్వికాహంకారము | తైజసాహంకారము | తామసాహంకారము |
|---|---|---|
| దీని వలన చంద్రదైవతంబయిన మనస్సు అనగా లింగ శరీరము ఏర్పడినది. | దీనివలన జ్ఞానేంద్రియ కర్మేంద్రియములు ఏర్పడినవి ఇది సూక్ష్మ శరీరం | దీని అంశంబున తన్మాత్రలు వాటి వలన |
| ఇంద్రియాధిష్ఠాన దేవతలయిన | | |
| దిక్కులు... | చెవులు | ఆకాశము |
| వాయువు... | చర్మము | వాయువు |
| సూర్యుడు... | నేత్రములు | తేజంబు |
| ప్రచేతసులు | నాలుక | జలము |
| అశ్వినీదేవతలు | ముక్కు | భూమి అనే |
| అగ్ని | నోరు | పంచభూతములు |
| ఇంద్రుడు | చేతులు | వాటి వలన |
| ఉపేంద్రుడు | పాదములు | స్థూల దేహము |
| మిత్రుడు | గుదము | ఏర్పడినది. |
| ప్రజాపతి | గుహ్యం | |
| గలిగిరి | గలిగినవి | |

బుద్ధి - ఇది అంతఃకరణ చతుష్టయములో ఒక భాగము, బోధ జనకము.

ప్రాణము: ఇది అంతఃకరణము. క్రియాజనకము. ప్రాణము అత్మయొక్క ఛాయ.

సాత్త్వికాహంకారము జ్ఞానశక్తి. రాజసాహంకారము క్రియాశక్తి. తామసాహంకారము ద్రవ్యశక్తి.

సాత్త్వికాహంకారము, తైజసాహంకారము వలన లింగశరీరము, సూక్ష్మశరీరము ఏర్పడును. ఈ లింగ శరరీము పునర్జన్మకు కారణమగును. లింగ శరీరము లేక కారణ శరీరము నశించినచో జీవుడు - ఆత్మయై విరాజిల్లును.

తామసాహంకారము వలన స్థూల దేహము ఏర్పడును. దీనికి హాని వృద్ధులుగలవు. జీవుడు దేహమును వదలిన తర్వాత ఈ శరీరమును కాల్చుటయో లేక పూడ్చుటయో, వారి వారి ఆచారములను అనుసరించి, చేయుదురు.ఈ స్థూల, సూక్ష్మదేహము రెండు వశమైనప్పుడు ఆ వ్యక్తి ప్రకృతిని చేరినాడని అందురు. ఈ ప్రకృతి రామాయణంలో లవణ సముద్రముగా వర్ణింపబడినది. ఈ సముద్రమును ఆకాశమార్గమున దాటి హనుమంతుడు సీతను దర్శించినాడు. ఈ సముద్రమునే అగ్నిద్యోతనుడు దాటి శ్రీకృష్ణుని దర్శించినాడు అని భాగవతమున వర్ణింపబడినది.

ఆత్మస్థానమును అథర్వవేదము అయోధ్యగా వర్ణించితే అదే అయోధ్యను తీసుకొని వాల్మీకి రామాయణమును రచించినాడు. ఆత్మ స్థానమునకు 'ద్వారక - మధుర' అని భాగవతం గూఢముగా వర్ణించినది. ఈ అయోధ్య, మధుర, ద్వారకలు శరీరములో ఉండును.

ప్రకృతినుంచి భూమివఱకు పైన చెప్పినవి తమంతతాముగా కలియలేదు. భగవత్‌శక్తిచే అవి అన్నీ కలిసినవి. అప్పుడు అండం ఏర్పడినది. అది అచేతనము. ఆ అండమునకు చేతనత్వము గల్పించి ఆదిపురుషుడు ఆ బ్రహ్మాండములో ప్రవేశించి సవిస్తారముగావించెను. చివరకు జీవుడుగా నిర్గమించెను. మాయావరణలో ఉన్నంత కాలము ఈశ్వరుడు వేఱు, జీవుడు వేఱు. జీవుడు ఉపాధి లక్షణములను గలిగి ఉండును. ఇది ద్వైత స్థితి. మాయావరణదాటినచో జీవుడు - ఈశ్వరుడు ఒకటి అనగా జీవత్వమునశించి ఈశ్వరుడగును. ఇదే అద్వైత స్థితి.

*****



విరాట్‌పురుషుని వర్ణనమ మఱియు - ఈ సృష్టి సర్వము విరాట్‌పురుషుడే. ఆత్మ అంతర్యామి

**4. అగ్ని ర్మూర్ధా చక్షుషీ చంద్రసూర్యౌ**
**దిశః శ్రోత్రే వాగ్వివృతాశ్చ వేదాః।**
**వాయుః ప్రాణో హృదయం విశ్వమస్య**
**పద్భ్యాం పృథివీ హ్యేష సర్వభూతాంతరాత్మా ॥**

అగ్నిః - మూర్ధా - చక్షుషీ - చంద్రసూర్యౌ - దిశః - శ్రోత్రే - వాక్ - వివృతాః - చ - వేదాః - వాయుః -ప్రాణః - హృదయం - విశ్వమ్ - అస్య - పద్భ్యాం - పృథివీ - హి - ఏషః - సర్వభూత - అంతరాత్మా.

| | | |
|---|---|---|
| ఏషః | = | ఇతడు ఈ విరాట్ పురుషుడు |
| విశ్వం | = | విశ్వమును సృజియించెను. ఆత్మ అతర్యామిగా |
| సర్వభూత | = | సర్వ ఉపాదులలో |
| అంతరాత్మా+హి | = | ఆత్మగానూ జీవాత్మగానూ ఉన్నది. |
| అస్య | = | ఈ విరాట్ పురుషుని యొక్క |
| అగ్నిః | = | ముఖము అగ్ని |
| చక్షుషీ | = | రెండు కన్నులు |
| చంద్రసూర్యౌ | = | సూర్యచంద్రులు |
| శ్రోత్రే | = | రెండు చెవులు |
| దిశః | = | దిశలు |
| వివృతాః+వాక్ | = | తెఱచిన నోటినుండి వెలువడుచున్నమాటలే |
| వేదాః | = | వేదములు |
| ప్రాణః+వాయుః | = | ప్రాణము వాయువు |
| పద్భ్యాం+పృథివీ | = | రెండు పాదములు భూమి |
| చ | = | మఱియు |
| మూర్ధా | = | శిరస్సు సత్యలోకము |
| హృదయం | = | హృదయము ప్రధానము లేక ప్రకృతి |

**ఇట్టి సర్వమయుండైన పరమేశ్వరుని విగ్రహంబు (విరాట్ పురుషుని) ముముక్షు**

**వైనవాడు** (ఆత్మదర్శనము చేయకోరినవాడు) **మనంబున అనుసంధానము సేయవలయును.** (భాగవతము-ద్వితీయ స్కంధం-16)

విరాట్ పురుషుని వర్ణన కొంచెం తేడాతో అనేక చోట్ల కనిపించినను దాని ముఖ్యోద్దేశ్యము మాత్రము ఈ దృశ్యమాన ప్రపంచము సర్వము అతడే అని చెప్పుటగా గ్రహించవలయును.

*****

మిథునధర్మ సృష్టి చెప్పబడినది

5. **తస్మా దగ్నిః సమిధో యస్య సూర్యః**
**సోమాత్ పర్జన్య ఓషధయః పృథివ్యాం।**
**పుమాన్ రేతః సించతి యోషితాయాం**
**బహ్వీఃప్రజాః పురుషాత్ సంప్రసూతాః॥**

తస్మాత్ - అగ్నిః - సమిధః- యస్య- సూర్యః - సోమాత్ - పర్జన్యః - ఓషధయః - పృథివ్యాం - పుమాన్ - రేతః - సించతి - యోషితాయాం - బహ్వీః - ప్రజాః - పురుషాత్ - సంప్రసూతాః

సకల జీవరాసులను ఆడ-మగ భేదములుగా సృజియించినాడు. ప్రాణముండి ఆహారము కావలసిన సర్వజీవరాసులకు విరాట్పురుషుడు అతని సంకల్పము వలన ఆహారమును కల్పించినాడు. మఱియు దప్పిక తీరుటకు నీటిని కల్పించినాడు. ఆడ-మగ జీవరాసులు ఆహారమును తిని, నీటిని త్రాగి ఆకలి దప్పికలను తీర్చుకొనుచున్నవి. ఆహారము వలన వీర్యము గలుగుచున్నది. ఆ వీర్యము వలన సర్వజీవరాసులు ఆఆ తెగకు చెందిన వాటిని పుట్టించుచున్నవి. ఈ విధముగా సృష్టి అభివృద్ధి అగుచున్నది. ప్రతి జీవరాసికి ఆహారము రెండు విధములు. ఒకటి ఆహారపు పంటలు. రెండవది ఇతర జీవరాసి యొక్క దేహమును తిని ఆకలి తీర్చుకొనుట. ఉదాహరణకు పులి-మేకను చంపితినును. పాము కప్పను మ్రింగును. కప్ప చిన్న చిన్న కీటకములను తినును. పెద్ద చేప చిన్న చేపనుతిని బ్రతుకును. పంటలను తిని బ్రతుకు జీవరాసులను శాఖాహారపు జీవములని, మఱియొక జీవరాసిని తిని బ్రతుకునవి మాంసాహారపు జీవములని వ్యవహరింతురు. ఈ రెండు రకముల ఆహారము కూడ ఘనపదార్థమే. ఇప్పుడు పంటలు గలుగుటకు శాస్త్రీయముగా వివరించుచున్నాడు.

| | | |
|---|---|---|
| యస్య | = | ఎవని యొక్క సంకల్పమువలన సర్వజీవ రాసులు గలిగినవో ఆ |
| పురుషాత్ | = | విరాట్ పురుషునివలన |
| అగ్నిః | = | అగ్ని. ఆ అగ్నివలన వేడి గలిగినది. ఆ విరాట్ పురుషుని వలన సూర్యుడు సృజియింపబడినాడు. |
| సూర్యః+సమిధః | = | సూర్యుడు సమిధ. అనగా అగ్నిలో సమిధలు వేస్తే అగ్ని బాగా మండి వేడి, వెలుతురు వచ్చును గదా. అటులనే సూర్యుని వలన వేడి, వెలుతురు గలిగినవి. |
| తస్మాత్ | = | ఆ సూర్యుని వలన నీరు ఆవిరియై |
| పర్జన్యః | = | మేఘములు గలిగినవి. ఆ మేఘములు వర్షించుట వలన నీరు గలిగినది. వేడి, వెలుతురు, నీరు వీటివలన |
| పృథ్వివ్యాం | = | భూమియందు |
| ఓషధయః | = | ఓషధులు అనగా అన్నిపంటలు గలిగినవి |
| సోమాత్ | = | ఆ పంటలు చంద్రుని వలన పోషింపబడినవి. ఈ విధముగా అన్ని పంటలు పండి ఆహారము వచ్చినది. ఆ ఆహారము తినుట వలన శక్తి |
| రేతః | = | వీర్యము గలిగినది. ఆ వీర్యమును |
| పుమాన్ | = | మగవాడు |
| యోషితాయాం | = | స్త్రీ యందు (మగ జంతువులు ఆడజంతువుల యందు) |
| సించతి | = | విడుచును. అప్పుడు స్త్రీ గర్భమును ధరించును. (అటులనే మగ జంతువులు విడచిన వీర్యము వలన ఆడ జంతువులు గర్భము ధరించును). |

బహ్వీః+ప్రజాః = (స్త్రీలుప్రసవించుట వలన) అసంఖ్యాకమయిన ప్రజలు

సంప్రసూతాః = జన్మించినారు. (అటులనే అనేక జంతువులు, మృగములు పక్షులు గలిగినవి. వీర్యము వలన జన్మించు పశుపక్షిమృగాదుల గుఱించి చెప్పబడినది).

*****

సర్వసృష్టికి మూలకారకుడు విరాట్

6. **తస్మా దృచః సామ యజూగ్ంషి దీక్షా యజ్ఞాశ్చ సర్వే క్రతవో దక్షిణాశ్చ।**
**సంవత్సరశ్చ యజమానశ్చ లోకాః సోమో యత్ర పవతే యత్ర సూర్యః ॥**

తస్మాత్ - ఋచః - సామః - యజూంషి - దీక్షాః - యజ్ఞాః - చ - సర్వే - క్రతవః - దక్షిణాః - చ - సంవత్సరః - చ - యజమానః - చ - లోకాః - సోమః - యత్ర - పవతే - యత్ర - సూర్యః

తస్మాత్ = విరాట్ పురుషుని వలననే ఈ సర్వసృష్టి జరిగినది. అందువలన ఈ సర్వము అతడే అనగా

లోకాః = 14 లోకములు

సంవత్సరః+చ = కాలము అనగా సంవత్సరము, ఋతువులు, మాసములు, పక్షములు, రాత్రింపగళ్ళు

యత్ర+సోమః+పవతే+చ = ఎక్కడ చంద్రుడు పవిత్రము చేయునో అనగా పునరావృత్తిని గలుగ చేయు దక్షిణాయనము అనే మార్గము

యత్ర+సూర్యః = ఎక్కడ సూర్యుడు పవిత్రము చేయునో అనగా పునరావృత్తి రహితమయిన ఉత్తరాయణము అనేమార్గము



ఋచః = (ఋగ్వేదము) - ఋక్కులు

సామః = (సామవేదము) - సామములు

యజూంషి = (యజుర్వేదము) - యజుస్సులు

చ = మఱియు ఈ అథర్వవేదము

సర్వే+దీక్షాః = వేదప్రణీతసర్వదీక్షలు

క్రతవః = సర్వ క్రతువులు, యాగములు

యజ్ఞాః = సర్వయజ్ఞములు

దక్షిణాః = సర్వదక్షిణలు

చ = మఱియు నెయ్యి, సమిధలు మొదలయిన యజ్ఞ సంభారములు, సర్వకర్మలు గలిగినవి.

యజమానః = యజ్ఞకర్త అనగా జీవుడు గలిగెను.

ఈ విషయమునే

**బ్రహ్మార్పణం బ్రహ్మహవి ర్బ్రహ్మాగ్నౌ బ్రహ్మణా హుతమ్**
**బ్రహ్మైవ తేన గన్తవ్యం బ్రహ్మ కర్మ సమాధినా**

(భగవద్గీత-జ్ఞానయోగం-24)

అని శ్రీకృష్ణభగవానుడు చెప్పినాడు

హోమ సాధనములు, హోమద్రవ్యము, అగ్ని - యజమాని- అగ్నిలో హుతమగునవి - కర్మ ఫలితము ఈ సర్వము పరబ్రహ్మ వలననే గలిగినది. సర్వము బ్రహ్మమే. సర్వవేదములు, సర్వదీక్షలు, సర్వయాగములు, సర్వయజ్ఞ ములు, సర్వదక్షిణలు అతనివలననే అనగా విరాట్ పురుషుని వలననే గలిగినవి. ఈ విషయమునే శ్రీకృష్ణభగవానుడు.

**'కర్మ బ్రహ్మోద్భవం విద్ధి'** (కర్మయోగం- 15)లో చెప్పినాడు. సర్వకర్మలు వాటిని చేయు విధి విధానము సృష్ట్యాదియందే నిర్ణయింపబడినవి. బ్రాహ్మణాది వర్ణములజాతి ధర్మములు అనగా యేయే జాతి వారు యేయే పనులు చేయవలయునో అనియు మఱియు బ్రహ్మచర్య ఆశ్రమము మొదలయిన ఆశ్రమ ధర్మములు సృష్ట్యాది యందే ఆదిపురుషునిచే నిర్ణయింపబడినవి. ఈ విషయమునే

విపులముగా నారదమహర్షికి, బదరీకావనములో తపస్సు చేయు సమయమున నర నారాయణులలో ఒకరయిన నారాయణుడు చెప్పినాడు. ఈ విషయము భాగవతమున సప్తమ స్కంధములో విపులముగా చెప్పబడినది.

అయితే ఈ జాతి ధర్మములు, ఆశ్రమ ధర్మములు అపరవిద్యకు చెందినవి కావున ఇవి కలియుగ ప్రభావమునకు లోను అగుచున్నవి.

*****

**సర్వ సృష్టికి మూలకారకుడు విరాట్**

7. **తస్మాచ్చ దేవా బహుధా సంప్రసూతాః**
**సాధ్యా మనుష్యాః పశవో వయాంసి ।**
**ప్రాణా పానౌ వ్రీహి యవౌ తపశ్చ**
**శ్రద్ధా సత్యం బ్రహ్మచర్యం విధిశ్చ ॥**

తస్మాత్ - చ - దేవాః - బహుధా - సంప్రసూతాః - సాధ్యాః - మనుష్యాః - పశవః - వయాంసి - ప్రాణాపానౌ - వ్రీహియవౌ - తపః - చ - శ్రద్ధా - సత్యం - బ్రహ్మచర్యం - విధిః - చ.

తస్మాత్ = అందువలన అనగా విరాట్ పురుషుని వలన
దేవాః = సర్వదేవతలు అనగా వసువులు, రుద్రులు, ఆదిత్యులు, ఇంద్రాది సర్వదేవతలు
సాధ్యాః = సాధ్యులు అనగా సిద్ధ, సాధ్య, కిన్నర, కింపురుష, విద్యాధరులు
చ = యక్షరాక్షసులు
మనుష్యాః = మానవులు
పశవః = పశువులు, మృగములు, క్రూరమృగములు
వయాంసి+చ = పక్షులు మఱియు జలచరములు
వ్రీహియవౌ = వరిధాన్యము, యవధాన్యము అనగా సమస్త పంటలు



తపః = తపస్సు (సాత్త్వికతపస్సు, రాజసతపస్సు, తమోగుణతపస్సు)
సత్యం = సత్యము(అసత్యము)
శ్రద్ధా = శ్రద్ధ (సాత్త్విక, రాజస, తామసిక శ్రద్ధలు)
బ్రహ్మచర్యం+చ = బ్రహ్మచర్య ఆశ్రమ ధర్మములు మఱియు గృహస్థ, వాన ప్రస్థ, సన్న్యాస ఆశ్రమ ధర్మములు - జాతి ధర్మములు
బహుధా+విధిః = అనేక విధి నిషేధములు, కర్మలు
ప్రాణాపానౌ = ప్రాణము, అపానము అనగా పంచ ప్రాణములు
సంప్రసూతాః = గలిగినవి.

*****

**సర్వ సృష్టికి మూలకారకుడు విరాట్**

8. **సప్తప్రాణాః ప్రభవంతి తస్మాత్**
**సప్తార్చిషః సమిధః సప్తహోమాః ।**
**సప్త ఇమే లోకా యేషు చరంతి ప్రాణా**
**గుహాశయా నిహితాః సప్త సప్త ॥**

సప్త ప్రాణాః - ప్రభవంతి - తస్మాత్ - సప్త అర్చిషః - సమిధః - సప్తహోమాః - సప్త - ఇమే - లోకాః - యేషు - చరంతి - ప్రాణాః - గుహాశయాః - నిహితాః - సప్త - సప్త.

తస్మాత్ = విరాట్ పురుషుని వలన
సప్త ప్రాణాః = సప్త ప్రాణములు.

వీటినే సప్తమరుత్తులు అని కూడ అందురు. మనము పీల్చుగాలి వాయువు. ఇది ఊపరితిత్తులలోనికి వెళ్ళును. ఇది జీవాధారమయిన ముఖ్యప్రాణము అనిపిలువబడును.ఈ ముఖ్యప్రాణము శరీరములో అది చేయు పనిని బట్టి ప్రాణము, అపానము, సమానము, వ్యానము, ఉదానము అని పంచ ప్రాణములుగా

వ్యవహరింపబడును. యోగి, యోగాభ్యాసము ద్వారా ఈ ముఖ్య ప్రాణమును హంసగా మార్చును. ఈ హంసయే జీవాధారము. యోగి ఈ ప్రాణవాయువును నాభినుంచి పీల్చి శుద్ధ వాయువు అగునట్లు చేయును. ఆపై పరిశుద్ధ వాయువు అయి సుషుమ్నానాడిలో ప్రవేశించును. ఆపై ఆధార చక్రమునుంచి సహస్రారము వఅకు చేరును. సహస్రారములో నిశ్చలముగా ఉన్నవారు జీవసమాధిలోఉందురు.

పంచ ప్రాణములు, శుద్ధ వాయువు, పరి శుద్ధ వాయువు, ఇవి సప్తమరుత్తులు. వాయువును సప్తమరుత్తులుగా మార్చు విధానమును రామాయణంలో బాలకాండలో సప్తమరుత్తుల జన్మ వృత్తాంతముగా విశ్వామిత్రమహర్షి రామునికి విశాలనగరంలో వివరించినట్లు వర్ణింపబడినది.

| | | |
|---|---|---|
| సప్త అర్చిషః | = | కాళీ, కరాలీ, మనోజవా, సులోహితా, సుధూ మ్రవర్ణా, స్ఫులింగినీ, విశ్వరుచీ అనే ఏడు అగ్నిజ్వాలలు |
| సమిధః | = | అగ్నిహోత్రములో వేయు సమిధలు |
| సప్తహోమాః | = | సప్త హోమములు జ్యోతిష్టోమ, ఉక్థ్య,అతిరాత్రి, ఆయుర్యాగ, అభిజిత్, విశ్వజిత్, ఆప్తోర్యామ |
| ఇమే | = | ఈ |
| సప్త సప్త లోకాః | = | ఏడు ఏడు లోకములు. అనగా 14 లోకములు |
| యేషు | = | ఎందులో |
| ప్రాణాః | = | ప్రాణములు |
| చరంతి | = | చరించుచున్నవో అనగా సర్వ ఉపాధులు |
| సప్త | = | మహత్, అహంకారం, పంచభూతములు అనే సప్తావరణములు |
| ప్రభవంతి | = | గలిగినవి. సుషుప్తి కాలములో |
| గుహాశయాః+ నిహితాః | = | హృదయగుహలో ఆత్మతో ఉండి మరల జాగ్రతా వస్థలో విడివడి ఇంద్రియార్థములు, మనస్సు, జీవుడు పనిచేయును. |

*****



## సర్వ సృష్టికి మూలకారకుడు విరాట్

**9. అతః సముద్రా గిరయశ్చ సర్వేఽ**
**స్మాత్ స్యందంతే సింధవః సర్వరూపాః ।**
**అతశ్చ సర్వా ఓషధయో రసశ్చ**
**యే నైష భూతైస్తిష్ఠతేహ్యంతరాత్మా ॥**

అతః - సముద్రాః - గిరయః - చ - సర్వే- అస్మాత్ - స్యందంతే - సింధవః - సర్వరూపాః - అతః - చ - సర్వాః - ఓషధయః - రసః - చ - యేన - ఏషః - భూతైః - తిష్ఠతే - హి - అంతరాత్మా

| | | |
|---|---|---|
| అతః | = | ఇందు వలన, ఈ విరాట్ పురుషుని వలన |
| సర్వే+సముద్రాః | = | సర్వ సముద్రములు అనగా సప్త సము ద్రములు |
| చ | = | మఱియు |
| గిరయః | = | మేరు, మందరాది సర్వ పర్వతములు, కొండలు |
| అస్మాత్ | = | ఈ విరాట్ పురుషుని వలన |
| స్యందంతే | = | ప్రవహించే |
| సింధవః | = | నదులు |
| చ | = | మఱియు |
| అతః | = | ఇతని వలన |
| సర్వాః+ఓషధయః | = | సర్వపంటలు |
| రసః | = | షట్ రుచులు |
| సర్వరూపాః | = | నామరూపములతో వ్యవహరింపబడే సర్వ స్థావర జంగమములు |
| చ | = | మఱియు గుణములు సర్వకర్మలు, సర్వధర్మములు, సర్వభావములు సర్వము గలిగినవి |
| యేన | = | ఎవనిచేత ఈ సర్వసృష్టి గల్పింపబడినదో అది అంతా విరాట్ స్వరూపమే. |
| ఏషః | = | ఆత్మ |
| అంతరాత్మా, | = | అంతరాత్మగా |

భూతైః+హి = ప్రకృతి, మహత్, అహంకారం, పంచ భూతముల చేత నిర్మింపబడిన ఉపాధిలో ఆత్మగానూ, జీవాత్మగానూ

తిష్ఠతే = వసియించుచున్నాడు

ఈ పురుషుని వలన

1. లోకములు - 14 లోకములు
2. సర్వజీవరాసులు - దేవతలు, సిద్ధులు, సాధ్యులు, వగైరాలు యక్ష రాక్షసులు, మనుష్యులు, పశువులు, పక్షులు, జలచరములు
3. ప్రాణము - ప్రాణము, అపానము, సమానము వ్యానము, ఉదానము, శుద్ధవాయువు, పరిశుద్ధవాయువు
4. ఓషధులు - సర్వపంటలు, షట్‌రుచులు
5. సర్వకర్మములు - 4 వేదములు, క్రతువులు, యాగములు, యజ్ఞములు, దీక్షలు, సప్త హోమములు,సప్త అర్చులు, సమిధలు, సర్వదక్షిణలు, దక్షిణాయన మార్గము ఉత్తరాయణ మార్గము
6. భావములు - తపస్సు, శ్రద్ధ, సత్యము, సర్వభావములు సర్వజాతి ధర్మములు,
7. ఆశ్రమ ధర్మములు - సర్వఆశ్రమ ధర్మములు
8. స్థావరములు - సర్వ సముద్రములు, సర్వ పర్వతములు,సర్వ నదులు నామ రూపకమైన ఈ సర్వజగత్తు
9. కాలము - సంవత్సరము, ఋతువులు వగైరా గలిగినవి

విరాట్ పురుషుని వలన స్థావర జంగమాత్మకమైన విశ్వము కలిగినది. ఆత్మ ఈ సర్వజగత్తులో అంతరాత్మగా అనగా ఆత్మ, జీవాత్మగా వసియించుచున్నాడు.

సృష్ట్యాదియందున్న ఆత్మ - అధ్యాత్మము
యొక్క తత్వము -



సర్వ ఉపాధులు - అధి భౌతికములు
సర్వ జీవాత్మలు - అధి దైవికములు
హృదయగుహలోని ఆత్మ - అధి యజ్ఞము

ఈ విధముగా సృష్టి అధిభౌతికము, అధిదైవికము, అధ్యాత్మముగా భాసిల్లుచున్నవి.

సర్వము విరాట్‌స్వరూపమే. ఇదే విషయాన్ని హిరణ్యకశిపుడు **"సర్వంబును నీవ నీవు గానిది లేశంబును లే"**దని చెప్పినాడు. (భాగవతము సప్తమస్కంధము 88)

హిరణ్యకశిపుడు స్వానుభవంతో ప్రకటించిన ఆత్మ దర్శనమును, ప్రహ్లాదుడు మొదట శాస్త్ర పాఠమును వల్లెవేసి చివరకు ఆత్మను దర్శించినాడు.

**మ॥ కలఁడంభోధిఁ, గలండుగాలిఁ, గలఁడాకాశంబునం, గుంభినిం**
**గలఁ, డగ్నిన్ దిశలం బగళ్ళ నిశలన్ ఖద్యోత చంద్రాత్మలం**
**గల డోంకారమునం త్రిమూర్తులఁ త్రిలింగవ్యక్తులం దంతటం**
**గలఁ డీశుండు గలండు, తండ్రి ! వెదకంగా నేల నీ యా యెడన్**

(భాగవతము - సప్తమస్కంధం-274)

**కం॥ ఇందుఁ గలఁ డందు లేఁడని, సందేహము వలదు, చక్రి సర్వోపగతుం,**
**డెం దెందు వెదకి చూచిన, నందందే కలఁడు దానవాగ్రణి ! వింటే.**

(భాగవతము, సప్తమస్కంధం-275).

సృష్ట్యాదియందున్న ఆత్మ యే అంతరాత్మగా సర్వజీవ రాసులలో, సర్వసృష్టిలో భాసిల్లుచున్నది అని చెప్పి స్తంభమునందు ఆత్మను అనగా అంతరాత్మను నరసింహరూపమున దర్శించినాడు. ప్రహ్లాదుడు ప్రయోజకుడయినాడు. హిరణ్యకశిపుని తపన నెఱవేఱినది. తనంతవాడు కొడుకు. ఇంతకంటే ఏతండ్రికయినా కావలసినదేమి? ఇరువురి జన్మ సార్థకత అయినది. సర్వము పరమాత్మయే అనే విషయాన్ని శుకబ్రహ్మ, పరీక్షిత్‌నకు

**క॥ హరిమయము విశ్వ మంతయు,**
**హరి విశ్వమయుండు, సంశయము పనిలే దా**

**హరిమయము గాని ద్రవ్యము,**

**పరమాణువు లేదు వంశపావన! వింటే.**

(భాగవతము-ద్వితీయస్కంధం-17)

*****

10. **పురుష ఏవేదం విశ్వం కర్మ**

**తపో బ్రహ్మ పరామృతం ।**

**ఏతద్యో వేదనిహితం గుహాయాం**

**సో౽విద్యా గ్రంథిం వికిరతీహ సోమ్య**

(ఇతి ముండకోపనిషది ద్వితీయ ముండకే ప్రథమః ఖండః)

పురుషః - ఏవ - ఇదం - విశ్వం - కర్మ - తపః - బ్రహ్మ - పరా - అమృతం - ఏతత్ - యః - వేద - నిహితం - గుహాయాం - సః - అవిద్యాగ్రంథిం - వికిరతి - ఇహ - సోమ్య.

సోమ్య = ఓ స్నేహితుడా

పరా = సృష్ట్యాది యందున ప్రకృతికి ఆవలది

బ్రహ్మ = ఆత్మ కలడు. అతడు

అమృతం = శాశ్వతము, ఆ ఆత్మయే ఉపాధిలో

గుహాయాం = హృదయ గుహలో

నిహితం = స్వయం జ్యోతి స్వరూపమున కలదు. సృష్ట్యాది యందున్న ఆత్మ పరిమాణములో గొప్పది. మహత్. ఉపాధిలో గల ఆత్మ సూక్ష్మము. పరిమాణములో భేదము కలదు గాని స్వరూప, స్వభావములలో భేదము లేదు.

కర్మ = కర్మలు

తపః = తపస్సు అనగా సర్వకర్మలు, సర్వభావములు, సర్వలోకములు

ఇదం = ఈ



విశ్వం = సర్వజగత్తు - ఈ సర్వము

పురుషః+ఏవ = ఆ విరాట్ పురుషుడే

ఏతత్ = అతనిని - ఆత్మను

యః = ఎవడు

వేద = దర్శించునో అనగా హృదయగుహలో గల ఆత్మను సర్వత్రాగల ఆత్మను దర్శించిన

సః = అతడు

ఇహ = జీవించియుండగానే

అవిద్యాగ్రంథిం = అవిద్యాగ్రంథిని

వికిరతి = భేదించును. అప్పుడు అతడు బ్రహ్మయై అమృతుడగును.

ఇలా సర్వత్రా ఆత్మను దర్శించినవాడు ఎలా ఉండునో భాగవతమున యిట్లు చెప్పబడినది.

**కం॥ పొడిచినఁ దిట్టినఁ గొట్టినఁ,**

**బడుచుందురు గాని పరమభాగవతులు దా**

**రొడఁబడరు మాఱుసేయగఁ,**

(భాగవతము, ప్రథమ స్కంధము 486.)

**కం॥ చెలఁగరు కలఁగరు సాధులు,**

**మిళితములయి పరులవలన మేలుం గీడున్**

**నెలకొనిన నైన నాత్మకు,**

**నొలయవు సుఖదుఃఖచయము లుగ్రము లగుచున్**

(భాగవతము - ప్రథమ స్కంధము 487)

*****

## ద్వితీయ ముండకే- ద్వితీయః ఖండః

ఈ అధ్యాయములో ఆత్మ శరీరములో ఎక్కడ గలదో చెప్పినాడు. జీవాత్మను బ్రహ్మముతో అను సంధానము చేయవలయునని ధనుస్సు ఓంకారము ; బాణము జీవాత్మ; లక్ష్యము బ్రహ్మము అని ఉదాహరణ పూర్వకముగా సాధన వివరించినారు. రథ చక్రపు నాభిలో రథ చక్రము యొక్క ఆకులు అమరియున్నట్లు ఈ సర్వవిశ్వము విరాట్ పురుషుని దేహమందు అమరియున్నదని, సర్వత్రా వ్యాపించియున్న బ్రహ్మమును అనగా విరాట్పురుషుని గ్రహించవలయునని వివరించినారు.

*****

ఉపాధిలో పురుషుని స్థానము. పురుషునికి జగత్తుకు గల సంబంధము.

**1. అవిః సన్నిహితం గుహాచరం నామ మహత్పదమత్రైతత్ సమర్పితం ।<br>ఏజత్ప్రాణన్నిమిషచ్చ యదేత జ్జానథ సదసద్వరేణ్యం పరం<br>విజ్ఞానాద్యద్వరిష్ఠం ప్రజానాం ॥**

అవిః - సన్నిహితం - గుహాచరం - నామ -మహత్ - పదమ్ - అత్ర - ఏతత్ - సమర్పితం - ఏజత్ - ప్రాణత్ - నిమిషత్ - చ - యత్ - ఏతత్ - జానథ - సత్ - అసత్ - వరేణ్యం - పరం - విజ్ఞానాత్ - యత్ - వరిష్ఠం - ప్రజానాం.

| | | |
|---|---|---|
| అత్ర | = | విరాట్పురుషుని యందు |
| ఏతత్+సత్+ అసత్+నామ | = | ఈ సర్వఉపాధులు, జీవాత్మలనే అసత్, ఆత్మ అనే సత్ - నామరూప గుణాత్మకమైన విశ్వము |
| సమర్పితం | = | రథచక్రపు నాభిలో ఆకుల వలె అమర్చ బడి యున్నవి. |
| యత్+ఏతత్ | = | సత్, అసత్‌ల కలయిక అయిన ఈ సకలము విరాట్ పురుషుని యందు |
| ఏజత్+ప్రాణత్+ నిమిషత్+చ | = | ప్రాణముండి కదలు పక్షులు, మృగములు, మానవులు, కనుఱెప్పలు ఆర్పే జీవరాసులు అనగా సర్వ జంగమములు, మఱియు సర్వ స్థావరములు రథచక్రపు నాభిలో రథచక్రపు ఆకులు వలె అమర్చ బడియున్నవి. |
| గుహాచరం | = | హృదయగుహలో కలదియు |
| సన్నిహితర | = | చాలా దగ్గరగా కలదియు |
| మహత్+పదమ్ | = | గొప్ప లక్ష్యస్థానముగా కలదియు అయిన ఆత్మ అద్రేశ్యము, అగ్రాహ్యము, అంతర్యామి అయిన ఆత్మ |
| అవిః | = | స్వయం జ్యోతి స్వరూపము కావున ధీరులకు కనబడును. |
| యత్ +ప్రజానాం+ వరిష్ఠం | = | సర్వజీవరాసులలో ఏది శ్రేష్ఠమో |
| పరం+వరేణ్యం | = | ఏది ప్రకృతికి అవ్వలగలదియో, దేనిని బుద్ధిమంతులు వరింతురో అట్టి ఆత్మను |
| విజ్ఞానాత్ | = | విజ్ఞానముతో |
| జానథ | = | తెలుసుకొనుము. బాహ్య చక్షువులకు గోచరము కాదు కావున ఆత్మను విజ్ఞానము వలన అనగా హృదయ గుహలో గల ఆత్మను దర్శించ వలయును. ఆపై సర్వము అతడే యని గ్రహించవలయును. ఆపై ఉపాధి లక్షణములను, జీవలక్షణములను వీడి ఆత్మస్థితిని పొంది ఆత్మతో ఆత్మను ఏకీభూతము చేయవలయును. |

*****

ఆత్మ లక్షణము - అది ఉపాధిలో వుండి చేసే పని

2. **యదర్చిమద్యదణుభ్యోఽణు చ**
**యస్మిన్ ల్లోకా నిహితా లోకిన శ్చ ।**
**తదేతదక్షరం బ్రహ్మ స ప్రాణస్తదువాఙ్మనః**
**తదేతద్సత్యం తదమృతం**
**తద్వేద్ధవ్యం సోమ్య విద్ధి ॥**

యత్ - అర్చిమత్ - యత్ - అణుభ్యః - అణు - చ - యస్మిన్ - లోకాః - నిహితాః - లోకినః - చ - తత్ - ఏతత్ - అక్షరం - బ్రహ్మ - సః - ప్రాణః - తత్ - ఉ - వాక్ - మనః - తత్ - ఏతత్ - సత్యం - తత్ - అమృతం - తత్ - వేద్ధవ్యం - సోమ్య - విద్ధి.

| | | |
|---|---|---|
| సోమ్య | = | ఓ స్నేహితుడా |
| యత్+అర్చిమత్ | = | ఏదికాంతివంతమో |
| యత్+అణుభ్యః+ అణు | = | ఏది అణువుల కంటె మిక్కిలి సూక్ష్మమో. అనగా సూక్ష్మాతి సూక్ష్మము. కంటికి కనిపించని సూక్ష్మజీవుల హృదయగుహలో కూడ ఉండును కావున యిది సూక్ష్మాతి సూక్ష్మము. |
| చ | = | మఱియు - మహత్ |
| యస్మిన్+లోకాః+ చ+లోకినః+నిహితాః | = | దేనిలో లోకములు, లోకస్థులు గలరో |
| తత్+ఏతత్ | = | ఆ సృష్ట్యాదియందున్న ఆత్మయే ఈ ఉపాధిలో హృదయగుహలో కలదు. అది |
| అక్షరం | = | నశింపనిది |
| బ్రహ్మ+ఉ | = | సృష్టికారకుడు. స్థితికారకుడు. లయకారకుడు |
| సః+ప్రాణః | = | ఆత్మ ప్రాణరూపమున ఉపాధిలో చరించుచున్నది. |
| తత్+ఏతత్+ వాక్+మనః | = | దాని వలననే ఈ మనస్సు, వాక్కు, జ్ఞానేంద్రియ కర్మేంద్రియములు, ఈ శరీరము పనిచేయు చున్నదని |
| తత్ + విద్ధి | = | ఆ ఆత్మ గుఱించి తెలుసుకో |
| తత్+అమృతం+ సత్యం | = | అది అనగా ఆత్మ శాశ్వతము, సత్యము |
| తత్+వేద్ధవ్యం | = | అట్టి దానిని అనగా ఆత్మను మనస్సును నిశ్చలము చేసి ధ్యానము ద్వారా గ్రహించవలయునని తెలుసుకొనవలయును. |

*****

ఎలా తెలుసుకొనవలయునో, ఎలా సాధన చేయవలయునో, వివరించుచున్నాడు.

సాధన - ఓంకారోపాసన

3. **ధనుర్ గృహీ త్వాపనిషదం మహాస్త్రం**
**శరం హ్యుపాసా నిశితం సంధయాత ।**
**ఆయమ్య తద్భావ గతేన చేతసా**
**లక్ష్యం తదేవాక్షరం సోమ్య విద్ధి ॥**

ధనుః - గృహీత్వా - ఔపనిషదం - మహాఅస్త్రం - శరం - హి- ఉపాసా - నిశితం - సంధయాత - ఆయమ్య - తత్- భావ - గతేన - చేతసా - లక్ష్యం- తత్ - ఏవ - అక్షరం - సోమ్య - విద్ధి.

**ధ్యానయోగము**

ధర్మపరుడై పుణ్యకర్మానుష్ఠానము చేయుచూ ఓంకారమును జపించవలయును

| | | |
|---|---|---|
| సోమ్య | = | ఓ స్నేహితుడా |
| ధనుః+గృహీత్వా | = | ధనుస్సును చేబూని |
| నిశితం+శరం | = | వాడి అయిన బాణమును |
| సంధయాత | = | ధనస్సును సంధించి |
| ఆయమ్య | = | ఆకర్ణాంతము వింటినారిని లాగి |
| తత్+లక్ష్యం | = | ఆ లక్ష్యమును |
| భావ గతేన + చేతసా | = | ఛేదించవలయుననే భావము గలగి స్థిర చిత్తముతో లక్ష్యమును ఛేదించునట్లు |

ఔపనిషదం+మహాఅస్త్రం= సర్వ ఉపనిషత్తుల యందు మహా అస్త్రముగా (బ్రహ్మాస్త్రముగా చెప్పబడిన) చెప్పబడిన ఓంకారమును

ఉపాసా+హి = నిరంతర ఉపాసనచే, అరిషట్ వర్గములను జయించి శుద్ధ సత్త్వగుణము కలిగి

తత్+అక్షరం+ఏవ = ఆ ఆత్మ అనే లక్ష్యమును కొట్టవలయునని

విద్ధి = తెలుసుకొనుము

ధనుర్బాణములను ఉదాహరణగా తీసుకొని సాధనను వివరించినాడు. రామాయణంలో శ్రీరాముడు సీతాస్వయంవరములో శివధనుర్భంగము మాత్రమే చేసినాడు. బాణమును తీసుకొని లక్ష్యమును కొట్టలేదు. కావున సాధన పూర్తికాలేదు. ఈ పాఠమును చెప్పుటకు వైష్ణవావతారమయిన పరశురాముడు వచ్చి రామునకు వైష్ణవ ధనుస్సును, బాణమును యిచ్చి ఆ రామునిచే బాణప్రయోగము చేయించి లక్ష్యమును కొట్టించినాడు. సాధన శ్రీరాముని పరంగా పూర్తి అయినది. వాల్మీకి బాలకాండను పూర్తి చేసినాడు. తత్త్వము తెలియని వారి వలన ఈ కథ పరశురామ గర్వభంగంగా చెప్పబడుచున్నది. దశావతారములలో పరశురాముడు ఒకడు. శ్రీరాముడు కూడ ఒకడు. ఒక విష్ణువునకు గర్వభంగము, మఱియొక విష్ణువునకు జయము అని చెప్పేవారిని ఏమనాలి?

*****

**4. ప్రణవో ధనుః శరోహ్యాత్మా బ్రహ్మతల్లక్ష్యముచ్యతే ।**
**అప్రమత్తేన వేద్ధవ్యం శరవత్ తన్మయో భవేత్ ॥**

ప్రణవః - ధనుః - శరః -హి - ఆత్మా - బ్రహ్మ - తత్ - లక్ష్యమ్ - ఉచ్యతే - అప్రమత్తేన - వేద్ధవ్యం - శరవత్ - తన్మయః - భవేత్.

ప్రణవః+ధనుః = ఓంకారము ధనుస్సు బాణమును సంధించుటకు ధనుస్సు ఒక ముఖ్య పరికరము

ఆత్మా+శరః+హి = జీవాత్మ బాణము. ఆ బాణమును ధ్యానముచే పదును పెట్టి అనగా నిరంతరము బ్రహ్మమును ధ్యానించి



తత్+బ్రహ్మ+లక్ష్యమ్ = ఆ బ్రహ్మము లక్ష్యము. హృదయ గుహలో గల ఆత్మ లక్ష్యము అని

ఉచ్యతే = చెప్పబడుచున్నది. ఆ లక్ష్యమును

అప్రమత్తేన = ఏకాగ్రతతో ఛేదించ వలయును అని

వేద్ధవ్యం = తెలుసుకొనవలయును. ఆ విధముగా

శరవత్+తన్మయః = బాణము లక్ష్యమున నాటికొనినట్లు బ్రహ్మము అనే లక్ష్యమున జీవాత్మ అనే బాణము స్థిరముగా నాటుకొని

భవేత్ = ఉండవలయును. అనగా జీవాత్మ ఆత్మతో ఏకీభూతము కావలయును.

| ధనుస్సు చేబూన వలసినవాడు | ధనుస్సు | బాణము పదునుపెట్టుట | లక్ష్యస్థానమును ఛేదించవలయును |
|---|---|---|---|
| **సాధకుడు** | **ఓంకారమును జపించుట** | **జీవాత్మ** నిరంతరము బ్రహ్మమును ధ్యానించుట | బ్రహ్మము జీవాత్మ ఏకీభూతము కావలయును |

**అనుభవములో లక్ష్య స్థానమును చేరవలయును**

**5. యస్మిన్ ద్యౌః పృథివీ చాంతరిక్ష**
**మోతం మనః సహ ప్రాణైశ్చ సర్వైః ।**
**తమే వైకం జానథ ఆత్మాన మన్యా**
**వాచో విముఞ్చథ అమృతస్యైషసేతుః ॥**

యస్మిన్ - ద్యౌః - పృథివీ - చ - అంతరిక్షమ్ - ఓతం - మనః - సహ-ప్రాణైః - చ- సర్వైః - తమ్ - ఏవ - ఏకం - జానథ - ఆత్మానమ్ - అన్యాః - వాచః- విముఞ్చథ - అమృతస్య - ఏషః -సేతుః

| | | |
|---|---|---|
| యస్మిన్ +ద్యౌః+ అంతరిక్షం+చ+పృథివీ | = | దేని యందు అనగా విరాట్పురుషుని యందు స్వర్గము, అంతరిక్షము, పృథివీ మొదలయిన లోకములు పంచభూతములు సర్వ స్థావర జంగమములు మఱియు సర్వము |
| ఓతం | = | పడుగుపేకల్లా అల్లబడి ఉన్నవో, |
| మనః+ప్రాణైః+ సహ+సర్వైః+చ | = | ఆ విరాట్పురుషునిని మఱియు దేనిచేత మనస్సు, ప్రాణము, జ్ఞానేంద్రియ కర్మేంద్రియములు ఈ దేహము సర్వము పనిచేయుచున్నదో |
| తమ్+ఏకం+ఏవ | = | దానినే అనగా ఆ హృదయగత ఆత్మనే |
| జానథ | = | సాధన చేసి తెలుసుకొనుము |
| ఆత్మానమ్ | = | ఆత్మ దర్శన ప్రాప్తి కొఱకు |
| అన్యాః+వాచః | = | ఇతరమాటలు, పొల్లు కబుర్లు |
| విముఇ్చథ | = | విడిచిపెట్టు |
| ఏషః | = | విరాట్పురుషుని యందు ఈ సర్వము ఉన్నది. హృదయగుహలోని ఆత్మవలన దేహేంద్రియ మనో బుద్ధులు పనిచేయుచున్నవి. మొదట హృదయ గుహలోగల ఆత్మను దర్శించి ఆపై సర్వము బ్రహ్మము అని గ్రహించుము. ఇదే |
| అమృతస్య+సేతుః | = | అమృతత్వానికి వారధి |

*****

హృదయగుహలో గల ఆత్మకు - ఉపాధికి గల సంబంధము

6. **అరా ఇవ రథనాభౌ సంహతా యత్ర నాడ్యః**
**స ఏషోఽన్తశ్చరతే బహుధా జాయమానః ।**
**ఓమిత్యేవం ధ్యాయథ ఆత్మానం**
**స్వస్తి వః పారాయ తమసః పరస్తాత్॥**



అరాః - ఇవ - రథనాభౌ - సంహతాః - యత్ర - నాడ్యః - సః -ఏషః - అన్తః - చరతే - బహుధా - జాయమానః - ఓం - ఇతి - ఏవం- ధ్యాయథ - ఆత్మానం - స్వస్తి - వః - పారాయ - తమసః - పరస్తాత్.

| | | |
|---|---|---|
| రథనాభౌ | = | రథచక్రపు నాభియందు |
| అరాః+ఇవ | = | రథచక్రపు ఆకులవలె అనగా రథచక్రపు నాభి యందు - రథ చక్రపు ఆకులు కూర్చబడినవో - అటులనే |
| యత్ర | = | ఎక్కడ |
| నాడ్యః+సంహతాః | = | 101 నాడులు, శరీరములో కూర్చ బడియున్నవో. (నాడులకు కేంద్ర బిందువు నాభిస్థానము దానినే కిష్కింధ అని అందురు) |

రథ చక్రపు నాభి విఱిగిన రథచక్రపు ఆకులు విడిపోయి రథ చక్రము నడవదు. అటులనే హృదయ గుహలో గల ఆత్మ - శరీరమును వీడిన ప్రాణము, మనస్సు, ఇంద్రియములు పనిచేయక శరీరము నశించును.

| | | |
|---|---|---|
| సః+ ఏషః | = | ఆ ఆత్మ |
| బహుధా+ జాయమానః | = | వైశ్వానర రూపమున అన్నమును పచనము చేయును. ప్రాణరూపమున శరీరమును మృతముగాకుండా చేయును. జీవరూపమున కోపము కామము మొదలయిన భావములు గలిగి ఇంద్రియములతో భోగించును, - ఇటుల అనేక విధములుగా |
| అంతః+చరతే | = | శరీరము లోపల చరించుచున్నది |
| తమసః+పరస్తాత్ | = | అవిద్యను అతిక్రమించి |
| పారాయ | = | సంసార సాగరమును దాటుట కొఱకు |
| ఆత్మానం | = | ఆ ఆత్మను పొందుటకు |

| | | |
|---|---|---|
| ఓం+ఇతి+ఏవం+ | = | మీరు ఓంకారోపాసననే చేయండి. పరమాత్మను |
| ద్యాయథ | = | ధ్యానించండి. |
| వః | = | మీకు |
| స్వస్తి | = | శుభమగుగాక. |

ఈ మంత్రము నందు వాడిన నాడులు సూక్ష్మ శరీరమందు ఉండును. ఈ నాడీ మండలమునకు కేంద్ర స్థానము నాభి ప్రాంతమందు గల కిష్కింధ. ఇక్క డ నుండే 101 నాడులు బయలు దేరును. అందు సుషుమ్న నాడిగా చెప్పబడేది అమృతత్వమునకు సంబంధించినది. రామాయణంలో రాముడు - పంపా ప్రాంతమునకు చేరి - హనుమంతుని వలన బుశ్యమూక పర్వతం చేరి - వాలిని సంహరించి - సుగ్రీవుని రాజు చేసి కిష్కింధానగరం కేంద్రముగా గల సర్వవానరులు తోడ్పాటుతో రావణ సంహారము చేసి - అయోధ్యకు వచ్చి పట్టాభిషిక్తుడయినాడు. దేహసామ్రాజ్యాధిపత్యమును పొందుటకు ఈ కిష్కింధకు సాధకుడు చేరవలయును.

*****

**ఆత్మ లక్షణం**

ఆత్మ దర్శనము వలనగలుగు ఫలితములు

7. యః సర్వజ్ఞః సర్వవిద్యత్ యస్యైష మహిమా భువి ।
దివ్యే బ్రహ్మపురే హ్యేష వ్యోమ్న్యాత్మా ప్రతిష్ఠితః ॥
మనోమయః ప్రాణ శరీరనేతా ప్రతిష్ఠితోఽన్నే
హృదయం సన్నిధాయ । తద్విజ్ఞానేన పరిపశ్యంతి ధీరా
ఆనందరూప మమృతం యద్విభాతి ॥

యః - సర్వజ్ఞః - సర్వవిత్ - యస్య - ఏషః - మహిమా - భువి - దివ్యే - బ్రహ్మపురే- హి - ఏషః - వ్యోమ్ని - ఆత్మా - ప్రతిష్ఠితః - మనోమయః - ప్రాణ - శరీర - నేతా - ప్రతిష్ఠితః - అన్నే - హృదయం - సన్నిధాయ - తత్ - విజ్ఞానేన - పరిపశ్యంతి - ధీరాః - ఆనంద రూపమ్ - అమృతమ్ - యత్ - విభాతి.



| | | |
|---|---|---|
| యః | = | ఎవడు |
| సర్వజ్ఞః | = | సర్వజ్ఞుడో |
| సర్వవిత్ | = | సర్వము తెలిసివాడో |
| మహిమా+భువి | = | భూమియందు |
| వ్యోమ్ని | = | ఆకాశము నందు, జలమునందు గల ఈ సృష్టి సర్వము |
| యస్య | = | ఎవని యొక్క మహిమయో - అట్టి |
| ఏషః+ఆత్మా | = | ఈ ఆత్మ ప్రకృతికి అవ్వల, 14 లోకములకు పైన |
| దివ్యే | = | దివ్యమయిన |
| బ్రహ్మపురే | = | బ్రహ్మపురము నందు |
| ప్రతిష్ఠితః | = | ప్రతిష్ఠింపబడి ఉన్నది. ఆ ఆత్మ |
| అనందరూపం | = | ఆనంద రూపము అయినట్టి |
| అమృతం | = | అమృతస్వరూపుడు |
| విభాతి | = | స్వయముగా ప్రకాశించుచున్నది అనగా స్వయం ప్రకాశకుడు |
| హి | = | అతడే హృదయగుహాలో గలడు |
| ఏషః | = | అతడు |
| ప్రాణశరీరనేతా | = | ప్రాణమునకు, శరీరమునకు నాయకుడు అనగా దేహేంద్రియ మనోబుద్ధులను నడిపించువాడు |
| మనోమయః | = | మనోమయుడు |
| యత్ | = | ఎవడు - సృష్టి అభివృద్ధికి |
| అన్నే | = | అన్నము నందు |
| ప్రతిష్ఠితః | = | ప్రతిష్ఠితుడో |
| తత్ | = | అట్టి ఆత్మను |
| ధీరాః | = | ధీరులు - వారి |
| హృదయం | = | హృదయమును |

| | | |
|---|---|---|
| సన్నిధాయ | = | ఆత్మయందుంచి |
| విజ్ఞానేన | = | విజ్ఞాన చక్షువులతో |
| పరిపశ్యంతి | = | దర్శించెదరు |

*****

ఆత్మ దర్శనము వలన కలుగు ఫలితము

8. **భిద్యతే హృదయ గ్రంథిః ఛిద్యంతే సర్వ సంశయాః**
**క్షీయంతే చాస్య కర్మాణి తస్మిన్ దృష్టే పరావరే**

భిద్యతే - హృదయ గ్రంథిః - ఛిద్యంతే - సర్వ సంశయాః - క్షీయంతే - చ - అస్య - కర్మాణి - తస్మిన్ - దృష్టే - పరా - అవరే.

| | | |
|---|---|---|
| పరా | = | సృష్ట్యాది యందు గలది, ప్రకృతికి అవ్వలది |
| అవరే | | సృష్టి యంతా గలది ప్రకృతిలో అంతర్యామిగా గలది అగు |
| తస్మిన్ | = | ఆత్మయందు తనను - సర్వభూతములను |
| దృష్టే (సతి) | = | దర్శించినచో |
| హృదయగ్రంథిః | = | హృదయగ్రంథి |
| భిద్యతే | = | విడివడుతుంది చిత్తము సత్త్వగుణమున ప్రసన్నంబగు. అహంకారము పోవును. అప్పుడు |
| సర్వసంశయాః | = | సర్వసంశయములు |
| ఛిద్యంతే+చ | = | తొలగింపబడుతాయి |
| అస్య | = | ఆత్మదర్శనము చేసినవాని యొక్క |
| కర్మాణి | = | సర్వకర్మలు అనగా పుణ్యాపాపములు వాని వలన గలిగిన కర్మ బంధములు |
| క్షీయంతే | = | నశింపబడును. |

ఈ మంత్రమునకు విపులవ్యాఖ్యానము వ్యాసభగవానుడు భాగవతమున ఇట్లు వివరించినాడు.



**చిత్తంబు సత్త్వగుణంబునఁ బ్రసన్నంబగుఁ; బ్రసన్నమనస్కుండైన ముక్త సంగుండగు; ముక్త సంగుండైన నీశ్వర తత్త్వాజ్ఞానంబు సిద్ధించు; నీశ్వరుండు గానంబడిన** (ఆత్మను దర్శించినచో) **జిజ్జడ గ్రథన రూపంబైన యహంకారంబు భిన్నంబగు;** (హృదయగ్రంథి విడివడుతుంది) **నహంకారంబు భిన్నంబైన నసంభావనాది రూపంబులగు సంశయంబులు విచ్ఛిన్నంబులగు;** (సర్వసంశయములు తొలగింపబడును). **సంశయ విచ్ఛేదంబైన నవారబ్ధఫలంబులైన కర్మంబులు నిశ్శేషంబులై నశించు** (కర్మలు నశింపబడతాయి).

(భాగవతం - ప్రథమస్కంధము- 58)

*****

ఆత్మ లక్షణములు - స్థానము - ఆత్మను ఎవరు దర్శించుదురు

9. **హిరణ్మయే పరేకోశే విరజం బ్రహ్మ నిష్కలం ।**
**తచ్ఛుభ్రం జ్యోతిషాం జ్యోతిస్తద్యదాత్మవిదో విదుః॥**

హిరణ్మయే - పరే - కోశే - విరజం - బ్రహ్మ - నిష్కలం - తత్ - శుభ్రం - జ్యోతిషాం - జ్యోతిః - తత్ - యత్ - ఆత్మవిదః - విదుః

| | | |
|---|---|---|
| తత్ | = | ఆత్మ |
| శుభ్రం | = | ఉపాధి లక్షణములను గ్రహించక నిర్మల మయినది |
| జ్యోతిషాం+జ్యోతిః | = | వెలుగులకు వెలుగు. స్వయం జ్యోతి |
| బ్రహ్మ | = | సృష్టికారకుడు |
| విరజం | = | గుణరహితమైనది |
| నిష్కలం | = | కళంకము లేనిది |
| యత్+పరే+ | = | ఏది ఉత్కృష్టమయిన హిరణ్మయకోశములో |
| హిరణ్మయే+కోశే | | అనగా హృదయగుహలో గలదో |
| తత్ | = | అట్టి ఆత్మను |
| ఆత్మవిదః | = | ఆత్మ జ్ఞానులు - విజ్ఞాన చక్షువులతో |
| విదుః | = | దర్శించెదరు. గ్రహించెదరు. |

*****

ఆత్మ స్థానములో ఆత్మ ప్రకాశము తప్ప యితర వెలుగులుండవు

**10. న తత్ర సూర్యోభాతి న చంద్ర తారకం**
**నేమా విద్యుతో భాన్తి కుతోఽయ మగ్నిః**
**తమేవ భాన్త మనుభాతి సర్వం**
**తస్య భాసా సర్వమిదం విభాతి**

(కఠోపనిషత్-పంచమవల్లి-15లో కూడ కలదు)

న - తత్ర - సూర్యః - భాతి - న - చంద్ర - తారకం - న - ఇమాః - విద్యుతః - భాంతి - కుతః - అయమ్ - అగ్నిః -తమ్ - ఏవ - భాంతమ్ - అనుభాతి - సర్వం - తస్య- భాసా - సర్వమ్ - ఇదమ్ - విభాతి.

| | | |
|---|---|---|
| తత్ర | = | అక్కడ అనగా హృదయ స్థానములో |
| సూర్యః | = | సూర్యుడు |
| న+భాతి | = | ప్రకాశింపడు. అనగా సూర్యకాంతి వుండదు. |
| చంద్ర(చంద్రమాః) | = | చంద్రుడు |
| తారకం+న | = | నక్షత్రాలు ప్రకాశింపవు |
| ఇమాః+విద్యుతః | = | ఈ మెఱుపులు |
| న+భాంతి | = | ప్రకాశింపవు. |
| అయం | = | ఈ |
| అగ్నిః+కుతః | = | ఈ భూలోకమున మనము వెలిగించుట వలన ప్రకాశించే అగ్ని ఎక్కడ ప్రకాశించును? అనగా అగ్ని ప్రకాశము కూడా లేదు. |
| తం+ఏవ | = | ఆ ఆత్మయే |
| భాంతం | = | స్వయం ప్రకాశము గావున ఆత్మ ప్రకాశమే అక్కడ వుండును. |
| సర్వం | = | అదే అన్నింటిని |
| అనుభాతి | = | ప్రకాశింపచేయును |
| ఇదం+సర్వం | = | ఈ సర్వ ప్రపంచము |



| | | |
|---|---|---|
| తస్య+భాసా | = | దాని యొక్క వెలుతురులో |
| విభాతి | = | ప్రకాశించును. |

*****

మొదట హృదయ గుహలో గల ఆత్మను దర్శించి ఆపై సర్వభూతములలో ఆత్మను దర్శించి ఈ సర్వము అతడే యని గ్రహించవలయును.

సర్వత్రా ఉన్న బ్రహ్మను గ్రహించవలయును.

*****

**11. బ్రహ్మై వేద మమృతం పురస్తాద్ బ్రహ్మ పశ్చాద్ బ్రహ్మ దక్షిణతశ్చోత్తరేణ।**
**అధశ్చోర్ధ్వం చ ప్రసృతం బ్రహ్మై వేదం విశ్వమిదం వరిష్ఠం ॥**

ఇతి ముండకోపనిషది ద్వితీయ ముండకే ద్వితీయః ఖండః

బ్రహ్మ - ఏవ - ఇదమ్ - అమృతం - పురస్తాత్ - బ్రహ్మ - పశ్చాత్ - బ్రహ్మ- దక్షిణతః - చ - ఉత్తరేణ - అధః - చ - ఊర్ధ్వం - చ - ప్రసృతం - బ్రహ్మ - ఏవ - ఇదం - విశ్వమ్ - ఇదమ్ - వరిష్ఠం.

| | | |
|---|---|---|
| ఇదం | = | ఈ విశ్వమంతా |
| బ్రహ్మ+ఏవ | = | బ్రహ్మ స్వరూపమే |
| పురస్తాత్+చ | = | తూర్పున వ్యాపించియున్నదంతా బ్రహ్మమే |
| పశ్చాత్+ | | పడమర వ్యాపించి యున్నదంతా బ్రహ్మమే |
| దక్షిణతః+చ+ | | ఉత్తర దక్షిణములలో వ్యాపించి యున్నదంతా |
| ఉత్తరేణ+బ్రహ్మ | | బ్రహ్మమే |
| అధః+చ+ | = | పైన, క్రింద వ్యాపించియున్నదంతా బ్రహ్మమే |
| ఊర్ధ్వం | | |

| | | |
|---|---|---|
| ప్రస్పృతం+బ్రహ్మ | = | అనగా సర్వత్రా వ్యాపించియున్నది బ్రహ్మమే |
| ఇదమ్+వరిష్ఠం | = | ఇది సర్వోత్కృష్టమైనది |
| అమృతం | = | అమృతస్వరూపమైనది |
| ఇదమ్+విశ్వమ్ | = | బాహ్య దృష్టికి గోచరించు ఈ విశ్వము అనగా స్థావర జంగమములు |
| బ్రహ్మ+ఏవ | = | బ్రహ్మమే అని గ్రహించవలయును. |

హృదయ గుహలో గల ఆత్మను దర్శించి ఆపై యీ బాహ్య దృష్టికి గోచరమగు చరాచరజగత్తంతయు ఆ ఆత్మయనియే గ్రహించ వలయును.

విరాట్పురుషుని వలన ఉపాధులు వచ్చినవని యింతకు పూర్వం వివరించినాడు. అగ్నినుంచి అగ్నికణము వచ్చినట్లు ఆత్మ నుంచి హృదయ గుహలో గల ఆత్మ వచ్చినది. స్వరూప, స్వభావ, లక్షణములు రెండింటికి ఒకటే. అయితే ఒకటి పరిమాణములో పెద్దది. మఱి యొకటి అనగా ఉపాధిలో వసియించినది చిన్నది. దీనినే మహా భూతము సూక్ష్మమందు చొచ్చి అని దేవకి శ్రీకృష్ణుని స్తోత్రము చేసినది. ఈ సర్వము బ్రహ్మ స్వరూపమని గ్రహించవలయును.

*****



ప్రథమ ముండకం ప్రథమఖండములో విరాట్పురుషుడు ఊర్ణనాభివలె ప్రధాన కారణము, ఉపాదానకారణము తనే అయి ఉపాధులను సృజియించెను. అని చెప్పినాడు.

ద్వితీయముండకం ప్రథమఖండములో సృష్ట్యాదియందున్న ఆత్మ నుంచి అసంఖ్యాకమయిన ఆత్మలు వచ్చి ఉపాధులలో హృదయగుహలో వసియించినవి అని చెప్పినాడు.

ఇక జీవుని గుఱించి వివరించవలయును. ఇప్పుడు ఈ ఖండములో జీవుని గుఱించి వివరించుచున్నాడు. నిరుపాధికమయిన ఆత్మ అని, అదే సోపాధికమయిన పురుషుడని అందురు. అప్పుడు ఆత్మను పరమాత్మ అని, జీవాత్మ అని అందురు. అదే పురుషుడయిన ఈశ్వరుడని, జీవుడని అందురు. జీవుడు నిజమునకు దేహము కంటే వేఱు అయినను దేహ సంబంధము గలిగి గుణయుతుడై కర్మలు చేయుచూ వాటికి తనే కర్తనని భావించి కర్మఫలితమును అనుభవించుచూ సుఖదుఃఖములను పొందుచున్నాడు. ఈశ్వరుడు సాక్షిగా ఉండి సుఖదుఃఖములకు అంటక విలక్షణముగా ఆనందమయుడై ఉన్నాడు. జీవుడు గుణయుతుడు. ఈశ్వరుడు గుణరహితుడు. జీవేశ్వరులు సమానవయస్కులని జీవుడు కర్మఫలితమును అనుభవించుచున్నాడని ఈశ్వరుడు కర్మఫలితమును అనుభవించుటలేదని ఈ ఖండములో వివరించినారు. ఈశ్వరుడే జీవుడు. ఈశ్వరుడు జీవుడు బింబ ప్రతిబింబములు. ఈశ్వరుడు పెద్దవాడు. జీవుడు చిన్నవాడు. అనగా ఈశ్వరుడు అన్న. జీవుడు తమ్ముడు. దీనినే రామాయణములో రాముడు పెద్దవాడు. భరతాదులు చిన్నవాళ్ళు అని వర్ణించినారు. ఈశ్వరుడు చక్రవర్తి, జీవుడు యువరాజు. జీవుడు ఈశ్వరుడయిన సామ్రాజ్య పట్టాభిషిక్తుడగును. ఈశ్వరుని యొక్క అంశ జీవుడు. ఈశ్వరుడు సగభాగము. జీవుడు సగభాగము. మరల జీవుడు జాగ్రత్, స్వప్న, సుషుప్తి అనే అవస్థా భేదములతో ముగ్గురుగా అయినాడు. ఆ విధముగా జీవేశ్వరులు నాలుగు భాగములు. జీవుడు - ఈశ్వరుడు సమాన వయస్కులు. ఈ విధముగా అనేక వాదనలు గలవు.

*****

## తృతీయ ముండకే ప్రథమః ఖండః

జీవుడు -ఈశ్వరుడు

1. **ద్వా సుపర్ణా సయుజా సఖాయా సమానం వృక్షం పరిషస్వజాతే ।
తయోరన్యః పిప్పలం స్వాద్వత్త్య నశ్నన్నన్యోఽభిచాక శీతి ॥**

ద్వా - సుపర్ణా - సయుజా - సఖాయా - సమానం -వృక్షం - పరిషస్వజాతే - తయోః - అన్యః - పిప్పలం - స్వాదు - అత్తి - అనశ్నన్ - అన్యః - అభిచాకశీతి.

| | | |
|---|---|---|
| ద్వా (ద్వౌ) | = | ఈశ్వరుడు, జీవుడు అనే రెండు |
| సుపర్ణా(సుపర్ణౌ) | = | పక్షులు |
| సయుజా(సయుజౌ) | = | నిత్యము కలిసి ఉండేవి. ఆ రెండు |
| సఖాయా(సఖాయౌ) | = | మంచి స్నేహితులుగా |
| సమానం | = | సమాన అభివ్యక్త కారణములు. సమాన వయస్కులు ఇవి |
| వృక్షం | = | ఒకే దేహమనే వృక్షమును |
| పరిషస్వజాతే | = | ఆశ్రయించి ఉన్నవి |
| తయోః | = | ఈశ్వరుడు, జీవుడు అనే యీ రెండింటిలో |
| అన్యః | = | ఒకటి అనగా జీవుడు |
| పిప్పలం | = | కర్మఫలితమనే పండును |
| స్వాదు | = | ఆసక్తితో |
| అత్తి | = | తినుచున్నాడు. అనగా కర్మ ఫలితమును జీవుడు అనుభవించుచున్నాడు. |
| అన్యః | = | ఇంకొకటి అనగా ఈశ్వరుడు |
| అనశ్నన్ | = | తినకుండా అనగా కర్మ ఫలితమును గ్రహించక |
| అభిచాకశీతి | = | సాక్షిగా చూచుచున్నాడు. |

*****

హృదయ గుహలో గల ఆత్మను దర్శించిన శోకరహితుడగును

**2. సమానే వృక్షే పురుషో నిమగ్నోఽ నీశయా శోచతి ముహ్యమానః ।**
**జుష్టం యదా పశ్యత్యన్య మీశ మస్య మహిమానమితి వీతశోకః ॥**

సమానే - వృక్షే - పురుషః - నిమగ్నః - అనీశయా - శోచతి - ముహ్యమానః - జుష్టం - యదా - పశ్యతి - అన్యమ్ - ఈశమ్ - అస్య - మహిమానమ్ - ఇతి - వీతశోకః

| | | |
|---|---|---|
| సమానే+వృక్షే | = | ఒకే చెట్టుపై గల రెండు పక్షులలో అనగా ఒకే దేహములో గల జీవుడు ఈశ్వరులలో |
| నిమగ్నః+పురుషః | = | ఉపాధిగతుడైన జీవుడు దేహమే నేననే భావన వలన అజ్ఞానంలో మునిగి |
| అనీశయా | = | బంధములను తొలగించుకొనగల సమర్థుడయ్యు ఈశ్వరుని దర్శించక - అసమర్థునివలె |
| ముహ్యమానః | = | మోహము చెందినవాడయి బాధలననుభవించుచూ |
| శోచతి | = | ఆ బాధల నివారణకై ఆలోచించుచున్నాడు |
| యదా | = | ఎప్పుడు జీవుడు త్రిగుణరహితుడై |
| అన్యం | = | ఇంకొక పక్షియగు |
| జుష్టం | = | శ్రేష్ఠమయిన |
| ఈశం | = | ఈశ్వరుని |
| పశ్యతి | = | దర్శించునో అప్పుడు జీవుడు |
| వీతశోకః | = | శోక రహితుడగును. అనగా శోక, మోహము లుండవు. |
| అస్య+మహిమానం+ఇతి | = | ఇది ఈశ్వరుని యొక్క గొప్పతనము |

దర్శనము రెండు విధములు. పునరావృత్తిని గలుగ చేయు దర్శనము ఒకటి. మఱియు పునరావృత్తిరహితమును గలుగచేయు దర్శనము ఇంకొకటి. పునరావృత్తి రహిత దర్శనములు రెండు విధములు.

ఒకటి : ఇంద్రియముల తోటి సంగమంబు విడువనిస్థితి అనగా గుణరహితుడు కాని స్థితిలో దర్శనము.



ఇంకొకటి : ఇంద్రియముల తోటి సంగమంబు విడిచిన స్థితి. అనగా గుణరహితుడయిన స్థితిలో దర్శనము. తమోగుణయుతులైన రాక్షసులు బ్రహ్మను దర్శించి వరములు కోరి దేవతలను బాధించి తిరిగి జననమరణ వలయములో చిక్కుకున్నారు. ఇది పునరావృత్తిని గలుగచేయు దర్శనము. ధ్రువుడు విష్ణువుని దర్శించి ధ్రువస్థానమును వరముగా పొంది ఆ స్థానమున వసియించినాడు. ఇది ఇంద్రియముల తోడి సంగమము విడువని స్థితి. శుద్ధ సత్త్వగుణ యుతుడైన ప్రహ్లాదుడు నరసింహావతారమును దర్శించియు వరములు కోరలేదు. తన తండ్రి మరణమునకు శోకింపలేదు. ఆనందమూ పడలేదు. ఇది ఇంద్రియములతోడి సంగమము విడిచిన స్థితి.

త్రిగుణ రహితులయిన నారదాదులు, ఋషులు, మునులు ఈశ్వరుని దర్శించి వరములు కోరక ఈశ్వరునితో కలసి క్రీడించినారు. ఈ స్థాయిలోని వారు గోపబాలురు, గోపికలు మొదలయినవారు.

*****

ఆత్మదర్శనం వలన కలుగు ఫలితములు
ఆత్మస్థానము చేరుట-ఈశ్వర రూపమును పొందుట

**3. యదా పశ్యః పశ్యతే రుక్మవర్ణం**
**కర్తార మీశం పురుషం బ్రహ్మయోనిం ।**
**తదా విద్వాన్ పుణ్యాపాపే విధూయ**
**నిరంజనః పరమం సామ్యముపైతి ॥**

యదా - పశ్యః - పశ్యతే - రుక్మవర్ణం - కర్తారమ్ - ఈశం- పురుషం - బ్రహ్మయోనిం - తదా - విద్వాన్ - పుణ్యాపాపే - విధూయ - నిరంజనః - పరమం - సామ్యమ్ - ఉపైతి.

| | | |
|---|---|---|
| యదా | = | ఎప్పుడు |
| విద్వాన్ | = | తనయందు గల ఆత్మను, సర్వత్రాగల ఆత్మను దర్శించిన విద్వాంసుడు |

| | | |
|---|---|---|
| రుక్మవర్ణం | = | బంగారు వన్నె కలవాడు అనగా హిరణ్మయ కోశమనే హృదయగుహలో గలవాడును |
| కర్తారం | = | సృష్టికర్తయు |
| ఈశం | = | సర్వ నియామకుడు, ప్రభువును |
| పురుషం | = | పురుషోత్తముడయిన పురుషుడును, |
| బ్రహ్మయోనిం | = | సృష్టికి నిలయమైన వాడును అయిన ఈశ్వరుని |
| పశ్యతే | = | దర్శించునో |
| తదా+పశ్యః | = | అలాచూచినవాడు అనగా ధీరుడు |
| పుణ్యాపాపే | = | కర్మానుష్ఠానం వలన గలిగిన పుణ్యాపాపముల రెండింటిని |
| విధూయ | = | సమూలముగా వదిలించుకొని పూర్వజన్మ కర్మవలన గలిగిన ఈ దేహమును వీడి కర్మబంధముపోయి |
| నిరంజనః | = | కళంకరహితుడయి |
| పరమం+సామ్యం | = | ఉత్కృష్టము అయిన అభేదమయిన బ్రహ్మత్వమును |
| ఉపైతి | = | పొందును. అనగా బ్రహ్మయగును |

ఈ విషయమునే పురాణములలో వైకుంఠనివాసులందఱు చతుర్భుజములతో శంఖుచక్ర గదా పద్మములతో శ్రీమహావిష్ణువలె ఉండునట్లు వర్ణించి విష్ణుమందిర ద్వారపాలకులయిన జయ, విజయులను శ్రీ మహావిష్ణువునివలె చిత్రీకరించిరి.

ఇచ్చట కూడ పునరావృత్తి భయము కలదు. కావుననే జయ విజయులు సనకసనందనాదుల వలన శాపగ్రస్తులై రాక్షసయోనియందు జన్మించిరి అని వ్యాసభగవానుడు చెప్పినారు. సారూప్య సాయుజ్యముల కంటె బ్రహ్మీస్థితి గొప్పది అని భావన.

*****





**4. ప్రాణో హ్యేష యః సర్వభూతైర్విభాతి విజానన్ విద్వాన్ భవతే నాతివాదీ ।**
**ఆత్మక్రీడ ఆత్మరతిః క్రియావానేష బ్రహ్మవిదాం వరిష్ఠః ॥**

ప్రాణః - హి -ఏషః - యః - సర్వభూతైః - విభాతి - విజానన్ - విద్వాన్ - భవతే - న - అతివాదీ - ఆత్మక్రీడః - ఆత్మరతిః - క్రియావాన్ - ఏషః - బ్రహ్మవిదాం - వరిష్ఠః

| | | |
|---|---|---|
| యః | = | ఎవరైతే |
| ఏషః | = | ఈ పురుషుడు |
| సర్వభూతైః+హి | = | తనలోనూ సర్వభూతములలోనూ |
| ప్రాణః | = | ప్రాణరూపమున శరీర వ్యాపారములను నడుపుతూ |
| విభాతి | = | హృదయ గుహలో స్వయం జ్యోతియై ప్రకాశించు చున్నాడు అని |
| విజానన్+విద్వాన్+హి | = | తెలుసుకొనిన విద్వాంసుడు అనగా శుద్ధ సత్త్వగుణయుతుడైన విద్వాంసుడు అనగా తన యందు సర్వభూతములందు ఆత్మదర్శనము చేసిన విద్వాంసుడు, త్రిగుణరహితుడు. |
| న+అతివాదీ+ భవతే(భవతి) | = | ఒట్టి పొల్లు కబుర్లు ఊకదంపుడు ఉపన్యాసాలు యిచ్చేవాడు కాడు. అతనికి లోక వ్యవహారములు రుచింపవు. ఈ విషయమునే ప్రహ్లాద చరిత్రలో ప్రహ్లాదుడు హిరణ్యాకశిపునితో |

**సీ॥ మందార మకరంద మాధుర్యమునఁ దేలు**
**మధుపంబు వోవునే మదన ములకు..**

**తే॥ నంబుజోదర దివ్య పాదార విందు,**
**చింతనామృత పానవిశేష మత్త**
**చిత్త మేరీతి నితరంబుఁ జేర నేర్చు?**
**వినుత గుణశీల ! మాటలు వేయు నేల?**

(భాగవతము-సప్తమస్కంధము-150)

అని చెప్పును.

ఏషః = అన్య మెఱుగక తనయందు, అఖిల భూతములందు ఆత్మను దర్శించిన ఇతడు
ఆత్మక్రీడః = ఆత్మతో క్రీడించువాడు
ఆత్మరతిః = ఆత్మతో రమించువాడు అగును.

దీనినే కథా పరంగా గోపబాలురు శ్రీకృష్ణుడు క్రీడించినట్లు, గోపికలు శ్రీకృష్ణుడు రమించినట్లు రాసక్రీడలుగా వర్ణించినారు. రాసక్రీడలనగా ఆత్మక్రీడ, ఆత్మరతి అని తెలిసిన నారదమహర్షి తన భక్తి సూత్రములలో భక్తికి గోపికలనుదహరించి - యథావ్రజ గోపికాః అని అన్నారు.

క్రియావాన్ = ఇట్టి విద్వాంసుడు కర్మానుష్ఠాన శ్రేష్ఠుడు అగును. నిష్కామకర్మ పరుడు అగును. దీనికి ఉదాహరణగా జనకునిని చెప్పినారు. దేహ లక్షణములు లేని ఆత్మ లక్షణములు గలవాడని చెప్పుటకు యితనిని విదేహునినిగా పేర్కొనిరి.
బ్రహ్మ విదాం+వరిష్ఠః = బ్రహ్మవిదులలో శ్రేష్ఠుడగును.

*****

బ్రహ్మదర్శనము

5. సత్యేన లభ్య స్తపసా హ్యేష ఆత్మా
సమ్యగ్ జ్ఞానేన బ్రహ్మచర్యేణ నిత్యం ।
అన్తః శరీరే జ్యోతిర్మయో హి శుభ్రో
యం పశ్యంతి యతయః క్షీణదోషాః

సత్యేన - లభ్యః - తపసా - హి - ఏషః - ఆత్మా- సమ్యక్ - జ్ఞానేన - బ్రహ్మచర్యేణ - నిత్యం - అంతః - శరీరే - జ్యోతిర్మయః - హి - శుభ్రః - యం - పశ్యంతి - యతయః - క్షీణదోషాః

శుభ్ర ః = నిష్కళంకము పరిశుద్ధము అయినదియు



ఏషః+జ్యోతిర్మయః+ఆత్మా = ఈ జ్యోతి స్వరూపమయిన ఆత్మ
బ్రహ్మచర్యేణ+హి = బ్రహ్మచర్యముచేత, సంసారతాపత్రయములను వీడి అరిషట్ వర్గములను జయించుట చేత
సమ్యక్+జ్ఞానేన = సమ్యక్ జ్ఞానము చేత అనగా తన యందు అఖిల భూతములందు ఆత్మగలదని ఎఱుగుట చేత
సత్యేన+హి = సత్యవాక్పరిపాలనచేత - ఓంకారోపాసనచేత, శ్రద్ధా భక్తిధ్యానయోగము చేత
తపసా = తపస్సుచేత
లభ్యః = పొందబడును
యం = ఎవనిని అనగా పరిశుద్ధమయిన ఆత్మను
క్షీణదోషాః = దోషరహితులయిన
యతయః = జితేంద్రియులు
నిత్యం = నిత్యము
అంతః+శరీరే = హృదయగుహలో
పశ్యంతి = దర్శించుదురు

*****

సాధనలో సత్య పరిపాలన గొప్పది

6. సత్యమేవ జయతే నానృతం
సత్యేన పంథా వితతో దేవయానః ।
యేనాక్రమన్తి ఋషయో హ్యాప్తకామా
యత్ర తత్ సత్యస్య పరమం నిధానం॥

సత్యమ్ - ఏవ - జయతే - న - అనృతం - సత్యేన - పంథాః - వితతః దేవయానః - యేన - ఆక్రమన్తి - ఋషయః - హి - ఆప్తకామాః - యత్ర - తత్ - సత్యస్య - పరమం - నిధానం

| | | |
|---|---|---|
| సత్యమ్+ఏవ+హి | = | సత్యమును పాటించుట చేతనే లేదా నిజమయిన సాధకులకు మాత్రమే |
| జయతే | = | ఆత్మదర్శనము అనే సాధనలో జయము గలుగును. సత్యము జయించును. |
| న+ అనృతం | = | సత్యమును పాటించనిచో ఆత్మదర్శనము కాదు. కుయోగికి ఆత్మదర్శనం కాదు. అసత్యము జయించదు. |
| ఆప్తకామాః | = | నెఱవేఱిన కోరికలుగల వారు అనగా కోరికలు ఏమియు లేని పూర్ణకాములైన, నిష్కాములైన |
| ఋషయః | = | ఋషులు |
| యేన+సత్యేన | = | ఏ సత్యము చేత |
| దేవయానః+పంథాః | = | దేవయానమార్గము అనగా జ్యోతిర్మయ మార్గము |
| వితతః | = | ఏర్పడి యున్నదో |
| యత్ర | = | ఎక్కడ |
| సత్యస్య | = | సత్యమునకు నిలయమో |
| తత్+పరమం నిధానం | = | ఆ పరమ పదమును అనగా ఆత్మస్థానమును |
| ఆక్రమన్తి | = | చేరుకొందురు. |

*****

ఆత్మ లక్షణము

7. బృహచ్చ తద్ దివ్యమచింత్యరూపం
సూక్ష్మాచ్చ తత్ సూక్ష్మతరం విభాతి ।
దూరాత్ సుదూరే తదిహాంతికే చ
పశ్యత్స్విహైవ నిహితం గుహాయాం ॥

బృహత్ - చ - తత్ - దివ్యమ్ - అచింత్యరూపం - సూక్ష్మాత్ - చ - తత్ - సూక్ష్మతరం - విభాతి - దూరాత్ - సుదూరే - తత్ - ఇహ - అంతికే - చ - పశ్యత్సు - ఇహ - ఏవ - నిహితం - గుహాయాం



| | | |
|---|---|---|
| తత్+బృహత్+చ | = | సర్వ భూతములలో గలది మఱియు సర్వ భూతములు తనే అయిన సృష్ట్యాది యందు గల ఆత్మ పరిమాణంలో అన్నింటికంటె పెద్దది. |
| తత్+సూక్ష్మాత్+ సూక్ష్మతరం +చ | = | ఆ ఆత్మయే కంటికి కనిపించని సూక్ష్మజీవులలో వాటి హృదయ గుహలో నుండుట వలన సూక్ష్మాతి సూక్ష్మం. అంతర్యామిగా సూక్ష్మతరం. |
| దూరాత్+సుదూరే+చ | = | దూరముగా యున్న వస్తువు కంటికి కనిపించనట్లు ఆత్మ అజ్ఞానులకు చాలా దూరముగా ఉన్నట్లు కనిపించదు. |
| తత్+ఇహ+అంతికే | = | జ్ఞానులు తమ హృదయ గుహలో దర్శించుదురు కావున వారికి చాలా దగ్గరలో ఆత్మ కలదు. |
| దివ్యం | = | ఆ ఆత్మ స్వయంప్రకాశమైనది |
| అచింత్యరూపం | = | సర్వరూపములు అదే అగుట వలన ఒకే రూపము లేక పోవుట వలన ఊహాతీతము. |
| ఇహ | = | ఈ |
| గుహాయాం+ఏవ | = | హృదయగుహలోనే |
| నిహితం | = | ఉండి ఆత్మ |
| విభాతి | = | ప్రకాశించుచున్నది. |
| పశ్యత్సు | = | దర్శించయోగ్యులయిన జ్ఞానులకు దర్శనీయము. |

*****

ఆత్మ ఇంద్రియములకు అగోచరము

ఆత్మను దర్శించుట ఎట్లు? - ఏకీభూతుడగుట ఎట్లు?

8. న చక్షుషా గృహ్యతే నాపివాచా నాన్యైర్దేవై స్తపసా కర్మణా వా ।
జ్ఞాన ప్రసాదేన విశుద్ధ సత్త్వః తతస్తు తం పశ్యతే నిష్కలం ధ్యాయమానః ॥

న - చక్షుషా - గృహ్యతే - న - అపి - వాచా - న - అన్యైః - దేవైః తపసా - కర్మణా - వా - జ్ఞాన ప్రసాదేన - విశుద్ధ సత్త్వః - తతః - తు - తం - పశ్యతే - నిష్కలం -

ధ్యాయమానః

| | | |
|---|---|---|
| చక్షుషా+న+గృహ్యతే | = | కన్నులచే చూడబడదు. |
| న+అన్యైః+దేవైః | = | మనస్సు చేత గాని, ముక్కుచేత గాని, చెవుల చేతగాని, చర్మము చేత గాని, నాలుక చేతగాని ఆత్మను గ్రహించలేము అనగా జ్ఞానేంద్రియములచే ఆత్మను గ్రహించలేము. |
| న+వాచా+అపి | = | వాక్కు ద్వారా గ్రహించలేము. అనగా కర్మేంద్రియ ముల చేత కూడ గ్రహించలేము. |

అనగా ఆత్మను జ్ఞానేంద్రియములచే దర్శించలేము. గ్రహించలేము. అటులనే కర్మేంద్రియములచే గ్రహించలేము.
మఱి ఆత్మను దర్శించుట ఎట్లు? గ్రహించుట ఎట్లు?

| | | |
|---|---|---|
| జ్ఞాన ప్రసాదేన | = | జ్ఞానముచేత |
| తపసా | = | తపస్సు చేత |
| కర్మణా +వా | = | నిష్కామ పుణ్య కర్మానుష్ఠానము చేత, శ్రద్ధాభక్తిధ్యానయోగము చేత |
| నిష్కలం+ ధ్యాయమానః | = | నిర్మలమయిన మనస్సుచే నిరంతరము ధ్యాన నిమగ్నుడై |
| విశుద్ధ సత్త్వః | = | గుణరహితుడయినవాడు |
| తతః+తు | = | అప్పుడు |
| తం | = | తన హృదయ గుహలోనూ, సర్వత్రాగల ఆత్మను |
| పశ్యతే (పశ్యతి) | = | దర్శించెదరు. ఆత్మస్థానమును చేరుకొందురు. ఆత్మతో ఏకీభూతులగుదురు. |

ఇంతకు పూర్వం ఓంకారోపాసన చెప్పి ఇప్పుడు ధ్యానమును చెప్పుచున్నాడు.
ఓంకారోపాసన యనునది నిరాకార ఉపాసన
ధ్యానయోగమనునది సాకార ఉపాసన.

జాగ్రతావస్థలో యోగము చేయని కాలములో మనో బుద్ధులు విడివిడిగా తెలియవు.



అదే ధ్యానం చేయుచూఉంటే ఒకటి భగవన్నామస్మరణ చేయుచూఉంటే మఱియొకటి చంచలముగా ఉండి అనేక విషయములను అప్పుడే ఆలోచిస్తూ ఉంటుంది. ఇలా చంచలముగా ఉండి అనేక విషయాలను ఆలోచించునది మనస్సు. నామస్మరణ చేయునది బుద్ధి. నిరంతర నామస్మరణ వలన మనస్సు యొక్క చంచలత్వము పోయి స్థిరమై బుద్ధితో కలసి ధారణస్థాయికి చేరును. పూర్వజన్మ కర్మ వాసనలు నశించగా నిశ్చల సమాధి గలుగును. అప్పుడు జీవాత్మ పరమాత్మలో ఏకీభూతుడగును.కావున సాధనలో నిరంతర నామస్మరణ యనునది యొక మెట్టు.

ప్రహ్లాదుని సాధన:

శా॥ **పానీయంబులు ద్రావుచుం గుడుచుచున్ భాషించుచున్ హాస లీ**
**లా నిద్రాదులు సేయుచున్ దిరుగుచున్ లక్షించుచున్ సంతత**
**శ్రీనారాయణ పాదపద్మ యుగళీ చింతామృతా స్వాద సం**
**ధానుండై మఱచెన్ సురారిసుతుఁ డేతద్విశ్వమున్ భూవరా!**

(భాగవతము-సప్తమస్కంధము-123)

**కంసుని సాధన:**

1. **క్రౌర్యంబు విడిచి, ధైర్యంబు నొంది, గాంభీర్యంబు వాటించి, శౌర్యంబు ప్రకటించుకొనుచు, మౌనియుంబోలె** (భాగవతము- దశమ స్కంధము- 82)

2. **వైరానుబంధంబున నన్యానుసంధానంబు మఱచి**

(భాగవతము-దశమస్కంధము-84)

3 **తిరుగుచుఁ గుడుచుచుఁ ద్రాగుచు**
**నరుగుచుఁ గూర్చుండి లేచు చనవరతంబున్**
**హరిఁ దలఁచి తలఁచి జగ మా,**
**హరిమయ మని చూచెఁ గంసుఁ డాఱని యలుకన్**

(భాగవతము-దశమస్కంధము-85)

4. సీ॥ **శ్రవణరంధ్రముల నే శబ్దంబు వినఁబడు నది**
**హరిరవ మని యాలకించు,**
**నక్షిమార్గమున నెయ్యది సూడఁబడు నది**

హరిమూర్తి గానోపు నంచు జూచుఁ,
దిరుగుచో దేహంబు తృణమైన సోఁకిన
హరికరాఘాతమో యనుచు నులుకు,
గంధంబు లేమైన ఘ్రాణంబు సోఁకిన
హరి మాలికా గంధ మనుచు నదరుఁ,

ఆ॥ బలుకు లెవ్వియైనఁ బలుకుచో హరి పేరు,
వలుకఁ బడియె ననుచు భ్రమసి పలుకుఁ
దలఁపు లెట్టివైనఁ దలఁచి యా తలఁపులు,
హరితలంపు లనుచు నలుగఁ దలఁచు

(భాగవతము-దశమస్కంధము-87)

తే॥ అరసి నిర్గుణబ్రహ్మంబు నాశ్రయించి,
విధినిషేధ నివృత్తి సద్విమలమతులు
సేయుచుందురు హరి గుణచింతనములు,
మానసంబుల నేప్రొద్దు మానవేంద్ర (భాగవతము, ద్వితీయ స్కంధము-6)

ధ్యానయోగము ద్వారా నిశ్చల సమాధిని పొంది
ప్రాణాయామము ద్వారా ప్రాణములను బ్రహ్మరంధ్రము చేర్చి
బ్రహ్మరంధ్రముచించి బ్రహ్మమందు గలియుదురు.

| ప్రాణాయామము | ధ్యానయోగము | |
|---|---|---|
| ప్రాణవాయువులను జయించుట | మనస్సు | బుద్ధి |
| ప్రాణమును ఆధారము నుంచి బ్రహ్మ రంధ్రమునకు చేర్చుట | హృదయ గుహలో గల ఆత్మను ధ్యానించుట | ఓంకారమును జపించుట |
| | నిరంతర నామ స్మరణ చేస్తూ సాకారముగా ఈశ్వరుని ధ్యానించుట | దైవ నామము జపించుట |



9. ఏషోఽణురాత్మా చేతసా వేదితవ్యో యస్మిన్ ప్రాణః పంచధా సంవివేశ।
ప్రాణైశ్చిత్తం సర్వమోతం ప్రజానాం యస్మిన్ విశుద్ధే విభవత్యేష ఆత్మా॥

ఏషః - అణుః - ఆత్మా - చేతసా - వేదితవ్యః - యస్మిన్ - ప్రాణః - పంచధా - సంవివేశ - ప్రాణైః - చిత్తం - సర్వమ్ - ఓతం - ప్రజానాం - యస్మిన్ - విశుద్ధే - విభవతి - ఏషః - ఆత్మా.

| | | |
|---|---|---|
| ఏషః+ఆత్మా | = | ఈ ఆత్మ |
| అణుః | = | సూక్ష్మాతి సూక్ష్మము |
| యస్మిన్ | = | ఎందులో అనగా ఉపాధిలో - ముఖ్య ప్రాణరూపమున ఉండి |
| ప్రాణః+పంచధా+సంవివేశ | = | ప్రాణ,అపాన, ఉదాన, సమాన, వ్యానములనే ఐదుగా తనకు తానే విభజించు కొని ఉపాధిలో యుంటున్నదో - దానిని అనగా ఆ ఆత్మను |
| చేతసా+వేదితవ్యః | = | శరీర చేతన వలన అనగా ప్రాణరూపమున ఆత్మను గ్రహించవలయును. |
| యస్మిన్ | = | ఎందులో అనగా ఆత్మలో |
| ప్రజానాం | = | ప్రాణుల యొక్క |
| ప్రాణైః | = | ప్రాణముతో సహా |
| సర్వం+చిత్తం | = | మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము, జ్ఞానేంద్రియములు, కర్మేంద్రియములు సర్వ శరీరము - ఆత్మయందు |
| ఓతం | = | అల్లబడి అనగా పూలదండలో దారము వలె ఉన్నది |
| ఏషః+ఆత్మా | = | ఈ ఆత్మ |
| విశుద్ధే+విభవతి | = | ఉపాధిని అంటక అనగా దేహలక్షణములను గ్రహించక హృదయ గుహలో స్వయంజ్యోతియై ప్రకాశించుచున్నది. ఆత్మను దర్శించిన వాడు |

ఆత్మతో ఏకీభూతుడగును. ఆ విధానమును
వ్యాసభగవానుడు యిట్లు వివరించినారు.

సీ॥ ఆసన్న మరణార్థియైన యతీశుండు
కాలదేశములను గాచికొనఁడు
తనువు విసర్జించు తలఁపు జనించిన
భద్రాసనస్థుఁడై ప్రాణపవను
మనసు చేత జయించి మానస వేగంబు
బుద్ధిచే భంగించి బుద్ధిఁ దెచ్చి
క్షేత్రజ్ఞుతోఁ గూర్చి క్షేత్రజ్ఞు నాత్మలో
పలఁ జేర్చి యాత్మను బ్రహ్మ మందుఁ

తే॥ గలిపి యొక్కటి గావించి గారవమున,
శాంతితోడ నిరూఢుఁడై సకలకార్య
నివహ మెల్లను దిగనాడి నిత్యసుఖము
వలయు నని చూచు నటమీఁద వసుమతీశ !

(భాగవతము -ద్వితీయ స్కంధము-27)

వ॥ దేహాదులయందాత్మత్వంబు విసర్జించి యన్యసౌహృదంబు మాని
పూజ్యంబయిన హరి పదంబుం బ్రతిక్షణంబును హృదయంబున
నాలింగనంబుసేసి... రివ్విధంబున విజ్ఞాన దృగ్వీర్య జ్వలనంబున
నిర్దగ్ధ విషయ వాసనుండై క్రమంబున నిరపేక్షత్వంబున...

(భాగవతము -ద్వితీయ స్కంధము 28)

సీ॥ అంఘ్రిమూలమున మూలాధారచక్రంబుఁ
బీడించి, ప్రాణంబు బిగియఁ బటి,
నాభితలముఁజేర్చి నయముతో మెల్లన
హృత్సరోజము మీఁది కెగయఁ బట్టి,
యటమీఁద నురమందు హత్తించి, క్రమ్మఱఁ
దాలు మూలమునకుఁ దఱిమి నిలిపి,
మమతతో భ్రూయుగమధ్యంబు సేర్చి,
దృ క్కర్ణనాసాస్య మార్గములు మూసి,

తే॥ యిచ్ఛలేని యోగి యెలమి ముహూర్తార్థ,
మింద్రి యానుషంగ మింతలేక
ప్రాణములను వంచి బ్రహ్మ రంధ్రము చించి,
బ్రహ్మమందుఁ గలయుఁ బౌరవేంద్ర !

(భాగవతము - ద్వితీయ స్కంధము29)

ఇది సద్యోముక్తి.

మొదట సాధకుడు జీవన్ముక్తుడు కావలయును. దేహత్యాగసమయమున మనస్సును బుద్ధితో కలపి - వాటిని క్షేత్రజ్ఞునితో కలపి - ఆ క్షేత్రజ్ఞుని హృదయగత ఆత్మతో కలపవలయును. ప్రాణమును బ్రహ్మ రంధ్రము చేర్చవలయును. బ్రహ్మ రంధ్రము చించి బ్రహ్మమందు కలపవలయును.

*****

ఫల శ్రుతి

దేహ త్యాగకాలమున గల కోరికల ప్రకారము ఆఆ లోకములకు చేరును.

10. యం యం లోకం మనసా సంవిభాతి
విశుద్ధ సత్త్వః కామయతే యాంశ్చకామాన్
తం తం లోకం జయతే తాంశ్చ కామాన్
తస్మాదాత్మజ్ఞం హ్యర్చయేత్ భూతి కామః

(ఇతి ముండకోపనిషది తృతీయ ముండకే ప్రథమః ఖండః)

యం - యం - లోకం - మనసా - సంవిభాతి - విశుద్ధసత్త్వః - కామయతే - యాన్ - చ - కామాన్ - తం - తం - లోకం - జయతే - తాన్ - చ - కామాన్ - తస్మాత్ - ఆత్మజ్ఞం - హి - అర్చయేత్ - భూతికామః

భూతికామః = దేహత్యాగకాలంబున నింద్రియంబులతోడి సంగమంబులు విడువనివాడు. - అనగా కోరికలు గలవాడు

మనసా = మనస్సుచేత

యాన్+కామాన్ = యే యే కోరికలను మనస్సుచే

కామయతే = కోరునో

తాన్ + కామాన్ = ఆ కోరికలను పొందును. దేహత్యాగ కాలమున అతని కోరిక ప్రకారము పునర్జన్మ గలుగును.

యం+యం = ఏ ఏ

లోకం + చ = లోకమును

సంవిభాతి = వాంఛించునో

తం+తం = ఆ ఆ

లోకం + చ = లోకమును

జయతే = జయించును అనగా పొందును - ఇది క్రమముక్తి

విశుద్ధసత్త్వః = త్రిగుణ రహితుడు బ్రహ్మమందు గలియును

తస్మాత్ = అందువలన బ్రహ్మత్వము పొందగోరువాడు

ఆత్మజ్ఞం+హి = ఆత్మ తత్త్వము తెలిసిన గురువుని ఆశ్రయించి

అర్చయేత్ = పూజించవలయును.

ఈ శ్లోకమున క్రమముక్తి గుఱించి పునర్జన్మ గుఱించి వివరింపబడినది.

పునర్జన్మ - మనస్సులో కోరికలతో చనిపోయినవాడు మరల జన్మించును. పుణ్యఫలితము కోరినవాడు బ్రహ్మలోకము చేరి పుణ్యము క్షీణించగనే తిరిగి భూలోకమున జన్మించును.

క్రమముక్తి - మొదట సాధకుడు ధ్రువస్థానమును చేరును. ఆపై బ్రహ్మలోకమును పొందును. బ్రహ్మతోపాటు పరబ్రహ్మము నందు కలియును.

*****



# తృతీయ ముండకే ద్వితీయః ఖండః

ఆత్మతో ఏకీభూతుడగును

1. **స వేదైతత్ పరమం బ్రహ్మ ధామ**
**యత్ర విశ్వం నిహితం భాతి శుభ్రం ।**
**ఉపాసతే పురుషం యే హ్యకామాః**
**తే శుక్రమేతదతివర్తంతి ధీరాః ॥**

సః - వేద - ఏతత్ - పరమం - బ్రహ్మ - ధామ - యత్ర - విశ్వం - నిహితం - భాతి - శుభ్రం - ఉపాసతే - పురుషం - యే - హి - అకామాః - తే - శుక్రమ్ - ఏతత్ - అతివర్తంతి - ధీరాః

యత్ర = ఎక్కడ

విశ్వం = లయకాలములో విశ్వము,

నిహితం = లయమగునో,

భాతి = లోకంబులు, లోకస్థులు నశించిన తర్వాత పెంజీకటికి అవ్వల ఏకాకృతిగా ఆత్మ ప్రకాశించునో

శుభ్రం = నిష్కళంకమో

ఏతత్+బ్రహ్మ = అట్టి యీ బ్రహ్మయొక్క

పరమం = ఉత్కృష్టమైన

ధామ = స్థానమును బ్రహ్మ లోకమును - ఆత్మస్థానమును

యే+అకామాః+తే = కోరికలు లేని విశుద్ధ సత్త్వగుణయుతులైన

ధీరాః = ధీరులు

పురుషం = పరమపురుషునుని

ఉపాసతే = ధ్యానించువారు

వేద = తనయందు, సర్వభూతములందు ఆత్మను దర్శించిన ఆత్మను గ్రహించిన

సః = వాడు

ఏతత్+శుక్రం = ఈ వీర్యమును అనగా జన్మను

| | | |
|---|---|---|
| అతివర్తంతి+హి | = | జన్మ కారణమయిన కర్మను అతిక్రమించు చున్నారు. అనగా ఆత్మతో ఏకీభూతు లగుదురు. మరల ఎన్నటికీ జన్మించడు. వారికి పునర్జన్మ లేదు. |

*****

ఆత్మతో ఏకీభూతమగుట ఆత్మస్థానమును చేరుట

2. **కామాన్ యః కామయతే మన్యమానః**
**స కామభిర్జాయతే తత్ర తత్ర ।**
**పర్యాప్త కామస్య కృతాత్మనస్తు**
**ఇహైవ సర్వే ప్రవిలీయంతి కామాః ॥**

కామాన్ - యః - కామయతే - మన్యమానః - సః - కామభిః - జాయతే - తత్ర తత్ర - పర్యాప్త కామస్య - కృతాత్మనః - తు - ఇహ - ఏవ - సర్వే - ప్రవిలీయంతి-కామాః

| | | |
|---|---|---|
| యః | = | ఎవడు |
| కామాన్+మన్యమానః | = | కోరికలను అనగా విషయ భోగంబులను తలచుకొనుచూ |
| కామయతే | = | కోరికలను కోరుతూ అంత్యకాలమందు శరీరమును వదలునో |
| సః | = | వాడు |
| కామభిః | = | కోరికలచే |
| తత్ర తత్ర | = | ఆ ఆ కోరికల అనుసారము |
| జాయతే | = | మరల జన్మించును. దేహత్యాగ సమయమున అతని మనస్సులోని కోరికల ప్రకారము జన్మించును. |
| పర్యాప్తకామస్య+తు | = | తీరిన కోరికలు గల వారి యొక్క అనగా విశుద్ధ సత్త్వగుణయుతులైన ధీరుల యొక్క సాధనచే |
| కృతాత్మనః | = | ప్రాప్తానుసారము లభించిన వాటిని అనుభవించి ఆత్మప్రాప్తి తప్ప యితర కోరికలు లేని కామనా రహితుడైన జ్ఞానికి |



| | | |
|---|---|---|
| ఇహ+ఏవ | = | ఈ భూలోకమునందే |
| సర్వే+కామాః | = | అన్ని కోరికలు |
| ప్రవిలీయంతి | = | తీరిపోవును. కావున ఇక ఏ కోరికలు ఉండవు. అట్టివాడు దేహత్యాగ కాలంబున ఇంద్రియముల తోడి సంగమంబులు విడచి ఆత్మలో ఏకీభూతుడ గును. అతడు ఎన్నటికీ మరల జన్మించడు. |

| **యోగులు** | |
|---|---|
| 1. దేహత్యాగకాలమున యింద్రియముల తోడి సంగమంబులేనివారు ప్రాణముచే బ్రహ్మరంధ్రమును చించి బ్రహ్మమందు కలియుదురు. ఇది జ్యోతిర్మార్గము. | 2. దేహత్యాగకాలంబున ఇంద్రియంబులతోడి సంగమంబులు విడువనివాడు మహర్లోకంబుసొచ్చి మహాకల్పకాలంబు క్రీడించుచు కల్పాంతంబున పరమేష్ఠి పదంబు చేరుకొని మరల రాడువాడు. ఉదాహరణ: ధ్రువుడు |

| పుణ్య కర్మానుష్ఠానపరులు దేహత్యాగకాలంబున | |
|---|---|
| 3. ఫలితము కోరనివారు బ్రహ్మ లోకము చేరి అక్కడ వసియించెదరు. పుణ్యాతిరేకంబున బ్రహ్మలోకగతు లైనవారు కల్పాంతరంబున పుణ్య తారతమ్యంబుల నధికార విశేషంబు నొందు వారలగుదురు. ఇది **ఉత్తరాయణ** మార్గము | 4. పుణ్య ఫలితము కోరినవారు బ్రహ్మ లోకము చేరి ఆ పుణ్యము క్షీణించగానే మరల పుట్టుదురు ఇది **దక్షిణాయన** మార్గము |

కోరికలతో మరణించినవారు ఆ ఆ కోరికల అనుసారము మరల పుట్టుదురు.

నిష్కామ కర్మానుష్ఠాన పరులకు అనగా ఉత్తరాయణ మార్గమున పయనించిన వారికి ఉదాహరణ

వినుమ పోయిన కల్పాంతవేళఁ దొల్లి,
ద్రవిళ దేశపురాజు సత్యవ్రతుండు
నీరు ద్రావుచు హరిఁగూర్చి నిష్ఠతోడఁ
దపముఁ గావించె నొక యేటితటమునందు

(భాగవతము-అష్టమస్కంధము-693)

వ॥ నతం డిమ్మహా కల్పంబున వివస్వతుం డనంబరఁగిన సూర్యునకు శ్రాద్ధ దేవుండన జన్మించి శ్రీహరికృపావశంబున నేడ వమనువయ్యె.

(భాగవతము- అష్టమస్కంధం-731)

జ్యోతిర్మార్గము, ఉత్తరాయణ, దక్షిణాయన మార్గముల గుఱించి భగవద్గీతలో అక్షర పరబ్రహ్మ యోగములో శ్రీకృష్ణభగవానుడు యిలా వివరించినారు.

జ్యోతిర్మార్గము

1. సర్వద్వారాణి సంయమ్య మనో హృది నిరుధ్య చ
మూర్ధ్న్యాధాయాత్మనః ప్రాణమాస్థితితో యోగధారణామ్ (12)

ఓ మిత్యేకాక్షరం బ్రహ్మ వ్యాహరన్ మామనుస్మరన్
యః ప్రయాతి త్యజన్దేహం స యాతి పరమాంగతిమ్ (13)

2. మాముపేత్య పునర్జన్మ దుఃఖాలయ మశాశ్వతమ్
నాప్నువన్తి మహాత్మాన స్సంసిద్ధిం పరమాం గతాః (15)

ఉత్తరాయణమార్గము

3. అగ్నిర్జ్యోతి రహఃశుక్ల ష్షణ్మాసా ఉత్తరాయణమ్
తత్ర ప్రయాతా గచ్ఛన్తి బ్రహ్మ బ్రహ్మవిదో జనాః (24)



దక్షిణాయనమార్గము

4. ధూమో రాత్రిస్తథా కృష్ణ ష్షణ్మాసా దక్షిణాయనమ్
తత్ర చాన్ద్రమసం జ్యోతి ర్యోగీ ప్రాప్యనివర్తతే (25)

చక్షురాది ఇంద్రియములను మూసి మనో బుద్ధులను నియమించి - ప్రాణమును బ్రహ్మరంధ్రము చేర్చి, ఓంకారమును జపించుచు భగవంతుడనైన నన్నే స్మరించుచు దేహమును విడచిన యోగి ఆత్మ స్థానమును చేరును. అట్టి యోగులు నన్నే పొంది మరల పునర్జన్మకు రారు. జ్యోతిర్మార్గమునకు అగ్ని అధి దేవత. ఈ మార్గమున పయనించిన యోగులు, ఉత్తరాయణ మార్గమున పయనించిన వారు పరమ పదమును చేరుదురు.
కర్మ ఫలితము కోరిన వారు దక్షిణాయన మార్గమున పయనించి పుణ్యము క్షీణించగా తిరిగి భూలోకమున జన్మింతురు.

*****

ఉపన్యాసములు చెప్పుట వలన వినుట వలన ఆత్మ దర్శనము కాదు. సాధకులకే ఆత్మ దర్శనము గలుగును.

3. నాయ మాత్మా ప్రవచనేన లభ్యో న మేధయా న బహునా శ్రుతేన ।
యమే వైష వృణుతే తేన లభ్యః తస్యైష ఆత్మా వివృణుతే తనుం స్వామ్ ॥

(కఠోపనిషత్ 1-2-23లోకూడా కలదు)

న - అయమ్ - ఆత్మా - ప్రవచనేన - లభ్యః - న - మేధయా - న - బహునా - శ్రుతేన - యం - ఏవ - ఏషః - వృణుతే - తేన - లభ్యః - తస్య - ఏషః - ఆత్మా- వివృణుతే - తనుం - స్వాం.

| | | |
|---|---|---|
| అయం+ఆత్మా | = | ఈ ఆత్మ సంసార తాపత్రయములు వీడక కేవలము |
| ప్రవచనేన+న | = | శాస్త్రములు చదువుట వలన గాని చెప్పుట వలన గాని |

| | | |
|---|---|---|
| న + మేధయా | = | బుద్ధిచేగాని - అనగా తర్కముచేగాని |
| బహునా+ శ్రుతేన | = | వేద పురాణములు వినుట వలన గాని |
| న+ లభ్యః | = | లభ్యము కాదు. |
| యం+ఏవ | = | అవిద్య తొలగిన వానికే అనగా |
| ఏషః | = | సాధకునికి యింతకు పూర్వం చెప్పిన సాధన చేసిన వానికే |
| లభ్యః | = | లభించును |
| వృణుతే | = | ఆ సాధకునినే వరించును |
| తేన | = | యింతకు పూర్వం చెప్పిన సాధనచేతనే |
| ఏషః+ఆత్మా | = | ఈ ఆత్మ |
| తస్య | = | తనయొక్క |
| స్వాం+తనుం | = | తన నిజరూపమును |
| వివృణుతే | = | దర్శనమిచ్చును |

*****

ఆత్మ స్థానము చేరుట

4. నాయమాత్మా బలహీనేన లభ్యో
న చ ప్రమాదాత్ తపసో వాఽప్య లింగాత్
ఏతై రుపాయై ర్యతతే యస్తు విద్వాం
స్తస్యైష ఆత్మా విశతే బ్రహ్మధామ

న - అయమ్ - ఆత్మా - బలహీనేన - లభ్యః - న - చ - ప్రమాదాత్ - తపసః - వా - అపి - అలింగాత్ - ఏతైః - ఉపాయైః - యతతే - యః - తు - విద్వాన్ - తస్య - ఏషః - ఆత్మా - విశతే - బ్రహ్మ - ధామ.

| | | |
|---|---|---|
| అయమ్+ఆత్మా | = | ఈ ఆత్మ |
| బలహీనేన+న+లభ్యః | = | బలహీనునికి అనగా ఇహలోక పరలోక సుఖాపేక్ష పరుల చేత లభ్యము కాదు |
| చ | = | మఱియు |
| న+ప్రమాదాత్+అపి | = | ప్రమత్తునికి కూడా లభ్యము కాదు. అనగా శ్రద్ధగా సాధన చేయని వానికి కూడా లభ్యము కాదు. మరి ఎవరికి లభ్యమగును? |
| యః+విద్వాన్ | = | ఏ విద్వాంసుడు |
| తపసః+వా | = | తపస్సు |
| ఏతైః+ఉపాయైః+తు | = | ప్రాణయోగము, ధ్యానయోగము, ఓంకారోపాసన సత్యము, బ్రహ్మచర్యము, మొదలయిన వానిచే శ్రద్ధ భక్తి గలిగి |
| యతతే | = | ఆత్మదర్శనమునకై ప్రయత్నించుచున్నారో |
| తస్య | = | వానికి |
| ఏషః+ఆత్మా | = | ఈ ఆత్మ లభ్యమగును |
| అలింగాత్ | = | జీవన్ముక్తుడై లింగశరీరమును భంగము చేసుకొనుట వలన అతడు |
| బ్రహ్మధామ | = | దేహత్యాగానంతరము బ్రహ్మలోకమునందు |
| విశతే | = | ప్రవేశించుచున్నాడు. ఆపై బ్రహ్మతో ఏకీభూతుడగుచున్నాడు. |

*****

ఆత్మలో విలీనమగుట

5. సమ్ప్రాప్యైనమృషయో జ్ఞానతృప్తాః
కృతాత్మానో వీతరాగాః ప్రశాంతాః
తే సర్వగం సర్వతః ప్రాప్య ధీరా
యుక్తాత్మానః సర్వమేవావిశంతి

సంప్రాప్య - ఏనమ్ - ఋషయః - జ్ఞానతృప్తాః - కృతాత్మానః - వీతరాగాః - ప్రశాంతాః - తే - సర్వగం - సర్వతః - ప్రాప్య - ధీరాః - యుక్తాత్మానః - సర్వమ్ - ఏవ - అవిశంతి.

కృతాత్మానః = సాధన చేసి కృతకృత్యులయిన
వీతరాగాః = రాగ రహితులు
ప్రశాంతాః = ప్రశాంతచిత్తులు,
జ్ఞానతృప్తాః = జ్ఞానవంతులుఅయిన బ్రహ్మజ్ఞానంచేత తృప్తులు
ఋషయః = ఋషులు అయిన
తే+ధీరాః = ఆ ధీరులు
సర్వగం = అన్నింటిలో అంతరాత్మగా
సర్వతః = సర్వత్రా నిండియున్న
సర్వం+ఏవ = సర్వము తనే అయిన ఆత్మను
ప్రాప్య = దర్శించి ....... (ఒక స్థాయి)
ఏనం = ఈ ఆత్మస్థానమును
సంప్రాప్య = చేరి....(ఇది ఒక స్థాయి)
యుక్తాత్మానః = ఆత్మతో ఆత్మను కూర్చి
అవిశంతి = ఆత్మలో ఏకీభూతులగుదురు.
ఆత్మలో ప్రవేశించెదరు.
(పరిపూర్ణమయినస్థాయి)

*****

బ్రహ్మత్వము పొందుట

**6. వేదాన్త విజ్ఞాన సునిశ్చితార్థాః**
**సన్న్యాస యోగా ద్యతయః శుద్ధ సత్వాః**
**తే బ్రహ్మ లోకేషు పరాన్తకాలే**
**పరామృతాః పరి ముచ్యన్తి సర్వే**

(కైవల్య 3 లో కూడ గలదు)

వేదాంత -విజ్ఞాన - సునిశ్చిత- అర్థాః - సన్న్యాస యోగాత్- యతయః - శుద్ధ సత్వాః - తే - బ్రహ్మలోకేషు - పర - అన్తకాలే - పర- అమృతాః - పరి- ముచ్యన్తి - సర్వే



సన్న్యాసయోగాత్ = సన్న్యాస యోగము వలన అనగా కర్మఫల త్యాగము వలన

**అనాశ్రితః కర్మఫలం కార్యం కర్మకరోతి యః**
**స సన్న్యాసీ చ యోగీచ న నిరగ్ని ర్నచాక్రియః**

(భగవద్గీత - ఆత్మసంయమయోగం-1)

పుణ్యకర్మలు శ్రద్ధగా ఆచరించి- ఆ కర్మ ఫలితమును కోరనివారు సన్యాసులు వారే యోగులు అగ్ని హోత్రాది కర్మలు మానినంతనే సన్న్యాసులు కారు,యోగులుకారు.

వేదాంత+విజ్ఞాన+ సునిశ్చిత+అర్థాః = వేద వేదాంగములు చదివి, వాటి అర్థములు బాగుగా పరిశీలించి, వేదములలో చెప్పబడిన అమృతత్త్వమును పొందు విధానమును విజ్ఞానము ద్వారా ఆకళింపు చేసుకొని దానిని సాధన ద్వారా గ్రహించిన
శుద్ధసత్వాః+యతయః = శుద్ధ సత్త్వగుణయుతులైన యతులు. (యచ్ఛంతి ఇంద్రియేభ్యఇతి యతయః- యమ ఉపరమే - ఇంద్రియములను జయించిన వారు అనగా జితేంద్రియులు. యతం ఇంద్రియ సంయమ ఏషా మస్తీతి యతినః- ఇంద్రియ నియమముగల వారు)
తే = అట్టివారు వారు జీవించియుండగానే
సర్వే+పరి+ముచ్యంతి = అన్ని బంధముల నుంచి కర్మబంధముల నుంచి విముక్తులగుదురు. జీవన్ముక్తు లగుదురు అట్టివారు
పర+అన్తకాలే = ఈ దేహమును వీడి
పర+బ్రహ్మలోకేషు = ఉన్నతోన్నతమయిన బ్రహ్మలోకమునందు వసియించి బ్రహ్మలో ఏకీభూతులై

అమృతాః = అమృతత్త్వము గలిగి బ్రహ్మయగుదురు.

*****

దేహత్యాగ సమయమున ప్రకృతి నుంచి వచ్చినవి ప్రకృతిలోనూ ఆత్మ నుంచి వచ్చినవి ఆత్మలోనూ లయమగును.

7. **గతాః కలాః పంచదశ ప్రతిష్ఠా దేవాశ్చ సర్వే ప్రతిదేవతాసు ।**
**కర్మాణి విజ్ఞానమయశ్చ ఆత్మా పరే ऽవ్యయే సర్వ ఏకీ భవంతి**

గతాః - కలాః - పంచదశ - ప్రతిష్ఠాః - దేవాః - చ - సర్వే - ప్రతిదేవతాసు - కర్మాణి - విజ్ఞానమయః - చ - ఆత్మా - పరే - అవ్యయే - సర్వః(సర్వే) - ఏకీభవంతి.

| | | |
|---|---|---|
| పంచదశ+కలాః+ప్రతిష్ఠాః | = | ఆత్మ వలన వచ్చిన ప్రకృతికి సంబంధించిన 15 కళలు |
| గతాః | = | తిరిగి ప్రకృతిని చేరుచున్నవి |
| చ | = | మఱియు |
| సర్వే+దేవాః | = | సర్వదేవతలు |
| ప్రతిదేవతాసు | = | ఆ యా ఇంద్రియాధిష్ఠానదేవతలలో కలియుచున్నారు. |
| చ | = | మఱియు |
| సర్వః(సర్వే)+కర్మాణి | = | సర్వకర్మలు, ఆ యా కర్మఫలితములు, కర్మ బంధములు నశించుచున్నవి. దేహత్యాగకాలమున జీవుడు |
| విజ్ఞానమయః+ఆత్మా | = | అతడు హృదయగుహలోగల ఆత్మయై |
| పరే+అవ్యయే | = | దేహము వీడినతర్వాత సృష్ట్యాదియందుగల ఆత్మతో |
| ఏకీభవంతి | = | ఏకీభూతుడు అగుచున్నాడు. |

ఉపాధి ప్రకృతిలో లీనమగుచున్నది. జీవాత్మ హృదయగుహలో గల ఆత్మ తోనూ ఆపై దేహమును వీడి సృష్ట్యాదియందుగల ఆత్మతో లయమగుచున్నవి. దీనినే కర్పూర దీప సంయోగమని చెప్పిరి. కర్పూరము దీపముతో సంయోగము వలన



కర్పూరదీపము అయి సర్వము హరించుకొనిపోయినది. దీనినే ఆచారకాండలో పూజ చివరలో కర్పూరము వెలిగించి ఈ విషయము గుర్తు చేయబడినది. ఇప్పుడు ఈ స్థితిలో ఉపాధి లేదు. జీవాత్మ లేదు. హృదయ గుహలో గల ఆత్మ లేదు. సాధనలో ముందు జీవాత్మను ఉపాధి నుంచి వేఱు చేయాలి. ఉపాధిని వీడిన జీవాత్మ ఆత్మలో లయమగును. ఈ రహస్యమునే రామాయణంలో వాల్మీకి నారద మహర్షి చెప్పిన విషయమును తమసా తీరమున మననము చేసి నిధి ధ్యాసలకు చేరి సాధన రహస్యమును ఈ ఒక్క శ్లోకములో చెప్పినాడు.

**మా నిషాద ప్రతిష్ఠాం త్వమగమః శాశ్వతీః సమాః**
**యత్ క్రౌఞ్చమిథునాదేకమవధీః కామమోహితమ్**

(బాలకాండ -ద్వితీయ సర్గ- 15)

బ్రహ్మ దేవుడు వాల్మీకి ఆశ్రమమునకు రాగా బ్రహ్మ అనుమతితో వాల్మీకి కూర్చొని ఈ శ్లోకమునే మరల మరల బ్రహ్మ ఎదుట చదివెను. అంత, ఈ విజ్ఞానము నా వలననే వచ్చినది. ఈ శ్లోకమును విస్తరించి సాధన రహస్యమును రచియింపుము అని, రాముని చరిత్ర (అధ్యాత్మము) వ్రాయమని బ్రహ్మ చెప్పినాడు. వాల్మీకి ఆత్మను దర్శించి ఆత్మను దర్శించు విధానమును రాముని కథగా రచియించినాడు. ఆత్మ దర్శన విధానమును భారతము గానూ, భాగవతముగానూ వ్యాసుడు రచియించినాడు.

*****

లయమును వివరించు చున్నాడు

8. **యథా నద్యః స్యందమానాః సముద్రేऽస్తం గచ్ఛంతి నామరూపే విహాయ ।**
**తథా విద్వాన్నామరూపాద్విముక్తః పరాత్పరం పురుషముపైతి దివ్యం ॥**

యథా - నద్యః - స్యందమానాః - సముద్రే - అస్తం - గచ్ఛంతి - నామరూపే - విహాయ - తథా - విద్వాన్ - నామరూపాత్ - విముక్తః - పరాత్ - పరం - పురుషమ్ - ఉపైతి - దివ్యం

| | | |
|---|---|---|
| యథా | = | ఏ విధముగా |
| స్యందమానాః | = | ప్రవహించే |
| నద్యః | = | నదులు |
| నామ+రూపే | = | వాటి వాటి నామములను, రూపములను |
| విహాయ | = | విడచి |
| సముద్రే | = | సముద్రమునందు ఎలా |
| అస్తం+గచ్ఛంతి | = | కలిసి పోవునో అనగా కలిసి వాటి వాటి ఉనికిని కోల్పోయి సముద్రముగా పిలువ బడునో |

నదులు భూమిపై ప్రవహించినంతసేపు వాటికి వేఋవేఋ పేర్లుండును. గంగ, గోదావరి, యమున, సరస్వతి, కావేరీ యిలా పేర్లు ఉండును. కాని అవి సముద్రంలో కలియగానే అవి వాటి నామ, రూపములనే ప్రత్యేకత, ఉనికిని కోల్పోయి సముద్ర ముగా పిలువబడును.

| | | |
|---|---|---|
| తథా | = | అటులనే నామరూపములు గలిగియుండి ఉపాధి సహితుడైన |
| విద్వాన్ | = | విద్వాంసుడు (ధీరుడు) |
| నామరూపాత్+ విముక్తః | = | నామ రూపములు గల ఉపాధి నుంచి విడివడి |
| దివ్యం | = | స్వప్రకాశకుడు, |
| పరాత్పరం | = | పరాత్పరుడు, |
| పురుషం | = | పురుషోత్తముడు అయిన పురుషుడ్ని |
| ఉపైతి | = | పొందును అనగా పురుషునిలో లీనమయి పురుషోత్తముడు గనే పిలువబడును. |

ఈ విషయమునే గజేంద్రమోక్షములో సాధన, సాధన ఫలితమును వివరించినాడు.



గతజన్మలో ఇంద్రద్యుమ్నుడనే పేరుగల ద్రవిడ దేశపురాజు గజేంద్రునిగా పుట్టి సాధనచేసి విష్ణురూపమును పొందినాడు. **హస్తిలోకనాథుఁ డజ్ఞాన రహితుఁడై విష్ణురూపుఁ డగుచు వెలుఁగుచుండె.**

(భాగవతము - అష్టమస్కంధము - 121)

*****

బ్రహ్మను దర్శించినవాడు బ్రహ్మయగును

9. **స యో హ వై తత్ పరమం బ్రహ్మ వేద**
**బ్రహ్మైవ భవతి నాస్యా బ్రహ్మవిత్ కులే భవతి**
**తరతి శోకం తరతి పాప్మానం**
**గుహాగ్రంథిభ్యో విముక్తోఽమృతో భవతి**

సః - యః - హ - వై - తత్ - పరమం - బ్రహ్మ - వేద - బ్రహ్మ - ఏవ - భవతి - న - అస్య - అబ్రహ్మవిత్ - కులే - భవతి - తరతి - శోకం - తరతి పాప్మానం - గుహాగ్రంథిభ్యః - విముక్తః - అమృతః - భవతి.

| | | |
|---|---|---|
| యః | = | ఎవడు |
| తత్+పరమం | = | ఆ ఉత్కృష్టమయిన |
| బ్రహ్మ+వేద | = | బ్రహ్మను తెలుసుకొని అనగా ఆత్మను దర్శించి ఆత్మస్థానమును చేరి, ఆత్మతో ఏకీభూతుడగుట తెలిసి ఆత్మతో ఏకీభూతుడయిన |
| సః | = | వాడు |
| బ్రహ్మ+ఏవ | = | బ్రహ్మమే |
| భవతి | = | అగును |
| శోకం+తరతి | = | ఉపాధి లక్షణములయిన శోక, మోహాది భావము లను, గుణములను నశింపచేసుకొని వాటిని దాటును |
| పాప్మానం+తరతి | = | కర్మానుష్ఠానము వలన గలిగిన పుణ్య పాపములు నుంచి విడివడి ఆ పుణ్య పాపములను దాటును. |

గుహా(గంథిభ్యః+ = బ్రహ్మగ్రంథి, విష్ణుగ్రంథి, రుద్రగ్రంథి యనే
హ+వై+విముక్తః హృదయ గ్రంథులనుంచి విముక్తుడై
అమృతః+భవతి = అమృతుడగును

**ఫలశృతి**

అస్య+కులే = ఈ ఉపనిషత్తులో చెప్పిన విషయములను పాటించిన వాని యొక్క కులమునందు పుట్టిన, ఎవరయినా ఉపనిషత్తులో చెప్పిన వాటిని ఆచరించినచో
అబ్రహ్మవిత్ = బ్రహ్మజ్ఞుడు కాని వాడు
న+భవతి = ఉండడు అనగా అతడు కూడా బ్రహ్మలో ఏకీభూతుడగును.

*****

ఈ బ్రహ్మ విద్య ఎవరికి నేర్పాలి

10. **తదే తదృచా౽భ్యుక్తమ్**
**క్రియావన్తః శ్రోత్రియాః బ్రహ్మనిష్ఠాః**
**స్వయం జుహ్వతి ఏకర్షిం శ్రద్ధయంతః**
**తేషామేవైతాం బ్రహ్మ విద్యాం వదేత**
**శిరోవ్రతం విధివద్యైస్తు చీర్ణమ్**

తత్ - ఏతత్ - ఋచా - అభ్యుక్తమ్ - క్రియావంతః - శ్రోత్రియాః - బ్రహ్మనిష్ఠాః - స్వయం - జుహ్వతి - ఏకర్షిం - శ్రద్ధయంతః - తేషామ్ - ఏవ - ఏతాం - బ్రహ్మ విద్యాం - వదేత - శిరోవ్రతం - విధివత్ - యైః - తు - చీర్ణం.

తత్+ఏతత్ = ఎవరికి యీ బ్రహ్మవిద్యనుపదేశించాలో ఈ చెప్పబోయే
ఋచా = ఋక్కునందు
అభ్యుక్తం = వివరింపబడినది ఇంతకు ముందు శిష్యలక్షణ ములుగా చెప్పి ఇంకను విస్తరించి వివరించు చున్నాడు.
శ్రద్ధయంతః = శ్రద్ధ గలవారికి,
శ్రోత్రియాః = చక్కని ఆచారములు గలవారికి,
బ్రహ్మనిష్ఠాః = బ్రహ్మను తెలుసుకోవాలనుకునే వారికి,
క్రియావంతః = తపస్సు, బ్రహ్మచర్యం మొదలయిన సాధనలు చేయువారికి
ఏకర్షిం = ఏకర్షియనే అగ్నిహోత్రము
స్వయం+జుహ్వతి = స్వయముగా చేసిన వానికి
యైః+శిరోవ్రతం = ఎవరిచేత అథర్వవేదములో చెప్పబడిన శిరోవ్రతమనే పేరు గల వ్రతమును
విధివత్+చీర్ణం = విధివిధానముగా చేయబడినదో వారికి
తు = పుణ్య కర్మనుష్ఠానపరులయిన
తేషాం+ఏవ = అట్టి వారికి మాత్రమే
ఏతాం+బ్రహ్మవిద్యాం = ఈ బ్రహ్మ విద్యను
వదేత = చెప్పవలయును.

ఊరక కాలక్షేపమునకు మాత్రమే విని ఆచరణచేయని వానికి చెప్పి మాత్రము ప్రయోజనము ఏమి? ప్రయోజనము లేదు. కావున ప్రయోజనము లేని వ్యర్థకార్యము చేయరాదు. కావున బ్రహ్మ విద్యను ఆచరణ చేయని వానికి చెప్పరాదు. ఇదే విషయాన్ని భగవద్గీతలో శ్రీకృష్ణభగవానుడు ఇట్లు చెప్పినాడు.

**ఇదం తే నాతపస్కాయ నాభక్తాయ కదాచన**
**నా చాశుశ్రూషవే వాచ్యం న చ మాం యో౽భ్యసూయతి**

(భగవద్గీత - మోక్షసన్న్యాస యోగము -67)

నీకు చెప్పిన ఈ గీతాశాస్త్రమును తపస్సు చేయనివానికి, సత్త్వగుణములు లేని వానికి శ్రద్ధతో విననివానికి, నాస్తికునికి చెప్పరాదు.

*****

**11. తదేతత్సత్యమృషి రంగిరాః పురోవాచ నైతదచీర్ణ వ్రతోఽధీతే ।**

**నమః పరమ ఋషిభ్యో నమః పరమ ఋషిభ్యః ॥**

(ఇతి ముండకోపనిషది తృతీయముండకే ద్వితీయః ఖండః)

తత్ - ఏతత్ - సత్యమ్ - ఋషిః - అంగిరాః - పురా - ఉవాచ - న - ఏతత్ - అచీర్ణవ్రతః - అధీతే - నమః - పరమ - ఋషిభ్యః - నమః పరమ - ఋషిభ్యః

| | | |
|---|---|---|
| పురా | = | పూర్వము |
| ఋషిః+అంగిరాః | = | అంగిరసుడను ఋషి |
| ఏతత్ | = | దీనిని ఈ ఉపనిషత్తును గురుపరంపరగా తన శిష్యునికి శౌనకునికి |
| ఉవాచ | = | ఉపదేశించెను |
| ఏతత్ | = | దీనిని ఈ బ్రహ్మవిద్యను |
| అచీర్ణవ్రతః | = | అథర్వవేదములో చెప్పబడిన శిరోవ్రతము చేయని వాడు అనగా నిష్కామ కర్మానుష్ఠానపరుడు కానివాడు |
| న+అధీతే | = | అనుష్ఠించలేడు. పట్టుదల, దీక్ష సాధన చేయనివాడు అనుష్ఠించలేడు |
| తత్+సత్యం | = | కాలక్షేపానికే విని ఆ విన్నది మఱచి పోయి పట్టుదల, దీక్ష, సాధన లేనివాడు బ్రహ్మను చేరలేడనే విషయము ముమ్మాటికి నిజము |
| నమః+పరమ+ఋషిభ్యః | = | మహాఋషులు సర్వులకు నమస్కారము |
| నమః+పరమ+ఋషిభ్యః | = | ఎందఱో మహానుభావులు అందఱికీ వందనములు. |

*****



**ఓం భద్రం కర్ణేభిః శృణు యామ దేవాః**
**భద్రం పశ్యేమాక్షభిర్యజత్రాః**
**స్థిరై రంగై స్తుష్టువాగ్ం సస్తనూభిః**
**వ్యశేమ దేవహితం యదాయుః**
**స్వస్తి న ఇంద్రో వృద్ధ శ్రవాః**
**స్వస్తి నః పూషా విశ్వవేదాః**
**స్వస్తి నస్తార్క్ష్యోఽరిష్టనేమిః**
**స్వస్తి నో బృహస్పతి ర్దధాతు**

**ఓం శాంతి శాంతి శాంతిః**

అష్టా చక్రా నవ ద్వారా దేవానాం పూరయోధ్యా
తస్యాం హిరణ్మయః కోశః స్వర్గో జోతిషావృతః

(అథర్వ వేదము-10వ కాండ-1వ అధ్యాయము- 2వ సూక్తము, 31)

ఎనిమిది చక్రములు కలిగి, తొమ్మిది ద్వారములు కలిగి, అయోధ్యా నగరమున్నది. ఇది సర్వ దేవతా నివాస స్థానము. హిరణ్మయ కోశము స్వయం జ్యోతియైన ఆత్మచే ఆవృతమై ఉన్నది.

(ఈ అయోధ్యనే అయోధ్యా నగరముగా రామాయణములో వర్ణించినారు)

శాంతి పాఠము

ఓం భద్రం కర్ణేభిః శృణు యామ దేవాః
భద్రం పశ్యేమాక్షభిర్యజత్రాః
స్థిరై రంగై స్తుష్టువాగ్ం సస్తనూభిః
వ్యశేమ దేవహితం యదాయుః
స్వస్తి న ఇంద్రో వృద్ధ శ్రవాః
స్వస్తి నః పూషా విశ్వవేదాః
స్వస్తి నస్తార్క్ష్యో౽ రిష్టనేమిః
స్వస్తి నో బృహస్పతి ర్దధాతు

ఓం శాంతి శాంతి శాంతిః






## ఈ సర్వవిశ్వము

| అక్షరముగా ఓంకారము | | | | పరబ్రహ్మగా ఆత్మ | | | |
|---|---|---|---|---|---|---|---|
| అ | ఉ | మ | ఓం | జీవుడు | | | ఆత్మ |
| | | | | ప్రథమపాదం<br>వైశ్వానరుడు<br>జాగ్రతావస్థ<br>19 ముఖాలు<br>7 అంగాలు<br>స్థూల శరీరం<br>అంతర్యామి | పునర్జన్మకు<br>మోక్షమునకు<br>కారణం<br>రెండవ పాదం<br>తైజసుడు<br>స్వప్నావస్థ<br>19 ముఖాలు<br>7 అంగాలు<br>సూక్ష్మశరీరం | మూడవపాదం<br>ప్రాజ్ఞుడు<br>సుషుప్తి అవస్థ<br>ఆత్మతో<br>ఏకీభూతుడు<br>కేవలం<br>ఆనందం<br>సుషుప్తిలో<br>కర్మవాసనలు<br>నశింపవు.<br>నిశ్చల<br>సమాధిలో<br>కర్మవాసనలు<br>నశించును. | హృదయ గుహలో ఆత్మ |

మాండుక్య ఉపనిషత్ కేవలం పరవిద్యనే బోధించును. రామాయణములో చెప్పిన పరవిద్యను యిక్కడ అనుసంధానము చేసికొనవలయును.

సాధకులను వాల్మీకి రెండు విధములుగా వర్గీకరించినాడు.

1. విహంగమార్గమునకు దశరథునిని ఉదాహరణగా తీసుకొనినాడు.
2. పిపీలిక మార్గమునకు రామునిని ఉదాహరణగాతీసుకొనినాడు.

## దశరథుని వృత్తాంతము

అజునికుమారుడు దశరథుడు. అజుడు అనగా పుట్టనివాడు. ఆత్మ. ఆత్మనుంచి జీవాత్మ వచ్చినది కావున అజుని కుమారుడు దశరథుడు అనగా జీవాత్మ.
దశ= అనేకమయిన, రథ = ఉపాధులందు గలవాడు
అనగా జీవుడు - ఈ జీవునిని దశరథుడని వ్యవహరించెను.
ఇతడు అయోధ్యాధిపతి. అయోధ్య అనగా దేహమని హృదయకోశమని అథర్వవేదంలో చెప్పబడినది. కావున అయోధ్య యనే శరీరానికి అధిపతి. ఇతడే జీవుడు. అయోధ్య అనగా బ్రహ్మపురమని చెప్పబడే హృదయగుహ. ఆ గుహలో కలది ఆత్మ.

| | |
|---|---|
| దశరథునికి ముగ్గురు భార్యలు వారలతో రమించును. కైక యన్న ఎక్కువ ప్రేమ | స్థూల సూక్ష్మ కారణ శరీరములు అతని ముగ్గురు భార్యలు. స్థూలశరీరము కైక |
| సుమంతుడు రథసారథి | బుద్ధి |
| వసిష్ఠుడు పురోహితుడు | శరీరము పనిచేయుటకు ప్రాణము అవసరము. దేహమనే పురమునకు ఇతడు పురోహితుడు. ఈ పురోహితుడు సకల కార్యములకు అవసరము |
| దశరథునికి 60 వేల సంవత్సరములు వచ్చినా పుత్రులు కలుగ లేదు | ప్రతి దినము మనకు తెలియకుండానే హంస ఈ 60 దళములలో సంచరించును. అయినా ఆత్మ దర్శనము కలుగదు. |



| | |
|---|---|
| దశరథుడు సుమంత్రుని వెంట పెట్టుకొని అంగ దేశమునకు వెళ్ళి ఋశ్యశృంగుని దర్శించి నాడు | గురువును సమీపించినాడు. ఋశ్యశృంగుడు - సాధనలో నిశ్చల సమాధి పొందిన మహనీయుడు. జీవన్ముక్తుడు. అమృతత్త్వము పొందినవాడు. త్రిగుణ రహితుడు శాంతుడు. దీనినే కథగా ఋశ్యశృంగుని భార్య శాంతయని పేర్కొనినారు. |
| శాంతత్త్వము పొందుట ఎట్లు? ఋశ్యశృంగుడు వచ్చి అశ్వమేధయాగము చేయించినాడు.అన్నదానికి ఋశ్య్యశృంగుని కథ చెప్పినాడు. | అశ్వము అనగా మనస్సు. ఆ మనస్సును దశరథుడు లయింప చేసినాడు. జీవన్ముక్తుడై ఆత్మదర్శనము చేసినాడు. |
| ఆ తర్వాత పుత్రకామేష్ఠి చేయించగా దశరథునకు 4 గురు పుత్రులు గలిగిరి. | సృష్ట్యాది యందున్న ఆత్మ సృష్టిలో4 విధములుగా ఉన్నదని స్వానుభవంతో గ్రహించినాడు. |

హృదయ గుహలో గల ఆత్మ - ఒక పుత్రుడు
జాగ్రతావస్థలో గల జీవాత్మ - ఒక పుత్రుడు
స్వప్నావస్థలో గల జీవాత్మ - ఒక పుత్రుడు
సుషుప్తి అవస్థలో గల జీవాత్మ - ఒక పుత్రుడు

దశరథుడు దేహ త్యాగ కాలములో కౌసల్య మందిరమునకు చేరి- అనగా హృదయ గుహలోని ఆత్మస్థానము చేరి రామునిని తలచుచూ దేహమును వదలి బ్రహ్మలోకము చేరెను. యుద్ధకాండలో రావణవధానంతరము బ్రహ్మ దేవతలతో కలసి రాముని వద్దకు వచ్చెను - నిరంతర సాధన ఫలితముగా అమృతత్త్వమును పొందెను. యోగభాషలో రాత్రి అనగా మనము చెప్పుకొనే రాత్రికాదు అని చెప్పుటకు దశరథుడు రాత్రి చనిపోయెను అని చెప్పినారు. దశరథుని సాధన పూర్తి అయినది.

ఇక రాముని పరంగా వ్రాయదలచినాడు.

**బాలకాండలో రామకథ వివరించుచున్నాడు. రాముడు విశ్వామిత్రుని వెంట బయలు దేరినాడు.**

1. విశ్వామిత్రుడు రామునికి - బల, అతిబలలు ఉపదేశించినాడు. వీటిని **"తపసా సంభృతే చైతే బహురూపే భవిష్యతః"** వీటిని తపస్సుచే పోషించిన అనేక విధములయిన ఫలితములను యివ్వగలవు. అనిచెప్పినాడు అనగా ప్రాణము గుఱించి చెప్పినాడు.
2. అందఱూ కామాశ్రమము చేరిరి. మన్మథ దహనము విశ్వామిత్రుడు చెప్పెను. అనగా సర్వ కోరికలు, మనో వికారములు నశించవలయును అని అర్థము.
3. గంగానది దక్షిణతీరమున తాటకవనం. తాటక సంహారం. మలద కరూశ దేశముల వృత్తాంతము చెప్పెను. అనగా ఆకలి దప్పికలు ప్రాణ లక్షణములు వివరించెను.
4. సిద్ధాశ్రమమున సుబాహాది రాక్షసులను వధియించెను. అనగా వికల్పములు నశింపచేయుట. యోగ శక్తులను స్వీకరించక, పూర్వజన్మ కర్మ వాసనలు నశింపజేయుట అని అర్థము. అవి దగ్ధమగు వఱకు సాధన చేస్తూ - ధారణకు చేరవలయును.
5. శోణనది, మగధదేశం గంగానది దాటి విశాల నగరం చేరిరి. అనగా హరి విశాల విగ్రహమునందు హృదయము నిలిపి సాధన చేయవలయును.
6. ఆపై గౌతమాశ్రమం. అహల్య. విదేహనగరం చేరిరి. ఈ ఉపాధిలోనే ఆత్మదర్శనం గలుగును. విదేహుడగును.

7. పరశురాముడు వచ్చి వైష్ణవ ధనుస్సు, బాణముయిచ్చెను. అనగా ఆత్మను ఆత్మతో ఏకీభూతము చేయుట. తత్త్వమసి అనుభవము. ఆత్మదర్శనము అగు విధము, ఆత్మతో ఏకీభూతమగువిధము బాలకాండలో వివరించినాడు. దీనినే విస్తరించి మిగిలిన కాండలలో కథగానూ యోగపరముగా వివరింపబడినది.

ఆత్మ, పురత్రయములలో క్రీడించు జీవాత్మ కూడా రాముడే అను భావనను వాల్మీకి గ్రహించినాడు. సృష్ట్యాదియందున్న ఆత్మ తనను తానుగా విభజించుకొని సృష్టిలో



| | | |
|---|---|---|
| హృదయగుహలో | - | పరంజ్యోతిగా, పరబ్రహ్మగా, శ్రీరాముడయినాడు. హిరణ్మయ శరీరము లేక హృదయ గుహయే కౌసల్య. |
| స్థూలశరీరములో | - | స్థూలశరీరముగా చెప్పబడే కైకకు భరతుడు. |

రాజ్యమనగా దేహము. ఈ స్థూల దేహమునకు ఇతడు అధిపతి అని కొందఱు ఇతడు అధిపతి కాదు ప్రతినిధి అని కొందఱు చెప్పుదురు.

| | | |
|---|---|---|
| సూక్ష్మశరీరములో | - | స్వప్నావస్థలో సుమిత్రకు శత్రుఘ్నుడు |
| సూక్ష్మశరీరములో | - | కారణ శరీరములో సుమిత్రకు లక్ష్మణుడు |

ఈ కారణశరీరమే యోగ భాషలో లింగ శరీరము అనియు సుషుప్తి అవస్థను నిశ్చల సమాధి స్థితి అనియు చెప్పబడును.

ఇలా నాలుగు మూర్తులుగా ఆవిర్భవించినాడు.

రావణసంహారమనగా - జీవాత్మ కూటస్థుడగుట.

శ్రీరాముడు హృదయగత ఆత్మ. ఇంద్రియారాముడు జీవుడు. రాముని జీవునిగా తీసుకొని సాధన రహస్యములను అరణ్యాకాండ, కిష్కింధకాండ, సుందరకాండలలో చెప్పి, యుద్ధకాండలో యోగరహస్యమయిన సేతువును నిర్మింప చేసి రావణుని సంహరించి కూటస్థుడైనాడు. ఆత్మదర్శనము చేసినాడు. ఇదే బ్రహ్మాది దేవతలు రాముని వద్దకు వచ్చుటగా వర్ణించినారు. రాముడు శ్రీరాముడైనాడు. అనగా సృష్ట్యాది యందు గల ఆత్మ స్వరూపుడయినాడు. సృష్ట్యాది యందు గల ఆత్మను - శ్రీరాముని పరంగా బ్రహ్మ స్తుతించినట్లు యుద్ధకాండలో 117వ సర్గలో - ఆత్మ లక్షణములను చెప్పినాడు.

ఆత్మ లక్షణములు

ఆత్మ-సృష్ట్యాదియందు

ఆత్మ

| | | |
|---|---|---|
| స్వయందేవః | = | స్వప్రకాశకుడు |
| స్వయం ప్రభః | = | స్వయంజ్యోతి |

స్వయంప్రభుః = నీవే సర్వమునకు ప్రభువు. నీకంటె అధికులు లేరు.

ప్రభుః = చక్రవర్తి

అక్షరం = అక్షరము

కృష్ణః = సర్వముచేయువాడు

దివ్యాః మహర్షయః త్వామ్ శరణ్యం శరణమ్ ఆహుః = దేవతలు, ఋషులు, నిన్ను శరణాగత రక్షకునిగా చెప్పుదురు.

పరాత్ పరః = ప్రకృతి పురుషులకు పరుడు ఆదిపురుషుడు

పురుషః = ఆదిపురుషుడు

విరాట్పురుషుడు

**రూపము:-**

కర్ణౌ = కర్ణములు - దిశలు

సూర్యచంద్రమసౌదృశే = సూర్యచంద్రులు నేత్రములు

అశ్వినౌ = అశ్వనీదేవతలు ముక్కు రంధ్రములు

హృదయం బ్రహ్మ = బ్రహ్మ హృదయము

జిహ్వా దేవీ సరస్వతీ = నాలుక సరస్వతీ దేవి

అనగా విరాట్పురుషుడు సమస్త దేవతా స్వరూపుడు

**సర్వవ్యాపకుడు:-**

సలిలే+గగనే+సర్వాసు+ పర్వతేషు+నదీషు+దృశ్యసి = నీటియందు, ఆకాశమునందు, సర్వపర్వతములయందు , సర్వ నదులయందు (నీవు) కనబడుదువు.



**అంతర్యామి:-**

గోషు+బ్రాహ్మణేషు+ సర్వభూతేషు = గోవులలో, బ్రాహ్మణులలో, సర్వ జంగమములలో అంతర్యామిగా ఉండును.

లోకానాం ఆదౌ అంతే దృశ్యసే= లోకముల సృష్టికి ముందు, లోకములు లయము అయిన తరువాత కూడ ఉండువాడు.

ప్రభవః నిధనం నో విధుః = విశ్వము యొక్క పుట్టుకకు పూర్వము విశ్వము లయము అయిన తరువాత - ఎవరును నిన్ను ఎఱుంగరు

**కర్మ:- దుష్ట శిక్షణ**

భూతభవ్య సపత్నజిత్ = త్రికాలములందు రాక్షసులను, శత్రువులను సంహరించువాడు. దుష్ట సంహారకుడు

**సృష్టి, స్థితి, లయకారకుడు:-**

**సృష్టిగా:**

ప్రజాపతిః = ప్రజాపతి

బ్రహ్మ = బ్రహ్మ

సర్వలోకస్య కర్తా = సర్వలోకములను సృజియించువాడు

త్రయాణాం లోకానాం ఆదికర్తా = ప్రారంభ సృష్టి కర్త. మూడు లోకములు సృజియించినవాడు.

సర్వ గాత్రేషు దేవాః = సర్వ అవయవములనుంచి దేవతలు సృజియింపబడి ఆదేవతలు ఆ యా అవయవములందు ఉండిరి.

**స్థితికారకునిగా - విష్ణువు:-**

నారాయణః = నారాయణుడు

శ్రీమాన్ = లక్ష్మీయుతుడు

చతుర్భుజః = నాలుగు చేతులు కలవాడు

చక్రాయుధః = సుదర్శన చక్రధారి

శార్ఙ్గ ధన్వా = శార్ఙ్గమను ధనుస్సు చేబూనిన వాడు

శ్రీవత్స లక్షణః = శ్రీ వత్సాంకితుడు

మధుసూదనః = మధుసూదనుడు

పద్మనాభః = పద్మనాభుడు

**లయకారకునిగా:-**

రుద్రాణాం అష్టమః రుద్రః = రుద్రులలో ఎనిమిదవవాడు

విష్వక్సేనః = అన్ని వైపులు సేనలు గలవాడు

ప్రభవః అప్యయః = ఆవిధముగా సృష్టిస్థితిలయములు చేయువాడు

**అవతారపురుషుడు:-**

ఏక శృంగః వరాహః = ఒక కొమ్ముగల వరాహావతారుడు

త్రిభిః విక్రమైః త్రయః లోకాః = వామనావతారుడు, త్రివిక్రమావతారుడు

క్రాన్తా

ఈ జగత్తు సర్వమూ అతడే. అతడు కానిది పరమాణువు కూడా లేదు.

సర్వదేవతారూపుడు - సర్వదేవతలూ అతడే

తేశరీరం సర్వం జగత్ = సర్వ జగత్తు నీ శరీరము

మహేంద్రః = ఇంద్రుడు

ఉపేంద్రః = ఉపేంద్రుడు

ఇన్ద్ర కర్మా = త్రిలోక పాలకుడు

సేనానీ = కుమార స్వామి

వసూనాం ఋతధామా = అష్ట వసువులలో ఋతధాముడు

మహాబలః = మహా బలవంతుడైన వాయువు

మహోరగః = ఆదిశేషువు

స పర్వతామ్ భూతాని పృథివీ = ఆదిశేషువుగా నీవు (పర్వతములు), స్థావర

చ ధారయసి జంగమములతో కూడిన భూమిని ధరియించు వాడవు.

దేవ గన్ధర్వ దానవాం = నీవు విశ్వరూపుడవు. దేవదానవగంధర్వ

ధారయన్ దృశ్యసే రూపములు ధరియించి కనబడుచున్నావు.

**సర్వ జీవరాసులు అతడే**

శత శీర్షః + సహస్రదృక్+ = అనేక వేల శిరస్సులూ, అనేకవేల కన్నులూ,

సహస్రచరణః అనేక వేల పాదములు కలవాడవు

**వేదములు యజ్ఞములు అతడే:-**

వేదాః = వేదములు

వేదాత్మా = వేద స్వరూపుడు

యజ్ఞః = యజ్ఞ స్వరూపుడు

సత్యం = సత్య స్వరూపుడు

**సర్వభావములు అతడే:-**

బుద్ధిః = బుద్ధి

క్షమా = ఓర్పు

దమః = దమము

స్థైర్యం వసుధాతలమ్ = ఓర్పున భూమి

కోపః అగ్నిః = కోపించిన అగ్నివలె దహించువాడు

ఓంకారము = ఓంకారము

వషట్కారః = వషట్కారము

సంస్కారాః = సర్వ సంస్కారములు

గ్రామణిః = దేహమనే గ్రామమునకు అధిపతి

హృషీకేశః = ఇంద్రియములకు అధిపతి

జ్ఞానవతాం శ్రేష్ఠః = జ్ఞానవంతులలో శ్రేష్ఠుడు

తే పరాక్రమమం అమోఘం = పరాక్రమము అమోఘము

తేవీర్యం అమోఘం = వీర్యము అమోఘము

**కాల స్వరూపుడు:-**

నిమిషః రాత్రిః ఉన్మేషః దివః = కనులు మూయుట రాత్రి అనగా లయము. కనులు తెఱచుట పగలు అనగా సృష్టి.

వేదములలో ఉపనిషత్తులలో ఆత్మగుఱించి, పురుషుని గుఱించి విరాట్పురుషుని వర్ణించిన పదములనే శ్రీరాముని పరంగా చెప్పినాడు. శ్రీరాముడు అనగా ఆత్మ. **ఆత్మను ఉపాసించుటయే రామోపాసన.** సాధనకు ముందు గల రాముడు -సాధనచే శ్రీరాముడు అనగా ఆత్మయైనాడని చెప్పినాడు. ఏది ఉపనిషత్తులలో చెప్పబడినదో దానినే రామాయణంగా రచించుటచే రామాయణము వేదోపబృంహణార్థముగా చెప్పుచున్నానని వాల్మీకి చెప్పినాడు.

*****

అహల్య అనే సాధకురాలు - ఆత్మ అనే రామునిని గౌతమాశ్రమము అనే ఉపాధిలో దర్శించి సర్వబంధములనుంచి విముక్తురాలైనది. ఆత్మ దర్శనమగు విధము అహల్యపరంగా -విహంగమార్గంలో -అహల్యకథలో ఇట్లు చెప్పినాడు.

**వాయుభక్షా నిరాహారా తప్యన్తీ భస్మశాయినీ**
**అదృశ్యా సర్వభూతానాం మాశ్రమేஉస్మిన్నివత్స్యసి**

(బాలకాండ-48 వ సర్గ-30)

భస్మశాయినీ = భస్మమును పూసుకొని - మనోవికారములను వీడుటకు - సాధువులు, ఈశ్వరుడు భస్మమును పూసుకొనినట్లువర్ణింతురు. అనగా మనోవికారములు లేనివారని అర్థము - మనోవికారములు లేక.

అస్మిన్ ఆశ్రమే = ఈ ఆశ్రమములో- ఈ దేహములోనే

అదృశ్యా సర్వ భూతానాం = సర్వభూతములకు కనిపించక అనగా ఉపాధి లక్షణములను వీడి



నిరాహారా వాయుభక్షా = ఆహారమును స్వీకరించక, వాయుభక్షణ చేయుచు అనగా నిశ్చల సమాధి స్థితిలో ఉండి

తప్యన్తీ నివత్స్యసి = తపస్సు చేయుచూ నివసించగలవు.

**రామఃఆగమిష్యతి........ పూతా భవిష్యసి (31)**

రామః = రాముడు

ఆగమిష్యతి: = రాగలడు ఆత్మదర్శనమగును

పూతా+భవిష్యసి: = పవిత్రురాలవు అగుదువు. సర్వ బంధములు తొలగును. అహల్యకు సర్వబంధములు తొలగినవి. రాముడు అహల్యకు నమస్కరించినాడు

| | **దళములు** | **హంసలు** | **హంసగమనమునకు సమయము గం॥ ని॥లు** |
|---|---|---|---|
| ఆధారము | 4 | 600 | 0.40 |
| స్వాధిష్ఠానము | 6 | 6000 | 6.40 |
| మణిపూరకము | 10 | 6000 | 6.40 |
| అనాహతము | 12 | 6000 | 6.40 |
| విశుద్ధము | 16 | 1000 | 1.07 |
| ఆజ్ఞేయం | 2 | 1000 | 1.07 |
| సహస్రారము | 8 | 1000 | 1.06 |
| సహస్రారమధ్యగత బిందువు | 2 | - | - |
| **మొత్తం** | **60** | **21,600** | **24.00** |

ఆధారములో తెల్లవారు ఝామున = 2.30 నుంచి 3.10 ని॥ వఱకు

స్వాధిష్ఠానములో = 3.10 నుంచి ఉ॥ 9.50 వఱకు

మణిపూరకములో = ఉ॥ 9.50నుంచిసా॥4.30 వఱకు

అనాహతంలో = సా॥4.30నుంచి 11.10 సా॥ వఱకు

| | | |
|---|---|---|
| విశుద్ధములో | = | సా॥ 11.10 నుంచి ఉ॥ 0.17 వఱకు |
| భ్రూమధ్యములో | = | ఉ॥ 0.17 నుంచి ఉ॥ 1.24 వఱకు |
| సహస్రారము, సహస్రార మధ్యగత బిందువులో | = | ఉ॥1.24 నుంచి ఉ॥ 2.30 వఱకు ఉండును |

మరల ఆధారమునకు వచ్చును.

ఈ 24 గంటలలోనే జాగ్రతావస్థ, స్వప్నావస్థ, సుషుప్తి అవస్థలనే త్రయావస్థలలో చరించును. 24 గంటలలో 60 దళములు పూర్తి చేసినను ఆత్మదర్శనము గలుగదు. యోగాభ్యాసమున తను సహస్రారమధ్యగత బిందువునకు చేరిననే ఆత్మదర్శనము, ఆత్మస్థానము చేరుట గలుగును. ఇట్టి సాధకుడు తను జీవించి యుండగనే అమృతుడగును. అమృత ఇహభవతి. సహస్రారమధ్య గత బిందువును చేరుటనే నిశ్చల సమాధి యని యందురు. కర్మవాసనలు క్షయమయినగాని యీ స్థానమునకు ఎవరునూ చేరలేరు. లేదా గురుకటాక్షమున మాత్రమే చేరగలరు.

కావున ఆత్మదర్శనమునకై పరితపించు సాధకుడు విధి విహితముగా గురువును సమీపించవలయును, గురుసాన్నిధ్యములో సాధన చేయవలయును.

| **నాడులు** | | **నాభినుంచి అవి వ్యాపించిన ప్రదేశం** |
|---|---|---|
| | | **ఉత్తరదిశ - నాభికి ఎగువ భాగము** |
| సుషుమ్న | = | నాభి నుంచి బ్రహ్మ రంధ్రము వఱకు |
| విశ్వోదరి | = | నాభినుంచి భ్రూమధ్యము - త్రినేత్ర స్థానము వఱకు |
| గాంధారినాడి | = | నాభినుంచి ఎడమ కన్ను వఱకు- ఇది కథా పరంగా ధృతరాష్ట్రుని భార్యగా చెప్పినారు |
| పూషనాడి | = | నాభి నుంచి కుడికన్ను వఱకు |
| శంఖినినాడి | = | నాభినుంచి ఎడమచెవి వఱకు(దేవహూ) |
| పయశ్వనినాడి | = | నాభినుంచి కుడి చెవివఱకు (పితృహూ) |
| ఇడనాడి | = | నాభి నుంచి ఎడమ ముక్కు రంధ్రము వఱకు |
| పింగళనాడి | = | నాభి నుంచి కుడి ముక్కు రంధ్రము వఱకు |
| సరస్వతినాడి | = | నాభినుంచి నాలుక వఱకు |
| | | **దక్షిణదిశ - నాభికి దిగువ భాగము** |
| కుహూనాడి | = | నాభినుంచి శిశ్నము వఱకు |
| అలంబస | = | నాభినుంచి గుదము వఱకు ( రామాయణములో అలంబస ఇక్ష్వాకుని భార్య వీరి వంశమున విశాల నగరరాజు జన్మించెను) |
| హస్తిజిహ్వ | = | నాభినుంచి ఎడమ పాదం వఱకు |
| యశస్విని | = | నాభినుంచి కుడి పాదం వఱకు |
| వారుణి | = | సర్వత్రావుంది. దీనినే కథగా సముద్ర మథనంలో ఆవిర్భవించిన వారుణిని దేవతలు గ్రహించి సురలయినారు. గ్రహించక రాక్షసులు - అసురులయినారు. |

నదులను నాడులుగా, పర్వతములను దేహములోని ఒక్కొక్క స్థానముగానూ, క్షీరసాగరమును, హిమవత్పర్వతమును భ్రూమధ్య స్థానముగానూ చిత్రీకరించి పురాణములలో కథలు కథలుగా సాధన రహస్యములను వర్ణించినారు. వీటిని గురుముఖతా గ్రహించి సాధన చేయవలయును.సృష్టిలోని ఆత్మ నాలుగు విధములయినది. కావున రామాయణములో ఆ నలుగురికి రామ, లక్ష్మణ, భరత, శత్రుఘ్నులని పేరు పెట్టినారు. అదే భాగవతములో శ్రీకృష్ణ, సంకర్షణ(బలరామ), ప్రద్యుమ్న, అనిరుద్ధ అని పేర్లు పెట్టినారు. ఈ విధముగా పిలువబడే నలుగురి గుఱించి ఈ ఉపనిషత్తు వివరించినది.

ఓంకారము - అక్షర పరబ్రహ్మము. అది అకార, ఉకార, మకార యుతము. సమిష్టి తత్త్వమున ఓంకారమై చతుర్విధము. ఆత్మ-హృదయ గుహలోని ఆత్మగా, జాగ్రత్, స్వప్న, సుషుప్తి అవస్థలలోని జీవాత్మగా చతుర్విధము. కావున ఓంకారమును ఉదాహరణగా తీసుకొని ఆత్మను యీ విధముగా యీ ఉపనిషత్ నందు వర్ణించుచున్నాడు.

ఓంకారము గురించి వివరించుచున్నాడు

1. **ఓ మిత్యేతదక్షర మిదగ్ం సర్వం తస్యోపవ్యాఖ్యానమ్ ।**
**భూతం భవద్భవిష్యదితి సర్వమోంకార ఏవ ।**
**యచ్చాన్యత్ త్రికాలాతీతం తదప్యోంకార ఏవ ॥**

ఓమ్ - ఇతి - ఏతత్ - అక్షరమ్ - ఇదగ్ం - సర్వం - తస్య - ఉపవ్యాఖ్యానం - భూతం - భవత్ - భవిష్యత్ - ఇతి - సర్వమ్ - ఓంకారః - ఏవ - యత్ - చ - అన్యత్ - త్రికాలాతీతం - తత్ - అపి - ఓంకారః - ఏవ.

ఓం కారమును ఉదాహరణగా తీసికొని చతుర్విధములయిన ఆత్మ గుఱించి వర్ణించుచున్నాడు. ఆత్మసృష్ట్యాదియందు ఒక్కడు. సృష్టిలో చతుర్విధములయినది.

| | | |
|---|---|---|
| ఓంకారః | = | ఓంకారము అ మాత్ర. సమిష్టిగా ఏక అక్షరము |
| ఓమ్+అక్షరం+ఇతి | = | అకారము, ఉకారము, మకారము అనే మూడు అక్షరములు సమిష్టి ఓం అను అక్షరము |
| ఓకారః | = | ఓంకారము హృదయగత ఆత్మ. త్రయావస్థలుగా అకారము, ఉకారము, మకారములు. జీవాత్మ ఆత్రయావస్థలలో విహరించును. ఆ విధముగా ఉదాహరణతో ఆత్మ తత్త్వమును మఱియు |
| ఏతత్ | = | ఆత్మ గుఱించి |
| తస్య+ఉపవ్యాఖ్యానం | = | దానియొక్కవివరణనుచెప్పుచున్నాను. ఆత్మ గుఱించి వివరించు చున్నాను |
| ఇదగ్ం+సర్వం+ఏవ | = | ఈ సర్వ విశ్వము - విరాట్ స్వరూపమే |
| భూతం+భవత్ | = | భూతకాలము, వర్తమానకాలము |
| భవిష్యత్+ఇతి | = | భవిష్యత్ కాలములో యుండే |
| సర్వమ్+ఏవ | = | ఈ సర్వ విశ్వము విరాట్ స్వరూపమే |
| చ | = | మఱియు |
| యత్+అన్యత్+తత్+అపి | = | ఏది ఇంకొకటి అనగా సృష్ట్యాదియందున్న ఆత్మ ఉపాధులలో అంతర్యామిగా అనగా జీవాత్మగా హృదయగుహలో ఆత్మగా ఉండునో అట్టి |
| త్రికాలాతీతం | = | ఆత్మ త్రికాలాతీతమైనది |



సృష్ట్యాదియందున్న ఆత్మకు నాలుగు పాదములు లేవు. అది పూర్ణస్వరూపము. అది ఏకము. సృష్టిలో ఆత్మకు నాలుగు పాదములు. లేక అది నాలుగు భాగములు.

| | | |
|---|---|---|
| హృదయగుహలో ఆత్మ | - | ఒక పాదము |
| 1. జాగ్రదావస్థలోగల జీవుడు | - | ఒక పాదము |
| 2. స్వప్నావస్థలోగల జీవుడు | - | ఒక పాదము |
| 3. సుషుప్తి అవస్థలోగల జీవుడు | - | ఒక పాదము |
| అటులనే ఓంకారము | - | ఒక పాదము |
| అకారము | - | ఒక పాదము |
| ఉకారము | - | ఒక పాదము |
| మకారము | - | ఒక పాదము. ఈ విధముగా నాలుగు పాదములు. |

ఓంకారము ఉదాహరణగా తీసుకొని సృష్టిలోగల ఆత్మ గుఱించి వివిరింపబడినది. ఓంకారము ధనుస్సు. జీవుడు బాణము. బ్రహ్మ లక్ష్యము. సాధకుడు ఓంకారము అనే ధనుస్సును గ్రహించి జీవాత్మ అనే బాణముతో బ్రహ్మము అనే లక్ష్యమును కొట్టవలయును.

*****

## ఓంకారము - ఆత్మ 4 పాదములు

**2. సర్వగ్ం హ్యేతద్ బ్రహ్మ అయమాత్మా బ్రహ్మ సోఽయమాత్మా చతుష్పాత్**

సర్వగ్ం - హి - ఏతత్ - బ్రహ్మ - అయమ్ - ఆత్మా - బ్రహ్మ - సః - అయమ్ - ఆత్మా - చతుష్పాత్

| | | |
|---|---|---|
| ఏతత్+సర్వగ్ం+హి | = | ఈ సర్వము - స్థావర జంగమాత్మకమైన ఈ విశ్వమంతా |
| బ్రహ్మ | = | బ్రహ్మ స్వరూపమే అనగా విరాట్ స్వరూపమే |
| అయమ్+ఆత్మా | = | సృష్ట్యాదియందు నిరుపాధికముగా ఉన్న ఈ ఆత్మయే |
| బ్రహ్మ | = | సాకారముగా పురుషుడయినది. అతడే ప్రకృతితో కూడి విరాట్‌పురుషుడయినాడు. రజోగుణహితుడై బ్రహ్మగా పిలువబడుతున్నాడు. బ్రహ్మగా ఉపాధులను సృజియించినాడు. ఆత్మ జీవాత్మగా హృదయగత ఆత్మగా ఉపాధులలో వసియించినవి. ఆ విధముగా సృష్ట్యాదియందున్న ఆత్మ సృష్టిలో |
| సః+అయమ్+ఆత్మా | = | ఈ ఆత్మ |
| చతుష్పాత్ | = | నాలుగు భాగములుగా వ్యవహరింప బడుచున్నది. |

ఆత్మ - హృదయగుహలో గల ఆత్మగా - జాగ్రతావస్థలో- స్వప్నావస్థలో - సుషుప్తి అవస్థలలో - ఇలా మూడు అవస్థలలో మూడు పేర్లతో మొత్తం నాలుగు పేర్లతో పిలువబడుచున్నది. వాల్మీకి శ్రీరాముడు, భరతుడు, శత్రుఘ్నుడు, లక్ష్మణుడుగా రామాయణంలో వీటికి పేర్లు పెట్టినాడు.

ఆత్మ - రెండు భాగములయినది. ఒక సగభాగము బింబము, మిగిలిన సగభాగము ప్రతిబింబము. ఈ ప్రతిబింబము జీవాత్మ. ఈ జీవాత్మ మరల మూడు భాగములు. అయితే యీ 4 భాగములు సమముగా మాత్రము కాదు.

| | |
|---|---|
| హృదయ గుహలో గల ఆత్మ సగభాగము | = శ్రీరాముడు |
| ఆత్మతో సుషుప్తిలో జీవాత్మ కలసి యుండును కావున ఇది- 1/4 భాగము | = లక్ష్మణుడు |
| జాగ్రతావస్థలో శరీరముతో సుఖదుఃఖములను అనుభవించును ఇది-1/8 భాగము | = భరతుడు |
| స్వప్నావస్థలోని లక్షణములు జాగ్రతావస్థలోని లక్షణములు సమానము ఇది -1/8 భాగము | = శత్రుఘ్నుడు |

సృష్ట్యాదియందున్న ఆత్మ పూర్ణము. సృష్టిలో కూడా పూర్ణము. దశరథుడు యజ్ఞ పాయసమును పంచుటలోని ఆంతర్యమిది

*****

జాగ్రతావస్థలో జీవాత్మ - వైశ్వానరుడు

**3. జాగరిత స్థానో బహిః ప్రజ్ఞః సప్తాంగ ఏకోనవింశతి ముఖః స్థూల భుగ్ వైశ్వానరః ప్రథమః పాదః**

జాగరిత - స్థానః - బహిః - ప్రజ్ఞః - సప్త - అంగః - ఏకోనవింశతి - ముఖః - స్థూలభుక్ - వైశ్వానరః - ప్రథమః - పాదః

4 పాదములలో అనగా 4 భాగములలో

| | | |
|---|---|---|
| ప్రథమః+పాదః | = | ప్రథమ పాదము-ప్రథమ భాగము |
| వైశ్వానరః | = | వైశ్వానరుడు |
| జాగరిత+స్థానః | = | జాగ్రతావస్థ. జాగ్రతావస్థలో యున్న జీవునిని వైశ్వానరుడని అందురు. ఈ వైశ్వానరుడు ప్రజ్ఞావంతుడే గాని |
| బహిః+ప్రజ్ఞః | = | బాహ్యవిషయములనే గ్రహించును. (భోగములు అనుభవించు భోక్త) |

కన్నుల ద్వారా బాహ్య దృశ్యములనే చూడగలడు. శరీరములో గల వాటిని చూడలేడు.

చెవి ద్వారా బాహ్య శబ్దమునే వినగలడు. కాని హంస గమన వేగమును వినలేడు. అంతర్నాదమును వినలేడు. ఇటులనే మిగిలిన జ్ఞానేంద్రియముల ద్వారా బాహ్య విషయములనే గ్రహించగలడు.

| | | |
|---|---|---|
| స్థూలభుక్ | = | స్థూలవిషయములను,బాహ్య విషయములను అనుభవించువాడు. |

ఇతని అనుభవమునకు బాహ్యముగా వస్తువు ఉండవలయును. స్థూల విషయములను అనుభవించును. ఆకలి గలిగి నప్పుడు ఆ ఆకలి తీరుటకు అన్నము అనే పదార్థము ఉండి తీరవలయును. విశ్వామిత్రుడు రామునికి బల అతిబలలు ఉపదేశించి వీటి ద్వారా ఆకలి దప్పికలు తీరునని చెప్పెను. కాని రాముడు అరణ్యవాసములోనూ, అయోధ్యలోనూ ఆహారమును స్వీకరించెను. అరణ్యములో మృగములను వేటాడి ఆ మాంసమును తినెను. అనగా వైశ్వానరుడుగా యున్నంత సేపు ఆకలి దప్పికలు ఉండును. ఆహారము, నీరు అవసరము. ఇటులనే మిగిలిన బాహ్య వస్తువులు, జీవుడు భోగించుటకు కావలయును.

| | | |
|---|---|---|
| ఏకోనవింశతి +ముఖః | = | 5 జ్ఞానేంద్రియములు, 5 కర్మేంద్రియములు, 5 ప్రాణములు, మనస్సు, బుద్ధి, చిత్తము, అహం కారము - ఈ 19 ద్వారా వైశ్వానరుడు బాహ్య జగత్తులోని విషయములను అనుభవించును. |
| సప్తాంగః(సప్త+ అంగః) | = | మహత్, అహంకారం, ఆకాశం, వాయువు, అగ్ని, జలము, భూమి అనే సప్తావరణలు అనే 7 ముఖ్యమైన అంగములు కలవాడు. (ఇతడే సుఖ దుఃఖములను జాగ్రతావస్థలో అనుభవించును - కైవల్య - 12) |

రామాయణములో స్థూల దేహాధిపతి యైన జీవుడు భరతుడు. ఇతడే దేహ సామ్రాజ్యమునకు సంబంధించిన సుఖ దుఃఖములనుభవించు భోక్త. వేదము చెప్పినదానికి కైక వరముగా చెప్పబడినది. కావున దేహసామ్రాజ్యమనే - కోసల దేశమునకు అయోధ్యకు భరతుడే అధిపతి **అని చెప్పుటకు "నివాసనం చ రామస్య**



**భరతస్యాభిషేచనం"** బాలకాండ- ప్రథమ సర్గ -22లో చెప్పబడెను.

పైన చెప్పిన 19 ముఖములలో 5 ప్రాణములపై వైశ్వానరునికి అధికారము లేదు. కావున 19లో నుంచి 5 తీస్తే 14. ఈ 14 యింటిపైన భరతునకు అధికారము ఉండును. కావున 14 సం॥లు భరతుడు రాజ్యమేలతాడని చెప్పక 14 సంవత్సరములు రాముడు అరణ్య వాసము చేయవలయునని కైక కోరినది. (అయోధ్య కాండలో) . సప్తాంగః అని చెప్పిన దానికి భగవద్గీతలో దుర్యోధనుడు తన సేనలోని ప్రముఖులను పేర్కొనుచు 7 పేరులనే చెప్పినాడు.

**భవాన్ భీష్మశ్చ కర్ణశ్చ కృపశ్చ సమితింజయః**
**అశ్వత్థామా వికర్ణశ్చ సౌమదత్తి స్తథైవ చ**

(భగవద్గీత - అర్జునవిషాద యోగము- 8)

| | | | |
|---|---|---|---|
| 1. | భవాన్ | = | మీరు (ద్రోణాచార్యుడు) |
| 2. | భీష్మః +చ | = | భీష్ముడు |
| 3. | కర్ణః+చ | = | కర్ణుడు |
| 4. | సమితింజయః+ కృపః+చ | = | యుద్ధమందు జయశీలుడైన కృపుడు |
| 5. | అశ్వత్థామా | = | అశ్వత్థామా |
| 6. | వికర్ణః+చ | = | (దుర్యోధనుని తమ్ముడగు) వికర్ణుడు |
| 7. | సౌమదత్తిః | = | సోమదత్తుని కుమారుడగు భూరిశ్రవుడు |
| | (తథైవచ | = | అట్లే మిగిలిన వారు) |

ఈ 7గురు బ్రహ్మవిద్యలో ఎవరెవరో తెలుసుకొనవలయును. స్థూల శరీరములో ఎవరెవరో తెలుసుకొనవలయును. ఈ స్థూల శరీరమునకు సేనాధిపతి భీష్ముడు. భీష్ముడు అనగా జలతత్త్వము. స్థూలశరీరమునకు ప్రధానమైనది జలతత్త్వము. ఈ జలతత్త్వము లేనిచే స్థూల శరీరము బూడిదగును.

*****

మనో ప్రధానమైన సూక్ష్మ శరీరమునే లింగశరీరమని అందురు. సూక్ష్మ శరీరమునకు రెండు అవస్థలు గలవు. ఒకటి స్వప్నావస్థ. మఱియొకటి సుషుప్తి అవస్థ. సుషుప్తి అవస్థలో జీవుడు, లేదా నిశ్చల సమాధిలో చెప్పబడే కూటస్థుడు, ఆత్మతో నిత్యము కలసి యుండి ఆత్మతో ఏకీభూతుడగును. ఇతడు నిర్మలుడు. కావున తెల్లనివాడు అని చెప్పుదురు. జీవుడు కర్మవాసనలు క్షయము కానంత వఱకు మోక్షప్రాప్తి పొందలేడు. యోగములో నిశ్చల సమాధి పొందినవాడు అమృతు డగును. ఇతనిని కూటస్థుడు అని అందురు.

*****

స్వప్నావస్థ

ఒక వ్యక్తి కలలో పులిని చూచి భయపడి పెద్దకేక వేసి మేల్కాంచి కలలో చూచిన పులి లేదని గ్రహించినను జాగ్రతావస్థలో కూడా కొంత తడవు గుండె దడదడ కొట్టుకొనును. అటులనే ఆనందపడే కలలు వచ్చినా కూడ జాగ్రతావస్థలో కొంత తడవు ఆ అనుభూతి ఉండును. కావుననే భరతునితోనే నిత్యము శతృఘ్నుడు ఉన్నట్లు రామాయణములో వర్ణింపబడెను.

స్వప్నావస్థలో జీవాత్మ - తైజసుడు

4. **స్వప్నస్థానోఽ౽ంతః ప్రజ్ఞః సప్తాంగ ఏకోనవింశతి ముఖః ప్రవివిక్తభుక్ తైజసో ద్వితీయః పాదః**

స్వప్నస్థానః - అంతఃప్రజ్ఞః - సప్తాంగః - ఏకోనవింశతి-ముఖః - ప్రవివిక్తభుక్ - తైజసః - ద్వితీయః - పాదః

ద్వితీయః+పాదః = రెండవ పాదము

తైజసః = తైజసుడు. అనగా తేజోవంతుడు. ఆత్మ ప్రకాశము వలన స్వప్నములో మనని మనమే చూచుకొని అనుభవములను పొందుచున్నాము.

స్వప్నస్థానః = స్వప్నావస్థ యితని స్థానము

అంతఃప్రజ్ఞః = అంతర్ముఖమైన చేతన గలవాడు. మనస్సుచే స్వమాయచే కల్పింపబడిన జీవ లోకములో సుఖదుఃఖములను అనుభవించును.

ప్రవివిక్తభుక్ = స్వప్నములో మనస్సుతో విషయములను అనుభవించువాడు. అంతరేంద్రియములతో విషయములను అనుభవించువాడు.

ఏకోన వింశతి +ముఖః = 19ముఖములు అనగా
5 జ్ఞానేంద్రియములు,
5 కర్మేంద్రియములు,
5 ప్రాణములు, మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము అనే నాలుగు అంతఃకరణములు

సప్తాంగః = మహత్తు, అహంకారము, ఆకాశము, వాయువు, అగ్ని, జలము, భూమి అనే సప్తావరణలు (సప్త అంగములు) 7 ముఖ్యమైన అంగములు కలవాడు.

జాగ్రతావస్థలోని వైశ్వానరుని వలె స్వప్నావస్థలో తైజసుడు ఉండి సుఖదుఃఖములను అనుభవించును. స్వప్నావస్థలోని తైజసునికి శత్రుఘ్నుడని రామాయణంలో చెప్పబడినది. కావున రామాయణంలో శతృఘ్నుడు నిత్యము భరతుని తోనే ఉండును.

స్థూల శరీరమునకు 19 ముఖములు, 7 అంగములు. సూక్ష్మ శరీరమునకు కూడా 19 ముఖములు, 7 అంగములు. అయినను సూక్ష్మ శరీరము స్థూల శరీరము కంటె విశిష్ఠమయినది. గొప్పది. ఈ విషయమును చెప్పుటకు రామాయణములో స్థూల శరీర అధిపతి అయిన భరతడు 1/8వ పాలు అని, లక్ష్మణుడు 1/4వ పాలు అని చెప్పినారు. అటులనే భారతములో కౌరవసేనలో 7గురు ప్రముఖులను, పాండవసేనలో 19 మంది ప్రముఖులను పేర్కొనినారు.

భగవద్గీత - అర్జున విషాదయోగంలో ఈ 19 ముఖములను పాండవసేనలోని 19 మంది వీరులుగా చెప్పినారు.

**అత్రశూరా మహేష్వాసా భీమార్జున సమా యుధి**
**యుయుధానో విరాటశ్చ ద్రుపదశ్చ మహారథః- (4)**

**దృష్టకేతుశ్చేకితానః కాశీరాజశ్చ వీర్యవాన్**
**పురుజిత్కున్తి భోజశ్చ శైబ్యశ్చ నరపుంగవః-(5)**
**యుధామన్యుశ్చ విక్రాన్త ఉత్తమౌజాశ్చ వీర్యవాన్**
**సౌభద్రో ద్రౌపదేయాశ్చ సర్వ ఏవ మహారథాః-(6)**

| | | | |
|---|---|---|---|
| 1. | యుయుధానః | = | సాత్యకి |
| 2. | విరాట్ +చ | = | విరాటుడు |
| 3. | ద్రుపదః+చ | = | ద్రుపదుడు |
| 4. | దృష్టకేతుః | = | శిశుపాలుని కుమారుడు దృష్టకేతువు |
| 5. | చేకితానః | = | చేకితానుడు |
| 6. | కాశీరాజః+చ | = | కాశీరాజు |
| 7. | పురుజిత్ | = | పురుజిత్ |
| 8. | కుంతిభోజః+చ | = | కుంతిభోజుడు |
| 9. | శైబ్యః+చ | = | శైబ్యుడు |
| 10. | యుధామన్యుః+చ | = | యుధామన్యు |
| 11. | ఉత్తమౌజాః+చ | = | ఉత్తమౌజుడు |
| 12. | సౌభద్రో | = | సుభద్రకుమారుడగు అభిమన్యుడు |
| 13-17. | ద్రౌపదేయాః+చ | = | ద్రౌపది పుత్రులయిన, ఉప పాండవులు, ప్రతి విందు్యడు, శ్రుతసోముడు, శ్రుతకీర్తి, శతానీకుడు, శ్రుతసేనుడు |
| 18-19. | భీమార్జున | = | భీమార్జునులు |

ఈ సూక్ష్మ శరీరము లేక లింగ శరీరమునకు ముఖ్యుడు భీముడు. భీముడు వాయువు కుమారుడు. అనగా వాయు తత్త్వము సూక్ష్మ శరీరమునకు ముఖ్యము. లింగ శరీరమునకు మనస్సు అధి దేవత. అటులనే ఈ 19 మందిని బ్రహ్మవిద్యలో ఎవరెవరుగా చెప్పినారో గ్రహించవలయును. ఇవి సూక్ష్మశరీరములోనివి. స్థూలదేహము, సూక్ష్మదేహములను కౌరవపాండవులుగా ప్రవేశపెట్టి బ్రహ్మవిద్యను భగవద్గీతలో - ఉపనిషత్‌ల సారమును వివరించినారు. స్థూలదేహములోని వాటిని రాక్షసులుగా, సూక్ష్మ శరీరములోని వాటిని వానరులుగా చిత్రీకరించి రామాయణములో వివరించినారు.



*****

సుషుప్తి అవస్థ - జీవాత్మ

5. **యత్ర సుప్తో న కంచన కామం కామయతే**
**న కంచన స్వప్నం పశ్యతి తత్ సుషుప్తం।**
**సుషుప్త స్థాన ఏకీభూతః ప్రజ్ఞానఘన ఏవానందమయో**
**హ్యనంద భుక్ చేతో ముఖః ప్రాజ్ఞస్తృతీయఃపాదః॥**

యత్ర - సుప్తః - న - కంచన - కామం - కామయతే - న - కంచన - స్వప్నం- పశ్యతి - తత్ - సుషుప్తం - సుషుప్తస్థానః - ఏకీభూతః - ప్రజ్ఞానఘనః - ఏవ - ఆనందమయః - హి - ఆనందభుక్ - చేతో ముఖః - ప్రాజ్ఞః - తృతీయః - పాదః

సుషుప్తి అవస్థ అనగానేమిటో నిర్వచించుచున్నాడు.

| | | |
|---|---|---|
| యత్ర+సుప్తః | = | నిద్రించునప్పుడు - జీవుడు |
| కంచన+కామం+ న+కామయతే | = | ఎటువంటి కోరికలు కోరడో |
| కంచన+స్వప్నం+ న+పశ్యతి | = | స్వప్నములో ఏదీ చూడడో అనగా స్వప్నావస్థ, జాగ్రతావస్థ కానిదేదో |
| తత్+సుషుప్తం | = | అది సుషుప్తి అవస్థ అని అందురు ఈ సుషుప్తి |
| తృతీయః+పాదః | = | మూడవపాదము అప్పుడు జీవుడు |
| ప్రాజ్ఞః | = | ప్రాజ్ఞుడుగా పిలువబడును |
| సుషుప్తిస్థానః | = | సుషుప్తి అతని స్థానము |
| ప్రజ్ఞాన ఘనః | = | గొప్ప ప్రజ్ఞానము గలవాడు |
| ఆనందభుక్+ఏవ | = | ఆనందమునే అనుభవించును, ఈ స్థానములో దుఃఖమువుండదు. సుఖము దుఃఖములు -జాగ్రతావస్థలోనూ, స్వప్నములోనూ గలుగును. ఆనందము - సుషుప్తి అవస్థలో పొందును. |

| | | |
|---|---|---|
| ఆనందమయః | = | **సకలే విలీనే సుఖరూపం ఏతి** - కైవల్య 13లో చెప్పిన విధంగా సుఖదుఃఖములు రెండూ విలీనమయి కేవలం ఆనందమయుడై హృదయ గుహలోని ఆత్మతో ఏకీభూతుడగును. |
| చేతోముఖః+హి | = | చేతన అనగా ప్రాణము, ప్రాణమే పనిచేయును. ఇంద్రియములు పనిచేయవు. ఇంద్రియార్థములు, అంతఃకరణ చతుష్టయము మఱియు జీవుడు అనే ఈ సర్వము ఆత్మలో విలీనమవగా ప్రాణము మాత్రము సంచారము చేయును. జాగ్రత్ స్వప్న అవస్థలలో 19 ముఖములు గలవాడైనను సుషుప్తిలో ప్రాణము అనే ఒకే ముఖము గలవాడు. |
| ఏకీభూతః | = | హృదయగుహలో గల ఆత్మతో - ఏకీభూతమగును. |

కాని ఈ ఆనందము తమః ప్రధానము.

**జన్మాంతర కర్మ యోగాత్ పునః ప్రబుద్ధః - కైవల్య 14లో చెప్పినట్లు పూర్వజన్మ కర్మవాసనల వలన తిరిగి జాగ్రతావస్థకు వచ్చును.**

ఇతడు ప్రాజ్ఞుడు. అంటే జాగ్రతావస్థలోని వైశ్వానరుడు కంటె, స్వప్నావస్థలోని తైజసుని కంటె అధికుడు. ఈ స్థితిలో దేహధ్యాస యుండదు గాన యీ ప్రాజ్ఞునికి అంగములు, ముఖములు చెప్పలేదు. కాని ప్రాణసంచారము ఉండునుగాన చేతోముఖుడు. సుషుప్తి అవస్థలో ఆకలిదప్పికలు, సుఖదుఃఖములు, రాగద్వేషములు ఉండవు. అందువలన రామాయణంలో అరణ్యవాసంలో లక్ష్మణుడు, తన భార్య అయిన ఊర్మిళను వదలి వచ్చినట్లు చిత్రీకరింపబడినాడు. తిరిగి అయోధ్యకు వచ్చి ఊర్మిళతో యున్నాడు. జాగ్రతావస్థకు వచ్చిన తర్వాత దేహధ్యాస యుండును.

ప్రథమ పాదము, ద్వితీయ పాదము, తృతీయ పాదములనే మూడు పాదములు దానం చేసినవాడు అనగా త్రయీ అవస్థలను దాటిన వాడు పుణ్యాతి రేకమున పుణ్యలోకములలో కొంతకాలము ఉండి తిరిగి పుణ్యాతి రేకమున అధికారము



గల పురుషుడగును. ఈ విషయమునే బలి చక్రవర్తి మూడు పాదములు విష్ణువునకు దానం యిచ్చినట్లు కథగా చెప్పినారు. బలి చక్రవర్తి ప్రస్తుతం పుణ్యఫలితము వలన గలిగిన సుఖభోగములను రసాతలంలో అనుభవించుచున్నాడు. రాబోయే అష్టమమనువు కాలములో ఇంద్రుడగును.

పుణ్యకర్మానుష్ఠానం వలన ఆత్మతో ఏకీభూతుడగుట గాని, ఆత్మ స్థానమున శాశ్వతముగా వసించుటగాని జరగదు. కేవలము పుణ్యలోక ప్రాప్తియే గలుగును. పుణ్యకర్మానుష్ఠానముచేసి ఫలితమును కోరిన పుణ్యానుభవము క్షీణించగనే తిరిగి మర్త్యలోకమున పుట్టును. కర్మ ఫలితము బలి చక్రవర్తి కోరలేదు గావున అధికారము గల పురుషుడు అనగా ఇంద్రుడుగా, రాబోయే మనువు కాలములో అగును.

దానము అన్నది పుణ్యకర్మానుష్ఠానము. ఆ దానమును శ్రద్ధగానూ, విధివిహితముగానూ, ఫలితమును కోరక చేయుట వలన బలి చక్రవర్తి అధికార పురుషుడయినాడు. దానమును అనగా గోవును అశ్రద్ధగా దానము ఇచ్చిన నృగు మహారాజు తొండగా పుట్టినాడు. కావున పుణ్యకర్మానుష్ఠానము విధి విహితముగా చేయవలయును.

*****

స్వప్నాదియందుగల ఆత్మ
హృదయ గుహలోని - ఆత్మ

6. **ఏష సర్వేశ్వర ఏష సర్వజ్ఞ ఏషోఽంతర్యామ్యేష**
**యోనిః సర్వస్య ప్రభవాప్యయౌ హి భూతానామ్**

ఏషః - సర్వేశ్వరః - ఏషః - సర్వజ్ఞః - ఏషః - అంతర్యామి - ఏషః - యోనిః - సర్వస్య - ప్రభవ ఆప్యయౌ - హి - భూతానామ్.

హృదయ గుహలో గల ఆత్మ జాగ్రత్, స్వప్న, సుషుప్తి, అవస్థలకు లోనుగాడు. సుఖదుఃఖములను అనుభవించదు. ఇతడు సాక్షి. మూడు అవస్థలకు భిన్నమగు అవస్థ అని చెప్పుటకు పెద్దలు దీనిని తురీయావస్థ అని పేరు పెట్టినారు.

స్థూల, సూక్ష్మ, కారణ శరీరములకు భిన్నమగు శరీరము అని చెప్పుటకు పెద్దలు హిరణ్మయ శరీరమని పేరు పెట్టినారు. అట్టి సృష్ట్యాదియందున్న ఆత్మ

| | | |
|---|---|---|
| ఏషః+సర్వజ్ఞః | = | ఇతడు సర్వజ్ఞుడు సృష్టి స్థితి లయములు భూత వర్తమాన భవిష్యత్‌లు తెలిసినవాడు |
| ఏషః+సర్వేశ్వరః | = | ఇతడు సర్వనియామకుడు సృష్టిలో |
| ఏషః+అంతర్యామి | = | ఇతడు విశ్వములో అంతర్యామి రూపంబున అనగా జీవాత్మగా హృదయగుహలోని ఆత్మగా చరించును. విరాట్‌పురుషునిగా |
| ఏషః+యోనిః | = | ఇతడు సర్వజీవులకు సర్వస్థావరములకు, జంగమములకు, సర్వజగత్తుకు పుట్టుక స్థానము |
| సర్వస్య+భూతానాం+హి+ ప్రభవఆప్యయౌ | = | సర్వభూతముల యొక్క స్థితికి ఉత్పత్తి వినాశములకు కారణమైనవాడు. |



ఆత్మ - రామాయణంలో శ్రీరాముడు, భాగవతములో శ్రీకృష్ణుడు. ఈ ఆత్మను దర్శించుట, ఆత్మతో ఏకీభూతమగుటను సాధన రహస్యముగా రామాయణము భాగవతములు వివరించినవి. వాటిని పారాయణ చేసి ఆత్మదర్శనము చేసినవారు ధన్యులు.

*****

7. **నాంతః ప్రజ్ఞం నబహిః ప్రజ్ఞం నోభయతః ప్రజ్ఞం న ప్రజ్ఞాన ఘనం న ప్రజ్ఞం నా ప్రజ్ఞం । అదృష్ట మవ్యవహార్య మగ్రాహ్య మలక్షణ మచింత్య మవ్యపదేశ్య మేకాత్మ ప్రత్యయ సారం ప్రపంచోపశమం శాంతం శివమద్వైతం చతుర్థం మన్యంతే స ఆత్మా స విజ్ఞేయః**

న - అంతః - ప్రజ్ఞం - న - బహిః - ప్రజ్ఞం - న - ఉభయతః - ప్రజ్ఞం - న - ప్రజ్ఞానఘనం +న ప్రజ్ఞం - న అప్రజ్ఞం - అదృష్టమ్ - అవ్యవహార్యమ్ - అగ్రాహ్యమ్- అలక్షణమ్ - అచింత్యమ్ - అవ్యపదేశ్యమ్ -ఏకాత్మ - ప్రత్యయసారం - ప్రపంచ- ఉపశమం - శాంతం - శివమ్ - అద్వైతం - చతుర్థం - మన్యంతే - సః - ఆత్మా - సః - విజ్ఞేయః

| | | |
|---|---|---|
| చతుర్థం | = | మూడు పాదములు గాక నాలుగవది |
| న+బహిః+ప్రజ్ఞం | = | బహిప్రజ్ఞ గల వైశ్వానరుడు కాడు |
| న+అంతః+ప్రజ్ఞ | = | అంతఃప్రజ్ఞ గల తైజసుడు కాడు. |
| న+ఉభయతః+ ప్రజ్ఞం | = | రెండింటియొక్క ప్రజ్ఞలేనివాడు అనగా స్థూల శరీరములో 19 ముఖములు, 7 అంగములతో చరించు - వైశ్వానరుడు కాడు. సూక్ష్మ శరీరములో 19 ముఖములు 7 అంగములతో చరించు తైజసుడుకాడు. వైశ్వానరుడు, తైజసుడు కానందున అతనికి సుఖదుఃఖములు లేవు. |
| న+ప్రజ్ఞానఘనం | = | పూర్వ జన్మ కర్మవాసనలతో కూడి సూక్ష్మ శరీరములో సుషుప్తి అవస్థలో ఉన్న ప్రజ్ఞాన ఘనుడగు- ప్రాజ్ఞుడు కాడు. కేవలము క్షణిక మైన ఆనందమును గాక శాశ్వత ఆనందము గలవాడు. ఆనందరూపుడు. |
| న+అప్రజ్ఞం+న+ప్రజ్ఞం | = | వైశ్వానరునివలె బాహ్య ప్రజ్ఞ, తైజసునివలె అంతః ప్రజ్ఞ, ప్రాజ్ఞునివలె గొప్ప ప్రజ్ఞానం గలవాడు కాడు. అలా అని ప్రజ్ఞానం లేనివాడు కాడు. |

హృయగుహలోగల ఆత్మ, జీవలక్షణములను - ఉపాధి లక్షణములను అంటక విలక్షణముగా ఉండును అని దీని సారాంశము.

సృష్ట్యాదియందున్న ఆత్మ

| | | |
|---|---|---|
| అదృష్టం | = | బాహ్యచక్షువులకు గోచరము గాక అంతర్యామియు |
| అవ్యవహార్యం | = | సాక్షి అనగా లోకవ్యవహారములతో సంబంధము |

లేనిదియు

| | | |
|---|---|---|
| అగ్రాహ్యం | = | ఇంద్రియములచే గ్రహించలేనిదియు |
| అలక్షణం+అచింత్యం | = | ఉపాధి లక్షణములు లేనిది. నామ, రూప, జీవలక్షణములు గుణములు లేనిది. కావున ఊహింప నలవి కానిదియు. |
| అవ్యపదేశ్యం | = | ఇట్టిది అట్టిది అని ఈ రూపము అని నిర్దేశింపరానిది |
| శాంతం | = | త్రిగుణ రహితమయినదగుట వలన శాంతత్త్వము గలదియు |
| శివం | = | శుభకరమయినదియు |
| ప్రపంచ+ఉపశమనం | = | లయకారకము అయినదియు |
| ఏకాత్మ | = | సృష్ట్యాదియందు ఒకటిగా ఉన్నదియు సృష్ట్యాది యందు ఉన్నదీ అదే. ఈ సర్వ విశ్వము అదే. హృదయ గుహలో ఉన్నదీ అదే. |
| అద్వైతం | = | రెండవది లేనిది అనగా అంతా ఆత్మయే |
| ప్రత్యయసారం | = | త్రయావస్థలను ఎఱిగినదియు అయిన |
| సః+ఆత్మా+సః+విజ్ఞేయః | = | అట్టి ఆత్మను దర్శించవలయును. దానిచే సర్వబంధములు తొలగును. అని |
| మన్యంతే | = | తలంచెదరు. అట్టి ఆత్మను దర్శించిన సర్వ బంధములు తొలగి జీవుడు ఈశ్వరుడగును. |

ఈ విషయమునే కైవల్య 17 లో ఇట్లు చెప్పబడినది.

**జాగ్రత్, స్వప్న, సుషుప్తాది ప్రపంచం యత్ప్రకాశతే**
**తత్ బ్రహ్మాహమితి జ్ఞాత్వా సర్వబంధైః ప్రముచ్యతే**

*****

**ఓంకారము**

**8. సోఽయమాత్మాఽధ్యక్షర మోంకారోఽధి మాత్రం పాదా**
**మాత్రా మాత్రాశ్చ పాదా అకార ఉకారో మకార ఇతి**

సః - అయం - ఆత్మా - అధిఅక్షరమ్ - ఓంకారః - అధిమాత్రం - పాదాః - మాత్రా - మాత్రాః - చ - పాదాః - అకారః - ఉకారః - మకారః - ఇతి.

| | | |
|---|---|---|
| సః+ఆత్మా | = | సృష్ట్యాదియందున్న ఆ ఆత్మ |
| అయం+పాదాః | = | సృష్టిలో నాలుగు భాగములుగా విరాజిల్లు చున్నది. |
| చ | = | మఱియు సృష్టి అంతా తనే అయి విరాజిల్లుచున్నది. |

ఇప్పుడు ఓంకారము గుఱించి చెప్పుచున్నారు.

| | | |
|---|---|---|
| అధిఅక్షరమ్+ | = | అది అక్షరము అయినదియు |
| అధిమాత్రమ్ | = | అధిమాత్రము అయినదియు అయిన |
| ఓంకారః +మాత్రా | = | ఓంకారము సమిష్టిలో ఒకటి. ఏకమాత్ర. |

అదే వ్యష్టిలో

| | | |
|---|---|---|
| అకారః | = | అకారము |
| ఉకారః +చ | = | ఉకారము |
| మకారః | = | మకారము అని |
| మాత్రాః | = | మూడు మాత్రలుగా ఉన్నది. అటులనే జీవాత్మ |
| పాదాః+ఇతి | = | మూడు పాదములుగా త్రయావస్థలలో విరాజిల్లుచున్నదని గ్రహించవలయును. |

*****

అకారము

**9. జాగరిత స్థానో వైశ్వానరోఽకారః ప్రథమామాత్రా**
**ఆప్తేరాధిమత్వాత్ వా ఆప్నోతి హ వై**
**సర్వాన్ కామానాదిశ్చ భవతి య ఏవం వేద**

జాగరిత - స్థానః - వైశ్వానరః - అకారః - ప్రథమా - మాత్రా - ఆప్తేః - అధిమత్వాత్- వా - ఆప్నోతి - హ - వై - సర్వాన్ - కామాన్ - ఆదిః - చ - భవతి - యః - ఏవం - వేద.

ఓంకారము వ్యష్టిలో

అకారః = అ - అనే అక్షరము

ప్రథమా+మాత్రా = మొదటి మాత్ర

ఆప్తేః = అ అనే అక్షరము అన్ని హల్లులలో వ్యాపించి ఉన్నది

అధిమత్వాత్ = అ అనే అక్షరము హల్లులతో కలసి ఉండుట వలన హల్లులు అజంతములుగా పిలువబడుచున్నవి.

అటులనే జీవాత్మ వ్యష్టిలో జాగ్రతావస్థలో

వైశ్యానరః = వైశ్వానరుడు అని పిలువబడుచున్నాడు

జాగరిత+స్థానః = జాగరిత స్థానము అనగా జాగ్రతావస్థలో జీవునుని వైశ్వానరుడని అందురు.

హ = అ - అనే అక్షరము హల్లులతో వ్యాపించి ఉన్నట్లు వైశ్వానరుడు జాగ్రతావస్థలో స్థూల శరీరముతో మమేకం అయి ఉండును ఈ స్థితిలో దేహము వేఱు జీవుడు వేఱు గాక దేహము జీవుడు కలసియే ఉందురు. అందువలన శ్రీకృష్ణుడు కురుక్షేత్ర సంగ్రామములో భీష్ముని బాణములచే కొట్టబడి బాధను భరింపలేక సుదర్శన చక్రమును తీసుకొని భీష్మునిపైకి లంఘించినాడు. ప్రహ్లాదుడు తనతోటి బాలకులకు జీవాత్మ గుఱించి ఇటుల చెప్పెను.

| | | |
|---|---|---|
| మూల ప్రకృతి - మహత్ - అహంకారము | - | 3 |
| పంచతన్మాత్రలు - పంచభూతములు | - | 10 |
| జ్ఞానేంద్రియ కర్మేంద్రియములు | - | 10 |
| త్రిగుణములు | - | 3 |
| మనస్సు | - | 1 |
| | | 27 |

ఈ 27 యింటితో జీవాత్మ గూడి ఉండును.(భాగవతము సప్తమస్కంధము 237)



వై = సాక్షిగా హృదయగత ఆత్మ ఉండును సృష్ట్యాది యందున్న ఆత్మ బాహ్య చక్షువులకు గోచరముగాక సర్వస్థావర జంగమములలో అంతర్యామిగా ఉన్నది.

దీనినే ప్రహ్లాద చరిత్రలో కథగా స్థావరమయిన స్తంభములో ఆత్మ - నరసింహ రూపమున గలడని చెప్పబడినది.

యః+ఏవం+వేద = ఎవడు ఇలా తెలుసుకొనునో అనగా ఆత్మ సర్వత్రా వ్యాపించి ఉన్నాడని స్వానుభవంలో గ్రహించినవాడు

సర్వాన్+కామాన్ = సర్వకోరికలను

ఆప్నోతి+వా = పొందును

చ = మఱియు

ఆదిః = మానవులలో శ్రేష్ఠుడు

భవతి = అగును

*****

ఉకారము

**10. స్వప్నస్థానః తైజస ఉకారో ద్వితీయా మాత్రా ఉత్కర్షా దుభయత్వాద్ వా ఉత్కర్షతి హ వై జ్ఞాన సంతతిం సమానశ్చ భవతి నాస్యా బ్రహ్మవిత్ కులే భవతి య ఏవం వేద**

స్వప్నస్థానః - తైజసః - ఉకారః - ద్వితీయా-మాత్రా - ఉత్కర్షాత్ - ఉభయత్వాత్ - వా - ఉత్కర్షతి - హ - వై - జ్ఞాన సంతతిం - సమానః - చ - భవతి - న - అస్య - అబ్రహ్మవిత్ - కులే - భవతి - యః - ఏవం - వేద

ఓంకారము వ్యష్టిలో

ఉకారః = ఉ అనే అక్షరము

ద్వితీయా+మాత్రా = రెండవ అక్షరము

అటులనే జీవాత్మ వ్యష్టిలో

తైజసః = తైజసుడు

| | | |
|---|---|---|
| స్వప్నస్థానః | = | ఇతని స్థానము స్వప్నము. సూక్ష్మశరీరములో గల జీవునుని తైజసుడని అందురు. |
| ఉత్కర్షాత్ | = | స్థూల శరీరము కంటే సూక్ష్మ శరీరము గొప్పదగుట వలన |
| ఉభయత్వాత్ | = | స్థూల శరీరముతో జీవుడు చేసిన పుణ్యపాపముల వలన అనగా పుణ్యపాప ఫలితములు సూక్ష్మ శరీరములో నిలువ ఉండుట వలన |
| హ | = | జీవుడు దేహము వీడిన తర్వాత అనగా మరణానంతరము సూక్ష్మ శరీరముతో |
| వై | = | ఊర్ధ్వ, అధోలోకములకు పయనించి పుణ్యలోకమున పుణ్యఫలితము, నరకమున పాపఫలితము అనుభవించును. |
| వా | = | ఆ పుణ్యఫలితము క్షీణించగానే తరిగి భూలోకమున అతని కర్మానుసారము మానవునిగనో లేదా మృగపక్షి వృక్షలతా గుల్మాదులుగనో జన్మించును. అనగా పునర్జన్మకు వచ్చును. |
| యః+ఏవం+వేద | = | ఎవడు ఈ విధముగా తెలియునో వాడు |
| జ్ఞానసంతతిం | = | జ్ఞాన సంతతిని |
| ఉత్కర్షతి | = | వర్థిల్లజేయును |
| సమానః | = | జ్ఞానవంతులలో సమానుడు |
| భవతి | = | అగును |
| చ | = | మఱియు |
| అస్య+కులే | = | అతనియొక్క కులమందు |
| అబ్రహ్మవిత్ | = | బ్రహ్మజ్ఞాని కానివాడు |
| న+భవతి | = | ఉండడు. |

కర్మ - కర్మఫలితము గుఱించి భాగవతములో వ్యాసుడు ప్రాచీనబర్హి కథగా చతుర్థస్కంధములో (883 నుంచి 887) వివరించినాడు. స్థూల శరీరముతో చేసిన



కర్మయొక్క ఫలితము లింగ శరీరములో నిలువ ఉండును. ఆ కర్మ యొక్క ఫలితము వలన పుణ్య పాపములను దేహ త్యాగానంతరము అనుభవించును. ఈ విషయమునే ప్రాచీన బర్హికి నారదుని ఉపదేశముగా ఇట్లు చెప్పబడినది.

**"కర్మస్వరూపము (అపరవిద్య); విద్యాస్వరూపంబు (విద్య) ను నీవు నెఱుంగవు. కర్మనిష్ఠులగు నుపాధ్యాయులయిన వారలీ ఆత్మ తత్త్వంబునెఱుంగరు"**

కర్మానుష్ఠానమును నిష్కామకర్మతో అనుసంధానము చేసిన ఆత్మ తత్త్వంబు తెలుసుకొనుటకు ఉపకరించును. కావున పుణ్య కర్మానుష్ఠానము విషయముపై లింగశరీరమును గ్రహించి దానిని నశింప చేసిన అనగా లింగ శరీరము భంగమయిన పునరావృత్తి ఉండదు.

పూర్వదేహ కృత కర్మంబులు ఈ జన్మలో అనుభవింపబడును. అటులనే ఈ మనంబుచే పురుషులకు శుభాశుభ నిమిత్తంబులైన పూర్వ అపరదేహంబుల ప్రకాశింప చేయుచుండు. సమస్త విషయంబులు మనంబునం చేసి భోగ్యంబులగు. గత జన్మలో చేసిన కర్మలు వాసనలుగా బీజరూపమున కారణ శరీరములో నిలువ యుండి, ఈ జన్మలో సుషుప్తి నుంచి జాగ్రతావస్థకు మేలుకొలుపు చున్నవి. అప్పుడు జాగ్రతావస్థలో సుఖదుఃఖములనను భవించుచున్నాడు. అటులనే ఈ జన్మలో చేసిన కర్మఫలితములతో ఊర్ధ్వలోకమునకు చేరును. పుణ్యము క్షీణమవగా మరల జన్మించును.

ఇది కర్మ విభాగములోని గుణ దోషములు.

*****

సుషుప్తి - మకారము

**11. సుషుప్తస్థానః ప్రాజ్ఞో మకారస్తృతీయామాత్రా మితేరపీతేర్వా మినోతి హ వా ఇదం సర్వమపీతిశ్చ భవతి య ఏవం వేద**

సుషుప్తస్థానః - ప్రాజ్ఞః - మకారః - తృతీయా-మాత్రా- మితేః - అపీతేః- వా- మినోతి- హ-వా-ఇదం- సర్వం - అపీతః -చ- భవతి- యః- ఏవం-వేద.

ఓంకారము వ్యష్టిలో

మకారః = మకారము

తృతీయా+మాత్రా = మూడవ మాత్ర

అపీతః = మకారముతో ఓంకారము యొక్క మాత్రలు లయమగును

అటులనే జీవాత్మ వ్యష్టిలో

ప్రాజ్ఞః = ప్రాజ్ఞుడు

సుషుప్తిస్థానః = ఇతని స్థానము సుషుప్తి అనగా కారణశరీరము లేదా లింగశరీరము

ఇదం+సర్వం = ఇంద్రియార్థములు, అంతఃకరణ చతుష్టయము, జీవుడు అనే ఈ సర్వము

అపితః = హృదయగుహలోగల ఆత్మతో లయమగును

అపేతేః+వా = హృదయగత ఆత్మతో ఏకీభూతమగుట వలన ఈ స్థితిలో సుఖదుఃఖములు జీవుడు అనుభవించడు. కేవలము ఆనందమునే అనుభవించును. కాని కర్మవాసనలు క్షయము కానందున ఆత్మను వీడి తిరిగి జాగ్రతావస్థలో విహరించి మరల సుఖ దుఃఖములను పొందుచున్నాడు.

మితేః = జీవుడు చేసిన పుణ్యాపాప ఫలితములు ఈ శరీరములో కొలువబడి నింపబడి ఉండుటవలన

మినోతి = ఆకర్మ ఫలితములను అనుభవించుచున్నాడు.

చ = మఱియు నిష్కామకర్మ చేయుచూ

హ = అవిద్య తొలగి విద్యారూపంబున పరిణత అయి

వా = స్థూల సూక్ష్మశరీరములను రెండింటిని దహించిన జీవుడు కాష్ఠంబు లేక తేజరిల్లు అగ్ని చందంబున ఆత్మస్వరూపుడగును.

యః+ఏవం+వేద = పునర్జన్మ - జన్మ రాహిత్యములను గుఱించి ఎవడు



ఈ విధముగా తెలుసుకొనునో వాడు ఆ జీవుడు

భవతి = ఈశ్వరుడగును.

*****

సమిష్టి రూపము - ఓంకారం

**12. అమాత్రశ్చతుర్థోఽవ్యవహార్యః ప్రపంచోపశమః**
**శివోఽద్వైత ఏవమోంకార ఆత్మైవ సంవిశత్యాత్మ**
**నాత్మానం య ఏవం వేద య ఏవం వేద**

(ఇతి మాండుక్యోపనిషత్)

అమాత్రః - చతుర్థః - అవ్యవహార్యః - ప్రపంచ - ఉపశమః - శివః - అద్వైత - ఏవమ్ - ఓంకారః - ఆత్మా - ఏవ - సంవిశతి - ఆత్మనా - ఆత్మానం - యః - ఏవం - వేద - యః - ఏవం - వేద.

ఓంకారః = ఓంకారము

అమాత్రః = మాత్రలు లేనిది. ఏకము

చతుర్థః = అకార, ఉకార, మకారములనే త్రిమాత్రలుగాక వాటి సమిష్టి రూపమైనది ఆ విధముగా నాలుగవ మాత్ర

అటులనే

ఆత్మా+ ఏవ = త్రయావస్థలలో విహరించు జీవుడుగాక హృదయ గుహలో గల ఆత్మ ఆ విధాముగా నాలుగువది సృష్ట్యాదియందు ఒక్కడుగా ఉన్న ఆత్మ సృష్టిలో నాలుగు భాగములుగా విరాజిల్లుచున్నది.

సృష్ట్యాది యందున్న ఆత్మ

అవ్యవహార్యః = సృష్టితో సంబంధము లేనిది. లోక వ్యవహారములలో సంబంధము లేనిది.

ప్రపంచ ఉపశమః = లయకారకుడు

శివః = మంగళ కరుడు

| | | |
|---|---|---|
| అద్వైతః | = | ఈ దృశ్యమైన ప్రపంచమంతా తనే అయి అందులో చరించునది కూడా ఆత్మ అగుటవలన రెండవది లేనిది |
| ఏవం | = | ఆ విధముగా ఆత్మను |
| యః+ఏవం+వేద | = | ఎవడు స్వానుభవంలో గ్రహించునో |
| యః+ఏవం+వేద | | |
| ఆత్మనా+ఆత్మానం+ సం వింశతి | = | ఆత్మ ఆత్మలో ప్రవేశించును. అనగా సాధకుడు తన జీవాత్మను హృదయగత ఆత్మతో ఏకీభూతుని చేసి - దేహమును వీడి హృదయగత ఆత్మను సృష్ట్యాది యందుగల ఆత్మలో ప్రవేశించును. ఆత్మ అగును. |

ఆత్మ - జీవాత్మల గురించి, అవస్థల గురించి ఓంకారమును ఉదాహరణగా తీసికొని ఈ ఉపనిషత్తు చర్చించినది. రామాయణము, భాగవతము సహాయముననే ఈ ఉపనిషత్‌ను గ్రహించవలయును.

విశుద్ధ చక్రములోని 16 దళములే శ్రీకృష్ణుని 16వేల మంది భార్యలు. సహస్రారములోని ఎనిమిది దళములే అతని అష్ట భార్యలు. సహస్రార మధ్యగత బిందువులో గల రెండు దళములే రాధా కృష్ణులు. రాధా అనగా దీనిచే కార్యము సిద్ధించును అని అర్థము. రాధ సంసిద్ధి. కృష్ణుడనగా సర్వము చేయువాడు అని అర్థము. ఆత్మను పొందిన సర్వ కార్యములు సిద్ధించునను అర్థములో రాధాకృష్ణులని చెప్పిరి.

ఈ ఉపనిషత్‌నకు గౌడపాదుల వారు కారికను రచియించిరి.

**ఓం భద్రం కర్ణేభిః శృణు యామ దేవాః । భద్రం పశ్యేమాక్షభిర్యజత్రాః ।**
**స్థిరై రంగై స్తుష్టువాగ్ం సస్తనూభిః । వ్యశేమ దేవహితం యదాయుః ।**
**స్వస్తి న ఇంద్రో వృద్ధ శ్రవాః । స్వస్తి నః పూషా విశ్వవేదాః ।**
**స్వస్తి నస్తార్క్ష్యో౽రిష్టనేమిః । స్వస్తి నో బృహస్పతి ర్దధాతు॥**
**ఓం శాంతిః శాంతిఃశాంతిః**

*****



# ప్రశ్నోపనిషత్

**ప్రాణాయ నమో యస్య సర్వమిదం వశే**
**యో భూతః సర్వస్యేశ్వరో యస్మిన్ సర్వం ప్రతిష్ఠితం**
**(అథర్వ వేదము - 11వ కాండ, 2, 4, 5 వ అధ్యాయము సూక్తము-1)**

ఎవని యొక్క వశములో ఈ సర్వమూ అనగా దేహేంద్రియ మనో బుద్ధులు ఉన్నవో ఎవడు భూత భవిష్యత్ వర్తమానములలో గల సర్వమునకూ అనగా సర్వ ఉపాధులకూ పాలకుడో, ఎందులో సర్వమూ ప్రతిష్ఠితమై ఉన్నదో అనగా దేహేంద్రియ మనోబుద్ధుల వ్యాపారము సర్వము ఆధారపడి ఉన్నదో అట్టి ప్రాణమునకు నమస్కారము.

**ఓం భద్రం కర్ణేభిః శృణు యామ దేవాః**
**భద్రం పశ్యేమాక్షభిర్యజత్రాః**
**స్థిరై రంగై స్తుష్టువాగ్ం సస్తనూభిః**
**వ్యశేమ దేవహితం యదాయుః**
**స్వస్తి న ఇంద్రో వృద్ధ శ్రవాః**
**స్వస్తి నః పూషా విశ్వవేదాః**
**స్వస్తి నస్తార్క్ష్యోఅరిష్టనేమిః**
**స్వస్తి నో బృహస్పతి ర్దధాతు**

**ఓం శాంతిఃశాంతిఃశాంతిః**



**ఈ ఉపనిషత్‌లో సృష్టి ఎలా వచ్చినది అనే విషయముపై వివరణ**

- సృష్టి ఎలా వచ్చినది?
- ఆత్మ/ప్రాణము
- ఎవరు ఈ శరీరమును భరించుచున్నారు?
- ఎవరు ప్రకాశింపచేయుచున్నారు?
- ఎవరు శ్రేష్ఠుడు?
- ఈ శరీరములోనికి ఎలా వచ్చుచున్నది?
- తనని తను విభజించుకొని శరీరములో ఎక్కడ ఉంటున్నది?
- బాహ్య జగత్తులో ఏఏ పేర్లతో ఉంటున్నది?
- దేహ త్యాగ సమయమున దేహమును ఎలా వీడుచున్నది?
- ఎవడు నిద్రించుచున్నాడు? ఎవడు స్వప్నమును చూచుచున్నాడు?
- సుఖమును ఎవడు పొందుచున్నాడు?
- సర్వము దేనియందు ప్రతిష్ఠితమై ఉన్నది?
- ఓంకారము వలన గలుగు ఫలితము ఏమిటి?
- షోడశ కళాపురుషుడు ఎవడు?

ఆత్మ గుఱించి, ప్రాణము గుఱించి ఒకే శ్లోకములో శ్లేషగా ఇందు వర్ణింపబడినది. కావున ఆత్మ లక్షణములను, ప్రాణలక్షణములను విడివిడిగా చదవవలయును. ఈ పద్ధతినే వాల్మీకి, వ్యాసులు తమతమ రచనలలో ప్రవేశపెట్టినారు.

*****

## ప్రథమః ప్రశ్నః

**గురువు-శిష్యులు**

1. **ఓం। సుకేశా చ భారద్వాజః శైబ్యశ్చ సత్యకామః సౌర్యాయణీ చ గార్గ్యః కౌసల్యశ్చాశ్వలాయనో భార్గవో వైదర్భిః కబన్ధీ కాత్యాయన స్తేహైతే బ్రహ్మపరాబ్రహ్మనిష్ఠాః పరంబ్రహ్మాన్వేషమాణా ఏష హ వై తత్సర్వం వక్ష్యతీతి తే హ సమిత్పాణయో భగవన్తం పిప్పలాదముపసన్నాః ॥**

ఓం - సుకేశాః - చ - భారద్వాజః - శైబ్యః - చ - సత్యకామః - సౌర్యాయణీ - చ - గార్గ్యః - కౌసల్యః - చ - అశ్వలాయనః - భార్గవః - వైదర్భిః - కబన్ధీ - కాత్యాయనః - తే - హ - ఏతే - బ్రహ్మపరాః - బ్రహ్మనిష్ఠాః - పరంబ్రహ్మ - అన్వేషమాణాః - ఏషః - హ - వై - తత్ - సర్వం - వక్ష్యతి - ఇతి - తే - హ - సమిత్పాణయః - భగవన్తమ్ - పిప్పలాదం - ఉపసన్నాః

| | | |
|---|---|---|
| ఓం | = | ఓం. అక్షర పరబ్రహ్మను ధ్యానించి గురువగు పిప్పలాదుడు యీ ఉపనిషత్‌ను చెప్పప్రారంభించెను. |
| కాత్యాయనః+కబన్ధీ | = | కత్య యొక్క ముని మనుమడగు కబన్ధీ |
| వైదర్భిః+ భార్గవః+చ | = | విదర్భదేశస్థుడయిన భృగువంశజుడు (ఇతని పేరు చెప్పలేదు) |
| అశ్వలాయనః+కౌసల్యః | = | అశ్వలుని కుమారుడు అయిన కౌసల్యుడు |
| గార్గ్యః+సౌర్యాయణీ+ (సౌర్యాయణిః)+చ | = | సూర్యుని కుమారుడు సౌర్యుడు - సౌర్యుని కుమారుడు - సౌర్యాయణి (సౌర్యాయణీ అన్నది వేద పద ప్రయోగం) గార్గ్య వంశస్థుడగు సూర్యుని మనుమడు (ఇతని పేరు చెప్పలేదు). |
| శైబ్యః+సత్యకామః+చ | = | శిబికుమారుడు అగు సత్యకాముడు |
| భారద్వాజః+సుకేశాః+చ | = | భరద్వాజుని కుమారుడగు సుకేశుడు |
| బ్రహ్మనిష్ఠాః+బ్రహ్మ పరాః+ఏతే+తే+హ | = | బ్రహ్మనిష్ఠులు, నిష్కామ కర్మపరులు, బ్రహ్మ పరాయణులయిన వీరందఱు |



| | | |
|---|---|---|
| పరంబ్రహ్మ+ అన్వేషమాణాః | = | పరబ్రహ్మను అన్వేషించుచూ అనగా ఆత్మ తత్త్వము చెప్పగల గురుబ్రహ్మ- గురుః విష్ణుః గురుదేవో మహేశ్వరః అనిచెప్పిన గురువును అన్వేషించుచూ బ్రహ్మ విద్యను తెలుసుకొనగోరి |
| ఏషః+హ+వై+తత్+ సర్వం+వక్ష్యతి+ఇతి | = | ఈ మహానుభావుడు ఆత్మతత్త్వము గుఱించి, సృష్టి గుఱించి, ప్రాణము గుఱించి, త్రయావస్థల గుఱించి సర్వము చెప్పగలడని |
| భగవంతం+పిప్పలాదం | = | భగవత్స్వరూపుడయిన గురువగు పిప్పలాదుని |
| తే+సమిత్పాణయః+హ | = | శిష్యులు గురువును చేరు విధి విధానముగా, వారు చేతులలో దర్భలు ధరియించి వినయముగా గురువును |
| ఉపసన్నాః | = | ఆశ్రయించిరి |

*****

2. **తాన్ హ స ఋషి రువాచ భూయ ఏవ తపసా బ్రహ్మచర్యేణ శ్రద్ధయా సంవత్సరం సంవత్స్యథ యథాకామం ప్రశ్నాన్ పృచ్ఛత యది విజ్ఞాస్యామః సర్వం హ వో వక్ష్యామ ఇతి ॥**

తాన్ - హ - సః - ఋషిః - ఉవాచ - భూయః - ఏవ - తపసా - బ్రహ్మచర్యేణ - శ్రద్ధయా - సంవత్సరం - సంవత్స్యథ - యథా కామం - ప్రశ్నాన్ - పృచ్ఛత - యది - విజ్ఞాస్యామః - సర్వం - హ - వః - వక్ష్యామః - ఇతి

| | | |
|---|---|---|
| భూయః+ఏవ+హ | = | ఇంతకు పూర్వం మీరు వేద వేదాంగములు చదివి, అందు చెప్పిన అపరవిద్యను అనగా విధివిహితముగా పుణ్యకర్మలు, సదాచారములు పాటించినారు. నిష్కామ పుణ్యకర్మానుష్ఠానం చేసినారు. కావున పరవిద్య నేర్చుకొనుటకు మరల |
| శ్రద్ధయా+బ్రహ్మచర్యేణ+ | = | (శ్రద్ధాభక్తి ధ్యాన యోగాత్ అని కైవల్య 2లో |

| | | |
|---|---|---|
| తపసా | | బ్రహ్మ అశ్వలాయననునికి ఆత్మతత్వమును గ్రహించవలయునని ఉపదేశించినాడు. అదే ఇందు ఈ విధముగా చెప్పబడినది.) మీరు శ్రద్ధతో, బ్రహ్మచర్యముతో, తపస్సుతో |
| సంవత్సరం+సంవత్స్యథ | = | మా ఆశ్రమంలో సంవత్సరకాలం గడపండి (ఇదే శ్రీకృష్ణుడు గీతలో గురువును సేవించి పరిప్రశ్నేన అని చెప్పినాడు) |
| యధాకామం+ప్రశ్నాన్+ పృచ్ఛత (పృచ్ఛథ) | = | శ్రద్ధ, బ్రహ్మచర్యము, తపస్సు చేసి పరవిద్యను గ్రహించుటకు అర్హతలు సంపాదించి ఆపై ఆత్మ గురించి ఎవరెవరు ఏమి ఏమి తెలుసుకొన వలయునని అనుకొనుచున్నారో ఆ విషయమును గురించి మీరు ప్రశ్నలు అడగండి. |
| యది+విజ్ఞాస్యామః | = | ఆ ప్రశ్నలకు సంబంధించిన సమాధానములు మాకు ఒకవేళ తెలిసినచో (ఇది గురువు యొక్క నిరహంకారమును సూచించును) |
| వః | = | మీకు |
| సర్వం+హ+వక్ష్యామః+ | = | ప్రాణము గురించి, ఆత్మ గురించి సర్వము స్వానుభవంలో |
| ఇతి | | గ్రహించినది ఉపదేశించగలమని |
| సః+ఋషిః | = | ఋషియగు పిప్పలాదుడు |
| తాన్ | = | వారికి |
| ఉవాచ | = | చెప్పెను. |

పరవిద్య నేర్చుకోవాలనుకునే శిష్యుడు - ముందుగా పుణ్య కర్మానుష్ఠానము చేసి, ఆ పుణ్యకర్మానుష్ఠానము వలన గలుగు ఫలితమును అందలి దోషములను గ్రహించి నిర్వేదము పొందవలయును. ఆపై బ్రహ్మ విద్యను ఉపదేశించగల గురువును అన్వేషించవలయును.



యోగ్యుడయిన శిష్యుని వద్దకు జగద్గురువు ఆదేశమున శిష్యుని యొక్క స్వగురువు వచ్చును.

దృష్టాంతములు :- 1. రామాయణంలో వాల్మీకి వద్దకు నారదుడు వచ్చెను. పరీక్షిత్తు వద్దకు శుక బ్రహ్మ వచ్చెను.
వాల్మీకి అర్హతలు :- తపస్వీ వాల్మీకిః = వాల్మీకి తపశ్శాలి. ఇది శిష్యుని అర్హత

**నారద మహర్షి:**

**తపః స్వాధ్యాయనిరతం వాగ్విదాం వరమ్ మునిపుంగవమ్** - ఇది గురువు యొక్క అర్హత

మునిపుంగవుడు అనగా జితేంద్రియుడు, సాధ్యాయము నిరంతరము చేయువాడు. తపస్వీ, శిష్యులకు విద్యను బోధించుటలో శ్రేష్ఠుడు. అట్టి గురువును

| | | |
|---|---|---|
| పరిప్రపచ్ఛ | = | సేవించి వినయముగా ఇట్లు ప్రశ్నించెను. |

**మహర్షే త్వం సమర్థోఽసి జ్ఞాతు మేవం విధం నరమ్**

| | | |
|---|---|---|
| నరమ్ | = | పరమ పురుషుని - ఆత్మను (నరమ్) అనగా నృణంతి నయంతి సర్వం స్వవశమితి -। నృనయే - అన్నియు తనవశమునందు ఉంచుకొనువాడు. |
| ఏవం విధం జ్ఞాతుమ్ | = | ఏ విధముగా గ్రహించవలయునో ఆ విధముగా వివరించుటకు |
| మహర్షే+త్వం | = | ఓనారద మహర్షీ నీవు |
| సమర్థః+అసి | = | సమర్థుడవు, ఆత్మ దర్శనము చేసిన మహాను భావుడవు |

కావున పరవిద్య అయిన ఆత్మ దర్శనమును చేయు విధి విధానమును నాకు ఉపదేశింపుము అని వాల్మీకి నారద మహర్షిని ప్రార్థించ- జీవాత్మయగు రామునిని వర్ణించి-ఆ రాముడు శ్రీరాముడై అయోధ్యాధిపతి యగు విధానమును అనగా ఆత్మయగు విధివిధానమును వాల్మీకికి అర్థమగునట్లు శ్లేషగా - యిటు జీవపరముగా అటు ఆత్మపరముగా రామ కథను చెప్పినాడు.

ఆ విషయము గురుముఖతావిని వాల్మీకి యోగారూఢులకు బాలకాండను రచియించినాడు. మిగిలిన సాధకులకు అయోధ్యాకాండనుంచి యుద్ధకాండవఱకు పరవిద్యను బోధించినాడు. కర్మానుష్ఠానము తప్పనిసరి కావున సందర్భానుసారము అపరవిద్యను బోధించినాడు. అపరవిద్య, పరవిద్యల సమ్మేళనము రామాయణము.

2. భాగవతంలో పరీక్షిత్ వద్దకు శుకబ్రహ్మ వచ్చెను.

**పరీక్షిత్తుని అర్హతలు :** (ఇవి శిష్యునికి ఉండవలసిన అర్హతలు)
ప్రారంభములో రోషము, దర్పము, మదము మొదలయిన అసుర లక్షణములు గల రాజగర్వము గలవాడు. శమీకుని భుజముపై చనిపోయిన పామును వేసి తన కోపమును చూపెను. అనగా మామూలు జీవుడు. ఇతడు కలిని నిగ్రహించి అనగా ధర్మపరుడై కృపాచార్యుడు గురువుగా మూడు అశ్వమేధ యాగములు చేసెను-పుణ్యకర్మానుష్ఠానము చేసెను. ఆ పై ధర్మార్థకామంబులు నిరసించి భూలోక స్వర్గలోక భోగంబులు హేయంబులని తలచి-అనగా నిర్వేదముపొంది-ధర్మార్థ కామంబులు సన్న్యసించి రాజ్యంబు విసర్జించి, సుతులు, హితులు, చుట్టాలు, ఇల్లాలు, బహుబలములు అనగా సైన్యమును ధనము, సర్వము విడచి మృత్యుభయము నిరసించి

స్థలము - గంగా తరంగిణీ దక్షిణకూలంబున
ఆసనము - దర్భాసనమున, ఉత్తరాభిముఖుడై ప్రాయోపవేశము చేసి
ప్రత్యాహారము - మౌనియై, చిత్తము గోవిందునిపై నిలిపి
ధ్యానము - పురుషోత్తమునందు చిత్తమునిల్పి రాజు హృదయమిడియె రాజీవ నయునుపై. (శిష్యునికి ఉండవలసిన లక్షణములను పరీక్షిత్ పరముగా విపుల వ్యాఖ్యానము భాగవతమున వ్యాసుడు రచియించినాడు.)

ఇట్టి యోగ్యత గల శిష్యునికి గురువు పరవిద్యను బోధించును.



**శుకబ్రహ్మ లక్షణములు (గురువుకు ఉండవలసిన అర్హతలు)**

శుక బ్రహ్మ:

1. సన్న్యాసి = ధర్మార్థకామములను వదలినవాడు
2. తపోధన్యాగ్రణి = తపోధనులలో శ్రేష్ఠుడు.
3. ధీమణి = పరవిద్య తెలిసినవాడు
4. ముక్తకర్మచయుడు= కర్మ బంధములనుంచి విముక్తుడు.
5. నిరస్త ఖేదుండు = దుఃఖరహితుడు-శోకమోహములు లేనివాడు
6. మాయా శయనంబు= మాయను గూర్చి తెలిసినవాడు. సృష్ట్యాది తెలిసినవాడు యందు గల ఆత్మయే మాయను చేబూని సర్వవిశ్వముగా విస్తరిల్లినదని తెలిసినవాడు.
7. సమదర్శనుండు = స్త్రీ పురుషులనే భేద దృష్టి లేక తన యందు అఖిల భూతములందు ఉపాధిని గాక ఆత్మను దర్శించుట వలన సమదర్శనుడు.
8. మహాయోగి = యోగారూఢుడు
9. ఏకాంతమతి = ఆత్మ యందే తను ఉండి ఆత్మతో క్రీడించువాడు, ఆత్మతో రమించువాడు, ఉన్మత్తుని క్రియ, మూగ తెఱంగున, జడుని భంగి ఉండును. తనే ఆత్మ. అతనిని శుకబ్రహ్మ యని సామాన్యులు గుర్తించ లేరు.
10. గూఢుండు = అనగా గూఢవర్తనుడై గురువు యుండును

ఇట్లు భాగవతమున నారదుడు, వ్యాసభగవానుడు, శుకబ్రహ్మ, సూతమహర్షి శౌనకాదుల పరంగా గురువు లక్షణములు-శిష్యుని లక్షణములు చెప్పబడినవి.కావున పరవిద్య నేర్చుకొనుటకు వాల్మీకివలె, పరీక్షిత్తునివలె అర్హతలు మొదట సంపాదించి ఆపై నారదమహర్షి, శుకబ్రహ్మల వంటి గురువులను ఆశ్రయించి పరవిద్యగా చెప్పబడే ఆత్మవిద్యను బ్రహ్మవిద్యను తెలుసుకొని ఆచరించవలయును. అశ్వలాయనుడు గురువుకు ఉండవలసిన లక్షణములు గలవాడు. ఆత్మ దర్శనము చేసినవాడు. ఆఱుగురు శిష్యులు యోగ్యులు.

*****

సంవత్సరకాలము శ్రద్ధ, బ్రహ్మచర్యము తపస్సు చేసి పరవిద్య గ్రహించుటకు అర్హత సంపాదించిన తర్వాత

కబన్ధీ యొక్క ప్రశ్న:- ఈ ప్రజలు ఎట్లు జన్మించిరి?

**3. అథ కబన్ధీ కాత్యాయన ఉపేత్య పప్రచ్ఛ భగవన్ కుతో హ వా ఇమాః ప్రజాః ప్రజాయన్త ఇతి ॥**

అథ - కబన్ధీ - కాత్యాయనః - ఉపేత్య - పప్రచ్ఛ - భగవన్ - కుతః - హ - వా - ఇమాః - ప్రజాః - ప్రజాయన్త (ప్రజాయంతే) - ఇతి.

| | | |
|---|---|---|
| అథ | = | పర విద్యను పొందు అర్హతలు సంపాదించిన పిమ్మట జిజ్ఞాసువై |
| కాత్యాయనః+కబన్ధీ | = | కత్య యొక్క మునిమనుమడగు కబన్ధీ- అనే అతడు |
| ఉపేత్య | = | గురువును సమీపించి |
| భగవన్ | = | ఓ గురువుగారూ! |
| కుతః+ఇమాః+ | = | దేని నుంచి, దేని వలన ఈ ప్రజలు జన్మించిరి. |
| ప్రజాః (ప్రజాయన్తే) | | దేని వలన అభివృద్ధి పొందుచున్నారు? |
| ప్రజాయన్త+ఇతి+హ+వా | | ఎందులయమగుచున్నారు. అని |
| పప్రచ్ఛ | = | అడిగెను |

అంత గురువు శిష్యుని ప్రశ్నకు అనేక అనుబంధ ప్రశ్నలు వేసుకొని ఈ (సృష్టి) ప్రజలు ఎలా వచ్చిరి? - ఎలా అభివృద్ధి పొందినది? ఎలా లయమగును? ఉత్తరాయణము-దక్షిణాయనములలో పయనించే జీవుడు ఎక్కడకు చేరుకొనును? ఏది పునరావృత్తి? ఏది పునరావృత్తి రహితము? ఆ ప్రశ్నలన్నింటికి సమాధానము చెప్పుచున్నాడు.

పిప్పలాదుని సమాధానము - సృష్టి - సృష్టి అభివృద్ధి

**4. తస్మై సహోవాచ ప్రజాకామో వై ప్రజాపతిః స తపోఽతప్యత స తపస్తప్త్వా స మిథున ముత్పాదయంతే రయిం చ ప్రాణం చేత్యేతౌ మే బహుధా ప్రజాః కరిష్యత ఇతి ॥**



తస్మై - సః - హ - ఉవాచ - ప్రజాకామః - వై - ప్రజాపతిః - సః - తపః - అతప్యత - సః - తపః - తప్త్వా - సః - మిథునమ్ - ఉత్పాదయంతే - రయిం - చ - ప్రాణం - చ - ఇతి - ఏతౌ - మే - బహుధా - ప్రజాః - కరిష్యతః - ఇతి.

| | | |
|---|---|---|
| తస్మై | = | కబంధుని కొఱకు |
| సః+హ+ఉవాచ | = | పిప్పలాదుడు, కబంధుడు అడిగిన ప్రశ్నకు సమాధానముతో పాటు అనేక విషయములను చెప్పెను. |

**సృష్టి ఎలా వచ్చినదో - ఉపదేశించుచున్నాడు.** విరాట్పురుషుని వలన ఈ ప్రజలు జన్మించిరి. అతడు స్త్రీపురుషులను సృజియించెను. వారి వలన ప్రజలు కలిగిరి. మిథున ధర్మ సృష్టిని చెప్పుచున్నాడు.

| | | |
|---|---|---|
| సః+ప్రజాపతిః | = | సృష్టి చేయుటకు ముందు అనగా సృష్ట్యాదియందు గల ఆత్మ- పురుషుడు- విరాట్పురుషుడు |
| ప్రజాకామః+వై | = | ప్రజలను అనగా చరాచర జగత్తును సృష్టిచేయ |
| తపః+అతప్యత | = | తపస్సుచేసెను. అనగా సంకల్పించెను |
| సః | = | ఆ సృష్టికర్త -విరాట్పురుషుడు |
| తపః | = | తపస్సు |
| తప్త్వా | = | చేసి అనగా సంకల్పించి |
| సః | = | అతడు-ప్రకృతిని అధిష్ఠించి చరాచర జగత్తును సృజియించెను. |
| మిథునమ్ | = | స్త్రీ పురుషులను |
| ఉత్పాదయంతే | = | సృజియించెను. |
| ఏతౌ+ఇతి | = | ఈ స్త్రీ, పురుషుల వలన |
| మే | = | నా యొక్క సృష్టి అనగా |
| బహుధా+ప్రజాః | = | అనేకమంది ప్రజలు |
| కరిష్యతః+ఇతి | = | కలుగుదురు. అని తలంచెను. ఈస్త్రీపురుషులు అనేకమంది ప్రజలను పుట్టింతురని తలచెను. |

రయిం+చ = శరీరపోషణకు అన్నమును

ప్రాణం+చ = ఉపాధులు నశించకుండా ఉండుటకు ప్రాణమును సృజియించెను

ఆ ఉపాధులు పని చేయుటకు ప్రాణము, ఉపాధుల అభివృద్ధికి అన్నమును సృజియించెను. సృష్టి చేయునపుడు స్థావరముల సృష్టి ఎలా ఉన్నదో ఆతర్వాత కూడా అలాగే ఉన్నది. జంగమముల సృష్టి అభివృద్ధి అయినది.

సృష్టి అభివృద్ధి అన్నము వలన కలిగినది

వేడి, వెలుతురు, నీరు- వీటి వలన ఓషధులు గలిగినవి. తద్వారా ఆహారము గలిగినది. దాని వలన వీర్యము గలిగినది. ఆ వీర్యము వలన ఉపాధి గలిగినది. ఆహారము వలన ప్రాణము, మనస్సు తేజోవంతమగును. ఆ ప్రాణము ఉపాధిలో సంచరించుట వలన ఉపాధి చైతన్యవంతమై చరించును.

*****

5. ఆదిత్యో హ వై ప్రాణో రయి రేవ చంద్రమా రయిర్వా
ఏతత్సర్వం యన్మూర్తం చా మూర్తం చ తస్మాన్మూర్తి రేవరయిః ॥

ఆదిత్యః - హ - వై - ప్రాణః - రయిః - ఏవ - చంద్రమాః - రయిః - వా - ఏతత్ - సర్వం - యత్ - మూర్తం - చ - అమూర్తం - చ - తస్మాత్ - మూర్తిః - ఏవ - రయిః

సృష్టిచేసినది అతడే. సర్వసృష్టి అతడే.

యత్ = ఏవి అనగా

మూర్తం+చ = కంటికి కనిపించునవి

అమూర్తం+చ+ ఏతత్+హ+వై+సర్వం = కంటికి కనిపించనివి (సూక్ష్మజీవులు) స్థావర జంగమములు, లోకములు, లోకపాలురు ఈ సర్వము, అనగా సృష్టి సర్వము సృష్టికారకుడైన విరాట్ పురుషునివలననే గలిగినది. అతడు ప్రాణులను స్త్రీపురుష భేదముగా సృజియించినాడు.



తస్మాత్ = అందువలన స్త్రీ పురుషుల వలనను సృష్టిగలిగినది.

ఆదిత్యః = ఆదిత్యుడు

ప్రాణః = ప్రాణము.

చంద్రమాః+ఏవ+రయిః = చంద్రుడు అన్నము

రయిః+ఏవ+మూర్తిః = అన్నము ఘన పదార్థము. అనగా రూపము గలది.

రయిః+వా = అన్నము వలన వీర్యము గలిగినది. ఆ వీర్యము వలన సృష్టి అభివృద్ధి అగుచున్నది. ప్రాణము వలన ఉపాధి పనిచేయుచున్నది.

సృష్టిలో

| ఆహారము కావలసినవి | | ఆహారము అవసరములేనివి |
|---|---|---|
| స్థావరములు | జంగమములు | 1. కొండలు, నదులు, వగైరాలు |
| 1. చెట్లు | గగన చరములు | 2. భావములు వగైరాలు |
| 2. లతలు | 1. దేవతలు, 2. రాక్షసులు | |
| 3. ఓషధులు | భూచరములు | |
| | 3. మానవులు, 4. పశువులు | |
| | 5. పక్షులు - ఆకాశమున విహరించునవి | |
| | 6. జలచరములు వగైరాలు | |

ఆత్మ వలన దేహేంద్రియ మనోబుద్ధులు పనిచేయుచున్నవి. ఆత్మయే బాహ్య జగత్తులో ఆదిత్యుడు. ఆత్మ వలన దేహము, ఆదిత్యుని వలన జగత్తు ప్రకాశించుచున్నవి.

*****

ఆత్మ లేక ఆదిత్యునిని అధ్యాత్మం, అధి దైవికం, అధి భౌతికంగా వివరించు చున్నాడు. ఇప్పుడు అధిభౌతికంగా సూర్యుని గురించి చెప్పుచున్నాడు. అధ్యాత్మముగా ఆత్మ. అధిదైవికముగా సర్వదేవతారూపుడు. బాహ్యముగా వాయుస్వరూపుడు. అనగా ప్రాణము.

6. **అథాదిత్య ఉదయన్ యత్ ప్రాచీం దిశం ప్రవిశతి తేన ప్రాచ్యాన్ ప్రాణాన్ రశ్మిషు సన్నిధత్తే యద్దక్షిణాం యత్ ప్రతీచీం యదుదీచీం యదధో య దూర్ధ్వం యదంతరాదిశో యత్సర్వం ప్రకాశయతి తేన సర్వాన్ ప్రాణాన్ రశ్మిషు సన్నిధత్తే.** ॥

అథ - ఆదిత్యః - ఉదయన్ - యత్ - ప్రాచీం - దిశం - ప్రవిశతి - తేన - ప్రాచ్యాన్ - ప్రాణాన్ - రశ్మిషు - సన్నిధత్తే - యత్ - దక్షిణాం - యత్ - ప్రతీచీం - యత్ - ఉదీచీం - యత్ - అధః - యత్ - ఊర్ధ్వం - యత్ - అంతరాదిశః - యత్ - సర్వం - ప్రకాశయతి - తేన - సర్వాన్ - ప్రాణాన్ - రశ్మిషు - సన్నిధత్తే.

| | | |
|---|---|---|
| అథ | = | అలా నీకు సృష్టి గురించి చెప్పిన తర్వాత ఇప్పుడు అధిభౌతికంగా సూర్యుని గురించి విపులీకరించు చున్నాను. |
| యత్ | = | ఎప్పుడు |
| ఆదిత్యః+ఉదయన్ | = | సూర్యుడు ఉదయించి |
| ప్రాచీం+దిశం+ప్రవిశతి | = | తూర్పుదిక్కున ప్రవేశించునో అప్పుడు ఆ దిక్కును ప్రకాశింపచేయును. చీకటి నశించి వెలుగు గలుగును. సూర్యుని చేత తూర్పుదిక్కున గల జీవుల ప్రాణములను తన కిరణములలో ధరించును. అనగా ఆ దిక్కులలో సూర్యకాంతి వలన చీకటి పోవును. అటులనే ఆ దిక్కున గల సర్వ జీవరాసులు చైతన్యవంతులై సర్వ కార్యములు చేయుదురు. అటులనే |
| తేన | = | అప్పుడు ఆ సూర్యుని చేత |
| ప్రాచ్యాన్+ప్రాణాన్ | = | తూర్పుదిక్కునందలి ప్రాణములను |
| రశ్మిషు | = | తన కిరణములయందు |
| సన్నిధత్తే | = | ధరించుచున్నాడు - అటులనే |
| యత్+దక్షిణాం | = | ఎప్పుడు దక్షిణదిశ |
| యత్+ప్రతీచీం | = | పడమర దిశ |
| యత్+ఉదీచీం | = | ఉత్తర దిశ |
| యత్+అధః | = | క్రింద |
| యత్+ఊర్ధ్వం | = | పైన |
| యత్+అంతరాదిశః | = | మూలలు |
| యత్+సర్వం | = | ఇలాసర్వమును భూమండలమునంతను |
| ప్రకాశయతి | = | ప్రకాశింపజేయునో - అప్పుడు |
| తేన | = | ఆ సూర్యుని చేత |
| సర్వాన్+ప్రాణాన్ | = | అన్ని దిక్కులయందు అనగా సర్వత్రాగల ప్రాణములను తన |
| రశ్మిషు | = | కిరణములందు |
| సన్నిధత్తే | = | ధరించును. |

సూర్యుడు ఏ దిక్కున అనగా ఏ ప్రదేశములలో ప్రకాశించునో ఆ దిక్కున వృక్షములలో కిరణ జన్య సంయోగక్రియ జరిగి ఆహారము గలుగును. ఆ ఆహారము తినుట వలన జీవరాసులలో బలము, తేజము, ఉత్సాహము గలిగి జీవులు చైతన్యవంతులై సర్వకార్యములు చేయుదురు. దేహము ప్రాణము వలన చైతన్య వంతమగును. దేహమునకు నాభి మధ్యప్రదేశము. ఇదే కిష్కింధ. నాభికి దిగువభాగము దక్షిణము. నాభికి ఎగువభాగము ఉత్తరము. హృదయము గల భాగము తూర్పు. వెన్నుభాగము పడమర. ఈ దేహమంతా నాడులు వ్యాపించి ఉన్నవి. ఈ విషయమునే సీతాన్వేషణ సందర్భమున భూమిని వానరులు తిరిగినట్లు చెప్పబడినది. ఇచ్చట భూమి అనగా దేహము.

*****

7. స ఏష వైశ్వానరో విశ్వరూపః ప్రాణోఽగ్ని రుదయతే తదేతదృచా భ్యుక్తం ॥
స: - ఏషః - వైశ్వానరః - విశ్వరూపః - ప్రాణః - అగ్నిః - ఉదయతే - తత్ - ఏతత్ - ఋచా - అభ్యుక్తం

**అధ్యాత్మంగా చెప్పినచో సృష్ట్యాది యందు గల విరాట్పురుషుడు.** సృష్టి అంతా అతడే. కావున

విశ్వరూపః = విశ్వరూపుడు

**అధి దైవికంగా చెప్పినచో**

వైశ్వానరః+అగ్నిః = వైశ్వానరుడు అనే అగ్ని

సః+ఏషః+ప్రాణః = అతడే ఉపాధిలో చరించే ప్రాణము

**అధి భౌతికంగా చెప్పినచో**

ఉదయతే = ప్రతి దినము తూర్పున ఉదయించును. కాంతిని ప్రసరించును

తత్+ఏతత్+ఋచా+అభ్యుక్తం = ఈ విధముగా ఆ సూర్యుని గురించి అధ్యాత్మ అధిదైవిక అది భౌతికముగా వర్ణింపబడినది.

*****

8. **విశ్వరూపం హరిణం జాతవేదసం పరాయణం జ్యోతి రేకం తపంతం ।**
**సహస్ర రశ్మిః శతథా వర్తమానః ప్రాణః ప్రజానాముదయత్యేష సూర్యః ॥**

విశ్వరూపం - హరిణం - జాతవేదసం - పరాయణం - జ్యోతిః - ఏకం - తపంతం - సహస్రరశ్మిః - శతథావర్తమానః - ప్రాణః - ప్రజానామ్ - ఉదయతి -ఏషః - సూర్యః

**అధ్యాత్మంగా:-** (ఆత్మ గురించి)

ఏకం = సృష్ట్యాది యందు ఒక్కడును

విశ్వరూపం = సృష్టిలో సర్వము. కావున విశ్వరూపుడును

జాతవేదసం = భూత భవిష్యత్ వర్తమానములలోని సృష్టి సర్వము తెలిసినవాడును

పరాయణం = సకల జీవులకు గమ్యస్థానమైనవాడును అయిన ఆదిత్యుడు

జ్యోతిః = స్వయంజ్యోతి

**అధి దైవికం:-**

ఏషః+ ప్రజానాం+ప్రాణః= ఉపాధులలో ప్రాణము

**అధి భౌతికం:-**

ఏషః+సూర్యః = ఈ సూర్యుడు

తపంతం = వేడిని యిచ్చువాడును

హరిణం = కిరణములు గలవాడును అయిన సూర్యుడు

సహస్రరశ్మిః = అసంఖ్యాకమైన కిరణములు గలవాడు,

ఉదయతి = తూర్పున ఉదయించును ఆకాశమున చరించి వెలుగును ప్రసాదించును.

శతథావర్తమానః = ఉత్తరాయణము దక్షిణాయనమని, ఋతువులని - ఇలా కాలస్వరూపమును విభజించి అనేక కిరణములు గలిగి జగత్‌లో చరించుచున్నాడు. అధిదైవికముగా పుణ్య కర్మానుష్ఠానపరులు బ్రహ్మ లోకమునకు చేరు ఉత్తరాయణ, దక్షిణాయన **మార్గములను** ఏర్పరచు చున్నాడు. అధి భౌతికముగా ఉత్తరాయణము, దక్షిణాయనములుగా **కాలమును** విభజించుచున్నాడు.

| అధి భౌతికమయి సూర్యుడు | | అది దైవికమయిన సూర్యుడు | |
|---|---|---|---|
| దక్షిణాయనము | ఉత్తరాయణము | దక్షిణాయనము | ఉత్తరాయణము |
| ఇవి కాలమునకు సంబంధించినవి. | | ఇవి మార్గములకు సంబంధించినవి | |

*****

పుణ్యాకర్మల వలన గలుగు ఉత్తరాయణ - దక్షిణాయన మార్గములు

9. **సంవత్సరో వై ప్రజాపతిః తస్యాయనే దక్షిణం చోత్తరం చ తద్యేహ వై తదిష్టాపూర్తే కృతమిత్యుపాసతే తే చాంద్రమసమేవ లోకమభిజయంతే త ఏవ పునరావర్తంతే తస్మాదేత ఋషయః ప్రజాకామా దక్షిణం ప్రతి పద్యంతే ఏష హ వై రయిర్యః పితృయాణః ॥**

సంవత్సరః - వై - ప్రజాపతిః - తస్య - అయనే - దక్షిణం - చ - ఉత్తరం - చ - తత్ - యే - హ - వై - తత్ - ఇష్టాపూర్తే - కృతమ్ - ఇతి - ఉపాసతే - తే - చాంద్రమసం - ఏవ - లోకమ్ - అభిజయంతే - త (తే) - ఏవ - పునః - ఆవర్తంతే - తస్మాత్ - ఏత (ఏతే) - ఋషయః - ప్రజాకామాః - దక్షిణం - ప్రతిపద్యంతే - ఏషః - హ - వై - రయిః - యః - పితృయాణః

| | | |
|---|---|---|
| సంవత్సరః+వై+ ప్రజాపతిః | = | సంవత్సరమే అనగా కాలము ప్రజాపతి. కాలము గణించునప్పుడు కాల గణనమున సంవత్సరము. ఆధ్యాత్మికంగా సృష్టికర్త అయిన పురుషుడే కాలము. సృష్టికర్త అయిన పురుషుడే కాల స్వరూపమున లయము చేయుచున్నాడు. అప్పుడు ఇతడు కాలుడు. సూర్యుడు పగలు, రాత్రి అని కాల భేదమును చేయు చున్నాడు. |
| తస్య | = | జీవునియొక్క కర్మానుసారము అనగా |
| దక్షిణం +ఆయనే+చ+ ఉత్తరం+చ+ యే+హ+వై+తత్ | = | పుణ్యకర్మానుష్ఠాన పరులకు దక్షిణాయన మార్గము, మఱియు ఉత్తరాయణ మార్గములు యోగనిష్ఠా పరులకు బ్రహ్మలోకమున శాశ్వత నివాసము, బ్రహ్మలో ఏకీభూతమయి బ్రహ్మయై విరాజిల్లుటకు జ్యోతిర్మార్గము ఏర్పరచబడినవి. |
| ఇష్టాపూర్తే+ కృతమ్+ఇతి+ తత్ + ఉపాసతే+తే | = | యజ్ఞయాగాదులు అగ్నిహోత్రము మొదలైన విధులు అనే ఇష్టాపూర్తములు; మొదలయిన పుణ్యకర్మానుష్ఠానమును ఆ పరమ పురుషుని ఉపాసించెదరో ఆ పుణ్యఫలితమును కోరి బ్రహ్మలోకము చేరి కృతార్థులమయితిమి అని |
| ఏవ+లోకమ్+ అభిజయంతే+ త(తే)+ఏవ+ పునః+ఆవర్తంతే+ | = | భావించిన వారు బ్రహ్మలోకమునే చేరుదురు. వారు పుణ్యఫలితము క్షీణించగాతిరిగి భూలోకమున జన్మించెదరు. (వీరు మూర్ఖులు.) |



| | | |
|---|---|---|
| ప్రజాకామాః+ దక్షిణం+ ప్రతిపద్యంతే | | పుణ్య ఫలితమును గోరిన కామ్యపరులైన వారు పునరావృత్తి మార్గమయిన దక్షిణాయన మార్గమును పొందుదురు. |
| యః+పితృయాణః | = | ఏది దక్షిణాయన మార్గమని చెప్పబడునో అది పితృయానము. |
| ఏషః+రయిః+ చాంద్రమసం+ హ+వై | = | ఇదే చంద్రయానము. ఆ పుణ్యఫలితము కోరినవారు చంద్రయానమార్గమున ప్రయాణించి తిరిగి భూలోకమున జన్మించెదరు. ఉత్తరాయణ మార్గమున పయనించిన వారు అధికార పురుషులగుదురు. |
| తస్మాత్+ఏత(ఏతే)+ ఋషయః | = | అందువలన యీ ఋషులు దక్షిణాయనము - ఉత్తరాయణములనే మార్గములలో ప్రయాణించక జ్యోతిర్మార్గమున ఆత్మస్థానమును చేరుకొందురు. |

*****

ఉత్తరాయణము

10. **అథోత్తరేణ తపసా బ్రహ్మచర్యేణ శ్రద్ధయా విద్యయాఽఽత్మాన మన్విష్యాదిత్యమభిజయంతే ఏతద్వై ప్రాణానామాయతనమేతదమృత మభయ మేతత్ పరాయణమే తస్మాన్న పునరా వర్తంత ఇత్యేష నిరోధః తదేష శ్లోకః ॥**

అథ - ఉత్తరేణ - తపసా - బ్రహ్మచర్యేణ - శ్రద్ధయా - విద్యయా -ఆత్మానం - అన్విష్య - ఆదిత్యమ్ - అభిజయంతే - ఏతత్ - వై - ప్రాణానామ్ - ఆయతనమ్ - ఏతత్ - అమృతమ్ - అభయమ్ - ఏతత్ - పరాయణమ్ - ఏతస్మాత్ - న - పునః - ఆవర్తంత - ఇతి - ఏషః - నిరోధః - తత్ - ఏషః - శ్లోకః

ఏతత్+వై+ = విరాట్ పురుషుడు

| | | |
|---|---|---|
| ప్రాణానామ్+ఆయతనం | | సర్వజీవరాసులకు నిలయస్థానము |
| అథ | = | పుణ్యకర్మానుష్ఠానం చేసి పుణ్యఫలితమును కోరని వారు బ్రహ్మలోకం చేరి కల్పాంతమున అధికార పురుషులై జన్మిచెందరు వీరు |
| ఉత్తరేణ | = | ఉత్తరాయణ మార్గములో పయనించి |
| ఆదిత్యం | = | బ్రహ్మలోకం |
| అభిజయంతే | = | చేరుదురు |
| శ్రద్ధయా+ బ్రహ్మచర్యేణ+తపసా+ విద్యయా | = | శ్రద్ధ, బ్రహ్మచర్యము, తపస్సు సమ్యక్ జ్ఞానములచే ఆత్మజ్ఞానమును పొంది ఆ ఆత్మజ్ఞానముచే జ్యోతిర్మార్గమున |
| ఆత్మానం+అన్విష్య | = | ఆత్మను అన్వేషించి ఆత్మను దర్శించి ఆత్మ స్థానమును పొంది ఆత్మలో ఏకీభూతులగుదురు |
| ఏతత్+అమృతమ్ | = | ఆత్మస్థానము. సర్వలోకములు నశించినా నశింపని స్థానము |
| అభయమ్ | = | పునరావృత్తి అనే భయములేని స్థానము |
| ఏతత్+పరాయణమ్ | = | ఇది జ్యోతిర్మార్గము సర్వులకు గొప్ప మార్గము |
| పునః+న ఆవర్తంత (ఆవర్తంతే) | = | తిరిగి జన్మ పరంపరలలో చిక్కుకొనరు |
| ఏతస్మాత్+ఏషః +నిరోధః | = | ఇందువలన పుణ్యకర్మానుష్ఠానపరులకు యీ జ్యోతిర్మార్గములో ప్రయాణం కుదరదు. |
| తత్+ఏషః+శ్లోకః+ఇతి | = | అని యీ శ్లోకము చెప్పుచున్నది |

*****

ఆదిత్యుడు

**11. పంచపాదం పితరం ద్వాదశాకృతిం దివ ఆహుః పరే అర్ధే పురీషణమ్ అథే మే అన్య ఉ పరే విచక్షణం సప్తచక్రే షడర ఆహురర్పితమితి ॥**

పంచపాదం - పితరం - ద్వాదశ ఆకృతిం - దివః - ఆహుః - పరే - అర్ధే - పురీషణమ్ - అథ - ఇమే - అన్య (అన్యే) - ఉ - పరే - విచక్షణం - సప్త చక్రే - షడర - ఆహుః - అర్పితమ్ - ఇతి.



**అధ్యాత్మికంగా:- ఆత్మ**

| | | |
|---|---|---|
| పరే+అర్ధే+దివః (దివే) | = | 14 లోకములకు పైన పెంజీకటికి అవ్వల ఏకాకృతిగ వెలుగు ఆత్మ స్థానమని చెప్పబడే బ్రహ్మలోకమున ఉండువానిగను |
| విచక్షణం | = | సర్వమునకు సాక్షి యని |
| అర్పితమ్+ఉ+ ఇతి+ఆహుః | = | రథ చక్ర నాభిలో ఆకులు అమరినట్లు యీ సర్వవిశ్వము విరాట్పురుషుని యందు అమరి ఉండు ననియు అట్లుండుట వలన ఇతడే ఈ విరాట్ పురుషుడే యీ సర్వ విశ్వమునకు ప్రధానమని - ప్రధాన పురుషుడని చెప్పుదురు. |
| అన్య (అన్యే) | = | కొందఱు |

**అధిదైవికంగా:-**

| | | |
|---|---|---|
| సప్తచక్రే | = | ఏడు గుఱ్ఱములు పూన్చిన రథము గలవానిగను చెప్పుదురు(సూర్య కిరణములలో ఏడు రంగులు గలవు) |
| ఇమే+ద్వాదశ ఆకృతిం | = | 12 రూపములు గల వానిగను, ద్వాదశ ఆదిత్యులు అనియు చెప్పుదురు. |
| అథ | = | ఆ తర్వాత కొందఱు |

**అధి భౌతికంగా:-**

| | | |
|---|---|---|
| పంచపాదం | = | పంచపాదములు అనగా సంవత్సరము, అయనం, ఋతువులు, నెలలు, పగలు అనే విధముగా కాల విభజన చేయువానిగను |
| షడర (షడరే) | = | ఆఱు ఋతువులు ఏర్పడునట్లు చేయు ఋతు కర్తగను |
| పురీషణమ్ | = | వర్షము గలుగుచేయువానిగను, ఆ వర్షము వలన |

| | | |
|---|---|---|
| పితరం | = | పంటలు, తద్ద్వారా ఆహారము యిచ్చి జీవరాసిని పోషించు తండ్రిగను |
| పరే | = | అంతరిక్షమునందు గలవానిగను |
| ఆహుః | = | చెప్పుదురు |

*****

చంద్రుడు - మాసములు

**12. మాసో వై ప్రజాపతిస్తస్య కృష్ణపక్ష ఏవ రయిః శుక్లః ప్రాణస్తస్మాదేతే ఋషయః శుక్ల ఇష్టం కుర్వంతీతర ఇతరస్మిన్ ॥**

మాసః - వై - ప్రజాపతిః - తస్య - కృష్ణపక్షః - ఏవ - రయిః - శుక్లః - ప్రాణః - తస్మాత్ - ఏతే - ఋషయః - శుక్లః - ఇష్టం - కుర్వంతి - ఇతర(ఇతరే) - ఇతరస్మిన్

**అధ్యాత్మముగా - ఇతడు**

| | | |
|---|---|---|
| ప్రజాపతిః | = | సృష్టికర్తయే కాలము. కాలమును చేయుటకు |
| తస్య | = | వానియొక్క ప్రతినిధులు - సూర్య చంద్రులు. సూర్యునివలన సంవత్సరము, చంద్రునివలన పక్షములు, మాసములను గలుగచేయును. |

**అధిదైవికముగా**

| | | |
|---|---|---|
| ప్రాణః | = | ప్రాణము |

**అధిభౌతికముగా**

| | | |
|---|---|---|
| రయిః+వై | = | చంద్రుడు. చంద్రుని వలన |
| శుక్లః+కృష్ణపక్షః+ ఏవ+మాసః | = | శుక్లపక్షము, కృష్ణపక్షము అనే ఈ రెండు పక్షములు కలసి ఒక మాసము ఏర్పడును. |
| ఇష్టం | = | పుణ్యకర్మానుష్ఠాన పరులు యజ్ఞయాగాది క్రతువులు పుణ్యకార్యములను |
| కుర్వంతి | = | చేయుదురు. పుణ్యకర్మఫలితము కోరినవారు దక్షిణాయనముగా చెప్పబడే కృష్ణపక్షమున దేహమును వీడి బ్రహ్మలోకము చేరి పుణ్యము క్షీణించగా తిరిగి భూలోకమున జన్మించెదరు. |
| ఇతర (ఇతరే) | = | పుణ్యకర్మలు చేసి పుణ్యఫలితము కోరని వారు |
| ఇతరస్మిన్+శుక్లః (శుక్లే) | | శుక్లపక్షము నందు ఉత్తరాయణమునందు పయనించి బ్రహ్మలోకము చేరి అందు వసియించి కల్పాంతము అయిన తర్వాత అధికారపురుషులుగా ఉద్భవించెదరు. |
| తస్మాత్ | = | అందువలన |
| ఏతే+ఋషయః | = | ఈ ఋషులు దక్షిణాయన, ఉత్తరాయణ, మార్గములుగాక, జ్యోతిర్మార్గమున, పయనించి అమృతత్త్వమును పొందుదురు. |



*****

**13. అహో రాత్రో వై ప్రజాపతిస్తస్యాహ రేవ ప్రాణో రాత్రి రేవరయిః ప్రాణం వా ఏతే ప్రస్కందంతి యే దివా రత్యాసంయుజ్యంతే బ్రహ్మచర్యమేవతద్యద్రాత్రౌ రత్యా సంయుజ్యంతే ॥**

అహోరాత్రః - వై - ప్రజాపతిః - తస్య - అహః - ఏవ - ప్రాణః రాత్రిః - ఏవ - రయిః - ప్రాణం - వా - ఏతే - ప్రస్కందంతి - యే - దివా - రత్యా - సంయుజ్యంతే - బ్రహ్మచర్యమ్ - ఏవ - తత్ - యత్ - రాత్రౌ - రత్యా - సంయుజ్యంతే.

| | | |
|---|---|---|
| ప్రజాపతిః+ఏవ | = | అధ్యాత్మమైన ఆత్మయే సృష్టికర్త. అతడే ప్రజాపతి. అతడే ఆదిత్యుడు సూర్యుని |
| తస్య+అహోరాత్రః+వై | = | వలననే కాల విభజన జరిగి రాత్రింపగళ్ళు గలుగుచున్నవి. సూర్యుడు ఉదయించిన పగలు. సూర్యుడు అస్తమించిన రాత్రి. |
| రాత్రిః+ఏవ+రయిః | = | రాత్రి చంద్రుడు. |
| అహః+ఏవ+ప్రాణః | = | పగలు ఆదిత్యుడు. పగలు ఉత్తరాయణము. రాత్రి దక్షిణాయనము |

యత్+తత్ = ఏది రాత్రిగా చెప్పబడునో అది దక్షిణాయనము. ఏది పగలుగా చెప్పబడునో అది ఉత్తరాయణము. అవి ఉత్తరాయణ మార్గము దక్షిణాయన మార్గములు.

సూర్యునివలన సంవత్సరము, చంద్రునివలన పక్షములు మాసములు గలుగుచున్నవి. ఆదిత్యుని వలన కర్మానుసారము జీవులు పయనించుటకు దక్షిణాయనము, ఉత్తరాయణము, జ్యోతిర్మార్గములు ఏర్పరచబడినవి.

పుణ్యఫలితము కోరినవారు - రాత్రి - కృష్ణపక్షము - దక్షిణాయనమున పయనింతురు. వీరు పునర్జన్మకు వత్తురు.

పుణ్యఫలితము కోరనివారు - పగలు - శుక్లపక్షము - ఉత్తరాయణమున పయనింతురు. వీరు భూలోకమున జన్మించరు.

జ్యోతిర్మార్గమున పయనించినవారు బ్రహ్మయగుదురు.

**అపర ధర్మమును ప్రతిపాదించుచున్నాడు**

యే+దివా+రత్యా+ సంయుజ్యంతే = ఎవరు పగలు అనగా సాయం సమయములో రతిలో కలియుదురో

ఏతే = వారు

ప్రాణం = ప్రాణమును

ప్రస్కందంతి = జారవిడిచినవారు అగుదురు. అనగా ప్రాణమును వ్యర్థము చేసికొన్నవారు అగుదురు.

రాత్రౌ = ఎవరు రాత్రి యందు

రత్యా = రతిలో

సంయుజ్యంతే = కలియుదురో వారు ప్రాణమును వ్యర్థము చేసికొన్నవారు కారు.

బ్రహ్మచర్యమ్ = రాత్రియందు భార్యతో రతిలో కలియుట ఒక విధమయిన బ్రహ్మచర్యమే.

పగలు రతిలో కలియరాదు. ఈ అపర ధర్మమునే భాగవతంలో వివరించిరి. దితి కశ్యపునిని సాయం సమయములో రతి కోరినది. కశ్యపుడు యిది ధర్మము కాదని చెప్పినను దితి బలాత్కారము చేయగా ఆమెతో కశ్యపుడు సంగమించినాడు. తత్ఫలితముగా హిరణ్యాక్ష, హిరణ్యకశిపులు పుట్టిరి. ధర్మ విరుద్ధమగుట వలన



ప్రాయశ్చిత్తముగా కశ్యపుడు స్నానం చేసి ప్రాణాయామంబుసేసి విరజంబు సనాతనంబునైన బ్రహ్మగాయత్రి జపియించెను.

(భాగవతము-తృతీయస్కంధం 470)

*****

అధిభౌతికముగా ప్రజలు ఎలా గలిగినారో వివరించుచున్నారు. అన్నము వలన వీర్యము. వీర్యము వలన ప్రజలు.

**14. అన్నం వై ప్రజాపతి స్తతో హ వై తద్రేతస్తస్మాదిమాః ప్రజాః ప్రజాయంత ఇతి ॥**

అన్నం -వై - ప్రజాపతిః - తతః - హ - వై - తత్ - రేతః - తస్మాత్ - ఇమాః - ప్రజాః - ప్రజాయంత(ప్రజాయంతే) - ఇతి.

అధ్యాత్మికంగా సృష్టికర్త యైన ఆత్మ సృష్టిచేయ సంకల్పించి విశ్వమును సృజియించినది. అన్నమును సృజియించినది.

ప్రజాపతిః+వై+అన్నం = ప్రజాపతి సర్వజీవరాసులను సృజియించి వాటి అభివృద్ధి కొఱకు అన్నమును సృజియించెను.

తతః+రేతః+తత్+హ+వై= అన్నము వలన వీర్యము గలుగును. అటు పిమ్మట ఆ వీర్యము స్త్రీ యోనిలో పడి శుక్ల శోణితములు కలిసి గర్భం ఏర్పడును.

తస్మాత్ = అందువలన

ఇమాః+ప్రజాః+ = ఈ ప్రజలు

ప్రజాయంత = జన్మించిరి.

(ప్రజాయంతే) +ఇతి

*****

**15. తద్యే హ వై తత్ప్రజాపతి వ్రతం చరంతి తే మిథున ముత్పాదయంతే తేషా మే వైష బ్రహ్మలోకో యేషాం తపో బ్రహ్మచర్యం యేషు సత్యం ప్రతిష్ఠితం ॥**

తత్ - యే - హ - వై - తత్ - ప్రజాపతి వ్రతం - చరంతి - తే - మిథునమ్ - ఉత్పాదయంతే - తేషామ్ - ఏవ - ఏషః - బ్రహ్మలోకః - యేషాం - తపః - బ్రహ్మచర్యం - యేషు - సత్యం - ప్రతిష్ఠితం

| | | |
|---|---|---|
| యే+మిథునమ్+ తత్+ | = | ఏ స్త్రీపురుషులు గృహస్థులై పిల్లలు కలగవలయుననే కోరికతో |
| ప్రజాపతి+వ్రతం+చరంతి | | ప్రజాపతి వ్రతమును అనగా భార్యా సహితులై సంభోగమును ఆచరించెదరో |
| తే | = | ఆ భార్యాభర్తలు, పిల్లలను |
| ఉత్పాదయంతే | = | పుట్టించెదరు |

ఎవరివలన ఈ ప్రజలు జన్మించిరి అని కబన్ధీ అడిగిన ప్రశ్నకు సమాధానముగా ప్రజాపతి వలన ఈ ప్రజలు జన్మించిరి. ఆ ప్రజాపతి స్త్రీ పురుషులను సృజియించినాడు. ఆ స్త్రీ పురుషుల వలన ఈ ప్రజలు జన్మించుచున్నారు అని చెప్పినాడు. ఇందు మిథున ధర్మసృష్టి చెప్పబడినది. బ్రహ్మలోక ప్రాప్తి పొందువారు

| | | |
|---|---|---|
| యేషు+ సత్యం+ ప్రతిష్ఠితం | = | ఎవరి యందు సత్యము ప్రతిష్ఠితమై ఉండునో |
| యేషాం | = | ఎవరియొక్క |
| బ్రహ్మచర్యం+తపః | = | శ్రద్ధ, బ్రహ్మచర్యం, తపస్సు గలిగి |
| తేషామ్+ఏవ | = | ఆత్మ దర్శనము చేసిన మహానుభావులకే |
| ఏషః+బ్రహ్మలోకః | = | ఈ బ్రహ్మలోకము |
| తత్ + హ+వై | = | వారు బ్రహ్మలోక ప్రాప్తిపొంది ఆ బ్రహ్మలో ఏకీభూతులై బ్రహ్మగా విరాజిల్లుదురు. పుణ్య ఫలితము కోరనివారు ఉత్తరాయణ మార్గమును, కోరినవారు దక్షిణాయన మార్గమును పయనించెదరు. ఋషులు జ్యోతిర్మార్గమున పయనించి బ్రహ్మ అగుదురు. |

*****



**16. తేషామసౌ విరజో బ్రహ్మలోకో న యేషు జిహ్మమనృతం న మాయా చేతి ॥**

**ఇతి ప్రశ్నోపనిషది ప్రథమః ప్రశ్నః**

తేషామ్ - అసౌ- విరజః - బ్రహ్మలోకః - న - యేషు - జిహ్మమ్ - అనృతం - న- మాయా - చ - ఇతి

| | | |
|---|---|---|
| యేషు | = | ఎవరి యందు |
| న+మాయా | = | మాయలేదో అనగా ఇంచుక మాయ లేకుండా |
| అనృతం+చ | = | ఎవరు అసత్య వాక్కు పలుకరో |
| న+జిహ్మమ్ | = | ఎవరి యందు వంచన లేదో ఎవరు రజోగుణము లేక గుణరహితులై శాంతులై ఉందురో |
| తేషామ్ | = | వారికి |
| అసౌ+విరజః+బ్రహ్మలోకః +ఇతి | = | ఈ బ్రహ్మలోకము |

**ఇంచుక మాయ లేక మది నెప్పుడుఁ బాయని భక్తి తోడ వర్తించుచు** - ఉండువాడు ఆత్మను గ్రహించును. ( భాగవతము - ప్రథమ స్కంధము- 71).

*****

ఈ ప్రశ్నోపనిషత్ ప్రథమ ప్రశ్నలో ఆదిత్యుని పరంగా చెప్పినదానినే విస్తరించి ఆదిత్య హృదయముగా రామాయణములో అధ్యాత్మగా, అధి దైవికముగా, అధి భౌతికముగా వర్ణింపబడినది. ఈ ఆదిత్య హృదయమును చదివి అధ్యాత్మ అయిన ఆదిత్యుని అనగా ఆత్మను దర్శించవలయును. ఇదే సూర్యోపాసన.

**ఆదిత్య హృదయము**

పుణ్యకర్మానుష్ఠానముగా ఆదిత్య హృదయంలో చెప్పిన ఆదిత్యుని స్తుతించుట వలన పుణ్యకర్మ ఫలితముగా యుద్ధములో లేదా తలపెట్టిన కార్యములోజయము గలుగును. సర్వము అతడే యనే ఆత్మదర్శనమును స్వానుభవముతో గ్రహించుట వలన మోక్షము గలుగును.

**అధ్యాత్మము**

రశ్మిమన్తమ్ = స్వయం ప్రకాశకుడగుట వలన జ్యోతి స్వరూపుడు. కిరణములు గలవాడు.

దేవాసుర+నమస్కృతమ్ = దేవతలచే అసురలచే నమస్కరింప బడినవాడు.

వివస్వన్తమ్ = ఇతర వెలుగులను కప్పివేయువాడు అనగా సర్వ వెలుగుల కంటె గొప్ప కాంతి గలవాడు.

భాస్కరమ్ = కాంతిని గలుగ చేయువాడు.

భువనేశ్వరమ్ = లోక నియామకుడు

ప్రజాపతిః = సృష్టికర్త

సువర్ణ సదృశో భానుః = హిరణ్మయ శరీరములో ప్రకాశించువాడు.

హిరణ్యరేతాః = ప్రకృతిని అధిష్ఠించి ప్రకృతిలో తన తేజోబల వీర్యముల నుంచి సృష్టి చేసినవాడు.

మార్తాణ్డకః = ప్రళయానంతరము సృష్టిచేయువాడు

హిరణ్యాగర్భః = హిరణ్యాగర్భుడు

శిశిరః = భక్తుల తాపత్రయములను పోగొట్టువాడు

రవిః = అందఱి చేత నుతింపబడు వాడు.

అగ్ని గర్భః = అగ్ని గర్భుడు. హృదయాంతర్గత జ్యోతి

తమోభేదీ = అవిద్య అజ్ఞానమనే చీకటిని పారద్రోలు వాడు

ఋగ్యజుః సామపారగః = వేదాతీతుడు

మృత్యుః = కాలస్వరూపమున సర్వమును వినాశము చేయువాడు

కవిః = సర్వజ్ఞుడు

విశ్వః = విశ్వకర్త

మహాతేజాః = గొప్పతేజోవంతుడు

రక్తః = అందఱి యందు అనురాగము గలవాడు

సర్వభవోద్భవః = సృష్టికి నిలయమైనవాడు

విశ్వభావనః = విశ్వస్వరూపుడు

తేజసానుపితేజస్వీ = అధికతేజోవంతుడు. తేజస్సులకు కూడా తేజస్సు. వెలుగులక్కు వెలుగు.



జయాయ జయభద్రాయ = భక్తులకు జయము భద్రము యిచ్చువాడు

వీరాయ = ప్రాణులను ప్రేరేపించువాడు

ఆదిత్యవర్చసే = ఆదిత్య రూపమైన కాంతి గలవాడు

భాస్వతే = కాంతి గలవాడు

దేవాయ = ప్రకాశించువాడు

జ్యోతిషాంపతయే = వెలుగులకు వెలుగు

తప్తచామీకరాభాయ = హిరణ్మయరూపుడు

హరయే = అజ్ఞానమును హరించువాడు. హరి

విశ్వకర్మణే = విశ్వకర్మ, విశ్వసృష్టికర్త.

లోకసాక్షిణే = లోకమునకు సాక్షి

ప్రభుః = లోకములకు ప్రభువు

భూతం నాశయతి = ఇతడే లయ కారకుడు.

తదేవసృజతిః = లయకాలాంతంబున పునఃసృష్టి చేయును

ఏషః భూతేషు సుప్తేషు+ పరినిష్ఠితః జాగర్తి = ఇతడు హృదయ గుహలో ఉండి ప్రాణులు నిద్రించుచుండగా మేల్కొని సాక్షిగాయుండును.

జగత్ప్రతిమ్ః = జగత్ప్రతి

**అధి దైవికం**

సర్వదేవాత్మకః = సకల దేవతా రూపుడు

దేవాసురగణాన్+ లోకాన్ పాతి = దేవ అసుర మనుష్యాదులను లోకములను రక్షించువాడు

బ్రహ్మ = బ్రహ్మ

విష్ణుః = విష్ణువు

శివః = శివుడు

శంభుః = శుభమునకు నిలయమైనవాడు

స్కన్దః = కుమారస్వామి

మహేన్ద్రః = ఇంద్రుడు

ధనదః = కుబేరుడు

కాలః = కాలుడు, కాలస్వరూపుడు
యమః = యముడు
సోమః = సోముడు
అపాంపతిః = వరుణుడు
పితరః = తండ్రి, పితృదేవతలు
వసవః = వసువులు
సాధ్యాః = సాధ్యులు
అశ్వినౌ = అశ్వినీదేవతలు
మరుతః = సప్తమరుత్తులు
అదితేః పుత్రః = అదితి పుత్రుడు
హర్యశ్వాయ = పచ్చని గుఱ్ఱములు కలవాడు
హరిదశ్వః = పచ్చని గుఱ్ఱములు కలవాడు
ఆదిత్యః = అదితి కుమారుడు
మనుః = మనువు
వాయుః = వాయువు
వహ్నిః = అగ్ని
సవితా = మేలుకొలుపువాడు
లోకసాక్షిణే = లోకసాక్షి
త్వష్టా = త్వష్ట
సూర్యః = జనులను కర్మయందు ప్రేరేపించువాడు
ప్రాణః = ప్రాణము
ఉగ్రాయ = రుద్రరూపమున ఉగ్రుడు
ప్రచణ్డాయః = రుద్రరూపమున తీక్షణుడు
బ్రహ్మేశానాచ్యుతేశాయ = బ్రహ్మశివుడు విష్ణువు
సర్వభక్షాయ = అగ్ని స్వరూపుడు
రౌద్రాయఃవపుషే = రుద్ర స్వరూపుడు
ఏషః చైవ అగ్నిహోత్ర చ = ఇతడే అగ్నిహోత్రము.



అగ్నిహోత్రిణామ్ ఫలంచ = కర్మఫలితము అగ్నిహోత్రము చేసిన గలుగు ఫలితము కూడ యితడే.
దేవాశ్చ క్రతవశ్చైవ+ క్రతూనాం ఫలమ్ = దేవతలు, రాక్షసులు, మనుషులు, జీవరాసులు, క్రతువులు, యజ్ఞములు, కూడ యితడే
సర్వేషు లోకేషు+ యానికృత్యాని+ పరమ ప్రభుః = సమస్త లోకములలో ఏఏ కృత్యములు గలవో అవి అన్నీ ఇతడే. తపస్సు, శ్రద్ధ, సత్యము, సుఖ దుఃఖములు - సర్వ భావములు యితడే.
సప్తసప్తి = ఏడు గుఱ్ఱములు, పూన్చిన రథము నధిరోహించు వాడు.

**అధి భౌతికము**

సముద్యన్తమ్ = ఆకాశ ములో తూర్పున ఉదయించువాడు
తేజస్వీ = గొప్ప తేజస్సు అనగా కాంతి కలవాడు.
రశ్మిభావనః = కిరణములు గలవాడు
గభస్తిభిం = కిరణములచేత వేడి,వెలుతురు ఇచ్చువాడు
ఋతుకర్తా = ఋతువులను చేయువాడు
ప్రభాకరః = కాంతిని యిచ్చువాడు.
ఖగః = ఆకాశము నందు చరించువాడు
పూషా = జగత్తుకు వర్షము గలిగించి తద్వారా పోషించువాడు
గభస్తిమాన్ = కిరణములు గలవాడు
దివాకరః = పగలు గలిగించువాడు
సహస్రార్చిః = అసంఖ్యాకమైన కిరణములుగలవాడు
మరీచిమాన్ = కిరణములు గలవాడు
తిమిరోన్మథనః = చీకటిని నశింపచేయువాడు
అంశుమాన్ = కిరణములు గలవాడు
తపనః = వేడిని గలిగించువాడు
అహస్కరః = పగటిని చేయువాడు
శంఖః = సాయంకాలమందు స్వయముగా అస్తమించువాడు

శిశిరనాశనః = మంచును నశింప చేయువాడు

వ్యోమనాథః = ఆకాశమునకు ప్రభువు

ఘనవృష్టిః = అధికమయిన వర్షమును కురిపించువాడు

అపామ్‌మిత్రః = జలములకు మిత్రుడు

విన్ధ్యవీథీ ప్లవంగమః = ఆకాశమున శీఘ్ర గమనము గలవాడు

ఆతపీ = ఎండనిచ్చువాడు

మణ్డలీ = మండలము గలవాడు

పిఙ్గల = ఎఱుపురంగు గలవాడు

సర్వతాపనః = అందఱినీ ఎండవలన తపింప చేయువాడు

నక్షత్ర గ్రహతారాణామధిపః= నక్షత్రములకు గ్రహములకు, తారలకు అధిపతి

ద్వాదశాత్మన్ = 12 రూపములు గల ద్వాదశ ఆదిత్య రూపుడు

నమఃపూర్వాయ + = తూర్పున ఉదయించు సూర్యునకు

గిరయే + నమస్కారము

పశ్చిమాయాద్రయే = పడమర అస్తమించు సూర్యునకు నమస్కారము

జ్యోతిర్గణానాం పతయే = జ్యోతిర్గణములకు అధిపతి

దినాధిపతయే = దినాధిపతి

సహస్రాంశః = అసంఖ్యాకములయిన కిరణములు గలవాడు

ఆదిత్యాయ = ఆదిత్యుడు

సారఙ్గాయ = వేగముగా వెళ్ళువాడు.

పద్మప్రబోధాయ = పద్మములను వికసింప చేయును

సూర్యాయ = సూర్యుడు

తమోఘ్నాయ = చీకటిని తొలగించువాడు.

హిమఘ్నాయ = మంచును నశింప చేయువాడు

తమోభినఘ్నాయ = చీకటిని తొలగించును

రుచయే = ప్రకాశ స్వరూపుడు

గభస్తిభిః+ సాయతి = కిరణములచే ఎండింపచేయును.



తపత్తి = తపింపచేయును.

వర్షతి = వర్షింపచేయును.

**ఫలశ్రుతి:**

సర్వత్రా గలవాడు, సర్వము అయిన యితనిని - ఆత్మను- దర్శించుము. సర్వమఙ్గల మఙ్గలం = సర్వమంగళములలోనూ మంగళకరమైనది. ఆత్మస్థానము చేరుటయే సర్వమంగళములోనూ మంగళము; సర్వపాప ప్రణాశనమ్ = పుణ్యాకర్మానుష్ఠానము వలన గలిగిన పుణ్యాపాపములు రెండును నశించును. అనగా కర్మబంధములు తొలగును. చిన్తాశోక ప్రశమనమ్= చిన్త శోకము, మోహము గుణముల వలన వచ్చిన భావములు సర్వము ఆత్మదర్శనమున నశించును; ఆయుర్వర్ధనమ్ = ఆయువు ఎక్కువగును; ఉత్తమమ్ = ఉత్తమము

అగస్త్య మహర్షి వచ్చి ఆత్మ గుఱించి శాస్త్రపాఠమును చెప్పినాడు. దీనిని ఆచరించిన జీవాత్మ కూటస్థుడగును. సర్వకర్మ బంధములు నశింప చేసుకొని నిర్మలాంతః కరుణుడగు స్థితిని కూటస్థస్థితి యని అందురు. అనగా సర్వ కర్మ బంధములు నశించిన కూటస్థుడగును. అప్పుడు తనే ఆ హృదయగుహలో గల ఆత్మయని, సృష్టికర్తయు సృష్ట్యాది యందు గల ఆత్మయని సర్వము అతడే అనే స్వానుభవము గలుగును. తత్త్వమసి అని చెప్పిన వాక్యము అనుభవము లోనికి వచ్చును. ఆ స్థితిలో బ్రహ్మవచ్చి రామునికి - సర్వము నీవే అనే అర్థములో శ్రీరామునిని స్తుతించినట్లు రామాయణంలో వర్ణింపబడినది.

ఆత్మ లక్షణములే ఆదిత్యుని పరముగా చెప్పబడినది. వీటిని ఆత్మ, ఆదిపురుషుడు, విరాట్పురుషుడుగా గతములో వివరింపబడినది. వాటినే ఇప్పుడు అధ్యాత్మ, అధిదైవిక అధిభౌతికముగా వివరింపబడినది. ఆత్మ దర్శనమువలన సర్వపాపములు నశిచును. సర్వ శుభములు గలుగును. ఆయువు వృద్ధియగును. అనగా చిరంజీవియై విరాజిల్లును.

*****

## ద్వితీయ ప్రశ్న

1. **అథ హైనం భార్గవో వైదర్భిః పప్రచ్ఛ భగవన్ కత్యేవ దేవాః ప్రజాం విదారయంతే । కతర ఏతత్ ప్రకాశయంతే । కః పునరేషాం వరిష్ఠ ఇతి ।**

అథ - హ - ఏనం - భార్గవః - వైదర్భిః - పప్రచ్ఛ - భగవన్ - కతి - ఏవ - దేవాః - ప్రజాం - విధారయంతే - కతర (కతరే) - ఏతత్ - ప్రకాశయంతే - కః - పునః - ఏషాం - వరిష్ఠః - ఇతి

| | | |
|---|---|---|
| అథ+హ | = | మొదటి ప్రశ్నకు పాఠము చెప్పిన మీదట |
| వైదర్భిః + భార్గవః | = | విదర్భ దేశస్థుడయిన భృగువంశజుడు |
| ఏనం | = | వీనిని అనగా గురువును చేరి నమస్కరించి |
| భగవన్ | = | ఓ భగవన్ |
| కతి+దేవాః+ఏవ | = | ఎందఱు దేవతలు |
| ప్రజాం+విధారయంతే | = | ఈ సర్వ ప్రాణుల దేహమును ధరించుచున్నారు. (ఇది మొదటి ప్రశ్న) |
| కతర (కతరే) +ఏతత్ | = | ఎందఱు యీ సర్వ ప్రాణుల దేహమును |
| ప్రకాశయంతే | = | ప్రకాశింపచేయుచున్నారు? (ఇది రెండవ ప్రశ్న) |
| పునః+కః | = | మరల ఎవడు |
| ఏషాం+వరిష్ఠః | = | వీరిలో శ్రేష్ఠుడు - అని మూడు ప్రశ్నలను |
| పప్రచ్ఛ+ఇతి | = | అడిగెను |

ఈ శ్లోకము శ్లేషతో కూడి ఉన్నది. అటు ఆత్మ పరముగా ఇటు ఇంద్రియాదుల పరముగా ప్రశ్న ఉన్నది. కావున సమాధానము కూడా అటులనే ఉండును.

*****

**2.తస్మై స హోవాచాకాశో హ వా ఏష దేవో వాయురగ్నిరాపఃపృథివీ వాఙ్మనశ్చక్షుః శ్రోత్రం చ తే ప్రకాశ్యాభి వదంతి వయమే తద్బాణమవష్టభ్య విదారయామః ॥**



తస్మై - సః - హ - ఉవాచ - ఆకాశః - హ -వా -ఏషః - దేవః - వాయుః - అగ్నిః- ఆపః - పృథివీ - వాక్ - మనః - చక్షుః - శ్రోత్రం - చ - తే - ప్రకాశ్య - అభివదంతి- వయమ్ - ఏతత్ - బాణమ్ - అవష్టభ్యః - విదారయామః

ఎందఱు దేవతలు ఈ దేహమును ధరించుచున్నారు? అన్న ప్రశ్నకు ప్రకృతి, మహత్, అహంకారం, ఆకాశాది పంచభూతములు అనే ఎనిమిది మంది దేవతలు మఱియు జీవుడు, ఆత్మ దేహమును ధరించుచున్నారు అని మొదటి ప్రశ్నకు సమాధానము చెప్పినాడు.

| | | |
|---|---|---|
| ఏతత్+బాణం | = | ఈ దేహమును |
| ఏషః+దేవః+ఆకాశః+ వాయుః+అగ్నిః+ఆపః+ పృథివీ+హ+వా(వై) + | = | ప్రకృతి, ప్రకృతి వలన గలిగిన మహత్ మహత్ వలన గలిగిన అహంకారము, దాని వలన గలిగిన ఆకాశము వాయువు, అగ్ని, జలము, భూమి అనే ఈ ఎనిమిది మంది దేవతలు మఱియు **జీవుడు** హృదయ గుహలోని ఆత్మ వీరు దేహమును ధరించుచున్నారు. |

*****

ఎందఱు ఈ దేహమును ప్రకాశింప చేయుచున్నారు అన్న రెండవ ప్రశ్నకు ఆత్మ ఈ దేహమును ప్రకాశింపచేయుచున్నది మఱియు మనస్సు, జ్ఞానేంద్రియములు, కర్మేంద్రియములు ఇవి ఈ దేహమును ప్రకాశింప చేయుచున్నారు అన్నది సమాధానము.

| | | |
|---|---|---|
| ప్రకాశ్య+హ | = | ఆత్మవలన ఈ దేహము ప్రకాశింపచేయబడుచున్నది. మఱియు |
| మనః+చక్షుః+శ్రోత్రం వాక్+చ | = | మనస్సు, జ్ఞానేంద్రియములయిన చెవులు, చర్మము, కన్ను, నాలుక, ముక్కు కర్మేంద్రియములయిన వాక్, పాణి, పాద, గుద, గుహ్యములు అనగా మనస్సు జ్ఞానేంద్రియములు, |

కర్మేంద్రియములు

వయం = మేమే

అవష్టభ్య = ఈ ఉపాధిని పట్టుకొని

విదారయామః = ధరించుచున్నాము, మేమే ఈ దేహమును

అభివదంతి = ప్రకాశింప చేయుచున్నాము అని

తే = వారు చెప్పిరి అని

తస్మై+సః+ఉవాచ = శిష్యునకు గురువగు పిప్పలాదుడు చెప్పెను.

*****

ఉపాధిని ప్రకాశింపచేయు వాటిలో ఎవరు శ్రేష్ఠుడు? అన్నమూడవ ప్రశ్నకు సమాధానముగా ఆత్మ శ్రేష్ఠము మఱియు ప్రాణము శ్రేష్ఠమని చెప్పి ఒక చిన్న కథ ఉదాహరణగా చెప్పుచున్నాడు.

3. **తాన్ వరిష్ఠః ప్రాణ ఉవాచ । మామోహ మాపద్యథ అహమేవై తత్పంచ ధాత్మానం ప్రవిభజ్య । ఏతద్బాణ మవష్టభ్య విదారయామీతి తేఽశ్రద్ధ దానా బభూవుః ॥**

తాన్ - వరిష్ఠః - ప్రాణః - ఉవాచ - మా - మోహమ్ - ఆపద్యథ - అహమ్ - ఏవ - ఏతత్ - పంచధా - ఆత్మానం - ప్రవిభజ్య - ఏతత్ - బాణమ్ - అవష్టభ్య - విదారయామి - ఇతి - తే - అశ్రద్ధ దానాః - బభూవుః

దేహములోగలవాటిలో

వరిష్ఠః+ఏవ = ఆత్మయే శ్రేష్ఠము

ఆత్మానం+ప్రవిభజ్య = ఆత్మ తనని తానుగా హృదయగత ఆత్మగా, జీవాత్మగా విభజించుకొని

విదారయామి = నేను (అనగా ఆత్మ) ఈ దేహమును ధరియించుచున్నాను.

తాన్ = ఆ విధముగా గొప్పలు చాటుకొన్న, మనస్సు, జ్ఞానేంద్రియ, కర్మేంద్రియములతో

ప్రాణః = ప్రాణము



మా+మోహమ్+ఆపద్యథ= మీరు నిజం గ్రహించకుండా మోహములో పడవద్దు

అహం+ఏవ+వరిష్టః = నేనే శ్రేష్ఠము. మీ అందరికంటె నేనే శ్రేష్ఠము అని చెప్పెను

ఏతత్+ఆత్మానం+ పంచధా+ప్రవిభజ్య = నన్ను నేనే ఐదు విధములుగా విభజించుకొని యీ ఉపాధిలో ఉండి

ఏతత్+బాణం+ అవష్టభ్య = ఈ శరీరమును

విదారయామి+ఇతి = ధరియించుచున్నాను. నేనే ముఖ్య ఆధారము అని ప్రాణము

ఉవాచ = పలికెను అయితే

తే = ఆ ఇంద్రియములు, మనస్సు

అశ్రద్ధ దానాః+బభూవుః = ప్రాణము చెప్పిన మాటలను నమ్మలేదు. ఇంద్రియములు, మనస్సు పని చేయుచున్నవి. ప్రాణము ఏ పని చేయుట లేదు. కావున ప్రాణము కార్యనిర్వహణలో ముఖ్య ఆధారము ఎట్లు అనే సందేహము గలిగినది.

*****

4. **సోఽభిమానాదూర్ధ్వముత్క్రమత ఇవ తస్మిన్నుత్క్రామత్యథేతరే సర్వ ఏవోత్క్రామంతే తస్మింశ్చ ప్రతిష్ఠమానే సర్వ ఏవ ప్రాతిష్ఠంతే । తద్యథా మక్షికా మధుకర రాజాన ముత్క్రామంతం సర్వా ఏవోత్క్రామంతే తస్మింశ్చ ప్రతిష్ఠమానే సర్వా ఏవ ప్రాతిష్ఠంత ఏవం వాఙ్మనశ్చక్షుఃశ్రోత్రం చ తే ప్రీతాః ప్రాణం స్తున్వంతి ॥**

సః - అభిమానాత్ - ఊర్ధ్వమ్ - ఉత్క్రమత (ఉత్క్రామతే) - ఇవ - తస్మిన్ - ను - ఉత్క్రామతి - అథ - ఇతరే - సర్వః (సర్వే) - ఏవ - ఉత్క్రామంతే - తస్మిన్ - చ - ప్రతిష్ఠమానే- సర్వః (సర్వే) - ఏవ - ప్రాతిష్ఠంతే - తత్ - యథా - మక్షికాః - మధుకర - రాజానమ్ - ఉత్క్రామంతం - సర్వాః - ఏవ - ఉత్క్రామంతే - తస్మిన్ - చ - ప్రతిష్ఠమానే - సర్వాః(సర్వే) - ఏవ - ప్రాతిష్ఠంత - ఏవం - వాక్ - మనః - చక్షుః - శ్రోత్రం - చ - తే - ప్రీతాః - ప్రాణం -

స్తున్వంతి

అభిమానాత్ = మనస్సు, జ్ఞానేంద్రియకర్మేంద్రియములు తన మాటలు నమ్మక పోవుట వలన గలిగిన అభిమానము వలన

సః = ప్రాణము నిర్లక్ష్యముగా

ఊర్ధ్వం+ఉత్క్రామతే+ (ఉత్క్రామత)+ఇవ = శరీము నుండి వెడలిపోవువానివలె

తస్మిన్+ను+ఉత్క్రామతి= శరీరమందు యున్న ప్రాణము శరీరమును విడచి బయటకు వచ్చుటకు ప్రయత్నించునంతలో

అథ = ఆ సమయములో

ఇతరే+సర్వః(సర్వే) = మనస్సు, మిగిలిన ఇంద్రియాదులు సర్వము

ఉత్క్రామంతే+ఏవ = వాటి వాటి కార్యసామర్థ్యమును కోలుపోయిన వానివలె చేష్టలు ఉడిగినవి

తస్మిన్+ ప్రతిష్ఠమానే+చ = అంతలో ప్రాణము శరీరమందు తిరిగి ప్రతిష్ఠితుడవగా మనస్సు, యింద్రియాదులు సర్వము కుదుట పడినవి. అనగా అవి మరల కార్య సామర్థ్యము గలిగి వాటి వాటి పనులు చేయగలిగెను.

తత్ = దీని విషయమై ఒక ఉదాహరణ చెప్పుచున్నాను

యథా = లోకములో ఏ విధముగా

మధుకర+ రాజానం = తేనెటీగల రాజు

ఉత్క్రామంతం = బయలుదేరగా

సర్వాః(సర్వే)+ మక్షికాః+ఏవ = సర్వతేనెటీగలు అతనిని అనుసరించి

ఉత్క్రామంతే+ = వెడలిపోవునట్లు

చ = మఱియు

తస్మిన్+ప్రతిష్ఠమానే = ఆ తేనెటీగల రాజు ఒక ప్రదేశమందు స్థిరపడగా

సర్వాః(సర్వే)+ఏవ+ = ఆ తేనెటీగలు సర్వము అతడున్న చోట



ప్రాతిష్ఠంతే ఉండి స్థిరపడినట్లు

ఏవం = ఈ విధముగా

మనః+చక్షుః+ శ్రోత్రం+చ+వాక్+ సరః (సర్వే)+ఏవ+ ప్రాతిష్ఠత = మనస్సు, చెవులు, కనులు మొదలయిన జ్ఞానేంద్రియములు మఱియు వాక్కు మొదలయిన కర్మేంద్రియములు శరీరమందు స్థిరపడి మరల వాటి వాటి పనులు చేయు చున్నవి.

తే = మనస్సాది సర్వ ఇంద్రియములు

ప్రీతాః = ప్రీతిని పొంది

ప్రాణం = ప్రాణమును

స్తున్వంతి = పొగిడినవి

ఆత్మ శ్రేష్ఠము. ఆత్మపై దేహ వ్యాపారము ఆధారపడి ఉన్నది. ప్రాణము శ్రేష్ఠము. ప్రాణముపై దేహవ్యాపారము ఆధారపడి ఉన్నది.

ప్రాణము-శరీరమునుండి బయటకు వచ్చుదాని వలె బయటకురా ప్రయత్నించగా సర్వ ఇంద్రియములు, మనస్సు చేష్టలుడిగినట్లు అయినవి. మరల ఆ ప్రాణము శరీరమందు స్థిరపడగా అవి వాటి వాటి పనులు చేయుచున్నవి అని చెప్పిన ఉపదేశము యోగసాధనలో ఉపయోగము. ప్రాణము పూరక, రేచకములతో శరీరమందు స్థిరపడును. అప్పుడు మనస్సు, జ్ఞానేంద్రియ కర్మేంద్రియములు వాటి వాటి పనులు చేయును.ప్రాణము పూర్ణకుంభకములో యున్న దేహధ్యాస యుండదు. చెవులకు శబ్దము వినపడదు. మనస్సు పనిచేయదు. కర్మేంద్రియ జ్ఞానేంద్రియములు వాటి వాటి పనులు చేయవు. ఈ స్థితిని నిశ్చల సమాధి యని యోగములో చెప్పగా లోక వ్యవహారములో స్థాణువు భంగియని ఊయివలె ఉన్నాడని, కొఱడు చందంబున యున్నాడని చెప్పుదురు. ఆ యోగి పూర్ణకుంభకము నుంచి మరల జాగ్రతావస్థకు రాగానే ప్రాణము పూరక రేచకములలో పనిచేయును. ప్రాణము అధి దైవికము - ఉపాధి అధి భౌతికము. ప్రాణము ద్వారా ఉపాధిని జయించాలి అని చెప్పిన విషయమును కథగా రాముడు వానరుల ద్వారా రావణ సంహారము చేసినట్లు వాల్మీకి మహర్షి రామాయణమును రచియించినాడు.

స్థూల శరీరమును రాక్షసులుగా చిత్రీకరించినాడు.

స్థూలదేహాధిపతి = వైశ్వానరుడు. రావణుడు

ప్రాణము = వానరులు

సాధకుడు = రాముడు

*****

ఆత్మ - ప్రాణము

**5. ఏషోఽగ్నిస్తపత్యేష సూర్యఏషపర్జన్యో మఘవానేష వాయుః।**
**ఏష పృథివీ రయి ర్దేవః సదసచ్చామృతం చ యత్ ॥**

ఏషః - అగ్నిః - తపతి - ఏషః - సూర్యః - ఏషః - పర్జన్యః - మఘవాన్ - ఏషః - వాయుః - ఏషః - పృథివీ - రయిః - దేవః - సత్ - అసత్ - చ - అమృతం - చ - యత్

ఏషః+సూర్యః = ఈ ప్రాణము సూర్యుడు, (రామాయణములో సుగ్రీవుడు)

ఏషః+అగ్నిః+తపతి = ఈ ప్రాణము అగ్ని స్వరూపము. కావున వేడిని గలుగ చేయును. (రామాయణములో నీలుడు గా వర్ణింపబడినాడు.) శరీరములో ప్రాణము లేకపోవుట వలన శరీరము నిర్జీవమై శవమగును. అప్పుడుకాళ్ళు, చేతులు మొత్తము శరీరము చల్లగా వుండును

ఏషః+వాయుః = ఈ ప్రాణము వాయువు (రామాయణములో హనుమంతుడుగా చెప్పబడినాడు.)

దేవః = ఈ ప్రాణము బృహస్పతి (రామాయణంలో తారుడుగా చెప్పబడినాడు).

ఏషః+మఘవాన్ = ఈ ప్రాణము ఇంద్రుడు. (రామాయణంలో వాలి) సర్వ దేవతలకు ఇంద్రుడు అధిష్ఠాత. సర్వ ఇంద్రియములే సాత్వికాహంకారమున దేవతలు. కావున ఆ సర్వయింద్రియములకు, మనస్సుకు, ప్రాణము అధిష్ఠాత మఱియు శ్రేష్ఠము అని తేనెటీగలను ఉపమానముగాతీసుకొని వివరింప బడినది.

ఏషః+పర్జన్యః = ఈ ప్రాణము పర్జన్యుడు. (రామాయణంలో పర్జన్యుని కుమారుడు శరభుడు. సాల్వేయ పర్వత నివాసి.)

రయిః+చ = చంద్రుడు. (రామాయణంలో దధిముఖుడు) చంద్రుని వలన ఓషధులు గలిగి పంటలు గలిగి తద్వారా ఆహారము, ఆహారము వలన శక్తి, బలము గలును. అటులనే ప్రాణము వలన శక్తి బలము గలుగును.

అమృతం = అమృతము అనగా ఆత్మ. ఇతడే ప్రజాపతి విశ్వకర్మ (రామాయణములో విశ్వకర్మ కుమారుడు నలుడు)

యత్+సత్+చ+అసత్ = మఱియు సత్ అసత్ కూడా

ప్రాణము పూర్ణకుంభకములో ఉన్నచో శరీరము నిశ్చలమై స్థాణువువలె ఉండుట వలన ఆహారము, నీరు అక్కరలేదు.

పృథివీ = భూమి( ప్రాణము శరీరమంతా నఖశిఖ పర్యంతము వ్యాపించియున్నది)

రామాయణములో వానరులను సీతాన్వేషణకు పంపు సందర్భమున సుగ్రీవుడు భూమినంతా ఒకప్పుడు తిరిగినట్లు ఆ అనుభవమును వానరులకు చెప్పునట్లుగా మనకు భూమి గుఱించి వాల్మీకి మహర్షి అధిభౌతిక అధి దైవికంగా అందించినారు.

*****

విరాట్ పురుషుని యందు సర్వవిశ్వము ఆధారపడి ఉన్నది. అటులనే ప్రాణము నందు శరీర వ్యాపారము అంతా ఆధారపడి ఉన్నది.

**6. అరా ఇవ రథ నాభౌ ప్రాణే సర్వం ప్రతిష్ఠితం ।**
**ఋచో యజూంగ్షి సామాని యజ్ఞః క్షత్రం బ్రహ్మ చ ॥**

అరాః - ఇవ - రథనాభౌ - ప్రాణే - సర్వం - ప్రతిష్ఠితం - ఋచః యజూగ్ంషి -

సామాని - యజ్ఞః - క్షత్రం - బ్రహ్మ- చ

| | | |
|---|---|---|
| రథనాభౌ | = | రథచక్రపునాభిలో |
| అరాః+ఇవ | = | రథచక్రపు ఆకులు ప్రతిష్ఠింపబడి ఉన్నట్లు విరాట్ పురుషునియందు |
| ఋచః | = | ఋగ్వేదము |
| యజూగ్ంషి | = | యజుర్వేదము |
| సామాని+చ | = | సామవేదము, అథర్వవేదము |
| యజ్ఞః | = | యజ్ఞము |
| బ్రహ్మ+క్షత్రం | = | బ్రాహ్మణ క్షత్రియాది నాలుగు వర్ణములు |
| సర్వం | = | ఈ సర్వవిశ్వము |
| ప్రతిష్ఠితం | = | ప్రతిష్ఠితమై ఉన్నది అటులనే |
| ప్రాణే | = | ప్రాణమునందు-శరీర వ్యాపారము సర్వము ఆధారపడి ఉన్నది. |

రథచక్రపు నాభి లేనిచో ఆకులు వేటికి అవి విడిపోయి చక్రము పనిచేయదు. అటులనే ప్రాణము లేనిచో శరీరము పనిచేయదు. ప్రాణమందు ఈ ఉపాధిలోని మనస్సు, కర్మేంద్రియ, జ్ఞానేంద్రియములు మొదలయినవి ప్రతిష్ఠితమై యున్నవి. ఈప్రాణము సూత్రాత్మగా పనిచేయును. ఈ సూత్రాత్మ లేనిచో వేటికి అవి విడిపోవును. **ఈ ప్రాణము బ్రహ్మరంధ్రమును చేరునాటికి ఉపాధిలో గల సర్వము విడిపోవును.** ఈ ప్రాణము బ్రహ్మరంధ్రము చీల్చి బ్రహ్మమందు కలియగానే ఎందుండి గలిగినవో అవి అందులో లయమగును.

*****

7. **ప్రజాపతిశ్చరసి గర్భే త్వమేవ ప్రతిజాయసే । తుభ్యం ప్రాణ ప్రజాస్త్విమా బలిం హరంతి యఃప్రాణైః ప్రతితిష్ఠసి ॥**

ప్రజాపతిః - చరసి - గర్భే - త్వమ్ - ఏవ - ప్రతిజాయసే - తుభ్యం - ప్రాణ - ప్రజాః - తు - ఇమాః - బలిం - హరంతి - యః - ప్రాణైః - ప్రతితిష్ఠసి



ప్రాణము - ప్రజాపతిని రెండింటిని మేళవించి ఒకే శ్లోకములో చెప్పినాడు.

ఆత్మ పరముగా :-

| | | |
|---|---|---|
| త్వం | = | నీవు - ఆత్మ |
| గర్భే | = | హృదయగుహలో |
| చరసి | = | చరించు చున్నావు. నీవలన ఈ దేహ వ్యాపారము నడచు చున్నది. |
| యః | = | ఎవడు అనగా |
| ప్రజాపతిః | = | ప్రజాపతి అయిన (ఆత్మ) నీవు |
| ప్రతితిష్ఠసి | = | జీవాత్మగా దేహమున, ఆత్మగా హృదయగుహలో ఉంటివి. |
| ప్రతిజాయసి | = | జీవుడు పునర్జన్మకు వచ్చిన అతనితో పాటు నీవు తిరిగి దేహములోనికి వచ్చెదవు. |
| తుభ్యం | = | ప్రజాపతీ ! నీకు |
| ఇమాః+ప్రజాః | = | ఈ ప్రజలు చక్రవర్తికి సామంతులు కానుకలు సమర్పించునట్లు |
| బలిం | = | కానుకలను |
| హరంతి | = | సమర్పించెదరు |
| ప్రాణ | = | ఓ ప్రాణమా ! నీవు దేహములో చరించుచున్నావు. |
| ప్రాణైః | = | ప్రాణము చేత ఈ శరీరవ్యాపారము నడచుచున్నది జీవుడు పునర్జన్మకు రాగా అతనితో పాటు నీవుకూడా వచ్చెదవు. |

నీవు - చక్రవర్తివి. ఇంద్రియములు మనస్సు నీకు సామంతులు.

*****

8. **దేవానామపి వహ్నితమః పితౄణాం ప్రథమాస్వధా । ఋషీణాం చరితం సత్యమథర్వాంగిరసామసి ॥**

దేవానామ్ - అపి - వహ్నితమః - పితౄణాం - ప్రథమా - స్వధా - ఋషీణాం -

చరితం - సత్యమ్ - అథర్వ - అంగిరసామ్ - అసి

**ఆత్మ - అగ్ని దేమునిగా**

ఆత్మ పరముగా:-

దేవానాం+వహ్నితమః+ = దేవతలకు హవ్యము వేగముగా గొనిపోవు
పిత్రూణాం+ప్రథమా+ వాహకుడవు నీవు పిత్రుదేవతలకు తొలివిడతగా
స్వధా+అసి నాంది ముఖ శ్రాద్ధమునందు స్వధాన్నమును (కవ్యమును) అందజేయువాడవు నీవు

ప్రాణముగా:-

ఋషీణాం+అంగిరసాం+= ఋషిగతౌ అను ధాతవునుండి ఋషిపదము
అథర్వ+సత్యమ్+ వచ్చినది. గతౌ అనగా గమన శీలులు అని అర్థము.
చరితం+అసి కావున ఋషులు అనగా ఇక్కడ ఇంద్రియములు. అంగి అనగా దేహము. రసాం అనగా ఆ దేహము యొక్క సారభూతములు అంగిరసాం అనగా చక్షురాది జ్ఞానేంద్రియములు. అంగిరసములు అథర్వమనగా ముఖ్యప్రాణము. ప్రాణరూపమున భుజించిన ఆహారమును పచనము చేసి ఆ సారమును సమముగా ఇంద్రియాదులను అందచేయువాడవు నీవు.

*****

**ఆత్మ విరాట్ రూపమున సర్వ దేవతలు**

**9. ఇంద్రస్త్వం ప్రాణ తేజసా రుద్రోఽపి పరిరక్షితా।**
**త్వ మంతరిక్షే చరసి సూర్యస్త్వం జ్యోతిషాం పతిః ॥**

ఇంద్రః - త్వం - ప్రాణ - తేజసా - రుద్రః - అపి - పరిరక్షితా - త్వం - అంతరిక్షే- చరసి - సూర్యః - త్వం - జ్యోతిషాంపతిః

త్వం = నీవు - ఆత్మ
జ్యోతిషాంపతిః = సర్వ వెలుగులకు మూలమైన వెలుగువు. స్వయం జ్యోతివి
త్వం+ఇంద్రః = నీవు ఇంద్రుడవు
త్వం+రుద్రః+అపి = నీవు రుద్రుడవు
అంతరిక్షే = అంతరిక్షమున
సూర్యః = సూర్యుడవు. నీవు
తేజసా = తేజస్సుచే ఆకాశమున
చరసి = సంచరించుచున్నావు
పరిరక్షితా = ప్రజా రక్షకుడవు
ప్రాణ = ఓ ప్రాణమా నీవు దేహమును నశింపకుండా రక్షించువాడవు.

*****

**ఆత్మ - పర్జన్యరూపుడు**

**10. యదా త్వమభి వర్షస్య థేమాః ప్రాణతే ప్రజాః।**
**ఆనంద రూపాస్తిష్ఠంతి కామాయాన్నం భవిష్యతీతి ॥**

యదా - త్వమ్ - అభివర్షసి - అథ - ఇమాః- ప్రాణ - తే - ప్రజాః - ఆనంద రూపాః - తిష్ఠంతి - కామాయ - అన్నం - భవిష్యతి - ఇతి

ఆత్మా నీవు పర్జన్య రూపమున అనగా
యదా+త్వం+అభివర్షసి = ఎప్పుడు నీవు మేఘ రూపమున బాగా వర్షించెదవో
అథ+ కామాయ+అన్నం = అప్పుడు కోరినంత అన్నము
భవిష్యసి = గలుగుతుందని
ఇమాః + ప్రజాః = ఈ ప్రజలు
తే+ఆనందరూపాః+ = ఆనందముగా ఉందురు. వానలు పడి దేశము
తిష్ఠంతి+ఇతి సుభిక్షమగుటవలన ప్రజలు హాయిగా ఊపిరి పీల్చుకొందురు
ప్రాణ = ఓ ప్రాణమా నీవు దేహమును వీడక ఈ దేహమున

ఉన్నంతకాలము ప్రజలు హాయిగా ఆనందములను అనుభవింతురు.

*****

ఆత్మ - వాయురూపుడు

**11. వ్రాత్యస్త్వం ప్రాణైక ఋషిరత్తా విశ్వస్యసత్పతిః ।**
**వయమాద్యస్య దాతారః పితా త్వం మాతరిశ్వ నః ॥**

వ్రాత్య : - త్వం - ప్రాణ - ఏకఋషిః - అత్తా - విశ్వస్య - సత్పతిః - వయమ్ - ఆద్యస్య - దాతారః - పితా - త్వం - మాతరిశ్వ - నః

| | | |
|---|---|---|
| త్వం | = | ఆత్మా నీవు |
| విశ్వస్య+సత్పతిః | = | విశ్వమునకు చక్కని ప్రభువువు మఱియు |
| అత్తా | = | సర్వ భక్షకుడవు అనగా లయకారకుడవు |
| త్వం | = | సృష్టిలో నీవు |
| వ్రాత్యః | = | పరిశుద్ధుడవు, సృష్టిలో వచ్చిన బ్రాహ్మణాది వర్ణములకు వర్ణానుగుణ సంస్కారములు చెప్ప బడును. స్వతహాగా- సృష్ట్యాది యందున్న నీవు - సంస్కారము గల వాని వగుటచే వర్ణాను గుణ సంస్కారములేవి గలవో అవి నీకు అవసరము లేదు. |
| నః+పితా | = | మాకు నీవు తండ్రివి |
| వయం | = | మేము నీ పిల్లలము |
| ఆద్యస్య+దాతారః | = | హవిస్సులను అందచేయు వారలము నీవు రాజువు. మేము కానుకలు యిచ్చే నీ ప్రజలము. |

**అధి దైవికంగా:-**

| | | |
|---|---|---|
| ఏకఋషిః | = | నీవు ఏకర్షి యనే పేరు గల అగ్నివి. |
| ప్రాణ | = | ఓ ప్రాణమా నీవు ప్రాణ రూపమున ఆహారము తిందువు |
| మాతరిశ్వా | = | సర్వత్రా సంచరించు వాయువా! నీవు శరీరములో ప్రాణరూపమున సంచరింతువు. |



*****

ఆత్మను నుతించుచున్నాడు

**12. యా తే తనూర్వాచి ప్రతిష్ఠితా యా శ్రోత్రే యా చ చక్షుషి ।**
**యా చ మనసి సంతతా శివాం తాం కురు మోత్క్రమీః ॥**

యా - తే - తనూః - వాచి - ప్రతిష్ఠితా - యా - శ్రోత్రే - యా - చ - చక్షుషి - యా - చ - మనసి - సంతతా - శివాం - తామ్ - కురు - మా - ఉత్క్రమీః

| | | |
|---|---|---|
| యా | = | ఏదైతే |
| తే | = | నీయొక్క |
| తనూః | = | శరీరము అనగా నీయొక్క ఏ శక్తి |
| వాచి+చ | = | వాగింద్రియమునందు - కర్మేంద్రియములందు |
| యా+శ్రోత్రే | = | చెవులయందు |
| యా+చక్షుషి+చ | = | కన్నులయందు |
| చ | = | మఱియు జ్ఞానేంద్రియములందు |
| యా+మనసి | = | మనస్సునందు |
| ప్రతిష్ఠితా | = | నెలకొనియున్నదో |
| తాం | = | దానిని - ఎల్లప్పుడు |
| సంతతా+శివాం+కురు | = | మంగళ ప్రదమైనదానినిగ చేయుము |
| మా+ఉత్క్రమీః | = | శరీరము నుంచి వెడలిపోవద్దు. అనగా మేము సాధనచే యీ జన్మలోనే అమృతత్త్వము పొందు దుముగాక. |

ప్రాణరూపమున ఓ ప్రాణమా నీవు కర్మేంద్రియములు, జ్ఞానేంద్రియములు, మనస్సు నందు నెలకొని ఉన్నావు. ప్రాణరూపమున శరీరమంతా అనగా నఖశిఖపర్యంతము వ్యాపించి ఉన్నావు. నీవు నా శరీరమునుంచి వెడలిపోవద్దు.

*****

13. ప్రాణస్యేదం వశే సర్వం త్రిదివే యత్ ప్రతిష్ఠితం ।
మాతేవ పుత్రాన్ రక్షస్వ శ్రీశ్చ ప్రజ్ఞాం చ విధేహి న ఇతి ॥

ఇతి ప్రశ్నోపనిషది ద్వితీయః ప్రశ్నః

ప్రాణస్య - ఇదం- వశే - సర్వం- త్రిదివే- యత్- ప్రతిష్ఠితమ్ -మాత- ఇవ - పుత్రాన్- రక్షస్వ- శ్రీః(శియః) -చ- ప్రజ్ఞాం - చ- విధేహి-నః-ఇతి

| | | |
|---|---|---|
| యత్ | = | ఏదైతే |
| త్రిదివే+ప్రతిష్ఠితం | = | మూడు లోకములలో గలదో అనగా |
| ఇదం+సర్వం+ వశే | = | ఈ సృష్టి సర్వము ఆత్మయొక్క వశమునందు కలదు. |

కావున అధ్యాత్మ స్వరూపమునగల ఓ ఆత్మా, పురుషోత్తమా!

| | | |
|---|---|---|
| పుత్రాన్+మాత+ | = | పుత్రులను తల్లి రక్షించునట్లు |
| ఇవ+రక్షస్వ | | నీవు మమ్ములను రక్షించు |
| నః+చ+శ్రీః(శియః)+చ | = | మఱియు మాకు సంపద, మంచి బుద్ధి, సర్వత్రా |
| ప్రజ్ఞాం+విదేహి+ఇతి | | నిన్ను దర్శించు ప్రజ్ఞ దయ చేయుము. అనగా సర్వము ఆత్మ స్వరూపమని గ్రహించు ప్రజ్ఞను గలుగ చేయుము. |

ప్రాణముగా:-

| | | |
|---|---|---|
| ప్రాణస్య | = | ఈ దేహేంద్రియమనోబుద్ధులు ప్రాణము యొక్కవశములో గలదు. |

ఈ ఉపాధితో జీవాత్మ మమేకమై మద మాత్సర్యాది దోషములు గలిగి- అహంకార మమకారములు గలిగి సుఖదుఃఖములను పొందుచున్నది. సాధనలో ప్రాణము, మనస్సులను తీసుకొని శ్రద్ధాభక్తి ధ్యాన యోగము మొదలయిన సాధనలచే మోక్షసామ్రాజ్య పట్టాభిషిక్తుడు కావలయును. రావణ సంహారమనగా జీవుడు - కూటస్థుడయినాడని అర్థము. జీవోపాధి లక్షణములను వీడిన కూటస్థుడగును. కూటస్థుడు బ్రహ్మరంధ్రమును చేరును. బ్రహ్మరంధ్రమనే హృదయ గుహాయే అయోధ్య. రాముడు రావణ సంహారము చేసి అయోధ్యకు వచ్చి పట్టాభిషిక్తుడయ్యెను.



అనగా జీవన్ముక్తుడయ్యెను. విదేహుడు అయ్యెను. దేహ త్యాగకాలమున మాయోపాధి అనే సీతను పరిత్యజించి ఆత్మయై హిరణ్మయ శరీరమును దాల్చెను. ఆత్మతో ఏకీభూతుడై ఆత్మయై స్వరాట్ యై విరాజిల్లెను. ఇదే రామాయణము ద్వారా వాల్మీకి మనకందించిన సందేశము.

| | |
|---|---|
| ఆత్మ గుఱించి | - ప్రాణము గుఱించి శ్లేషగా చెప్పినాడు |
| ఆత్మ | - శరీర వ్యాపారము నడచుచున్నది. |
| | - విరాట్పురుష రూపమున సర్వ దేవతా రూపము |
| | - అగ్ని రూపమున దేవతలకు, పితృదేవతలకు హవ్య, కవ్యములను అందిచును. |
| | - పర్జన్య రూపమున వర్షించును. |
| | - పరిశుద్ధుడు. |
| | - సర్వము ఆత్మయొక్క వశమునందు ఉన్నది. |
| ప్రాణము | - ప్రాణమువలన ఈ దేహవ్యాపారము నడచుచున్నది. |
| | - ఆహారమును పచనము చేసి శరీరభాగము లన్నింటికి సమముగా పంచును. |
| | - పరిశుద్ధుడు |
| | - శరీరము ప్రాణముయొక్క వశములో ఉన్నది. |

*****

# తృతీయః ప్రశ్నః

### అశ్వలుని కుమారుడగు కౌసల్యుని ప్రశ్నలు

1. అథ హైనం కౌసల్యశ్చాశ్వలాయనః పప్రచ్ఛ భగవన్ కుత ఏష ప్రాణో జాయతే కథ మాయాత్యస్మిఞ్ఛరీరే ఆత్మానం వా ప్రవిభజ్య కథం ప్రాతిష్ఠతే కేనోత్క్రమతే కథం బాహ్యమభిదత్తే కథ మధ్యాత్మమితి ॥

అథ - హ - ఏనం - కౌసల్యః - చ - అశ్వలాయనః - పప్రచ్ఛ - భగవన్ - కుతః - ఏషః - ప్రాణః - జాయతే - కథమ్ - ఆయాతి - అస్మిన్ - శరీరే - ఆత్మానం - వా - ప్రవిభజ్య - కథం - ప్రాతిష్ఠతే - కేన - ఉత్క్రమతే - కథమ్ - బాహ్యమ్ - అభిదత్తే - కథమ్ - అధ్యాత్మమ్ - ఇతి.

| | | |
|---|---|---|
| అథ | = | గురువగు పిప్పలాదుడు - రెండవ ప్రశ్నకు పాఠం చెప్పిన తర్వాత |
| అశ్వలాయనః | = | అశ్వలుని కుమారుడగు |
| కౌసల్యః | = | కౌసల్యుడు - గురువును సమీపంచి వినయముగా |
| భగవన్ | = | ఓ భగవాన్ ప్రాణము తనంత తానే యీ శరీరంలోనికి వచ్చినదా? లేక ఎవరి వలన నయినా యీ శరీరంలోనికి వచ్చినదా? ఈ ప్రాణము స్వయంభువా? లేక ఎవరి వలన నయినా గలుగుచున్నదా? అలాగయితే |
| కుతః+ ఏషః | = | ఎవని వలన ఈ |
| ప్రాణః+జాయతే | = | ప్రాణము గలుగుచున్నది? (మొదటి ప్రశ్న) |
| చ | = | మఱియు |
| అస్మిన్ + శరీరే | = | ప్రాణము ఈ శరీరములోనికి |
| కథం+ఆయాతి | = | ఎట్లు వచ్చుచున్నది? (రెండవ ప్రశ్న) |
| ఆత్మానం+వా + ప్రవిభజ్య + కథం+ప్రాతిష్ఠతే | = | ఇంతకు ముందు ఒక ప్రశ్నకు సమాధానముగా ప్రాణము ఇంద్రియములతో తనే శ్రేష్ఠమని చెప్పు సందర్భమున తనని తనే ఐదు విధములుగా విభజించుకొని ఈ ఉపాధులలో ఉన్నానని చెప్పినది. అయితే ఈ ప్రాణం తనని తనే ఎలా విభజించుకొని ఎట్లు ఈ శరీరములో నివసించుచున్నది? |



ఒకటిగా యున్న ప్రాణము తనని తనే విభజించుకొన్న ఆ ఐదు ప్రాణముల పేర్లు ఏమిటి? తనని తానే విభజించుకొని శరీరములో ఏఏ స్థానములలో అవి వుంటున్నవి? (మూడవ ప్రశ్న)

| | | |
|---|---|---|
| కేన+ఉత్క్రమతే | = | దేనితో కలసి యీ ప్రాణము శరీరము నుండి వెడలిపోవుచున్నది? (నాల్గవ ప్రశ్న) ప్రాణము శరీరములో ఏ ఏ స్థానములలో ఏ ఏ పేర్లతో ఉన్నది? ఐదు ప్రాణములు ఏమిటి? (ఐదవ ప్రశ్న) |
| కథం+ఇతి | = | ప్రాణము మరణ కాలమున శరీరమును ఎట్లు వీడును అని ఆఱు ప్రశ్నలను |
| ఏనం+పప్రచ్ఛ | = | గురువుని వినయముగా ప్రశ్నించెను. |

ఆత్మ పరముగా:-

| | | |
|---|---|---|
| కుతః+ఏష+జాయతే | = | ఆత్మ ఎవని వలన గలుగుచున్నది? |
| అస్మిన్ +శరీరే+కథం+ ఆయాతి | = | ఈ శరీరములోనికి ఎట్లు వచ్చుచున్నది? |
| ఆత్మానంవా+ప్రవిభజ్య కథం+ప్రాతిష్ఠతే | = | తనని తను విభజించుకొని ఎట్లు ఈ శరీరములో నివసించుచున్నది? |
| కేన + ఉత్క్రమతే | = | దేనితో కలసి ఈ శరీరము నుండి వెడలి పోవుచున్నది? |
| అధ్యాత్మం+కథం+ బాహ్యం+ఇతి | = | ఆత్మ బాహ్యాజగత్తులో ఏ ఏ నామములతో పిలువబడుచున్నది? |

*****

**2. తస్మై స హో వాచాతి ప్రశ్నాన్ పృచ్ఛసి బ్రహ్మిష్ఠోఽసీతి**
**తస్మాత్తేఽహం బ్రవీమి ॥**

తస్మై - సః - హ - ఉవాచ- అతి ప్రశ్నాన్ - పృచ్ఛసి - బ్రహ్మిష్ఠః - అసి - ఇతి - తస్మాత్ - తే - అహం - బ్రవీమి.

| | | |
|---|---|---|
| తస్మై | = | కౌసల్యునితో |
| సః | = | గురువగు పిప్పలాదుడు, నీవు |
| అతిప్రశ్నాన్+హ | = | విశిష్ఠములయిన ప్రశ్నలను |
| పృచ్ఛసి+ఇతి | = | అడిగితివి అని |
| ఉవాచ | = | పలికెను |
| బ్రహ్మిష్ఠః+అసి | = | నీవు బ్రహ్మనిష్ఠుడవు |
| తస్మాత్ | = | కావున |
| అహం+తే | = | నేను నీకు నీవడిగిన ప్రశ్నలన్నింటికి |
| బ్రవీమి | = | సమాధానముగా పాఠం చెప్పెదను. |

*****

**3. ఆత్మన ఏష ప్రాణో జాయతే । యథైషా పురుషే ఛాయై**
**తస్మిన్నేతదాతతం మనోకృతే నా యాత్యస్మిఞ్ఛరీరే ॥**

ఆత్మనః - ఏషః - ప్రాణః - జాయతే - యథా - ఏషా - పురుషే - ఛాయా - ఏతస్మిన్ - ఏతత్ - ఆతతం - మనః - కృతేన - ఆయాతి - అస్మిన్ - శరీరే

**ఎవని వలన ఆత్మ మఱియు ఈ ప్రాణము గలుగుచున్నది? (మొదటి ప్రశ్న)**

| | | |
|---|---|---|
| ఏషః+ఆత్మానం | = | తనంత తానుగా గలుగుచున్నది. అనగా |
| జాయతే | | స్వయంభువు. |
| యథాపురుషే+ఏషా+ ఛాయా | = | ఆత్మ, జీవాత్మలు, పురుషుడు అతని ఛాయ వంటివి. |
| ఏషః+ప్రాణః | = | ఈ ప్రాణము |
| ఆత్మనః | = | ఆత్మ వలన |
| జాయతే | = | గలుగుచున్నది. |



| | | |
|---|---|---|
| యథా | = | ఏ విధముగా |
| పురుషే+ఏషా+ | = | పురుషుని వలన ఛాయ గలుగునో ఆ విధముగా |
| ఛాయా | | ఈ ప్రాణము ఆత్మ వలన గలుగుచున్నది. |

ఛాయకు స్వయం ప్రతిపత్తి లేదు. ఛాయ పురుషుని అనుసరించి ఉండును. ఛాయ (నీడ)పై నీళ్ళు చల్లినా, జాతితో కొట్టినా- పురుషుడు తడవడు, బాధపడడు. కావున ప్రాణ ధర్మములు, ఆత్మధర్మములు ఒకటి కావు. అవి వేఱు వేఱు. కాని పురుషుని అనుసరించియే ఛాయ ఉండును. జీవుడు ఎప్పుడు శరీరము లోనికి వచ్చునో అప్పుడే ప్రాణము కూడ ఈ శరీరంలోనికి వచ్చును. ఎప్పుడు జీవుడు ఈ శరీరము వదలి వెళ్ళునో అప్పుడు ప్రాణము కూడ ఈ శరీరమును వదలి వెళ్ళును.

**ప్రాణము ఈ శరీరములోనికి ఎట్లు వచ్చుచున్నది? (రెండవ ప్రశ్న)**

| | | |
|---|---|---|
| మనః+కృతేన+ | = | తన సంకల్పానుసారము తనంత తానుగా ఆత్మ |
| అస్మిన్+శరీరే+ | | ఈ శరీరములోనికి వచ్చుచున్నది. జీవుని |
| ఆయాతి | | కర్మానుసారము వచ్చుచున్నది. |
| అస్మిన్+శరీరే | = | ఈ శరీరములోనికి |
| ఆయాతి | = | ఆత్మ వలన వచ్చుచున్నది. ఈ ప్రాణమును |
| మనః+కృతేన | = | మనస్సుచే నియమించ వచ్చును. |

మనస్సుకు ప్రాణమునకు ఒక సంబంధము గలదు. మనస్సు ఉద్రేకపడిన ప్రాణము ఉద్రేకపడును. మనస్సు ప్రశాంతంగా యున్న ప్రాణము ప్రశాంతముగా ఉండును. మనస్సు నిశ్చలముగాయున్న ప్రాణము నిశ్చలముగా ఉండును. లేదా ప్రాణము స్వాధీనమయిన మనస్సు స్వాధీనమగును. అందువలన ప్రాణాయామము ప్రత్యేకంగా చెప్పవలసిన పనిలేదు. ధ్యానయోగముతోనే ప్రాణము స్వాధీనమగును.

| | | |
|---|---|---|
| ఏతత్+ఏతస్మిన్+ | = | జీవరూపమున దేహమంతా అనగా నఖశిఖ |
| ఆతతః | | పర్యంతము వ్యాపించి ఉన్నది. |
| ఏతత్+ఏతస్మిన్ | = | ఈ ప్రాణము- శరీరమునందు సర్వత్రా వ్యాపించి యున్నది.అనగా నఖ శిఖ పర్యంతము |

ఆతతం = వ్యాపించియున్నది.

*****

4. **యథా సమ్రాడేవాధికృతాన్ వినియుంక్తే । ఏతాన్ గ్రామానేతాన్ గ్రామానధితిష్ఠస్వే త్యేవ మే వైష ప్రాణ ఇతరాన్ ప్రాణాన్ పృథక్ పృథగేవ సన్నిధత్తే ॥**

యథా - సమ్రాట్ - ఏవ - అధికృతాన్ - వినియుంక్తే - ఏతాన్ - గ్రామాన్ ఏతాన్- గ్రామాన్ - అధితిష్ఠస్వ - ఇతి - ఏవమ్ - ఏవ - ఏషః - ప్రాణః - ఇతరాన్ - ప్రాణాన్ - పృథక్ - పృథక్ - ఏవ - సన్నిధత్తే.

**ఆత్మ/ప్రాణం తనని తనే ఎలా విభజించుకొని ఎట్లు ఈ శరీరంలో నివసించుచున్నది?**

(మూడవ ప్రశ్న) దీనిని ఉదాహరణ రూపమున వివరించెదను.

ఆత్మ/ప్రాణము చక్రవర్తి- ఇది మొత్తం శరీరమును పాలించు అధికారము గలది. అయినను చక్రవర్తి పరిపాలనా సౌలభ్యంబునకై ఇతర ఉద్యోగస్థులను నియమించును. అటులనే ప్రాణము- మిగిలిన ప్రాణములను నియమించినది. వాటికి పనులను కేటాయించినది. స్థల నిర్దేశము చేసినది.

ఆత్మ హృదయగుహలోని ఆత్మగా, జీవాత్మగా తనని తను విభజించుకొని ఈ శరీరములో ఉంటున్నది. ఆత్మ చక్రవర్తి. జీవుడు యువరాజు. ఆత్మ దేవతలకు, దేహేంద్రియమనోబుద్ధులకు విధులను నిర్ణయించును.

యథా = ఏవిధముగా

సమ్రాట్+ఏవ = చక్రవర్తే

ఏతాన్+గ్రామాన్+ = ఈఈ గ్రామములను, ఈఈ
ఏతాన్+గ్రామాన్ గ్రామములకు

అధితిష్ఠస్వ+ఇతి = నీవు అక్కడ అధికారిగా ఉండి పాలింపుము అని

అధికృతాన్ = అధికారులను

వినియుంక్తే = నియమించునో



ఏవమ్+ఏవ = ఆ విధముగనే ముఖ్య ప్రాణము ఈ శరీరములో చక్రవర్తి వలె

ఏషః+ప్రాణః = ఈప్రాణము

ఇతరాన్+ప్రాణాన్ = మిగిలిన ప్రాణ అపాన, సమాన, వ్యాన, ఉదానములను

పృథక్+పృథక్+ఏవ = వేఱు వేఱు స్థానములందు మఱియు వేఱు వేఱు పనులయందు

సన్నిధత్తే = నియోగించును.

ప్రాణము వశమయిన మిగిలిన ప్రాణములు వశమగును.

*****

వాటి వాటి స్థానములు

5. **పాయూపస్థేఽపానం చక్షుః శ్రోత్రే ముఖనాసికాభ్యాం ప్రాణః స్వయం ప్రాతిష్ఠతే మధ్యేతు సమానః । ఏషహ్యే తద్ధుతమన్నం సమం నయతి తస్మాదేతాః సప్తార్చిషో భవంతి ॥**

పాయు - ఉపస్థే - అపానం - చక్షుః - శ్రోత్రే - ముఖనాసికాభ్యాం - ప్రాణః - స్వయం - ప్రాతిష్ఠతే - మధ్యే - తు - సమానః - ఏషః - హి - ఏతత్ - హుతం - అన్నం - సమం - నయతి - తస్మాత్ - ఏతాః - సప్తార్చిషః - భవంతి

**ఆ ఐదు ఏమిటి? శరీరంలో ఏవేవి ఏఏ స్థానములలో వుంటున్నవి?** చక్రవర్తి యొక్క అధికారం అతని రాజ్యమంతా ఉంటుంది. అయితే చక్రవర్తి మాత్రము తన రాజసౌధమున ఉండును. అటులనే చక్రవర్తి వంటిదగు

**ప్రాణము**

చక్షుః+శ్రోత్రే+ముఖనాసికాభ్యాం+= నేత్రము, చెవులు, ముఖము, (నోరు),
స్వయం+ ప్రాణః+ప్రాతిష్ఠతే ముక్కులలో ప్రాణము ఉండును

అగ్నికి ఏడు జ్వాలలు. అటులనే ప్రాణమునకు ఈ ఏడు స్థానములు.

ఏతాః = 2 నేత్రములు, 2 చెవులు, 2 ముక్కురంధ్రములు,

నోరు అనునవి ప్రాణమునకు

| | | |
|---|---|---|
| సప్తార్చిషః | = | ఏడు జ్వాలలు |
| భవంతి | = | అగుచున్నవి. ఈ ప్రాణము ఆహారమును గ్రహించును |

**అపానము**

| | | |
|---|---|---|
| పాయు+ఉపస్థే+ అపానమ్ | = | గుదము, గుహ్యములలో- అపానము వుంటుంది. ఈ అపానము మలమూత్రములను విసర్జించును |

**సమానం**

| | | |
|---|---|---|
| మధ్యే+తు+ సమానః | = | శరీరమధ్య భాగమగు నాభి ప్రాంతంలో సమాన వాయువు ఉండును. దీనినే జఠరాగ్ని అని అందురు. ఇది ఆహారమును పచనము చేయును. |

**సమాన వాయువు చేయు పని**

| | | |
|---|---|---|
| ఏషః+హి+ఏతత్+ అన్నం+హుతం+ సమం+నయతి | = | ఈ సమాన వాయువు మనము తిన్న ఆహారమును జీర్ణము చేసి ఆశక్తిని మరల శరీరములోని అన్ని భాగములకు సమముగా తీసుకొని పోయి సమముగా పంచును. |
| తస్మాత్ | = | అందువలన యిది సమాన వాయువు అని పిలువ బడుచున్నది. ఇదే జఠరాగ్ని. ఇదే వైశ్వానరాగ్ని. |

ఆత్మగా హృదయస్థానమున, జీవాత్మగా నఖశిఖపర్యంతము అనగా దేహమున ఉండును.

స్వయం+ప్రాతిష్ఠతే = తనంతతానుగా హృదయగుహలో ఉండును. జీవరూపమున కర్మానుసారము దేహమును పొంది ఆ ఉపాధిలో ఉండును.

*****





**6. హృది హ్యేష ఆత్మా । అత్రైతదేకశతం నాడీనాం తాసాం శతం శతమేకైకస్యాం ద్వాసప్తతిర్ద్వాసప్తతిః ప్రతిశాఖానాడీ సహస్రాణి భవంత్యాసు వ్యానశ్చరతి ॥**

హృది - హి - ఏషః - ఆత్మా- అత్ర - ఏతత్ - ఏకశతం - నాడీనాం - తాసాం - శతం - శతమ్ - ఏకైక - స్యాం - ద్వాసప్తతిః - ద్వాసప్తతిః - ప్రతిశాఖానాడీ - సహస్రాణి - భవంతి - ఆసు - వ్యానః - చరతి

| | | |
|---|---|---|
| ఏషః+ఆత్మా+ హృది+హి | = | ఈ ఆత్మ హృదయ గుహలో ఉండును. జీవాత్మ స్థానం నాభి. |

ప్రాణమునకు నాడీ కేంద్రం కిష్కింధ. సమస్తనాడులకు కేంద్రస్థానము నాభి లేక కిష్కింధ. ఈ కిష్కింధలో ఋశ్యమూక పర్వతం, ప్రస్రవణగిరి ఉన్నాయి. అనగా నాభి వద్ద గల చిన్న చిన్న బిందువులుగా వుండే స్థానములే యీ పర్వతములు. ఈ కిష్కింధనుంచే వానరులు సీతను వెతక బయలు దేరినారు. కిష్కిందాధిపతి అయిన సుగ్రీవుడు స్నేహితుడయిన రావణ సంహారము చేసి సీతను పొందగలము.

**నాడులు**

| | | |
|---|---|---|
| అత్ర | = | ఈ నాభి స్థానమునుండి |
| ఏతత్+ఏకశతం+ నాడీనాం | = | నూట ఒక్క నాడులు - ఆనాడుల యొక్క ప్రస్తారము బయలుదేరును. |
| తాసాం+శతం+ ఏకైక+స్యాం+శతం | = | 101 నాడులలో ఒకనాడి అలానే ఉండును మిగిలిన నూఱు నాడులు ఒక్కొక్కటి నూఱు శాఖలుగా విభజింపడును 100×100=10,000 |
| ద్వాసప్తతిః | = | అవి ఒకొక్కటి 72గా విభజింపబడును 10,000×72 = 7,20,000 |
| ద్వాసప్తతిః | = | 72,000×72. 5,18,40,000లు వీటిని ప్రతి శాఖానాడులందురు |

ప్రతిశాఖానాడీ+ = ప్రతి శాఖానాడీ ఒకొక్కటి వేయిగా

సహస్రాణి+భవంతి విభజింపబడును. ఈ నాడులు సూక్ష్మ శరీరములో ఉండును. ఇవి స్థూల శరీరములోని నాడులు కావు.

**వ్యానవాయువు**

ఆసు+వ్యానః+చరతి = ఈ 518.4 కోట్ల నాడులలో వ్యానవాయువు చరించును.సూర్యకిరణములు సర్వత్రా వ్యాపించు నట్లు ఈ వ్యానవాయువు శరీరమంతా వ్యాపించి ఉండును. వ్యానమనగా వ్యాపించి ఉండునది అని అర్థము. పూర్ణ కుంభకమున వ్యానము యొక్క శక్తి విజృంభించును.

నాడులు - శంకరాచార్యుల ప్రకారము నాడులు 101. ఇవి ఒక్కొక్కటి నూఱు భాగములు అయినవి. 101 x 100 = 10100

అవి మరల ఒక్కొక్కటి 72,000 (72 వేలు అయినవి)

10,100 x 72,000 = 72,72,00,000

కావున 72,72,00,000
10,101
101

72,72,10,201 = 72.7 కోట్లు

వ్యాసభగవానుని ప్రకారము 76 కోట్ల 20 లక్షలు.

బ్రహ్మవిద్యా సంప్రదాయము ప్రకారము - 518.4 కోట్లు

వాల్మీకి ప్రకారము - అసంఖ్యాకము

వీటిని అంకెల ద్వారా కాక అసంఖ్యాకము అని గ్రహించవలయును.

స్థూల శరీరములోని ధమనులకు, సిరలకు ఈ నాడులకు సంబంధము లేదు. ఈనాడులు బాహ్య దృష్టికి గోచరింపవు. ఇవి సూక్ష్మ శరీరములో ఉండును.

*****



ఉదాన వాయువు

7. **అథైక యోర్ధ్వం ఉదానః పుణ్యేన పుణ్యం లోకం నయతి ।**
**పాపేన పాపముభాభ్యామేవ మనుష్యలోకం ॥**

అథ - ఏకయా - ఊర్ధ్వమ్ - ఉదానః - పుణ్యేన - పుణ్యం - లోకం - నయతి - పాపేన - పాపమ్ - ఉభాభ్యామ్ - ఏవ - మనుష్యలోకం

**ఉదాన వాయువు**

ఏకయా+ఉదానః = నూటొక్క నాడులలో 100 నాడులలో వ్యానవాయువు చరించును. ఆ మిగిలిన ఒక నాడిలో అనగా సుషుమ్నా నాడిలో ఉదాన వాయువు చరించును.

స్థూలశరీరములో- ప్రాణము, అపానము, సమానములు గలవు. సూక్ష్మశరీరములో- వ్యానము, ఉదానము గలవు. ఇలా ప్రాణము 5గా విభజించుకొని ఆయా స్థానములలో ఉండి ఆయా పనులు చేయుచున్నది.

**దేనితో కలసి ఈ ఆత్మ ప్రాణము శరీరము నుండి వెడలిపోవు చున్నది?**

(నాలుగవ ప్రశ్న)

మరణము తర్వాత - సూక్ష్మశరీరములో ఉదాన వాయువుగా యున్న ప్రాణము జీవుడు చేసిన పుణ్యపాపములను వెంట తీసుకొని పోవుచున్నది. ఆ పాప పుణ్యముల ఫలితముగా జీవునకు పునర్జన్మ గలుగుచున్నది.

మానవుడు మరణించినతర్వాత అనగా జీవుడు స్థూల శరీరమును వీడిన తర్వాత సూక్ష్మశరీరములో జీవుడు ఉండును. జీవుడు చేసిన కర్మ ఫలితము సూక్ష్మశరీరమున నిల్వయుండి పునర్జన్మకు కారణ మగును. లింగ శరీరము భంగమయిన కాని ఆత్మస్థానమునకు చేరలేము.

అథ = ఈ సూక్ష్మ శరీరములో ఉదాన వాయువు గలదు. ఆ ఉదాన వాయువు

ఊర్ధ్వం(సన్) = పై లోకములకు ప్రయాణమైన

ఉదానము ద్వారా

పుణ్యేన = పుణ్యకర్మల వలన గలిగిన ఫలితము చేత

పుణ్యంలోకం = (బ్రహ్మ లోకమును) పుణ్యలోకములను

నయంతి = చేర్చును. దీనినే అగ్నిహోత్రం యొక్క ఆహుతులు అని అవి బ్రహ్మలోకం చేర్చును అని ముండక ఉపనిషత్‌లో చెప్పినాడు.

పాపేన+పాపం = పాపకర్మల వలన గలిగిన ఫలితము చేత నరకమును చేర్చును.

ఉభాభ్యామ్ = పుణ్య పాప కర్మ మిశ్రమము వలన

మనుష్యలోకం+ఏవ = తిరిగి భూలోకమునకే వచ్చును.

*****

**8. ఆదిత్యో హ వై బాహ్యః ప్రాణ ఉదయత్యేష హ్యేనం చాక్షుషం ప్రాణ మనుగృహ్ణానః । పృథివ్యాం యా దేవతాసైషా పురుషస్యాపాన మవష్టభ్యాంతరా యదా కాశః స సమానో వాయు ర్వ్యానః ॥**

ఆదిత్యః - హ - వై - బాహ్యః - ప్రాణః - ఉదయతి - ఏషః - హి - ఏనం - చాక్షుషం - ప్రాణం - అనుగృహ్ణానః - పృథివ్యాం - యా - దేవతా - సా - ఏషా- పురుషస్య - అపానమ్ - అవష్టభ్య - అంతరా - యత్ - ఆకాశః - సః - సమానః - వాయుః - వ్యానః

**బాహ్యజగత్తులో ఆత్మ. ఆ అయిదు ప్రాణములు ఏమిటి ?** (ఐదవ ప్రశ్న) అధి భౌతికంగా అవి ఏమిటియో చెప్పుచున్నాడు. కన్నులలో గల ఈ ప్రాణమును అనగా

ప్రాణః = ప్రాణము

ఏనం+ప్రాణం+ చాక్షుషం = ఈ ప్రాణము కన్నులలో కలదు



ఆత్మ పరముగా:-

బాహ్యః+ఏషః+ఆదిత్యః = ఈ ఆత్మ బాహ్య జగత్తులో ఆదిత్యునిగా గలదు.

హ+వై+ఏషః+అనుగృహ్ణాతి= అధ్యాత్మ,అధిదైవిక అధిభౌతిక రూపమున ఇతడు ప్రజల కర్మలననుసరించి వారిని అనుగ్రహించు చున్నాడు. ఆత్మ అధిభౌతికముగా సూర్యుడు.

ఉదయతి = సూర్యునిగా ఇతడు తూర్పు దిక్కున ఉదయించుచున్నాడు.

అపానమ్+పురుషస్య+ అవష్టభ్య = అపానముగా పురుషుని యొక్క గుద స్థానమున గలదు

యా+పృథివ్యామ్ ఏషా+సా+దేవతా+ = ఆత్మ అధిభౌతికముగా భూమి. పంచభూతములలో నొకటి అయిన భూమిలో గలదు.

(యః)యత్+సమానః+ = శరీరమందు గల సమాన వాయువుగా నాభి స్థానమున గలదు.

సః+అంతరా+ఆకాశః = ఆత్మ బాహ్య జగత్తులో ఆకాశము. ఆవిధముగా పంచభూతములలో నొక్కటైన ఆకాశము గలదు.

వ్యానః = శరీరమందలి వ్యానవాయువు నాడులలో వ్యాపించి ఉన్నది.

వాయుః = అధి భౌతికముగా వాయువు

ఆత్మ బాహ్య జగత్తులో

ఆత్మ బాహ్య జగత్తులో - ఆదిత్యుడు

- పంచభూతములు అయిన భూమి,(జలము), అగ్ని,వాయువు, ఆకాశము మఱియు పంచభూతములలో ఆత్మ కలదు.

*****

**9. తేజో హ వై ఉదానస్తస్మాదుపశాంత తేజాః పునర్భవ మింద్రియై ర్మనసి సంపద్యమానైః**

తేజః - హ - వై - ఉదానః - తస్మాత్ - ఉపశాంత తేజాః - పునః - భవమ్ - ఇంద్రియైః - మనసి - సంపద్యమానైః.

| | | |
|---|---|---|
| తేజః | = | ఆత్మ అధిభౌతికముగా అగ్ని. బాహ్య జగత్తులో అగ్ని. |
| ఉదానః+హ | = | ఉదానవాయువు సుషుమ్నా నాడిలో కలదు. |
| వై+తస్మాత్ | | |
| ఇంద్రియైః+మనసి+ సంపద్యమానైః | = | జీవుడు ఇంద్రియములు చేతచేయబడిన పుణ్య పాపకర్మల ఫలితము మనస్సు నందు నిల్వఉండి కర్మఫలము జీవుని చేత అనుభవింప చేయుటకు యీ ఉదాన వాయువు జీవుని ఊర్ధ్వలోకములకు చేర్చును. అక్కడ పుణ్యాను భవమునకై బ్రహ్మలోకమును, పాపానుభవమునకై నరక లోకమును చేర్చును. |
| ఉపశాంత తేజాః | = | అగ్ని చల్లారిన తర్వాత అనగా ఆ ఊర్ధ్వ లోకములలో పుణ్య ఫలితము క్షీణించగనే భూలోకమున జీవుడు |
| పునః+భవమ్ | = | ఆ కర్మల ఫలితముల ప్రకారము మరల జన్మించును. |

పుణ్య-పాపముల ఫలితమున పుణ్యలోకములు-నరకము గలుగును. అవి క్షీణించగానే తిరిగి పునర్జన్మకు వత్తురు.

*****

### మరణకాలమున - శరీరమును ఎట్లు వీడును?

**10. యచ్చిత్తస్తేనైష ప్రాణ మాయాతి । ప్రాణస్తేజసా యుక్తః ।
సహాత్మనా యథా సంకల్పితం లోకం నయతి ॥**



యచ్చిత్తః - తేన - ఏషః - ప్రాణమ్ - ఆయాతి - ప్రాణః - తేజసా యుక్తః - సహా - ఆత్మనా - యథా - సంకల్పితం - లోకం - నయతి

| | | |
|---|---|---|
| ఏషః | = | ఈ జీవుడు మరణ కాలములో |
| యచ్చిత్తః | = | ఏ ఆలోచనలు కలిగివుండునో |
| తేన | = | ఆ ఆలోచనలతో - అతడు |
| యథా+సంకల్పితం +లోకం | = | అతడు కోరిన కోరికల ప్రకారము అతడు చేసిన కర్మ ఫలము ప్రకారము ఆ ఆ లోకములకు వెళ్ళి పునర్జన్మకు |
| ఆయాతి | = | వచ్చును |
| యుక్తః (సన్) | = | కర్మ ఫలితముతో కూడినదై - దేహమును వీడిన పిదప జీవుడు తను చేసిన |
| ఆత్మనా+సహ | = | పుణ్యపాపములతో కలసి |
| నయతి | = | పోవును |
| ప్రాణః | = | ప్రాణము |
| తేజసా | = | తేజస్సుతో కలసి పోవును. జీవుడు |
| ప్రాణం | = | ప్రాణమును వీడును అనగా మరణించును. |

జీవుడు మరణసమయమున చిత్తసంకల్పానుసారము పునర్జన్మకు వచ్చును. ఉదాహరణ భరతుడు మరణ సమయమున తను పెంచిన లేడిని తలచెను. గావున ఆ లేడి కడుపున జన్మించెను. ఆ తరువాత ఆ లేడి మరణించి జడభరతుడుగా పుట్టెను.

*****

**11. య ఏవం విద్వాన్ ప్రాణం వేద న హాస్య ప్రజా హీయతేఽమృతో భవతి ॥ తదేష శ్లోకః**

యః - ఏవం - విద్వాన్ - ప్రాణం - వేద - న - హ -అస్య - ప్రజాః - హీయతే అమృతః - భవతి - తత్ - ఏషః - శ్లోకః

| | | |
|---|---|---|
| యః+విద్వాన్ | = | ఏ విద్వాంసుడు |
| ఏవం+వేద | = | ఈ విధముగా తెలుసుకొనునో అతడు |
| అస్య+ప్రజాః | = | అతని సంతానము |
| న+హీయతే+హ | = | నశింపదు, వారు సాధనచేసి |
| అమృతః+భవతి (భవంతి) | = | అమృతులగుదురు |
| తత్+ఏష+శ్లోకః | = | అని యీ శ్లోకము చెప్పుచున్నది. |
| ప్రాణం | = | ప్రాణమును గుఱించి - వాటి స్థానముల గుఱించి అవి చేయు పనుల గుఱించి తెలుసుకొనవలయును. |

*****

**12. ఉత్పత్తి మాయతిం స్థానం విభుత్వం చైవ పంచధా। అధ్యాత్మం చైవ ప్రాణస్య విజ్ఞాయామృతమశ్నుతే విజ్ఞాయామృతమశ్నుత ఇతి ॥**

**ఇతి ప్రశ్నోపనిషది తృతీయః ప్రశ్నః**

ఉత్పత్తిమ్ - ఆయతిం(ఆయాతిం) - స్థానం - విభుత్వం - చ - ఏవ - పంచధా - అధ్యాత్మం - చ - ఏవ - ప్రాణస్య - విజ్ఞాయ - అమృతమ్ - అశ్నుతే - విజ్ఞాయ - అమృతమ్ - అశ్నుత - ఇతి.

| | | |
|---|---|---|
| ఉత్పత్తిం | = | ప్రాణము యొక్క ఉత్పత్తిని |
| ఆయతిం (ఆయాతిం) | = | శరీరములో లోనికి ఎలా వచ్చినది అనగా రాకను |
| స్థానం | = | పంచ ప్రాణముల యొక్క స్థానమును |
| విభుత్వం | = | మిగిలిన ప్రాణములపై అధికారమును |
| పంచధా+ఏవ | = | తనని విభజించుకొని యేయే స్థానము లందు ఉన్నదో ఆ స్థానములను |
| చ | = | అవి చేయు పనులను |
| విజ్ఞాయ+చ+ఏవ | = | ప్రాణము యొక్క చేష్టలను తెలుసుకొనినవాడు మఱియు |
| అధ్యాత్మం | = | ఆత్మ తత్త్వమును అనగా |
| ఉత్పత్తిం | = | ఆది పురుషుడు, విరాట్పురుషులను |
| ఆయతిం | = | హృదయగత ఆత్మగా, జీవాత్మగా శరీరములోనికి రాకను - శరీరములో |
| స్థానం | = | ఆత్మ, జీవాత్మల స్థానమును |
| విభుత్వం | = | వాటి ఆధిపత్యమును |
| విజ్ఞాయ+ఏవ | = | దహించినవాడు |
| అమృతం+అశ్నుతే | = | అమృతత్త్వమును పొందును. |
| విజ్ఞాయ అమృతమ్+ (అశ్నుతే) అశ్నుత+ఇతి | = | అమృతత్త్వమును పొందును |

*****

# చతుర్థః ప్రశ్నః

త్రయావస్థల గుఱించి ఇందు వివరింపబడును.

**1.** **అథ హైనం సౌర్యాయణీ గార్గ్యః పప్రచ్ఛ । భగవన్నే తస్మిన్ పురుషే కాని స్వపంతి కాన్యస్మిన్ జాగ్రతి కతర ఏష దేవః స్వప్నాన్ పశ్యతి కస్యై తత్ సుఖం భవతి కస్మిన్ను సర్వే సమ్ప్రతిష్ఠితా భవన్తీతి ॥**

అథ - హ - ఏనం - సౌర్యాయణీ(సౌర్యాయణిః) - గార్గ్యః - పప్రచ్ఛ - భగవన్ - ఏతస్మిన్ - పురుషే - కాని - స్వపంతి - కాని - అస్మిన్ - జాగ్రతి - కతరః - ఏషః - దేవః - స్వప్నాన్ - పశ్యతి - కస్య - ఏతత్ - సుఖం - భవతి - కస్మిన్ - ను - సర్వే - సంప్రతిష్ఠితా - భవంతి - ఇతి.

| | | |
|---|---|---|
| అథ | = | అశ్వలుని కుమారుడగు కౌసల్యుడు అడిగిన ప్రశ్నకు గురువుగారు పాఠం చెప్పిన తర్వాత |
| సౌర్యాయణ(సౌర్యాయణిః)= +గార్గ్యః | | గార్గ్య వంశస్థుడగు సూర్యుని మనుమడు, గురువగు పిప్పలాదుని సమీపించి |
| భగవన్ | = | ఓ భగవాన్ |
| కస్మిన్+ను+సర్వే+ సంప్రతిష్ఠితా+భవంతి +ఇతి | = | ఎవని యందు యీ సర్వము- ప్రతిష్ఠితమై యున్నవి? - 1వ ప్రశ్న |
| ఏతస్మిన్+పురుషే+ హ+కాని+స్వపంతి | = | ఈ పురుషుని యందు అనగా హృదయగుహలో గల ఆత్మ, దేహమందు గల జీవుడు, ప్రాణం, మనస్సు, ఇంద్రియాదులలో ఏవి నిద్రించుచున్నవి? - 2వ ప్రశ్న |
| అస్మిన్+కాని+జాగ్రతి | = | వాటిలో ఏవి మేలుకొని యున్నవి 3వ ప్రశ్న |
| కతరః+ఏషః+దేవః+ స్వప్నాన్+పశ్యతి | = | వీరిలో ఏ దేవుడు అనగా ఎవడు స్వప్నములను చూచుచున్నాడు 4వ ప్రశ్న |
| ఏతత్+సుఖం+కస్య+ భవతి | = | ఈ సుఖము ఎవరికి గలుగుచున్నది? 5వ ప్రశ్న |
| ఏనం+ పప్రచ్ఛ | = | ఐదు ప్రశ్నలను వినయంగా అడిగెను |

కైవల్య ఉపనిషత్‌లో జీవుని త్రయావస్థలగుఱించి చెప్పినదానినే ఈ ఉపనిషత్‌లో ఇట్లు వివరించుచున్నాడు.

*****

సుషుప్తి అవస్థ - ఏవి నిద్రించుచున్నవి?

**2.** **తస్మై సహోవాచ । యథా గార్గ్య మరీచయోఽర్కస్యాస్తం గచ్ఛతః సర్వా ఏతస్మిన్ స్తేజోమండల ఏకీ భవంతి । తాః పునః పునరుదయంతః ప్రచరన్త్యేవం హ వై తత్ సర్వం పరే దేవే మనస్యేకీభవంతి । తేన తర్హ్యేష పురుషో న శృణోతి న పశ్యతి న జిఘ్రతి న రసయతే న స్పృశతే నా భివదతే నా దత్తే నా నందయతే న విసృజతే నే యాయతే స్వపితీత్యా చక్షతే ॥**

తస్మై - సః - హ - ఉవాచ - యథా - గార్గ్య - మరీచయః - అర్కస్య - అస్తం - గచ్ఛతః- సర్వాః - ఏతస్మిన్ - తేజోమండల - ఏకీభవంతి - తాః - పునః - పునః - ఉదయంతః - ప్రచరంతి - ఏవం - హ - వై - తత్ - సర్వం - పరే - దేవే - మనసి - ఏకీభవంతి - తేన - తర్హి - ఏషః - పురుషః - న - శృణోతి - న - పశ్యతి - న - జిఘ్రతి - న - రసయతే - న స్పృశతే - న - అభివదతే - న - ఆదత్తే - న - ఆనందయతే - న - విసృజతే - న - ఇమాయతే - స్వపితి - ఇతి - ఆచక్షతే.

| | | |
|---|---|---|
| గార్గ్య | = | ఓ గార్గ్యవంశస్థుడా |
| యథా | = | ఏ విధముగా అధి భౌతికమయిన సూర్యుడు అస్తమించుచుండగా అనగా |
| అస్తం+గచ్ఛతః | = | అస్తమించుచున్న |
| అర్కస్య | = | సూర్యుని యొక్క |
| సర్వాః+మరీచయః | = | అన్ని కిరణములు |
| ఏతస్మిన్+తేజోమండల (తేజోమండలే)+ఏకీభవంతి | = | ఈ సూర్యుని యందు ఏకీభూతమై |

| | | |
|---|---|---|
| తాః+పునః+పునః | = | మరల ఆ కిరణములు సూర్యుడు |
| ఉదయంతః+యదా | = | ఉదయించగా ఏ విధముగా |
| ప్రచరంతి | = | ప్రసరించు చున్నవో |
| ఏవం+తత్+సర్వం | = | ఇంద్రియములు, ఇంద్రియార్థములు సర్వము |
| పరే+దేవే+మనసి+ తేన | = | సూక్ష్మశరీరమందున్న మనస్సు నందు ఆ మనస్సు జీవుని యందు ఆజీవుడు ఇవి అన్నీ ఆత్మతో |
| ఏకీభవంతి | = | ఏకీభూతమగుచున్నవి |
| తర్హి | = | అప్పుడు ఆ అవస్థలో |
| ఏషః+పురుషః | = | ఈ సుషుప్తి అవస్థను పొందిన జీవుడు |
| న+శృణోతి+న+పశ్యతి | = | (చెవులతో)వినడు. కన్నులతో చూడడు. |
| న+జిఘ్రతి+న+రసయతే | = | ముక్కుతో వాసనచూడడు. నాలుకతో రుచి చూడడు. |
| న+స్పృశతే | = | చర్మముతో దేనినీ స్పృశియించడు. |
| న+అభివదతే | = | నోటితో మాట్లాడడు |
| న+ఆదత్తే | = | చేతులతో ఏదీ తీసుకొనడు |
| న+ఆనందయతే | = | స్త్రీలతో రమించి ఆనందమనుభవించడు |
| న+విసృజతే | = | మలమూత్రములను విసర్జన చేయడు |
| న+ఇమాయతే | = | పాదములతో నడువడు. |

అనగా జ్ఞానేంద్రియములు వాటి వాటి ఇంద్రియార్థములపై ప్రసరించుట లేదు.కర్మేంద్రియములు పనిచేయుట లేదు. అప్పుడు ఈ జీవుడు

| | | |
|---|---|---|
| స్వపితి+ఇతి | = | నిద్రించుచున్నాడని-సుషుప్తి అవస్థలో నున్నాడని |
| ఆ చక్షతే+హ+వై | = | చెప్పుదురు. అవి మరల జన్మాంతర కర్మయోగము వలన జీవుడు జాగ్రతావస్థకు వచ్చును. మరల ఇంద్రియములు, మనస్సు పనిచేయును అని చెప్పుదురు అని |
| తస్మై | = | శిష్యునకు |
| సః | = | గురువు |
| ఉవాచ | = | చెప్పెను. సుషుప్తి అవస్థలో ముఖ్యప్రాణము |



మేలుకొని ఉండును.

### స్వప్నావస్థ

జీవుడు స్థూలదేహమును వీడి సూక్ష్మ శరీరమునకు చేరగానే బాహ్యఇంద్రియములు పని చేయవు. సూక్ష్మశరీరమునకు రెండు అవస్థలు గలవు. ఒకటి స్వప్నావస్థ. ఇంకొకటి సుషుప్తి అవస్థ.

స్వప్నావస్థలో ఇంద్రియములు ఇంద్రియార్థములు మనస్సులో ఏకీభూతమగును. స్వప్నావస్థలో - హృదయగుహలో గల ఆత్మ, జీవుడు, మనస్సు, ప్రాణము- ఇవి నిద్రించవు. అటులనే యోగములో సవికల్ప సమాధిలో ఇంద్రియములు ఇంద్రియార్థములు పనిచేయవు. కాని మనస్సు పని చేయును. దీనినే ఇంద్రియములతోటి సంగమము విడువని స్థితిగా చెప్పుదురు. ఈ స్థితిలో దేహమును వీడి ఆత్మస్థానమును చేరును.

ఈ సూక్ష్మశరీరములో నిద్రించుచున్న ఇంద్రియములు ఇంద్రియార్థములు మరల జాగ్రతావస్థకు రాగానే తిరిగి పనిచేయును. స్వప్నావస్థలో సంహరించ వలసిన వాటిని కథగా భారతములో సౌప్తిక పర్వములో నిద్రించుచున్న పాండవ సేనలోని ఉపపాండవులు మొదలయిన వారి సంహారమును అశ్వత్థామ చేసినట్లు చెప్పినాడు.

బ్రహ్మకు రాత్రి అయినది. మూడు లోకములు జల ప్రళయంలో నశించినవి. అప్పుడు హయగ్రీవుడనే రాక్షసుడు-ఇతనినే సోమకాసురుడు అని కూడ అందురు. బ్రహ్మముఖము నుంచి వచ్చిన వేదములను దొంగిలించి జలములలో దాగెను. శ్రీమహావిష్ణువు మత్స్యావతారమున హయగ్రీవుని సంహరించెను. స్వప్నావస్థలో సంహరించవలసిన విషయమును యోగభాషలో చెప్పెను. హయగ్రీవుడనగా మనస్సు, ఆమనస్సును సంహరించవలయును. గుణరహితము చేయవలయును.

*****

ఏవి మేలుకొని ఉన్నవి ?

**3. ప్రాణాగ్నయ ఏవై తస్మిన్ పురే జాగ్రతి । గార్హపత్యో హవా ఏషో౽పానో వ్యానో౽న్వాహార్య పచనో యద్ గార్హ పత్యాత్ ప్రణీయతే ప్రణయనాదాహవనీయః ప్రాణః ॥**

ప్రాణాగ్నయః - ఏవ - ఏతస్మిన్ - పురే - జాగ్రతి - గార్హపత్యః - హ -వా - ఏషః - అపానః -వ్యానః - అన్వాహార్య - పచనః - యత్ - గార్హపత్యాత్ - ప్రణీయతే- ప్రణయనాత్ - ఆహవనీయః - ప్రాణః

| | | |
|---|---|---|
| ఏతస్మిన్+పురే | = | ఈ శరీరమనే పురమునందు |
| ప్రాణాగ్నయః+ఏవ | = | శరీరమంతా వ్యాపించి యున్న ప్రాణము, అనే అగ్ని |
| జాగ్రతి | = | మేలుకొని యుండును. హృదయగత ఆత్మమేలుకొని ఉండును. |

ఈ విషయమును ఒక ఉదాహరణగా చెప్పుచున్నానని వేదకాల ములోని శిష్యులకు పరిచయం ఉన్న త్రేతాగ్నులను ఉదాహరణగా తీసుకొన్నారు.

గార్హపత్యాగ్ని=ముఖ్యప్రాణము/ఆత్మ

(జీవాత్మ)ఆహవనీయాగ్ని — దక్షిణాగ్ని(ప్రాణము)

ప్రాణ, అపాన, సమానములు — వ్యాన, ఉదానములు

| | | |
|---|---|---|
| యత్+గార్హపత్యాత్+ ఆహవనీయః+ప్రణీయతే | = | ఏ విధముగా మండుతూ వుండే గార్హపత్యాగ్ని నుండి ఆహవనీయాగ్నిని తీసుకుందుమో అలాగే |
| ఏషః+గార్హపత్యః | = | ముఖ్య ప్రాణము గార్హపత్యాగ్ని వంటిది |
| ప్రాణః+అపానః+హ+ పచనః | = | ప్రాణము, అపానము, సమానము - ఇవి మండుతూ వుండే ఆహవనీయాగ్ని వంటివి |
| ప్రణయనాత్ | = | మండుతూ వుండే గార్హపత్య అగ్నినుండి దక్షిణాగ్నిని తెచ్చినట్లు |
| వ్యానః+వా | = | వ్యానము, ఉదానములు |



| | | |
|---|---|---|
| అన్వాహార్య | = | ఇవి మండుతూ వుండే (అన్వాహార్య) దక్షిణా అగ్ని వంటివి |

*****

**4. యదుచ్ఛ్వాస నిఃశ్వాసా వేతావాహుతీ సమంనయతీతి స సమానః । మనో హ వావ యజమాన ఇష్టఫలమేవోదానః స ఏనం యజమాన మహరహర్బ్రహ్మ గమయతి ॥**

యత్ - ఉచ్ఛ్వాస - నిఃశ్వాసా - ఏతౌ - ఆహుతీ - సమం - నయతి - ఇతి - సః - సమానః - మనః - హ - వావ - యజమానః - ఇష్టఫలమ్ - ఏవ - ఉదానః - సః - ఏనం - యజమానమ్ - అహః - అహః - బ్రహ్మ - గమయతి

**ఆహవనీయాగ్ని**

| | | |
|---|---|---|
| ఉచ్ఛ్వాస+నిఃశ్వాసా+ ఏతౌ+ఆహుతీ | = | ప్రాణముయొక్క ఉచ్ఛ్వాస నిఃశ్వాసము అనే యీ రెండూ అగ్నిలో వేయు ఆహుతులు వంటివి |
| యత్+సమం+ నయతి+ సమానః+ఇతి | = | మనము భుజించిన ఆహారమును పచనము చేసి ఆహార శక్తిని సమానవాయువు శరీర భాగములన్నింటికి సమానముగా పంచును. అలా సమానముగా పంచునది సమానవాయువు. |
| హ | = | ప్రాణము ఆహారమును స్వీకరించును. అపాన వాయువు ఆహారములోని వ్యర్థపదార్థములను మలమూత్రముల ద్వారా విసర్జించును. |

**దక్షిణాగ్ని**

| | | |
|---|---|---|
| ఉదానః+వావ | = | వ్యానము ఉదానములు దక్షిణాగ్నివంటివి. |
| ఏషః+సః+యజమానః | = | ఈ జీవుడు యజమాని |
| మనః | = | మనస్సు కర్మకు కారణము |
| ఇష్ట ఫలం | = | కర్మ ఫలితము ఇష్ట ఫలము. ఈ కర్మ ఫలితము సూక్ష్మ శరీరములో నిల్వ ఉండును. |
| సః | = | అది |

| | | |
|---|---|---|
| అహః+అహః | = | ప్రతిదినము |
| ఏనం+యజమానం | = | ఈ యజమానిని |
| బ్రహ్మ | = | బ్రహ్మలోకమును |
| గమయతి | = | చేర్చును |

ఆధారము నుంచి సహస్రారము వరకు గల ఏడు చక్రములు ఉత్తరాయణ మార్గములో దాట వలయును. దీనినే సప్తాహము అని అందురు. అహః అనగా పగలు లేక ఉత్తరాయణము. ఈ సప్తాహముల ద్వారానే సాధకుడు మోక్షమును పొందును. ఈ సప్తాహములలో ముక్తికేగు గతిని చెప్పమని పరీక్షిత్తు శుక బ్రహ్మను అడిగెను.




*****

స్వప్నావస్థలో జీవుడు, మనస్సు మేలుకొని ఉండును. జీవుడు స్వప్నమును చూచును

5. **అత్రైష దేవః స్వప్నే మహిమానమనుభవతి । యత్ దృష్టం దృష్ట మనుపశ్యతి । శ్రుతం శ్రుతమేవార్థ మను శృణోతి దేశ దిగతంరైశ్చ ప్రత్యనుభూతం పునః పునః ప్రత్యనుభవతి దృష్టం చా దృష్టం చ శ్రుతం చా శృతం చ అనుభూతం చా ననుభూతం చ సచ్చా సచ్చ సర్వం పశ్యతి సర్వః పశ్యతి ॥**

అత్ర - ఏషః - దేవః - స్వప్నే - మహిమానమ్ - అనుభవతి - యత్ - దృష్టం - దృష్టమ్ - అనుపశ్యతి - శ్రుతం - శ్రుతమ్ - ఏవ - అర్థమ్ - అనుశృణోతి - దేశ దిగంతరైః - చ - ప్రతి - అనుభూతమ్ - పునః పునః - ప్రతి - అనుభవతి - దృష్టం - చ - అదృష్టం - చ - శ్రుతం - చ - అశ్రుతం - చ - అనుభూతం - చ - అననుభూతం - చ - సత్ - చ - అసత్ - చ - సర్వం - పశ్యతి - సర్వః - పశ్యతి



ఎవరు స్వప్నంలో చూచుచున్నారు ? జీవుడు

| | | |
|---|---|---|
| అత్ర+స్వప్నే | = | ఆ స్వప్నములో |
| ఏషః+దేవః | = | ఈ **జీవుడు మనసు ప్రాణము** మేల్కొని యుండగా |
| మహిమానం+అనుభవతి | = | గొప్ప అనుభూతులను పొందును |
| యత్+దృష్టం+దృష్టం+ అనుపశ్యతి | = | జాగ్రతావస్థలో ఏది చూచినదో దానినే మళ్ళీ స్వప్నావస్థలో చూచును. |
| శ్రుతం+అర్థం+శ్రుతం+ ఏవ+అనుశృణోతి | = | జాగ్రతావస్థలో దేనిని వినునో దానినే స్వప్నావస్థలో వినును. |
| దేశదిగంతరైః+ ప్రతి+అనుభూతం+ పునః+పునః+ప్రత్యనుభవతి | = | జాగ్రతావస్థలో చూచిన ప్రదేశములు, పొందిన అనుభవములనే స్వప్నావస్థలో మళ్ళీ మళ్ళీ చూచి అనుభూతులను పొందుతుంది |
| చ | = | మఱియు |
| దృష్టం+చ+అదృష్టం+ చ+శ్రుతం+చ+అశ్రుతం+ చ+అనుభూతం+చ+ అననుభూతం+చ+ సర్వం పశ్యతి | = | జాగ్రతావస్థలో చూచిన దానిని, చూడని దానిని విన్న దానిని, వినని దానిని, అనుభవించిన దానిని అనుభవించని దానిని యిలా సర్వమును స్వప్నములో చూచును.. |
| సత్ + చ | = | స్వప్నములో వచ్చినవి కొన్ని నిజమగును |
| చ+అసత్ | = | స్వప్నములో వచ్చినవి కొన్ని నిజము కావు నిజమగునవి, నిజము కానివి |
| సర్వః+పశ్యతి | = | సర్వము జీవుడు కలగనును. సుఖదుఃఖములను పొందును. |

రామాయణంలో త్రిజటాస్వప్నము-దీనికి ఉదాహరణ.

*****

**సుఖము ఎవనికి గలుగు చున్నది?**

6. **సయదా తేజసాఽభిభూతో భవతి అత్రైష దేవః స్వప్నాన్న పశ్యత్యథ తదైతస్మిఞ్ఛరీరే ఏతత్సుఖంభవతి ॥**

సః - యదా - తేజసా - అభిభూతః - భవతి - అత్ర -ఏషః - దేవః - స్వప్నాన్ - న

- పశ్యతి - అథ - తత్ - ఏతస్మిన్ - శరీరే - ఏతత్ - సుఖం - భవతి

ఎవరు సుఖమును పొందుచున్నారు?

| | | |
|---|---|---|
| యదా | = | ఎప్పుడు |
| సః | = | జీవుడు |
| తత్ | = | ఆత్మ యొక్క |
| తేజసా | = | తేజస్సు చేత |
| అభిభూతః+భవతి | = | అ(క్రమింపబడినది అగునో అనగా హృదయ గుహ అని చెప్పబడే బ్రహ్మ లోకం చేరునో అప్పుడు |
| అత్ర | = | ఆ బ్రహ్మలోకంలో |
| ఏషః+దేవః | = | ఈ జీవుడు |
| స్వప్నాన్+న+పశ్యతి | = | కలలు గనడు. ఆ స్థితిని సుషుప్తి అని అందురు |
| అథ | = | ఆ తరువాత ఆ సుషుప్తిలో |
| ఏతస్మిన్+శరీరే | = | ఈ శరీరములో |
| ఏతత్+సుఖం+భవతి | = | సుఖదుఃఖములనేవి లేక జీవుడు కేవలము సుఖమునే అనుభవించును. |

*****

కాని పూర్వజన్మ కర్మవాసనలు క్షయము కాలేదు గాన వాటి వలన తిరిగి జాగ్రతావస్థకు వచ్చును. మరల సుఖదుఃఖములను అనుభవించును. దీనినే పుణ్యా కర్మానుష్ఠానము వలన పుణ్యఫలితము కోరి బ్రహ్మలోకం చేరి పుణ్యఫలితము క్షీణించగా పునర్జన్మకు వచ్చుటగా చెప్పుదురు. కర్మవాసనలు క్షయమయిన స్థితిని బ్రహ్మలోకం చేరినట్లు చెప్పుదురు.

| | | |
|---|---|---|
| జాగ్రతావస్థలో | - | హృదయగుహలోని ఆత్మ, జీవుడు, ప్రాణము, మనస్సు, ఇంద్రియములు, ఇంద్రియార్థములు మేలుకొని ఉండును - సుఖదుఃఖములు అనుభవించును. |
| స్వప్నావస్థలో | - | ఇంద్రియములు-ఇంద్రియార్థములు మనస్సుతో ఏకీభూతమయినవి. అప్పుడు హృదయగుహలోని ఆత్మ, జీవుడు, ప్రాణము, మనస్సు మేలుకొని వుండును. సూక్ష్మేంద్రియములతో సుఖదుఃఖములు అనుభవించును. |
| సుషుప్తిలో | - | మనస్సు జీవునితో ఏకీభూతమయినది. జీవుడు ఉదానవాయువు వలన ఆత్మస్థానమును చేరినాడు. ఆత్మతో జీవుడు ఏకీభూతుడైనాడు. అప్పుడు హృదయగుహలోని ఆత్మ - ప్రాణముండును. కేవలము సుఖమును అనుభవించును. |

దేహ త్యాగ కాలములో జీవుడు, ప్రాణము ఇవి రెండు హృదయ గుహలోని ఆత్మతో ఏకీభూతమగును. దేహమును వీడును. కర్మ వాసనలు నశించిన పునరావృత్తి ఉండదు. నదులు సముద్రములో కలసి సముద్రముగా పిలువబడునట్లు జీవత్వము నశించి బ్రహ్మ యగును.

*****

ఎవని యందు ఈ సర్వమూ ప్రతిష్ఠితమై ఉన్నది?

**7. స యథా సోమ్య వయాంసి వాసో వృక్షం సంప్రతిష్ఠంతే**
**ఏవం హ వై తత్ సర్వం పర ఆత్మని సంప్రతిష్ఠతే ॥**

సః - యథా - సోమ్య - వయాంసి - వాసో - వృక్షం - సంప్రతిష్ఠంతే - ఏవం - హ - వై - తత్ - సర్వం - పర(పరే) - ఆత్మని - సంప్రతిష్ఠతే(సంప్రతిష్ఠంతే).

| | | |
|---|---|---|
| సోమ్య | = | ఓ స్నేహితుడా |
| యథా | = | ఏ విధంగా |
| సర్వం+వయాంసి | = | పక్షులు అన్నియు |
| తత్+వాసో +వృక్షం | = | అవి నివసించే వృక్షమును |
| సంప్రతిష్ఠంతే | = | ఆశ్రయించుకొని ఉండునో |
| ఏవం | = | ఈ విధముగా ఇట్లు |
| సః | = | జీవుడు,మనస్సు, ప్రాణము, |
| పర+ఆత్మని+ సంప్రతిష్ఠతే(సంప్రతిష్ఠంతే) | = | ఇంద్రియములు ఇంద్రియార్థములు సర్వము ఆ హృదయ గుహలో గల ఆత్మయందు రథనాభిలో |

ఆకుల వలె ఆశ్రయించు కొని యున్నవి

| | | |
|---|---|---|
| హ+వై | = | పక్షులు రాత్రిని చెట్టును ఆశ్రయించుకొని వుండి పగలు ఆ చెట్టును వీడి సంచారము చేయును. |

అటులనే సుషుప్తిలో జీవుడు మొదలయినవి సర్వము హృదయ గుహలోని ఆత్మను ఆశ్రయించుకొని ఉండి పూర్వజన్మ కర్మ వాసనలచే సుషుప్తి నుంచి జాగ్రతావస్థకు వచ్చి జీవుడు మొదలయినవి హృదయ గుహలోని ఆత్మను వీడి సంచారము చేయును. ఇంతకు ముందు రథనాభిలో రథచక్రపు ఆకులు అమరియున్నట్లు ఈసర్వము ఆత్మయందు అమరియున్నదని ఉదహరించినాడు. ఇప్పుడు చెట్టు, పక్షులుగా ఉదహరించినాడు.

*****

సృష్టి గురించి వివరించుచున్నాడు

8. **పృథివీ చ పృథివీ మాత్రా చాఽఽపశ్చాఽఽపోమాత్రా చ తేజశ్చ తేజో మాత్రా చ వాయుశ్చ వాయు మాత్రా చ ఆకాశశ్చాఽఽకాశ మాత్రా చ చక్షుశ్చ ద్రష్టవ్యం చ శ్రోతం చ శ్రోతవ్యం చ ఘ్రాణం చ ఘ్రాతవ్యం చ రసశ్చ రసయతవ్యం చ త్వక్చ స్పర్శయితవ్యం చ వాక్చ వక్తవ్యం చ హస్తౌచాఽఽదాతవ్యంచోపస్థశ్చానందయతవ్యం చ పాయుశ్చ విసర్జయితవ్యం చ పాదౌ చ గంతవ్యం చ మనశ్చ మంతవ్యం చ బుద్ధిశ్చ బోద్ధవ్యం చాహంకారశ్చాహం కర్తవ్యం చ చిత్తం చ చేతయితవ్యం చ తేజశ్చ విద్యోతయితవ్యం చ ప్రాణశ్చ విధారయితవ్యం చ ॥**

పృథివీ - చ - పృథివీమాత్రా - చ - ఆపః - చ - ఆపోమాత్రా - చ - తేజః - చ - తేజో మాత్రా - చ - వాయుః - చ - వాయుఃమాత్రా - చ - అకాశః - చ - ఆకాశమాత్రా - చ - చక్షుః - చ - ద్రష్టవ్యం - చ - శ్రోత్రం - చ - శ్రోతవ్యం - చ - ఘ్రాణం - చ - ఘ్రాతవ్యం - చ - రసః - చ - రసయితవ్యం - చ - త్వక్ - చ - స్పర్శయితవ్యం - చ - వాక్ - చ - వక్తవ్యం - చ - హస్తౌ - చ - ఆదాతవ్యం - చ - ఉపస్థః - చ - ఆనందయితవ్యం - చ -పాయుః - చ - విసర్జయితవ్యం - చ - పాదౌ - చ - గంతవ్యం - చ - మనః - చ - మంతవ్యం - చ - బుద్ధిః - చ - బోద్ధవ్యం - చ - అహంకారం - చ - అహంకర్తవ్యం - చ - చిత్తం - చ - చేతయితవ్యం - చ - తేజః - చ - విద్యోతయితవ్యం - చ - ప్రాణః- చ - విధారయితవ్యం - చ.

సర్వము ఆత్మను ఆశ్రయించుకొన్నవి అని గురువు చెప్పి యీ సర్వము అనగానేమి? అవి ఎలా వచ్చినవో వివరించి సృష్టి సర్వము అతనిని ఆశ్రయించుకొని ఉన్నవి. అనగా అతడే సృష్టికి ఆధారము.

ఈశ్వరుడు ప్రకృతిని అధిష్ఠించి ఉన్నాడు. వీరి వలన మహత్ కలిగినది. మహత్‌వలన అహంకారం కలిగినది. అహంకారం మూడు విధములైనది. తమోహంకారం నుంచి తన్మాత్రలు వాటి నుంచి పంచభూతములు గలిగినవి. దేహము గలిగినది.

| | | |
|---|---|---|
| ఆకాశమాత్రా | = | శబ్దతన్మాత్ర |
| చ | = | శబ్దతన్మాత్ర నుంచి |
| ఆకాశః+చ | = | ఆకాశము - ఆకాశము నుంచి |
| వాయుమాత్రా | = | స్పర్శతన్మాత్ర |
| చ | = | స్పర్శతన్మాత్ర నుంచి |
| వాయుః+చ | = | వాయువు -వాయువు నుంచి |
| తేజోమాత్రా | = | రూప తన్మాత్ర |
| చ | = | రూపతన్మాత్ర నుంచి |
| తేజః | = | తేజము (అగ్ని) - తేజస్సునుంచి |
| ఆపోమాత్ర+చ | = | రసతన్మాత్ర |
| చ | = | రసతన్మాత్ర నుంచి |
| ఆపః+చ | = | జలము - జలము నుంచి |
| పృథివీమాత్రా | = | గంధతన్మాత్ర |
| చ | = | గంధతన్మాత్ర నుంచి |
| పృథివీ+చ | = | భూమి కలిగినది (జ్ఞానేంద్రియములు -ఇంద్రియార్థములు గలిగినవి) |

తేజః+చ+ విద్యోతయితవ్యం+చ = అగ్ని దాని గుణము అయిన రూపము అనగా ఆకాశాది పంచభూతములు వాటి గుణములు

శ్రోత్రం+చ+శ్రోతవ్యం+ = చెవి మఱియు దాని ఇంద్రియార్థము వినుట

చ+త్వక్+చ+స్పర్శయి = చర్మము దాని ఇంద్రియార్థము స్పర్శ

తవ్యం+చచక్షుః+చ+ ద్రష్టవ్యం+చ = కన్ను మఱియు దాని ఇంద్రియార్థమగు చూచుట

రసః+చ+ రసయితవ్యం+చ = నాలుక మఱియు దాని ఇంద్రియార్థమగు రుచి

ఘ్రాణం+చ+ ఘ్రాతవ్యం+చ = ముక్కు దాని ఇంద్రియార్థమగు వాసన

వాక్ +చ+ వక్తవ్యం+చ = నోరు మఱియు దాని వలన మాట

హస్తౌ+ చ+ ఆదాతవ్యం+చ = చేతులు మఱియు వాటి వలన గ్రహించుట

పాదౌ +చ+ గంతవ్యం+చ = పాదములు మఱియు వాటి వలన నడచుట

ఉపస్థః+చ+ ఆనందయితవ్యం+చ = గుహ్యము మఱియు దాని వలన సంభోగము వలన గలుగు ఆనందము

పాయుః+చ+ విసర్జయితవ్యం+చ = గుదము దాని వలన మల విసర్జన

అంతఃకరణములు

మనః+చ+ మంతవ్యం+చ = మనస్సు దాని సంకల్ప వికల్పములు

చిత్తం+చ+ చేతయితవ్యం+చ = చిత్తము మఱియు ఆలోచనలు

అహంకారం+చ+ అహంకర్తవ్యం+చ = అహంకారము మఱియు నేను అనే వృత్తి

బుద్ధిః+చ+ బోద్ధవ్యం+చ = బుద్ధి మఱియు మంచిచెడ్డలను బోధించు బోధ

ప్రాణము



ప్రాణః+చ+విదారయి తవ్యం+చ = ప్రాణము మఱియు దాని ధర్మములు

ఇవి అన్నీ అనగా ఈ 45 జీవునిని ఆశ్రయించి ఉన్నవి. రథనాభిలో రథముయొక్క ఆకులు అమరియున్నట్లు ఇవి అన్నియు ఆత్మయందు అనగా విరాట్పురుషుని యందు అమరియున్నవి. ఈ 45 ను సాధనలో దాటుటను మండలదీక్ష అని అందురు. ఈ 45 గల మండలమును మాండవి అని వ్యక్తివాచకముగా పేర్కొని ఈ మండలాంతర్గత జీవపురుషునుని భరతునిగా పేర్కొనినారు. మాండవి భరతుడు ఒక జంట. షట్ఉర్ములను ఉర్మిళగా పేర్కొనినారు. ఊర్మిళ, లక్ష్మణుడు ఒక జంట. దేహేంద్రియ మనోబుద్ధులనే శత్రువులను జయించి కీర్తిని పొందవలయును. అప్పుడు శ్రుతకీర్తి శత్రుఘ్నుడు ఒక జంట. ప్రకృతి పురుషులు ఒక జంట. వీరినే సీతారాములనిరి.

**ఊర్ధ్వమూల మధఃశాఖ మశ్వత్థం ప్రాహురవ్యయమ్**
**ఛన్దాంసి యస్య పర్ణాని యస్తం వేద స వేదవిత్**

(భగవద్గీత-పురుషోత్తమ యోగము-1)

అశ్వత్థం = నశించు యీ జగత్తుకు

ఊర్ధ్వమూలమ్ = మూలముపైన ఉన్నది. మామూలుగా మనము చూచే చెట్టుకు మూలము భూమిలోనూ, శాఖలు పైకి ఉండును.

అధఃశాఖమ్ = క్రిందకి కొమ్మలు గలది. ఆ చెట్టుకు మూలమయిన ఈశ్వరుడు

అవ్యయమ్ = నశింపడు అని

ప్రాహుః = చెప్పుదురు

యస్య = ఈ జగత్ వృక్షమునకు

ఛన్దాంసిపర్ణాని = వేదములు ఆకులు

యః+తత్+వేద = ఎవడు ఈశ్వరుని తెలుసుకొనునో జగత్‌కు మూలకారకుడైన ఆత్మను ఎవడు తెలుసుకొనునో

| | | |
|---|---|---|
| సః+వేదవిత్ | = | అతడు వేదజ్ఞుడు. అనగా పరమాత్మను దర్శించిన వాడు. |

అవరోహణ క్రమములో సృష్టి జరుగును. ఆరోహణక్రమములో లయమగును. బ్రహ్మతో ఏకీభూతుడగు వాడు ఆరోహణ క్రమములో అధిరోహించి, ప్రకృతిని బాసి ఆనందమయుండై బ్రహ్మమందు గలియును.

జీవుడు, ఇంద్రియములు, ఇంద్రియార్థములు, మనస్సు, చిత్తము, అహంకారము, బుద్ధి, ప్రాణము- యివి అన్నీ ఆత్మను ఆశ్రయించి ఉన్నవి అని యీ మంత్రములో శిష్యునకు వివరించుచున్నాడు. వీటిని సాధనచే అధిగమించి ప్రకృతిని వీడి ఆనందమయుండై బ్రహ్మమందు కలియవలయును.

*****

**9. ఏష హి ద్రష్టా స్ప్రష్టా శ్రోతా ఘ్రాతా రసయతా మంతా బోద్ధా కర్తా విజ్ఞానాత్మ పురుషః । సః పరేఽక్షరే ఆత్మని సంప్రతిష్ఠతే ॥**

ఏషః - హి - ద్రష్టా - స్ప్రష్టా - శ్రోతా - ఘ్రాతా - రసయితా - మంతా - బోద్ధా - కర్తా - విజ్ఞానాత్మ - పురుషః - సః - పరే - అక్షరే - ఆత్మని - సంప్రతిష్ఠతే.

| | | |
|---|---|---|
| ఏషః+పురుషః+హి | = | ఆత్మ సాన్నిధ్యమున ఈ జీవుడే |
| ద్రష్టా+స్ప్రష్టా | = | చూచేవాడు, స్పర్శించేవాడు |
| శ్రోతా+ఘ్రాతా | = | వినేవాడు, వాసనచూచేవాడు |
| రసయితా+బోద్ధా | = | రుచి చూచేవాడు, తెలుసుకొనేవాడు |
| మంతా | = | ఆలోచించేవాడు, |
| సః+కర్తా | = | ఇతడే కర్త. కావున కర్మ ఫలితమును అనుభవించు వాడు యితడే. |

హృదయ గుహలో గల ఆత్మనిరీక్షకుడే గాని దేనికీ కర్తగాడు. అయితే జీవుడు- జీవుని ఆశ్రయించుకొని ఉన్న ఈ సర్వము సుషుప్తిలో ఆత్మని ఆశ్రయించి ఉన్నవి.

| | | |
|---|---|---|
| సః+విజ్ఞానాత్మా+ | = | విజ్ఞానాత్మ అయిన ఆ జీవ పురుషుడే కూటస్థుడై |



| | | |
|---|---|---|
| పరే+ ఆత్మని అక్షరే+సంప్రతిష్ఠతే | = | స్వయం జ్యోతియైనదియు అక్షరమైనది అయిన క్షేత్రజ్ఞుడు ఆత్మ యందు ఏకీభూతుడగును. |

శ్రద్ధా, భక్తి, ధ్యానయోగాదుల ద్వారా అట్టి ఆత్మను దర్శించవలయును.

*****

ఆత్మను దర్శించవలయును. ఆత్మలక్షణములు వివరించుచున్నారు.

**10. పరమేవాక్షరం ప్రతిపద్యతే స యో హ వై తదచ్ఛాయమశరీర మలోహితం శుభ్రమక్షరం వేదయతే యస్తు సోమ్య స సర్వజ్ఞః సర్వోభవతి తదేషశ్లోకః ॥**

పరమ్ - ఏవ - అక్షరమ్ - ప్రతిపద్యతే - సః - యః - హ - వై - ఏతత్ - అచ్ఛాయమ్ - అశరీరమ్ - అలోహితం - శుభ్రం - అక్షరం - వేదయతే - యః - తు - సోమ్య - సః - సర్వజ్ఞః - సర్వః - భవతి - తత్ - ఏషః - శ్లోకః

| | | |
|---|---|---|
| సోమ్య | = | ఓ స్నేహితుడా |
| యః+ఏతత్ | = | ఎవడు సృష్ట్యాదియందు కలడో, వాడు |
| అచ్ఛాయం+అశరీరం | = | అశరీరుడు, నిరాకారుడు, నిర్గుణుడు |
| అలోహితం+శుభ్రం | = | పరిశుద్ధుడు, శాశ్వతుడు, |
| అక్షరం | = | అక్షరుడు. అతనిని |
| వేదయతే | = | ఎవడు తెలుసుకొనుచున్నాడో |
| సః | = | అతడు |
| పరం+అక్షరం+ఏవ+ హ+వై+ప్రతిపద్యతే | = | ఉత్కృష్టము, అక్షరము అయిన ఆత్మనే పొందు చున్నాడు. అనగా ఆత్మ స్థానమును చేరి ఆత్మతో ఆత్మను ఏకీ భూతము చేసి సృష్ట్యాది యందు గల ఆత్మ యగును. |
| యః+సః+తు+ సర్వజ్ఞః+భవతి+సర్వః+ | = | ఎవడు ఆత్మతో ఆత్మను ఏకీభూతము చేయునో అతడు సర్వజ్ఞుడగును. సర్వము అతడే యగును. |

| | |
|---|---|
| తత్+ఏషః+శ్లోకః | అనగా ఆత్మ యగును అని ఈవిషయమును యీ శ్లోకము చెప్పుచున్నది. |

*****

11 విజ్ఞానాత్మా సహ దేవైశ్చ సర్వైః ప్రాణా భూతాని సంప్రతిష్ఠతి యత్ర ।
తదక్షరం వేదయతే యస్తు సోమ్య స సర్వజ్ఞః సర్వమేవావివేశేతి ॥

ఇతి ప్రశ్నోపనిషది చతుర్థః ప్రశ్నః

విజ్ఞానాత్మా - సహ - దేవైః - చ - సర్వైః - ప్రాణాః - భూతాని - సంప్రతిష్ఠతి - యత్ర - తత్ - అక్షరం - వేదయతే - యః - తు - సోమ్య - సః - సర్వజ్ఞః - సర్వమ్ - ఏవ - ఆవివేశ(అవిశతి) - ఇతి

| | | |
|---|---|---|
| సోమ్య | = | ఓ స్నేహితుడా |
| యత్ర | = | ఆత్మలో |
| ప్రాణాః | = | పంచప్రాణములు |
| భూతాని | = | పంచభూతములు, ఇంద్రియములు, |
| సర్వం+చ | | ఇంద్రియార్థములు తన్మాత్రలు-ప్రకృతి నుంచి వచ్చినవన్నీ |
| సర్వైః+దేవైః | = | సాత్త్వికాహంకారము, రాజసాహంకారము, తామసాహంకారము చేత గలిగినవన్నీ |
| విజ్ఞానాత్మా+సహ | = | కూటస్థునితో కూడి |
| ఆవివేశ (అవిశతి) | = | హృదయగుహలో గల ఆత్మలో ప్రవేశించి |
| సంప్రతిష్ఠతి | = | ఏకీభూతమగును |
| తత్+అక్షరం+యః+తు | = | అట్టి శాశ్వతమగు ఆత్మను సాధనలో ఎవడు దర్శించి, |
| వేదయతే | = | తెలుసుకొనునో అనగా ఏకీభూతుడగునో |
| సః+సర్వజ్ఞః+ఏవ+ఇతి | = | అతడు ఆత్మయై సర్వజ్ఞుడగును |

*****



# పంచమః ప్రశ్నః

**ఓంకారము** గురించి చెప్పుచున్నాడు

**ఓంకారమును** జపించవలయును

1. అథ హైనం శైబ్యః సత్యకామః పప్రచ్ఛ స యో హ వై
తద్భగవన్ మనుష్యేషు ప్రాయణాన్తమోంకార మభిధ్యాయీత ।
కతమం వావ స తేన లోకం జయతీతి తస్మై సహోవాచ ॥

అథ- హ - ఏనం - శైబ్యః - సత్యకామః - పప్రచ్ఛ - సః - యః - హ - వై - తత్ - భగవన్ - మనుష్యేషు - ప్రాయణాంతమ్ - ఓంకారమ్ - అభిధ్యాయీత (అభిధ్యాయంతి) - కతమం- వావ - సః - తేన - లోకం - జయతి - ఇతి - తస్మై - సః - హ - ఉవాచ

| | | |
|---|---|---|
| అథ+హ | = | గార్గ్యవంశస్థుడు సూర్యుని మనుమడు అడిగిన ప్రశ్నకు గురువుగారు పాఠం చెప్పిన తర్వాత |
| శైబ్యః+సత్యకామః | = | శిబికుమారుడగు సత్యకాముడు గురువుని సమీపించి వినయముగా |
| భగవన్ | = | ఓ భగవాన్ |
| మనుష్యేషు | = | మనుష్యులలో నిరంతరము |
| ప్రాయణాంతం+తత్+ ఓంకారం+యః+సః+హ+ వై+అభిధ్యాయీత (అభి ధ్యాయంతి) | = | సంసార తాపత్రయతములను వీడి జ్ఞాన వైరాగ్యములు గలిగి ఓంకారమును ఎవరు ధ్యానించెదరో |
| సః | = | అతడు |
| తేన+కతమం+వావ+ లోకం+జయతి | = | ఆ ఓంకారధ్యానముచే ఏ లోకమును పొందును అని |
| ఏనం+పప్రచ్ఛ | = | గురువగు పిప్పలాదునిని వినయముగా ప్రశ్నించెను |
| సః | = | ఆ గురువగు పిప్పలాదుడు |
| తస్మై+హ | = | సత్యకామునకు |

| | | |
|---|---|---|
| ఉవాచ+ఇతి | = | ఇట్లు పాఠము చెప్పెను |

*****

2. ఏతద్వై సత్యకామ పరం చా పరం చ బ్రహ్మ యదోంకారః ।
తస్మాద్విద్వానేతేనైవాఽఽ యతనే నైకతరమన్వేతి ॥

ఏతత్ - వై - సత్యకామ - పరం - చ - అపరం - చ - బ్రహ్మ - యత్ - ఓంకారః - తస్మాత్ - విద్వాన్ - ఏతేన - ఏవ - ఆయతనేన - ఏకతరమ్ - అన్వేతి

| | | |
|---|---|---|
| సత్యకామ | = | ఓ సత్యకామా ! |
| ఏతత్+వై+బ్రహ్మ+ ఓంకారః | = | సృష్ట్యాది యందున్న బ్రహ్మమును ఓంకారమును జపించుచూ, ఈశ్వరునిని |
| తస్మాత్ | = | ధ్యానించవలయును అందువలన |
| విద్వాన్ | = | ఆత్మ సాక్షాత్కారము పొందగోరు విద్వాంసుడు |
| ఏతేన+ఆయతనేన+ ఏవ | = | ఓంకారోపాసన అనే యీ పంథాద్వారానే |
| యత్+పరం+చ+ అపరం+చ+ఏకతరం | = | ఏది పరం అనగా సృష్ట్యాది యందు ఒక్కడై విరాజిల్లు ఆత్మకలదో - ఏది ఈ విశ్వముగా విస్తరిల్లినదో దానిని |
| అన్వేతి | = | పొందును. బ్రహ్మలోకమును పొందును. |

*****

ఓంకారోపాసన - ఒక మాత్రపట్టు సమయముగా ధ్యానించిన

3. స యద్యేక మాత్ర మభిధ్యాయీత స తేనైవ సంవేదిత స్తూర్ణమేవ జగత్యామభిసంపద్యతే । తమృచో మనుష్య లోకముపనయంతే । స తత్ర తపసా బ్రహ్మచర్యేణ శ్రద్ధయా సంపన్నో మహిమానమనుభవతి ॥

సః - యది - ఏకమాత్రమ్ - అభిధ్యాయీత - సః - తేన - ఏవ - సంవేదితః - తూర్ణమ్ - ఏవ - జగత్యామ్ - అభిసంపద్యతే - తమ్ - ఋచః - మనుష్య లోకమ్- ఉపనయంతే - సః - తత్ర - తపసా - బ్రహ్మచర్యేణ - శ్రద్ధయా - సంపన్నః- మహిమానమ్ - అనుభవతి

| | | |
|---|---|---|
| తపసా | = | తపస్సు |
| బ్రహ్మచర్యేణ | = | బ్రహ్మచర్యము |
| శ్రద్ధయా | = | శ్రద్ధతో కూడినవాడై |
| సంపన్నః | = | ఓంకారమును ధ్యానించినట్లయిన |
| సః | = | అతడు |
| తత్ర | = | బ్రహ్మలోకములో |
| మహిమానం | = | మహిమను గొప్పతనమును |
| అనుభవతి | = | పొందును |
| యది | = | ఒకవేళ |
| ఏకమాత్రమ్ | = | ఒక మాత్ర పట్టు సమయముగా ఓంకారమును |
| అభిధ్యాయీత | = | ధ్యానించినట్లయితే అతడు |
| తేన+ఏవ+సః+ సంవేదితః | = | అతడు ఓంకార ధ్యానముచే పుణ్యాత్ముడై బ్రహ్మలోకం చేరి |
| సః | = | అతడు |
| తూర్ణం+ఏవ+జగత్యాం | = | బ్రహ్మలోకమునుండి వెంటనే |
| అభిసంపద్యతే | = | భూలోకమునకు తిరిగి వచ్చును. |
| తం | = | అతనిని |
| ఋచః | = | ఋక్కులు |
| మనుష్యలోకం | = | భూ లోకమునకు |
| ఉపనయంతే | = | తీసుకొని వచ్చును.అనగా అతనికి పునర్జన్మ గలుగును. |

*****

ఓంకారమును రెండు మాత్రలు పట్టు సమయముగా ధ్యానించిన

4. **అథ యది ద్విమాత్రేణ మనసి సంపద్యతే సోఽంతరిక్షం యజుర్భిరున్నీయతే సోమలోకం । స సోమలోకే విభూతి మనుభూయ పునరావర్తతే ॥**

అథ - యది - ద్విమాత్రేణ - మనసి - సంపద్యతే - సః - అంతరిక్షం - యజుర్భిః - ఉన్నీయతే - సోమలోకం - సః - సోమలోకే - విభూతిమ్ - అనుభూయ - పునః- ఆవర్తతే

యది = ఒకవేళ
మనసి = మనస్సుతో
ద్విమాత్రేణ = రెండు మాత్రలు పట్టు సమయముగా
సంపద్యతే = ఓంకారమును ధ్యానించినట్లయిన
సః = అతడు
యజుర్భిః = యజస్సులచేత
అంతరిక్షం+ = అంతరిక్షమునగల బ్రహ్మలోకమునకు
సోమలోకం+ఉన్నీయతే చంద్రయానమున వెళ్ళును.
అథ = పుణ్యఫలితము క్షీణించగానే
సః = అతడు
సోమలోకే = బ్రహ్మలోకమునందు(చంద్రలోకము) నందు
విభూతిం+అనుభూయ+= భోగ భాగ్యములు అనుభవించి పుణ్యము
పునః+ఆవర్తతే క్షీణించగానే తిరిగి భూలోకమున జన్మించును

అందఱూ బ్రహ్మలోకం చేరుదురు. అయితే గందర గోళము లేకుండుటకై తిరిగి భూలోకమున జన్మించు వారిని చంద్ర లోకస్థానమును పొందినట్లు, కల్పాంతము వఱకు బ్రహ్మలోకములో ఉండి అధికార పురుషులగు వారిని సూర్యలోకము పొందినట్లు వర్ణింతురు.

*****

ఓంకారోపాసన విధి చెప్పబడినది

5. **యః పునరేతం త్రిమాత్రేణోమిత్యేతేనైవాక్షరేణ పరం పురుషం మభి ధ్యాయీత స తేజసి సూర్యే సంపన్న యథా పాదో దరస్త్వచా వినిర్ముచ్యత ఏవం హ వై స పాప్మనా వినిర్ముక్తః స సామభిరున్నీయతే బ్రహ్మలోకం స ఏతస్మాజ్జీవ ఘనాత్పరాత్పరం పురిశయం పురుష మీక్షతే ॥**

**తదేతౌ శ్లోకౌ భవతః**



యః - పునః - ఏతం - త్రిమాత్రేణ - ఓమ్ - ఇతి - ఏతేన - ఏవ - అక్షరేణ - పరం - పురుషం - అభిధ్యాయీత - సః - తేజసి - సూర్యే - సంపన్నః - యథా - పాదోదరః - త్వచా - వినిర్ముచ్యత(వినిర్ముచ్యతే) - ఏవం - హ - వై - సః - పాప్మనా -వినిర్ముక్తః - సః - సామభిః - ఉన్నీయతే - బ్రహ్మలోకం - సః ఏతస్మాత్ - జీవఘనాత్ - పరాత్పరం - పురిశయం - పురుషమ్ - ఈక్షతే - తత్ - ఏతౌ - శ్లోకౌ - భవతః

ఓంకారోపాసన విధి చెప్పబడినది

తత్ + ఏతౌ+ శ్లోకౌ+ = అని ఈ రెండు శ్లోకములు చెప్పుచున్నవి.
భవతః

అలా అతడు తిరిగి భూలోకమునకు వచ్చునని గత రెండు శ్లోకములలో చెప్పబడినది

యః = ఎవరైతే
ఏతం+పరం+పురుషం = ఈ పరమ పురుషుని
ఏతేన+ఓం+అక్షరేణ = ఈ ఓం అను అక్షరముచే
త్రిమాత్రేణ+ = మూడు మాత్రలు పట్టు సమయముగా
అభిధ్యాయీత ధ్యానించునో
సః = అతడు
యథా+పాదోదరః+ఏవ = ఏవిధముగా పాము
త్వచా+వినిర్ముచ్యత (వినిర్ముచ్యతే) = కుబుసమును విడుచునో ఆ విధముగా
పాప్మనా+వినిర్ముక్తః = పుణ్య పాపముల నుండి విడువ బడిన వాడై
పునః = మరల
సః = అతడు
సామభిః+బ్రహ్మలోకం+ = సామము చేత బ్రహ్మలోకము
ఉన్నీయతే తీసుకొనిపోబడును
సః = అతడు
తేజసి+సూర్యే+సంపన్నః = తేజస్సుతో సూర్యునివలె దేదీప్యమాన సంపన్నుడై
సః = అతడు

ఏతస్మాత్+జీవఘనాత్+ = ఈ జీవత్వమును వీడి హిరణ్మయ
హ+వై శరీరమును ధరించి
ఏవం+పరాత్పరం+ = పరాత్పరుడు హృదయగుహలో
పురిశయం+పురుషం నుండువాడు అగు పురుషుణ్ణి
ఈక్షతే+ఇతి = దర్శించును. ఆత్మతో ఏకీభూతుడగును.

అనగా రెండు మాత్రలు పట్టు సమయముగా ఉచ్చరించిన బ్రహ్మలోకము చేరి పుణ్యము క్షీణించగా పునర్జన్మకు వత్తురనియు మూడు మాత్రలు పట్టు సమయముగా ఉచ్చరించిన అనగా ఓంకారమును ఉచ్చరించుచు బ్రహ్మరంధ్రమునకు చేర్చిన పునరావృత్తి రహితులై బ్రహ్మలోకమున వసియింతురనియు చెప్పుచున్నవి.

*****

ఓంకారోపాసన నిషేధం చెప్పబడినది

**6. తిస్రో మాత్రా మృత్యుమత్యః ప్రయుక్తా అన్యోన్యసక్తా అనవిప్రయుక్తాః।**
**క్రియాసు బాహ్యాభ్యంతర మధ్యమాసు సమ్యక్ప్రయుక్తాసు న కంపతే జ్ఞః ॥**

తిస్రః - మాత్రాః - మృత్యుమత్యః - ప్రయుక్తాః - అన్యోన్య - సక్తాః - అనవిప్రయుక్తాః - క్రియాసు - బాహ్య అభ్యంతరమధ్యమాసు - సమ్యక్ - ప్రయుక్తాసు - న - కంపతే - జ్ఞః

తిస్రః+మాత్రాః = అ. ఉ. మ అను మూడు అక్షరములను
ప్రయుక్తాః = విడివిడిగా ఉచ్చరింపబడినవై
మృత్యుమత్యః = మనుష్యులకు మరణ కారకులగును.
(మృత్యుమ్- మర్త్యః) అనగా ఏ విధమయిన ఫలితము లేదు
అన్యోన్య+సక్తాః = సమిష్టిగా అయినట్టియు
అనవిప్రయుక్తాః = విడివడనట్టియు అయిన ఓంకారమును మూడు మాత్రలు పట్టు సమయముగా
క్రియాసు = వైదిక క్రియలందు
బాహ్యాఅభ్యంతర = ప్రారంభంలోనూ మధ్యలోనూ
మధ్యమాసు ముగింపులోనూ



ప్రయుక్తాసు = ఉపయోగింపబడినప్పుడు
సమ్యక్+జ్ఞః = సమ్యక్ జ్ఞాని అనగా ఆత్మను దర్శించిన వాడు అగును. అతడు
న+కంపతే = శోకమోహములు సుఖదుఃఖములు మొదలయిన ద్వంద్వములకు చలింపడు.

*****

**7. ఋగ్భిరేతం యజుర్భిరంతరిక్షం సామభిర్యత్తత్కవయో వేదయంతే।**
**తమోంకారేణైవాఽఽయతనేనాన్వేతి విద్వాన్ యత్తచ్ఛాంత మజరమమృతమభయం పరం చేతి ॥**

(ఇతి ప్రశ్నోపనిషది పంచమః ప్రశ్నః)

ఋగ్భిః - ఏతం - యజుర్భిః - అంతరిక్షం - సామభిః - యత్ - తత్ - కవయః - వేదయంతే - తమ్ - ఓంకారేణ - ఏవ - ఆయతనేన - అన్వేతి - విద్వాన్ - యత్ - తత్ - శాంతమ్ - అజరమ్ - అమృతమ్ - అభయం - పరం - చ - ఇతి

యత్+తత్ = ఏది అనగా ఓంకారమున ఒక మాత్ర సమయముగా జపించిన
ఋగ్భిః = ఋక్కులచే వెంటనే
ఏతం = ఈభూలోకమును,
యజుర్భిః = రెండు మాత్రల సమయముగా ఉచ్చరించిన యజస్సులచే
అంతరిక్షం = అంతరిక్షమును పొంది పునర్జన్మకు వత్తురు
సామభిః = మూడు మాత్రలు పట్టు సమయముగా ఉచ్చరించిన సామములచే
తం = బ్రహ్మలోకమును పొందుదురు అని
కవయః = జ్ఞానులు
వేదయంతే = తెలియుచున్నారు కావున

| | | |
|---|---|---|
| ఓంకారేణ+ఏవ | = | ఓంకారమును జపించుచు |
| ఆయతనేన | = | సాధనచేత |
| విద్వాన్ | = | విద్వాంసుడు |
| యత్+శాంతమ్+ అజరం+అమృతం+ అభయం+చ+పరం+ తత్+అన్వేతి+ఇతి | = | శాంతము అయినది జరామరణములేనిది, అమృతత్త్వము అయినది, పునర్జన్మకు వచ్చుట అనే భయంలేనిది అనగా పునరావృత్తి రహితమైనది అగు పరమపదమును చేరుకొని ఆ ఆత్మతో ఏకీభూతుల గుదురు. |

*****



# షష్ఠః ప్రశ్నః

**(షోడశ కళాపురుషుని గురించి)**

1. **అథ హైవం సుకేశా భారద్వాజః పప్రచ్ఛ । భగవన్ హిరణ్యనాభః కౌసల్యో రాజపుత్రో మాముపేత్యైతం ప్రశ్నమపృచ్ఛత । షోడశకలం భారద్వాజ పురుషం వేత్థ । తమహం కుమారమబ్రువం నాహమిమంవేద । యద్యహమిమమ వేదిషం కథం తే నా వక్ష్యమితి । సమూలో వా ఏష పరిశుష్యతి యోఽ నృతమభివదతి తస్మాన్నార్హామ్యనృతం వక్తుం । స తూష్ణీం రథమారుహ్య ప్రవవ్రాజ । తం త్వా పృచ్ఛామి క్వా సౌ పురుష ఇతి ॥**

అథ - హ - ఏవం - సుకేశాః - భారద్వాజః - పప్రచ్ఛ - భగవాన్ - హిరణ్యనాభః - కౌసల్యః - రాజపుత్రః - మాం - ఉపేత్య - ఏతం - ప్రశ్నమ్ - అపృచ్ఛత - షోడశకలం - భారద్వాజ - పురుషం - వేత్థ - తమ్ - అహం - కుమారమ్ - అబ్రువం - న - అహమ్ - ఇమం - వేద - యది - అహమ్ - ఇమమ్ - అవేదిషం- కథం - తే - న - అవక్ష్యమ్ - ఇతి - సమూలః - వా - ఏషః - పరిశుష్యతి - యః - అనృతమ్ - అభివదతి - తస్మాత్ - న - అర్హామి - అనృతం - వక్తుం - సః - తూష్ణీం - రథమ్ - ఆరుహ్య - ప్రవవ్రాజ - తం - త్వా - పృచ్ఛామి - క్వ - అసౌ - పురుషః - ఇతి

| | | |
|---|---|---|
| అథ+హ | = | శిబికుమారుడగు సత్యకాముని ప్రశ్నలకు పాఠం చెప్పిన తర్వాత |
| భారద్వాజః+సుకేశాః | = | భారద్వాజస గోత్రుడైన సుకేశుడు గురువును సమీపించి |
| భగవన్ | = | ఓ భగవాన్ |
| కౌసల్యః+రాజపుత్రః | = | కోసల దేశస్థుడు రాజపుత్రుడు అయిన |
| హిరణ్యనాభః | = | హిరణ్య నాభుడు |
| మాం+ఉపేత్య | = | నన్ను సమీపించి |
| భారద్వాజ | = | ఓ భరద్వాజ వంశస్థుడా |

| | | |
|---|---|---|
| తం+షోడశకలం+ | = | ఆ పదహారు కళల పురుషుడిని నీవు స్వానుభవంలో |
| పురుషం+వేత్థ | | ఎఱుగుదువా అని |
| ఏతం+ప్రశ్నం+ | = | నన్ను ఈ ప్రశ్నను అడిగెను. నేను ఆ |
| అపృచ్ఛత | | రాకుమారునితో |
| అహం+యది+ | = | నేను ఒకవేళ ఈ షోడశకళల పురుషుడ్ని |
| ఇమం+అవేదిషం | | ఎఱిగినట్లయిన |
| తే+కథం+న+ | = | నీకు ఎట్లు చెప్పక ఉందును? అనగా |
| అవక్ష్యం+ఇతి | | షోడశకళల పురుషుడు నాకు తెలియదు. |

ఈ సందర్భమున అసత్యమాడుట పాపమని ధర్మమును చెప్పుచున్నాడు

| | | |
|---|---|---|
| యః+అనృతం+ | = | ఎవడు అసత్యము పలుకునో అతడు |
| అభివదతి+ ఏషః+ | | సమూలముగా నశించి పోవును. |
| సమూలః+వై+పరిశుష్యతి | | |
| తస్మాత్ | = | అందువలన |
| అనృతం+వక్తుం+న | = | అసత్యము చెప్పుటకు నేను తగను. అనగా |
| తం+అర్హామి+కుమారం+ | | నేను అసత్యమాడను. అని ఆ రాకుమారునితో నాకు |
| అహం+ ఇమం+న+వేద | | ఈ షోడశకళల పురుషుడు తెలియదు అని |
| అబ్రువం+ | = | చెప్పితిని అంత నా సమాధానము విని ఆ |
| అథ+సః+తూష్ణీం+ | | రాకుమారుడు మౌనముగా రథమును ఆరోహించి |
| రథం+ఆరుహ్య | | |
| ప్రవవ్రాజ | = | వెళ్ళిపోయెను. ఆ రాకుమారుడు నన్ను అడిగిన ఆ ప్రశ్నకు అనగా |
| క్వ+అసౌ+పురుషః | = | ఆ షోడశకళా పురుషుడు -ఎవరు అని |
| త్వా (త్వాం) | = | తమరిని - నాకు తెలియక |
| పృచ్ఛామి | = | అడుగుచున్నాను |
| ఏవం | = | ఈ విధముగా గురువగు పిప్పలాదుని |
| పప్రచ్ఛ+హ+ఇతి | = | వినయముతో ప్రశ్నించి ఆ షోడశకళా పురుషుని గుఱించి చెప్పవలసినదిగా ప్రార్థించెను. షోడశకళా పురుషునిని స్వానుభవంలో దర్శించుటయే ప్రశ్నోపనిషత్ సారము. ఇదే జన్మ సార్థకత. |



*****

**2. తస్మై స హో వాచ । ఇహైవాంతః శరీరే సోమ్య స పురుషో యస్మిన్నేతాః షోడశకలాః ప్రభవంతీతి ॥**

తస్మై - సః - హ - ఉవాచ - ఇహ - ఏవ - అంతః - శరీరే - సోమ్య - సః - పురుషః - యస్మిన్ - ఏతాః - షోడశకలాః - ప్రభవంతి - ఇతి

| | | |
|---|---|---|
| సోమ్య | = | ఓ స్నేహితుడా |
| యస్మిన్ + ఏతాః+ | = | ఎవని యందు యీ షోడశకళలు గలుగుచున్నవో |
| షోడశకలాః+ప్రభవంతి | | |
| సః+పురుషః | = | ఆ పురుషుడు షోడశకళలు గలిగి యున్న షోడశకళా పురుషుడు |
| ఇహ+ఏవ+అంతః | = | ఈ శరీరములో- యిక్కడే- అనగా |
| +శరీరే+హ | | సూక్ష్మశరీరములో గల హృదయ గుహలో స్వయం జ్యోతిగా ఉన్నాడు అతడే ప్రకృతితో గూడి విరాట్ పురుషుడైనాడని |
| సః | = | గురువగు పిప్పలాదుడు |
| తస్మై+ఉవాచ+ఇతి | = | శిష్యునకు వివరించెను |

*****

**3. స ఈక్షాంచక్రే । కస్మిన్నహ ముత్క్రాంత ఉత్క్రాంతో భవిష్యామి కస్మిన్ వా ప్రతిష్ఠతే ప్రతిష్ఠాస్యామీతి ॥**

సః - ఈక్షాంచక్రే - కస్మిన్ - అహమ్ - ఉత్క్రాంత(ఉత్క్రాంతే) - ఉత్క్రాంతః - భవిష్యామి - కస్మిన్ - వా - ప్రతిష్ఠతే - ప్రతిష్ఠాస్యామి - ఇతి.

కస్మిన్ + ప్రతిష్ఠతే = ఎవడు యీ శరీరములో ఉండుటచే
అహమ్+ప్రతిష్ఠాస్యామి = నేను జీవించియుందునో
కస్మిన్+ఉత్క్రాంత+ = ఎవడు యీ శరీరము నుండి వెడలిన
(ఉత్క్రంతే) +వా నేను మరణింతునో
ఉత్క్రాంతః+భవిష్యామి = వాడు అనగా
సః = యీ హృదయగుహలో గల స్వయం జ్యోతియైన ఆత్మయే షోడశ కళాపురుషుడు అని స్వానుభవంలో
ఈక్షాంచక్రే+ఇతి = కనుగొంటిని

*****

4. స ప్రాణమసృజత ప్రాణాచ్ఛ్రద్ధాం ఖం వాయుర్జ్యోతిరాపః
పృథివీంద్రియం మనః । అన్నమన్నాద్వీర్యం తపో మంత్రాః
కర్మ లోకాః లోకేషు చ నామ చ ॥

సః - ప్రాణమ్ - అసృజత - ప్రాణాత్ - శ్రద్ధాం - ఖం - వాయుః - జ్యోతిః - ఆపః - పృథివీ - ఇంద్రియం - మనః - అన్నమ్ - అన్నాత్ - వీర్యం - తపః - మంత్రాః - కర్మ - లోకాః - లోకేషు - చ - నామ - చ

సః+చ = ఆ షోడశ కళా పురుషుడు - విరాట్ పురుషుడు ప్రకృతితో కలసి మహత్తును, ఆహంకారమును సృజియించెను. మఱియు తమోఅహంకారము వలన
ఖం = ఆకాశమును
వాయుః = వాయువును
జ్యోతిః = అగ్నిని
ఆపః = జలమును
పృథివీ = భూమిని - అనే పంచ భూతములను సృజియించెను
చ = మఱియు
ప్రాణం = ప్రాణమును
ప్రాణాత్ = ప్రాణమువలన పనిచేయు శరీరమును
మనః = మనస్సును
ఇంద్రియం = ఇంద్రియములను, ఇంద్రియార్థములను సృజియించెను
అసృజత = సృజియించెను.
లోకాః = పదునాలుగు లోకములను సృజియించెను
శ్రద్ధాం = శ్రద్ధను
తపః+చ = తపస్సు
మంత్రాః = వేదములను, మంత్రములను
కర్మ = కర్మలను సృజియించెను
లోకేషు+నామ+చ = లోకమునందు నామరూపములచే వ్యవహరింపబడు సమస్తజీవులను
అన్నమ్ = ప్రాణుల అభివృద్ధికి అన్నము
అన్నాత్ = అన్నమునుంచి
వీర్యం = వీర్యము గలిగనది.

| | |
|---|---|
| ప్రకృతి | 1 |
| మహత్ | 1 |
| అహంకారము | 1 |
| పంచ తన్మాత్రలు | 5 |
| పంచ భూతములు | 5 |
| మనస్సు | 1 |
| ప్రాణము | 1 |
| మొత్తము | 15 |

వీటితో పురుషుడు కలసి షోడశకళాపురుషుడు అయ్యెను.

*****

**5. స యథేమానద్యః స్యందమానాః సముద్రాయణాః సముద్రం ప్రాప్యాస్తంగచ్ఛంతి భిద్యేతే తాసాం నామరూపే సముద్ర ఇత్యేవం ప్రోచ్యతే । ఏవమేవాస్య పరిద్రష్టురిమాః షోడశకలాః పురుషాయణాః పురుషం ప్రాప్యాస్తంగచ్ఛంతి భిద్యతే చ తాసాం నామరూపే పురుష ఇత్యేవం ప్రోచ్యతే స ఏషోఽకలోఽమృతో భవతి ॥ తదేష శ్లోకః**

సః - యథా - ఇమాః - నద్యః - స్యందమానాః - సముద్రాయణాః - సముద్రం - ప్రాప్య - అస్తం - గచ్ఛంతి - భిద్యేతే - తాసాం - నామరూపే - సముద్రః - ఇతి - ఏవం - ప్రోచ్యతే - ఏవమ్ - ఏవ - అస్య - పరిద్రష్టుః - ఇమాః - షోడశకలాః - పురుషాయణాః - పురుషం - ప్రాప్య - అస్తం - గచ్ఛంతి - భిద్యతే - చ - తాసాం- నామరూపే - పురుషః - ఇతి - ఏవం - ప్రోచ్యతే - సః - ఏషః - అకలః - అమృతః - భవతి - తత్ ఏషః శ్లోకః

**ఉదాహరణగా చెప్పుచున్నారు.**

యథా = ఎలాగయితే

ఇమాః = ఈ

స్యందమానాః+నద్యః = ప్రవహించే నదులు

సముద్రాయణాః + = సముద్రము గమ్యముగా గలిగినవియై

సముద్రం+ప్రాప్య+ సముద్రమును చేరి సముద్రములో

అస్తం+గచ్ఛంతి లీనమగుచున్నవో

తాసాం+నామరూపే = వాటి యొక్క నామ రూపములు పోవునో

భిద్యేతే +సముద్రః+ = అప్పుడు సముద్రము అనియే చెప్పబడునో

ఇతి+ప్రోచ్యతే+ఏవం ఆ విధముగనే

అస్య+పరిద్రష్టుః+ = ఈపదహారుకళలు గల

ఇమాః+షోడశకలాః+ హృదయగుహలోగల

పురుషాయణాః

సః+పురుషం+ప్రాప్య+ = స్వయం జ్యోతియైన పరమ పురుషుడే గతిగా

ఏషః+అకలః+అస్తం+ గలవియై ఆత్మను చేరి ఈకళలు అతనిలో

గచ్ఛంతి లీనమగును.

తాసాం+నామరూపే+ = ఈ జీవుల యొక్క నామ రూపములు, ఆ కళలు

భిద్యతే+చ పోవుచున్నవి అప్పుడు అతడు

ఏవం+పురుషః+ఏవం+ = కేవలము పరమ పురుషుడే అని చెప్పబడును.

ప్రోచ్యతే+ఇతి

సః+ఏవ+అమృతః+ = జీవ పురుషుడు కూటస్థుడై అమృతత్త్వము

భవతి పొందును. అమృతుడు అగును.

తత్+ఏషః+శ్లోకః = ఈ విషయమును యీ శ్లోకము చెప్పుచున్నది.

ఆత్మ షోడశ కళాపురుషుడు. జీవాత్మ ఊనషోడశి కళాపురుషుడు. ఈ విషయమునే బాలకాండలో రాముడు విశ్వామిత్రుని వెంట సిద్ధాశ్రమమునకు బయలు దేరునాటికి 15 సంవత్సరముల ప్రాయమువాడని చెప్పబడినది. అతడు వికల్పములను నశింప చేసుకొని విశ్వమునందు విన్న, కన్న అర్థమునందు ఆత్మ భావన చేసినచో అతడు ద్వాదశాంతర సిద్ధి పొందినవాడని చెప్పుదురు. అందువలన మారీచుడు రాముని వయస్సు సిద్ధాశ్రమము నాటికి 12 సంవత్సరములని చెప్పినాడు.

*****

**6. అరా ఇవ రథనాభౌ కలా యస్మిన్ ప్రతిష్ఠితాః ।**
**తం వేద్యం పురుషం వేద యథా మావోమృత్యుః పరివ్యథా ఇతి ॥**

అరాః - ఇవ - రథనాభౌ - కలాః - యస్మిన్ - ప్రతిష్ఠితాః - తం - వేద్యం - పురుషం - వేద - యథా - మా - వః - మృత్యుః - పరివ్యథాః - ఇతి

ఉదాహరణగా చెప్పుచున్నాను

యథా+రథనాభౌ+ = ఏ విధముగా రథనాభిలో రథచక్రపు

అరాః+ఇవ+ప్రతిష్ఠితాః ఆకులు కూర్చబడినవో అట్లు

యస్మిన్+కలాః+ = ఎవని యందు యీ పదహారు కళలు

తం+వేద్యం కూర్చబడి యున్నవో- ఆ తెలుసుకోదగిన

పురుషం+వేద = పురుషుడ్ని గ్రహించిన అనగా దర్శించిన శిష్యులారా

| | | |
|---|---|---|
| వః | = | మిమ్ము |
| మృత్యుః+మా+ పరివ్యథాః+ఇతి | = | మృత్యువు బాధించదు. అనగా మీరు మృత్యుంజయులగుదురు. చిరంజీవులగుదురు. అమృతులగుదురు. |

ఈ షోడశ కళా పురుషునిని దర్శించిన మార్కండేయ మహర్షి చిరంజీవి. హనుమంతుడు చిరంజీవి. ఋషులందఱూ చిరంజీవులే. బాహ్యముగా సమస్త జీవులు విరాట్పురుషుని యందు రథ నాభిలో రథ చక్రపు ఆకులు కూర్చబడినట్లు ఉన్నవి. అంతరములో పూలదండలో దారము వలె ఉన్నవి.

*****

**7. తాన్ హోవాచై తావదే వాహమేతత్ పరం బ్రహ్మ వేద । నాతః పరమస్తీతి ॥**

తాన్ - హ - ఉవాచ - ఏతావత్ - ఏవ - అహమ్ - ఏతత్ - పరం - బ్రహ్మ - వేద- న - అతః - పరమ్ - అస్తి - ఇతి

| | | |
|---|---|---|
| అతః+పరమ్+న+అస్తి | = | ఈ పురుషుడు గల స్థానమునకు మించినది ఏదీ లేదు. ఇదే అత్యున్నత స్థానము. ఈ పురుషుడే పరమ గమ్యము. పరాయణము. ఇతనినే దర్శించ వలయును. |
| ఏతావత్+ఏవ | = | ఇంతవఱకు మాత్రమే అనగా ఈ సృష్టికారకుడు ఆత్మ అని అతడే విరాట్ పురుషుడై సర్వము సృజియించెనని - ఆత్మను దర్శించిన అమృతులు అగుదురని |
| ఏతత్+పరం+బ్రహ్మ | = | ఈ పరబ్రహ్మగుఱించి |
| అహమ్ | = | నేను స్వానుభవంలో |
| వేద | = | గ్రహించితిని |

ఇందువలన పరబ్రహ్మను మించినది గ్రహించుటకు ఏదీలేదు అనగా పరబ్రహ్మను స్వానుభవంలో గ్రహించ వలయును అని

| | | |
|---|---|---|
| తాన్ | = | ఆ శిష్యులను గూర్చి గురువగు పిప్పలాదుడు |



| | | |
|---|---|---|
| ఉవాచ+హ+ఇతి | = | చెప్పెను. |

*****

**8. తే తమర్చయంతస్త్వం హి నః పితా యోఽస్మాకమవిద్యాయాః పరం పారం తారయసీతి । నమః పరమ ఋషిభ్యో నమః పరమ ఋషిభ్యః ॥**

(ఇతి ప్రశ్నోపనిషది షష్ఠః ప్రశ్నః)

తే - తమ్ - అర్చయంతః - త్వం - హి -నః - పితా - యః - అస్మాకమ్ - అవిద్యయాః - పరంపారం - తారయసి - ఇతి

| | | |
|---|---|---|
| యః | = | ఎవరయితే అనగా మీరు |
| అస్మాకం+హి అవిద్యయాః+పరం+ పారం+తారయసి | = | మమ్ములను పరవిద్యను బోధించి అవిద్య యొక్క ఆవలి తీరమును దాటించినారు. |
| త్వం+నః+పితా | = | మీరే మాకు తండ్రి వంటివారు |

హరిచేరు మని యెడి తండ్రి తండ్రి-అని ప్రహ్లాద చరిత్రలో ప్రహ్లాదుడు చెప్పెను

| | | |
|---|---|---|
| తే+తం+అర్చయంతః+ ఇతి | = | వారు - ఆ ఆఱుగురు శిష్యులు గురువగు పిప్పలాదునిని పూజించిరి. |

వారు స్వానుభవంతో ఆత్మను దర్శించిరి.

| | | |
|---|---|---|
| నమః+పరమ+ఋషిభ్యః నమః+పరమ+ఋషిభ్యః | = | పరమ ఋషులకు నమస్కారము |

**కుంభినీధవు చెప్పెడి గురుడు గురుడు**

చండామార్కుల వంటి వారు గురువులు కారు నారదాది ఋషులే గురువులు

ప్రశ్నోపనిషత్ సమాప్తము

*****

ఓం భద్రం కర్ణేభిః శృణు యామ దేవాః
భద్రం పశ్యేమాక్షభిర్యజత్రాః
స్థిరై రంగై స్తుష్టువాగ్ం సస్తనూభిః
వ్యశేమ దేవహితం యదాయుః
స్వస్తి న ఇంద్రో వృద్ధ శ్రవాః
స్వస్తి నః పూషా విశ్వవేదాః
స్వస్తి నస్తార్క్ష్యోఅరిష్టనేమిః
స్వస్తి నో బృహస్పతి ర్దధాతు

ఓం శాంతిఃశాంతిఃశాంతిః

*****



# కైవల్య ఉపనిషత్

ఓం భద్రం కర్ణేభిః శృణు యామ దేవాః
భద్రం పశ్యేమాక్షభిర్యజత్రాః
స్థిరై రంగై స్తుష్టువాగ్ం సస్తనూభిః
వ్యశేమ దేవహితం యదాయుః
స్వస్తి న ఇంద్రో వృద్ధ శ్రవాః
స్వస్తి నః పూషా విశ్వవేదాః
స్వస్తి నస్తార్క్ష్యోఽరిష్టనేమిః
స్వస్తి నో బృహస్పతి ర్దధాతు

ఓం శాంతి శాంతి శాంతిః

ఈ ఉపనిషత్‌లో బ్రహ్మ విద్య యొక్క విశిష్టత గుఱించి వివరించినాడు.

ఆత్మను ఎలా తెలుసుకొనవలయును అన్న ప్రశ్నకు సమాధానముగా శ్రద్ధ-భక్తి-ధ్యానయోగము అని చెప్పి త్యాగము అనగా ఇంద్రియములు ఇంద్రియార్థములను త్యజించి ఓంకారోపాసన చేయవలయునని వివరించినాడు.

ఈశ్వరునిని సాకారముగానూ, నిరాకారముగాను వర్ణించి ఈశ్వరునిని ధ్యానించవలయునని ధ్యానయోగము గుఱించి వివరించినాడు. సృష్ట్యాది యందు గల ఆత్మను, సృష్టిలోని ఆత్మ స్వరూపమును వివరించి సాధన ద్వారా సర్వత్రా గల ఆత్మను దర్శించిన ధీరులు ఆత్మను పొందుదురని ఫలశృతి చెప్పినాడు. ఆత్మ స్థానమును పొందిన మహనీయుడు అయిన అశ్వలాయనుడు తన స్వానుభవమును ప్రకటించి అన్యాపదేశముగ ఆత్మ గుఱించి చెప్పినాడు.

అశ్వలాయనుడు - ఆత్మతత్త్వమునుపొంది ఆత్మ గుఱించి చెప్పు సందర్భమున మయి (నాయందు) అనియు అహం (నేను) అనియు చెప్పినట్లే భగవద్గీతలో శ్రీకృష్ణుడు కూడా మయి, అహమ్, అని చెప్పెను.



బ్రహ్మను చేరి అశ్వలాయనుని ప్రశ్న - బ్రహ్మవిద్యనుపదేశింపుడు

**అథాశ్వలాయనో భగవంతం పరమేష్ఠిన ముపసమేత్యోవాచ**

1. **అధీహి భగవన్ బ్రహ్మవిద్యాం వరిష్ఠాం సదా సద్భిః సేవ్యమానాం నిగూఢాం ।**
**యయాఽచిరాత్ సర్వపాపం వ్యపోహ్యపరాత్పరం పురుషం యాతి విద్వాన్॥**

అథ - అశ్వలాయనః - భగవంతం - పరమేష్ఠినం - ఉపసమేత్య - ఉవాచ - అధీహి - భగవన్ - బ్రహ్మవిద్యాం - వరిష్ఠామ్ - సదా - సద్భిః - సేవ్యమానాం - నిగూఢాం - యయా - అచిరాత్ - సర్వపాపం - వ్యపోహ్య - పరాత్పరం - పురుషం - యాతి - విద్వాన్

| | | |
|---|---|---|
| అథ | = | మంగళావాచకం, బ్రహ్మవిద్యోపదేశమునకు అశ్వలాయనుడు అర్హుడయిన తర్వాత. (అర్హతల గుఱించి ముండకుపనిషత్తు 1-2-12, 13లో చెప్ప బడినది). |
| అశ్వలాయనః | = | అశ్వలాయనుడు (ఇతని పేరున అశ్వలాయన సూత్రములు, మంత్రములు గలవు. ఇతడు ఋగ్వేదములో ఆచార్యుడుగా కనిపించును) |
| భగవంతం | = | భగవంతుడు అయిన |
| పరమేష్ఠినం | = | పరమేష్ఠిని -జగద్గురువును |
| ఉపసమేత్య | = | సమీపించి |
| ఉవాచ | = | ఇట్లు ప్రార్థించెను |

బ్రహ్మవిద్య యొక్క ప్రశంస

| | | |
|---|---|---|
| భగవన్ | = | ఓ జగద్గురూ |
| వరిష్ఠాం+నిగూఢాం | = | శ్రేష్ఠమయినదియు, రహస్యమైనదియు |
| సదా | = | ఎల్లప్పుడు |

| | | |
|---|---|---|
| సద్భిః | = | సత్పురుషులచే |
| సేవ్యమానాం | = | సేవింపబడునదియు |
| యయా | = | దేనిచేత (అనగా బ్రహ్మవిద్యచేత) |
| సర్వపాపం | = | సర్వపాపములు |
| అచిరాత్ | = | వెంటనే |
| వ్యపోహ్య | = | తొలగిపోయి |
| విద్వాన్ | = | విద్వాంసుడు అనగా ధీరుడు |
| పరాత్పరం | = | పరాత్పరుడయిన |
| పురుషం | = | పురుషుని |
| యాతి | = | చేరుకొనునో అట్టి |
| బ్రహ్మవిద్యాం | = | బ్రహ్మవిద్యను |
| అధీహి | = | ఉపదేశింపుడు అని ప్రార్థించెను |

బ్రహ్మవిద్యలో అపరా, పరా- అనే రెండు విద్యలు గలవని ముండకోపనిషత్తు చెప్పినది. ఇప్పుడు పరవిద్యయగు సాధనను వివరించుచున్నాడు.

*****

ఆత్మను (బ్రహ్మవిద్యను) గ్రహించుటకు కావలసినవి

2. **తస్మై స హోవాచ పితామహశ్చ శ్రద్ధా భక్తి ధ్యాన యోగాదవైహి ।**
**న కర్మణా న ప్రజయా ధనేన త్యాగే నైకే అమృతత్త్వ మానశుః ॥**

తస్మై - సః - హ - ఉవాచ - పితామహః - చ - శ్రద్ధా - భక్తి - ధ్యానయోగాత్ - అవైహి - న - కర్మణా - న - ప్రజయా - ధనేన - త్యాగేన - ఏకే - అమృతత్త్వమ్ - ఆనశుః

| | | |
|---|---|---|
| సః+పితామహః | = | జగద్గురువయిన బ్రహ్మ |
| తస్మై | = | అశ్వలాయనునకు |



**ఆత్మతత్త్వము**

| | | |
|---|---|---|
| న+కర్మణా | = | పుణ్యకర్మల చేత గాని (ధర్మము) |
| (న)+ధనేన+చ | = | ధనము వలన గాని (అర్థము) |
| న+ప్రజయా | = | సంతానము వలన గాని (కామము) |
| ఆవైహి | = | ధర్మార్థకామములనే -త్రివర్గములవలన ఆత్మ తత్త్వమును గ్రహించలేము. అమృతత్త్వము రాదు అని గ్రహింపుము. |

**అమృతత్త్వము**

| | | |
|---|---|---|
| శ్రద్ధా | = | శ్రద్ధ అనగా విధివిధానములతో పుణ్యఫలితము కోరక పుణ్య కర్మాచరణ చేయుట చేత |
| భక్తి | = | భక్తిచేత అనగా సత్త్వగుణము గలిగి |
| ధ్యానయోగాత్ | = | ధ్యానయోగము చేత |
| త్యాగేన+ఏకే+హ | = | ఉపాధి లక్షణములను, త్రిగుణములను, అరిషడ్ వర్గములను ఈషణత్రయములను మొదలయినవి వదలించుకొనుట చేతనే అనగా వైరాగ్యము వలననే ఉపాధి పరంపరావసానంబునం ప్రకృతింబాసి ఆనందమయుండగుట చేతనే |
| అమృతత్త్వమ్ | = | అమృతత్త్వమును |
| ఆనశుః | = | పొందుదురు అని |
| ఉవాచ | = | పల్కెను |

"శ్రద్ధాయుక్తంబయిన భక్తి చేత యోగాభ్యాసంబునం చేసి సుమహిత మనస్కుండై నిస్సంగత్వంబున విరక్తుండైన వాడు అమృతత్వము పొందు"- నని వ్యాస భగవానుడు భాగవతమున చెప్పెను.

**న అయం ఆత్మా ప్రవచనేన లభ్యః**

ఏతైః ఉపాయైన - ముండక 3-2-4

తపసా కర్మణా వా - ముండక 3-2-8 అని ముండకోపనిషత్ చెప్పిన దానికి ఇందు శ్రద్ధ, భక్తి, ధ్యాన యోగాత్ అని చెప్పబడినది.

*****

ఆత్మగుఱించి-ఆత్మస్థానమును పొందువారి గుఱించి చెప్పుచున్నారు

**3. పరేణ నాకం నిహితం గుహాయాం విభ్రాజతే యద్యతయో విశన్తి**

**4. వేదాన్త విజ్ఞాన సునిశ్చితార్థాః సన్న్యాస యోగాద్యతయః శుద్ధ సత్వాః ।**
**తే బ్రహ్మ లోకేషు పరాన్తకాలే పరామృతాత్పరిముచ్యన్తి సర్వే ॥**

(ఇదే మంత్రం ముండకోపనిషత్ 3- 2- 6లో కూడా వుంది)

పరేణ - నాకం - నిహితం - గుహాయాం - విభ్రాజతే - యత్ - యతయః - విశన్తి - వేదాంత - విజ్ఞాన - సునిశ్చిత అర్థాః - సన్న్యాసయోగాత్ - యతయః - శుద్ధసత్వాః - తే - బ్రహ్మలోకేషు - పరఅన్తకాలే - పరఅమృతాత్ - పరిముచ్యన్తి - సర్వే.

సన్న్యాసయోగాత్ = సన్న్యాస యోగము వలన అనగా కర్మఫల త్యాగము వలన

వేదాంత+విజ్ఞాన+ సునిశ్చిత+అర్థాః = వేద వేదాంగములు చదివి, వాటి అర్థములు బాగుగా పరిశీలించి, వేదములలో చెప్పబడిన అమృతత్త్వమును పొందు విధానమును విజ్ఞానము ద్వారా ఆకళింపు చేసుకొని దానిని సాధన ద్వారా గ్రహించిన

శుద్ధసత్వాః+యతయః+ = శుద్ధ సత్త్వగుణయుతులైన యతులు.

తే = అట్టివారు జీవించియుండగానే

సర్వే+పరిముచ్యంతి = అన్ని బంధముల నుంచి కర్మబంధముల నుంచి విముక్తులగుదురు. జీవన్ముక్తులగుదురు. అట్టివారు

పరఅన్తకాలే = ఈ దేహమును వీడి

పర+బ్రహ్మలోకేషు = ఉన్నతోన్నతమయిన బ్రహ్మలోకమునందు వసియించి



బ్రహ్మలో ఏకీభూతులై

అమృతాత్ = అమృతత్త్వము గలిగి బ్రహ్మ యగుదురు

యత్+పరేణ+నాకం = ఏది పదునాలుగు లోకములకు పైన బ్రహ్మలోకములో కలదో

గుహాయాం+నిహితం = ఏది హృదయగుహలో కలదో

విభ్రాజతే = స్వయం జ్యోతియై ప్రకాశించుచున్నదో అట్టి ఆత్మతో

యతయః = యతులు ఏకీభూతులగుదురు

*****

## ధ్యాన యోగము

**5. వివిక్త దేశే చ సుఖాసనస్య శుచిః సమగ్రీవ శిరః శరీరః**
**అత్యాశ్రమస్థః సకలేన్ద్రియాణి నిరుధ్య భక్త్యా స్వగురుం ప్రణమ్య**
**హృత్పుండరీకం విరజం విశుద్ధం విచింత్య మధ్యే విశదం విశోకం**

వివిక్తదేశే - చ - సుఖాసనస్య - శుచిః - సమగ్రీవ ః - శిరః - శరీరః - అతి ఆశ్రమ - స్థః - సకల - ఇన్ద్రియాణి - నిరుధ్య - భక్త్యా - స్వగురుం - ప్రణమ్య - హృత్ - పుండరీకం - విరజం - విశుద్ధం - విచింత్య - మధ్యే - విశదం - విశోకం.

శుచిః = బాహ్య శుచి గలిగి - అతఃకరణ శుద్ధి కలిగి

భక్త్యా = భక్తితో

స్వగురుం = తన గురువుకు

ప్రణమ్య = నమస్కారం చేసి

వివిక్త దేశే+చ = ఏకాంతమునందు

సుఖాసనస్య = సుఖమయిన ఆసనములో కూర్చుండి

సమగ్రీవః+శిరః = మెడ- శిరస్సు-

శరీరః = శరీరము చక్కగా నిటారుగా వుంచి

సకల+ఇంద్రియాణి = జ్ఞానేంద్రియ కర్మేంద్రియములను, మనస్సును

నిరుధ్య = నిగ్రహించి,

అతి ఆశ్రమ+స్థః = అన్య చింతలనువీడి

హృత్ = హృదయము అనే
విశదం = వికసించిన
పుండరీకం+మధ్యే = కమలము మధ్యన గల
విచింత్య = పురుషుని ధ్యానించి

నిరాకార పురుషుని గుఱించి అనగా ఆత్మ గుఱించి

విరజం = రజోగుణాది గుణములు లేని త్రిగుణాతీతము అయినదియు
విశుద్ధం = పరిశుద్ధము అయినదియు
విశోకం = దేహలక్షణములయిన శోక, మోహములు లేనిది అయిన అనగా రాగద్వేషములు లేని ఆత్మను ధ్యానించవలయును.

ధ్యానయోగములో చెప్పిన విషయములను తీసుకొని శ్రీకృష్ణుడు భగవద్గీతలో

1. యోగ నిర్వచనం
2. ప్రారంభ సాధకులు - యోగారూఢులు. (ప్రారంభకునికి పుణ్యకర్మ; ఆరూఢునికి అంతరింద్రియ నిగ్రహము అవసరము)
3. యోగము ఎలా చేయవలయును?
4. యోగికి ఉండ వలసిన లక్షణములు ఏమిటి?
5. యోగము ఎవరికి వస్తుంది? ఎవరికి రాదు?
6. యోగము వలన లాభమేమిటి?
7. మనసు స్థిరంగా ఎలా వుంటుంది?
8. ఈ జన్మలో యోగ సిద్ధిగాక పోతే వాని పరిస్థితి ఏమిటి?

ఇలా ప్రశ్నలు వేసుకొని వాటికి సమాధానముగా ఆత్మ సంయమ యోగము చెప్పినాడు. గీతలోని ఆత్మసంయమ యోగమునకు మూలము ఈ ఉపనిషత్. యోగము గుఱించి భాగవతములో కథలుగా చెప్పబడినది. శ్వేతాశ్వతరోపనిషత్తు, ఈ ఉపనిషత్తు, కపిలుని సాంఖ్యము, రామాయణము, భగవద్గీత, ఉద్ధవగీత, భాగవతములను తీసుకొని పతంజలి యోగసూత్రములను రచియించినాడు.



ఇందు చెప్పిన శుచిః + భక్త్యా స్వగురుం ప్రణమ్య- అనిన పదములను ఆ తర్వాత తర్వాత యమ, నియమములుగా పేర్కొనినారు. పుణ్యకర్మాచరణకు మరో పేరే యమ నియమములు.

| యమములు | పతంజలి ప్రకారం | ఉద్ధవగీత ప్రకారము |
|---|---|---|
| | సత్యము | ఇవియే గాక |
| | అహింస | మౌనం |
| | ఆస్తేయము | అసంగము (యితరులతో కలియక) |
| | అపరిగ్రహము | హ్రీ (సిగ్గు) |
| | బ్రహ్మచర్యం | అసంచయము (ధనకనకవస్తు వాహనాదులను సమకూర్చుకోవాలనే భావన లేకుండుట) |
| | | ఆస్తిక్యం, స్థైర్యం క్షమ,అభయం |
| నియమములు | ఆచార్యోపాసన | వీటితో పాటు |
| | స్వాధ్యాయము | ఆతిథ్యం, హోమము, అర్చన, తీర్థాటన, జపము, తపము, శ్రద్ధ, తుష్టి చెప్పినారు |

వివిక్తదేశే అని చెప్పిన దానికి

ఏకాకీ = ఒంటరిగా
రహసిస్థితః = ఏకాంత ప్రదేశమున
శుచౌదేశే ప్రతిష్ఠాప్య = మంచి ప్రదేశమున కూర్చుండి అని భగవద్గీతలో శ్రీకృష్ణుడు వివరించినాడు.

సుఖాసనస్య- అని చెప్పిన దానికి భగవద్గీతలో

స్థిరమాసనః = స్థిరమైన ఆసనమున యుండి
నాత్యుచ్ఛ్రి తమ్ + నాతినీచం = మిక్కిలి ఎత్తుగాని, మిక్కిలి పల్లముగానూ లేకుండా
చేలాజినకుశోత్తరమ్ = క్రిందదర్భలు, ఆపైన జింక చర్మము, ఆపైన బట్టవేసి అని వివరించినాడు.
సమగ్రీవః శిరఃశరీరః = అని చెప్పిన దానికి భగవద్గీతలో సమంకాయం

శిరోగ్రీవం ధారయన్నచలస్థిరః సమముగా శరీరము,
శిరస్సు, మెడ ఉంచి యిటు అటు కదలక అని

సంప్రేక్ష్య నాసికాగ్రం స్వ = ముక్కుకొనచూస్తూ

దిశశ్చానవలోకయన్ = ఇటు అటు చూడక అని వివరించినాడు

సకల ఇంద్రియాణి నిరుధ్య అని చెప్పిన దానికి

మనస్సంయమ్య = మనస్సును అరికట్టి

తత్రైకాగ్రం మనఃకృత్వా = మనస్సును ఏకాగ్రత చేసి

యత చిత్తేన్ద్రియక్రియః = చిత్తము,యింద్రియములను నియమించి

యతచిత్తాత్మా = చిత్తశుద్ధి గలిగి

నిరాశీ = కోరికలు లేక

అపరిగ్రహః = ఎవరి వద్ద ఏదీ పుచ్చుకొనక

ప్రశాన్తాత్మా = ప్రశాంతమనస్కుడై

విగతభీః = భయరహితుడై

బ్రహ్మచారివ్రతేస్థిత = బ్రహ్మచారియై అని వివరించినాడు.

విచింత్య- అని చెప్పినదానికి

మచ్చిత్తో యుక్త ఆసీతమత్పరః = నాయందే చిత్తముంచి నా యందే భావముంచి అనగా నన్నే నిరంతరము ధ్యానించుచూ యుండవలయును అని చెప్పినాడు.

ఈ ఉపనిషత్తుగాని, శ్రీకృష్ణుడుగాని ప్రాణాయామము చెప్పలేదు. ధ్యానయోగంకు కావలసినది నిరంతరనామస్మరణ. ఈ విషయము ముండకోపనిషత్‌లో చెప్పబడినది.

ఈ ధ్యానయోగమును ఈ క్రింద వివరించిన విధముగా వర్గీకరించు కొని భాగవతంలో ఎవరెవరు ఎలా సాధన చేసినదీ చదివినచో విపులముగా అర్థమగును.

**విరక్తి గలిగి ఉండి -**

1. స్థలము 2.పుణ్యకర్మానుష్ఠానం యమ-నియమములు 3.ఆసనము 4.ప్రాణాయామము 5.ప్రత్యాహారము 6.ధ్యానము - మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము అనే అతఃకరణముల శుద్ధి, 7.ధారణ - నిరంతర నామ స్మరణ



8.సమాధి, 9.దేహత్యాగము.

ఆహారము నాలుగు స్థాయిలలో తీసుకొనబడు విధము గమనించవలయును.

1. ప్రారంభస్థాయి 2. ధ్యానములో స్థాయి 3. ధారణలో స్థాయి 4. సమాధిలో స్థాయి ధారణ గుఱించి భాగవతంలో పరీక్షిత్ అడుగగా శుకబ్రహ్మ చెప్పినట్లు ద్వితీయ స్కంధంలో వివరించినారు.

ప్రశ్న:

**కం॥ ధారణ యే క్రియ నిలచును ? ధారణ కే రూప ? మెద్ది ధారణ యనఁగా**
**ధారణ పురుష మనోమల, మేరీతి హరించు? నాకు నెఱిఁగింపఁగదే**

(భాగవతము- ద్వితీయస్కంధము 13)

సమాధానం:

**ఆ॥ పవనములు జయించి పరిహృతసంగుఁడై, యింద్రియముల గర్వమెల్ల మాపి**
**హరి విశాలరూపమునందుఁ జిత్తముఁ జేర్చి, నిలపవలయు బుద్ధి నెఱపి బుధుఁడు**

(భాగవతము - ద్వితీయస్కంధము- 15)

ధ్యానయోగము యొక్క పరిపక్వ స్థితినే ధారణ యనియందురు. నిరంతర ధారణయే సమాధి. కర్మవాసనలు క్షయమయిన గాని సమాధి కుదరదు.

*****

ధ్యానమునకు లక్ష్యమయిన పురుషుని వర్ణన

నిరాకార వర్ణన - దీనినే ఆత్మ గుఱించి వర్ణించుటగా చెప్పుదురు

6. **అచిన్త్య మవ్యక్త మనన్త రూపం శివం ప్రశాన్త మమృతం బ్రహ్మయోనిమ్ ।**
**తథాఽఽది మధ్యాన్త విహీన మేకం విభుం చిదానన్ద మరూప మద్భుతం ॥**

అచిన్త్యమ్ - అవ్యక్తమ్ - అనన్తరూపం - శివం - ప్రశాన్తమ్ - అమృతం - బ్రహ్మయోనిమ్ - తథా - ఆది - మధ్య - అన్త - విహీనమ్ - ఏకం- విభుం - చిదానన్దమ్ - అరూపం - అద్భుతం.

విరజం, విశుద్ధం, విశోకం - అని గతశ్లోకములో చెప్పి యిప్పుడు

తథా = అటులనే, ఆ విధముగా ఆత్మ

| | | |
|---|---|---|
| అచిన్త్యమ్ | = | ఊహకందనిది. గుణియో, నిర్గుణుడో, అణువో గాక మహామహిమకలదో తెలియదు. |
| శివం | = | మంగళకరమయినది |
| ప్రశాంతం | = | త్రిగుణరహితమైనది. శాంతత్త్వము గలది |
| అమృతం | = | శాశ్వతము |
| బ్రహ్మయోనిం | = | జగత్ కారణము |
| ఆదిమధ్యాంత+విహీనం | = | కాలాతీతము. కాలములోనే ఆది, మధ్య అంతము లుండును. ఇది కాలాతీతము. కావున ఆది మధ్యాంత విహీనము. |
| ఏకం | = | సృష్ట్యాది యందు యిది ఒక్కటే గలదు |
| విభుం | = | సర్వమునకు ప్రభువు |
| చిదానందం | = | చిత్‌గా పిలువబడే ఆనంద స్వరూపమయినది |
| అరూపం | = | రూపరహితమయినది |
| అద్భుతం | = | అద్భుతము |
| అవ్యక్తమ్ | = | కనిపించదు-అంతర్యామి |
| అనన్తరూపమ్ | = | అనంతరూపములుగా విరాట్ పురుషునిగా విశ్వములో కలది. |

*****

నిరాకారముగా యున్న ఆత్మ సాకారముగా పురుషుడయినది.

పురుషుని వర్ణన

7. **ఉమా సహాయం పరమేశ్వరం ప్రభుం త్రిలోచనం నీలకంఠం ప్రశాంతం ।**
**ధ్యాత్వా మునిర్గచ్ఛతి భూతయోనిం సమస్తసాక్షిం తమసః పరస్తాత్ ॥**

ఉమాసహాయం - పరమేశ్వరం - ప్రభుం - త్రిలోచనం - నీలకంఠం - ప్రశాంతం - ధ్యాత్వా - మునిః - గచ్ఛతి - భూతయోనిం - సమస్త సాక్షిం - తమసః - పరస్తాత్.

| | | |
|---|---|---|
| భూతయోనిం | = | సృష్టికారకుడు |
| సమస్త సాక్షిం | = | సమస్తమునకు సాక్షి |
| ప్రశాంతం | = | త్రిగుణ రహితుడు |
| తమసః+పరస్తాత్ | = | ప్రకృతికి పరుడు |
| ప్రభుం | = | జగత్పరిపాలకుడు |
| త్రిలోచనం | = | సూర్య, చంద్ర, అగ్ని అనే మూడు కన్నులు గలవాడు |
| నీలకంఠం | = | నీలకంఠుడు |
| ఉమాసహాయం | = | అర్ధనారీశ్వరుడు, పార్వతితో కూడినవాడు. ప్రకృతిని అధిష్ఠించినవాడు ప్రకృతి పురుషుల సమిష్టి రూపము అయినవాడు |
| పరమేశ్వరం | = | సృష్ట్యాది యందు గల ఉత్కృష్టమయిన ఈశ్వరుడు అట్టి పరబ్రహ్మను |
| మునిః | = | జ్ఞాని (వాచాం నియచ్ఛతీతి - వాచం యమః - యమ ఉపరమే - వాక్కును నిలుపువాడు. మన్యతేమునిః మనజ్ఞానే జ్ఞానముగలవాడు మునిః- సర్వధర్మాణాం మననాన్మునిః - సర్వ ధర్మములు తెలిసినవాడు) |
| ధ్యాత్వా | = | ధ్యానించి |
| గచ్ఛతి | = | ఆ పురుషుని దర్శించి ఆ స్థానమునకు చేరును. |

ఆపై ఆ పురుషునితో ఏకీభూతుడగును.

*****

విరాట్ పురుషుని వర్ణన

ఆ ఈశ్వరుడే - బ్రహ్మ విష్ణువు శివుడు - సర్వదేవతలు ఇతడే

8. **సబ్రహ్మ సశ్శివః సేన్ద్రః సోఽక్షరః పరమః స్వరాట్ ।**
**స ఏవ విష్ణుః స ప్రాణః సకాలోఽగ్నిః స చంద్రమాః ॥**

సః - బ్రహ్మ - సః - శివః - సః - ఇన్ద్రః - సః - అక్షరః - పరమః - స్వరాట్ - సః - ఏవ - విష్ణుః - సః - ప్రాణః - సః - కాలః - అగ్నిః - సః - చంద్రమాః

ఇంతవఱకు చెప్పిన ఆత్మ లేక ఈశ్వరుడు అయిన అతడే విరాట్ పురుషుడు. ఆవిరాట్ పురుషుడే

| | | |
|---|---|---|
| సః + బ్రహ్మ | = | అతడే బ్రహ్మ (బ్రహ్మ - బృంహతి వర్ధయతి ప్రజా ఇతి బ్రహ్మ. బృహి వృద్ధౌ - ప్రజలను వృద్ధి బొందించువాడు) |
| సః+విష్ణుః | = | అతడే విష్ణువు (విష్ణుః -విశ్వం వేవేష్టి వ్యాప్నో తీతి విష్ణుః - విశ్వమును వ్యాపించియుండువాడు సర్వవ్యాపకుడు) |
| సః + శివః | = | అతడే శివుడు (శివం కల్యాణం తద్యోగాద్వా శివః - శివ మనగా శుభము - దానితో గూడిన వాడు. అనగా శుభముల నిచ్చువాడు. శివప్రదాత్వాద్వాశివః శామ్యతి పరమానంద రూపత్వాన్నిర్వికారో భవతీతి శివః బ్రహ్మానంద స్వరూపుడును, నిర్వి కారుడును గనుక శమించి యుండువాడు) |
| సః+ అక్షరః | = | అతడే అక్షరుడు (నక్షర తీత్యక్షరః - క్షర సంరక్షణే - చెడనిది కనుక అక్షరము.అనగా లయకాలమున కూడా నశింపని వాడు) |
| సః+ ఇన్ద్రః | = | అతడే ఇంద్రుడు (ఇదం తీతీంద్ర - ఇది పరమైశ్వర్యే - పరమైశ్వర్యయుక్తుడు.అనగా లక్ష్మీయుతుడు) |
| (సః)+అగ్నిః | = | అతడే అగ్ని (హృదయ గుహలో గల అగ్నిశిఖల మధ్య గల పరమాత్మ) |
| సః+చంద్రమాః | = | అతడే చంద్రుడు (చందయతీతి చంద్రః - చది ఆహ్లాదనే - సంతోషింపచేయువాడు. మాఙ్ మానే - చంద్ర మనగా కర్పూరము. దానితో పోల్చబడువాడు అనగా తెల్లనివాడు - శశివర్ణము గలవాడు) |
| (సః)+కాలః | = | అతడే కాలము, కాలుడు, యమధర్మరాజు, కాల స్వరూపుడు. |
| సః+పరమః | = | అతడే సర్వోన్నతుడు |



| | | |
|---|---|---|
| స్వరాట్+ఏవ | = | అతడే స్వరాట్. స్వయం ప్రకాశకుడు. (రాజతే రాట్ ప్రకాశించువాడు స్వరాట్-స్వయముగా ప్రకాశించు వాడు) |
| సః+ప్రాణః | = | అతడే ప్రాణము. సర్వజీవులలో ప్రాణ రూపమున గలడు |

హృదయ గుహలోని ఆత్మ అతడే. జీవుడు కూడా అతడే. అతడే సర్వదేవతా స్వరూపుడు అతడే బ్రహ్మ. శివుడు. అతడే విష్ణువు అని ఈ మంత్రార్థము.

*****

సర్వము అతడే - ఆత్మను దర్శించిన అమృతత్త్వము

**9. స ఏవ సర్వం యత్ భూతం యచ్చ భవ్యం సనాతనం ।**
**జ్ఞాత్వా తం మృత్యుమత్యేతి నాన్యః పన్థా విముక్తయే ॥**

సః - ఏవ - సర్వం - యత్ - భూతం - యత్ - చ - భవ్యం - సనాతనం - జ్ఞాత్వా- తం - మృత్యుమ్ - అత్యేతి - న - అన్యః - పన్థాః - విముక్తయే.

| | | |
|---|---|---|
| సనాతనం | = | సనాతనుడు. అతడే సృష్ట్యాది యందున్న వాడు. అతడే సృష్టి చేసి |
| యత్+భూతం+చ+ యత్+భవ్యం+ సః+ఏవ+సర్వం | = | అతడే భూతకాలము నందు, వర్తమానకాలమునందు మఱియు భవిష్యత్ కాలము నందుగల సృష్టి సర్వము అతడే. అనగా ఈ విశ్వమంతా అతడే. అతడు గానిది పర మాణువు కూడ లేదు. |
| జ్ఞాత్వా | = | సాధకుడు తన హృదయ గుహయందు గల స్వయం జ్యోతిని దర్శించి, ఆపై అఖిల భూతము లందు గల ఆత్మను గ్రహించి, ఆత్మను సర్వభూతస్థుడని తెలిసికొని |
| తం+మృత్యుం+అత్యేతి | = | మృత్యువును దాటును. అమృతుడగును. |
| విముక్తయే | = | జనన మరణ వలయము నుంచి విడువ బడుటకు, సర్వబంధముల విముక్తికి |

న+అన్యః+పంథాః = ఇంకొక మార్గము లేదు.

ఈ విషయమునే ప్రహ్లాదుడు తన తండ్రికి విన్నవించెను.

శా॥ **శోధింపం బడె సర్వశాస్త్రములు రక్షోనాథ వేయేటికిన్**
**గాథల్ మాధవశేముషీతరణి సాంగత్యంబునం గాక దు**
**ర్మేధన్ దాఁటఁగ వచ్చునే సుతవధూమీనోగ్ర వాంఛామద**
**క్రోధోల్లోల విశాల సంసృతి మహా ఘోరామితాంభోనిధిన్**

(భాగవతము-సప్తమ స్కంధం -183)

*****

అమృతత్త్వమునకు ఆత్మను దర్శించవలయును.

10. **సర్వభూతస్థ మాత్మానం సర్వభూతాని చాత్మని ।**
**సమ్పశ్యన్ బ్రహ్మ పరమం యాతి నాన్యేన హేతునా ॥**

( భగవద్గీత - ఆత్మసంయమ యోగము -29లో కలదు)

సర్వభూతస్థమ్ - ఆత్మానం - సర్వభూతాని - చ - ఆత్మని - సమ్ పశ్యన్ - బ్రహ్మ - పరమం - యాతి - న - అన్యేన - హేతునా.

| | | |
|---|---|---|
| ఆత్మానం | = | తనని |
| సర్వభూతస్థమ్ | = | సర్వభూతములయందు |
| సర్వభూతాని+చ | = | సర్వభూతములను |
| ఆత్మని | = | తనయందు |
| సంపశ్యన్ | = | గ్రహించిన వాడు అనగా నామ, రూప, గుణాత్మకమైన ఉపాధులను గాక ఆత్మను దర్శించిన వాడు |
| పరమం+బ్రహ్మ | = | ఆత్మ స్థానమును |
| యాతి | = | చేరుకొనును. |
| న+అన్యేన+హేతునా | = | సర్వత్రా ఆత్మను దర్శించుట తప్ప ఇలా ఆత్మస్థానము చేరుకొనుటకు ఇంకొక మార్గము లేదు. |

*****



త్రిగుణరహిత స్థితియే విరాట్ పురుషుని దర్శనములేక ఆత్మ దర్శనము

ఇదే విషయాన్ని ప్రహ్లాద చరిత్రలో - ప్రహ్లాదుని పరంగా వర్ణించినారు.

సీ॥ **తనయందు నఖిలభూతములందు నొకభంగి సమహితత్వంబున**
**జరుగువాఁడు !** (భాగవతము - సప్తమస్కంధం - 115)

శా॥ **అంభోజాసనుఁ డాదిగాఁగఁ దృణపర్యంతంబు విశ్వాత్ముఁడై**
**సంభావంబున నుండు ప్రోడ విపుల స్తంభంబునందుండఁడే**
**స్తంభాతర్గతుఁడయ్యు నుండుటకు నే సందేహమున్ లేదు, ని**
**ర్దంభత్వంబున నేఁడు గానఁబడుఁ బ్రత్యక్షస్వరూపంబునన్**

(భాగవతము-సప్తమస్కంధం - 282)

అని ప్రహ్లాదుడు చెప్ప శ్రీ నృసింహదేవుండావిర్భవించ ప్రహ్లాదుడు ,హిరణ్యకశిపుడు ఇరువురు దర్శించినారు. కావున

....

**నృసింహావతారంబు నిష్ఠతోడఁ**
**దగిలి చింతించువారలు దండధరుని,**
**బాధ నొందరు, మృత్యువు బారిఁబడరు**

(భాగవతము-సప్తమస్కంధం -381)

ఈ సప్తమ స్కంధంలో - యోగరీత్యా దర్శించిన హిరణ్యకశిపుని సాధన మఱియు శ్రద్ధ ధ్యానయోగభక్తితో దర్శించిన ప్రహ్లాదుని సాధన చదివి అలా సాధన చేసినవారు ఆత్మను దర్శించెదరు. గుణరహిత స్థితిని పొందినవారు ఆత్మను దర్శించెదరు.

*****

ఆత్మ ప్రాప్తికి - ఓంకారమును ఉపాసించవలయును

11. **ఆత్మానమరణిం కృత్వా ప్రణవం చోత్తరారణిం ।**
**జ్ఞాన నిర్మథనా భ్యాస్యాత్ పాశం దహతి పండితః ॥**

(శ్వేతాశ్వతర 1-14లో కూడా కలదు)

ఆత్మానమ్ - అరణిం - కృత్వా - ప్రణవం - చ - ఉత్తరారణిమ్ - జ్ఞాన - నిర్మథన- అభ్యాస్యాత్ - పాశం - దహతి - పండితః

ఇంతకు ముందు ముండకోపనిషత్‌లో ధనుస్సు బాణములను ఉదాహరణగా తీసుకొని ఇట్లు వివరించినారు.

ధనుస్సు ధరియించవలసిన వాడు సాధకుడు
ధనుస్సు - ఓంకారము
పదును పెట్టిన బాణము - జీవుడు
బాణముతో కొట్టవలసిన లక్ష్యస్థానము - ఆత్మ.

ఓంకారము, నిరంతరనామస్మరణ చేసిన జీవాత్మయే ఆత్మ అగును. ఇక్కడ మఱియొక ఉదాహరణతో వివరించుచున్నాడు. వేద కాలములో అరణి మధించి అగ్నిని పుట్టించెడివారు. అనగా క్రింద ఒక కఱ్ఱముక్క పైన ఒక కఱ్ఱముక్క ఉంచి కొంతసేపు వాటిచే మథించగా అగ్నిపుట్టును. ఆ విషయం వేదవిద్యార్థులకు ఆ కాలములో అందఱికీ తెలిసినదే. కావున యీ ఉదాహరణ చెప్పినాడు.

| | | |
|---|---|---|
| పండితః | = | వేదవేదాంగములు చదివి ఆత్మ దర్శనము చేయ సంకల్పించిన సాధకుడు, సమదర్శనము గలవాడు |
| ఆత్మానం+అరణిం+ కృత్వా+చ | = | తనని దక్షిణ అరణిగా చేసి అనగా దక్షిణ అరణి స్థిరముగా భూమిపై ఉంచి అందు గల రంధ్రములో ఉత్తర అరణిని ఉంచి అగ్ని వచ్చే వఱకు త్రిప్పుట మీకు తెలిసినదే గదా. అలాగే సాధకుడు సుఖదుః ఖములకు విచలితుడుగాక ధీరుడై |
| ప్రణవం+ఉత్తర+అరణిం | = | ఓంకారమును ఉత్తర అరణిగా భావించి |
| అభ్యాసాత్ | = | నిరంతర అభ్యాసము వలన |
| నిర్మధన | = | అరణిలను మధించగా అగ్ని పుట్టునట్లు |
| జ్ఞాన | = | జ్ఞాన మనే అగ్ని పుడుతుంది. ఆ అరణి నుంచి వచ్చిన అగ్ని సమిధలను దహించును. అటులనే యీ జ్ఞానాగ్ని కర్మ బంధము అనే |
| పాశం | = | మృత్యుపాశమును |
| దహతి | = | దహించును. అనగా బంధ విముక్తుడగును. ఆత్మదర్శనమై అమృతుడగును. |

*****





**12 స ఏవ మాయా పరిమోహితాత్మా శరీరమాస్థాయ కరోతి సర్వం ।**
**స్త్రీ యన్న పానాది విచిత్ర భోగైః స ఏవ జాగ్రత్పరితృప్తి మేతి ॥**

సః - ఏవ - మాయా - పరిమోహితాత్మా - శరీరమ్ - ఆస్థాయ - కరోతి - సర్వమ్ - స్త్రియః - అన్నపానాది - విచిత్ర - భోగైః - సః - ఏవ - జాగ్రత్ - పరితృప్తిమ్ - ఏతి.

| | | |
|---|---|---|
| సః+ఏవ | = | సృష్ట్యాది యందున్న ఆత్మయే హృదయ గుహలో ఆత్మగానూ, దేహములో జీవునిగానూ ఉన్నది. జీవునిగా పూర్వ జన్మ కర్మ ఫలితమున |
| శరీరమ్+ఆస్థాయ | = | శరీరములో వసియించి |
| మాయా | = | ఆత్మ వలనగలిగిన మాయచే |
| పరిమోహితాత్మ | = | మాయా మోహితుడైన జీవాత్మ |
| జాగ్రత్ | = | జాగ్రతావస్థలో స్థూలదేహంతో |
| అన్నపానాది+సర్వం | = | అన్నపానాది సర్వకార్యములు చేయుచూ |
| స్త్రియః | = | అనేక మంది స్త్రీలతో భోగించుచూ |
| విచిత్ర+భోగైః | = | అనేక భోగముల చేత ఆనందము పొందుచూ |
| కరోతి | = | పుణ్యా పాప యుతమయిన కర్మలు చేయు చున్నాడు. ఆ కర్మల వలన |
| సః+ఏవ | = | ఆ జీవుడే జాగ్రతావస్థలో |
| పరితృప్తమ్+ఏతి | = | సుఖదుఃఖములను మిక్కిలి అనుభవించుచున్నాడు. |

ఈశ్వరుడు తనని తాను విభజించుకొని ఒక భాగము హృదయ గుహలోనూ మూడు భాగములు జీవుడుగా మూడు అవస్థలలో క్రీడించుచుండెను అన్న భావనను వాల్మీకి తన రామాయణంలో ఇట్లు చెప్పినాడు.

విష్ణో పుత్రత్వ మాగచ్ఛ కృత్వాత్మానం చతుర్విధమ్

(బాలకాండ-15 వ సర్గ-19)

ఓ విష్ణో ! నిన్ను నీవు 4 భాగములుగా చేసుకొని దశరథునికి పుత్రులుగా

ఆవిర్భవించుము.

ఈ విషయము మాండుక్య ఉపనిషత్తులో వివరింపబడినది.

*****

జీవుడు - స్వప్నావస్థ - సుషుప్తి అవస్థ

13. **స్వప్నే స జీవః సుఖదుఃఖ భోక్తా స్వమాయయా కల్పితజీవలోకే ।**
**సుషుప్తి కాలే సకలే విలీనే తమోऽభిభూతః సుఖరూపమేతి ॥**

స్వప్నే - సః - జీవః - సుఖదుఃఖం - భోక్తా - స్వ - మాయయా - కల్పిత - జీవలోకే - సుషుప్తి కాలే - సకలే - విలీనే - తమః - అభిభూతః - సుఖరూపమ్ - ఏతి.

స్వప్నావస్థ - సూక్ష్మశరీరము

| | | |
|---|---|---|
| సః+జీవః | = | జాగ్రతావస్థలోని ఆ జీవుడే |
| స్వ+మాయయా | = | తనమాయచే అనగా తన మనస్సులోని ఆలోచనలచే |
| కల్పిత+జీవలోకే | = | కల్పింపబడిన జీవలోకము అయిన |
| స్వప్నే | = | స్వప్నమందు |
| సుఖదుఃఖం | = | సుఖదుఃఖములు |
| భోక్తా | = | అనుభవించి, స్వప్నావస్థనుంచి జాగ్రతావస్థకు లేదా స్వప్నావస్థనుంచి సుషుప్తి అవస్థకు వెళ్ళుచున్నాడు. |

జీవుడు జాగ్రతావస్థలో ఈశ్వరునిచే కల్పింపబడిన మాయవలనను, స్వప్నావస్థలో తనచే కల్పింపబడిన మాయవలనను సుఖదుఃఖములననుభవించుచున్నాడు. స్వప్నావస్థలో ఆత్మ యొక్క వెలుగులో మనము కలలో దృశ్యములను చూచెదము. అయితే ఈ దర్శనము ఆత్మదర్శనమయినట్లు కాదు.

కారణ శరీరము- సుషుప్తి అవస్థ

| | | |
|---|---|---|
| సుషుప్తి కాలే | = | సుషుప్తి కాలమునందు |
| తమః+అభిభూతః | = | అజ్ఞానము, అవిద్య ఆవరించగా |
| సకలే+విలీనే | = | ప్రాణము తప్ప మిగిలిన జ్ఞానేంద్రియములు, మనస్సు, అంతఃకరణ చతుష్టయము, జీవాత్మ - ఇవి సర్వము ఆత్మతో ఏకీభూతమై ఉండగా |
| సుఖరూపం+ఏతి | = | సుఖరూపమును పొందుచున్నారు. |



జాగ్రతావస్థనుంచి సుషుప్తి వఱకు గల అవస్థలను అవిద్య, అజ్ఞానము, తమస్సుగా చెప్పుదురు. సుషుప్తిలో జీవాత్మ పరమాత్మతో కలసి ఉండును. అయితే యాస్థితి ఆత్మస్థానమునకు చేరినట్లు కాదు. సుషుప్తి వఱకు గల అవస్థలలో ఆత్మప్రాప్తి కలగదు. ఈ విషయమునే ఈ తమస్సును తమసా నదిగా వర్ణించి రామాయణంలో ఇట్లు చెప్పినాడు. సుమంతుడు రథము నడుపగా శ్రీరాముడు వనవాసమునకు లక్ష్మణునితో సీతతో బయలు దేరినాడు. అయోధ్యాపురవాసులు, బ్రాహ్మణులు అనుసరించిరి. ఆ బ్రాహ్మణులు వాజపేయ యాగము చేసినవారు, ఆ బ్రాహ్మణుల బుద్ధి ఆ వేదమంత్రములయందే ఉండును.

**యా హి నః సతతం బుద్ధిర్వేదమన్త్రానుసారిణీ**

(అయోధ్యకాండ- 45వ సర్గ-24)

నః-యా-బుద్ధిః- సతతం-వేదమన్త్ర-అనుసారిణీ - హి

| | | |
|---|---|---|
| నః | = | మా యొక్క |
| యా+బుద్ధిః | = | బుద్ధి |
| సతతం | = | ఎల్లప్పుడూ |
| వేదమన్త్రానుసారిణీ+హి | = | వేదముల యందలి మన్త్రములతో అనుసరించి ఉండును |

**హృదయేష్వేవతిష్ఠన్తి వేదా యే నః** (45వ సర్గ-25)

యే - వేదాః - నః - హృదయేషు - ఏవ- తిష్ఠన్తి

ఆ వేదములు మా హృదయముల యందే ఉన్నవి. అనగా వారు వేదపారంగతులు. ఇలా బ్రాహ్మణులు చెప్పుచుండగా తమసానది వచ్చెను. ఆ రాత్రి పౌరులు, బ్రాహ్మణులు అందఱూ తమసా నది వద్ద విశ్రమించిరి.

**వృక్షమూలేషు సంసుప్తాన్** - (46వ సర్గ. 19)

వృక్షముల వద్ద సుషుప్తిలో - గాఢనిద్రలో - ఉండిరి.

సుమంతుడు రథము సిద్ధము చేయగా శ్రీరాముడు, లక్ష్మణ సీతాసహితుడై

**తమసామతరన్నదీమ్ (46వ సర్గ-28)**

నదీమ్ - తమసామ్ - అతరత్ = తమసానదిని దాటెను. పౌరులు, బ్రాహ్మణులు శ్రీరామునిని అనుసరించలేక వెనుతిరిగిరి.

వేదవేదాంగములు చదువుట అపరవిద్య. అపరవిద్యవలన ఆత్మను చేరలేము అని చెప్పిన దానికి వ్యాఖ్యానముగా ఈ కథ రామాయణంలో చెప్పబడినది. వేదములు చదివియు సంసార తాపత్రయములను వదలనిచో ఆత్మాను సంధానము కుదరదని భావము.

*****

జీవుడు -సుషుప్తి నుంచి జాగ్రతావస్థకు

**14. పునశ్చ జన్మాంతర కర్మయోగాత్ స ఏవ జీవః స్వపితి ప్రబుద్ధః**
**పురత్రయే క్రీడతి యశ్చ జీవస్త తస్తు జాతం సకలం విచిత్రమ్**
**ఆధారమానన్ద మఖణ్డ బోధం యస్మిల్లయం యాతి పురత్రయం చ**

పునః - చ - జన్మాంతర - కర్మయోగాత్ - సః - ఏవ - జీవః - స్వపితి - ప్రబుద్ధః - పురత్రయే - క్రీడతి - యః - చ - జీవః - తతః - తు - జాతం - సకలం - విచిత్రమ్- ఆధారమ్- ఆనన్దమ్ - అఖణ్డ బోధం - యస్మిన్ - లయం - యాతి - పురత్రయం - చ

| | | |
|---|---|---|
| స్వపితి | = | నిద్రించును |
| చ | = | మఱియు |
| సః+జీవః+ఏవ | = | సుషుప్తిలో సుఖరూపమున పొందిన ఆ జీవుడే |
| జన్మాంతర | = | పూర్వజన్మ |
| కర్మయోగాత్ | = | కర్మవాసనలవలన మేల్కొలపబడి |
| పునః+ప్రబుద్ధః | = | మరల జాగ్రతావస్థకు వచ్చును. |
| యః+జీవః | = | ఆ జీవుడు |
| పురత్రయే+చ | = | ఇటులనే ప్రతిదినము జాగ్రతావస్థ, స్వప్న అవస్థ, సుషుప్తి అవస్థలలో అనగా స్థూల శరీరము, సూక్ష్మశరీరము, కారణ శరీరములనే మూడు పురములతో - అనగా మూడు నివాసస్థానములలో ఉండి సుఖదుఃఖములను, కేవలము సుఖమును పొందుచూ |
| క్రీడతి | = | క్రీడించున్నాడు |
| యస్మిన్ | = | ఎందులో, అనగా సృష్ట్యాదియందు గల పురుషుని వలన వచ్చిన ప్రకృతిలో |
| పురత్రయం | = | స్థూల, సూక్ష్మ, కారణ శరీరములనే మూడు పురములు |
| లయం+యాతి | = | లయమును పొందును. అనగా లయమగును |
| తతః+తు | = | అందువలన ఆ పురుషుని వలన వచ్చిన ప్రకృతిలో |
| సకలం | = | యీ సర్వ సృష్టిలయమై మరల కల్పారంభమున |
| విచిత్రం+జాతం | = | ఆ పురుషుని వలననే విచిత్రముగా యీ సృష్టి అంతా వచ్చును. |



ఇటుల కల్పారంభమున సృష్టి వచ్చును. లయకాలమున లయమగును. ఆ పురుషుడు

| | | |
|---|---|---|
| ఆధారమ్+చ | = | జగత్ సృష్టికి ఆధారము |
| ఆనన్దమ్ | = | కేవల ఆనంద స్వరూపుడు |
| అఖణ్డబోధం | = | సర్వవ్యాపకుడు అని తెలియుము |

పురుషుడు అనాది. ఈ పురుషుని వలన ప్రకృతి వచ్చింది. ఎలా వచ్చింది? అన్న ప్రశ్నకు కొందఱు పురుషుడే ప్రకృతిని సృష్టించి ఆ ప్రకృతిలో తన వీర్యము నుంచి సృష్టి చేసినాడని చెప్పిరి. ఇదే కథగా బ్రహ్మ సరస్వతిని సృష్టించి అలా కూతురయిన సరస్వతిని పెండ్లాడినాడు అని చెప్పిరి.

కొందఱు పురుషునిలో సగభాగము ప్రకృతి అనిరి. పురుష ప్రకృతులు ఒకే నాణము యొక్క బొమ్మ, బొరుసు అనిరి. దీనినే కథగా శివ పార్వతులను చెప్పి శివుడు అర్థనారీశ్వరుడని కథగా చెప్పిరి.

కొందఱు పురుషుడు అనాది. అటులనే ప్రకృతి కూడా అనాది. ఇద్దఱూ సమాన వయస్కులనిరి. దీనినే కథగా శ్రీకృష్ణుడు యోగమాయా ఒకే సమయంలో

జన్మించినట్లు కథగా వర్ణించిరి.

ఇలా అనేక వాదనలుండుట వలన సృష్టి విచిత్రంగా పురుషుని వలన వచ్చినదని యీ ఉపనిషత్ చెప్పినది.

సుషుప్తి అవస్థలో ప్రాణము తప్ప మిగిలినవన్నీ లీనమయినా జన్మసార్థకత కాలేదు. ఎందుకనగా పూర్వజన్మ కర్మ వాసనలు క్షయము కాలేదు. అందువలననే జాగ్రతావస్థలో మళ్ళీ ఎప్పటి వలె ప్రవర్తించుచున్నాడు.

పూర్వజన్మ కర్మవాసనలను సాధనచే దహించి నిశ్చల సమాధి స్థితిలో ఆత్మను దర్శించి, ఆత్మస్థానమును చేరి, ఆత్మతో ఏకీభూతుడయి బ్రహ్మయై విరాజిల్లును. నిశ్చల సమాధి స్థితినే తురీయ అవస్థ యని కొందఱు పేర్కొనిరి.

పురత్రయములను దహించు విధానము భాగవతం సప్తమ స్కంధంలో వివరించి దానికి త్రిపురాసుర సంహారమని పేర్కొనినాడు. ఈ త్రిపురాసుర సంహారకుడు ఈశ్వరుడు. అయితే యీ త్రిపురములు ప్రకృతిలో లీనమగును గాన కొందఱు ప్రకృతినే త్రిపురాసుర సంహారిణిగా పార్వతిని పేర్కొనిరి.

| | **కథ** | **అంతరార్థము** |
|---|---|---|
| 1. | మయుడు తన మాయాబలంబున రాక్షసులకు త్రిపురములు నిర్మించి యిచ్చెను. | ఈశ్వరుడు తనమాయాశక్తిచే జీవులకు-స్థూలసూక్ష్మ కారణ శరీరములనే త్రిపురములు నిర్మించియిచ్చెను. |
| 2. | శివుడు ధనుస్సు, బాణములు ధరియించి ఆ త్రిపురములపై గప్పెను | ధనుస్సు-ఓంకారము బాణము-జీవాత్మ నిరంతర ఓంకారోపాసన వలన జీవాత్మ - పురత్రయములలో క్రీడించుటపోయి-కూటస్థుడయినది |
| 3. | మయుడు రాక్షసులను సిద్ధరస కూపమున ఉంచెను బ్రహ్మదూడగా విష్ణువు గోవుగావచ్చి ఆ సిద్ధరసకూప అమృత రసంబు ద్రావెను | అమృతత్త్వము గలిగినది అమృత ఇహభవతి అయినాడు ఆత్మదర్శనముగలిగినది ఆత్మస్థానము చేరినాడు అమృతత్త్వము- అనగా జీవన్ముక్త స్థితిని పొందినాడు. |
| 4. | ఆ పరమేశ్వరుండు మరల ఒక దివ్యబాణము సంధించి వదలగా రాక్షసులు నశించిరి | ఓంకారోపాసన చేసి ధ్యానయోగము వలన దేహ త్యాగ కాలమున ప్రాణములను బ్రహ్మరంధ్రము చేర్చి బ్రహ్మ రంధ్రము చించి ఆత్మ ఆత్మతో ఏకీభూతమయినది. |

వేద రహస్యమును కథగా వ్యాసభగవానుడు సాధకులకు వివరించినారు.

*****

విరాట్పురుషుడు సృష్టిచేయసంకల్పించెను. సృష్టి చేసెను. దీనిని ప్రారంభసృష్టి అని అందురు.

**15. ఏతస్మాత్ జ్జాయతే ప్రాణో మనః సర్వేంద్రియాణి చ ।**
**ఖం వాయు ర్జ్యోతి రాపః పృథివీ విశ్వస్య ధారిణీ ॥**

(ముండక ఉపనిషత్- 2-1-3లో కూడ కలదు)

ఏతస్మాత్ - జాయతే - ప్రాణః - మనః - సర్వేంద్రియాణి - చ - ఖం - వాయుః - జ్యోతిః - ఆపః - పృథివీ - విశ్వస్య - ధారిణీ.

| | | |
|---|---|---|
| ఏతస్మాత్ | = | ఈ విరాట్పురుషుని వలన విశ్వసృష్టికి కారణమయిన ప్రకృతి-మహత్, మహత్ వలన అహంకారము, అహంకారము మూడు విధముల యినవి. **తమో అహంకారము** వలన |
| ఖం | = | ఆకాశము |
| వాయుః | = | వాయువు |

| | | |
|---|---|---|
| జ్యోతిః | = | తేజస్సు అనగా అగ్ని |
| ఆపః | = | జలము |
| విశ్వస్యధారిణీ+పృథివీ | = | భూమి - వీటి వలన స్థూల శరీరము |
| చ | = | మఱియు పంచభూతములకు గుణములు గలిగినవి. **సాత్త్వికాహంకారము** వలన |
| మనః | = | మనస్సు ఇంద్రియ అధిష్ఠానదేవతలు- **రజో అహంకారమువలన** బుద్ధి |
| సర్వేంద్రియాణి | = | సూక్ష్మ శరీరములోని సర్వ ఇంద్రియములు |
| ప్రాణః | = | ప్రాణము |
| జాయతే | = | గలిగినవి వీటి అన్నింటి సమ్మేళనమున సర్వ ఉపాధులు గలుగుచున్నవి. అనగా విశ్వనిర్మాణము జరుగు చున్నది. |

ఈ మంత్రమునకు అర్థము ముండకోపనిషత్‌లో వివరింపబడినది. దానిని ఇచ్చట చదువుకొనవలయును.

*****

గురువు సృష్ట్యాదియందున్న ఆత్మవునీవే అని ఉపదేశము యిచ్చుట.

**16. యత్పరం బ్రహ్మ సర్వాత్మా విశ్వస్యాయతనం మహత్ ।**
**సూక్ష్మాత్ సూక్ష్మతరం నిత్యం తత్త్వమేవ త్వమేవ తత్ ॥**

యత్ - పర బ్రహ్మ - సర్వ - ఆత్మా- విశ్వస్య - ఆయతనమ్ - మహత్ - సూక్ష్మాత్ సూక్ష్మతరం - నిత్యమ్ - తత్ - త్వమ్ - ఏవ - త్వమ్ - ఏవ - తత్.

| | | |
|---|---|---|
| యత్+పరంబ్రహ్మ | = | ఉత్కృష్టమై సృష్టికారణమయిన సృష్ట్యాదియందుగల ఆ ఆత్మ |
| మహత్ | = | పరిమాణంలో అన్నింటి కంటె గొప్పది |
| నిత్యం | = | శాశ్వతమైనది |
| విశ్వస్య | = | విశ్వమునకు |
| ఆయతనం | = | ఆధారము అనగా మూలకారణము |
| సర్వాత్మా | = | సర్వత్రా గల విరాట్ స్వరూపము కలది |
| సూక్ష్మాత్+సూక్ష్మతరం | = | అదే ప్రాణుల హృదయ గుహలో కూడా ఉన్నది. సృష్టిలో ప్రాణుల హృదయ గుహలో గల ఆత్మ మిక్కిలి సూక్ష్మము. |
| తత్+త్వమ్+ఏవ | = | ఆ ఆత్మవు నీవే |
| త్వమ్+ఏవ+తత్ | = | నీవే ఆ ఆత్మవు. |

**"తత్త్వమసి"** - అని గురువు ఉపదేశించినాడు. ఆత్మ తనే అని స్వానుభవంలో గ్రహించిన సర్వబంధములు పోవును.

*****

**17. జాగ్రత్ స్వప్న సుషుప్త్యాది ప్రపంచం యత్ప్రకాశతే ।**
**తత్ బ్రహ్మాహమితి జ్ఞాత్వా సర్వబంధైః ప్రముచ్యతే ॥**

జాగ్రత్ - స్వప్న - సుషుప్త - ఆది - ప్రపంచం - యత్ - ప్రకాశతే - తత్ - బ్రహ్మ- అహమ్ - ఇతి - జ్ఞాత్వా - సర్వబంధైః - ప్రముచ్యతే

| | | |
|---|---|---|
| జాగ్రత్+స్వప్న+ సుషుప్త్యాది | = | జీవరూపమున జాగ్రత్, స్వప్న, సుషుప్త్యాది అవస్థలలో; స్థూలసూక్ష్మ కారణ శరీరములలోను మఱియు ఆత్మగా |
| ప్రపంచం | = | ప్రపంచము అనగా సర్వమూ తానే అయి |
| యత్+ప్రకాశతే | = | ఏది క్రీడించుచున్నదో, ఏది ప్రకాశించు చున్నదో |
| తత్+బ్రహ్మ | = | ఆ ఆత్మ |
| అహం+ఇతి+జ్ఞాత్వా | = | నేనే అని స్వానుభవంలో దర్శించిన వాడు, సర్వత్రా వ్యాపించియున్న ఆత్మ తత్త్వము నేనేనని గ్రహించిన వాడు. |
| సర్వబంధైః | = | సర్వబంధములనుంచి |
| ప్రముచ్యతే | = | విడివడును. అమృతుడగును. |

*****

అశ్వలాయనుడు ఆత్మయై విరాజిల్లుచు స్వానుభవమును ప్రకటించుచున్నాడు. ఆత్మ లక్షణములను అన్యాప దేశంగా చెప్పుచున్నాడు

(కైవల్య 18 నుంచి 24 వఱకు)

**18. త్రిషు ధామసు యత్ భోగ్యం భోక్తా భోగశ్చ యద్భవేత్।**
**తేభ్యో విలక్షణః సాక్షీ చిన్మాత్రోఽహం సదాశివః ॥**

త్రిషు - ధామసు - యత్ - భోగ్యం - భోక్తా - భోగః - చ - యత్ - భవేత్ - తేభ్యః - విలక్షణః - సాక్షీ - చిన్మాత్రః - అహం - సదాశివః

| | | |
|---|---|---|
| యత్+త్రిషు+ధామసు | = | ఎవడు మూడు పురముల యందు జీవుడుగా ఉండి |
| భోక్తా | = | అనుభవించేవాడు |
| భోగ్యం | = | అనుభవింపబడే సుఖదుఃఖాది భావములు |
| భోగః | = | భోగము; భోగకారణమయిన దృశ్యమాన ప్రపంచము అయి |
| భవేత్ | = | ఉన్నాడో అతడు |
| అహం | = | నేను. |
| చిన్మాత్రః | = | నేను చిత్ స్వరూపుడను |
| చ | = | మఱియు |
| తేభ్యః | = | భోక్తా, భోగ్యం, భోగములనే వాటి చేత అనగా |
| యత్+విలక్షణః +సాక్షీ | = | ఉపాధి లక్షణములచేత బంధింపబడని విలక్షణము అయిన హృదయ గుహలోగల సాక్షిని నేను. |
| సదాశివః | = | ఎల్లప్పుడు మంగళకరుడను నేను. |

*****

**19. మయ్యేవ సకలం జాతం మయి సర్వం ప్రతిష్ఠితం।**
**మయి సర్వం లయం యాతి తద్బ్రహ్మాద్వయ మస్మ్యహమ్ ॥**

మయి - ఏవ - సకలం - జాతం - మయి - సర్వం - ప్రతిష్ఠితం - మయి - సర్వం- లయం - యాతి - తత్ - బ్రహ్మ - అద్వయమ్ - అస్మి - అహమ్



| | | |
|---|---|---|
| మయి+ఏవ | = | నా వలననే |
| సకలం+ జాతం | = | సర్వ విశ్వము పుట్టుచున్నది |
| మయి | = | నాయందే |
| సర్వం+ప్రతిష్ఠితం | = | సర్వ విశ్వము ఉన్నది |
| మయి | = | నా వలన కలిగిన ప్రకృతి యందే |
| సర్వం | = | సర్వ విశ్వము |
| లయం+యాతి | = | లయమగుచున్నది |
| తత్+బ్రహ్మ | = | ఆ సృష్టిస్థితిలయకారకమయిన ఆత్మ |
| అహం+అద్వయం+అస్మి | = | నేను ఒకటే అయిఉన్నాను. అనగా నేనే ఆత్మను. |

*****

**20. అణోరణీయానహమేవ తద్వన్మహానహం విశ్వమహం**
**విచిత్రం పురాతనోఽహం పురుషోఽహ మీశో**
**హిరణ్మయోఽహం శివరూపమస్మి**

అణోః - అణీయాన్ - అహమ్ - ఏవ - తద్వత్ - మహాన్ - అహం - విశ్వం - అహం - విచిత్రం - పురాతనః - అహం - పురుషః - అహమ్ - ఈశః - హిరణ్మయః - అహం - శివరూపమ్ - అస్మి.

| | | |
|---|---|---|
| అణోః+అణీయాన్ | = | అణువులో అణువును |
| అహమ్+ఏవ | = | నేనే |
| తద్వత్+మహాన్ | = | ఆ విధముగనే మహత్‌ను |
| అహం | = | నేను |
| విశ్వం+అహం | = | నేనే సర్వవిశ్వమును |
| పురాతనః+అహం | = | నేనే సృష్ట్యాదియందు గల ఆత్మను |
| ఈశః+హిరణ్మయః+ పురుషః+అహమ్ | = | సర్వ సృష్టి నియామకుడనయిన హిరణ్మయ కోశమునగల పురుషుడను నేను |
| విచిత్రం | = | ఊహకందని విధముగా సృష్టి చేసినది నేనే |
| అహం+శివరూపం+అస్మి | = | నేను శుభప్రదమయిన ఆత్మను |

*****

**21. అపాణిపాదోఽహమచిన్త్య శక్తిః పశ్యామచక్షుః సశృణోమ్యకర్ణః ।**
**అహం విజానామి వివక్తరూపో నచాస్తి వేత్తా మమచిత్సదాహం ॥**

(శ్వేతాశ్వతర III - 19,20లో కూడా కలదు)

అపాణి - పాదః - అహమ్ - అచిన్త్య - శక్తిః - పశ్యామి - అచక్షుః - సః - శృణోమి - అకర్ణః - అహమ్ - విజానామి - వివిక్తరూపః - న - చ - అస్తి - వేత్తా - మమ - చిత్ - సదా - అహం

| | | |
|---|---|---|
| అహమ్ | = | నేను ఉపాధి రహితుడను |
| అపాణి+పాదః | = | కాళ్ళు చేతులు లేకుండా అనగా కర్మేంద్రియములు లేకుండా |
| అచిన్త్య+శక్తిః+చ | = | అపరిమితమైన శక్తి గలిగియున్నాను. అనగా కర్మేంద్రియములు చేయుపనులన్నీ చేయుదును |
| అచక్షుః+పశ్యామి | = | కన్నులు లేకుండా చూచెదను |
| అకర్ణః+శృణోమి | = | చెవులు లేకుండా వినెదను. అనగా మనస్సు, జ్ఞానేంద్రియములు లేకుండా జ్ఞానేంద్రియములు, మనస్సు చేయు పనులను చేయుదును. |
| సః+వివిక్తరూపః | = | సృష్ట్యాది యందు ఒక్కడను - రూప రహితుడను |
| అహం+విజానామి | = | నేను భూత, భవిష్యత్ వర్తమాన కాలములలో గల సర్వము తెలియుదును. |
| మమ+వేత్తా+న+అస్తి | = | అయితే లయకాలములో సర్వము లయమగును కాన అప్పుడు నన్ను తెలిసినవాడు ఉండడు. |
| అహం+సదా+చిత్ | = | జీవ రూపమున ఎల్లప్పుడు చిద్రూపుడను |

*****

**22. వేదై రనేకై రహమేవ వేద్యో వేదాన్త కృద్వేద విదేవ చాహం ।**
**న పుణ్యాపాపే మమనాస్తి నాశో న జన్మ దేహేంద్రియ బుద్ధి రస్తి ॥**

(భగవద్గీత-పురుషోత్తమ ప్రాప్తియోగం-15లో కూడా కలదు)



వేదైః - అనేకైః - అహమ్ - ఏవ - వేద్యః - వేదాన్తకృత్ - వేదవిత్ - ఏవ - చ - అహమ్- న - పుణ్యాపాపే - మమ - న - అస్తి - నాశః - న - జన్మ - దేహేంద్రియ - బుద్ధిః - అస్తి

| | | |
|---|---|---|
| మమ+జన్మ+ దేహేంద్రియ+ బుద్ధిః+న+అస్తి+ నాశః+న+అస్తి+చ | = | నాకు దేహము, ఇంద్రియములు, మనస్సు, బుద్ధి జీవులకు వలె లేవు. అనగా ఉపాధి రహితుడను. దేహమునకు వలె జన్మము, మరణము లేదు |
| అహం+న+పుణ్యాపాపే | = | జీవులకు కర్మల వలన గలుగు పుణ్యా పాపములు జీవులను బంధించు నట్లు నన్ను సృష్టి, స్థితి, లయములు అనే కర్మలు బంధించవు. |
| అహం | = | నన్ను |
| అనేకైః+వేదైః+ వేదాంతకృత్+ఏవ+వేద్యః | = | నాలుగు వేదములు చదివి అందలి వేదాంత వాక్యములు అర్థము చేసుకొని వాటిని సాధన చేసిన వారు మాత్రమే గ్రహించగలరు. |
| వేదవిత్+అనేకైః+ఏవ | = | వేదవిదులు, బ్రహ్మచర్యము ధ్యాన యోగము మొదలయిన అనేక సాధనల చేత మాత్రమే నన్ను దర్శించగలరు. నా స్థానమును చేర గలరు నన్ను పొందగలరు. |

*****

**23. న భూమి రాపో న చ వహ్ని రస్తి న చా నిలో మేఽస్తి న చాంబరం చ ।**
**ఏవం విదిత్వా పరమాత్మ రూపం గుహాశయం నిష్కలమద్వితీయం ॥**

న - భూమిః - ఆపః - న - చ - వహ్నిః - అస్తి - న - చ - అనిలః - మే - అస్తి - న - చ - అంబరం - చ - ఏవం - విదిత్వా - పరమాత్మ - రూపం - గుహాశయం - నిష్కలమ్ - అద్వితీయం.

| | | |
|---|---|---|
| న+భూమిః+చ | = | నేను భూమిని కాను |
| న+చ+ఆపః | = | జలమును కాను |
| వహ్నిః+న+అస్తి+చ | = | అగ్నిని కాను |

అనిలః+అస్తిః+న = వాయువును కాను

అంబరం+చ = ఆకాశమును కాను. మఱియు అహంకారము, మహత్‌ను, ప్రకృతిని కాను.

ఏవం+విదిత్వా = ఈ విధముగా తెలుసుకొని అనగా నేను పంచ భూతములలో నుందును గాని నేను పంచ భూతములు కాను. అటులనే ఉపాధులలో అంతర్యామిగా ఉందును గాని ఉపాధులు నేను కాను. నా వలననే ఉపాధులు వచ్చినవి. ఇలా వర్ణింపబడిన విషయమును తెలుసుకొని

మే = నాయొక్క

నిష్కలమ్ = పరిశుద్ధము అయినదియు

అద్వితీయమ్ = సృష్ట్యాది యందున్నదియు రెండవదిలేనిదియు .

గుహాశయం = హృదయగుహలో ఉన్నదియు

పరమాత్మ+రూపం = ఉత్కృష్టమైన యీ ఆత్మ స్వరూపము నేను అని తెలుసుకొన్నవాడు అమృతత్త్వమును పొందును.

*****

**24. సమస్త సాక్షీం సదసద్విహీనం ప్రయాతి శుద్ధం పరమాత్మరూపం ॥**

ఇతి ప్రథమః ఖండః

సమస్తసాక్షీం - సత్ - అసత్ - విహీనం - ప్రయాతి - శుద్ధం - పరమాత్మ - రూపం

సత్+అసత్+విహీనం = సత్, అసత్‌లు కానిదియు హృదయ గుహలోని ఆత్మ-సత్ ఉపాధులు- అసత్ ఈ సత్, అసత్‌లు కలసి విశ్వమయినది. నేను సృష్ట్యాది యందున్న వానిని అగుటచే సత్, అసత్ అనే యీ రెండూ లేనివాడును నేను.

సమస్త సాక్షీం = సమస్తమునకు సాక్షి అయినదియు కేవల ఆత్మ స్వరూపమును. జీవుని కర్మలకు సాక్షిని నేను



ఫల శృతి

శుద్ధం = పరిశుద్ధమయినదియు అయిన ఆత్మను ఈ విధముగా గ్రహించిన జ్ఞానులు

పరమాత్మరూపం = ఉత్కృష్టమయిన ఆత్మలో ఏకీభూతులై ఆత్మ రూపమును

ప్రయాతి = పొందుచున్నారు.

*****

మంగళాచరణము

**యః శతరుద్రీయమధీతే సోஉగ్ని పూతో భవతి సురాపానా త్పూతో భవతి బ్రహ్మహత్యా త్పూతో భవతి కృత్యా కృత్యాత్పూతో భవతి తస్మాద విముక్త మాశ్రితో భవతి । అత్యాశ్రమీ సర్వదా సకృదాన జపేత్ ॥ అనేన జ్ఞాన మాప్నోతి సంసారార్ణవ నాశనం । తస్మా దేవం విదిత్వైనం కైవల్యం ఫలమశ్నుతే కైవల్య ఫలమశ్నుతే ఇతి ॥**

-ఇత్యథర్వ వేదే కైవల్యోపనిషత్సు-

యః - శతరుద్రీయమ్ - అధీతే - సః - అగ్నిః - పూతః - భవతి - సురాపానాత్ - పూతః - భవతి - బ్రహ్మహత్యాత్ - పూతః - భవతి - కృత్య - అకృత్యాత్ - పూతః - భవతి - తస్మాత్ - అవిముక్తమ్ - ఆశ్రితః - భవతి - అత్యాశ్రమీ - సర్వదా - సకృత్ - వా - జపేత్ - అనేన - జ్ఞానమ్ - ఆప్నోతి - సంసార - ఆర్ణవ - నాశనం - తస్మాత్ - ఏవం - విదిత్వా - ఏనం - కైవల్యం - ఫలమ్ - అశ్నుతే - కైవల్యం - ఫలం - అశ్నుతే - ఇతి.

అత్యాశ్రమీ = జ్ఞానికూడ - ఆత్మ దర్శనం చేసిన జ్ఞాని

సర్వదా = ఎల్లప్పుడూ శ్రద్ధగా

సకృత్+జపేత్ = శత రుద్రీయమును జపించ వలయును.

యః+శతరుద్రీయం = ఎవడు శతరుద్రీయమును

అధీతే = జపించునో - ఆత్మను స్వానుభవంతో దర్శించునో

సః+అగ్నిః పూతః+భవతి= సర్వబంధములను అగ్ని దహించినట్లు జ్ఞానాగ్నిచే సర్వబంధముల నుంచి విముక్తుడై **అగ్నిద్యోతనుడు అగును.**

| | | |
|---|---|---|
| తస్మాత్ | = | అందువలన |
| ఆశ్రితః+భవతి | = | ఆత్మాశ్రయుడగును |
| సంసార+ఆర్ణవ+నాశనం | = | సంసార సాగరము అనే తాపత్రయములను నశింప చేయును. |
| సురాపానాత్+పూతః+భవతి+వా బ్రహ్మహత్యాత్+పూతః+భవతి+ | = | సురాపానము, బ్రహ్మహత్యాది పాపములనుంచి విడివడి పాపరహితుడు అగును |
| కృత్య+అకృత్యాత్+పూతః+భవతి | = | కర్మబంధముల నుంచి విడివడును. |
| అనేన | = | సత్యము, బ్రహ్మచర్యము, మొదలయిన సాధనల చేత |
| జ్ఞానం+ఆప్నోతి | = | జ్ఞానవంతుడగును, ఆత్మదర్శనము పొందును |
| తస్మాత్ | = | అందువలన |
| అవిముక్తం | = | ఆత్మనుంచి విడివడక ఉండును |
| ఏవం+విదిత్వా | = | ఈ విధముగా ఆత్మను తెలుసుకొని |
| ఏవం+కైవల్యం+ఫలం+అశ్నుతే | = | కైవల్య ఫలమును పొందును |
| కైవల్యం+ఫలం+అశ్నుతే+ఇతి | = | కైవల్య ఫలమును పొందును |

బంధవిముక్తుడయిన జ్ఞాని కూడ కర్మలు చేయవలయునా? అన్న దానిని శ్రీకృష్ణుడు భగవద్గీతలో

**సక్తాః కర్మణ్య విద్వాంసో యథా కుర్వన్తి భారత**
**కుర్యాద్విద్వాం స్తథాఽసక్త శ్చికీర్షుర్లోక సంగ్రహమ్** (కర్మయోగము-25)



| | | |
|---|---|---|
| భారత | = | ఓ అర్జునా |
| అవిద్వాసః | = | అవిద్వాంసులు |
| యథా | = | ఎట్లు |
| కర్మణి | = | కర్మల యందు |
| సక్తః | = | ఆసక్తి గలిగి కర్మలను |
| కుర్వంతి | = | ఆచరించుచున్నారో |
| తథా | = | అట్లే |
| విద్వాన్ | = | విద్వాంసుడు కూడ |
| ఆసక్తః | = | అసక్తిలేక |
| లోక సంగ్రహమ్+చికీర్షుః | = | లోక హితమును గోరు వాడై |
| కుర్యాత్ | = | కర్మలను ఆచరింప వలయును. |

అజ్ఞానులు ఫలాసక్తులయి ఫలాపేక్షతో కర్మలు యే ప్రకారము చేయుచున్నారో అటులనే జ్ఞాని కూడా ఫలాసక్తి రహితుడై లోకమునకు మార్గదర్శకుడుగా కర్మలు ఆచరింపవలయును.

*****

**ఓం భద్రం కర్ణేభిః శృణు యామ దేవాః**
**భద్రం పశ్యేమాక్షభిర్యజత్రాః**
**స్థిరై రంగై స్తుష్టువాగ్ం సస్తనూభిః**
**వ్యశేమ దేవహితం యదాయుః**
**స్వస్తి న ఇంద్రో వృద్ధ శ్రవాః**
**స్వస్తి నః పూషా విశ్వవేదాః**
**స్వస్తి నస్తార్క్ష్యోఽరిష్టనేమిః**
**స్వస్తి నో బృహస్పతి ర్దధాతు**
**ఓం శాంతి శాంతి శాంతిః**

*****

## ఉపనిషత్సంగ్రహము

ఒక్కొక్కవేదము ఒక్కొక్క మహావాక్యమును చెప్పినది అనిగాక బ్రహ్మవిద్యా సంప్రదాయములో నాలుగు వేదములు ఒకే విషయమును ప్రతిపాదించునని చెప్పబడును.

**ఋగ్వేదము-ఐతరేయోపనిషత్:** విరాట్పురుషుడు లోకములను, లోకపాలురను, సర్వ స్థావరజంగమములను, సృష్టి అభివృద్ధికి అన్నమును సృజియించెను.
మిథున ధర్మసృష్టి చెప్పబడినది.
సృష్ట్యాదియందున్న ఆత్మ హృదయగుహలో ప్రవేశించి ఈ సర్వమూ తనే అని చూచినది. తనుగాక ఇతరమేదియులేదని చూచెను.
విరాట్పురుషునినుంచి వచ్చిన దేవతలకు మానవ శరీరములో స్థానము ఏర్పడినది.
ప్రాణులలో మానవుడు శ్రేష్ఠుడు.
ప్రజలలో సంసారులు విద్వాంసులు అని రెండు విభాగములు.
ఆత్మను ఉపాసించి ఆత్మను గ్రహించవలయును.

**సామవేదము-కేనఉపనిషత్:** ఆత్మవలన జీవుడు, దేహేంద్రియమనోబుద్ధులు, పనిచేయుచ్నువి.
జీవుడు మాత్రమే ఆత్మను గ్రహించగలడు.

**యజుర్వేదము-కఠోపనిషత్:** ఇహలోక, పరలోక, సుఖాపేక్షపరులు బ్రహ్మవిద్యకు అనర్హులు.
సాధన పదునైన కత్తి అంచుపై నడక వంటిది.
ధీరులు సాధన చేసి - బుద్ధిద్వారా ఆత్మ తత్త్వమును గ్రహించవలయును.
ఆత్మను గ్రహించవలయును.



**యజుర్వేదము-తైత్తిరీయోపనిషత్:** కర్మ, యోగ, సాంఖ్య పద్ధతుల ద్వారా అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ, ఆనందమయ కోశములుగా చెప్పబడే దేహమును వీడి ప్రకృతిని వీడి - ఈ ఐదుకోశములుగాక హిరణ్మయకోశవర్తియైన ఆత్మను సాధన ద్వారా గ్రహించవలయును.
ఆత్మను దర్శించవలయును.

**యజుర్వేదము-ఈశఉపనిషత్:** విద్యావిద్యల ద్వారా సాధనచే ఆత్మను గ్రహించవలయును.

**అథర్వవేదము-ముండక ఉపనిషత్:** విరాట్పురుషుడు, ఉపాధులను, సర్వ స్థావరజంగమములను, సర్వ భావములను సృష్టి అభివృద్ధికి అన్నమును సృజియించెను.
విధివిహితముగా పుణ్యకర్మలు చేయవలయును.
పుణ్యఫలితము కోరరాదు. సాధనచే ఆత్మను గ్రహించవలయును.

**అథర్వవేదము-మాండుక్యఉపనిషత్:** సృష్ట్యాదియందు ఒక్కడుగా ఉన్న ఆత్మ సృష్టిలో మానవ దేహములో నాలుగు భాగములైనది.
ఆత్మను గ్రహించవలయును.

**అథర్వవేదము-ప్రశ్నోపనిషత్:** ఆత్మ విరాట్పురుషుడై సర్వదేవతారూపములుగా భాసిల్లుచున్నాడు. సాధనచేసి షోడశకళాపురుషునిని - ఆత్మను గ్రహించవలయును.

**అథర్వవేదము-కైవల్యఉపనిషత్:** యోగమార్గమున సాధనచేసి ఆత్మను గ్రహించవలయును.

అన్ని ఉపనిషత్తులు ఆత్మ తత్త్వమును గ్రహించి, ఆత్మను దర్శించి ఆత్మలో ఏకీభూతుడై ఆత్మయై విరాజిల్లవలయునని చెప్పినవి.

*****